## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజి



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస



అమ్మ శారదా దేవి



గురు వివేకానంద



గురు సాయిబాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళ స్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని ద్వారకాధీష్ వాస్తు వెబ్ సైట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్చంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్ధికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) ద్వారకాధీష్ వాస్తు వారి వెబ్ సైట్: http://dwarkadheeshvastu.com
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul



Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline/WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

ద్వారకాదీష్ వాస్తు వారి వెబ్ సైట్:

**http://dwarkadheeshvastu.com**

Free Download Indian epic ×

dwarkadheeshvastu.com/Epic-List-of-Indian-Epics-in-Telugu.aspx

Hindi | Sanskrit | English | Gujrati | Bangali | Oriya | Telugu | Nepali | Marathi | Kannad | Asamiya | Urdu | Malyalam | Avdhi | Ved | Puran | Bhagwat | Ramayan | Geeta | Punjabi | Jain Dharm | Islam | Karm Kand

**Dwarkadheesh Vastu**

Home
Contact Us
हिन्दी वेबसाईट
Vastu Consultancy
Download Vastu Book
FREE Astrology Books

FREE Devotional Music (Mp3)
FREE Devotional Videos
FREE Devotional Books (PDF)
FREE Educational Books (PDF)
FREE Educational Videos
FREE Devotional Wallpapers

Dwarkadheesh Vastu
Like
3,663 people like Dwarkadheesh Vastu.
Facebook social plugin

A | B | C | D | E | F | G | H | I
J | K | L | M | N | O | P | Q | R
S | T | U | V | W | X | Y | Z

1. 12 Rashi Fal (Hindi)
2. 300 Saal Sikh Itihaas De Naal (English)
3. Aachar Manjari (Nepali)
4. Aadarsh Bhakti Prem (Telugu)
5. Aadarsh Dampatya Jeevan (Telugu)
6. Aadarsh Desh Bhakt (Hindi)
7. Aadarsh Manav Hridaya (Hindi)
8. Aadarsh Nari Sushila (Bengali)
9. Aadarsh Nari Sushila (Gujrati)
10. Aadarsh Nari Sushila (Tamil)

**Indian Epics in Telugu**

1. Aadarsh Bhakti Prem (Telugu)
2. Aadarsh Dampatya Jeevan (Telugu)
3. Aadarsh Nari Sushila (Telugu)
4. Aadhyatm Ramayan (Telugu)
5. Aandhra Mahabhagwat Dasham Skandh (Telugu)
6. Agni Puranam (Telugu)
7. Aladdin Adbhutha Deepam (Telugu)
8. Alibaba Dongalu Katha (Telugu)
9. Amavasya Somavara Vratham (Telugu)
10. Amma Neeti Kathalu Katha (Telugu)
11. Amulya Samaya Ka Upyog (Telugu)
12. Anantapadmanabha Asthotram (Telugu)

You Tube

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటీ కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విషయ సూచిక

## III అరణ్యాకాండము

## IV కిష్కింధాకాండము



## V సుందరకాండము



## VI లంకాకాండము

## VII ఉత్తరకాండము



## పిబరే రామరసమ్

శ్లో॥ వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే
మధ్యేపుష్పకమాసనే మణిమయే వీరాసనే సంస్థితమ్ ।
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్ ॥

గీ॥ పిబ రే రామరసం రసనే । పిబరే రామరసమ్ ॥ ॥ పిబరే ॥

1) దూరీకృతపాతకసంసర్గం । పూరితనానావిధఫలవర్గమ్ ॥ ॥ పిబరే ॥
2) జననమరణభయశోకవిదూరం । సకలశాస్త్రనిగమాగమసారమ్ ॥ ॥ పిబరే ॥
3) పరిపాలితసరసిజబ్రహ్మాండం । పరమపవిత్రీకృతపాషండమ్ ॥ ॥ పిబరే ॥
4) శుద్ధపరమహంసఆశ్రమగీతం । శుకశౌనకకౌశికముఖపీతమ్ ॥ ॥ పిబరే ॥

శ్రీరామ జయరామ జయజయ రామ ॥

# శ్రీ గోస్వామి తులసీదాసు జీవితవిశేషములు

ప్రసిద్ధ పుణ్యక్షేత్రమైన ప్రయాగ సమీపమున 'బాందా' జిల్లాలో 'రాజాపురము' అను గ్రామము గలదు. అచట ఆత్మారామ్ దూబే - అను సుప్రసిద్ధుడైన సరయూపారీణబ్రాహ్మణుడు ఉండెను. శ్రీమతి హులసీదేవి ఆయన ధర్మపత్ని. క్రీ.శ. 1497, విక్రమశకం 1554వ సంవత్సరమున శ్రావణ శుద్ధ సప్తమినాడు అభుక్తమూలా నక్షత్రమున ఆ పుణ్యదంపతులకు జన్మించిన ముద్దులబిడ్డడే మన గోస్వామి తులసీదాసు. అతడు మాతృగర్భమున 12 (పండ్రెండు) మాసములు మసలెను. శిశువైన తులసీదాసు పుట్టగనే రోదనము కావింపలేదు. అతనిముఖమునుండి 'రామ్' అను శబ్దము (రామనామము) వినిపించెను. ఆయననోటిలో ముప్పది రెండు(32) దంతములుండెను. చూచుటకు అతడు ఐదు (5) సంవత్సరముల ఈడుగల బాలకునివలె ఒప్పుచుండెను. ఇట్టి అద్భుతలక్షణములుగల బాలకుని జూచి, ఆయనతండ్రి అమంగళములను శంకించి భీతిల్లెను. కుమారునివిషయమై ఆత్మారాముడు పెక్కు విధములగు ఊహాగానములను చేయసాగెను. తల్లియైన 'హులసి' మిక్కిలి చింతించెను. అశుభములను శంకించి, ఆమె ఆ పసికందును దశమినాటి రాత్రి దాసీచేతులలో ఉంచి, ఆ దాసియొక్క అత్తగారింటికి పంపెను. మఱునాడే ఆ పవిత్ర మాతృమూర్తి ఈ లోకమును వీడెను. 'చునియా' అను పేరుగల ఆదాసి ఆ శిశువును మిక్కిలి ప్రేమానురాగములతో పెంచెను. తులసీదాసునకు దాదాపు ఐదున్నర సంవత్సరములప్రాయమున చునియా గూడ దివంగతురాలయ్యెను. ఇప్పుడతడు అనాథబాలుడై ఇంటింటికిని తిరుగసాగెను. జగజ్జననియైన పార్వతీదేవికి ఈ అమాయకబాలునిపై కృపగలిగెను. ఆమె బ్రాహ్మణస్త్రీవేషమున ప్రతిదినము ఆ బాలునికడకు వచ్చి, స్వహస్తములతో అతనిచే అన్నము తినిపించుచుండెడిది.

రామశైలనివాసియైన శ్రీ అనంతానందజీ ప్రియశిష్యుడు శ్రీ నరహరి ఆనంద. అతడు పరమేశ్వర ప్రేరణచే ఈ బాలకుని వెదకుచు వచ్చెను. ఈ బాలునకు 'రామ్ బోలా' అను పేరు పెట్టి, అతడు వానిని తనతో అయోధ్యకు తీసికొనివెళ్లెను. విక్రమ శకము 1561 (క్రీ॥శ॥ 1504)వ సంవత్సరమున మాఘ శుద్ధ పంచమీ శుక్రవారము నాడు అతడు ఆ బాలునకు ఉపనయన సంస్కారములను జరిపెను. ఎవ్వరి ప్రేరణ లేకయే ఏకసంతగ్రాహియైన 'రామ్‌బోలా' గురూపదేశమైన వెంటనే గాయత్రీ మంత్రమును ఉచ్చరించెను. దానిని జూచి అందఱును చకితులైరి. పిమ్మట నరహరి స్వామి రామ్‌బోలాకు వైష్ణవసంప్రదాయమును అనుసరించి, పంచసంస్కారములను జరిపించి, రామమంత్ర దీక్షను ఒసంగెను. అయోధ్యయందే అతనిచే విద్యాధ్యయనము చేయించెను. బాలకుడైన రామ్‌బోలా మిక్కిలి బుద్ధిమంతుడు, చురుకైన వాడు. అతడు ఏకసంతగ్రాహి. 'గురుముఖతః' ఒకసారి విన్నంతనే ఆ విషయము అతనికి కంఠస్థమగుచుండెను. ఆ గురుశిష్యులిద్దఱును అచట కొంత కాలము గడిపి, అనంతరము 'వరాహ క్షేత్రము'నకు చేరిరి. అక్కడ శ్రీ నరహరిస్వామి తులసీదాసునకు రామచరితమును వినిపించెను. కొలదిదినములపిమ్మట వారు కాశీనగరమును చేరిరి. కాశీలో శేషసనాతనస్వామివారికడ తులసీదాసు పదునైదు (15) సంవత్సరముల కాలము అధ్యయనము చేసి, వేదములను, వేదాంగములను జిహ్వాగ్రమున నిలుపుకొనెను. ఇచ్చట ఆయనకు సాంసారికవాసనలు జాగృతములయ్యెను. గురునాజ్ఞను దీసికొని, తిరిగి తన జన్మ స్థానమునకు చేరెను. అచట తన వారెవ్వరును మిగిలి యుండకపోవుటను అతడు గ్రహించెను. తన మాతాపిత్రాదులకు విధ్యుక్తములైన శ్రాద్ధకర్మలనాచరించెను. అచటనేయుండి జనులకు శ్రీరామచరితమును వినిపింపసాగెను.

విక్రమ శకము 1583 (క్రీ॥శ॥ 1526)వ సంవత్సరమున జ్యేష్ఠ శుద్ధ త్రయోదశీ గురువారము నాడు భారద్వాజగోత్రజయైన 'రత్నావళి'యను సుందరి(కన్య)తో ఆయనకు వివాహమయ్యెను. ఆ క్రొత్త దంపతులు సుఖసంతోషములతో తమజీవితమును కొనసాగించుచుండిరి. ఒకసారి రత్నావళి తన సోదరునితోగూడి, పుట్టింటికి వెళ్లెను. కొంతసేపైన తరువాత తులసీదాసు భార్యమీది ప్రేమతో తన ఇంటినుండి బయలుదేఱి, తన భార్యపుట్టింటికి చేరెను. అతనిని జూచి, భార్య రత్నావళి తన భర్తను చులకన జేయుచు ఇట్లనెను. "రక్తమాంసములతో గూడిన ఈ నా తనువుపైగల ఆసక్తిలో సగమైనను మీకు భగవంతునిపై ఉన్నచో మీరు తరించియుండెడివారు." ఆమెమాటలు తులసీదాసు మనస్సులో బాగుగా నాటుకొనెను. దానితో ఆయనలో అంతర్మథనము జరిగెను. ఆయనకు కనువిప్పు కలిగెను. వెంటనే ఆయనమనస్సు భగవంతునిమీదికి మఱలెను. మఱుక్షణముననే అతడు అచటినుండి తన ఇంటికి చేరెను. పిదప ప్రయాగ వెళ్ళెను. అచ్చట తులసీదాసు గృహస్థవేషమును పరిత్యజించి, సాధువేషమును స్వీకరించెను. పిమ్మట తీర్థయాత్రలను గావించుచు అతడు కాశీ చేరెను. ఈ సమయముననే ఆయనకు మానససరోవరమున 'కాకభుశుండి' దర్శనమాయెను.

కాశీలో తులసీదాసు రామకథాప్రవచనమును చేయసాగెను. ప్రతినిత్యము తులసీదాసు తన సంధ్యావందనము ముగిసిన పిమ్మట ఆ తీర్థమును ఒక చెట్టుమొదట చల్లుచుండెడివాడు. ఆ చెట్టు పైనున్న ఒక బ్రహ్మరాక్షసుడు ఆ తీర్థప్రభావమున శాపవిముక్తుడై, మానవరూపమున తులసీదాసు సమ్ముఖమున నిలిచెను. అతడు "నీ తీర్థ ప్రభావమున నాకు శాపవిముక్తి కలిగినది. నీకు నేను ఏవిధముగా సహాయపడగలనో తెలుపుము." అని తులసీదాసును అడిగెను. అప్పుడు తులసీదాసు "నాకు శ్రీరాముని దర్శనము కలుగు ఉపాయమును తెలుపుడు"- అని ఆయనను ప్రార్థించెను. అప్పుడు అతడు "అట్టి శక్తి నాకు లేదు. నీవు హనుమంతుని ఆశ్రయించినచో నీ కోరిక నెఱవేఱును" అని పలికెను. "అది సరే! హనుమంతునిదర్శనము కలుగుట యెట్లు?" అని తులసీదాసు ప్రశ్నించెను. దానికి సమాధానముగా అతడు-

"యత్ర యత్ర రఘునాథకీర్తనం, తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్ ।
బాష్పవారిపరిపూర్ణలోచనం, మారుతిం నమత రాక్షసాంతకమ్ ॥"

అను శ్లోకమును పఠించెను- అనగా శ్రీ రఘురాముని కథాప్రవచనము (కీర్తనము) జరుగుచోట ఆంజనేయుడు తప్పక ఉండితీరును.

తులసీదాసు ప్రవచనమును వినుటకు నిత్యము ఒక వృద్ధ బ్రాహ్మణుడు వచ్చుచుండెడివాడు. అతడు శ్రీరామకథా శ్రవణము చేయుచు ఆర్ద్ర హృదయముతో ప్రేమవిహ్వలుడగుచుండెను. అతడు ఎవరో కాదు, మాఱువేషమున వచ్చిన ఆంజనేయస్వామియే. తులసీదాసు ఆయనకు ప్రణమిల్లి "స్వామీ! మీరు ఎవరు? అందఱికంటెను ముందుగా వచ్చి, చివరకు వెళ్లుచున్నారు". అని అడిగెను. అప్పుడు ఆంజనేయుడు ఆయనకు తన రూపమును జూపెను. అంతట తులసీదాసు మిక్కిలి హర్షితుడై "స్వామీ! నాకు శ్రీరామునిదర్శనము కలిగింపుము" అని ప్రార్థించెను. ఆంజనేయుడు ఇట్లు నుడివెను. "నీవు చిత్రకూటమునకు వెళ్ళుము. అచ్చట నీకు శ్రీరఘునాథునిదర్శనము కాగలదు." ఈ మాటలను విని, తులసీదాసు శ్రీరామదర్శనమునకు త్వరపడుచున్నవాడై చిత్రకూటమునకు చేరెను. అక్కడ రామఘట్టమునందు ఒక పీఠమును ఏర్పఱచుకొనెను. ఒకనాడు అతడు కామదగిరికి ప్రదక్షిణమొనర్చుటకు బయలుదేఱెను. మార్గమున ఆయనకు శ్రీరామునిదర్శనమాయెను. మిక్కిలి

అందమైన ఇద్దఱు రాజకుమారులు ధనుర్బాణములను ధరించి, గుఱ్ఱములపై వెళ్ళుచుండిరి. తులసీదాసు వారిని జూచి ముగ్ధుడాయెను. కాని వారిని అతడు గుర్తింపలేదు. పిమ్మట ఆంజనేయుడు ఆయనకడకు వచ్చి, వాస్తవమును ఎఱింగించెను. అప్పుడతడు మిక్కిలి పశ్చాత్తాపపడసాగెను. హనుమంతుడతనిని అనునయించి, మఱల మఱునాటి ప్రాతఃకాలమున శ్రీరామ దర్శనమగునని తెలిపెను.

వి॥ శ॥ 1607వ సంవత్సరమున మౌనిఅమావాస్య, (పుష్యబహుళ అమావాస్య) బుధవారమునాడు శ్రీరామచంద్ర ప్రభువు మఱల అతనిముందు ప్రత్యక్షమాయెను. బాలరూపుడుగా ఉన్న శ్రీరాముడు తులసీదాసుతో "బాబా! మాకు చందనము ఇమ్ము" అని అడిగెను. ఈసారి పొరపాటు జరుగకుండ ఆంజనేయుడు చిలుక రూపము ధరించి, ఈ దోహాను పలికెను.

చిత్రకూట కే ఘాట్ పర్ భఇ సంతన కీ భీర్ । తులసిదాస చందన్ ఘిసేఁ తిలక్ దేత రఘువీర్ ॥

అనగా చిత్రకూటమునందలి రామఘట్టమున సజ్జనసమూహములు గలవు. తులసీదాసు చందనము దీసెను. రఘువీరుడు తిలకమును దిద్దెను.

నీవు తీయు చందనమును దిద్దువాడు సాక్షాత్తు శ్రీరామచంద్రభగవానుడే.

తులసీదాసు అద్భుతమైన రామునితేజస్సునకు అబ్బురపడి, తనశరీరస్పృహను కోల్పోయెను. భగవానుడు తనచేతితో చందనమును దీసికొని తనకును, తులసీదాసునకును ముఖములయందు తిలకమును దిద్దెను. అనంతరము అతడు అంతర్ధానమాయెను.

వి॥ శ॥ 1628వ సంవత్సరమున ఆంజనేయుని అనుమతితో తులసీదాసు అయోధ్యకై బయలుదేఱెను. ఆ సమయమున ప్రయాగయందు మాఘమేలా జరుగుచుండెను. అతడు అచ్చట కొన్ని దినములు గడిపెను. ఆఱు పర్వదినములపిమ్మట ఒక వటవృక్షచ్ఛాయయందు ఆయనకు మహర్షులైన భరద్వాజ, యాజ్ఞవల్క్యుల దర్శనమయ్యెను. వరాహక్షేత్రమునందు గురువుద్వారా తాను వినినకథయే అచట చెప్పబడుచుండెను. అచటినుండి అతడు కాశీనగరమునకు చేరి, ప్రహ్లాదఘట్టమున ఒక బ్రాహ్మణునింటియందు నివసింపసాగెను. అచ్చట అతనిలో కవితాశక్తి జాగృతమయ్యెను. సంస్కృత భాషలో శ్లోకరచన చేయసాగెను. కాని పగటివేళ వ్రాసిన శ్లోకములన్నియును రాత్రియందు లుప్తములగుచుండెను. ఈ సంఘటనము ప్రతిదినము కొనసాగుచు వచ్చెను. ఎనిమిదవ దినమున తులసీదాసునకు ఒక కల వచ్చెను. ఆ కలలో "నీవు నీ (వ్యవహార) భాషయందు కావ్యరచన చేయుము" అని అతనిని పరమేశ్వరుడు ఆదేశించెను. తులసీదాసు మేల్కొని కూర్చుండెను. ఆసమయమున శివపార్వతులు ఆతనికి ప్రత్యక్షమైరి. తులసీదాసు ఆ ఆదిదంపతులకు ప్రణమిల్లెను. పరమేశ్వరుడు పలికెను. "నీవు అయోధ్యకు వెళ్లి, వ్యవహార (అవధి) భాషలో కావ్య రచనచేయుము. నా ఆశీర్వాదప్రభావమున నీకవిత సామవేదముతో సమానముగా ఫలములను గూర్చును. సామవేదమువలె దీనిని ప్రజలందఱును గానముచేయుదురు." ఇట్లు ఆశీర్వదించి, గౌరీశంకరులు అంతర్ధానమైరి. వారి ఆజ్ఞలను శిరసావహించి, తులసీదాసు కాశీనుండి అయోధ్యకు చేరెను.

త్రేతాయుగమున శ్రీరామజన్మదినోత్సవము జరుపబడునట్లే 1631వ సంవత్సరమున అయోధ్యలో శ్రీరామనవమిఉత్సవములు జరుపబడుచుండెను. ఆనాడు ప్రాతఃకాలమున శ్రీతులసీదాసు 'శ్రీరామచరితమానస'రచనను ప్రారంభించెను. రెండు సంవత్సరముల ఏడు మాసముల ఇఱువది ఆఱుదినములలో ఆ గ్రంథరచన పూర్తియయ్యెను. 1633వ సంవత్సరమున మార్గశిర శుక్ల పక్షమున శ్రీ సీతారాములవివాహమహోత్సవమునాడు ఏడు కాండములును సంపూర్ణమాయెను.

ఆ పిదప తులసీదాసు భగవదాజ్ఞను అనుసరించి, కాశీ చేరెను. అచట అన్నపూర్ణావిశ్వేశ్వరులకు 'శ్రీరామచరిత మానసమును' విన్పించెను. ఆ రాత్రి ఆ గ్రంథము విశ్వనాథునిమందిరమున ఉంచబడెను. ప్రాతఃకాలమున పుస్తకమును తెఱచిచూడగా అందు 'సత్యం, శివం, సుందరమ్' అను మధుర పదత్రయము వ్రాయబడి యుండెను. క్రింద శంకరభగవానునిసంతకముగూడ ఉండెను. అచ్చట నున్న జనులు 'సత్యం, శివం, సుందరమ్' అను పదములను గూడ వినిరి.

ఈ విషయములను వినిన అక్కడి పండితులమనస్సులలో ఈర్ష్య జనించెను. వారు అందఱును ఒకటై తులసీదాసును నిందింపసాగిరి. ఆ గ్రంథమునుగూడ నష్టపఱచుటకు ప్రయత్నించిరి. దానిని దొంగిలించి తీసికొనివచ్చుటకై ఇద్దఱు దొంగలను పంపిరి. వారు వెళ్ళిచూడగా తులసీదాసు కుటీరసమీపమున ఇద్దఱు వీరులు ధనుర్బాణములను ధరించి, కావలాకాయుచుండిరి. వారు శ్యామగౌరవర్ణశోభితులై యుండిరి. వారిదర్శనముతో చోరులబుద్ధి మాఱిపోయెను. వెంటనే చోరవృత్తికి స్వస్తిపలికి, శ్రీరామభజనను చేయసాగిరి. తనకొఱకై భగవంతుడు కష్టపడినట్లు తెలిసికొని, కుటీరమునందలి వస్తువులనన్నింటిని అతడు దానమొనర్చి, గ్రంథమును మాత్రము తనమిత్రుడైన 'తోడర్‌మల్' కడనుంచెను. ఆ పిమ్మట అతడు మఱియొక ప్రతిని వ్రాసెను. దీనిని ఆధారముగా చేసికొనియే ఇతరప్రతులు సిద్ధపఱచబడినవి. ఈ గ్రంథము క్రమక్రమముగా ప్రసిద్ధి వహించెను.

ఇచ్చట పండితులకు ఏమియు తోచక ఆ పుస్తకమును పరిశీలింపవలసినదిగా శ్రీ మధుసూదన సరస్వతిగారిని ప్రార్థించిరి. శ్రీ మధుసూదనసరస్వతిగారు ఆగ్రంథమును సావధానముగా సమగ్రముగా పరిశీలించి, మిక్కిలి ప్రసన్నులై తమ సమ్మతిని ఇట్లు తెల్పిరి.

ఆనందకాననేహ్యస్మిన్ జంగమస్తులసీతరుః । కవితామంజరీ భాతి రామభ్రమరభూషితా ॥

'కాశి'యను ఆనంద వనమున 'తులసీదాసు' అనెడి సంచరించుతులసిమొక్క కలదు. దాని కవితారూపమంజరి మిక్కిలి సుందరమైనది. దానిపై శ్రీరాముడనెడి తుమ్మెద సర్వదా పరిభ్రమించు చుండును.

దీనితో పండితులకు సంతుష్టి కలుగకపోగా, వారి ఈర్ష్య ఇంకను అధికమైనది. ఈ గ్రంథ ప్రామాణిక పరీక్షకు వారు మఱియొక ఉపాయమును ఆలోచించిరి. వారు విశ్వేశ్వరునిఎదుట ఒక పీఠముపై వేదశాస్త్ర పురాణగ్రంథములను, వాటి అన్నింటికిని అడుగుభాగమున తులసీరామాయణగ్రంథమును ఉంచిరి. పిమ్మట మందిరము మూయబడెను. ప్రాతఃకాలమున మందిరద్వారములు తెఱచిచూడగా అట్టడుగున ఉంచబడిన శ్రీరామచరితమానసము వేదపురాణాదిగ్రంథములపైభాగమున వారికిగనబడెను. పండితులందఱును సిగ్గుతో తలవంచుకొనిరి. వారు శ్రీ తులసీదాస గోస్వామివారికి క్షమాపణ చెప్పుకొని భక్తితో ఆయన పాదోదకమును సేవించిరి.

ఇపుడు తులసీదాసు 'అసీఘట్టము'న ఉండసాగెను. ఒకనాటిరాత్రి కలిపురుషుడు ఆయనయొద్దకు వచ్చి, ఆయనను బాధింపసాగెను. గోస్వామీజీ ఆంజనేయుని ధ్యానించెను. 'మారుతి' వినయపదములను వ్రాయుమని ఆయనను ఆజ్ఞాపించెను. తులసీదాసు 'వినయ పత్రిక'ను రచించి, భగవంతునిపాదముల కడ సమర్పించెను. శ్రీరాముడు దానిపై తనహస్తాక్షరములను ఉంచెను. ఆయనకు అభయప్రదానము చేసెను. అంతట తులసీదాసునకు కలిపురుషుని భయము తొలగిపోయెను. 1680 సంవత్సరమున ఆషాఢ బహుళ తదియ శనివారము నాడు అసీఘట్టమున రామనామమును స్మరించుచు తులసీదాసు తన తనువును వీడి, పరమపదమును జేరెను.

* * *

## నవాహ్నికపారాయణ విరామస్థానములు



## మాసపారాయణ విరామస్థానములు

## శ్రీరామచరితమానసపారాయణవిధి

శ్రీరామచరితమానసమును పారాయణము చేయువారు ప్రారంభమున గోస్వామితులసీదాసును, వాల్మీకి మహర్షిని, పరమేశ్వరుని, ఆంజనేయస్వామిని ఆవాహనముచేసి, పూజింపవలెను. పిమ్మట శ్రీసీతారామలక్ష్మణ భరతశత్రుఘ్నులను ఆవాహనమొనర్చి, వారిని ధ్యానించి, వారికి షోడశోపచారపూజలు సలుపవలయును. వారి ఆవాహన-ధ్యాన-అర్చనాది శ్లోకములు-

### ఆవాహన మంత్రములు

1. తులసీకనమస్తుభ్యమ్, ఇహాగచ్ఛ శుచివ్రత ।
నైరృత్య ఉపవిశ్యేదం పూజనం ప్రతిగృహ్యతామ్ ॥ 1 ॥ ఓం తులసీదాసాయ నమః ।

2. శ్రీ వాల్మీక నమస్తుభ్యమ్, ఇహాగచ్ఛ శుభప్రద ।
ఉత్తరపూర్వయోర్మధ్యే తిష్ఠ గృహ్ణీష్వ మేఽర్చనమ్ ॥ 2 ॥ ఓం వాల్మీకాయ నమః ।

3. గౌరీపతే నమస్తుభ్యమ్, ఇహాగచ్ఛ మహేశ్వర ।
పూర్వదక్షిణయోర్మధ్యే తిష్ఠ పూజాం గృహాణ మే ॥ 3 ॥ ఓం గౌరీపతయే నమః ।

4. శ్రీ లక్ష్మణ నమస్తుభ్యమ్, ఇహాగచ్ఛ సహప్రియః ।
యామ్యభాగే సమాతిష్ఠ, పూజనం సంగృహాణ మే ॥ 4 ॥ ఓం శ్రీ సపత్నీకాయ లక్ష్మణాయ నమః ।

5. శ్రీ శత్రుఘ్న నమస్తుభ్యమ్, ఇహాగచ్ఛ సహప్రియః ।
పీఠస్య పశ్చిమే భాగే పూజనం స్వీకురుష్వ మే ॥ 5 ॥ ఓం శ్రీ సపత్నీకాయ శత్రుఘ్నాయ నమః ।

6. శ్రీ భరత నమస్తుభ్యమ్, ఇహాగచ్ఛ సహప్రియః ।
పీఠకస్యోత్తరే భాగే తిష్ఠ పూజాం గృహాణ మే ॥ 6 ॥ ఓం శ్రీ సపత్నీకాయ భరతాయ నమః ।

7. శ్రీ హనుమన్ నమస్తుభ్యమ్, ఇహాగచ్ఛ కృపానిధే ।
పూర్వభాగే సమాతిష్ఠ, పూజనం స్వీకురు ప్రభో ॥ 7 ॥ ఓం శ్రీ హనుమతే నమః ।

8. అథ ప్రధానపూజా చ కర్తవ్యా విధిపూర్వకమ్ ।
పుష్పాంజలిం గృహీత్వా తు ధ్యానం కుర్యాత్ పరస్య చ ॥ 8 ॥

9) రక్తాంభోజదళాభిరామనయనం పీతాంబరాలంకృతం
శ్యామాంగం ద్విభుజం ప్రసన్నవదనం శ్రీసీతయా శోభితమ్ ।
కారుణ్యామృతసాగరం ప్రియగణైః భ్రాత్రాదిభిర్భావితం
వందే విష్ణుశివాదిసేవ్యమనిశం భక్తేష్టసిద్ధిప్రదమ్ ॥ 9 ॥

10) ఆగచ్ఛ జానకీనాథ జానక్యా సహ రాఘవ ।
గృహాణ మమ పూజాం చ వాయుపుత్రాదిభిర్యుతః ॥ 10 ॥ ఇత్యావాహనం ।

11) సువర్ణరచితం రామ దివ్యాస్తరణశోభితమ్ ।
ఆసనం హి మయా దత్తం గృహాణ మణిచిత్రితమ్ ॥ 11 ॥ ఇతి షోడశోపచారైః పూజయేత్ ।

ఓమ్ అస్య శ్రీమన్మానసరామాయణశ్రీరామచరితస్య శ్రీశివకాకభుశుండి యాజ్ఞవల్క్య గోస్వామితులసీదాసా ఋషయః, శ్రీ సీతారామో దేవతా, శ్రీరామనామ బీజం భవరోగ హారి భక్తిః శక్తిః, మమ నియన్త్రితాశేషవిఘ్నతయా శ్రీ సీతారామప్రీతిపూర్వకసకలమనోరథసిద్ధ్యర్థం పాఠే వినియోగః ।

## అథ ఆచమనమ్

శ్రీ సీతారామాభ్యాం నమః । శ్రీరామచంద్రాయ నమః । శ్రీరామభద్రాయ నమః ।

ఇతి మంత్రత్రితయేన ఆచమనం కుర్యాత్ । శ్రీయుగళ బీజమంత్రేణ ప్రాణాయామం కుర్యాత్ ॥

## అథ కరన్యాసః

జగ మంగల గునగ్రామ రామ కే । దాని ముకుతి ధన ధరమ ధామ కే ॥ అంగుష్ఠాభ్యాం నమః

రామ రామ కహి జే జముహాహీం । తిన్హహి న పాపపుంజ సముహాహీం ॥ తర్జనీభ్యాం నమః

రామ సకల నామన్హ తే అధికా । హోఉ నాథ అఘ ఖగ గన బధికా ॥ మధ్యమాభ్యాం నమః

ఉమా దారు జోషిత కీ నాఈం । సబహి నచావత రాము గొసాఈం ॥ అనామికాభ్యాం నమః

సన్ముఖ హోఇ జీవ మొహి జబహీం । జన్మ కోటి అఘ నాసహిం తబహీం ॥ కనిష్ఠికాభ్యాం నమః

మామభిరక్షయ రఘుకులనాయక । ధృత బర చాప రుచిర కర సాయక ॥ కరతలకరపృష్ఠాభ్యాం నమః

ఇతి కరన్యాసః ।

## అథ హృదయాదిన్యాసః

జగ మంగల గునగ్రామ రామ కే । దాని ముకుతి ధన ధరమ ధామ కే ॥ హృదయాయ నమః

రామ రామ కహి జే జముహాహీం । తిన్హహి న పాపపుంజ సముహాహీం । శిరసే స్వాహా

రామ సకల నామన్హ తే అధికా । హోఉ నాథ అఘ ఖగ గన బధికా ॥ శిఖాయై వషట్

ఉమా దారు జోషిత కీ నాఈం । సబహి నచావత రాము గొసాఈం ॥ కవచాయ హుమ్

సన్ముఖ హోఇ జీవ మొహి జబహీం । జన్మ కోటి అఘ నాసహిం తబహీం ॥ నేత్రాభ్యాం వౌషట్

మామభిరక్షయ రఘుకులనాయక । ధృత బర చాప రుచిర కర సాయక ॥ అస్త్రాయ ఫట్

ఇతి హృదయాదిన్యాసః

## అథ ధ్యానమ్

మామవలోకయ పంకజలోచన । కృపాబిలోకని సోచ బిమోచన ॥

నీల తామరస స్యామ కామ అరి । హృదయ కంజ మకరంద మధుప హరి ॥

జాతుధాన బరూథ బల భంజన । ముని సజ్జన రంజన అఘ గంజన ॥

భూసుర ససి నవ బృంద బలాహక । అసరన సరన దీన జన గాహక ॥

భుజబల బిపుల భార మహి ఖండిత । ఖర దూషన బిరాధ బధ పండిత ॥

రావనారి సుఖరూప భూపబర । జయ దసరథ కుల కుముద సుధాకర ॥

సుజస పురాన బిదిత నిగమాగమ । గావత సుర ముని సంత సమాగమ ॥

కారునీక బ్యలీక మద ఖండన । సబ బిధి కుసల కోసలామండన ॥

కలి మల మథన నామ మమతాహన । తులసిదాస ప్రభు పాహి ప్రణత జన ॥ ఇతి ధ్యానమ్

# ధ్యాన శ్లోకములు

1) జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్ ।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

2) శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥

3) అగజాననపద్మార్కం గజాననమహర్నిశమ్ ।
అనేకదం తం భక్తానామ్ ఏకదంతముపాస్మహే ॥

4) వాగీశాద్యాస్సుమనసః సర్వార్థానాముపక్రమే ।
యం నత్వా కృతకృత్యాస్స్యుః తం నమామి గజాననమ్ ॥

5) శ్రీరాఘవం దశరథాత్మజమప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపమ్ ।
ఆజానుబాహుమ్ అరవిందదళాయతాక్షం
రామం నిశాచరవినాశకరం నమామి ॥

6) ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥

7) రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే ।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః ॥

8) ఆంజనేయమతిపాటలాననం కాంచనాద్రికమనీయవిగ్రహమ్ ।
పారిజాతతరుమూలవాసినం భావయామి పవమాననందనమ్ ॥

9) యత్ర యత్ర రఘునాథకీర్తనం, తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్ ।
బాష్పవారి పరిపూర్ణలోచనమ్, మారుతిం నమత రాక్షసాంతకమ్ ॥

10) మనోజవం మారుతతుల్యవేగం, జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్ ।
వాతాత్మజం వానరయూథముఖ్యం, శ్రీరామదూతం శిరసా నమామి ॥

11) కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్ ॥

12) ఆనందకాననేహ్యస్మిన్ జంగమస్తులసీతరుః ।
కవితామంజరీ భాతి రామభ్రమరభూషితా ॥

--- ❁ ---

## శ్రీ జానకీ జీవనాష్టకమ్

ఆలోక్య యస్యాతిలలామలీలాం సద్భాగ్యభాజౌ పితరౌ కృతార్థౌ ।
తమర్భకం దర్పకదర్పచోరం శ్రీజానకీజీవనమానతోఽస్మి ॥ 1 ॥
శ్రుత్వైవ యో భూపతిమాత్తవాచం వనం గతస్తేన న నోదితోఽపి ।
తం లీలయాహ్లాదవిషాదశూన్యం శ్రీజానకీజీవనమానతోఽస్మి ॥ 2 ॥
జటాయుషో దీనదశాం విలోక్య ప్రియావియోగప్రభవం చ శోకమ్ ।
యో వై విసస్మార తమార్ద్రచిత్తం శ్రీజానకీజీవనమానతోఽస్మి ॥ 3 ॥
యో వాలినా ధ్వస్తబలం సుకంఠం న్యయోజయద్రాజపదే కపీనామ్ ।
తం స్వీయసంతాపసుతప్తచిత్తం శ్రీజానకీజీవనమానతోఽస్మి ॥ 4 ॥
యద్ధ్యాననిర్ధూతవియోగవహ్నిః విదేహబాలా విబుధారివన్యామ్ ।
ప్రాణాందధే ప్రాణమయం ప్రభుం తం శ్రీజానకీజీవనమానతోఽస్మి ॥ 5 ॥
యస్యాతివీర్యాంబుధివీచిరాజౌ వంశ్యైరహో వైశ్రవణో విలీనః ।
తం వైరివిధ్వంసనశీలలీలం శ్రీజానకీజీవనమానతోఽస్మి ॥ 6 ॥
యద్రూపరాకేశమయూఖమాలానురంజితా రాజరమాపి రేజే ।
తం రాఘవేంద్రం విబుధేంద్రవంద్యం శ్రీజానకీజీవనమానతోఽస్మి ॥ 7 ॥
ఏవం కృతా యేన విచిత్రలీలా మాయామనుష్యేణ నృపచ్ఛలేన ।
తం వై మరాళం మునిమానసానాం శ్రీజానకీజీవనమానతోఽస్మి ॥ 8 ॥

## శ్రీరామస్తుతి

శ్రీరామచంద్ర కృపాళు భజు మన హరణ భవభయదారుణమ్ ।
నవకంజలోచన కంజముఖ కరకంజ పదకంజారుణమ్ ॥ 1 ॥
కందర్ప అగణిత అమిత ఛబి నవనీల నీరదసుందరమ్ ।
పటపీత మానహు తడిత రుచి శుచి నౌమి జనకసుతావరమ్ ॥ 2 ॥
భజు దీనబంధు దినేశ దానవ దైత్య వంశ నికందనమ్ ।
రఘునంద ఆనందకంద కోసలచంద దశరథనందనమ్ ॥ 3 ॥
సిరముకుట కుండల తిలక చారు ఉదారు అంగ విభూషణమ్ ।
ఆజానుభుజ శరచాపధర సంగ్రామజితఖరదూషణమ్ ॥ 4 ॥
ఇతి వదతి తులసీదాస శంకర శేషమునిమనరంజనమ్ ।
మమ హృదయకంజ నివాస కురు కామాది ఖల దల గంజనమ్ ॥ 5 ॥

पादुका-दान

Sandals (Pādukās)—Handed Over



प्रभु करि कृपा पाँवरी दीन्ही। सादर भरत सीस धरि लीन्ही॥

जटायुकी स्तुति Prayer by Jaṭāyu




गीध देह तजि धरि हरिरूपा। भूषन बहु पट पीत अनूपा॥
स्याम गात बिसाल भुज चारी। अस्तुति करत नयन भरि बारी॥



एकु मैं मंद मोहबस कुटिल हृदय अग्यान।
पुनि प्रभु मोहि बिसारेउ दीनबंधु भगवान॥



भूधराकार हनुमान्

**Mountain-like Hanumān**



अहह कंत कृत राम बिरोधा। काल बिबस मन उपज न बोधा॥




केकीकण्ठाभनीलं सुरवरविलसद्विप्रपादाब्जचिह्नं शोभाढ्यं पीतवस्त्रं सरसिजनयनं सर्वदा सुप्रसन्नम्।
पाणौ नाराचचापं कपिनिकरयुतं बन्धुना सेव्यमानं नौमीड्यं जानकीशं रघुवरमनिशं पुष्पकारूढरामम्॥

సత్యం శివం సుందరమ్
శ్రీగణేశాయ నమః
శ్రీజానకీవల్లభో విజయతే

# శ్రీరామచరితమానసము

## ప్రథమ సోపానము

# బాలకాండము

## మంగళాచరణము

శ్లో ॥ వర్ణానామర్థసంఘానాం రసానాం ఛందసామపి ।
మంగళానాం చ కర్తారౌ వందే వాణీవినాయకౌ ॥ 1 ॥

సమస్త వర్ణములకును, వాటి అర్థములకును, నవరసములకును, వివిధ ఛందస్సులకును, సమస్త శుభకార్యములకును ఆది దేవతలైన సరస్వతీ దేవికిని శ్రీ గణేశునకును నమస్కరించుచున్నాను. (1)

శ్లో ॥ భవానీశంకరౌ వందే శ్రద్ధావిశ్వాసరూపిణౌ ।
యాభ్యాం వినా న పశ్యంతి సిద్ధాః స్వాంతఃస్థమీశ్వరమ్ ॥ 2 ॥

శ్రద్ధా విశ్వాసములు లేనిదే సిద్ధులు అంతఃకరణ స్థితుడైన పరమేశ్వరుని దర్శింప జాలరు. కావున శ్రద్ధా విశ్వాసములకు ప్రతీకలైన పార్వతీ పరమేశ్వరులకు నమస్కరించెదను. (2)

శ్లో ॥ వందే బోధమయం నిత్యం గురుం శంకరరూపిణమ్ ।
యమాశ్రితో హి వక్రోఽపి చంద్రః సర్వత్ర వంద్యతే ॥ 3 ॥

వక్రరూపుడైన చంద్రుడుగూడ శంకరుని ఆశ్రయించుటవలన ఎల్లజనులచే పూజింప బడుచున్నాడు. జ్ఞాన స్వరూపుడును, నిత్యుడును, ఆదిగురువు ఐన అట్టి శంకరునకు నమస్కరించెదను. (3)

శ్లో ॥ సీతారామగుణగ్రామపుణ్యారణ్యవిహారిణౌ ।
వందే విశుద్ధవిజ్ఞానౌ కవీశ్వరకపీశ్వరౌ ॥ 4 ॥

కవీశ్వరుడైన వాల్మీకియు, కపీశ్వరుడైన మారుతియు, సర్వదా శ్రీ సీతారాములగుణగణపుణ్య వనమునందు విహరించు విశుద్ధ విజ్ఞాన ఖనులు. ఆ మహా మహితాత్ములకు ప్రణమిల్లు చున్నాను. (4)

శ్లో ॥ ఉద్భవస్థితిసంహారకారిణీం క్లేశహారిణీమ్ ।
సర్వశ్రేయస్కరీం సీతాం నతోఽహం రామవల్లభామ్ ॥ 5 ॥

శ్రీరామచంద్రుని ప్రియ పత్ని సీతమ్మ. ఆ తల్లి సృష్టి స్థితి లయ కారిణియైన మహా శక్తి స్వరూపిణి, అవిద్యాది సర్వక్లేశహారిణి, సమస్త శుభప్రదాయిని. ఆ సీతా మాతకు నా నమస్సుమాంజలులు. (5)

శ్లో ॥ యన్మాయావశవర్తి విశ్వమఖిలం బ్రహ్మాదిదేవాసురా
యత్సత్త్వాదమృషైవ భాతి సకలం రజ్జౌ యథాహేర్భ్రమః ।
యత్పాదప్లవమేకమేవ హి భవాంభోధేస్తితీర్షావతాం
వందేఽహం తమశేషకారణపరం రామాఖ్యమీశం హరిమ్ ॥ 6 ॥

శ్రీరాముడు శ్రీ మహా విష్ణువు యొక్క అవతారము. ఆయన మాయకు ఈ సమస్త విశ్వము, బ్రహ్మాది దేవతలు, అసురగణములు వశవర్తులు. ఆయన అస్తిత్వ ప్రభావముచే మిథ్యా జగత్తు అంతయును రజ్జు సర్పభ్రాంతిచే సత్యముగా తోచును. ఆయన పాదములే భవ సాగరమును దాటగోరు వారికి నౌకలు. ఆతడు అశేషకారణములకు అతీతుడు, శ్రేష్ఠుడు. అనగా మూలకారణమైనవాడు. అట్టి శ్రీరామచంద్ర ప్రభువునకు నా ప్రణామములు. (6)

శ్లో ॥ నానాపురాణనిగమాగమసమ్మతం యద్
రామాయణే నిగదితం క్వచిదన్యతోఽపి ।
స్వాంతఃసుఖాయ తులసీ రఘునాథగాథా
భాషానిబంధమతిమంజులమాతనోతి ॥ 7 ॥

రఘుకుల తిలకుడైన శ్రీరామచంద్రునిగాథ వేదపురాణశాస్త్రసమ్మతము, ఆ కథనే శ్రీమద్రామాయణ మహాకావ్యముగా ఆదికవి వాల్మీకిమహర్షి మనోజ్ఞముగా వర్ణించెను. ఇతర కవులును ఆ గాథను వివిధ రీతుల రచించిరి. అట్లే ఈ తులసీదాసు తన ఆత్మానందముకొఱకై ఆ రామాయణ గాథనే సరళమైన మధురమైన భాషలో వ్రాయుచున్నాడు. (7)

## ప్రార్థన

సో- జో సుమిరత సిధి హోఇ, గన నాయక కరిబర బదన ।
కరఉ అనుగ్రహ సోఇ, బుద్ధి రాసి సుభ గున సదన ॥ 1 ॥

పరమశివునిప్రమథగణములకు అధిపతియగు గజాననుడు తనను స్మరించినవారికి కార్య సిద్ధిని గలిగించును. ఆతడు విజ్ఞానఖని (భక్తులకు బుద్ధి ప్రదాత), సుగుణాల రాశి, అట్టి శ్రీ వినాయకుడు నన్ను అనుగ్రహించుగాక. (సోరఠ॥ 1)

మూక హోఇ బాచాల, పంగు చఢఇ గిరిబర గహన ।
జాసు కృపాఁ సో దయాల, ద్రవఉ సకల కలిమల దహన ॥ 2 ॥

దయాళువైన భగవంతునిఅనుగ్రహముచే మూగవాడు వక్త యగును. కుంటివాడు దుర్గమములైన పర్వతములను సైతము ఎక్కగలడు. కలి కల్మషములను రూపుమాపు ఆ భగవంతుడు నాపై కృపజూపుగాక. (2)

నీల సరోరుహ స్యామ, తరున అరున బారిజ నయన ।
కరఉ సో మమ ఉర ధామ, సదా ఛీరసాగర సయన ॥ 3 ॥

నల్లగల్వలవలె నీలమైన శరీర కాంతిగలవాడు, విచ్చిన ఎఱ్ఱదామరలవంటి విశాలనేత్రములు గలవాడు, క్షీర సాగర శయనుడైన శ్రీమన్నారాయణుడు సర్వదా నా హృదయమున నివసించు గాక. (3)

కుంద ఇందు సమ దేహా, ఉమా రమన కరునా అయన ।
జాహి దీన పర నేహా, కరఉ కృపా మర్దన మయన ॥ 4 ॥

పార్వతీ పతియైన పరమేశ్వరుడు మల్లె పూవులవలె, చంద్రుని వలె తెల్లని దేహ కాంతిగలవాడు, కరుణామూర్తి, దీనజనరక్షకుడు, మన్మథమర్దనుడైన ఆ పరమశివుడు నన్ను బ్రోచు గాక. (4)

## గురుప్రస్తుతి

బందఉఁ గురు పద కంజ, కృపా సింధు నరరూప హరి ।
మహామోహ తమ పుంజ, జాసు బచన రబి కర నికర ॥ 5 ॥

నేను నా గురుదేవులపాదపద్మములకు నమస్కరించుచున్నాను. ఆయన కృపాసముద్రుడు, మనుష్యరూపముదాల్చిన శ్రీహరి. సూర్యకిరణములు అంధకారమునువలె. విజ్ఞాననిధియైన ఆయునవచనములు అజ్ఞానమును పటాపంచలు గావించును. (5)

చౌ- బందఉఁ గురు పద పదుమ పరాగా । సురుచి సుబాస సరస అనురాగా ॥
అమిఅ మూరిమయ చూరన చారూ । సమన సకల భవరుజ పరివారూ ॥ 1 ॥
సుకృతి సంభు తన బిమల బిభూతీ । మంజుల మంగల మోద ప్రసూతీ ॥
జన మన మంజు ముకుర మల హరనీ । కిఏఁ తిలక గున గన బస కరనీ ॥ 2 ॥
శ్రీగుర పద నఖ మని గన జోతీ । సుమిరత దిబ్య దృష్టి హియఁ హోతీ ॥
దలన మోహ తమ సో సప్రకాసూ । బడే భాగ ఉర ఆవఇ జాసూ ॥ 3 ॥
ఉఘరహిఁ బిమల బిలోచన హీ కే । మిటహిఁ దోష దుఖ భవ రజనీ కే ॥
సూఝహిఁ రామ చరిత మని మానిక । గుపుత ప్రగట జహఁ జో జెహి ఖానిక ॥ 4 ॥

నా గురుదేవునిపవిత్రపాదపద్మములధూళి సుందరమైనది. సురుచిరమైనది. సువాసనలను వెదజల్లునది, అనురాగ మధురిమలను చిలుకునది. అది జన్మమృత్యురూపసాంసారిక బాధలను నశింపజేయు దివ్యౌషధము. అమృత రూపవనస్పతియొక్క దివ్య చూర్ణము. అట్టి గురుపాదపద్మరజమునకు నా వందనములు. ఈ ధూళి

శంకరునిశరీరముపై గల విభూతివలె నిర్మలమైనది, శుభకరమైనది, ఆనంద ప్రదమైనది. ఇది భక్తుని మనోదర్పణముపై గల మాలిన్యమును తొలగించును. తిలకముగా ధరించినచో పెక్కు సుగుణములను సమకూర్చును. శ్రీ గురుదేవుని నఖద్యుతులు మణులవలె ప్రకాశించుచు స్మరణ మాత్రముననే అవి అజ్ఞానాంధకారమును రూపుమాపి, ఆత్మానందమును గూర్చును. గురుదేవుల పాద పద్మములను హృదయమున నిలుపుకొనినవాడు భాగ్యశాలి. గురుదేవులకృపచే వానిమనోనేత్రములు విచ్చుకొనును. పాపములును, సాంసారికబాధలును దూరమగును. శ్రీరామకథలు అనెడి మణిమాణిక్యములు ఏగనియందు ప్రక్షిప్త(గుప్త)ములుగానున్నను, ప్రకటితములైనను, అవి ఆహృదయమున ప్రకాశమానములగు చుండును.

(చౌపాఈ॥ 1-4)

దో-జథా సుఅంజన అంజి దృగ, సాధక సిద్ధ సుజాన।
కౌతుక దేఖత సైల బన, భూతల భూరి నిధాన ॥ 1 ॥

సిద్ధాంజనమును కనులలో పెట్టుకొనిన సిద్ధులు, సాధకులు శిఖరములపైనను వనముల మధ్యయందును, భూగర్భములయందునుగల సమస్తనిధులను అనాయాసముగా చూచినట్లు గురుపాదకమలధూళిని కన్నులకద్దుకొనినవారు సిద్ధిని, జ్ఞానమును అవలీలగా పొందుదురు. (దోహా - 1)

చౌ- గురు పద రజ మృదు మంజుల అంజన । నయన అమిఅ దృగ దోష బిభంజన ॥
తెహిఀ కరి బిమల బిబేక బిలోచన । బరనఉఀ రామ చరిత భవ మోచన ॥ 1 ॥
బందఉఀ ప్రథమ మహీసుర చరనా । మోహ జనిత సంసయ సబ హరనా ॥
సుజన సమాజ సకల గున ఖానీ । కరఉఀ ప్రనామ సప్రేమ సుబానీ ॥ 2 ॥

## సజ్జనుల మహిమ

సాధు చరిత సుభ చరిత కపాసూ । నిరస బిసద గునమయ ఫల జాసూ ॥
జో సహి దుఖ పరఛిద్ర దురావా । బందనీయ జెహిఀ జగ జస పావా ॥ 3 ॥
ముద మంగలమయ సంత సమాజూ । జో జగ జంగమ తీరథరాజూ ॥
రామ భక్తి జహఀ సురసరి ధారా । సరసఇ బ్రహ్మ బిచార ప్రచారా ॥ 4 ॥
బిధి నిషేధమయ కలిమల హరనీ । కరమ కథా రబినందని బరనీ ॥
హరి హర కథా బిరాజతి బేనీ । సునత సకల ముద మంగల దేనీ ॥ 5 ॥
బటు బిస్వాస అచల నిజ ధరమా । తీరథరాజ సమాజ సుకరమా ॥
సబహి సులభ సబ దిన సబ దేసా । సేవత సాదర సమన కలేసా ॥ 6 ॥
అకథ అలౌకిక తీరథరాఊ । దేఇ సద్య ఫల ప్రగట ప్రభాఊ ॥ 7 ॥

గురుదేవునిపాదపద్మరజము కోమలమైనది, మనోజ్ఞమైనది. అది నేత్ర దోషములను రూపు మాపు నయనామృతసిద్ధాంజనము. ఈ అంజనముచే నామనోనేత్రములను నిర్మలమొనర్చుకొని, సంసారబంధములనుండి విముక్తిని ప్రసాదించు శ్రీరామచరితమును వర్ణించెదను. అజ్ఞానజనితములైన సందేహములనుపాఱద్రోలు భూసురోత్తములకు ముందుగా వందనములనాచరింతును. అనంతరము సద్గుణసంపన్నులైన సాధువులకును, సత్పురుషులకును వినయముతో ప్రణమిల్లెదను. ప్రత్తి ఎండినదై, స్వచ్ఛమై గుణమయమై యుండును. అట్లే

సాధువులచరిత్ర అనాసక్తమై, పాపరహితమై సద్గుణ సంపన్నమై అలరారును. వడకుట, నేయుట మొదలగు సందర్భములలో ప్రత్తిత్తాను కష్టములను సహించి, ఇతరుల ఛిద్రములను కప్పివేసి, గొప్ప కీర్తిని సంపాదించును. అట్లే సాధువులు ఎన్ని కష్టములనైనను ఓర్చుకొనుచు ఇతరులను ఉద్ధరించెదరు. అట్టి సాధువుల సమాజము ఆనందమయము, కల్యాణ ప్రదము. అది (ఆ సమాజము) ఒక కదలుచున్న ప్రయాగ. (త్రివేణీ సంగమము) అచట రామ భక్తి అనువది గంగా ప్రవాహము. బ్రహ్మవిచారమే సరస్వతీ నది. విధినిషేధ రూపములైనకథలు కలియుగపాపములను ప్రక్షాళనచేయు యమునా తరంగములు. ఈ మూడును ఇచట కలియును. శివకేశవులగాథలు త్రివేణీ సంగమమై శ్రోతలకు ఆనందమును, శుభములను అందించును. ఈ సాధు సమాజ రూపమైన ప్రయాగ క్షేత్రమున స్వధర్మము నందలి విశ్వాసమే అక్షయవటము, సత్కార్యములే తీర్థ రాజ పరివారములు. తీర్థ రాజ మైన ఇట్టి ప్రయాగ వివిధదేశములలో సర్వకాలములయందును సాధుజనరూపమున అందరికిని లభ్యమగును. వారిని సాదరముగా సేవించుటచే అవిద్యాదిక్లేశములన్నియును పటాపంచలగును. ఈ తీర్థ రాజము అలౌకికము, వర్ణనాతీతము, సద్యః ఫలదాయకము. దీని ప్రభావము ప్రత్యక్షము. (చౌ॥ 1-7)

దో-సుని సముఝహిఀ జన ముదిత మన, మజ్జహిఀ అతి అనురాగ ।
లహహిఀ చారి ఫల అఛత తను, సాధు సమాజ ప్రయాగ ॥ 2 ॥

ఈ సాధుసమాజరూపమైన ప్రయాగ మహిమను విని, అవగాహన చేసికొని, అత్యంత భక్తితో అందు మునకలు వేయువారికి ఈ జన్మలోనే ధర్మార్థ కామ మోక్ష (చతుర్విధ పురుషార్థ) ఫలములు సిద్ధించును. (దో॥ 2)

చౌ- మజ్జన ఫల పేఖిఅ తతకాలా । కాక హోహిఀ పిక బకఉ మరాలా ॥
సుని ఆచరజ కరై జని కోఈ । సతసంగతి మహిమా నహిఀ గోఈ ॥ 1 ॥
బాలమీక నారద ఘటజోనీ । నిజ నిజ ముఖని కహీ నిజ హోనీ ॥
జలచర థలచర నభచర నానా । జే జడ చేతన జీవ జహానా ॥ 2 ॥
మతి కీరతి గతి భూతి భలాఈ । జబ జేహిఀ జతన జహాఀ జేహిఀ పాఈ ॥
సో జానబ సతసంగ ప్రభాఊ । లోకహుఀ బేద న ఆన ఉపాఊ ॥ 3 ॥
బిను సతసంగ బిబేక న హోఈ । రామ కృపా బిను సులభ న సోఈ ॥
సతసంగత ముద మంగల మూలా । సోఇ ఫల సిధి సబ సాధన ఫూలా ॥ 4 ॥
సఠ సుధరహిఀ సతసంగతి పాఈ । పారస పరస కుధాత సుహాఈ ॥
బిధి బస సుజన కుసంగత పరహీఀ । ఫని మని సమ నిజ గున అనుసరహీఀ ॥ 5 ॥
బిధి హరి హర కబి కోబిద బానీ । కహత సాధు మహిమా సకుచానీ ॥
సో మో సన కహి జాత న కైసేఀ । సాక బనిక మని గున గన జైసేఀ ॥ 6 ॥

సాధుసమాజరూపమైన ఈ ప్రయాగలో మునిగినచో ఫలము వెంటనే లభించును. కాకులు కోయిలలగును. కొంగలు హంసలుగా మారును. దీనికి ఆశ్చర్యపడవలసిన పనియేలేదు. సత్సంగత్యమహిమ జగద్విదితము. వాల్మీకి, నారద, అగస్త్యాదిమహర్షులజీవితగాథలే యిందుకు ప్రబలనిదర్శనములు. భూచరములు, జలచరములు, ఖేచరములు మొదలగు చరాచరప్రాణులన్నియును సత్సంగప్రభావమువలననే ఐశ్వర్యములను, బుద్ధి, కీర్తి

సద్గతులను, పొందినవి. ఈ ఐశ్వర్యాదులను పొందుటకు సత్సాంగత్యము తప్ప మఱియేమార్గమూ లోకమున గాని వేదములలో గాని ప్రస్తావింపబడలేదు. సత్సాంగత్యము లేనిదే వివేకము అబ్బదు. శ్రీరాముని దయ వలననే సత్సాంగత్యము లభించును. ఆనంద ప్రాప్తికిని, శ్రేయోలాభములకును సత్సాంగత్యమే మూలము. సాధనములన్నియును పుష్పములు. సత్సంగప్రాప్తియే ఫలము. ఇనుము పరుస వేదిని తాకిన బంగారమగునట్లు దుష్టులు గూడ సత్సంగతి వలన సత్పురుషులుగా అయ్యెదరు. విధివశమున సత్పురుషులకు దుష్టసాంగత్యము ప్రాప్తించినను పాము పడగపైగల మణివలె వారు సద్గుణములతోడనే విలసిల్లుదురు. సర్పవిషముచే మణి ఏ విధముగను ప్రభావితముగాక స్వయంప్రకాశమానమగును. అట్లే దుష్టసాంగత్యముచే సజ్జనులు ఏ మాత్రమూ ప్రభావితులు గాక తమ సుగుణములతోడనే శోభిల్లుచుందురు. కవులుగాని, విజ్ఞానులుగాని కడకు బ్రహ్మవిష్ణు మహేశ్వరులుగాని సత్పురుషమహిమలను పూర్తిగా వర్ణింపజాలరు. ఇక నేను వర్ణింపబూనుట కూరలమ్ము వాడు మణుల నాణ్యతను తెల్పునట్లుండును. (చౌ॥ 1-6)

దో-బందఉఁ సంత సమాన చిత, హిత అనహిత నహిఁ కోఇ।
అంజలి గత సుభ సుమన జిమి, సమ సుగంధ కర దోఇ ॥ 3 (క) ॥
సంత సరల చిత జగత హిత, జాని సుభాఉ సనేహు।
బాలబినయ సుని కరి కృపా, రామచరన రతి దేహు ॥ 3 (ఖ) ॥

దోసిట జేరిన పుష్పములు రెండు చేతులకును (అనగా తమను తెంపిన చేతికిని, తమను పట్టుకొనిన చేతికిని) సుగంధమును సమానముగనే పంచియిచ్చును. అట్లే సాధుపుంగవులు అందఱిని సమ భావముతోడనే చూచెదరు. వారికి శత్రువులు గాని, మిత్రులుగాని, ఉండరు. అట్టి సాధుపురుషులకు నమస్కరించెదను. సాధువులు సరళ చిత్తులు, లోకోపకారులు. వారి సద్భావమును స్నేహమును తెలిసికొని, "ఓ సాధువులారా! ఈ బాలుని ప్రార్థనను మన్నించి, శ్రీరామునిచరణకమలములపై ప్రీతికలుగునట్లు అనుగ్రహింపుడు" - అని వారిని తులసీదాసు వేడుకొనుచున్నాడు. (దో॥ 3 క,ఖ)

చౌ- బహురి బంది ఖల గన సతిభాఏఁ। జే బిను కాజ దాహినెహు బాఏఁ ॥
పర హిత హాని లాభ జిన్హ కేరేఁ। ఉజరేఁ హరష బిషాద బసేరేఁ ॥ 1 ॥
హరి హర జస రాకేస రాహు సే। పర అకాజ భట సహసబాహు సే ॥
జే పర దోష లఖహిఁ సహసాఖీ। పర హిత ఘృత జిన్హ కే మన మాఖీ ॥ 2 ॥
తేజ కృసాను రోష మహిషేసా। అఘ అవగున ధన ధనీ ధనేసా ॥
ఉదయ కేత సమ హిత సబహీ కే। కుంభకరన సమ సోవత నీకే ॥ 3 ॥
పర అకాజు లగి తను పరిహరహీఁ। జిమి హిమ ఉపల కృషీ దలి గరహీఁ ॥
బందఉఁ ఖల జస సేష సరోషా। సహస బదన బరనఇ పర దోషా ॥ 4 ॥
పుని ప్రనవఉఁ పృథురాజ సమానా। పర అఘ సునఇ సహస దస కానా ॥
బహురి సక్ర సమ బినవఉఁ తేహీ। సంతత సురానీక హిత జేహీ ॥ 5 ॥
బచన బజ్ర జెహి సదా పిఆరా। సహస నయన పర దోష నిహారా ॥ 6 ॥

దుష్టులు తమకు అవ్యాజ ప్రేమతో హితమునుచేకూర్చు వారిని సైతము హింసింతురు. ఇతరులకు హాని చేయుటలోనే తమకు లాభము కలదని భావింతురు. ఇతరుల పతనమును జూచి ఆనందింతురు, ఉన్నతిని జూచి దుఃఖ పడుదురు. అట్టి దుష్టులకుసైతము నేను సద్భావముతో నమస్కరింతును. వీరు హరిహరులకీర్తియనెడి పూర్ణచంద్రునకు రాహువు వంటివారు. (అనగా హరిహరులను కీర్తించినను దానికితట్టు కొనలేక ఆ కీర్తించువారికి విఘ్నములను గూర్తురు.) ఇతరులకు కీడు చేయుటలో వీరు సహస్ర బాహువులు. ఇతరుల దోషములను వేయి కన్నులతో వెదకు చుందురు. నేతిని చెడగొట్టు ఈగవలె వీరి మనస్సులు ఇతరుల హితములను భంగపఱచుటలో నిమగ్నమగుచుండును. వీరు ఇతరులకు తాపమును గూర్చుటలో అగ్నివంటివారు. క్రోధములో యమునివంటివారు. పాపములు, అవగుణములు అనెడి ధనములకు వీరు కుబేరులు. కేతువు (తోకచుక్క) వలె అందఱిహితములను నాశనముచేయుదురు. వీరు నిద్రించుటలో కుంభకర్ణులగుటయే లోకమునకు మేలు. వడగండ్లు పంటలను పాడుచేసి, తాముగూడ కరగి పోవునట్లే వీరు ఇతరులకు కీడు చేయుటకై తమ ప్రాణములనుగూడ ఒడ్డెదరు. వేయినాలుకలతో ఇతరుల దోషములను ఆక్రోశముతో ఎన్ను వీరిని శేషుడని భావించి, నమస్కరించెదను. ఇతరుల పాప కృత్యములను గూర్చి పదివేల చెవులతో (చెవులప్పగించి) విందురు. భగవత్కథలను వినుటకై పదివేల చెవులను గోరిన పృథురాజుగా వీరిని భావించెదను. సురా(మద్య)పాన ప్రియులైన వీరిని సురానీక (దేవతాసమూహ)ప్రియుడైన ఇంద్రునిగా భావించెదను. కఠినాతి కఠినమైన వజ్రాయుధమే ఇంద్రునకు ఇష్టము. అట్లే కఠినాతి కఠినములైన పరుష వచనములే వీరికి ఇష్టములు. ఇతరుల దోషములను ఎన్నుటలో వీరు సహస్రాక్షులు. (చౌ॥ 1-6)

దో- ఉదాసీన అరి మీత హిత, సునత జరహిఁ ఖల రీతి।
జాని పాని జుగ జోరి జన, బినతీ కరఇ సప్రీతి ॥ 4 ॥

దుష్టులు తమ మిత్రుల యొక్క, శత్రువుల యొక్క, తటస్థుల యొక్క ఉన్నతిని జూచి, ఈర్ష్యతో మలమల మాడిపోవుదురు. వీరి యీరీతిని గమనించి, వినయముతో ప్రేమతో చేతులు జోడించి వీరికి నమస్కరింతును.
(దో॥ 4)

చౌ- మైఁ అపనీ దిసి కీన్హ నిహోరా। తిన్హ నిజ ఓర న లాఉబ భోరా ॥
బాయస పలిఅహిఁ అతి అనురాగా। హోహిఁ నిరామిష కబహుఁ కి కాగా ॥ 1 ॥
బందఉఁ సంత అసజ్జన చరనా। దుఖప్రద ఉభయ బీచ కఛు బరనా ॥
బిఛురత ఏక ప్రాన హరి లేహీఁ। మిలత ఏక దుఖ దారున దేహీఁ ॥ 2 ॥
ఉపజహిఁ ఏక సంగ జగ మాహీఁ। జలజ జోఁక జిమి గున బిలగాహీఁ ॥
సుధా సురా సమ సాధు అసాధూ। జనక ఏక జగ జలధి అగాధూ ॥ 3 ॥
భల అనభల నిజ నిజ కరతూతీ। లహత సుజస అపలోక బిభూతీ ॥
సుధా సుధాకర సురసరి సాధూ। గరల అనల కలిమల సరి బ్యాధూ ॥ 4 ॥
గున అవగున జానత సబ కోఈ। జో జెహి భావ నీక తెహి సోఈ ॥ 5 ॥

నా ధర్మముగా వారిని నేను ప్రార్థించితిని. కాని వారు తమ స్వభావములను మానుకొందురా? కాకులను ఎంతటి తియ్యని పాయసముతో పోషించినను అవి మాంసమును తినుట మానుకొనునా? నేను సాధువులకును దుష్టులకును నమస్కరింతును. ఉభయులును కష్టపెట్టెడి వారే. కాని వారి మధ్య మిక్కిలి అంతరము గలదు.

సాధువులు మనకు దూరమైనప్పుడు మన ప్రాణములే పోయినట్లగును, దుష్టులు మనకు చేరువయైనప్పుడు ఎనలేని బాధకలుగును. ఏకాలమునందైనను సజ్జనులును దుర్జనులును ఈ లోకమున ప్రక్క ప్రక్కనే జన్మించుచుందురు. కాని వారి వారి స్వభావములు వేఱు. కమలములు జలగలు నీటిలోనే పుట్టు చుండును. అమృతము మదిర రెండును సముద్రము నుండియే ఉద్భవించినవి. సజ్జనులును దుర్జనులును వారి వారి కర్మఫలములను అనుసరించి కీర్తి-అపకీర్తులను పొందెదరు. సాధువుల స్వభావములు అమృతము, చంద్రుడు, పవిత్ర గంగానది వంటివి. దుష్టుల స్వభావములు విషము, అగ్ని, కలి పాపములతో గూడిన కర్మనాశనదివంటివి. వీరి గుణావగుణములను ఎల్లరును ఎఱుంగుదురు. ఎవరికి నచ్చిన వాటిని వారుగ్రహింతురు. (చౌ॥ 1-5)

దో-భలో భలాఇహి పై లహఇ, లహఇ నిచాఇహి నీచు।
సుధా సరాహిఅ అమరతాఀ, గరల సరాహిఅ మీచు ॥ 5 ॥

సజ్జనులు మంచినే పట్టుకొందురు. దుర్జనులు చెడును విడిచిపెట్టరు. అమృతము అమరత్వమును ప్రసాదించును. విషము మరణమునే సమకూర్చును. ఈ రెండును తమతమ గుణములకు ప్రసిద్ధములు, దోహదకారులు. (దో॥ 5)

చౌ- ఖల అఘ అగున సాధు గున గాహా। ఉభయ అపార ఉదధి అవగాహా ॥
తెహి తేఀ కఛు గున దోష బఖానే। సంగ్రహ త్యాగ న బిను పహిచానే ॥ 1 ॥
భలెఉ పోచ సబ బిధి ఉపజాఏ। గని గున దోష బేద బిలగాఏ ॥
కహహిఀ బేద ఇతిహాస పురానా। బిధి ప్రపంచు గున అవగున సానా ॥ 2 ॥
దుఖ సుఖ పాప పున్య దిన రాతీ। సాధు అసాధు సుజాతి కుజాతీ ॥
దానవ దేవ ఊఀచ అరు నీచూ। అమిఅ సుజీవను మాహురు మీచూ ॥ 3 ॥
మాయా బ్రహ్మ జీవ జగదీసా। లచ్ఛి అలచ్ఛి రంక అవనీసా ॥
కాసీ మగ సురసరి క్రమనాసా। మరు మారవ మహిదేవ గవాసా ॥ 4 ॥
సరగ నరక అనురాగ బిరాగా। నిగమాగమ గున దోష బిభాగా ॥ 5 ॥

దుర్జనుల పాపకృత్యములను దోషములను, సజ్జనుల సద్గుణములను తెలిపెడి కథలు సముద్రములవలె అపారములు, అగాధములు. ఇందులో సజ్జనులగుణములు, దుర్జనులదోషములును వర్ణింపబడినవి. ఏలనన వారితారతమ్యములను గుర్తింపనిదే సుగుణములను గ్రహించుటకును, దుర్గుణములను నిరాకరించుటకును సాధ్యము కాదు. గుణదోషములు రెండును బ్రహ్మసృష్టిలోని భాగములే. వేదములు వాటి తారతమ్యములను వేర్వేఱుగా స్పష్టముగా విశదీకరించెను. వేదములతోపాటు ఇతిహాసపురాణాదులు గూడ బ్రహ్మసృష్టి గుణదోషములసమ్మేళనమని వక్కాణించెను. ఇట్టి వైరుధ్యములు ఈ సృష్టిలో అనంతములు. సుఖదుఃఖములు, పుణ్యపాపములు, దివారాత్రములు, మంచిచెడులు, సుజాతికుజాతులు, దేవదానవులు, ఉచ్చనీచములు, అమృతవిషములు, జననమరణములు, బ్రహ్మ-మాయలు ఈశ్వర-జీవులు, సంపదలు-దారిద్ర్యములు, రాజు-పేదలు, కాశీ-మగధలు, గంగా-కర్మనాశనదులు, మార్వార-మాళవ దేశములు, బ్రాహ్మణుడు-కసాయివాడు, స్వర్గనరకములు, వైరాగ్యానురాగములు మొదలగునవి ఈ వైవిధ్యములకు ప్రబలనిదర్శనములు. వేదశాస్త్రములు వీటి మంచిచెడులను వివరించినవి. (చౌ॥ 1-5)

దో-జడ చేతన గున దోషమయ, బిస్వ కీన్హ కరతార।
సంత హంస గున గహహిఁ పయ, పరిహరి బారి బికార॥ 6 ॥

భగవంతుడు చేతనాచేతనరూపమైన విశ్వమునందు మంచిచెడులను సృష్టించెను. హంస పాలను గ్రహించి నీటిని వదలినట్లే సాధువులు గుణములను గ్రహించి, దోషములను దూరముగా పరిహరించెదరు. (దో॥ 6)

చౌ- అస బిబేక జబ దేఇ బిధాతా। తబ తజి దోష గునహిఁ మను రాతా॥
కాల సుభాఉ కరమ బరిఆఈఁ। భలెఉ ప్రకృతి బస చుకఇ భలాఈఁ॥ 1 ॥
సో సుధారి హరిజన జిమి లేహీఁ। దలి దుఖ దోష బిమల జసు దేహీఁ॥
ఖలఉ కరహిఁ భల పాఇ సుసంగూ। మిటఇ న మలిన సుభాఉ అభంగూ॥ 2 ॥
లఖి సుబేష జగ బంచక జేఊ। బేష ప్రతాప పూజిఅహిఁ తేఊ॥
ఉఘరహిఁ అంత న హోఇ నిబాహూ। కాలనేమి జిమి రావన రాహూ॥ 3 ॥
కిఏహుఁ కుబేషు సాధు సనమానూ। జిమి జగ జామవంత హనుమానూ॥
హాని కుసంగ సుసంగతి లాహూ। లోకహుఁ బేద బిదిత సబ కాహూ॥ 4 ॥
గగన చఢఇ రజ పవన ప్రసంగా। కీచహిఁ మిలఇ నీచ జల సంగా॥
సాధు అసాధు సదన సుక సారీఁ। సుమిరహిఁ రామ దేహిఁ గని గారీఁ॥ 5 ॥
ధూమ కుసంగతి కారిఖ హోఈ। లిఖిఅ పురాన మంజు మసి సోఈ॥
సోఇ జల అనల అనిల సంఘాతా। హోఇ జలద జగ జీవన దాతా॥ 6 ॥

భగవదనుగ్రహమున విచక్షణాశక్తిని కల్గియున్నవారు చెడును విసర్జించి, మంచిని మాత్రమే గ్రహింతురు. ఒక్కొక్కప్పుడు మంచివారు సైతము మాయామోహితులై కాలము, స్వభావము, కర్మల ప్రభావముచే సన్మార్గము నుండి వైదొలగుదురు. భగవద్భక్తులు ఈ పొరపాటును తెలిసికొని, వాటిని సవరించు కొందురు. దుఃఖదోషములను అధిగమించి (పాలుద్రోలి) నిర్మలమైనయశమును పొందుదురు. అట్లే దుష్టులుగూడ ఒక్కొక్కసారి సత్సాంగత్యప్రభావమున సత్కర్మలను ఆచరింతురు. కాని వారిదుష్టస్వభావములు మాత్రము మారవు. కపట వేషధారులైన ధూర్తులు మొదట గౌరవింపబడినను కాలక్రమమున వారివారి నిజ స్వరూపములు బట్టబయలగును. కాలనేమి, రావణుడు, రాహువు మొదలగు వారి వృత్తాంతములే ఇందులకు ప్రబలనిదర్శనములు. సజ్జనుల రూపములు, వేషములు ఎట్లున్నను వారు హనుమజ్జాంబవంతాదులవలె అందఱిచే గౌరవింప బడుదురు. దుష్టసహవాసము ప్రమాదకరము. సజ్జనమైత్రి వరప్రసాదము. ఇది లోకవిదితము, వేదప్రామాణికము. వాయు సాంగత్యమున పైకెగురుధూళి ఉన్నతస్థితికి చేరును. అదియే పతనోన్ముఖముగా సాగిపోవు నీటితో కూడినప్పుడు బురదయై అధోగతి పాలగును. సజ్జనులఇండ్లలో పెఱిగినచిలుకలు, గోర్వంకలు, రామ నామమును జపించును. (పలుకును) దుర్జనులఇండ్లలోనిచిలుకలు దుర్భాషలాడును. పొగ మలినములతో కలిసినచో నల్లబారును. కాని సిరాగా మాఱినచో పవిత్రపురాణములనే వ్రాయవచ్చును ఆ పొగయే-నీరు, అగ్ని, గాలితో కలిసి, మేఘముగా, మాఱినప్పుడు వర్షజలముల ద్వారా జీవులకు ప్రాణదాత యగును. (చౌ॥ 1-6)

దో- గ్రహ భేషజ జల పవన పట, పాఇ కుజోగ సుజోగ ।
హోహిఁ కుబస్తు సుబస్తు జగ, లఖహిఁ సులచ్ఛన లోగ ॥ 7 (క) ॥
సమ ప్రకాస తమ పాఖ దుహుఁ, నామ భేద బిధి కీన్హ ।
ససి సోషక పోషక సముఝి, జగ జస అపజస దీన్హ ॥ 7 (ఖ) ॥
జడ చేతన జగ జీవ జత, సకల రామమయ జాని ।
బందఉఁ సబకే పద కమల, సదా జోరి జుగ పాని ॥ 7 (గ) ॥
దేవ దనుజ నర నాగ ఖగ, ప్రేత పితర గంధర్బ ।
బందఉఁ కిన్నర రజనిచర, కృపా కరహు అబ సర్బ ॥ 7 (ఘ) ॥

గ్రహములు, ఓషధులు, జలములు, వాయువు, వస్త్రములు - ఇవియన్నియును వాటివాటి సాహచర్యములను బట్టి మంచి, లేక చెడుగా భావింపబడుచుండును. విజ్ఞులైన వారు ఈ లోకసత్యములను ఎఱుంగ గలరు. శుక్ల, కృష్ణపక్షములయందు వెన్నెల, చీకటి సమానముగనే యుండును. కాని విధాత వాటికి వేర్వేఱు పేర్లను పెట్టెను. లోకము చంద్రునికళలవృద్ధికి తోడ్పడు శుక్ల పక్షమును ప్రశంసించును. క్షీణదశకు ఆకరమగు కృష్ణపక్షమును ఏవగించుకొనును. విశ్వమునందలి చేతనాచేతన పదార్థములన్నియును శ్రీరామమయములు. కావున నేను వాటిచరణకమలములకు చేతులుజోడించి మ్రొక్కెదను. దేవతలు, దైత్యులు, మానవులు, నాగులు, పక్షులు, ప్రేతలు, పితరులు, గంధర్వ, కిన్నర, రాక్షసులు మున్నగు సమస్త ప్రాణికోటికిని ప్రణమిల్లుదును. తదనుగ్రహము నాకు లభించునుగాక.
(దో॥ 7. క,ఖ,గ,ఘ)

చౌ- ఆకర చారి లాఖ చౌరాసీ । జాతి జీవ జల థల నభ బాసీ ॥
సీయ రామమయ సబ జగ జానీ । కరఉఁ ప్రనామ జోరి జుగ పానీ ॥ 1 ॥
జాని కృపాకర కింకర మోహూ । సబ మిలి కరహు ఛాడి ఛల ఛోహూ ॥
నిజ బుధి బల భరోస మొహి నాహీఁ । తాతేఁ బినయ కరఉఁ సబ పాహీఁ ॥ 2 ॥
కరన చహఉఁ రఘుపతి గున గాహా । లఘు మతి మోరి చరిత అవగాహా ॥
సూఝ న ఏకఉ అంగ ఉపాఊ । మన మతి రంక మనోరథ రాఊ ॥ 3 ॥
మతి అతి నీచ ఊఁచి రుచి ఆఛీ । చహిఅ అమిఅ జగ జురఇ న ఛాఛీ ॥
ఛమిహహిఁ సజ్జన మోరి ఢిఠాఈ । సునిహహిఁ బాలబచన మన లాఈ ॥ 4 ॥
జౌఁ బాలక కహ తోతరి బాతా । సునహిఁ ముదిత మన పితు అరు మాతా ॥
హఁసిహహిఁ కూర కుటిల కుబిచారీ । జే పర దూషన భూషనధారీ ॥ 5 ॥
నిజ కబిత్త కేహి లాగ న నీకా । సరస హోఉ అథవా అతి ఫీకా ॥
జే పర భనితి సునత హరషాహీఁ । తే బర పురుష బహుత జగ నాహీఁ ॥ 6 ॥
జగ బహు నర సర సరి సమ భాఈ । జే నిజ బాఢి బఢహిఁ జల పాఈ ॥
సజ్జన సకృత సింధు సమ కోఈ । దేఖి పూర బిధు బాఢఇ జోఈ ॥ 7 ॥

భూమ్యాకాశములయందును జలములయందును జీవించు చతుర్విధములైన (జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజములు) (1) మానవులు, జంతువులు. (2) పక్షులు. (3) క్రిమి కీటకాదులు. (4) మొక్కలు. ఎనుబది నాలుగు లక్షల జీవరాసులు సీతారామమయములని భావించి, వాటికి అంజలి ఘటింతును. ఓ దయానిధులారా ! నన్ను మీసేవకునిగా భావించి, నిష్కపటచిత్తములతో నాపై కృపజూపుడు. నాబుద్ధి బలముపై నాకు విశ్వాసము లేదు. కనుక మీకు విన్నవించుచున్నాను. రఘుకులతిలకుడైన శ్రీరామునిగుణములను వర్ణింప గోరుచున్నాను. నా బుద్ధి అల్పమైనది. శ్రీరాముని చరితము అగాధమైనది. నేను ఏ కావ్యాంగములనూ ఎఱుగను, నా మనోరథము మాత్రము రాజువలె ఉన్నతమైనది కాని నామనస్సు, బుద్ధి నిరుపేదల వలె అల్పములైనవి, నా కోరిక ఘనమైనది, ఒ..ద్దిమాత్రము అల్పమైనది. నేను అమృతమును కోరుచున్నాను. కాని మజ్జిగ సంపాదించు శక్తికూడ నాకు లేదు. సజ్జనులు నా అతిసాహసమును మన్నించి, ఈ బాలుని వచనములను ఆదరముతో ఆలకింతురు గాక. తల్లిదండ్రులు తమపిల్లల చిలుకపలుకులను విని ఆనందించెదరు. కఠినాత్ములు, కుటిలురు, దురాలోచనాపరులు ఇతరుల దోషములనెన్నుటయే ఒక ఘనకార్యముగా భావించి, వారిని పరిహసించుచుందురు. మనోహరముగానున్నను లేక పేలవముగా నున్నను ఎవరి కవిత్వము వారికి మధురముగానే ఉండును. కాని ఇతరులరచనలను విని మెచ్చుకొను సజ్జనులు చాల అరుదుగా మాత్రమే ఉందురు. కుంభ వృష్టి పడినప్పుడు వరదలతో పొంగిపొరలు నదులు, తటాకముల వలె తమ ఉన్నతికి పొంగి పోవు జనులు లోకమున కోకొల్లలు. కాని పూర్ణ చంద్రుని జూచి గంతులు వేయు సముద్రునివలె ఇతరులఔన్నత్యమును జూచి, సంతసించు సహృదయులు చాలతక్కువగా ఉందురు.

(చౌ॥ 1-7)

దో- భాగ ఛోట అభిలాషు బడ, కరఉఁ ఏక బిస్వాస ।
పైహహిఁ సుఖ సుని సుజన సబ, ఖల కరిహహిఁ ఉపహాస ॥ 8 ॥

నా శక్తి అల్పము, కాని లక్ష్యము అనల్పము (ఉన్నతము) దుర్జనులు పరిహసించినను సుజనులు నా రచనకు ఆనందింతురని నా పరమ విశ్వాసము. (దో॥ 8)

చౌ - ఖల పరిహాస హోఇ హిత మోరా । కాక కహహిఁ కలకంఠ కఠోరా ॥
హంసహి బక దాదుర చాతకహీ । హఁసహిఁ మలిన ఖల బిమల బతకహీ ॥ 1 ॥
కబిత రసిక న రామ పద నేహూ । తిన్హ కహఁ సుఖద హాస రస ఏహూ ॥
భాషా భనితి భోరి మతి మోరీ । హఁసిబే జోగ హఁసేఁ నహిఁ ఖోరీ ॥ 2 ॥
ప్రభు పద ప్రీతి న సాముఝి నీకీ । తిన్హహి కథా సుని లాగిహి ఫీకీ ॥
హరి హర పద రతి మతి న కుతరకీ । తిన్హ కహఁ మధుర కథా రఘుబర కీ ॥ 3 ॥
రామ భగతి భూషిత జియఁ జానీ । సునిహహిఁ సుజన సరాహి సుబానీ ॥
కబి న హోఉఁ నహిఁ బచన ప్రబీనూ । సకల కలా సబ బిద్యా హీనూ ॥ 4 ॥
ఆఖర అరథ అలంకృతి నానా । ఛంద ప్రబంధ అనేక బిధానా ॥
భావ భేద రస భేద అపారా । కబిత దోష గున బిబిధ ప్రకారా ॥ 5 ॥
కబిత బిబేక ఏక నహిఁ మోరేఁ । సత్య కహఉఁ లిఖి కాగద కోరేఁ ॥ 6 ॥

దుర్జనుల పరిహాసముగూడ నాకు హితమే. కోయిల పాట కాకులకు కఠోరముగా ఉండును. కొంగలు హంసలను, కప్పలు చాతకపక్షులను పరిహసించుచుండును. నీచులు సచ్చరిత్రులను విని నవ్వెదరు. కవిత్వమునందును శ్రీరామచంద్రుని పాదపద్మములయందును భక్తిలేని కవితారసికులకు ఈ కవిత హాస్యరస ప్రధానమై సుఖమునిచ్చును. నా రచన లౌకికభాషలో సాగినది. పైగా నా బుద్ధి అల్పమైనది. కావున నవ్వదగినది. అందువలన వారు నవ్వుటలో దోషము లేదు. శ్రీహరి చరణకమలములయందు భక్తిలేని వారికిని, అవగాహనారహితులకును ఈ కథ నీరసముగా కనిపింప వచ్చును. హరిహరభక్తులకును, కుతర్కబుద్ధులుకానివారికిని శ్రీ రఘునాథునిచరితము మధురముగా ఉండును. హాయిని గొల్పును. సజ్జనులు ఈ గాథను శ్రీరామభక్తివైభవభూషితమైనదిగా గ్రహించి, (విని) మనోహరముగ ప్రశంసింతురు. నేను కవిని గాను. వాక్చతురుడనూ గాను. వాక్యరచనకళలయందును, నాకు ప్రావీణ్యము లేదు. శబ్దార్థ ప్రయోగములు వివిధములు. అలంకారములు, ఛందస్సులు అనేకములు. భావరసభేదములు అపరిమితములు. కవితాగుణములు, దోషములు వివిధములు ఈ కవితావిశేషములలో ఏ ఒక్కదానిని గూర్చియు నేనెఱుగనేయెఱుగను. ఈ సత్యమును ప్రమాణపూర్వకముగా తెల్పుచున్నాను. (చౌ॥ 1-6)

దో- భనితి మోరి సబ గున రహిత, బిస్వ బిదిత గున ఏక।
సో బిచారి సునిహహిఁ సుమతి, జిన్హ కేఁ బిమల బిబేక ॥ 9 ॥

నా కవితలో ఎట్టి సుగుణములూ లేవు. కాని జగత్ప్రసిద్ధమైన రామకథయను ఒకే ఒక్క సుగుణము గలదు. జ్ఞానులును, వివేక వంతులును దానిని ఎటింగి సాదరముగా ఆలకింతురు. (దో॥ 9)

## రామాయణ మహత్త్వము

చౌ - ఏహి మహఁ రఘుపతి నామ ఉదారా । అతి పావన పురాన శ్రుతి సారా ॥
మంగల భవన అమంగల హారీ । ఉమా సహిత జెహి జపత పురారీ ॥ 1 ॥
భనితి బిచిత్ర సుకబి కృత జోఊ । రామ నామ బిను సోహ న సోఊ ॥
బిధుబదనీ సబ భాఁతి సఁవారీ । సోహ న బసన బినా బర నారీ ॥ 2 ॥
సబ గున రహిత కుకబి కృత బానీ । రామ నామ జస అంకిత జానీ ॥
సాదర కహహిఁ సునహిఁ బుధ తాహీ । మధుకర సరిస సంత గునగ్రాహీ ॥ 3 ॥
జదపి కబిత రస ఏకఉ నాహీఁ । రామ ప్రతాప ప్రగట ఏహి మాహీఁ ॥
సోఇ భరోస మోరేఁ మన ఆవా । కేహిఁ న సుసంగ బడప్పను పావా ॥ 4 ॥
ధూమఉ తజఇ సహజ కరుఆఈ । అగరు ప్రసంగ సుగంధ బసాఈ ॥
భనితి భదేస బస్తు భలి బరనీ । రామ కథా జగ మంగల కరనీ ॥ 5 ॥

ఇందు సాంబశివుడు సర్వదా జపించు శ్రీరామచంద్రునిపావననామము గలదు. ఇది మిక్కిలి పవిత్రమైనది. వేద, పురాణములసారము, కల్యాణములకు పెన్నిధి, అశుభములను రూపుమాపునది. అనేకాలంకారభూషితయైనను, ఎంతగా సౌందర్యవతియైనను వస్త్రములను ధరింపని స్త్రీ శోభింపదు. అట్లే అది మహాకవిచే వ్రాయబడినను, మిక్కిలి

ప్రశంసనీయమైనదేయైనను రామనామము లేని కావ్యము శోభింపదు. కాని అల్పజ్ఞుడైన కుకవిచే వ్రాయబడినను, అది గుణరహితమైనదేయైనను రామనామవైభవముచే అలంకృతమైన కావ్యమును సజ్జనులు సాదరముగా చదివి, విని, ఆనందింతురు. తుమ్మెదలు పుష్పములలోని మధువును గ్రోలినట్లు సత్పురుషులు గుణములనే గ్రహింతురు. ఇందు కవితారసపోషణలేకున్నను శ్రీరామచంద్రునిప్రతాపము బహుధా కీర్తింపబడినది. ఇదియే నా సంపూర్ణ విశ్వాసమునకు మూలము. సత్సాంగత్యమువలన గౌరవము దక్కని వారెవరు? పొగ అగరు సాంగత్యమున తన సహజమైన ఘాటును, కటుకుదనమును వదలి సుగంధమునే వ్యాపింప జేయును. అట్లే నా కవిత సౌందర్య శోభితము కాకున్నను రామకథావర్ణనామహితమగుటవలన శుభప్రదమైనది. (చౌ॥ 1-5)

ఛం-మంగల కరని కలిమల హరని తులసీ కథా రఘునాథ కీ ।
గతి కూర కబితా సరిత కీ జ్యోఁ సరిత పావన పాథ కీ ॥
ప్రభు సుజస సంగతి భనితి భలి హోఇహి సుజన మన భావనీ ।
భవ అంగ భూతి మసాన కీ సుమిరత సుహావని పావనీ ॥

తులసీదాసు పలుకు చున్నాడు. శ్రీరఘునాథునిచరితము కలియుగపాపములను కడిగి వేయును, కల్యాణపరంపరను గూర్చును. శోభారహితమైన నా కవితాప్రవంతి పావనగంగానదివలె ఎన్ని మలుపులు తిరిగినను శ్రీహరి వైభవ సాంగత్యముచే సుజనులకు మనోహరముగా ఉండును. స్మశానములోని అపవిత్రమైన భస్మముకూడశంభునిశరీరస్పర్శచేత సుశోభితమై, స్మరణ మాత్రముననే పవిత్ర మొనర్చును. (ఛంద్)

దో- ప్రియ లాగిహి అతి సబహి మమ, భనితి రామ జస సంగ ।
దారు బిచారు కి కరఇ కోఉ, బందిఅ మలయ ప్రసంగ ॥ 10 (క) ॥
స్యామ సురభి పయ బిసద అతి, గునద కరహిఁ సబ పాన ।
గిరా గ్రామ్య సియ రామ జస, గావహిఁ సునహిఁ సుజాన ॥ 10 (ఖ) ॥

మలయపర్వతమునందలి చందనవృక్షములసమీపమునగల ఏ వృక్షమైనను అది చందన వృక్షముగనే మారును. అందఱు దానిని ఆదరింతురు. అట్లే శ్రీరామ వైభవ సాహచర్య ప్రభావమున నా కవిత ఎల్లరకును అత్యంత ప్రీతికరమేయగును. నల్లని ఆవుపాలుగూడ తెల్లగాను, పుష్టికరముగను ఉండును. అందఱును దానిని సేవింతురు. అట్లే నా భాష గ్రామ్యమేయైనను సీతారాములకథను వర్ణించుటవలన సజ్జనులు దానిని గానము చేయుదురు, చెవులప్పగించి విందురు. (దో॥ 10, క,ఖ)

చౌ - మని మానిక ముకుతా ఛబి జైసీ । అహి గిరి గజ సిర సోహ న తైసీ ॥
నృప కిరీట తరునీ తను పాఈ । లహహిఁ సకల సోభా అధికాఈ ॥ 1 ॥
తైసెహిఁ సుకబి కబిత బుధ కహహీఁ । ఉపజహిఁ అనత అనత ఛబి లహహీఁ ॥
భగతి హేతు బిధి భవన బిహాఈ । సుమిరత సారద ఆవతి ధాఈ ॥ 2 ॥
రామ చరిత సర బిను అన్హవాఏఁ । సో శ్రమ జాఇ న కోటి ఉపాఏఁ ॥
కబి కోబిద అస హృదయఁ బిచారీ । గావహిఁ హరి జస కలిమల హారీ ॥ 3 ॥

నారద బచన సగర్భ సహేతూ । సుందర సబ గున నిధి బృషకేతూ ॥
అస బిచారి తుమ్హ తజహు అసంకా । సబహి భాఁతి సంకరు అకలంకా ॥ 2 ॥
సుని పతి బచన హరషి మన మాహీఁ । గఈ తురత ఉఠి గిరిజా పాహీఁ ॥
ఉమహి బిలోకి నయన భరె బారీ । సహిత సనేహ గోద బైఠారీ ॥ . ॥
బారహిఁ బార లేతి ఉర లాఈ । గదగద కంఠ న కఛు కహి జాఈ ॥
జగత మాతు సర్బగ్య భవానీ । మాతు సుఖద బోలీఁ మృదు బానీ ॥ 4 ॥

నీకు కుమార్తెపై ప్రేమయున్నచో శివునితో పెండ్లిజరుగుటకై తపస్సుచేయుమని ఆమెకు సూచింపుము. ఈ సమస్యనుండి బయటపడుటకు వేఱు ఉపాయము లేదు. నారదునిపలుకులు సాభిప్రాయములు, సకారణములు. శంకరుడు అతిసుందరుడు. సకలసద్గుణసంపన్నుడు. అన్ని విధముల నిష్కళంకుడు. ఈ విషయమును గ్రహించి, నీ సందేహములను వీడుము"- భర్త మాటలకు మైనాదేవి మిక్కిలి సంతసించెను. వెంటనే పార్వతియొద్దకేగెను. పార్వతిని చూచినంతనే ఆమెకన్నులు అశ్రుపూరితములు ఆయెను. ఆ గారాల బిడ్డను ప్రేమతో తనయొడిలో కూర్చుండబెట్టుకొని, పదేపదే తనగుండెలకు హత్తుకొనెను. కంఠము గద్గదమై, ఆమె యేమియు మాట్లాడలేకపోయెను. జగజ్జననియు, భవానియు, సర్వజ్ఞురాలును ఐన పార్వతి మృదుమధురముగా ఇట్లనెను.
(చౌ॥ 1-4)

# పార్వతీ తపశ్చర్య

దో- సునహి మాతు మైఁ దీఖ అస, సపన సునావఉఁ తోహి ।
సుందర గౌర సుబిప్రబర, అస ఉపదేసేఉ మోహి ॥ 72 ॥

"అమ్మా! వినుము నేను గాంచిన స్వప్నవృత్తాంతమును దెల్పెదను. ఒక అందమైన తెల్లని బ్రాహ్మణోత్తముడు నాకు ఉపదేశించెను. (దో॥ 72)

చౌ- కరహి జాఇ తపు సైలకుమారీ । నారద కహా సో సత్య బిచారీ ॥
మాతు పితహి పుని యహ మత భావా । తపు సుఖప్రద దుఖ దోష నసావా ॥ 1 ॥
తపబల రచఇ ప్రపంచు బిధాతా । తపబల బిష్ను సకల జగ త్రాతా ॥
తపబల సంభు కరహిఁ సంఘారా । తపబల సేషు ధరఇ మహిభారా ॥ 2 ॥
తప అధార సబ సృష్టి భవానీ । కరహి జాఇ తపు అస జియఁ జానీ ॥
సునత బచన బిసమిత మహతారీ । సపన సునాయఉ గిరిహి హఁకారీ ॥ 3 ॥
మాతు పితహి బహుబిధి సముఝాఈ । చలీఁ ఉమా తప హిత హరషాఈ ॥
ప్రియ పరివార పితా అరు మాతా । భఏ బికల ముఖ ఆవ న బాతా ॥ 4 ॥

"ఓ శైలకుమారీ! నారదుని పలుకులు ముమ్మాటికిని సత్యములు. తపస్సు చేయుము. నీ తల్లిదండ్రులకుగూడ ఈ మాటలు నచ్చినవి. తపస్సు సుఖప్రదమై బాధలను, పాపములను హరించును. ఈ జగత్తును బ్రహ్మ సృష్టించుటకును, విష్ణువు పాలించుటకును, శివుడు లయమొందించుటకును, శేషుడు ఈ భూభారమును మోయుటకును వారివారి తపోబలములే కారణములు. భవానీ! ఈ సమస్తసృష్టికిని తపస్సే

ఆధారము. దీనిని గ్రహించి, నీవు తపస్సు చేయుము"– ఈ మాటలు విని తల్లి, మిగులఆశ్చర్యమును పొందెను. హిమవంతునకు మేనాదేవి ఈ స్వప్నవృత్తాంతమును వినిపించెను. మాతాపితరులను అనేకవిధముల ఓదార్చి, ఉమాదేవి హర్షముతో తపస్సునకై బయలుదేరెను. ఆమెతల్లిదండ్రులు, ఇతరప్రియపరివారములు వ్యాకులచిత్తులైరి. అందఱి కంఠములును మూగ పోయెను. (చౌ॥ 1-4)

దో- బేదసిరాముని ఆఇ తబ, సబహి కహా సముఝాఇ ।
పారబతీ మహిమా సునత, రహే ప్రబోధహి పాఇ ॥ 73 ॥

వేదశిరుడను మునివచ్చి, వారినందఱిని తనసదుపదేశములతో ఊరడించెను. పార్వతీదేవి మహిమను దెలిసికొని, వారు ప్రసన్నులైరి. (దో॥ 73)

చౌ- ఉర ధరి ఉమా ప్రానపతి చరనా । జాఇ బిపిన లాగీం తపు కరనా ॥
అతి సుకుమార న తను తప జోగూ । పతి పద సుమిరి తజెఉ సబు భోగూ ॥ 1 ॥
నిత నవ చరన ఉపజ అనురాగా । బిసరీ దేహ తపహిం మను లాగా ॥
సంబత సహస మూల ఫల ఖాఏ । సాగు ఖాఇ సత బరష గవాంఏ ॥ 2 ॥
కఛు దిన భోజను బారి బతాసా । కిఏ కఠిన కఛు దిన ఉపబాసా ॥
బెల పాతీ మహి పరఇ సుఖాఈ । తీని సహస సంబత సోఇ ఖాఈ ॥ 3 ॥
పుని పరిహరే సుఖానెఉ పరనా । ఉమహి నాము తబ భయఉ అపరనా ॥
దేఖి ఉమహి తప ఖీన సరీరా । బ్రహ్మగిరా భై గగన గభీరా ॥ 4 ॥

పార్వతీదేవి తనకు ప్రాణసదృశుడైన పరమశివునియొక్కపాదపద్మములను మనస్సునధ్యానించుచు వనమునకువెళ్లి, తపస్సును ప్రారంభించెను. ఆమెసుకుమారశరీరము తపస్సునకు తట్టుకొనలేనిదేయైనను పట్టుదలతో దీక్షబూని తపస్సును చేయసాగెను. సర్వభోగములను త్యజించెను. దినములు గడచుకొలదియు శంకరుని చరణములపై ఆమెకు భక్తి ప్రపత్తులు అతిశయించెను. తపస్సులో లీనమగుటచే ఆమెకు దేహముపై ధ్యాసయే లేకపోయెను. వేయి సంవత్సరములు కందమూల ఫలములను, వందసంవత్సరములు కేవలము ఆకులనుమాత్రమే ఆహారముగా తీసికొనుచు తపమాచరించెను. కొన్ని దినములు నీరు, గాలి మాత్రమే ఆమెకు ఆహారమాయెను. మఱికొన్ని దినములు కఠోరమైన ఉపవాసదీక్షతో గడిపెను. మూడువేల సంవత్సరములు బిల్వవృక్షములనుండి రాలి, ఎండిపోయిన ఆకులనే ఆహారముగా ఆమె స్వీకరించెను. క్రమక్రమముగా ఆ శుష్కపర్ణములను గూడ తినుట మానెను. కనుక ఆమెకు 'అపర్ణ' అను పేరు ప్రసిద్ధికెక్కెను. తపస్సువలన ఆమె శరీరము రానురాను శుష్కించిపోసాగెను. అంతట ఆకాశమునుండి గంభీరమైన బ్రహ్మవాణి వినవచ్చెను. (చౌ॥ 1-4)

దో- భయఉ మనోరథ సుఫల తవ, సును గిరిరాజకుమారి ।
పరిహరు దుసహ కలేస సబ, అబ మిలిహహిం త్రిపురారి ॥ 74 ॥

"ఓ గిరి రాజకుమారీ! వినుము నీ మనోరథము సఫలమైనది. ఇంక నీ కఠోర తపస్సును మానుము. త్వరలో త్రిపురారి నీకు భర్త కాగలడు. (దో॥ 74)

చౌ- అస తపు కాహుఁ న కీన్హ భవానీ । భఏ అనేక ధీర ముని గ్యానీ ॥
అబ ఉర ధరహు బ్రహ్మ బర బానీ । సత్య సదా సంతత సుచి జానీ ॥ 1 ॥
ఆవై పితా బోలావన జబహీఁ । హఠ పరిహరి ఘర జాఏహు తబహీఁ ॥
మిలహిఁ తుమ్హహి జబ సప్త రిషీసా । జానేహు తబ ప్రమాన బాగీసా ॥ 2 ॥
సునత గిరా బిధి గగన బఖానీ । పులక గాత గిరిజా హరషానీ ॥
ఉమా చరిత సుందర మైఁ గావా । సునహు సంభు కర చరిత సుహావా ॥ 3 ॥
జబ తేఁ సతీఁ జాఇ తను త్యాగా । తబ తేఁ సివ మన భయఉ బిరాగా ॥
జపహిఁ సదా రఘునాయక నామా । జహఁ తహఁ సునహిఁ రామ గున గ్రామా ॥ 4 ॥

ఓ భవానీ! ధీరులు, మునులు, జ్ఞానులు ఎందరో కలరు. కాని ఎవ్వరును ఇట్టి ఘోరతపమును ఆచరించియుండలేదు. సర్వశ్రేష్ఠమైన ఈ బ్రహ్మవాణిని సర్వదా సత్యముగా నిర్మలమైనదానినిగా తలంచి, దీనిని నీ మనస్సులో ఉంచుకొనుము. నీ తండ్రి నిన్ను ఇంటికి రమ్మని కోరినప్పుడు నీదీక్షను మాని ఇంటికి పొమ్ము. సప్తర్షులు నిన్ను చూచుటకు వత్తురు. అప్పుడు ఈ బ్రహ్మవాణి సత్యమగును."- ఆకసమునుండివినబడిన బ్రహ్మవాణికి పార్వతీదేవి పులకించిపోయెను. (యాజ్ఞవల్క్యుడు భరద్వాజునితో పల్కుచున్నాడు) నేనింత వఱకు పార్వతీదేవి సుందర కథను దెల్పితిని. ఇప్పుడు శంకరుని పవిత్ర గాథను వినుడు. సతీదేవి తనశరీరమును త్యజించినదిమొదలుకొని శంకరునిలో వైరాగ్యము అధికమాయెను. సదా రామనామమును జపించుచు శ్రీరామునిగుణకీర్తన శ్రవణములయందే నిమగ్నుడాయెను. (చౌ॥ 1-4)

దో- చిదానంద సుఖధామ సివ, బిగత మోహ మద కామ ।
బిచరహిఁ మహి ధరి హృదయఁ హరి, సకల లోక అభిరామ॥ 75 ॥

చిదానందుడు, సర్వ సుఖనిధానము, మోహ, మద, కామరహితుడైన శివుడు పరమానందప్రదుడైన శ్రీహరిని స్మరించుచు భువిపై సంచరింప సాగెను. (దో॥ 75)

చౌ- కతహుఁ మునిన్హ ఉపదేసహిఁ గ్యానా । కతహుఁ రామ గున కరహిఁ బఖానా ॥
జదపి అకామ తదపి భగవానా । భగత బిరహ దుఖ దుఖిత సుజానా ॥ 1 ॥
ఏహి బిధి గయఉ కాలు బహు బీతీ । నిత నై హోఇ రామ పద ప్రీతీ ॥
నేము ప్రేము సంకర కర దేఖా । అబిచల హృదయఁ భగతి కై రేఖా ॥ 2 ॥
ప్రగటే రాము కృతగ్య కృపాలా । రూప సీల నిధి తేజ బిసాలా ॥
బహు ప్రకార సంకరహి సరాహా । తుమ్హ బిను అస బ్రతు కో నిరబాహా ॥ 3 ॥
బహుబిధి రామ సివహి సముఝావా । పారబతీ కర జన్మ సునావా ॥
అతి పునీత గిరిజా కై కరనీ । బిస్తర సహిత కృపానిధి బరనీ ॥ 4 ॥

పరమేశ్వరుడు ఒక చోట మునీశ్వరులకు జ్ఞానోపదేశములను జేసెడి వాడు. వేఱొక తావున శ్రీరామచంద్రుని గుణగణములను గానము చేయుచుండెడివాడు. మహేశ్వరుడు పరమజ్ఞానియు, కామరహితుడునైనను

సతీవియోగముచే దుఃఖితుడగుచుండెను. ఈ విధముగా చాలకాలము గడిచెను. ఆయనలో రామభక్తి పెల్లుబుకుచు నిత్యనూతనముగుచుండెను. శ్రీరాముడు శివునికఠోర నియమములను, అనన్యప్రేమను, దృఢభక్తిని గ్రహించెను. కృతజ్ఞుడు, కృపాళువు, రూపశీలశోభితుడు ఐన శ్రీరామచంద్రుడు గొప్పతేజస్సుతో శివునకు ప్రత్యక్షమాయెను. ఆయన అనేకవిధముల శంకరుని స్తుతించి, "మీరు తప్ప ఈ కఠోరనియమములను ఇతరులెవ్వరు పాటింపగలరు?" అనెను. రఘురాముడు శంకరునకు పెక్కు రీతుల నచ్చజెప్పి, పార్వతీదేవిజన్మ వృత్తాంతమును ఆమె పవిత్రతపశ్చర్య గాథను వివరించెను. (చౌ॥ 1-4)

దో- అబ బినతీ మమ సునహు సివ, జౌఀ మో పర నిజ నేహు।
జాఇ బిబాహహు సైలజహి, యహ మోహి మాగేఀ దేహు ॥ 76 ॥

శ్రీరాముడు శివునితో ఇట్లనెను. "నాపై మీకు భక్తియున్నచో నా ప్రార్థనను వినుడు. మీరు పార్వతిని వివాహమాడుడు. అట్లు నాకు వాగ్దానము చేయుడు." (దో॥ 76)

చౌ- కహ సివ జదపి ఉచిత అస నాహీఀ । నాథ బచన పుని మేటి న జాహీఀ ॥
సిర ధరి ఆయసు కరిఅ తుమ్హారా। పరమ ధరము యహ నాథ హమారా ॥ 1 ॥
మాతు పితా గుర ప్రభు కై బానీ । బినహిఀ బిచార కరిఅ సుభ జానీ ॥
తుమ్హ సబ భాఀతి పరమ హితకారీ । అగ్యా సిర పర నాథ తుమ్హారీ ॥ 2 ॥
ప్రభు తోషేఉ సుని సంకర బచనా । భక్తి బిబేక ధర్మ జుత రచనా ॥
కహ ప్రభు హర తుమ్హార పన రహేఊ । అబ ఉర రాఖేహు జో హమ కహేఊ ॥ 3 ॥
అంతరధాన భఏ అస భాషీ। సంకర సోఇ మూరతి ఉర రాఖీ ॥
తబహిఀ సప్తరిషి సివ పహిఀ ఆఏ। బోలే ప్రభు అతి బచన సుహాఏ ॥ 4 ॥

దీని ఉచితానుచితములమాటయెట్లున్నను మీ ఆజ్ఞ జవదాటరానిది. దానిని శిరసావహించుటయే నా పరమధర్మము. తల్లిదండ్రులు, గురువు యజమాని - మున్నగువారి ఆజ్ఞలను శుభప్రదములని భావించి, ఎట్టి ఆలోచనలను చేయక ఆచరింపవలెను. మీరు నాకు అత్యంత హితమును గూర్చువారు. మీ ఆన నాకు శిరోధార్యము." అని శివుడు పలికెను. శంకరుని భక్తిజ్ఞానధర్మనిరతినిజూచి, శ్రీరామచంద్రుడు మిక్కిలి ప్రసన్నుడాయెను. "ఓ మహేశ్వరా! మీవ్రతము సఫలమైనది. నేనునుడివిన వాక్యములను మీమనస్సులో నుంచుకొనుడు"- అని పలికి శ్రీరాముడు అంతర్ధానమాయెను. శివుడు తనహృదయములో శ్రీహరిని నిల్పుకొనియే యుండెను. ఆదేసమయమున సప్తమహర్షులు శివునికడకు ఏతెంచిరి. మహాదేవుడు మిక్కిలి మృదుమధురముగా వారితో ఇట్లనెను. (చౌ॥ 1-4)

దో- పారబతీ పహిఀ జాఇ తుమ్హ, ప్రేమ పరిచ్ఛా లేహు ।
గిరిహి ప్రేరి పఠఏహు భవన, దూరి కరేహు సందేహు ॥ 77 ॥

"మీరు పార్వతికడకు వెళ్లి, ఆమె భక్తిని పరీక్షింపుడు. ఆమెతండ్రియైన హిమవంతుడు ఆమెను ఇంటికి తీసికొని వచ్చునట్లు చేయుడు. ఆమె సందేహములను నివృత్తిచేయుడు." (దో॥ 77)

చౌ-రిషిన్హ గౌరి దేఖీ తహఁ కైసీ । మూరతిమంత తపస్యా జైసీ ॥
బోలే ముని సును సైలకుమారీ । కరహు కవన కారన తపు భారీ ॥ 1 ॥
కెహి అవరాధహు కా తుమ్హ చహహూ । హమ సన సత్య మరము కిన కహహూ ॥
కహత బచన మను అతి సకుచాఈ । హఁసిహహు సుని హమారి జడతాఈ ॥ 2 ॥
మను హఠ పరా న సునఇ సిఖావా । చహత బారి పర భీతి ఉఠావా ॥
నారద కహా సత్య సోఇ జానా । బిను పంఖన్హ హమ చహహిఁ ఉడానా ॥ 3 ॥
దేఖహు ముని అబిబేకు హమారా । చాహిఅ సదా సివహి భరతారా ॥ 4 ॥

మూర్తీభవించిన తపస్సువలెనున్న పార్వతీదేవిని చూచి, సప్తమహర్షులు ఇట్లు ప్రశ్నించిరి. "ఓ పార్వతీ! ఈ ఘోరతపస్సును చేయుటకు కారణమేమి? ఎవరిని ఆరాధించుచున్నావు. నీ కోరిక యేమి? నీ మనసులోని మాటను తెల్పుము"- పార్వతీదేవి ఇట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "నామనసులోని మాటను చెప్పుటకు సంకోచించుచున్నాను. దానిని విన్నచో మీరు నా జడత్వమునకు నవ్వెదరు. నా మనస్సు ఎవ్వరి మాటలను పట్టించు కొనక, ఒకే విధముగా పట్టుదలవహించియున్నది. అది గాలిలో మేడలు కట్టుకొనుచున్నది. నారదుని మాటలను విశ్వసించి, నేను ఱెక్కలులేకుండగనే ఎగురుటకు ప్రయత్నించుచున్నాను. ఋషులారా! నా అవివేకమును గమనింపుడు. నేను పరమేశ్వరుని పతిగా పొంద దలచితిని. (చౌ॥ 1-4)

దో- సునత బచన బిహసే రిషయ, గిరిసంభవ తవ దేహ ।
నారద కర ఉపదేసు సుని, కహహు బసేఉ కిసు గేహ ॥ 78 ॥

ఈ మాటలను వినగానే ఋషులు నవ్వి ఇట్లు పలికిరి. "నీవు శైలజవు. నీ శరీరము పర్వత సంభవమేగదా! నారదుని ఉపదేశమును విన్నవారి కాపురము ఏది నిలబడినది? చెప్పుము. (దో॥ 78)

చౌ- దచ్ఛసుతన్హ ఉపదేసెన్హి జాఈ । తిన్హ ఫిరి భవను న దేఖా ఆఈ ॥
చిత్రకేతు కర ఘరు ఉన ఘాలా । కనకకసిపు కర పుని అస హాలా ॥ 1 ॥
నారద సిఖ జె సునహిఁ నర నారీ । అవసి హోహిఁ తజి భవను భిఖారీ ॥
మన కపటీ తన సజ్జన చీన్హా । ఆపు సరిస సబహీ చహ కీన్హా ॥ 2 ॥
తెహి కేఁ బచన మాని బిస్వాసా । తుమ్హ చాహహు పతి సహజ ఉదాసా ॥
నిర్గున నిలజ కుబేష కపాలీ । అకుల అగేహ దిగంబర బ్యాలీ ॥ 3 ॥
కహహు కవన సుఖు అస బరు పాఏఁ । భల భూలిహు ఠగ కే బౌరాఏఁ ॥
పంచ కహేఁ సివఁ సతీ బిబాహీ । పుని అవడేరి మరాఏన్హి తాహీ ॥ 4 ॥

నారదుడు దక్షకుమారులకు ఉపదేశములనిచ్చెను. వారు మరల ఇంటిముఖమే చూడలేదు. చిత్రకేతుకుటుంబముగూడ నారదునివలననే చిక్కులపాలాయెను. హిరణ్యకశిపునిపరిస్థితియు అట్లేఐనది. నారదుని ఉపదేశములను విన్న స్త్రీపురుషులెవ్వరైనను ఇల్లు-వాకిలి వదలి, బిచ్చగాండ్రు కావలసినదే. ఆయనకు శరీరముపైన మాత్రమే సజ్జనలక్షణములు, కాని మనస్సులో కపటము. అతడు ఇతరులను గూడ తనవలెనే చేయనిచ్చగించును.

ఆయన మాటలను విశ్వసించుచు నీవు శివుని నీభర్తగా పొందగోరు చున్నావు. శంకరుడు సహజముగా ఉదాసీనుడు, గుణహీనుడు, లజ్జారహితుడు, వికృతవేషధారి, కపాలధారి, కులము, గృహము లేనివాడు, దిగంబరుడు, సర్పములను భూషణములుగా ధరించినవాడు. ఇట్టి వరుని పెండ్లియాడి, నీవేమి సుఖపడగలవు? నీవు ఆ నారదునిమాయమాటలకు మోసపోయితివి. ఈశ్వరుడు పరులమాటలను విని, సతీదేవిని పరిణయమాడెను. తరువాత ఆమెను పరిత్యజించి, ఆమె దేహత్యాగమునకు కారణమాయెను. (చౌ॥ 1-4)

దో- అబ సుఖ సోవత సోచు నహిం, భీఖ మాగి భవ ఖాహిం ।
సహజ ఏకాకిన్హ కే భవన, కబహుఁ కి నారి ఖటాహిం ॥ 79 ॥

ఇప్పుడు శివుడు నిశ్చింతగా హాయిగా నిద్రించుచున్నాడు. బిచ్చమెత్తుకొని జీవించు చున్నాడు. అట్టి ఏకాకికడ ఏ స్త్రీయైనను సుఖముగా జీవింపగలదా? (దో॥ 79)

చౌ- అజహూఁ మానహు కహా హమారా । హమ తుమ్హ కహుఁ బరు నీక బిచారా ॥
అతి సుందర సుచి సుఖద సుసీలా । గావహిం బేద జాసు జస లీలా ॥ 1 ॥
దూషన రహిత సకల గున రాసీ । శ్రీపతి పుర బైకుంఠ నివాసీ ॥
అస బరు తుమ్హహి మిలాఉబ ఆనీ । సునత బిహసి కహ బచన భవానీ ॥ 2 ॥
సత్య కహేహు గిరిభవ తను ఏహా । హఠ న ఛూట ఛూటై బరు దేహా ॥
కనకఉ పుని పషాన తేఁ హోఈ । జారేహుఁ సహజు న పరిహర సోఈ ॥ 3 ॥
నారద బచన న మైం పరిహరఊఁ । బసఉ భవను ఉజరఉ నహిం డరఊఁ ॥
గుర కేం బచన ప్రతీతి న జేహీ । సపనేహుఁ సుగమ న సుఖ సిధి తేహీ ॥ 4 ॥

ఇప్పటికైనను మామాటలను వినుము. నీకొఱకు మేము ఒక మంచివరుని వెదకినాము. అతడు సుందరుడు, పవిత్రుడు, సుఖప్రదుడు, సుశీలుడు. అతని వైభవమును, లీలలను వేదములు గూడ ప్రస్తుతించును. అతడు దోషరహితుడు, సద్గుణరాశి, లక్ష్మీపతి, వైకుంఠవాసుడు, అట్టి వరునితో నీకు వివాహము జరిపింపగలము."- ఈ మాటలను వినగానే భవాని నవ్వి ఇట్లనెను. "మీరు వచించినది సత్యమే. ఈ శరీరము శైలజమే. శరీరము పోయినను హఠముమాత్రము పోదు. బంగారముగూడ రాళ్ల నుండియే జనించును. దానిని నిప్పులలో కాల్చినను దానిస్వభావము మారదు. నేను నారదునిమాటలను విస్మరింపను. నా కాపురము కలకలలాడనిండు లేక పాడుబడనిండు. దానికి నేను భయపడను. గురు వచనములమీద విశ్వాసము లేని వారు కలలోనైనను సుఖమును, జయమును పొందజాలరు. (చౌ॥ 1-4)

దో- మహాదేవ అవగున భవన, బిష్ను సకల గున ధామ ।
జేహి కర మను రమ జాహి సన, తేహి తేహీ సన కామ ॥ 80 ॥

మహాదేవుడు దోషములకు నిలయుమే కావచ్చును. విష్ణువు సకలసద్గుణ నిధానమే కావచ్చును. కాని మనసు ఎవరియందు లగ్నమగునో వారినే అది కోరుకొనును. (దో॥ 80)

చౌ- జౌఁ తుమ్హ మిలతేహు ప్రథము మునీసా । సునతిఉఁ సిఖ తుమ్హారి ధరి సీసా ॥
అబ మైఁ జన్ము సంభు హిత హారా । కో గున దూషన కరై బిచారా ॥ 1 ॥
జౌఁ తుమ్హరే హఠ హృదయఁ బిసేషీ । రహి న జాఇ బిను కిఏఁ బరేషీ ॥
తౌ కౌతుకిఅన్హ ఆలసు నాహీఁ । బర కన్యా అనేక జగ మాహీఁ ॥ 2 ॥
జన్మ కోటి లగి రగర హమారీ । బరఉఁ సంభు న త రహఉఁ కుఆరీ ॥
తజఉఁ న నారద కర ఉపదేసూ । ఆపు కహహిఁ సత బార మహేసూ ॥ 3 ॥
మైఁ పా పరఉఁ కహఇ జగదంబా । తుమ్హ గృహ గవనహు భయఉ బిలంబా ॥
దేఖి ప్రేము బోలే ముని గ్యానీ । జయ జయ జగదంబికే భవానీ ॥ 4 ॥

ఓ మునీశ్వరులారా! ఒక వేళమీరు ముందుగనే కలిసియున్నచో మీయుపదేశమునే శిరసావహించి యుండెడి దాననేమో? కాని ఇప్పుడు నా జీవితము ఈశ్వరార్పితమైనది. ఇంక గుణదోషములను ఎవరు విచారింతురు? ఒకవేళ మీకు వివాహమహోత్సవములు జరిపి, ఆనందించుటకు ఆసక్తికలదేని లోకములో కన్యలకు, వరులకు కొదువలేదు. ఇట్టి వినోదములతో కాలముగడుపువారికి అలసటయే యుండదు. కోట్లకొలది జన్మలనెత్తి యైనను నేను పరమశివునే భర్తగా పొందెదను. లేదా కన్యగానే మిగిలిపోయెదను. ఆ శంకరుడే స్వయముగా వచ్చి, వందసార్లు చెప్పినను నారదునిఉపదేశమును నేను ఉల్లంఘింపను. మీకు నమస్కరించెదను. దయచేసి మీరు మీఇండ్లకుచనుడు. ఇప్పటికే ఆలస్యమైనది"- అని పలికెను. మునులు పార్వతీదేవిభక్తినిశ్చయములను గాంచి, "ఓ భవానీ! జగదంబా! నీకు జయముగుగాక" అని పలికిరి. (చౌ॥ 1-4)

దో- తుమ్హ మాయా భగవాన సివ, సకల జగత పితు మాతు ।
నాఇ చరన సిర ముని చలే, పుని పుని హరషత గాతు ॥ 81 ॥

"పరమశివుడు భగవంతుడు. నీవు మాయువు. మీరు ఇరువురును జగత్తునకు మాతాపితరులు." అని పలికి మునీశ్వరులు పార్వతీదేవిపాదములకు ప్రణమిల్లి, పులకితగాత్రులై వెళ్లిపోయిరి. (దో॥ 81)

చౌ- జాఇ మునిన్హ హిమవంతు పఠాఏ । కరి బినతీ గిరజహిఁ గృహ ల్యాఏ ॥
బహురి సప్తరిషి సివ పహిఁ జాఈ । కథా ఉమా కై సకల సునాఈ ॥ 1 ॥
భఏ మగన సివ సునత సనేహా । హరషి సప్తరిషి గవనే గేహా ॥
మను థిర కరి తబ సంభు సుజానా । లగే కరన రఘునాయక ధ్యానా ॥ 2 ॥
తారకు అసుర భయఉ తేహి కాలా । భుజ ప్రతాప బల తేజ బిసాలా ॥
తేహిఁ సబ లోక లోకపతి జీతే । భఏ దేవ సుఖ సంపతి రీతే ॥ 3 ॥
అజర అమర సో జీతి న జాఈ । హారే సుర కరి బిబిధ లరాఈ ॥
తబ బిరంచి సన జాఇ పుకారే । దేఖే బిధి సబ దేవ దుఖారే ॥ 4 ॥

అక్కడినుండి సప్తర్షులు హిమవంతునికడకేగి, ఆయనను పార్వతీదేవియొద్దకు పంపగా అతడామెను ఇంటికి పిలుచుకొనివచ్చెను. పిదప మహర్షులు శివునియొద్దకు వెళ్లి, ఉమాదేవివృత్తాంతమును అంతయు వినిపించిరి.

పార్వతీదేవిప్రేమనుగూర్చి వినిన శివుని మనస్సు ఆనందమగ్నమాయెను. సప్తర్షులు, సంతోషించి, తమతమనివాసములకు చేరిరి. పిమ్మట మహాజ్ఞానియైన శివుడు తన మనస్సును స్థిరపఱచుకొని, శ్రీరఘునాథునిధ్యానములో మునిగెను. ఆ కాలమున 'తారకుడు' అను రాక్షసుడు తనభుజబలప్రతాపతేజస్సులచే సకలలోకములను, లోకపాలకులను జయించెను. దేవతలు తమసుఖసంపదలను కోల్పోయిరి. బ్రహ్మయిచ్చిన వరములకారణముగ ఆ తారకాసురుడు జరా మరణములు లేనివాడు. కనుక వానిని జయించుట అసాధ్యము. దేవతలు వానితో యుద్ధమొనర్చి పరాజితులైరి. వారు బ్రహ్మదేవునితో మొఱపెట్టుకొనిరి. బ్రహ్మదేవుడు దేవతలు దుఃఖితులగుట గాంచెను. (చౌ॥ 1-4)

దో- సబ సన కహా బుఝాఇ బిధి, దనుజ నిధన తబ హోఇ ।
సంభు సుక్ర సంభూత సుత, ఏహి జీతఇ రన సోఇ ॥ 82 ॥

వారిని బ్రహ్మ ఓదార్చి, శివాంశసంభూతుడే యుద్ధమున ఈ రాక్షసుని ఓడించి, చంపగలడని పలికెను. (దో॥ 82)

చౌ- మోర కహా సుని కరహు ఉపాఈ । హోఇహి ఈస్వర కరిహి సహాఈ ॥
సతీం జో తజీ దచ్ఛ మఖ దేహా । జనమీ జాఇ హిమాచల గేహా ॥ 1 ॥
తేహిం తపు కీన్హ సంభు పతి లాగీ । సివ సమాధి బైఠే సబు త్యాగీ ॥
జదపి అహఇ అసమంజస భారీ । తదపి బాత ఏక సునహు హమారీ ॥ 2 ॥
పఠవహు కాము జాఇ సివ పాహీం । కరై ఛోభు సంకర మన మాహీం ॥
తబ హమ జాఇ సివహి సిర నాఈ । కరవాఉబ బిబాహు బరిఆఈ ॥ 3 ॥
ఏహి బిధి భలేహిం దేవహిత హోఈ । మత అతి నీక కహఇ సబు కోఈ ॥
అస్తుతి సురన్హ కీన్హి అతి హేతూ । ప్రగటేఉ బిషమబాన ఝషకేతూ ॥ 4 ॥

బ్రహ్మ మఱియును ఇట్లు చెప్పెను. "నేను చెప్పినది విని, దానిని ఆచరింపుడు. భగవంతుడు మీకు మేలుచేయును. మనపథకము సఫలమగును. దక్షుని యజ్ఞములో ప్రాణత్యాగమొనర్చిన సతీదేవి మఱల హిమవంతునికూతురుగా జన్మించినది. ఆమె శంకరుని వివాహమాడుటకు తపమును ఆచరించినది. కాని శివుడు సర్వసంగపరిత్యాగియై ధ్యానమగ్నుడై యున్నాడు. సమంజసము కాకపోయినను నేను చెప్పెడి ఉపాయమును వినుడు. మీరు వెళ్ళి, శివునికడకు మన్మథుని పంపుడు. అతడు శివునకు మనోవికారములను కల్గించును. దానివలన శివునకు తపోభంగము కలుగును. పిమ్మట మనము అచ్చటికి వెళ్ళి, శివుని ప్రార్థించి, పార్వతితో ఆయనకు వివాహము జరుగునట్లు చూతము. దేవతలను రక్షించుటకు ఇది యొక్కటే మార్గము." బ్రహ్మమాటలకు దేవతలందఱును సంతసించిరి. భక్తితో స్తుతింపగా పంచబాణుడు, మీనకేతనుడు ఐన మన్మథుడు వారికి ప్రత్యక్షమాయెను. (చౌ॥ 1-4)

## కామదహనము

దో- సురన్హ కహీ నిజ బిపతి సబ, సుని మన కీన్హ బిచార ।
సంభు బిరోధ న కుసల మోహి, బిహసి కహేఉ అస మార ॥ 83 ॥

దేవతలు మదనునితో తమ ఆపదను గూర్చి విన్నవించిరి. వారిమాటలు విని, అతడు నవ్వి, శివునితో వైరము నాకు శుభముగాదు. (దో॥ 83)

చౌ-తదపి కరబ మైఁ కాజు తుమ్హారా । శ్రుతి కహ పరమ ధరమ ఉపకారా ॥
పర హిత లాగి తజఇ జో దేహీ । సంతత సంత ప్రసంసహిఁ తేహీ ॥ 1 ॥
అస కహి చలేఉ సబహి సిరు నాఈ । సుమన ధనుష కర సహిత సహాఈ ॥
చలత మార అస హృదయఁ బిచారా । సివ బిరోధ ధ్రువ మరను హమారా ॥ 2 ॥
తబ ఆపన ప్రభాఉ బిస్తారా । నిజ బస కీన్హ సకల సంసారా ॥
కోపేఉ జబహిఁ బారిచరకేతూ । ఛన మహుఁ మిటే సకల శ్రుతి సేతూ ॥ 3 ॥
బ్రహ్మచర్జ బ్రత సంజమ నానా । ధీరజ ధరమ గ్యాన బిగ్యానా ॥
సదాచార జప జోగ బిరాగా । సభయ బిబేక కటకు సబు భాగా ॥ 4 ॥

ఐనను నేను మీకు సహాయపడెదను. పరోపకారమే పరమ ధర్మమని వేదములు చెప్పుచున్నవి. ఇతరులమేలుకొఱకు ప్రాణములను సైతము అర్పించువారిని సజ్జనులు మెచ్చుకొందురు. ఇట్లు పలికి అందరకికిని నమస్కరించి, మన్మథుడు తనధనుస్సును, పుష్పబాణములను ధరించి, వసంతుడు మొదలగు వారితో కార్యసాధనకై బయలుదేఱెను. "శివునితో వైరమువలన తనకు మరణము నిశ్చయము"- అని మనస్సులో అతడు తలపోసెను. తనప్రభావమును విస్తరింప జేసెను. సమస్తప్రపంచమును తనవశము చేసికొనెను. ఈ మత్స్యధ్వజుడు విజృంభింపగానే వేదమర్యాదలన్నియును అడుగంటెను. బ్రహ్మచర్యము, వ్రతములు, సంయమములు, ధైర్యము, ధర్మము, జ్ఞానము, విజ్ఞానము, సదాచారము, జపయోగవైరాగ్యములు మొదలగు వివేకవాహినులు అచట నిలువలేక పలాయనము చిత్రగించెను. (చౌ॥ 1-4)

ఛం-భాగేఉ బిబేకు సహాయ సహిత సో సుభట సంజుగ మహి మురే ।
సదగ్రంథ పర్బత కందరన్హి మహుఁ జాఇ తేహి అవసర దురే ॥
హోనిహార కా కరతార కో రఖవార జగ ఖరభరు పరా ।
దుఇ మాథ కేహి రతినాథ జేహి కహుఁ కోపి కర ధను సరు ధరా ॥

వివేకము తనసహాయకులతోపాటు పాఱిపోయెను. వివేకయోధులు రణభూమినుండి పలాయితులై సద్గ్రంథరూపములలో పర్వతగుహలలో దాగికొనిరి. ప్రపంచములో అల్లకల్లోలములు చెలరేగినవి. కొందఱు ఇట్లు చెప్పుచుండిరి- "భగవంతుడా! ఏమికానున్నది? మనకు రక్షకుడెవ్వరు? మన్మథుడు తన ధనుర్బాణములను ఎక్కుపెట్టిన ఆ రెండు తలల అసాధారణ వ్యక్తి (శూలధారి) ఎవరు? (ఛంద్)

దో- జే సజీవ జగ అచర చర, నారి పురుష అస నామ ।
తే నిజ నిజ మరజాద తజి, భఏ సకల బస కామ ॥ 84 ॥

ప్రపంచములోని స్త్రీపురుషప్రకృతులైన చరాచరజీవులన్నియును తమ జీవన మర్యాదలను విస్మరించి, కామమునకు బానిసలైనవి. (దో॥ 84)

చౌ- సబ కే హృదయఁ మదన అభిలాషా । లతా నిహారి నవహిఁ తరు సాఖా ॥
నదీఁ ఉమగి అంబుధి కహుఁ ధాఈఁ । సంగమ కరహిఁ తలావ తలాఈఁ ॥ 1 ॥
జహఁ అసి దసా జడన్హ కై బరనీ । కో కహి సకఇ సచేతన కరనీ ॥
పసు పచ్ఛీ నభ జల థలచారీ । భఏ కామబస సమయ బిసారీ ॥ 2 ॥
మదన అంధ బ్యాకుల సబ లోకా । నిసి దిను నహిఁ అవలోకహిఁ కోకా ॥
దేవ దనుజ నర కిన్నర బ్యాలా । ప్రేత పిసాచ భూత బేతాలా ॥ 3 ॥
ఇన్హ కై దసా న కహేఉఁ బఖానీ । సదా కామ కే చేరే జానీ ॥
సిద్ధ బిరక్త మహాముని జోగీ । తేపి కామబస భఏ బియోగీ ॥ 4 ॥

అందఱిహృదయములలో కామక్రీడాభిలాష జనించెను. లతలను జూచి, చెట్లశాఖలు వంగెను. నదులుప్పొంగి సముద్రుని జేరుటకు పరుగులు తీసెను. సరస్సులు, కుంటలుగూడ సంగమించెను. అచేతనముల స్థితియే యిట్లుండగా ఇక చేతనములసంగతి చెప్పనేల? ఆకాశమునను, నేలపైనను, నీటిలోను ఉండు పశుపక్ష్యాదులు కాలనియమములనుగూడ పాటింపక కామమునకు వశమాయెను. జనులందఱును కామాంధులైరి. చక్రవాకములకు దివారాత్రములవిచక్షణ లేకపోయెను. దేవతలు, దైత్యులు, మానవులు, కిన్నరులు, నాగులు, భూత బేతాళపిశాచాదులు సహజముగా కామమునకు దాసులు. వీరిని గూర్చి చెప్పవలసిన పనియేలేదు కాని సిద్ధులు, విరక్తులు, మహామునులు, యోగులును కామవికారములకు బానిసలై, నియమములకు నీళ్లువదలి, విరహములను అనుభవించిరి. (చౌ॥)

ఛం-భఏ కామబస జోగీస తాపస పావఁరన్హి కీ కో కహై ।
దేఖహిఁ చరాచర నారిమయ జే బ్రహ్మమయ దేఖత రహే ॥
అబలా బిలోకహిఁ పురుషమయ జగు పురుష సబ అబలామయం ।
దుఇ దండ భరి బ్రహ్మాండ భీతర కామకృత కౌతుక అయం ॥

యోగీశ్వరులును, తపస్వినులును కామాతురులైనప్పుడు ఇక పామరులసంగతి చెప్పనేల? సమస్త చరాచరజగత్తును బ్రహ్మమయముగా భావించువారుగూడ దానిని స్త్రీమయముగా చూచుచుండిరి. జగత్తు స్త్రీలకు పురుషమయముగాను, పురుషులకు స్త్రీమయముగాను గోచరించుచుండెను. కామునిలీలలు బ్రహ్మాండమంతటను రెండు గడియల పాటు విజృంభించెను. (ఛం॥)

సో- ధరీ న కాహూఁ ధీర, సబ కే మన మనసిజ హరే ।
జే రాఖే రఘుబీర, తే ఉబరే తెహి కాల మహుఁ ॥ 85 ॥

మనోధైర్యము ఎవ్వరికిని లేకపోయెను. అందఱిమనస్సులను మన్మథుడు దోచివేసెను. శ్రీరఘునాథునిరక్షణలో ఉన్నవారు మాత్రమే నిగ్రహముతో నిలిచియుండిరి. (సో॥ 85)

చౌ- ఉభయ ఘరీ అస కౌతుక భయఊ । జౌ లగి కాము సంభు పహిఁ గయఊ ॥
సివహి బిలోకి ససంకేఉ మారూ । భయఉ జథాథితి సబు సంసారూ ॥ 1 ॥

భఏ తురత సబ జీవ సుఖారే । జిమి మద ఉతరి గఏఁ మతవారే ॥
రుద్రహి దేఖి మదన భయ మానా । దురాధరష దుర్గమ భగవానా ॥ 2 ॥
ఫిరత లాజ కఛు కరి నహిఁ జాఈ । మరను ఠాని మన రచేసి ఉపాఈ ॥
ప్రగటేసి తురత రుచిర రితురాజా । కుసుమిత నవ తరు రాజి బిరాజా ॥ 3 ॥
బన ఉపబన బాపికా తడాగా । పరమ సుభగ సబ దిసా బిభాగా ॥
జహఁ తహఁ జను ఉమగత అనురాగా । దేఖి మురుహుఁ మన మనసిజ జాగా ॥ 4 ॥

మన్మథుడు శివుని సమీపించునంతవఱకు ఈ లీలలు కొనసాగుచునే యుండెను. శివుని జాడగనే మన్మథుడు గడగడవణకసాగెను. వెంటనే ప్రపంచము తనయథాస్థితిని పొందెను. త్రాగినవాడు మత్తువీడినంతనే శాంతిని అనుభవించునట్లు జీవులందఱును ప్రశాంతతను పొందిరి. దుర్ధయుడును, దుర్గముడును, భగవానుడును, (షడ్గుణైశ్వర్య సంపన్నుడును) ఐన రుద్రుని జూచి, మన్మథుడు భీతిల్లెను. వెనుకకు మఱలిపోవుట సిగ్గుచేటు, ముందుకు పోజాలడు. (ముందు నూయి, వెనుక గొయ్యి) తనకు మరణము నిశ్చయమని తలంచి, అతడు ఒకయుక్తిని పన్నెను. వెంటనే వసంత ఋతువును ప్రేరేపించెను. వృక్షములన్నియును చిగిర్చి, పుష్పశోభితములాయెను. వనములును, ఉపవనములును బావులును, చెఱువులును, ప్రకృతియు ప్రేమమయములై కనబడెను. ఈ దృశ్యము, ప్రేతాత్మలనుగూడ కామ వశములుగా జేసెను. (చౌ॥ 1-4)

ఛం-జాగఇ మనోభవ మువహుఁ మన బన సుభగతా న పరై కహీ ।
సీతల సుగంధ సుమంద మారుత మదన అనల సఖా సహీ ॥
బికసే సరన్హి బహు కంజ గుంజత పుంజ మంజుల మధుకరా ।
కలహంస పిక సుక సరస రవ కరి గాన నాచహిఁ అపఛరా ॥

మృతులకుగూడ కాముడు జాగృతిగూర్చెను. వనసౌందర్యములు వర్ణనాతీతములయ్యెను, శీతలసుగంధిలమందపవనములు కామాగ్నిని ప్రజ్వలింప జేసెను. సరోవరములలో కమలములు శోభలను వెదజల్లెను. వాటిపై జేరిన అందమైన తుమ్మెదలు రొదచేయసాగెను. కలహంసలు, కోకిలలు, చిలుకలు మధుర గానములను వినిపించెను. అప్సరసలు మధురసంగీతములతో అద్భుతనాట్యములను ప్రదర్శించిరి. (ఛం॥)

దో- సకల కలా కరి కోటి బిధి, హారేఉ సేన సమేత ।
చలీ న అచల సమాధి సివ, కోపేఉ హృదయనికేత ॥ 86 ॥

మన్మథుడు తనపరివారములతోగూడ అనేకములైన ఉపాయములను పన్నెను. కాని శివునితపస్సమాధి చెక్కుచెదరలేదు- మదనునికి కోపము హెచ్చాయెను. (దో॥ 86)

చౌ- దేఖి రసాల బిటప బర సాఖా । తెహి పర చఢేఉ మదను మన మాఖా ॥
సుమన చాప నిజ సర సంధానే । అతి రిస తాకి శ్రవన లగి తానే ॥ 1 ॥
ఛాడే బిషమ బిసిఖ ఉర లాగే । ఛూటి సమాధి సంభు తబ జాగే ॥
భయఉ ఈస మన ఛోభు బిసేషీ । నయన ఉఘారి సకల దిసి దేఖీ ॥ 2 ॥

సౌరభ పల్లవ మదను బిలోకా । భయఉ కోపు కంపేఉ త్రైలోకా ॥
తబ సివఁ తీసర నయన ఉఘారా। చితవత కాము భయఉ జరి ఛారా ॥ 3 ॥
హాహాకార భయఉ జగ భారీ । డరపే సుర భఏ అసుర సుఖారీ ॥
సముఝి కామసుఖు సోచహిఁ భోగీ । భఏ అకంటక సాధక జోగీ ॥ 4 ॥

అతడు అందమైన ఒకమామిడికొమ్మనెక్కి, తనపుష్పధనుస్సునందు పూలబాణములను సంధించెను. ఆకర్ణాంతముగా లాగి అతడు తనతీక్ష్ణమైన పుష్పబాణములను ఐదింటిని ఒకేసారి వదలెను. అవి వేరుగా శివుని హృదయమున గ్రుచ్చుకొనెను. శివునిసమాధి చెదరిపోయెను. మనస్సు క్షోభించెను. పరమేశ్వరుడు కనులు తెఱచి, నలువైపులను చూచెను. మామిడిచెట్టుపై ఆకులలో దాగియున్నమన్మథుని చూడగనే శివుడు క్రుద్ధుడాయెను. ముల్లోకములును కంపించెను. మూడవకంటిని తెఱవగనే మన్మథుడు మసియైపోయెను. విశ్వమునందంతటను హాహాకారములు మిన్నుముట్టెను. దేవతలు భయకంపితులైరి. దైత్యులు సంతసించిరి. విషయలోలురు కామసుఖములను స్మరించుకొనుచు చింతించిరి. యోగసాధకులు నిష్కంటకులైరి. (చౌ॥ 1-4)

ఛం-జోగీ అకంటక భఏ పతి గతి సునత రతి మురుఛిత భఈ ।
రోదతి బదతి బహు భాఁతి కరునా కరతి సంకర పహిఁ గఈ ॥
అతి ప్రేమ కరి బినతీ బిబిధ బిధి జోరి కర సన్ముఖ రహీ ।
ప్రభు ఆసుతోష కృపాల సివ అబలా నిరఖి బోలే సహీ ॥

యోగులు నిష్కంటకులైరి. కాని మన్మథునిపత్ని రతీదేవి తన భర్తమరణవార్త విని మూర్ఛిల్లెను. ఆమె శోకవిహ్వలయై శివునిసన్నిధికి ఏతెంచి, పరిపరివిధముల ప్రార్థించుచు ఆయనయెదుట నిలబడెను. నిస్సహాయస్థితిలోనున్న ఆమెను జూచి, జాలిగొని కరుణాళువు ఐన పరమశివుడు ఇట్లు పలికెను. (ఛం॥)

దో-అబ తేఁ రతి తవ నాథ కర, హోఇహి నాము అనంగు ।
బిను బపు బ్యాపిహి సబహి పుని, సును నిజ మిలన ప్రసంగు ॥ 87 ॥

ఓ రతీ! నేటినుండి నీ భర్త 'అనంగుడు' అనబడును. దేహము లేకున్నను అందఱిని వ్యాకుల పఱచును. నీ భర్తను పొందెడి మార్గమును వినుము. (దో॥ 87)

చౌ- జబ జదుబంస కృష్న అవతారా । హోఇహి హరన మహా మహిభారా ॥
కృష్న తనయ హోఇహి పతి తోరా । బచను అన్యథా హోఇ న మోరా ॥ 1 ॥
రతి గవనీ సుని సంకర బానీ । కథా అపర అబ కహఉఁ బఖానీ ॥
దేవన్హ సమాచార సబ పాఏ । బ్రహ్మాదిక బైకుంఠ సిధాఏ ॥ 2 ॥
సబ సుర బిష్ను బిరంచి సమేతా । గఏ జహాఁ సివ కృపానికేతా ॥
పృథక పృథక తిన్హ కీన్హి ప్రసంసా । భఏ ప్రసన్న చంద్ర అవతంసా ॥ 3 ॥
బోలే కృపాసింధు బృషకేతూ । కహహు అమర ఆఏ కేహి హేతూ ॥
కహ బిధి తుమ్హ ప్రభు అంతరజామీ । తదపి భగతి బస బినవఉఁ స్వామీ ॥ 4 ॥

పృథ్వీభారమును బాపుటకు శ్రీహరి యదువంశమున శ్రీకృష్ణుడుగా అవతరించును. అప్పుడే నీభర్త ఆయనకు ప్రద్యుమ్నుడనుపేర కుమారుడుగా జన్మించును. నాపలుకులు సత్యములు. శివునిమాటలు విని రతీదేవి వెడలి పోయెను. ఇప్పుడు మఱియొక కథను వినిపించెదను. బ్రహ్మాదిదేవతలు ఈ సమాచారమును విని నేరుగా వైకుంఠమునకు చేరిరి. పిమ్మట విష్ణువు వారిని వెంటబెట్టుకొని పరమేశ్వరునిసన్నిధికి చేరెను. వారు చంద్రశేఖరుని పెక్కువిధముల ప్రస్తుతించిరి. దయాళువైన పరమశివుడు ప్రసన్నుడై "దేవతలారా! మీరాకకు కారణమేమి? అని యడిగెను. బ్రహ్మ "ఓ ప్రభూ ఓ అంతర్యామీ! దయతో మామనవిని ఆలకింపుడు. (చౌ॥ 1-4)

# పార్వతీ పరమేశ్వరుల పరిణయము

దో-సకల సురన్హ కే హృదయఁ అస, సంకర పరమ ఉఛాహు।
నిజ నయనన్హి దేఖా చహహిఁ, నాథ తుమ్హార బిబాహు ॥ 88 ॥

బ్రహ్మ పల్కెను. "స్వామీ! దేవతలందఱిహృదయములలో ఒకేకోరిక కలదు. వారు మీవివాహమహోత్సవమును చూడ గోరుచున్నారు. (దో॥ 88)

చౌ- యహ ఉత్సవ దేఖిఅ భరి లోచన। సోఇ కఛు కరహు మదన మద మోచన ॥
కాము జారి రతి కహుఁ బరు దీన్హా। కృపాసింధు యహ అతి భల కీన్హా ॥ 1 ॥
సాసతి కరి పుని కరహిఁ పసాఊ । నాథ ప్రభున్హ కర సహజ సుభాఊ ॥
పారబతీఁ తపు కీన్హ అపారా। కరహు తాసు అబ అంగీకారా ॥ 2 ॥
సుని బిధి బినయ సముఝి ప్రభుబానీ। ఐసెఇ హోఉ కహా సుఖు మానీ ॥
తబ దేవన్హ దుందుభీఁ బజాఈఁ। బరషి సుమన జయ జయ సుర సాఈఁ ॥ 3 ॥
అవసరు జాని సప్తరిషి ఆఏ । తురతహిఁ బిధి గిరిభవన పఠాఏ ॥
ప్రథమ గఏ జహఁ రహీఁ భవానీ। బోలే మధుర బచన ఛల సానీ ॥ 4 ॥

ఓ మన్మథ గర్వాపహారీ! మీ వివాహమును మేము కనువిందుగా జూచెడి ఉపాయమును దెల్పుడు. కరుణాసాగరా! మదనుని భస్మమొనర్చినపిమ్మట రతీదేవికి వరములనిచ్చి, మేలొనగూర్చితిరి. ప్రభూ! మొదట దండించి, పిదప క్షమించుట మహాత్ముల లక్షణము. పార్వతీదేవి గొప్పతపస్సు చేసినది. దయతో ఆమెను అర్ధాంగిగా స్వీకరింపుడు- "బ్రహ్మదేవునివిజ్ఞాపనను విని, శ్రీరామునిఆజ్ఞను జ్ఞప్తికి దెచ్చుకొని, శివుడు ప్రసన్నుడై 'అట్లే యగుగాక' (తథాస్తు)" – అని అనుగ్రహించెను. పూలవానగురిసెను. దేవతలందఱును దుందుభులు మ్రోగించి, 'జయ జయ ధ్వానములు' చేసిరి. ఇదియే తగిన'అదను' అని భావించి, సప్తర్షులు అచటికి వచ్చిరి. బ్రహ్మ వారిని హిమవంతునికడకు పంపెను. వారు మొదట పార్వతీదేవి యొద్దకు వెళ్లి, మధురముగా వినోదవచనములను పలికిరి. (చౌ॥ 1-4)

దో- కహా హమార న సునేహు తబ, నారద కేఁ ఉపదేస।
అబ భా ఝూఠ తుమ్హార పన, జారేఉ కాము మహేస ॥ 89 ॥

"ఆ సమయమున నారదుని మాటలను పాటించి, మా పలుకులను వినక పోయితివి. ఇప్పుడు నీ ప్రతిజ్ఞ వమ్మైనది. మహాదేవుడిప్పుడు మన్మథునే భస్మము గావించెను. (దో॥ 89)

## మాసపారాయణము - మూడవ విరామము

చౌ- ముని బోలీఀ ముసుకాఇ భవానీ। ఉచిత కహేహు మునిబర బిగ్యానీ ॥
తుమ్హరేఀ జాన కాము అబ జారా। అబ లగి సంభు రహే సబికారా ॥ 1 ॥
హమరేఀ జాన సదా సివ జోగీ। అజ అనవద్య అకామ అభోగీ ॥
జౌఀ మైఀ సివ సేయే అస జానీ। ప్రీతి సమేత కర్మ మన బానీ ॥ 2 ॥
తౌ హమార పన సునహు మునీసా। కరిహహిఀ సత్య కృపానిధి ఈసా ॥
తుమ్హ జో కహా హర జారేఉ మారా। సోఇ అతి బడ అబిబేకు తుమ్హారా ॥ 3 ॥
తాత అనల కర సహజ సుభాఊ। హిమ తెహి నికట జాఇ నహిఀ కాఊ ॥
గఏఀ సమీప సో అవసి నసాఈ। అసి మన్మథ మహేస కీ నాఈ ॥ 4 ॥

ఈ మాటలను విని పార్వతీదేవి చిఱునవ్వుతో ఇట్లనెను. "జ్ఞాన నిధులైన మునీశ్వరులారా! మీరులెస్సగా పలికితిరి. పరమేశ్వరుడు కాముని ఇప్పుడే కాల్చినాడనియు, ఇంతవఱకును అతడు సవికారుడనియు మీ ఉద్దేశ్యము. కాని నా అభిప్రాయములో శివుడు సర్వదా యోగి, జన్మరహితుడు, అనింద్యుడు, నిష్కాముడు, నిర్వికార-నిరంజనుడు. ఈ విషయమును ఎఱింగియు నేను త్రికరణశుద్ధిగా ప్రీతితో ఆయనను సేవించితిని. కావున ఓ మునులారా! వినుడు దయామయుడైన ప్రభువు నా ప్రతిజ్ఞను సఫలము చేయును. శివుడు మన్మథుని భస్మమొనర్చినాడనుట అవివేకము. హిమము ఎట్టి పరిస్థితులలోను అగ్నిని సమీపింపలేదు. ఒకవేళ సమీపించినచో అది కఱిగి పోవును. అట్లే మన్మథుడు తనకైతానే మహాదేవునికడకు వెళ్ళి భస్మమైనాడు. ఇది సత్యము, న్యాయము. (చౌ॥ 1-4)

దో- హియఀ హరషే ముని బచన సుని, దేఖి ప్రీతి బిస్వాస।
చలే భవానిహి నాఇ సిర, గఏ హిమాచల పాస ॥ 90 ॥

పార్వతీదేవివచనములను విని, సప్తర్షులు ఆమెభక్తివిశ్వాసములకు సంతసించిరి. ఆమెకు శిరసా ప్రణమిల్లి, హిమవంతుని కడకు చేరిరి. (దో॥ 90)

చౌ- సబు ప్రసంగు గిరిపతిహి సునావా। మదన దహన సుని అతి దుఖు పావా ॥
బహురి కహేఉ రతి కర బరదానా। సుని హిమవంత బహుత సుఖు మానా ॥ 1 ॥
హృదయఀ బిచారి సంభు ప్రభుతాఈ। సాదర మునిబర లిఏ బోలాఈ ॥
సుదిను సునఖతు సుఘరీ సోచాఈ। బేగి బేదబిధి లగన ధరాఈ ॥ 2 ॥
పత్రీ సప్తరిషిన్హ సోఇ దీన్హీ। గహి పద బినయ హిమాచల కీన్హీ ॥
జాఇ బిధిహి తిన్హ దీన్హి సో పాతీ। బాచత ప్రీతి న హృదయఀ సమాతీ ॥ 3 ॥

లగన బాచి అజ సబహి సునాఈ । హరషే ముని సబ సుర సముదాఈ ॥
సుమన బృష్టి నభ బాజన బాజే । మంగల కలస దసహుఁ దిసి సాజే ॥ 4 ॥

వారు హిమవంతునకు విషయములను అన్నింటిని తెల్పిరి. మదనుడు భస్మమగుటను విని, అతడు మిగుల దుఃఖించెను. రతీదేవికి ఇచ్చినవరమునుగూర్చి విన్నవిమ్మట సంతోషించెను. మనస్సులో శివమహిమను తలచుకొని, మునీశ్వరులను సాదరముగా ఆహ్వానించెను. వారిచే శుభదిననక్షత్ర ఘటికలను పరిశీలింపజేసి, వేదోక్తముగా వివాహముహూర్తమును నిర్ణయించెను. హిమవంతుడు లగ్నపత్రికను వ్రాయించి, దానిని సప్తర్షులకు ఇచ్చి, వారికి పాదాభివందనమాచరించి విన్నవించెను. వారు ఆ పత్రికను బ్రహ్మదేవునకు అందించిరి. బ్రహ్మ దానిని చదివి మహానందభరితుడాయెను. బ్రహ్మ లగ్న పత్రికను చదివి విన్పింపగా మునులు దేవతలు సంతోషపడిరి. ఆకాశమునుండి పుష్పవర్షము కురిసెను. వివిధవాద్యములు మ్రోగెను. దశదిశల మంగళకలశములు అలంకరింపబడెను. (చౌ॥ 1-4)

దో-లగే సఁవారన సకల సుర, బాహన బిబిధ బిమాన ।
హోహిఁ సగున మంగల సుభద, కరహిఁ అపఛరా గాన ॥ 91 ॥

దేవతలందఱును తమతమ వాహనములను విమానములను సిద్ధపఱచిరి. శుభశకునములు పొడసూపెను. ఆనందముతో అప్సరసలు నాట్యములాడిరి. (దో॥ 91)

చౌ-సివహి సంభు గన కరహి సిఁగారా । జటా ముకుట అహి మౌరు సఁవారా ॥
కుండల కంకన పహిరే బ్యాలా । తన బిభూతి పట కేహరి ఛాలా ॥ 1 ॥
ససి లలాట సుందర సిర గంగా । నయన తీని ఉపబీత భుజంగా ॥
గరల కంఠ ఉర నర సిర మాలా । అసివ బేష సివధామ కృపాలా ॥ 2 ॥
కర త్రిసూల అరు డమరు బిరాజా । చలే బసహఁ చఢి బాజహిఁ బాజా ॥
దేఖి సివహి సురత్రియ ముసుకాహీఁ । బర లాయక దులహిని జగ నాహీఁ ॥ 3 ॥
బిష్ను బిరంచి ఆది సురబ్రాతా । చఢి చఢి బాహన చలే బరాతా ॥
సుర సమాజ సబ భాఁతి అనూపా । నహిఁ బరాత దూలహ అనురూపా ॥ 4 ॥

భూతగణములు శివుని అలంకరించిరి. జటాజూటములపై సర్పములను అలంకరించిరి. సర్పములతోడనే కుండలములను కంకణములను ధరింపజేసిరి. సుందర శరీరముపై విభూతిని అలందిరి. వ్యాఘ్రచర్మమును ధరింపజేసిరి. పరమశివుని లలాటమున చంద్రుడు, శిరస్సున గంగ, ముఖమున త్రినేత్రములు, నాగయజ్ఞోపవీతము, కంఠమున గరళము, ఉరమున కపాలమాలికలు శోభిల్లుచుండెను. ఈ విధముగా ఆయన విలక్షణవేషధారిగా ఉన్నను శుభప్రదుడు, కృపాళువు. హస్తములయందు త్రిశూలము, డమరుకము ధరించి, మంగళ వాద్యములతో నందివాహనారూఢుడై విచ్చేసెను. శివుని గాంచిన దేవాంగనలు "ఈ వరునికి తగినవధువు ఈ జగత్తులోనే దొరకదు"- అని తమలో తాము చిఱునవ్వులను చిందించుచు అనుకొనిరి. బ్రహ్మ, విష్ణువు మొదలగు దేవతలు తమతమ వాహనములతో ఊరేగింపులో పాల్గొనిరి. దేవతల కోలాహలముతో సాగుచున్న ఈ ఊరేగింపు అత్యద్భుతముగా నున్నను అది వరునకు తగినట్లుగా లేదు. (చౌ॥ 1-4)

దో- బిష్ను కహా అస బిహసి తబ, బోలి సకల దిసిరాజ।
బిలగ బిలగ హోఇ చలహు సబ, నిజ నిజ సహిత సమాజ ॥ 92 ॥

అప్పుడు విష్ణుమూర్తి దిక్పాలురను పిలిచి, నవ్వి ఇట్లనెను. "మీరు మీ పరివారములతో వేర్వేఱుగా నడచుచుండుడు. (దో॥ 92)

చౌ- బర అనుహారి బరాత న భాఈ। హఁసీ కరైహహు పర పుర జాఈ ॥
బిష్ను బచన సుని సుర ముసుకానే। నిజ నిజ సేన సహిత బిలగానే ॥ 1 ॥
మనహీఁ మన మహేసు ముసుకాహీఁ। హరి కే బింగ్య బచన నహిఁ జాహీఁ ॥
అతి ప్రియ బచన సునత ప్రియ కేరే। భృంగిహి ప్రేరి సకల గన టేరే ॥ 2 ॥
సివ అనుసాసన సుని సబ ఆఏ। ప్రభుపద జలజ సీస తిన్హ నాఏ ॥
నానా బాహన నానా బేషా। బిహసే సివ సమాజ నిజ దేఖా ॥ 3 ॥
కోఉ ముఖహీన బిపుల ముఖ కాహూ। బిను పద కర కోఉ బహు పద బాహూ ॥
బిపుల నయన కోఉ నయన బిహీనా। రిష్టపుష్ట కోఉ అతి తనఖీనా ॥ 4 ॥

సోదరులారా! ఈ ఊరేగింపు వరునకు తగినట్లుగా లేదు. క్రొత్తచోట ఏల నవ్వులపాలయ్యెదరు?" విష్ణువచనములను విని, దేవతలు నవ్వి, తమ సేనలతో వేర్వేఱుగా నడవసాగిరి. మహాదేవుడు గూడ విష్ణువు యొక్క ప్రియవచనములను విని నవ్వి, "శ్రీహరి తనవ్యంగ్యధోరణిని ఎన్నడును మానడు."- అనియనుకొనెను. శివుడు భృంగిని పంపి, తన పరివారములను రప్పించెను. శివుని ఆజ్ఞతో వారందఱును వచ్చి, తమ ప్రభువుయొక్క పాదపద్మములకు నమస్కరించిరి: చిత్రవిచిత్రములైన వారివేషములను వాహనములను జూచి, శివుడు నవ్వెను. కొందఱికి నోళ్ళులేవు. మఱికొందఱికి పెక్కునోళ్ళు గలవు. కొందఱికి చేతులును, కాళ్లును లేవు. మఱికొందఱికి అనేకములున్నవి. నేత్రములు లేనివారు కొందఱు. బహునేత్రములు గలవారు మఱికొందఱు. కొందఱులావుగా బలిష్ఠముగా నుండిరి. మఱికొందరు బక్కగా బలహీనముగా నుండిరి. (చౌ॥ 1-4)

ఛం-తన ఖీన కోఉ అతి పీన పావన కోఉ అపావన గతి ధరేఁ।
భూషన కరాల కపాల కర సబ సద్య సోనిత తన భరేఁ ॥
ఖర స్వాన సుఅర సృకాల ముఖ గన బేష అగనిత కో గనై।
బహు జినస ప్రేత పిసాచ జోగి జమాత బరనత నహిఁ బనై ॥

కొందఱు కృశించినదేహములుగలవారు. మఱికొందఱు బలిష్ఠకాయులు. కొందఱు పవిత్రవేషధారులు, వికృతవేషధారులు మఱికొందరు. వారిసొమ్ములు భయమును గొలుపుచున్నవి. చేతులలో పుఱ్ఱెలు కలిగియుండిరి. శరీరములు రక్తసిక్తములై యుండెను. వారు గార్దభముల, శునకముల, సూకరముల, జంబుకముల ముఖములు కలిగియుండిరి. ఈ ప్రమథగణములవేషములను లెక్కింప నలవికాదు. ప్రేత పిశాచ యోగినులు అసంఖ్యాకముగా నుండిరి. (ఛం॥)

సో- నాచహిం గావహిం గీత, పరమ తరంగీ భూత సబ।
దేఖత అతి బిపరీత, బోలహిం బచన బిచిత్ర బిధి ॥ 93 ॥

ఆ భూతప్రేతములు పరమానందముతో పాటలు పాడుచు నాట్యములు సల్పుచు చూచుటకు వికారముగా నుండి విచిత్ర ధ్వనులను జేయుచుండెను. (సో॥ 93)

చౌ- జస దూలహు తసి బనీ బరాతా। కౌతుక బిబిధ హోహిం మగ జాతా ॥
ఇహాం హిమాచల రచేఉ బితానా। అతి బిచిత్ర నహిం జాఇ బఖానా ॥ 1 ॥
సైల సకల జహం లగి జగ మాహీం। లఘు బిసాల నహిం బరని సిరాహీం ॥
బన సాగర సబ నదీం తలావా। హిమగిరి సబ కహుం నెవత పఠావా ॥ 2 ॥
కామరూప సుందర తన ధారీ। సహిత సమాజ సహిత బర నారీ ॥
గఏ సకల తుహినాచల గేహా। గావహిం మంగల సహిత సనేహా ॥ 3 ॥
ప్రథమహిం గిరి బహు గృహ సంవరాఏ। జథాజోగు తహం తహం సబ ఛాఏ ॥
పుర సోభా అవలోకి సుహాఈ। లాగఇ లఘు బిరంచి నిపునాఈ ॥ 4 ॥

ఊరేగింపు ఇప్పుడు పెండ్లి కొడుకునకు తగినట్లు ఉండెను. వారు మార్గమధ్యములో వివిధములగు వినోదములు చేయుచుండిరి. ఇక్కడ హిమవంతుడు ఒక అపూర్వమైన వివాహమండపమును సిద్ధము చేయించెను. ఆయన ప్రపంచములోని చిన్న, పెద్ద పర్వతముల, అడవుల, సముద్రముల, నదుల, తటాకముల అధిదేవతలను ఆహ్వానించెను. కామరూపులైనట్టి వారు సుందరశరీరములతో సతీసమేతులై పరివారములతో హిమవంతుని గృహమునకు చేరిరి. స్నేహపూర్వకముగా మంగళగీతములను పాడిరి. పర్వతరాజు పెక్కు అతిథిగృహములను అలంకరింపజేసి, వారికై ఏర్పఱచెను. వారు తమతమ యోగ్యతలను అనుసరించి, వాటిలో చేరిరి. మనోహరమైన ఈ నగరశోభను తిలకించిన వారు బ్రహ్మసృష్టిని తక్కువగా భావించుచుండిరి. (చౌ॥ 1-4)

ఛం- లఘు లాగ బిధి కీ నిపునతా అవలోకి పుర సోభా సహీ।
బన బాగ కూప తడాగ సరితా సుభగ సబ సక కో కహీ ॥
మంగల బిపుల తోరన పతాకా కేతు గృహ గృహ సోహహీం।
బనితా పురుష సుందర చతుర ఛబి దేఖి ముని మన మోహహీం ॥

నిజముగా ఈ నగరవైభవము బ్రహ్మసృష్టిని మించియుండెను. వన-ఉపవన వాపీకూపతటాకముల శోభలు వర్ణనాతీతములు. ప్రతిగృహము మంగళ తోరణములతో ధ్వజపతాకములతో విలసిల్లుచుండెను. అచటి స్త్రీలు పురుషులు అందమైనవారు, చతురులు. వారి సౌందర్యములు మునుల మనస్సులను గూడ ఆకర్షించుచుండెను. (ఛం॥)

దో- జగదంబా జహం అవతరీ, సో పురు బరని కి జాఇ।
రిద్ధి సిద్ధి సంపత్తి సుఖ, నిత నూతన అధికాఇ ॥ 94 ॥

జగన్మాతయే అవతరించిన ఆ నగరశోభను ఎంతని వర్ణింపగలను? ఐశ్వర్యము, జయము, సుఖ సంపదలు అన్నియు ఒక్కచోటనే యుండెను. అవి నిత్య నూతనముగా వృద్ధిచెందుచుండెను. (దో॥ 94)

చౌ- నగర నికట బరాత సుని ఆఈ। పుర ఖరభరు సోభా అధికాఈ॥
కరి బనావ సజి బాహన నానా। చలే లేన సాదర అగవానా॥ 1॥
హియఁ హరషే సుర సేన నిహారీ। హరిహి దేఖి అతి భఏ సుఖారీ॥
సివ సమాజ జబ దేఖన లాగే। బిడరి చలే బాహన సబ భాగే॥ 2॥
ధరి ధీరజు తహఁ రహే సయానే। బాలక సబ లై జీవ పరానే॥
గఏఁ భవన పూఛహిఁ పితు మాతా। కహహిఁ బచన భయ కంపిత గాతా॥ 3॥
కహిఅ కాహ కహి జాఇ న బాతా। జమ కర ధార కిధౌఁ బరిఆతా॥
బరు బౌరాహ బసహఁ అసవారా। బ్యాల కపాల బిభూషన ఛారా॥ 4॥

ఊరేగింపు నగరమును చేరుచున్నదనివినగానే నగరములో కోలాహలము అధికమాయెను. ఆ నగరశోభ ఇనుమడించెను. ఆహ్వానసంఘసభ్యులు తాము అలంకరించుకొని, తమ వాహనములను గూడ అలంకరించి, పెండ్లి కుమారుని, ఆయనపరివారములను సాదరముగా ఆహ్వానించుటకు ముందుకు నడిచిరి. దేవతాబృందములను జూచి, అందఱును ఆనందించిరి. శ్రీహరిని జూచి మిక్కిలి హర్షపులకితులైరి. కాని శివునిపరివారములను గాంచి, వారి వాహనములు భయముతో వెనుదిరిగి పరుగులు దీయసాగెను. యువకులు ధైర్యము వహించి, అచటనే నిలిచిరి. కాని పిల్లలు ప్రాణభీతితో పరుగులు దీసిరి. గృహములకు చేరిన పిమ్మట వారు వణకుచు తల్లిదండ్రులతో ఇట్లు చెప్పదొడంగిరి. "ఏమని చెప్పగలము? మాటలు వచ్చుట లేదు. ఇది పెండ్లి యూరేగింపా? లేక యముని సైన్యమా? పెండ్లికుమారుడు పిచ్చివాడు. ఎద్దుపై నెక్కి వచ్చుచున్నాడు. సర్పములు, కపాలములు, భస్మము ఆయన ఆభరణములు. (చౌ॥ 1-4)

ఛం- తన ఛార బ్యాల కపాల భూషన నగన జటిల భయంకరా।
సఁగ భూత ప్రేత పిసాచ జోగిని బికట ముఖ రజనీచరా॥
జో జిఅత రహిహి బరాత దేఖత పున్య బడ తెహి కర సహీ॥
దేఖిహి సో ఉమా బిబాహు ఘర ఘర బాత అసి లరికన్హ కహీ॥

పెండ్లికుమారుడు శరీరముపై భస్మమును పూసికొని, సర్పములను, కపాలములను ధరించి యుండెను. అతడు దిగంబరముగా జటాధారియై భయంకరముగా ఉండెను. ఆయన వెంట భయంకరముఖములుగల భూతప్రేతపిశాచయోగినులును, రాక్షసులును గలరు. ఈ వరుని ఊరేగింపునుజూచి, బ్రతికినవాడు పుణ్యాత్ముడు. అతడే (ఆ బ్రతికి యున్నవాడే) ఈ పార్వతీవివాహమును జూడగలడు"- ప్రతియింటిలోను బాలురు ఈ మాటలనే పలుకుచుండిరి. (ఛంద్)

దో- సముఝి మహేస సమాజ సబ, జనని జనక ముసుకాహిఁ।
బాల బుఝాఏ బిబిధ బిధి, నిడర హోహు డరు నాహిఁ॥ 95॥

ఇదియంతయు శివునిపరివారము-అని తెలిసికొని పెద్దలు నవ్వుకొనిరి. వారు పిల్లలకు పెక్కురీతుల నచ్చజెప్పి, భయపడవలదని ధైర్యమునుగొల్పిరి. (దో॥ 95)

చౌ- లై అగవాన బరాతహి ఆఏ। దిఏ సబహి జనవాస సుహాఏ ॥
మైనాఁ సుభ ఆరతీ సఁవారీ। సంగ సుమంగల గావహిఁ నారీ ॥ 1 ॥
కంచన థార సోహ బర పానీ। పరిఛన చలీ హరహి హరషానీ ॥
బికట బేష రుద్రహి జబ దేఖా। అబలన్హ ఉర భయ భయఉ బిసేషా ॥ 2 ॥
భాగి భవన పైఠీఁ అతి త్రాసా। గఏ మహేసు జహాఁ జనవాసా ॥
మైనా హృదయఁ భయఉ దుఖు భారీ। లీన్హీ బోలి గిరీస కుమారీ ॥ 3 ॥
అధిక సనేహఁ గోద బైఠారీ। స్యామ సరోజ నయన భరె బారీ ॥
జెహిఁ బిధి తుమ్హహి రూపు అస దీన్హా। తెహిఁ జడ బరు బాఉర కస కీన్హా ॥ 4 ॥

ఆహ్వానసంఘసభ్యులు పెండ్లికుమారుని, ఆతనిపరివారములను కలిసికొని, వారిని సాదరముగా తగిన విడిది గృహములకు చేర్చిరి. పార్వతితల్లియగు మేనాదేవి మంగళహారతిని వెలిగించెను. ఇతర స్త్రీలు మంగళగీతములను పాడిరి. ఆమె బంగరుహారతిపళ్లెమును చేతబట్టుకొని ద్వార (వర) పూజ చేయుటకు బయలుదేరెను. స్త్రీలు ఆ మహాదేవుని జూడగానే భయచకితలైరి. వారు తమఇండ్లలో దూరిరి. శివుడు తనవిడిదిగృహమున ప్రవేశించెను. మేనాదేవి తనహృదయమున మిక్కిలి పరితాపమునొందెను. పార్వతిని పిలిచెను. ప్రేమతో కుమార్తెను తనయొడిలో కూర్చుండబెట్టుకొని, నల్లకలువలవంటి తనకనులనుండి అశ్రువులను రాల్చుచు ఇట్లనెను. "మూర్ఖుడైన విధాత నిన్ను ఇంత అందముగా సృష్టించి, నీకు ఒక పిచ్చివానిని భర్తగా జేసెను. (చౌ॥ 1-4)

ఛం- కస కీన్హ బరు బౌరాహ బిధి జెహిఁ తుమ్హహి సుందరతా దఈ।
జో ఫలు చహిఅ సురతరుహిఁ సో బరబస బబూరహిఁ లాగఈ ॥
తుమ్హ సహిత గిరి తేఁ గిరౌఁ పావక జరౌఁ జలనిధి మహుఁ పరౌఁ।
ఘరు జాఉ అపజసు హోఉ జగ జీవత బిబాహు న హౌఁ కరౌఁ ॥

నిన్నింతఅందముగా సృష్టించినవిధాత నీకు ఈ పిచ్చివానిని భర్తగా ఎట్లు నిర్ణయించెను? కల్పవృక్షమునకు కాయవలసినఫలము ఒక తుమ్మచెట్టును ఎట్లు చేరును? నిన్ను నాచేతులలో ఉంచుకొని, గిరిశిఖరములనుండి క్రిందికి దూకెదను. అగ్నిలో పడెదను లేదా సముద్రములో మునిగెదను. నా ఇల్లు ఏమైపోయినను సరే. ప్రపంచమున నాకు అప్రతిష్ఠ వచ్చినను రానిమ్ము. నా కంఠములో ప్రాణమున్నంతవఱకు ఈ పిచ్చివానితో నీ వివాహము జరుగనీయను."- అనిపల్కెను. (ఛం॥)

దో-భఈఁ బికల అబలా సకల, దుఖిత దేఖి గిరినారి।
కరి బిలాపు రోదతి బదతి, సుతా సనేహు సఁభారి ॥ 96 ॥

హిమవంతునిపత్ని దుఃఖితురాలగుటజూచి ఇతరస్త్రీలుగూడ మిగులవగచిరి. కుమార్తెపై తనకుగలప్రేమను తలచుకొని, మేనాదేవి మిగుల విలపించెను. (దో॥ 96)

చౌ- నారద కర మైం( కాహ బిగారా । భవను మోర జిన్హ బసత ఉజారా ॥
అస ఉపదేసు ఉమహి జిన్హ దీన్హా । బౌరే బరహి లాగి తపు కీన్హా ॥ 1 ॥
సాచెహుం( ఉన్హ కే( మోహ న మాయా । ఉదాసీన ధను ధాము న జాయా ॥
పర ఘర ఘాలక లాజ న భీరా । బాం(ఝు కి జాన ప్రసవ కై పీరా ॥ 2 ॥
జననిహి బికల బిలోకి భవానీ । బోలీ జుత బిబేక మృదు బానీ ॥
అస బిచారి సోచహి మతి మాతా । సో న టరఇ జో రచఇ బిధాతా ॥ 3 ॥
కరమ లిఖా జౌం( బాఉర నాహూ । తౌ కత దోసు లగాఇఅ కాహూ ॥
తుమ్హ సన మిటహిం( కి బిధి కే అంకా । మాతు బ్యర్థ జని లేహు కలంకా ॥ 4 ॥

"ఇట్టిపిచ్చివానికొఱకు అపస్సుచేయుమని పార్వతికి ఉపదేశించి, నా ఇంటిని గూల్చుటకుపూనుకొనిన నారదునకు నేను ఏమి అపకారము చేసియుంటిని? నిజముగా ఆయనకు ఎవ్వరిపైనను ప్రేమ, మమకారములు లేవు. నిర్ధనుడు, ఇల్లు-ఇల్లాలు లేనివాడు, ఉదాసీనుడు ఇతరులకాపురములను కూల్చువాడు, సిగ్గు-భయము లేనివాడు, గొడ్రాలికి కడుపుతీపి ఏమి తెలియును?" (గొడ్రాలికి ప్రసవవేదన ఎట్లు తెలియును?) ఇట్లు తల్లి దుఃఖితయగుట చూచి, పార్వతీదేవి వివేకముతో మృదుమధురముగా ఇట్లు పలికెను. "అమ్మా! విధివ్రాతను తప్పించుటకు ఎవ్వరికిని సాధ్యముగాదు. నా ప్రారబ్ధమున పిచ్చివానిని భర్తగా పొందవలసియున్నచో ఇతరులను నిందించి ప్రయోజనము ఏమి? విధివ్రాతను నీవు చెఱపగలవా? అనవసరముగా మనస్సును పాడుచేసికొనవలదు. కళంకమును నెత్తిన వేసికొన వలదు. (చౌ॥ 1-4)

ఛం- జని లేహు మాతు కలంకు కరునా పరిహరహు అవసర నహీం( ।
దుఖు సుఖు జో లిఖా లిలార హమరే( జాబ జహం( పాఉబ తహీం( ॥
సుని ఉమా బచన బినీత కోమల సకల అబలా సోచహీం( ।
బహు భాం(తి బిధిహి లగాఇ దూషన నయన బారి బిమోచహీం( ॥

"మాతా! అనవసరమైన కళంకమును పొందవలదు. ఏడుపు మానుము. ఇది విచారింప వలసిన సమయము గాదు. నా నొసట వ్రాయబడిన సుఖదుఃఖములను నేనెచ్చటికిపోయినను అనుభవింపక తప్పదు." పార్వతీదేవి యొక్క ఈ సవినయకోమలవచనములను విని, స్త్రీలందఱును విధాతను నిందించుచు కన్నీరు గార్చిరి. (ఛంద్)

దో-తెహి అవసర నారద సహిత, అరు రిషి సప్త సమేత ।
సమాచార సుని తుహినగిరి, గవనే తురత నికేత ॥ 97 ॥

ఈ సమాచారమును దెలిసికొని, హిమవంతుడు నారదుని, ఇతర సప్తర్షులను వెంటబెట్టుకొని వచ్చెను. (దో॥ 97)

చౌ- తబ నారద సబహీ సముఝావా । పూరుబ కథాప్రసంగు సునావా ॥
మయనా సత్య సునహు మమ బానీ । జగదంబా తవ సుతా భవానీ ॥ 1 ॥
అజా అనాది సక్తి అబినాసిని । సదా సంభు అరధంగ నివాసిని ॥
జగ సంభవ పాలన లయ కారిని । నిజ ఇచ్ఛా లీలా బపు ధారిని ॥ 2 ॥

జనమీం ప్రథమ దచ్ఛ గృహ జాఈ। నాము సతీ సుందర తను పాఈ ॥
తహఁహుఁ సతీ సంకరహి బిబాహీం। కథా ప్రసిద్ధ సకల జగ మాహీం ॥ 3 ॥
ఏక బార ఆవత సివ సంగా। దేఖెఉ రఘుకుల కమల పతంగా ॥
భయఉ మోహు సివ కహా న కీన్హా। భ్రమ బస బేషు సీయ కర లీన్హా ॥ 4 ॥

అప్పుడు నారదుడు ఉమాదేవి పూర్వజన్మ వృత్తాంతమునుజెప్పి, అందఱిని శాంతింప జేసెను. "మేనాదేవీ! నా మాటలను నమ్ముము. నీ కూతురు జగజ్జనని, భవాని. ఈమె ఆద్యంతములు లేని శక్తి స్వరూపిణి, శివునకు సర్వదా 'అర్ధాంగి' లోకసృష్టిస్థితిలయకారిణి, ఇచ్ఛా మాత్రమున మాయారూపమును ధరింపగలదు. పూర్వజన్మమున దక్షునిపుత్రికగానుండెను. అప్పుడామెనామధేయము సతీదేవి. ఆ అవతారమునగూడ ఆమె శంకరునే వివాహమాడెను. ఇదిలోకవిదితము. ఒకనాడు శివునితో గూడి గృహోన్ముఖురాలై వచ్చుచుండగా రఘుకులతిలకుడైన శ్రీరామునిముఖసరోజమును జూచెను. శివుని మాటలను లెక్కింపక భ్రమవశమున సీతాదేవిరూపమును దాల్చెను.
(చౌ॥ 1-4)

ఛం-సీయ బేషు సతీం జో కీన్హ తేహిం అపరాధ సంకర పరిహరీం।
హర బిరహం జాఇ బహోరి పితు కేం జగ్య జోగానల జరీం ॥
అబ జనమి తుమ్హరే భవన నిజ పతి లాగి దారున తపు కియా।
అస జాని సంసయ తజహు గిరిజా సర్బదా సంకరప్రియా ॥

సీతాదేవి రూపమును దాల్చిన దోషమునకు శంకరుడీమెను పరిత్యజించెను. పతివియోగమును సహింపజాలక ఈమె తనతండ్రియైన దక్షుని ఇంట యజ్ఞశాలయందు యోగాగ్నిలో దగ్ధమయ్యెను. మఱల మీ గృహమున జన్మించి, శివుని తనపతిగా పొందుటకు కఠోరతపమాచరించినది. ఈ విషయములను ఎఱింగి, మీ సందేహమును వీడుడు. గిరిజాదేవి సర్వదా శివుని అర్ధాంగియే".
(ఛం॥)

దో-సుని నారద కే బచన తబ, సబ కర మిటా బిషాద।
ఛన మహుఁ బ్యాపెఉ సకల పుర, ఘర ఘర యహ సంబాద ॥ 98 ॥

నారదుని వచనములను వినినంతనే ఎల్లరిశోకములు తొలగిపోయినవి. క్షణములోనే ఈ వృత్తాంతము ఇంటింటికిని వ్యాపించెను.
(దో॥ 98)

చౌ- తబ మయనా హిమవంతు అనందే। పుని పుని పారబతీ పద బందే ॥
నారి పురుష సిసు జుబా సయానే। నగర లోగ సబ అతి హరషానే ॥ 1 ॥
లగే హోన పుర మంగల గానా। సజే సబహిం హాటక ఘట నానా ॥
భాఁతి అనేక భఈ జెవనారా। సూపసాస్త్ర జస కఛు బ్యవహారా ॥ 2 ॥
సో జెవనార కి జాఇ బఖానీ। బసహిం భవన జేహిం మాతు భవానీ ॥
సాదర బోలే సకల బరాతీ। బిష్ను బిరంచి దేవ సబ జాతీ ॥ 3 ॥

బిబిధి పాఁతి బైఠీ జేవనారా। లాగే పరుసన నిపున సుఆరా ॥
నారిబృంద సుర జేవఁత జానీ। లగీఁ దేన గారీఁ మృదు బానీ ॥ 4 ॥

మేనాదేవియు, హిమవంతుడును పార్వతీదేవిదివ్యత్వమును తెలిసికొని, ఆనందపరవశులై ఆమెకు పాదాభివందనమొనరించిరి. పౌరులెల్లరును స్త్రీలు, పురుషులు, బాలురు బాలికలు, యువకులు, వృద్ధులును మిక్కిలి ఆనందముతో పొంగిపోయిరి. అందఱును మంగళగీతములను పాడిరి. నానావిధసువర్ణకలశములను అలంకరించిరి. పాకశాస్త్ర ప్రావీణ్యముతో కమ్మని భోజన పదార్థములనుసిద్ధపఱచిరి. జగన్మాతయైన భవానీనివాసనదనమునందలి వంటలరుచులను వర్ణింపనెవరితరము? హిమవంతుడు బ్రహ్మావిష్ణువు మొదలగు దేవతలను అందఱిని సాదరముగా ఆహ్వానించెను. అతిథులు బారులుతీరికూర్చుండియుండగా నిపుణులైనవారు ఆహారపదార్థములను వడ్డించిరి. స్త్రీలు కోమల స్వరములలో సరసోక్తులాడిరి. (చౌ॥ 1-4)

ఛం- గారీఁ మధుర స్వర దేహిఁ సుందరి బింగ్య బచన సునావహీఁ।
భోజను కరహిఁ సుర అతి బిలంబు బినోదు సుని సచు పావహీఁ ॥
జేవఁత జో బఢ్యో అనందు సో ముఖ కోటిహూఁ న పరై కహ్యో।
అచవాఁఇ దీన్హే పాన గవనే బాస జహఁ జాకో రహ్యో ॥

సుందరీమణులు మధురగానములతో వ్యంగ్య ధోరణిలో సరసముగా హాస్యములాడిరి. దేవతలందఱును వాటిని విని, అమితానందముతో నెమ్మది నెమ్మదిగా భుజించిరి. అప్పటివేడుకలను ఆనందములను కోటిగొంతులుగూడ పూర్తిగా వర్ణింపజాలవు. భోజనానంతరము వారు తాంబూలములను సేవించి, తమ తమ విడుదులకు జనిరి. (ఛం॥)

దో- బహురి మునిన్హ హిమవంత కహుఁ, లగన సునాఈ ఆఇ।
సమయ బిలోకి బిబాహ కర, పఠఏ దేవ బోలాఇ ॥ 99 ॥

మునులు హిమవంతునకు లగ్నపత్రికలను చదివి వినిపించిరి. వివాహ ముహూర్తము సమీపించినదని మఱల దేవతలను ఆహ్వానించిరి. (దో॥ 99)

చౌ- బోలి సకల సుర సాదర లీన్హే। సబహి జథోచిత ఆసన దీన్హే ॥
బేదీ బేద బిధాన సఁవారీ। సుభగ సుమంగల గావహిఁ నారీ ॥ 1 ॥
సింఘాసను అతి దిబ్య సుహావా। జాఇ న బరని బిరంచి బనావా ॥
బైఠే సివ బిప్రన్హ సిరు నాఈ। హృదయఁ సుమిరి నిజ ప్రభు రఘురాఈ ॥ 2 ॥
బహురి మునీసన్హ ఉమా బోలాఈఁ। కరి సింగారు సఖీఁ లై ఆఈఁ ॥
దేఖత రూపు సకల సుర మోహే। బరనై ఛబి అస జగ కబి కో హై ॥ 3 ॥
జగదంబికా జాని భవ భామా। సురన్హ మనహిఁ మన కీన్హ ప్రనామా ॥
సుందరతా మరజాద భవానీ। జాఇ న కోటిహుఁ బదన బఖానీ ॥ 4 ॥

హిమవంతుడు సాదరముగా దేవతలనందరిని వివాహవేదికకు ఆహ్వానించి, వారిని ఉచితాసనములపై కూర్చుండబెట్టెను. వేదిక వేదోక్తముగా సిద్ధపఱచబడెను. ముత్తైదువలు కల్యాణ గీతములను పాడిరి. ఒక దివ్యసుందరసింహాసనమును వేదికపై ఏర్పఱచిరి. దానిసౌందర్యము వర్ణనాతీతము. ఏలనన అది బ్రహ్మనిర్మితము. వేదమూర్తులైన బ్రాహ్మణులకు నమస్కరించి, శ్రీరాముని మనసా ధ్యానించి, శివుడాసింహాసనమును అలంకరించెను. పిదప మహర్షులు పార్వతీదేవిని ఆదరముతో ఆహ్వానించిరి. సఖులు ఆమెను అలంకరించి, వెంటబెట్టుకొనివచ్చిరి. ఆమెరూపలావణ్యములకు దేవతలందఱును ముగ్ధులైరి. ఆమెసౌందర్యమును ఎంతటిమహాకవియు వర్ణింపజాలడు. ఆమెను జగన్మాతయైన భవానిగా గుర్తించి దేవతలందఱును మనస్సులలో ప్రణామములాచరించిరి. ఆమె సౌందర్యనిధి. ఆమెరూపరేఖావిలాసములను వర్ణింప ఎవ్వరికిని తరముగాదు. (చౌ॥ 1-4)

ఛం- కోటిహుఁ బదన నహిఁ బనై బరనత జగ జనని సోభా మహా ।
సకుచహిఁ కహత శ్రుతి సేష సారద మందమతి తులసీ కహా ॥
ఛబిఖాని మాతు భవాని గవనీఁ మధ్య మండప సివ జహాఁ ।
అవలోకి సకహిఁ న సకుచ పతి పద కమల మను మధుకరు తహాఁ ॥

జగజ్జనని పార్వతీదేవి సౌందర్యమును వర్ణించుటకు కోటి కంఠములుగ్గూడ చాలవనగా మందమతియైన తులసీదాసు ఎట్లు వర్ణింపగలడు? వేదములు, శేషుడు, సరస్వతీ దేవిగూడ అందుకు చాలరు. సౌందర్యరాశియైన భవానీమాత మండపమునకు వచ్చి, శివుని పాదారవిందములను దర్శించుటకు సిగ్గుపడెను. కాని వాటి మకరందమును ఆమె మనోభ్రమరము గ్రోలెను. (ఛం॥)

దో-ముని అనుసాసన గనపతిహి, పూజేఉ సంభు భవాని ।
కోఉ సుని సంసయ కరై జని, సుర అనాది జియఁ జాని ॥ 100 ॥

మునులఆదేశముప్రకారము శివపార్వతులు మొట్టమొదట మహాగణపతిని పూజించిరి. ఈ పూజావిషయమున ఎవ్వరికిని సందేహము రానక్కర లేదు. ఏలనన దేవతలు అనాది కాలమునుండియు కలరు. (దో॥ 100)

చౌ- జసి బిబాహ కై బిధి శ్రుతి గాఈ । మహామునిన్హ సో సబ కరవాఈ ॥
గహి గిరీస కుస కన్యా పానీ । భవహి సమరపీఁ జాని భవానీ ॥ 1 ॥
పానిగ్రహన జబ కీన్హ మహేసా । హియఁ హరషే తబ సకల సురేసా ॥
బేదమంత్ర మునిబర ఉచ్చరహీఁ । జయ జయ జయ సంకర సుర కరహీఁ ॥ 2 ॥
బాజహిఁ బాజన బిబిధ బిధానా । సుమనబృష్టి నభ భై బిధి నానా ॥
హర గిరిజా కర భయఉ బిబాహూ । సకల భువన భరి రహా ఉఛాహూ ॥ 3 ॥
దాసీఁ దాస తురగ రథ నాగా । ధేను బసన మని బస్తు బిభాగా ॥
అన్న కనకభాజన భరి జానా । దాఇజ దీన్హ న జాఇ బఖానా ॥ 4 ॥

మహర్షులు వేదోక్తపద్ధతిలో వివాహకార్యక్రమమును జరిపించిరి. హిమవంతుడు కుశపాణియై పార్వతీదేవిహస్తమును శివునిచేతిలో నుంచి, వారి 'పాణిగ్రహణ' మహోత్సవమును జరిపెను. ఈ

పాణిగ్రహణమహోత్సవమును దర్శించినదేవతలహృదయములు ఆనందడోలికలలో ఊగెను. మునీశ్వరులు వేదాశీర్వచనమంత్రములను పఠింపగా అక్కడివారందఱును 'జయ-జయ' ధ్వానములు గావించిరి. వివిధవాద్యసంగీతగోష్ఠులు నిర్వహింపబడినవి. ఆకసమునుండీ పుష్పవృష్టి గురిసినది. శివపార్వతులకల్యాణమహోత్సవము సకలలోకములకును ఆనందదాయకమయ్యెను. వరదక్షిణగా దాసదాసీలు, రథములు, గుఱ్ఱములు, ఏనుగులు, ఆవులు, వస్త్రములు, మణులు, వివిధములగుఆహారపదార్థములు, సువర్ణపాత్రలు, మొదలగునవి అన్నియును శివునకు సమర్పింపబడెను.అవి బండ్లపై వారి బసలకు చేర్చబడెను.
(చౌ॥ 1-4)

ఛం- దాఇజ దియో బహు భాఁతి పుని కర జోరి హిమభూధర కహ్యో।
కా దేఉఁ పూరనకామ సంకర చరన పంకజ గహి రహ్యో ॥
సివఁ కృపాసాగర ససుర కర సంతోషు సబ భాఁతిహిఁ కియో ।
పుని గహే పద పాథోజ మయనాఁ ప్రేమ పరిపూరన హియో ॥

అనేకవిధములైన కానుకలను వరదక్షిణగా సమర్పించి, హిమవంతుడు చేతులు జోడించి, యిట్లు పలికెను- "ఓ పరమేశ్వరా! మీరు పూర్ణకాములు, మీకు నేనేమి ఇయ్యగలను?" అని శివుని పాదపద్మములకు ప్రణమిల్లెను. కృపాసాగరుడైన శంకరుడు హిమవంతుని అనేకవిధముల ప్రసన్నునిగా చేసెను. పిమ్మట మేనాదేవియు సంతుష్టాంతరంగయై శివునిపాదములకు మోకరిల్లి ఇట్లనెను.
(ఛం॥)

దో-నాథ ఉమా మమ ప్రాన సమ, గృహకింకరీ కరేహు ।
ఛమేహు సకల అపరాధ అబ, హోఇ ప్రసన్న బరు దేహు ॥ 101 ॥

"ఓ ప్రభూ! నా కుమార్తెయైన ఈ ఉమ నాకు ప్రాణాధిక ప్రియమైనది. మీరు ఈమెను ఇల్లాలుగా సేవకురాలుగా స్వీకరింపుడు. ఈమె అపరాధములను అన్నింటిని మన్నింపుడు. దయతో ప్రసన్నచిత్తులై నాకీవరమును ప్రసాదింపుడు.
(దో॥ 101)

చౌ- బహు బిధి సంభు సాసు సముఝాఈ । గవనీ భవన చరన సిరు నాఈ ।
జననీఁ ఉమా బోలి తబ లీన్హీ । లై ఉఛంగ సుందర సిఖ దీన్హీ ॥ 1 ॥
కరెహు సదా సంకర పద పూజా । నారిధరము పతి దేఉ న దూజా ॥
బచన కహత భరె లోచన బారీ । బహురి లాఇ ఉర లీన్హి కుమారీ ॥ 2 ॥
కత బిధి సృజీఁ నారి జగ మాహీఁ । పరాధీన సపనెహుఁ సుఖు నాహీఁ ॥
భై అతి ప్రేమ బికల మహతారీ । ధీరజు కీన్హ కుసమయ బిచారీ ॥ 3 ॥
పుని పుని మిలతి పరతి గహి చరనా । పరమ ప్రేము కఛు జాఇ న బరనా ॥
సబ నారిన్హ మిలి భేటి భవానీ । జాఇ జనని ఉర పుని లపటానీ ॥ 4 ॥

శివుడామెకు పెక్కురీతుల నచ్చజెప్పెను. ఆమె శివునిపాదములకు నమస్కరించి, 'ఉమ'ను ఒడిలో కూర్చుండ బెట్టుకొని ఇట్లుపదేశించెను. "సర్వదా శంకరునిపాదములను పూజింపుము. ఇదియే స్త్రీ ధర్మము. భార్యకు భర్తయే దైవము"- ఇట్లనుచుండగా ఆమె కన్నులు ప్రేమాశ్రువులతో నిండెను. ఆమె మఱల తన కుమార్తెను గుండెకు హత్తుకొనెను. "విధాత స్త్రీలను ఎందులకు సృజించెను? పరాధీనకు స్వప్నములోగూడ సుఖము ఉండదు గదా!" ఇట్లు పలుకుచు మేనాదేవి ప్రేమ విహ్వలయయ్యెను. కాని దుఃఖించుటకు అది సమయముగాదని ధైర్యమువహించెను. మేనాదేవి మాటిమాటికిని పార్వతీదేవిని కౌగిలించుకొనుచు ఆమెకాళ్లపై బడెను. ఆమెప్రేమ మిక్కిలి ఉత్కృష్టముగానుండెను. అది వర్ణింపనలవిగానిదియై యుండెను. భవాని స్త్రీలందఱికిని వీడ్కోలు చెప్పి, తల్లి అక్కున జేరెను. (చౌ॥ 1-4)

ఛం- జననిహి బహురి మిలి చలీ ఉచిత అసీస సబ కాహూఁ దఈఁ।
ఫిరి ఫిరి బిలోకతి మాతు తన తబ సఖీఁ లై సివ పహిఁ గఈఁ॥
జాచక సకల సంతోషి సంకరు ఉమా సహిత భవన చలే।
సబ అమర హరషే సుమన బరషి నిసాన నభ బాజే భలే॥

పార్వతీదేవి తనతల్లినుండి వీడ్కోలు తీసికొనెను. అందఱుగూడ ఆమెను సముచితముగా ఆశీర్వదించిరి. ఆమె మాటిమాటికిని తల్లివైపు తిరిగి చూడసాగెను. సఖులు ఆమెను శంకరునికడకు చేర్చిరి. శంకరుడు అర్థులను యోగ్యతానుసారముగా తగిన కానుకలతో తృప్తిపఱచి, 'ఉమ'తోగూడి, సపరివారముగా కైలాసమునకేగెను. దేవతలందఱును సంతోషముతో పుష్పవృష్టిని గురిపించిరి. ఆకాశమున నగారాలు మ్రోగెను. (ఛం॥)

దో-చలే సంగ హిమవంతు తబ, పహుఁచావన అతి హేతు।
బిబిధ భాఁతి పరితోషు కరి, బిదా కీన్హ బృషకేతు॥ 102 ॥

హిమవంతుడు అత్యంతప్రేమాదరములతో పార్వతీపరమేశ్వరులను వీడ్కొలుపుటకై వారివెంట వెళ్లెను. శివుడు ఆయునను అన్నివిధముల సాదరవచనములతో సంతృప్తి పఱచి, పంపెను. (దో॥ 102)

చౌ- తురత భవన ఆఏ గిరిరాఈ। సకల సైల సర లిఏ బొలాఈ॥
ఆదర దాన బినయ బహుమానా। సబ కర బిదా కీన్హ హిమవానా॥ 1 ॥
జబహిఁ సంభు కైలాసహిఁ ఆఏ। సుర సబ నిజ నిజ లోక సిధాఏ॥
జగత మాతు పితు సంభు భవానీ। తెహిఁ సింగారు న కహఉఁ బఖానీ॥ 2 ॥
కరహిఁ బిబిధ బిధి భోగ బిలాసా। గనన్హ సమేత బసహిఁ కైలాసా॥
హర గిరిజా బిహార నిత నయఊ। ఏహి బిధి బిపుల కాల చలి గయఊ॥ 3 ॥
తబ జనమేఉ షటబదన కుమారా। తారకు అసురు సమర జెహిఁ మారా॥
ఆగమ నిగమ ప్రసిద్ధ పురానా। షన్ముఖ జన్ము సకల జగ జానా॥ 4 ॥

లేదు." అందులకు భగవంతుడు ఇట్లు పలికెను. "ఓ మహర్షీ! నీవు వెళ్లి, శంకరుని శతనామ(స్తోత్రము)ములను జపింపుము. నీ మనసు కుదుటబడును. శివుడు నాకు అత్యంత ప్రియతముడు. పొరపాటునగూడ నీవు ఈవిషయమును మఱువవలదు. ఓ మునీశ్వరా! శివునికృపకు పాత్రులు కానివారు నా భక్తులు కాజాలరు. దీనిని విశ్వసించి, భూలోకమునచరింపుము. నామాయ నీదరికి చేరదు. (చౌ॥ 1-4)

దో-బహుబిధి మునిహి ప్రబోధి ప్రభు, తబ భఏ అంతరధాన।
సత్యలోక నారద చలే, కరత రామ గున గావ॥ 138 ॥

ఇట్లు అనేకవిధముల నారదుని ఊరడించి, విష్ణువు అంతార్ధానమాయెను. నారదుడు శ్రీరాముని గుణములను కీర్తించుచు సత్యలోకమును చేరెను. (దో॥ 138)

చౌ- హర గన మునిహి జాత పథ దేఖీ। బిగత మోహ మన హరష బిసేషీ॥
అతి సభీత నారద పహిఁ ఆఏ। గహి పద ఆరత బచన సునాఏ॥ 1 ॥
హర గన హమ న బిప్ర మునిరాయా। బడ అపరాధ కీన్హ ఫల పాయా॥
శ్రాప అనుగ్రహ కరహు కృపాలా। బోలే నారద దీనదయాలా॥ 2 ॥
నిసిచర జాఇ హోహు తుమ్హ దోఊ। బైభవ బిపుల తేజ బల హోఊ॥
భుజబల బిస్వ జితబ తుమ్హ జహిఆ। ధరిహహిఁ బిష్ను మనుజ తను తహిఆ॥ 3 ॥
సమర మరన హరి హాథ తుమ్హారా। హోఇహహు ముకుత న పుని సంసారా॥
చలే జుగల ముని పద సిర నాఈ। భఏ నిసాచర కాలహి పాఈ॥ 4 ॥

మోహరహితుడై, ప్రసన్నుడై వచ్చుచున్న నారదమునిని జూచి, శివగణములవారు భయపడుచు వచ్చి, ఆయన పాదములపైబడి దీనులై ప్రార్థించిరి. "మునీశ్వరా! మేము నిజముగా బ్రాహ్మణులము కాము. శివగణములలోనివారము. మీ యెడ మహాపరాధము చేసి, దాని ఫలితమును అనుభవించినాము. కృపాళూ! మమ్ము శాపవిముక్తులను గావింపుడు."- దీనవత్సలుడైన నారదుడు ఇట్లనెను. "మీరు ఇద్దఱును రాక్షసులుగా జన్మించెదరు. మీకు గొప్పఐశ్వర్యము, తేజస్సు, బలము ప్రాప్తించును. మీరు మీ భుజబలములతో విశ్వమును జయించెదరు. అపుడు విష్ణువు మానవావతారమునుదాల్చును. మీరు యుద్ధమున శ్రీహరిచే నిహతులై మోక్షమును పొందెదరు. ఆపై మీకు పునర్జన్మయుండదు." వారు మునికి ప్రణమిల్లి స్వనివాసములకు చేరిరి. కొలది కాలమునకు పిమ్మట వారు రాక్షసులై జన్మించిరి. (చౌ॥ 1-4)

దో-ఏక కలప ఏహి హేతు ప్రభు, లీన్హ మనుజ అవతార।
సుర రంజన సజ్జన సుఖద, హరి భంజన భుబి భార॥ 139 ॥

ఈ కారణమువలననే ఒకకల్పమునందు దేవతలను ప్రసన్నులుగా జేయుటకును, సజ్జనులకు సుఖములను ఇచ్చుటకును, భూభారమును బాపుటకును శ్రీహరి మానవావతారమును దాల్చెను. (దో॥ 139)

చౌ- ఏహి బిధి జనమ కరము హరి కేరే। సుందర సుఖద బిచిత్ర ఘనేరే॥
కలప కలప ప్రతి ప్రభు అవతరహీఁ। చారు చరిత నానాబిధి కరహీఁ॥ 1 ॥

తబ తబ కథా మునీసన్హ గాఈం । పరమ పునీత ప్రబంధ బనాఈం ॥
బిబిధ ప్రసంగ అనూప బఖానే । కరహిం న సుని అచరజు సయానే ॥ 2 ॥
హరి అనంత హరికథా అనంతా । కహహిం సునహిం బహువిధి సబ సంతా ॥
రామచంద్ర కే చరిత సుహాఏ । కలప కోటి లగి జాహిం న గాఏ ॥ 3 ॥
యహ ప్రసంగ మైం కహా భవానీ । హరిమాయాఁ మోహహిం ముని గ్యానీ ॥
ప్రభు కౌతుకీ ప్రనత హితకారీ । సేవత సులభ సకల దుఖ హారీ ॥ 4 ॥

ఈ విధముగా శ్రీహరిజన్మకర్మలు అనేకములు. అవి మనోజ్ఞములు, సుఖదాయకములు, దివ్యములు. ప్రతికల్పమునందును భగవంతుడు అవతారములను దాల్చి, తనదివ్యలీలలను ప్రదర్శించుచుండును. అపుడు మహర్షులు పరమపవిత్రమైనకావ్యములను రచించి, ఆయనచరితములను పెక్కురీతుల వర్ణించుచుందురు. వాటిని వినినవివేకవంతులు సంభ్రమాశ్చర్యములకు లోనగుదురు. శ్రీహరి అనంతుడు. తత్కథలును అనంతములు. సత్పురుషులు వాటిని అనేకవిధముల వినెదరు, వర్ణించెదరు, శ్రీరామచంద్రునిమనోహరగాథను గానముచేయుటకు ఎన్ని కల్పములైనను చాలవు. భవానీ! జ్ఞానులైన మునీశ్వరులుగూడ శ్రీహరిమాయామోహితులగుదురని తెల్పుటకే నీకు నేనీకథను చెప్పితిని. ప్రభువులీలామయుడు, శరణాగతవత్సలుడు, సులభ సేవ్యుడు, అందఱి దుఃఖములను హరించువాడు. (చౌ॥ 1-4)

సో- సుర నర ముని కోఉ నాహీం, జెహి న మోహ మాయా ప్రబల ।
అస బిచారి మన మాహీం, భజిఅ మహామాయా పతిహి ॥ 140 ॥

దేవతలు, మునులు, మానవులలో శ్రీహరిమాయకు లోనుకానివారు ఎవ్వరును లేరు. ఈ విషయమును గ్రహించి, మాయాధీశుడైన భగవంతుని పాదపద్మములను భజింపవలెను. (సో॥ 140)

## శతరూపాస్వాయంభువమనువుల వృత్తాంతము

చౌ- అపర హేతు సును సైలకుమారీ । కహఉఁ బిచిత్ర కథా బిస్తారీ ॥
జెహి కారన అజ అగున అరూపా । బ్రహ్మ భయఉ కోసలపుర భూపా ॥ 1 ॥
జో ప్రభు బిపిన ఫిరత తుమ్హ దేఖా । బంధు సమేత ధరేం మునిబేషా ॥
జాసు చరిత అవలోకి భవానీ । సతీ సరీర రహిహు బౌరానీ ॥ 2 ॥
అజహుఁ న ఛాయా మిటతి తుమ్హారీ । తాసు చరిత సును భ్రమ రుజ హారీ ॥
లీలా కీన్హి జో తెహిం అవతారా । సో సబ కహిహఉఁ మతి అనుసారా ॥ 3 ॥
భరద్వాజ సుని సంకర బానీ । సకుచి సప్రేమ ఉమా ముసుకానీ ॥
లగే బహురి బరనై బృషకేతూ । సో అవతార భయఉ జెహి హేతూ ॥ 4 ॥

ఓ పార్వతీ! భగవానుడు శ్రీరాముడుగా అవతరించుటకు మఱియొక కారణముగూడ గలదు. అజుడు, నిర్గుణుడు, నిరాకారుడైన భగవంతుడు అయోధ్యాపతిగా ఏల అవతరించెనో సవిస్తరముగా తెల్పెదను, వినుము. మునివేషధారియై తన సోదరునితోగూడి తిరుగుచుండగా ఆ ప్రభువునే పూర్వ జన్మలో నీవు చూచితివి. అతని

లీలలను జూచి, సతీ రూపమున నీవు భ్రమకు లోనయితివి. నేటికిని ఆ భ్రమనీడ నిన్నువీడలేదు. ఆ భ్రమజాడ్యమును రూపుమాపు శ్రీరామచరితమును వినుము. ఆ అవతారమున ప్రభువుచూపినలీలలను నా శక్త్యనుసారము వర్ణించెదను. (యాజ్ఞవల్క్యుడు పలుకుచున్నాడు) భరద్వాజా! శంకరుని వచనములను విని ఉమాదేవి బిడియముతో ఒక చిఱునవ్వు నవ్వెను. భగవంతుని అవతార కారణములను వృషకేతుడైన శివుడు వర్ణింప సాగెను. (చౌ॥ 1-4)

దో-సో మైం తుమ్హ సన కహఉఁ సబు, సును మునీస మన లాఇ।
రామ కథా కలిమల హరని, మంగల కరని సుహాఇ ॥ **141** ॥

ఓ భరద్వాజా! ఆ విషయమునంతయును నేను చెప్పెదను మునీశ్వరా! సావధానముగా వినుడు. శ్రీరాముని చరితము కలిపాపములను నశింప జేయును. అది మనోజ్ఞము, మంగళ ప్రదము. (దో॥ 141)

చౌ- స్వాయంభూ మను అరు సతరూపా। జిన్హ తేఁ భై నరసృష్టి అనూపా ॥
దంపతి ధరమ ఆచరన నీకా। అజహుఁ గావ శ్రుతి జిన్హ కై లీకా ॥ 1 ॥
నృప ఉత్తానపాద సుత తాసూ। ధ్రువ హరిభగత భయఉ సుత జాసూ ॥
లఘు సుత నామ ప్రియబ్రత తాహీ। బేద పురాన ప్రసంసహిఁ జాహీ ॥ 2 ॥
దేవహూతి పుని తాసు కుమారీ। జో ముని కర్దమ కై ప్రియ నారీ ॥
ఆదిదేవ ప్రభు దీనదయాలా। జఠర ధరేఉ జెహిఁ కపిల కృపాలా ॥ 3 ॥
సాంఖ్య సాస్త్ర జిన్హ ప్రగట బఖానా। తత్త్వ బిచార నిపున భగవానా ॥
తెహిఁ మను రాజ కీన్హ బహు కాలా। ప్రభు ఆయసు సబ బిధి ప్రతిపాలా ॥ 4 ॥

ఈ మానవ జాతియంతయును స్వాయంభువమనువు-శతరూప అనుదంపతుల సంతతి. వీరు మిక్కిలి ధర్మాచరణపరులని వేదములు స్తుతించుచున్నవి. వీరి కుమారుడు ఉత్తానపాదుడు. అతని కుమారుడు హరిభక్తుడైన ధ్రువుడు. మనువు యొక్క చిన్న కుమారుడైన ప్రియవ్రతుని వేదపురాణములు ప్రశంసించినవి. వారి (ఆ దంపతుల) కుమార్తె దేవహూతి. ఆమెభర్త కర్దముడు. ఈ పుణ్యదంపతులకు కపిలుడు ఉదయించెను. అతడు ఆదిదేవుడు, సమర్థుడు, దీనదయాళువు. కపిలభగవానుడు సాంఖ్య తత్త్వమును విశదముగా ప్రతిపాదించెను. అతడు తత్త్వవిచారణలో అత్యంతకుశలుడు. ఈ స్వాయంభువమనువు చాలాకాలము భగవదాజ్ఞానుసారము రాజ్యపాలనమొనర్చెను. (చౌ॥ 1-4)

సో- హోఇ న బిషయ బిరాగ, భవన బసత భా చౌథపన।
హృదయఁ బహుత దుఖ లాగ, జనమ గయఉ హరిభగతి బిను ॥ **142** ॥

అతడిట్లు (మనువు) తలంచెను. "జీవితము యొక్క చరమ (చతుర్థ)దశ యైన ముసలితనము మీద బడినది. ఇంకను గృహస్థ-ఆశ్రమములోనే యున్నాను. విషయవిరక్తి కలుగలేదు. హరిభక్తి రహితముగా నా జీవితము వ్యర్థముగా గడిచినది''. అని తలచి మిక్కిలి దుఃఖితుడాయెను. (సో॥ 142)

చౌ- బరబస రాజ సుతహి తబ దీన్హా। నారి సమేత గవన బన కీన్హా ॥
తీరథ బర నైమిష బిఖ్యాతా। అతి పునీత సాధక సిధి దాతా ॥ 1 ॥

బసహిఁ తహాఁ ముని సిద్ధ సమాజా । తహఁ హియఁ హరషి చలేఉ మను రాజా ॥
పంథ జాత సోహహిఁ మతిధీరా । గ్యాన భగతి జను ధరేఁ సరీరా ॥ 2 ॥
పహుంచే జాఇ ధేనుమతి తీరా । హరషి నహానే నిరమల నీరా ॥
ఆఏ మిలన సిద్ధ ముని గ్యానీ । ధరమ ధురంధర నృపరిషి జానీ ॥ 3 ॥
జహఁ జహఁ తీరథ రహే సుహాఏ । మునిన్హ సకల సాదర కరవాఏ ॥
కృస సరీర మునిపట పరిధానా । సత సమాజ నిత సునహిఁ పురానా ॥ 4 ॥

మనువు తనకుమారునకు రాజ్యభారమునప్పగించి, భార్యతోగూడి వనములకేగెను. నైమిశారణ్యము పుణ్యతీర్థములలో ప్రసిద్ధిగాంచినది. అది సాధకులకు సిద్ధిప్రదాత. అచ్చట మునులు సిద్ధులు నివసించుచుండిరి. వారినిజూచి మనువు ప్రసన్నుడాయెను. ఆ దంపతులు ఆ మార్గమున నడచుచుండగా జ్ఞానము భక్తి సశరీరములై సంచరించుచున్నట్లుండెను. వారు గోమతీతీరమునకు చేరి అనదీజలములలో స్నానములనాచరించిరి. అతనిని ధర్మాత్ముడైన రాజర్షిగా గుర్తించి, సిద్ధులు, మునులు, జ్ఞానులు ఆయనను కలిసికొనుటకు వచ్చిరి. మునులతోగూడి వారు (ఆ దంపతులు) సర్వతీర్థములను సేవించిరి. వారి శరీరములు కృశించినవి. వారు జటావల్కలధారులై సజ్జనులకడ పురాణశ్రవణము చేయుచుండిరి. (చౌ॥ 1-4)

దో-ద్వాదస అచ్ఛర మంత్ర పుని, జపహిఁ సహిత అనురాగ ।
బాసుదేవ పద పంకరుహ, దంపతి మన అతి లాగ ॥ 143 ॥

మంత్రరాజమైన ద్వాదశాక్షరీమంత్రమును (ఓమ్ నమో భగవతే వాసుదేవాయ) భక్తితో జపించుచుండిరి. ఆ రాజదంపతులు భగవంతుడైన వాసుదేవునిచరణకమలములయందు మనస్సులను లగ్నము చేసిరి. (దో॥ 143)

చౌ- కరహిఁ అహార సాక ఫల కందా । సుమిరహిఁ బ్రహ్మ సచ్చిదానందా ॥
పుని హరి హేతు కరన తప లాగే । బారి అధార మూల ఫల త్యాగే ॥ 1 ॥
ఉర అభిలాష నిరంతర హోఈ । దేఖిఅ నయన పరమ ప్రభు సోఈ ॥
అగున అఖండ అనంత అనాదీ । జెహి చింతహిఁ పరమారథబాదీ ॥ 2 ॥
నేతి నేతి జెహి బేద నిరూపా । నిజానంద నిరుపాధి అనూపా ॥
సంభు బిరంచి బిష్ను భగవానా । ఉపజహిఁ జాసు అంస తేఁ నానా ॥ 3 ॥
ఐసెఉ ప్రభు సేవక బస అహఈ । భగత హేతు లీలాతను గహఈ ॥
జౌఁ యహ బచన సత్య శ్రుతి భాషా । తౌ హమార పూజిహి అభిలాషా ॥ 4

వారు కేవలము కూరగాయలు, ఫలములు, కందమూలములు మాత్రమే భుజించుచు, సచ్చిదానందస్వరూపుడైన పరబ్రహ్మను స్మరింపసాగిరి. క్రమక్రమముగా ఫలమూలాదులను కూడ త్యజించి, నీటిని మాత్రమే స్వీకరించుచు శ్రీహరినిగూర్చి తపస్సు చేసిరి. నిరంతరము వారిలో ప్రభు దర్శనాభిలాషయే మెదలుచుండెను. ఆ పరమాత్మ నిర్గుణుడు, అఖండుడు, అనంతుడు, అనాది. బ్రహ్మజ్ఞులు ఆయనను నిరంతరము స్మరించుచుందురు. 'నేతినేతి' వచనములతో వేదములు ఆపరమాత్మను నిరూపించుచున్నవి. ఆయనఅంశనుండియే అసంఖ్యాకులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఆవిర్భవించిరి. అట్టి ఆనంద స్వరూపుడు, ఉపాధిరహితుడు,

అసమానుడువైన పరబ్రహ్మను వారు (ఆ దంపతులు) ప్రత్యక్షముగా చూడగోరిరి. శక్తిశాలియు, సమర్థుడును ఐన ప్రభువు తన భక్తులకువశుడై లీలాశరీరములను ధరించి, వారికి దర్శనమిచ్చుచుండును. "వేదములలో పేర్కొనబడిన వైవిషయములన్నియు సత్యములైనచో మాకోర్కెలు తప్పక సఫలములగును." (చౌ॥ 1-4)

దో-ఏహి బిధి బీతే బరష షట, సహస బారి ఆహార।
సంబత సప్త సహస్ర పుని, రహే సమీర అధార ॥ **144** ॥

ఈ విధముగా భావించుచు, కేవలము నీటిని మాత్రమే ఆహారముగా గొనుచు, ఆఱు వేల సంవత్సరములు వారు జీవించిరి. తరువాత ఏడు వేల సంవత్సరముల కాలము వాయు భక్షణముతో కాలము గడిపిరి. (దో॥ 144)

చౌ- బరష సహస దస త్యాగేఉ సోఊ। ఠాఢే రహే ఏక పద దోఊ ॥
బిధి హరి హర తప దేఖి అపారా। మను సమీప ఆఏ బహు బారా ॥ 1 ॥
మాగహు బర బహు భాఁతి లోభాఏ। పరమ ధీర నహిఁ చలహిఁ చలాఏ ॥
అస్థిమాత్ర హోఇ రహే సరీరా। తదపి మనాగ మనహిఁ నహిఁ పీరా ॥ 2 ॥
ప్రభు సర్బగ్య దాస నిజ జానీ। గతి అనన్య తాపస నృప రానీ ॥
మాగు మాగు బరు భై నభ బానీ। పరమ గభీర కృపామృత సానీ ॥ 3 ॥
మృతక జిఆవని గిరా సుహాఈ। శ్రవన రంధ్ర హోఇ ఉర జబ ఆఈ ॥
హృష్టపుష్ట తన భఏ సుహాఏ। మానహుఁ అబహిఁ భవన తే ఆఏ ॥ 4 ॥

అనంతరము పది వేల సంవత్సరములు వాయుభక్షణమునుగూడమాని, ఒంటికాలిపై నిలబడి తపమాచరించిరి. వారిఅపారతపశ్చర్యను గాంచి (త్రిమూర్తులు) బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ప్రత్యక్షమై, వారిని వరములను కోరుకొమ్మనిరి. కానివారు ఎట్టి ప్రలోభములకును లోనుకాలేదు. వరములను కోరుకొనలేదు. వారిశరీరములు అస్థిపంజరములుగామిగిలినను వారి మనస్సులు మాత్రము నిశ్చలముగానుండెను. సర్వజ్ఞుడైన భగవంతుడు వారిని తనఅనన్యభక్తులుగా గుర్తించెను. ఆకాశమునుండి "వరమును కోరుకొనుము"అను అమృతతుల్యమైన వాణి వినిపించెను. మృతులను గూడ సజీవులనుగా జేయు ఈ అమృతవచనము వారి హృదయములకు చేరెను. వెంటనే వారి శరీరములు సర్వాంగ శోభితములై, అప్పుడే రాజభవనములనుండి విచ్చేసినట్లు భాసించెను. (చౌ॥ 1-4)

దో-శ్రవన సుధా సమ బచన సుని, పులక ప్రఫుల్లిత గాత।
బోలే మను కరి దండవత, ప్రేమ న హృదయఁ సమాత॥ **145** ॥

అమృతప్రాయమైనఆకాశవాణి చెవులబడినంతనే వారితనువులు పులకించెను. హృదయములయందు ప్రేమ పొంగిపొరలగా ఆ దంపతులు సాష్టాంగదండప్రణామములను ఆచరించి, ఇట్లు పల్కిరి. (దో॥ 145)

చౌ- సును సేవక సురతరు సురధేనూ। బిధి హరి హర బందిత పద రేనూ ॥
సేవత సులభ సకల సుఖ దాయక। ప్రనతపాల సచరాచర నాయక ॥ 1 ॥

జౌ౯ అనాథ హిత హమ పర నేహా। తౌ ప్రసన్న హోఁ౯ యహ బర దేహా ॥
జో సరూప బస సివ మన మాహీం। జెహి కారన ముని జతన కరాహీం ॥ 2 ॥
జో భుసుండి మన మానస హంసా। సగున అగున జెహి నిగమ ప్రసంసా ॥
దేఖహిం హమ సో రూప భరి లోచన। కృపా కరహు ప్రనతారతి మోచన ॥ 3 ॥
దంపతి బచన పరమ ప్రియ లాగే। మృదుల బినీత ప్రేమ రస పాగే ॥
భగత బఛల ప్రభు కృపానిధానా। బిస్వబాస ప్రగటే భగవానా ॥ 4 ॥

ఆశ్రయించిన (సేవించు) వారికి కల్పతరువు, కామధేనువు ఐన హే ప్రభో! బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగూడ నీ పాదరేణువులను సేవింతురు. సేవించు వారికి నీవు సులభుడవు, సుఖ ప్రదాతవు, శరణాగతవత్సలుడవు. ఈ చరాచర సృష్టికి స్వామివి. ఓ అనాథనాథా! మాపై కృపజూపి మాకొక వరమునిమ్ము. నీ రూపమును పరమశివుడు తనహృదయములో నిరంతరము ధ్యానించుచుండును. మునులు సర్వదా దానిని దర్శించుటకు ఉవ్విళ్ళూరుచుందురు. నీ రూపము భుశుండిమానససరోవరమునందు విహరించెడిహంస. నిన్ను సగుణనిర్గుణ బ్రహ్మముగా వేదములు ప్రస్తుతించును. శరణాగతులదుఃఖములను దూరము చేయునట్టి నీరూపమును నేత్రపర్వముగా మాకు ప్రత్యక్షమొనర్పుము. కోమలములు, వినయశోభితములు, ప్రేమరససిక్తములు ఐన ఆ దంపతుల వచనములతో భగవానుడు సంతుష్టుడాయెను. భక్తవత్సలుడు, సర్వవ్యాపి, కృపాళువు, సర్వసమర్థుడైన ఆ పరమాత్మ వారికి ప్రత్యక్షమాయెను. (చౌ॥ 1-4)

దో- నీల సరోరుహ నీల మని, నీల నీరధర స్యామ।
లాజహిం తన సోభా నిరఖి, కోటి కోటి సత కామ ॥ 146 ॥

నీలకమలమువలె కోమలము, నీలమణివలె దేదీప్యమానము, నీల మేఘమువలె సరసము అగు పరమాత్ముని ఆ నీల దేహశోభలను గాంచి, కోటి మన్మథులు గూడ లజ్జితులగుదురు. (దో॥ 146)

చౌ- సరద మయంక బదన ఛబి సీంవా। చారు కపోల చిబుక దర గ్రీవా ॥
అధర అరున రద సుందర నాసా। బిధు కర నికర బినిందక హాసా ॥ 1 ॥
నవ అంబుజ అంబక ఛబి నీకీ। చితవని లలిత భావంతీ జీ కీ ॥
భృకుటి మనోజ చాప ఛబి హారీ। తిలక లలాట పటల దుతికారీ ॥ 2 ॥
కుండల మకర ముకుట సిర భ్రాజా। కుటిల కేస జను మధుప సమాజా ॥
ఉర శ్రీబత్స రుచిర బనమాలా। పదిక హార భూషన మనిజాలా ॥ 3 ॥
కేహరి కంధర చారు జనేఊ। బాహు బిభూషన సుందర తేఊ ॥
కరి కర సరిస సుభగ భుజదండా। కటి నిషంగ కర సర కోదండా ॥ 4 ॥

శరచ్చంద్రునివంటి అపారముఖసౌందర్యము, చెక్కిళ్లమిలమిలలు, చిబుకపు సోయగములు, శంఖమువలెగళము, ఎఱ్ఱనిపెదవులు, మనోహరములైన దంతములు, చూడముచ్చటైన నాసిక, వెన్నెలవంటి చిఱునవ్వు, వికసించిన పద్మములవంటి కన్నులు, ఆకర్షణీయములైన చూపులునుగల ఆ పరమాత్ముని రూపము

మిక్కిలి మనోజ్ఞముగా నుండెను. మన్మథుని ధనుస్సును తల దన్ను కనుబొమలు, లలాటతిలకశోభలు, చెవులవ్రేలాడుమకరకుండలములు, శిరముపై నిగనిగలాడు కిరీటము, తుమ్మెదలబోలు ముంగురులు, చూచువారినిసమ్మోహపఱచుచుండెను. వక్షముపై శ్రీవత్సము, సుందరవనమాల, రత్నఖచిత హారములు, మణులుపొదిగినఆభరణములు అత్యంత శోభాయమానముగా నుండెను. సింహమువంటి బలిష్ఠమైనస్కంధముపై పవిత్రయజ్ఞోపవీతము వ్రేలాడుచుండెను. ఏనుగు తొండములవలె బలిష్ఠములైన భుజములపై అందమైన భుజకీర్తులు, మూపు పై భాగమున తూణీరము, చేతులయందు ధనుర్బాణములుగల అత్యంతరమణీయరూపమును వారు దర్శించిరి. (చౌ॥ 1-4)

దో-తడిత బినిందక పీత పట, ఉదర రేఖ బర తీని।
నాభి మనోహర లేతి జను, జమున భవఁర ఛబి ఛీని॥ **147** ॥

విద్యుత్కాంతులను అధఃకరించు పీతాంబరము, ఉదరముపై అందమైన త్రివళులు, యమునా జలముల ఆవృతము (సుడు)ల యొక్క గాంభీర్యమును తిరస్కరించు నాభిసొంకము అతి మనోహరముగా ఉండెను. (దో॥ 147)

చౌ- పద రాజీవ బరని నహిఁ జాహీఁ। ముని మన మధుప బసహిఁ జెన్హ మాహీఁ॥
బామ భాగ సోభతి అనుకూలా। ఆదిసక్తి ఛబినిధి జగమూలా॥ **1** ॥
జాసు అంస ఉపజహిఁ గునఖానీ। అగనిత లచ్ఛి ఉమా బ్రహ్మానీ॥
భృకుటి బిలాస జాసు జగ హోఈ। రామ బామ దిసి సీతా సోఈ॥ **2** ॥
ఛబిసముద్ర హరి రూప బిలోకీ। ఏకటక రహే నయన పట రోకీ॥
చితవహిఁ సాదర రూప అనూపా। తృప్తి న మానహిఁ మను సతరూపా॥ **3** ॥
హరష బిబస తన దసా భులానీ। పరే దండ ఇవ గహి పద పానీ॥
సిర పరసే ప్రభు నిజ కర కంజా। తురత ఉఠాఏ కరునాపుంజా॥ **4** ॥

సర్వదా మునీశ్వరుల మనస్సులనెడి తుమ్మెదలు విహరించు ఆ చరణకమలములసౌందర్యములు వర్ణనాతీతములు. అనుకూలవతి సౌందర్యరాశి, జగన్మాత, ఆది శక్తియైన సీతాదేవి ఆ స్వామి వామభాగమున అలరారుచుండెను. ఆ సీతామాత అంశనుండియే ఉమా లక్ష్మి సరస్వతులు ఉద్భవింతురు. ఆమె కనుసన్నల మాత్రమున జగత్సృష్టికార్యము జరుగుచుండును. మనువు శతరూపలు శ్రీహరి యొక్క అనంత రూప సౌందర్యవైభవమును కన్నులార చూచుచునే యుండిరి. ఎంత చూచినను తనివిదీరని ఆ దివ్యాకృతివిగాంచి వారిహృదయములు ఆనందసాగరమున ఓలలాడెను. ఆ పరమానంద పారవశ్యములో వారు శరీరస్మృతినిగూడ వీడిరి. పిమ్మట సాష్టాంగదండప్రణామములనాచరించి, శ్రీహరి పాదములను విడువక పట్టుకొనిరి. కరుణామయుడైన శ్రీహరి వారిశిరస్సులను తాకి, తనకర కమలములతో వారిని లేవనెత్తెను. (చౌ॥ 1-4)

దో- బోలే కృపానిధాన పుని, అతి ప్రసన్న మొహి జాని।
మాగహు బర జోఇ భావ మన, మహాదాని అనుమాని॥ **148** ॥

కృపానిధియైన శ్రీహరి ఇట్లు పలికెను. "నేను అత్యంతము ప్రసన్నుడనైతిని. మీరుకోరిన వరమును ఇచ్చెదను. నన్ను మహాదాతగా భావించి, కోరుకొనుడు". (దో॥ 148)

చౌ- సుని ప్రభు బచన జోరి జుగ పానీ। ధరి ధీరజు బోలీ మృదు బానీ ॥
నాథ దేఖి పద కమల తుమ్హారే। అబ పూరే సబ కామ హమారే ॥ 1 ॥
ఏక లాలసా బడి ఉర మాహీం। సుగమ అగమ కహి జాతి సో నాహీం ॥
తుమ్హహి దేత అతి సుగమ గోసాఈం। అగమ లాగ మోహి నిజ కృపనాఈం ॥ 2 ॥
జథా దరిద్ర బిబుధతరు పాఈ। బహు సంపతి మాగత సకుచాఈ ॥
తాసు ప్రభాఉ జాన నహిం సోఈ। తథా హృదయం మమ సంసయ హోఈ ॥ 3 ॥
సో తుమ్హ జానహు అంతరజామీ। పురవహు మోర మనోరథ స్వామీ ॥
సకుచ బిహాఇ మాగు నృప మోహీ। మోరేం నహిం అదేయ కఛు తోహీ ॥ 4 ॥

ప్రభువచనములను విని, ఆ దంపతులు అంజలిఘటించి, ధైర్యము వహించి, యిట్లనిరి. "ఓ ప్రభూ! మీ చరణకమలములదర్శనముతోడనే మా కోరికలన్నియు తీరినవి. ఐనను ఒక తీరనికోరిక మిగిలియున్నది. అది సుసాధ్యమో? కష్టసాధ్యమో? మేమెఱుగము. దయామయులైన మీరు ఇచ్చుటకు సమర్థులు. కాని కృపణులమైన మేము పొందుట కష్ట సాధ్యముగా తోచును. దరిద్రుడు కల్పతరువును గాంచి, సంపదలను కోరుకొనుటకు సంకోచించును. ఏలనన అతడు దాని మహిమను ఎఱుగడు. అట్లే మాహృదయములుగూడ సంకోచించుచున్నవి. స్వామీ! నీవు అంతర్యామివి. మా కోరికను నీ వెఱుగుదువు. కావున దానిని నీవు మాకు ప్రసాదింపుము." - భగవంతుడు మఱల ఇట్లు పలికెను. "రాజా! సంకోచపడక, మీకోరికను అడుగుడు. మీరేదడిగినను నేను ఇయ్యగలను". (చౌ॥ 1-4)

దో- దాని సిరోమని కృపానిధి, నాథ కహఉం సతిభాఉ।
చాహఉం తుమ్హహి సమాన సుత, ప్రభు సన కవన దురాఉ ॥ 149 ॥

మనువు పలికెను. "ఓ మహాదాతా! దయాసాగరా! స్వామీ! నామనస్సులోగల నిజమైన కోరికను తెలిపెదను. నీ యొద్ద దాచవలసినది ఏముండును? నీ వంటి పుత్రుని ప్రసాదింపుము.-" (దో॥ 149)

చౌ- దేఖి ప్రీతి సుని బచన అమోలే। ఏవమస్తు కరునానిధి బోలే ॥
ఆపు సరిస ఖోజౌం కహం జాఈ। నృప తవ తనయ హోబ మైం ఆఈ ॥ 1 ॥
సతరూపహి బిలోకి కర జోరేం। దేబి మాగు బరు జో రుచి తోరేం ॥
జో బరు నాథ చతుర నృప మాగా। సోఇ కృపాల మోహి అతి ప్రియ లాగా ॥ 2 ॥
ప్రభు పరంతు సుఠి హోతి ఢిఠాఈ। జదపి భగత హిత తుమ్హహి సోహాఈ ॥
తుమ్హ బ్రహ్మాది జనక జగ స్వామీ। బ్రహ్మ సకల ఉర అంతరజామీ ॥ 3 ॥

అస సముఝుత మన సంసయ హోఈ । కహా జో ప్రభు ప్రవాన పుని సోఈ ॥
జే నిజ భగత నాథ తవ అహహీం । జో సుఖ పావహిం జో గతి లహహీం ॥ 4 ॥

ఆరాజు (మనువు) యొక్క అనన్యభక్తిని జూచి, ఆతని అనర్ఘవచనములను విని, దయానిధియైన ప్రభువు ఇట్లనెను. "అట్లే కానిమ్ము రాజా! నా వంటివానిని ఎక్కడని వెదకగలను? కావున నేనే మీకు పుత్రుడుగా జన్మించెదను."- చేతులు జోడించి నమస్కరించిన శతరూపాదేవితో ప్రభువు ఇట్లనెను. దేవీ! నీకోరిక ఏమి? అడుగుము"- శతరూపాదేవి పలికెను. "ప్రభూ! కృపాళూ! చతురుడైన రాజుయొక్క కోరికయే నా కోరిక. కాని ప్రభూ! నా ధృష్టత్వమును క్షమింపుము. నాకు మఱియొక కోరిక గలదు. నీవు భక్తవత్సలుడవు. బ్రహ్మాదిదేవతలకు తండ్రివి. లోకరక్షకుడవు. అంతర్యామివి. పరబ్రహ్మవు. ఇట్టి మీ ప్రభావమును జూచి నాకు సంకోచము గలుగుచున్నది. కాని మీరు పలికినదే సత్యము. మీ పరమ భక్తులు ఏ అలౌకిక దివ్యసుఖములను అనుభవించి, పరమగతిని పొందెదరో,-
(చౌ॥ 1-4)

దో- సోఇ సుఖ సోఇ గతి సోఇ భగతి, సోఇ నిజ చరన సనేహు ।
సోఇ బిబేక సోఇ రహని ప్రభు, హమహి కృపా కరి దేహు ॥ 150 ॥

అదే దివ్యానందమును, పరమగతిని, మీపాదపద్మములపై భక్తి విశ్వాసములను, వివేకమును, విశిష్ట జీవితమును మాకు దయతో ప్రసాదింపుడు.
(దో॥ 150)

చౌ- సుని మృదు గూఢ రుచిర బర రచనా । కృపాసింధు బోలే మృదు బచనా ॥
జో కఛు రుచి తుమ్హరే మన మాహీం । మైం సో దీన్హ సబ సంసయ నాహీం ॥ 1 ॥
మాతు బిబేక అలౌకిక తోరేం । కబహుం న మిటిహి అనుగ్రహ మోరేం ॥
బంది చరన మను కహేఉ బహోరీ । అవర ఏక బినతీ ప్రభు మోరీ ॥ 2 ॥
సుత బిషఇక తవ పద రతి హోఊ । మోహి బడ మూఢ కహై కిన కోఊ ॥
మని బిను ఫని జిమి జల బిను మీనా । మమ జీవన తిమి తుమ్హహి అధీనా ॥ 3 ॥
అస బరు మాగి చరన గహి రహేఊ । ఏవమస్తు కరునానిధి కహేఊ ॥
అబ తుమ్హ మమ అనుసాసన మానీ । బసహు జాఇ సురపతి రజధానీ ॥ 4 ॥

కోమలములు, గూఢములు, మనోహరములు ఐన ఆ శతరూపాదేవివచనములు విని, కృపాసింధువైన భగవానుడు మృదుమధురముగా ఇట్లు పలికెను. "మీ మనస్సులలోనున్న కోరికలనన్నింటిని నేను వరములుగా ఇచ్చితిని. సందేహము వలదు. తల్లీ! నా కృపవలన మీ అలౌకికవివేకము చెక్కుచెదరదు."- మఱల మనువు భగవంతునిపాదములకు మ్రొక్కి యిట్లు పలికెను- "ప్రభూ! నాది మఱియొక్క విన్నపము. నన్ను ఎవ్వరైనను పరమమూర్ఖునిగా భావింపవచ్చును. మీ చరణములపై నాకుగలప్రేమ ఒక కుమారునిపైతండ్రికిగల ప్రేమవలె నుండవలెను. ఇదియే నా కోరిక. మణిలేకుండా పాము, నీరులేకుండ చేప నిలువ లేనట్లు మీరు లేకుండ నేను ఉండజాలను." ఇట్టి వరమును గోరి మనువు మఱల ప్రభువునకు పాదాభివందనమును జేసెను. కరుణానిధియైనప్రభువు. "అట్లేయగు గాక" ఇప్పుడు మీరు నా ఆజ్ఞను పాలింపుడు. దేవేంద్రుని రాజధానియైన అమరావతియందు వసింపుడు.
(చౌ॥ 1-4)

సో- తహఁ కరి భోగ బిసాల, తాత గఏఁ కఛు కాల పుని ।
హోఇహహు అవధ భుఆల, తబ మైఁ హోబ తుమ్హార సుత ॥ 151 ॥

నాయనా! అక్కడ కొలదికాలము సుఖములను అనుభవించిన పిదప, నీవు అయోధ్యాపతివై జన్మించెదవు. అప్పుడు నేను నీ కుమారుడనగుదును. (సో॥ 151)

చౌ- ఇచ్ఛామయ నరబేష సఁవారేఁ । హోఇహఉఁ ప్రగట నికేత తుమ్హారేఁ ॥
అంసన్హ సహిత దేహ ధరి తాతా । కరిహఉఁ చరిత భగత సుఖదాతా ॥ 1 ॥
జే సుని సాదర నర బడభాగీ । భవ తరిహహిఁ మమతా మద త్యాగీ ॥
ఆదిసక్తి జెహిఁ జగ ఉపజాయా । సోఉ అవతరిహి మోరి యహ మాయా ॥ 2 ॥
పురఉబ మైఁ అభిలాష తుమ్హారా । సత్య సత్య పన సత్య హమారా ॥
పుని పుని అస కహి కృపానిధానా । అంతరధాన భఏ భగవానా ॥ 3 ॥
దంపతి ఉర ధరి భగత కృపాలా । తెహిఁ ఆశ్రమ నివసే కఛు కాలా ॥
సమయ పాఇ తను తజి అనయాసా । జాఇ కీన్హ అమరావతి బాసా ॥ 4 ॥

ఇచ్ఛాపూర్వకముగ మానవరూపమునుదాల్చి నేను నీయింట జన్మించెదను. నాయనా! నా అంశలన్నింటితో మానవ దేహమును ధరించి, భక్తులకు ఆనందము గూర్చుగాథను నడుపుదును. ఈ కథలను భాగ్యశాలురు భక్తిశ్రద్ధలతో విని, మమతాగర్వములనుత్యజించి, భవసాగరమును దాటుదురు. జగదుత్పత్తికి కారణము, ఆదిశక్తియు ఐన ఈమాయగూడ అవతారమును ఎత్తును. నేను నీ మనోరథములను అన్నింటిని పూర్తిచేయుదును. ఇది ముమ్మాటికిని సత్యము." అని దయానిధి యైన భగవానుడు అంతర్ధానమాయెను. ఆ దంపతులు కొలదికాలము ఆ ఆశ్రమములో భక్తజనమందారమైన ఆ భగవంతునిమూర్తిని హృదయములలో ధ్యానించుచు గడిపిరి. తరువాత సహజముగా అనాయాసముగ దేహత్యాగము చేసి, దేవరాజధానియైన అమరావతిని జేరిరి. (చౌ॥ 1-4)

దో-యహ ఇతిహాస పునీత అతి, ఉమహి కహీ బృషకేతు ।
భరద్వాజ సును అపర పుని, రామ జనమ కర హేతు ॥ 152 ॥

(యాజ్ఞవల్క్యుడు చెప్పుచున్నాడు.) భరద్వాజా! పరమ పవిత్రమైన ఈ కథను శివుడు పార్వతికి వినిపించెను. శ్రీ రాముని అవతారమునకు మఱియొక కారణము గూడ గలదు, వినుము. (దో॥ 152)

మాసపారాయణము - ఐదవ విరామము

## ప్రతాపభానుని ఉదంతము

చౌ- సును ముని కథా పునీత పురానీ । జో గిరిజా ప్రతి సంభు బఖానీ ॥
బిస్వ బిదిత ఎక కైకయ దేసూ । సత్యకేతు తహఁ బసఇ నరేసూ ॥ 1 ॥
ధరమ ధురంధర నీతి నిధానా । తేజ ప్రతాప సీల బలవానా ॥
తెహి కేఁ భఏ జుగల సుత బీరా । సబ గున ధామ మహా రనధీరా ॥ 2 ॥

రాజ ధనీ జో జేఠ సుత ఆహీ । నామ ప్రతాపభాను అస తాహీ ॥
అపర సుతహి అరిమర్దన నామా । భుజబల అతుల అచల సంగ్రామా ॥ 3 ॥
భాఇహి భాఇహి పరమ సమీతీ । సకల దోష ఛల బరజిత ప్రీతీ ॥
జేఠే సుతహి రాజ నృప దీన్హా । హరి హిత ఆపు గవన బన కీన్హా ॥ 4 ॥

ఓ మునీశ్వరా! ఇదియొక పవిత్రమైన ప్రాచీనగాథ-వినుడు. దీనిని పరమశివుడు పార్వతీదేవికి వినిపించెను. ప్రపంచ ప్రసిద్ధి వహించిన కైకయ రాజ్యమును సత్యకేతుడు అను రాజు పాలించు చుండెను. ఆతడు ధర్మాత్ముడు, నీతినిధానము, తేజస్వి, పరాక్రమవంతుడు, సుశీలుడు, బలశాలి. అతనికి ఇద్దఱు పుత్రులుండిరి. వారుగూడ యోధులు, సద్గుణ సంపన్నులు. వారిలో జ్యేష్ఠుడైన ప్రతాపభానుడు రాజ్యమునకు ఉత్తరాధికారి. రెండవవాడైన అరిమర్దనుడు మహాబలశాలి. సంగ్రామరంగమున తొణకనివీరుడు. వారి ఐకమత్యము నిరుపమానము, నిష్కళంకము. రాజు జ్యేష్ఠకుమారునకు రాజ్యభారమును అప్పగించి, శ్రీహరిధ్యానముకై వనములకేగెను. (చౌ॥ 1-4)

దో- జబ ప్రతాపరబి భయఉ నృప, ఫిరీ దోహాఈ దేస ।
ప్రజా పాల అతి బేదబిధి, కతహుఁ నహీఁ అఘ లేస ॥ 153 ॥

ప్రతాపభానుడు రాజ్యాధికారమును చేబట్టినట్లు దేశమునందంతటను చాటబడెను. అతని రాజ్యపాలనము వేదోక్తధర్మములను అనుసరించుచు సాగుచుండెను. ఆతనిపాలనలో రాజ్యమున పాపకృత్యములు మచ్చునకైనను లేకుండెను. (దో॥ 153)

చౌ- నృప హితకారక సచివ సయానా । నామ ధరమరుచి సుక్ర సమానా ॥
సచివ సయాన బంధు బలబీరా । ఆపు ప్రతాపపుంజ రనధీరా ॥ 1 ॥
సేన సంగ చతురంగ అపారా । అమిత సుభట సబ సమర జుఝారా ॥
సేన బిలోకి రాఉ హరషానా । అరు బాజే గహగహే నిసానా ॥ 2 ॥
బిజయ హేతు కటకఈ బనాఈ । సుదిన సాధి నృప చలేఉ బజాఈ ॥
జహఁ తహఁ పరీఁ అనేక లరాఈఁ । జీతే సకల భూప బరిఆఈఁ ॥ 3 ॥
సప్త దీప భుజబల బస కీన్హే । లై లై దండ ఛాడి నృప దీన్హే ॥
సకల అవని మండల తెహి కాలా । ఏక ప్రతాపభాను మహిపాలా ॥ 4 ॥

ఆతనిమంత్రియైన ధర్మరుచి నీతిజ్ఞుడు, బుద్ధిమంతుడు. రాజనీతిలో శుక్రాచార్యునితో సమానుడు. రాజైనప్రతాపభానుడు స్వయముగా పరాక్రమవంతుడు, రణధీరుడు. చతురుడైన మంత్రి, బలశాలియైన తమ్ముడు అతనికి అండగా నుండిరి. అపారమైనచతురంగబలములు గలవు. వీరులైన యోధులు ప్రాణములకు తెగించి పోరాడువారు. సైన్యములు రాజునకు హర్షమును గూర్చునవిగా ఉండెను. నగారాలు మ్రోగుచుండగా మంచిముహూర్తమున రాజు దిగ్విజయయాత్రకు బయలుదేరెను. యుద్ధములలో అతడు రాజులను అందఱిని జయించెను. తన భుజబలముతో సప్తద్వీపములను వశపఱచుకొనెను. పరాజితులైన రాజులనుండి పన్నులను స్వీకరించి, వారిని విడిచిపెట్టెను. ఇట్లు ప్రతాపభానుడు అఖండమండలమునకు ఏకైకచక్రవర్తి ఆయెను. (చౌ॥ 1-4)

దో-స్వబస బిస్వ కరి బాహుబల, నిజ పుర కీన్హ ప్రబేసు ।
అరథ ధరమ కామాది సుఖ, సేవఇ సమయఁ నరేసు ॥ **154** ॥

ఈ విధముగా సమస్త భూమండలమును జయించి, రాజు తననగరమున ప్రవేశించి, సర్వసుఖములను అనుభవించుచుండెను, ధర్మార్థకామములను యథాయోగ్యముగ అనుసరించుచు ప్రజలను పాలించుచుండెను.
(దో॥ 154)

చౌ- భూప ప్రతాపభాను బల పాఈ । కామధేను భై భూమి సుహాఈ ॥
సబ దుఖ బరజిత ప్రజా సుఖారీ । ధరమసీల సుందర నర నారీ ॥ 1 ॥
సచివ ధరమరుచి హరి పద ప్రీతీ । నృప హిత హేతు సిఖవ నిత నీతీ ॥
గుర సుర సంత పితర మహిదేవా । కరఇ సదా నృప సబ కై సేవా ॥ 2 ॥
భూప ధరమ జే బేద బఖానే । సకల కరఇ సాదర సుఖ మానే ॥
దిన ప్రతి దేఇ బిబిధ బిధి దానా । సునఇ సాస్త్ర బర బేద పురానా ॥ 3 ॥
నానా బాపీం కూప తడాగా । సుమన బాటికా సుందర బాగా ॥
బిప్రభవన సురభవన సుహాఏ । సబ తీరథన్హ బిచిత్ర బనాఏ ॥ **4** ॥

ప్రతాపభానునిపాలనలో భూమి కామధేనువువలె కోరినఫలములను ఒసంగుచుండెను. ప్రజలు దుఃఖమునే ఎఱుంగక హాయిగా జీవించుచుండిరి. స్త్రీపురుషులు సుందరులు, ధర్మాత్ములు. మంత్రియైన ధర్మరుచి శ్రీహరిభక్తుడు. రాజునకు హితైషి. అందువలన రాజు గురువులను, దేవతలను, సజ్జనులను పితరులను, బ్రాహ్మణులను, భక్తివిశ్వాసములతో సేవించుచుండెను. రాజధర్మములను అన్నింటిని వేదోక్తముగా సాదరముగా నిర్వహించుచుండెను. నిత్యము అనేకదానములనుజేయుచు వేదశాస్త్ర పురాణములను వినుచుండెను. సమస్త తీర్థక్షేత్రములలో బావులను, చెఱువులను, ఉద్యానవనములను ఏర్పాటు చేయించెను. దేవతా మందిరములను, బ్రాహ్మణులకు గృహములను కట్టించెను.
(చౌ॥ 1-4)

దో-జహఁ లగి కహే పురాన శ్రుతి, ఏక ఏక సబ జాగ ।
బార సహస్ర సహస్ర నృప, కిఏ సహిత అనురాగ ॥ **155** ॥

రాజు వేదశాస్త్రపురాణములలో పేర్కొనబడిన పెక్కు యజ్ఞములను విధ్యుక్తముగా భక్తి శ్రద్ధలతో చేసెను.
(దో॥ 155)

చౌ- హృదయఁ న కఛు ఫల అనుసంధానా । భూప బిబేకీ పరమ సుజానా ॥
కరఇ జే ధరమ కరమ మన బానీ । బాసుదేవ అర్పిత నృప గ్యానీ ॥ 1 ॥
చఢి బర బాజి బార ఏక రాజా । మృగయా కర సబ సాజి సమాజా ॥
బింధ్యాచల గభీర బన గయఊ । మృగ పునీత బహు మారత భయఊ ॥ 2 ॥
ఫిరత బిపిన నృప దీఖ బరాహూ । జను బన దురేఉ ససిహి గ్రసి రాహూ ॥
బడ బిధు నహిఁ సమాత ముఖ మాహీఁ । మనహుఁ క్రోధ బస ఉగిలత నాహీఁ ॥ 3 ॥

కోల కరాల దసన ఛబి గాఈం । తను బిసాల పీవర అధికాఈం ॥
ఘురుఘురాత హయ ఆరౌ పాఏఁ । చకిత బిలోకత కాన ఉఠాఏఁ ॥ 4 ॥

ప్రతాపభానుడు మిక్కిలి వివేకముగలవాడు. అతడు ఎట్టి ప్రతిఫలములను ఆసింపక తాను ఆచరించు ధర్మ కార్యములను అన్నింటిని త్రికరణ శుద్ధిగా భగవదర్పణము గావించుచుండెను. ఒక నాడు అతడు ఉత్తమాశ్వమునెక్కి వేటకై వలసిన సాధనములతో వింధ్యాటవికి వెళ్లెను. అచట శాస్త్రోక్తములైన అనేక ఉత్తమ (చంపదగిన) మృగములను వేటాడెను.[1] అడవిలో తిరుగుచు అతడొక వనవరాహమును జూచెను. దాని దంతములు రాహుగ్రస్తమైన చంద్రునివలె భాసించుచుండెను. దాని శరీరము పర్వతాకారసదృశము. గుఱ్ఱపు గిట్టల శబ్దములను విని, అది నిక్కపొడుచు కొనిన చెవులతో సావధానముగా ఇటునటు పరికించుచు ఘుర్ఘురించుచుండెను.

(చౌ॥ 1-4)

దో-నీల మహీధర సిఖర సమ, దేఖి బిసాల బరాహు ।
చపరి చలేఉ హయ సుటుకి నృప, హాఁకి న హోఇ నిబాహు ॥ 156 ॥

నీలగిరిశృంగమువలె ఉన్నత (విశాల)మైన ఆ సూకరమును గాంచి, రాజు చిక్కలువేయుచు తనగుఱ్ఱమును అతి వేగముగ పరుగెత్తించెను. "ఇప్పుడు నీవు తప్పించుకొనలేవు" అని అతడు ఆ వరాహమును కవ్వించెను.

(దో॥ 156)

చౌ- ఆవత దేఖి అధిక రవ బాజీ । చలేఉ బరాహ మరుత గతి భాజీ ॥
తురత కీన్హ నృప సర సంధానా । మహి మిలి గయఉ బిలోకత బానా ॥ 1 ॥
తకి తకి తీర మహీస చలావా । కరి ఛల సుఅర సరీర బచావా ॥
ప్రగటత దురత జాఇ మృగ భాగా । రిస బస భూప చలేఉ సంగ లాగా ॥ 2 ॥
గయఉ దూరి ఘన గహన బరాహూ । జహఁ నాహిన గజ బాజి నిబాహూ ॥
అతి అకేల బన బిపుల కలేసూ । తదపి న మృగమగ తజఇ నరేసూ ॥ 3 ॥
కోల బిలోకి భూప బడ ధీరా । భాగి పైఠ గిరిగుహాఁ గభీరా ॥
అగమ దేఖి నృప అతి పఛితాఈం । ఫిరేఉ మహాబన పరేఉ భులాఈం ॥ 4 ॥

అతి వేగముగా వచ్చుచున్న గుఱ్ఱమును జూచి, తప్పించుకొనుటకై అది వాయువేగముతో పరుగిడ సాగెను. వెంటనే రాజు ధనుస్సున బాణమును సంధించెను. కాని ప్రతిపర్యాయము అది తప్పించు కొనుచునే యుండెను. ఒక సారి పైకికనిపించును. మఱొక సారి దాగుకొనును. వేఱొక సారి పరుగులు తీయును. రాజు మిక్కిలి క్రుద్ధుడై దానిని వెంటాడెను. ఆ వరాహము చాలా దూరము పరుగెత్తి, ఏనుగు గాని, గుఱ్ఱముగాని చొరరానిఘనారణ్యములో ప్రవేశించెను. రాజు ఏకాకిగా అట్టి దట్టమైన అడవిలోనికి పోవుట కష్టము. ఐనను అతడు తనప్రయత్నమును మానలేదు. ధీరుడైన రాజునుజూచి, ఆ వరాహము ఒక పర్వతగుహలోనికి ప్రవేశించెను. ఆ గుహలో ప్రవేశించుటకు వీలులేక అతడు నిరాశతో వెనుకకుమఱలెను. కాని ఆ దట్టమైనఅడవిలో అతడు దారితప్పెను. (చౌ॥ 1-4)

1) వనవాసులైన మహర్షులు తమ తపశ్శక్తిలో అఱవభాగమును రాజులకు ధారపోయుదురు. ఆ శక్తితో ప్రభువులు బలసంపన్నులై, చక్కగా రాజ్యపాలన చేయుచుందురు. కావున వనములలోని క్రూర మృగముల బారి నుండి తపోధనులను రక్షించుచుండుట రాజులకు విధి- వేటాడదగిన మృగములను గూర్చి శాస్త్రములు తెల్పినవి. ఆ మృగములను సూచించుచు తులసీదాసు 'పునీత' అను పదమును ప్రయోగించెను.

దో- ఖేద ఖిన్న ఛుద్ధిత తృషిత, రాజా బాజి సమేత।
ఖోజత బ్యాకుల సరిత సర, జల బిను భయఉ అచేత ॥ **157** ॥

అతిప్రయాసకారణముగా మిక్కిలిడస్సిన ఆరాజు ఖిన్నుడై, ఆకలిదప్పులతో వ్యాకులుడై, గుఱ్ఱమును దీసికొని నదీతటాకములను వెదకుచు నీరుదొరకక స్పృహతప్పి పడిపోయెను. (దో॥ 157)

చౌ- ఫిరత బిపిన ఆశ్రమ ఎక దేఖా। తహఁ బస నృపతి కపట మునిబేషా ॥
జాసు దేస నృప లీన్హ ఛడాఈ। సమర సేన తజి గయఉ పరాఈ ॥ 1 ॥
సమయ ప్రతాపభాను కర జానీ। ఆపన అతి అసమయ అనుమానీ ॥
గయఉ న గృహ మన బహుత గలానీ। మిలా న రాజహి నృప అభిమానీ ॥ 2 ॥
రిస ఉర మారి రంక జిమి రాజా। బిపిన బసఇ తాపస కేఁ సాజా ॥
తాసు సమీప గవన నృప కీన్హా। యహ ప్రతాపరబి తెహిఁ తబ చీన్హా ॥ 3 ॥
రాఉ తృషిత నహిఁ సో పహిచానా। దేఖి సుబేష మహాముని జానా ॥
ఉతరి తురగ తేఁ కీన్హ ప్రనామా। పరమ చతుర న కహేఉ నిజ నామా ॥ 4 ॥

అతడు కొంతతడవునకు లేచి, వనమున దిరుగుచు ఒక ఆశ్రమమునకు జేరెను. అక్కడ ఒక రాజు కపటమునివేషధారియై నివసించుచుండెను. ఇదివరలో అతడు ప్రతాపభానునిచే పరాజితుడై రాజ్యమునుగోల్పోయియుండెను. యుద్ధములో సైన్యమును వదలివేసి పాఱిపోయియుండెను. ప్రతాపభానునిఅదృష్టమును, తనదురదృష్టమును తలచుకొనుచు అతడు తిరిగి తనరాజ్యమునకు పోలేదు. ప్రతాపభానునితో సంధిచేసికొనుటకు అతనికి అభిమానము అడ్డువచ్చెను. ఆ రాజు క్రోధమును తనహృదయములోనే దాచుకొని, అతిదరిద్రునివలె మునివేషముతో అయడవిలోనే తలదాచుకొని యుండెను. ప్రతాపభానుడు అతనికడకు చేరెను. వెంటనే అతడు ప్రతాపభానుని గుర్తించెను. దాహబాధలో వికలుడైయున్న రాజు అతనిని గుర్తింప లేదు. రాజు అతనిని మునీశ్వరునిగా భావించి, గుఱ్ఱము దిగి, వందనమునాచరించెను. కాని చతురుడైన రాజు తనపేరుమాత్రము అతనికి చెప్పలేదు. (చౌ॥ 1-4)

దో-భూపతి తృషిత బిలోకి తెహిఁ, సరబరు దీన్హ దెఖాఇ।
మజ్జన పాన సమేత హయ, కీన్హ నృపతి హరషాఇ ॥ **158** ॥

దాహార్తుడైన ఆ రాజునకు ఆ కుహనా సన్న్యాసి ఒకసరోవరమునుజూపెను. రాజు గుఱ్ఱముతోగూడ ఆ సరస్తీరమునకు చేరి, అందు స్నానము చేసి నీరు గ్రోలెను. (దో॥ 158)

చౌ- గై శ్రమ సకల సుఖీ నృప భయఊ। నిజ ఆశ్రమ తాపస లై గయఊ ॥
ఆసన దీన్హ అస్త రబి జానీ। పుని తాపస బోలేఉ మృదు బానీ ॥ 1 ॥
కో తుమ్హ కస బన ఫిరహు అకేలేఁ। సుందర జుబా జీవ పరహేలేఁ ॥
చక్రబర్తి కే లచ్ఛన తోరేఁ। దేఖత దయా లాగి అతి మోరేఁ ॥ 2 ॥

నామ ప్రతాపభాను అవనీసా । తాసు సచివ మైఁ సునహు మునీసా ॥
ఫిరత అహేరేఁ పరేఉఁ భులాఈ । బడేఁ భాగ దేఖేఉఁ పద ఆఈ ॥ 3 ॥
హమ కహఁ దుర్లభ దరస తుమ్హారా । జానత హౌఁ కఛు భల హోనిహారా ॥
కహ ముని తాత భయఉ అఁధిఆరా । జోజన సత్తరి నగరు తుమ్హారా ॥ 4 ॥

పూర్తిగా సేదదీరి, సుఖియైనరాజును ఆ కపట సన్యాసి తనఆశ్రమమునకు తీసికొనిపోయెను. సాయం సమయమగుటచే ఆసీనుని గావించి, తపస్వి మృదువచనములతో ఇట్లనెను. "నీవు ఎవరు? అందమైన యువకుడనైనను ప్రాణములను లెక్కసేయక ఈ అడవిలో ఒంటరిగా ఏల తిరుగుచుంటివి? నీలో చక్రవర్తి లక్షణములు కన్పించుచున్నవి. నిన్ను జూచి నాకు జాలివేయుచున్నది."- రాజు సమాధానమును ఇచ్చెను. "మునీశ్వరా! ప్రతాపభానుడు అను రాజుగలడు నేను అతని మంత్రిని. వేటకై వచ్చి, దారి తప్పితిని. అదృష్టవశమున ఇచట మీ పాదదర్శనమైనది. మీ దర్శనము అతిదుర్లభము. దీనిని శుభసూచకముగా నేను భావించుచున్నాను." అనంతరము ముని ఇట్లనెను. "నాయనా! చీకటిపడినది. నీ నగరము ఇచ్చటికి డెబ్బది యోజనముల దూరమున ఉన్నది. (చౌ॥ 1-4)

దో-నిసా ఘోర గంభీర బన, పంథ న సునహు సుజాన ।
బసహు ఆజు అస జాని తుమ్హ, జాఎహు హోత బిహాన ॥ 159 (క) ॥
తులసీ జసి భవతబ్యతా, తైసీ మిలఇ సహాఇ ।
ఆపును ఆవఇ తాహి పహిఁ, తాహి తహాఁ లై జాఇ ॥ 159 (ఖ) ॥

ఓ సజ్జనుడా! ఇది ఘోరాంధకారము అలముకొనిన రాత్రి, కీకారణ్యము, మార్గము చొరరానిది. కావున ఈ రాత్రికి ఇక్కడనేయుండి రేపు ప్రాతఃకాలమున వెళ్లుము. (తులసీదాసు పల్కుచున్నాడు) కానున్నది కాకమానదు. పరిస్థితులు అనుకూలించినప్పుడు అదృష్టము అతనిని వెదకుకొనుచు వచ్చును. లేదా ఆ అదృష్టము వ్యక్తులను తనవైపునకే లాగుకొనును. (దో॥ 159. క,ఖ)

చౌ- భలెహిఁ నాథ ఆయసు ధరి సీసా । బాఁధి తురగ తరు బైఠ మహీసా ॥
నృప బహు భాఁతి ప్రసంసేఉ తాహీ । చరన బంది నిజ భాగ్య సరాహీ ॥ 1 ॥
పుని బోలేఉ మృదు గిరా సుహాఈ । జాని పితా ప్రభు కరఉఁ ఢిఠాఈ ॥
మోహి మునీస సుత సేవక జానీ । నాథ నామ నిజ కహహు బఖానీ ॥ 2 ॥
తెహి న జాన నృప నృపహి సొ జానా । భూప సుహృద సో కపట సయానా ॥
బైరీ పుని ఛత్రీ పుని రాజా । ఛల బల కీన్హ చహఇ నిజ కాజా ॥ 3 ॥
సముఝి రాజసుఖ దుఖిత అరాతీ । అవాఁ అనల ఇవ సులగఇ ఛాతీ ॥
సరల బచన నృప కే సుని కానా । బయర సఁభారి హృదయఁ హరషానా ॥ 4 ॥

"అట్లే కానిండు మహాత్మా!"- అని చెప్పి, రాజు ఆ సన్యాసిఆజ్ఞను శిరసావహించి, గుఱ్ఱమును చెట్టుకు కట్టివేసి, అచటనే కూర్చుండెను. రాజు అతనిని అనేకవిధముల పొగడి, పాదాభివందనము ఆచరించెను తనఅదృష్టమును కొనియాడుకొనుచు సవినయముగా మృదుమధురముగా పల్కెను. "మునీశ్వరా! నేను మిమ్ము

తండ్రివలె తలంతును. నన్ను మీపుత్రునిగా లేక సేవకునిగా భావించి, మీ పేరు మొదలగువివరములు తెల్పగలరు."- రాజు ఆ సన్న్యాసిని గుర్తింపకున్నను అతడు ఆ రాజును గుర్తించెను. రాజు నిష్కపటి, కాని ఆ ముని కపటి. అతడు రాజునకు శత్రువు, క్షత్రియుడు, పైగా రాజవంశజుడు. కావున తనకార్యమును బలప్రయోగముచేతనో లేక మోసముతోడనో సాధింపనెంచెను. అతడు తన పూర్వపురాజసుఖములను తలంచుకొని దుఃఖపడుచుండెను. అతనిలో ఈర్ష్యాగ్ని కొలిమివలెమండుచుండెను. నిర్మలమనస్కుడైన ప్రతాపభానువిపల్కులు వినియు, తనలోని ద్వేషమును అణచుకొనుచు, అతడు లోలోన సంతసించెను. (చౌ॥ 1-4)

దో- కపట బోరి బానీ మృదుల, బోలెఉ జుగుతి సమేత।
నామ హమార భిఖారి అబ, నిర్ధన రహిత నికేత ॥ 160 ॥

ఆ సన్న్యాసి మృదువుగనే కపటవచనములను ఇట్లు పలికెను "నా పేరు భికారి" నేను నిర్ధనుడను, ఇల్లు వాకిలి లేనివాడను. (దో॥ 160)

చౌ- కహ నృప జే బిగ్యాన నిధానా। తుమ్హ సారిఖే గలిత అభిమానా ॥
సదా రహహిఁ అపనపౌ దురాఏఁ। సబ బిధి కుసల కుబేష బనాఏఁ ॥ 1 ॥
తెహి తేఁ కహహిఁ సంత శ్రుతి టేరేఁ। పరమ అకించన ప్రియ హరి కేరేఁ ॥
తుమ్హ సమ అధన భిఖారి అగేహా। హోత బిరంచి సివహి సందేహా ॥ 2 ॥
జోసి సోసి తవ చరన నమామీ। మో పర కృపా కరిఅ అబ స్వామీ ॥
సహజ ప్రీతి భూపతి కై దేఖీ। ఆపు బిషయ బిస్వాస బిసేషీ ॥ 3 ॥
సబ ప్రకార రాజహి అపనాఈ। బోలెఉ అధిక సనేహ జనాఈ ॥
సును సతిభాఉ కహఉఁ మహిపాలా। ఇహాఁ బసత బీతే బహు కాలా ॥ 4 ॥

రాజు పల్కెను. "మీవంటి జ్ఞానులు, నిరహంకారులు సర్వదా తమనిజస్వరూపములను దాచియుంచెదరు. పేదవాని దైన్యస్థితిలో కన్పించుటయే సర్వవిధముల క్షేమమని భావింతురు. మిక్కిలి అకించనులు (మమతాహంకార రహితులు) ఐన వారినే శ్రీహరి ప్రేమించునని వేదములు, సజ్జనులు పల్కుట ప్రసిద్ధము. నిర్ధనులు, గృహహీనులు ఐన మీవంటి భికారులను జూచి, వీరు నిజముగనే సజ్జనులా? భికారులా? అని బ్రహ్మకును, పరమేశ్వరునకును సందేహము కలుగుచుండును. మీరు ఎవ్వరైనను కానిండు మీకృపకై ప్రణమిల్లి ప్రార్థింతును."- రాజుయొక్క స్వాభావిక ప్రేమను, తనపై ఆయనకు గల విశ్వాసమును జూచి, ఆ సన్న్యాసి అన్ని విధముల రాజును తనవశములో నుంచుకొని, అధికప్రేమను ప్రకటించుచు ఇట్లనెను. "రాజా! వినుము. సత్యము చెప్పెదను. నేనిచట చాల కాలము నుండియు నివసించుచున్నాను. (చౌ॥ 1-4)

దో- అబ లగి మోహి న మిలెఉ కోఉ, మైఁ న జనావఉఁ కాహు।
లోకమాన్యతా అనల సమ, కర తప కానన దాహు ॥ 161 (క) ॥

ఇంతవఱకు నాయొద్దకు ఎవ్వరును రాలేదు. నన్నుగూర్చి ఎవ్వరికిని నేను తెల్పుకొనలేదు. ఏలనగా లోక ప్రతిష్ఠ తపస్సనెడివనమును దగ్ధముచేయు అగ్నివంటిది. (దో॥ 161. క)

సో-తులసీ దేఖి సుబేషు, భూలహిఁ మూఢ న చతుర నర ।
సుందర కేకిహి పేఖు, బచన సుధా సమ అసన అహి॥ 161 (ఖ) ॥

తులసీదాసు చెప్పుచున్నాడు. సుందరమైన వేషములను జూచి మూఢులేగాదు విజ్ఞులు గూడ మోసపోవుదురు అందమైననెమలిని చూడుడు దానికంఠస్వరముఅమృతతుల్యము. కాని సర్పములు దానిఆహారము. (సో॥ 161, ఖ)

చౌ- తాతేఁ గుపుత రహఉఁ జగ మాహీఁ । హరి తజి కిమపి ప్రయోజన నాహీఁ ॥
ప్రభు జానత సబ బినహిఁ జనాఏఁ । కహహు కవని సిధి లోక రిఝాఏఁ ॥ 1 ॥
తుమ్హ సుచి సుమతి పరమ ప్రియ మోరేఁ । ప్రీతి ప్రతీతి మోహి పర తోరేఁ ॥
అబ జౌఁ తాత దురావఉఁ తోహీ । దారున దోష ఘటఇ అతి మోహీ ॥ 2 ॥
జిమి జిమి తాపసు కథఇ ఉదాసా । తిమి తిమి నృపహి ఉపజ బిస్వాసా ॥
దేఖా స్వబస కర్మ మన బానీ । తబ బోలా తాపస బగధ్యానీ ॥ 3 ॥
నామ హమార ఏకతను భాఈ । సుని నృప బోలెఉ పుని సిరు నాఈ ॥
కహహు నామ కర అరథ బఖానీ । మోహి సేవక అతి ఆపన జానీ ॥ 4 ॥

కపటసన్న్యాసి పల్కెను. "అందులకే ప్రపంచమునకు దూరముగా మసలుచున్నాను. శ్రీహరితోతప్ప నాకుఎవ్వరితోడను పనిలేదు. మనము తెలుపుకొనకున్నను ప్రభువునకన్నియును తెలియును. లోకులను తృప్తిపఱచుటవలనకలుగుప్రయోజనమేమి? నీవు అతిపవిత్రుడవు. నీ బుద్ధి మంచిది. నీపై నాకు ఎంతో ప్రీతిగలదు. నీకును నాపై ప్రేమవిశ్వాసములు మెండుగా గలవు. నాయనా! ఇప్పుడుగూడ నీకడ నేనేమైన దాచినచో నేను దోషినగుదును." ఆ కపట సన్న్యాసి ప్రాపంచికవిషయముల యెడ ఔదాసీన్యము ప్రకటించు కొలదియు రాజునకు అతనిపై విశ్వాసము ఇనుమడింపసాగెను. రాజు మనసా, వాచా, కర్మణా తనకు వశుడైనట్లు తెలిసికొని, ఆ బకధ్యానియైన కపటముని పలికెను. "సోదరా! నా పేరు ఏకతనుడు" ఈ మాటకు రాజు నమస్కరించి, "మీ పేరునకు అర్థమును తెల్పుడు."- అనియడిగెను. (చౌ॥ 1-4)

దో-ఆదిసృష్టి ఉపజీ జబహిఁ, తబ ఉతపతి భై మోరి ।
నామ ఏకతను హేతు తెహి, దేహ న ధరీ బహోరి॥ 162 ॥

ఆ బకధ్యాని ఇట్లనెను. "సృష్టి ప్రారంభమైనప్పుడే నేను జన్మించితిని. తరువాత మఱియొకదేహమును దాల్చలేదు. అందువలననే నాపేరు 'ఏకతనుడు'. (దో॥ 162)

చౌ- జని ఆచరజు కరహు మన మాహీఁ । సుత తప తేఁ దుర్లభ కఛు నాహీఁ ॥
తపబల తేఁ జగ సృజఇ బిధాతా । తపబల బిష్ను భఏ పరిత్రాతా ॥ 1 ॥
తపబల సంభు కరహిఁ సంఘారా । తప తేఁ అగము న కఛు సంసారా ॥
భయఉ నృపహి సుని అతి అనురాగా । కథా పురాతన కహై సో లాగా ॥ 2 ॥
కరమ ధరమ ఇతిహాస అనేకా । కరఇ నిరూపన బిరతి బిబేకా ॥
ఉదభవ పాలన ప్రలయ కహానీ । కహేసి అమిత ఆచరజ బఖానీ ॥ 3 ॥

సుని మహీప తాపస బస భయఊ । ఆపన నామ కహాన తబ లయఊ ॥
కహ తాపస నృప జానఉఁ తోహీ । కీన్హేహు కపట లాగ భల మోహీ ॥ 4 ॥

"పుత్రా! ఆశ్చర్యపడవలదు. తపస్సుచే సాధ్యము కానిది ఏదియును లేదు. తపోబలముచేతనే బ్రహ్మ లోకములను సృష్టించును. విష్ణువు పరిపాలించును. మహేశ్వరుడు లయమొనర్చును. ప్రపంచములో తపస్సుద్వారా అప్రాప్యమైనదిఏదియును లేదు." ఈ మాటలను వినిన రాజునకు ఆతనిపై అనురాగము అధికమయ్యెను. అపుడు తపస్వి ప్రాచీనగాథలను, ధర్మకర్మలకు సంబంధించిన ఇతిహాసములను చెప్పసాగెను. జ్ఞానవైరాగ్యములనుగూర్చియు వ్యాఖ్యానింపసాగెను. సృష్టిస్థితి లయములను గూర్చిన ఆశ్చర్యకర గాథలను విస్తారముగా వివరింపసాగెను. వీటినన్నింటిని విని, రాజు ఆతనికి పూర్తిగా వశుడై, తన పేరును ప్రకటించెను. ఆ సన్న్యాసి "రాజా! నాకంతయు తెలియును నీవు నీపేరును ప్రకటింపక దాచితివి. నీ ప్రవర్తన నాకు మంచిగానే తోచినది. (చౌ॥ 1-4)

సో-సును మహీస అసి నీతి, జహఁ తహఁ నామ న కహహిఁ నృప ।
మొహి తోహి పర అతి ప్రీతి, సోఇ చతురతా బిచారి తవ ॥ 163 ॥

రాజా! రాజులు తమ పేర్లను ముందువెనుకలనాలోచింపక సర్వత్ర ప్రకటింపరాదని నీతిశాస్త్రము పేర్కొనుచున్నది. నీ చాతుర్యమునుగ్రహించిన నాకు నీపై ప్రేమ అధికమాయెను. (సో॥ 163)

చౌ- నామ తుమ్హార ప్రతాప దినేసా । సత్యకేతు తవ పితా నరేసా ॥
గుర ప్రసాద సబ జానిఅ రాజా । కహిఅ న ఆపన జాని అకాజా ॥ 1 ॥
దేఖి తాత తవ సహజ సుధాఈ । ప్రీతి ప్రతీతి నీతి నిపునాఈ ॥
ఉపజి పరీ మమతా మన మోరేఁ । కహఉఁ కథా నిజ పూఛే తోరేఁ ॥ 2 ॥
అబ ప్రసన్న మైఁ సంసయ నాహీఁ । మాగు జో భూప భావ మన మాహీఁ ॥
సుని సుబచన భూపతి హరషానా । గహి పద బినయ కీన్హి బిధి నానా ॥ 3 ॥
కృపాసింధు ముని దరసన తోరేఁ । చారి పదారథ కరతల మోరేఁ ॥
ప్రభుహి తథాపి ప్రసన్న బిలోకీ । మాగి అగమ బర హోఉఁ అసోకీ ॥ 4 ॥

నీ పేరు ప్రతాపభానుడు. నీ తండ్రిపేరు సత్యకేతువు. గురువుగారికృపవలన నాకంతయు తెలియును. కాని నిజము పల్కుట ప్రమాదకరమని భావించి, నేను ముందుగా చెప్పలేదు. నాయనా! నీ సరళత్వము, ప్రేమవిశ్వాసములు నీతి నైపుణ్యములు చూచి, నాకు నీపై మమత్వము పెఱిగినది. కావున నీవు అడిగిన వెంటనే నా కథను తెల్పితిని. నేను ప్రసన్నుడనైతిని. ఇందు సంశయములేదు. రాజా! నీకు కావలసిన దానిని కోరుకొనుము." ఈ మాటలకు రాజు సంతోషించి, ఆ సన్న్యాసిపాదములకు నమస్కరించి ప్రార్థించెను. "ఓ దయాసాగరా! మీదర్శనము చేతనే నాకు చతుర్విధపురుషార్థములు హస్తగతములైనవి. ఐనను మీరు ప్రసన్నులుగాన దుర్లభమైన ఒకవరమును గోరెదను. దానివలన నా శోకము దూరమగును. (చౌ॥ 1-4)

దో-జరా మరన దుఖ రహిత తను, సమర జితై జని కోఉ ।
ఏకఛత్ర రిపుహీన మహి, రాజ కలప సత హోఉ ॥ 164 ॥

నా శరీరము జరామరణదుఃఖరహితముగుగాక. యుద్ధమున నన్ను ఎవ్వరును జయింపకుందురు గాక. భూమిపై నూఱుకల్పములు నా ఏకచ్ఛత్రాధిపత్యము నిలిచియుండుగాక. (దో॥ 164)

చౌ- కహ తాపస నృప ఐసెఇ హోఊ । కారన ఏక కఠిన సును సోఊ ॥
కాలఉ తుఅ పద నాఇహి సీసా । ఏక బిప్రకుల ఛాడి మహీసా ॥ 1 ॥
తపబల బిప్ర సదా బరిఆరా । తిన్హ కే కోప న కోఉ రఖవారా ॥
జౌం బిప్రన్హ బస కరహు నరేసా । తౌ తుఅ బస బిధి బిష్ను మహేసా ॥ 2 ॥
చల న బ్రహ్మకుల సన బరిఆఈ । సత్య కహఉం దోఉ భుజా ఉఠాఈ ॥
బిప్ర శ్రాప బిను సును మహిపాలా । తోర నాస నహిం కవనెహుం కాలా ॥ 3 ॥
హరషెఉ రాఉ బచన సుని తాసూ । నాథ న హోఇ మోర అబ నాసూ ॥
తవ ప్రసాద ప్రభు కృపానిధానా । మో కహుం సర్బ కాల కల్యానా ॥ 4 ॥

అకుహనాసన్న్యాసి పల్కెను. "రాజా! అట్లేయగుగాక. కాని ఒక జటిల సమస్యగలదు. దానిని వినుము. బ్రాహ్మణులుతప్ప అందఱును నీకు 'దాసోఽహమ్' అనియుందురు. మృత్యుదేవత గూడనీముందు నతమస్తకమగును. ఏలనన తపోబలమువలన బ్రాహ్మణులు శక్తిసంపన్నులౌదురు. వారి క్రోధమునుండి తప్పించుకొనుట సాధ్యముగాదు. నీవు బ్రాహ్మణులను వశముచేసికొన్నచో నీకు అత్రిమూర్తులును వశమగుదురు. నేను శపథము చేసి, ఎలుగెత్తి చాటగలను. బ్రాహ్మణులపై దౌర్జన్యము పనిచేయదు. విప్రశాపము తప్ప నిన్నెవ్వరును ఏమియు చేయలేరు. కడకు యముడుగూడ నీ జోలికి రాజాలడు. "అతని మాటలకు ప్రతాపభానుడు మిక్కిలి ప్రసన్నుడై పలికెను. "స్వామీ! నాకెట్టి ప్రమాదమూలేదు. మీ దయవలన నాకు శుభములే కలుగును. (చౌ॥ 1-4)

దో-ఏవమస్తు కహి కపటముని, బోలా కుటిల బహోరి ।
మిలబ హమార భులాబ నిజ, కహహు త హమహి న ఖోరి ॥ 165 ॥

"అట్లే కానిమ్ము" అని పలికి ఆ కపటసన్న్యాసి మఱల ఇట్లనెను. "కాని నీవు ఈ అడవిలో దారితప్పినదియు, నాతో కలిసినదియు ఎవ్వరితోడను చెప్పవలదు. చెప్పినచో ఆ దోషము నాదికాదు. (దో॥ 165)

చౌ- తాతేం మైం తోహి బరజఉం రాజా । కహేం కథా తవ పరమ అకాజా ॥
ఛఠేం శ్రవన యహ పరత కహానీ । నాస తుమ్హార సత్య మమ బానీ ॥ 1 ॥
యహ ప్రగటేం అథవా ద్విజశ్రాపా । నాస తోర సును భానుప్రతాపా ॥
ఆన ఉపాయం నిధన తవ నాహీం । జౌం హరి హర కోపహిం మన మాహీం ॥ 2 ॥
సత్య నాథ పద గహి నృప భాషా । ద్విజ గుర కోప కహహు కో రాఖా ॥
రాఖఇ గుర జౌం కోప బిధాతా । గుర బిరోధ నహిం కోఉ జగ త్రాతా ॥ 3 ॥
జౌం న చలబ హమ కహే తుమ్హారేం । హోఉ నాస నహిం సోచ హమారేం ॥
ఏకహిం డర డరపత మన మోరా । ప్రభు మహిదేవ శ్రాప అతి ఘోరా ॥ 4 ॥

రాజా! మన ఈ ప్రసంగమును ఎవ్వరితోనైనను చెప్పినచో నీకు తీవ్రమైనహాని కలుగును. అందువలన చెప్పవలదని ఆంక్ష విధించుచున్నాను. ఈ వృత్తాంతము మూడవవానిచెవిన బడినచో నీవు నశింతువు. ఇది సత్యము. ఓ ప్రతాపభానూ! ఈ రహస్యము బయటికిపొక్కినను, లేక ఏ బ్రాహ్మణుడైనను శపించినను నీవు నశింపక తప్పదు. బ్రహ్మ మహేశ్వరులు కోపగించినను వేరే ఏవిధముగానైనను నీవు చావవు." మునికి పాదాభివందనమాచరించి రాజు పలికెను. "స్వామీ! బ్రాహ్మణుడు, గురువు ఐన వారికోపములనుండి ఎవరు రక్షించెదరు? బ్రహ్మ కోపించినను గురువు రక్షించును. కాని గురువు విరోధియైనచో ఇక రక్షకులెవ్వరు? మీరు చెప్పినట్లు చేయనిచో నేను నశింపకతప్పదు. దీనినిగూర్చి నాకు చింతలేదు. కాని కేవలము ఒక్క భయము మాత్రము గలదు. బ్రాహ్మణ శాపము మిక్కిలి భయంకరమైనది. (చౌ॥ 1-4)

దో- హోహిఀ బిప్ర బస కవన బిధి, కహహు కృపా కరి సోఉ।
తుమ్హ తజి దీనదయాల నిజ, హితూ న దేఖఉఀ కోఉ॥ 166 ॥

బ్రాహ్మణులు ఏ విధముగా వశమగుదురు? దయతో తెల్పుడు. ఓ దయాళూ! మీరు తప్ప నా హితము గోరెడి వారెవ్వరును లేరు. (దో॥ 166)

చౌ- సును నృప బిబిధ జతన జగ మాహీఀ। కష్టసాధ్య పుని హోహిఀ కి నాహీఀ॥
అహఇ ఏక అతి సుగమ ఉపాఈ। తహాఀ పరంతు ఏక కఠినాఈ॥ 1 ॥
మమ ఆధీన జుగుతి నృప సోఈ। మోర జాబ తవ నగర న హోఈ॥
ఆజు లగేఀ అరు జబ తేఀ భయఊఀ। కాహూ కే గృహ గ్రామ న గయఊఀ॥ 2 ॥
జౌఀ న జాఉఀ తవ హోఇ అకాజూ। బనా ఆఇ అసమంజస ఆజూ॥
సుని మహీస బోలేఉ మృదు బానీ। నాథ నిగమ అసి నీతి బఖానీ॥ 3 ॥
బడే సనేహ లఘున్హ పర కరహీఀ। గిరి నిజ సిరని సదా తృన ధరహీఀ॥
జలధి అగాధ మౌలి బహ ఫేనూ। సంతత ధరని ధరత సిర రేనూ॥ 4 ॥

కపటసన్న్యాసి చెప్పెను. "రాజా! వినుము బ్రాహ్మణులను వశపఱచుకొనుటకు ప్రపంచములో పెక్కు ఉపాయములున్నవి. వాటిని ఆచరించుట కష్టము. వాటి సాఫల్యముగూడ సందేహాస్పదమే. ఒక సులభోపాయముగలదు. కాని దానిలోనూ ఒకచిక్కు గలదు. రాజా! ఈ యుక్తి నాఆధీనమున ఉన్నది. నేను నీ నగరమునకు రాజాలను. పుట్టినప్పటినుండియు నేను ఏ గ్రామమునకుగాని, ఎవ్వరింటికిగాని వెళ్లియెఱుగను. నేను రానిచో నీ కార్యము నెరవేరదు. ఇదియొక సందిగ్ధావస్థ"- రాజు ఈ మాటలు విని మృదువుగా ఇట్లనెను. "స్వామీ! వేదములలో ఒకనీతి తెల్పబడినది. పెద్దవారు చిన్నవారిపై కనికరము చూపుదురు. పర్వతములు తమశిఖరములపై గడ్డిని మోయుచున్నవి. సముద్రుడు శిరస్సుపై నురుగును ధరించును. భూమి తనతలపై ధూళిని భరించును. (చౌ॥ 1-4)

దో- అస కహి గహే నరేస పద, స్వామీ హోహు కృపాల।
మోహి లాగి దుఖ సహిఅ ప్రభు, సజ్జన దీనదయాల॥ 167 ॥

"కావున స్వామీ! నాపై దయ జూపుడు. నాకొఱకై ఈ కష్టములను భరింపుడు" అనుచు రాజు ఆ ముని పాదములపై మోకరిల్లెను. (దో॥ 167)

చౌ- జాని నృపహి ఆపన అధీనా। బోలా తాపస కపట ప్రబీనా ॥
సత్య కహఉఀ భూపతి సును తోహీ। జగ నాహిన దుర్లభ కఛు మోహీ ॥ 1 ॥
అవసి కాజ మైఀ కరిహఉఀ తోరా। మన తన బచన భగత తైఀ మోరా ॥
జోగ జుగుతి తప మంత్ర ప్రభాఊ। ఫలఇ తబహిఀ జబ కరిఅ దురాఊ ॥ 2 ॥
జౌఀ నరేస మైఀ కరౌఀ రసోఈ। తుమ్హ పరుసహు మొహి జాన న కోఈ ॥
అన్న సో జోఇ జోఇ భోజన కరఈ। సోఇ సోఇ తవ ఆయసు అనుసరఈ ॥ 3 ॥
పుని తిన్హ కే గృహ జేవఁఇ జోఊ। తవ బస హోఇ భూప సును సోఊ ॥
జాఇ ఉపాయ రచహు నృప ఏహూ। సంబత భరి సంకలప కరేహూ ॥ 4 ॥

రాజు పూర్తిగా తనకు అధీనుడైనట్లు తెలిసికొని, కపటియైన ఆ సన్న్యాసి ఇట్లనెను. 'రాజా! వినుము. నిజము పల్కుచున్నాను. ప్రపంచములో నాకు దుర్లభమైనది ఏదియును లేదు. నీవు త్రికరణ శుద్ధిగా నాకు భక్తుడవు. కనుక నేను నీపనిని తప్పక చేసెదను. కాని యోగము, యుక్తి, తపస్సు, మంత్రము రహస్యముగా సాధన చేసినప్పుడే సఫలములగుచుండును. రాజా! నేను వంట చేసెదను. నీవు దానిని వడ్డింపుము. కాని నేను ఎవ్వరో ఎవ్వరికిని తెలియకూడదు. ఆ అన్నముతినిన వారందఱును నీ ఆజ్ఞకు లోబడియుందురు. వారియిండ్లలో భుజించిన వారును నీకు అధీనులగుదురు. రాజా! ఈ వ్రతమును ఒక సంవత్సరము ఆచరింపవలెను. (చౌ॥ 1-4)

దో-నిత నూతన ద్విజ సహస సత, బరేహు సహిత పరివార।
మైఀ తుమ్హారే సంకలప లగి, దినహిఀ కరబి జేవనార॥ 168 ॥

రాజా! ప్రతిదినము ఒక లక్షమంది బ్రాహ్మణులను సకుటుంబముగా భోజనమునకు ఆహ్వానింపుము. వారికి నేను ఒక సంవత్సరము వఱకు వండిపెట్టెదను. (దో॥ 168)

చౌ- ఏహి బిధి భూప కష్ట అతి థోరేఀ। హోఇహహిఀ సకల బిప్ర బస తోరేఀ ॥
కరిహహిఀ బిప్ర హోమ మఖ సేవా। తేహిఀ ప్రసంగ సహజేహిఀ బస దేవా ॥ 1 ॥
ఔర ఏక తోహి కహఉఀ లఖాఊ। మైఀ ఏహిఀ బేష న ఆఉబ కాఊ ॥
తుమ్హరే ఉపరోహిత కహుఀ రాయా। హరి ఆనబ మైఀ కరి నిజ మాయా ॥ 2 ॥
తపబల తేహి కరి ఆపు సమానా। రఖిహఉఀ ఇహాఀ బరష పరవానా ॥
మైఀ ధరి తాసు బేషు సును రాజా। సబ బిధి తోర సఀవారబ కాజా ॥ 3 ॥
గై నిసి బహుత సయన అబ కీజే। మొహి తోహి భూప భేఀట దిన తీజే ॥
మైఀ తపబల తోహి తురగ సమేతా। పహుఀచైహఉఀ సోవతహి నికేతా ॥ 4 ॥

ఈ విధముగా చాల స్వల్పశ్రమతో బ్రాహ్మణులందఱును నీ వశమగుదురు. వారు హవనము యజ్ఞము, పూజలు, దైవసేవలు చేయుచుండెడివారుగావున దేవతలుగూడ సహజముగనే నీకు వశులయ్యెదరు. ఒక గుర్తును చెప్పెదను. నేను ఈ వేషములో రాను. నామాయాశక్తిచే నేను నీ పురోహితుని అపహరించెదను. నా తపశ్శక్తిచే అతనిని నావలె మార్చి, ఒక సంవత్సరము వఱకు ఇచటనే ఉంచెదను. నేను అతనిరూపమును ధరించి, నీకార్యమును పూర్తిగా నెరవేర్చెదను. రాజా! చాల రాత్రియైనది ఇక నిద్రింపుము. నా తపోబలమువలన నిద్రించుచున్ననిన్ను నీగుఱ్ఱముతోగూడ నీయింటికి చేర్చెదను. మూడవరోజున మఱల నీకు నాదర్శనమగును. (చౌ॥ 1-4)

దో-మైం఼ ఆఉబ సోఇ బేషు ధరి, పహిచానేహు తబ మోహి ।
జబ ఏకాంత బోలాఇ సబ, కథా సునావౌం఼ తోహి ॥ 169 ॥

నేను చెప్పిన ప్రకారము పురోహితునివేషముతో నీయింటికి వచ్చెదను. నిన్ను ప్రక్కకు పిలిచి, ఈ విషయము నంతయును నీకు తెల్పెదను. అప్పుడు నీవు నన్ను గుర్తించెదవు. (దో॥ 169)

చౌ- సయన కీన్హ నృప ఆయసు మానీ । ఆసన జాఇ బైఠ ఛలగ్యానీ ॥
శ్రమిత భూప నిద్రా అతి ఆఈ । సో కిమి సోవ సోచ అధికాఈ ॥ 1 ॥
కాలకేతు నిసిచర తహం఼ ఆవా । జెహిం఼ సూకర హోఇ నృపహి భులావా ॥
పరమ మిత్ర తాపస నృప కేరా । జానఇ సో అతి కపట ఘనేరా ॥ 2 ॥
తేహి కే సత సుత అరు దస భాఈ । ఖల అతి అజయ దేవ దుఖదాఈ ॥
ప్రథమహిం఼ భూప సమర సబ మారే । బిప్ర సంత సుర దేఖి దుఖారే ॥ 3 ॥
తేహిం఼ ఖల పాఛిల బయరు సం఼భారా । తాపస నృప మిలి మంత్ర బిచారా ॥
జెహిం఼ రిపు ఛయ సోఇ రచేన్హి ఉపాఊ । భావీ బస న జాన కఛు రాఊ ॥ 4 ॥

ఆ కపటసన్న్యాసియొక్క ఆజ్ఞమేరకు రాజు నిద్రించెను. బాగుగా అలసిపోవుటచే అతడు గాఢనిద్రలో మునిగెను. ఆ కపటసన్న్యాసి పీఠముపై కూర్చుండి, తన యుక్తిని కార్యరూపములో పెట్టుటను గూర్చి ఆలోచించుచుండెను. అపుడు వనవరాహరూపములో రాజును దారినుల్లించిన 'కాలకేతువు' అను రాక్షసుడు అచటికి వచ్చెను. అతడు ఈ కపటసన్న్యాసికి మిత్రుడు. అనేకమాయోపాయములను ఎఱిగినవాడు. అతనికి నూర్గురుకుమారులును, పదిమంది సోదరులును ఉండిరి. వారు దుష్టులు, అజేయులు. వారు దేవతలనుగూడ హింసించువారు. వారివలన బ్రాహ్మణులు, సజ్జనులు, దేవతలు దుఃఖితులగుట జూచి, ప్రతాపభానుడు వారినందఱిని యుద్ధమున చంపియుండెను. దుష్టుడైన ఆ కాలకేతువు ఈ కపట సన్న్యాసితో గలిసి, తమఉమ్మడిశత్రువైన ప్రతాపభానునివినాశమునకు కుట్ర పన్నియుండెను. విధివైపరీత్యములవలన రాజునకు ఈ విషయము తెలియదు. (చౌ॥ 1-4)

దో-రిపు తేజసీ అకేల అపి, లఘు కరి గనిఅ న తాహు ।
అజహుం఼ దేత దుఖ రబి ససిహి, సిర అవసేషిత రాహు ॥ 170 ॥

తేజశ్శాలియైన శత్రువు ఒంటరివాడైనను వానిని చులకనగా భావింపరాదు. కేవలము తలమాత్రమే మిగిలియున్న రాహువు ఇప్పటికిని సూర్యచంద్రులను దుఃఖితులను జేయుచునే యున్నాడు. (దో॥ 170)

చౌ- తాపస నృప నిజ సఖహి నిహారీ। హరషి మిలేఉ ఉఠి భయఉ సుఖారీ ॥
మిత్రహి కహి సబ కథా సునాఈ। జాతుధాన బోలా సుఖ పాఈ ॥ 1 ॥
అబ సాధేఉఁ రిపు సునహు నరేసా। జౌఁ తుమ్హ కీన్హ మోర ఉపదేసా ॥
పరిహరి సోచ రహహు తుమ్హ సోఈ। బిను ఔషధ బిఆధి బిధి ఖోఈ ॥ 2 ॥
కుల సమేత రిపు మూల బహాఈ। చౌథేఁ దివస మిలబ మైఁ ఆఈ ॥
తాపస నృపహి బహుత పరితోషీ। చలా మహాకపటీ అతి రోషీ ॥ 3 ॥
భానుప్రతాపహి బాజి సమేతా। పహుఁచాఏసి ఛన మాఝ నికేతా ॥
నృపహి నారి పహిఁ సయన కరాఈ। హయగృహఁ బాఁధేసి బాజి బనాఈ ॥ 4 ॥

కుహనాముని తనమిత్రుని జూచి సంతోషించి, అతనికి కథనంతయు వినిపించెను. ఆ రాక్షసుడు అందులకానందించి, "రాజా! నీవు నా ఉపదేశానుసారము ఇంతపని చేసితివి. శత్రువు మనవశమైనట్లేయని భావింపుము. ఇంక చింతమాని, హాయిగా నిద్రపొమ్ము. మందులేకుండగనే విధాత రోగమును కుదిర్చెను. శత్రువును వానివంశముతోగూడ నిర్మూలించి, నాల్గవ రోజు నిన్ను కలిసెదను."ఇట్లు ముని వేషధారియైన రాజును ఓదార్చి, మహా మాయావియు, క్రోధియు ఐన ఆ రాక్షసుడు వెడలిపోయెను. ఆ కాలకేతువు ఒక్క క్షణకాలములో ప్రతాపభానుని వాని గుఱ్ఱముతో పాటు అతనిరాజమందిరమునకు చేర్చెను. రాజును రాణియొద్ద పరుండ బెట్టి, గుఱ్ఱమును అశ్వశాలలో ఉంచెను. (చౌ॥ 1-4)

దో-రాజా కే ఉపరోహితహి, హరి లై గయఉ బహోరి।
లై రాఖేసి గిరి ఖోహ మహుఁ, మాయా కరి మతి భోరి ॥ **171** ॥

ఆ కాలకేతువు తనమాయాశక్తితో రాజపురోహితుని అపహరించి, వానికి బుద్ధిమాంద్యమును కల్గించి, ఒక పెద్దగుహలో దాచెను. (దో॥ 171)

చౌ- ఆపు బిరచి ఉపరోహిత రూపా। పరెఉ జాఇ తేహి సేజ అనూపా ॥
జాగేఉ నృప అనభఏఁ బిహానా। దేఖి భవన అతి అచరజు మానా ॥ 1 ॥
ముని మహిమా మన మహుఁ అనుమానీ। ఉఠేఉ గవఁహిఁ జేహిఁ జాన న రానీ ॥
కానన గయఉ బాజి చఢి తేహీఁ। పుర నర నారి న జానేఉ కేహీఁ ॥ 2 ॥
గఏఁ జామ జుగ భూపతి ఆవా। ఘర ఘర ఉత్సవ బాజ బధావా ॥
ఉపరోహితహి దేఖ జబ రాజా। చకిత బిలోక సుమిరి సోఇ కాజా ॥ 3 ॥
జుగ సమ నృపహి గఏ దిన తీనీ। కపటీ ముని పద రహ మతి లీనీ ॥
సమయ జాని ఉపరోహిత ఆవా। నృపహి మతే సబ కహి సముఝావా ॥ 4 ॥

పిమ్మట రాక్షసుడు స్వయముగా రాజపురోహితుని రూపమును దాల్చి, వాని సుందరశయ్యపై పరుండెను. తెల్లవారకముందే ప్రతాపభానుడు నిద్రనుండి మేల్కొని, తాను తనయింటిలోనుండుట గమనించి, ఆశ్చర్యచకితుడాయెను. ఇదియంతయు ఆ మహర్షితపఃప్రభావమని తలంచి, రాణికి కనబడకుండ మఱల

గుఱ్ఱమునెక్కి, ఎవరికిని దెలియకుండ వనమునకు బోయెను. మధ్యాహ్నమునకు రాజు తిరిగి వచ్చెను. ఈ విషయముతెలిసిన ప్రజలు ఇంటింటను మంగళవాద్యములతో ఉత్సవములను జేసికొనిరి. రాజు తనపురోహితుని గాంచి, జరిగిన దంతయును ఒకసారి జ్ఞప్తికి దెచ్చుకొని, ఆశ్చర్య పడెను. రాజు ఆ మూడురోజులను మూడు యుగములుగా భావించెను. ఆ కపటసన్న్యాసిపాదములనే ధ్యానించుచు గడిపెను. అనుకొన్నసమయమునకు ఆ కుహనాపురోహితుడు (రాక్షసుడు) వచ్చి తాము లోగడ అనుకొన్న పథకమును వివరించెను. (చౌ॥ 1-4)

దో-నృప హరషేఉ పహిచాని గురు, భ్రమ బస రహా న చేత।
బరే తురత సత సహస బర, బిప్ర కుటుంబ సమేత ॥ 172 ॥

ఆతనిని గురువుగా భావించి రాజు సంతోషించెను. (వాస్తవముగా ఆతడు కుహనామునిగాడు, కాలకేతురాక్షసుడు.) ఆతని మనస్సు పూర్తిగా భ్రమకు లోనైయుండెను. వెంటనే రాజు ఒక లక్షమంది బ్రాహ్మణులను వారి కుటుంబములతో గూడ భోజనమునకు ఆహ్వానించెను. (దో॥ 172)

చౌ- ఉపరోహిత జెవనార బనాఈ। ఛరస చారి బిధి జసి శ్రుతి గాఈ ॥
మాయామయ తెహిఁ కీన్హి రసోఈ। బింజన బహు గని సకఇ న కోఈ ॥ 1 ॥
బిబిధ మృగన్హ కర ఆమిష రాఁధా। తెహి మహుఁ బిప్ర మాఁసు ఖల సాఁధా ॥
భోజన కహుఁ సబ బిప్ర బోలాఏ। పద పఖారి సాదర బైఠాఏ ॥ 2 ॥
పరుసన జబహిఁ లాగ మహిపాలా। భై అకాసబానీ తెహి కాలా ॥
బిప్రబృంద ఉఠి ఉఠి గృహ జాహూ। హై బడి హాని అన్న జని ఖాహూ ॥ 3 ॥
భయఉ రసోఈఁ భూసుర మాఁసూ। సబ ద్విజ ఉఠే మాని బిస్వాసూ ॥
భూప బికల మతి మోహఁ భులానీ। భావీ బస న ఆవ ముఖ బానీ ॥ 4 ॥

ఆ కుహనాపురోహితుడు నాలుగురకముల వంటలను షడ్రసోపేతముగ పాకశాస్త్రము ననుసరించి, మాయచేత సిద్ధము చేసెను. లెక్కలేనన్ని వ్యంజనములను కల్పించెను. అనేకజంతువుల మాంసములతోపాటు బ్రాహ్మణులమాంసముమగూడ కలిపెను. రాజు బ్రాహ్మణులనందఱిని భోజనములకై పిలిచి, పాదప్రక్షాళనమొనర్చి వారిని సాదరముగా కూర్చుండబెట్టెను. రాజు ఆభోజనపదార్థములను వారికి వడ్డింపగనే కాలకేతువు సృష్టించిన ఆకాశవాణి "ఓ బ్రాహ్మణులారా! లేచి మీరు మీఇండ్లకు పొండు. ఈ భోజనము హానికరము. ఇందులో బ్రాహ్మణులమాంసము కలుపబడినది. దీనిని భుజింపకుడు" అని పలికెను. ఆకాశవాణిని వినగానే బ్రాహ్మణులందఱును లేచినిలబడిరి. రాజు వ్యాకులచిత్తుడాయెను ఆతని నోట మాటరాలేదు. బుద్ధి భ్రమకు లోనయ్యెను. (చౌ॥ 1-4)

దో-బోలే బిప్ర సకోప తబ, నహిఁ కఛు కీన్హ బిచార।
జాఇ నిసాచర హోహు నృప, మూఢ సహిత పరివార ॥ 173 ॥

బ్రాహ్మణులందఱును కోపముతో ముందువెనుకలాలోచింపక పలికిరి. "మూర్ఖుడవైన ఓ రాజా! నీవుకుటుంబ సహితముగా రాక్షసుడవై జన్మింపుము. (దో॥ 173)

చౌ- ఛత్రబంధు తైఁ బిప్ర బోలాఈ। ఘాలై లిఏ సహిత సముదాఈ ॥
ఈస్వర రాఖా ధరము హమారా। జైహసి తైఁ సమేత పరివారా ॥ 1 ॥
సంబత మధ్య నాస తవ హోఊ। జలదాతా న రహిహి కుల కోఊ ॥
నృప సుని శ్రాప బికల అతి త్రాసా। భై బహోరి బర గిరా అకాసా ॥ 2 ॥
బిప్రహు శ్రాప బిచారి న దీన్హా। నహిఁ అపరాధ భూప కఛు కీన్హా ॥
చకిత బిప్ర సబ సుని నభబానీ। భూప గయఉ జహఁ భోజన ఖానీ ॥ 3 ॥
తహఁ న అసన నహిఁ బిప్ర సుఆరా। ఫిరెఉ రాఉ మన సోచ అపారా ॥
సబ ప్రసంగ మహిసురన్హ సునాఈ। త్రసిత పరెఉ అవనీఁ అకులాఈ ॥ 4 ॥

ఓ క్షత్రియాధమా! నీవు బ్రాహ్మణులను ఆహ్వానించి, వారిని సపరివారముగా భ్రష్టులను గావింపదలచితివి. భగవంతుడు మా పవిత్రతను (ధర్మములను) కాపాడినాడు. ఇపుడు నీవే సపరివారముగా నశింపగలవు. ఒక సంవత్సరములోపల నీవు నాశనమయ్యెదవు. నీ వంశమున నీకు తిలాంజలియిచ్చెడివారుగూడ ఉండరు." ఈ శాపమును విని, రాజు భయముతో మిక్కిలి వ్యాకులుడయ్యెను. పిమ్మట ఉత్తమమైన ఆకాశవాణి పలికెను. "ఓ బ్రాహ్మణులారా! వాస్తవమును తెలిసికొనకుండా మీరు ఈతనిని శపించితిరి. ఇతడు ఏ తప్పును చేయలేదు."- ఆకాశవాణిని విని, బ్రాహ్మణులందఱును చకితులైరి. రాజు వెంటనే వంటశాలలోనికి పోయిచూచెను. అక్కడ భోజనపదార్థములుగాని వంటవాడుగాని కన్పించలేదు. రాజు మిగుల చింతించి, వారికడకు వచ్చెను. పిమ్మట అతడు జరిగిన వృత్తాంతమంతయు వారితో చెప్పి, భయముతో విహ్వలుడై నేలపై పడిపోయెను. (చౌ॥ 1-4)

దో- భూపతి భావీ మిటఇ నహిఁ, జదపి న దూషన తోర।
కిఏఁ అన్యథా హోఇ నహిఁ, బిప్రశ్రాప అతి ఘోర ॥ 174 ॥

బ్రాహ్మణులు పలికిరి "రాజా! నీవు నిర్దోషివేయైనను విధినెవ్వరూ తప్పింపలేరు. బ్రాహ్మణశాపము భయంకరము, అప్రతిహతము. (దో॥ 174)

చౌ- అస కహి సబ మహిదేవ సిధాఏ। సమాచార పురలోగన్హ పాఏ ॥
సోచహిఁ దూషన దైవహి దేహీఁ। బిరచత హంస కాగ కియ జేహీఁ ॥ 1 ॥
ఉపరోహితహి భవన పహుఁచాఈ। అసుర తాపసహి ఖబరి జనాఈ ॥
తెహిఁ ఖల జహఁ తహఁ పత్ర పఠాఏ। సజి సజి సేన భూప సబ ధాఏ ॥ 2 ॥
ఘేరెన్హి నగర నిసాన బజాఈ। బిబిధ భాఁతి నిత హోఇ లరాఈ ॥
జూఝే సకల సుభట కరి కరనీ। బంధు సమేత పరెఉ నృప ధరనీ ॥ 3 ॥
సత్యకేతు కుల కోఉ నహిఁ బాఁచా। బిప్రశ్రాప కిమి హోఇ అసాఁచా ॥
రిపు జితి సబ నృప నగర బసాఈ। నిజ పుర గవనే జయ జసు పాఈ ॥ 4 ॥

చక్రవాకములకును, సమస్త లోకములకును సుఖప్రదమైన అరుణోదయమైనది"- లక్ష్మణుడు చేతులుజోడించి, ప్రభుప్రతాపమును ప్రకటించుచు మృదువచనములతో ఇట్లనెను. (చౌ॥ 1-4)

దో- అరునోదయఀ సకుచే కుముద, ఉడగన జోతి మలీన ।
జిమి తుమ్హార ఆగమన సుని, భఏ నృపతి బలహీన ॥ 238 ॥

అరుణోదయముతో కలువలు ముకుళించెను. తారకలు కాంతి విహీనములయ్యెను. అట్లే మీ రాక కారణముగ రాజన్యులందఱును దుర్బలులైరి. (దో॥ 238)

చౌ- నృప సబ నఖత కరహిఀ ఉజిఆరీ । టారి న సకహిఀ చాప తమ భారీ ॥
కమల కోక మధుకర ఖగ నానా । హరషే సకల నిసా అవసానా ॥ 1 ॥
ఐసేహిఀ ప్రభు సబ భగత తుమ్హారే । హోఇహహిఀ టూటేఀ ధనుష సుఖారే ॥
ఉయఉ భాను బిను శ్రమ తమ నాసా । దురే నఖత జగ తేజు ప్రకాసా ॥ 2 ॥
రబి నిజ ఉదయ బ్యాజ రఘురాయా । ప్రభు ప్రతాపు సబ నృపన్హ దిఖాయా ॥
తవ భుజ బల మహిమా ఉదఘాటీ । ప్రగటీ ధను బిఘటన పరిపాటీ ॥ 3 ॥
బంధు బచన సుని ప్రభు ముసుకానే । హోఇ సుచి సహజ పునీత నహానే ॥
నిత్యక్రియా కరి గురు పహిఀ ఆఏ । చరన సరోజ సుభగ సిర నాఏ ॥ 4 ॥
సతానందు తబ జనక బోలాఏ । కౌసిక ముని పహిఀ తురత పఠాఏ ॥
జనక బినయ తిన్హ ఆఇ సునాఈ । హరషే బోలి లిఏ దోఉ భాఈ ॥ 5 ॥

రాత్రులయందు నక్షత్రములవలె మినుకుమినుకులాడుచున్న ఈ రాజులు చీకటివలె దుర్భేద్యమైన ఈ ధనుస్సును భంగపఱచజాలరు. రాత్రి గడిచినంతనే కమలములు, చక్రవాకములు, తుమ్మెదలు, వివిధములైన పక్షులు సంతసించును. అట్లే ధనుర్భంగము జరిగినచో మీభక్తులు సంతసించెదరు. ఇదిగో సూర్యోదయమైనది. అదిగో అంధకారము దూరమైనది. నక్షత్రములు అదృశ్యములైనవి. ప్రపంచమున వెలుగులు నిండినవి. ఓ రఘునాథా! రాజులందఱికిని మీ ప్రతాపమును ప్రకటించుటకే సూర్యుడు ఉదయించుచున్నాడు. మీ భుజబలమును నిరూపించుటకే ఈ ధనుర్భంగము చాటింపబడినది."- తమ్ముని వచనములకు శ్రీరాముడు దరహాసితుడయ్యెను. శ్రీరాముడు సహజముగా నిత్యపవిత్రుడైనను శౌచ స్నానాదులను ఆచరించెను. అనుష్ఠానానంతరము గురుపాదములకు ప్రణమిల్లెను. జనక మహారాజు తనపురోహితుడైన శతానందుని విశ్వామిత్రునికడకు పంపెను. జనకుని విన్నపమును అతడు మునికి వినిపించెను. విశ్వామిత్రుడు సంతుష్టుడై సోదరులిద్దఱిని తన యొద్దకు పిలిచెను. (చౌ॥ 1-5)

దో-సతానంద పద బంది ప్రభు, బైఠే గుర పహిఀ జాఇ ।
చలహు తాత ముని కహేఉ తబ, పఠవా జనక బోలాఇ ॥ 239 ॥

శ్రీరాముడు శతానందులకు నమస్కరించి, గురువునొద్ద కూర్చొనెను. అప్పుడు విశ్వామిత్రుడు "నాయనా! పద. జనక మహారాజు పిలువనంపినాడు"- అనియనెను. (దో॥ 239)

## మాసపారాయణము-ఎనిమిదవ విరామము
## నవాహ్నికపారాయణము-రెండవ విరామము

## శివ ధనుర్భంగము

చౌ- సీయ స్వయంబరు దేఖిఅ జాఈ। ఈసు కాహి ధౌఁ దేఇ బడాఈ ॥
లఖన కహా జస భాజను సోఈ। నాథ కృపా తవ జాపర హోఈ ॥ 1 ॥
హరషే ముని సబ సుని బర బానీ। దీన్హి అసీస సబహిఁ సుఖు మానీ ॥
పుని మునిబృంద సమేత కృపాలా। దేఖన చలే ధనుషమఖ సాలా ॥ 2 ॥
రంగభూమి ఆఏ దోఉ భాఈ। అసి సుధి సబ పురబాసిన్హ పాఈ ॥
చలే సకల గృహ కాజ బిసారీ। బాల జుబాన జరఠ నర నారీ ॥ 3 ॥
దేఖీ జనక భీర భై భారీ। సుచి సేవక సబ లిఏ హఁకారీ ॥
తురత సకల లోగన్హ పహిఁ జాహూ। ఆసన ఉచిత దేహు సబ కాహూ ॥ 4 ॥

"మనము సీతాస్వయంవరమును చూడవలెను. భగవదనుగ్రహము ఎవరిపై ప్రసరించునో చూచెదము"- అని విశ్వామిత్రుడు పలుకగా లక్ష్మణుడు ఇట్లనెను. "ప్రభూ! మీకృప ఎవరిపై నుండునో వారే ఈ అదృష్టమునకు నోచుకొందురు."- లక్ష్మణుని ఈ మంచి మాటలను విని, సంతసించి, మునులు వారిని ఆశీర్వదించిరి. కృపానిధియైన శ్రీరాముడు మునులతోగూడి ధనుర్యాగశాలకు వెళ్లెను. సోదరులిద్దఱును రంగభూమికి వచ్చినట్లు తెలియగనే నగరమునందలి స్త్రీ పురుషులు, బాలురు, యువకులు, వృద్ధులు అందఱును తమ పనులన్నింటిని విడిచిపెట్టి, అచటికి చేరిరి. ఆ మహాసమూహమునుగాంచి, జనకమహారాజు తనకు విశ్వాసపాత్రులైన సేవకులను బిలిచి, "మీరు వెంటనే సభకు వచ్చిన వారి నందఱిని ఉచితాసనములపై యథా యోగ్యముగ, కూర్చుండ బెట్టుడు"- అని చెప్పెను. (చౌ॥ 1-4)

దో- కహి మృదు బచన బినీత తిన్హ, బైఠారే నర నారి।
ఉత్తమ మధ్యమ నీచ లఘు, నిజ నిజ థల అనుహారి ॥ 240 ॥

ఆ సేవకులు వినయపూర్వకముగా మృదువచనములను బల్కుచు విచ్చేసిన వారినందఱిని (పెద్ద, చిన్న, ఉత్తమ, మధ్యమ తారతమ్యములను గమనించుచు) యథాయోగ్యముగ సుఖాసీనులను గావించిరి. (దో॥ 240)

చౌ- రాజకుఅఁర తేహి అవసర ఆఏ। మనహుఁ మనోహరతా తన ఛాఏ ॥
గునసాగర నాగర బర బీరా। సుందర స్యామల గౌర సరీరా ॥ 1 ॥
రాజ సమాజ బిరాజత రూరే। ఉడగన మహుఁ జను జుగ బిధు పూరే ॥
జిన్హ కేఁ రహీ భావనా జైసీ। ప్రభు మూరతి తిన్హ దేఖీ తైసీ ॥ 2 ॥
దేఖహిఁ రూప మహా రనధీరా। మనహుఁ బీర రసు ధరేఁ సరీరా ॥
డరే కుటిల నృప ప్రభుహి నిహారీ। మనహుఁ భయానక మూరతి భారీ ॥ 3 ॥
రహే అసుర ఛల ఛోనిప బేషా। తిన్హ ప్రభు ప్రగట కాల సమ దేఖా ॥
పురబాసిన్హ దేఖే దోఉ భాఈ। నర భూషన లోచన సుఖదాఈ ॥ 4 ॥

మూర్తీభవించిన సౌందర్యములాయుననట్లు ఆ రాకుమారులు (రామలక్ష్మణులు)సభలో ఆసీనులైరి. వారి వన్నెచిన్నెలు సర్వాకర్షకములై ఒప్పుచుండెను. సద్గుణనిధులు, అస్త్రవిద్యావిశారదులు, మహావీరులు, ఐనట్టి, వారు తారాగణములమధ్య ఇద్దఱు చంద్రులవలె ఆ రాజసమూహములో ప్రకాశించిరి. సభలోని వారికందఱికిని వారివారి హృదయములలోని భావములకనుగుణముగా శ్రీరామచంద్రుడు కన్పట్టెను. శ్రీరామచంద్రప్రభువును రణధీరులైన రాజన్యులు ఆకృతిదాల్చినవీరరసముగా జూచిరి. కుటిలురు భయంకరమూర్తిగా గాంచి భీతిల్లిరి. మాఱువేషములలోనున్న రాక్షసులు ప్రభువును కాలయమునిగా గాంచిరి. నగరవాసులు ఆ ఇరువురు సోదరులను నేత్రానందకరులైన పురుషోత్తములనుగా దర్శించిరి. (చౌ॥ 1-4)

దో- నారి బిలోకహిఁ హరషి హియఁ, నిజ నిజ రుచి అనురూప।
జను సోహత సింగార ధరి, మూరతి పరమ అనూప ॥ 241 ॥

స్త్రీలందఱును హర్షితహృదయలై తమతమ భావములననుసరించి, మూర్తీభవించిన శృంగార రసముగా గాంచిరి. (దో॥ 241)

చౌ- బిదుషన్హ ప్రభు బిరాటమయ దీసా। బహు ముఖ కర పగ లోచన సీసా ॥
జనక జాతి అవలోకహిఁ కైసేఁ। సజన సగే ప్రియ లాగహిఁ జైసేఁ ॥ 1 ॥
సహిత బిదేహ బిలోకహిఁ రానీ। సిసు సమ ప్రీతి న జాతి బఖానీ ॥
జోగిన్హ పరమ తత్త్వమయ భాసా। సాంత సుద్ధ సమ సహజ ప్రకాసా ॥ 2 ॥
హరిభగతన్హ దేఖే దోఉ భ్రాతా। ఇష్టదేవ ఇవ సబ సుఖ దాతా ॥
రామహి చితవ భాయఁ జెహి సీయా। సో సనేహు సుఖు నహిఁ కథనీయా ॥ 3 ॥
ఉర అనుభవతి న కహి సక సోఊ। కవన ప్రకార కహై కబి కోఊ ॥
ఎహి బిధి రహా జాహి జస భాఊ। తెహిఁ తస దేఖెఉ కోసలరాఊ ॥ 4 ॥

పండితులు ప్రభువును అనేకములైన ముఖములు, చేతులు, పాదములు, శిరస్సులు గల విరాట్ స్వరూపునిగా దర్శించిరి. జనకుని బంధువులు ఆయనను తమఆత్మీయునిగా తలపోసిరి. జనకుని రాణులు ఆయనను వాత్సల్య భావముతో బాలునిగా భావించిరి. వారిప్రీతి వర్ణనాతీతము. యోగులు శుద్ధ శాంతస్వరూపుడైన పరబ్రహ్మగా కనుగొనిరి. భక్తులు ఆయిరువురిని సుఖప్రదాతలైన తమ ఇష్టదేవతలుగా తలంచిరి. సీతాదేవి ఆ ప్రభువును అనిర్వచనీయప్రేమానందమూర్తిగా గాంచెను. ఆమె తనహృదయములోగలిగిన ప్రేమసుఖానుభూతిని ప్రకటింపలేక పోయెను. ఇంక కవియెట్లు ప్రకటింప గలడు? ఈ విధముగా వారందఱును ఆ కోసలరాకుమారుని తమతమ హృదయములలోని భావములకు అనురూపముగా దర్శించిరి. (చౌ॥ 1-4)

దో- రాజత రాజ సమాజ మహుఁ, కోసలరాజ కిసోర।
సుందర స్యామల గౌర తన, బిస్వ బిలోచన చోర ॥ 242 ॥

శ్యామల, గౌరవర్ణ శరీరులైన ఆ అయోధ్యారాకుమారులు ఈ విధముగా అందఱిదృష్టిని ఆకట్టుకొని, సభలో విరాజిల్లిరి. (దో॥ 242)

చౌ-సహజ మనోహర మూరతి దోఉ। కోటి కామ ఉపమా లఘు సోఉ ॥
సరద చంద నిందక ముఖ నీకే। నీరజ నయన భావతే జీ కే ॥ 1 ॥
చితవని చారు మార మను హరనీ। భావతి హృదయ జాతి నహిఁ బరనీ ॥
కల కపోల శ్రుతి కుండల లోలా। చిబుక అధర సుందర మృదు బోలా ॥ 2 ॥
కుముదబంధు కర నిందక హాఁసా। భృకుటీ బికట మనోహర నాసా ॥
భాల బిసాల తిలక ఝలకాహీఁ। కచ బిలోకి అలి అవలి లజాహీఁ ॥ 3 ॥
పీత చౌతనీఁ సిరన్హి సుహాఈఁ। కుసుమ కలీఁ బిచ బీచ బనాఈఁ ॥
రేఖేఁ రుచిర కంబు కల గీవాఁ। జను త్రిభువన సుషమా కీ సీవాఁ ॥ 4 ॥

వారిమూర్తులు సహజమనోహరములైనవి. కోటిమన్మథుల సౌందర్యములుగూడ వారి అందచందములకు సాటిగావు. శరత్పూర్ణిమాచంద్రుడుగూడ వారిముందు దిగదుడుపే- వారికమల నయనశోభలు అందఱికిని మనోరంజకములాయెను. వారిచూపులు అందఱికిని ప్రీతికరములాయెను, అవి మన్మథునిగూడ మురిపించుచుండెను, అవి వర్ణనాతీతములు, కపోలముల నిగనిగలు మనోహరములు, కర్ణకుండలములు చంచలములు, చుబుకములు, పెదవులు మిక్కిలి మనోజ్ఞములు, పలుకులు అతిమధురములు, చిఱునవ్వులు చంద్రకిరణములను పరిహసించును. కనుబొమలు, నాసికలు, ఫాలతిలకములు పరమాకర్షణీయములు. నల్లనికేశపాశములు మధుపాళిని మరపించుచుండెను శిరోభూషణములైన పచ్చనిఉష్ణీషముల (పాగాల) మధ్య గల పూలనగిషీలు నేత్రానందకరములు. శంఖములవంటి కంఠసీమలపై అలరారు త్రిరేఖలు ముల్లోకముల సౌందర్యములకు పరాకాష్ఠగా నుండెను. (చౌ॥ 1-4)

దో-కుంజర మని కంఠా కలిత, ఉరన్హి తులసికా మాల।
బృషభ కంధ కేహరి ఠవని, బల నిధి బాహు బిసాల ॥ 243 ॥

వారి హృదయసీమలను గజముక్తామణుల సుందరహారములు, తులసీమాలలు అలంకరించి యుండెను. వారిభుజస్కంధములు వృషభములమూపురములవలె బలిష్ఠములై సమున్నతములై యుండెను. నిలబడియున్నప్పుడు వారు సింహకిశోరములవలె ధీరగంభీరులై యుండిరి. వారి బాహువులు దీర్ఘములు, బలిష్ఠములు. (దో॥ 243)

చౌ-కటి తూనీర పీత పట బాఁధేఁ। కర సర ధనుష బామ బర కాఁధేఁ ॥
పీత జగ్య ఉపబీత సుహాఏ। నఖ సిఖ మంజు మహాఛబి ఛాఏ ॥ 1 ॥
దేఖి లోగ సబ భఏ సుఖారే। ఎకటక లోచన చలత న తారే ॥
హరషే జనకు దేఖి దోఉ భాఈ। ముని పద కమల గహే తబ జాఈ ॥ 2 ॥
కరి బినతీ నిజ కథా సునాఈ। రంగ అవని సబ మునిహి దెఖాఈ ॥
జహఁ జహఁ జాహిఁ కుఅఁర బర దోఊ। తహఁ తహఁ చకిత చితవ సబు కోఊ ॥ 3 ॥
నిజ నిజ రుఖ రామహి సబు దేఖా। కోఉ న జాన కఛు మరము బిసేషా ॥
భలి రచనా ముని నృప సన కహెఉ। రాజాఁ ముదిత మహాసుఖ లహెఉ ॥ 4 ॥

తూణీరములు కటిపుటితములై యుండెను. పీతాంబరములతో, చేతులవిల్లంబులతో, మెడలపై యజ్ఞోపవీతములతో, ఆ రాకుమారులు ఆపాదమస్తకము మధురాకృతులు గల్గియుండిరి. అచటి వారెల్లరు వారిని రెప్పవాల్చక చూడసాగిరి. జనకమహారాజు వారిని జూచి ముచ్చటపడుచు విశ్వామిత్రుని పాదములకు ప్రణమిల్లెను. అతడు మునికి శివధనుస్సుకథను వినిపించి, రంగభూమిని చూపించెను. ముద్దులొలుకు రాకుమారులు వెళ్లిన ప్రతిప్రదేశమునందును జనులు ఆశ్చర్యచకితులైచూడసాగిరి. శ్రీరాముడు తమనే చూచుచున్నట్లు అందఱును భావించిరి. ఈ రహస్యమెవ్వరికిని బోధపడలేదు. మునీశ్వరుడు రంగభూమిని మెచ్చుకొనెను. జనకుడు సంతుష్టుడాయెను. (చౌ॥ 1-4)

దో-సబ మంచన్హ తేఁ మంచు ఏక, సుందర బిసద బిసాల ।
ముని సమేత దోఉ బంధు తహఁ, బైఠారే మహిపాల॥ **244** ॥

సమున్నత సుందర-ఆసనములపై జనకుడు మునిని, రామలక్ష్మణులను ఆసీనులుగా జేసెను. (దో॥ 244)

చౌ-ప్రభుహి దేఖి సబ నృప హియఁ హారే । జను రాకేస ఉదయ భఏఁ తారే ॥
అసి ప్రతీతి సబ కే మన మాహీఁ । రామ చాప తోరబ సక నాహీఁ ॥ **1** ॥
బిను భంజెహుఁ భవధను బిసాలా । మేలిహి సీయ రామ ఉర మాలా ॥
అస బిచారి గవనహు ఘర భాఈ । జసు ప్రతాపు బలు తేజు గవాఁఈ ॥ **2** ॥
బిహసే అపర భూప సుని బానీ । జే అబిబేక అంధ అభిమానీ ॥
తోరెహుఁ ధనుషు బ్యాహు అవగాహా । బిను తోరేఁ కో కుఅఁరి బిఆహా ॥ **3** ॥
ఏక బార కాలఉ కిన హోఊ । సియ హిత సమర జితబ హమ సోఊ ॥
యహ సుని అవర మహిప ముసుకానే । ధరమసీల హరిభగత సయానే ॥ **4** ॥

శ్రీరామచంద్రునిజూచిన రాజన్యులందఱును రాకాసుధాకరునిముందు తారకలవలె తేజోవిహీనులైరి. "శ్రీరాముడే ధనుర్భంగముగావించును. ఇందు సందేహము లేదు"- అని అందఱును విశ్వసించిరి. "శివధనుర్భంగవిషయముమాట ఎట్లున్నను సీతాదేవి శ్రీరాముని కంఠమున విజయమాలను అలంకరించుట తథ్యము. కావున కీర్తి, ప్రతాపము, బలము, తేజస్సు- అన్నింటిని మఱచిపోయి, మన ఇండ్లకు పోవుదము. రండు" అని కొందఱు తమనిశ్చితభావములను ప్రకటించిరి. వారి మాటలను విని, అవివేకులు, అజ్ఞానాంధులు, దురభిమానులు ఐన మఱికొందఱు రాజులు వారిని పరిహాసముచేయుచు "ధనుర్భంగము కావించినను శ్రీరామునివివాహము సీతతో జరుగుట అసంభవము. ధనుర్భంగము కానిచో అది యెట్లు జరుగును? కాల యముడే వచ్చి ఎదిరించినను అతనితో పోరుసల్పుటకు మేము సిద్ధము"- అని పల్కిరి. ఆ మూర్ఖులను జూచి, ధర్మశీలురు, హరిభక్తులైన రాజులు నవ్వుకొనిరి. (చౌ॥ 1-4)

సో-సీయ బిఆహబి రామ, గరబ దూరి కరి నృపన్హ కే ।
జీతి కో సక సంగ్రామ, దసరథ కే రనబాఁకురే ॥ **245** ॥

వారు (ఆ సజ్జనులు) పలికిరి. "ఈ రాజులగర్వములనణచి శ్రీరాముడు సీతను తప్పకుండా పెండ్లియాడును. రణధీరులైన దశరథకుమారులను యుద్ధములో ఎదుర్కొని జయింపగల వారెవ్వరు? (సో॥ 245)

చౌ- బ్యర్థ మరహు జని గాల బజాఈ। మన మోదకన్హి కి భూఖ బుతాఈ ॥
సిఖ హమారి సుని పరమ పునీతా। జగదంబా జానహు జియఁ సీతా ॥ 1 ॥
జగత పితా రఘుపతిహి బిచారీ। భరి లోచన ఛబి లేహు నిహారీ ॥
సుందర సుఖద సకల గున రాసీ। ఏ దోఉ బంధు సంభు ఉర బాసీ ॥ 2 ॥
సుధా సముద్ర సమీప బిహాఈ। మృగజలు నిరఖి మరహు కత ధాఈ ॥
కరహు జాఇ జా కహుఁ జోఇ భావా। హమ తౌ ఆజు జనమ ఫలు పావా ॥ 3 ॥
అస కహి భలే భూప అనురాగే। రూప అనూప బిలోకన లాగే ॥
దేఖహిఁ సుర నభ చఢే బిమానా। బరషహిఁ సుమన కరహిఁ కల గానా ॥ 4 ॥

వ్యర్థ ప్రేలాపనలతో ప్రాణములను పోగొట్టుకొనవద్దు. ఊహాజనిత మధురపదార్థములతో ఆకలి తీరదు. మా పవిత్ర సూచనను పాటించి, సీతాదేవిని సాక్షాత్తు లోకమాతగా శ్రీరామచంద్రుని జగత్ పితగా ఎఱుంగుడు. ఆయన సౌందర్యమును కన్నులార ఆస్వాదింపుడు. సుందరులు, సుఖప్రదాయకులు సద్గుణసంపన్నులు ఐన రామలక్ష్మణులు ఎల్లప్పుడును శివుని హృదయములో నివసింతురు. ప్రక్కనే ఉన్న (సమీపమునవేయున్న) అమృత సాగరమును వదలి ఎండమావులకై పరుగెత్తుచు ఏల మరణించెదరు? అనగా జగజ్జననియైన సీతాదేవిని వ్యర్థముగా ఏలకోరెదరు? సరే మీ ఇష్టమువచ్చినట్లు ప్రవర్తింపుడు. మేము మాత్రము మా జన్మలు ధన్యమైనట్లు తలంచెదము."- ఈవిధముగా పలికి, సజ్జనులైన ఆ రాజులు భక్తి తత్పరులై రాముని అనుపమసౌందర్యమును తనివితీరగ్రోలిరి. దేవతలు ఆకాశమున విమానములలో నుండి ఈ దృశ్యమును గాంచుచు పుష్పవృష్టిని గురిపించిరి. మధురగానములను వినిపించిరి. (చౌ॥ 1-4)

దో-జాని సుఅవసరు సీయ తబ, పఠఈ జనక బోలాఇ।
చతుర సఖీఁ సుందర సకల, సాదర చలీఁ లవాఇ ॥ 246 ॥

ఇదియే సరియైనసమయమని భావించి, జనకుడు సీతాదేవిని పిలువనంపెను. ఆమెను సుందరీమణులైన చెలులు స్వయంవరమునకు తోడ్కొని వచ్చిరి. (దో॥ 246)

చౌ- సియ సోభా నహిఁ జాఇ బఖానీ। జగదంబికా రూప గున ఖానీ ॥
ఉపమా సకల మోహి లఘు లాగీఁ। ప్రాకృత నారి అంగ అనురాగీఁ ॥ 1 ॥
సియ బరనిఅ తేఇ ఉపమా దేఈ। కుకబి కహాఇ అజసు కో లేఈ ॥
జౌఁ పటతరిఅ తీయ సమ సీయా। జగ అసి జుబతి కహాఁ కమనీయా ॥ 2 ॥
గిరా ముఖర తన అరధ భవానీ। రతి అతి దుఖిత అతను పతి జానీ ॥
బిష బారునీ బంధు ప్రియ జేహీ। కహిఅ రమాసమ కిమి బైదేహీ ॥ 3 ॥
జౌఁ ఛబి సుధా పయోనిధి హోఈ। పరమ రూపమయ కచ్ఛపు సోఈ ॥
సోభా రజు మందరు సింగారూ। మథై పాని పంకజ నిజ మారూ ॥ 4 ॥

జగజ్జననియైన సీతాదేవిసౌందర్యము వర్ణనాతీతము. ఆమె సద్గుణసౌందర్యరాశి. సామాన్య స్త్రీలను వర్ణించు సందర్భమున ఉపయోగింపబడు ఉపమానములెవ్వియును ఆమె విషయమున పనికిరావు. ఈ ఉపమానములతో

సీతాదేవిని వర్ణించి, ఎవరు 'కుకవి'గా అపకీర్తిపాలగుదురు? వేఱొక స్త్రీతో పోల్చుటకు ప్రపంచమున అట్టి మఱియొకసౌందర్యవతి లేనేలేదు. సరస్వతీదేవి ఎక్కువగా మాట్లాడునది. భవాని అర్ధాంగిని, అనగా సగము స్త్రీ సగము పురుషుడు. మన్మథునిభార్య రతీదేవి తన భర్త 'అనంగుడు' అగుటచే విచారగ్రస్తయై యున్నది. విషము, మదిరలకు తోబుట్టువైన లక్ష్మీదేవితో ఈమెను పోల్చుట తగదు. లావణ్యమను అమృత సాగరమును పరమసౌందర్య మనెడి కూర్మమును కుదురుగా జేసి, శోభను త్రాడుగా జేసి, శృంగారరసమును మందరపర్వతముగా జేసి, మన్మథుడు స్వయముగా మథించినచో- (చౌ॥ 1-4)

దో-ఏహి బిధి ఉపజై లచ్ఛి జబ, సుందరతా సుఖ మూల ।
తదపి సకోచ సమేత కబి, కహహిం సీయ సమతూల ॥ 247 ॥

అట్టి మథనమువలన శృంగారదేవతయైన లక్ష్మీదేవి ఉద్భవించినను ఆమె కూడ సీతాదేవికి సాటిరాదు. అనగా లావణ్య పరమ సౌందర్య శోభాశృంగారముల మఱురాకృతియే సీతాదేవి. (దో॥ 247)

చౌ-చలీం సంగ లై సఖీం సయానీ। గావత గీత మనోహర బానీ ॥
సోహ నవల తను సుందర సారీ। జగత జనని అతులిత ఛబి భారీ ॥ 1 ॥
భూషన సకల సుదేస సుహాఏ। అంగ అంగ రచి సఖిన్హ బనాఏ ॥
రంగభూమి జబ సియ పగు ధారీ। దేఖి రూప మోహే నర నారీ ॥ 2 ॥
హరషి సురన్హ దుందుభీం బజాఈం। బరసి ప్రసూన అపఛరా గాఈం ॥
పాని సరోజ సోహ జయమాలా। అవచట చితఏ సకల భుఆలా ॥ 3 ॥
సీయ చకిత చిత రామహి చాహా। భఏ మోహబస సబ నరనాహా ॥
ముని సమీప దేఖే దోఉ భాఈ। లగే లలకి లోచన నిధి పాఈ ॥ 4 ॥

చతురలైన ఆమెసఖులు మధురగీతములను గానముచేయుచు ఆమెవెంట నడిచిరి. అందమైననవినూత్నవస్త్రములతో సుశోభితయైన జగజ్జనని (సీతమ్మ) నిరుపమానసౌందర్యరాశిగా శోభిల్లుచుండెను. సఖులచే సర్వాలంకారభూషితయై ఆమె అలరారుచుండెను. సీతాదేవి స్వయంవరసభలో అడుగిడినంతనే ఆమెదివ్యసౌందర్యశోభలకు స్త్రీపురుషులెల్లరును ముగ్ధులైరి. దేవతలు పరమానందముతో దుందుభులు మ్రోగించిరి. అప్సరసలు గీతములను ఆలపించుచు పుష్పవృష్టిగురిపించిరి. సీతాదేవికరకమలములయందు జయమాల శోభిల్లుచుండెను. ఆమె ఒక్కసారి సభలోని రాజన్యులనందఱిని పరికించి చూచెను. ఆమెచకితచిత్తము తహతహపాటుతో కేవలము శ్రీరాముని దర్శనమునకై ఆరాటపడసాగెను. రాజులందఱును మోహవివశులైరి. ముని ప్రక్కన ఆసీనులైయున్న రామలక్ష్మణులను జూచి, ఆమెనేత్రములు నిధినిగాంచినట్లు ఆనందపరవశమైనవి. (ఆ చూపులు అచటి నుండి మఱలిరాలేదు.) (చౌ॥ 1-4)

దో-గురజన లాజ సమాజు బడ, దేఖి సీయ సకుచాని।
లాగి బిలోకన సఖిన్హ తన, రఘుబీరహి ఉర ఆని ॥ 248 ॥

సీతాదేవి గురుజనుల యెదుట ఇతర సదస్యుల సమ్ముఖమున సిగ్గు పడినదై, శ్రీరాముని తదేక దృష్టితో గాంచుటకు సంకోచించి, ఆయనరూపమును తనహృదయమునందే నిల్పుకొని, సఖులవైపు తిరిగెను. (దో॥ 248)

చౌ- రామ రూపు అరు సియ ఛబి దేఖేఁ। నర నారిన్హ పరిహరీఁ నిమేషేఁ ॥
సోచహిఁ సకల కహత సకుచాహీఁ। బిధి సన బినయ కరహిఁ మన మాహీఁ ॥ 1 ॥
హరు బిధి బేగి జనక జడతాఈ। మతి హమారి అసి దేహి సుహాఈ ॥
బిను బిచార పను తజి నరనాహూ। సీయ రామ కర కరై బిబాహూ ॥ 2 ॥
జగు భల కహిహి భావ సబ కాహూ। హఠ కీన్హేఁ అంతహుఁ ఉర దాహూ ॥
ఎహిఁ లాలసాఁ మగన సబ లోగూ। బరు సాఁవరో జానకీ జోగూ ॥ 3 ॥
తబ బందీజన జనక బోలాఏ। బిరిదావలీ కహత చలి ఆఏ ॥
కహ నృపు జాఇ కహహు పన మోరా। చలే భాట హియఁ హరషు న థోరా ॥ 4 ॥

సభాసదులందఱును సీతారాములరూపవైభవములను రెప్పలార్పక చూడసాగిరి. వారు తమఆనందములను బయటికి ప్రకటింపక మనస్సులలోనే పదిలపఱచుకొనిరి. పిదప వారు బ్రహ్మదేవుని గూర్చి లోలోన ఇట్లు ప్రార్థించిరి. "ఓ విధాతా! జనకుడు పట్టుదలను వీడి, సముచితముగా ప్రవర్తించుగాక. తనప్రతిజ్ఞను ప్రక్కనబెట్టి నిస్సంకోచముగా సీతాదేవిని శ్రీరామునకిచ్చి, వివాహము చేయుగాక. ఇదియే సరియైన విధానము. అపుడు జనకుడు అందఱి మన్ననలను అందుకొనును. లేక అతడు పట్టుదలను వీడనిచో పశ్చాత్తాపపడక తప్పదు." అందఱును ఇట్లే అభిప్రాయపడుచుండిరి. జానకీరమణికి ఈ శ్యామ సుందరుడే తగిన వరుడని భావించుచుండిరి. రాజు వందిమాగధులను పిలిపింపగా వారు ఆయనకీర్తిని పొగడుచు వచ్చిరి. రాజు "మీరు వెళ్లి నా ప్రతిజ్ఞను చాటుడు" అని వారిని ఆదేశించెను. వారు సంతోషముతో వెళ్లిరి. (చౌ॥ 1-4)

దో- బోలే బందీ బచన బర, సునహు సకల మహిపాల।
పన బిదేహ కర కహహిఁ హమ, భుజా ఉఠాఇ బిసాల ॥ 249 ॥

వారు గంభీరముగా ఇట్లు పలికిరి. "ఓ రాజులారా! మేము జనకమహారాజుగారి దృఢప్రతిజ్ఞను ఎలుగెత్తి చాటుచున్నాము. (దో॥ 249)

చౌ- నృప భుజబలు బిధు సివధను రాహూ। గరుఅ కఠోర బిదిత సబ కాహూ ॥
రావను బాను మహాభట భారే। దేఖి సరాసన గవఁహిఁ సిధారే ॥ 1 ॥
సోఇ పురారి కోదండు కఠోరా। రాజ సమాజ ఆజు జోఇ తోరా ॥
త్రిభువన జయ సమేత బైదేహీ। బినహిఁ బిచార బరఇ హఠి తేహీ ॥ 2 ॥
సుని పన సకల భూప అభిలాషే। భటమానీ అతిసయ మన మాఖే ॥
పరికర బాఁధి ఉఠే అకులాఈ। చలే ఇష్టదేవన్హ సిర నాఈ ॥ 3 ॥
తమకి తాకి తకి సివధను ధరహీఁ। ఉఠఇ న కోటి భాఁతి బలు కరహీఁ ॥
జిన్హ కే కఛు బిచారు మన మాహీఁ। చాప సమీప మహీప న జాహీఁ ॥ 4 ॥

రాజులభుజబలమనెడి చంద్రునకు ఈ శివధనుస్సు ఒక రాహువువంటిది. ఇది 'బరువైనది, కఠినమైనది' అను విషయమును ఎల్లరును ఎఱుగుదురు. మహాబలశాలురైన రావణుడు, బాణాసురుడు గూడ, దీనిని గాంచి, వెంటనే

తిన్నగా నిష్క్రమించిరి. సాటిలేని ఈ శివధనుస్సును ఈ సభలో భంగము చేసిన వానిని జనకసుత వరించును. అతడు త్రిభువనవిజేతయే యగును." ఈ రాజప్రతిజ్ఞను విని, రాజన్యులెల్లరును పేరాసకులైనారి. మనస్సులలో ఆరాటముతో దురభిమానులైన ఈర్ష్యాళువులు నడుము బిగించి, తమ ఇష్ట దైవములను స్మరించుకొనుచు ముందుకు రాసాగిరి. వారు ఆవేశముతో శివధనుస్సు వైపు చూచిరి. దానిపై దృష్టిని నిలిపి, బలమునంతయును ఉపయోగించుచు దానిని ఎత్తుటకు ప్రయత్నించిరి. కాని అది కదలనైన కదలలేదు. వివేకవంతులైన కొందఱు ఆ ధనుస్సుచాయలకే వెళ్లలేదు. (చౌ॥ 1-4)

దో- తమకి ధరహిఁ ధను మూఢ నృప, ఉఠఇ న చలహిఁ లజాఇ ।
మనహుఁ పాఇ భట బాహుబలు, అధికు అధికు గరుఆఇ ॥ 250 ॥

మూర్ఖులైన రాజులు తమకముతో ధనుస్సును తాకు చుండిరి. కాని దానిని కదలింప లేక సిగ్గుతో తలవంచుకొని, వెనుకకు మఱలుచుండిరి. ఆ యోధుల బాహుబలములను గ్రహించి, ఆ ధనుస్సు ఇంకను బరువెక్కుచున్నట్లు ఉండెను. (దో॥ 250)

చౌ- భూప సహస దస ఏకహి బారా । లగే ఉఠావన టరఇ న టారా ॥
డగఇ న సంభు సరాసను కైసేఁ । కామీ బచన సతీ మను జైసేఁ ॥ 1 ॥
సబ నృప భఏ జోగు ఉపహాసీ । జైసేఁ బిను బిరాగ సన్యాసీ ॥
కీరతి బిజయ బీరతా భారీ । చలే చాప కర బరబస హారీ ॥ 2 ॥
శ్రీహత భఏ హారి హియఁ రాజా । బైఠే నిజ నిజ జాఇ సమాజా ॥
నృపన్హ బిలోకి జనకు అకులానే । బోలే బచన రోష జను సానే ॥ 3 ॥
దీప దీప కే భూపతి నానా । ఆఏ సుని హమ జో పను ఠానా ॥
దేవ దనుజ ధరి మనుజ సరీరా । బిపుల బీర ఆఏ రనధీరా ॥ 4 ॥

పిదప పదివేల మంది రాజన్యులు ఒక్కుమ్మడిగా ఆ ధనువును కదలింప ప్రయత్నించిరి. కాని వారి ప్రయత్నములెల్లను వమ్మయ్యెను. కాముకునిఇచ్ఛకపుమాటలు పతివ్రతమనస్సును చలింపజేయజాలనట్లు వారిబలములు శివధనుస్సును కదలింప లేకపోయెను. వైరాగ్యము లేని సన్న్యాసి వలె వారందఱును నవ్వులపాలైరి. వారు తమకీర్తిని, విజయమును, వీరత్వమును ధనుస్సునకప్పగించి, నిస్సహాయ స్థితిలో వెనుకకు మఱలిరి. రాజన్యులందఱును పరాజితులై నిరాశానిస్పృహలతో తమ తమ స్థానములకు చేరి చతికిలబడిరి. వారిని జూచి జనకమహారాజు కోపముతో పలికెను. "మేము చేసిన ప్రతిజ్ఞను విని, ప్రపంచము యొక్క నలుమూలలనుండి పెక్కుమంది రాజులు విచ్చేసిరి. దేవతలు, దైత్యులు గూడ మానవాకారములతో వచ్చినారు. వేతే వీరులు, యోధులు గూడ విచ్చేసిరి. (చౌ॥ 1-4)

దో-కుఅఁరి మనోహర బిజయ బడి, కీరతి అతి కమనీయ ।
పావనిహార బిరంచి జను, రచెఉ న ధను దమనీయ ॥ 251 ॥

మనోహరిణియైన కన్యకామణిని, అఖండవిజయమును, శాశ్వత కీర్తిని పొందదగిన మహావీరుని బ్రహ్మ ఇంత వఱకు సృష్టింపనే లేదని నాకనిపించుచున్నది. అట్లే అమోఘమైన ఈ ధనుస్సును, దీనిని భంగపఱచగలవీరుని

బ్రహ్మ సృష్టింపలేదు, సృష్టింపలేడు. అంతరార్థమేమనగా బ్రహ్మ సృష్టికి అతీతుడైన శ్రీరాముడు మాత్రమే శివధనుర్భంగముగావించి, మనోహారిణియైన కన్యకామణిని, అఖండ విజయమును, శాశ్వత కీర్తిని పొందగలడు. (దో॥ 251)

చౌ- కహహు కాహి యహ లాభు న భావా। కాహుఁ న సంకర చాప చఢావా ॥
రహఉ చఢాఉబ తోరబ భాఈ। తిలు భరి భూమి న సకే ఛడాఈ ॥ 1 ॥
అబ జని కొఉ మాఖై భట మానీ। బీర బిహీన మహీ మైఁ జానీ ॥
తజహు ఆస నిజ నిజ గృహ జాహూ। లిఖా న బిధి బైదేహి బిబాహూ ॥ 2 ॥
సుకృతు జాఇ జౌఁ పను పరిహరఊఁ। కుఅఁరి కుఆరి రహఉ కా కరఊఁ ॥
జౌఁ జనతేఉఁ బిను భట భుబి భాఈ। తౌ పను కరి హోతేఉఁ న హఁసాఈ ॥ 3 ॥
జనక బచన సుని సబ నర నారీ। దేఖి జానకిహి భఏ దుఖారీ ॥
మాఖే లఖను కుటిల భఇఁ భౌఁహేఁ। రదపట ఫరకత నయన రిసౌఁహేఁ ॥ 4 ॥

జనకుడు ఇంకను ఇట్లు వచించెను. "ఈ బహుమతులకై ఆశపడినవారు ఎవ్వరు? కాని ఎవ్వరూ శివధనుస్సును ఎక్కుపెట్టలేకపోయిరి. ఎక్కుపెట్టుట, విఱుచుట వేరే సంగతులు. వాటిని అటు ఉండనిండు కాని ధనుస్సును వారెవ్వరునూ ఇసుమంతయును కదలింపలేకపోయిరి. పృథ్విలో వీరుడైన వాడు ఒక్కడూలేడని నేను భావించినచో అభిమానము ఉన్నవాడెవ్వడును తప్పుగా తలంపరాదు. మీ ఆశలనన్నింటిని వదలుకొని, గృహోన్ముఖులు కండు. సీతావివాహమును బ్రహ్మ నిర్ణయింపలేదేమో? (సీతమ్మ బ్రహ్మ సృష్టికాదుగదా!) నేను నా ప్రతిజ్ఞను విరమించుకొన్నచో నా పుణ్యమును కోల్పోవుదును. ఇప్పుడు నేను చేయవలసినదేమి? రాజకుమారి కన్యగానే మిగులును. రాజన్యులారా! ఈ భూమిపై వీరులే లేరని తెలిసియున్నచో నేను ఈ ప్రతిజ్ఞను చేయకయే యుందును. ఇట్లు నవ్వులపాలు కాకపోవుదును." జనకుని మాటలు విని స్త్రీపురుషులందఱును జానకివైపు జూచి విచారగ్రస్తులైరి. కాని లక్ష్మణుడు కోపావేశమును ఆణచుకొనలేకపోయెను. ఆతని భ్రుకుటి ముడివడెను. పెదవులు వణికెను. కన్నులు నిప్పులు రాల్చెను. (చౌ॥ 1-4)

దో- కహి న సకత రఘుబీర డర, లగే బచన జను బాన।
నాఇ రామ పద కమల సిరు, బోలే గిరా ప్రమాన ॥ 252 ॥

జనకుని మాటలు బాణములవలె ఆతని హృదయమున గ్రుచ్చుకొన్నను రామునకు భయపడి ఏమియు మాటాడక మిన్నకుండెను. కాని చివరకు శ్రీరాముని పాదపద్మములకు ప్రణమిల్లి, దృఢముగా పల్కెను. (దో॥ 252)

చౌ- రఘుబంసిన్హ మహుఁ జహఁ కొఉ హోఈ। తేహిఁ సమాజ అస కహఇ న కోఈ ॥
కహీ జనక జసి అనుచిత బానీ। బిద్యమాన రఘుకులమని జానీ ॥ 1 ॥
సునహు భానుకుల పంకజ భానూ। కహఉఁ సుభాఉ న కఛు అభిమానూ ॥
జౌఁ తుమ్హారి అనుసాసన పావౌఁ। కందుక ఇవ బ్రహ్మాండ ఉఠావౌఁ ॥ 2 ॥
కాచే ఘట జిమి డారౌఁ ఫోరీ। సకఉఁ మేరు మూలక జిమి తోరీ ॥
తవ ప్రతాప మహిమా భగవానా। కో బాపురో పినాక పురానా ॥ 3 ॥

నాథ జాని అస ఆయసు హోఈ। కౌతుకు కరౌఁ బిలోకిఅ సోఈ ॥
కమలనాల జిమి చాప చఢావౌఁ। జోజన సత ప్రమాన లై ధావౌఁ ॥ 4 ॥

రఘువంశమణియైన శ్రీరామచంద్రుడు ఈ సభలోనే విరాజిల్లుచున్నాడని తెలిసియు జనకుడు ఇట్లు మాట్లాడుట అనుచితము. సభలో రఘువంశజుడైన వాడెవ్వడున్నను ఇట్లు మాట్లాడనే రాదు. ఓ సూర్యవంశతిలకా! నా అభిమానముతో గాక సహజముగానే పలుకుచున్నాను. మీరు అనుమతించినచో ఈ బ్రహ్మాండమునే బంతివలె ఎత్తగలను. (ఆదిశేషుడు గదా!) దానినొక మట్టికుండనువలె పగులగొట్టగలను కూడ. మేరుపర్వతమునుగూడ ముల్లంగినివలె ముక్కలు ముక్కలు చేయగలను. ఈ ప్రాతధనుస్సు ఒక లెక్కా? ప్రభూ! నాకాజ్ఞయిండు నేను చేయు అద్భుతములను తిలకింపుడు. తామరతూడునువలె ఈ ధనుస్సును వంచి, దానిని చేతబట్టి నూఱుయోజనములు పరుగెత్తగలను. (చౌ॥ 1-4)

దో- తోరౌఁ ఛత్రక దండ జిమి, తవ ప్రతాప బల నాథ ! ।
జౌఁ న కరౌఁ ప్రభు పద సపథ, కర న ధరౌఁ ధను భాథ ॥ 253 ॥

ప్రభూ! మీ ప్రతాప ప్రభావములవలన నేను ఈ ధనుస్సును పుట్టగొడుగును వలె విరిచి వైచెదను. అట్లు చేయనిచో నేను ధనుర్బాణములనే ధరింపనని మీ పాదములపై ఒట్టు పెట్టుకొని చెప్పుచున్నాను. (దో॥ 253)

చౌ- లఖన సకోప బచన జే బోలే। డగమగాని మహి దిగ్గజ డోలే ॥
సకల లోగ సబ భూప డెరానే। సియ హియఁ హరషు జనకు సకుచానే ॥ 1 ॥
గుర రఘుపతి సబ ముని మన మాహీఁ। ముదిత భఏ పుని పుని పులకాహీఁ ॥
సయనహిఁ రఘుపతి లఖను నెవారే। ప్రేమ సమేత నికట బైఠారే ॥ 2 ॥
బిస్వామిత్ర సమయు సుభ జానీ। బోలే అతి సనేహమయ బానీ ॥
ఉఠహు రామ భంజహు భవచాపా। మేటహు తాత జనక పరితాపా ॥ 3 ॥
సుని గురు బచన చరన సిరు నావా। హరషు బిషాదు న కఛు ఉర ఆవా ॥
ఠాఢే భఏ ఉఠి సహజ సుభాఏఁ। ఠవని జుబా మృగరాజు లజాఏఁ ॥ 4 ॥

లక్ష్మణుని ఈ మాటలకు పృథ్వి కంపించెను. దిగ్గజములు గడగడలాడెను. అక్కడ నున్నవారితోగూడ రాజన్యులెల్లరును భయభ్రాంతులైరి. సీతాదేవి సంతోషపడెను. జనకుడు సిగ్గుపడెను. శ్రీరాముడును, విశ్వామిత్రాది మునీశ్వరులును ప్రశాంత చిత్తులై, పులకిత గాత్రులైరి. శ్రీరాముడు సంజ్ఞతో లక్ష్మణుని నివారించి, ప్రేమతో తన ప్రక్కన కూర్చొన జేసెను. ఇది సరియైన సమయమని గ్రహించి, విశ్వామిత్రుడు ప్రేమతో "రామా! లెమ్ము శివధనుర్భంగముగావింపుము. నాయనా! జనకరాజు విచారమును తొలగింపుము"- అని పలికెను. గురువాజ్ఞను వినినంతనే శ్రీరాముడు ఆయనకు పాదాభివందనమాచరించెను. ఆ రాముని మనస్సులో శోకముగాని, హర్షముగాని లేవు. సహజమైన శాంత స్వభావముతో శౌర్యమున సింహకిశోరమును మించుచు లేచి నిలబడెను.[1] (చౌ॥ 1-4)

1. అలకలల్లలాడగగని ఆరాణ్ముని యెటు పొంగెనో?
చెలువమీరగను మారీచుని మదమణచెడువేళ ॥ అలక ॥
ముని కనుసైగ దెలిసి శివధనువును విరిచెడి సమయమున
త్యాగరాజవినుతుని మోమున రంజిల్లు ॥ అలక ॥ (త్యాగరాజ)

దో-ఉదిత ఉదయగిరి మంచ పర, రఘుబర బాలపతంగ।
బికసే సంత సరోజ సబ, హరషే లోచన భృంగ॥ 254॥

ప్రభాతసూర్యుడు ఉదయాద్రిని అధిరోహించినట్లు శ్రీరాముడు ఎత్తైనపీఠమును ఎక్కగనే సజ్జనులముఖకమలములు వికసించినవి. వారి చూపులు అనెడి తుమ్మెదలు హర్షోల్లాసములను ప్రదర్శించినవి. (దో॥ 254)

చౌ-నృపన్హ కేరి ఆసా నిసి నాసీ। బచన నఖత అవలీ న ప్రకాసీ॥
మానీ మహిప కుముద సకుచానే కపటీ భూప ఉలూక లుకానే॥ 1॥
భఏ బిసోక కోక ముని దేవా। బరిసహిఁ సుమన జనావహిఁ సేవా॥
గుర పద బంది సహిత అనురాగా। రామ మునిన్హ సన ఆయసు మాగా॥ 2॥
సహజహిఁ చలే సకల జగ స్వామీ। మత్త మంజు బర కుంజర గామీ॥
చలత రామ సబ పుర నర నారీ। పులక పూరి తన భఏ సుఖారీ॥ 3॥
బంది పితర సుర సుకృత సఁభారే। జౌఁ కఛు పున్య ప్రభాఉ హమారే॥
తౌ సివధను మృనాల కీ నాఈం। తోరహుఁ రాము గనేస గోసాఈం॥ 4॥

రాజుల ఆశానిశీధులు అంతరించెను. వారివచనములు నక్షత్రములవలె నిస్తేజములాయెను. గర్విష్ఠులైన రాజులు కలువలవలె ముడుచుకొని పోయిరి. కపటులైన రాజులు దివాంధముల (గుడ్ల గూబల) వలెదాగుకొనిరి. మునులు, దేవతలు చక్రవాకములవలె సంతసించి, పుష్ప వృష్టిని గురిపించిరి. శ్రీరాముడు భక్తిశ్రద్ధలతో గురువునకు ప్రణమిల్లి, మునులఆజ్ఞకై ప్రార్థించెను. జగన్నాథుడైన శ్రీరామచంద్రుడు శ్రేష్ఠమైన మదపుటేనుగువలె తనసహజగమనముతో నడిచెను. పురజనులు పులకితగాత్రులైరి. వారు తమపూర్వసత్కార్యములను తలంచుకొని, పితరులకును, దేవతలకును వందనములాచరించి, ఇట్లు ప్రార్థించిరి. "ఓ గణేశా! మా పూర్వపుణ్యఫలమేమాత్రమైనను ఉన్నచో శ్రీరాముడు శివధనుస్సును ఒక తామరతూడునువలె భంగపఱచుగాక." (చౌ॥ 1-4)

దో-రామహి ప్రేమ సమేత లఖి, సఖిన్హ సమీప బోలాఇ।
సీతా మాతు సనేహ బస, బచన కహఇ బిలఖాఇ॥ 255॥

వాత్సల్యపూర్వకముగా శ్రీరామచంద్రునిజూచుచు సఖులను తనయొద్దకు పిలిచి, సీతాదేవి యొక్క తల్లియైన సునయనాదేవి స్నేహవశమున వికల మనస్కురాలై పలికెను. (దో॥ 255)

చౌ-సఖి సబ కౌతుకు దేఖనిహారే। జేఉ కహావత హితూ హమారే॥
కోఉ న బుఝాఇ కహఇ గుర పాహీఁ। ఏ బాలక అసి హఠ భలి నాహీఁ॥ 1॥
రావన బాన ఛుఆ నహిఁ చాపా। హారే సకల భూప కరి దాపా॥
సో ధను రాజకుఅఁర కర దేహీఁ। బాల మరాల కి మందర లేహీఁ॥ 2॥
భూప సయానప సకల సిరానీ। సఖి బిధి గతి కఛు జాతి న జానీ॥
బోలీ చతుర సఖీ మృదు బానీ। తేజవంత లఘు గనిఅ న రానీ॥ 3॥

కహఁ కుంభజ కహఁ సింధు అపారా। సోషేఉ సుజసు సకల సంసారా ॥
రబి మండల దేఖత లఘు లాగా। ఉదయఁ తాసు తిభువన తమ భాగా ॥ 4 ॥

"సఖులారా! అందఱును వినోదముగా చూచుచున్నారేమి? మన మేలుగోరువారెవ్వరైనను విశ్వామిత్రునితో చెప్పినచో బాగుగానుండును. ఈ ఘోరమైన శివధనుస్సును ఎక్కుపెట్టుమని ముద్దులొలుకు ఈ పసిబాలుని ఆజ్ఞాపించుట వాంఛనీయముగాదు. రావణుడు, బాణాసురుడు గూడ ఈ శివధనుస్సును తాకలేకపోయిరి. వీరములుపలికినరాజులెల్లరును తోకలుముడిచిరి. అట్టి మహాధనుస్సును ఈ రాకుమారునిచేతులలో పెట్టుచున్నారు. బాలమరాళము మందరగిరిని మోయగలదా? రాజుగారి బుద్ధి కౌశలము అడుగంటినది. విధాత సంకల్పము ఎట్లున్నదో?"- ఒక తెలివిగల సఖి ఇట్లు పలికెను." మహారాణీ! తేజోవంతుల విషయములో వయస్సును చూడరాదు. చూడుడు కుంభసంభవుడైన అగస్త్యుడెక్కడ? మహాసముద్రమెక్కడ? కాని ఆయన దానిని పూర్తిగా పానము చేసి, లోకప్రసిద్ధుడాయెను. చూచుటకు సూర్యమండలము చిన్నదేయైనను అతడు ఉదయింపగనే ముల్లోకములలోని అంధకారము పటాపంచలగును. (చౌ॥ 1-4)

దో- మంత్ర పరమ లఘు జాసు బస, బిధి హరి హర సుర సర్బ।
మహామత్త గజరాజ కహుఁ, బస కర అంకుస ఖర్బ ॥ 256 ॥

బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, ఇతర దేవతలు గూడ చిన్న చిన్న మంత్రములకే బద్ధులయ్యెదరు. మదపుటేనుగు చిన్న అంకుశమునకే లొంగిపోవును. (దో॥ 256)

చౌ- కామ కుసుమ ధను సాయక లీన్హే। సకల భువన అపనేఁ బస కీన్హే ॥
దేబి తజిఅ సంసఉ అస జానీ। భంజబ ధనుషు రాము సును రానీ ॥ 1 ॥
సఖీ బచన సుని భై పరతీతీ। మిటా బిషాదు బఢీ అతి ప్రీతీ ॥
తబ రామహి బిలోకి బైదేహీ। సభయ హృదయఁ బినవతి జెహి తేహీ ॥ 2 ॥
మనహీఁ మన మనావ అకులానీ। హోహు ప్రసన్న మహేస భవానీ ॥
కరహు సఫల ఆపని సెవకాఈ। కరి హితు హరహు చాప గరుఆఈ ॥ 3 ॥
గననాయక బరదాయక దేవా। ఆజు లగేఁ కీన్హిఉఁ తుఅ సేవా ॥
బార బార బినతీ సుని మోరీ। కరహు చాప గురుతా అతి థోరీ ॥ 4 ॥

అతిపేశలమైన ధనుస్సుతో పుష్పబాణములతో మదనుడు సకలలోకములను వశపఱచు కొనును. దేవీ! సందేహమును వీడుడు. వినుడు శ్రీరాముడు అవలీలగా తప్పక ధనుర్భంగము గావించును." సఖీవచనములను విని, రాణికి రామచంద్రునిసామర్థ్యముపై నమ్మకము కలిగెను. విషాదము తొలగి పోయెను. రామునిపై అనురాగము అధిక మాయెను. ఆ సమయమున సీతాదేవి రామ చంద్రుని జూచి, వ్యాకులచిత్తయై సకలదేవతలను మనస్సులోనే ప్రార్థించెను. "ఓమహేశా! ఓభవానీ! నన్నుధన్యురాలిని గావింపుడు. నాయెడ ప్రసన్నులై శివచాపము యొక్క బరువును తగ్గింపుడు. ఓ గణాధిపా! వరదాయకా! ఈ రోజుకొఱకై నిరీక్షించుచు నిన్ను సేవించుచు ఉంటిని. నా ప్రార్థనను మన్నించి, ధనుస్సును మిక్కిలి తేలికగా చేయుము. (చౌ॥ 1-4)

దో- దేఖి దేఖి రఘుబీర తన, సుర మనావ ధరి ధీర ।
భరే బిలోచన ప్రేమ జల, పులకావలీ సరీర ॥ 257 ॥

సీతాదేవి రఘునాథుని రెప్పవాల్చక చూచుచు ఆందోళనమునూని, ధైర్యమును వహించెను. అనంతరము ఆమె సూర్యభగవానుని ప్రార్థించెను. ఆమెకన్నులు సజలములాయెను. శరీరము రోమాంచమయ్యెను. (దో॥ 257)

చౌ- నీకేఁ నిరఖి నయన భరి సోభా । పితు పను సుమిరి బహురి మను ఛోభా ॥
అహహ తాత దారుని హఠ ఠానీ । సముఝత నహిఁ కఛు లాభు న హానీ ॥ 1 ॥
సచివ సభయ సిఖ దేఇ న కోఈ । బుధ సమాజ బడ అనుచిత హోఈ ॥
కహఁ ధను కులిసహు చాహి కఠోరా । కహఁ స్యామల మృదుగాత కిసోరా ॥ 2 ॥
బిధి కెహి భాఁతి ధరౌఁ ఉర ధీరా । సిరస సుమన కన బేధిఅ హీరా ॥
సకల సభా కై మతి భై భోరీ । అబ మోహి సంభుచాప గతి తోరీ ॥ 3 ॥
నిజ జడతా లోగన్హ పర డారీ । హోహి హరుఅ రఘుపతిహి నిహారీ ॥
అతి పరితాప సీయ మన మాహీఁ । లవ నిమేష జుగ సయ సమ జాహీఁ ॥ 4 ॥

చూడముచ్చటైన శ్రీరామునిసౌందర్యమును ఆమె నేత్రపర్వముగా జూచెను. కాని తన తండ్రి నిబంధన తలంపునకు రాగానే ఆమెమనస్సు కలవరపాటునకు లోనయ్యెను. ఆమె తనలోతాను ఇట్లు అనుకొనెను. "మాతండ్రి ఎంతో గట్టిపట్టు పట్టినారు. దాని మంచి, చెడు ఫలితములను ఆలోచింపనేలేదు. ఆయనమంత్రులందఱును ఎంతోవివేకముగలవారైయుండియు, ఆయనకు భయపడి, ఏ ఒక్కరును సరియైన సూచనలను చేయనేలేదు. ఇంతమంది పండితులున్న ఈ సభలో ఇట్లు జరుగుట అనుచితము. వజ్రసమానమైన ఆ ధనుస్సు ఎక్కడ? కిశోరావస్థలో కోమలగాత్రుడైన ఈ శ్యామసుందరుడెక్కడ? ఓ విధాతా! నాహృదయమును స్తిమితపఱచుకొను మార్గమేమి? శిరీషపుష్పకణము వజ్రమును భేదింప గలదా? సదస్యులబుద్ధులును మందగించినవి. ఓ శంభునిచాపమా! నీపై మాత్రమే నాకు విశ్వాసము ఉన్నది. నీవే నన్ను కాపాడవలెను. నీ జడత్వమంతయు ఈ సభలోనివారిపై వేయుము. శ్రీరఘునాథుని కోమలత్వము చూచియైనను తేలికగా మాఱుము. ఈ విధముగా సీతాదేవిమనస్సు వ్యాకులతకు గురియయ్యెను. ఆమె ఒక్కొక్క క్షణమును నూఱుయుగములుగా గడుపుచుండెను. (చౌ॥ 1-4)

దో- ప్రభుహి చితఇ పుని చితవ మహి, రాజత లోచన లోల ।
ఖేలత మనసిజ మీన జుగ, జను బిధు మండల డోల ॥ 258 ॥

ఆమె ఒక క్షణము శ్రీరామచంద్రుని జూచును. మఱుక్షణమే తన చంచల దృక్కులను భూమిమీదికి మఱల్చును. చూడగా ఈ రీతి మన్మథుని రెండు చేపలు చంద్రమండలములో ఊయలలు ఊగుచున్నట్లు ఒప్పుచుండెను. (దో॥ 258)

చౌ- గిరా అలిని ముఖ పంకజ రోకీ । ప్రగట న లాజ నిసా అవలోకీ ॥
లోచన జలు రహ లోచన కోనా । జైసేఁ పరమ కృపన కర సోనా ॥ 1 ॥

సకుచీ బ్యాకులతా బడి జానీ । ధరి ధీరజు ప్రతీతి ఉర ఆనీ ॥
తన మన బచన మోర పను సాచా । రఘుపతి పద సరోజ చితు రాచా ॥ 2 ॥
తౌ భగవాను సకల ఉర బాసీ । కరిహి మోహి రఘుబర కై దాసీ ॥
జెహి కేఁ జెహి పర సత్య సనేహూ । సో తెహి మిలఇ న కఛు సందేహూ ॥ 3 ॥
ప్రభు తన చితఇ ప్రేమ తన ఠానా । కృపానిధాన రామ సబు జానా ॥
సియహి బిలోకి తకెఉ ధను కైసేఁ । చితవ గరురు లఘు బ్యాలహి జైసేఁ ॥ 4 ॥

కమలములోని తుమ్మెదలవలె ఆమెవాణి నోటిలోనే బంధింపబడినది. సిగ్గువలన అదిబయటికి వచ్చుట లేదు. లోభిసంపద ఇంటిమాళుమూలయందే ఉండిపోయినట్లు ఆమె కన్నీరు కనుగొనలయందే ఆగి పోయినది. తన మనస్సంఘర్షణకారణముగా మిక్కిలి బాధపడినను ఆమె నిబ్బరము వహించి, విశ్వాసముతో తనలో తాను ఇట్లనుకొనెను. "మనసా వాచా కర్మణా నా నిశ్చయము (మనోరథము) ధర్మబద్ధమయితే, నిజముగా నా మనస్సు రామచంద్రునిపాదపద్మములకే అంకితమైనచో అందఱి హృదయములలో వసించు భగవంతుడు (విష్ణుమూర్తి) నన్ను తప్పక రఘుకులస్వామిపాదదాసిగా చేయును గాక. స్వచ్ఛమైన ప్రేమగలవారు తాము ప్రేమించుచున్నవారిని తప్పక పొందగలరు." ఆమె శ్రీరాముని వైపుచూచి, "ఈ శరీరము ఆయనదికానిచో ఇందు ప్రాణములు ఉండవు" అని భావించెను. కృపానిధియైన శ్రీరాముడు విషయములనన్నింటిని గ్రహించెను. ముందుగా సీతాదేవిని జూచెను. పిమ్మట అతడు గరుత్మంతుడు ఒక చిన్న పామును జూచినట్లు ధనుస్సువైపు చూచెను. (చౌ॥ 1-4)

దో- లఖన లఖెఉ రఘుబంసమని, తాకెఉ హరకోదండు ।
పులకి గాత బోలే బచన, చరన చాపి బ్రహ్మాండు ॥ 259 ॥

రఘుకులమణియగు శ్రీరామచంద్రుడు శివచాపమును తదేకదృష్టితో చూచుటనుగాంచిన లక్ష్మణుడు హర్షపులకితగాత్రుడై బ్రహ్మాండమును తన పాదముతో నొక్కి పట్టి, బిగ్గరగా పలికెను." (దో॥ 259)

చౌ- దిసికుంజరహు కమఠ అహి కోలా । ధరహు ధరని ధరి ధీర న డోలా ॥
రాము చహహిఁ సంకర ధను తోరా । హోహు సజగ సుని ఆయసు మోరా ॥ 1 ॥
చాప సమీప రాము జబ ఆఏ । నర నారిన్హ సుర సుకృత మనాఏ ॥
సబ కర సంసఉ అరు అగ్యానూ । మంద మహీపన్హ కర అభిమానూ ॥ 2 ॥
భృగుపతి కేరి గరబ గరుఆఈ । సుర మునిబరన్హ కేరి కదరాఈ ॥
సియ కర సోచు జనక పఛితావా । రానిన్హ కర దారున దుఖ దావా ॥ 3 ॥
సంభుచాప బడ బోహితు పాఈ । చఢే జాఇ సబ సంగు బనాఈ ॥
రామ బాహుబల సింధు అపారూ । చహత పారు నహిఁ కోఉ కడహారూ ॥ 4 ॥

ఓ దిగ్గజములారా! ఆదికూర్మమా! ఆదిశేషుడా! ఆదివరాహమా! భూమి కంపించకుండ గట్టిగా (నిశ్చలముగా) నిలుపుడు. శ్రీరామచంద్రుడు శివధనుర్భంగము గావించుటకు సన్నద్ధుడగుచున్నాడు. నాఆజ్ఞను విని, సావధానులుకండు. "శ్రీరాముడు ధనువును సమీపింపగనే స్త్రీ పురుషులందఱును దేవతలను, తమశుభకర్మలను

స్మరింపసాగిరి. అందఱి సందేహములు, అజ్ఞానము, రాజులదురభిమానము, పరశురాముని అహంకారము, దేవతల, మునుల భయములు, సీతాదేవివిచారము, జనకునిపశ్చాత్తాపము, రాణులదారుణదుఃఖదావానలము-ఇవియన్నియును కలిసి, శివధనుస్సు అనెడి పడవపై ఎక్కికూర్చొనెను. అవి శ్రీరామచంద్రుని భుజబలమనెడి అపారసముద్రమును దాటుటకు కోరిక పడుచుండెను, కాని ఈ నావను నడుపువాడే లేడు. (చౌ॥ 1-4)

దో-రామ బిలోకే లోగ సబ, చిత్ర లిఖే సే దేఖి।
చితఈ సీయ కృపాయతన, జానీ బికల బిసేషి ॥ 260 ॥

శ్రీరాముడు ప్రేక్షకులను అందఱినీ చూచెను. వారు చిత్తరువులలోని బొమ్మలవలె నిశ్చలముగా నుండిరి. ఆ కృపానిధి సీతాదేవిని జూచి, ఆమె వ్యాకులపాటును గ్రహించెను. (దో॥ 260)

చౌ-దేఖీ బిపుల బికల బైదేహీ। నిమిష బిహాత కలప సమ తేహీ ॥
తృషిత బారి బిను జో తను త్యాగా। ముఏఁ కరఇ కా సుధా తడాగా ॥ 1 ॥
కా బరషా సబ కృషీ సుఖానేఁ। సమయ చుకేఁ పుని కా పఛితానేఁ ॥
అస జియఁ జాని జానకీ దేఖీ। ప్రభు పులకే లఖి ప్రీతి బిసేషీ ॥ 2 ॥
గురహి ప్రనాము మనహిఁ మన కీన్హా। అతి లాఘవఁ ఉఠాఇ ధను లీన్హా ॥
దమకేఉ దామిని జిమి జబ లయఊ। పుని నభ ధను మండలసమ భయఊ ॥ 3 ॥
లేత చఢావత ఖైంచత గాఢేఁ। కాహుఁ న లఖా దేఖ సబు ఠాఢేఁ ॥
తెహి ఛన రామ మధ్య ధను తోరా। భరే భువన ధుని ఘోర కఠోరా ॥ 4 ॥

సీతాదేవి మిక్కిలి వ్యాకులత చెందినట్లు గ్రహించెను. ఆమెకు క్షణమొక యుగముగా అనిపించుచున్నది. దప్పిగొన్న వ్యక్తి నీటికై పరితపించి చనిపోయినచో తరువాత అమృతతటాకమును దెచ్చినను ప్రయోజనము శూన్యము. పైరు ఎండిపోయినతరువాత వర్షమువలన ఏమి లాభము? సమయమునకు ఉపయోగపడనిచో పిదప పశ్చాత్తాపపడి ప్రయోజనమేమి? ఈ విధముగా ఆలోచించి, సీతాదేవిని జూచి, ఆమె ప్రేమను కనుగొని, పులకించి పోయెను. మనస్సులోనే గురువునకు ప్రణమిల్లెను. అతిలాఘవముగా ధనుస్సును లేవనెత్తెను. దానిని పట్టుకొనగానే ధనుస్సు మెఱుపువలె ప్రకాశించెను. ఆకాశమున విద్యుద్వలయము ఏర్పడెను. శ్రీరాముడు ధనుస్సును చేతబట్టుటగాని, వింటినారిని ఎక్కుపెట్టుట గాని, దానిని లాగుట గాని ఎవ్వరును చూడవేలేదు. అందఱును చూచుచుండగనే శ్రీరామచంద్రుడు విల్లెక్కు పెట్టి, దానిని రెండుగా విఱిచెను. ధనుర్భంగ ధ్వనులు భయంకరముగా అన్ని లోకములయందును నిండెను. (చౌ॥ 1-4)

ఛం-భరె భువన ఘోర కఠోర రవ రబి బాజి తజి మారగు చలే।
చిక్కరహిఁ దిగ్గజ డోల మహి అహి కోల కూరుమ కలమలే ॥
సుర అసుర ముని కర కాన దీన్హేఁ సకల బికల బిచారహీఁ ॥
కోదండ ఖండెఉ రామ తులసీ జయతి బచన ఉచారహీఁ ॥

ఘోరమైన ఆ కఠోరశబ్దము సమస్తలోకముల యందును ప్రతిధ్వనించెను. సూర్యుని రథాశ్వములు తమవిహిత మార్గమును వీడి ప్రక్కకు దిరిగెను, దిగ్గజములు ఘీంకరించెను. భూమి ఊగిపోయెను. శేష, వరాహ

కచ్ఛపములు శాంతిని గోల్పోయెను. దేవతలు, రాక్షసులు, మునులు చెవులు మూసికొని కలవరపాటునకు లోనైరి. శ్రీరాముడు శివునివింటిని విరిచెనని అందఱికిని విశ్వాసము కలిగెను. అందఱును 'జయ జయ' ధ్వానములను జేసిరని తులసీదాసు తెల్పుచున్నాడు. (ఛం॥)

సో- సంకర చాపు జహాజు, సాగరు రఘుబర బాహుబలు ।
బూడ సో సకల సమాజు, చఢా జో ప్రథమహిఁ మోహ బస ॥ **261** ॥

శ్రీరామచంద్రునిఅపారభుజబలము సముద్రమువంటిది. శంకరునిధనుస్సు ఓడవంటిది. అజ్ఞానాదికారణములచే ఈ పడవను ఆశ్రయించిన వారందఱును ధనుర్భంగమగుటవలన శ్రీరాముని అపారపరాక్రమసముద్రములో మునిగిపోయిరి. (సో॥ 261)

చౌ- ప్రభు దోఉ చాపఖండ మహి డారే। దేఖి లోగ సబ భఏ సుఖారే ॥
కౌసికరూప పయోనిధి పావన। ప్రేమ బారి అవగాహు సుహావన ॥ **1** ॥
రామరూప రాకేసు నిహారీ। బఢత బీచి పులకావలి భారీ ॥
బాజే నభ గహగహే నిసానా। దేవబధూ నాచహిఁ కరి గానా ॥ **2** ॥
బ్రహ్మాదిక సుర సిద్ధ మునీసా। ప్రభుహి ప్రసంసహిఁ దేహిఁ అసీసా ॥
బరిసహిఁ సుమన రంగ బహు మాలా। గావహిఁ కిన్నర గీత రసాలా ॥ **3** ॥
రహీ భువన భరి జయ జయ బానీ। ధనుష భంగ ధుని జాత న జానీ ॥
ముదిత కహహిఁ జహఁ తహఁ నర నారీ। భంజేఉ రామ సంభుధను భారీ ॥ **4** ॥

శ్రీరామచంద్రుడు ధనుస్సు యొక్క రెండు ముక్కలను నేలపై పడవేసెను. దానిని చూచిన జనులందఱును సంతోషముతో పొంగిపోయిరి. విశ్వామిత్రుడు ఒక పవిత్రమైన సాగరము. ఆయన వాత్సల్యము సుందరము, అగాధము ఐన జలము. సాగరములోని అలలు చంద్రుని గాంచి, ఉప్పొంగినట్లు శ్రీరామునిముఖ చంద్రునిగాంచి ఆయన (మేని) యందు పులకావళులు అధికమాయెను. ఆకసమున దేవతల డిండిమధ్వనులు ప్రతిధ్వనించెను. దివ్యాంగనలనృత్యగానములవిలాసములు కనువిందుగావించెను. బ్రహ్మాది దేవతలు, సిద్ధులు, మునీశ్వరులు శ్రీరాముని ప్రస్తుతించుచు మంగళాశాసనములను పలికిరి. చిత్ర విచిత్రములైన పుష్పమాలికలను కురిపించిరి. కిన్నరులు రసవత్తరముగా గానము చేసిరి. చతుర్దశ భువనములు జయ జయ ధ్వానములతో చాలతడవు మాఱుమ్రోగెను. వాటిలో శివధనుర్భంగ టంకారధ్వని ఎప్పుడు విలీనమైనదో ఎవ్వరికినీ తెలియదు. స్త్రీ పురుషులు ప్రసన్నచిత్తులై "శ్రీరాముడు శివచాపమును విరిచెను" అని పలుకుచుండిరి. (చౌ॥ 1-4)

దో- బందీ మాగధ సూతగన, బిరుద బదహిఁ మతిధీర ।
కరహిఁ నిఛావరి లోగ సబ, హయ గయ ధన మని చీర ॥ **262** ॥

వందిమాగధులు, సూతులు, కావించిన స్తుతిపాఠములతో సభమాఱుమ్రోగెను. అందఱును పట్టరాని ఆనందముతో గుఱ్ఱములను , ఏనుగులను, ధనమును, మణులను, వస్త్రభూషణములను కానుకలుగా సమర్పించిరి. (దో॥ 262)

చౌ- ఝూఁఝి మృదంగ సంఖ సహనాఈఁ। భేరి ఢోల దుందుభీ సుహాఈఁ ॥
బాజహిఁ బహు బాజనే సుహాఏ। జహఁ తహఁ జుబతిన్హ మంగల గాఏ ॥ 1 ॥
సఖిన్హ సహిత హరషీ అతి రానీ। సూఖత ధాన పరా జను పానీ ॥
జనక లహెఉ సుఖు సోచు బిహాఈఁ। పైరత థకేఁ థాహ జను పాఈఁ ॥ 2 ॥
శ్రీహత భఏ భూప ధను టూటే। జైసేఁ దివస దీప ఛబి ఛూటే ॥
సీయ సుఖహి బరనిఅ కేహి భాఁతీ। జను చాతకీ పాఇ జలు స్వాతీ ॥ 3 ॥
రామహి లఖను బిలోకత కైసేఁ। ససిహి చకోర కిసోరకు జైసేఁ ॥
సతానంద తబ ఆయసు దీన్హా। సీతాఁ గమను రామ పహిఁ కీన్హా ॥ 4 ॥

తాళమృదంగములు లయాన్వితములై మ్రోగినవి. శంఖములు, సన్నాయిలు, డోళ్లు, నగారాలు మొదలగు వివిధవాద్యములగోష్ఠి వీనులవిందుగావించెను. అంతటా యువతీమణులు మంగళ గీతములను గానము చేసిరి. ఎండిపోవుచున్నపైరుపంటలకునీరు లభించినట్లు తన సఖులతో గూడిన మహారాణి ముఖము కళకళలాడెను. నీటిలో కాలూనుటకు గట్టిపట్టు దొరకగా అలసి పోయిన ఈతగాడు మిక్కిలి సంతసించినట్లు జనకుడు తనఆందోళనను త్యజించి, ఎంతగానో ఆనందించెను. ధనుర్భంగముగుటవలన సూర్యోదయమున దీపములవలె రాజులముఖములు వెలవెలబోయినవి. సీతాదేవి ఆనందమునకు అవధులే లేకుండెను. స్వాతికార్తెవానకు ఆడుచాతకపక్షివలె సీతాదేవి మురిసి పోయెను. చకోరశాబకము చంద్రుని చూచునట్లు సౌమిత్రి శ్రీరాముని గాంచుచుండెను. శతానందునిఆజ్ఞతో సీతాదేవి శ్రీరాముని సమీపించుటకు ముందుకు నడచెను. (చౌ. 1-4)

దో-సంగ సఖీఁ సుందర చతుర, గావహిఁ మంగలచార।
గవనీ బాల మరాల గతి, సుషమా అంగ అపార ॥ 263 ॥

రూపవతులు, చతురలు ఐన చెలులు ఆమెతోపాటు నడచుచు మంగళ గీతములను ఆలపించిరి. సీతాదేవి బాలమరాళగమనముతో నడచుచుండెను. ఆమెయొక్కపరమసౌందర్యశోభలు అద్భుతముగా ఉండెను. (దో. 263)

చౌ- సఖిన్హ మధ్య సియ సోహతి కైసేఁ। ఛబిగన మధ్య మహాఛబి జైసేఁ ॥
కర సరోజ జయమాల సుహాఈ। బిస్వ బిజయ సోభా జేహిఁ ఛాఈ ॥ 1 ॥
తన సకోచు మన పరమ ఉఛాహూ। గూఢ ప్రేము లఖి పరఇ న కాహూ ॥
జాఇ సమీప రామ ఛబి దేఖీ। రహి జను కుఅఁరి చిత్ర అవరేఖీ ॥ 2 ॥
చతుర సఖీఁ లఖి కహా బుఝాఈ। పహిరావహు జయమాల సుహాఈ ॥
సునత జుగల కర మాల ఉఠాఈ। ప్రేమ బిబస పహిరాఇ న జాఈ ॥ 3 ॥
సోహత జను జుగ జలజ సనాలా। ససిహి సభీత దేత జయమాలా ॥
గావహిఁ ఛబి అవలోకి సహేలీ। సియఁ జయమాల రామ ఉర మేలీ ॥ 4 ॥

సౌందర్యరాసులమధ్య మహాసౌందర్యరాశిగా సీతాదేవి తనసఖులమధ్య మిక్కిలి శోభిల్లెను. ఆమెకరకమలములయందలి 'జయమాల' విశ్వవిజయశోభలను వెదజల్లెను. ఆమెశరీరము సిగ్గుతోఒదిగియున్నను మనసు పరమానందభరితమైయుండెను. ఆమె మనోఽనురాగములను ఎవరును పసిగట్టలేకపోయిరి. శ్రీరాముని సమీపించి, ఆయన అందచందములకు ముగ్ధురాలై, చిత్రించిన బొమ్మవలె నిశ్చలముగా నిలిచిపోయెను. ఆమెతన్మయస్థితిని గమనించిన ఒక నెచ్చెలి "శ్రీరామచంద్రునకు నీమనోహరజయమాలను వేయుము"- అని పలికెను. ఆ మాటలు విని సీతాదేవి తన చేతులతో జయమాలను ఎత్తెను. ప్రేమవివశయై ఆయన కంఠసీమయందు వేయలేకపోయెను. రెండు కమలములు తమ కాండములపై నిలబడి, చంద్రునకు జంకుతో జయమాలను సమర్పించుచున్నట్లు సీతాదేవి కరకమలములయందు జయమాల అలరారెను. కనులకు విందొనర్చు ఈ మనోజ్ఞదృశ్యమును గాంచి, చెలులు మంగళ గానముచేసిరి. వెంటనే సీతాదేవి జయ (వర) మాలను శ్రీరాముని కంఠమున అలంకరించెను. (చౌ॥ 1-4)

సో- రఘుబర ఉర జయమాల, దేఖి దేవ బరిసహిఁ సుమన ।
సకుచే సకల భుఆల, జను బిలోకి రబి కుముదగన ॥ 264 ॥

శ్రీరాముని కంఠసీమయందు జయ(వర) మాలను జూచి, దేవతలు పుష్ప వృష్టినిగురిపించిరి. సూర్యోదయమున కలువలవలె రాజులముఖముల్లెలను ముడుచుకొని పోయినవి. (సో॥ 264)

చౌ- పుర అరు బ్యోమ బాజనే బాజే । ఖల భఏ మలిన సాధు సబ రాజే ॥
సుర కిన్నర నర నాగ మునీసా । జయ జయ జయ కహి దేహిఁ అసీసా ॥ 1 ॥
నాచహిఁ గావహిఁ బిబుధ బధూటీఁ । బార బార కుసుమాంజలి ఛూటీఁ ॥
జహఁ తహఁ బిప్ర బేదధుని కరహీఁ । బందీ బిరిదావలి ఉచ్చరహీఁ ॥ 2 ॥
మహి పాతాల నాక జసు బ్యాపా । రామ బరీ సియ భంజేఉ చాపా ॥
కరహిఁ ఆరతీ పుర నర నారీ । దేహిఁ నిఛావరి బిత్త బిసారీ ॥ 3 ॥
సోహతి సీయ రామ కై జోరీ । ఛబి సింగారు మనహుఁ ఎక ఠోరీ ॥
సఖీఁ కహహిఁ ప్రభుపద గహు సీతా । కరతి న చరన పరస అతి భీతా ॥ 4 ॥

నగరమునందును నభమునందును వాద్యములు మ్రోగినవి. దుష్టులు ఉదాసీనులైరి. సాధుజనులు సంతోషించిరి. సురకిన్నర నరనాగ మునీశ్వరులు "జయము జయము" అని ఆశీర్వదించిరి. దివ్యాంగనలు పాటలు పాడుచు నాట్యములు చేయుచుండిరి. వారిదోసిళ్లనుండి పూవులు భూమికి జారుచుండెను. బ్రాహ్మణులవేదఘోషలు సర్వత్ర వినిపించుచుండెను. వందిమాగధులు బిరుదావళులను ఉచ్చరించుచుండిరి. శ్రీరాముడు శివధనుర్భంగము గావించి, సీతను వరించెనను శుభవార్త స్వర్గ మర్త్య పాతాళ లోకములయందు క్షణములో వ్యాపించెను. నగరప్రజలు మంగళహారతులను ఇచ్చుచుండిరి. వారు తమశక్తికిమించిన కానుకలను సమర్పించుచుండిరి. శ్రీసీతారాములజంట సౌందర్యశృంగారములు ఒకేచోట మూర్తీభవించినట్లు మనోహరముగా ఉండెను. సఖులు "సీతా! నీ ప్రభుపాదములకు ప్రణమిల్లుము"- అని పలికిరి. కాని సీతాదేవి ఆయన పాదములను తాకుటకు భయపడెను. (చౌ॥ 1-4)

దో- గౌతమ తియ గతి సురతి కరి, నహిఁ పరసతి పగ పాని ।
మన బిహసే రఘుబంసమని, ప్రీతి అలౌకిక జాని ॥ 265 ॥

గౌతమ పత్నియగు అహల్య గతిని స్మరించి, సీతాదేవి తనపతి పాదములను చేతులతో తాకుటకు వెనుకాడెను. ఈ అలౌకిక ప్రేమనుగాంచి, శ్రీరాముడు తనలో తాను నవ్వుకొనెను. (దో॥ 265)

చౌ- తబ సియ దేఖి భూప అభిలాషే । కూర కపూత మూఢ మన మాఖే ॥
ఉఠి ఉఠి పహిరి సనాహ అభాగే । జహఁ తహఁ గాల బజావన లాగే ॥ 1 ॥
లేహు ఛడాఇ సీయ కహ కోఊ । ధరి బాఁధహు నృప బాలక దోఊ ॥
తోరేఁ ధనుషు చాడ నహిఁ సరఈ । జీవత హమహి కుఅఁరి కో బరఈ ॥ 2 ॥
జౌఁ బిదేహు కఛు కరై సహాఈ । జీతహు సమర సహిత దోఉ భాఈ ॥
సాధు భూప బోలే సుని బానీ । రాజసమాజహి లాజ లజానీ ॥ 3 ॥
బలు ప్రతాపు బీరతా బడాఈ । నాక పినాకహి సంగ సిధాఈ ॥
సోఇ సూరతా కి అబ కహుఁ పాఈ । అసి బుధి తౌ బిధి ముహఁ మసి లాఈ ॥ 4 ॥

సీతాదేవిని జూచిన రాజన్యులకు ఆమెపై మోహము అధికమాయెను. దుష్టులు, మూర్ఖులు ఐన రాజులు క్రుద్ధులైరి. ఆ భాగ్యహీనులు కవచములను ధరించి, బీరములను పలుక సాగిరి. వారిలో ఒకడు ఇట్లు పలుక సాగెను. "సీతను బలవంతముగా ఎత్తుకొనిపోయెదము. ఆ రాకుమారులను శ్రద్ధతోని బంధించెదము. ధనుర్భంగమాత్రమున పని పూర్తిగాలేదు. మేము బ్రతికియుండగా రాకుమారిని ఎవరు పెండ్లియాడెదరో చూచెదముగాక." మఱియొకడిట్లు మాటాడెను. మాకు వ్యతిరేకముగా "జనకరాజు వారికి సాయపడినచో వారితోపాటు ఆయననుగూడ యుద్ధమున ఓడించెదము. వారి ప్రగల్భ వచనములను విని" సజ్జనులైన కొందఱు రాజులు ఇట్లనిరి. "ఈ మూర్ఖులను జూచి, సిగ్గునకే సిగ్గగుచున్నది. అరే ఓ మూర్ఖులారా! మీ బలపరాక్రమములు, గౌరవ ప్రతిష్ఠలు ధనుస్సుతోనే పోయినవి. మఱల మీకు వీరత్వము క్రొత్తగా పుట్టుకొని వచ్చినదా? మీలో ఇట్టి దుష్టత్వము ఉన్నందులకే విధాత మీ ముఖములను నల్లగా మార్చినాడు. (చౌ॥ 1-4)

దో-దేఖహు రామహి నయన భరి, తజి ఇరిషా మదు కోహు ।
లఖన రోషు పావకు ప్రబల, జాని సలభ జని హోహు ॥ 266 ॥

ఈర్ష్య, గర్వము, క్రోధములను వదలి, శ్రీరామచంద్రుని కనులపండువుగా చూడుడు. లక్ష్మణుని కోపాగ్నికి శలభములు కావద్దు. (దో॥ 266)

చౌ- బైనతేయ బలి జిమి చహ కాగూ । జిమి ససు చహై నాగ అరి భాగూ ॥
జిమి చహ కుసల అకారన కోహీ । సబ సంపదా చహై సివద్రోహీ ॥ 1 ॥
లోభీ లోలుప కల కీరతి చహఈ । అకలంకతా కి కామీ లహఈ ॥
హరిపద బిముఖ పరమ గతి చాహా । తస తుమ్హార లాలచు నరనాహా ॥ 2 ॥
కోలాహలు సుని సీయ సకానీ । సఖీఁ లవాఇ గఈఁ జహఁ రానీ ॥
రాము సుభాయఁ చలే గురు పాహీఁ । సియ సనేహు బరనత మన మాహీఁ ॥ 3 ॥

రానిన్హ సహిత సోచబస సీయా । అబ ధౌం బిధిహి కాహా కరనీయా ॥
భూప బచన సుని ఇత ఉత తకహీం । లఖను రామ డర బోలి న సకహీం ॥ 4 ॥

గరుత్మంతుని కర్ణమైన ఆహారమును కాకి కోరినట్లు, సింహము యొక్క ఆహారమును కుందేలు ఆశించినట్లు, అకారణకోపిష్ఠి సుఖశాంతులకు అఱ్ఱులుసాచినట్లు, శివవైరి సమస్తసంపదలను కాంక్షించినట్లు, లోభులు, దురాశాపరులు కీర్తికై ప్రాకులాడినట్లు, కాముకుడైనవాడు నిష్కళంకత్వమును వాంఛించినట్లు, శ్రీహరిపాదపద్మములయెడ విముఖులైనవారు మోక్షమునకై కాంక్షపడినట్లు, ఓ రాజులారా! సీతాదేవిని మీరు కోరుకొనుట వ్యర్థము. "ఈ కోలాహలమును అంతయు విని సీతాదేవి భయపడెను. సఖులామెను అక్కడినుండి రాణికడకు తీసికొనిపోయిరి. శ్రీరాముడు సీతాదేవిని మనస్సులో మెచ్చుకొనుచు తనసహజగమనముతో గురువునొద్దకు వచ్చెను. "విధాత ఏమి చేయనున్నాడో?" అని సీతాదేవియు, రాణులును కలవరపడిరి. రాజుల మాటలు విని, లక్ష్మణుడు ఇటునటు చూచుచుండెను. కాని శ్రీరామునకు వెఱచి ఊరకుండెను. (చౌ॥ 1-4)

దో- అరున నయన భృకుటీ కుటిల, చితవత నృపన్హ సకోప ।
మనహుఀ మత్త గజగన నిరఖి, సింఘకిసోరహి చోప ॥ 267 ॥

లక్ష్మణునికన్నులు ఎఱ్ఱబారెను. భ్రుకుటి ముడిపడెను. సింహకిశోరము ఏనుగుల గుంపును జూచి లంఘించుటకు ఆరాటపడుచున్నట్లు లక్ష్మణుడు క్రుద్ధుడై ఆ మూర్ఖులైన రాజుల వైపు జూచెను. (దో॥ 267)

## పరశురాముని ఆగమనము

చౌ- ఖరభరు దేఖి బికల పుర నారీం । సబ మిలి దేహీం మహీపన్హ గారీం ॥
తెహిం అవసర సుని సివ ధను భంగా । ఆయఉ భృగుకుల కమల పతంగా ॥ 1 ॥
దేఖి మహీప సకల సకుచానే । బాజ ఝపట జను లవా లుకానే ॥
గౌరి సరీర భూతి భల భ్రాజా । భాల బిసాల త్రిపుండ బిరాజా ॥ 2 ॥
సీస జటా ససిబదను సుహావా । రిసబస కఛుక అరున హోఇ ఆవా ॥
భృకుటీ కుటిల నయన రిస రాతే । సహజహుఀ చితవత మనహుఀ రిసాతే ॥ 3 ॥
బృషభ కంధ ఉర బాహు బిసాలా । చారు జనేఉ మాల మృగఛాలా ॥
కటి మునిబసన తూన దుఇ బాంధేం । ధను సర కర కుఠారు కల కాంధేం ॥ 4 ॥

ఈ గందరగోళమును గాంచి, స్త్రీలందఱును వ్యాకులపడి, రాజులను దూషింపసాగిరి. అదే సమయమున భృగువంశజుడైన పరశురాముడు శివధనుర్భంగధ్వానమును విని, అచటికి ఏతెంచెను. ఆయనను చూడగనే రాజులు అందఱును గడగడ వణకసాగిరి. ఆకసమున డేగను చూడగానే లావుకపిట్టలు భయముతో దాగికొనినట్లు పరశురాముని గాంచినంతనే రాజులెల్లరును భీతచిత్తులై దాగికొనిరి. ఆయనగౌరవర్ణశరీరముపై భస్మము, లలాటముపై త్రిపుండ్రములు శోభిల్లు చుండెను. శిరమున జటాజూటమును గల్గియుండెను. సుందరముఖచంద్రుడు కోపమున కొంచెము ఎఱ్ఱబారియుండెను. కనుబొమలు ముడివడియుండెను. కన్నులు క్రోధముతో ఎఱుపెక్కియుండెను. చూచువారికి ఆయన సహజదృష్టియు క్రోధమునే ప్రకటించుచుండెను. భుజములు

వృషభమూపురములవలె బలిష్ఠములై సమున్నతములై ఒప్పుచుండెను. ఱొమ్ము విశాలముగా, బాహువులు పొడవుగా ఉండెను. ఆయన యజ్ఞోపవీతమును, రుద్రాక్షమాలను, జింకచర్మమును ధరించియుండెను. వల్కలధారియై, చేతులలో ధనుర్బాణములను, రెండు తూణీరములను, భుజమున గండ్రగొడ్డలిని కలిగియుండెను. (చౌ॥ 1-4)

**దో-సాంత బేషు కరనీ కఠిన, బరని న జాఇ సరూప।**
**ధరి మునితను జను బీర రసు, ఆయఉ జహఁ సబ భూప ॥ 268 ॥**

అతడు మునివేషధారియైనను ఆయనకృత్యములన్నియును చెప్పలేనంత కఠోరముగా ఉండెను. వీరరసము ముని రూపమును దాల్చి, రాజుల మధ్యకు వచ్చినదా యనునట్లుండెను. (దో॥ 268)

**చౌ-దేఖత భృగుపతి బేషు కరాలా। ఉఠే సకల భయ బికల భుఆలా ॥**
**పితు సమేత కహి కహి నిజ నామా। లగే కరన సబ దండ ప్రనామా ॥ 1 ॥**
**జేహి సుభాయఁ చితవహిఁ హితు జానీ। సో జానఇ జను ఆఇ ఖుటానీ ॥**
**జనక బహోరి ఆఇ సిరు నావా। సీయ బోలాఇ ప్రనాము కరావా ॥ 2 ॥**
**ఆసిష దీన్హి సఖీఁ హరషానీఁ। నిజ సమాజ లై గఈఁ సయానీఁ ॥**
**బిస్వామిత్రు మిలే పుని ఆఈ। పద సరోజ మేలే దోఉ భాఈ ॥ 3 ॥**
**రాము లఖను దసరథ కే ఢోటా। దీన్హి అసీస దేఖి భల జోటా ॥**
**రామహి చితఇ రహే థకి లోచన। రూప అపార మార మద మోచన ॥ 4 ॥**

పరశురాముని భయంకరాకారమునుగాంచి, రాజులెల్లరును వికలమనస్కులై భయముతో లేచినిలబడిరి. తమ పేర్లను, కులగోత్రములతో సహా చెప్పుకొని, దండప్రణామములనాచరించిరి. పరశురాముడు ఎవ్వరినైనను సహజముగా చూచినను తమకు ఇక 'నూకలు చెల్లినట్లే' అని అందఱును భావించుచుండిరి. జనకుడు ఆయనకు ప్రణమిల్లి, సీతాదేవిని పిలిచి, ఆమెతో నమస్కరింప జేసెను. పరశురాముడు ఆమెను ఆశీర్వదించెను. చెలులు మిగుల హర్షించి, ఆమెను తమతో పాటు లోనికి దీసికొని పోయిరి. పిమ్మట విశ్వామిత్రుడు రామలక్ష్మణులచే ఆయన పాదములకు ప్రణమిల్లజేసెను. పిమ్మట "వీరు దశరథ మహారాజు పుత్రులు, రామలక్ష్మణులు"- అని తెలిపెను. ఆ సుందరరాకుమారులజంటను జూచి, పరశురాముడు వారినాశీర్వదించెను. మన్మథుని సౌందర్యమునే అధఃకరించు శ్రీరామునిఅద్భుతమైన సౌందర్యమును పరశురాముడు రెప్పలార్పక చూచెను. (చౌ॥ 1-4)

**దో-బహురి బిలోకి బిదేహ సన, కహహు కాహ అతి భీర।**
**పూఛత జాని అజాన జిమి, బ్యాపెఉ కోపు సరీర ॥ 269 ॥**

పరశురాముడు ఒక పర్యాయము అందఱిని కలయజూచి, తనకేమియు తెలియనట్లు "ఈ జనసమూహము ఇచటికి చేరుటకు కారణమేమి?" అని జనకుని అడిగెను. ఇట్లు ప్రశ్నించుచునే అతడు కోపోద్రిక్తుడాయెను. (దో॥ 269)

చౌ- సమాచార కహి జనక సునాఏ। జెహి కారన మహీప సబ ఆఏ ॥
సునత బచన ఫిరి అనత నిహారే। దేఖే చాపఖండ మహి డారే ॥ 1 ॥
అతి రిస బోలే బచన కఠోరా। కహు జడ జనక ధనుష కై తోరా ॥
బేగి దెఖాఉ మూఢ న త ఆజూ। ఉలటఉఁ మహి జహఁ లహి తవ రాజూ ॥ 2 ॥
అతి డరు ఉతరు దేత నృపు నాహీఁ। కుటిల భూప హరషే మన మాహీఁ ॥
సుర ముని నాగ నగర నర నారీ। సోచహిఁ సకల త్రాస ఉర భారీ ॥ 3 ॥
మన పఛితాతి సీయ మహతారీ। బిధి అబ సఁవరీ బాత బిగారీ ॥
భృగుపతి కర సుభాఉ సుని సీతా। అరధ నిమేష కలప సమ బీతా ॥ 4 ॥

రాజులందఱును అక్కడ సమావేశమైనకారణమును జనకుడు ఆయనకు తెలిపెను. జనకుని ప్రత్యుత్తరమును వినుచునే నేలపై బడియున్న శివధనుస్సుముక్కలను గాంచెను. కట్టలు తెంచుకొనిన కోపముతో పరశురాముడు కఠోర వచనములను బలికెను. "ఓ మూర్ఖజనకుడా! ధనుస్సును విరిచినదెవరో తెలుపుము. వెంటనే అతనిని చూపుము. లేనిచో నీరాజ్యమును అస్తవ్యస్తముగావించెదను. భయకారణముగ జనకుడు అందులకు ప్రత్యుత్తరమునీయలేదు. దీనిని చూచుచున్న కుటిలురైన రాజులు మిక్కిలి సంతోషించిరి. దేవతలు, మునులు, నాగులు, పురజనులు కలతచెందిరి. అందఱిహృదయములలో భయాందోళనలు అలముకొనెను. "అయ్యో! పూర్తియైన కార్యమును విధాత చెడగొట్టు చున్నాడే" అని సీతాదేవితల్లి విచార పడెను. పరశురాముని క్రోధస్వభావమునుజూచి సీతాదేవి క్షణమొక యుగముగా భావించెను. (చౌ॥ 1-4)

దో-సభయ బిలోకే లోగ సబ, జాని జానకీ భీరు।
హృదయఁ న హరషు బిషాదు కఛు, బోలే శ్రీరఘుబీరు ॥ 270 ॥

జనులెల్లరును భయభ్రాంతులగుటను, సీతాదేవి భీతిల్లుటను గాంచియు శ్రీరాముడు హర్షశోకాది వికారములకు ఏ మాత్రము లోనుగాకుండ పరశురామునితో ఇట్లు పలికెను. (దో॥ 270)

## మాసపారాయణము-తొమ్మిదవ విరామము

చౌ- నాథ సంభుధను భంజనిహారా। హోఇహి కెఉ ఎక దాస తుమ్హారా ॥
ఆయసు కాహ కహిఅ కిన మోహీ। సుని రిసాఇ బోలే ముని కోహీ ॥ 1 ॥
సేవకు సో జో కరై సెవకాఈ। అరి కరనీ కరి కరిఅ లరాఈ ॥
సునహు రామ జెహిఁ సివధను తోరా। సహసబాహు సమ సో రిపు మోరా ॥ 2 ॥
సో బిలగాఉ బిహాఇ సమాజా। న త మారే జైహహిఁ సబ రాజా ॥
సుని ముని బచన లఖన ముసుకానే। బోలే పరసుధరహి అపమానే ॥ 3 ॥

బహు ధనుహీం తోరీం లరికాఈం । కబహుం న అసి రిస కీన్హి గొసాఈం ॥
ఏహి ధను పర మమతా కెహి హేతూ । సుని రిసాఇ కహ భృగుకులకేతూ ॥ 4 ॥

"స్వామీ! ఎవరో మీ దాసుడే ఈ శివధనుస్సును విఱిచి ఉండవచ్చును. మీ ఆజ్ఞను నాకు తెల్పుడు." ఈమాటలకు పరశురాముడు ఇంకను కోపోద్రిక్తుడాయెను. సేవకుని పని "సేవ చేయుట మాత్రమే. కనుక రామా! వినుము. నాకు విరుద్ధముగా ఈ శివధనువును విఱిచినవాడు సహస్ర బాహువువలె నాకు శత్రువు. ఈ సమూహమునుండి అతనిని బయటికి రానిమ్ము. లేనిచో ఈ రాజులందఱును నిహతులగుదురు." ముని బెదరింపులను వినగానే లక్ష్మణుడు నిరాదరమును ప్రకటించుచిఱునవ్వుతో ఇట్లనెను. "స్వామీ! నా బాల్యమున నేను అనేకచాపములను విఱిచితిని. కానీ మీరు ఎప్పుడును కోపగింపలేదు. ఈ చాపముపైననే మీకింత ప్రీతియేల?" ఈ మాటలు వినగానే భార్గవ రాముడు పట్టరాని కోపముతో ఇట్లు పలికెను. (చౌ॥ 1-4)

దో-రే నృప బాలక కాల బస, బోలత తోహి న సంభార ।
ధనుహీ సమ తిపురారి ధను, బిదిత సకల సంసార ॥ 271 ॥

"ఓరీ! రాకుమారా! నీకు చావుమూడినది. నీవేమి పల్కుచుంటివో నీకు తెలియుటలేదు. లోక ప్రశస్తమైన ఈ శివధనుస్సును ఇతర ధనుస్సులతో పోల్చుట తగునా?" (దో॥ 271)

చౌ-లఖన కహా హఁసి హమరేం జానా । సునహు దేవ సబ ధనుష సమానా ॥
కా ఛతి లాభు జూన ధను తోరేం । దేఖా రామ నయన కే భోరేం ॥ 1 ॥
ఛుఅత టూట రఘుపతిహు న దోసూ । ముని బిను కాజ కరిఅ కత రోసూ ॥
బోలే చితఇ పరసు కీ ఓరా । రే సఠ సునేహి సుభాఉ న మోరా ॥ 2 ॥
బాలకు బోలి బధఉం నహిం తోహీ । కేవల ముని జడ జానహి మోహీ ॥
బాల బ్రహ్మచారీ అతి కోహీ । బిస్వ బిదిత ఛత్రియకుల ద్రోహీ ॥ 3 ॥
భుజబల భూమి భూప బిను కీన్హీ । బిపుల బార మహిదేవన్హ దీన్హీ ॥
సహసబాహు భుజ ఛేదనిహారా । పరసు బిలోకు మహీపకుమారా ॥ 4 ॥

లక్ష్మణుడు నవ్వి ఇట్లనెను. "మునీశ్వరా! వినుడు. మా దృష్టిలో చాపములన్నియును సమానమే. తుప్పుపట్టిన ఈపాతచాపమును విఱుచుటవలన కలుగునష్టమేమి? శ్రీరామచంద్రుడు దానిని క్రొత్త చాపమని భావించి యుండెను. కాని అతడు దానిని తాకినంతనే అది విఱిగినది. ఇందులో శ్రీరాముని దోషము ఏ మాత్రమూ లేదు. మీరు వ్యర్థముగా ఏల కోపగించెదరు"- పరశురాముడు తన గండ్రగొడ్డలివైపు ఒకసారిచూచి పలికెను. "అరే! దుష్టుడా నీకు నా స్వభావమునుగూర్చి తెలియదు. నీవు బాలుడవుగావున నిన్ను చంపదలచుకొనలేదు. మూర్ఖుడా! నన్ను కేవలము ఒక మునిగా భావించితివా? నేను ఆజన్మ బ్రహ్మచారిని. కోపిష్ఠిని. నేను క్షత్రియులకు విరోధినని లోకవిదితము. నా బాహుబలముచే పెక్కు పర్యాయములు పృథ్విని క్షత్రియరహితముగా జేసి, దానిని బ్రాహ్మణులకు దానము చేసితిని. ఓరాకుమారా! నా పరశువును జూడుము. దీనితో సహస్రబాహుభుజములను నఱికివేసితిని."- (చౌ॥ 1-4)

దో- మాతు పితహి జని సోచబస, కరసి మహీసకిసోర ।
గర్భన్హ కే అర్భక దలన, పరసు మోర అతి ఘోర ॥ 272 ॥

రాజకుమారా! నీ తల్లిదండ్రులను పుత్రశోకమునకు గురిచేయ వద్దు. నా పరశువు చాల భయంకరమైనది. దాని భయమునకు గర్భస్థ శిశువులు గూడ మృతులైరి. (దో॥ 272)

చౌ- బిహసి లఖను బోలే మృదు బానీ । అహో మునీసు మహా భటమానీ ॥
పుని పుని మోహి దెఖావ కుఠారూ । చహత ఉడావన ఫూఁకి పహారూ ॥ 1 ॥
ఇహాఁ కుమ్హడబతియా కోఉ నాహీఁ । జే తరజనీ దేఖి మరి జాహీఁ ॥
దేఖి కుఠారు సరాసన బానా । మైఁ కఛు కహా సహిత అభిమానా ॥ 2 ॥
భృగుసుత సముఝి జనేఉ బిలోకీ । జో కఛు కహహు సహఉఁ రిస రోకీ ॥
సుర మహిసుర హరిజన అరు గాఈ । హమరేఁ కుల ఇన్హ పర న సురాఈ ॥ 3 ॥
బధేఁ పాపు అపకీరతి హారేఁ । మారతహూఁ పా పరిఅ తుమ్హారేఁ ॥
కోటి కులిస సమ బచను తుమ్హారా । బ్యర్థ ధరహు ధను బాన కుఠారా ॥ 4 ॥

లక్ష్మణుడు హసన్ముఖుడై మృదుమధురముగా ఇట్లు పలికెను. "ఆహా! ఈ మునీశ్వరుడు తానొక అసాధారణ యోధుడనని భావించుకొనుచున్నాడు. మాటిమాటికిని తనగొడ్డలిని చూపించుచున్నాడు. బహుశా 'ఉఫ్' అని ఊది పర్వతమును సైతము ఎగురగొట్టదలచుకొనినాడేమో? చూపుడువ్రేలిని చూపగనే వాడిపోవుటకు ఇక్కడ గుమ్మడిపూవు లేదు. మీ కరములయందు గొడ్డలిని, ధనుర్బాణములను చూచిన పిమ్మటనే నేను కొంచెము అభిమానముతో మాట్లాడితిని. మీరు భృగువంశజులని గ్రహించి, మీ యజ్ఞోపవీతమును జూచి, కోపమును నిగ్రహించుకొని, మీ మాటలను సహించితిని. మా వంశము వారెవ్వరును దేవతలు బ్రాహ్మణులు గోవులు, శ్రీహరి భక్తులు మొదలగు వారిపై తమ ప్రతాపమును చూపరు. ఏలనన వారిని చంపినచో మహాపాపము, వారితో ఓడినచో అపకీర్తి ప్రాప్తించును. మీరు మమ్ముకొట్టినను తిట్టినను మేము మీకు పాదాభివందనమునే చేయుదుము. మీ ప్రతిమాటయు కోటిఅశనిపాతములతో సమానము. (అతికఠోరము.) ఇక పరశువును గాని, ధనుర్బాణములనుగాని మీరు ధరింపవలసిన అవసరమేలేదు. (చౌ॥ 1-4)

దో- జో బిలోకి అనుచిత కహేఉఁ, ఛమహు మహాముని ధీర ।
సుని సరోష భృగుబంసమని, బోలే గిరా గభీర ॥ 273 ॥

"ఓ ధీరమునీ! పరశువుమున్నగు మీ ఆయుధములనుజూచి నేనేమైనా అనుచిత వచనములను పలికినచో నన్ను క్షమింపుడు." ఈ మాటలను విని, పరశురాముడు క్రుద్ధుడై గంభీరముగా ఇట్లనెను. (దో॥ 273)

చౌ- కౌసిక సునహు మంద యహు బాలకు । కుటిల కాలబస నిజ కుల ఘాలకు ॥
భాను బంస రాకేస కలంకూ । నిపట నిరంకుస అబుధ అసంకూ ॥ 1 ॥
కాల కవలు హోఇహి ఛన మాహీఁ । కహఉఁ పుకారి ఖోరి మోహి నాహీఁ ॥
తుమ్హ హటకహు జౌఁ చహహు ఉబారా । కహి ప్రతాపు బలు రోషు హమారా ॥ 2 ॥

లఖన కహేఉ ముని సుజసు తుమ్హారా । తుమ్హహి అఛత కో బరనై పారా ॥
అపనే ముఁహ తుమ్హ ఆపని కరనీ । బార అనేక భాఁతి బహు బరనీ ॥ 3 ॥
నహిఁ సంతోషు త పుని కఛు కహహూ । జని రిస రోకి దుసహ దుఖ సహహూ ॥
బీరబ్రతీ తుమ్హ ధీర అఛోభా । గారీ దేత న పావహు సోభా ॥ 4 ॥

"ఓ విశ్వామిత్రా! వినుము. ఈ బాలుడు మిక్కిలి మందుడు, కుటిలుడు మఱియు ఆత్మఘాతకుడేగాక, వంశనాశకుడుగూడ అగుచున్నాడు. సూర్యవంశమను పూర్ణచంద్రునకు ఇతడొక కళంకము. ఉద్దండుడు, మూర్ఖుడు, ఏ మాత్రమూ భయభక్తులు లేనివాడు. ఇప్పటికిప్పుడే ఇతనిని యముని కడకు పంపెగలను. వాస్తవముగా నేను ఉన్న మాటనే చెప్పుచున్నాను. తరువాత ఎవ్వరూ నన్ను నిందింపరాదు. మీరు అతనిని రక్షింపదలచినచో నాబల పరాక్రమములను, కోపమును గూర్చి అతనికి చెప్పి, అతని దూకుడును అరికట్టండి."- మఱల లక్ష్మణుడు ఇట్లనెను. "ఓ మునీశ్వరా! మీ కీర్తిని మీరే పొగడుకొనుచుండగా ఇతరులతో పనియేమి? మీఘనకార్యములనుగూర్చి మీ నోటిద్వారా పెక్కుమార్లు మీరేవల్లెవేసితిరి. ఇంకా తృప్తి లేనిచో మరికొన్నింటిని వల్లెవేయుడు. మీ కోపమును అపుకొన వద్దు. దానిని పూర్తిగా వెళ్లగక్కుడు. లేనిచో దానిని భరించుట మీకు కష్టము కావచ్చును. మీరు వీరులు, ధీరులు క్షోభరహితులు. కావున మీరు ఈ విధముగా దూషించుట సముచితముగాదు. (చౌ॥ 1-4)

దో- సూర సమర కరనీ కరహిఁ, కహి న జనావహిఁ ఆపు ।
బిద్యమాన రన పాఇ రిపు, కాయర కథహిఁ ప్రతాపు ॥ 274 ॥

వీరులైనవారు యుద్ధములో తమశౌర్యమును జూపెదరు. తమ బలపరాక్రమములను గూర్చి తామే చెప్పికొనరు. శత్రువునెదుట పిరికివాడుమాత్రమే తనప్రతాపమును గూర్చి ప్రగల్భములను పలుకుచుండును. (దో॥ 274)

చౌ- తుమ్హ తౌ కాలు హాఁక జను లావా । బార బార మోహి లాగి బోలావా ॥
సునత లఖన కే బచన కఠోరా । పరసు సుధారి ధరేఉ కర ఘోరా ॥ 1 ॥
అబ జని దేఇ దోసు మోహి లోగూ । కటుబాదీ బాలకు బధజోగూ ॥
బాల బిలోకి బహుత మైఁ బాఁచా । అబ యహు మరనిహార భా సాఁచా ॥ 2 ॥
కౌసిక కహా ఛమిఅ అపరాధూ । బాల దోష గున గనహిఁ న సాధూ ॥
ఖర కుఠార మైఁ అకరున కోహీ । ఆగేఁ అపరాధీ గురుద్రోహీ ॥ 3 ॥
ఉతర దేత ఛోడఉఁ బిను మారేఁ । కేవల కౌసిక సీల తుమ్హారేఁ ॥
న త ఏహి కాటి కుఠార కఠోరేఁ । గురహి ఉరిన హోతేఉఁ శ్రమ థోరేఁ ॥ 4 ॥

ఓ మునీశ్వరా! మాటిమాటికి నా కొఱకు యముని ఎలుగెత్తి పిలుచు చున్నారు. లక్ష్మణుని ఈ కఠోరవచనములను విని, పరశురాముడు పదునైన తన గండ్రగొడ్డలిని, ఎత్తి చేతిలోనికి తీసికొని పలికెను. "ఎవ్వరూ నన్ను నిందింపవలదు. పరుషములాడు ఈ బాలుడు వధార్హుడు. బాలుడని భావించియే, వీనిని ఇంతవఱకును క్షమించితిని. కాని నిజముగా ఇతడు ఇంతకుముందే చంపబడవలసినవాడు."- విశ్వామిత్రుడు పలికెను. "ఈతని అపరాధమును క్షమింపుడు. సాధువులైన సజ్జనులు బాలుర గుణదోషములను పట్టించుకొనరు." పరశురాముడు

పలికెను." నాకుఠారము మిక్కిలి పదునైనది. నేను దయారహితుడను, కోపిష్ఠిని, ఈ గురుద్రోహి, అపరాధి, నాయెదుటనే యుండి నన్ను ఎదిరించు చున్నాడు. ఐనప్పటికిని మీమీది గౌరవముతో నేను ఇతనిని ఇంతవఱకును ఉపేక్షించుచువచ్చితిని. విశ్వామిత్రా! కేవలము మీమీది ప్రేమతో మాత్రమే ఇతనిని వదలివేయుచు ఉంటిని. లేనిచో ఈ గొడ్డలితో ఈతనిని నఱికి, నా గురు ఋణమును అవలీలగా తీర్చుకొని యుండెడివాడను." (చౌ॥ 1-4)

దో- గాధిసూను కహ హృదయఁ హఁసి, మునిహి హరిఅరఇ సూఝ ।
అయమయ ఖాఁడ న ఊఖమయ, అజహుఁ న బూఝ అబూఝ ॥ 275 ॥

విశ్వామిత్రుడు మనస్సులోనే నవ్వుకొని ఇట్లు తలపోసెను. "ఈ మునికి ఎచ్చటనూ తనకు తిరుగేలేనట్లు కనిపించుచున్నది. అనగా క్షత్రియులను అందఱినీ జయించియుండుటవలన రామలక్ష్మణులను గూడ సాధారణ క్షత్రియులుగా భావించుచున్నాడు. ఈ సోదరులు ఇనుపఖడ్గములు. (చప్పరించుటకు) ఇక్షు ఖండములు గారు. ముని ఇంకను వీరిప్రభావమును గ్రహింపకపోవుట విచారకరము. (దో॥ 275)

చౌ- కహేఉ లఖన ముని సీలు తుమ్హారా । కో నహిఁ జాన బిదిత సంసారా ॥
మాతా పితహి ఉరిన భఏ నీకేఁ । గుర రిను రహా సోచు బడ జీ కేఁ ॥ 1 ॥
సో జను హమరేహి మాథే కాఢా । దిన చలి గఏ బ్యాజ బడ బాఢా ॥
అబ ఆనిఅ బ్యవహరిఆ బోలీ । తురత దేఉఁ మైఁ థైలీ ఖోలీ ॥ 2 ॥
సుని కటు బచన కుఠార సుధారా । హాయ హాయ సబ సభా పుకారా ॥
భృగుబర పరసు దెఖావహు మోహీ । బిప్ర బిచారి బచఉఁ నృపద్రోహీ ॥ 3 ॥
మిలే న కబహుఁ సుభట రన గాఢే । ద్విజదేవతా ఘరహి కే బాఢే ॥
అనుచిత కహి సబ లోగ పుకారే । రఘుపతి సయనహిఁ లఖను నేవారే ॥ 4 ॥

లక్ష్మణుడు పలికెను. "ఓ మునీశ్వరా! మీ శీలమును ఎవరెరుగరు? అది లోకప్రసిద్ధము. మాతాపితరులఋణమును బాగుగా తీర్చితివి. ఇంక గురువుగారిఋణము తీర్చవలసియున్నది. అందులకే నీవు విచారించుచుంటివేమో? బహుశా ఆ ఋణము మా ద్వారా తీరవలసియున్నదేమో? చాలా దినములు గడిచినవి. వడ్డీకూడా ఎంతో పెఱిగియుండవచ్చును. ఎవరినైనా ఒక మహాగణకుని పిల్చుకొని రండు. ఇప్పుడే ముల్లెవిప్పి, నేను ఆ ఋణమును పూర్తిగా తీర్చగలను."- లక్ష్మణుని పరుషవాక్యములను విని, పరశు రాముడు తన గొడ్డలిని పైకెత్తెను. సభలో హాహాకారములు చెలరేగెను. మఱల లక్ష్మణుడు పలికెను. "ఓ పరశురామా! మీరు నాపై గొడ్డలిని ఎత్తితిరి. నృపద్రోహీ! బ్రాహ్మణుడవైనందువ నీవు బ్రతికిపోయితివి. నీవు ఇంత వఱకును సరియైనయోధునిచేతిలో పడలేదు. ఓ భూసురుడా! నీ గృహమునందే నీవు గొప్ప వాడవు." ఈ మాటలను విని, యందఱును "అనుచితము అనుచితము" అని పలుకుచు లేచిరి. అపుడు శ్రీరాముడు 'ఊరకుండుము' అని లక్ష్మణునకు సంజ్ఞ చేసెను.
(చౌ॥ 1-4)

దో- లఖన ఉతర ఆహుతి సరిస, భృగుబర కోపు కృసాను ।
బఢత దేఖి జల సమ బచన, బోలే రఘుకులభాను ॥ 276 ॥

లక్ష్మణుని మాటలు ఆజ్యములై పరశురాముని కోపాగ్నిని ప్రజ్వలింపజేసినవి. దానిని చల్లార్చుటకు జలము వంటి చల్లని మాటలను శ్రీరాముడు పలికెను. (దో॥ 276)

చౌ- నాథ కరహు బాలక పర ఛోహూ । సూధ దూధముఖ కరిఅ న కోహూ ॥
జౌఁ పై ప్రభు ప్రభాఉ కఛు జానా । తౌ కి బరాబరి కరత అయానా ॥ 1 ॥
జౌఁ లరికా కఛు అచగరి కరహీఁ । గుర పితు మాతు మోద మన భరహీఁ ॥
కరిఅ కృపా సిసు సేవక జానీ । తుమ్హ సమ సీల ధీర ముని గ్యానీ ॥ 2 ॥
రామ బచన సుని కఛుక జుడానే । కహి కఛు లఖను బహురి ముసుకానే ॥
హఁసత దేఖి నఖ సిఖ రిస బ్యాపీ । రామ తోర భ్రాతా బడ పాపీ ॥ 3 ॥
గౌర సరీర స్యామ మన మాహీఁ । కాలకూటముఖ పయముఖ నాహీఁ ॥
సహజ టేఢ అనుహరఇ న తోహీ । నీచు మీచు సమ దేఖ న మోహీ ॥ 4 ॥

"ప్రభూ! ఈ బాలునిపై దయజూపుడు. ఈ పసివానిపై క్రోధము వలదు. మీ ప్రతాపమునుగూర్చి వీసమాత్రము ఎఱింగియున్నను ఈ విధముగా మిమ్ము ఎదిరించి యుండెడివాడుకాడు. పిల్లలు చేసినఅల్లరికి తల్లిదండ్రులు, గురువులు మనస్సులలో సంతోషపడెదరు. ఇతనిని బాలునిగా, మీ సేవకునిగా భావింపుడు. కృపజూపుడు. మీరు సమదర్శనులు, సుశీలురు, ధీరులు, మునులు, జ్ఞానులు."- శ్రీరామచంద్రుని వచనములను విని, పరశురాముడు చల్లబడుచుండగా లక్ష్మణుడు ఏదోయని నవ్వెను. అతడు నవ్వగానే పరశురాముడు నఖశిఖ పర్యంతము కోపముతో ఊగిపోవుచు ఇట్లు పల్కెను. "ఓ రామా! నీ తమ్ముడు మహాపాపి. శరీరము ఎఱ్ఱగా నున్నను ఈతని మనస్సు నల్లనిది. ఈతడు పసివాడుగాడు విషనాగు. స్వాభావికముగనే ఇతడు వక్రబుద్ధి. నిన్ను అనుసరింపడు (నీవలె సుశీలుడు గాడు). ఈ అధముడు నన్ను మృత్యుదేవతగా ఎఱుంగడు." (చౌ॥ 1-4)

దో- లఖన కహేఉ హఁసి సునహు ముని, క్రోధు పాప కర మూల ।
జెహి బస జన అనుచిత కరహిఁ, చరహిఁ బిస్వ ప్రతికూల ॥ 277 ॥

లక్ష్మణుడు నవ్వి ఇట్లనెను. "ఓ మునీశ్వరా! వినుము. కోపమే పాపాలకు మూలము. దానికిలోనైన వాడు దుష్కర్మలను ఆచరించును. అతడు లోకమునకు కీడునే తలపెట్టును. (దో॥ 277)

చౌ- మైఁ తుమ్హార అనుచర మునిరాయా । పరిహరి కోపు కరిఅ అబ దాయా ॥
టూట చాప నహిఁ జురిహి రిసానే । బైఠిఅ హోఇహిఁ పాయ పిరానే ॥ 1 ॥
జౌఁ అతి ప్రియ తౌ కరిఅ ఉపాఈ । జోరిఅ కోఉ బడ గునీ బోలాఈ ॥
బోలత లఖనహిఁ జనకు డేరాహీఁ । మష్ట కరహు అనుచిత భల నాహీఁ ॥ 2 ॥
థర థర కాఁపహిఁ పుర నర నారీ । ఛోట కుమార ఖోట బడ భారీ ॥
భృగుపతి సుని సుని నిరభయ బానీ । రిస తన జరఇ హోఇ బల హానీ ॥ 3 ॥
బోలే రామహి దేఇ నిహోరా । బచఉఁ బిచారి బంధు లఘు తోరా ॥
మను మలీన తను సుందర కైసేఁ । బిష రస భరా కనక ఘటు జైసేఁ ॥ 4 ॥

ఓ మునిరాజా! నేను మీ సేవకుడను. కోపమును పరిత్యజించి, నాపై దయజూపుడు. కోపమువలన విఱిగినధనుస్సు అతకదు. నిలబడియున్నందువ మీ కాళ్లకు నొప్పులు పుట్టియుండవచ్చును. కూర్చుండుడు. ఈ ధనుస్సు మీకు అంతగా ప్రియమైనచో ఒక నిపుణుని పిలిపించి, అతికింపజేయుడు." లక్ష్మణుని ఈమాటలకు భీతిల్లిన జనకమహారాజు "దయచేసి వాగ్వివాదములను ఆపండి. హద్దులు మీఱుట ఉచితముగాదు."- అనెను. పురప్రజలు గడగడలాడ సాగిరి. "ఈ చిన్నవాడు నిజముగా మిక్కిలి అల్లరివాడు" అనియనుకొనిరి. లక్ష్మణుని నిర్భయవాక్యములను విని, పరశురాముడు క్రోధాగ్నితో మండిపోవుచుండెను. ఆయనశక్తి క్షీణించుచుండెను. శ్రీరామునిపై దయజూపుచున్నట్లుగా అతడు పలికెను. "ఇతడు నీ తమ్ముడు గాబట్టి వదిలి వేయుచున్నాను. ఈతని శరీరము మాత్రము అందమైనది. కాని మనస్సు మలినమైనది. ఇతడు విషముతో నిండిన బంగారుపాత్రవంటివాడు. (పయోముఖ విషకుంభము)". (చౌ॥ 1-4)

దో- ముని లఛిమన బిహసే బహురి, నయన తరేరే రామ ।
గుర సమీప గవనే సకుచి, పరిహరి బానీ బామ ॥ 278 ॥

ఈ మాటలు విని లక్ష్మణుడు మఱల నవ్వెను. అపుడు శ్రీరామచంద్రుడు అతనిని కనుసన్నలతో వారించెను. లక్ష్మణుడు సంకోచముతో తనవ్యంగ్యధోరణినిమాని, గురు సమీపమునకు చేరెను. (దో॥ 278)

చౌ- అతి బినీత మృదు సీతల బానీ । బోలే రాము జోరి జుగ పానీ ॥
సునహు నాథ తుమ్హ సహజ సుజానా । బాలక బచను కరిఅ నహిఀ కానా ॥ 1 ॥
బరరై బాలకు ఏకు సుభాఊ । ఇన్హహి న సంత బిదూషహిఀ కాఊ ॥
తేహిఀ నాహీఀ కఛు కాజ బిగారా । అపరాధీ మైఀ నాథ తుమ్హారా ॥ 2 ॥
కృపా కోపు బధు బఁధబ గోసాఈఀ । మో పర కరిఅ దాస కీ నాఈఀ ॥
కహిఅ బేగి జెహి బిధి రిస జాఈ । మునినాయక సోఇ కరౌఀ ఉపాఈ ॥ 3 ॥
కహ ముని రామ జాఇ రిస కైసేఀ । అజహుఀ అనుజ తవ చితవ అనైసేఀ ॥
ఏహి కేఀ కంఠ కుఠారు న దీన్హా । తౌ మైఀ కాహ కోపు కరి కీన్హా ॥ 4 ॥

శ్రీరామచంద్రుడు చేతులుజోడించి, అత్యంతవినయముతో శీతలమధుర వచనములను పల్కెను. "ప్రభూ! వినుడు. మీరు సహజముగానే జ్ఞానులు. బాలుని వచనములను పట్టించుకొనకుడు. కందురీగల స్వభావము, బాలకుల స్వభావము ఒకటియే (కందురీగ సహజముగా ఎవ్వరికినీ హాని చేయదు. కాని తన జోలికి వచ్చిన వారిని మాత్రము కుట్టును. పిల్లల స్వభావము కూడ అట్టిదే.) సజ్జనులు వారిని దోషులుగా పరిగణింపరు. అపరాధము చేసినవాడను నేను. లక్ష్మణుడు మీకు ఎట్టి హానియు చేయలేదు. స్వామీ! నేను మీ సేవకుడను. కృప, క్రోధము, వధ, బంధనము- వీటిలో ఏ శిక్షనైనను నాకు విధింపుడు. మీ కోపమును తొలగు ఉపాయమును చెప్పుడు. దానిని నేను ఆచరించెదను." ముని సమాధానమును ఇచ్చెను. "రామా! నా కోపము ఎట్లు చల్లారును? నీ తమ్ముడు ఇంకను నావైపు వ్యంగ్య దృష్టితోడనే చూచుచున్నాడు. అతని శిరస్సును ఛేదింపనిదే నా కోపము ఎట్లు చల్లారును? (చౌ॥ 1-4)

దో- గర్భ స్రవహిఀ అవనిప రవని, సుని కుఠార గతి ఘోర।
పరసు అఛత దేఖఉఀ జిఅత, బైరీ భూపకిసోర ॥ 279 ॥

నా గొడ్డలిచేసినఘోరమైనకృత్యములనుగూర్చి విన్నంతమాత్రముననే క్షత్రియస్త్రీలకు గర్భస్రావమగును. అట్టిగొడ్డలి ఉండికూడ శత్రువైన ఈరాకుమారుడు జీవించియుండుటను చూడవలసి వచ్చుచున్నది. (దో॥ 279)

చౌ- బహఇ న హాథు దహఇ రిస ఛాతీ । భా కుఠారు కుంఠిత నృపఘాతీ ॥
భయఉ బామ బిధి ఫిరేఉ సుభాఊ । మోరే హృదయఀ కృపా కసి కాఊ ॥ 1 ॥
ఆజు దయా దుఖు దుసహ సహావా । సుని సౌమిత్రి బిహసి సిరు నావా ॥
బాఉ కృపా మూరతి అనుకూలా । బోలత బచన ఝరత జను ఫూలా ॥ 2 ॥
జౌఀ పై కృపాఀ జరిహిఀ ముని గాతా । క్రోధ భఏఀ తను రాఖ బిధాతా ॥
దేఖు జనక హఠి బాలకు ఏహూ । కీన్హ చహత జడ జమపుర గేహూ ॥ 3 ॥
బేగి కరహు కిన ఆఁఖిన్హ ఓటా । దేఖత ఛోట ఖోట నృప ఢోటా ॥
బిహసే లఖను కహా మన మాహీఀ । మూదేఀ ఆఁఖి కతహుఀ కౌఉ నాహీఀ ॥ 4 ॥

నాహృదయము కోపముతోనిండియున్నను చేయి కదలుటలేదు. అయ్యో! అసంఖ్యాకులైన రాజులను వధించిన ఈ గొడ్డలి మొద్దుబారిపోయినది. విధి నాకు వ్యతిరేకమైనది. నా స్వభావము మారినది. లేనిచో నా హృదయములో ఇతరులపై కృప యెప్పుడుండెను? నేడు ఈ దయ నాలో దుస్సహదుఃఖమును కలిగించుచున్నది"- ఈమాటలు వినగానే లక్ష్మణుడు తలవంచుకొని, చిఱునవ్వుతో ఇట్లనెను. "మీ కృపా చిహ్నకలు మీ ఆకారమునకు తగినట్లే యున్నవి. మీ వచనములు చెట్లనుండి రాలు పూలవలెనున్నవి. ఓ మునీశ్వరా! కృప జూపినప్పుడుగూడ మీ శరీరము దహించుకొనిపోయినచో క్రోధమునకు వశమైనప్పుడు మీ తనువును ఆ విధాతయే రక్షింపవలెను." పరశురాముడు పల్కెను. "జనకా! మూర్ఖుడైన ఈ బాలుడు అర్థములేని పట్టుదలతో యమపురిలో తననివాసమును ఏర్పఱచుకొనదలచినట్లున్నాడు. వెంటనే ఇతనిని నాయెదుటనుండి ఏల తొలగింపవు? చూచుటకు ఇతడు చాల చిన్నవాడు. కాని మిక్కిలి తుంటరి." లక్ష్మణుడు నవ్వుచు తనలో అనుకొనెను. "కనులు మూసికొన్నచో ఏమియు కనబడదు గదా!" (చౌ॥ 1-4)

దో- పరసురాము తబ రామ ప్రతి, బోలే ఉర అతి క్రోధు।
సంభు సరాసను తోరి సఠ, కరసి హమార ప్రబోధు ॥ 280 ॥

కోపోద్రిక్తుడైన పరశురాముడు శ్రీరాముని వైపునకు మఱలి, ఇట్లనుడివెను. "ఓ శఠుడా! శివధనుస్సును విఱిచినది చాలక తిరిగి నాకే జ్ఞానోపదేశమును చేయుచున్నావా?" (దో॥ 280)

చౌ- బంధు కహఇ కటు సమ్మత తోరేఀ । తూ ఛల బినయ కరసి కర జోరేఀ ॥
కరు పరితోషు మోర సంగ్రామా । నాహిఀ త ఛాడ కహాఉబ రామా ॥ 1 ॥
ఛలు తజి కరహి సమరు సివద్రోహీ । బంధు సహిత న త మారఉఀ తోహీ ॥
భృగుపతి బకహిఀ కుఠార ఉఠాఏఀ । మన ముసుకాహిఀ రాము సిర నాఏఀ ॥ 2 ॥
గునహ లఖన కర హమ పర రోషూ । కతహుఀ సుధాఇహు తే బడ దోషూ ॥
టేఢ జాని సబ బందఇ కాహూ । బక్ర చంద్రమహి గ్రసఇ న రాహూ ॥ 3 ॥

రామ కహేఉ రిస తజిఅ మునీసా। కర కుఠారు ఆగేం యహ సీసా ॥
జేహిం రిస జాఇ కరిఅ సోఇ స్వామీ। మోహి జానిఅ ఆపన అనుగామీ ॥ 4 ॥

నీ సమ్మతితోడనే నీ తమ్ముడు దురుసుగా మాట్లాడుచున్నాడు. నీవేమో చేతులు జోడించి, నక్కవినయములను ప్రదర్శించుచున్నావు. నాతో యుద్ధముచేసి, నన్ను తృప్తిపఱచుము. లేదా 'రాముడు' అను పేరును నీవు త్యజింపుము. ఓ శివద్రోహీ! నీ కపటమును మాని, నాతో యుద్ధమునకు రమ్ము. లేనిచో నీ సోదరునితోగూడ నిన్ను వధింతును." ఈ విధముగా పరశురాముడు తనకుఠారమును ఎత్తుచు మితిమీఱి మాట్లాడుచుండెను. శ్రీరాముడు శిరస్సువంచి, దరహాసముతో తనలో తాను ఇట్లు తలపోయసాగెను. "లక్ష్మణుడు తప్పు చేయగా ఈయన నన్ను కోపగించుచున్నాడేమి? ఒక్కొక్కప్పుడు మెత్తదనముగూడ గొప్ప దోషమేయగును. అప్పుడప్పుడు వక్రబుద్ధిని సాధారణముగా అందఱూ గౌరవించు చుందురు. వంకరగా ఉన్న చంద్రుని (నెలవంక) జోలికి రాహువు గూడ పోడుగదా!" పిమ్మట శ్రీరాముడు పరశురామునితో ఇట్లనెను. "మునీశ్వరా! కోపమును వీడుడు. మీ చేతిలో గొడ్డలియున్నది. ఎదురుగా నాతల యున్నది. మీ కోపము చల్లారుటకు తగినట్లు చేయుడు. నేను మీ దాసుడను. (చౌ॥ 1-4)

దో-ప్రభుహి సేవకహి సమరు కస, తజహు బిప్రబర రోసు ।
బేషు బిలోకేం కహేసి కఛు, బాలకహూ నహిం దోసు ॥ 281 ॥

స్వామి సేవకులమధ్య యుద్ధము ఎట్లు సంభవించును? ఓ బ్రాహ్మణోత్తమా! క్రోధమును వీడుడు. మీ వీరోచితవేషమునుబట్టి ఈ బాలుడు ఏమేమో అన్నాడు. ఆలోచించినచో ఇందు అతనిదోషముకూడా ఏమియు కన్పట్టదు. (బ్రాహ్మణవేషముతో వచ్చినచో మీకు ఈ బాధలు కలిగియుండెడివి కావు.) (దో॥ 281)

చౌ- దేఖి కుఠార బాన ధను ధారీ। భై లరికహి రిస బీరు బిచారీ ॥
నాము జాన పై తుమ్హహి న చీన్హా। బంస సుభాయం ఉతరు తేహిం దీన్హా ॥ 1 ॥
జౌం తుమ్హ ఔతేహు ముని కీ నాఈం। పద రజ సిర సిసు ధరత గోసాఈం ॥
ఛమహు చూక అనజానత కేరీ। చహిఅ బిప్ర ఉర కృపా ఘనేరీ ॥ 2 ॥
హమహి తుమ్హహి సరిబరి కసి నాథా। కహహు న కహాం చరన కహం మాథా ॥
రామ మాత్ర లఘు నాము హమారా। పరసు సహిత బడ నాము తోహారా ॥ 3 ॥
దేవ ఏకు గును ధనుష హమారేం। నవ గున పరమ పునీత తుమ్హారేం ॥
సబ ప్రకార హమ తుమ్హ సన హారే। ఛమహు బిప్ర అపరాధ హమారే ॥ 4 ॥

కుఠారమును, ధనుర్బాణములను ధరించినమిమ్మ్ముజూచి, వీరుడనికొని, అతడు ఇట్లు పలికియుండవచ్చును. మీ పేరును మాత్రము ఇదివరలో విన్నాడు. కాని మీ స్వరూపమును గుర్తింపలేదు. తనవంశమునకు తగినరీతిలో అతడు మీకు సమాధానమును ఇచ్చియున్నాడు. ఒకవేళ మీరు మునివేషధారియై వచ్చియున్నచో స్వామీ! ఈ బాలుడు మీపాదధూళిని తనశిరస్సుపై ఉంచుకొనెడి వాడు. తెలియకచేసినతప్పును మన్నింపగలరు. బ్రాహ్మణ హృదయము కృపతో నిండియుండవలెను గదా! ప్రభూ! మీకును నాకును సామ్యము ఎక్కడ? చెప్పండి. శిరస్సు ఎక్కడ? పాదములు ఎక్కడ? 'రాముడు' అను చిన్న పేరునాది. మీపేరో? పరశువుతో గూడిన రాముడు. పెద్దది.

బ్రాహ్మణోత్తమా! నా యొద్ద ఒకే ఒక గుణము (అల్లెత్రాడు) గల ధనుస్సుగలదు; మీలో పరమ పవిత్రములైన తొమ్మిది గుణములు గలవు.

శమో దమస్తపశ్శౌచం క్షాంతిరార్జవ మేవ చ ।
జ్ఞానం, విజ్ఞాన మాస్తిక్యం, బ్రహ్మకర్మ స్వభావజమ్ ॥ గీత - 18-52
శమ, దమ, తప, శౌచములు, క్షాంతి, ఆర్జవము, జ్ఞాన, విజ్ఞాన, ఆస్తికత్వములు
అనునవి బ్రాహ్మణుల సహజగుణములు.
మేము అన్ని విధముల మా ఓటమిని అంగీకరించెదము. బ్రాహ్మణోత్తమా! మా అపరాధములను క్షమింపుడు.
(చౌ॥ 1-4)

దో- బార బార ముని బిప్రబర, కహా రామ సన రామ ।
బోలె భృగుపతి పరుష హసి, తహూఀ బంధు సమ బామ ॥ 282 ॥

శ్రీరాముడు పదే పదే పరశురాముని మునీశ్వరా! బ్రాహ్మణోత్తమా! అనుచు సంబోధించెను. దానికి భార్గవరాముడు కుపితుడై "నీవును నీ తమ్ముని వలె కపటివి"- అనియనెను. (దో॥ 282)

చౌ- నిపటహిఀ ద్విజ కరి జానహి మోహీ । మైఀ జస బిప్ర సునావఉఀ తోహీ ॥
చాప స్రువా సర ఆహుతి జానూ । కోపు మోర అతి ఘోర కృసానూ ॥ 1 ॥
సమిధి సేన చతురంగ సుహాఈ । మహా మహీప భఏ పసు ఆఈ ॥
మైఀ ఏహిఀ పరసు కాటి బలి దీన్హే । సమర జగ్య జప కోటిన్హ కీన్హే ॥ 2 ॥
మోర ప్రభాఉ బిదిత నహిఀ తోరేఀ । బోలసి నిదరి బిప్ర కే భోరేఀ ॥
భంజెఉ చాపు దాపు బడ బాఢా । అహమితి మనహుఀ జీతి జగు ఠాఢా ॥ 3 ॥
రామ కహా ముని కహహు బిచారీ । రిస అతి బడి లఘు చూక హమారీ ॥
ఛుఅతహిఀ టూట పినాక పురానా । మైఀ కెహి హేతు కరౌఀ అభిమానా ॥ 4 ॥

"నీవు నన్ను కేవలము ఒక సాధారణబ్రాహ్మణునిగా భావించుచున్నావు. నేను ఎటువంటి బ్రాహ్మణుడనో తెలిపెదను. నాధనుస్సు 'స్రువము' బాణములు ఆజ్యములు. నా కోపము మండుచున్న అగ్ని. చతురంగ బలములు సమిధలు. మహారాజులు బలిపశువులు. వారిని ఈ గొడ్డలితోడనే నఱికి బలిగావించితిని. ఇట్టి రణయజ్ఞములను అసంఖ్యాకముగా చేసితిని. నా ప్రభావము నీకు తెలియదు. అందువలననే నీవు నన్ను సామాన్య బ్రాహ్మణునిగా తలంచి అవహేళన చేయుచున్నావు. 'ధనుస్సు విఱిచితిని' అని మిక్కిలి మిడిసిపడుచున్నావు. విశ్వమునే జయించిన వానివలె మురిసిపోవుచున్నావు."- శ్రీరామచంద్రుడు ప్రత్యుత్తరము నిచ్చెను. "మునీశ్వరా! నెమ్మదిగా ఆలోచింపుడు. మీకోపమేమో చాలా గొప్పది. నా అపరాధము మిక్కిలి చిన్నది. ధనుస్సేమో కటికిప్రాతది. తాకియు తాకకముందే విఱిగి పోయినది. నేను ఏకారణమున గర్వపడెదను? (చౌ॥ 1-4)

దో- జౌఀ హమ నిదరహిఀ బిప్ర బది, సత్య సునహు భృగునాథ ।
తౌ అస కో జగ సుభటు జెహి, భయ బస నావహిఀ మాథ ॥ 283 ॥

ఓ భృగు నాథా! బ్రాహ్మణుడవని నిన్ను నిరాదరణ చేసినట్లుగా మీరు భావించియున్నచో సత్యమును వచించెదను, వినుడు. మేము భయముతో తలవంచవలసిన వీరుడు ప్రపంచమున ఎవడు కలడో తెలుపుడు.
(దో॥ 283)

చౌ- దేవ దనుజ భూపతి భట నానా। సమబల అధిక హోఉ బలవానా ॥
జౌఁ రన హమహి పచారై కోఊ। లరహిఁ సుఖేన కాలు కిన హోఊ ॥ 1 ॥
ఛత్రియ తను ధరి సమర సకానా। కుల కలంకు తెహి పావఁర ఆనా ॥
కహఉఁ సుభాఉ న కులహి ప్రసంసీ। కాలహు డరహిఁ న రన రఘుబంసీ ॥ 2 ॥
బిప్రబంస కై అసి ప్రభుతాఈ। అభయ హోఇ జో తుమ్హహి డెరాఈ ॥
సుని మృదు గూఢ బచన రఘుపతి కే। ఉఘరే పటల పరసుధర మతి కే ॥ 3 ॥
రామ రమాపతి కర ధను లేహూ। ఖైఁచహు మిటై మోర సందేహూ ॥
దేత చాపు ఆపుహిఁ చలి గయఊ। పరసురామ మన బిసమయ భయఊ ॥ 4 ॥

దేవతలలోగాని, రాక్షసులలోగాని, మహారాజులలోగాని ఏ వీరుడైనను మాతో సమానుడుగాని, లేక మమ్ము మించినవాడుగాని మాతో తలపడుటకు సిద్ధమైనచో అతడు యముడైనను సరే సంతోషముతో వానిని మేము ఎదుర్కొన గలము. ఏ క్షత్రియుడైనను యుద్ధమునకు వెఱచినచో తన వంశమునకే అతడు మచ్చుతెచ్చినవాడగును. రఘువంశములో జన్మించినవాడెవ్వడును యుద్ధమున యమునికైనను భయపడడు. ఇది వాస్తవము, పొగడ్త గాదు. ఎవ్వరికిని భయపడనివాడుగూడ మీకు భయపడును. విప్రవంశ మహిమయే అట్టిది." రఘురాముని కోమలమైన, నిగూఢమైన పల్కులను విని, పరశురామునిబుద్ధిని గప్పివేసిన తెర తొలగిపోయినది. వెంటనే అతడు ఇట్లు పలికెను. "ఓ. రామా! లక్ష్మీపతి యొక్క ఈ ధనుస్సును చేతబట్టి సంధింపుము. నా సందేహము తీరిపోవును." అని అందించుచుండగనే ధనుస్సు స్వయముగా శ్రీరాముని చేతులలోనికి పోయెను. (ధనుస్సుతో పాటు విష్ణు సంబంధతేజస్సు కూడా పరశురాముని నుండి శ్రీరాముని చేరెను.) పరశురామునకు అత్యంతము సంభ్రమాశ్చర్యములు గలిగెను.
(చౌ॥ 1-4)

దో-జానా రామ ప్రభాఉ తబ, పులక ప్రపుల్లిత గాత।
జోరి పాని బోలే బచన, హృదయఁ న ప్రేము అమాత ॥ 284 ॥

అప్పుడు శ్రీరామునిలోకోత్తరమహిమను పరశురాముడు గుర్తించెను. అతడు పులకిత గాత్రుడయ్యెను. మనస్సు ఆనందముతో పొంగిపోయెను. హృదయమున ఉద్రేకమును ఆపుకొన లేకపోయెను. చేతులు జోడించి యిట్లు స్తుతింపసాగెను.
(దో॥ 284)

చౌ- జయ రఘుబంస బనజ బన భానూ। గహన దనుజ కుల దహన కృసానూ ॥
జయ సుర బిప్ర ధేను హితకారీ। జయ మద మోహ కోహ భ్రమ హారీ ॥ 1 ॥
బినయ సీల కరునా గున సాగర। జయతి బచన రచనా అతి నాగర ॥
సేవక సుఖద సుభగ సబ అంగా। జయ సరీర ఛబి కోటి అనంగా ॥ 2 ॥

కరౌం కాహ ముఖ ఏక ప్రసంసా । జయ మహేస మన మానస హంసా ॥
అనుచిత బహుత కహెఉఁ అగ్యాతా । ఛమహు ఛమామందిర దోఉ భ్రాతా ॥ 3 ॥
కహి జయ జయ జయ రఘుకులకేతూ । భృగుపతి గఏ బనహి తప హేతూ ॥
అపభయఁ కుటిల మహీప డెరానే । జహఁ తహఁ కాయర గవఁహిఁ పరానే ॥ 4 ॥

"రఘువంశమనెడి కమలవనమునకు సూర్యుడా! దైత్యకులమనెడి అడవిని గాల్చు అగ్నిదేవుడా! నీకు జయము. దేవ బ్రాహ్మణగోగణార్తి హరణా! నీకు జయము. మదమోహ క్రోధ భ్రమలను తొలగించువాడా! నీకు జయము. వినయ శీల! కృపాగుణసాగరా! మృదు మధుర వచనరచనాధురంధరా! నీకు జయము. ఆశ్రితజనమందారా! మనోహరాంగా! కోటిమన్మథసుందరాకారా! నీకు జయము. మీ అపారకృపామహిమలను ఒక్కనోట నేనెట్లు ప్రశంసింపగలను? నీవు మహాదేవుని మానససరోవరమున విహరించు హంసవు. నీకు జయము. నేను అజ్ఞానముచే అనుచితములైన అనేకవాక్యములను పలికితిని. సోదరులైన మీరిద్దఱును క్షమానిధానములు. నన్ను మన్నింపుడు. ఓ రఘుకులతిలకా! శ్రీరామచంద్రా! నీకు జయము." అని పల్కుచు భార్గవరాముడు తపోవనమున వెళ్లిపోయెను. ఇది గమనించి దుష్టులైన రాజులు మేము శ్రీరాముని అవమాన పఱచితిమి. అతడు మాపై ప్రతీకారమును తీర్చుకొనునేమో?"– అని భయపడి ఎక్కడి వారక్కడ గుట్టుచప్పుడుగాకుండ పాఱిపోయిరి. (చౌ. 1-4)

దో- దేవన్హ దీన్హీఁ దుందుభీ, ప్రభు పర బరషహిఁ ఫూల ।
హరషే పుర నర నారి సబ, మిటీ మోహమయ సూల ॥ 285 ॥

దేవతలు దుందుభులను మ్రోగించిరి. పుష్ప వృష్టిని గురిపించిరి. మిథిలాపురమునందలి ప్రజలు సంతోషించిరి. వారిమోహజనితబాధ తొలగిపోయెను. (దో. 285)

చౌ- అతి గహగహే బాజనే బాజే । సబహిఁ మనోహర మంగల సాజే ॥
జూథ జూథ మిలి సుముఖి సునయనీఁ । కరహిఁ గాన కల కోకిలబయనీఁ ॥ 1 ॥
సుఖు బిదేహ కర బరని న జాఈ । జన్మదరిద్ర మనహుఁ నిధి పాఈ ॥
బిగత త్రాస భఇ సీయ సుఖారీ । జను బిధు ఉదయఁ చకోరకుమారీ ॥ 2 ॥
జనక కీన్హ కౌసికహి ప్రనామా । ప్రభు ప్రసాద ధను భంజేఉ రామా ॥
మోహి కృతకృత్య కీన్హ దుహుఁ భాఈఁ । అబ జో ఉచిత సో కహిఅ గోసాఈఁ ॥ 3 ॥
కహ ముని సును నరనాథ ప్రబీనా । రహా బిబాహు చాప ఆధీనా ॥
టూటతహీఁ ధను భయఉ బిబాహూ । సుర నర నాగ బిదిత సబ కాహూ ॥ 4 ॥

నగరమున నగారాలు మ్రోగింపబడెను. మనోహరవస్తువులు ప్రదర్శింపబడెను. సుముఖులు, సునయనలు తమతమ కోకిలకంఠములతో సామూహికముగా కమ్మనిగీతములను గానముచేసిరి. జనకమహారాజుసంతోషమునకు అవధులు లేకుండెను. ఆయనకు గర్భదరిద్రునకు నిధులు దొరకినంత సంతోషము కలిగెను. సీతాదేవి భయము

వీడి, చంద్రునిజూచిన చకోరమువలె సంతసించెను. జనకమహారాజు విశ్వామిత్రునకు నమస్కరించి, ఇట్లు పలికెను. "మీ ఆశీర్వాదమువలననే శ్రీరామచంద్రుడు శివధనుర్భంగము గావించినాడు. ఈ సోదరులిద్దఱును నన్ను కృతార్థునిగాజేసిరి. స్వామీ! మీరు ఉచితమని భావించినదానినే చేయుడు." విశ్వామిత్రుడు పల్కెను. "ఓ రాజశిరోమణీ! వినుము. వివాహము ధనుర్భంగముపై ఆధారపడెను. కావున ధనుర్భంగమైనప్పుడే వివాహము ఐనది. దేవతలు, నాగులు, మానవులు అందఱును ఈ విషయమును ఎఱుగుదురు. (చౌ॥ 1-4)

దో- తదపి జాఇ తుమ్హ కరహు అబ, జథా బంస బ్యవహారు ।
బూఝి బిప్ర కులబృద్ధ గుర, బేద బిదిత ఆచారు ॥ 286 ॥

ఐనప్పటికిని నీవు మీవంశమర్యాదననుసరించి, బ్రాహ్మణులను, కులవృద్ధులను, మీ గురువర్యులగు శతానందులవారిని సంప్రదించి, వేదోక్తముగా ఆవివాహ మహోత్సవమును జరిపింపుము. (దో॥ 286)

## జనకుడు దూతలద్వారా దశరథుని ఆహ్వానించుట

చౌ- దూత అవధపుర పఠవహు జాఈ । ఆనహిఁ నృప దసరథహి బోలాఈ ॥
ముదిత రాఉ కహి భలేహిఁ కృపాలా । పఠఏ దూత బోలి తేహి కాలా ॥ 1 ॥
బహురి మహాజన సకల బోలాఏ । ఆఇ సబన్హి సాదర సిర నాఏ ॥
హాట బాట మందిర సురబాసా । నగరు సఁవారహు చారిహుఁ పాసా ॥ 2 ॥
హరషి చలే నిజ నిజ గృహ ఆఏ । పుని పరిచారక బోలి పఠాఏ ॥
రచహు బిచిత్ర బితాన బనాఈ । సిర ధరి బచన చలే సచు పాఈ ॥ 3 ॥
పఠఏ బోలి గునీ తిన్హ నానా । జే బితాన బిధి కుసల సుజానా ॥
బిధిహి బంది తిన్హ కీన్హ అరంభా । బిరచే కనక కదలి కే ఖంభా ॥ 4 ॥

దశరథమహారాజును (సపరివారముగా) ఆహ్వానించి, ఇక్కడికి తీసికొనివచ్చుటకై అయోధ్యకు దూతలను పంపుము." జనక మహారాజు ప్రసన్నవదనుడై "ఓ కృపాళూ! చాల మంచిది" అని పలికి, వెంటనే దూతలను అయోధ్యకు పంపెను. తరువాత ఆహ్వానితులైన పురప్రముఖులు వచ్చి, సాదరముగా మహారాజునకు నమస్కరించిరి. "అంగడులు, వీధులు, భవనములు, దేవాలయములు, నగరము యొక్క నలువైపులను అలంకరింపుడు" అని వారినాజ్ఞాపించెను. వారు సంతోషముతో తమగృహములకు వెళ్లి పోయిరి. తనసేవకులను పిలిచి, అతడు "ఒక మనోహరమండపమును అత్యద్భుతముగా నిర్మింపచేసి అలంకరింపుడు." అని ఆజ్ఞయిచ్చెను. వారు నమ్రతతో ఆయనఆజ్ఞను శిరసావహించిరి. వారు మండపనిర్మాణ శిల్పులను పిలిపించిరి. ఆ శిల్పులు బ్రహ్మదేవుని పూజించి, తమ పనులను ప్రారంభించిరి. మొదట బంగారు అరటి స్తంభములను సిద్ధపఱచిరి. (చౌ॥ 1-4)

దో- హరిత మనిన్హ కే పత్ర ఫల, పదుమరాగ కే ఫూల ।
రచనా దేఖి బిచిత్ర అతి, మను బిరంచి కర భూల ॥ 287 ॥

పచ్చలుపొదిగినపండ్లు, ఆకులతో, పద్మరాగ ఖచితమైన పూవులతో ఆ మండపము శోభిల్లుచుండెను. దాని రచనా వైచిత్రిని గాంచి విరించియు (బ్రహ్మయు) చకితుడాయెను. (దో॥ 287)

చౌ- బేను హరిత మనిమయ సబ కీన్హే। సరల సపరబ పరహిఀ నహిఀ చీన్హే ॥
కనక కలిత అహిబేలి బనాఈ। లఖి నహిఀ పరఇ సపరన సుహాఈ ॥ 1 ॥
తేహి కే రచి పచి బంధ బనాఏ। బిచ బిచ ముకుతా దామ సుహాఏ ॥
మానిక మరకత కులిస పిరోజా। చీరి కోరి పచి రచే సరోజా ॥ 2 ॥
కిఏ భృంగ బహురంగ బిహంగా। గుంజహిఀ కూజహిఀ పవన ప్రసంగా ॥
సుర ప్రతిమా ఖంభన గఢి కాఢీఀ। మంగల ద్రబ్య లిఏఀ సబ ఠాఢీఀ ॥ 3 ॥
చౌకేఀ భాఀతి అనేక పురాఈఀ। సింధుర మనిమయ సహజ సుహాఈఀ ॥

ముడులుగల సాధారణమైన వెదురులు పచ్చలతోడనే సిద్ధపఱచబడినవి. వాటిని చూచిన వారు అవి నిజముగా వెదురులేయని అందఱునుతలంచుచుండిరి. బంగారు తీగలతో గూడియున్న తమలపాకులను జూచి, అవి నిజమైన తమలపాకులని భ్రమపడుచుండిరి. ఈ లతలను ఒక దానితో మఱియొకదానిని పెన వైచి మరకతములను, పచ్చలను వజ్రములను చీల్చి, వేర్వేఱు ఆకారములలో కోసి ఎఱుపు, ఆకుపచ్చ, తెలుపు, పసుపురంగుల కమలములను సిద్ధపఱచిరి. వాటిపై తుమ్మెదలను, వేర్వేఱు పక్షులనుగూడ చెక్కిరి. గాలికి కదలినప్పుడు అవి ఝుంకారములను, కిలకిలారావములను చేయుచున్నవా? అనునట్లుండెను. ప్రాంగణమునందలిస్తంభములపై దేవతామూర్తులను శుభప్రదములైన వస్తువులతో చెక్కిరి. ముంగిళ్లలో అనేకరీతులచదరపుముగ్గులను వేసి, వాటి మధ్య గజముత్యములను బఱచిరి. (చౌ॥ 1-4)

దో- సౌరభ పల్లవ సుభగ సుఠి, కిఏ నీలమని కోరి।
హేమ బౌర మరకత ఘువరి, లసత పాటమయ డోరి ॥ 288 ॥

వారు అద్భుతమైన మామిడిఆకులను మణులతోను బంగారు, పచ్చలు పొదిగిన మామిడి పువ్వులను పట్టుదారములతో వ్రేలాడునట్లు అమర్చిరి. (దో॥ 288)

చౌ- రచే రుచిర బర బందనివారే। మనహుఀ మనోభవఀ ఫంద సఀవారే ॥
మంగల కలస అనేక బనాఏ। ధ్వజ పతాక పట చమర సుహాఏ ॥ 1 ॥
దీప మనోహర మనిమయ నానా। జాఇ న బరని బిచిత్ర బితానా ॥
జేహిఀ మండప దులహిని బైదేహీ। సో బరనై అసి మతి కబి కేహీ ॥ 2 ॥
దూలహు రాము రూప గున సాగర। సో బితాను తిహుఀ లోక ఉజాగర ॥
జనక భవన కై సోభా జైసీ। గృహ గృహ ప్రతి పుర దేఖిఅ తైసీ ॥ 3 ॥
జేహిఀ తేరహుతి తేహి సమయ నిహారీ। తేహి లఘు లగహిఀ భువన దస చారీ ॥
జో సంపదా నీచ గృహ సోహా। సో బిలోకి సురనాయక మోహా ॥ 4 ॥

అందమైనద్వారతోరణములను మన్మథుడే నిర్మించినాడాయన్నట్లు ఏర్పఱచిరి. అందు మంగళకలశములు, సుందరధ్వజపతాకములు, మనోజ్ఞములైనతెరలు, చూడముచ్చటగొల్పు చామరములు అలంకరింపబడినవి.

మణిఖచితములైన పెక్కుదీపములతో దేదీప్యమానముగానున్న ఆ మండపవైభవము వర్ణనాతీతము. జగన్మోహనాకారులైన సీతారాములు సర్వాలంకారములతో నవవధూవరులై కూర్చొనుటకు నిర్మింపబడుచున్న ఆ మండపశోభలను ఎవ్వరును వర్ణింపజాలరు. అది ముల్లోకములను మురిపింపజేయునదిగా ఉన్నది. జనక మహారాజప్రాసాదముల వలెనే నగరములోని ఇతరహర్మ్యములు గూడ వివిధాలంకారములతో మిలుమిట్లు గొల్పుచుండెను. రాజధానియగు మిథిలానగర శోభలముందు పదునాలుగులోకములశోభలుగూడ వెలవెలబోవు చుండెను. ఆ నగరమునందలి సాధారణపౌరుల గృహాలంకార వైభవములు ఇంద్రునకును అసూయను కల్గించుచుండెను. (చౌ॥ 1-4)

దో- బసఇ నగర జెహిఁ లచ్ఛి కరి, కపట నారి బర బేషు ।
తెహి పుర కై సోభా కహత, సకుచహిఁ సారద సేషు ॥ 289 ॥

సాక్షాల్లక్ష్మీదేవియే మానవకాంత(సీత)గా అవతరించి, నివసించు ఆ నగరశోభలను వర్ణించుటకు ఆ శారదా దేవికిగాని, ఈ ఆదిశేషునకు గాని, సాధ్యముగాకుండెను. (దో॥ 289)

చౌ- పహుఁచే దూత రామ పుర పావన । హరషే నగర బిలోకి సుహావన ॥
భూప ద్వార తిన్హ ఖబరి జనాఈ । దసరథ నృప సుని లిఏ బోలాఈ ॥ 1 ॥
కరి ప్రనాము తిన్హ పాతీ దీన్హీ । ముదిత మహీప ఆపు ఉఠి లీన్హీ ॥
బారి బిలోచన బాఁచత పాతీ । పులక గాత ఆఈ భరి ఛాతీ ॥ 2 ॥
రాము లఖను ఉర కర బర చీఠీ । రహి గఏ కహత న ఖాటీ మీఠీ ॥
పుని ధరి ధీర పత్రికా బాఁచీ । హరషీ సభా బాత సుని సాఁచీ ॥ 3 ॥
ఖేలత రహే తహాఁ సుధి పాఈ । ఆఏ భరతు సహిత హిత భాఈ ॥
పూఛత అతి సనేహఁ సకుచాఈ । తాత కహాఁ తేఁ పాతీ ఆఈ ॥ 4 ॥

జనకునిదూతలు అయోధ్యాపట్టణమును చేరిరి. వారు ఆ నగరశోభలను గాంచి, మిక్కిలి సంతసించిరి. రాజభవనద్వారముకడ నిల్చి, రాజునకు తమరాకను దెల్పిరి. రాజు వారిని లోనికి రప్పించెను. వారు ప్రభువునకు నమస్కరించి, ఆహ్వానపత్రికను అందించిరి. రాజు ప్రసన్నచిత్తుడై, స్వయముగా ఆ ఉత్తరమును అందుకొనెను. దానిని చదువుచున్నప్పుడు ఆయననేత్రములు ఆనందాశ్రువులతో నిండెను. తనువు పులకరించెను. హృదయము సంతోషముతో నిండెను. కోసలపతి హృదయములో శ్రీరామ లక్ష్మణులుండిరి. చేతులలో శుభాహ్వానపత్రికయుండెను. ప్రేమాధిక్యముతో దానిని చూచుచున్న ఆ దశరథునికంఠము మూగపోయెను. తిన్నగా అతడు మనస్సును కుదుటబఱచుకొని, ఉత్తరమును చదివి, వినిపించెను. ఆ శుభవార్తలను విని, సభాసదులు ఆనందమును పట్టలేక పోయిరి. భరతుడు తన ప్రియ సోదరుడైన శత్రుఘ్నునితోడను, ఇతర మిత్రులతోడను ఆడుకొనుచుండెను. ఈ వార్త తెలియగనే పరుగెత్తికొని వచ్చి, ప్రేమతో, సంకోచముతో "నాన్న గారూ! ఈ యుత్తరము ఎక్కడినుండి వచ్చినది?" అనియడిగెను. (చౌ॥ 1-4)

దో- కుసల ప్రానప్రియ బంధు దౌఉ, అహహిఁ కహహు కెహిఁ దేస ।
సుని సనేహ సానే బచన, బాచీ బహురి నరేస ॥ 290 ॥

"ప్రాణములకంటెను ప్రియమైన నా సోదరులు ఇద్దఱును కుశలమా? వారు ఏ దేశములో ఉన్నారు? తెలుపుడు." ఈ ప్రేమపూరితవచనములను విని, రాజు ఆ ఉత్తరమును మఱల చదివి వినిపించెను. (దో॥ 290)

చౌ- సుని పాతీ పులకే దోఉ భ్రాతా । అధిక సనేహు సమాత న గాతా ॥
ప్రీతి పునీత భరత కై దేఖీ । సకల సభాఁ సుఖు లహేఉ బిసేషీ ॥ 1 ॥
తబ నృప దూత నికట బైఠారే । మధుర మనోహర బచన ఉచారే ॥
భైయా కహహు కుసల దోఉ బారే । తుమ్హ నీకేఁ నిజ నయన నిహారే ॥ 2 ॥
స్యామల గౌర ధరేఁ ధను భాథా । బయ కిసోర కౌసిక ముని సాథా ॥
పహిచానహు తుమ్హ కహహు సుభాఊ । ప్రేమ బిబస పుని పుని కహ రాఊ ॥ 3 ॥
జా దిన తేఁ ముని గఏ లవాఈ । తబ తేఁ ఆజు సాఁచి సుధి పాఈ ॥
కహహు బిదేహ కవన బిధి జానే । సుని ప్రియ బచన దూత ముసుకానే ॥ 4 ॥

ఆ ఉత్తరములోని విషయములనన్నింటిని విని, సోదరులిద్దరును పులకితగాత్రులైరి. వారి ఆనందములకు అవధులు లేకుండెను. భరతునిపవిత్రప్రేమను తెలిసికొని, సదస్యులెల్లరును ఆనందపరవశులైరి. రాజు దూతలను తన యొద్ద కూర్చుండ బెట్టుకొని, వారితో "మిత్రులారా! నా గారాల బిడ్డలిద్దఱును కుశలమా? వారిని మీరు స్వయముగా చూచియుంటిరా?" అని మృదుమధురముగా నడిగెను. "వారు శ్యామల గౌరవర్ణులు, ధనుర్బాణములను ధరించియున్నవారు, కిశోరావస్థలో ఉన్నవారు, విశ్వామిత్రునితో పాటు ఉన్నారు. మీరు వారిని గుర్తించియున్నచో వారిని గూర్చి తెలుపుడు." ఇట్లు రాజు ప్రేమ పూర్వకముగా పదే పదే వారిని అడిగెను. "విశ్వామిత్రుడు వారిని తనవెంట తీసికొని వెళ్లిన పిమ్మట నేడే వారిక్షేమసమాచారములు మాకు తెలిసినవి. జనకుడు వారిని ఎట్లు గుర్తించెను? తెల్పుడు." దశరథుని ఈ ప్రియవచనములను విని, దూతలు దరహాసముతో ప్రేమపూర్వకముగా! ఇట్లు పలికిరి. (చౌ॥ 1-4)

దో- సునహు మహీపతి ముకుట మని, తుమ్హ సమ ధన్య న కోఉ ।
రాము లఖను జిన్హ కే తనయ, బిస్వ బిభూషన దోఉ ॥ 291 ॥

ఓ రాజకులశిరోరత్నమా! వినుడు. విశ్వమునకే అలంకారప్రాయులైన రామలక్ష్మణులను కుమారులనుగా పొందిన మీవంటి భాగ్యశాలురు ఈలోకములో ఎవ్వరునూలేరు. (దో॥ 291)

చౌ- పూఛన జోగు న తనయ తుమ్హారే । పురుషసింఘ తిహు పుర ఉజిఆరే ॥
జిన్హ కే జస ప్రతాప కేఁ ఆగే । ససి మలీన రబి సీతల లాగే ॥ 1 ॥
తిన్హ కహఁ కహిఅ నాథ కిమి చీన్హే । దేఖిఅ రబి కి దీప కర లీన్హే ॥
సీయ స్వయంబర భూప అనేకా । సమిటే సుభట ఏక తేఁ ఏకా ॥ 2 ॥
సంభు సరాసను కాహుఁ న టారా । హారే సకల బీర బరిఆరా ॥
తీని లోక మహఁ జే భటమానీ । సభ కై సకతి సంభు ధను భానీ ॥ 3 ॥

సకల ఉఠాఇ సరాసుర మేరూ । సోఉ హియఁ హారి గయఉ కరి ఫేరూ ॥
జెహిఁ కౌతుక సివసైలు ఉఠావా । సోఉ తెహి సభాఁ పరాభఉ పావా ॥ 4 ॥

పురుష సింహులును, విశ్వజ్యోతులును ఐన మీ కుమారులను గూర్చి అడుగనేల? వారికీర్తిశోభల ముందు చంద్రుడు వెలవెల బోవును. వారి ప్రతాపముముందు సూర్యుడు చల్లబడును. ప్రభూ! వారిని ఎట్లు గుర్తించితిరి? అని మీరు మమ్ము అడుగుచున్నారు. సూర్యుని జూచుటకు దివిటీ అవసరమా? సీతాస్వయంవరమునకు పెక్కుమందిరాజన్యులు విచ్చేసిరి. వారిలో ఒకరినిమించినవీరుడు మతి యొకడు. కాని వారిలో ఎవ్వరును శివధనుస్సును కదిలింపలేక పోయిరి. ముల్లోకములలో వీరులమని పెట్టిపీగువారిఅభిమానములను శివధనుస్సు నిర్వీర్యముగావించెను. మేరుపర్వతమును ఎత్తిన బాణాసురుడును శివధనుస్సు ముందు తన ఓటమిని అంగీకరించి, దానికి ప్రదక్షిణమొనర్చి, వెడలి పోయెను. కైలాసమును ఎత్తిన రావణాసురుడుకూడా ఆ సభలో పరాజితుడాయెను. (చౌ॥ 1-4)

దో- తహఁ రామ రఘుబంసమని, సునిఅ మహా మహిపాల ।
భంజెఉ చాప ప్రయాస బిను, జిమి గజ పంకజ నాల ॥ 292 ॥

మహారాజా! వినుడు. "ఆ సమయమున రఘుకులమణియగు శ్రీరాముడు అవలీలగా ఆ శివధనుస్సును ఏనుగు తామరతూడునువలె విఱిచివేసెను. (దో॥ 292)

చౌ- సుని సరోష భృగునాయకు ఆఏ । బహుత భాఁతి తిన్హ ఆఁఖి దెఖాఏ ॥
దేఖి రామ బలు నిజ ధను దీన్హా । కరి బహు బినయ గవను బన కీన్హా ॥ 1 ॥
రాజన రాము అతులబల జైసేఁ । తేజ నిధాన లఖను పుని తైసేఁ ॥
కంపహిఁ భూప బిలోకత జాకేఁ । జిమి గజ హరి కిసోర కే తాకేఁ ॥ 2 ॥
దేవ దేఖి తవ బాలక దోఊ । అబ న ఆఁఖి తర ఆవత కోఊ ॥
దూత బచన రచనా ప్రియ లాగీ । ప్రేమ ప్రతాప బీర రస పాగీ ॥ 3 ॥
సభా సమేత రాఉ అనురాగే । దూతన్హ దేన నిఛావరి లాగే ॥
కహి అనీతి తే మూదహిఁ కానా । ధరము బిచారి సబహిఁ సుఖు మానా ॥ 4 ॥

అపూర్వమైన ధనుర్భంగటంకారమును విని, పరశురాముడు క్రోధముతో మిథిలకు విచ్చేసి, అనేక విధముల నిష్ఠురోక్తులాడెను. కడకు శ్రీరామచంద్రుని శక్తిసామర్థ్యములను దెలిసికొని, తనవిష్ణు ధనుస్సును గూడ ఆయనకు ఇచ్చివేసి, వినమ్రుడై తపోవనమునకు వెళ్లి పోయెను. శ్రీరాముడు అతులిత బలధాముడైనట్లే లక్ష్మణుడును మహా తేజస్సంపన్నుడు. అతని యొక్క తీవ్రములైన చూపులకు గుఱియైన రాజులు సింహకిశోరముచే చూడబడినఏనుగులవలె భయకంపితులైరి. మీ కుమారులను ఒక్కసారి చూచినంతమాత్రముననే వారు మాకనులలో శాశ్వతముగ నిలిచి పోయిరి. ఆ కనులలో ఇతరుల స్ఫురణకు చోటులేదు. వారి సౌందర్య తేజఃప్రతాపములముందు ఎవ్వరును సాటిరారు." ప్రేమ, ప్రతాపము, వీర రసములతో నిండిన ఆ దూతల పల్కులను విని, సభాసదులెల్లరును ఆనందించిరి. వారితోపాటు దశరథుడును ఆనందమగ్నుడై వారికి పెక్కు కానుకలను సమర్పింపబోయెను. వారు మాత్రము "ఇది యుచితముగాదు, ధర్మవిరుద్ధము" అనుచు అందులకు తమ వైముఖ్యమును ప్రకటించిరి.

(కన్యాపక్షమువారు కానుకలను స్వీకరించుట సముచితము కాదుగదా!) వారి సౌశీల్యమును ధర్మవచనములను అచటి వారెల్లరును పొగడిరి. (చౌ॥ 1-4)

దో- తబ ఉఠి భూప బసిష్ఠ కహుఁ, దీన్హి పత్రికా జాఇ ।
కథా సునాఈ గురహి సబ, సాదర దూత బోలాఇ ॥ 293 ॥

పిదప రాజు తమగురువైన వసిష్ఠులవారి కడకేగి, ఆయనకు ఆహ్వానపత్రమును స్వయముగా సమర్పించెను. పిమ్మట దూతలను సాదరముగా పిలిపించెను. వారు భక్తి శ్రద్ధలతో గురువుగారికి సమస్త విషయములను వివరించిరి. (దూతల ద్వారా వినిపించుటలో రెండు ప్రత్యేకతలున్నవి. (1)తననుగూర్చిగాని, తన పుత్రులను గూర్చి గాని తాను స్వయముగా తెల్పుట పద్ధతి గాదు. (2) తన పుత్రులైన రామలక్ష్మణుల ప్రతాపములను గూర్చి మఱియొక సారి విని, ఆనందించుటకు ఆయనకు అవకాశము కలుగును.) (దో॥ 293)

చౌ- సుని బోలే గుర అతి సుఖు పాఈ । పున్య పురుష కహుఁ మహి సుఖ ఛాఈ ॥
జిమి సరితా సాగర మహుఁ జాహీఁ । జద్యపి తాహి కామనా నాహీఁ ॥ 1 ॥
తిమి సుఖ సంపతి బినహిఁ బోలాఏఁ । ధరమసీల పహిఁ జాహిఁ సుభాఏఁ ॥
తుమ్హ గుర బిప్ర ధేను సుర సేబీ । తసి పునీత కౌసల్యా దేబీ ॥ 2 ॥
సుకృతీ తుమ్హ సమాన జగ మాహీఁ । భయఉ న హై కోఉ హోనేఉ నాహీఁ ॥
తుమ్హ తే అధిక పున్య బడ కాకేఁ । రాజన రామ సరిస సుత జాకేఁ ॥ 3 ॥
బీర బినీత ధరమ బ్రత ధారీ । గున సాగర బర బాలక చారీ ॥
తుమ్హ కహుఁ సర్బ కాల కల్యానా । సజహు బరాత బజాఇ నిసానా ॥ 4 ॥

ఈ శుభసమాచారములకు సంతుష్టుడై వసిష్ఠుడు ఇట్లనెను. "పుణ్యపురుషులను ఎల్లెడలను సౌఖ్యమే వెన్నంటినడచుచుండును. సముద్రము కోరకున్నను నదులన్నియును ఆ సముద్రమునే చేరును. అట్లే సుఖసంపదలుగూడ ధర్మాత్ములయొద్దకు అయాచితముగేవచ్చిచేరును. నీవలెనే కౌసల్యా దేవియు దేవతలకును, గురువులకును, బ్రాహ్మణులకును, గోవులకును భక్తితో సేవలు చేయును. ఆమె పవిత్రకార్యాచరణము ప్రశంసావహము. నీతో సమానుడైన పుణ్యాత్ముడు ఈ జగత్తులో 'న భూతో న భవిష్యతి'. రాజా! రామునివంటి పుత్రునిగన్న నీకంటెను పుణ్యపురుషుడెవడుండును? నీ నలుగురు కుమారులును వీరులు, వినయ శీలురు, ధర్మవ్రతులు, సద్గుణసముద్రులు, ఉత్తములు. నీకెల్లప్పుడును శుభమే జరుగును. కావున దుందుభి నాదములతో వివాహప్రయాణములకు శీఘ్రముగా సిద్ధమగుము. (చౌ॥ 1-4)

దో- చలహు బేగి సుని గుర బచన, భలేహిఁ నాథ సిరు నాఇ ।
భూపతి గవనే భవన తబ, దూతన్హ బాసు దెవాఇ ॥ 294 ॥

శీఘ్రముగా బయలుదేఱుము." అను వసిష్ఠుని ఆదేశమును విని, దశరథుడు "ప్రభూ! అట్లే కానిండు" అని పలికి, నమస్కరించి, దూతలకు విడిదిని ఏర్పఱచి, నిజ మందిరమునకు అరిగెను. (దో॥ 294)

చౌ- రాజా సబు రనివాస బొలాఈ। జనక పత్రికా బాచి సునాఈ ॥
సుని సందేసు సకల హరషానీఁ। అపర కథా సబ భూప బఖానీఁ ॥ 1 ॥
ప్రేమ ప్రఫుల్లిత రాజహిఁ రానీ। మనహుఁ సిఖిని సుని బారిద బానీ ॥
ముదిత అసీస దేహిఁ గుర నారీఁ। అతి ఆనంద మగన మహతారీఁ ॥ 2 ॥
లేహిఁ పరస్పర అతి ప్రియ పాతీ। హృదయఁ లగాఇ జుడావహిఁ ఛాతీ ॥
రామ లఖన కై కీరతి కరనీ। బారహిఁ బార భూపబర బరనీ ॥ 3 ॥
ముని ప్రసాదు కహి ద్వార సిధాఏ। రానిన్హ తబ మహిదేవ బొలాఏ ॥
దిఏ దాన ఆనంద సమేతా। చలే బిప్రబర ఆసిష దేతా ॥ 4 ॥

దశరథుడు రాణులనందఱిని పిలిచి, జనకుని ఉత్తరమును చదివివినిపించెను. వారందఱును ఆ శుభవార్తకు అమితానందమునందిరి. తాను దూతలద్వారా విన్న విషయములను అన్నింటిని రాజు స్వయముగా వారికి తెలిపెను. మేఘగర్జనలకు నెమళ్లవలె రాణులెల్లరు పరమానందభరితలైరి. గురుపత్ని, పెద్దముత్తైదువలు అందఱును ఆశీర్వచనములను పలికిరి. తల్లులు అత్యంతము ఆనందించిరి. వారు అత్యంతప్రియమైన ఆ ఉత్తరమును ఒకరితరువాత మఱియొకరు తీసికొని, దానిని తమ హృదయములకు హత్తుకొని ప్రశాంతతను బొందిరి. ఇతరులచే ప్రశంసింపబడిన రామలక్ష్మణులకీర్తి ప్రతాపములను రాజశ్రేష్ఠుడైన దశరథుడును పదే పదే మెచ్చుకొనెను. "ఇదియంతయు మునీశ్వరుల కృప"- అనిపలుకుచు తన మందిరమునకు వెళ్లెను. రాణులు బ్రాహ్మణులకు ఆనందముతో అనేక దానములనొసంగిరి. వారు ఆశీర్వదించి వెళ్లిరి. (చౌ॥ 1-4)

సో- జాచక లిఏ హఁకారి, దీన్హి నిఛావరి కోటి బిధి।
చిరు జీవహుఁ సుత చారి, చక్రబర్తి దసరత్థ కే ॥ 295 ॥

పిమ్మట రాణులు అర్థులకు (వస్త్రములు మొదలగు) అనేక విధములైన కానుకలను ఇచ్చిరి. "దశరథ మహారాజుగారి నలుగురు కుమారులును కలకాలము వర్ధిల్లుదురుగాక" - (సో॥ 295)

చౌ- కహత చలే పహిరేఁ పట నానా। హరషి హనే గహగహే నిసానా ॥
సమాచార సబ లోగన్హ పాఏ। లాగే ఘర ఘర హోన బధాఏ ॥ 1 ॥
భువన చారి దస భరా ఉఛాహూ। జనకసుతా రఘుబీర బిఆహూ ॥
సుని సుభ కథా లోగ అనురాగే। మగ గృహ గలీఁ సఁవారన లాగే ॥ 2 ॥
జద్యపి అవధ సదైవ సుహావని। రామ పురీ మంగలమయ పావని ॥
తదపి ప్రీతి కై ప్రీతి సుహాఈ। మంగల రచనా రచీ బనాఈ ॥ 3 ॥
ధ్వజ పతాక పట చామర చారూ। ఛావా పరమ బిచిత్ర బజారూ ॥
కనక కలస తోరన మనిజాలా। హరద దూబ దధి అచ్ఛత మాలా ॥ 4 ॥

అనిపలుకుచు వారు నానావిధములైన నూతన వస్త్రములను ధరించి, ఆనందముతో వెడలిపోయిరి. నగారాలు మ్రోగినవి. ఈ శుభవార్త జనులందఱిలో వ్యాపింపగనే ఇంటింటా పండుగవాతావరణము నెలకొల్లెను. శ్రీ సీతారాముల

వివాహవార్త చతుర్దశభువనములయందును ఆనందోత్సాహములను వెల్లివిరియ జేసెను. ప్రజలు ప్రేమార్ద్రహృదయములతో తమగృహములను, పురవీధులను అలంకరింప సాగిరి. శ్రీరాముని పవిత్రజన్మస్థానమగుటచే సహజముగనే మనోహరమైన అయోధ్యను ప్రజలు ప్రీతితో ఇంకను అందముగా అలంకరించిరి. పురవీధులు, అంగడులు, ధ్వజపతాకములతో, తోరణములతో, తెరలతో, మనోహరములైన చామరములతో అలరారెను. బంగారుకలశములతో విజయద్వారములతో, మణులతోరణములతో పసుపు,పెఱుగు, అక్షతలు, గరిక, పూలమాలలతో గృహములు అలంకరింపబడెను. (చౌ॥ 1-4)

దో- మంగలమయ నిజ నిజ భవన, లోగన్హ రచే బనాఇ।
బీథీఀ సీఀచీఀ చతురసమ, చౌకేఀ చారు పురాఇ ॥ 296 ॥

ఈ విధముగా పౌరులందఱును తమతమ ఇండ్లను మంగళకరముగా అలంకరించిరి. వీధులన్నింటను ప్రాంగణములయందును, లోగిళ్లలోను, చతురసమ (చందనము, కేసరి, కస్తూరి, కర్పూరము) సుగంధ ద్రవ్యములతో కలయంపి చల్లబడెను. ద్వారములన్నియు అందముగా అలంకరింప బడెను. రంగవల్లులు తీర్చబడెను. (దో॥ 296)

చౌ- జహఀ తహఀ జూథ జూథ మిలి భామిని। సజి నవ సప్త సకల దుతి దామిని ॥
బిధుబదనీఀ మృగ సావక లోచని। నిజ సరూప రతి మాను బిమోచని ॥ 1 ॥
గావహిఀ మంగల మంజుల బానీఀ। సుని కలరవ కలకంఠి లజానీఀ ॥
భూప భవన కిమి జాఇ బఖానా। బిస్వ బిమోహన రచేఉ బితానా ॥ 2 ॥
మంగల ద్రబ్య మనోహర నానా। రాజత బాజత బిపుల నిసానా ॥
కతహుఀ బిరిద బందీ ఉచ్చరహీఀ। కతహుఀ బేద ధుని భూసుర కరహీఀ ॥ 3 ॥
గావహిఀ సుందరి మంగల గీతా। లై లై నాము రాము అరు సీతా ॥
బహుత ఉఛాహు భవను అతి థోరా। మానహుఀ ఉమగి చలా చహు ఓరా ॥ 4 ॥

విద్యుల్లతలవలె ప్రకాశించుచంద్రముఖులు, హరిణేక్షణలు, అందమున రతీదేవిని మించినయువతీ లలామలు గుంపులు గూడి పదునాఱు విధములగు అలంకరణములను చేసికొని, మంజుల మనోహర స్వరములతో మంగళగీతములను ఆలపించుచుండిరి. వారి మధురస్వరములు కోయిలలను గూడ తలవంచుకొనునట్లు చేయుచుండెను. రాజ భవనములరామణీయకములను వర్ణించుటకెవరితరము? అచట విశ్వమునే ముగ్ధమోహనముగావించు సుందర మండపము ఏర్పఱచబడినది. మంగళకరములైన వస్తువులు ప్రదర్శింపబడెను. నగారాలు మ్రోగింపబడెను. వందిమాగధులు బిరుదావళులను పలుకుచుండిరి. బ్రాహ్మణులు వేదములను పఠించుచుండిరి. రూపవతులైన స్త్రీలు సీతారాముల పేర్లతో మంగళ గీతములను గానముచేయుచుండిరి. భవనము చిన్నదై ఉత్సాహము అధికమై నలుదిశల పొంగి ప్రవహించు చుండెను. (చౌ॥ 1-4)

దో- సోభా దసరథ భవన కఇ, కో కబి బరనై పార।
జహాఀ సకల సుర సీస మని, రామ లీన్హ అవతార ॥ 297 ॥

సమస్తదేవతాశిరోమణియైన శ్రీరాముడు అవతరించిన ఆ దశరథమహారాజభవనవైభవమును ఏ కవి వర్ణింపగలడు? (దో॥ 297)

## దశరథుడు సపరివారముగా పెండ్లికి తరలుట

చౌ- భూప భరత పుని లిఏ బోలాఈ । హయ గయ స్యందన సాజహు జాఈ ॥
చలహు బేగి రఘుబీర బరాతా । సునత పులక పూరే దోఉ భ్రాతా ॥ 1 ॥
భరత సకల సాహనీ బోలాఏ । ఆయసు దీన్హ ముదిత ఉఠి ధాఏ ॥
రచి రుచి జీన తురగ తిన్హ సాజే । బరన బరన బర బాజి బిరాజే ॥ 2 ॥
సుభగ సకల సుఠి చంచల కరనీ । అయ ఇవ జరత ధరత పగ ధరనీ ॥
నానా జాతి న జాహిం బఖానే । నిదరి పవను జను చహత ఉడానే ॥ 3 ॥
తిన్హ సబ ఛయల భఏ అసవారా । భరత సరిస బయ రాజకుమారా ॥
సబ సుందర సబ భూషనధారీ । కర సర చాప తూన కటి భారీ ॥ 4 ॥

దశరథమహారాజు భరతుని పిలిచి "నీవు వెళ్ళి, గుఱ్ఱములను, ఏనుగులను, రథములను అలంకరింపజేయుము. శీఘ్రముగా శ్రీరామునివివాహమునకు ఊరేంగిపుగా వెళ్ళవలెను." అని ఆజ్ఞాపించెను. భరతశత్రుఘ్నులు ఇరువురును పులకితగాత్రులైరి. భరతుడు అశ్వశాలలఅధ్యక్షులను పిలిపించి, వారికి తగుసూచనలను ఇచ్చెను. వారు ప్రసన్నులై వెంటనే వెళ్ళి, అందములొలుకు జీనులతో గుఱ్ఱములను అలంకరించిరి. వివిధ వర్ణములతో ఆ హయములు శోభిల్లుచుండెను. గుఱ్ఱములన్నియును అతిసుందరములైనవి. శీఘ్రగమనములు గలవి. కాలుచున్న ఇనుముపై నడచుచున్నవా యనునట్లు అవి భూమిపై వెళ్ళుచుండెను. వేర్వేఱుజాతులకుచెందిన ఆ యశ్వములు వాయువేగమునుమించి పరుగిడగలవు. భరతునకు సమవయస్కులైన రాకుమారులు ఆ గుఱ్ఱములను అధిరోహించిరి. వారు నానా విధభూషణాలంకృతులై, ధనుర్బాణములను చేతబట్టి, నడుములకు తూణీరములను ధరించి శోభిల్లుచుండిరి. (చౌ॥ 1-4)

దో- ఛరే ఛబీలే ఛయల సబ, సూర సుజాన నబీన ।
జుగ పదచర అసవార ప్రతి, జే అసికలా ప్రబీన ॥ 298 ॥

వారందఱును నవయువకులు, చతురులు, యుద్ధనిపుణులు. ప్రతిరౌతుప్రక్కన కత్తి యుద్ధములో ఆరితేఱిన పాదచారులు ఇద్దఱేసి యుండిరి. (దో॥ 298)

చౌ- బాంధే బిరద బీర రన గాఢే । నికసి భఏ పుర బాహెర ఠాఢే ॥
ఫేరహిం చతుర తురగ గతి నానా । హరషహిం సుని సుని పనవ నిసానా ॥ 1 ॥
రథ సారథిన్హ బిచిత్ర బనాఏ । ధ్వజ పతాక మని భూషన లాఏ ॥
చవంర చారు కింకిని ధుని కరహీం । భాను జాన సోభా అపహరహీం ॥ 2 ॥
సావంకరన అగనిత హయ హోతే । తే తిన్హ రథన్హ సారథిన్హ జోతే ॥
సుందర సకల అలంకృత సోహే । జిన్హహి బిలోకత ముని మన మోహే ॥ 3 ॥

జే జల చలహిం థలహి కీ నాఈం । టాప న బూడ బేగ అధికాఈం ॥
అస్త్ర సస్త్ర సబు సాజు బనాఈ । రథీ సారథిన్హ లిఏ బోలాఈ ॥ 4 ॥

రణధీరులు, వీరులు గుఱ్ఱములనెక్కి, నగరమువెలుపల నిలిచిరి. కుశలురైన రౌతులు తమ హయములను వివిధగమనరీతులలో నడిపించిరి. ఢోలు, నగారాలమ్రోతలను విని సంతసించిరి. రథసారథులు ధ్వజపతాకములతోను, మణులతోను, భూషణములతోను రథములను అలంకరించిరి. ఛత్రచామరములతోడను, గంటలతోడను సమలంకృతములైన ఆ రథములు సూర్యరథమును మించి ప్రకాశించుచుండెను. యజ్ఞవేదికనుండి ఆవిర్భవించిన అసంఖ్యాకములైన శ్యామకర్ణశోభితములైన దివ్యాశ్వములు ఆ రథములకు కట్టబడెను. వాటి రూపరేఖావిలాసములు మునీశ్వరులమనసులనుగూడ దోచుకొనుచుండెను. అవి నేలమీదవలెనే నీటిమీదగూడ వేగముగా సాగిపోగలవు. అవి నీటిపై పరుగులుదీయునపుడు వేగకారణముగా వాటి గిట్టలుగూడ తడువవు. రథములను అస్త్రశస్త్రములతో అమర్చిన పిదప సారథులు రథికులను పిలిచిరి. (చౌ. 1-4)

దో- చఢి చఢి రథ బాహెర నగర, లాగీ జురన బరాత ।
హోత సగున సుందర సబహి, జో జెహి కారజ జాత ॥ 299 ॥

రథికులు రథములను అధిరోహించి, పెండ్లియూరేగింపునకై నగరమువెలుపల గుమిగూడిరి. అందఱికిని శుభశకునములే ఎదురగుచుండెను. (దో. 299)

చౌ- కలిత కరిబరన్హి పరీం అంబారీం । కహి న జాహిం జెహి భాంతి సంవారీం ॥
చలే మత్త గజ ఘంట బిరాజీ । మనహుం సుభగ సావన ఘన రాజీ ॥ 1 ॥
బాహన అపర అనేక బిధానా । సిబికా సుభగ సుఖాసన జానా ॥
తిన్హ చఢి చలే బిప్రబర బృందా । జను తను ధరేం సకల శ్రుతి ఛందా ॥ 2 ॥
మాగధ సూత బంది గునగాయక । చలే జాన చఢి జో జెహి లాయక ॥
బేసర ఊంట బృషభ బహు జాతీ । చలే బస్తు భరి అగనిత భాంతీ ॥ 3 ॥
కోటిన్హ కాంవరి చలే కహారా । బిబిధ బస్తు కో బరనై పారా ॥
చలే సకల సేవక సముదాఈ । నిజ నిజ సాజు సమాజు బనాఈ ॥ 4 ॥

సమున్నతములైన భద్రగజములపై అందమైనఅంబారీలు అమర్చబడెను. మదపుటేనుగులు ఘంటానాదములతో వీనులవిందుగావించుచు శ్రావణమేఘములవలె కదలుచుండెను. పల్లకీలు, చిన్న చిన్న రథములు మొదలగు వాహనములలో వేదమూర్తులైన బ్రాహ్మణులు ప్రయాణమైరి. వందిమాగధులు, సూతులు భట్రాజులు తగు వాహనముల నెక్కిరి. వివిధ వస్తువులను ఒంటెలపై, ఎడ్లపై కంచరగాడిదలపై వేసిరి. పాదచారులు మఱికొన్నివస్తువులను మోయుచు ముందుకు సాగుచుండిరి. సేవకులందఱును తమతమపరికరములను తీసికొని గుంపులు గుంపులుగా నడుచుచుండిరి. (చౌ. 1-4)

దో- సబ కేం ఉర నిర్భర హరషు, పూరిత పులక సరీర ।
కబహిం దేఖిబే నయన భరి, రాము లఖను దౌఉ బీర ॥ 300 ॥

అందఱిహృదయములును అపారమైనఆనందముతో నిండియుండెను. వారితనువులు పులకరించెను. శ్రీరామలక్ష్మణులను కన్నులార ఎపుడు కాంచగలము? అని అందఱును ఉవ్విళ్లూరుచుండిరి (దో॥ 300)

చౌ- గరజహిఀ గజ ఘంటా ధుని ఘోరా। రథ రవ బాజి హింస చహు ఓరా ॥
నిదరి ఘనహి ఘుర్మ్మరహిఀ నిసానా। నిజ పరాఇ కఛు సునిఅ న కానా ॥ 1 ॥
మహా భీర భూపతి కే ద్వారేఀ। రజ హోఇ జాఇ పషాన పబారేఀ ॥
చఢీ అటారిన్హ దేఖహిఀ నారీఀ। లిఏఀ ఆరతీ మంగల థారీఀ ॥ 2 ॥
గావహిఀ గీత మనోహర నానా। అతి ఆనందు న జాఇ బఖానా ॥
తబ సుమంత్ర దుఇ స్యందన సాజీ। జోతే రబి హయ నిందక బాజీ ॥ 3 ॥
దోఉ రథ రుచిర భూప పహిఀ ఆనే। నహిఀ సారద పహిఀ జాహిఀ బఖానే ॥
రాజ సమాజు ఏక రథ సాజా। దూసర తేజ పుంజ అతి భ్రాజా ॥ 4 ॥

ఏనుగులఘీంకారములు, వాటిఘంటారవములు, రథచక్రములసవ్వడులు, గుఱ్ఱముల సకిలింపులు, నగారాల మ్రోతలు- ఇవి యన్నియు మేఘగర్జనలనుగూడ మించిపోయెను. ఒకరి మాటలు మఱియొకరికి వినబడకుండెను. దశరథ మహారాజుభవనముముందఱ ఇసుకవేస్తే రాలనంతగా జనులు గుమిగూడి యుండిరి. స్త్రీలు అట్టాలికలపైనుండి హారతి పళ్లెములను చేబూని, ఊరేగింపునకై ఎదురు చూచుచుండిరి. మఱియు వారు మనోజ్ఞముగా పాటలు పాడుచుండిరి. వారియానందమునకు అవధియే లేకుండెను. దశరథునకు మిక్కిలి ఆంతరంగికుడైన సుమంత్రుడు వేగములో సూర్యరథాశ్వములను గూడ మించునట్టి గుఱ్ఱములను పూన్చి, రెండు రథములను సిద్ధపఱచెను. ఆ సుందరరథములను రాజుకడకు తీసికొని వచ్చెను. ఆ రథముల యొక్క అందచందములు వర్ణనాతీతములు. ఒక రథములో రాజుగారి సంబారములు ఉంచబడెను. మఱియొక రథము తేజః పుంజమై శోభాయమానముగా ఉండెను. (చౌ॥ 1-4)

దో- తెహిఀ రథ రుచిర బసిష్ఠ కహుఀ, హరషి చఢాఇ నరేసు।
ఆపు చఢేఉ స్యందన సుమిరి, హర గుర గౌరి గనేసు ॥ 301 ॥

ఈ సుందరరథముపై రాజు తమకులగురువైన వసిష్ఠుని హర్షముతో ఆసీనుని జేసెను. పిమ్మట శివుని, తన గురువగు వసిష్ఠుని, గౌరిగణేశులను మనస్సులో ధ్యానించి, దశరథుడు మఱియొక రథముపై నెక్కెను. (దో॥ 301)

చౌ- సహిత బసిష్ఠ సోహ నృప కైసేఀ। సురగుర సంగ పురందర జైసేఀ ॥
కరి కుల రీతి బేద బిధి రాఊ। దేఖి సబహి సబ భాఀతి బనాఊ ॥ 1 ॥
సుమిరి రాము గుర ఆయసు పాఈ। చలే మహీపతి సంఖ బజాఈ ॥
హరషే బిబుధ బిలోకి బరాతా। బరషహిఀ సుమన సుమంగల దాతా ॥ 2 ॥
భయఉ కోలాహల హయ గయ గాజే। బ్యోమ బరాత బాజనే బాజే ॥
సుర నర నారి సుమంగల గాఈఀ। సరస రాగ బాజహిఀ సహనాఈఀ ॥ 3 ॥

ఘంట ఘంటి ధుని బరని న జాహీం। సరవ కరహిం పాఇక ఫహరాహీం ॥
కరహిం బిదూషక కౌతుక నానా। హాస కుసల కల గాన సుజానా ॥ 4 ॥

సురగురువగు బృహస్పతితోగూడిన ఇంద్రునివలె దశరథుడు వసిష్ఠునితోగూడి ఒప్పొరెను. వంశానుగతములైన వేదోక్తవిధులన్నియును నెఱవేర్పబడెను. అందఱును ప్రయాణమునకవసరమైన సామగ్రితో బయలుదేఱిరి. దశరథమహారాజు శ్రీరామచంద్రుని తలంచుకొనుచు వసిష్ఠునిఆజ్ఞలతో శంఖారావములతో ముందునకు సాగెను. ఈ పెండ్లి యూరేగింపును జూచి, దేవతలుగూడ ప్రసన్నులైరి. తమశుభాశీస్సులతో, పూలవానలను కురిపించిరి. అశ్వహేషలతో, గజఘీంకృతులతో, వాద్యఘోషలతో భూమ్యాకాశములు మాఱుమ్రోగుచుండెను. ఆకాశమున దేవాంగనలును, పుడమిపై మానవభామినులును మంగళగీతములను మధురముగా ఆలపించుచుండిరి. మంగళవాద్యములు మ్రోగుచుండెను. చిఱుగంటల సవ్వడులు. మహాఘంటానాదములు మిళలితములై మిన్ను ముట్టెను. కొందఱు పాదచారులు గాలిలోనికెగిరి, పెక్కువిధములగు నృత్యవిన్యాసములను గావించిరి. విదూషకులు హాస్యోక్తులను పలుకుచుండిరి. కొందఱు వినోద గీతములను గానము చేయుచుండిరి. (చౌ॥ 1-4)

దో- తురగ నచావహిం కుఅఁర బర, అకని మృదంగ నిసాన।
నాగర నట చితవహిం చకిత, డగహిం న తాల బఁధాన ॥ 302 ॥

స్ఫురద్రూపులైన రాజకుమారులు మృదంగాదివాద్యములలయలకు అనుగుణముగా గుఱ్ఱములతో నాట్యవిన్యాసములు చేయించిరి. ఏ మాత్రమూ తాళగతులుతప్పని వాటినృత్యభంగిమలను గాంచి నర్తకులు ఆశ్చర్యపడిరి. (దో॥ 302)

చౌ- బనఇ న బరనత బనీ బరాతా। హోహిం సగున సుందర సుభదాతా ॥
చారా చాషు బామ దిసి లేఈ। మనహుఁ సకల మంగల కహి దేఈ ॥ 1 ॥
దాహిన కాగ సుఖేత సుహావా। నకుల దరసు సబ కాహూఁ పావా ॥
సానుకూల బహ త్రిబిధ బయారీ। సఘట సబాల ఆవ బర నారీ ॥ 2 ॥
లోవా ఫిరి ఫిరి దరసు దెఖావా। సురభీ సనముఖ సిసుహి పిఆవా ॥
మృగమాలా ఫిరి దాహిని ఆఈ। మంగల గన జను దీన్హి దెఖాఈ ॥ 3 ॥
ఛేమకరీ కహ ఛేమ బిసేషీ। స్యామా బామ సుతరు పర దేఖీ ॥
సనముఖ ఆయఉ దధి అరు మీనా। కర పుస్తక దుఇ బిప్ర ప్రబీనా ॥ 4 ॥

పెండ్లిఊరేగింపువైభవము వర్ణింపనలవిగానిది. అన్నియు శుభశకునములే కలుగుచుండెను. నీలకంఠపక్షి ఆహారమునుగొని ఎడమవైపునుండి ఎగురుచు పోవుచుండెను. కుడివైపునగల పంటపొలాలలో కాకి, ముంగిస కనబడెను. శీతలమందసుగంధిలవాయువులు అనుకూలముగా వీచుచుండెను. ముత్తైదువలు బుజములపై నిండుకుండలతోడను, చంకనపసిపిల్లలతోడను ఎదురైరి. ఒక నక్క పెక్కుపర్యాయములు కనబడెను. తనదూడకు పాలిచ్చుచున్న ఆవు కనబడెను. జింకలగుంపు ఎడమనుండి కుడివైపునకు పరుగెత్తెను. శుభసూచకముగా ఒకతెల్లనిపాలపిట్ట కనవచ్చెను. చెట్టుపైనొకశ్యామపక్షి గోచరమయ్యెను. ఒకడు పెరుగును చేతులలో పట్టుకొని

ఎదురుగా వచ్చెను. సరోవరమున ఎగురుచున్న చేపలు కనవచ్చెను. విద్వాంసులైన ఇద్దఱు బ్రాహ్మణులు తమ చేతులలో పుస్తకములను ఉంచుకొని ఎదురైరి. (చౌ॥ 1-4)

దో- మంగలమయ కల్యానమయ, అభిమత ఫల దాతార।
జను సబ సాచే హోన హిత, భఏ సగున ఏక బార ॥ 303 ॥

మంగళమయములు, కల్యాణప్రదములు, వాంఛితఫలదాయకములు ఐన శకునములు కొల్లలుగా పొడసూపెను. (దో॥ 303)

చౌ- మంగల సగున సుగమ సబ తాకేం। సగున బ్రహ్మ సుందర సుత జాకేం ॥
రామ సరిస బరు దులహిని సీతా। సమధీ దసరథు జనకు పునీతా ॥ 1 ॥
సుని అస బ్యాహు సగున సబ నాచే। అబ కీన్హే బిరంచి హమ సాంచే ॥
ఏహి బిధి కీన్హ బరాత పయానా। హయ గయ గాజహిం హనే నిసానా ॥ 2 ॥
ఆవత జాని భానుకుల కేతూ। సరితన్హి జనక బంధాఏ సేతూ ॥
బీచ బీచ బర బాస బనాఏ। సురపుర సరిస సంపదా ఛాఏ ॥ 3 ॥
అసన సయన బర బసన సుహాఏ। పావహిం సబ నిజ నిజ మన భాఏ ॥
నిత నూతన సుఖ లఖి అనుకూలే। సకల బరాతిన్హ మందిర భూలే ॥ 4 ॥

సగుణబ్రహ్మయేకుమారుడుగాగల దశరథునకు శకునములన్నియును శుభప్రదములేయగును. సీతారాములు వధూవరులుగా, దశరథజనకులు వియ్యంకులుగాగల వివాహమహోత్సవమునందు శుభశకునములన్నియును నాట్యములు సేయుచు బ్రహ్మ తమజన్మలను సఫలమొనర్చెనని ఘోషించినవి. ఈ విధముగా గుఱ్ఱములసకిలింపులు, ఏనుగుల బృంహితములు, నగారాల ఢాంకారములు మొదలగు వాటి మధ్య ఆ ఊరేగింపు పురోగమించుచుండెను. సూర్యవంశ శ్రేష్ఠుడైన దశరథుడు వచ్చుచున్నాడని విని జనకుడు దారిలోని నదులన్నింటిపైనను వంతెనలను నిర్మింపజేసెను. త్రోవలో విడిదికి సురలోక భవనములను క్రిందుపఱచు విశ్రాంతిగృహములను ఏర్పాటుచేసెను. అందు వరునిపక్షమువారికి మనోవాంఛితములైన భోజనపదార్థములను, పరుపులను, వస్త్రములను సమకూర్చెను. తమ మనోనుకూలములైన నూతనసుఖసౌకర్యములను జూచి, ఆ పెండ్లివారు తమఇండ్లనుగూడ మఱచి పోవుచుండిరి. (చౌ॥ 1-4)

దో- ఆవత జాని బరాత బర, సుని గహగహే నిసాన।
సజి గజ రథ పదచర తురగ, లేన చలే అగవాన ॥ 304 ॥

నగారాలమ్రోతలు చెవినబడగానే వరునిపక్షమువారిఊరేగింపు నగరమును సమీపించు చున్నదని తెలిసికొని, వారిస్వాగతసత్కారములకై జనకుని పరివారములు రథగజతురగ పదాతులతో బయలుదేఱెను. (దో॥ 304)

(మాసపారాయణము-పదియవ విరామము)

## పెండ్లివారికి స్వాగత మర్యాదలు

చౌ- కనక కలస భరి కోపర థారా । భాజన లలిత అనేక ప్రకారా ॥
భరే సుధాసమ సబ పకవానే । నానా భాఁతి న జాహిఁ బఖానే ॥ 1 ॥
ఫల అనేక బర బస్తు సుహాఈఁ । హరషి భేఁట హిత భూప పఠాఈఁ ॥
భూషన బసన మహామని నానా । ఖగ మృగ హయ గయ బహుబిధి జానా ॥ 2 ॥
మంగల సగున సుగంధ సుహాఏ । బహుత భాఁతి మహిపాల పఠాఏ ॥
దధి చిఉరా ఉపహార అపారా । భరి భరి కాఁవరి చలే కహారా ॥ 3 ॥
అగవానన్హ జబ దీఖి బరాతా । ఉర ఆనందు పులక భర గాతా ॥
దేఖి బనావ సహిత అగవానా । ముదిత బరాతిన్హ హనే నిసానా ॥ 4 ॥

పాలు, పానకము, నీరు చల్లని పానీయములు మొదలగువాటితో నింపిన బంగారుపాత్రలు, నానా విధములైన అమృతతుల్యములైన పక్వాన్నములతో నిండిన పళ్లెములు, వివిధములైన ఫలములు, అందమైనవస్తువులు జనకుడు సంతోషముతో వారిఆతిథ్యమునకై సమకూర్చెను. ఆభరణములను, వస్త్రములను, అమూల్యరత్నములను, పక్షులను, ఏనుగులను, జింకలను, గుఱ్ఱములను, అనేక వాహనములను, సుగంధమంగళద్రవ్యములను, శుభశకునములుగా భావింపబడు పెక్కువస్తువులను జనకమహారాజు వారికి పంపెను. సేవకులు పెఱుగులు, అటుకులు, అసంఖ్యాకములైన ఉపాహారములను కావళ్లలో వరుసలుగట్టి మోసికొనివచ్చిరి. ఆహ్వానసంఘసభ్యులు ఆ ఊరేగింపును గాంచి, అపరిమితానందము నొందిరి. వారి శరీరములు రోమాంచితములాయెను. వారిని చూచి, వరునిపక్షమువారు సంతోషముతో నగారాలను మ్రోగించిరి. (చౌ॥ 1-4)

దో- హరషి పరసపర మిలన హిత, కఛుక చలే బగమేల ।
జను ఆనంద సముద్ర దుఇ, మిలత బిహాఇ సుబేల ॥ 305 ॥

ఇరుపక్షములనుండి కొందఱు సంతోషమును పట్టలేక ఎదుటివారిని కలిసికొనుటకు పరుగులు దీసిరి. రెండుపక్షములవారును, రెండు ఆనంద సముద్రములు తమహద్దులను దాటి కలియుచున్నవాయనునట్లు కలిసిరి. (దో॥ 305)

చౌ- బరషి సుమన సుర సుందరి గావహిఁ । ముదిత దేవ దుందుభీఁ బజావహిఁ ॥
బస్తు సకల రాఖీఁ నృప ఆగేఁ । బినయ కీన్హి తిన్హ అతి అనురాగేఁ ॥ 1 ॥
ప్రేమ సమేత రాయఁ సబు లీన్హా । భై బకసీస జాచకన్హి దీన్హా ॥
కరి పూజా మాన్యతా బడాఈ । జనవాసే కహుఁ చలే లవాఈ ॥ 2 ॥
బసన బిచిత్ర పాఁవడే పరహీఁ । దేఖి ధనదు ధన మదు పరిహరహీఁ ॥
అతి సుందర దీన్హేఉ జనవాసా । జహఁ సబ కహుఁ సబ భాఁతి సుపాసా ॥ 3 ॥
జానీ సియఁ బరాత పుర ఆఈ । కఛు నిజ మహిమా ప్రగటి జనాఈ ॥
హృదయఁ సుమిరి సబ సిద్ధి బొలాఈఁ । భూప పహునఈ కరన పఠాఈఁ ॥ 4 ॥

సురసుందరీమణులు పుష్పవృష్టిని గురిపించుచు పాటలు పాడిరి. దేవతలు ఆనందముతో దుందుభులు మ్రోగించిరి. ఆహ్వానసంఘమువారు తాము తెచ్చిన వస్తువులనన్నింటిని దశరథుని ముందుంచి మిక్కిలిప్రేమతో సమర్పించిరి. రాజు వాటిని సాదరముగా స్వీకరించి, తనప్రజలకు కానుకలుగా ఇచ్చెను, అర్థులకు పంచెను. పిదప ఆహ్వానసంఘసభ్యులు గౌరవాదరములతో వారిని సన్మానించి, వారికై ఏర్పాటు చేయబడిన విడుదులలో వారిని ప్రవేశపెట్టిరి. మగపెండ్లివారు నడుచుటకు క్రింద పఱచబడిన వస్త్రములశోభలను చూచి కుబేరుడుగూడ తనధనగర్వమును విడిచి పెట్టెను. వారికి ఏర్పఱచబడిన విడిదిగృహములు సుందరములై సకలవసతులను కలిగియుండెను. మగపెండ్లివారు మిథిలానగరమునకు వచ్చినట్లు తెలియగనే సీతాదేవి తనమహిమలను కొన్నింటిని చూపెను. ఆమె తన సిద్ధులను స్మరించి, వాటిని దశరథుని స్వాగతమునకై పంపెను. (చౌ॥ 1-4)

దో-సిధి సబ సియ ఆయసు అకని, గఈఁ జహాఁ జనవాస।
లిఏఁ సంపదా సకల సుఖ, సురపుర భోగ బిలాస ॥ 306 ॥

ఆ సిద్ధులు సీతాదేవి ఆజ్ఞలను అనుసరించి, విడిది గృహములయందు వారికి స్వర్గసుఖసౌకర్యములను సమకూర్చెను. (దో॥ 306)

చౌ-నిజ నిజ బాస బిలోకి బరాతీ। సుర సుఖ సకల సులభ సబ భాఁతీ ॥
బిభవ భేద కఛు కోఉ న జానా। సకల జనక కర కరహిఁ బఖానా ॥ 1 ॥
సియ మహిమా రఘునాయక జానీ। హరషే హృదయఁ హేతు పహిచానీ ॥
పితు ఆగమను సునత దోఉ భాఈ। హృదయఁ న అతి ఆనందు అమాఈ ॥ 2 ॥
సకుచన్హ కహి న సకత గురు పాహీఁ। పితు దరసన లాలచు మన మాహీఁ ॥
బిస్వామిత్ర బినయ బడి దేఖీ। ఉపజా ఉర సంతోషు బిసేషీ ॥ 3 ॥
హరషి బంధు దోఉ హృదయఁ లగాఏ। పులక అంగ అంబక జల ఛాఏ ॥
చలే జహాఁ దసరథు జనవాసే। మనహుఁ సరోబర తకేఉ పిఆసే ॥ 4 ॥

వరపక్షమువారు తమబసలలో కోరుకొనినసుఖములను అన్నింటిని సులభముగా పొందిరి. ఈ ఐశ్వర్యరహస్యము ఎవ్వరికిని అంతుపట్టలేదు. అందఱును జనకుని ప్రశంసించిరి. ఇది సీతాదేవి మహిమయని శ్రీరామునికి మాత్రమే తెలియును. ఆమె ప్రగాఢప్రేమకు అతడు సంతసించెను. తమ తండ్రిరాక తెలియగానే రామలక్ష్మణులు ఇరువురును పట్టరాని ఆనందముతో అచట నిలువలేకపోయిరి. తండ్రిని చూడవలెనను కోరికయున్నను గురువును అడుగుటకు వెనుకాడిరి. వారి వినయవిధేయతలకు విశ్వామిత్రుడు మిక్కిలిసంతసించెను. ఆనందముతో అతడు ఆ ఇరువురిని ఆలింగనముచేసికొనెను. అతనిశరీరము పులకించెను. కన్నుల నీరునిండెను. వారు దశరథునిఅతిథిగృహమునకు వెళ్లిరి. దప్పిగొన్నవానికడకు సరస్సే నడిచివచ్చినట్లాయెను. (చౌ॥ 1-4)

దో-భూప బిలోకే జబహిఁ ముని, ఆవత సుతన్హ సమేత।
ఉఠే హరషి సుఖసింధు మహుఁ, చలే థాహ సీ లేత ॥ 307 ॥

రామలక్ష్మణులతోగూడి వచ్చుచున్నవిశ్వామిత్రుని జూచి, దశరథ మహారాజు మిక్కిలి హర్షితుడై, వారిని కలియుటకు ఎదురేగెను. శ్రీరామకల్యాణశుభవార్తలవలనను, జనకుడు జరిపించిన అతిథి సత్కారముల

కారణమునను ఆనంద సముద్రమున మునిగి తేలుచున్న దశరథుడు ఆ ఆనంద పారవశ్యము నుండి బయట పడుటకు రామలక్ష్మణులదర్శనము ఒక ఆలంబనమయ్యెను. (దో॥ 307)

చౌ- మునిహి దండవత కీన్హ మహీసా । బార బార పద రజ ధరి సీసా ॥
కౌసిక రాఉ లిఏ ఉర లాఈ । కహి అసీస పూఛీ కుసలాఈ ॥ 1 ॥
పుని దండవత కరత దోఉ భాఈ । దేఖి నృపతి ఉర సుఖు న సమాఈ ॥
సుత హియఁ లాఇ దుసహ దుఖ మేటే । మృతక సరీర ప్రాన జను భేఁటే ॥ 2 ॥
పుని బసిష్ఠ పద సిర తిన్హ నాఏ । ప్రేమ ముదిత మునిబర ఉర లాఏ ॥
బిప్ర బృంద బందే దుహుఁ భాఈఁ । మనభావతీ అసీసేఁ పాఈఁ ॥ 3 ॥
భరత సహానుజ కీన్హ ప్రనామా । లిఏ ఉఠాఇ లాఇ ఉర రామా ॥
హరషే లఖన దేఖి దోఉ భ్రాతా । మిలే ప్రేమ పరిపూరిత గాతా ॥ 4 ॥

దశరథుడు విశ్వామిత్రునకు సాష్టాంగ ప్రణామములను ఆచరించి, ఆయన పాదధూళిని శిరమున దాల్చెను. మునీశ్వరుడు ఆయనను కౌగిలించుకొని, ఆశీర్వదించి, కుశలప్రశ్నలు వేసెను. రామలక్ష్మణులిద్దఱును తనకు దండప్రణామములాచరింపగా దశరథుడు తన హృదయమున పట్టరాని ఆనందమును అనుభవించెను. అయిరువురిని హృదయమునకు హత్తుకొని గాఢాలింగన సుఖానందములను పొందెను. ఇన్నాళ్లవియోగబాధ ఒక్కసారిగా తొలగిపోయెను. పోయినప్రాణము తిరిగి వచ్చినంతసుఖమును అనుభవించెను. పిదపరామలక్ష్మణులు వసిష్ఠునకు పాదాభివందనమాచరించిరి. ఆ మునిశ్రేష్ఠుడు వారిని ఆలింగనముచేసికొని, ఆశీర్వదించెను. పిదప వారిరువురును బ్రాహ్మణులకు నమస్కరించిరి. వారు "అభీష్ట సిద్ధిరస్తు" అని ఆ యిరువురిని ఆశీర్వదించిరి. భరతుడు తనతమ్ముడైన శత్రుఘ్నునితో గూడి వచ్చి, శ్రీరామునకు నమస్కరించెను. అతడు వారిని లేపి తనఱక్కునజేర్చుకొనెను. సోదరులిద్దఱిని గాంచి, భరతునకు ప్రణమిల్లి, లక్ష్మణుడు అత్యంతానందముతో వారిని ఆలింగనము చేసికొనెను. (చౌ॥ 1-4)

దో- పురజన పరిజన జాతిజన, జాచక మంత్రీ మీత ।
మిలే జథాబిధి సబహి ప్రభు, పరమ కృపాల బినీత ॥ 308 ॥

పరమ కృపాళువు, వినయశీలియునైన శ్రీరామచంద్రుడు పురజనులను, పరిజనులను, బంధువులను, మంత్రులను, మిత్రులను అందఱిని యథావిధిగా లోకమర్యాదననుసరించి పరామర్శించెను. (దో॥ 308)

చౌ- రామహి దేఖి బరాత జుడానీ । ప్రీతి కి రీతి న జాతి బఖానీ ॥
నృప సమీప సోహహిఁ సుత చారీ । జను ధన ధరమాదిక తనుధారీ ॥ 1 ॥
సుతన్హ సమేత దసరథహి దేఖీ । ముదిత నగర నర నారి బిసేషీ ॥
సుమన బరిసి సుర హనహిఁ నిసానా । నాకనటీఁ నాచహిఁ కరి గానా ॥ 2 ॥
సతానంద అరు బిప్ర సచివ గన । మాగధ సూత బిదుష బందీజన ॥
సహిత బరాత రాఉ సనమానా । ఆయసు మాగి ఫిరే అగవానా ॥ 3 ॥

ప్రథమ బరాత లగన తేఁ ఆఈ। తాతేఁ పుర ప్రమోదు అధికాఈ ॥
బ్రహ్మానందు లోగ సబ లహహీఁ। బఢహుఁ దివస నిసి బిధి సన కహహీఁ ॥ 4 ॥

శ్రీరామచంద్రుని జూచినంతనే అయోధ్యావాసులవిరహాగ్ని ఒక్కసారిగా చల్లారెను. అప్పటి వారి ప్రేమానందములు వర్ణనాతీతములు. దశరథమహారాజసమీపముననున్న ఆ నలుగురు సోదరులును మూర్తీభవించిన చతుర్విధపురుషార్థముల (ధర్మార్థకామమోక్షముల) వలె శోభిల్లిరి. పుత్రులతోగూడియున్న దశరథునిజూచి మిథిలానగరవాసులు పరమానందమును అనుభవించిరి. దేవతలు పూవులను వర్షించిరి. దుందుభులను మ్రోగించిరి. దివ్యాగంనలు గీతములను ఆలపించుచు నృత్యములను జేసిరి. ఆహ్వానసంఘసభ్యులైన గురువు శతానందుడు, ఇతరబ్రాహ్మణులు, మంత్రులు, మాగధులు, సూతులు, విద్వాంసులు, స్తుతిపాఠకులు మొదలగు వారందఱును దశరథునకును, వరపక్షము వారందఱికిని యథోచిత స్వాగత సత్కారములను ఆచరించి, వారి యాజ్ఞనుగొని వెనుకకు మఱలిపోయిరి. వివాహమహోత్సవమునకై మగపెండ్లివారు ముందుగా వచ్చినారని తెలియగనే నగరమునందంతటను ఆనందము వెల్లివిరిసెను. జనులెల్లరును బ్రహ్మానందమును అనుభవించిరి. దివారాత్రములను దీర్ఘములుగా జేయుమని వారు విధిని ప్రార్థించిరి. (చౌ॥ 1-4)

దో- రాము సీయ సోభా అవధి, సుకృత అవధి దోఉ రాజ।
జహఁ తహఁ పురజన కహహిఁ అస, మిలి నర నారి సమాజ ॥ 309 ॥

నగరములోని స్త్రీ పురుషులందఱును గుంపులుగూడి తమలో తాము ఇట్లనుకొనసాగిరి. "సీతారాములు సౌందర్యమునకు సీమలు. దశరథజనకమహారాజులు పుణ్యమునకు పరాకాష్ఠలు. అర్థాత్ సీతారాములవంటి సౌందర్య మూర్తులులేరు. జనక దశరథులవంటి పుణ్యపురుషులునూలేరు. (దో॥ 309)

చౌ- జనక సుకృత మూరతి బైదేహీ। దసరథ సుకృత రాము ధరేఁ దేహీ ॥
ఇన్హ సమ కాహుఁ న సివ అవరాధే। కాహుఁ న ఇన్హ సమాన ఫల లాధే ॥ 1 ॥
ఇన్హ సమ కోఉ న భయఉ జగ మాహీఁ। హై నహిఁ కతహూఁ హోనేఉ నాహీఁ ॥
హమ సబ సకల సుకృత కై రాసీ। భఏ జగ జనమి జనకపుర బాసీ ॥ 2 ॥
జిన్హ జానకీ రామ ఛబి దేఖీ। కో సుకృతీ హమ సరిస బిసేషీ ॥
పుని దేఖబ రఘుబీర బిఆహూ। లేబ భలీ బిధి లోచన లాహూ ॥ 3 ॥
కహహిఁ పరసపర కోకిలబయనీఁ। ఏహి బిఆహఁ బడ లాభు సునయనీఁ ॥
బడేఁ భాగ బిధి బాత బనాఈ। నయన అతిథి హోఇహహిఁ దోఉ భాఈ ॥ 4 ॥

దశరథునిపుణ్యము శ్రీరాముడుగా మూర్తీభవించినది. జనకునిపుణ్యఫలముగా జానకి అవతరించినది. ఈ ఇరువురివలె ఆ పరమశివుని మఱెవ్వరును ఆరాధింపలేదు. ఫలముగూడ మఱియెవ్వరును పొందలేదు. వీరికి సమానులైన పుణ్యమూర్తులు 'న భూతో న భవిష్యతి'. మనముకూడ అనేకజన్మలలో చేసికొనిన పుణ్యఫలముగా ఈ జనకమహారాజురాజ్యములో జన్మించితిమి. శ్రీ సీతారాముల అలౌకికసౌందర్యమును కనులార చూడగల్గిన పుణ్యాత్ములు మన కంటె ఈ లోకములో ఎవరున్నారు? ఇప్పుడు శ్రీ సీతారాముల వివాహమహోత్సవమును తిలకించి, నేత్రములున్న ఫలమును పొందెదము." కోకిలకంఠస్వరముగల స్త్రీలు తమలో తాము ఇట్లనుకొనిరి. "ఓ

తరుణులారా! ఈ వివాహమువలన మనకెంతో లాభము. మనఅదృష్టమువలన విధాత మనకు ఈ అవకాశమును గల్గించినాడు. సోదరులిద్దఱు తఱచుగా మనకు అతిథులుగా వచ్చెదరు. మనకు నేత్రానందమును కూర్చెదరు. (చౌ॥ 1-4)

దో- బారహిఁ బార సనేహ బస, జనక బోలాఉబ సీయ ।
లేన ఆఇహహిఁ బంధు దోఉ, కోటి కామ కమనీయ ॥ 310 ॥

వాత్సల్యముతో జనకుడు మాటిమాటికి సీతాదేవిని అయోధ్యనుండి ఇచటికి పిలుచుకొని వచ్చును. కోటిమన్మథాకారులైన ఈ సోదరులు ఆమెను మఱల తీసికొని పోవుటకు ఇచటికి వచ్చెదరు. (దో॥ 310)

చౌ- బిబిధ భాఁతి హోఇహి పహునాఈ । ప్రియ న కాహి అస సాసుర మాఈ ॥
తబ తబ రామ లఖనహి నిహారీ । హోఇహహిఁ సబ పుర లోగ సుఖారీ ॥ 1 ॥
సఖి జస రామ లఖన కర జోటా । తైసెఇ భూప సంగ దుఇ ఢోటా ॥
స్యామ గౌర సబ అంగ సుహాఏ । తే సబ కహహిఁ దేఖి జే ఆఏ ॥ 2 ॥
కహా ఏక మైఁ ఆజు నిహారే । జను బిరంచి నిజ హాథ సఁవారే ॥
భరతు రామహీ కీ అనుహారీ । సహసా లఖి న సకహిఁ నర నారీ ॥ 3 ॥
లఖను సత్రుసూదను ఏకరూపా । నఖ సిఖ తే సబ అంగ అనూపా ॥
మన భావహిఁ ముఖ బరని న జాహీఁ । ఉపమా కహుఁ త్రిభువన కోఉ నాహీఁ ॥ 4 ॥

ఇక్కడ మనము అన్ని విధములుగా వారికి ఆతిథ్యము ఇచ్చెదము. ఇట్టి మామగారిఇల్లు ఎవరికి ఇష్టముఉండదు? వారు వచ్చినప్పుడెల్ల వారిని దర్శించి, మనము ధన్యజీవులముగావచ్చును. ఓ సఖీ! దశరథునితోపాటు మఱి యొక రాజకుమారుల జంట కూడ వచ్చినది. వారును రామలక్ష్మణుల జంటవలె సుందరాకారులు. ఒకరు నీలముగా మఱొకరు గౌరవర్ణముతో ఉన్నారు. వారిని జూచినవారందఱును అట్లే చెప్పుచున్నారు." ఒక యువతి ఇట్లు పల్కెను. "నేను నేడే వారిని జూచినాను. బ్రహ్మ స్వయముగా తన కరములతో ప్రత్యేకముగా వారిని సృష్టించినాడా యనునట్లు వారు మిక్కిలి మనోహరముగా ఉన్నారు. భరతుడైతే పూర్తిగా శ్రీరామునివలెనే ఉన్నాడు. వారిని హఠాత్తుగా చూచినవారు ఎవ్వరునూ వారిని గుర్తింపలేరు. లక్ష్మణశత్రుఘ్నులు ఒకే పోలికలుగలిగియున్నారు. ఇద్దఱును ఆపాదమస్తకము నిరుపమానసౌందర్యమూర్తులు. వారిని గాంచినపుడు కలిగెడిఆత్మానందము వర్ణింపనలవిగానిది. ముల్లోకములలో వారికి సాటియైనవారు లేనేలేరు. (చౌ॥ 1-4)

ఛం- ఉపమా న కోఉ కహ దాస తులసీ కతహుఁ కబి కోబిద కహైఁ ।
బల బినయ బిద్యా సీల సోభా సింధు ఇన్హ సే ఏఇ అహైఁ ॥
పుర నారి సకల పసారి అంచల బిధిహి బచన సునావహీఁ ।
బ్యాహిఅహుఁ చారిఉ భాఇ ఏహిఁ పుర హమ సుమంగల గావహీఁ ॥

(తులసీదాసు చెప్పుచున్నాడు) "వారికి ఎవ్వరును సాటిరారు" అని కవులు, పండితులు పొగడుచున్నారు. బలము, వినయము, శీలము, విద్య అందము- మూర్తీభవించినట్లున్నారు. వారికి వారేసాటి. మిథిలాపురస్త్రీలు తమ

కొంగులు పట్టుకొని విధాతను ఇట్లు వేడుకొనుచుండిరి. "ఈ నలుగురి వివాహములు ఇచ్చటనే జరుగవలయును. మేమందరము మంగళ గీతములను పాడెదము." (ఛం॥)

సో- కహహిం పరస్పర నారి, బారి బిలోచన పులక తన।
సఖి సబు కరబ పురారి, పున్య పయోనిధి భూప దోఉ ॥ 311 ॥

చెమర్చిన కన్నులతో, పులకించిన దేహములతో స్త్రీలందఱును తమలో తాము ఇట్లనుకొనిరి. సఖీ! త్రిపురారియైన ఆపరమశివుడు మన కోరికలను తప్పక ఈడేర్చును. ఏలనన ఈ రాజులు ఇరువురును పుణ్యాత్ములే. ఇంతమంది మనోరథమును భగవంతుడు తప్పక సఫలమొనర్చును. అనగా ఈ నలుగురి వివాహములు ఇక్కడనే జరిగి తీరును. (సో॥ 311)

## శ్రీ సీతారాముల, భరతాదుల కళ్యాణ మహోత్సవములు

చౌ- ఏహి బిధి సకల మనోరథ కరహీం। ఆనంద ఉమగి ఉమగి ఉర భరహీం ॥
జే నృప సీయ స్వయంబర ఆఏ। దేఖి బంధు సబ తిన్హ సుఖ పాఏ ॥ 1 ॥
కహత రామ జసు బిసద బిసాలా। నిజ నిజ భవన గఏ మహిపాలా ॥
గఏ బీతి కఛు దిన ఏహి భాంతీ। ప్రముదిత పురజన సకల బరాతీ ॥ 2 ॥
మంగల మూల లగన దిను ఆవా। హిమ రితు అగహను మాసు సుహావా ॥
గ్రహ తిథి నఖతు జోగు బర బారూ। లగన సోధి బిధి కీన్హ బిచారూ ॥ 3 ॥
పఠై దీన్హి నారద సన సోఈ। గనీ జనక కే గనకన్హ జోఈ ॥
సునీ సకల లోగన్హ యహ బాతా। కహహిం జోతిషీ ఆహిం బిధాతా ॥ 4 ॥

ఈ విధముగా పురస్త్రీలు ప్రార్థించుచుండిరి. వారి హృదయములయందు ఆనందము వెల్లి విరియుచుండెను. సీతాదేవి స్వయంవరమునకు పెక్కుమంది రాజన్యులును వచ్చియుండిరి. వారు ఆ నలుగురు సోదరులను జూచి సంతసించిరి. శ్రీరాముని నిర్మలమనకీర్తిని పొగడుచు వారు తమ గృహములకు చేరిరి. ఇట్లు చాలా దినములు గడిచినవి. పురజనులు, వరపక్షము వారు ఆనందముగా ఉండిరి. శుభప్రదమైన ఆ వివాహ ముహూర్తసమయము రానే వచ్చెను. అది మార్గశీర్ష మాసము, హేమంత ఋతు ప్రారంభ సమయము. బ్రహ్మదేవుడు సరియైన తిథివారనక్షత్రగ్రహయోగములను పరిశీలించి, సుముహూర్త కాలమును నిర్ణయించి, నారదుని వెంట పంపెను. జనకుని సంస్థాన జ్యోతిష పండితులుగూడ అదే ముహూర్తమును నిర్ణయించియుండిరి. ఇదివిన్న జనులు "మన జ్యోతిషులు గూడ బ్రహ్మయంతటి వారు" అనిరి. (చౌ॥ 1-4)

దో- ధేనుధూరి బేలా బిమల, సకల సుమంగల మూల।
బిప్రన్హ కహేఉ బిదేహ సన, జాని సగున అనుకూల ॥ 312 ॥

మిక్కిలి శుభప్రదమైన గోధూళిసమయమున మంచి శకునములను జూచి, బ్రాహ్మణులు జనకునకు సందేశమును పంపిరి. (దో॥ 312)

చౌ- ఉపరోహితహి కహేఉ నరనాహా । అబ బిలంబ కర కారను కాహా ॥
సతానంద తబ సచివ బొలాఏ । మంగల సకల సాజి సబ ల్యాఏ ॥ 1 ॥
సంఖ నిసాన పనవ బహు బాజే । మంగల కలస సగున సుభ సాజే ॥
సుభగ సుఆసిని గావహిఁ గీతా । కరహిఁ బేద ధుని బిప్ర పునీతా ॥ 2 ॥
లేన చలే సాదర ఎహి భాఁతీ । గఏ జహాఁ జనవాస బరాతీ ॥
కోసలపతి కర దేఖి సమాజా । అతి లఘు లాగ తిన్హహి సురరాజా ॥ 3 ॥
భయఉ సమఉ అబ ధారిఅ పాఉ । యహ సుని పరా నిసానహిఁ ఘాఉ ॥
గురహి పూఛి కరి కుల బిధి రాజా । చలే సంగ ముని సాధు సమాజా ॥ 4 ॥

జనకమహారాజు తనకులగురువైన శతానందుని జూచి "ఇక విలంబమేల? అనెను. శతానందుడు మంత్రులను పిలిచెను. వారు మంగళద్రవ్యములతో విచ్చేసిరి. శంఖములు, నగారాలు, డోళ్లు, ఇతర వాద్యములు మ్రోగింపబడినవి. మంగళ కలశములు, శుభశకునములను సూచించువస్తువులు అలంకరింప బడెను. సువాసినులు గీతములను గానముచేసిరి. బ్రాహ్మణులు వేదములను పఠించిరి. ఈ విధముగ జనులందఱును సాదరముగా మగపెండ్లి వారువిడిసిన గృహములకు వెళ్లి, వారిని ఆహ్వానించుటకు తరలిరి. అయోధ్యాపతియగుదశరథునిఐశ్వర్యమును జూచినవారికి దేవేంద్రుడును చిన్నవాడుగానే తోచును. వారు సవినయముగా దశరథునితో ఇట్లు పలికిరి. "శుభముహూర్తము సమీపించినది, దయతో విచ్చేయుడు"- వెంటనే నగారాలు మ్రోగెను. గురువగువసిష్ఠునిఅభిప్రాయమునడిగితెలిసికొని, వంశాచార కార్యములను యథావిధిగా నిర్వర్తించి, దశరథమహారాజు మునులతో సాధువులతో సపరివారముగా బయలు దేఱెను. (చౌ॥ 1-4)

దో-భాగ్య బిభవ అవధేస కర, దేఖి దేవ బ్రహ్మాది ।
లగే సరాహన సహస ముఖ, జాని జనమ నిజ బాది ॥ 313 ॥

బ్రహ్మాది దేవతలు దశరథమహారాజు భాగ్య వైభవములను జూచి, ఆయనను వేనోళ్ల పొగడుటయే గాక, అట్టి భాగ్యమునకు నోచుకొనని తమ జన్మలు వ్యర్థములని భావించిరి. (దో॥ 313)

చౌ- సురన్హ సుమంగల అవసరు జానా । బరషహిఁ సుమన బజాఇ నిసానా ॥
సివ బ్రహ్మాదిక బిబుధ బరూథా । చఢే బిమానన్హి నానా జూథా ॥ 1 ॥
ప్రేమ పులక తన హృదయఁ ఉఛాహూ । చలే బిలోకన రామ బిఆహూ ॥
దేఖి జనకపురు సుర అనురాగే । నిజ నిజ లోక సబహిఁ లఘు లాగే ॥ 2 ॥
చితవహిఁ చకిత బిచిత్ర బితానా । రచనా సకల అలౌకిక నానా ॥
నగర నారి నర రూప నిధానా । సుఘర సుధరమ సుసీల సుజానా ॥ 3 ॥
తిన్హహి దేఖి సబ సుర సురనారీఁ । భఏ నఖత జను బిధు ఉజిఆరీఁ ॥
బిధిహి భయఉ ఆచరజు బిసేషీ । నిజ కరనీ కఛు కతహుఁ న దేఖీ ॥ 4 ॥

ఆ సుముహూర్తము మిక్కిలి మంగళకరమైనదని తెలిసికొని, దేవతలు కుసుమ వృష్టి గురిపించిరి. దుందుభులను మ్రోగించిరి. బ్రహ్మ, శంకరుడు మొదలగు దేవతలు శ్రీ సీతారాముల వివాహ మహోత్సవమును తిలకించుటకై పరమోత్సాహముతో తమతమ విమానములపై మిథిలకు ఏతెంచిరి. ఆ నగరవైభవమునుగాంచినదేవతలు తమలోకములను అత్యల్పమైనవిగా తలంచిరి. అద్భుతమైన మండపమును ఇతరవివిధ- అలౌకికశిల్పములను జూచి, వారు చకితులైరి. నగరములోని స్త్రీ పురుషులు సుందరులు, సౌష్ఠవకాయులు, ధర్మాత్ములు, సచ్ఛీలురు, జ్ఞానులు. వారిముందు దేవతలు, దివ్యాంగనలు వెన్నెలలో చిన్న చిన్న నక్షత్రములవలె కనబడిరి. తనరచనను ఒక్కదానిని గూడ చూడకయే బ్రహ్మ మిక్కిలి ఆశ్చర్యచకితుడాయెను.

(చౌ॥ 1-4)

దో- సివఁ సముఝాఏ దేవ సబ, జని ఆచరజ భులాహు ।
హృదయఁ బిచారహు ధీర ధరి, సియ రఘుబీర బిఆహు ॥ 314 ॥

అపుడు పరమేశ్వరుడు దేవతలతో పలికెను. "మీరు ఆశ్చర్యపడవలదు. ప్రశాంతముగా ఆలోచింపుడు. ఇది సామాన్యుల వివాహముగాదు. శ్రీ సీతారాముల పరిణయము. (దో॥ 314)

చౌ- జిన్హ కర నాము లేత జగ మాహీఁ । సకల అమంగల మూల నసాహీఁ ॥
కరతల హోహిఁ పదారథ చారీ । తెఇ సియ రాము కహేఉ కామారీ ॥ 1 ॥
ఏహి బిధి సంభు సురన్హ సముఝావా । పుని ఆగేఁ బర బసహ చలావా ॥
దేవన్హ దేఖే దసరథు జాతా । మహామోద మన పులకిత గాతా ॥ 2 ॥
సాధు సమాజ సంగ మహిదేవా । జను తను ధరేఁ కరహిఁ సుఖ సేవా ॥
సోహత సాథ సుభగ సుత చారీ । జను అపబరగ సకల తనుధారీ ॥ 3 ॥
మరకత కనక బరన బర జోరీ । దేఖి సురన్హ భై ప్రీతి న థోరీ ॥
పుని రామహి బిలోకి హియఁ హరషే । నృపహి సరాహి సుమన తిన్హ బరషే ॥ 4 ॥

వారినామోచ్చారణమాత్రమున అమంగళములన్నియును సమూలముగా రూపుమాయును. మఱియు చతుర్విధ పురుషార్థములు సిద్ధించును. వారే సీతారాములు." అని కామారి యగు పరమశివుడు అమరులకు తెలిపి, తనవాహనమైన నందీశ్వరుని ముందునకు నడిపెను. అమితానందముతో పులకిత గాత్రుడైన దశరథుడు జనకునిభవనమువైపునకు వెళ్లుటను దేవతలు చూచిరి. అతనితో గూడి సమస్త సుఖములు ఆకృతిదాల్చినట్లు సాధువులు, బ్రాహ్మణులు వెంటనడచుచుండిరి. తోడుగా నలుగురు కుమారులును మూర్తీభవించిన మోక్షము (సాలోక్యము, సామీప్యము, సారూప్యము, సాయుజ్యము) వలె శోభిల్లుచుండిరి. మరకతసువర్ణచ్ఛాయలుగల రెండుజంటలనుజూచి, దేవతలు మహదానందమును పొందిరి. శ్రీరాముని గాంచి మిక్కిలి ఆనందించిరి. దశరథ మహారాజును పొగడుచు పూవులను వర్షించిరి. (చౌ॥ 1-4)

దో- రామ రూపు నఖ సిఖ సుభగ, బారహిఁ బార నిహారి ।
పులక గాత లోచన సజల, ఉమా సమేత పురారి ॥ 315 ॥

నఖశిఖపర్యంతము శ్రీరాముని అపూర్వరూపసౌందర్యమునుగాంచి ఉమామహేశ్వరులు హర్షవిహ్వలులైరి. వారికన్నులలో ఆనందాశ్రువులు నిండెను. (దో॥ 315)

చౌ- కేకి కంఠ దుతి స్యామల అంగా । తడిత బినిందక బసన సురంగా ॥
బ్యాహ బిభూషన బిబిధ బనాఏ । మంగల సబ సబ భాఀతి సుహాఏ ॥ 1 ॥
సరద బిమల బిధు బదను సుహావన । నయన నవల రాజీవ లజావన ॥
సకల అలౌకిక సుందరతాఈ । కహి న జాఇ మనహీఀ మన భాఈ ॥ 2 ॥
బంధు మనోహర సోహహిఀ సంగా । జాత నచావత చపల తురంగా ॥
రాజకుఅఀర బర బాజి దెఖావహిఀ । బంస ప్రసంసక బిరిద సునావహిఀ ॥ 3 ॥
జెహి తురంగ పర రాము బిరాజే । గతి బిలోకి ఖగనాయకు లాజే ॥
కహి న జాఇ సబ భాఀతి సుహావా । బాజి బేషు జను కామ బనావా ॥ 4 ॥

శ్రీరామునితనుచ్ఛాయలునెమలికంఠశోభలతో ప్రకాశించుచుండెను. విద్యుల్లతలనుమించి శోభాయమానములగు వస్త్రములును, వివిధములగు ఆభరణములును ఆయన అవయవములపై మిక్కిలి శోభించుచుండెను. శరత్పూర్ణిమ నాటి నిర్మల చంద్రుని అధఃకరించు ముఖశోభలు, అప్పుడే వికసించిన కెందామరలను త్రోసిరాజను కనులకాంతులుగల ఆయనఅలౌకిక సౌందర్యము మిక్కిలి మనోజ్ఞము, వర్ణనాతీతము. శ్రీరామునితోబాటు మనోహరులైన ఆయనతమ్ములు గుఱ్ఱములతో విన్యాసములుచేయించుచు నడిపించుచుండిరి. వందిమాగధులు స్తోత్రపాఠములు పాడుచుండిరి. శ్రీరాముడు అధిరోహించిన గుఱ్ఱమునుజూచి గురుత్మంతుడే సిగ్గుపడుచుండెను. మన్మథుడే ఆ అశ్వాకృతి దాల్చినాడా అనునట్లు దాని అందచందములు అద్భుతావహముగా ఉండెను. (చౌ॥ 1-4)

ఛం-జను బాజి బేషు బనాఇ మనసిజు రామ హిత అతి సోహఈ ।
అపనేఀ బయ బల రూప గున గతి సకల భువన బిమోహఈ ॥
జగమగత జీను జరావ జోతి సుమోతి మని మానిక లగే ।
కింకిని లలామ లగాము లలిత బిలోకి సుర నర ముని ఠగే ॥

మన్మథుడు శ్రీరాముని గుఱ్ఱముగా మారి, మిక్కిలిశోభిల్లుచుండెను. దానియౌవనము, బలము, రూపము, గమనము, గుణములకు సమస్తలోకములును మోహవశమైనవి. అందమైన ముత్యములు, మణులు, మాణిక్యములు పొదిగిన దానిజీను కన్నులకు మిరుమిట్లు గొల్పుచుండెను. దానికళ్లెమునకు కట్టినగంటలరవములు దేవతలను, మానవులను, మునులనుగూడ మోహింపజేయునవిగా ఉండెను. (ఛం॥)

దో-ప్రభు మనసహిఀ లయలీన మను, చలత బాజి ఛబి పావ ।
భూషిత ఉడగన తడిత ఘను, జను బర బరహి నచావ ॥ 316 ॥

నక్షత్రములతోడను, విద్యుల్లతలతోడను భాసించు మేఘములను జూచి, నెమళ్ళు నాట్యము చేసినట్లు శ్రీరాముని ఇచ్ఛానుసారము ఆ హయము మనోజ్ఞపదవిన్యాసములతో నడచుచుండెను. (దో॥ 316)

చౌ- జేహిఁ బర బాజి రాము అసవారా । తెహి సారదఉ న బరనై పారా ॥
సంకరు రామ రూప అనురాగే । నయన పంచదస అతి ప్రియ లాగే ॥ 1 ॥
హరి హిత సహిత రాము జబ జోహే । రమా సమేత రమాపతి మోహే ॥
నిరఖి రామ ఛబి బిధి హరషానే । ఆఠఇ నయన జాని పఛితానే ॥ 2 ॥
సుర సేనప ఉర బహుత ఉఛాహూ । బిధి తే డేవఢ లోచన లాహూ ॥
రామహి చితవ సురేస సుజానా । గౌతమ శ్రాపు పరమ హిత మానా ॥ 3 ॥
దేవ సకల సురపతిహి సిహాహీఁ । ఆజు పురందర సమ కోఉ నాహీఁ ॥
ముదిత దేవగన రామహి దేఖీ । నృపసమాజ దుహుఁ హరషు బిసేషీ ॥ 4 ॥

శ్రీరాముడధిరోహించినగుఱ్ఱము యొక్క అతిలోకవైభవములను వాగ్దేవియు వర్ణింపజాలదు. శ్రీరాముని అందచందములను గాంచిన పదునైదు కన్నులుగల పంచముఖ పరమేశ్వరుడు తనధన్యతను తానే అభినందించుకొనెను. శ్రీమహావిష్ణువు, లక్ష్మీదేవికూడ శ్రీరాముని సౌందర్యమునకు ముగ్ధులైరి. చతుర్ముఖుడైనబ్రహ్మ శ్రీరామునిలావణ్యలాలిత్యములకు మిక్కిలి హర్షితుడాయెను. కాని తనకు ఎనిమిది కన్నులు మాత్రమే యున్నందున తనివిదీరగాంచలేక విచారపడెను. దేవసేనాపతియైన షణ్ముఖుడు తాను భాగ్యశాలినని యనుకొనెను. ఏలనన బ్రహ్మదేవునికంటె ఒకటిన్నర రెట్లు (పన్నెండు) కన్నులు కలిగియున్నందున తాను శ్రీరాముని వైభవమును తృప్తికరముగా దర్శింపగల్గెను. ఇంద్రుడు తనవేయికన్నులతో శ్రీరామచంద్రుని తనివిదీరజూచి, గౌతమమునిశాపము తనపాలిటివరమైనట్లు మిక్కిలి సంబరపడెను. దేవతలందఱును ఆపురందరునిజూచి అసూయపడసాగిరి, ఆతనియంతటి ధన్యుడెవ్వడునులేడనియనుకొనసాగిరి. శ్రీరాముని జూచి దేవతలెల్లరును ప్రసన్నచిత్తులైరి. జనకదశరథ మహారాజుల పరివారముల హృదయములలో ఆనందము వెల్లివిరిసెను. (చౌ॥ 1-4)

ఛం-అతి హరషు రాజసమాజ దుహు దిసి దుందుభీఁ బాజహిఁ ఘనీ ।
బరషహిఁ సుమన సుర హరషి కహి జయ జయతి జయ రఘుకులమనీ ॥
ఏహి భాఁతి జాని బరాత ఆవత బాజనే బహు బాజహీఁ ॥
రానీ సుఆసిని బోలి పరిఛని హేతు మంగల సాజహీఁ ।

ఇరుపక్షములవారు ఆనందోత్సాహములతో నిండియుండిరి. నగారాలు మ్రోగుచుండెను. 'రఘుకులమణికి జయము జయము' అనుచు దేవతలు కుసుమ వర్షమును గురిపించిరి. ఈ విధముగా పెండ్లి కుమారుని ఊరేగింపు సమీపింపగా అనేకవాద్యములు మనోజ్ఞములై మ్రోగెను. సీతాదేవి యొక్క మాతృమూర్తి సునయనాదేవి ముత్తైదువలతోగూడి వరపూజకై మంగళద్రవ్యములను సిద్ధము చేయించెను. (ఛం॥)

దో-సజి ఆరతీ అనేక బిధి, మంగల సకల సఁవారి ।
చలీఁ ముదిత పరిఛని కరన, గజగామిని బర నారి ॥ 317 ॥

అందములొలుకు గజగామినులు అనేకవిధములైన హారతిపళ్లెములను, మంగళద్రవ్యములను తీసికొని వరపూజకై(ద్వార మర్యాదలకై) వెళ్లిరి. (దో॥ 317)

చౌ- బిధుబదనీఁ సబ సబ మృగలోచని । సబ నిజ తన ఛబి రతి మదు మోచని ॥
పహిరేఁ బరన బరన బర చీరా । సకల బిభూషన సజేఁ సరీరా ॥ 1 ॥
సకల సుమంగల అంగ బనాఏఁ । కరహిఁ గాన కలకంఠి లజాఏఁ ॥
కంకన కింకిని నూపుర బాజహిఁ । చాలి బిలోకి కామ గజ లాజహిఁ ॥ 2 ॥
బాజహిఁ బాజనె బిబిధ ప్రకారా । నభ అరు నగర సుమంగలచారా ॥
సచీ సారదా రమా భవానీ । జే సురతియ సుచి సహజ సయానీ ॥ 3 ॥
కపట నారి బర బేష బనాఈ । మిలీఁ సకల రనివాసహిఁ జాఈ ॥
కరహిఁ గాన కల మంగల బానీఁ । హరష బిబస సబ కాహుఁ న జానీఁ ॥ 4 ॥

ఆ స్త్రీలందఱును చంద్రముఖులు, మృగనయనలు. వారితనుశోభలు రతీదేవి సౌందర్యవైభవమును తిరస్కరించుచుండెను. వారు చిత్రవిచిత్రవర్ణములుగల వస్త్రాభరణములను ధరించి యుండిరి. పరిమళ ద్రవ్యములను అలందుకొనిరి. కోకిలల కంఠస్వరములతో గీతములను గానముచేయుచుండిరి. గాజుల గలగలలతోడను, ఒడ్డాణమువకును, నూపురములకుగల చిఱుగజ్జెలసవ్వడులతోడను వారు నడచుచుండగా మన్మథునిఏనుగుగూడ సిగ్గుతో తలవంచుకొనుచుండెను. వివిధసంగీతవాద్యములగోష్ఠి కొనసాగుచుండెను. నభమునందును, నగరమునందును ఆశీర్వచనగీతములు ఆలపింపబడెను. శచీ దేవియు, లక్ష్మీ సరస్వతీ పార్వతులును, ఇతర దివ్యాంగనలును మాఱువేషములతో రాణివాసములలో జేరి, మధురస్వరములతో మంగళగీతములను పాడుచుండిరి. అక్కడనున్నవారు ప్రేమలోనిమగ్నులై యున్నందున ఆ క్రొత్తగా వచ్చినవారిని ఎవ్వరూ గుర్తింపనేలేదు. (చౌ॥ 1-4)

ఛం-కో జాన కేహి ఆనంద బస సబ బ్రహ్మ బర పరిఛన చలీ ।
కల గాన మధుర నిసాన బరషహిఁ సుమన సుర సోభా భలీ ॥
ఆనందకందు బిలోకి దూలహు సకల హియఁ హరషిత భఈ ।
అంభోజ అంబక అంబు ఉమగి సుఅంగ పులకావలి ఛఈ ॥

ఎవరుఎవరిని గుర్తింపగలరు? అందఱును ఆనందపరవశులే. నిర్గుణబ్రహ్మ అవతారమైన శ్రీరామచంద్రుడే సాక్షాత్తుగా పెండ్లికుమారుడు. ఆయన 'పరపూజ'కు అందఱును తరలివచ్చిరి. మనోహర - గీతములతో, మధురదుందుభినాదములతో, దేవతాపుష్పవృష్టులతో అంతయు కోలాహలముగా ఉండెను. ఆనంద కందుడైన[1] పెండ్లి కుమారుని గాంచి, స్త్రీలెల్లరు హర్షోల్లసితలైరి. వారినేత్రకమలములు చెమర్చినవి. వారి సుందర తనువులు పులకించినవి. (ఛం॥)

1) కం=జలమును, ద=దదాతి=ఇచ్చునది, ఇతికందః=నీటిని ఇచ్చునది, మేఘము. అట్లే రాముడు ఆనందకందుడు. మేఘము నీటినివలె శ్రీరాముడు లోకములకు అయాచితముగ, సమృద్ధిగ ఆనందమును పంచియిచ్చువాడు. ఈ రామచరిత మానసము నందు కృపాకంద, సుఖ కంద, కరుణాకంద, మొదలగు రీతులలో శ్రీ తులసీదాస మహాకవి కంద శబ్దమును సందర్భ శుద్ధితో చక్కగా ప్రయోగించెను.

దో-జో సుఖు భా సియ మాతు మన, దేఖి రామ బర బేషు।
సో న సకహిం కహి కలప సత, సహస సారదా సేషు ॥ 318 ॥

సీతాదేవిజననియైన సునయనాదేవి వరునిరూపములోనున్న శ్రీరామునిగాంచినప్పుడు పొందినఆనందమును వేలకొలది సరస్వతులు, ఆదిశేషులు నూఱు కల్పములలోగూడ వర్ణింప జాలరు. (దో॥ 318)

చౌ-నయన నీరు హాటి మంగల జానీ। పరిఛని కరహిం ముదిత మన రానీ ॥
బేద బిహిత అరు కుల ఆచారూ। కీన్హ భలీ బిధి సబ బ్యవహారూ ॥ 1 ॥
పంచ సబద ధుని మంగల గానా। పట పాంవడే పరహిం బిధి నానా ॥
కరి ఆరతీ అరఘు తిన్హ దీన్హా। రామ గమను మండప తబ కీన్హా ॥ 2 ॥
దసరథు సహిత సమాజ బిరాజే। బిభవ బిలోకి లోకపతి లాజే ॥
సమయం సమయం సుర బరషహిం ఫూలా। సాంతి పఢహిం మహిసుర అనుకూలా ॥ 3 ॥
నభ అరు నగర కొలాహల హోఈ। ఆపని పర కఛు సునఇ న కోఈ ॥
ఏహి బిధి రాము మండపహిం ఆఏ। అరఘు దేఇ ఆసన బైఠాఏ ॥ 4 ॥

మంగళకరసమయముగావున కనులనుండి వచ్చు ఆనందాశ్రువులను ఆపుకొని, రాణి ప్రసన్న చిత్తముతో ద్వార సమీపమున 'వరపూజ' చేసెను. రాణి వేదోక్తముగా వంశాచారవ్యవహారములను చక్కగా పాటించి, నడిపెను. ఐదు రకములైన సంగీత వాద్యములు, (తంత్రీ, తాళ, నగారా, ఝుంఝు, తురహి) ఐదు విధములైన ధ్వనులు (వేద, వంది, జయ, శంఖ, గీత ధ్వనులు) వినిపింపబడెను. నడచుదారిలో వివిధవర్ణములుగల వస్త్రములు పఱచబడెను. రాణి శ్రీరామునకు మంగళహారతిని ఇచ్చి, అర్ఘ్యమును సమర్పించెను. శ్రీరామచంద్రుడు మండపములో ప్రవేశించెను. దశరథుడు తనపరివారములతో సభలోఆసీనుడయ్యెను. అతని ఐశ్వర్యమును జూచి, దిక్పాలురును అసూయపడిరి. అప్పుడప్పుడు దేవతలు పుష్పవర్షములను కురిపించుచునేయుండిరి. బ్రాహ్మణోత్తములు సందర్భాను సారము శాంతిపాఠములను కావించుచునే యుండిరి. ఆకాశమునందును, నగరమునందును, జరుగుచున్న కోలాహలముల మధ్య ఒకరి మాటలు మఱియొకరికి విన్పింపకుండెను. మండపమున ప్రవేశించిన శ్రీరామునకు అర్ఘ్యమునిచ్చి, సముచితాసనముపై సుఖాసీనుని జేసిరి. (చౌ॥ 1-4)

ఛం-బైఠారి ఆసన ఆరతీ కరి నిరఖి బరు సుఖు పావహీం।
మని బసన భూషన భూరి వారహిం నారి మంగల గావహీం ॥
బ్రహ్మాది సురబర బిప్ర బేష బనాఇ కౌతుక దేఖహీం।
అవలోకి రఘుకుల కమల రబి ఛబి సుఫల జీవన లేఖహీం ॥

పెండ్లి కుమారుని సుఖాసీనుని గావించి, హారతులనిచ్చి, స్త్రీలు సంతోషతరంగితలైరి. మణులు, వస్త్రములు, ఆభరణములు పుష్కలముగా సమర్పించి, మంగళ గీతములను పాడిరి. బ్రహ్మాది దేవతలు బ్రాహ్మణ వేషములలో వచ్చి, ఈ మహోత్సవములను కనులారగాంచిరి. రఘుకులకమలమునకు సూర్యుడైన శ్రీరాముని యొక్క సౌందర్యమును జూచి, వారు తమ జన్మలు సార్థకమైనవని భావించిరి. (ఛం॥)

దో- నాఉ బారీ భాట నట, రామ నిఛావరి పాఇ।
ముదిత అసీసహిఁ నాఇ సిర, హరషు న హృదయఁ సమాఇ॥ 319 ॥

మంగళవాద్యములవారు, దివిటీలవారు, భట్రాజులు, నటులు శ్రీరామునిపక్షమువారినుండి అమూల్యములైన కానుకలను పొందిరి. వారి హృదయములలో హర్షోల్లాసములు పొంగిపొరలెను. పిదప వారు ఆనందముతో ఆశీర్వదించిరి. (దో॥ 319)

చౌ- మిలే జనకు దసరథు అతి ప్రీతీఁ। కరి బైదిక లౌకిక సబ రీతీఁ॥
మిలత మహా దోఉ రాజ బిరాజే। ఉపమా ఖోజి ఖోజి కబి లాజే॥ 1 ॥
లహీ న కతహుఁ హారి హియఁ మానీ। ఇన్హ సమ ఏఇ ఉపమా ఉర ఆనీ॥
సామధ దేఖి దేవ అనురాగే। సుమన బరషి జసు గావన లాగే॥ 2 ॥
జగు బిరంచి ఉపజావా జబ తేఁ। దేఖే సునే బ్యాహ బహు తబ తేఁ॥
సకల భాఁతి సమ సాజు సమాజూ। సమ సమధీ దేఖే హమ ఆజూ॥ 3 ॥
దేవ గిరా సుని సుందర సాఁచీ। ప్రీతి అలౌకిక దుహు దిసి మాచీ॥
దేత పాఁవడే అరఘు సుహాఏ। సాదర జనకు మండపహిఁ ల్యాఏ॥ 4 ॥

వైదిక, లౌకికవిధులన్నియు ముగిసినపిమ్మట జనకుడు దశరథుడు ప్రేమానురాగములతో పరస్పరము ఆలింగనముచేసికొనిరి. వారి ఆలింగనానందానుభవములను వర్ణించుటకు కవులు ఉపమానములను వెదకసాగిరి. ఎట్టి ఉపమానములును లభ్యములు కానందున వారికివారేసాటియని వర్ణించిరి. ఈ వియ్యంకుల సమాగమమును జూచి, దేవతలు ఆనందముతో పుష్పములను వర్షించి, వారి కీర్తిని కొనియాడిరి. వారు ఇంకను ఇట్లు పలికిరి- "బ్రహ్మ సృష్టి ప్రారంభమైనప్పటినుండి ఇంతవఱకును పెక్కువివాహములను చూచితిమి, వింటిమి. కాని అన్నివిధములుగా వైభవోపేతమైన వివాహమును, అనుకూలురైనవియ్యంకులను నేడే చూచుచున్నాము." దేవతలమధురములైన సత్యవచనములను విని, ఇరుపక్షముల వారును, అలౌకికసుఖానందములను పొందిరి. మనోహరములైన అమూల్యవస్త్రములపై నడిపించుచు అర్ఘ్యములనొసగి జనకమహారాజు దశరథుని సకలరాజమర్యాదలతో మండపమునకు పిలుచుకొని వచ్చెను. (చౌ॥ 1-4)

ఛం- మండపు బిలోకి బిచిత్ర రచనాఁ రుచిరతాఁ ముని మన హరే।
నిజ పాని జనక సుజాన సబ కహుఁ ఆని సింఘాసన ధరే॥
కుల ఇష్ట సరిస బసిష్ట పూజే బినయ కరి ఆసిష లహీ।
కౌసికహి పూజత పరమ ప్రీతి కి రీతి తౌ న పరై కహీ॥

ఆ మండపరచనాసౌందర్యములు మునులమనస్సులనుగూడ దోచెను. సజ్జన శిరోమణియైన జనకుడు స్వయముగా అందఱికిని ఆసనములను అమర్చెను. ఆయన తనకులదైవముతో సమానముగువసిష్ఠుని పూజించెను. ఆయనకు నమస్కరించి, అతడు ఆశీస్సులను అందుకొనెను. విశ్వామిత్రుని పూజించువేళ అతడు ప్రకటించిన భక్తివిశ్వాసములు అపూర్వములు. (ఛం॥)

దో-బామదేవ ఆదిక రిషయ, పూజే ముదిత మహీస ।
దిఏ దిబ్య ఆసన సబహి, సబ సన లహీ అసీస ॥ 320 ॥

వామదేవుడు మొదలగు ఋషులను సగౌరవముగా ఆసీనులనుగావించి, జనకుడు వారిని భక్తి శ్రద్ధలతో పూజించి, వారి ఆశీస్సులను పొందెను. (దో॥ 320)

చౌ-బహురి కీన్హి కోసలపతి పూజా । జాని ఈస సమ భాఉ న దూజా ॥
కీన్హి జోరి కర బినయ బడాఈ । కహి నిజ భాగ్య బిభవ బహుతాఈ ॥ 1 ॥
పూజే భూపతి సకల బరాతీ । సమధీ సమ సాదర సబ భాఁతీ ॥
ఆసన ఉచిత దిఏ సబ కాహూ । కహౌఁ కాహ ముఖ ఏక ఉఛాహూ ॥ 2 ॥
సకల బరాత జనక సనమానీ । దాన మాన బినతీ బర బానీ ॥
బిధి హరి హరు దిసిపతి దినరాఊ । జే జానహిఁ రఘుబీర ప్రభాఊ ॥ 3 ॥
కపట బిప్ర బర బేష బనాఏఁ । కౌతుక దేఖహిఁ అతి సచు పాఏఁ ॥
పూజే జనక దేవ సమ జానేఁ । దిఏ సుఆసన బిను పహిచానేఁ ॥ 4 ॥

పిమ్మట జనకుడు దశరథుని పరమశివునిగా భావించి పూజించెను. చేతులు జోడించి, వినయముతో ప్రార్థన చేసి, తన యదృష్టమునకు మురిసిపోయెను. అతడు మగపెండ్లివారిని అందఱిని దశరథునితో సమానముగా గౌరవించి, వారిని ఉచితాసనములపై కూర్చుండజేసెను. ఆయన ఉత్సాహమునుగూర్చి తులసీదాసు తన ఒక్కనోటితో ఎట్లు వర్ణింపగలడు. జనకుడు వారినందఱిని దానములతో బహుమానములతో వినయముతో సద్వచనములతో గౌరవించెను. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు, దిక్పాలురు, సూర్యుడు రఘునాథుని ప్రభావమును ఎఱుంగుదురు. వారు బ్రాహ్మణవేషములలోవచ్చి, కూర్చొని అత్యుత్సాహముతో ఆ వివాహమహోత్సవమును తిలకించిరి. జనకుడువారిని గుర్తింపకున్నను వారిని దేవతలుగా భావించి, ఉన్నతాసనములపై కూర్చుండ బెట్టెను. (చౌ॥ 1-4)

ఛం-పహిచాన కో కేహి జాన సబహి అపాన సుధి భోరీ భఈ ॥
ఆనందకందు బిలోకి దూలహు ఉభయ దిసి ఆనందమఈ ॥
సుర లఖే రామ సుజాన పూజే మానసిక ఆసన దఏ ॥
అవలోకి సీలు సుభాఉ ప్రభు కో బిబుధ మన ప్రముదిత భఏ ॥

ప్రతి వ్యక్తియు తనసుతానే మఱచిపోయిన ఆ శుభవేళ ఎవరు ఎవరిని గుర్తించెదరు. ఆనంద కందుడైన వరుని జూచి, అందఱును ఆనంద పరవశులైరి. విజ్ఞుడైన శ్రీరామచంద్రుడు దేవతలను గుర్తించి మానసపూజలను అందించి, తనహృదయమునందే వారికి పీఠముల నిచ్చెను. ప్రభువు సౌశీల్యమునకు వారు మిక్కిలి ప్రసన్నులైరి. (ఛం॥)

దో-రామచంద్ర ముఖ చంద్ర ఛబి, లోచన చారు చకోర ।
కరత పాన సాదర సకల, ప్రేము ప్రమోదు న థోర ॥ 321 ॥

అందఱి సుందరనేత్రచకోరములు అపూర్వమైన వర్ణనాతీతమైన శ్రీరామముఖచంద్ర శోభాచంద్రికలను త్రాగు చుండెను. వారి ప్రేమానురాగములు నిరుపమానములు. (దో॥ 321)

చౌ-సముఉ బిలోకి బసిష్ఠ బోలాఏ। సాదర సతానందు ముని ఆఏ॥
బేగి కుఅఁరి అబ ఆనహు జాఈ। చలే ముదిత ముని ఆయసు పాఈ॥ 1॥
రానీ సుని ఉపరోహిత బానీ। ప్రముదిత సఖిన్హ సమేత సయానీ॥
బిప్ర బధూ కులబృద్ధ బోలాఈం। కరి కుల రీతి సుమంగల గాఈం॥ 2॥
నారి బేష జే సుర బర బామా। సకల సుభాయఁ సుందరీ స్యామా॥
తిన్హహి దేఖి సుఖు పావహిం నారీం। బిను పహిచాని ప్రానహు తే ప్యారీం॥ 3॥
బార బార సనమానహిం రానీ। ఉమా రమా సారద సమ జానీ॥
సీయ సఁవారి సమాజు బనాఈ। ముదిత మండపహిం చలీం లవాఈ॥ 4॥

వివాహశుభసమయము సమీపించినది. వసిష్ఠుడు శతానందుని బిలిచి "వెళ్లి పెండ్లికుమార్తెను తీసికొనిరండు" అని పల్కెను. ఋషిఆజ్ఞానుసారము అతడు వెళ్లెను. పురోహితునిసందేశమును విని, రాణి, ఆమెసఖులు ప్రసన్నచిత్తలైరి. బ్రాహ్మణోత్తమస్త్రీలను తమకులమువారైన పెద్దముత్తైదువలను కోరగా వారు మంగళగీతములను ఆలపించుచు వంశసంప్రదాయములను నడిపిరి. దేవభామినులు షోడశవర్షప్రాయమానవయువతులుగా అచటికి విచ్చేసిరి. రాణివాసస్త్రీలు వారిని గుర్తింపకున్నను గౌరవించిరి. వారిని ఉమా రమా శారదలతో సమానముగా భావించి, రాణి వారికి పదేపదే గౌరవ మర్యాదలను నెరపెను. రాణివాసస్త్రీలు సీతాదేవిని చక్కగా అలంకరించి, ఆమెచుట్టును వలయాకారమున నిలిచి, ఆనందముతో మండపమునకు తీసికొని వచ్చిరి. (చౌ॥ 1-4)

ఛం-చలి ల్యాఇ సీతహి సఖీం సాదర సజి సుమంగల భామినీం।
నవసప్త సాజేం సుందరీం సబ మత్త కుంజర గామినీం॥
కల గాన సుని ముని ధ్యాన త్యాగహిం కామ కోకిల లాజహీం।
మంజీర నూపుర కలిత కంకన తాల గతి బర బాజహీం॥

మంగళకరమైనద్రవ్యములను తీసికొని, అంతఃపురస్త్రీలు, సఖులు ఆమెను మండపమునకు తోడ్కొనివచ్చిరి. వారందఱును పదునారువిధములుగా అలంకరించుకొని మదగజగమనములతో నచ్చిరి. వారిమధుర గానములలోబడి, ఋషులు తమ ధ్యానములనే విస్మరించిరి, మధురనికోయిలలు సిగ్గుపడెను. వారి కటిభూషణములు, నూపురములు, కరకంకణములు వారి పాటలతాళములకు వంత పలుకు చుండెను. (ఛం॥)

దో-సోహతి బనితా బృంద మహుఁ, సహజ సుహావని సీయ।
ఛబి లలనా గన మధ్య జను, సుషమా తియ కమనీయ॥ 322॥

సుందరీమణులమధ్య సీతాదేవి మూర్తీభవించిన సౌందర్యరాశిగా శోభిల్లు చుండెను. (దో॥ 322)

చౌ-సియ సుందరతా బరని న జాఈ। లఘు మతి బహుత మనోహరతాఈ॥
ఆవత దీఖి బరాతిన్హ సీతా। రూప రాసి సబ భాఁతి పునీతా॥ 1॥

సబహి మనహిఁ మన కిఏ ప్రనామా । దేఖి రాము భవె పూరనకామా ॥
హరషే దసరథ సుతన్హ సమేతా । కహి న జాఇ ఉర ఆనందు జేతా ॥ 2 ॥
సుర ప్రనాము కరి బరిసహిఁ ఫూలా । ముని అసీస ధుని మంగల మూలా ॥
గాన నిసాన కోలాహలు భారీ । ప్రేమ ప్రమోద మగన నర నారీ ॥ 3 ॥
ఏహి బిధి సీయ మండపహిఁ ఆఈ । ప్రముదిత సాంతి పఢహిఁ మునిరాఈ ॥
తెహి అవసర కర బిధి బ్యవహారూ । దుహుఁ కులగురు సబ కీన్హ అచారూ ॥ 4 ॥

సీతాదేవిసౌందర్యవైభవములను వర్ణించుటకు నాబుద్ధిబలము చాలదు. ఆమె నడచి వచ్చుచుండగా చూచిన మగపెండ్లివారు ఒకతేజఃపుంజము కదలివచ్చుచున్నట్లు భావించిరి. వారందఱును మనస్సులలోనే ఆమెకు ప్రణతులు చెల్లించిరి. రాముని జూచి, అందఱును పూర్ణకాములైరి. (కృతార్థులైరి) దశరథుడు పుత్రులతోపాటు అపరిమితానందమును అనుభవించెను. దేవతలు నమస్సుమాంజలులర్పించిరి. మునులు శుభాశీస్సులనందించిరి. వనితామణులగీతములు, నగారాల మ్రోతలు గొప్ప కోలాహలమును సృష్టించెను. అందఱును పరమానందభరితులైరి. ఈ విధముగా సీతాదేవి మండపమున ప్రవేశించెను. మునీశ్వరులు ప్రమోదముతో శాంతిమంత్రములను పఠించిరి. కుల గురువులైన వసిష్ఠ శతానందులు ఉభయవంశాచారములను అనుసరించి, కార్యక్రమములను నడిపిరి. (చౌ॥ 1-4)

ఛం-ఆచారు కరి గుర గౌరి గనపతి ముదిత బిప్ర పుజావహీఁ ।
సుర ప్రగటి పూజా లేహిఁ దేహిఁ అసీస అతి సుఖు పావహీఁ ॥
మధుపర్క మంగల ద్రబ్య జో జెహి సమయ ముని మన మహుఁ చహైఁ ।
భరె కనక కోపర కలస సో తబ లిఏహిఁ పరిచారక రహైఁ ॥ 1 ॥
కుల రీతి ప్రీతి సమేత రబి కహి దేత సబు సాదర కియో ।
ఏహి భాఁతి దేవ పుజాఇ సీతహి సుభగ సింఘాసను దియో ॥
సియ రామ అవలోకని పరసపర ప్రేము కాహు న లఖి పరై ।
మన బుద్ధి బర బానీ అగోచర ప్రగట కబి కైసే కరై ॥ 2 ॥

వంశ సంప్రదాయములను పాటించి, గురువులు బ్రాహ్మణులద్వారా గౌరీగణేశులపూజలు చేయించిరి. దేవతలు వారిపూజలను స్వయముగా స్వీకరించి, ఆనందించిరి, ఆశీర్వదించిరి. మధుపర్కములను, వంటకములను, మధుర పానీయములను అవసరసమయములలో అందించుటకు సేవకులు పళ్లెములతోడను, పాత్రలతోడను సంసిద్ధముగానుండిరి. సూర్యుడు స్వయముగా తన వంశాచారములను గుర్తు చేయుచుండెను. వారు వాటిని సాదరముగా పాటించుచుండిరి. ఈ విధముగా బ్రాహ్మణులు శ్రీరామునిచే దేవతలపూజలను చేయించిరి. పిమ్మట మునులు సీతాదేవిని సుందర సింహాసనమున కూర్చుండబెట్టిరి. శ్రీసీతారాములు పరస్పరము చూచుకొనినప్పటి వారిసనాతన ప్రేమభావములు ఎవరిబుద్ధికిని అందకుండెను. శ్రేష్ఠమైన మనస్సు, బుద్ధి, వాక్కులకుగూడ అవి అతీతములైనవి. ఇంక కవి యెట్లు వర్ణింపగలడు. (శ్రీసీతారాముల పరస్పర ప్రేమ చేతనము. బుద్ధి జడము. చేతన తత్త్వమును చేతనమే గ్రహింపగలదు. దానిని జడమైన బుద్ధియెట్లు గ్రహింపగలదు? "యతోవాచో నివర్తన్తే అప్రాప్యమనసాసహ" అని గదా! శ్రుతి ప్రమాణము.) (ఛం॥ 1-2)

దో- హోమ సమయ తను ధరి అనలు, అతి సుఖ ఆహుతి లేహిఁ ।
బిప్ర బేష ధరి బేద సబ, కహి బిబాహ బిధి దేహిఁ ॥ 323 ॥

హోమసమయమున అగ్నిదేవుడు స్వయముగావచ్చి ఆహుతులను ప్రత్యక్షముగా స్వీకరించుచుండెను. వేదములు బ్రాహ్మణవేషములను దాల్చివచ్చి, వివాహవిధులను తెలుపుచుండెను. (దో॥ 323)

చౌ- జనక పాటమహిషీ జగ జానీ। సీయ మాతు కిమి జాఇ బఖానీ ॥
సుజసు సుకృత సుఖ సుందరతాఈ। సబ సమేటి బిధి రచీ బనాఈ ॥ 1 ॥
సమఉ జాని మునిబరన్హ బొలాఈఁ। సునత సుఆసిని సాదర ల్యాఈఁ ॥
జనక బామ దిసి సోహ సునయనా। హిమగిరి సంగ బనీ జను మయనా ॥ 2 ॥
కనక కలస మని కోపర రూరే। సుచి సుగంధ మంగల జల పూరే ॥
నిజ కర ముదిత రాయఁ అరు రానీ। ధరే రామ కే ఆగేఁ ఆనీ ॥ 3 ॥
పఢహిఁ బేద ముని మంగల బానీ। గగన సుమన ఝరి అవసరు జానీ ॥
బరు బిలోకి దంపతి అనురాగే। పాయ పునీత పఖారన లాగే ॥ 4 ॥

జనకునిపట్టమహిషియు, సీతాదేవిజననియునైన సునయనాదేవివైభవమును ఎవరు వర్ణింపగలరు? కీర్తిని, సుకృతమును, సుఖసౌందర్యములను కలబోసి, బ్రహ్మ ఆమెను సృష్టించెను. సుముహూర్తమును తెలిసికొని, మునులు ఆమెను పిలిచిరి. సువాసినులు ఆమెను వెంటబెట్టుకొని వచ్చిరి. హిమవంతుని ప్రక్కన మేనాదేవి యున్నట్లు జనకునివామభాగమున సునయనాదేవి శోభిల్లుచుండెను. రాజు, రాణి స్వహస్తములతో పవిత్రసుగంధిల మంగళజలములతో నిండియున్న సువర్ణకలశములను, మణి ఖచితములైన పళ్లెరములను తెచ్చి, ప్రసన్నచిత్తములతో వాటిని శ్రీరాముని ముందుంచిరి. ఋషులు శ్రావ్యకంఠస్వరములతో వేదమంత్రములను పఠించుచుండగా, ఆకసమునుండి పుష్పవృష్టి గురియుచుండగా ఆ రాజదంపతులు అనురాగముతో వరుని జూచుచు ఆయన పావనచరణములను కడిగిరి.[1] (చౌ॥ 1-4)

ఛం-లాగే పఖారన పాయ పంకజ ప్రేమ తన పులకావలీ।
నభ నగర గాన నిసాన జయ ధుని ఉమగి జను చహుఁ దిసి చలీ ॥

1. బ్రహ్మకడిగిన పాదము, బ్రహ్మము తానైన పాదము ॥ బ్రహ్మ ॥
చెలగి వసుధగొలిచినదీపాదము, బలితలమోపిన పాదము
తలకక గగనము దన్నిన పాదము, బలరిపుగాచిన పాదము ॥ బ్రహ్మ ॥
కామిని పాపము కడిగిన పాదము, పాముతలనిడిన పాదము
ప్రేమతో శ్రీసతి పిసికెడి పాదము, పామిడి తురగపు పాదము ॥ బ్రహ్మ ॥
పరమ యోగులకు పరిపరివిధముల వరమొసగెడునీపాదము
తిరు వేంకటగిరి తిరమని చూపిన పరమపదమునీపాదము ॥ బ్రహ్మ ॥ (అన్నమాచార్య)

జే పద సరోజ మనోజ అరి ఉర సర సదైవ బిరాజహీం ।
జే సకృత సుమిరత బిమలతా మన సకల కలి మల భాజహీం ॥ 1 ॥
జే పరసి మునిబనితా లహీ గతి రహీ జో పాతకమఈం ।
మకరందు జిన్హ కో సంభు సిర సుచితా అవధి సుర బరనఈం ॥
కరి మధుప మన ముని జోగిజన జే సేఇ అభిమత గతి లహైం ।
తే పద పఖారత భాగ్యభాజను జనకు జయ జయ సబ కహైం ॥ 2 ॥
బర కుఅఁరి కరతల జోరి సాఖోచారు దోఉ కులగుర కరైం ।
భయొ పానిగహను బిలోకి బిధి సుర మనుజ ముని ఆనంద భరైం ॥
సుఖమూల దూలహు దేఖి దంపతి పులక తన హులస్యో హియో ।
కరి లోక బేద బిధాను కన్యాదాను నృపభూషన కియో ॥ 3 ॥
హిమవంత జిమి గిరిజా మహేసహి హరిహి శ్రీ సాగర దఈం ।
తిమి జనక రామహి సియ సమరపీ బిస్వ కల కీరతి నఈం ॥
క్యోం కరై బినయ బిదేహు కియో బిదేహు మూరతి సావఁరీ ॥
కరి హోము బిధిబత గాంఠి జోరీ హోన లాగీం భావఁరీ ॥ 4 ॥

శ్రీరామునిచరణములను కడుగుచుండగా వారు పులకిత గాత్రులైరి. ఆకాశమునను నగరమునను గీతములు, నగారాల మ్రోతలు, జయ జయ ధ్వానములు దశదిశల మాఱుమ్రోగెను. ఆ పాదపద్మములు అత్యంతపవిత్రములు. అవి కామారియైన పరమశివునిహృదయమున సర్వదా విరాజిల్లునవి, స్మరించినంత మాత్రముననే మనస్సులను నిర్మలమొనర్చునవి, కలియుగపాపతాపములను పాఱద్రోలునవి, గౌతమపత్నిఅహల్యకు తనధూళిస్పర్శచే శాపవిముక్తిని కల్గించి, మోక్షమును ప్రసాదించినవి, శివుని శిరమున విలసిల్లు పవిత్ర గంగకు జన్మ స్థానమైనవి, శ్రీరామచరణకమల మకరందరసమే గంగ. ఆ గంగ దేవతలచే పవిత్రతకు పరాకాష్ఠగా భావింప బడినది. మునుల, యోగుల మనస్సులనెడి తుమ్మెదలచే సర్వదా సేవింపబడుచు వారికి అభీష్టగతులను ప్రసాదించునట్టివి ఆ రామచరణములు. అట్టి శ్రీరామ పవిత్రచరణములను కడిగినజనకుడు నిజముగా మహాభాగ్యశాలి. అందఱును ఆ జనకునకు 'జేజేలు' పలికిరి. కుల గురువులు ఇద్దఱును వధూవరులచేతులను కలిపి, వారిప్రవరలను (గోత్రనామములను) ప్రవచించిరి. పాణిగ్రహణ మహోత్సవమును తిలకించి, బ్రహ్మాదిదేవతలు, విశ్వామిత్రాదిమహామునులు, పురజనులు పరమానందభరితులైరి. సకల సుఖనిధానమైన వరునిగవి రాజదంపతులతనువులు ఆనందపరవశములైనవి. ఈ విధముగా రాజశ్రేష్ఠుడైన జనకమహారాజు వేదోక్తముగా లోకాచార రీతిననుసరించి, కన్యాదానమును గావించెను. హిమవంతుడు పార్వతీదేవిని పరమశివునకు అర్పించినట్లును, సముద్రుడు లక్ష్మీదేవిని శ్రీమహావిష్ణువునకు సమర్పించినట్లును, జనకమహారాజు సీతాదేవిని శ్రీరామచంద్రునకు సమర్పించి, లోక విఖ్యాతుడయ్యెను. జనకుని ఈ మహోన్నతవినూతనకీర్తి ప్రపంచమునందంతటను వ్యాపించెను. శ్యామసుందరుడైన శ్రీరాముడు విదేహరాజును నిజముగా విదేహుని(తన్మయుని)గా జేసెను. అట్టి స్థితిలో జనకుడు శ్రీరామునకు విన్నపమును ఎట్లు చేసికొనగలడు?

ఆనూతనవధూవరులు విధ్యుక్తముగా హోమములను నిర్వహించిరి. వేదపండితులైన పురోహితులు (బ్రహ్మముడులు (వారి వస్త్రపుటంచులను ముడి) వేయగా వారు అగ్నికి ప్రదక్షిణములు గావించిరి. (ఛం॥ 1-4)

**దో-జయ ధుని బందీ బేద ధుని, మంగల గాన నిసాన।**
**ముని హరషహిఁ బరషహిఁ బిబుధ, సురతరు సుమన సుజాన ॥ 324 ॥**

జయ జయ ధ్వనులను, వందిమాగధులధ్వనులను, వేదఘోషలను, మంగళగీతములను, దుందుభినాదములను- ఈ పంచధ్వనులను విని, దేవతలు మిక్కిలి సంతసించి, కల్పవృక్ష ప్రసూనములను అనవరతము కురిపించిరి. (దో॥ 324)

**చౌ- కుఅఁరు కుఅఁరి కల భాఁవరి దేహీఁ। నయన లాభు సబ సాదర లేహీఁ ॥**
**జాఇ న బరని మనోహర జోరీ। జో ఉపమా కఛు కహౌఁ సో థోరీ ॥ 1 ॥**
**రామ సీయ సుందర ప్రతిఛాహీఁ। జగమగాత మని ఖంభన మాహీఁ ॥**
**మనహుఁ మదన రతి ధరి బహు రూపా। దేఖత రామ బిఆహు అనూపా ॥ 2 ॥**
**దరస లాలసా సకుచ న థోరీ। ప్రగటత దురత బహోరి బహోరీ ॥**
**భఏ మగన సబ దేఖనిహారే। జనక సమాన అపాన బిసారే ॥ 3 ॥**
**ప్రముదిత మునిన్హ భాఁవరీఁ ఫేరీఁ। నేగసహిత సబ రీతి నిబేరీఁ ॥**
**రామ సీయ సిర సేందుర దేహీఁ। సోభా కహి న జాతి బిధి కేహీఁ ॥ 4 ॥**
**అరున పరాగ జలజు భరి నీకేఁ। ససిహి భూష అహి లోభ అమీ కేఁ ॥**
**బహురి బసిష్ఠ దీన్హి అనుసాసన। బరు దులహిని బైఠే ఎక ఆసన ॥ 5 ॥**

చూచు వారికి కన్నుల పండువుగా సీతారాములు అగ్నికి ప్రదక్షిణములను ఆచరించుచుండిరి. ఆ మనోహరమైన జంటను వర్ణించుటకు ఏ ఉపమానములుగూడ చాలవు. నిరుపమానమైన, అపూర్వమైన ఈ వివాహమహోత్సవమును జూచుటకు రతీ మన్మథులు పెక్కు రూపములలో వచ్చియున్నారా యనునట్లుగా స్తంభములపై పొదగబడిన మణులలో ఆ సీతారాముల ప్రతిరూపములు ప్రకాశించెను. రతీమన్మథులు సీతారాముల అందచందములను గాంచుటకై గల తమ అభిలాషను ఒకసారి వెల్లడించుచు, మఱియొక సారి సిగ్గుచే సంకోచించుచున్నారా? అనునట్లు, ఆ మణిఖచిత స్తంభములలో అవి మాటిమాటికి ప్రకటితములగుచుండెను. మఱియు దాగుకొనుచుండెను. సదస్యులుగూడ జనకునివలెనే ఆనందములో తమనుతాము మఱచిపోయిరి. మునీశ్వరుల ఆదేశానుసారము సీతారాములు అగ్నికి ప్రదక్షిణములు గావించిరి. సకలకార్యములను నిర్వర్తించి, ఎల్లరకును బహుమతులను సమర్పించిరి. శ్రీరాముడు సీతాదేవిపుడుట కుంకుమను దిద్దిన దృశ్యము నయనానందకరము. ఆ- దర్శనానందము అనుభవైక వేద్యము, వర్ణనాతీతము. శ్రీరాముడు తన కరకమలమునందు సిందూరమనెడి పుప్పొడిని బాగుగా నింపుకొని, అమె అనురాగామృతమును పొందుటకై సీతాదేవి ముఖచంద్రుని అలంకరించెను. (భూష అహి అనగా భూషితుని చేయుచున్నది-) (కమలము జలమునందుండును. జలము లేనప్పుడు అది ముడుచుకొని పోవును. అమృతపానము చేసినచో అది ఎప్పుడును ముడుచుకొని పోదు- కావున అది

అమృతమును ఆసించుచున్నది- చంద్రుడు అమృత కిరణుడు గదా!) శ్రీసీతారాముల ప్రేమ సనాతనమైనది. కాని లౌకిక రీతిలో ఇప్పుడు వారు పరస్పరము మిత్రులు. వారి యీప్రేమను దృఢపఱచుటకై శ్రీరాముడు తనకరకమలమునందు సిందూరమును చేర్చుకొని సీతాదేవి ముఖచంద్రుని అలంకరించెను. వసిష్ఠుని ఆజ్ఞతో ఆ నవవధూవరులు ఒకే ఆసనమునలంకరించిరి. (చౌ॥ 1-5)

ఛం-బైఠే బరాసన రాము జానకి ముదిత మన దసరథు భఏ ।
తను పులక పుని పుని దేఖి అపనేఁ సుకృత సురతరు ఫల నఏ ॥
భరి భువన రహా ఉఛాహు రామ బిబాహు భా సబహీఁ కహా ।
కెహి భాఁతి బరని సిరాత రసనా ఏక యహు మంగలు మహా ॥ 1 ॥
తబ జనక పాఇ బసిష్ఠ ఆయసు బ్యాహ సాజ సఁవారి కై ।
మాండవీ శ్రుతకీరతి ఉరమిలా కుఅఁరి లఈఁ హఁకారి కై ॥
కుసకేతు కన్యా ప్రథమ జో గున సీల సుఖ సోభామఈ ।
సబ రీతి ప్రీతి సమేత కరి సో బ్యాహి నృప భరతహి దఈ ॥ 2 ॥
జానకీ లఘు భగినీ సకల సుందరి సిరోమని జాని కై ।
సో తనయ దీన్హీ బ్యాహి లఖనహి సకల బిధి సనమాని కై ॥
జెహి నాము శ్రుతకీరతి సులోచని సుముఖి సబ గున ఆగరీ ।
సో దఈ రిపుసూదనహి భూపతి రూప సీల ఉజాగరీ ॥ 3 ॥
అనురూప బర దులహిని పరస్పర లఖి సకుచ హియఁ హరషహీఁ ।
సబ ముదిత సుందరతా సరాహహీఁ సుమన సుర గన బరషహీఁ ॥
సుందరీఁ సుందర బరన్హ సహ సబ ఏక మండప రాజహీఁ ।
జను జీవ ఉర చారిఉ అవస్థా బిభున సహిత బిరాజహీఁ ॥ 4 ॥

సీతారామచంద్రులు ఒకే ఆసనముపై కూర్చొనియుండుట చూచి దశరథునిమనస్సు ఉప్పొంగెను. సుకృత మనెడి కల్పవృక్షము క్రొత్త ఫలములను అందించుచున్నట్లు ఆయన శరీరము మాటిమాటికిని రోమాంచమాయెను. "శ్రీసీతారాముల వివాహము 'జయ'ప్రదముగా జరిగినది." అని చతుర్దశ భువనములలోని వారందఱును మిక్కిలి ఆనందముతో ఎలుగెత్తి చాటిరి. "ఈ వివాహ మహోత్సవము మహామంగళకరము- నాచిన్ని నాలుక దీనిని ఎట్లు వర్ణింపగలదు? వసిష్ఠుని ఆదేశముమేరకు జనక మహారాజు వివాహమునకు అవసరములగు సామగ్రులను అన్నింటిని సమకూర్చి, మాండవి, శ్రుతకీర్తి, ఊర్మిళ, అను రాకుమార్తెలను పిలిపించెను. జనకరాజు తనతమ్ముడైన కుశధ్వజుని పెద్దకూతురు, గుణ శీలసుఖసౌందర్యముల ఖనియైన 'మాండవి'ని 'భరతు'నకు ఇచ్చి మిక్కిలి ప్రేమానురాగములతో యథా విధిగా వివాహము జరిపించెను. పిమ్మట సీతాదేవి చెల్లెలు, సౌందర్యరాశియగు 'ఊర్మిళ'ను 'లక్ష్మణు'నకిచ్చి, పెండ్లి చేసెను. పిదప సులోచన, సుముఖి సుగుణరూపశీలసంపన్నయగు 'శ్రుతకీర్తి'యను కన్యను 'శత్రుఘ్ను'నకు

ఇచ్చి, పాణిగ్రహణము కావించెను. వధూవరులజంటలు ఒకరినొకరు చూచుకొనుచు మనస్సులలో ఆనందించిరి. బయటికి మాత్రము సిగ్గుదొంతరలలో మునిగిపోయిరి. ఈ నవదంపతులను గాంచి, దేవతలు సంతోషముతో పుష్పవృష్టిని గురిపించిరి. అందమైన నవవధూవరులజంటలు ఒకేమండపమున శోభిల్లు చుండగా సదస్యులెల్లరును పరమానందభరితులైరి. వారు జీవునియొక్క జాగ్రత్-స్వప్న-సుషుప్తి-తురీయ, అను నాల్గు అవస్థలు తమ అధిపతులైన విశ్వ తైజస ప్రాజ్ఞ బ్రహ్మలతో కూడి నట్లుండిరి. (ఛం॥ 1-4)

దో- ముదిత అవధపతి సకల సుత, బధున్హ సమేత నిహారి ।
జను పాఏ మహిపాల మని, క్రియన్హ సహిత ఫల చారి ॥ 325 ॥

అయోధ్యాధీశుడైన దశరథ మహారాజు తన కుమారులను కోడండ్లను జూచి, క్రియా సహితముగా (యజ్ఞ, శ్రద్ధా, యోగ, జ్ఞాన ,క్రియలు) చతుర్విధపురుషార్థ (ధర్మార్థ కామ మోక్ష)ములను పొందినట్లు భావించెను. (దో॥ 325)

చౌ- జసి రఘుబీర బ్యాహ బిధి బరనీ । సకల కుఁఅర బ్యాహే తెహిఁ కరనీ ॥
కహి న జాఇ కఛు దాఇజ భూరీ । రహా కనక మని మండపు పూరీ ॥ 1 ॥
కంబల బసన బిచిత్ర పటోరే । భాఁతి భాఁతి బహు మోల న థోరే ॥
గజ రథ తురగ దాస అరు దాసీ । ధేను అలంకృత కామదుహా సీ ॥ 2 ॥
బస్తు అనేక కరిఅ కిమి లేఖా । కహి న జాఇ జానహిఁ జిన్హ దేఖా ॥
లోకపాల అవలోకి సిహానే । లీన్హ అవధపతి సబు సుఖు మానే ॥ 3 ॥
దీన్హ జాచకన్హి జో జెహి భావా । ఉబరా సో జనవాసెహిఁ ఆవా ॥
తబ కర జోరి జనకు మృదు బానీ । బోలే సబ బరాత సనమానీ ॥ 4 ॥

సీతారాములవివాహమువలెనే తక్కినరాజకుమారులవివాహములుగూడా జరుపబడినవి. వరులకిచ్చిన కట్నకానుకలతో, బంగారముతో, మణులతో మండపము నిండిపోయినది. శాలువలు, కంబళములు, వస్త్రములు, రంగురంగుల పట్టుబట్టలు, ఏనుగులు, రథములు, గుఱ్ఱములు దాసదాసీ జనములు, కామధేనువుతో సమానమైన గోవులు, ఇంకను అనేక వస్తువులు విరివిగా ఒసంగబడెను. వాటిని జూచి దిక్పాలురే అసూయపడిరి. దశరథుడు వానినన్నింటిని అంగీకరించి, అర్థులకు వారు వారు కోరినరీతిగా దానము చేసెను. మిగిలినవస్తువులు విడుదులకు చేరెను. వచ్చిన చుట్టముల నందఱిని గౌరవించిన పిదప జనకుడు చేతులు జోడించి మృదుమధురవచనములతో తృప్తి పఱచెను. (చౌ॥ 1-4)

ఛం- సనమాని సకల బరాత ఆదర దాన బినయ బడాఇ కై ।
ప్రముదిత మహాముని బృంద బందే పూజి ప్రేమ లడాఇ కై ॥
సిరు నాఇ దేవ మనాఇ సబ సన కహత కర సంపుట కిఏఁ ।
సుర సాధు చాహత భాఉ సింధు కి తోష జల అంజలి దిఏఁ ॥ 1 ॥

కర జోరి జనకు బహోరి బంధు సమేత కోసలరాయ సోఁ ।
బోలే మనోహర బయన సాని సనేహ సీల సుభాయ సోఁ ॥
సంబంధ రాజన రావరేఁ హమ బడే అబ సబ బిధి భఏ ।
ఏహి రాజ సాజ సమేత సేవక జానిబే బిను గథ లఏ ॥ 2 ॥
ఏ దారికా పరిచారికా కరి పాలిబీఁ కరునా నఈ।
అపరాధు ఛమిబో బోలి పఠఏ బహుత హౌఁ ఢీట్యో కఈ ॥
పుని భానుకులభూషన సకల సనమాన నిధి సమధీ కిఏ ।
కహి జాతి నహిఁ బినతీ పరస్పర ప్రేమ పరిపూరన హిఏ ॥ 3 ॥
బృందారకా గన సుమన బరిసహిఁ రాఉ జనవాసెహి చలే ।
దుందుభీ జయ ధుని బేద ధుని నభ నగర కౌతూహల భలే ॥
తబ సఖీఁ మంగల గాన కరత మునీస ఆయసు పాఇ కై ।
దూలహ దులహిన్హ సహిత సుందరి చలీఁ కోహబర ల్యాఇ కై ॥ 4 ॥

వరపక్షమువారినందఱిని దానములతో, విన్నపములతో, ప్రశంసలతో సగౌరవముగా సత్కరించెను. పిమ్మట జనకమహారాజు మునీశ్వరులను పూజించెను. వారికి మహదానందముతో సాదరముగా నివాళులర్పించెను. దోసిలొగ్గి, నతమస్తకుడై, భూసురులకును విన్నవించెను. వారందఱికిని అంజలిఘటించి "దేవతలు సజ్జనులు భావమునే గ్రహింతురు. ఒక దోసెడు నీటితో సముద్రుని తృప్తి పఱచగలమా? అని వచించెను. పిమ్మట జనకమహారాజు, ఆతనితమ్ముడైన కుశధ్వజుడు చేతులు జోడించి, దశరథునితో ఇట్లు పలికిరి. "రాజా! మీతో వియ్యమందుటవలన అన్నివిధములుగా మా గౌరవము ఇనుమడించినది. ఈ రాజ్యములతోగూడ మమ్ములను నిశ్శుల్కసేవకులుగా భావింపుడు. ఈ బాలికలను మీ సేవికలుగా తలంచి, దయా దృష్టితో వారి ఆలనపాలనలు చూడుడు. మా అపరాధములను క్షమింపుడు. మిమ్ము ఇంత దూరము రప్పించి, శ్రమ పెట్టితిమి"- రఘుకుల రత్నమైన దశరథుడు తన వియ్యంకులను గొప్పగా గౌరవించెను. వారి పరస్పర గౌరవ ప్రేమలు వర్ణనాతీతములు. ఆ ఉభయులును పరస్పరాలింగనములతో ఆనందించుచుండగా దేవతలు పూలవాన కురిపించి, దుందుభులను మ్రోగించిరి. రాజు తనవిడిదికి చేరెను. జయ జయ ధ్వానములు, వేద ఘోషలు సాగుచునే యుండెను. భూనభోంతరిక్షములయందు కోలాహలములు కొనసాగుచునేయుండెను. మునీశ్వరులఆజ్ఞలనుబడసి సుందరీమణులు మంగళ గీతములను పాడుచు తమకులదేవతలను ఆరాధించుటకై వధూవరులను పూజాగృహమునకు తీసికొని వచ్చిరి. (ఛం॥ 1-4)

దో- పుని పుని రామహి చితవ సియ, సకుచతి మను సకుచై న ।
హరత మనోహర మీన ఛబి, ప్రేమ పిఆసే నైన ॥ 326 ॥

సీతాదేవి మాటిమాటికిని శ్రీరాముని జూచును, సిగ్గుపడును. కాని మనస్సులో మాత్రము సంకోచింపక పదే పదే చూడ నిచ్చగించును. ప్రేమపిపాసగల ఆమెకనులు అందమైన చేపల సింగారములను అధఃకరించుచుండెను. (దో॥ 326)

## మాసపారాయణము-పదకొండవ విరామము

చౌ- స్యామ సరీరు సుభాయఁ సుహావన । సోభా కోటి మనోజ లజావన ॥
జావక జుత పద కమల సుహాఏ । ముని మన మధుప రహత జిన్హ ఛాఏ ॥ 1 ॥
పీత పునీత మనోహర ధోతీ । హరతి బాల రబి దామిని జోతీ ॥
కల కింకిని కటి సూత్ర మనోహర । బాహు బిసాల బిభూషన సుందర ॥ 2 ॥
పీత జనేఉ మహాఛబి దేఈ । కర ముద్రికా చోరి చితు లేఈ ॥
సోహత బ్యాహ సాజ సబ సాజే । ఉర ఆయత ఉరభూషన రాజే ॥ 3 ॥
పిఅర ఉపరనా కాఖాసోతీ । దుహుఁ ఆఁచరన్హి లగే మని మోతీ ॥
నయన కమల కల కుండల కానా । బదను సకల సౌందర్జ నిధానా ॥ 4 ॥
సుందర భృకుటి మనోహర నాసా । భాల తిలకు రుచిరతా నివాసా ॥
సోహత మౌరు మనోహర మాథే । మంగలమయ ముకుతా మని గాథే ॥ 5 ॥

శ్రీరామచంద్రుడు నీలమేఘశ్యాముడు. సహజసుందరుడు. కోటిమన్మథాకారుడు. మునుల మనస్సులనెడితుమ్మెదలనుఆకర్షించు ఆయనపాదపద్మములు లత్తుకతోగూడి మిక్కిలి మనోజ్ఞముగా ఉండెను. పవిత్రమై మనోహరమైన ఆయన పట్టుపీతాంబరశోభలు ప్రాతఃకాలసూర్యుని, విద్యుల్లతలమెఱుపులను మించిప్రకాశించుచుండెను. నడుమున మొలనూలుగజ్జెలకలరవములు అహ్లాదకరముగా నుండెను. విశాలభుజములభూషణములు, సర్వమనోజ్ఞయజ్ఞోపవీతము చూచువారికి మానసోల్లాసమును గూర్చుచుండెను. చేతులవ్రేళ్లఅంగుళీయకములు రమణీయములై యుండెను. వివాహాలంకారశోభలతో శ్రీరాముడు మిగుల ఆకర్షణీయముగానుండెను. విశాలవక్షఃస్థలమున ఆభరణములు అహ్లాదకరముగా ఉండెను. భుజములపై వల్లెవాటుగా ధరింపబడిన పచ్చని ఉత్తరీయాంచలముల యందు పొదగబడిన ముత్యాల మణుల కాంతులు మిఱుమిట్లు గొలుపుచుండెను. కమలములవంటి నేత్రములు, చెవుల వ్రేలాడు కుండలములు, సౌందర్యఖనియైన ముఖము, అందమైన కనుబొమలు, మనోహరమైన నాసిక, లలాటమున శోభలకు ఆకరమైన తిలకము, శిరమున ముత్యములు మణులు పొదిగినకలికితురాయి (పెండ్లికుమారుని తలపాగ) అత్యంత శోభావహములై యుండెను. (చౌ॥ 1-5)

ఛం-గాథే మహామని మౌర మంజుల అంగ సబ చిత చోరహీఁ ।
పుర నారి సుర సుందరీఁ బరహి బిలోకి సబ తిన తోరహీఁ ॥
మని బసన భూషన వారి ఆరతి కరహిఁ మంగల గావహీఁ ।
సుర సుమన బరిసహిఁ సూత మాగధ బంది సుజసు సునావహీఁ ॥ 1 ॥
కోహబరహిఁ ఆనే కుఅఁర కుఅఁరి సుఆసినిన్హ సుఖ పాఇ కై ।
అతి ప్రీతి లౌకిక రీతి లాగీఁ కరన మంగల గాఇ కై ॥
లహకౌరి గౌరి సిఖావ రామహి సీయ సన సారద కహైఁ ।
రనివాసు హాస బిలాస రస బస జన్మ కో ఫలు సబ లహైఁ ॥ 2 ॥
నిజ పాని మని మహుఁ దేఖిఅతి మూరతి సురూపనిధాన కీ ।
చాలతి న భుజబల్లీ బిలోకని బిరహ భయ బస జానకీ ॥

కౌతుక బినోద ప్రమోదు ప్రేము న జాఇ కహి జానహిఁ అలీఁ ।
బర కుఅఁరి సుందర సకల సఖీఁ లవాఇ జనవాసెహి చలీఁ ॥ 3 ॥
తెహి సమయ సునిఅ అసీస జహఁ తహఁ నగర నభ ఆనందు మహా ।
చిరు జిఅహుఁ జోరీఁ చారు చార్యో ముదిత మన సబహీఁ కహా ॥
జోగీంద్ర సిద్ధ మునీస దేవ బిలోకి ప్రభు దుందుభి హనీ ।
చలె హరషి బరషి ప్రసూన నిజ నిజ లోక జయ జయ జయ భనీ ॥ 4 ॥

మంజులమకుటమున అమూల్యములైన మణులు పొదగబడినవి. శ్రీరాముని ప్రత్యంగ లావణ్యాలాలిత్యములు అందఱి మనస్సులను దోచుకొనుచుండెను. నగరస్త్రీలు, దివ్యాంగనలు వరునకు దిష్టి దీయుచుండిరి. వారు మణులను, వస్త్రములను, భూషణములను కానుకలుగా సమర్పించి, మంగళ గీతములను పాడుచు హారతులనిచ్చిరి.[1] దేవతలు పూలవానలను గురిపించిరి. వందిమాగధులు, సూతులు శ్రీరాముని కీర్తిని గానముచేసిరి. ముత్తైదువలు నాలుగువధూవరులజంటలను కులదేవతాగృహములకు దీసికొని వచ్చిరి. అతిప్రీతితో మంగళ గీతములను గానము చేయుచు లౌకికకృత్యములను నెరవేర్చిరి. పార్వతీదేవి శ్రీరాముని చేతను, సరస్వతీదేవి సీతాదేవిచేతను బువ్వంబంతి చేయించిరి. రాణివాసము రాసవిలాసములలో మునిగితేలుచుండెను. సీతారాములదర్శనమున తమజన్మలు సఫలములైనట్లు అందఱును తలంచిరి. జానకీదేవి తనకంకణమణులలో ప్రతిఫలించినశ్రీరామునిరూపములను జూచుచు, తనచూపులను ప్రక్కకు మఱల్పదు. చేతులను కదల్పదు. ఆ సమయమునందలి వినోదహాసవిలాసములు, ప్రేమానురాగములు వర్ణనాతీతములు. అవి సఖులకే తెలియును. వారు వధూవరులను విడిదిగృహములకు తీసికొనివచ్చిరి. ఆసమయమున నగరమునందును, ఆకాశమునందును సర్వత్ర ఆశీర్వాదవచనములు వినబడెను. అంతటను ఆనందమే నిండియుండెను. అందఱును ప్రసన్నచిత్తులై "నాలుగు జంటల వారును చిరంజీవులై విలసిల్లుదురుగాక" అని ఆశీర్వదించిరి. దేవతలు, మునీశ్వరులు, సిద్ధులు, యోగులు శ్రీరామచంద్రుని జూచి, దుందుభులను మ్రోగించుచు, పుష్పములను వర్షించుచు జయ జయ నాదములను పలుకుచు ఆనందముతో స్వస్థలములకు వెళ్లిరి. (ఛం॥ 1-4)

దో- సహిత బధూటిన్హ కుఅఁర సబ, తబ ఆఏ పితు పాస ।
సోభా మంగల మోద భరి, ఉమగెఉ జను జనవాస ॥ 327 ॥

పిదప నలుగురు రాకుమారులును తమ తమ వధువులతో గూడి తండ్రిగారికడకు వచ్చిరి. విడిది గృహములు సౌందర్య శోభానందములతో నిండి పోయెను. (దో॥ 327)

చౌ- పుని జెవనార భఈ బహు భాఁతీ । పఠఏ జనక బోలాఇ బరాతీ ॥
పరత పాఁవడే బసన అనూపా । సుతన్హ సమేత గవన కియొ భూపా ॥ 1 ॥

---

1. సీతాకల్యాణ వైభోగమే, రామకల్యాణవైభోగమే.
పవనజస్తుతిపాత్ర పావన చరిత్ర, రవిసోమ వరనేత్ర రమణీయగాత్ర ॥ సీతా ॥
నిగమాగమ విహార నిరుపమ శరీర, నగధరాఘవిదార నతలోకాధార ॥ సీతా ॥
పరమేశనుతగీత భవజలధిపోత, తరణికుల సంజాత త్యాగరాజనుత ॥ సీతా ॥ (త్యాగరాజ)

సాదర సబ కే పాయ పఖారే । జథాజోగు పీఢన్హ బైఠారే ॥
ధోఏ జనక అవధపతి చరనా । సీలు సనేహు జాఇ నహిం బరనా ॥ 2 ॥
బహురి రామ పద పంకజ ధోఏ । జే హర హృదయ కమల మహుఁ గోఏ ॥
తీనిఉ భాఇ రామ సమ జానీ । ధోఏ చరన జనక నిజ పానీ ॥ 3 ॥
ఆసన ఉచిత సబహి నృప దీన్హే । బోలి సూపకారీ సబ లీన్హే ॥
సాదర లగే పరన పనవారే । కనక కీల మని పాన సఁవారే ॥ 4 ॥

రుచికరములైన వివిధపక్వాన్నములతో విందు ఏర్పాటుచేయబడెను. జనకుడు వరపక్షమువారినందఱిని ఆహ్వానించెను. దశరథుడు పుత్రులతో తనపరివారములతోగూడి విందు నారగింపబోయెను. అమూల్యవస్త్రములు మార్గమున పఱచబడెను. పాద ప్రక్షాళనానంతరము అందఱును యథోచితాసనములపై ఆసీనులైరి. జనకుడు స్వయముగా దశరథునికాళ్లుకడిగెను. వారిస్నేహ సౌశీల్యములు ప్రశంసనీయములు. పిమ్మట పరమశివుడు సర్వదా తనహృదయమున నిలుపుకొను శ్రీరామచరణములను జనకుడు కడిగెను. మిగిలిన ముగ్గురు సోదరులనుగూడ శ్రీరామునివలెనే భావించి, వారిపాదములనుగూడ కడిగెను. జనకుడు వారిని యోగ్యములైనఆసనములపై సుఖాసీనులను గావించి, వడ్డించు వారిని రప్పించెను. మణులుపొదిగిన బంగారుతీగలతోకుట్టిన విస్తళ్లను వేయసాగిరి. (చౌ॥ 1-4)

దో- సూపోదన సురభీ సరపి, సుందర స్వాదు పునీత ।
ఛన మహుఁ సబ కేఁ పరుసి గే, చతుర సుఆర బినీత ॥ 328 ॥

నేర్పరులైన వంటవారు రుచికరములైన అన్నము, పప్పు, ఆవు నేయి క్షణములో వడ్డించిరి. (దో॥ 328)

చౌ- పంచ కవల కరి జేవన లాగే । గారి గాన సుని అతి అనురాగే ॥
భాఁతి అనేక పరే పకవానే । సుధా సరిస నహిఁ జాహిఁ బఖానే ॥ 1 ॥
పరుసన లగే సుఆర సుజానా । బింజన బిబిధ నామ కో జానా ॥
చారి భాఁతి భోజన బిధి గాఈ । ఏక ఏక బిధి బరని న జాఈ ॥ 2 ॥
ఛరస రుచిర బింజన బహు జాతీ । ఏక ఏక రస అగనిత భాఁతీ ॥
జేవఁత దేహిఁ మధుర ధుని గారీ । లై లై నామ పురుష అరు నారీ ॥ 3 ॥
సమయ సుహావని గారి బిరాజా । హఁసత రాఉ సుని సహిత సమాజా ॥
ఏహి బిధి సబహీఁ భోజను కీన్హా । ఆదర సహిత ఆచమను దీన్హా ॥ 4 ॥

మొదటి ఐదుకబళములను (ప్రాణాహుతులను) మంత్రయుక్తముగా స్వీకరించి, అందఱును భోజనమునకు ఉపక్రమించిరి. వ్యంగ్యములైన వరుస (పరసాలాపములతో గూడిన) పాటలను ప్రసన్న చిత్తములతో వినిరి. అపూర్వములైన అమృతతుల్యములైన వివిధపక్వాన్నములు వడ్డింపబడినవి. కుశలురైన వంటవారు విచిత్రములైన స్వాదువ్యంజనములను, చతుర్విధ భోజన పదార్థములను (భక్ష్య భోజ్య చోష్య లేహ్యములను) వడ్డించిరి.

వ్యంజనములు షడ్రసోపేతములై స్వాదిష్టములాయెను. ఒక్కొక్క రుచికి పలురకముల వంటకములుండెను. భోజనసమయమున వనితామణులు ఇతరస్త్రీ పురుషులనుగూర్చి పేరుపేరున మధురముగా వ్యంగ్యహాస్యగీతములను పాడిరి. సందర్భోచితముగా రక్తి కట్టించు ఆ హాస్యము ఆనంద దాయకమాయెను. వాటిని విని, దశరథ మహారాజా తన పరివారముతో గూడ వినోదింప సాగెను. భోజనానంతరము సాదరముగా హస్త ప్రక్షాళన గావింపబడెను.

(చౌ॥ 1-4)

దో- దేఇ పాన పూజే జనక, దసరథు సహిత సమాజ।
జనవాసెహి గవనే ముదిత, సకల భూప సిరతాజ॥ 329 ॥

జనకుడు దశరథునకును, ఆయన పరివారములకును తాంబూలములను ఇచ్చి, యథోచిత సత్కారములను గావించెను. రాజశిరోమణియైన దశరథుడు సంతుష్టుడై సకలమర్యాదలతో తనవిడిది గృహమునకు చేరెను.

(దో॥ 329)

చౌ- నిత నూతన మంగల పుర మాహీం। నిమిష సరిస దిన జామిని జాహీం॥
బడే భోర భూపతిమని జాగే। జాచక గున గన గావన లాగే॥ 1 ॥
దేఖి కుఅఁర బర బధున్హ సమేతా। కిమి కహి జాత మోదు మన జేతా॥
ప్రాతక్రియా కరి గే గురు పాహీం। మహాప్రమోదు ప్రేము మన మాహీం॥ 2 ॥
కరి ప్రనాము పూజా కర జోరీ। బోలే గిరా అమిఅఁ జను బోరీ॥
తుమ్హరీ కృపాఁ సునహు మునిరాజా। భయఉఁ ఆజు మైం పూరన కాజా॥ 3 ॥
అబ సబ బిప్ర బోలాఇ గోసాఈం। దేహు ధేను సబ భాఁతి బనాఈం॥
సుని గుర కరి మహిపాల బడాఈ। పుని పఠఏ ముని బృంద బోలాఈ॥ 4 ॥

మిథిలానగరమున ప్రతిదినము మంగళోత్సవములు నిత్య నూతనముగా జరుగుచునే యుండెను. కావున దివారాత్రములు క్షణములో గడిచిపోవుచుండెను. ఒకనాడు దశరథుడు ప్రాతఃకాలముననే మేల్కొనెను. సూతులతనిగుణగణములను ప్రశంసించిరి. తన నలుగురు కుమారులను, కోడండ్లను జూచి, దశరథుని మనస్సు ఆనందముతో పొంగిపోవుచుండెను. ఆయన తనప్రాతఃకాల కృత్యములను ముగించుకొని, వసిష్ఠునియొద్దకు వెళ్లెను. దశరథుని హృదయము ప్రేమానందములతో నిండియుండెను. అతడు వసిష్ఠుని పూజించి, చేతులు జోడించి, నమస్కరించుచు అమృతమయవచనములతో ఇట్లు పలికెను. "మునీశ్వరా! మీదయవలన నేటికి నాకోరికలన్నియు తీరినవి. స్వామీ! బ్రాహ్మణులను పిల్చి, చక్కగా అలంకరింపబడినగోవులను వారికి దానముగా ఇప్పింపుడు"- ఈ మాటలకు వసిష్ఠుడు రాజును మెచ్చుకొని, ముని బృందమును పిలిపించెను. (చౌ॥ 1-4)

దో- బామదేఉ అరు దేవరిషి, బాలమీకి జాబాలి।
ఆఏ మునిబర నికర తబ, కౌసికాది తపసాలి॥ 330 ॥

వామదేవుడు, నారద మహర్షి, వాల్మీకి, జాబాలి, విశ్వామిత్రుడు మొదలగు తపోనిధులైన మునిశ్రేష్ఠులు వచ్చిరి.

(దో॥ 330)

చౌ- దండ ప్రనామ సబహి న్నప కీన్హే। పూజి సప్రేమ బరాసన దీన్హే ॥
చారి లచ్ఛ బర ధేను మగాఈం। కామసురభి సమ సీల సుహాఈం ॥ 1 ॥
సబ బిధి సకల అలంకృత కీన్హీం। ముదిత మహిప మహిదేవన్హ దీన్హీం ॥
కరత బినయ బహు బిధి నరనాహూ। లహేఉఁ ఆజు జగ జీవన లాహూ ॥ 2 ॥
పాఇ అసీస మహీసు అనందా। లిఏ బోలి పుని జాచక బృందా ॥
కనక బసన మని హయ గయ స్యందన। దిఏ బూఝి రుచి రబికులనందన ॥ 3 ॥
చలే పఢత గావత గున గాథా। జయ జయ జయ దినకర కుల నాథా ॥
ఏహి బిధి రామ బిఆహ ఉఛాహూ। సకఇ న బరని సహస ముఖ జాహూ ॥ 4 ॥

రాజు వారికి దండప్రణామములాచరించి, భక్తిశ్రద్ధలతో పూజించి, వారిని సుఖాసీనులను గావించెను. కామధేనువుతో సమానములగు నాలుగు లక్షల ఉత్తమగోవులను తెప్పించెను. వాటిని బాగుగా అలంకరించి, పూజించి, బ్రాహ్మణులకు దానమిచ్చెను. ఈ విధముగా తన జీవితము సార్థకమైనదని వారికి సవినయముగ తెలుపుకొనెను. బ్రాహ్మణులఆశీర్వాదములనందుకొని, ఆతడు ప్రసన్నచిత్తుడాయెను. అర్థులకు వారి వారి అర్హతలను అనుసరించి, బంగారములను వస్త్రములను మణులను గుఱ్ఱములను ఏనుగులను రథములను దానము చేసెను. వారు ఆయనగుణములను కీర్తించుచు 'జయ జయ' ధ్వానములతో ఇండ్లకు చేరిరి. ఈ విధముగా శ్రీరామచంద్రుని వివాహమహోత్సవము తక్కిన సోదరుల పాణిగ్రహణోత్సవములు ముగిసినవి. ఆ వైభవమును వేయిపడగల ఆదిశేషుడు గూడ వర్ణింపజాలడు. (చౌ॥ 1-4)

దో- బార బార కౌసిక చరన, సీసు నాఇ కహ రాఉ।
యహ సబు సుఖు మునిరాజ తవ, కృపా కటాచ్ఛ పసాఉ ॥ 331 ॥

దశరథుడు మాటిమాటికిని విశ్వామిత్రునకు నమస్కరించి, "ఈ ఆనందమంతయు మీ కృపాకటాక్ష ప్రసాదమే"- అని పలికెను. (దో॥ 331)

## అయోధ్యకు పెండ్లివారి ప్రయాణములు

చౌ- జనక సనేహు సీలు కరతూతీ। నృపు సబ భాఁతి సరాహ బిభూతీ ॥
దిన ఉఠి బిదా అవధపతి మాగా। రాఖహిఁ జనకు సహిత అనురాగా ॥ 1 ॥
నిత నూతన ఆదరు అధికాఈ। దిన ప్రతి సహస భాఁతి పహునాఈ ॥
నిత నవ నగర అనంద ఉఛాహూ। దసరథ గవను సోహాఇ న కాహూ ॥ 2 ॥
బహుత దివస బీతే ఏహి భాఁతీ। జను సనేహ రజు బఁధే బరాతీ ॥
కౌసిక సతానంద తబ జాఈ। కహా బిదేహ నృపహి సముఝాఈ ॥ 3 ॥
అబ దసరథ కహఁ ఆయసు దేహూ। జద్యపి ఛాడి న సకహు సనేహూ ॥
భలేహిఁ నాథ కహి సచివ బోలాఏ। కహి జయ జీవ సీస తిన్హ నాఏ ॥ 4 ॥

దశరథమహారాజు జనకునిస్నేహసౌశీల్యములను, ఐశ్వర్యప్రాభవములను, సకలగౌరవ మర్యాదలను, అనేకవిధముల ప్రశంసించెను. ఆయన ప్రతిదినము తాము గృహోన్ముఖులగుటకు అనుజ్ఞను ప్రార్థించుచుండెను.

కాని జనకుడు వారిని ప్రేమతో నిలుపుచుండెను. ఆదరసత్కారములు నిత్యనూతనముగా వర్ధిల్లుచుండెను. అనేకవిధములుగా అతిథిమర్యాదలతో వినోదప్రదర్శనములు సాగిపోవుచుండెను. నగరములో నవనవోన్మేషముగా ఆనందోత్సాహములు వెల్లివిరియుచుండెను. దశరథునిఅయోధ్యాప్రయాణములకు మిథిలావాసులు ఎవ్వరును సుముఖులుగా లేకుండిరి. ఈ విధముగా పెండ్లి వారు మిథిలానగరజనుల ప్రేమపాశములలో బంధింపబడి, పెక్కుదినములు గడిపిరి. పిదప విశ్వామిత్రుడు, శతానందుడు జనకుని యొద్దకుజని ఇట్లు సూచన చేసిరి. "మీరు మీ బంధు ప్రేమకారణమున దశరథమహారాజు అయోధ్యవెళ్లుటకు ఆమోదింపలేకున్నను ప్రయాణములకు దయతో అనుజ్ఞఇయ్యవలెను." జనకుడు "ప్రభూ! అట్లే కానిండు" అని పలికి మంత్రులను పిలిపించెను. వారువచ్చి "మహారాజునకు జయము జయము" అని యనుచు నతశిరస్కులైరి. (చౌ॥ 1-4)

దో- అవధనాథు చాహత చలన, భీతర కరహు జనాఉ।
భఏ ప్రేమబస సచివ సుని, బిప్ర సభాసద రాఉ॥ 332॥

జనకుడు పలికెను. "అయోధ్యాపతి తిరుగుప్రయాణములకు త్వరపడుచున్నాడని రాణివాసమునకు తెల్పుడు." ఇది వినగానే మంత్రులు, బ్రాహ్మణులు, సభాసదులు, రాజుగారును ప్రేమవిహ్వలులైరి. (దో॥ 332)

చౌ- పురబాసీ సుని చలిహి బరాతా। బూఝత బికల పరస్పర బాతా॥
సత్య గవను సుని సబ బిలఖానే। మనహుఀ సాఀఝ సరసిజ సకుచానే॥ 1॥
జహఀ జహఀ ఆవత బసే బరాతీ। తహఀ తహఀ సిద్ధ చలా బహు భాఀతీ॥
బిబిధ భాఀతి మేవా పకవానా। భోజన సాజు న జాఇ బఖానా॥ 2॥
భరి భరి బసహఀ అపార కహారా। పఠఈఀ జనక అనేక సుసారా॥
తురగ లాఖ రథ సహస పచీసా। సకల సఀవారే నఖ అరు సీసా॥ 3॥
మత్త సహస దస సింధుర సాజే। జిన్హహి దేఖి దిసికుంజర లాజే॥
కనక బసన మని భరి భరి జానా। మహిషీఀ ధేను బస్తు బిధి నానా॥ 4॥

పెండ్లివారి తిరుగుప్రయాణవార్త వినగానే మిథిలావాసులు "ఇది నిజమా?" అని ఆశ్చర్యముతో పరస్పరము ప్రస్తావించు కొనిరి. అతిథులు వెళ్లిపోవుచున్నారని వారిముఖములు సంధ్యాకాలకమలములవలె వెలవెలబోయెను. అయోధ్యనుండి మిథిలకు వచ్చునప్పుడు పెండ్లి వారు బసచేసినప్రదేశములకు వారి తిరుగు ప్రయాణములకుగూడ ముందుగనే ఆహార పదార్థములు చేర్చబడినవి. పెక్కువిధములగు పండ్లు, పక్వాన్నములు, భోజనసామగ్రులు, బండ్లపైనను, కావడులద్వారాను జనకునిచే పంపబడెను. అలంకృతములైన ఒకలక్ష గుఱ్ఱములు, 25 వేల రథములు వారి వెంట పంపబడెను. దిగ్గజములనుగూడ మించునట్టి పదివేల మదపుటేనుగులను సాలంకారముగా పంపెను. బండ్లమీద బంగారములను, వస్త్రములను, రత్నములను,[1] చూడియావులను, పాడియావులను, మఱియు అనేక ప్రకారములైన కానుకలను పంపెంచెను. (చౌ॥ 1-4)

1) మూలమున మహిషీ గణమును (గేదెలను) ఇచ్చినట్లు గలదు. కాని ఒక మహారాజు తామస గుణము గల గేదెలను ఇచ్చుట సంప్రదాయము గాదు. సాత్త్విక స్వభావము గల గోవులను దానము చేయుటయే సంప్రదాయము- కావున మూలమునగల 'మహిషీ' అను పదమును చూడియావులు అనియు, 'ధేను' అను పదమును పాడియావులు అనియు అనువదించుట జరిగినది.

దో-దాఇజ అమిత న సకిఅ కహి, దీన్హ బిదేహఀ బహోరి ।
జో అవలోకత లోకపతి, లోక సంపదా థోరి ॥ 333 ॥

జనకుడు బహూకరించిన అపరిమితములైన ఉపాయనములముందు తమసంపదలు అత్యల్పములని దిక్పాలురు భావించిరి. (దో॥ 333)

చౌ- సబు సమాజు ఎహి భాఀతి బనాఈ । జనక అవధపుర దీన్హ పఠాఈ ॥
చలిహి బరాత సునత సబ రానీఀ । బికల మీనగన జను లఘు పానీఀ ॥ 1 ॥
పుని పుని సీయ గోద కరి లేహీఀ । దేఇ అసీస సిఖావను దేహీఀ ॥
హోఏహు సంతత పియహి పిఆరీ । చిరు అహిబాత అసీస హమారీ ॥ 2 ॥
సాసు ససుర గుర సేవా కరేహూ । పతి రుఖ లఖి ఆయసు అనుసరేహూ ॥
అతి సనేహ బస సఖీఀ సయానీ । నారి ధరమ సిఖవహిఀ మృదు బానీ ॥ 3 ॥
సాదర సకల కుఅఀరి సముఝాఈఀ । రానిన్హ బార బార ఉర లాఈఀ ॥
బహురి బహురి భేటహిఀ మహతారీఀ । కహహిఀ బిరంచి రచీఀ కత నారీఀ ॥ 4 ॥

ఈ విధముగా కానుకలను ఏర్పఱచి, వాటిని జనకుడు అయోధ్యకు పంపెను. పెండ్లివారు మఱలి పోవుచున్నారను వార్త వినగానే రాణులెల్లరును నీరు తక్కువగానున్న మడుగులలోని చేపలవలె గిలగిలలాడిరి. వారు మాటి మాటికిని సీతమ్మను గుండెలకు హత్తుకొనుచు ఆశీర్వదించిరి. "నీవు నీ పతికి అత్యంతప్రీతిపాత్రురాలవు అగుదువు. ఆయనతో ఎల్లప్పుడును సుఖజీవనము కలుగుగాక. దీర్ఘసుమంగళీభవ ఇదియే మాఆశీర్వాదము. నీవు

అత్తమామలకును, గురువులకును సేవలొనర్పుము. నీ భర్తమాటను జవదాటకుము"- అని హిత వచనములను పలికిరి. చతురలైన సఖీమణులు ప్రేమతో చొరవచూపి, ఆమెకు గృహిణీధర్మములను ఉపదేశించిరి. రాణులు నలుగురు వధువులను అక్కునజేర్చుకొనుచు "బ్రహ్మదేవుడు స్త్రీలను ఏల సృష్టించెను." అనుచు తమ విచారమును ప్రకటించిరి. (చౌ॥ 1-4)

దో- తెహి అవసర భాఇన్హ సహిత, రాము భానుకుల కేతు ।
చలే జనక మందిర ముదిత, బిదా కరావన హేతు ॥ 334 ॥

ఆ సమయమున భానుకులకేతువు (శ్రేష్ఠుడు) ఐన శ్రీరామచంద్రుడు ప్రసన్నమనస్కుడై తన సోదరులతో గూడి, జనకుని యొద్ద సెలవు గైకొనుటకు వచ్చెను. (దో॥ 334)

చౌ- చారిఉ భాఇ సుభాయఀ సుహాఏ । నగర నారి నర దేఖన ధాఏ ॥
కోఉ కహ చలన చహత హహిఀ ఆజూ । కీన్హ బిదేహ బిదా కర సాజూ ॥ 1 ॥
లేహు నయన భరి రూప నిహారీ । ప్రియ పాహునే భూప సుత చారీ ॥
కో జానై కేహిఀ సుకృత సయానీ । నయన అతిథి కీన్హే బిధి ఆనీ ॥ 2 ॥

మరనసీలు జిమి పావ పిఊషా । సురతరు లహై జనము కర భూఖా ॥
పావ నారకీ హరిపదు జైసేఁ । ఇన్హ కర దరసను హమ కహఁ తైసేఁ ॥ 3 ॥
నిరఖి రామ సోభా ఉర ధరహూ । నిజ మన ఫని మూరతి మని కరహూ ॥
ఏహి బిధి సబహి నయన ఫలు దేతా । గఏ కుఅఁర సబ రాజ నికేతా ॥ 4 ॥

మిథిలానగరములోని స్త్రీపురుషులందఱును సహజసుందరులైన ఆ సోదరులను జూచుటకు పరుగులు దీసిరి. వారిలో ఒకరు "ఈ దినమే వీరు తిరుగు ప్రయాణములు చేయుచున్నారు. అందులకే జనకుడు వారికి తగినఏర్పాట్లు కావించినాడు. కావున మనఅతిథులు, ప్రేమాస్పదులు, సుందరులు ఐన ఈ నలుగురు రాకుమారులను కనులపండువుగా తనివిదీర దర్శింపుడు. వారి సౌందర్యమకరందమును మీనేత్ర చషకములతో తృప్తిగా గ్రోలుడు. సఖీ! ఎవరి పుణ్యఫలముగా విధాత వీరిని ఇక్కడకు గొనివచ్చి, మనకు కనువిందు గావించెనో? ఎవరెరుగుదురు? చనిపోవుచున్నవానికి అమృతము లభించినట్లును, జీవిత మంతయు ఆకలితో అలమటించుచున్నవానికి కల్పవృక్షముదొరకినట్లును, నరకమునకు పోవుచున్నవానికి పరమపదము ప్రాప్తించినట్లును, మనకు వీరిదర్శనభాగ్యము కల్గెను. శ్రీరామచంద్రుని అలౌకికసౌందర్యమును తనవిదీర చూచి సర్పము మణిని తనపడగపై భద్రపఱచుకొనినట్లు ఆయనరూపమును మీ హృదయములలో పదిలపఱచుకొనుడు." ఈ విధముగా అందఱికిని నయనానందమును గూర్చుచు రాకుమారులు రాజభవనమునకు చేరిరి. (చౌ॥ 1-4)

దో-రూప సింధు సబ బంధు లఖి, హరషి ఉఠా రనివాసు।
కరహిఁ నిఛావరి ఆరతీ, మహా ముదిత మన సాసు ॥ 335 ॥

అతిలోకసుందరులైన ఆ రాకుమారులను జూచి రాణీవాసమువారందఱును హర్షోల్లాసభరితలైరి. వధువులతల్లులు కానుకలను వెదజల్లిరి. మంగళహారతులను ఇచ్చిరి. (దో॥ 335)

చౌ- దేఖి రామ ఛబి అతి అనురాగీఁ । ప్రేమబిబస పుని పుని పద లాగీఁ ॥
రహీ న లాజ ప్రీతి ఉర ఛాఈ । సహజ సనేహు బరని కిమి జాఈ ॥ 1 ॥
భాఇన్హ సహిత ఉబటి అన్హవాఏ । ఛరస అసన అతి హేతు జేవాఁఏ ॥
బోలే రాము సుఅవసరు జానీ । సీల సనేహ సకుచమయ బానీ ॥ 2 ॥
రాఉ అవధపుర చహత సిధాఏ । బిదా హోన హమ ఇహాఁ పఠాఏ ॥
మాతు ముదిత మన ఆయసు దేహూ । బాలక జాని కరబ నిత నేహూ ॥ 3 ॥
సునత బచన బిలఖేఉ రనివాసూ । బోలి న సకహిఁ ప్రేమబస సాసూ ॥
హృదయఁ లగాఇ కుఅఁరి సబ లీన్హీ । పతిన్హ సౌంపి బినతీ అతి కీన్హీ ॥ 4 ॥

శ్రీరాముని అద్భుత సౌందర్యమునకు ముగ్ధలై ప్రేమపారవశ్యమున వారు మాటిమాటికిని ఆయన పాదములను జంకుగొంకులులేక స్పృశించుచుండిరి. వారిహృదయములు ప్రేమపూర్ణములాయెను. శ్రీరామునకును, ఆయన సోదరులకును సుగంధద్రవ్యములను బూసి, స్నానములు చేయించిరి. పిదప షడ్రసోపేతముగా భోజనము చేయించిరి. అది అదనుగాదలచి, శ్రీరామచంద్రుడు స్నేహసౌశీల్య సంకోచయుతవచనములను ఇట్లు పలికెను. "మా

తండ్రి గారు అయోధ్యకు వెళ్లగోరు చున్నారు. మీ అనుమతి కొఱకై మమ్ములను ఇచటికి పంపినారు. కావున అమ్మా! మమ్ము మీ పిల్లలవలె భావించి, వాత్సల్యముతో మాకు అనుజ్ఞను ఇండు." ఈ మాటలను వినగానే రాణివాసమువారు ఆందోళన పడిరి. అత్తగార్లు మాటలాడజాలక పోయిరి. వారు రాకుమార్తెలను అక్కున జేర్చుకొని, వారిని వారి భర్తలకు అప్పగించి ఇట్లనిరి. (చౌ॥ 1-4)

ఛం-కరి బినయ సియ రామహి సమరపీ జోరి కర పుని పుని కహై ।
బలి జాఉ( తాత సుజాన తుమ్హ కహుఁ బిదిత గతి సబ కీ అహై ॥
పరివార పురజన మోహి రాజహి ప్రానప్రియ సియ జానిబీ ।
తులసీస సీలు సనేహు లఖి నిజ కింకరీ కరి మానిబీ ॥

సీతాదేవితల్లి ఆమెను శ్రీరామునకుఅప్పగించి, చేతులు జోడించి ప్రార్థించుచు ఇట్లనెను. "నాయనా! నీవు సజ్జనశిరోమణివి! నేను ఒట్టుపెట్టుకొని చెప్పుచున్నాను. సీత నాకును రాజు గారికిని మాత్రమే గాక మా బంధువులకును నగరప్రజలకును ప్రాణములతో సమానము. ఆమెస్నేహసౌశీల్యములను గమనించి, ఓ తులసీ(దాస) ప్రభూ! ఆమెను మీ సేవకురాలిగా భావింపుడు. (ఛం॥)

సో- తుమ్హ పరిపూరన కామ, జాన సిరోమని భావప్రియ ।
జన గున గాహక రామ, దోష దలన కరునాయతన ॥ 336 ॥

రామా! నీవు పూర్ణకాముడవు. జ్ఞానులకు తలమానికము. భావ ప్రియుడవు. భక్తులగుణములనే గ్రహించి, వారి దోషములను రూపుమాపెదవు. కరుణానిధివి. (సో॥ 336)

చౌ- అస కహి రహీ చరన గహి రానీ । ప్రేమ పంక జను గిరా సమానీ ॥
సుని సనేహసానీ బర బానీ । బహుబిధి రామ సాసు సనమానీ ॥ 1 ॥
రామ బిదా మాగత కర జోరీ । కీన్హ ప్రనాము బహోరి బహోరీ ॥
పాఇ అసీస బహురి సిరు నాఈ । భాఇన్హ సహిత చలే రఘురాఈ ॥ 2 ॥
మంజు మధుర మూరతి ఉర ఆనీ । భఈ( సనేహ సిథిల సబ రానీ ॥
పుని ధీరజు ధరి కుఅ(రి హఁకారీ । బార బార భేటహిఁ మహతారీ( ॥ 3 ॥
పహుఁచావహిఁ ఫిరి మిలహిఁ బహోరీ । బఢీ పరస్పర ప్రీతి న థోరీ ॥
పుని పుని మిలత సఖిన్హ బిలగాఈ । బాల బచ్ఛ జిమి ధేను లవాఈ ॥ 4 ॥

ఈ విధముగా పలికి ఆమె శ్రీరాముని పాదములకు ప్రణమిల్లెను. ప్రేమోద్వేగముచే ఆమె కంఠము మూగబోయెను. ఆమె మౌనము వహించెను. ప్రేమ పూరితమైన ఆమె పల్కులను విని, శ్రీరాముడు చేతులు జోడించి నమస్కరించి, అనుజ్ఞకై సగౌరవముగా ఆమెను ప్రార్థించెను. మాటి మాటికిని ప్రణమిల్లెను. ఆమె ఆశీస్సులను గైకొని, రఘు రాముడు నతమస్తకుడై తన తమ్ములతో గూడి ఆమెనుండి సెలవు గైకొనెను. వారి సుందర మధుర మూర్తులను హృదయములలో నిలుపుకొని, రాణులు ప్రేమవిహ్వలలైరి. నిబ్బరము వహించి తమ కూతుళ్లను పిల్చి,

వారిని పదే పదే అక్కున జేర్చుకొనిరి. వారిని కొంత దూరము సాగనంపిరి. మనస్సు నిలువక రాణులు కొంత దూరము వారితో నడిచి తిరిగి వచ్చిరి. కాని ప్రేమతమకమున మఱల వారిని సమీపించి అలింగనము చేసికొనిరి. ఇట్లు పెక్కు పర్యాయములు రాణులు వారిని అనుగమించిరి. ఎట్టకేలకు దూడలనుండి ఆవులను వేఱు చేసినట్లు సఖులు వారిని గృహములకు మఱలించిరి. (చౌ॥ 1-4)

దో- ప్రేమబిబస నర నారి సబ, సఖిన్హ సహిత రనివాసు ।
మానహుఁ కీన్హ బిదేహపుర, కరునాఁ బిరహఁ నివాసు ॥ 337 ॥

మిథిలానగరమునందలి స్త్రీ పురుషులు దాసదాసీలు, రాణివాసమువారు ప్రేమోద్వేగములకు లోనైరి. కరుణరసము, విరహవేదన ఆపురములో మూర్తీభవించినట్లుండెను. (దో॥ 337)

చౌ- సుక సారికా జానకీ జ్యాఏ । కనక పింజరన్హి రాఖి పఢాఏ ॥
బ్యాకుల కహహిఁ కహాఁ బైదేహీ । సుని ధీరజు పరిహరఇ న కేహీ ॥ 1 ॥
భఏ బికల ఖగ మృగ ఏహి భాఁతీ । మనుజ దసా కైసేఁ కహి జాతీ ॥
బంధు సమేత జనకు తబ ఆఏ । ప్రేమ ఉమగి లోచన జల ఛాఏ ॥ 2 ॥
సీయ బిలోకి ధీరతా భాగీ । రహే కహావత పరమ బిరాగీ ॥
లీన్హి రాయఁ ఉర లాఇ జానకీ । మిటీ మహామరజాద గ్యాన కీ ॥ 3 ॥
సముఝావత సబ సచివ సయానే । కీన్హ బిచారు న అవసర జానే ॥
బారహిఁ బార సుతా ఉర లాఈఁ । సజి సుందర పాలకీఁ మగాఈఁ ॥ 4 ॥

బంగారు పంజరములలో ఉంచబడి, జానకీదేవికడ మాటలు నేర్చుకొనిన చిలుకలు గోరువంకలు 'వైదేహి ఎక్కడ? వైదేహి ఎక్కడ? అని పలుకసాగినవి. ఇది విని, మనశ్శాంతిని ఎవరు కోల్పోరు? పశుపక్ష్యాదులే ఈ విధముగా వ్యాకులపడుచున్నప్పుడు ఇక మనుష్యుల సంగతి చెప్పనేల? జనకుడు తన సోదరుడైన కుశధ్వజునితోపాటు అచటికి వచ్చెను. ప్రేమాతిరేకమున అతనికన్నులు చెమ్మగిల్లెను. ఆయనను అందఱును విరాగి అనుకొందురు. కాని భర్తవెంటవెళ్లుచున్న సీతాదేవిని జూచి, ఆయన ధైర్యము, వైరాగ్యము ఎగిరి పోయెను. బిడ్డను అక్కున జేర్చుకొనెను. చూచుచుండగనే ప్రేమ ప్రవాహము పఱదలుకాగా ఆయనజ్ఞానమనెడిఆనకట్ట బీటలువాఱెను. మంత్రులు ఆత్మీయులు ఆయనను ఊరడించిరి. అది శోకమునకు సమయముగాదని గ్రహించి, జనకుడు కుమార్తెలను కౌగిలించుకొని, వారికి ధైర్యము చెప్పెను. పల్లకీలను దెప్పించెను. (చౌ॥ 1-4)

దో- ప్రేమబిబస పరివారు సబు, జాని సులగన నరేస ।
కుఅఁరి చఢాఈఁ పాలకిన్హ, సుమిరే సిద్ధి గనేస ॥ 338 ॥

జనకుని పరివారమంతయు ప్రేమ వివశమాయెను. శుభముహూర్తమున జనకుడు శ్రీ గణేశుని, సిద్ధి దేవిని స్మరించుచు వధువులను పల్లకీలలో కూర్చుండ బెట్టెను. (దో॥ 338)

చౌ- బహుబిధి భూప సుతా సముఝాఈం। నారిధరము కులరీతి సిఖాఈం ॥
దాసీం దాస దిఏ బహుతేరే। సుచి సేవక జే ప్రియ సియ కేరే ॥ 1 ॥
సీయ చలత బ్యాకుల పురబాసీ। హోహిం సగున సుభ మంగల రాసీ ॥
భూసుర సచివ సమేత సమాజా। సంగ చలే పహుంచావన రాజా ॥ 2 ॥
సమయ బిలోకి బాజనే బాజే। రథ గజ బాజి బరాతిన్హ సాజే ॥
దసరథ బిప్ర బోలి సబ లీన్హే। దాన మాన పరిపూరన కీన్హే ॥ 3 ॥
చరన సరోజ ధూరి ధరి సీసా। ముదిత మహీపతి పాఇ అసీసా ॥
సుమిరి గజానను కీన్హ పయానా। మంగలమూల సగున భఏ నానా ॥ 4 ॥

జనకమహారాజు తనబిడ్డలకు పెక్కువిధముల ఉపదేశములనిచ్చెను. స్త్రీధర్మములను, వంశ సంప్రదాయములను బోధించెను. సీతాదేవికి విశ్వాసపాత్రులైన దాసదాసీజనులను ఆమెతోపాటు పంపెను. సీతాదేవి భర్తవెంట అత్తవారింటికి ప్రయాణమైనప్పుడు నగరవాసులు వ్యాకులపాటునకు లోనైరి. శుభశకునములు మంగళకరములైన చిహ్నములు గోచరించెను. బ్రాహ్మణులతో మంత్రులతో, ప్రజలతో కలిసి, జనకుడు కొంతదూరము వారిని అనుగమించెను. బాజాభజంత్రీలు మ్రోగెను. రథగజతురంగములు అలంకరింపబడెను. దశరథుడు బ్రాహ్మణులందరికిని దానములనిచ్చి, వారిని సంతుష్టుల జేసెను. వారి పాదధూళిని శిరమున దాల్చి, వారి నుండి ఆశీస్సులనుబొందెను. శ్రీ గణేశుని స్మరించి, ప్రయాణమయ్యెను. మంచి శకునములెదురయ్యెను.
(చౌ॥ 1-4)

దో- సుర ప్రసూన బరషహిం హరషి, కరహిం అపఛరా గాన ।
చలే అవధపతి అవధపుర, ముదిత బజాఇ నిసాన ॥ 339 ॥

దేవతలు హర్షముతో పుష్పములను వర్షించిరి. అప్సరసలు పాడిరి, ఆడిరి. నగారాల మ్రోతలు అనుసరింపగా దశరథుడు సంతోషముతో అయోధ్యానగరమునకు బయలు దేరెను. (దో॥ 339)

చౌ- నృప కరి బినయ మహాజన ఫేరే। సాదర సకల మాగనే టేరే ॥
భూషన బసన బాజి గజ దీన్హే। ప్రేమ పోషి ఠాఢే సబ కీన్హే ॥ 1 ॥
బార బార బిరిదావలి భాషీ। ఫిరే సకల రామహి ఉర రాఖీ ॥
బహురి బహురి కోసలపతి కహహీం। జనకు ప్రేమబస ఫిరై న చహహీం ॥ 2 ॥
పుని కహ భూపతి బచన సుహాఏ। ఫిరిఅ మహీస దూరి బడి ఆఏ ॥
రాఉ బహోరి ఉతరి భఏ ఠాఢే। ప్రేమ ప్రబాహ బిలోచన బాఢే ॥ 3 ॥
తబ బిదేహ బోలే కర జోరీ। బచన సనేహ సుధాం జను బోరీ ॥
కరౌం కవన బిధి బినయ బనాఈ। మహారాజ మోహి దీన్హి బడాఈ ॥ 4 ॥

దశరథుడు బ్రాహ్మణులను, ప్రముఖులైన పురజనులను, ప్రజలను అనునయించి, సాదరముగా వెనుకకు పంపెను. సంప్రదాయమునను సరించి, వారి వారికి తగినట్లుగా సొమ్ములను, వస్త్రములను, గుఱ్ఱములను, ఏనుగులను

ఇచ్చి అందఱిని సంతృప్తి పఱచెను. వారు రాజును పదేపదే పొగడుచు, శ్రీరాముని తమహృదయములయందు నిలుపుకొని, వెనుకకు మఱలిరి. దశరథుడు ఎంతగా చెప్పినను జనకుడు ప్రేమవశమున మఱలిపోలేకపోయెను. పిమ్మట దశరథుడు రథము దిగి, మర్యాదగా ఇట్లనెను. "మహారాజా! మీరు చాలా దూరము వచ్చితిరి. ఇంకనైనను మఱలిపొండు."- ఆయన కన్నులలో నీరు నిండెను. అప్పుడు జనకుడు చేతులు జోడించి, ప్రేమామృతవచనములను ఇట్లు పలికెను. "మహారాజా! మీరు నాపై అమితగౌరవమును చూపితిరి. ఆ ఋణభారమును నేను ఎట్లు తీర్చుకొనగలను? (చౌ॥ 1-4)

దో- కోసలపతి సమధీ సజన, సనమానే సబ భాఀతి ।
మిలని పరసపర బినయ అతి, ప్రీతి న హృదయఀ సమాతి ॥ 340 ॥

కోసలాధిపతియైన దశరథుడు తనవియ్యంకుని మిక్కిలి ఆదరించెను. అతివినమ్రతతో వారు పరస్పరాలింగనములను కావించుకొనిరి. వారి హృదయములు ప్రేమతో నిండిపోయెను. (దో॥ 340)

చౌ-ముని మండలిహి జనక సిరు నావా । ఆసిరబాదు సబహి సన పావా ॥
సాదర పుని భేఀటే జామాతా । రూప సీల గున నిధి సబ భ్రాతా ॥ 1 ॥
జోరి పంకరుహ పాని సుహాఏ । బోలే బచన ప్రేమ జను జాఏ ॥
రామ కరౌఀ కెహి భాఀతి ప్రసంసా ।ముని మహేస మన మానస హంసా ॥ 2 ॥
కరహిఀ జోగ జోగీ జెహి లాగీ । కోహు మోహు మమతా మదు త్యాగీ ॥
బ్యాపకు బ్రహ్మ అలఖు అబినాసీ । చిదానందు నిరగున గునరాసీ ॥ 3 ॥
మన సమేత జెహి జాన న బానీ । తరకి న సకహిఀ సకల అనుమానీ ॥
మహిమా నిగము నేతి కహి కహఈ । జో తిహుఀ కాల ఏకరస రహఈ ॥ 4 ॥

జనకుడు మునులందఱికిని నమస్కరించి, వారినుండి ఆశీస్సులు గైకొనెను. పిమ్మట ఆయన ఆప్యాయతతో స్నేహశీలగుణోపేతులైన అల్లుండ్లను కౌగిలించు కొనెను. చేతులు జోడించి, ప్రేమ భరితకంఠముతో ఇట్లనెను. "ఓ రామా! నేను ఏ విధముగా మిమ్ము కొనియాడగలను? మీరు మునులయొక్కయు మహాదేవుని యొక్కయు మనస్సులనెడి సరోవరములయందు సంచరించెడి హంసలు. మీకొఱకు యోగులు కామక్రోధమోహమదములను త్యజించి, యోగ సాధన చేయుచుందురు. నీవు సర్వవ్యాపివి, పరబ్రహ్మవు, అవ్యయుడవు, అగోచరుడవు, చిదానంద స్వరూపుడవు, నిర్గుణుడవైనను, గుణనిధివి, అవాఙ్మానసగోచరుడవు, తార్కికులహేతువాదములకు అందనివాడవు. వేదములు నీ మహిమలను 'నేతి నేతి' అని వర్ణించును. త్రికాలములయందును ఒకే విధముగా ఉండువాడవు. నిర్వికారుడవు. (చౌ॥ 1-4)

దో- నయన బిషయ మో కహుఀ భయఉ, సో సమస్త సుఖ మూల ।
సబఇ లాభు జగ జీవ కహఀ, భఏఀ ఈసు అనుకూల ॥ 341 ॥

సర్వ సుఖ నిధానమైన మీరు నాకు కనువిందు గావించితిరి. ఈశ్వరానుగ్రహము లభించిన వారికి ఈ ప్రపంచమున ప్రాప్తముకానిది ఏదియును ఉండదు. (దో॥ 341)

చౌ- సబహి భాఁతి మొహి దీన్హి బడాఈ । నిజ జన జాని లీన్హ అపనాఈ ॥
హోహిఁ సహస దస సారద సేషా । కరహిఁ కలప కోటిక భరి లేఖా ॥ 1 ॥
మోర భాగ్య రాఉర గున గాథా । కహి న సిరాహిఁ సునహు రఘునాథా ॥
మైఁ కఛు కహఉఁ ఏక బల మోరేఁ । తుమ్హ రీఝహు సనేహ సుఠి థోరేఁ ॥ 2 ॥
బార బార మాగఉఁ కర జోరేఁ । మను పరిహరై చరన జని భోరేఁ ॥
సుని బర బచన ప్రేమ జను పోషే । పూరనకామ రాము పరితోషే ॥ 3 ॥
కరి బర బినయ ససుర సనమానే । పితు కౌసిక బసిష్ఠ సమ జానే ॥
బినతీ బహురి భరత సన కీన్హీ । మిలి సప్రేము పుని ఆసిష దీన్హీ ॥ 4 ॥

మీరు అన్నివిధముల నన్ను ఉన్నతుని జేసితిరి. మీదాసునిగా నన్ను అనుగ్రహించితిరి. పదివేలమంది శారదలు, శేషులు కోటి కల్పములలోగూడ నా అదృష్టమును మీ గుణములను గానము చేయుచునే యుందురు. ఐనను రఘునాథా! నా ఈ అదృష్టమును, మీ గుణములను తెల్పెడి గాథలు ఎన్నటికిని సమాప్తము కానేకావు. స్వల్ప ప్రేమ (భక్తి) తోడనే మీరు ప్రసన్నులయ్యెదరు. ఈ దృఢ విశ్వాసముతో చేతులు జోడించి, మీకు ఒక్కమాటను విన్నవించెదను. నా మనస్సు ఒక్కక్షణమైనను మీపాదపద్మములను మఱువకుండుగాక" భక్తిభరితములైన జనకునివచనములను విని, శ్రీరామచంద్రుడు మిక్కిలి సంతుష్టుడాయెను. వినమ్రభావముతో అతడు జనకమహారాజును తన తండ్రిగారితో, గురువు విశ్వామిత్రునితో, కుల గురువు వసిష్ఠునితో సమానముగా భావించి, గౌరవించెను. పిదప జనకుడు భరతునితోగూడ సాదరముగా విన్నవించుకొనెను. ప్రేమతో కౌగిలించుకొని, ఆయనను ఆశీర్వదించెను. (చౌ॥ 1-4)

దో- మిలే లఖన రిపుసూదనహి, దీన్హి అసీస మహీస ।
భఏ పరసపర ప్రేమబస, ఫిరి ఫిరి నావహిఁ సీస ॥ 342 ॥

అనంతరము జనకరాజు లక్ష్మణుని, శత్రుఘ్నునిగూడ ప్రేమతో కౌగిలించుకొని, ఆశీస్సులు పలికెను. వారు ప్రేమాధిక్యమున పరస్పరము పదే పదే నతశిరస్కులైరి. (దో॥ 342)

చౌ- బార బార కరి బినయ బడాఈ । రఘుపతి చలే సంగ సబ భాఈ ॥
జనక గహే కౌసిక పద జాఈ । చరన రేను సిర నయనన్హ లాఈ ॥ 1 ॥
సును మునీస బర దరసన తోరేఁ । అగము న కఛు ప్రతీతి మన మోరేఁ ॥
జో సుఖు సుజసు లోకపతి చహహీఁ । కరత మనోరథ సకుచత అహహీఁ ॥ 2 ॥
సో సుఖు సుజసు సులభ మొహి స్వామీ । సబ సిధి తవ దరసన అనుగామీ ॥
కీన్హి బినయ పుని పుని సిరు నాఈ । ఫిరే మహీసు ఆసిషా పాఈ ॥ 3 ॥
చలీ బరాత నిసాన బజాఈ । ముదిత ఛోట బడ సబ సముదాఈ ॥
రామహి నిరఖి గ్రామ నర నారీ । పావహి నయన ఫలు హోహిఁ సుఖారీ ॥ 4 ॥

కడకు జనకమహారాజునకు పెక్కుపర్యాయములు విన్నవించుకొని శ్రీరామచంద్రుడు తన సోదరులతోగూడి బయలు దేఱెను. జనకుడు విశ్వామిత్రుని పాదములకు ప్రణమిల్లి, ఆయన పాదధూళిని కన్నులకు అద్దుకొని, శిరమున దాల్చెను. మఱియు ఇట్లు పలికెను. "మునీశ్వరా! మీ దర్శన భాగ్యమువలన లభ్యముకానిదేదియు లేదు. ఇది నా పరిపూర్ణవిశ్వాసము. లోకపాలురుగూడ సంకోచపడుచునే కోరుకొనెడి సుఖసంపదలు, కీర్తిప్రతిష్ఠలు, ఈనాడు నాకు సులభముగా లభ్యమైనవి. ఏలనన సర్వ సిద్ధులును మీ దర్శనమునే అనుసరించి యుండును." ఈ విధముగా మాటిమాటికిని విన్నవించి, నమస్కరించి, ఆశీస్సులను పొంది, జనకుడు గృహోన్ముఖుడాయెను. నగారాలు మ్రోగుచుండగా పెండ్లి వారు బయలుదేఱిరి. పిన్నలును, పెద్దలును అందఱు సంతసించిరి. మార్గములో వివిధ గ్రామములప్రజలు శ్రీరామచంద్రుని గాంచి తమనేత్ర సాఫల్యములకు సంబరపడిరి. (చౌ॥ 1-4)

దో- బీచ బీచ బర బాస కరి, మగ లోగన్హ సుఖ దేత।
అవధ సమీప పునీత దిన, పహుఁచీ ఆఇ జనేత ॥ 343 ॥

త్రోవలో అచ్చటచ్చట బసచేయుచు ప్రజలను సంతోషపఱచుచు ఒక శుభదినమున పెండ్లివారు అయోధ్యను సమీపించిరి. (దో॥ 343)

## పెండ్లివారు అయోధ్యకు చేరుట - నిత్యనూతనోత్సవములు

చౌ- హనే నిసాన పనవ బర బాజే। భేరి సంఖ ధుని హయ గయ గాజే ॥
ఝాఁఝి బిరవ డిండిమీఁ సుహాఈ। సరస రాగ బాజహిఁ సహనాఈ ॥ 1 ॥
పుర జన ఆవత అకని బరాతా। ముదిత సకల పులకావలి గాతా ॥
నిజ నిజ సుందర సదన సఁవారే। హాట బాట చౌహట పుర ద్వారే ॥ 2 ॥
గలీఁ సకల అరగజాఁ సిఁచాఈఁ। జహఁ తహఁ చౌకేఁ చారు పురాఈఁ ॥
బనా బజారు న జాఇ బఖానా। తోరన కేతు పతాక బితానా ॥ 3 ॥
సఫల పూగఫల కదలి రసాలా। రోపే బకుల కదంబ తమాలా ॥
లగే సుభగ తరు పరసత ధరనీ। మనిమయ ఆలబాల కల కరనీ ॥ 4 ॥

నగారాలమ్రోతలు, డోళ్లశబ్దములు, శంఖనాదములు, ఏనుగులఘీంకారములు, గుఱ్ఱముల సకిలింపులు, కరతాళధ్వనులు, మృదంగరవములు, మధురరాగములనుఆలపించునాదస్వరములు వీటి కోలాహలముల మధ్యవచ్చెడి పెండ్లివారిని గాంచి, అయోధ్యా నగరవాసులు అత్యంతము హర్షితులైరి. వారితనువులు పులకితములయ్యెను. వారు తమఅందమైన గృహములను, వీధులను, అంగళ్లను, కూడళ్లను, నగర ద్వారములను కనులపండువుగా అలంకరించిరి. సుగంధ ద్రవ్యములను గలిపిన కలాపిని వీధులలో చల్లిరి. రంగవల్లులు తీర్చిదిద్దిరి. ధ్వజపతాకతోరణములతో నగరమంతయు శోభాయమానమయ్యెను. పండ్లతో బరువెక్కిన పోక, అరటి, మామిడి, పకుళ, కదంబ తమాల వృక్షముల వరుసలు కన్నులకింపు గొల్పుచుండెను. వాటి శాఖలు నేలను ముద్దాడుచుండెను. వాటి చుట్టును మణులు పొదిగిన అరుగులు (ఆలవాలములు) వింత శోభలను వెలార్చు చుండెను. (చౌ॥ 1-4)

దో- బిబిధ భాఁతి మంగల కలస, గృహ గృహ రచే సఁవారి।
సుర బ్రహ్మాది సిహాహిఁ సబ, రఘుబర పురీ నిహారి ॥ 344 ॥

ప్రతిగృహమునందును నానావిధమంగళకలశములు అమర్చబడియుండెను. ఆ అయోధ్యా నగర-అలంకార శోభలకు ముగ్ధులైన బ్రహ్మాదిదేవతలు దానిని జూచి (ఇట్టి కల్యాణ మహోత్సవము మాలోకమున గూడ జరిగిన ఎంత బాగుండును?అని) ఈర్ష్య పడుచునే ప్రశంసించిరి. (దో॥ 344)

చౌ- భూప భవను తెహి అవసర సోహా । రచనా దేఖి మదన మను మోహా ॥
మంగల సగున మనోహరతాఈ । రిధి సిధి సుఖ సంపదా సుహాఈ ॥ 1 ॥
జను ఉఛాహ సబ సహజ సుహాఏ । తను ధరి ధరి దసరథ గృహఀ ఛాఏ ॥
దేఖన హేతు రామ బైదేహీ । కహహు లాలసా హోహి న కేహీ ॥ 2 ॥
జూథ జూథ మిలి చలీఀ సుఆసిని । నిజ ఛబి నిదరహిఀ మదన బిలాసిని ॥
సకల సుమంగల సజేఀ ఆరతీ । గావహిఀ జను బహు బేష భారతీ ॥ 3 ॥
భూపతి భవన కోలాహలు హోఈ । జాఇ న బరని సమఉ సుఖు సోఈ ॥
కౌసల్యాది రామ మహతారీఀ । ప్రేమబిబస తన దసా బిసారీఀ ॥ 4 ॥

ఆ సమయమున రాజభవనసౌందర్యవైభవములను గాంచి, మన్మథునిమనస్సు గూడ ఆకర్షితమయ్యెను. శుభశకునములు, రామణీయకము, ఐశ్వర్య మహత్త్వములు, సుఖసంపదలు, ఉత్సాహము ఇవి యన్నియును సహజసుందరదేహములను దాల్చి, దశరథుని గృహమున ప్రవేశించినట్లుండెను. శ్రీరామచంద్రుని, సీతాదేవిని చూచుటకు ఎవరి కన్నులు ఉబలాట పడవు? మన్మథ పత్నియైన రతీదేవి సౌందర్యమును గూడ తిరస్కరించు సుందరీమణులు అచటికి గుంపులు గుంపులుగా వచ్చిరి. అందఱును మంగళద్రవ్యములను, హారతులను పట్టుకొని, పాటలు పాడుచుండిరి. సరస్వతీదేవియే పెక్కురూపములలో వచ్చి, గానముచేయుచున్నట్లుండెను. రాజభవనము ఆనందోత్సాహకోలాహలములతో కలకలలాడుచుండెను. ఆసమయసుఖానందములు వర్ణనాతీతములు. కౌసల్యాదేవి మొదలగు మాతృమూర్తులు ప్రేమపారవశ్యమున తమనుతాము మఱచిపోయిరి. (చౌ॥ 1-4)

దో-దిఏ దాన బిప్రన్హ బిపుల, పూజి గనేస పురారి ।
ప్రముదిత పరమ దరిద్ర జను, పాఇ పదారథ చారి ॥ 345 ॥

గర్భదరిద్రునకు చతుర్విధపురుషార్థఫలములు ప్రాప్తించినంతగా రాణివాసమువారు అపరిమితానందములను పొందిరి. శ్రీ గణేశుని, పరమశివుని పూజించి, వారు బ్రాహ్మణోత్తములకు పుష్కలముగా విశేషదానములను గావించిరి. (దో॥ 345)

చౌ- మోద ప్రమోద బిబస సబ మాతా । చలహిఀ న చరన సిథిల భఏ గాతా ॥
రామ దరస హిత అతి అనురాగీఀ । పరిఛని సాజు సజన సబ లాగీఀ ॥ 1 ॥
బిబిధ బిధాన బాజనే బాజే । మంగల ముదిత సుమిత్రాఀ సాజే ॥
హరద దూబ దధి పల్లవ ఫూలా । పాన పూగఫల మంగల మూలా ॥ 2 ॥
అచ్ఛత అంకుర లోచన లాజా । మంజుల మంజరి తులసి బిరాజా ॥
ఛుహే పురట ఘట సహజ సుహాఏ । మదన సకున జను నీడ బనాఏ ॥ 3 ॥

సగున సుగంధ న జాహిఀ బఖానీ । మంగల సకల సజహిఀ సబ రానీ ॥
రచీఀ ఆరతీఀ బహుత బిధానా । ముదిత కరహిఀ కల మంగల గానా ॥ 4 ॥

మోద ప్రమోదవివశలైన రాణులు అత్యంతానందముతో నిశ్చేష్టలై నిలిచి పోయిరి. శ్రీరామచంద్రుని దర్శనమునకై ద్వారపూజకై ఆనందోత్సాహములతో మంగళద్రవ్యములను, హారతులను సిద్ధపఱచిరి. నానావిధవాద్యములసంగీతగోష్ఠి సాగుచుండెను. సుమిత్రాదేవి సంతోషముతో పసుపు, దూర్వాగడ్డి, పెఱుగు, ఆకులు, పుష్పములు, తములపాకులు, వక్కలు, శుభప్రదములైన వ్రేళ్లు, అక్షతలు, బార్లీ మొక్కలు, గోరోజనము, పేలాలు తులసిమొక్కలు మొదలగు మంగళ ద్రవ్యములను తీసికొని వచ్చెను. రంగురంగుల సువర్ణకలశములు మన్మథపక్షులగూళ్లవలెనుండెను. శుభశకునములనిచ్చు సుగంధ ద్రవ్యములు అనేకము తీసికొని రాబడెను. రాణులందఱును శుభకార్యములయందు నిమగ్నలైరి. నానావిధ హారతులతో మధురగానములను చేయసాగిరి.

(చౌ॥ 1-4)

దో- కనక థార భరి మంగలన్హి, కమల కరన్హి లిఏఀ మాత ।
చలీఀ ముదిత పరిఛని కరన, పులక పల్లవిత గాత ॥ 346 ॥

బంగారు పళ్లెములలో మంగళకరమైన సుగంధ ద్రవ్యములను తీసికొని, రాణులు ద్వారపూజకై వచ్చి తమకరకమలములతో కుమారులకు మంగళహారతులనిచ్చిరి. హర్షాతిరేకములతో వారు పులకిత గాత్రలైరి.

(దో॥ 346)

చౌ- ధూప ధూమ నభు మేచక భయఊ । సావన ఘన ఘమండు జను ఠయఊ ॥
సురతరు సుమన మాల సుర బరషహిఀ । మనహుఀ బలాక అవలి మను కరషహిఀ ॥ 1 ॥
మంజుల మనిమయ బందనివారే । మనహుఀ పాకరిపు చాప సఀవారే ॥
ప్రగటహిఀ దురహిఀ అటన్హ పర భామిని । చారు చపల జను దమకహిఀ దామిని ॥ 2 ॥
దుందుభి ధుని ఘన గరజని ఘోరా । జాచక చాతక దాదుర మోరా॥
సుర సుగంధ సుచి బరషహిఀ బారీ । సుఖీ సకల ససి పుర నర నారీ ॥ 3 ॥
సమఉ జాని గుర ఆయసు దీన్హా । పుర ప్రబేసు రఘుకులమని కీన్హా ॥
సుమిరి సంభు గిరిజా గనరాజా । ముదిత మహీపతి సహిత సమాజా ॥ 4 ॥

వారిచ్చిన ధూపధూమములు ఆకాశమున శ్రావణమేఘములను సృష్టించుచుండెను. దేవతలు, ఆకసము నుండి కల్ప వృక్ష ప్రసూనములను వర్షింపగా ఆ పుష్ప గుచ్ఛములవిలసనములు, బలాక (తెల్లని) పక్షుల గుంపులవలె ప్రజల (చూచువారి) మనస్సులను దోచుకొనుచుండెను. మణిఖచిత తోరణ కాంతులు ఇంద్రధనుశ్శోభలను తలపించుచుండెను. తరుణీమణులు ఇటునటు తిరుగుచుండగా సుందరములై చపలములైన విద్యుల్లతలు మెఱయుచున్నట్లుండెను. దుందుభులనాదములు మేఘగర్జనలను స్ఫురింపజేయుచుండెను. యాచకులగగ్గోలు, చాతకములు, కప్పలు, నెమళ్ల అఱపులవలె ఉండెను. దేవతలు పవిత్రసుగంధజలములను కురిపింపగా వర్షజలములకు పైరుపంటలు కలకలలాడినట్లు నగరవాసులు సంబరపడిరి. శుభముహూర్తమున వసిష్ఠులవారి ఆజ్ఞతో దశరథమహారాజు తనపరివారములతోగూడి పార్వతీపరమేశ్వరులను, శ్రీ గణేశుని స్మరించుచు పరమానందముతో నగరమున ప్రవేశించెను. (చౌ॥ 1-4)

దో- హోహిఁ సగున బరషహిఁ సుమన, సుర దుందుభీఁ బజాఇ ।
బిబుధ బధూ నాచహిఁ ముదిత, మంజుల మంగల గాఇ ॥ 347 ॥

శుభశకునములయ్యెను. దేవతలు దుందుభులు మ్రోగించిరి. పుష్పవృష్టిని గురిపించిరి. గంధర్వులు గానము చేసిరి. దివ్యాంగనలు, మంగళ గీతములను ఆలపించుచు నాట్యములాడిరి. (దో॥ 347)

చౌ- మాగధ సూత బంది నట నాగర । గావహిఁ జసు తిహు లోక ఉజాగర ॥
జయ ధుని బిమల బేద బర బానీ । దస దిసి సునిఅ సుమంగల సానీ ॥ 1 ॥
బిపుల బాజనే బాజన లాగే । నభ సుర నగర లోగ అనురాగే ॥
బనే బరాతీ బరని న జాహీఁ । మహా ముదిత మన సుఖ న సమాహీఁ ॥ 2 ॥
పురబాసిన్హ తబ రాయ జొహారే । దేఖత రామహి భఏ సుఖారే ॥
కరహిఁ నిఛావరి మనిగన చీరా । బారి బిలోచన పులక సరీరా ॥ 3 ॥
ఆరతి కరహిఁ ముదిత పుర నారీ । హరషహిఁ నిరఖి కుఅఁర బర చారీ ॥
సిబికా సుభగ ఓహార ఉఘారీ । దేఖి దులహిన్హ హోహిఁ సుఖారీ ॥ 4 ॥

త్రిలోకవ్యాప్తమైన దశరథుని యొక్క, శ్రీరామచంద్రుని యొక్క ఉజ్జ్వలనిర్మలకీర్తిప్రతిష్ఠలను చతురులైన వందిమాగధులు, సూతులు, భట్రాజులు, నటులు గానముచేసిరి. జయధ్వనులు, వేదఘోషలు దశదిశల ప్రతిధ్వనించెను. వివిధవాద్యములగోష్ఠి జరిగెను. ఆకాశమున దేవతలు, నగరమున ప్రజలు ప్రేమపరవశులైరి. పెండ్లిఊరేగింపుదృశ్యములకు వారు పరమానందభరితులైరి. అయోధ్యావాసులు మహారాజునకు వందనములనాచరించిరి. శ్రీరామచంద్రుని దర్శింపగనే ప్రసన్నమనస్కులై మణులను, వస్త్రములను కానుకలుగా సమర్పించిరి. వారికన్నులు ఆనందాశ్రువులతో ఆర్ద్రములాయెను, తనువులు పులకరించెను. పురస్త్రీలు హర్షాతిరేకముతో ఆ నలుగురు రాకుమారులకు మంగళహారతులు పట్టిరి. పల్లకీలతెరలను మాటిమాటికిని కొద్దిగా తెఱచుచు వారు నవవధువులను గాంచుచు ముచ్చటపడుచుండిరి. (చౌ॥ 1-4)

దో- ఏహి బిధి సబహీ దేత సుఖు, ఆఏ రాజదుఆర ।
ముదిత మాతు పరిఛని కరహిఁ, బధున్హ సమేత కుమార ॥ 348 ॥

ఈ విధముగా ఎల్లరకును ఆనందమునుగూర్చుచు నవవధూవరులజంటలు రాజ భవనద్వారములను చేరినవి. రాజమాతలు ఆనందముతో వారికి ద్వారపూజలతో స్వాగతమర్యాదలను నెరపిరి. (దో॥ 348)

చౌ- కరహిఁ ఆరతీ బారహిఁ బారా । ప్రేము ప్రమోదు కహై కో పారా ॥
భూషన మని పట నానా జాతీ । కరహిఁ నిఛావరి అగనిత భాఁతీ ॥ 1 ॥
బధున్హ సమేత దేఖి సుత చారీ । పరమానంద మగన మహతారీ ॥
పుని పుని సీయ రామ ఛబి దేఖీ । ముదిత సఫల జగ జీవన లేఖీ ॥ 2 ॥
సఖీఁ సీయ ముఖ పుని పుని చాహీ । గాన కరహిఁ నిజ సుకృత సరాహీ ॥
బరషహిఁ సుమన ఛనహిఁ ఛన దేవా । నాచహిఁ గావహిఁ లావహిఁ సేవా ॥ 3 ॥

దేఖి మనోహర చారిఉ జోరీं। సారద ఉపమా సకల ఢం‌ఢోరీं ॥
దేత న బనహిం నిపట లఘు లాగీं। ఏకటక రహీం రూప అనురాగీं ॥ 4 ॥

వారు వరుసగా హారతులను ఇచ్చిరి. వారిప్రేమాతిరేకస్థితిని ఎవ్వరును వర్ణింపజాలరు. నానా విధములైన ఆభరణములను, వస్త్రములను, రత్నములను ఆ శుభసమయమున కానుకలుగా సమర్పించిరి. నవవధువులతోగూడి వచ్చుచున్న తమ నలుగురు పుత్రులను జూచి, రాజమాతలు పరమానంద భరితలైరి. శ్రీ సీతారాములను తనివిదీర జూచి, వారు తమజన్మలు ధన్యమైనట్లు భావించిరి. సఖులు మాటిమాటికి సీతాదేవిని అదే పనిగా దర్శించుచు తమపుణ్య విశేషమును కొనియాడుచు గానము చేసిరి. దేవతలు ప్రతి క్షణము పూలవర్షములతో, నాట్యములతో, మధురగానములతో తమభక్తి ప్రపత్తులను ప్రకటించు కొనుచుండిరి. ఆ నాలుగుజంటలను జూచి, వాగ్దేవి వారివైభవములను వర్ణించుటకు ఉపమానములను వెదకుచుండెను. కాని ఏ ఉపమానములుగూడ వారి రూపసౌభాగ్యములతో సరిపోలకుండెను. కావున అనురక్తితో రెప్పవాల్చక వారినే చూడసాగెను. (చౌ॥ 1-4)

దో-నిగమ నీతి కుల రీతి కరి, అరఘ పాంవడే దేత।
బధున్హ సహిత సుత పరిఛి సబ, చలీं లవాఇ నికేత ॥ 349 ॥

వేదమార్గవిధానములు, వంశసంప్రదాయములు ముగిసినపిమ్మట రాజమాతలు ఆ నవ వధూవరులకు హారతులను, అర్ఘ్యములను ఇచ్చి, నూతన వస్త్రములపై నడిపించుచు ప్రాసాదములోనికి గొనివచ్చిరి. (దో॥ 349)

చౌ- చారి సింఘాసన సహజ సుహాఏ। జను మనోజ నిజ హాథ బనాఏ ॥
తిన్హ పర కుఅఁరి కుఅఁర బైఠారే। సాదర పాయ పునీత పఖారే ॥ 1 ॥
ధూప దీప నైబేద బేద బిధి। పూజే బర దులహిని మంగలనిధి ॥
బారహిం బార ఆరతీ కరహీం। బ్యజన చారు చామర సిర ఢరహీం ॥ 2 ॥
బస్తు అనేక నిఛావరి హోహీం। భరీం ప్రమోద మాతు సబ సోహీం ॥
పావా పరమ తత్వ జను జోగీं। అమృతు లహెఉ జను సంతత రోగీं ॥ 3 ॥
జనమ రంక జను పారస పావా। అంధహి లోచన లాభు సుహావా ॥
మూక బదన జను సారద ఛాఈ। మానహుం సమర సూర జయు పాఈ ॥ 4 ॥

మన్మథశిల్పసౌందర్యములను పుణికిపుచ్చుకొని, సహజశోభలతో అలరారుచున్న సింహాసనములపై వధూవరులను గూర్చుండబెట్టి, సాదరముగా వారిపవిత్రపాదములను కడిగిరి. పిమ్మట విధ్యుక్తముగా వారికి ధూపదీపనైవేద్యములతో పూజాకార్యక్రమములను నిర్వర్తించిరి. రాజమాతలు వారికి హారతులెత్తి, విసనకఱ్ఱలతో వింజామరలతో విసరుచుండిరి. వారికి అమూల్యములైన ఉపాయనములను సమర్పించిరి. యోగులు బ్రహ్మానందమును పొందినట్లును, దీర్ఘరోగికి అమృతము లభించినట్లును, రాణులు మహదానంద భరితలైరి. గర్భ దరిద్రునకు స్పర్శమణి దొరికినట్లు, అంధునకు చూపు వచ్చినట్లు, మూగవానికి శారదాదేవి వలన వాగ్ధాటి అబ్బినట్లు, వీరునకు సంగ్రామమున విజయము లభించినట్లు- వారు మిక్కిలి ఆనందించిరి. (చౌ॥ 1-4)

దో- ఏహి సుఖ తే సత కోటి గున, పావహిం మాతు అనందు।
భాఇన్హ సహిత బిఆహి ఘర, ఆఏ రఘుకులచందు ॥ 350 (క) ॥

లోక రీతి జననీం కరహీం, బర దులహిని సకుచాహీం।
మోదు బినోదు బిలోకి బడ, రాము మనహీం ముసుకాహీం॥ 350 (ఖ) ॥

రఘువంశ మణియైన శ్రీరామచంద్రుడు సోదర సహితుడై వివాహ మహోత్సవములను జరుపుకొని, అయోధ్యలో అడుగిడిన ఆ శుభసమయమున తల్లులు పై సుఖానందములకు శతకోటి రెట్లు ఆనందమును తనివిదీర అనుభవించిరి. ఆ నవవధూవరులు సిగ్గుదొంతరలో మునిగిపోవునట్లుగా రాజమాతలు తమ సంప్రదాయ వినోదములను హాస్యప్రసంగములతో నడిపించిరి. శ్రీరాముడు వారి ఆనందోత్సాహములను గమనించి, దరహాసముతో మనస్సులోనే సంతసించెను. (దో॥ 350. క,ఖ)

చౌ- దేవ పితర పూజే బిధి నీకీ। పూజీం సకల బాసనా జీ కీ॥
సబహి బంది మాగహీం బరదానా। భాఇన్హ సహిత రామ కల్యానా॥ 1 ॥
అంతరహిత సుర ఆసిష దేహీం। ముదిత మాతు అంచల భరి లేహీం॥
భూపతి బోలి బరాతీ లీన్హే। జాన బసన మని భూషన దీన్హే॥ 2 ॥
ఆయసు పాఇ రాఖి ఉర రామహి। ముదిత గఏ సబ నిజ నిజ ధామహి॥
పుర నర నారి సకల పహిరాఏ। ఘర ఘర బాజన లగే బధాఏ॥ 3 ॥
జాచక జన జాచహిం జోఇ జోఈ। ప్రముదిత రాఉ దేహిం సోఇ సోఈ॥
సేవక సకల బజనిఆ నానా। పూరన కిఏ దాన సనమానా॥ 4 ॥

తమ మనోరథములన్నియును నెఱవేరినవని రాణులు దేవతలను పితరులను పూజించిరి. శ్రీరామునకును, తక్కిన రాకుమారులకును శుభములు కలుగునట్లుగా నమస్కరించుచు వారిని వరములను గోరిరి. అదృశ్య రూపములతో దేవతలు వారికి ఆకసమునుండియే ఆశీస్సులను పలికిరి. వారు అమితానందముతో తమచీరకొంగులుపట్టి ఆశీస్సులను గ్రహించిరి. పెండ్లికి వచ్చినవారికి అందఱికిని మహారాజు వాహనములను, వస్త్రములను, ఆభరణములను, మణులను కానుకలుగా సమర్పించెను. వారు రాజాజ్ఞను గైకొని, ఆనందముతో తమతమఇండ్లకు చేరిరి. నగరములోని స్త్రీ పురుషులందఱికిని మహారాజు ఆభరణములను నూతన వస్త్రములను పంచెను. ఇంటింటా మంగళ వాద్యములు మ్రోగెను. పాత్రులైనఅర్థులకు కోరినవస్తువులనెల్ల దానము చేసెను. సేవకులకును, మేళములవారికిని, తదితరులకును తృప్తికరముగా బహుమతులను పంచెను. (చౌ॥ 1-4)

దో- దేహీం అసీస జోహారి సబ, గావహీం గున గన గాథ।
తబ గుర భూసుర సహిత గృహం, గవను కీన్హ నరనాథ॥ 351 ॥

వారందఱును ఆశీర్వదించుచు నమస్కరించి, దశరథుని కొనియాడుచు వెళ్లిరి. పిదప రాజు గురువుగారితోడను, ఇతరబ్రాహ్మణులతోడను కలిసి, రాజభవనమున ప్రవేశించెను. (దో॥ 351)

చౌ- జో బసిష్ఠ అనుసాసన దీన్హి। లోక బేద బిధి సాదర కీన్హి॥
భూసుర భీర దేఖి సబ రానీ। సాదర ఉఠీం భాగ్య బడ జానీ॥ 1 ॥

పాయ పఖారి సకల అన్హవాఏ। పూజి భలీ బిధి భూప జెవాఁఏ ॥
ఆదర దాన ప్రేమ పరిపోషే। దేత అసీస చలే మన తోషే ॥ 2 ॥
బహు బిధి కీన్హి గాధిసుత పూజా। నాథ మోహి సమ ధన్య న దూజా ॥
కీన్హి ప్రసంసా భూపతి భూరీ। రానిన్హ సహిత లీన్హి పగ ధూరీ ॥ 3 ॥
భీతర భవన దీన్హ బర బాసూ। మన జోగవత రహ నృపు రనివాసూ ॥
పూజే గుర పద కమల బహోరీ। కీన్హి బినయ ఉర ప్రీతి న థోరీ ॥ 4 ॥

వసిష్ఠుని ఆదేశానుసారము రాజు లోకాచారములను, వైదికవిధులను చక్కగా ఆచరించెను. రాణులు బ్రాహ్మణబృందములను జూచి, తమభాగ్యములను తలచుకొనుచు వారిని సాదరముగా ఆహ్వానించిరి. రాజు వారిపాదములను కడిగి, స్నానములు చేయించి, పూజించి, భోజనాదికములను జరిపించెను. వారి ప్రేమాదరములకును, దానములకును తృప్తి చెందిన విప్రోత్తములు వారిని ఆశీర్వదించి, తమ గృహములకు అరిగిరి. దశరథమహారాజు గాధిసుతుడైన విశ్వామిత్రునకు అనేకవిధములగు పూజలొనర్చి "మునీశ్వరా! నేను మిక్కిలి ధన్యుడను" అని పలికెను. అతడు మునిని శ్లాఘించుచు ఆయన పాదధూళిని తనశిరమున దాల్చెను. రాణులుగూడ ఆ పాదధూళిని తమ శిరస్సులపై దాల్చిరి. ఆ మహర్షికి రాజభవనమున అందలు సేవలు చేయుటకు అనుగుణముగా రాజు చక్కనినివాసవసతిని ఏర్పఱచెను. రాజు మిక్కిలి వినయముతో భక్తితో వసిష్ఠుని పూజించెను. (చౌ॥ 1-4)

దో- బధున్హ సమేత కుమార సబ, రానిన్హ సహిత మహీసు।
పుని పుని బందత గుర చరన, దేత అసీస మునీసు ॥ 352 ॥

రాజకుమారులు, నవవధువులు, దశరథుడు, రాణులు గురువుగారి పాదములకు పదే పదే ప్రణమిల్లిరి. వసిష్ఠ మహాముని వారిని ఆశీర్వదించెను. (దో॥ 352)

చౌ- బినయ కీన్హి ఉర అతి అనురాగేఁ। సుత సంపదా రాఖి సబ ఆగేఁ ॥
నేగు మాగి మునినాయక లీన్హా। ఆసిరబాదు బహుత బిధి దీన్హా ॥ 1 ॥
ఉర ధరి రామహి సీయ సమేతా। హరషి కీన్హ గుర గవను నికేతా ॥
బిప్రబధూ సబ భూప బోలాఈఁ। చైల చారు భూషన పహిరాఈఁ ॥ 2 ॥
బహురి బోలాఇ సుఆసిని లీన్హీఁ। రుచి బిచారి పహిరావని దీన్హీఁ ॥
నేగీ నేగ జోగ సబ లేహీఁ। రుచి అనురూప భూపమని దేహీఁ ॥ 3 ॥
ప్రియ పాహునే పూజ్య జే జానే। భూపతి భలీ భాఁతి సనమానే ॥
దేవ దేఖి రఘుబీర బిబాహూ। బరషి ప్రసూన ప్రసంసి ఉఛాహూ ॥ 4 ॥

దశరథుడు తనకుమారులతోగూడి, అత్యంతభక్తిప్రపత్తులతో తనసంపదను వసిష్ఠుని ముందుంచి, స్వీకరింపుడని ప్రార్థించెను. కాని ఆ మహాముని సంప్రదాయానుసారము పురోహితునిగా పొందదగిన కానుకలనుమాత్రము స్వీకరించి, నిండుమనస్సుతో వారిని ఆశీర్వదించెను. పిమ్మట సీతారాముల దివ్యరూపములను తనహృదయమున నిలుపుకొని, వసిష్ఠుడు ప్రసన్నచిత్తుడై తన నివాసమునకు వెళ్లెను. రాజు బ్రాహ్మణస్త్రీలందఱికిని

వస్త్రాభరణములను కానుకలుగా ఇచ్చెను. నగరములోని ముత్తైదువలందరికిని వారికిష్టములైన వస్త్రములను బహూకరించెను. శుభసమయములకు తగినట్లుగా అందరికిని బహుమతులనుపంచెను. తనకు ప్రేమాస్పదులు, పూజ్యులు ఐన అతిథులందరిని దశరథుడు సన్మానించెను. శ్రీరామునివివాహమహోత్సవమును జూచి, దేవతలందరును సంతసించి, పుష్పములను వర్షించిరి. (చౌ॥ 1-4)

దో- చలే నిసాన బజాఇ సుర, నిజ నిజ పుర సుఖ పాఇ ।
కహత పరసపర రామ జసు, ప్రేమ న హృదయఁ సమాఇ ॥ 353 ॥

దుందుభులను మ్రోగించుచు దేవతలు శ్రీరామునిగుణవైభవములను పరస్పరము తెలుపు కొనుచు, వారిని కీర్తించుచు తమలోకములకు వెళ్ళిరి. శ్రీరామునియెడలగలప్రేమతో వారి హృదయములు నిండి పోయెను. (దో॥ 353)

చౌ- సబ బిధి సబహి సమది నరనాహూ । రహా హృదయఁ భరి పూరి ఉఛాహూ ॥
జహఁ రనివాసు తహాఁ పగు ధారే । సహిత బహూటిన్హ కుఅఁర నిహారే ॥ 1 ॥
లిఏ గోద కరి మోద సమేతా । కో కహి సకఇ భయఉ సుఖు జేతా ॥
బధూ సప్రేమ గోద బైఠారీఁ । బార బార హియఁ హరషి దులారీఁ ॥ 2 ॥
దేఖి సమాజు ముదిత రనివాసూ । సబ కేఁ ఉర అనంద కియో బాసూ ॥
కహేఉ భూప జిమి భయఉ బిబాహూ । సుని సుని హరషు హోత సబ కాహూ ॥ 3 ॥
జనక రాజ గున సీలు బడాఈ । ప్రీతి రీతి సంపదా సుహాఈ ॥
బహుబిధి భూప భాట జిమి బరనీ । రానీఁ సబ ప్రముదిత సుని కరనీ ॥ 4 ॥

అందరికిని అన్నివిధముల సాదరముగా బహుమాన సత్కారములను జరిపి, వారిని ప్రసన్నులుగా జేసిన పిదప దశరథుడు హర్షోల్లసితహృదయుడై రాణివాసమునకు చేరెను. అచట రాజకుమారులను వారివధువులను జూచెను. కుమారులను తనఒడిలో కూర్చుండబెట్టుకొని, అపరిమితానందమును అనుభవించెను. వధువులను వాత్సల్యముతో తన యొడిలో కూర్చుండబెట్టుకొని వారిని లాలించెను. ఈ దృశ్యమును గాంచి, రాణివాసమువారు ఎనలేని ఆనందమును అనుభవించిరి. వివాహములు జరిగిన తీరును రాణులకు రాజు వివరించిచెప్పెను. అది విని అందరును సంతసించిరి. జనకుని గుణశీలస్వభావములను, ఆయన ఔన్నత్యమును, ప్రేమాభిమానములను సంపదలను గూర్చి భట్రాజువలెవర్ణించి కొనియాడెను. జనకుని ఆదరసత్కారములను సంపూర్ణముగా విని, రాణివాస స్త్రీలు మిక్కిలి సంతసించిరి. (చౌ॥ 1-4)

దో- సుతన్హ సమేత నహాఇ నృప, బోలి బిప్ర గుర గ్యాతి ।
భోజన కీన్హ అనేక బిధి, ఘరీ పంచ గఇ రాతి ॥ 354 ॥

రాజు తనపుత్రులతోగూడ స్నానాదుల నొనర్చి, బ్రాహ్మణులను, గురువుగారిని కుటుంబ సభ్యులను పిలిచి, విందు భోజనములకు ఏర్పాట్లు చేయించెను. ఈ విధముగా రాత్రి ఐదు గడియలు గడిచెను. (దో॥ 354)

చౌ- మంగలగాన కరహిం బర భామిని । భై సుఖమూల మనోహర జామిని ॥
అంచఇ పాన సబ కాహూం పాఈ । స్రగ సుగంధ భూషిత ఛబి ఛాఈ ॥ 1 ॥
రామహి దేఖి రజాయసు పాఈ । నిజ నిజ భవన చలే సిర నాఈ ॥
ప్రేము ప్రమోదు బినోదు బడాఈ । సమఉ సమాజు మనోహరతాఈ ॥ 2 ॥
కహి న సకహిం సత సారద సేసూ । బేద బిరంచి మహేస గనేసూ ॥
సో మైం కహౌం కవన బిధి బరనీ । భూమినాగు సిర ధరఇ కి ధరనీ ॥ 3 ॥
నృప సబ భాంతి సబహి సనమానీ । కహి మృదు బచన బోలాఈం రానీ ॥
బధూ లరికనీం పర ఘర ఆఈం । రాఖేహు నయన పలక కీ నాఈం ॥ 4 ॥

సౌభాగ్యవతులైన సుందరీమణులు మంగళగీతములను పాడుచుండిరి. ఆ రాత్రియంతయు సుఖసంతోషములతో గడిచెను. ఆచమనానంతరము రాజు, ఆయన పరివారము తాంబూలచర్వణముల గావించిరి. వారు సుగంధపుష్పమాలాలంకృతులైరి. అతిథులు శ్రీరామచంద్రుని తనివిదీర చూచి, నమస్కరించి, సెలవుగైకొని తమ నివాసములకు ఏగిరి. అప్పటి ప్రేమానందములు, వినోదములు, మహత్త్వము, సంపదలు, సౌందర్యములను వర్ణించుటకు వందల కొలది సరస్వతులకుగాని, శేషులకు గాని, వేదములకుగాని, బ్రహ్మమహేశ్వరులకు గాని, శ్రీ గణేశునకు గాని సాధ్యముగాదు- ఇక నేనెట్లు వర్ణింపగలను? ఒక చిన్నపాము సమస్తభూమిభారమును మోయగలదా? అందటిని అన్ని విధముల ఆదరించిన పిదప రాజు తనరాణులను బిల్చి, ఇట్లు చెప్పెను. "వధువులు చిఱుప్రాయముల వారు. పుట్టింటి నుండి వేటే ఇంటికి వచ్చిరి. వారిని కంటికి రెప్పలవలె కాపాడుకొనవలయును." (చౌ॥ 1-4)

దో- లరికా శ్రమిత ఉనీద బస, సయన కరావహు జాఇ ।
అస కహి గే బిశ్రామగృహం, రామ చరన చితు లాఇ ॥ 355 ॥

"బాలురు అలిసిపోయిరి. వారిని నిద్ర ఆవహించు చున్నట్లున్నది. వారిని నిద్రబుచ్చుడు." అని పలికి, రాజు తనశయనాగారమునకు బోయెను. అతడు శ్రీరామునే ధ్యానించు చుండెను. (దో॥ 355)

చౌ- భూప బచన సుని సహజ సుహాఏ । జరిత కనక మని పలంగ డసాఏ ॥
సుభగ సురభి పయ ఫేన సమానా । కోమల కలిత సుపేతీం నానా ॥ 1 ॥
ఉపబరహన బర బరని న జాహీం । స్రగ సుగంధ మనిమందిర మాహీం ॥
రతనదీప సుఠి చారు చందోవా । కహత న బనఇ జాన జెహిం జోవా ॥ 2 ॥
సేజ రుచిర రచి రాము ఉఠాఏ । ప్రేమ సమేత పలంగ పౌఢాఏ ॥
అగ్యా పుని పుని భాఇన్హ దీన్హీ । నిజ నిజ సేజ సయన తిన్హ కీన్హీ ॥ 3 ॥
దేఖి స్యామ మృదు మంజుల గాతా । కహహిం సప్రేమ బచన సబ మాతా ॥
మారగ జాత భయావని భారీ । కెహి బిధి తాత తాడకా మారీ ॥ 4 ॥

సహజ మధురములైన రాజుపలుకులను విని, రాణులు మణిఖచితములైన బంగారు మంచములపై పరుపులను, వాటిపై పాలనురుగువంటి తెల్లనివస్త్రములను, మనోజ్ఞములైన మెత్తలను ఏర్పాటు చేయించిరి.

మణిమయభవనములను పూలమాలలతో, సుగంధద్రవ్యములతో గుబాళింపజేసిరి. రత్నకాంతులదీపములను, వాటిపైగల గుమ్మటములశోభలను వర్ణింపనలవిగాదు. చూచినవారికే వాటిసౌందర్యము గ్రాహ్యమగును. తల్పులు పరుపులను అలంకరింపజేసిరి. శ్రీరాముని శయనింపజేసిరి. రాముని అనుమతితో సోదరులు తమతమపాన్పులపై శయనించిరి. అంతట రాజమాతలు ఆ శ్యామసుందరునితో ఇట్లనిరి. "నాయనా! అత్యంత భయంకరయైన తాటకను త్రోవలో నీవెట్లు చంపితివి? (చౌ॥ 1-4)

దో- ఘోర నిసాచర బికట భట, సమర గనహిఀ నహిఀ కాహు ।
మారే సహిత సహాయ కిమి, ఖల మారీచ సుబాహు ॥ 356 ॥

మారీచసుబాహువులనెడి క్రూరరాక్షసులను, వారి బలములతో పాటు ఎట్లు చంపగలిగితివి? వారు వికట యోధులు, యుద్ధపటిమగలవారు. (దో॥ 356)

చౌ- ముని ప్రసాద బలి తాత తుమ్హారీ । ఈస అనేక కరవరేఀ టారీ ॥
మఖ రఖవారీ కరి దుహుఀ భాఈఀ । గురు ప్రసాద సబ బిద్యా పాఈఀ ॥ 1 ॥
మునితియ తరీ లగత పగ ధూరీ । కీరతి రహీ భువన భరి పూరీ ॥
కమఠ పీఠి పబి కూట కఠోరా । నృప సమాజ మహుఀ సివధను తోరా ॥ 2 ॥
బిస్వ బిజయ జసు జానకి పాఈ । ఆఏ భవన బ్యాహి సబ భాఈ ॥
సకల అమానుష కరమ తుమ్హారే । కేవల కౌసిక కృపాఀ సుధారే ॥ 3 ॥
ఆజు సుఫల జగ జనము హమారా । దేఖి తాత బిధుబదన తుమ్హారా ॥
జే దిన గఏ తుమ్హహి బిను దేఖేఀ । తే బిరంచి జని పారహిఀ లేఖేఀ ॥ 4 ॥

నాయనా! విశ్వామిత్రునికృపవలననే పరమేశ్వరుడు నిన్ను అనేక- ఆపదల నుండి కాపాడెను. ఇది మా పరమవిశ్వాసము. ఆయన ఆశీర్వాదముతో సకల విద్యలను నేర్చి, ఆయాగసంరక్షణము గావించితివి. నీ చరణధూళిసోకగనే అహల్య ముక్తిని పొందెను. నీకీర్తి విశ్వమంతయును వ్యాపించినది. మహాకూర్మము వీపువలె, వజ్రమువలె, పర్వతశిఖరమువలె కఠినాతికఠినమైన శివధనుస్సును పెక్కుమంది రాజులసమక్షమున నిండుసభలో నీవు విరిచితివి. విశ్వవిజేతవని కీర్తిగాంచితివి. జానకిని చేపట్టితివి. సోదరులవివాహములనుగూడ జరిపించి, వారితోగూడి ఇంటికి వచ్చితివి. నీ ఘనకార్యములన్నియును అలౌకికములు. మానవాతీతములు. విశ్వామిత్రునికృపవలననే ఇవి సాధ్యములైనవి. నాయనా! పూర్ణచంద్రునిబోలు నీ ముఖశోభలను జూచి మా జన్మలు ధన్యములైనవని భావించుచున్నాము. నిన్ను చూడని దినములను మాఆయువులో లెక్కింపరాదని విధాతను వేడుకొనుచున్నాము. (చౌ॥ 1-4)

దో- రామ ప్రతోషీఀ మాతు సబ, కహి బినీత బర బైన ।
సుమిరి సంభు గుర బిప్ర పద, కిఏ నీదబస నైన ॥ 357 ॥

శ్రీరాముడు మిక్కిలివినయముతో మధురవచనములను పలికి, తల్లులకు సంతృప్తి గూర్చెను. పరమశివుని, గురుదేవుని, బ్రాహ్మణోత్తముల పాదములను స్మరించుచు నిదురించెను. (దో॥ 357)

చౌ-నీదఉఁ బదన సోహ సుఠి లోనా । మనహుఁ సాఁఝ సరసీరుహ సోనా ॥
ఘర ఘర కరహిఁ జాగరన నారీఁ । దేహిఁ పరసపర మంగల గారీఁ ॥ 1 ॥
పురీ బిరాజతి రాజతి రజనీ । రానీఁ కహహిఁ బిలోకహు సజనీ ॥
సుందర బధున్హ సాసు లై సోఈఁ । ఫనికన్హ జను సిరమని ఉర గోఈఁ ॥ 2 ॥
ప్రాత పునీత కాల ప్రభు జాగే । అరునచూడ బర బోలన లాగే ॥
బంది మాగధన్హి గునగన గాఏ । పురజన ద్వార జోహారన ఆఏ ॥ 3 ॥
బంది బిప్ర సుర గుర పితు మాతా । పాఇ అసీస ముదిత సబ భ్రాతా ॥
జననిన్హ సాదర బదన నిహారే । భూపతి సంగ ద్వార పగు ధారే ॥ 4 ॥

నిద్రలో గూడ శ్రీరామునిముఖము సంధ్యాకాలమున సగము ముకుళించిన ఎఱ్ఱకమలము వలె శోభాయమానముగా ఉండెను. స్త్రీలు ప్రతిగృహమునందును జాగరణలు చేసిరి. వారు పరస్పరసరసాలాపములతో మంగళగీతములతో ఆ రాత్రి గడిపిరి. రాణులు "సఖులారా! ఈ రాత్రి మిక్కిలి మనోహరముగా ఉన్నది. అయోధ్యానగరము శోభాయమానమై విలసిల్లుచున్నది." అని ఒకరితోనొకరు చెప్పుకొనుచుండిరి. సర్పములు తమ శిరములపై గల మణులను హృదయములలో దాచుకొనినట్లు అత్తలు తమ కోడండ్రను చేతులలో పెనవైచుకొని నిద్రించిరి. ప్రాతఃకాలమునందు బ్రాహ్మముహూర్తముననే శ్రీరామచంద్రుడు నిద్రనుండి మేల్కొనెను. కోళ్లు కూయసాగెను. వందిమాగధులు గుణగానము చేసిరి. పౌరులు ఆయనదర్శనమునకై ద్వారముకడ వేచియుండిరి. సోదరులు నలుగురును బ్రాహ్మణులకును, దేవతలకును, గురువులకును, మాతాపితరులకును వందనముల నాచరించి, వారి ఆశీర్వాదములను పొంది ప్రసన్నచిత్తులైరి. ఆసోదరులు తండ్రితోగూడి ప్రజలకు దర్శనమిచ్చుటకై రాజద్వారముకడకువెళ్లుచుండగా తల్లులు మిక్కిలివాత్సల్యముతో వారిముఖములను జూచి, మిగుల సంతసించిరి. (చౌ॥ 1-4)

దో-కీన్హి సౌచ సబ సహజ సుచి, సరిత పునీత నహాఇ ।
ప్రాతక్రియా కరి తాత పహిఁ, ఆఏ చారిఉ భాఇ ॥ 358 ॥

సహజ పవిత్రులైన ఆ సోదరులు కాలకృత్యములను దీర్చుకొని పవిత్ర సరయూనదీ జలములలో స్నానములు చేసిరి. ప్రాతస్సంధ్యావందనమాచరించి, తండ్రి కడకు చేరిరి. (దో॥ 358)

## నవాహ్నిక పారాయణము - మూడవ విరామము

చౌ-భూప బిలోకి లిఏ ఉర లాఈ । బైఠే హరషి రజాయసు పాఈ ॥
దేఖి రాము సబ సభా జుడానీ । లోచన లాభ అవధి అనుమానీ ॥ 1 ॥

పుని బసిష్ఠు ముని కౌసికు ఆఏ। సుభగ ఆసనన్హి ముని బైఠాఏ ॥
సుతన్హ సమేత పూజి పద లాగే। నిరఖి రాము దోఉ గుర అనురాగే ॥ 2 ॥
కహహిం బసిష్ఠు ధరమ ఇతిహాసా। సునహిం మహీసు సహిత రనివాసా ॥
ముని మన అగమ గాధిసుత కరనీ। ముదిత బసిష్ఠ బిపుల బిధి బరనీ ॥ 3 ॥
బోలే బామదేఉ సబ సాఁచీ। కీరతి కలిత లోక తిహుఁ మాచీ ॥
సుని ఆనందు భయఉ సబ కాహూ। రామ లఖన ఉర అధిక ఉఛాహూ ॥ 4 ॥

దశరథుడు వారిని చూడగానే అక్కునజేర్చుకొనెను. ఆయనఅనుజ్ఞతో వారు హర్షితులై సుఖాసీనులైరి. సభాసదులందఱును శ్రీరామచంద్రుని గాంచి, (సురరక్షకుని జూచుచూడ్కులు చూడ్కులు) అని అనుకొనుచు-తమనయనసాఫల్యములను ప్రశంసించుకొనిరి. ఇంతలో వసిష్ఠుడును, విశ్వామిత్రుడును అచటికి చేరిరి. రాజు వారిని సుఖాసీనులను గావించి, తనకుమారులతోపాటు వారికి ప్రణమిల్లెను. గురువులిద్దఱును శ్రీరాముని గాంచి హర్షోల్లసితులైరి. వసిష్ఠుడు ఇతిహాసప్రస్తావనలద్వారా పెక్కు ధర్మోపదేశములను గావించెను. రాజు తనరాణులతోగూడి, వాటిని మిక్కిలి శ్రద్ధగా వినెను. మునులకుగూడ గ్రాహ్యము గాని విశ్వామిత్రుని అద్భుతకృత్యములను వసిష్ఠుడు ఆనందముతో వర్ణించి చెప్పెను. వామదేవుడు పలికెను. "వసిష్ఠుని వచనములు అక్షరసత్యములు. విశ్వామిత్రునికీర్తి ముల్లోకముల యందును వ్యాపించినది." ఈ మాటలు విని, అందఱును ఆనందించిరి. రామలక్ష్మణులు పరమానందభరితులైరి. (చౌ॥ 1-4)

దో- మంగల మోద ఉఛాహ నిత, జాహిఁ దివస ఏహి భాఁతి।
ఉమగీ అవధ అనంద భరి, అధిక అధిక అధికాతి ॥ 359 ॥

ఈ విధముగా ప్రతినిత్యము శుభప్రదములైన సత్కథాప్రస్తావనలతో, మోదప్రమోదములనుగూర్చు ఉత్సవములతో, దినములు గడచుచుండెను. అయోధ్యానగరము అహరహము ఆనందప్రవాహములో దినదినాభివృద్ధిగా మునిగితేలుచుండెను. (దో॥ 359)

చౌ- సుదిన సోధి కల కంకన ఛోరే। మంగల మోద బినోద న థోరే ॥
నిత నవ సుఖు సుర దేఖి సిహాహీఁ। అవధ జన్మ జాచహిఁ బిధి పాహీఁ ॥ 1 ॥
బిస్వామిత్రు చలన నిత చహహీఁ। రామ సప్రేమ బినయ బస రహహీఁ ॥
దిన-దిన సయగున భూపతి భాఊ। దేఖి సరాహ మహామునిరాఊ ॥ 2 ॥
మాగత బిదా రాఉ అనురాగే। సుతన్హ సమేత ఠాఢ భే ఆగే ॥
నాథ సకల సంపదా తుమ్హారీ। మైఁ సేవకు సమేత సుత నారీ ॥ 3 ॥
కరబ సదా లరికన్హ పర ఛోహూ। దరసను దేత రహబ ముని మోహూ ॥
అస కహి రాఉ సహిత సుత రానీ। పరేఉ చరన ముఖ ఆవ న బానీ ॥ 4 ॥

దీన్హి అసీస బిప్ర బహు భాఁతీ। చలే న ప్రీతి రీతి కహి జాతీ ॥
రాము సప్రేమ సంగ సబ భాఈ। ఆయసు పాఇ ఫిరే పహుఁచాఈ ॥ 5 ॥

ఒక శుభముహూర్తమున వధూవరుల-ఉద్వాహదీక్షాకంకణములు విడువబడెను. ఆసమయమున మంగళకరములైన ఆనందోత్సవములు కొనసాగెను. ఉత్సాహభరితములైన ఈ నిత్యనూతన వినోద కార్యక్రమములను గాంచి, దేవతలు ఈర్ష్యపడుచునే ప్రశంసల జల్లులు కురిపించిరి. తాము అయోధ్యలో జన్మించుటకు ఆ విధాతను వారు తహతహపాటుతో అర్థించిరి. విశ్వామిత్రుడు తన ఆశ్రమమునకు వెళ్ళుటకై ప్రతిదినము తొందరపడుచునేయుండెను. కాని శ్రీరాముని వినమ్రప్రార్థనలకు వశుడై నిలబడి పోవుచుండెను. దినదినమునకు ఇనుమడించుచున్న రాజుగారిభక్తివిశ్వాసములకు ఆయన ముగ్ధుడగుచుండెను. ఎట్టకేలకు ఒకనాడు విశ్వామిత్రుని అభ్యర్థనను ఆలకించి, రాజు భక్తి పరవశుడై కుమారులను ముందు నిలిపి యిట్లు పలికెను. "ఓ మునిప్రవరా! ఈ సంపదయంతయు మీదే. నేను, నా భార్యా పుత్రులు మీ సేవకులమే. ఈ బాలురను అనుగ్రహింపుడు. మాకప్పుడప్పుడు మీ దర్శనభాగ్యము కలిగించుచుండుడు" అనంతరము దశరథుడు భార్యాపుత్రులతోగూడి విశ్వామిత్రునకు పాదాభివందనముల నాచరించెను. స్నేహవశమున ఆయన నోట మాటపెగలలేదు. అప్పటి వారి పరస్పర ప్రేమాదరములు వర్ణనాతీతములు. విశ్వామిత్రుడు పెక్కువిధముల వారినాశీర్వదించి, తన ఆశ్రమమునకు వెడలిపోయెను. శ్రీరాముడును, ఆయనసోదరులును కొంతదూరము విశ్వామిత్రుని అనుగమించిరి. ఆయన యాజ్ఞతో వెనుకకు మరలిరి. (చౌ॥ 1-5)

దో- రామ రూపు భూపతి భగతి, బ్యాహు ఉఛాహు అనందు।
జాత సరాహత మనహిఁ మన, ముదిత గాధికులచందు ॥ 360 ॥

గాధివంశచంద్రుడైన విశ్వామిత్రుడు ప్రసన్నచిత్తుడై, శ్రీరాముని అలౌకికరూపమును, దశరథునిభక్తి విశ్వాసములను, నలుగురు సోదరులవివాహమహోత్సవములను, ప్రజల ఆనందోత్సాహములను మనస్సులో కొనియాడుచు వెళ్లెను. (దో॥ 360)

చౌ- బామదేవ రఘుకుల గుర గ్యానీ। బహురి గాధిసుత కథా బఖానీ ॥
సుని ముని సుజసు మనహిఁ మన రాఊ। బరనత ఆపన పున్య ప్రభాఊ ॥ 1 ॥
బహురే లోగ రజాయసు భయఊ। సుతన్హ సమేత నృపతి గృహఁ గయఊ ॥
జహఁ తహఁ రామ బ్యాహు సబు గావా। సుజసు పునీత లోక తిహుఁ ఛావా ॥ 2 ॥
ఆఏ బ్యాహి రాము ఘర జబ తేఁ। బసఇ అనంద అవధ సబ తబ తేఁ ॥
ప్రభు బిబాహఁ జస భయఉ ఉఛాహూ। సకహిఁ న బరని గిరా అహినాహూ ॥ 3 ॥
కబికుల జీవను పావన జానీ। రామ సీయ జసు మంగల ఖానీ ॥
తెహి తే మైఁ కఛు కహా బఖానీ। కరన పునీత హేతు నిజ బానీ ॥ 4 ॥

వామదేవుడు, వసిష్ఠుడు మెుదలగువారు విశ్వామిత్రునికథలను వర్ణించిచెప్పసాగిరి. మునిమాహాత్మ్యములను విని, దశరథుడు తనభాగ్యమును కొనియాడుకొనెను. రాజాజ్ఞతో ప్రజలు తమ ఇండ్లకు చేరిరి. రాజు తనకుమారులతోపాటు అంతఃపురము లోనికేగెను. ప్రజలు ప్రతిప్రదేశమునందును శ్రీరాముని వివాహ గాథను గానము చేయుచుండిరి. ఆయన నిర్మలయశస్సు ముల్లోకములలోను వ్యాపించెను. శ్రీరాముడు సీతాదేవిని పెండ్లియాడి అయోధ్యలో అడుగిడినప్పటినుండియు అచట అన్నివిధముల ఆనందము వెల్లివిరియుచుండెను. సీతారాముల పాణిగ్రహణమహోత్సవవైభవములను వాగ్దేవిగాని, ఆదిశేషుడుగాని, మఱెవ్వరుగాని సమగ్రముగా వర్ణింపజాలరు. కల్యాణపరంపరకు నెలవైన శ్రీసీతారాములకీర్తి కవులజీవితములను ధన్యము గావించునని విశ్వసించి, నా వాణిని పవిత్రమొనర్చుకొనుటకై నేను ఆ గాథలను యథాశక్తి వర్ణించితిని. (చౌ॥ 1-4)

ఛం-నిజ గిరా పావని కరన కారన రామ జసు తులసీఀ కహ్యో ।
రఘుబీర చరిత అపార బారిధి పారు కబి కానేఀ లహ్యో ॥
ఉపబీత బ్యాహ ఉఛాహ మంగల సుని జె సాదర గావహీఀ ।
బైదేహి రామ ప్రసాద తే జన సర్బదా సుఖు పావహీఀ ॥

తన వాణిని పునీతమొనర్చుకొనుటకు తులసీదాసు శ్రీరామచంద్రుని కథను వర్ణించెను. కాని ఆ కథ ఒకఅపారమహావారిధి. దానిని ఎంతటిమహాకవియు దాటలేడు. శ్రీరాముని పవిత్రయజ్ఞోపవీతధారణమును, మంగళప్రదకల్యాణమహోత్సవమును భక్తి శ్రద్ధలతో వినెడివారు, గానము చేసెడివారు శ్రీజానకీరామచంద్రుల అనుగ్రహమునకు పాత్రులై, సుఖ సంపదలలో ఓలలాడుదురు. (ఛం॥)

సో- సియ రఘుబీర బిబాహు, జే సప్రేమ గావహిఀ సునహిఀ ।
తిన్హ కహుఀ సదా ఉఛాహు, మంగలాయతన రామ జసు ॥ 361 ॥

శ్రీ సీతారాములకల్యాణగాథను భక్తిశ్రద్ధలతో గానముచేయువారి, వినువారి, జీవితములు ఎల్లప్పుడును ఉత్సాహభరితములై ధన్యములగును. శ్రీరామచంద్రుని యశోవైభవగానములు శుభ సుఖనిధానములు. (సో॥ 361)

మాసపారాయణము - పన్నెండవ విరామము

ఇతి శ్రీమద్రామచరితమానసే సకలకలికలుషవిధ్వంసనే

ప్రథమః సోపానః సమాప్తః

కలియుగపాపములను నశింపజేయు శ్రీరామచరితమానసమునందలి బాలకాండము

అను ప్రథమ సోపానము సమాప్తము

(బాలకాండము సమాప్తము)

# Kevaṭa Ke Bhāgya



**ati ānaṁda umagi anurāgā, carana saroja pakhārana lāgā.**

శ్రీ గణేశాయ నమః

శ్రీజానకీవల్లభో విజయతే

# శ్రీరామచరితమానసము

## ద్వితీయ సోపానము

# అయోధ్యాకాండము

## భగవన్నుతి

శ్లో॥ యస్యాంకే చ విభాతి భూధరసుతా దేవాపగా మస్తకే
భాలే బాలవిధుర్గలే చ గరలం యస్యోరసి వ్యాలరాట్ ।
సోఽయం భూతివిభూషణః సురవరః సర్వాధిపః సర్వదా
శర్వః సర్వగతః శివః శశినిభః శ్రీశంకరః పాతు మామ్ ॥ 1 ॥

సర్వేశ్వరుడైన శంకరుని వామాంకమున గిరిరాజసుత పార్వతియు, జటాజూటమున గంగా దేవియు, ఫాలమున నెలవంకయు, గళమున గరళము, మెడలో నాగరాజు విలసిల్లుచుందురు. అతడు భస్మవిభూషితుడు. దేవతలలో శ్రేష్ఠుడు. లయకారకుడు. భక్తులపాపములను రూపుమాపువాడు, సర్వవ్యాపకుడు. కల్యాణ ప్రదుడు. చంద్రుని వలె శ్వేత కాంతులతో విరాజిల్లు చుండువాడు. అట్టి పరమేశ్వరుడు సర్వదా నన్ను రక్షించుచుండుగాక. (1)

శ్లో॥ ప్రసన్నతాం యా న గతాభిషేకతస్తథా న మమ్లే వనవాసదుఃఖతః ।
ముఖాంబుజశ్రీ రఘునందనస్య మే సదాస్తు సా మంజులమంగళప్రదా ॥ 2 ॥

రఘువంశమునకు ఆనందప్రదుడైన శ్రీరామచంద్రునియొక్క ముఖకమలశోభ రాజ్యాభిషేక వార్తను విని, పెంపుగనూలేదు, అట్లే వనవాసక్లేశములకు తఱుగనూలేదు. సర్వకాలసర్వావస్థలయందును ఒకేరీతిగావిలసిల్లు ఆయనముఖకాంతులు సర్వదా నాకు శుభములను కూర్చుగాక. (2)

శ్లో॥ నీలాంబుజశ్యామలకోమలాంగం సీతాసమారోపితవామభాగమ్ ।

పాణౌ మహాసాయకచారుచాపం నమామి రామం రఘువంశనాథమ్ ॥ 3 ॥

నీలాంబుజమువలె శ్యామలము, అతికోమలమునైన శరీరముగలవాడును, వామాంకమున సీతాదేవితో శోభిల్లుచుండువాడును, అమోఘములైన ధనుర్బాణములను చేతబట్టిన వాడును అగు రఘువంశ ప్రభువైన శ్రీరామచంద్రునకు నేను నమస్కరించుచున్నాను. (3)

దో-శ్రీగురు చరన సరోజ రజ, నిజ మను ముకురు సుధారి ।

బరనఉఁ రఘుబర బిమల జసు, జో దాయకు ఫల చారి ॥

శ్రీ గురుపాదకమలరేణువులచే నామనోదర్పణమును పవిత్రమొనర్చుకొని, ధర్మార్థ కామమోక్షఫలప్రదాయిని యగు శ్రీరామచంద్రునినిర్మలకీర్తిని వర్ణించుచున్నాను. (దోహా)

## యువరాజ పట్టాభిషేక సంకల్పము

చౌ- జబ తేఁ రాము బ్యాహి ఘర ఆఏ । నిత నవ మంగల మోద బధాఏ ॥

భువన చారిదస భూధర భారీ । సుకృత మేఘ బరషహిఁ సుఖ బారీ ॥ 1 ॥

రిధి సిధి సంపతి నదీఁ సుహాఈ । ఉమగి అవధ అంబుధి కహుఁ ఆఈ ॥

మనిగన పుర నర నారి సుజాతీ । సుచి అమోల సుందర సబ భాఁతీ ॥ 2 ॥

కహి న జాఇ కఛు నగర బిభూతీ । జను ఏతనిఅ బిరంచి కరతూతీ ॥

సబ బిధి సబ పుర లోగ సుఖారీ । రామచంద ముఖ చందు నిహారీ ॥ 3 ॥

ముదిత మాతు సబ సఖీఁ సహేలీ । ఫలిత బిలోకి మనోరథ బేలీ ॥

రామ రూపు గున సీలు సుభాఊ । ప్రముదిత హోఇ దేఖి సుని రాఊ ॥ 4 ॥

శ్రీరామచంద్రుడు వివాహితుడై ఇంటికి చేరినప్పటినుండియు అయోధ్యలో మంగళకరములైన ఆనందోత్సవములు నిత్యనూతనముగా జరుగుచునేయుండెను. పదునాలుగు భువనములనెడిపర్వతములపై పుణ్యములనెడుమేఘములు సుఖసంపదలనెడి జలములను వర్షించుచుండెను. నదీనదములు వేగముగా సాగరమును జేరునట్లు ఋద్ధి సిద్ధులు సంపదలు అయోధ్యను జేరెను. కులీనులైనపురజనులు పవిత్రములైన అనర్ఘరత్నములవలె ప్రకాశించిరి. ఆ నగరవైభవము వర్ణనాతీతము. బ్రహ్మదేవునిసృష్టివైశిష్ట్యమునకు అది పరాకాష్ఠ. అయోధ్యావాసులు శ్రీరామచంద్రునిముఖసౌందర్యశోభలకు ముగ్ధులైరి. రాణులు, వారి సఖులు తమమనోరథలతలు పుష్పఫలములతో వృద్ధిచెందుచుండుట గాంచి ఆనందించిరి. దశరథమహారాజు శ్రీరామచంద్రునిరూపగుణశీలస్వభావములను తాను జూచియు, ఇతరుల నుండి వినియు సంతుష్టాంతరంగుడాయెను. (చౌపాఈ ॥ 1-4)

దో- సబ కేఁ ఉర అభిలాషు అస, కహహిఁ మనాఇ మహేసు ।

ఆప అఛత జుబరాజ పద, రామహి దేఉ నరేసు ॥ 1 ॥

"మహారాజు తన జీవితకాలములోనే శ్రీరాముని యువరాజుగా చేయవలెను" అనెడి ఒక అభిలాష అందఱి హృదయములలో ఉండెను. తమ ఈ ఏకైకమనోరథమును తీర్చుమని వారు పరమశివుని ప్రార్థించుచుండిరి. (దో॥ 1)

చౌ- ఏక సమయ సబ సహిత సమాజా । రాజసభాఁ రఘురాజు బిరాజా ॥
సకల సుకృత మూరతి నరనాహూ । రామ సుజసు సుని అతిహి ఉఛాహూ ॥ 1 ॥
నృప సబ రహహిఁ కృపా అభిలాషేఁ । లోకప కరహిఁ ప్రీతి రుఖ రాఖేఁ ॥
త్రిభువన తీని కాల జగ మాహీఁ । భూరిభాగ దసరథ సమ నాహీఁ ॥ 2 ॥
మంగలమూల రాము సుత జాసూ । జో కఛు కహిఅ థోర సబు తాసూ ॥
రాయఁ సుభాయఁ ముకురు కర లీన్హా । బదను బిలోకి ముకుటు సమ కీన్హా ॥ 3 ॥
శ్రవన సమీప భఏ సిత కేసా । మనహుఁ జరఠపను అస ఉపదేసా ॥
నృప జుబరాజు రామ కహుఁ దేహూ । జీవన జనమ లాహు కిన లేహూ ॥ 4 ॥

ఒకనాడు దశరథమహారాజు తనసభాసదులతో సభయందు విరాజిల్లుచుండెను. సుకృతసద్గుణరాశియగు మహారాజు శ్రీరామచంద్రునిసత్కీర్తిని విని, మిక్కిలి సంబరపడు చుండెను. రాజులందఱు ఆయనఅనుగ్రహమును కోరుకొనుచుండిరి. ఇంద్రాదిదిక్పాలురు ఎల్లరును ఆయనమనోభావములను గ్రహించి, తదనుగుణముగా ఆయన స్నేహమును అభిలషించుచుండిరి. ముల్లోకములలోను త్రికాలములయందును దశరథునివంటి భాగ్యశాలి ఎవ్వరునులేరు. ఆనందప్రదుడైన దశరథరామునిగూర్చి ఎంత చెప్పినను తక్కువయే. ఒక నాడు రాజు అద్దములో తనముఖమును చూచుకొని, కిరీటమునుసరిచేసికొనుచుండెను. చెవుల దగ్గరనున్న తలవెంట్రుకలు తెల్లబడి, ఆయనముసలితనమును గుర్తు చేయుచుండెను. "రాజా! రాముని యువరాజుగా చేసి, నీజన్మను సార్థకమొనర్చుకొనుము." అని అవి సందేశమునిచ్చుచున్నట్లుండెను. (చౌ॥ 1-4)

దో- యహ బిచారు ఉర ఆని నృప, సుదిను సుఅవసరు పాఇ ।
ప్రేమ పులకి తన ముదిత మన, గురహి సునాయఉ జాఇ ॥ 2 ॥

ఈ ఆలోచనను తనమనస్సున నిలుపుకొని, ఒక శుభదినమున శుభసమయమునందు ప్రేమతో పులకితగాత్రుడై, తనకోర్కెను గురువైన వసిష్ఠునకు నివేదించెను. (దో॥ 2)

చౌ- కహఇ భుఆలు సునిఅ మునినాయక । భఏ రామ సబ బిధి సబ లాయక ॥
సేవక సచివ సకల పురబాసీ । జే హమారె అరి మిత్ర ఉదాసీ ॥ 1 ॥
సబహి రాము ప్రియ జేహి బిధి మోహీ । ప్రభు అసీస జను తను ధరి సోహీ ॥
బిప్ర సహిత పరివార గోసాఈఁ । కరహిఁ ఛోహు సబ రౌరిహి నాఈఁ ॥ 2 ॥

జే గుర చరన రేను సిర ధరహీం । తే జను సకల బిభవ బస కరహీం ॥
మొహి సమ యహు అనుభయఉ న దూజేం । సబు పాయఉం రజ పావని పూజేం ॥ 3 ॥
అబ అభిలాషు ఏకు మన మోరేం । పూజిహి నాథ అనుగ్రహ తోరేం ॥
ముని ప్రసన్న లఖి సహజ సనేహూ । కహేఉ నరేస రజాయసు దేహూ ॥ 4 ॥

దశరథుడు ఇట్లు పలికెను. "మునీశ్వరా! రాముడు ఇప్పుడు అన్ని విధముల యోగ్యుడు. అతడు నాకు మిక్కిలి ప్రియతముడు.అట్లే మంత్రులు, పురజనులు, సేవకులు, మిత్రులు, శత్రువులు, ఉదాసీనులు మొదలగువారందఱికిని ప్రియతముడు. మీ ఆశీర్వాదమే రామునిరూపుదాల్చి, శోభిల్లుచున్నది. ప్రభూ! బ్రాహ్మణులందఱును మీవలెనే అతనిపై ప్రేమ జూపుచున్నారు. గురుపాదధూళిని శిరమున ధరించువారికి సమస్తైశ్వర్యములును ప్రాప్తించును. ఈ సత్యము నాకు అనుభవసిద్ధము- మీచరణపవిత్రధూళిని తలదాల్చి నేను అన్నింటిని పొందగలిగితిని. నా మనస్సులో ఒకకోరిక గలదు. ప్రభూ! అదియును మీ అనుగ్రహమువలననే పూర్తియగును." రాజుగారిపుత్రవాత్సల్యమునకును, గురుభక్తికిని రామునిపైగల ప్రేమానురాగములకును ప్రసన్నుడై ముని ఇట్లు పలికెను. "రాజా! నీ అభిలాషను దెలుపుము"- (చౌ॥ 1-4)

దో- రాజన రాఉర నాము జసు, సబ అభిమత దాతార ।
ఫల అనుగామీ మహిప మని, మన అభిలాషు తుమ్హార ॥ 3 ॥

" ఓ రాజశిరోమణీ! మీ పేరుప్రతిష్ఠలే సకలమనోరథసాధకములు. మీ అభిలాషలు మనస్సు నుండి బయటికి ప్రకటింపబడకముందే వాటిని ఫలములు అనుగమించుచున్నవి. (దో॥ 3)

చౌ- సబ బిధి గురు ప్రసన్న జియఁ జానీ । బోలేఉ రాఉ రహఁసి మృదు బానీ ॥
నాథ రాము కరిఅహిం జుబరాజూ । కహిఅ కృపా కరి కరిఅ సమాజూ ॥ 1 ॥
మోహి అఛత యహు హోఇ ఉఛాహూ । లహహిం లోగ సబ లోచన లాహూ ॥
ప్రభు ప్రసాద సివ సబఇ నిబాహీం । యహ లాలసా ఏక మన మాహీం ॥ 2 ॥
పుని న సోచ తను రహఉ కి జాఊ । జెహిం న హోఇ పాఛేం పఛితాఊ ॥
సుని ముని దసరథ బచన సుహాఏ । మంగల మోద మూల మన భాఏ ॥ 3 ॥
సును నృప జాసు బిముఖ పఛితాహీం । జాసు భజన బిను జరని న జాహీం ॥
భయఉ తుమ్హార తనయ సోఇ స్వామీ । రాము పునీత ప్రేమ అనుగామీ ॥ 4 ॥

రాజు తనపై గురువునకుగల ప్రసన్నభావమును గ్రహించి, మృదుమధురముగా ఇట్లనెను. "ప్రభూ! శ్రీరామచంద్రుని యువరాజుగా చేయవలయును. అవసరమైన ఏర్పాట్లు చేయుటకు అనుజ్ఞ ఇయ్యండి. నా జీవితకాలముననే ఈ ఆనందోత్సవము జరుగవలెను. శివుని అనుగ్రహముచే నా కోరికలన్నియు నెరవేరినవి. ఈ ఒక్కకోరిక నా మనస్సులోనే మిగిలి పోయినది. ఇది తీరినచో ఈ శరీరము ఉన్నను పోయినను నాకు చింతలేదు. దీనిని పూర్తిచేయనిచో నేను పశ్చాత్తాపపడవలసి వచ్చును. మంగళకరములైన ఆనందదాయకములైన దశరథునివచనములను విని, వసిష్ఠుడు మిక్కిలి సంతసించి, ఇట్లనెను. "రాజా! వినుము. శ్రీరామునకు

విముఖులైనవారు పశ్చాత్తాపపడెదరు. అతనిని సేవింపనివారి మనస్తాపము చల్లారదు. అట్టి సకలలోకమహేశ్వరుడైన శ్రీరాముడు మీ పవిత్ర ప్రేమానురాగములకు అనుగామియై మీ కుమారునిగా జన్మించినాడు. (చౌ॥ 1-4)

దో- బేగి బిలంబు న కరిఅ నృప, సాజిఅ సబుఇ సమాజు ।
సుదిన సుమంగలు తబహిఀ జబ, రాము హోహిఀ జుబరాజు ॥ 4 ॥

"రాజా! ఆలసింపవద్దు. వెంటనే ఏర్పాట్లు జరిపింపుడు. శ్రీరాముడు యువరాజైనదినమే మంగళకరము. అదే సుదినము"- (దో॥ 4)

చౌ- ముదిత మహీపతి మందిర ఆఏ । సేవక సచివ సుమంత్రు బోలాఏ ॥
కహి జయజీవ సీస తిన్హ నాఏ । భూప సుమంగల బచన సునాఏ ॥ 1 ॥
జౌఀ పాఀచహి మత లాగై నీకా । కరహు హరషి హియఀ రామహి టీకా ॥ 2 ॥
మంత్రీ ముదిత సునత ప్రియ బానీ । అభిమత బిరవఀ పరెఉ జను పానీ ॥
బినతీ సచివ కరహిఀ కర జోరీ । జిఅహు జగతపతి బరిస కరోరీ ॥ 3 ॥
జగ మంగల భల కాజు బిచారా । బేగిఅ నాథ న లాఇఅ బారా ॥
నృపహి మోదు సుని సచివ సుభాషా । బఢత బౌఀడ జను లహీ సుసాఖా ॥ 4 ॥

రాజు ప్రసన్నచిత్తుడై తనప్రాసాదమునకు వచ్చి, సేవకుల ద్వారా సుమంత్రుడు మొదలగు మంత్రులను పిలిపించెను. వారందఱును 'మహారాజునకు జయమగుగాక" అని పలుకుచు వచ్చి, నమస్కరించిరి. రాజు ఆమంత్రులకు ఈ శుభవార్తను దెల్పుచు ఇట్లు పల్కెను." ముఖ్యులైన మీకు సమ్మతమైనచో ఆనందముగా శ్రీరాముని యువరాజుగా చేయుడు." ఈ ప్రియ వచనములను వినగానే మనోరథములనెడి మొక్కలకు వర్షపుజల్లులు పడినట్లు వారు సంతోష పడిరి. వారు చేతులు జోడించి, "ఓ జగత్ప్రభూ! మీరు కలకాలము జీవింతురుగాక" అని వినమ్రముగా పలికిరి. "మీరు లోకకల్యాణదాయకమైన ఉత్తమ కార్యమును తలపెట్టితిరి. ప్రభూ! ఆలసింపక త్వరపడుడు" అనిరి. మంత్రుల మధురవచనములను విని, పెఱుగుచున్న తీగకు చెట్టుకొమ్మపట్టు దొరికినట్లు రాజు మిక్కిలి సంతసించెను. (చౌ॥ 1-4)

దో- కహేఉ భూప మునిరాజ కర, జోఇ జోఇ ఆయసు హోఇ ।
రామ రాజ అభిషేక హిత, బేగి కరహు సోఇ సోఇ ॥ 5 ॥

దశరథుడు మంత్రులను ఆదేశించెను. "శ్రీరామునియువరాజపట్టాభిషేకమునకై మునిశ్రేష్ఠుడైన వసిష్ఠుడు ఇచ్చెడిఆజ్ఞలను అన్నింటిని మీరు వెంటనే ఆచరింపుడు. (దో॥ 5)

చౌ- హరషి మునీస కహేఉ మృదు బానీ । ఆనహు సకల సుతీరథ పానీ ॥
ఔషధ మూల ఫూల ఫల పానా । కహే నామ గని మంగల నానా ॥ 1 ॥
చామర చరమ బసన బహు భాఀతీ । రోమ పాట పట అగనిత జాతీ ॥
మనిగన మంగల బస్తు అనేకా । జో జగ జోగు భూప అభిషేకా ॥ 2 ॥

బేద బిదిత కహి సకల బిధానా । కహెఉ రచహు పుర బిబిధ బితానా ॥
సఫల రసాల పూగఫల కేరా । రోపహు బీథిన్హ పుర చహుఁ ఫేరా ॥ 3 ॥
రచహు మంజు మని చౌకేఁ చారూ । కహహు బనావన బేగి బజారూ ॥
పూజహు గనపతి గుర కులదేవా । సబ బిధి కరహు భూమిసుర సేవా ॥ 4 ॥

అతిహర్షముతో వసిష్ఠుడు "సమస్త తీర్థములనుండి జలములను తీసికొని రండు" అని ఆదేశించెను. పిమ్మట ఆముని పేరుపేరున అందరికిని ఓషధులను, వేర్లను, పూవులను, పండ్లను, పర్ణములను, తాంబూలములను తీసికొని రావలసినదిగా అజ్ఞాపించెను. చామరములు, అజినములు, అనేకవిధములగు వస్త్రములు, ఉన్ని వస్త్రములు, పట్టు బట్టలు, మణులు మున్నగు మంగళ ద్రవ్యములను, ఇంకను రాజ్యాభిషేకమునకు అవసరమగు ఇతర వస్తువులను తెమ్మని ఆదేశించెను. వేదోక్తవిధులను అన్నింటిని దెలిపెను. "నగరమును నానావిధములైన మంగళ తోరణములతో వితానములతో అలంకరింపుడు. ఫల శోభితములైన మామిడి, అరటి, పోక వృక్షములతో వీథులను అలంకరింపుడు. ప్రాంగణములను, అంగళ్లను మనోహరములగు మణులతో అలంకరింపుడు. శ్రీ గణేశుని, గురువులను, కులదేవతలను పూజింపుడు. బ్రాహ్మణులను సేవింపుడు" అని ఆజ్ఞలనిచ్చెను. (చౌ॥ 1-4)

దో- ధ్వజ పతాక తోరన కలస, సజహు తురగ రథ నాగ ।
సిర ధరి మునిబర బచన సబు, నిజ నిజ కాజహిఁ లాగ ॥ 6 ॥

ధ్వజపతాకములను, తోరణములను, కలశములను, గుఱ్ఱములను, రథములను, ఏనుగులను అలంకరింపుడు"- మునీశ్వరుని ఆజ్ఞలను శిరసావహించి, అందఱును తమ తమ విధులలో నిమగ్నులైరి. (దో॥ 6)

చౌ- జో మునీస జేహి ఆయసు దీన్హా । సో తేహిఁ కాజు ప్రథమ జను కీన్హా । ।
బిప్ర సాధు సుర పూజత రాజా । కరత రామ హిత మంగల కాజా ॥ 1 ॥
సునత రామ అభిషేక సుహావా । బాజ గహాగహ అవధ బధావా ॥
రామ సీయ తన సగున జనాఏ । ఫరకహిఁ మంగల అంగ సుహాఏ ॥ 2 ॥
పులకి సప్రేమ పరసపర కహహీఁ । భరత ఆగమను సూచక అహహీఁ ॥
భఏ బహుత దిన అతి అవసేరీ । సగున ప్రతీతి భేంట ప్రియ కేరీ ॥ 3 ॥
భరత సరిస ప్రియ కో జగ మాహీఁ । ఇహఇ సగున ఫలు దూసర నాహీఁ ॥
రామహి బంధు సోచ దిన రాతీ । అండన్హి కమఠ హృదఉ జేహి భాఁతీ ॥ 4 ॥

వసిష్ఠమహర్షిఆజ్ఞలు 'వచ్చియురాకముందే' వారు తమతమ కార్యములను అతి శీఘ్రముగా నెఱవేర్చుచుండిరి. రాజు దేవతలను, సాధువులను, బ్రాహ్మణులను పూజించు చుండెను. శ్రీరామునిక్షేమమునకై వలసినశుభకార్యములను అన్నింటిని పూర్తి చేయించు చుండెను. శ్రీరామచంద్రునియువరాజపట్టాభిషేకవార్త వినగానే అయోధ్యలో జయజయ ధ్వానములు మిన్నంటెను. సీతారాములతనువులపై శుభశకునములు పొడసూపెను. మంగళకరములైన వారిఅంగములు అన్నియును అదరెను. వారు తమలో "ఈ శుభశకునములన్నియును భరతుని ఆగమనమును సూచించుచున్నవి. అతడు తన మేనమామ ఇంటికి వెళ్లి చాలాకాలమాయెను. అతనిని చూచుటకు

మనస్సు ఉవ్విళ్ళూరుచున్నది. ఇట్టి శకునములు ప్రియతముడైన భరతునిరాకను తెలుపుచున్నవి. ఈ జగత్తులో మనకు భరతునికంటె ప్రియమైనవాడు ఎవరు? కావున ఈ శకునములకు అర్థమిదియే." అని భావించిరి. తాబేలు తన గ్రుడ్లను తటమునందుంచి, తాను నీటిలో ఉండి గ్రుడ్లనుగూర్చి చింతన చేయుచు, వాటిని రక్షించుచుండును. అట్లే శ్రీరాముడు రాత్రింబవళ్లు భరతుని గూర్చియే చింతన చేయుచుండెను. (చౌ॥ 1-4)

దో- ఏహి అవసర మంగలు పరమ, సుని రహఁసెఉ రనివాసు ।
సోభత లఖి బిధు బఢత జను, బారిధి బీచి బిలాసు ॥ 7 ॥

ఆ సమయమున ఈ సమాచారమును విని, రాణివాసపు స్త్రీలు చంద్రునివృద్ధిని జూచి సముద్ర తరంగములు పొంగినట్లు అత్యంతానందమును పొందిరి. (దో॥ 7)

చౌ- ప్రథమ జాఇ జిన్హ బచన సునాఏ । భూషన బసన భూరి తిన్హ పాఏ ॥
ప్రేమ పులకి తన మన అనురాగీఁ । మంగల కలస సజన సబ లాగీఁ ॥ 1 ॥
చౌకేఁ చారు సుమిత్రాఁ పూరీ । మనిమయ బిబిధ భాఁతి అతి రూరీ ॥
ఆనంద మగన రామ మహతారీ । దిఏ దాన బహు బిప్ర హఁకారీ ॥ 2 ॥
పూజీఁ గ్రామదేబి సుర నాగా । కహేఉ బహోరి దేన బలిభాగా ॥
జేహి బిధి హోఇ రామ కల్యానూ । దేహు దయా కరి సో బరదానూ ॥ 3 ॥
గావహిఁ మంగల కోకిలబయనీఁ । బిధుబదనీఁ మృగసావకనయనీఁ ॥ 4 ॥

మొదట రాణివాసమునకు వచ్చి, ఈ వార్తను అందజేసినవారికి రాణులు వస్త్రాభరణములను ఘనముగా బహూకరించిరి. రాణులు ప్రేమాతిరేకమున పులకితగాత్రలైరి. వారు మంగళకలశములను అలంకరింపసాగిరి. లక్ష్మణుని తల్లియైన సుమిత్రాదేవి మణులతో మిలమిలలాడుచున్న అనేకరంగవల్లులతో ప్రాంగణములను అతిరమణీయముగా అలంకరింపజేసెను. శ్రీరాముని తల్లియగు కౌసల్యాదేవి ఆనందపరవశయై, బ్రాహ్మణులకు అనేక దానములను ఇచ్చెను. ఆమె గ్రామదేవతలను, ఇతరదేవతలను, నాగులను భక్తితో పూజించి, శ్రీరామునకు శుభములు కల్గుటకై వరములనిమ్మని ప్రార్థించెను. మొక్కుబడులను చెల్లించెను. చంద్రముఖులు, హరిణలోచనలైనస్త్రీలు కోకిలకంఠస్వరములతో గీతములను మధురముగా ఆలపించిరి. (చౌ॥ 1-4)

దో- రామ రాజ అభిషేకు సుని, హియఁ హరషే నర నారి ।
లగే సుమంగల సజన సబ, బిధి అనుకూల బిచారి ॥ 8 ॥

పురజనులందరును శ్రీరామునియువరాజపట్టాభిషేకవార్తను విని "విధాత మనపక్షమున ఉన్నా"డని తలంచి, అత్యంతానందముతో శుభకార్యములను చేయసాగిరి. (దో॥ 8)

చౌ- తబ నరనాహఁ బసిష్ఠు బోలాఏ । రామధామ సిఖ దేన పఠాఏ ॥
గుర ఆగమను సునత రఘునాథా । ద్వార ఆఇ పద నాయఉ మాథా ॥ 1 ॥

సాదర అరఘు దేఇ ఘర ఆనే। సోరహ భాఁతి పూజి సనమానే॥
గహే చరన సియ సహిత బహోరీ। బోలే రాము కమల కర జోరీ॥ 2॥
సేవక సదన స్వామి ఆగమనూ। మంగల మూల అమంగల దమనూ॥
తదపి ఉచిత జను బోలి సప్రీతీ। పఠఇఅ కాజ నాథ అసి నీతీ॥ 3॥
ప్రభుతా తజి ప్రభు కీన్హ సనేహూ। భయఉ పునీత ఆజు యహు గేహూ॥
ఆయసు హోఇ సో కరౌఁ గోసాఈఁ। సేవకు లహఇ స్వామి సేవకాఈఁ॥ 4॥

అపుడు దశరథుడు వసిష్ఠులవారిని పిలిపించి, తగిన ఉపదేశమును ఇచ్చుటకు ఆయనను శ్రీరాముని భవనమునకు పంపెను. గురువుగారిరాకను విని, శ్రీరాముడు ఎదురేగి ఆయన పాదములకు నమస్కరించెను. సాదరముగా అర్ఘ్యపాద్యములనిచ్చి, లోనికి గొనివచ్చి, షోడశోపచారములతో గురుపూజలొనర్చి గౌరవించెను. సీతాదేవితోగూడి పాదాభివందనమొనర్చి, అంజలిఘటించి, శ్రీరాముడు పలికెను. "సేవకుని ఇంటికి ప్రభువు విచ్చేయుటవలన సకల శుభములును చేకూరును. వారిరాక అశుభములను పారద్రోలును. ఐనను ప్రభూ! లోకాచారమునననుసరించి, సేవకుని మీ యొద్దకు రమ్మని ఆదేశింపవలసి యుండెను. ప్రభూ! మీ గురుతర కార్యక్రమములను ప్రక్కనబెట్టి, మీరు స్వయముగా ఇచటికి విచ్చేసి, మీ వాత్సల్యములను ప్రసరింపజేయుటచే ఈ గృహము పునీతమైనది. స్వామీ! మీ ఆజ్ఞలను నేను తలదాల్తును. స్వామిపరిచర్యలలోనే సేవకునకు మేలు చేకూరును". (చౌ॥ 1-4)

దో- సుని సనేహ సానే బచన, ముని రఘుబరహి ప్రసంస।
రామ కస న తుమ్హ కహహు అస, హంస బంస అవతంస॥ 9॥

ప్రేమపూర్ణములైన ఈ వచనములను విని, వసిష్ఠుడు శ్రీరామచంద్రుని మిక్కిలి ప్రశంసించుచు పలికెను. "రామా! సూర్యవంశభూషణుడవైననీవుతప్ప ఇట్టివాక్యములను ఇతరులెవ్వరు పల్కుదురు"? (దో॥ 9)

చౌ- బరని రామ గున సీలు సుభాఊ। బోలే ప్రేమ పులకి మునిరాఊ॥
భూప సజేఉ అభిషేక సమాజూ। చాహత దేన తుమ్హహి జుబరాజూ॥ 1॥
రామ కరహు సబ సంజమ ఆజూ। జౌఁ బిధి కుసల నిబాహై కాజూ॥
గురు సిఖ దేఇ రాయ పహిఁ గయఊ। రామ హృదయఁ అస బిసమఉ భయఊ॥ 2॥
జనమే ఏక సంగ సబ భాఈ। భోజన సయన కేలి లరికాఈ॥
కరనబేధ ఉపబీత బిఆహా। సంగ సంగ సబ భఏ ఉఛాహా॥ 3॥
బిమల బంస యహు అనుచిత ఏకూ। బంధు బిహాఇ బడేహి అభిషేకూ॥
ప్రభు సప్రేమ పఛితాని సుహాఈ। హరఉ భగత మన కై కుటిలాఈ॥ 4॥

వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునిగుణ శీల స్వభావములను వర్ణించి, పులకిత గాత్రుడై ఇట్లు పలికెను. "రామా యువరాజపట్టాభిషేకమునకు ఏర్పాట్లు జరుగుచున్నవి. మహారాజు నిన్ను యువరాజుగాచేయదలచినాడు. కావున రామా! నేడు నీవు ఉపవాసము, హోమములు మొదలగు విధ్యుక్తములైన సంయమనతపోనిష్ఠలను పాటింపుము.

దానివలన విధాత ఈ కార్యమును సఫలమొనర్చును. ఇట్లుపదేశించి, గురువు వసిష్ఠుడు మహారాజుకడకేగెను. ఈ మాటలకు శ్రీరాముడాశ్చర్యచకితుడాయెను. "నేను, నాసోదరులును ఒకేసమయమున జన్మించితిమి. బాల్యమున కలిసి తింటిమి, నిద్రించితిమి, ఆడుకొంటిమి. కర్ణవేధము, ఉపనయనము, వివాహము మున్నగు సంస్కారములన్నియును అందఱికిని ఒకే సమయమున జరిగినవి. సోదరులందఱిని వీడి, పెద్దవానికి ఒక్కనికే యువరాజపట్టాభిషేకము చేయుట నిర్మలమైన ఈ సూర్య వంశమున అనుచితకార్యము అనెడివిచికిత్సకు లోనయ్యెను. తులసీదాసు పలుకుచున్నాడు. శ్రీరామచంద్రునినిర్మలప్రేమపూర్ణములైనమనోభావములు భక్తులమనస్సులలోనికుటిలత్వమును దూరముచేయుగాక. (చౌ॥ 1-4)

దో- తెహి అవసర ఆఏ లఖన, మగన ప్రేమ ఆనంద ।
సనమానే ప్రియ బచన కహి, రఘుకుల కైరవ చంద ॥ 10 ॥

అదేసమయమున ప్రేమానందమగ్నుడైన లక్ష్మణుడచటికి వచ్చెను. రఘుకుల కుముదమును వికసింపజేయుచంద్రుడైన శ్రీరాముడు అతనిని ప్రియవచనములతో ఆదరించెను. (దో॥ 10)

చౌ- బాజహిం బాజనె బిబిధ బిధానా । పుర ప్రమోదు నహిం జాఇ బఖానా ॥
భరత ఆగమను సకల మనావహిం । ఆవహుం బేగి నయన ఫలు పావహిం ॥ 1 ॥
హాట బాట ఘర గలీం అథాఈం । కహహిం పరసపర లోగ లోగాఈం ॥
కాలి లగన భలి కేతిక బారా । పూజిహి బిధి అభిలాషు హమారా ॥ 2 ॥
కనక సింఘాసన సీయ సమేతా । బైఠహిం రాము హోఇ చిత చేతా ॥
సకల కహహిం కబ హోఇహి కాలీ । బిఘన మనావహిం దేవ కుచాలీ ॥ 3 ॥
తిన్హహి సోహాఇ న అవధ బధావా । చోరహి చందిని రాతి న భావా ॥
సారద బోలి బినయ సుర కరహీం । బారహిం బార పాయ లై పరహీం ॥ 4 ॥

వివిధవాద్యఘోష్ఠులు జరుగుచుండెను. అయోధ్యానగరప్రజలహర్షాతిరేకస్థితి వర్ణనాతీతము. అందఱును భరతునిఆగమనమును కాంక్షించుచుండిరి. " భరతుడు శీఘ్రముగా వచ్చి, ఈ యుత్సవమును కనువిందుగా జూచి, సంతసించును". అని యనుకొనుచుండిరి. అంగళ్లలో, వీధులలో, ఇండ్లలో, సందులలో, కూడళ్లలో స్త్రీలు, పురుషులు తమలోతాము ఇట్లు మాట్లాడుకొనుచుండిరి. "దేవుడు మాకోర్కెను నెఱవేర్చునట్టి ఆ సుముహూర్తము రేపు ఎప్పుడు వచ్చును? అప్పుడు స్వర్ణసింహాసనముపై సీతాసమేతుడై శ్రీరామచంద్రుడు విరాజిల్లును. మామనోరథములు ఈడేరును". ఇక్కడ అందఱును 'వేడుకలు ఎప్పుడు జరుగును?' అని పలుకుచుండిరి. అక్కడ (స్వర్గమున) కుత్సితులైన దేవతలు విఘ్నములు కలుగవచ్చునని భావించుచుండిరి. చోరులు వెన్నెలరాత్రులకు ఇష్టపడనట్లు దేవతలు అయోధ్యలోని ఆనందోత్సాహములను జూచి, విచారపడుచుండిరి. దేవతలు సరస్వతీ దేవిని ఆవాహనమొనర్చి, ఆమెకు మాటిమాటికిని పాదాభివందనమొనర్చుచు, వినయముతో ఇట్లు విన్నవించుకొనిరి.

(చౌ॥ 1-4)

## దేవతల పన్నాగము - మంథర దుర్బోధ

దో- బిపతి హమారి బిలోకి బడి, మాతు కరిఅ సోఇ ఆజు ।
రాము జాహిఁ బన రాజు తజి, హోఇ సకల సురకాజు ॥ 11 ॥

"అమ్మా! మా ఆపదను జూచి, శ్రీరామచంద్రుడు రాజ్యమును వీడి, అడవులకు వెళ్లునట్లు చేయుము. దానివలన దేవతలకార్యము సిద్ధించును. (దో॥ 11)

చౌ- సుని సుర బినయ ఠాఢి పఛితాతీ । భఇఉఁ సరోజ బిపిన హిమరాతీ ॥
దేఖి దేవ పుని కహహిఁ నిహోరీ । మాతు తోహి నహిఁ థోరిఉ ఖోరీ ॥ 1 ॥
బిసమయ హరష రహిత రఘురాఊ । తుమ్హ జానహు సబ రామ ప్రభాఊ ॥
జీవ కరమ బస సుఖ దుఖ భాగీ । జాఇఅ అవధ దేవ హిత లాగీ ॥ 2 ॥
బార బార గహి చరన సఁకోచీ । చలీ బిచారి బిబుధ మతి పోచీ ॥
ఊఁచ నివాసు నీచి కరతూతీ । దేఖి న సకహిఁ పరాఇ బిభూతీ ॥ 3 ॥
ఆగిల కాజు బిచారి బహోరీ । కరిహహిఁ చాహ కుసల కబి మోరీ ॥
హరషి హృదయఁ దసరథ పుర ఆఈ । జను గ్రహ దసా దుసహ దుఖదాఈ ॥ 4 ॥

దేవతలప్రార్థనలను విని, సరస్వతీదేవి మౌనమువహించి, "నేను కమలవనమునకు తుషారపాతమును కలిగించు హేమంతరాత్రినైతిని." అని తనలోతాను విచారపడెను. విచార గ్రస్తయైన సరస్వతీదేవిని జూచి, దేవతలు మఱల వినయముతో ప్రార్థించిరి." తల్లీ! ఇందులో మీకు ఏ దోషమూ అంటదు. ఏలనన శ్రీరఘునాథుడు హర్షవిషాదరహితుడు. మీరు రామచంద్రునిప్రభావమును ఎఱుగుదురు. కర్మవశులైనజీవులు సుఖదుఃఖములకు లోనగుదురు. కాని శ్రీరఘునాథుడు జీవుడుకాడు. కావున దేవతలమేలుగోరి మీరు అయోధ్యకుజనుడు". వారు పదేపదే ఆమెపాదములను పట్టుకొని, వేడుకొనిరి. ఆమె సంకోచమునకులోనై ఇట్లు తలపోసెను. "దేవతలు మిగులలఘుబుద్ధులు. వీరి నివాసము గొప్పది. కాని వీరి కృత్యములు అల్పములైనవి. ఇతరులఉన్నతిని జూచి వీరు ఓర్చుకొనలేరు." కాని మఱల యోచనచేసి, వాగ్దేవి ఇట్లు అనుకొనెను. "శ్రీరాముడు అడవికి వెళ్లుటవలన రాక్షస సంహారము జరుగును. కుశలురైన కవులు వన్నావ్హానించెదరు. నేను అందఱి నాల్కలపైజేరి, శ్రీరాముని చరిత్రమును తెలిపెదను. నా ప్రతిష్ఠ ఇనుమడించును." సరస్వతీదేవి ఈ విధముగా భావించి, హర్షముతో అయోధ్యకుజనెను. దుస్సహమైన దుఃఖమునుగూర్చునట్టి ఏదో ఒక గ్రహమువచ్చినట్లాయెను. (చౌ॥ 1-4)

దో- నాము మంథరా మందమతి, చేరీ కైకఇ కేరి ।
అజస పెటారీ తాహి కరి, గఈ గిరా మతి ఫేరి ॥ 12 ॥

భరతుని తల్లియైన కైకేయికడ 'మంథర' అను ఒకమందబుద్ధి దాసిగానుండెను. సరస్వతీదేవి దాని బుద్ధిని వక్రీకరించి, దానిని అపకీర్తిపాలుజేయసంకల్పించెను. (దో॥ 12)

చౌ- దీఖ మంథరా నగరు బనావా । మంజుల మంగల బాజ బధావా ॥
పూఛేసి లోగన్హ కాహ ఉఛాహూ । రామ తిలకు సుని భా ఉర దాహూ ॥ 1 ॥

కరఇ బిచారు కుబుద్ధి కుజాతీ । హోఇ అకాజు కవని బిధి రాతీ ॥
దేఖి లాగి మధు కుటిల కిరాతీ । జిమి గవఁ తకఇ లేఉఁ కెహి భాఁతీ ॥ 2 ॥
భరత మాతు పహిఁ గఇ బిలఖానీ । కా అనమని హసి కహ హఁసి రానీ ॥
ఊతరు దేఇ న లేఇ ఉసాసూ । నారి చరిత కరి ఢారఇ ఆఁసూ ॥ 3 ॥
హఁసి కహ రాని గాలు బడ తోరేఁ । దీన్హ లఖన సిఖ అస మన మోరేఁ ॥
తబహుఁ న బోల చేరి బడి పాపిని । ఛాడఇ స్వాస కారి జను సాఁపిని ॥ 4 ॥

మంథర సుందరమైన నగరాలంకారములను జూచి, మంగళకరవాద్యగోష్ఠులను విని, "విశేషమేమిటి?" అని జనులను అడిగెను. శ్రీరామచంద్రుని 'యువరాజపట్టాభిషేక సమాచారము'నుగూర్చి వినగానే ఆమె హృదయము అసూయతో నిండిపోయెను. ఆ దుర్బుద్ధి మంథర నిమ్నజాతికి చెందిన దాసి. తెల్లవారకముందే ఆ సన్నాహములను నమ్మచేయుట ఎట్లు? అని యోచింపసాగెను. ఒక కుటిలురాలైన భిల్లజాతి స్త్రీ చెట్టుకొమ్మకువ్రేలాడు తేనెపట్టును దక్కించు కొనుటకై ఆరాట పడునట్లు మంథర వగచెను. ఆమె వెక్కి వెక్కి యేడ్చుచు, భరతునితల్లియైన కైకేయికడకు వచ్చెను. "నీ విచారమునకు కారణమేమి?" అని రాణి అడుగగా ఆమె ఏమియు పలుకక ఒక పెద్దనిట్టూర్పు వదలెను. స్త్రీలకు సహజమైనరీతిలో ఆమె కన్నీటిని బొటబొటగార్చెను. కైకేయి నవ్వుచు అనెను. "నీవు వదరుబోతువు. లక్ష్మణుడు నీకేదో గుణపాఠము చెప్పినాడని నా నమ్మకము." వినను ఆ దుష్టురాలు ఏమియు పలుకలేదు. ఒక ఆడుత్రాచు బుసకొట్టుచున్నట్లు దీర్ఘ నిఃశ్వాసములను మాత్రము విడుచుచుండెను. (చౌ॥ 1-4)

దో- సభయ రాని కహ కహసి కిన, కుసల రాము మహిపాలు ।
లఖను భరతు రిపుదమను సుని, భా కుబరీ ఉర సాలు ॥ 13 ॥

అప్పుడు రాణి భయపడి పలికెను. "ఓసీ! నీవు మాట్లాడవేమి? శ్రీరాముడు, రాజుగారు, లక్ష్మణ భరత శత్రుఘ్నులు కుశలమే గదా!" ఈ మాటలు వినగానే ఆ గూనిదాసిహృదయము పరితపించెను. (దో॥ 13)

చౌ- కత సిఖ దేఇ హమహి కోఉ మాఈ । గాలు కరబ కెహి కర బలు పాఈ ॥
రామహి ఛాడి కుసల కెహి ఆజూ । జేహి జనేసు దేఇ జుబరాజూ ॥ 1 ॥
భయఉ కౌసిలహి బిధి అతి దాహిన । దేఖత గరబ రహత ఉర నాహిన ॥
దేఖహు కస న జాఇ సబ సోభా । జో అవలోకి మోర మను ఛోభా ॥ 2 ॥
పూతు బిదేస న సోచు తుమ్హారేఁ । జానతి హహు బస నాహు హమారేఁ ॥
నీద బహుత ప్రియ సేజ తురాఈ । లఖహు న భూప కపట చతురాఈ ॥ 3 ॥
సుని ప్రియ బచన మలిన మను జానీ । ఝుకీ రాని అబ రహు అరగానీ ॥
పుని అస కబహుఁ కహసి ఘరఫోరీ । తబ ధరి జీభ కఢావఉఁ తోరీ ॥ 4 ॥

ఆ దాసి పలికెను. "అమ్మా! ఎవరెందుకు నాకు గుణపాఠము నేర్పాలి? నేను ఎవరికి ఎందుకు బెదరవలెను? యువరాజపదవిని పొందుచున్నరాముడుతప్ప నేడు ఎవరు సంతోషముతోనున్నారు? దేవుడిప్పుడు, కౌసల్యకు చాల అనుకూలుడు? ఆమె గర్వమునకు అవధియే లేకున్నది. నీవే నగరశోభను స్వయముగా ఏల తిలకింపవు? దానిని జూచి నా మనస్సు మిక్కిలి క్షోభపడుచున్నది. నీకుమారుడు దేశాంతరమున నున్నాడు. నీకావిషయమై ఏ మాత్రము

ధ్యాసయే లేదు. నీభర్త నీవశములోనేయున్నట్లు భ్రమపడుచున్నావు. మెత్తనిపట్టుపుమీద పండుకొని నిద్రించుటయే నీకు మంచిదిగా తోచును, నీభర్త ఎంతటి కపటియో, చతురుడో నీ వెరుగవు." మంథర యొక్క ఇచ్చకపుమాటలు విని, ఆమెమనస్సులోని కల్మషమును గ్రహించి, కైకేయి ఆమెను మందలించుచు ఇట్లనెను. "చాలించు. నీ అధికప్రసంగము. కుటుంబమున తగవులు పెట్టుటలో నీకు నీవే సాటి. మఱల ఇట్లు మాట్లాడినచో నీ నాల్కను చీలికలు చేసెదను. (చౌ॥ 1-4)

దో- కానే ఖోరే కూబరే, కుటిల కుచాలీ జాని ।
తియ బిసేషి పుని చేరి కహి, భరతమాతు ముసుకాని ॥ 14 ॥

'ఒంటి కంటివాడు, కుంటివాడు, గూనివాడు' వీరు దుష్టులు. అందునా దాసీలైతే ఇంకా దుష్టురాండ్రు." ఇట్లు చెప్పి, భరతునితల్లి నవ్వెను. (దో॥ 14)

చౌ- ప్రియబాదిని సిఖ దీన్హిఉఁ తోహీ । సపనేహుఁ తో పర కోపు న మోహీ ॥
సుదిను సుమంగల దాయకు సోఈ । తోర కహా ఫుర జేహి దిన హోఈ ॥ 1 ॥
జేఠ స్వామి సేవక లఘు భాఈ । యహ దినకర కుల రీతి సుహాఈ ॥
రామ తిలకు జౌఁ సాఁచెహుఁ కాలీ । దేఉఁ మాగు మన భావత ఆలీ ॥ 2 ॥
కౌసల్యా సమ సబ మహతారీ । రామహి సహజ సుభాయఁ పిఆరీ ॥
మో పర కరహిఁ సనేహు బిసేషీ । మైఁ కరి ప్రీతి పరీఛా దేఖీ ॥ 3 ॥
జౌఁ బిధి జనము దేఇ కరి ఛోహూ । హోహుఁ రామ సియ పూత పుతోహూ ॥
ప్రాన తేఁ అధిక రాము ప్రియ మోరేఁ । తిన్హ కేఁ తిలక ఛోభు కస తోరేఁ ॥ 4 ॥

"ఓ ప్రియంవద మంథరా! ఇదియంతయు నీమేలు కోరియే చెప్పినాను. నీ మీద నాకు స్వప్నములోగూడ కోపము ఉండదు. నీవు చెప్పిన విషయము (రామపట్టాభిషేకవిషయము) ఎప్పుడు సత్యమగునో అదియే శుభదినము. సోదరులలో పెద్దవాడు రాజ్యమునకు ప్రభువగుటయు, చిన్నవాడు సేవకుడు అగుటయు సూర్యవంశపు ఆచారము. శ్రీరాముడు రేపు యువరాజు ఐనచో నీ మనస్సున ఏ కోరికయున్నను నన్నడుగుము. నేను సంతోషముగా తీర్చెదను. కౌసల్యనువలె మమ్ములను అందఱిని అతడు ప్రేమాదరములతో సమానముగా గౌరవించును. అది ఆయనకు సహజస్వభావము. అతడు నన్ను అందఱికంటెను అత్యంత ప్రేమతో చూచును. ఆయనకు నామీదగల ప్రేమను నేను చాలాసార్లు పరీక్షించియుంటిని. విధాత నన్ను చల్లగా జూచి, మఱల నాకు మానవజన్మను ప్రసాదించినచో నాకు శ్రీరాముడు కుమారుడూ, సీత కోడలూ కావలెను. శ్రీరాముడు నాకు ప్రాణములకంటెను ఎక్కువ ప్రీతిపాత్రుడు. అతని రాజ్యాభిషేకోత్సవము నిన్ను ఎందులకు క్షోభపెట్టుచున్నది? (చౌ॥ 1-4)

దో- భరత సపథ తోహి సత్య కహు, పరిహరి కపట దురాఉ ।
హరష సమయ బిసమఉ కరసి, కారన మోహి సునాఉ ॥ 15 ॥

భరతునిమీద ఒట్టు. నీవు నీకపటప్రవర్తనను మాని, నిజము చెప్పుము. సంతోష పడవలసిన సమయమున దుఃఖించుటకుగల కారణమేమి? (దో॥ 15)

చౌ- ఏకహిఁ బార ఆస సబ పూజీ । అబ కఛు కహబ జీభ కరి దూజీ ॥
ఫోరై జోగు కపారు అభాగా । భలేఉ కహత దుఖ రఉరేహి లాగా ॥ 1 ॥
కహహిఁ ఝూఠి ఫురి బాత బనాఈ । తే ప్రియ తుమ్హహి కరుఇ మైఁ మాఈ ॥
హమహుఁ కహబి అబ ఠకురసోహాతీ । నాహిఁ త మౌన రహబ దిను రాతీ ॥ 2 ॥
కరి కురూప బిధి పరబస కీన్హా । బవా సో లునిఅ లహిఅ జో దీన్హా ॥
కోఉ నృప హోఉ హమహి కా హానీ । చేరి ఛాడి అబ హోబ కి రానీ ॥ 3 ॥
జారై జోగు సుభాఉ హమారా । అనభల దేఖి న జాఇ తుమ్హారా ॥
తాతేఁ కఛుక బాత అనుసారీ । ఛమిఅ దేబి బడి చూక హమారీ ॥ 4 ॥

మంథర పలికెను. "నా ఆశలన్నియు ఒకేసారి పూర్తియైనవి. నేను చెప్పవలసిన మాటలు ఏవైనను మిగిలియున్నచో వాటిని మఱియొక నాలుకతో చెప్పవలెను. నా దౌర్భాగ్యమైన తలను పగులగొట్ట వలెను. మీకు మంచి మాటలు చెప్పినను అవి దుఃఖమునే కలిగించుచున్నవి. అమ్మా! నిజమును కప్పిపుచ్చి మాట్లాడెడి వాళ్లే మీకు ఇష్టులు. నేను చెప్పినది మీకు నచ్చదు. నేటి నుండి నేనుగూడ మీకడ ఇచ్చకపుమాటలనే పలికెదను. లేనిచో మౌనముగనే యుండెదను. బ్రహ్మ నన్ను 'కురూపి'గా సృష్టించి, పరాధీనమగా జేసినాడు. ఇందు ఇతరులదోషము ఏ మాత్రము లేదు. "చేసికొన్న వారికి చేసికొన్నంత మహాదేవ!" నా కర్మను నేను అనుభవింపవలసినదే. ఎవరు యువరాజైన నాకేమి? నేను దాసినిగాక రాణిని కాగలనా? శ్రీరాముడు యువరాజైనచో నీవు కౌసల్యాదేవికి దాసివే అగుదువు. రాణిగా ఉందువా? నా స్వభావము కాల్చదగినది. నీకు కలుగబోవు హానిని నేను చూడజాలను. అందులకే ఒకటి రెండు మాటలను పలికితిని. నన్ను క్షమింపుము. నాది పొరపాటే" (చౌ॥ 1-4)

దో- గూఢ కపట ప్రియ బచన సుని, తీయ అధరబుధి రాని ।
సురమాయా బస బైరినిహి, సుహృద జాని పతిఆని ॥ 16 ॥

కపటముతో నిండిన 'ఈ తీయని మాటలను విని, నిలకడలేనిబుద్ధిగల కైకేయి, దేవతల మాయకు వశమై శత్రువైన మంథరను స్నేహితురాలుగా విశ్వసించెను. (దో॥ 16)

చౌ- సాదర పుని పుని పూఁఛతి ఓహీ । సబరీ గాన మృగీ జను మోహీ ॥
తసి మతి ఫిరీ అహఇ జసి భాబీ । రహసీ చేరి ఘాత జను ఫాబీ ॥ 1 ॥
తుమ్హ పూఁఛహు మైఁ కహత డెరాఊఁ । ధరెహు మోర ఘరఫోరీ నాఊఁ ॥
సజి ప్రతీతి బహుబిధి గఢి ఛోలీ । అవధ సాఢసాతీ తబ బోలీ ॥ 2 ॥
ప్రియ సియ రాము కహా తుమ్హ రానీ । రామహి తుమ్హ ప్రియ సో ఫురి బానీ ॥
రహా ప్రథమ అబ తే దిన బీతే । సముఉ ఫిరేఁ రిపు హోహిఁ పిరీతే ॥ 3 ॥
భాను కమల కుల పోషనిహారా । బిను జల జారి కరఇ సోఇ ఛారా ॥
జరి తుమ్హారి చహ సవతి ఉఖారీ । రూఁధహు కరి ఉపాఉ బర బారీ ॥ 4 ॥

కైకేయి మఱీ మఱీ ప్రేమతో అడిగెను. బిల్ల స్త్రీ పాటకు జింకవలె ఆమె మంథర యొక్క మచ్చు మాటలకు ముగ్ధురాలయ్యెను. విధి వైపరీత్యమున ఆమె బుద్ధి మాఱిపోయెను. దాసి తన పాచిక పాఱినదని లోలోన సంతసించెను. "నీవు అడుగుచున్నను చెప్పుటకు నాకు భయముగు చున్నది. ఏలనన ఇంతకు ముందు నీవు నన్ను కుటుంబనాశినివి అని, యుంటివి" ఈ విధముగా అనేకరీతుల తియ్యనిమాటలతో అయోధ్యపాలిటిశనియైనమంథర ఆమెవిశ్వాసమును చూరగొనెను. "రాణీ! సీతారాములు నీకు అత్యంతప్రియులని చెప్పియుంటివి. నీవనిన రామునకును ఇష్టమే. ఇది సత్యము. కాని ఆ దినములు గడిచిపోయినవి. కాలము మాఱినచో మిత్రులుగూడ శత్రువులే యయ్యెదరు. కమలములు నీటిలోనున్నప్పుడే సూర్యుడు వాటిని పోషించును. నీటి నుండి బయటపడినప్పుడు ఆ కమలములే సూర్యకిరణముల వేడికి భస్మమగును.(1)

నీ సవతి కౌసల్య నిన్ను సమూలముగ నాశనము చేయదలచినది. కావున బాగుగాఆలోచించి, ఆమెమార్గమునకు అవరోధములను కలిగించి నిన్ను నీవు రక్షించు కొనుము. (చౌ॥ 1-4)

**దో- తుమ్హహి న సోచు సోహాగ బల, నిజ బస జానహు రాఉ।**
**మన మలీన ముహ మీఠ నృపు, రాఉర సరల సుభాఉ ॥ 17 ॥**

నీభర్తప్రేమలోమునిగి, ఆయనతీయనిమాటలను నమ్మెదవు. నీవు మిక్కిలి అమాయికురాలవు. రాజు నీ వశుడని భావించుచున్నావు. ఆయనమనసంతయు విషమే. మాటలు మాత్రమే తియ్యనివి. (దో॥ 17)

చౌ- చతుర గంభీర రామ మహతారీ । బీచు పాఇ నిజ బాత సంవారీ ॥
పఠఏ భరతు భూప ననిఅఉరేం । రామ మాతు మత జానబ రఉరేం ॥ 1 ॥
సేవహిం సకల సవతి మోహి నీకేం । గరబిత భరతమాతు బల పీ కేం ॥
సాలు తుమ్హార కౌసిలహి మాఈ । కపట చతుర నహిం హోఇ జనాఈ ॥ 2 ॥
రాజహి తుమ్హ పర ప్రేము బిసేషీ । సవతి సుభాఉ సకఇ నహిం దేఖీ ॥
రచి ప్రపంచు భూపహి అపనాఈ । రామతిలక హిత లగన ధరాఈ ॥ 3 ॥
యహ కుల ఉచిత రామ కహుం టీకా । సబహి సోహాఇ మోహి సుఠి నీకా ॥
ఆగిలి బాత సముఝి డరు మోహీ। దేఉ దైఉ ఫిరి సో ఫలు ఓహీ ॥ 4 ॥

రామునితల్లి కౌసల్య చతురురాలు. ఆమెమనస్సులోతులు నీ వెఱుగవు. ఆమె ప్రతి- అవకాశమును తనకు అనుకూలముగా మలచుకొనును. రామునితల్లి సూచనను పాటించి, రాజుగారు భరతుని ఆయన అమ్మమ్మగారింటికి పంపెను. "రాణులందఱును తనకు సేవలు చేయుదురనియు, నీవు మాత్రము చేయవనియు, రాజుగారికి నీయందే అనురాగము మెండుగావున నీవు గర్వితమతివనియు, కౌసల్యాదేవి భావించును. అమ్మా నీవు కౌసల్యకు ప్రక్కలో

1 కమలములు నీటబాసిన, కమలాప్తునిరశ్మి సోకి, కమలిన భంగిన్,
తమ తమనెలవులు దప్పిన, తమ మిత్రులె శత్రులౌట తథ్యము సుమతీ!

బల్లెమువంటిదానవు. కాని ఆమె మిక్కిలిజాణ. బయటికి ఆమె తనమనోభావములను తెలియనీయదు. రాజుగారికి నీమీదగలప్రేమను జూచి, సవతులకు అసూయ. కావున రాజుగారిని లోబఱచుకొనుటకై రామునియువరాజపట్టాభిషేకమునకు శుభముహూర్తమును నిర్ణయింపజేసినది. వంశాచారముననుసరించి శ్రీరాముడు యువరాజగుట సమంజసమే. అందఱును దీనికి సమ్మతించెదరు. నాకుగూడ ఇష్టమే. కాని రాబోవు ఫలితములను ఊహించి చూడగా నాకు భయమగుచున్నది. దైవము దీనిప్రభావమును విపరీతమొనర్చి, ఆ దుష్ఫలితములను కౌసల్యయే అనుభవించునట్లు చేయుగాక." (చౌ॥ 1-4)

దో- రచి పచి కోటిక కుటిలపన, కీన్హెసి కపట ప్రబోధు ।
కహెసి కథా సత సవతి కై, జెహి బిధి బాఢ బిరోధు ॥ 18 ॥

ఈ విధముగా మంథర పెక్కు కపటకుటిలవచనములను పలికెను. సవతుల గాథలను పెక్కు చెప్పి, కైకేయి మనస్సును మార్చి వేసెను. (దో॥ 18)

చౌ- భావీ బస ప్రతీతి ఉర ఆఈ । పూఁఛ రాని పుని సపథ దేవాఈ ॥
కా పూఁఛహు తుమ్హ అబహుఁ న జానా । నిజ హిత అనహిత పసు పహిచానా ॥ 1 ॥
భయఉ పాఖు దిన సజత సమాజా । తుమ్హ పాఈ సుధి మొహి సన ఆజా ॥
ఖాఇఅ పహిరిఅ రాజ తుమ్హారేఁ । సత్య కహేఁ నహిఁ దోషు హమారేఁ ॥ 2 ॥
జౌఁ అసత్య కఛు కహబ బనాఈ । తౌ బిధి దేఇహి హమహి సజాఈ ॥
రామహి తిలక కాలి జౌఁ భయఊ । తుమ్హ కహుఁ బిపతి బీజు బిధి బయఊ ॥ 3 ॥
రేఖ ఖఁచాఇ కహఉఁ బలు భాషీ । భామిని భఇహు దూధ కఇ మాఖీ ॥
జౌఁ సుత సహిత కరహు సెవకాఈ । తౌ ఘర రహహు న ఆన ఉపాఈ ॥ 4 ॥

విధివైపరీత్యమున కైకేయికి మంథరపై పూర్తివిశ్వాసము కుదురుకొనెను. ఆమె ఒట్టు పెట్టుకొని, మఱల అడిగెను. అప్పుడు మంథర ఇట్లు పలికెను. "ఇంకను తెలుపవలసినదేమున్నది? ఇప్పటికిని నీకు అవగతము కాకపోవుట ఆశ్చర్యకరము. జంతువులుసైతము తమ మంచి చెడ్డలను గుర్తింప గలవు. పదునైదు దినముల నుండియు ఏర్పాట్లు జరుగుచునే యున్నవి. నీకు ఈ సమాచారము నేడు నాద్వారా తెలిసినదా? ఆశ్చర్యము! నేను నీ ఉప్పు, పులుసు తినుచున్నందున నిజము పలుకుచున్నాను. కల్లబొల్లి మాటలను చెప్పుచున్నచో, దేవుడు నాకు శిక్ష విధించును. రాముడు రేపు యువరాజ్యాభిషిక్తుడైనచో ఆ మఱుక్షణమునుండియే నీకు కష్టములు ప్రారంభమగునని తెలిసికొనుము. అమ్మా! నేను నూటికి నూఱు పాళ్లు గట్టిగా ఒట్టు పెట్టుకొని చెప్పుచున్నాను. నిన్ను పాలలోని ఈగను వలె అందఱును తీసివేయుదురు. నీవు నీ కొడుకుతోగూడ కౌసల్యకు సేవలు చేసినచోమాత్రమే ఈ ఇంటిలో నిలువగలవు. వేఱు ఉపాయము లేదు. (చౌ॥ 1-4)

దో- కద్రూఁ బినతహి దీన్హ దుఖు, తుమ్హహి కౌసిలాఁ దేబ ।
భరతు బందిగృహ సేఇహహిఁ, లఖను రామ కే నేబ ॥ 19 ॥

కశ్యపుని భార్యయైన కద్రువ తన సవతియైన 'వినత'ను కష్టపెట్టినట్లు కౌసల్య నిన్ను కష్టాలపాలుచేయును. భరతుడు చెరసాలపాలగును. లక్ష్మణుడు రామునకు అంతరంగికు డగును." (దో॥ 19)

చౌ- కైకయసుతా సునత కటు బానీ । కహి న సకఇ కఛు సహమి సుఖానీ ॥
తన పసేఉ కదలీ జిమి కాఁపీ । కుబరీఁ దసన జీభ తబ చాఁపీ ॥ 1 ॥
కహి కహి కోటిక కపట కహానీ । ధీరజు ధరహు ప్రబోధిసి రానీ ॥
ఫిరా కరము ప్రియ లాగి కుచాలీ । బకిహి సరాహఇ మాని మరాలీ ॥ 2 ॥
సును మంథరా బాత ఫురి తోరీ । దహిని ఆఁఖి నిత ఫరకఇ మోరీ ॥
దిన ప్రతి దేఖఉఁ రాతి కుసపనే । కహఉఁ న తోహి మోహ బస అపనే ॥ 3 ॥
కాహ కరౌఁ సఖి సూధ సుభాఊ । దాహిన బామ న జానఉఁ కాఊ ॥

మంథర పలికినచేదుమాటలను వినగానే కైకేయిముఖము భీతితో వాడిపోయెను. ఆమె నోట మాటరాలేదు. చెమటకు శరీరము తడిసెను. ఆమె ఎండినఅరటిఆకువలె వణకెను. అప్పుడు ఆ గూనిదాసి నాలుకకొఱుకు కొనెను. (కైకేయి గుండె ఆగిపోయినచో తన పన్నాగము చెల్లదని ఆమెకు భయము వేసెను) తరువాత కపటముముతో నిండిన పెక్కు ఉదంతములతో ఆమె రాణిని అనునయించెను. ధైర్యము వహింపుమనెను. కల్లబొల్లి మాటలతో ఆమె మనస్సును గట్టి పఱచెను. విధి వైపరీత్యమువలన కైకేయి మాఱిపోయెను. ఆమెకు మంథర తన హితైషిణిగా తోచెను. కొంగవంటిమంథరను హంసగా భావించి, ఆమెను ప్రశంసించెను. కైకేయి ఇట్లు పలికెను. "మంథరా! వినుము. నీవు చెప్పునదియొంతయు సత్యము. నాకుడికన్నుగూడ ప్రతిదినము అదఱుచున్నది. తఱచు నాకు చెడ్డకలలు వచ్చుచున్నవి. తెలివితక్కువదాననై వాటిని నీకు చెప్పలేదు. అమాయకురాలను. మంచి చెడులను గమనింపలేక పోయితిని. (చౌ॥ 1-4)

దో- అపనేఁ చలత న ఆజు లగి, అనభల కాహుక కీన్హ ।
కేహిఁ అఘ ఏకహి బార మొహి, దైఅఁ దుసహ దుఖు దీన్హ ॥ 20 ॥

నేను ఇంత వఱకు ఎవ్వరికిని బుద్ధి పూర్వకముగా అపకారము చేసియుండలేదు. విధి ఈ దుఃస్థితిని నాకు ఎందుకు తెచ్చిపెట్టుచున్నాడో తెలియకున్నది. (దో॥ 20)

చౌ- నైహర జనము భరబ బరు జాఈ । జిఅత న కరబి సవతి సెవకాఈ ॥
అరి బస దైఉ జిఆవత జాహీ । మరను నీక తెహి జీవన చాహీ ॥ 1 ॥
దీన బచన కహ బహుబిధి రానీ । సుని కుబరీఁ తియమాయా ఠానీ ॥
అస కస కహహు మాని మన ఊనా । సుఖు సోహాగు తుమ్హ కహుఁ దిన దూనా ॥ 2 ॥
జెహిఁ రాఉర అతి అనభల తాకా । సోఇ పాఇహి యహు ఫలు పరిపాకా ॥
జబ తేఁ కుమత సునా మైఁ స్వామిని । భూఖ న బాసర నీఁద న జామిని ॥ 3 ॥
పూఁఛెఉఁ గునిన్హ రేఖ తిన్హ ఖాఁచీ । భరత భుఆల హోహిఁ యహ సాఁచీ ॥
భామిని కరహు త కహౌఁ ఉపాఊ । హై తుమ్హరీఁ సేవా బస రాఊ ॥ 4 ॥

నేను నా పుట్టింటికి వెళ్లి, నా శేషజీవితమును అచటనే గడిపెదను. కాని బ్రతికియున్నంత వఱకు నేను సవతి సేవలుమాత్రము చేయను. బానిసగా పరులవశములో ఉండుటకంటెను చావే నయము." ఈ విధముగా రాణి అనేకదీనవచనములను పలుకగా ఆ కుబ్జ తన కపటమును ఇంకను బలము చేసెను. "అమ్మా! నిన్ను నీవు హీనపఱచుకొనవలదు. నీ దాంపత్య సుఖజీవితము రెండింతలుగా సాగును. నీకు కీడుతలపెట్టినవారు దానిఫలితమును తప్పక అనుభవింతురు. అమ్మా! ఈ దుర్వార్త విన్నక్షణమునుండియు నాకు అన్నమే సయించుట లేదు. రాత్రులయందు నిద్రపట్టుట లేదు. నేను జోస్యులను అడుగగా వారు "భరతుడు రాజగుట తథ్యము" అని గట్టిగా చెప్పినారు. అమ్మా! నీవు చేయుదునన్నచో నేనొక ఉపాయమును చెప్పెదను. రాజు నీ వశమునందే యున్నాడు."

(చౌ॥ 1-4)

**దో- పరఉఁ కూప తుఅ బచన పర, సకఉఁ పూత పతి త్యాగి ।**
**కహసి మోర దుఖు దేఖి బడ, కస న కరబ హిత లాగి ॥ 21 ॥**

కైక పలికెను. "నీవు బావిలో దూకుమన్నచో దూకుటకైనను నేను సిద్ధము. అవసరమగుచో నా పుత్రుని, భర్తను గూడ త్యజింతును. నీవు నా దుఃఖమును తొలగించు మార్గమును చూపినచో నా మేలుకొఱకు నేనెందుకు చేయను?"

(దో॥ 21)

**చౌ- కుబరీఁ కరి కబులీ కైకేఈ । కపట ఛురీ ఉర పాహన టేఈ ॥**
**లఖఇ న రాని నికట దుఖు కైసేఁ । చరఇ హరిత తిన బలిపసు జైసేఁ ॥ 1 ॥**
**సునత బాత మృదు అంత కఠోరీ । దేతి మనహుఁ మధు మాహుర ఘోరీ ॥**
**కహఇ చేరి సుధి అహఇ కి నాహీఁ । స్వామిని కహిహు కథా మోహి పాహీఁ ॥ 2 ॥**
**దుఇ బరదాన భూప సన థాతీ । మాగహు ఆజు జుడావహు ఛాతీ ॥**
**సుతహి రాజు రామహి బనబాసూ । దేహు లేహు సబ సవతి హులాసూ ॥ 3 ॥**
**భూపతి రామ సపథ జబ కరఈ । తబ మాగేహు జేహిఁ బచను న టరఈ ॥**
**హోఇ అకాజు ఆజు నిసి బీతేఁ । బచను మోర ప్రియ మానేహు జీ తేఁ ॥ 4 ॥**

ఇట్లు ఆ గూనిమంథర కైకేయిని వశపఱచుకొని, అనగా ఆమెను బలిపశువుమగా జేసి, కపటమనెడికత్తికి తనహృదయమనెడిరాతిపై పదును పెట్టెను. బలిపశువు తనకు రాబోవు ఆపదలను గుర్తింపక గడ్డిని మేసినట్లు కైకేయి తనకు ప్రాప్తింపబోవు కళంకమును, వైధవ్యమును గుర్తింపలేక ఆ గూనిదాసిమాటలకు చెవియొగ్గెను. మంథరమాటలు ప్రస్తుతము తియ్యగానున్నను కడకు విషతుల్యములేయగును. ఆమె తేనెలో విషమునుకలిపి త్రాగించెను. ఆ దాసి ఇట్లు పలికెను. "అమ్మా! నీవు లోగడ నాకొక కథ చెప్పి యుంటివి. జ్ఞాపకమున్నదా? ఒకసారి రాజుగారు నీకు రెండువరములను ఇచ్చుటకు వాగ్దానము చేసియున్నారు. నేడు ఆ రెండు వరములను కోరుకొని, నీ మనస్సును చల్లబఱచుకొనుము. భరతునకు రాజ్యమును, రామునకు వనవాసమును కోరుకొనుము. నీ సవతుల ఆనందమును పూర్తిగా లాగికొనుము. శ్రీరాముని మీద ఒట్టు పెట్టుకొనిన తరువాతనే ఈ వరములనడుగుము.

లేనిచో రాజుగారు తన మాటతప్పవచ్చును. ఈ రాత్రి గడిచినచో మనపథకము ఫలింపదు. నా మాటను ప్రాణతుల్యముగా భావింపుము." (చౌ॥ 1-4)

దో- బడ కుఘాతు కరి పాతకిని, కహేసి కోపగృహఁ జాహు ।
కాజు సఁవారెహు సజగ సబు, సహసా జని పతిఆహు ॥ 22 ॥

ఈ విధముగా పాపాత్మురాలైన ఆ గూనిమంథర కైకేయిని తనదురాలోచనలనెడి కత్తివేటుకు గురిచేసి, "ఇప్పుడు నీవు కోపగృహమునకు పొమ్ము. అతి జాగ్రతతో పనిని సాధించుకొనుము. తొందరపడి రాజుగారిని విశ్వసింపకుము."- అని పలికెను. (దో॥ 22)

## కైకేయి కోపగృహమునకు ఏగుట-రెండు వరములను కోరుట

చౌ- కుబరిహి రాని ప్రానప్రియ జానీ । బార బార బడి బుద్ధి బఖానీ ॥
తోహి సమ హిత న మోర సంసారా । బహే జాత కఇ భఇసి అధారా ॥ 1 ॥
జౌఁ బిధి పురబ మనోరథు కాలీ । కరౌఁ తోహి చఖ పూతరి ఆలీ ॥
బహుబిధి చేరిహి ఆదరు దేఈ । కోపభవన గవనీ కైకేఈ ॥ 2 ॥
బిపతి బీజు బరషా రితు చేరీ । భుఇఁ భఇ కుమతి కైకఈ కేరీ ॥
పాఇ కపట జలు అంకుర జామా । బర దోఉ దల దుఖ ఫల పరినామా ॥ 3 ॥
కోప సమాజు సాజి సబు సోఈ । రాజు కరత నిజ కుమతి బిగోఈ ॥
రాఉర నగర కోలాహలు హోఈ । యహ కుచాలి కఛు జాన న కోఈ ॥ 4 ॥

కైకేయి మంథరను ప్రాణప్రియముగా భావించెను. పదే పదే ఆమెను మెచ్చుకొనుచు, "ఈ జగత్తున నీ వలె నాహితము గోరెడివారెవరు గలరు? ప్రవాహములో కొట్టుకొని పోవుచున్న నాకు ఒక ఆలంబనముగా దొరకితివి. విధాత రేపు నా అభిలాషను పూర్తి చేసినచో నేను నిన్ను నాకంటి పాపగా భావించెదను." అని తనదాసిని మిక్కిలి శ్లాఘించుచు కైకేయి కోపగృహమునకు పోయెను. మంథర వర్ష-ఋతువు, ఆపదయనెడి బీజము కైకేయిబుద్ధియనెడినేలలో నాటబడినది. కపటమనెడి నీటిధారచే తడుపబడి, అది మొలకెత్తినది. ఫలితముగా వరములనెడి రెండు చిగురుటాకులను వేసినది. దుఃఖము దీనిపరిణామఫలము. కోపమును సూచించుటకై తగినవేషమునుదాల్చి కైకేయి కోపగృహమున నేలపై పరుండెను. రాజ్యాధికారము కల్గియుండియు దుర్బుద్ధి కారణముగా ఆమె అన్నింటిని కోల్పోయెను. రాజ భవనము, నగరము ఆనందోత్సాములతో నిండియుండెను. ఎవ్వరునూ ఈ కుతంత్రమును పసిగట్టలేదు. (చౌ॥ 1-4)

దో- ప్రముదిత పుర నర నారి సబ, సజహిఁ సుమంగలచార ।
ఏక ప్రబిసహిఁ ఏక నిర్గమహిఁ, భీర భూప దరబార ॥ 23 ॥

నగర వాసులైన స్త్రీ పురుషులెల్లరును అత్యుత్సాహముతో పట్టాభిషేకపు ఏర్పాట్లలో మునిగి తేలుచుండిరి. రాజభవనద్వారమున ప్రజలు గుమిగూడి, లోపలికిని బయటికిని నిరంతరము తిరుగుచుండిరి. (దో॥ 23)

చౌ- బాల సఖా సుని హియఁ హరషాహీఁ । మిలి దస పాంచ రామ పహిఁ జాహీఁ ॥
ప్రభు ఆదరహిఁ ప్రేము పహిచానీ । పూఁఛహిఁ కుసల ఖేమ మృదు బానీ ॥ 1 ॥
ఫిరహిఁ భవన ప్రియ ఆయసు పాఈ । కరత పరసపర రామ బడాఈ ॥
కో రఘుబీర సరిస సంసారా । సీలు సనేహ నిబాహనిహారా ॥ 2 ॥
జెహిఁ జెహిఁ జోని కరమ బస భ్రమహీఁ । తహఁ తహఁ ఈసు దేఉ యహ హమహీఁ ॥
సేవక హమ స్వామీ సియనాహూ । హోఉ నాత యహ ఓర నిబాహూ ॥ 3 ॥
అస అభిలాషు నగర సబ కాహూ । కైకయసుతా హృదయఁ అతి దాహూ ॥
కో న కుసంగతి పాఇ నసాఈ । రహఇ న నీచ మతేఁ చతురాఈ ॥ 4 ॥

శ్రీరామచంద్రునిచిన్ననాటిస్నేహితులు యువరాజపట్టాభిషేకవార్తను విని, మిక్కిలి సంతుష్టహృదయులైరి. వారు గుంపులుగుంపులుగా శ్రీరామచంద్రునికడకు వచ్చిరి. వారి ప్రేమలను గుర్తించి, శ్రీరాముడు వారిని ఆదరించి, మృదుమధురముగా వారిక్షేమసమాచారములను అడిగెను. తమ ప్రియమిత్రుడైన రామచంద్రునినుండి సెలవు గైకొని వెళ్లుచు "శ్రీరామునివంటి స్నేహశీలురు ఈ జగత్తున ఎవరుందురు? మా కర్మవశమున ఏవరికడుపున పుట్టినను జన్మజన్మలయందును సీతాపతియే మాకు ప్రభువుగను, మేము ఆయనకు సేవకులుగను ఉండునట్లు భగవంతుడు మమ్ములను అనుగ్రహించు గాక. ఈ సంబంధము ఎప్పటికిని ఇట్లే నిలిచియుండుగాక"- అని తమలో తాము అనుకొనుచుండిరి. నగరములోని ప్రతివ్యక్తి యొక్క అభిలాషయు ఇదియే. కైకేయిహృదయముమాత్రము ఈర్ష్యాగ్నితో మండిపోవుచుండెను. దుర్జనసహవాసమువలన చెడిపోనివారెవరు? నీచుల సాంగత్యము వలన వివేకము నశించును. (చౌ॰ 1-4)

దో- సాఁఝ సమయ సానంద నృపు, గయఉ కైకఈ గేహఁ ।
గవను నిఠురతా నికట కియ, జను ధరి దేహ సనేహఁ ॥ 24 ॥

సంధ్యాసమయమున దశరథమహారాజు సంతోషముతో మూర్తీభవించినప్రేమ నిష్ఠురత్వముకడకు వచ్చినట్లు కైకేయిగృహమునకు వచ్చెను. (దో॰ 24)

చౌ- కోపభవన సుని సకుచెఉ రాఊ । భయ బస అగహుఁడ పరఇ న పాఊ ॥
సురపతి బసఇ బాహఁబల జాకేఁ । నరపతి సకల రహహిఁ రుఖ తాకేఁ ॥ 1 ॥
సో సుని తియ రిస గయఉ సుఖాఈ । దేఖహు కామ ప్రతాప బడాఈ ॥
సూల కులిస అసి అఁగవనిహారే । తే రతినాథ సుమన సర మారే ॥ 2 ॥
సభయ నరేసు ప్రియా పహిఁ గయఊ । దేఖి దసా దుఖు దారున భయఊ ॥
భూమి సయన పటు మోట పురానా । దిఏ డారి తన భూషన నానా ॥ 3 ॥
కుమతిహి కసి కుబేషతా ఫాబీ । అనఅహివాతు సూచ జను భాబీ ॥
జాఇ నికట నృపు కహ మృదు బానీ । ప్రానప్రియా కెహి హేతు రిసానీ ॥ 4 ॥

కోపభవనముపేరు చెవినిబడినంతనే రాజుగుండె జల్లుమనెను. భూమిపై కాళ్లు నిలువలేదు. దేవరాజైన ఇంద్రునియంతటివానికి కుడిభుజముగానుండువాడును, రాజులందరికిని తలమానికమైనవాడును అగు దశరథమహారాజు ఒక స్త్రీకోపమునకు వణకిపోయెను. త్రిశూలము, వజ్రాయుధము, ఖడ్గముల దాడిని ఎదుర్కొనగల ధీరులు సైతము మన్మథునిపూలబాణములతాకిడికి నిల్వజాలరు. మన్మథునిమహిమ, బలప్రతాపముల ప్రభావములట్టివి. దశరథుడు భయపడుచు తన ముద్దులభార్యయైన కైకేయికడకు చేరెను. ఆమెస్థితిని జూచి ఆయనకు అమితమైనదుఃఖము కలిగెను. ఆ సమయమున కైకేయి తన ఆభరణములను అన్నింటిని తీసివేసి, ఒక పాతముతకవస్త్రమును ధరించి, నేలపై పరుండియుండెను. విధాత రాబోవు వైధవ్యమును ముందుగనే సూచించుచున్నాడాయనునట్లు ఆమె వేషము కుత్సితపథకములకు తగినట్లే యుండెను. రాజు ఆమెను సమీపించి, మృదు మధురముగా "ప్రియా! ఏల అలిగితివి?" అని పల్కెను. (చౌ॥ 1-4)

ఛం- కెహి హేతు రాని రిసాని పరసత పాని పతిహి నెవారఈ ।
మానహుఁ సరోష భుఅంగ భామిని బిషమ భాఁతి నిహారఈ ॥
దోఉ బాసనా రసనా దసన బర మరమ ఠాహరు దేఖఈ ।
తులసీ నృపతి భవతబ్యతా బస కామ కౌతుక లేఖఈ ॥

"రాణీ! కోపమేల?" అనుచు రాజు ఆమెను చేతితో తాకగానే కైక ఆ చేతిని విదలించి వేసెను. కోపక్రోక్కిన ఆడుత్రాచువలె ఆయనవైపు చూచెను. ఆమె రెండుకోరికలే నాలుకలుగా, వరములనెడివి రెండుకోరలుకాగా, కాటువేయుటకు అనువైనఆయువుపట్టుకొఱకు వెదకుచుండెను. తులసీదాసు చెప్పుచున్నాడు. దశరథరాజు దీనిని ప్రేమపూర్వకసరసముగా భావించెను. (ఛంద్)

సో- బార బార కహ రాఉ, సుముఖి సులోచని పికబచని ।
కారన మోహి సునాఉ, గజగామిని నిజ కోప కర ॥ 25 ॥

మహారాజు "ఓ సుముఖీ! సులోచనా! సుభాషిణీ! గజగామినీ! నీ కోపకారణమును తెలుపుము" అని పదే పదే పలికెను. (సోరఠ॥ 25)

చౌ- అనహిత తోర ప్రియా కెఇఁ కీన్హా । కెహి దుఇ సిర కెహి జము చహ లీన్హా ॥
కహు కెహి రంకహి కరౌఁ నరేసూ । కహు కెహి నృపహి నికాసౌఁ దేసూ ॥ 1 ॥
సకఉఁ తోర అరి అమరఉ మారీ । కాహ కీట బపురే నర నారీ ॥
జానసి మోర సుభాఉ బరోరూ । మను తవ ఆనన చంద చకోరూ ॥ 2 ॥
ప్రియా ప్రాన సుత సరబసు మోరేఁ । పరిజన ప్రజా సకల బస తోరేఁ ॥
జౌఁ కఛు కహౌఁ కపటు కరి తోహీ । భామిని రామ సపథ సత మోహీ ॥ 3 ॥
బిహసి మాగు మనభావతి బాతా । భూషన సజహి మనోహర గాతా ॥
ఘరీ కుఘరీ సముఝి జియఁ దేఖూ । బేగి ప్రియా పరిహరహి కుబేషూ ॥ 4 ॥

"ప్రియా! నీకు అపకారమును చేసినవారు ఎవరు? ఎవరి శిరమును ఛేదింపవలెను? యముడు ఎవరిని కోరుచున్నాడు? ఏ దరిద్రుని రాజుగా చేయవలెను? ఏ సామంతరాజును దేశబహిష్కృతుని జేయవలెను? నీకు

శత్రువులు దేవతలైనను సరే వారిని వధించెదను. ఇక మనుష్యులేమిలెక్క? వారు కీటకములతో సమానము. సుందరీ! నీవు నా స్వభావమును ఎఱుగుదువు. నీముఖచంద్రునకు నేను చకోరమును. ప్రియా! నా ప్రాణములు, పుత్రులు, కుటుంబము, ప్రజలు సర్వస్వము నీ అధీనము. నేనీ మాటలను కపటముతో చెప్పుట లేదు. వందసార్లు రామునిపై 'ఒట్టు పెట్టి' చెప్పుచున్నాను. ఇది ముమ్మాటికి సత్యము. నీ మనోరథమేమో నిండు మనసుతో తెలుపుము. సుందరమైన నీ తనువును ఆభరణములతో అలంకరించుకొనుము. సమయాసమయములను ఎఱింగి, ఈ వికృత వేషమును త్యజింపుము.

(చౌ॥ 1-4)

**దో- యహ సుని మన గుని సపథ బడి, బిహసి ఉఠీ మతిమంద ।**
**భూషన సజతి బిలోకి మృగు, మనహుఁ కిరాతిని ఫంద ॥ 26 ॥**

రాజుగారి ఈ మాటలను విని, ఆయనవాగ్దానప్రభావమును మనస్సునదలచి బుద్ధిహీనరాలైన కైకేయి నవ్వుచూ లేచి, ఆభరణములను ధరించెను. జింకను జూచి వేటాడు ఒక కిరాతస్త్రీవలె వలపన్నెను. (దో॥ 26)

**చౌ- పుని కహ రాఉ సుహృద జియఁ జానీ । ప్రేమ పులకి మృదు మంజుల బానీ ॥**
**భామిని భయఉ తోర మనభావా । ఘర ఘర నగర అనంద బధావా ॥ 1 ॥**
**రామహి దేఉఁ కాలి జుబరాజూ । సజహి సులోచని మంగల సాజూ ॥**
**దలకి ఉఠెఉ సుని హృదఉ కఠోరూ । జను ఛుఇ గయఉ పాక బరతోరూ ॥ 2 ॥**
**ఐసిఉ పీర బిహసి తెహిఁ గోఈ । చోర నారి జిమి ప్రగటి న రోఈ ॥**
**లఖహిఁ న భూప కపట చతురాఈ । కోటి కుటిల మని గురూ పఢాఈ ॥ 3 ॥**
**జద్యపి నీతి నిపున నరనాహూ । నారిచరిత జలనిధి అవగాహూ ॥**
**కపట సనేహు బఢాఇ బహోరీ । బోలీ బిహసి నయన ముహు మోరీ ॥ 4 ॥**

కైకేయికోపము తగ్గినదని తలచి, రాజు మోహపరవశుడై మృదుమధురముగా పలికెను. "ఓ భామినీ! నీ మనోరథము నెఱవేఱుచున్నది. నగరములో ప్రతిగృహము ఆనందోత్సాహములతో వెల్లివిరియుచున్నది. ఓ సుందరనయనా! రేపు రాముని యువరాజును చేయుచున్నాను. కావున మంగళకరవస్త్రములను ధరింపుము" ఇది వినగానే పాషాణహృదయ యైన కైకేయి గుండె బ్రద్దలాయెను. ఇది ఆమెకు పుండుపై కారముచల్లినట్లాయెను. ఆమె కృత్రిమముగా నవ్వుచు హృదయమునందలి తనవిషాదమును దాచుకొనెను. తేలుకుట్టినదొంగ బహిరంగముగా ఏడ్వలేడు గదా! రాజు ఆమె కపటచాతుర్యమును గమనింపలేదు. ఏలనన కుటిలత్వబోధనలో పండితురాలైన మంథర ఆమెకు ఉపదేశమిచ్చి యున్నది. రాజు ఇంగితజ్ఞుడేయైనను స్త్రీచిత్తము సముద్రమువలె అగాధమైనది, తెలిసికొన వీలుకానిది. ఆమె మఱల కపటప్రేమను నటించుచు, నవ్వుచు కనులును, మూతియు త్రిప్పుచు పలికెను. (చౌ॥ 1-4)

**దో- మాగు మాగు పై కహహు పియ, కబహుఁ న దేహు న లేహు ।**
**దేన కహేహు బరదాన దుఇ, తేఉ పావత సందేహు ॥ 27 ॥**

"ప్రియతమా! అడుగుము, అడుగుము' అని అనుటయే గాని ఇంత వఱకు ఏమియు ఇచ్చియే యెఱుగరు. మీరు నాకు లోగడ రెండు వరములను ఇచ్చి యుంటిరి. కాని వాటిని నేను పొందగలనో? లేనో?" (దో॥ 27)

చౌ- జానెఉఁ మరము రాఉ హఁసి కహఈ । తుమ్హహి కోహాబ పరమ ప్రియ అహఈ ॥
థాతీ రాఖి న మాగిహు కాఊ । బిసరి గయఉ మోహి భోర సుభాఊ ॥ 1 ॥
ఝూఠెహుఁ హమహి దోషు జని దేహూ । దుఇ కై చారి మాగి మకు లేహూ ॥
రఘుకుల రీతి సదా చలి ఆఈ । ప్రాన జాహుఁ బరు బచను న జాఈ ॥ 2 ॥
నహిఁ అసత్య సమ పాతక పుంజా । గిరి సమ హోహిఁ కి కోటిక గుంజా ॥
సత్యమూల సబ సుకృత సుహాఏ । బేద పురాన బిదిత మను గాఏ ॥ 3 ॥
తెహి పర రామ సపథ కరి ఆఈ । సుకృత సనేహ అవధి రఘురాఈ ॥
బాత దృఢాఇ కుమతి హఁసి బోలీ । కుమత కుబిహగ కులహ జను ఖోలీ ॥ 4 ॥

రాజనప్పి, "ఓ! ఇప్పుడు నీ మనస్సు అర్థమైనది. కనుక నీవు అలకబూనుట యుక్తమే- అని అనిపించుచున్నది. నీవు న్యాసముగా ఉంచినవరములను ఇంతవఱకు అడుగనేలేదు. మఱచుట నా స్వభావమగుటచే అవినాకు జ్ఞప్తిలో లేవు. నాపై మిథ్యాదోషము మోపకుండ రెండింటికి మాఱుగా నాలుగు వరములను కోరుకొనుము. ప్రాణములు పోయినాసరే! ఇచ్చిన మాట తప్పకుండుట రఘువంశజులనీతి. అసత్యముతో సమానమైన పాపమేమున్నది? కోటాను కోట్ల గంజాయి విత్తనాలు పర్వతముతో సమానమగునా? సత్యమే సర్వసద్గుణములకు మూలము' అని వేదములు, పురాణములు, మనువు నొక్కి చెప్పిన విషయము సువిదితము. అంతేగాక నేను రామునిపై ప్రమాణము చేసియుంటిని. రామచంద్రుడు నా నోముల పంట, ప్రేమకు పరాకాష్ఠ" ఈ విధముగా రాజు తన వాగ్దానమును ధ్రువపఱచిన పిమ్మట ఆ కుబుద్ధి కైకేయి ఒక విషపు నవ్వు నవ్వి, సంచాన పక్షి (డేగ) కండ్లపై కప్పిన టోపీని తీసివేసి, దానిని వేటకు వదలినట్లు ఆమె తన దురాలోచనలను కన్నులతో ప్రకటించుచు పలికెను. (చౌ॥ 1-4)

దో- భూప మనోరథ సుభగ బను, సుఖ సుబిహంగ సమాజు ।
భిల్లిని జిమి ఛాడన చహతి, బచను భయంకరు బాజు ॥ 28 ॥

రాజు యొక్క మనోరథమే ఒక సుందరవనము. అతని సుఖములే అందమైన పక్షుల సమూహము. కైకేయి అనెడి కిరాతవనిత వాటిపై తన క్రూర వచనములనెడి భయంకరములైన సంచాన పక్షులను వదలెను. (దో॥ 28)

## మాసపారాయణము-పదమూడవ విరామము

చౌ- సునహు ప్రానప్రియ భావత జీ కా । దేహు ఏక బర భరతహి టీకా ॥
మాగఉఁ దూసర బర కర జోరీ । పురవహు నాథ మనోరథ మోరీ ॥ 1 ॥
తాపస బేష బిసేషి ఉదాసీ । చౌదహ బరిస రాము బనబాసీ ॥
సుని మృదు బచన భూప హియఁ సోకూ । ససి కర ఛుఅత బికల జిమి కోకూ ॥ 2 ॥
గయఉ సహమి నహిఁ కఛు కహి ఆవా । జను సచాన బన ఝపటేఉ లావా ॥
బిబరన భయఉ నిపట నరపాలూ । దామిని హనెఉ మనహుఁ తరు తాలూ ॥ 3 ॥

మాథేఁ హాథ మూది దోఉ లోచన । తను ధరి సోచు లాగ జను సోచన ॥
మోర మనోరథు సురతరు ఫూలా । ఫరత కరిని జిమి హతెఉ సమూలా ॥ 4 ॥
అవధ ఉజారి కీన్హి కైకేఈఁ । దీన్హిసి అచల బిపతి కై నేఈఁ ॥ 5 ॥

ఆమె పలికెను. "ప్రాణనాథా! వినుడు. భరతుడు అయోధ్యకు యువరాజు అగుట నా మొదటివరము. నాథా! చేతులు జోడించి. మిమ్ము మఱియొక వరమునుగూడ కోరుకొనుచున్నాను. నా మనోరథమును తీర్పుడు. వైభవవిలాసములను వీడి, తాపసివేషము దాల్చి, ఉదాసీనుడై, మునులవలె శ్రీరాముడు పదునాలుగువత్సరములు వనవాసము చేయవలెను. ఇదియే నా రెండవవరము. దయచేసి ఈ రెండువరములను నాకు ప్రసాదింపుము. కైకేయి మెత్తనిపలుకులు చెవినబడగానే చంద్రకిరణములు సోకిన చక్రవాకమువలె రాజు శోకతప్త హృదయుడయ్యెను. గ్రద్దచేతిలోచిక్కి, గిలగిల కొట్టుకొనుచున్న పక్షివలె రాజు చకితుడై, అయోమయావస్థలో పడిపోయెను. గొంతు పెగలకుండెను. తాటి చెట్టుపై పిడుగుపడినట్లు ఆయనముఖము వివర్ణమాయెను. తలపై చేతులుంచుకొని, కన్నులు మూసికొని, శోకమూర్తియై వగచెను. "నామనోరథ రూపమగు కల్పవృక్షము ఇప్పుడే ఫలింపబోవుచుండగా, కైకేయియను ఏనుగు దానిని సమూలముగా పెకలించివేయుచున్నది. ఈమె అయోధ్యను నాశనముచేయుచున్నది. శాశ్వతమైనఆపదలకు పునాది వేయుచున్నది. (చౌ॥ 1-5)

దో- కవనేఁ అవసర కా భయఉ, గయఉఁ నారి బిస్వాస ।
జోగ సిద్ధి ఫల సమయ జిమి, జతిహి అబిద్యా నాస ॥ 29 ॥

ఈ సమయమున జరుగవలసినదేమి? జరిగినదేమి? ఒక యోగి యోగసిద్ధిని పొందు సమయమున అజ్ఞానముచే భ్రష్టుడైనట్లు నేను స్త్రీవ్యామోహములో పడి చెడిపోయితిని." (దో॥ 29)

చౌ- ఏహి బిధి రాఉ మనహిఁ మన ఝాఁఖా । దేఖి కుభాఁతి కుమతి మన మాఖా ॥
భరతు కి రాఉర పూత న హోహీఁ । ఆనేహు మోల బెసాహి కి మోహీఁ ॥ 1 ॥
జో సుని సరు అస లాగ తుమ్హారేఁ । కాహె న బోలహు బచను సఁభారేఁ ॥
దేహు ఉతరు అను కరహు కి నాహీఁ । సత్యసంధ తుమ్హ రఘుకుల మాహీఁ ॥ 2 ॥
దేన కహేహు అబ జని బరు దేహూ । తజహు సత్య జగ అపజసు లేహూ ॥
సత్య సరాహి కహేహు బరు దేనా । జానేహు లేఇహి మాగి చబేనా ॥ 3 ॥
సిబి దధీచి బలి జో కఛు భాషా । తను ధను తజేఉ బచన పను రాఖా ॥
అతి కటు బచన కహతి కైకేఈ । మానహుఁ లోన జరే పర దేఈ ॥ 4 ॥

ఈ విధముగా దశరథుడు లోలోన పరితపించుచుండెను. ఆయనదుఃస్థితినిజూచి దుర్బుద్ధిగలరాణి క్రుద్ధురాలై యిట్లు పలికెను. "భరతుడు మీ కుమారుడు కాడా? నన్ను బానిసగా కొనుక్కొని వచ్చినారా? నా పలుకులు వినగానే అవి ములుకులవలె గ్రుచ్చుకొన్నచో ముందుగనే ఎందుకు ఆలోచింపలేదు. ఔనా? కాదా? స్పష్టముగా తెల్పుడు. ప్రతిజ్ఞను పాలింతురా? లేదా? మీరు రఘువంశజులలో సత్యసంధులని పేరుమోసినవారు. మీరిచ్చిన వరములను మీరే నిరాకరింపుడు. సత్యమును వీడి అపకీర్తిపాలుకండు. సత్యపాలనమునుగూర్చి గట్టిగా

చెప్పి, నాకు వరములను ఇచ్చియుంటిరి. బహుశా నేను శనగలను అడుగుతానని మీరు భావించి యుండవచ్చును. శిబి, దధీచి, బలిచక్రవర్తిమున్నగు మహాపురుషులు తమ సంపదలను, ప్రాణములనుగూడ లెక్కచేయక తమమాటలను నిలబెట్టుకొనినారు." కైకేయికటు వచనములు పుండుపై కారము చల్లినట్లు రాజును బాధించెను. (చౌ॥ 1-4)

దో- ధరమ ధురంధర ధీర ధరి, నయన ఉఘారే రాయఁ।
సిరు ధుని లీన్హి ఉసాస అసి, మారెసి మోహి కుఠాయఁ ॥ 30 ॥

ధర్మాత్ముడైన రాజు ధైర్యమును దెచ్చుకొని, కన్నులు దెఱచి, ఒక నిట్టూర్పువిడిచి, తలబాదుకొనుచు, "ఈమె నా ఆయువుపట్టుపై పెద్ద దెబ్బతీసినది." అని వాపోయెను. (దో॥ 30)

చౌ- ఆగేఁ దీఖి జరత రిస భారీ । మనహుఁ రోష తరవారి ఉఘారీ ॥
మూఠి కుబుద్ధి ధార నిఠురాఈ । ధరీ కూబరీఁ సాన బనాఈ ॥ 1 ॥
లఖీ మహీప కరాల కఠోరా । సత్య కి జీవను లేఇహి మోరా ॥
బోలే రాఉ కఠిన కరి ఛాతీ । బానీ సబినయ తాసు సోహాతీ ॥ 2 ॥
ప్రియా బచన కస కహసి కుభాఁతీ । భీర ప్రతీతి ప్రీతి కరి హాఁతీ ॥
మోరేఁ భరతు రాము దుఇ ఆఁఖీ । సత్య కహఉఁ కరి సంకరు సాఖీ ॥ 3 ॥
అవసి దూతు మైఁ పఠఇబ ప్రాతా । ఐహహిఁ బేగి సునత దోఉ భ్రాతా ॥
సుదిన సోధి సబు సాజు సజాఈ । దేఉఁ భరత కహుఁ రాజు బజాఈ ॥ 4 ॥

క్రోధమనెడిఖడ్గము ఒరనుండి బయటికివచ్చియున్నట్లు రోషాగ్నిబుగబుగలతో మండిపడుచున్న కైకేయి ఆయన సమ్ముఖమున కన్నులనుండి నిప్పులు గురియుచు నిలబడెను. ఆ ఖడ్గమునకు దుర్బుద్ధియే పిడి. నిష్ఠురత్వమేధార (కత్తి అంచు). మంథరయనుసానెపై అది పదును పెట్టబడినది. ఈ ఖడ్గము చాల భయంకరమైనది, కఠోరమైనది. "ఇది నిజముగా నాప్రాణములను తీయదుగదా!" అనిరాజు భయపడెను. పిమ్మట రాజు తనగుండెను దిటవు చేసికొని, వినమ్రముగా కైకేయికి ప్రియమగు రీతిలో పలికెను. "ప్రియా! భయమును వీడి, ప్రేమ విశ్వాసములను గంగపాలుచేసి, ఇట్టి అప్రియవచనములను ఎట్లు పలికితివి? భరతుడు రాముడు ఇద్దఱును నాకు రెండు కన్నుల వంటివారు. ఈశ్వరుని సాక్షిగా ప్రమాణము చేసి ఈ మాటను చెప్పుచున్నాను. ప్రాతఃకాలముననే అవశ్యముగా దూతలను బంపి, భరత శత్రుఘ్నులను ఇచటకు రప్పించెదను. ఒక శుభముహూర్తమును నిర్ణయించి, వైభవోపేతముగా భరతునకు రాజ్యమును అప్పగించెదను. (చౌ॥ 1-4)

దో- లోభు న రామహి రాజు కర, బహుత భరత పర ప్రీతి ।
మైఁ బడ ఛోట బిచారి జియఁ, కరత రహేఉఁ నృపనీతి ॥ 31 ॥

రామునకు రాజ్యకాంక్ష ఏమాత్రము లేదు. అతనికి భరతునిపై అపారప్రేమ గలదు. పెద్ద,చిన్న అను విషయమును నా మనస్సులో విచారణ చేసి రాజనీతిని పాటించుచుంటిని. (దో॥ 31)

చౌ- రామ సపథ సత కహఉఁ సుభాఊ । రామమాతు కఛు కహేఉ న కాఊ ॥
మైఁ సబు కీన్హ తోహి బిను పూఛేఁ । తెహి తేఁ పరేఉ మనోరథు ఛూఛేఁ ॥ 1 ॥
రిస పరిహరు అబ మంగల సాజూ । కఛు దిన గఏఁ భరత జుబరాజూ ॥
ఏకహి బాత మోహి దుఖు లాగా । బర దూసర అసమంజస మాగా ॥ 2 ॥
అజహుఁ హృదఉ జరత తెహి ఆఁచా । రిస పరిహాస కి సాఁచెహుఁ సాఁచా ॥
కహు తజి రోషు రామ అపరాధూ । సబు కోఉ కహఇ రాము సుఠి సాధూ ॥ 3 ॥
తుహూఁ సరాహసి కరసి సనేహూ । అబ సుని మోహి భయఉ సందేహూ ॥
జాసు సుభాఉ అరిహి అనుకూలా । సో కిమి కరిహి మాతు ప్రతికూలా ॥ 4 ॥

శ్రీరాముని తల్లి కౌసల్య ఎప్పుడును ఏమియు అడుగలేదు. ఈ మాటను రామునిపై ఎన్ని పర్యాయములైనను 'ఒట్టు పెట్టుకొని' చెప్పగలను. నీకు చెప్పకయే నేను ఈ యేర్పాట్లు గావించితిని. అందులకే నాకోర్కె ఫలించుట లేదు. నీ కోపమును మాని, ఇప్పుడు మంగళకరములైన దుస్తులను ధరింపుము. కొన్నిదినములతరువాత భరతుడు యువరాజగును. ఒక్క విషయము మాత్రము నన్ను మిక్కిలి బాధించు చున్నది. నీ రెండవ కోరిక పూర్తిగా అసమంజసము. దానివలన కలిగిన దుఃఖాగ్ని ఇప్పటికిని నా హృదయమును దహించి వేయుచున్నది. ఇది కోపమా? హాస్యమా? లేక నిజముగనే పలికితివా? కోపమును మాని, రాముని తప్పేమిటో తెలుపుము. రాముడు గొప్పసాదుపురుషుడని అందఱును పలుకుచుందురు. అంతెందుకు? నీవుకూడ రాముని మెచ్చుకొనుచుంటివి. ప్రేమించుచుంటివి. ఇప్పటి నీ ధోరణిని బట్టి నీ విషయమున సందేహము గలుగుచున్నది. శత్రువునకును కీడుతలపెట్టని వాడు తల్లికి ప్రతికూలముగా ఎట్లు చరించును? (చౌ॥ 1-4)

దో- ప్రియా హాస రిస పరిహరహి, మాగు బిచారి బిబేకు ।
జెహిఁ దేఖౌఁ అబ నయన భరి, భరత రాజ అభిషేకు ॥ 32 ॥

ప్రియా! పరిహాసము, కోపము వీడి, వివేకముతో యోచన చేసి కోరుకొనుము. దానివలన భరతునిరాజ్యాభిషేకమును నేత్రానందకరముగా చూడవచ్చును. (దో॥ 32)

చౌ- జిఅఇ మీన బరు బారి బిహీనా । మని బిను ఫనికు జిఅఇ దుఖ దీనా ॥
కహఉఁ సుభాఉ న ఛలు మన మాహీఁ । జీవను మోర రామ బిను నాహీఁ ॥ 1 ॥
సముఝి దేఖు జియఁ ప్రియా ప్రబీనా । జీవను రామ దరస అధీనా ॥
సుని మృదు బచన కుమతి అతి జరఈ । మనహు అనల ఆహుతి ఘృత పరఈ ॥ 2 ॥
కహఇ కరహు కిన కోటి ఉపాయా । ఇహాఁ న లాగిహి రాఉరి మాయా ॥
దేహు కి లేహు అజసు కరి నాహీఁ । మోహి న బహుత ప్రపంచ సోహాహీఁ ॥ 3 ॥
రాము సాధు తుమ్హ సాధు సయానే । రామమాతు భలి సబ పహిచానే ॥
జస కౌసిలాఁ మోర భల తాకా । తస ఫలు ఉన్హహి దేఉఁ కరి సాకా ॥ 4 ॥

బహుశా నీరులేకుండా చేప జీవింపవచ్చును, మణిలేకుండ సర్పము దీనమైన జీవితమును గడపవచ్చును. కాని నిర్మలమనస్సుతో నిజము పల్కుచున్నాను. రాముడు లేనిదే నా జీవితము ఉండదు. ఓ చతురప్రియా! బాగుగా ఆలోచింపుము. నేను జీవించుట రామ దర్శనముపై ఆధారపడియుండును." అగ్నికి ఆజ్యము తోడైనట్లు

రాజుగారిహితవచనములు దుర్బుద్ధియగు కైకేయిక్రోధాగ్నిని ప్రజ్వలింపజేసినవి. కైకేయి పలికెను. "మీరు ఎన్ని పన్నుగడలు పన్నినను నాకడ అవి పనిచేయవు. ఇష్టమయినచో నేను కోరిన వరములను ఇచ్చివేయుడు. లేనిచో 'లేదు' అని చెప్పి, అపకీర్తిని మూటకట్టుకొనుడు. నాకు ఈ మోసపుమాటలు నచ్చవు. రాముడు సాధువు, మీరు పరమసాధువులు. రామునితల్లియు తక్కువేమీగాదు. ఆమె ఇంకనూ పరమసాధువు. నేను అందఱినిగూర్చియు బాగుగా తెలిసికొనినాను. కౌసల్య నామేలు ఎట్లు కోరినదో నేనుగూడ ఆమెకునట్లే చక్కగా జ్ఞాపకము ఉండునట్లు ప్రతిఫలమును కూర్చెదను. (చౌ॥ 1-4)

దో- హోత ప్రాతు మునిబేష ధరి, జౌఁ న రాము బన జాహిఁ।
మోర మరను రాఉర అజస, నృప సముఝిఅ మన మాహిఁ ॥ 33 ॥

తెల్లవాఱగనే రాముడు మునివేషమును దాల్చి, వనమునకు పోనిచో నేను ప్రాణత్యాగము చేయుట, మీరు అపకీర్తి పాలగుట తథ్యము, గ్రహింపుడు." (దో॥ 33)

చౌ- అస కహి కుటిల భఈ ఉఠి ఠాఢీ । మానహుఁ రోష తరంగిని బాఢీ ॥
పాప పహార ప్రగట భఇ సోఈ । భరీ క్రోధ జల జాఇ న జోఈ ॥ 1 ॥
దోఉ బర కూల కఠిన హఠ ధారా । భవఁర కూబరీ బచన ప్రచారా ॥
ఢాహత భూపరూప తరు మూలా । చలీ బిపతి బారిధి అనుకూలా ॥ 2 ॥
లఖీ నరేస బాత ఫురి సాఁచీ । తియ మిస మీచు సీస పర నాచీ ॥
గహి పద బినయ కీన్హ బైఠారీ । జని దినకర కుల హోసి కుఠారీ ॥ 3 ॥
మాగు మాథ అబహీఁ దేఉఁ తోహీ । రామ బిరహఁ జని మారసి మోహీ ॥
రాఖు రామ కహుఁ జెహి తెహి భాఁతీ । నాహిఁ త జరిహి జనమ భరి ఛాతీ ॥ 4 ॥

అని పలికి ఆ కుటిలాత్మురాలు కైకేయి, పాపమనెడిపర్వతమునబుట్టి క్రోధమనెడి జలములతోగూడిన నదీతరంగములు ఉవ్వెత్తుగా లేచినట్లు, నిటారుగా లేచి నిలబడెను. రెండు వరములును ఆ క్రోధరూపనదికి రెండుతీరములు. కైకేయికఠినమైనపట్టుదలయే ఆనదీ ప్రవాహవేగము. మంథరమాటలే సుడిగుండములు. ఆ నది దశరథుడనెడి మహా వృక్షమును సమూలముగా పెకలించి, విపత్తులనెడి సముద్రములో కల్పుటకు పూనుకొనెను. కైకేయి ఆ వరములను నిజముగానే కోరుకొనుచున్నట్లు దశరథుడు గ్రహించి, స్త్రీ రూపమున మృత్యువే తన నెత్తిపై నాట్యమాడుచున్నట్లు భావించి, కైకేయికాళ్లను పట్టుకొని, కూర్చుండబెట్టి "నీవు సూర్యవంశవృక్షమును నఱికివేయుగొడ్డలివి కావలదు." అని ప్రాధేయపడెను. "నీవు నా శిరస్సును కోరినను ఇప్పుడే ఇచ్చెదను. కాని రాముని నానుండి వేఱుచేసి నన్ను చంపవద్దు. ఎట్లైనను సరే రాముని ఇచట ఉండనిమ్ము. లేనిచో జీవితమంతయు నీకు హృదయవేదన తప్పదు." (చౌ॥ 1-4)

## దశరథుని పరితాపము

దో- దేఖీ బ్యాధి అసాధ నృపు, పరెఉ ధరని ధుని మాథ।
కహత పరమ ఆరత బచన, రామ రామ రఘునాథ ॥ 34 ॥

కైకేయిని పట్టిపీడించుచున్న రోగమును నివారించుట అసాధ్యమని గ్రహించి, దశరథుడు తలబాదుకొనుచు 'రామా! రామా! ఓ రఘురామా! అని విలపించుచు కుప్పగూలి పోయెను. (దో॥ 34)

చౌ- బ్యాకుల రాఉ సిథిల సబ గాతా । కరిని కలపతరు మనహుఁ నిపాతా ॥
కంఠు సూఖ ముఖ ఆవ న బానీ । జను పాఠీను దీన బిను పానీ ॥ 1 ॥
పుని కహ కటు కఠోర కైకేఈ । మనహుఁ ఘాయ మహుఁ మాహుర దేఈ ॥
జౌఁ అంతహుఁ అస కరతబు రహేఊ । మాగు మాగు తుమ్హ కేహిఁ బల కహేఊ ॥ 2 ॥
దుఇ కి హోఇ ఏక సమయ భుఆలా । హఁసబ ఠఠాఇ ఫులాఉబ గాలా ॥
దాని కహాఉబ అరు కృపనాఈ । హోఇ కి ఖేమ కుసల రౌతాఈ ॥ 3 ॥
ఛాడహు బచను కి ధీరజు ధరహూ । జని అబలా జిమి కరునా కరహూ ॥
తను తియ తనయ ధాము ధను ధరనీ । సత్యసంధ కహుఁ తృన సమ బరనీ ॥ 4 ॥

దశరథుడు అతివ్యాకులమనస్కుడాయెను. కల్పవృక్షమును ఒక (పిచ్చిపట్టిన) ఆడుఏనుగు పెకలించి పడగొట్టినట్లు ఆయన శరీరము శిథిలమయ్యెను. కంఠము ఎండిపోయెను, నోటమాటరాకుండెను, నీరు దొఱకని చేపవలె గిలగిలాడెను. గాయముపై విషము చల్లుచు కైకేయి మఱల కఠోర వచనములను ఇట్లు పలికెను. "చివరకు ఈ విధముగా చేయదలచుకొని, నాటి మాటికిని 'అడుగు అడుగు' అని యేల పల్కితిరి? రాజా! పగలబడి నవ్వుట చెంపలు ఉబ్బుట, రెండును ఒకేసారి సాధ్యమా? కృపణత్వము వహించుట దాతయని పేరుగాంచుట ఇవి ఒకేసారి సాధ్యము కావుగదా? అట్లే యుద్ధము చేయుట, గాయములు కాకుండుట- ఇవి అసంభవములు. ప్రతిజ్ఞా భంగమునైనను చేయుము. లేదా ధైర్యముతో ప్రవర్తింపుము. ఒక ఆడుదానివలె ఏడ్చుట, మొత్తుకొనుట తగదు. సత్య ప్రతిజ్ఞునకు శరీరము, భార్యాపుత్రులు, గృహము, సంపదలు, పృథ్వి మొదలగునవి అన్నియును గడ్డిపోచతో సమానములని చెప్పబడినవి." (చౌ॥ 1-4)

దో- మరము బచన సుని రాఉ కహ, కహు కఛు దోషు న తోర ।
లాగేఉ తోహి పిసాచ జిమి, కాలు కహావత మోర ॥ 35 ॥

కైకేయి పలికిన కర్ణకఠోరపు మాటలు విని, దశరథుడు, "నీకు తోచినట్లు మాట్లాడుము. ఇందులో నీ దోషము లేదు. నా మృత్యువే పిశాచమై నిన్ను ఆవహించి, ఇట్లు మాట్లాడించు చున్నది" అనెను. (దో॥ 35)

చౌ- చహత న భరత భూపతహి భోరేఁ । బిధి బస కుమతి బసీ జియ తోరేఁ ॥
సో సబు మోర పాప పరినామూ । భయఉ కుఠాహర జేహిఁ బిధి బామూ ॥ 1 ॥
సుబస బసిహి ఫిరి అవధ సుహాఈ । సబ గున ధామ రామ ప్రభుతాఈ ॥
కరిహహిఁ భాఇ సకల సేవకాఈ । హోఇహి తిహుఁ పుర రామ బడాఈ ॥ 2 ॥
తోర కలంకు మోర పఛితాఊ । ముఏహుఁ న మిటిహి న జాఇహి కాఊ ॥
అబ తోహి నీక లాగ కరు సోఈ । లోచన ఓట బైఠు ముహు గోఈ ॥ 3 ॥

జబ లగి జిఔఁ కహఉఁ కర జోరీ । తబ లగి జని కఛు కహసి బహోరీ ॥
ఫిరి పఛితైహసి అంత అభాగీ । మారసి గాఇ నహారూ లాగీ ॥ 4 ॥

"భరతుడు తాను యువరాజు కావలెనని పొరపాటునగూడ కోరడు. విధివైపరీత్యమున నీకే ఈ దుర్బుద్ధి కలిగినది. ఇది యంతయు నా పాపఫలమే. అందులకే విధాత తగని సమయమున నాకు ప్రతికూలుడైనాడు. నీవలన పాడుబడుచున్న సర్వాంగసుందరమైన ఈ అయోధ్య శ్రీరాముని పరిపాలనలో మఱల వికసించి, శోభాయమానమగును. సోదరులందఱును కలిసి, అతనికి సేవలొనర్తురు. శ్రీరామునికీర్తి ముల్లోకములలో వ్యాపించును. కాని నీ కళంకము, నా పశ్చాత్తాపము మన మరణానంతరముగూడ మాసిపోవు. నీకు ఇష్టమైనట్లు చేయుము, నాయెదుటనుండి తొలగిపొమ్ము. నీ ముఖమును నాకు చూపవద్దు. నేను బ్రతికియున్నంత కాలము నాతో మాట్లాడ వలదని నిన్ను దోసిలొగ్గి అర్థించుచున్నాను. ఓ దౌర్భాగ్యురాలా! కడకు నీవు గూడ పశ్చాత్తాపపడక తప్పదు. వారు (తోటుదారము) కొఱకు ఆవును వధించుచున్నావు. ('రాజమాత'యని పిలిపించుకొనుటకై పతిని వధించుచున్నావు.) (చౌ॥ 1-4)

దో- పరెఉ రాఉ కహి కోటి బిధి, కాహే కరసి నిదాను ।
కపట సయాని న కహతి కఛు, జాగతి మనహుఁ మసాను ॥ 36 ॥

ఎన్ని విధముల నచ్చజెప్పినను వినక, నీవు నా సర్వనాశనమునకు పూనుకొంటివి" అని యనుచు, విలపించుచు రాజు నేలకొరిగెను. కపటప్రవర్తనలో ఆరితేరిన కైకేయి శ్మశానములో మౌనముగా ప్రేతల నాహ్వానించుచున్నట్లు, ఏమియు మాట్లాడక నిలుచుండెను. (దో॥ 36)

చౌ- రామ రామ రట బికల భుఆలూ । జను బిను పంఖ బిహంగ బెహాలూ ॥
హృదయఁ మనావ భోరు జని హోఈ । రామహి జాఇ కహై జని కోఈ ॥ 1 ॥
ఉదఉ కరహు జని రబి రఘుకుల గుర । అవధ బిలోకి సూల హోఇహి ఉర ॥
భూప ప్రీతి కైకఇ కఠినాఈ । ఉభయ అవధి బిధి రచీ బనాఈ ॥ 2 ॥
బిలపత నృపహి భయఉ భినుసారా । బీనా బేను సంఖ ధుని ద్వారా ॥
పఢహిఁ భాట గున గావహిఁ గాయక । సునత నృపహి జను లాగహిఁ సాయక ॥ 3 ॥
మంగల సకల సోహాహిఁ న కైసేఁ । సహగామినిహి బిభూషన జైసేఁ ॥
తేహిఁ నిసి నీద పరీ నహిఁ కాహూ । రామ దరస లాలసా ఉఛాహూ ॥ 4 ॥

'రామా! రామా' యని విలపించుచు ఱెక్కలూడిన పక్షివలె రాజు విలవిలలాడెను. అతడు మనస్సులో "తెల్లవాఱకుండును గాక, రామునకు ఈ విషయమును ఎవ్వరును చెప్పకుందురు గాక" అని అనుకొనెను. "ఓ రఘువంశమూలపురుషుడా! సూర్య భగవానుడా! ఉదయింప వలదు. అయోధ్యదుర్దశను జూచినచో నీకు అపారవేదనయే మిగులును" అని సూర్యుని అర్థించెను. రాజు యొక్క ప్రేమను, కైకేయి యొక్క కాఠిన్యమును విధాత పరాకాష్ఠకు జేర్చెను. రాజు విలపించుచునేయుండెను. ఇంతలోనే తెల్లవాఱెను. రాజద్వారముకడ వీణావేణుశంఖధ్వనులు ప్రతిధ్వనించుచుండెను. వందిమాగధులు స్తోత్ర పాఠములను పఠించుచుండిరి. గాయకులు గుణ గానములను కావించుచుండిరి. కాని అవి రాజుచెవులకు శూలములవలె గ్రుచ్చుకొను చుండెను. ఈ మంగళగానములు పతితో సహగమనము చేయబోవు స్త్రీకి ఆభరణములవలె రాజునకు మిక్కిలి

బాధాకరములేయయ్యెను. తెల్లవారిన పిదప యువరాజపట్టాభిషిక్తుడగు శ్రీరామచంద్రుని చూడవలెనను కోరికతో పురజనులు ఎవ్వరును ఆ రాత్రి నిద్రింపనే లేదు. (చౌ॥ 1-4)

దో- ద్వార భీర సేవక సచివ, కహహిఀ ఉదిత రబి దేఖి ।
జాగేఉ అజహుఀ న అవధపతి, కారను కవను బిసేషి ॥ 37 ॥

రాజద్వారమున జనసమూహము చేరెను. సూర్యోదయమైనను దశరథ మహారాజు ఇంకను నిద్రలేవని కారణమేమని వారు సేవకులను మంత్రులను అడుగుచుండిరి. (దో॥ 37)

చౌ- పఛిలే పహర భూపు నిత జాగా । ఆజు హమహి బడ అచరజు లాగా ॥
జాహు సుమంత్ర జగావహు జాఈ । కీజిఅ కాజు రజాయసు పాఈ ॥ 1 ॥
గఏ సుమంత్రు తబ రాఉర మాహీఀ । దేఖి భయావన జాత డెరాహీఀ ॥
ధాఇ ఖాఇ జను జాఇ న హేరా । మానహుఀ బిపతి బిషాద బసేరా ॥ 2 ॥
పూఛేఀ కోఉ న ఊతరు దేఈ । గఏ జేహిఀ భవన భూప కైకేఈ ॥
కహి జయజీవ బైఠ సిరు నాఈ । దేఖి భూప గతి గయఉ సుఖాఈ ॥ 3 ॥
సోచ బికల బిబరన మహి పరేఊ । మానహుఀ కమల మూలు పరిహరేఊ ॥
సచిఉ సభీత సకఇ నహిఀ పూఛీ । బోలీ అసుభ భరీ సుభ ఛూఛీ ॥ 4 ॥

"రాజుగారు ప్రతిదినము రాత్రిచివరిజామముననే నిద్రలేచెడి వారు. ఈనాడు ఇంత వఱకును నిద్రలేవకుండుట మాకు ఆశ్చర్యమును కలిగించు చున్నది. సుమంత్రా! పొమ్ము, రాజు గారిని నిద్రలేపుము. వారి ఆజ్ఞలతో మేము మా పనులలో నిమగ్నులమయ్యెదము." అని వారు పలికిరి. సుమంత్రుడు రాజప్రాసాదమున ప్రవేశింపగనే అచటి విషాదకర దృశ్యమును జూచి భయపడెను. కనబడని ఒక పెనుభూతము అతనిపైబడి మ్రింగునాయనునట్లు ఉండెను. విపత్తు విషాదములకు అది నెలవుగా కనబడెను. ఎవ్వరిని అడిగినను ఏమియును చెప్పకుండిరి. పిమ్మట అతడు కైకేయిమందిరమున ప్రవేశించెను. 'జయము జయము మహారాజునకు' అని పలికి, అతడు తలవంచుకొని కూర్చుండెను, రాజుగారిస్థితిని జూచి, చింతాక్రాంతుడయ్యెను. కమలము మూలమునుండి వేఱై, క్రిందపడివాడిపోయినట్లు రాజుగారు నేలపై పడియుండిరి. ఆయన ముఖము వివర్ణమై శోకాకులమైయుండెను. భయముతో మంత్రి ఏమియు అడుగజాలక పోయెను. దోషపూరితయు, గుణరహితయు ఐన కైకేయి పలికెను. (చౌ॥ 1-4)

దో- పరీ న రాజహి నీద నిసి, హేతు జాన జగదీసు ।
రాము రాము రటి భోరు కియ, కహఇ న మరము మహీసు ॥ 38 ॥

"రాజుగారు రాత్రియంతయు నిద్రింపలేదు. దానికిగల కారణమును దేవుడే యెఱుంగును. తెల్లవాఱువఱకు 'రామా! రామా! యనుట తప్ప మఱేమియు చేయలేదు. కారణమేమో తెలుపలేదు. (దో॥ 38)

చౌ- ఆనహు రామహి బేగి బోలాఈ । సమాచార తబ పూఁఛేహు ఆఈ ॥
చలేఉ సుమంత్రు రాయ రుఖ జానీ । లఖీ కుచాలి కీన్హి కఛు రానీ ॥ 1 ॥
సోచ బికల మగ పరఇ న పాఊ । రామహి బోలి కహిహి కా రాఊ ॥
ఉర ధరి ధీరజు గయఉ దుఆరేఁ । పూఁఛహిఁ సకల దేఖి మను మారేఁ ॥ 2 ॥
సమాధాను కరి సో సబహీ కా । గయఉ జహాఁ దినకర కుల టీకా ॥
రామ సుమంత్రహి ఆవత దేఖా । ఆదరు కీన్హ పితా సమ లేఖా ॥ 3 ॥
నిరఖి బదను కహి భూప రజాఈ । రఘుకులదీపహి చలేఉ లేవాఈ ॥
రాము కుభాఁతి సచివ సఁగ జాహీఁ । దేఖి లోగ జహఁ తహఁ బిలఖాహీఁ ॥ 4 ॥

వెంటనే వెళ్లి, రాముని ఇచటికి పిలుచుకొని రమ్ము. వచ్చిన పిమ్మట విషయమును తెలిసికొనవచ్చును." రాజుగారి వైఖరిని బట్టి రాణియేదో కుతంత్రమును పన్నినట్లు ఊహించుచు సుమంత్రుడు అచటినుండి వెడలి పోయెను. 'శ్రీరామచంద్రుని పిలిచి రాజుగారు ఏమి పలుక వచ్చును?" ఈ ఆలోచనలతో కలతచెందిన సుమంత్రుడు ముందుకు నడువలేక పోయెను. మనస్సును దృఢపఱచుకొని రాజద్వారమును జేరెను. చింతాక్రాంతుడుగా నున్న ఆయనను జూచి అందఱును కారణమడుగసాగిరి. వారికి ఎల్లరకును సర్దిచెప్పి, అతడు సూర్యకుల తిలకుడైన శ్రీరామచంద్రునిమందిరమునకు చేరెను. శ్రీరాముడు సుమంత్రుని పితృతుల్యునిగా భావించి, గౌరవించెను. సుమంత్రుడు శ్రీరామునకు రాజాజ్ఞను వినిపించి, రఘుకులదీపమైన రాముని తనవెంట నిడుకొని బయలు దేఱెను. ఛత్ర చామరములు లేకుండ పాదచారియై మంత్రితో వచ్చు రాముని జూచి ప్రజలు మిక్కిలి వగచిరి. (చౌ॥ 1-4)

దో- జాఇ దీఖ రఘుబంసమని, నరపతి నిపట కుసాజు ।
సహమి పరేఉ లఖి సింఘినిహి, మనహుఁ బృద్ధ గజరాజు ॥ 39 ॥

ఒక ఆడు సింహమును జూచి భీతిల్లి, నేలపై పడిన ఏనుగువలె శోకసంతప్తహృదయుడై అస్తవ్యస్తముగా పడియున్న రాజును శ్రీరామచంద్రుడు చూచెను. (దో॥ 39)

చౌ- సూఖహిఁ అధర జరఇ సబు అంగూ । మనహుఁ దీన మనిహీన భుఅంగూ ॥
సరుష సమీప దీఖి కైకేఈ । మానహుఁ మీచు ఘరీఁ గని లేఈ ॥ 1 ॥
కరునామయ మృదు రామ సుభాఊ । ప్రథమ దీఖ దుఖు సునా న కాఊ ॥
తదపి ధీర ధరి సమఉ బిచారీ । పూఁఛీ మధుర బచన మహతారీ ॥ 2 ॥
మోహి కహు మాతు తాత దుఖ కారన । కరిఅ జతన జేహిఁ హోఇ నివారన ॥
సునహు రామ సబు కారన ఏహూ । రాజహి తుమ్హ పర బహుత సనేహూ ॥ 3 ॥
దేన కహెన్హి మోహి దుఇ బరదానా । మాగేఉఁ జో కఛు మోహి సోహానా ॥
సో సుని భయఉ భూప ఉర సోచూ । ఛాడి న సకహిఁ తుమ్హార సఁకోచూ ॥ 4 ॥

రాజుపెదవులు ఎండిపోయియుండెను. ప్రత్యంగము(జ్వరముతో) కాలిపోవు చుండెను. మణిహీనమైన సర్పమువలె అతడు నిస్సహాయస్థితిలో పడియుండెను. రాజుగారి అంతిమ ఘడియలను లెక్కపెట్టుచున్న

మృత్యుదేవతవలె సమీపముననే కైకేయి క్రోధమూర్తియై నిలబడియుండెను. శ్రీరామచంద్రుడు కోమలస్వభావుడు, కరుణామూర్తి, అతడెన్నడును దుఃఖమునుగూర్చియే వినియుండలేదు. ఈ శోక వాతావరణము జూచుట ఆయనకు ఇదియే మొదటిసారి. ఐనను సందర్భమును గుర్తించి, ధైర్యము వహించి, మృదువుగా అడిగెను. 'మాతా! పితృదేవులదుఃఖకారణమేమో తెల్పుడు తెలిసినచో దుఃఖనివారణప్రయత్నమును చేయవచ్చును." అప్పుడు ఆమె సమాధానమిచ్చెను." రామా! రాజుగారి దుఃఖమునకు నీమీది ప్రేమయే కారణము. వీరు నాకు రెండు వరములను ఇచ్చుటకు వాగ్దానముచేసి యుండిరి. నాకు ఇష్టములైన వరములను నేను అడిగితిని. దానిని విని రాజు గారి హృదయము దుఃఖపూరితమైనది. ఏలనన వారు నీమీది మమకారమును వదలుకొనలేకున్నారు. (చౌ॥ 1-4)

దో- సుత సనేహు ఇత బచను ఉత, సంకట పరేఉ నరేసు।
సకహు న ఆయసు ధరహు సిర, మేటహు కఠిన కలేసు ॥ 40 ॥

ఒకవైపు పుత్రప్రేమ, మఱియొకవైపు ప్రతిజ్ఞాపాలనము- ఈ రెండింటి మధ్య నిర్ణయము తీసికొనలేక రాజుగారు ధర్మసంకటమునకు లోనైనారు. సాధ్యమైనచో ఆయన ఆజ్ఞను శిరసావహింపుము. ఆయన దుర్భర దుఃఖమును రూపుమాపుము. (దో॥ 40)

చౌ- నిధరక బైఠి కహఇ కటు బానీ। సునత కఠినతా అతి అకులానీ॥
జీభ కమాన బచన సర నానా। మనహుఁ మహిప మృదు లచ్ఛ సమానా॥ 1॥
జను కఠోరపను ధరేఁ సరీరూ। సిఖఇ ధనుషబిద్యా బర బీరూ॥
సబు ప్రసంగు రఘుపతిహి సునాఈ। బైఠి మనహుఁ తను ధరి నిఠురాఈ॥ 2॥
మన ముసుకాఇ భానుకుల భానూ। రాము సహజ ఆనంద నిధానూ॥
బోలే బచన బిగత సబ దూషన। మృదు మంజుల జను బాగబిభూషన॥ 3॥
సును జననీ సోఇ సుతు బడభాగీ। జో పితు మాతు బచన అనురాగీ॥
తనయ మాతు పితు తోషనిహారా। దుర్లభ జనని సకల సంసారా॥ 4॥

సంకోచమనునదియేమాత్రము లేక కైకేయి పలికిన కఠోరవచనములను కఠోరత్వమే తలవంచు కొనెను. ఆమె నాలుక ఒక ధనుస్సుకాగా ఆమె వచనములు బాణములు. అవి నేరుగా దశరథుని హృదయమున గ్రుచ్చుకొనెను. కాఠిన్యము అస్త్రవిద్యను అభ్యసించుచున్నట్లుండెను. మూర్తీభవించిన నిష్ఠురత్వమువలె కైకేయి కూర్చొని కథనంతయు శ్రీరామునకు వివరించెను. స్వభావతః ఆనంద స్వరూపుడైన శ్రీరామచంద్రుడు మనస్సులో నవ్వుకొని, దోషరహితములైన కోమలమధురవచనములను పలికెను. అవి వాగ్దేవి ఆభరణములాయనునట్లుండెను. "మాతా! వినుము. మాతాపితరుల ఆజ్ఞలను పాలించుటయందు అనురాగముగల పుత్రుడే నిజముగా భాగ్యశాలి. జననీ! తల్లిదండ్రులను సంతృప్తిపఱచుపుత్రుడు ప్రపంచములో దుర్లభుడు. (చౌ॥ 1-4)

దో- మునిగన మిలను బిసేషి బన, సబహి భాఁతి హిత మోర।
తేహి మహఁ పితు ఆయసు బహురి, సమ్మత జననీ తోర॥ 41॥

వనములో గూడ అన్ని విధముల నాకు మేలే జరుగును. అక్కడ ముఖ్యముగా మునులతో సమాగమమగును. పైగా మీరు చెప్పినట్లు ఇది మా తండ్రిగారి ఆజ్ఞ. దీనికి మీ సమ్మతియు కలదు. (దో॥ 41)

చౌ- భరతు ప్రానప్రియ పావహిఁ రాజూ । బిధి సబ బిధి మోహి సనముఖ ఆజూ ॥
జౌఁ న జాఉఁ బన ఐసెహు కాజా । ప్రథమ గనిఅ మోహి మూఢ సమాజా ॥ 1 ॥
సేవహిఁ అరఁడు కలపతరు త్యాగీ । పరిహరి అమృత లేహిఁ బిషు మాగీ ॥
తెఉ న పాఇ అస సమఉ చుకాహీఁ । దేఖు బిచారి మాతు మన మాహీఁ ॥ 2 ॥
అంబ ఏక దుఖు మోహి బిసేషీ । నిపట బికల నరనాయకు దేఖీ ॥
థోరిహిఁ బాత పితహి దుఖ భారీ । హోతి ప్రతీతి న మోహి మహతారీ ॥ 3 ॥
రాఉ ధీర గున ఉదధి అగాధూ । భా మోహి తేఁ కఛు బడ అపరాధూ ॥
జాతేఁ మోహి న కహాత కఛు రాఊ । మోరి సపథ తోహి కహు సతిభాఊ ॥ 4 ॥

నాబహిఃప్రాణమైన భరతుడు రాజ్యమేలును. విధాత నేడు నాకంతయును అనుకూలముగనే చేయుచున్నాడు. ఇట్టి పరిస్థితులలోగూడ వనములకు పోనిచో నేనొక మహామూర్ఖుడనే అగుదును. ఇట్టి సదవకాశమును వదలుకొనుట కల్పవృక్షమును కాదని ఆముదపు చెట్టునకై ఆరాటపడుట వంటిది. అమృతమును నిరాకరించి, విషమును కోరుకొనుటవంటిది. కాని మాతా! మహారాజు మిగుల వ్యాకులపాటుతో ఉండుట చూచి, నాకు మిక్కిలి దుఃఖము కలుగు చున్నది. ఇంత చిన్నవిషయమునకే తండ్రిగారు ఇంతగా దుఃఖితులైనారా? నిజముగా నాకు విశ్వాసము కలుగుట లేదు. మహారాజుగారు ధీరులు, సద్గుణనిధులు వాస్తవముగా నావలన ఏదో మహాపరాధము జరిగియుండవచ్చును. అందువలననే రాజుగారు నాతో మాట్లాడుట లేదు కాబోలును. తల్లీ! నామీద ఒట్టు, నిజము వచింపుడు. (చౌ॥ 1-4)

దో- సహజ సరల రఘుబర బచన, కుమతి కుటిల కరి జాన।
చలఇ జోఁక జల బక్రగతి, జద్యపి సలిలు సమాన ॥ 42 ॥

రఘునాథుని పలుకులు స్వాభావికముగా నిర్మలములేయైనను దుర్బుద్ధియైన కైకేయి వాటిని వక్రముగానే అర్థము చేసికొనెను. నీరు ఎంత ప్రశాంతముగా నేరుగా ప్రవహించినను అందులో జలగ వక్రముగనే సంచరించును. (దో॥ 42)

చౌ- రహసీ రాని రామ రుఖ పాఈ । బోలీ కపట సనేహు జనాఈ ॥
సపథ తుమ్హార భరత కై ఆనా । హేతు న దూసర మైఁ కఛు జానా ॥ 1 ॥
తుమ్హ అపరాధ జోగు నహిఁ తాతా । జననీ జనక బంధు సుఖదాతా ॥
రామ సత్య సబు జో కఛు కహహూ । తుమ్హ పితు మాతు బచన రత అహహూ ॥ 2 ॥
పితహి బుఝాఇ కహహు బలి సోఈ । చౌథేఁపన జెహిఁ అజసు న హోఈ ॥
తుమ్హ సమ సుఅన సుకృత జెహిఁ దీన్హే । ఉచిత న తాసు నిరాదరు కీన్హే ॥ 3 ॥

లాగహిం కుముఖ బచన సుభ కైసే । మగహం గయాదిక తీరథ జైసే ॥
రామహి మాతు బచన సబ భాఏ । జిమి సురసరి గత సలిల సుహాఏ ॥ 4 ॥

శ్రీరాముని వినయమునకు కైకేయి ప్రసన్నచిత్తయై, కపట ప్రేమను నటించుచు, "నీపైన, భరతునిపైన ఒట్టు, రాజుగారి దుఃఖమునకు మఱియొక కారణమును నేనెఱుగను." అని యనెను. "నాయనా! నీవు తల్లిదండ్రులయెడల అపరాధముచేయుట అసంభవము. నీవు తల్లిదండ్రులకును సోదరులకును ఆనందమునిచ్చువాడవు. సత్యమునే పల్కుచుంటివి. మాతాపితృవాక్యపరిపాలనాతత్పరుడవు. ప్రేమతో పల్కుచుంటివి. ఈ ముసలితనములో మీ తండ్రిగారికి అపకీర్తి రాకుండునట్లు ఆయనకు నచ్చజెప్పుము. ఏ పుణ్యఫలమువలన నీవంటిపుత్రుడు కలిగెనో దానిని నిరాదరణచేయుట మంచిదిగాదు." దుర్భాషలాడు కైకేయి ముఖమునుండి మగధదేశములో గయాక్షేత్రమువలె ఇచ్చకపు మాటలు వచ్చుచుండెను. కాని అన్ని విధములైన జలప్రవాహము (మంచి చెడు)లు గూడ గంగానది(జలముల)లో చేరిన పిదప పవిత్రములుగానే భావింపబడినట్లు శ్రీరామచంద్రునకు ఆమెవాక్కులు శుభములుగనే అనిపించెను. (చౌ॥ 1-4)

దో- గఇ మురుఛా రామహి సుమిరి, నృప ఫిరి కరవట లీన్హ ।
సచివ రామ ఆగమన కహి, బినయ సమయ సమ కీన్హ ॥ 43 ॥

రాజుగారు మూర్ఛనుండి తేరుకొని, రామచంద్రుని స్మరించుచు ప్రక్కకు మఱలి పండుకొనిరి. శ్రీరామచంద్రుడు అచటికి వచ్చినవిషయమును చెప్పి, మంత్రి సమయాను కూలమగు విజ్ఞప్తిని జేసెను. (దో॥ 43)

చౌ- అవనిప అకని రాము పగు ధారే । ధరి ధీరజు తబ నయన ఉఘారే ॥
సచివం సంభారి రాఉ బైఠారే । చరన పరత నృప రాము నిహారే ॥ 1 ॥
లిఏ సనేహ బికల ఉర లాఈ । గై మని మనహుం ఫనిక ఫిరి పాఈ ॥
రామహి చితఇ రహెఉ నరనాహూ । చలా బిలోచన బారి ప్రబాహూ ॥ 2 ॥
సోక బిబస కఛు కహై న పారా । హృదయం లగావత బారహిం బారా ॥
బిధిహి మనావ రాఉ మన మాహీం । జెహిం రఘునాథ న కానన జాహీం ॥ 3 ॥
సుమిరి మహేసహి కహఇ నిహోరీ । బినతీ సునహు సదాసివ మోరీ ॥
ఆసుతోష తుమ్హ అవఢర దానీ । ఆరతి హరహు దీన జను జానీ ॥ 4 ॥

శ్రీరామచంద్రుడు వచ్చినవార్త చెవిసోకగనే రాజు ధైర్యమువహించి మెల్లగా కన్నులు దెఱచెను. ఆయనను మంత్రి తిన్నగా కూర్చుండ బెట్టెను. శ్రీరాముడు ఆయనకు పాదాభివందనమాచరించెను. సర్పము తాను పోగొట్టుకొనిన మణిని మఱల పొందినట్లు ప్రేమచే వ్యాకులుడైన దశరథుడు శ్రీరాముని తనహృదయమునకు హత్తుకొనెను. శ్రీరాముని చూడగనే దశరథుని కన్నులు అశ్రుపూర్ణములయ్యెను. శోకవివశుడైన రాజు మాట్లాడలేక పోయెను. మాటి మాటికిని శ్రీరామచంద్రుని తనఱక్కున జేర్చుకొనుచుండెను. 'శ్రీరాముడు అడవులకు పోకుండుగాక' అని అతడు తనమనస్సులోనే విధికి విన్నవించుకొనుచుండెను. అతడు శివుని స్మరించుచు ప్రార్థించెను. "ఓసదాశివా! నా ప్రార్థనను ఆలకింపుము. నీవు ఆశుతోషుడవు (శీఘ్రముగా సంతసించు వాడవు), కోరిన కోరికలను దీర్చువాడవు. ఈ దీనసేవకునిదుఃఖమును దూరముచేయుము. (చౌ॥ 1-4)

దో- తుమ్హ ప్రేరక సబ కే హృదయఁ, సో మతి రామహి దేహు ।
బచను మోర తజి రహహిఁ ఘర, పరిహరి సీలు సనేహు ॥ **44** ॥

నీవు అందఱిహృదయములకును ప్రేరణగలిగించువాడవు. శ్రీరామచంద్రుడు నా వచనములను పాటింపక తన సహజ స్నేహశీలస్వభావములను వీడి, ఇంటిలో ఉండునట్లు అతనికి బుద్ధిని ప్రసాదింపుము. (దో॥ 44)

చౌ- అజసు హోఉ జగ సుజసు నసాఊ । నరక పరౌఁ బరు సురపురు జాఊ ॥
సబ దుఖ దుసహ సహావహు మోహీ । లోచన ఓట రాము జని హోంహీ ॥ **1** ॥
అస మన గునఇ రాఉ నహిఁ బోలా । పీపర పాత సరిస మను డోలా ॥
రఘుపతి పితహి ప్రేమబస జానీ । పుని కఛు కహిహి మాతు అనుమానీ ॥ **2** ॥
దేస కాల అవసర అనుసారీ । బోలే బచన బినీత బిచారీ ॥
తాత కహఉఁ కఛు కరఉఁ ఢిఠాఈ । అనుచితు ఛమబ జాని లరికాఈ ॥ **3** ॥
అతి లఘు బాత లాగి దుఖు పావా । కాహుఁ న మోహి కహి ప్రథమ జనావా ॥
దేఖి గోసాఇఁహి పూఁఛిఉఁ మాతా । సుని ప్రసంగు భఏ సీతల గాతా ॥ **4** ॥

ఈ కార్యమువలన నా ప్రతిష్ఠదెబ్బ తిని, నాకు అపకీర్తి వచ్చినను వచ్చుగాక. స్వర్గము లభ్యముగాక నరకమే ప్రాప్తించు గాక, ఎట్టి దుఃఖములనైనను సహింపగలను గాని శ్రీరాముని చూడకుండ మాత్రము ఉండలేను. కనుక ఆతనిని నానుండి దూరము చేయవలదు." ఈ విధముగా రాజు తనమనస్సులోనే కలవరపడుచుండెను. కాని బయటికి మాట్లాడలేకుండెను. ఆయన మనస్సు రావిఆకువలె కొట్టుకొనుచుండెను. తండ్రి ప్రేమవివశుడగుటను జూచి, కైక మఱల ఏమైనను జెప్పినచో తండ్రిగారు మిక్కిలి విలవిలలాడుదురని భావించి, దేశకాల- అవసరములకు అనుగుణముగా శ్రీరాముడు నమ్రవచనములను పల్కెను. "నాయనగారూ! నేను ఒకవిషయమును చెప్పుటకు సాహసించుచున్నాను. నా ఈ అనుచితకార్యమును బాల్యచేష్టగా భావించి క్షమింపుడు. ఇంత చిన్నవిషయమునకై మీరు ఇంతగా దుఃఖపడుచున్నారు. ఎవ్వరును ఈ విషయమును నాకు ముందుగా తెల్పియుండలేదు. మీరు దుఃఖితులగుటను జూచి, నేను తల్లిగారిని అడిగితిని. ఆమెవలన విషయమునంతయును విని, ప్రశాంత చిత్తుడనైతిని. (చౌ॥ 1-4)

దో- మంగల సమయ సనేహ బస, సోచ పరిహరిఅ తాత ।
ఆయసు దేఇఅ హరషి హియఁ, కహి పులకే ప్రభు గాత ॥ **45** ॥

తండ్రిగారూ! సంతోషింప వలసిన సమయమున ప్రేమవిహ్వలురై విచారపడకుడు. ప్రసన్న చిత్తముతో నన్ను ఆజ్ఞాపింపుడు." ఈ మాటలను పలుకుచుండగా శ్రీరామునిశరీరము పులకించి పోయెను. (దో॥ 45)

చౌ- ధన్య జనము జగతీతల తాసూ । పితహి ప్రమోదు చరిత సుని జాసూ ॥
చారి పదారథ కరతల తాకే । ప్రియ పితు మాతు ప్రాన సమ జాకే ॥ **1** ॥

ఆయసు పాలి జనమ ఫలు పాఈ । ఐహఉఁ బేగిహిఁ హోఉ రజాఈ ॥
బిదా మాతు సన ఆవఉఁ మాగీ । చలిహఉఁ బనహి బహురి పగ లాగీ ॥ 2 ॥
అస కహి రామ గవను తబ కీన్హా । భూప సోక బస ఉతరు న దీన్హా ॥
నగర బ్యాపి గఇ బాత సుతీఛీ । ఛుఅత చఢీ జను సబ తన బీఛీ ॥ 3 ॥
సుని భఏ బికల సకల నర నారీ । బేలి బిటప జిమి దేఖి దవారీ ॥
జో జహఁ సునఇ ధునఇ సిరు సోఈ । బడ బిషాదు నహిఁ ధీరజు హోఈ ॥ 4 ॥

(తులసీదాసు పలుకుచున్నాడు) ఈ పృథ్వియందు ఎవనిచరిత్రను విని, అతని తండ్రి పరమానందభరితుడగునో అట్టికుమారునిజన్మ ధన్యము. తనతల్లిదండ్రులను ప్రాణతుల్యులనుగా ప్రేమించు కుమారునకు ధర్మార్థకామమోక్షములు కరతలామలకములు. "మీ ఆజ్ఞను పాటించి, నా జన్మను సఫలమొనర్చుకొని, శీఘ్రముగా తిరిగి రాగలను. నాకు అనుజ్ఞ నిండు. నేను తల్లిగారిఅనుమతిని గైకొని వత్తును. మఱల మీ పాదములకడ ప్రణమిల్లి, వనములకు వెళ్లెదెను" ఇట్లు పల్కి, శ్రీరాముడు వెళ్లిపోయెను. శోకతప్తుడైన రాజు ఏమియు పలుక జాలక పోయెను. ఈ దారుణవార్త నగరమునందంతటను తేలుకుట్టిన శరీరమున విషము వలె ప్రాకెను. దావానలముయొక్క సెగలు సోకినంతనే తీగలు. వృక్షములు వివర్ణములైనట్లు ఈ వార్తను విన్న స్త్రీ పురుషులముఖములన్నియును వెలవెల బోయెను. ప్రతివ్యక్తియు ఈవార్తకు చలించి, తలబాదుకొనుచు ఎక్కడి వారక్కడ కూలబడిరి. ఈ దుఃఖము దుర్భరమైనది. (చౌ॥ 1-4)

దో- ముఖ సుఖాహిఁ లోచన స్రవహిఁ, సోకు న హృదయఁ సమాఇ ।
మనహుఁ కరున రస కటకఈ, ఉతరీ అవధ బజాఇ ॥ 46 ॥

వారి ముఖములెండి పోయెను. కన్నీరు మున్నీరయ్యెను. హృదయములు శోక సంతప్తములయ్యెను. కరుణరసవాహిని ఢంకామ్రోగించి, అయోధ్యలో దిగినట్లాయెను. పురమంతయు శోకాకులమయ్యెను. ఆనందము పలాయనము చిత్తగించెను. (దో॥ 46)

చౌ- మిలెహి మాఝ బిధి బాత బెగారీ । జహఁ తహఁ దేహిఁ కైకఇహి గారీ ॥
ఏహి పాపినిహి బూఝి కా పరెఉ । ఛాఇ భవన పర పావకు ధరెఉ ॥ 1 ॥
నిజ కర నయన కాఢి చహ దీఖా । డారి సుధా బిషు చాహత చీఖా ॥
కుటిల కఠోర కుబుద్ధి అభాగీ । భఇ రఘుబంస బేను బన ఆగీ ॥ 2 ॥
పాలవ బైఠి పేడు ఏహిఁ కాటా । సుఖ మహుఁ సోక ఠాటు ధరి ఠాటా ॥
సదా రాము ఏహి ప్రాన సమానా । కారన కవన కుటిలపను ఠానా ॥ 3 ॥
సత్య కహహిఁ కబి నారి సుభాఊ । సబ బిధి అగహు అగాధ దురాఊ ॥
నిజ ప్రతిబింబు బరుకు గహి జాఈ । జాని న జాఇ నారి గతి భాఈ ॥ 4 ॥

పౌరులు పల్కుచుండిరి. "అన్ని ఏర్పాట్లును జరిగిన తరువాత విధి ఈ కార్యక్రమమునంతయును చెడగొట్టెను." మూలమూలలయందును (ప్రతిప్రదేశమునందును) ప్రజలు కైకేయిని తిట్టిపోయుచుండిరి. "ఈ పాపాత్మురాలు క్రొత్తగా నిర్మించిన భవనమును తగులబెట్టుటకు ఏల ప్రయత్నించుచున్నది? అరే! ఈమె చేజేతులా తన కన్నులను పెకలించి, తానే చూడగోరుచున్నది? అమృతమును పాఱబోసి విషమును రుచి చూచుచున్నది. ఈ కుటిల కఠోర దుర్బుద్ధి, దౌర్భాగ్యురాలు కైక రఘువంశముఅనెడివనమును కాల్చెడి అగ్నియైనది. తాను కూర్చున్నకొమ్మను తానే నఱకుకొనుచున్నది. శుభానందోత్సాహములమధ్య దుర్భర శోకములను సృష్టించినది. రాముడు ఈమెకు సర్వదా ప్రాణసమానుడు. మఱి ఆమె ఇంత కుటిలత్వమును కాఠిన్యమును వహించుటకుగల కారణమేమి? కవులపలుకులు వాస్తవములు. స్త్రీల స్వభావములు అగ్రాహ్యములు, అగాధములు. ఎవ్వరైనను తమనీడనైనను పట్టుకొనవచ్చునేమోగాని స్త్రీలచిత్తములను దెలిసికొనుట కష్టము. అవి భేదబుద్ధితో నిండియుండును. (చౌ॥ 1-4)

దో- కాహ న పావకు జారి సక, కా న సముద్ర సమాఇ।
కా న కరై అబలా ప్రబల, కెహి జగ కాలు న ఖాఇ ॥ 47 ॥

అగ్నిచే కాల్చబడనిదేది? సముద్రమున మునగని వస్తువేది? అట్లే స్త్రీ ప్రబలయైనచో ఆమె చేయజాలని పనియేమి? ఈ నశ్వరజగత్తున మృత్యువుచే కబళింపబడనిదేది? (దో॥ 47)

చౌ- కా సునాఇ బిధి కాహ సునావా। కా దెఖాఇ చహ కాహ దెఖావా ॥
ఏక కహహిఀ భల భూప న కీన్హా। బరు బిచారి నహిఀ కుమతిహి దీన్హా ॥ 1 ॥
జో హఠి భయఉ సకల దుఖ భాజను। అబలా బిబస గ్యాను గును గా జను ॥
ఏక ధరమ పరమితి పహిచానే। నృపహి దోసు నహిఀ దేహిఀ సయానే ॥ 2 ॥
సిబి దధీచి హరిచంద కహానీ। ఏక ఏక సన కహహిఀ బఖానీ ॥
ఏక భరత కర సమ్మత కహహీఀ। ఏక ఉదాస భాయఀ సుని రహహీఀ ॥ 3 ॥
కాన మూది కర రద గహి జీహా। ఏక కహహిఀ యహ బాత అలీహా ॥
సుకృత జాహిఀ అస కహత తుమ్హారే। రాము భరత కహుఀ ప్రానపిఆరే ॥ 4 ॥

బ్రహ్మ మొదట నిర్ణయించినదేమి? ఇప్పుడు ప్రకటించినదేమి? అతడు చూపదలచిన దృశ్యమేమి? ఇప్పుడు చూపించినదేమి? ఒక పౌరుడిట్లు పలికెను. "రాజుగారు దుర్బుద్ధియైన కైకేయికి వరములనిచ్చుట మంచిపనిగాదు. ముందు వెనుకల నాలోచింపక ఇచ్చిన వరములు దుఃఖములకు మూలములైనవి. ముఖ్యముగా స్త్రీకివశమగుటవలన తనజ్ఞానగుణములను కోల్పోయినాడు. "ధర్మమునెఱింగిన మఱికొందఱు బుద్ధిమంతులు రాజును దోషిగా భావింప లేదు. వారు పరస్పరము సత్యవ్రతులైన శిబి, దధీచి, హరిశ్చంద్రుల కథలను చెప్పికొనుచుండిరి. బహుశా ఇది భరతుని సన్నాగమై యుండవచ్చునని కొందఱు ఊహించిరి. కాని ఇతరులు ఈ మాటను వినియు మౌనము వహించిరి. మఱికొందఱు చెవులు మూసికొని, నాలుకలు కఱచుకొని ఆశ్చర్యమును ప్రకటించుచు "ఇది అబద్ధము. ఇట్టి మాటలు పల్కినచో నీ పుణ్యము నశించును. భరతునకు శ్రీరాముడు ప్రాణతుల్యుడు. (చౌ॥ 1-4)

దో- చందు చవై బరు అనల కన, సుధా హోఇ బిషతూల ।
సపనేహుఁ కబహుఁ న కరహిఁ కిఛు, భరతు రామ ప్రతికూల ॥ **48** ॥

చంద్రుడు శీతల కిరణములకు మాఱుగా అగ్నిని కురియవచ్చును. అమృతము విషము గావచ్చును. కాని భరతుడు కలలోగూడ శ్రీరామచంద్రునకు ప్రతికూలముగా ఏకార్యమును చేయనే చేయడు. (దో॥ 48)

చౌ- ఏక బిధాతహి దూషను దేహీఁ । సుధా దెఖాఇ దీన్హ బిషు జేహీఁ ॥
ఖరభరు నగర సోచు సబ కాహూ । దుసహ దాహు ఉర మిటా ఉఛాహూ ॥ **1** ॥
బిప్రబధూ కులమాన్య జఠేరీ । జే ప్రియ పరమ కైకఈ కేరీ ॥
లగీఁ దేన సిఖ సీలు సరాహీ । బచన బానసమ లాగహిఁ తాహీ ॥ **2** ॥
భరతు న మొహి ప్రియ రామ సమానా । సదా కహహు యహు సబు జగు జానా ॥
కరహు రామ పర సహజ సనేహూ । కెహిఁ అపరాధ ఆజు బను దేహూ ॥ **3** ॥
కబహుఁ న కియహు సవతి ఆరేసూ । ప్రీతి ప్రతీతి జాన సబు దేసూ ॥
కౌసల్యాఁ అబ కాహ బిగారా । తుమ్హ జెహి లాగి బజ్ర పుర పారా ॥ **4** ॥

కొందఱు విధాతను దూషించిరి. అతడు అమృతమును జూపి, విషమును ఇచ్చినాడనిరి. నగరమంతయు అల్లకల్లోలమాయెను. ప్రతివ్యక్తియు విషాదమునకు గురియయ్యెను. వారి హృదయములలో దుస్సహమైనబాధ, దుర్భరమైనవేదన నిండియుండెను. ఉత్సాహము అడుగంటెను. బ్రాహ్మణ స్త్రీలు వృద్ధలైన కులస్త్రీలు, కైకేయికి ప్రీతిపాత్రలైనవారు ఆమె సౌశీల్యమును పొగడుచు, ఆమెకు నచ్చజెప్పసాగిరి. కాని వారిహితవచనములు ఆమె చెవులకు ములుకులయ్యెను. వారు ఇట్లు పలుకసాగిరి. "నాకు భరతునికంటెను శ్రీరామచంద్రుడే మిక్కిలి ప్రేమపాత్రుడని ఇంతవఱకును నీవు చెప్పుచుంటివి గదా! ఈ విషయము జగత్ప్రసిద్ధము. నీకు శ్రీరామునిపై సహజముగా ప్రేమగలదు. మఱి వనములకు పంపుటకు అతడు చేసిన అపరాధమేమి? నీవు ఎప్పుడును సవతులపై ఈర్ష్య చెందలేదు. వారియెడల నీకు గల ప్రేమవిశ్వాసములను అందఱును ఎఱుగుదురు. కౌసల్య నీకు చేసిన అపకారమేమి? నగర ప్రజలపై ఈ వజ్రాయుధమును ఏల ప్రయోగించితివి? (చౌ॥ 1-4)

దో- సీయ కి పియ సఁగు పరిహరిహి, లఖను కి రహిహహిఁ ధామ ।
రాజు కి భూఁజబ భరత పుర, నృపు కి జిఇహి బిను రామ ॥ **49** ॥

సీతాదేవి శ్రీరాముని విడిచియుండగలదా? లక్ష్మణుడు ఇంటిలో నిలుచునా? శ్రీరాముడు లేని అయోధ్యను భరతుడు ఏలునా? శ్రీరాముడు లేకుండ రాజు బ్రతుక గలడా? (దో॥ 49)

చౌ- అస బిచారి ఉర ఛాడహు కోహూ । సోక కలంక కోఠి జని హోహూ ॥
భరతహి అవసి దేహు జుబరాజూ । కానన కాహ రామ కర కాజూ ॥ **1** ॥
నాహిన రాము రాజ కే భూఖే । ధరమ ధురీన బిషయ రస రూఖే ॥
గుర గృహ బసహుఁ రాము తజి గేహూ । నృప సన అస బరు దూసర లేహూ ॥ **2** ॥

జౌఁ నహిఁ లగిహహు కహేఁ హమారే । నహిఁ లాగిహి కఛు హాథ తుమ్హారే ॥
జౌఁ పరిహాస కీన్హి కఛు హోఈ । తౌ కహి ప్రగట జనావహు సోఈ ॥ 3 ॥
రామ సరిస సుత కానన జోగూ । కాహ కహిహి సుని తుమ్హ కహుఁ లోగూ ॥
ఉఠహు బేగి సోఇ కరహు ఉపాఈ । జెహి బిధి సోకు కలంకు నసాఈ ॥ 4 ॥

ఈ విషయములను ఆలోచించి, నీ కోపమును మానుకొనుము. శోకకళంకములకు నెలవు కావలదు. భరతుని యువరాజుగా చేయదలచికొనినచో అవశ్యముగా చేయుము. కాని శ్రీరాముని అడవులకు పంపుట ఎందులకు? శ్రీరామునకు రాజ్యకాంక్ష లేదు. అతడు ధర్మమూర్తి. విషయ వాంఛలకు ఇష్టపడడు. శ్రీరాముడు ఇల్లు వదలి గురువు గారి ఇంటిలో నుండునట్లు రెండవ వరమును అడుగుము. నీవు మా సూచనలను పాటింపనిచో నీకెట్టి ప్రయోజనమూ చేకూరదు. ఒకవేళ ఇది అంతయు పరిహాసమునకై చేయుచున్నచో ఆ విషయమును స్పష్టముగా చెప్పుము. రామునివంటి పుత్రుడు వనవాసమునకు అర్హుడా? ఈ విషయమును విన్నచో లోకులు నిన్నేమందురు? త్వరగా లేచి, ఈ శోకమూ, కళంకమూ తొలగిపోవు ఉపాయమును చూడుము. (చౌ॥ 1-4)

ఛం- జెహి భాఁతి సోకు కలంకు జాఇ ఉపాయ కరి కుల పాలహీ ।
హఠి ఫేరు రామహి జాత బన జని బాత దూసరి చాలహీ ॥
జిమి భాను బిను దిను ప్రాన బిను తను చంద బిను జిమి జామినీ ।
తిమి అవధ తులసీదాస ప్రభు బిను సముఝి ధౌఁ జియఁ భామినీ ॥

ఈ విధముగా చేసినచో నగరవాసులశోకము తొలగిపోవును. నీకు కలిగెడి కళంకము మాసి పోవును. అట్టి ఉపాయమును చేసి, నీ వంశమును రక్షించుకొనుము. శ్రీరాముడు వనములకు పోకుండ నీవు ఎట్లైనను అతనిని ఆపుము. మఱియొక మాటనే పలుక వలదు. (తులసీదాసు పలుకుచున్నాడు) సూర్యుడు లేని పగలు, చంద్రుడు లేని రాత్రి, ప్రాణములు లేని శరీరము శోభావిహీనములగునట్లే శ్రీరాముడులేని అయోధ్య ఎట్టి కళాకాంతులులేక తన వైభవమును కోల్పోవును. కావున ఓ భామినీ! ఈ విషయములను గ్రహింపుము." (ఛం)

సో- సఖిన్హ సిఖావను దీన్హ, సునత మధుర పరినామ హిత ।
తెఇఁ కఛు కాన న కీన్హ, కుటిల ప్రబోధీ కూబరీ ॥ 50 ॥

సఖులు కైకేయికి వినుటకు మధురములు, పరిణామమున శుభంకరములు ఐన బోధలను చేసిరి. కాని కుటిల కుబ్జ మంథర చేసిన ఉపదేశము తన మనస్సున బాగుగా నాటుకొని యుండుట వలన ఆమె వారి మాటలను చెడచెవిన బెట్టెను. (సో॥ 50)

చౌ- ఉతరు న దేఇ దుసహ రిస రూఖీ । మృగిన్హ చితవ జను బాఘిని భూఖీ ॥
బ్యాధి అసాధి జాని తిన్హ త్యాగీ । చలీఁ కహత మతిమంద అభాగీ ॥ 1 ॥
రాజు కరత యహ దైఅఁ బిగోఈ । కీన్హేసి అస జస కరఇ న కోఈ ॥
ఎహి బిధి బిలపహిఁ పుర నర నారీఁ । దేహిఁ కుచాలిహి కోటిక గారీఁ ॥ 2 ॥

జరహిఁ బిసమ జర లేహిఁ ఉసాసా । కవని రామ బిను జీవన ఆసా ॥

బిపుల బియోగ ప్రజా అకులానీ । జను జలచర గన సూఖత పానీ ॥ 3 ॥

అతి బిషాద బస లోగ లోగాఈఁ । గఏ మాతు పహిఁ రాము గోసాఈఁ ॥

ముఖ ప్రసన్న చిత చౌగున చాఊ । మిటా సోచు జని రాఖై రాఊ ॥ 4 ॥

దుస్సహమైన కోపముతో క్రౌర్యము వహించిన కైకేయికన్నులు ఎఱుపెక్కెను. ఆమె వారికి ఎట్టి సమాధానమును ఇయ్యక, ఆకలిగొన్న ఆడుపులి జింకలవైపు జూచినట్లు ఆమె వారి వైపు చూచెను. ఆమెజబ్బు నయమగునదికాదని తెలిసికొని, మందబుద్ధి, అభాగిని అని ఆమెను నిందించుచు వారు వెడలిపోయిరి. ఆమెకు రాజ్యవైభవములు ఎన్నియున్నను విధి వాటిని దూరము చేసెను. ఆమె చేసిన ఈ దుష్కృత్యమును ఇతరులు ఊహించుటకును సాహసింపరు." ఈ విధముగా నగరములోని స్త్రీ పురుషులందఱును పరితపించిరి. కైకేయిని పెక్కురీతుల తిట్టిపోసిరి. అయోధ్యావాసులు శోకాగ్నిచే సంతప్తులైరి. దీర్ఘనిఃశ్వాసలు వదలుచు "రాముడు లేనిచోట బ్రతుకుపై ఆశ యెట్లుండును?" అనియనుకొనుచుండిరి. చెఱువులోని నీరు ఇంకిపోవునపుడు జలచరములవలె రామవియోగాశంకతో వారు వ్యాకులురైరి. స్త్రీ పురుషులందఱును విషాదవిహ్వలులైరి. ఇంతలో శ్రీరాముడు కౌసల్యామాతకడకు వెళ్లెను. ఆయనముఖము ప్రసన్నముగాను, మనస్సు మిక్కిలి ఉల్లాసముగాను ఉండెను. మహారాజు తనను వనములకు పోకుండా ఆపునేమోయను భయము ఏ మాత్రములేకుండ ఉండెను. (రాజ్యాభిషేకవార్త వినగానే తనసోదరులను వీడి, పెద్దవాడైన తనకే పట్టాభిషేకమును వీల చేయుచున్నారని ఇదివరలో శ్రీరాముడు విచారమును ప్రకటించియుండెను. ఇపుడు కైకేయిమాతఆజ్ఞ, తన తండ్రిగారి మౌనసమ్మతి తనవిచారమును దూరమొనర్చెనని శ్రీరాముడు సంతోషించెను. (చౌ॥ 1-4)

## శ్రీరాముని వినతి - తల్లి కౌసల్య అనుమతి

దో- నవ గయందు రఘుబీర మను, రాజు అలాన సమాన ।

ఛూట జాని బన గవను సుని, ఉర అనందు అధికాన ॥ 51 ॥

శ్రీ రఘునాథుని మానసికస్థితి అప్పుడే బంధింపబడినగున్నఏనుగువలె ఉండెను. రాజ్యాభిషేకము ఆయేనుగునుబంధించు పగ్గమువంటిది. వనవాసవార్తను విన్నంతనే బంధవిముక్తుడైనంత ఆనందమును అనుభవించెను. (దో॥ 51)

చౌ- రఘుకులతిలక జోరి దోఉ హాథా । ముదిత మాతు పద నాయఉ మాథా ॥

దీన్హి అసీస లాఇ ఉర లీన్హే । భూషన బసన నిఛావరి కీన్హే ॥ 1 ॥

బార బార ముఖ చుంబతి మాతా । నయన నేహ జలు పులకిత గాతా ॥

గోద రాఖి పుని హృదయఁ లగాఏ । స్రవత ప్రేమరస పయద సుహాఏ ॥ 2 ॥

ప్రేము ప్రమోదు న కఛు కహి జాఈ । రంక ధనద పదబీ జను పాఈ ॥

సాదర సుందర బదను నిహారీ । బోలీ మధుర బచన మహతారీ ॥ 3 ॥

కహహు తాత జననీ బలిహారీ । కబహిఁ లగన ముద మంగలకారీ ॥
సుకృత సీల సుఖ సీవఁ సుహాఈ । జనమ లాభ కఇ అవధి అఘాఈ ॥ 4 ॥

రఘువంశతిలకుడైన శ్రీరాముడు అంజలి ఘటించి, ప్రసన్నచిత్తముతో కౌసల్యామాత చరణములపై మోకరిల్లెను. తల్లి అతనిని ఆశీర్వదించి, తన హృదయమునకు హత్తుకొనెను. ఆయనను ఆభరణములతో నూతనవస్త్రములతో ముంచెత్తెను. మాటిమాటికిని శ్రీరాముని ముద్దాడెను. ఆమె శరీరము పులకించెను. కన్నులలో ఆనంద బాష్పములు పెల్లుబికెను. తన యొడిలో కూర్చుండ బెట్టుకొని అక్కున జేర్చుకొనెను. తల్లి వక్షఃస్థలమునుండి ప్రేమ స్తన్యములు పొంగారెను. ఆమె ప్రేమానందములు వర్ణనాతీతములు ఒక నిరుపేద కుబేరుడైనంత ఆనందమును ఆమె అనుభవించెను. సాదరముగా శ్రీరామునిముఖమును జూచి, తల్లి మృదుమధురముగా పల్కెను. "నాయనా! ప్రేమతో అడుగుచున్నాను. నిశ్చయముగా తెల్పుము. ఆనందమంగళప్రదమైన ఆ శుభముహూర్తము ఎప్పుడు? పుణ్యాత్ముల శీలసుఖములకును మానవజన్మసాఫల్యసిద్ధికిని పరాకాష్ఠయైన ఆ శుభసమయమెప్పుడు?
(చౌ॥ 1-4)

దో- జెహి చాహత నర నారి సబ, అతి ఆరత ఎహి భాఁతి ।
జిమి చాతక చాతకి తృషిత, బృష్టి సరద రితు స్వాతి ॥ 52 ॥

దప్పిగొన్న చాతకపక్షులు శరదృతువునందు స్వాతివానకు ఎదురుచూచినట్లు అబాలగోపాలము యువరాజ పట్టాభిషేక శుభముహూర్తముకొఱకు ఎదురుచూచు చున్నారు. (దో॥ 52)

చౌ- తాత జాఉఁ బలి బేగి నహాహూ । జో మన భావ మధుర కఛు ఖాహూ ॥
పితు సమీప తబ జాఏహు భైఆ । భఇ బడి బార జాఇ బలి మైఆ ॥ 1 ॥
మాతు బచన సుని అతి అనుకూలా । జను సనేహ సురతరు కే ఫూలా ॥
సుఖ మకరంద భరే శ్రియమూలా । నిరఖి రామ మను భవఁరు న భూలా ॥ 2 ॥
ధరమ ధురీన ధరమ గతి జానీ । కహేఉ మాతు సన అతి మృదు బానీ ॥
పితాఁ దీన్హ మోహి కానన రాజూ । జహఁ సబ భాఁతి మోర బడ కాజూ ॥ 3 ॥
ఆయసు దేహి ముదిత మన మాతా । జెహిఁ ముద మంగల కానన జాతా ॥
జని సనేహ బస డరపసి భోరేఁ । ఆనందు అంబ అనుగ్రహ తోరేఁ ॥ 4 ॥

నాయనా! ప్రేమతో పలుకు చున్నాను. త్వరగా స్నానమొనర్చి, నీకు ఇష్టములగు మధుర పదార్థములను భుజింపుము. పిదప తండ్రిగారికడకు వెళ్లుము. ఇప్పటికే చాల ఆలస్యమైనది. "తల్లి ప్రేమానురాగములనెడి కల్పవృక్ష పుష్పములనుండి సుఖసంపదలనెడి మకరందములతో నిండిన వచనములు శ్రీరామునకు వీనుల విందు గావించెను. ఐనను పూలవంటి ఆ వచనములకుగూడ రామచంద్రుని మనస్సనెడి భ్రమరము ఆకర్షింపబడలేదు. ధర్మధురీణుడైన రాముడు ధర్మ మర్మములను ఎఱింగినవాడుగావున తల్లితో మధురముగా ఇట్లు పలికెను. "అమ్మా! తండ్రి గారు నాకప్పగించినవనరాజ్యమున నేను గొప్పగొప్ప కార్యములను నెఱవేర్చవలసి యున్నది. అమ్మా! నీవు ప్రసన్నమైన మనస్సుతో నాకు ఆజ్ఞనిమ్ము. దానివలన నా వనయాత్రలో ఆనందము, శుభము చేకూరును. నా ప్రేమలో నిమగ్నవై పొరపాటున గూడ భయపడవలదు. నీ కృపవలన అంతయు శుభమే జరుగును. (చౌ॥ 1-4)

దో- బరష చారిదస బిపిన బసి, కరి పితు బచన ప్రమాన।
అఇ పాయ పుని దేఖిహఉఁ, మను జని కరసి మలాన॥ 53 ॥

తండ్రిగారిఆజ్ఞమేరకు పదునాల్గు సంవత్సరములు వనవాసమును గడిపి, తిరిగి రాగలను. ఆ పిమ్మట మీ పాదములను దర్శింపగలను. కావున మనస్సున బాధకు తావీయు వలదు." (దో॥ 53)

చౌ- బచన బినీత మధుర రఘుబర కే। సర సమ లగే మాతు ఉర కరకే॥
సహమి సూఖి సుని సీతలి బానీ। జిమి జవాస పరేఁ పావస పానీ॥ 1 ॥
కహి న జాఇ కఛు హృదయ బిషాదూ। మనహుఁ మృగీ సుని కేహరి నాదూ॥
నయన సజల తన థర థర కాఁపీ। మాజహి ఖాఇ మీన జను మాపీ॥ 2 ॥
ధరి ధీరజు సుత బదను నిహారీ। గదగద బచన కహతి మహతారీ॥
తాత పితహి తుమ్హ ప్రాన పిఆరే। దేఖి ముదిత నిత చరిత తుమ్హారే॥ 3 ॥
రాజు దేన కహుఁ సుభ దిన సాధా। కహెఉ జాన బన కెహిఁ అపరాధా॥
తాత సునావహు మోహి నిదానూ। కో దినకర కుల భయఉ కృసానూ॥ 4 ॥

రఘువంశ శ్రేష్ఠుడైన రామచంద్రుని వినమ్రవచనములు మిక్కిలి మృదు మధురములేయైనను అవి ఆస్థితిలో ఆమెకు కటువుగా తోచెను. హృదయములో బాణములవలె గ్రుచ్చుకొని, అవి ఆమెను బాధింప సాగెను. ఆ చల్లని వాక్కులను విని వర్షపు నీటిలో జవసము (తెల్లుగడ్డి) వలె కౌసల్యముఖము వాడిపోయెను. ఆమె మనోవేదన వర్ణింపనలవికానిదాయెను. సింహగర్జన విన్న జింకవలె ఆమెమనస్సు వికలమాయెను. నేత్రములు అశ్రుపూర్ణములాయెను. శరీరము గడగడ వణకసాగెను. తొలకరి వర్షపునీటినురుగునుతిన్నచేపవలె గిలగిలలాడెను. ఆమె ధైర్యమును కూడగట్టుకొని, కుమారుని ముఖమును జూచుచు గద్గదస్వరముతో పల్కెను. "నాయనా! నీవు తండ్రిగారికి ప్రాణసమానుడవు. వారు నీచరితమును జూచి సంతసించెదరు. మహారాజుగారే నీయువరాజపట్టాభిషేకసుముహూర్తమును నిర్ణయింపజేసిరి. ఇప్పుడు ఏ అపరాధమునకు నిన్ను వనములకు పంపుచున్నారు? కుమారా! దీనికిగలకారణములను దెల్పుము. ఈ సూర్యవంశవనమునకు చిచ్చుపెట్టినదెవరు?"
(చౌ॥ 1-4)

దో- నిరఖి రామ రుఖ సచివసుత, కారను కహెఉ బుఝాఇ।
సుని ప్రసంగు రహి మూక జిమి, దసా బరని నహిఁ జాఇ॥ 54 ॥

శ్రీరామునికనుసన్నలను అనుసరించి, సుమంత్రునిపుత్రుడు కౌసల్యకు విషయమునంతయును వివరించెను. (హర్షశోకాదివికారరహితుడును మర్యాదా పురుషోత్తముడును ఐన రాముడు తన సవతితల్లి యొక్క తప్పునుసైతము తన నోట చెప్పడు) ఆ వృత్తాంతమును విన్న కౌసల్యగొంతు మూగవోయెను. అప్పటిఆమెమానసికస్థితిని వర్ణించుట అసాధ్యము. (దో॥ 54)

చౌ- రాఖి న సకఇ న కహి సక జాహూ । దుహూఁ భాఁతి ఉర దారున దాహూ ॥
లిఖత సుధాకర గా లిఖి రాహూ । బిధి గతి బామ సదా సబ కాహూ ॥ 1 ॥
ధరమ సనేహ ఉభయఁ మతి ఘేరీ । భఇ గతి సాఁప ఛుఛుందరి కేరీ ॥
రాఖఉఁ సుతహి కరఉఁ అనురోధూ । ధరము జాఇ అరు బంధు బిరోధూ ॥ 2 ॥
కహఉఁ జాన బన తౌ బడి హానీ । సంకట సోచ బిబస భఇ రానీ ॥
బహురి సముఝి తియ ధరము సయానీ । రాము భరతు దోఉ సుత సమ జానీ ॥ 3 ॥
సరల సుభాఉ రామ మహతారీ । బోలీ బచన ధీర ధరి భారీ ॥
తాత జాఉఁ బలి కీన్హెహు నీకా । పితు ఆయసు సబ ధరమక టీకా ॥ 4 ॥

(కర్తవ్యము-మమతల సంఘర్షణలవలన) కౌసల్య శ్రీరాముని ఆపలేదు, వనములకు వెళ్ళుమని చెప్పలేదు. రెండు విధములా ఆమె హృదయమున సంతాపమే కలుగుచుండెను. ఒక్కొక్కపుడు విధాతనిర్ణయములు అందటికిని ప్రతికూలములే. అతడు చంద్రుని వ్రాయబోయి రాహువును వ్రాసినాడు. (రాజ్యమునకు మారుగా వనవాసమును ప్రసాదించినాడు. అని మనస్సులో విచారపడెను) ధర్మము, పుత్రవాత్సల్యము. అను ఈ రెండింటి మధ్య కౌసల్య బుద్ధి ఊగిసలాటకు లోనయ్యెను. ఆమెమనఃస్థితి చుంచెలుకనునోటగఱచిన పాముస్థితి వలె నుండెను..(1). " నేను పట్టుదలవహించి, శ్రీరాముని నిల్పినచో ధర్మమునకు విరుద్ధమగును. సోదరులకు పరస్పర విరోధములు ఏర్పడును. ఒకవేళ వనములకు పొమ్మని చెప్పినచో విశేషనష్టము సంభవించును." ఇట్టి ధర్మ సంకటమునకులోనై రాణి విచారగ్రస్తురాలయ్యెను చివరకు తన భర్త యెడల తన ధర్మమును దెలిసికొని, రాముడు, భరతుడు ఇరువురును తనకు సమానులేయని భావించి, నిష్కపట స్వభావమైన కౌసల్య గుండెనిబ్బరమునుపూని శ్రీరామునితో ఇట్లు పలికెను. "కుమారా! ముమ్మాటికిని నీవు మంచిపనియే చేసితివి. పితృాజ్ఞాపాలనము సర్వధర్మములలో శ్రేష్ఠమైనది. నీ ధర్మనిష్ఠకు నాజోహారులు- (కౌసల్యా సుప్రజారామ) (చౌ॥ 1-4)

దో- రాజు దేన కహి దీన్హ బను, మోహి న సో దుఖ లేసు ।
తుమ్హ బిను భరతహి భూపతిహి, ప్రజహి ప్రచండ కలేసు ॥ 55 ॥

మీ తండ్రిగారు మొదట రాజ్యమును ఇయ్యజూపి, పిదప వనవాసమును ఇచ్చినారు. ఇందులకు నేను లేశమాత్రమూ దుఃఖించుటలేదు. కాని నీవు లేకున్నచో భరతునకును, మహారాజుగారికిని, అయోధ్యావాసులకును తీరనిక్లేశములు కలుగును. (దో॥ 55)

చౌ- జౌఁ కేవల పితు ఆయసు తాతా । తౌ జని జాహు జాని బడి మాతా ॥
జౌఁ పితు మాతు కహేఉ బన జానా । తౌ కానన సత అవధ సమానా ॥ 1 ॥

F.N సర్పము చుంచెలుకను సామాన్యమైన ఎలుకయని భావించి, దానిని నోటగఱచుకొనును. పిమ్మట దానిని విషపూరితమైన చుంచెలుకయని యెఱుంగును. మ్రింగినచో సర్పము చనిపోవును. క్రక్కినచో ఆ సర్పము గ్రుడ్డిదియగును. మ్రింగలేక, క్రక్కలేక ఆ సర్పము ఊగిసలాటలో పడును. కౌసల్య యొక్క మానసికస్థితి గూడ ఇట్టిదే. వనవాసమునకు వలదని చెప్పుట ధర్మహాని. అది తనకు మరణ సమానము. శ్రీరాముడు తనకంటిపాప. అనుమతించినచో కంటిపాప కనుమఱుగగును. అది తనకు అంధత్వతుల్యము.

పితు బనదేవ మాతు బనదేవీ । ఖగ మృగ చరన సరోరుహ సేవీ ॥
అంతహుఀ ఉచిత నృపహి బనబాసూ । బయ బిలోకి హియఀ హోఇ హరాఀసూ ॥ 2 ॥
బడభాగీ బను అవధ అభాగీ । జో రఘుబంసతిలక తుమ్హ త్యాగీ ॥
జౌఀ సుత కహౌఀ సంగ మోహి లేహూ । తుమ్హరే హృదయఀ హోఇ సందేహూ ॥ 3 ॥
పూత పరమ ప్రియ తుమ్హ సబహీ కే । ప్రాన ప్రాన కే జీవన జీ కే ॥
తే తుమ్హ కహహు మాతు బన జాఉఀ । మైఀ సుని బచన బైఠి పఛితాఉఀ ॥ 4 ॥

నాయనా! ఇది కేవలము తండ్రిగారిఆజ్ఞమాత్రమేయైనచో వనములకు పోవలదు. తల్లిస్థానము తండ్రిస్థానముకంటె ఉన్నతము. తల్లిదండ్రులిద్దఱును నిన్ను వనములకు పొమ్మనినచో అడవులు వంద అయోధ్యలతో సమానము. అప్పట వనదేవతలే నీ తల్లిదండ్రులు. పశుపక్ష్యాదులే నీ సేవకులు. రాజులు వార్ధకమున వనవాసము చేయుట యుక్తము. కాని నీ సౌకుమార్యమును జూచి, నా మనస్సు వ్యాకులపడుచున్నది. ఓ రఘువంశభూషణా! నీవు వెళ్లి అడుగిడువనమే మిక్కిలి భాగ్యవంతమైనది. నీవు వదలెడి అయోధ్య భాగ్యహీనమైనది. కుమారా! నన్ను గూడ నీతో తీసికొని పొమ్మని అడిగినచో (తల్లి ఈ నెపముతో నన్నాపుటకు ప్రయత్నించు చున్నదని) నీకు సంశయము కలుగును. కుమారా! నీవు అందఱికిని ప్రియతముడవు. ప్రాణులకు ప్రాణము, జీవులకు జీవనమైనవాడవు. "అమ్మా! నేను వనములకు వెళ్లెదను" అని నీవు చెప్పగా విని, నేను (చేతులు ముడుచుకొని) కూర్చొని, కుమిలి పోవలసి వచ్చినది. (చౌ॥ 1-4)

దో- యహ బిచారి నహిఀ కరఉఀ హఠ, ఝూఠ సనేహు బఢాఇ ।
మాని మాతు కర నాత బలి, సురతి బిసరి జని జాఇ ॥ 56 ॥

నీ మీద నాకున్న అనురాగమును ఎక్కువగా ప్రదర్శించి, నేను నిన్ను నిలుపజాలను. కాని ఈ తల్లిబంధమును, ఈ తల్లిని మాత్రము మఱువవద్దు. (దో॥ 56)

చౌ- దేవ పితర సబ తుమ్హహి గోసాఈఀ । రాఖహుఀ పలక నయన కీ నాఈఀ ॥
అవధి అంబు ప్రియ పరిజన మీనా । తుమ్హ కరునాకర ధరమ ధురీనా ॥ 1 ॥
అస బిచారి సోఇ కరహు ఉపాఈ । సబహి జిఅత జెహిఀ భేఁటహు ఆఈ ॥
జాహు సుఖేన బనహి బలి జాఉఀ । కరి అనాథ జన పరిజన గాఉఀ ॥ 2 ॥
సబ కర ఆజు సుకృత ఫల బీతా । భయఉ కరాల కాలు బిపరీతా ॥
బహువిధి బిలపి చరన లపటానీ । పరమ అభాగిని ఆపుహి జానీ ॥ 3 ॥
దారున దుసహ దాహు ఉర బ్యాపా । బరని న జాహిఀ బిలాప కలాపా ॥
రామ ఉఠాఇ మాతు ఉర లాఈ । కహి మృదు బచన బహురి సముఝాఈ ॥ 4 ॥

నా కన్నతండ్రీ! కనురెప్పలు కనులను రక్షించునట్లు దేవతలును, పితరులును నిన్ను అడవిలో రక్షించుచుందురు గాక. నీవనవాససమయము సరస్సులోని నీరువంటిది. (జీవనాధారము) నీ ప్రియతమజనులు,

కుటుంబసభ్యులు అందులోని చేపలు. నీవు కరుణాసాగరుడవు, ధర్మమూర్తివి. వనవాస సమయము పూర్తికాగానే నీవు వెంటనే తిరిగి రమ్ము. నీ పునరాగమనమునకై నిరీక్షించుచు వారు జీవించి యుందురను విషయమును విస్మరింపవద్దు. నీ ప్రజలును, కుటుంబసభ్యులును, పురవాసులును నీవు వనములకు వెళ్లినచో దిక్కులేనివారగుదురు. ఐనను నీవనవాసవ్యవధి వఱకు వారు తమ ప్రాణములను నిలుపుకొని యుందురు. కనుక వారు బ్రతికి యుండగనే నీవు అయోధ్యకు తిరిగి రమ్ము. విండు మనస్సుతో నిన్ను పంపుచున్నాను. వనములలో నీవు సుఖముగా నుండుము, వెళ్ళిరమ్ము. ప్రజలందఱి సత్కర్మఫలములు నేటితో ముగిసినవి. ఈ కరాళకాలము మాకు వ్యతిరేకమైనది." ఇట్లు అనేక విధములుగా విలపించి, తనను భాగ్యహీనురాలినిగా భావించి, కౌసల్య శ్రీరామచంద్రుని చరణములకు అంటుకొని పోయెను. ఆమె హృదయమున దుర్భరశోకము అలముకొనెను. ఆమెశోక విలాపములు వర్ణింపనలవికానివి. శ్రీరామచంద్రుడు తల్లిని లేపి, కూర్చుండబెట్టి, తన హృదయమునకు హత్తుకొని, మృదువచనములతో ఆమెను ఊరడించెను. (చౌ॥ 1-4)

## సీతాదేవి అభ్యర్థన - రాముని ఆమోదము

దో- సమాచార తెహి సమయ సుని, సీయ ఉఠీ అకులాఇ ।
జాఇ సాసు పద కమల జుగ, బంది బైఠి సిరు నాఇ ॥ 57 ॥

అదే సమయమున శ్రీరామచంద్రునివనవాసవార్తను విని, సీతాదేవి వ్యాకులపాటునకు లోనయ్యెను. ఆమె అత్తగారికడకువచ్చి, ఆమెకు పాదాభివందనమాచరించి, అవనతవదనయై కూర్చుండెను. (దో॥ 57)

చౌ- దీన్హి అసీస సాసు మృదు బానీ । అతి సుకుమారి దేఖి అకులానీ ॥
బైఠి నమితముఖ సోచతి సీతా । రూప రాసి పతి ప్రేమ పునీతా ॥ 1 ॥
చలన చహత బన జీవననాథూ । కెహి సుకృతీ సన హోఇహి సాథూ ॥
కీ తను ప్రాన కి కేవల ప్రానా । బిధి కరతబు కఛు జాఇ న జానా ॥ 2 ॥
చారు చరన నఖ లేఖతి ధరనీ । నూపుర ముఖర మధుర కబి బరనీ ॥
మనహుఁ ప్రేమ బస బినతీ కరహీఁ । హమహి సీయ పద జని పరిహరహీఁ ॥ 3 ॥
మంజు బిలోచన మోచతి బారీ । బోలీ దేఖి రామ మహతారీ ॥
తాత సునహు సియ అతి సుకుమారీ । సాస ససుర పరిజనహి పిఆరీ ॥ 4 ॥

కౌసల్యాదేవి తనకోమలస్వరముతో ఆమెను ఆశీర్వదించెను. ఆమె సీతాదేవి యొక్క సౌకుమార్యమును జూచి మిక్కిలి వ్యాకులపడెను. పతిప్రేమలోపునీతయైన సౌందర్యరాశి సీతాదేవి తలవంచుకొని, ఆలోచించుచుండెను. "ప్రాణనాథుడు వనవాస గమనమునకు సన్నద్ధుడగుచున్నాడు. వారి (నాపతి)తో గూడి వెళ్లుటకు నాప్రాణ శరీరములలో ఏది పుణ్యము చేసికొనినదో? నా శరీరము, ప్రాణములు రెండును కలిసి ఆయన వెంట పోవునా? లేక ప్రాణములు మాత్రమేనా? విధాత కృత్యములు అగ్రాహ్యములు" సీతాదేవి తన సుందర చరణ నఖములచే నేలను రాయుచుండెను. ఆ సమయమున ఆమె నూపురములు మధురధ్వనులను చేయుచుండెను. అవి సీతాదేవిచరణములనుండి మమ్ము దూరముచేయవలదని ప్రార్థించుచున్నట్లుండెను. సీతాదేవిసుందర

నేత్రములనుండి అశ్రువులు స్రవించుచుండెను. ఆమెస్థితికి చలించి, కౌసల్యాదేవి పలికెను. "నాయనా! సీత మిక్కిలి సుకుమారి. అత్తమామలకును కుటుంబములోని వారెల్లరకును ప్రీతిపాత్రురాలైనది. (చౌ॥ 1-4)

**దో- పితా జనక భూపాల మని, ససుర భానుకుల భాను।**
**పతి రబికుల కైరవ బిపిన, బిధు గున రూప నిధాను ॥ 58 ॥**

ఈమెతండ్రి రాజశ్రేష్ఠుడైన జనకుడు, మామగారు సూర్యవంశభానుడు, భర్త సూర్యవంశమనెడి కుముదవనమునకు చంద్రుడు, రూపసద్గుణనిధి. (దో॥ 58)

**చౌ- మైఀ పుని పుత్రబధూ ప్రియ పాఈ। రూప రాసి గున సీల సుహాఈ॥**
**నయన పుతరి కరి ప్రీతి బఢాఈ। రాఖేఉఀ ప్రాన జానకిహిఀ లాఈ ॥ 1 ॥**
**కలపబేలి జిమి బహుబిధి లాలీ। సీఀచి సనేహ సలిల ప్రతిపాలీ॥**
**ఫూలత ఫలత భయఉ బిధి బామా। జాని న జాఇ కాహ పరినామా ॥ 2 ॥**
**పలఀగ పీఠ తజి గోద హిఀడోరా। సియఀ న దీన్హ పగు అవని కఠోరా॥**
**జిఅనమూరి జిమి జోగవత రహఊఀ। దీప బాతి నహిఀ టారన కహఊఀ ॥ 3 ॥**
**సోఇ సియ చలన చహతి బన సాథా। ఆయసు కాహ హోఇ రఘునాథా॥**
**చంద కిరన రస రసిక చకోరీ। రబి రుఖ నయన సకఇ కిమి జోరీ ॥ 4 ॥**

ఈ సౌందర్యరాశి నా ముద్దుల కోడలు. సౌశీల్యవతి, సద్గుణ సంపన్న. ఈమెను నాకంటి పాపవలె చూచుకొనుచుంటిని. ఈమెనాబహిఃప్రాణము, అంతేగాదు, నా సర్వస్వమూ ఈ జానకియే. ఈ కల్పలతను నా ప్రేమయనెడి జలములతో పోషించుచున్నాను. ఈ లత పుష్పఫలములతో శోభించవలసినతరుణమున విధాత ఈమెకు ప్రతికూలుడైనాడు. దీని పరిణామమేమగునో తెలియదుగదా! సీత సుతిమెత్తనిపట్టుపు, కోమలమైన ఆసనము, చల్లని యొడి, తూగుటుయ్యేలలపై తప్ప కఠినమైన నేలపై కాలుగూడ మోపియెఱుగదు. సంజీవని మొక్కనువలె సురక్షితముగా ఈమెను కాపాడుకొనుచున్నాను. దీపపువత్తిని సరిచేయుమని గూడ ఎప్పుడును చెప్పలేదు. అట్టి సుకుమారియైన సీత నీవెంట వనములకు రాగోరుచున్నది. రఘునాథా! నీ ఆజ్ఞకై ఎదురుచూచుచున్నది. చంద్రుని శీతలకిరణామృతమును ఆస్వాదించు చకోరము ప్రచండ సూర్యకిరణముల తాకిడికి ఎట్లు తట్టుకొనగలదు? (చౌ॥ 1-4)

**దో- కరి కేహరి నిసిచర చరహిఀ, దుష్ట జంతు బన భూరి।**
**బిష బాటికాఀ కి సోహ సుత, సుభగ సజీవని మూరి ॥ 59 ॥**

వనములలో ఏనుగులు, సింహములు, రాక్షసులు మొదలగు దుష్ట ప్రాణులు సంచరించు చుండును. కుమారా! కోమలమైన సంజీవనీ మూలిక విష వృక్షముల మధ్య నెగడగలదా? (దో॥ 59)

**చౌ- బన హిత కోల కిరాత కిసోరీ। రచీఀ బిరంచి బిషయ సుఖ భోరీ॥**
**పాహన కృమి జిమి కఠిన సుభాఊ। తిన్హహి కలేసు న కానన కాఊ ॥ 1 ॥**

కై తాపస తియ కానన జోగూ । జిన్హ తప హేతు తజా సబ భోగూ ॥
సియ బన బసిహి తాత కెహి భాంతీ । చిత్రలిఖిత కపి దేఖి డెరాతీ ॥ 2 ॥
సురసర సుభగ బనజ బన చారీ । డాబర జోగు కి హంసకుమారీ ॥
అస బిచారి జస ఆయసు హోఈ । మైం సిఖ దేఉం జానకిహి సోఈ ॥ 3 ॥
జౌం సియ భవన రహై కహ అంబా । మోహి కహం హోఇ బహుత అవలంబా ॥
సుని రఘుబీర మాతు ప్రియ బానీ । సీల సనేహ సుధాం జను సానీ ॥ 4 ॥

బ్రహ్మదేవుడు అడవిలో నివసించుటకు కోల కిరాత జాతి స్త్రీలను సృష్టించినాడు. వారు ఈ సుఖ భోగములకు నోచుకొనరు. సహజముగా కఠిన స్వభావము గల కీటకములు జోళ్లలో నుండును. వాటికి అవి క్లేశకరములుగావు. తాపసపత్నులు సాంసారికసుఖములను వీడి, తపముల నొనర్చుచు అడవులలోనే తమజీవితములను వెళ్లబుచ్చుచుందురు. కాని కుమారా! చిత్రపటమునందలికోతిని జూచి భయపడుసీత వనములలో ఎట్లుండగలదు? మానససరోవరమునందలి సుందరకమలములమధ్య విహరించురాజహంస మురికి గుంటలో ఉండగలదా? ఆలోచింపుము. నీఆజ్ఞగా నేను జానకికి ఉపదేశింపగలను. ఆమె గృహమున (ఇచట)నే ఉండినచో నాకు తోడుగా ఉండును."- ప్రేమాదరములతో కౌసల్య పలికిన అమృత వచనములను శ్రీరాముడు వినెను. (చౌ॥ 1-4)

దో- కహి ప్రియ బచన బిబేకమయ, కీన్హి మాతు పరితోష।
లగే ప్రబోధన జానకిహి, ప్రగటి బిపిన గున దోష॥ 60 ॥

శ్రీరాముడు మృదువుగా ప్రియవచనములతో తల్లిని అనునయించెను. అనంతరము వనవాస క్లేశములను వాటి గుణ దోషములను గూర్చి, జానకికి వివరింప సాగెను. (దో॥ 60)

## మాసపారాయణము - పదునాల్గవ విరామము

చౌ- మాతు సమీప కహత సకుచాహీం । బోలే సమఉ సమురిఝ మన మాహీం ॥
రాజకుమారి సిఖావను సునహూ । ఆన భాంతి జియం జని కఛు గునహూ ॥ 1 ॥
ఆపన మోర నీక జౌం చహహూ । బచను హమార మాని గృహ రహహూ ॥
ఆయసు మోర సాసు సేవకాఈ । సబ బిధి భామిని భవన భలాఈ ॥ 2 ॥
ఏహి తే అధిక ధరము నహిం దూజా । సాదర సాసు ససుర పద పూజా ॥
జబ జబ మాతు కరిహి సుధి మోరీ । హోఇహి ప్రేమ బికల మతి భోరీ ॥ 3 ॥
తబ తబ తుమ్హ కహి కథా పురానీ । సుందరి సముఝాఏహు మృదు బానీ ॥
కహఉం సుభాయం సపథ సత మోహీ । సుముఖి మాతు హిత రాఖఉం తోహీ ॥ 4 ॥

తల్లి సమక్షమున సీతాదేవితో మాట్లాడుటకు రాముడు సంకోచపడెను. కాని ఆపద్ధర్మమును అనుసరించి, ఆమెతో ఇట్లు పలికెను. "ఓ రాజకుమారీ! నాసూచనను శ్రద్ధగా ఆలకింపుము. మనసులో వేఱొక విధముగా ఆలోచింప వలదు. నీవు మన ఇద్దఱి మేలును కోరు కొనుచున్నచో నామాటను పాటించి, ఇంటిలో (ఇచట)నే

యుండుము. ఆ విధముగా నాఆజ్ఞను పాలించినదానవూ కాగలవు, తల్లి గారికి సేవలనూ చేయగలవు. ఇంటిలో ఉండుటచే అన్ని విధాలుగ మేలే జరుగును. సాదరముగా అత్తమామలకు సేవలుచేయుట కంటె స్త్రీకి మఱియొక ధర్మమే లేదు. మా తల్లి గారు నామీది ప్రేమపారవశ్యముచే వ్యాకులపడినప్పుడు నీవు మృదు మధురముగా పౌరాణికగాథలను వినిపించుచు ఆమెను ఓదార్చగలవు. మా తల్లిగారిసేవల కొఱకే నిన్ను ఇచట ఉండుమని కోరుచున్నాను. ఇది ముమ్మాటికి నిజము. (చౌ॥ 1-4)

దో- గుర శ్రుతి సమ్మత ధరమ ఫలు, పాఇఅ బినహిఁ కలేస ।
హఠ బస సబ సంకట సహే, గాలవ నహుష నరేస ॥ 61 ॥

నాఆజ్ఞను పాలించుచు నీవు ఇంటిలో (ఇచట)నే యున్నచో గురువులు, వేదములు బోధించెడి సమస్త ధర్మములును నీకు అవలీలగా అబ్బును. పట్టుదలవహించినచో గాలవముని, నహుషుడు పడిన కష్టములను నీవు ఎఱుగుదువు. (దో॥ 61)

చౌ- మైఁ పుని కరి ప్రవాన పితు బానీ । బేగి ఫిరబ సును సుముఖి సయానీ ॥
దివస జాత నహిఁ లాగిహి బారా । సుందరి సిఖవను సునహు హమారా ॥ 1 ॥
జౌఁ హఠ కరహు ప్రేమ బస బామా । తౌ తుమ్హ దుఖు పాఉబ పరినామా ॥
కానను కఠిన భయంకరు భారీ । ఘోర ఘాము హిమ బారి బయారీ ॥ 2 ॥
కుస కంటక మగ కాఁకర నానా । చలబ పయాదెహిఁ బిను పదత్రానా ॥
చరన కమల మృదు మంజు తుమ్హారే । మారగ అగమ భూమిధర భారే ॥ 3 ॥
కందర ఖోహ నదీఁ నద నారే । అగమ అగాధ న జాహిఁ నిహారే ॥
భాలు బాఘ బృక కేహరి నాగా । కరహిఁ నాద సుని ధీరజు భాగా ॥ 4 ॥

ఓ సుకుమారీ! బుద్ధిమంతురాలా! వినుము. మా తండ్రిగారిఆజ్ఞను పాలించి, నేను శీఘ్రముగా తిరిగిరాగలను. ఈ వనవాసకాలము ఇట్లే గడిచిపోవును. నా మాట వినుము. ఒక వేళ నామీదిప్రేమతో హఠముచేసినచో చివరకు దుఃఖములను అనుభవింపవలసి వచ్చును. వనవాసము మిక్కిలి కష్టభూయిష్ఠము. భయానకము, అచటి ఎండ, చలి, వర్షము, గాలి అన్నియును దుర్భరములే. మార్గము గడ్డి, ముండ్లు, ఱాళ్లతో నిండియుండును. వాటిపై పాదరక్షలు లేకుండ నడువవలసివచ్చును. కమలములవంటి నీ చరణములు మిక్కిలి కోమలములు. త్రోవలలో దుర్గమములైన పర్వతములు, గుహలు, బిలములు, ఉండును. మిక్కిలి లోతైదాటుటకు వీలులేని నదీనదములు, వాగులు, వంకలు ఎదురగును. అవి చూచుటకే భయంకరములు. వనములలో ఎలుగుబంట్లు, తోడేళ్లు, ఏనుగులు, పులులు, సింహములు చేయు భీతిగొలుపు ధ్వనులకు ఎట్టి వారి ధైర్యమైనను చెదరిపోవును. (చౌ॥ 1-4)

దో- భూమి సయన బలకల బసన, అసను కంద ఫల మూల ।
తే కి సదా సబ దిన మిలహిఁ, సబుఇ సమయ అనుకూల ॥ 62 ॥

అక్కడ నేలపై పరుండవలెను. వల్కలములను ధరింపవలెను. దొరికిన మేరకు కందమూలఫలములే ఆహారము. ఋతుధర్మములను అనుసరించి లభించుఫలములనే భుజించుచుండవలెను. ఒక్కొక్కప్పుడు అవియును లభింపవు. (దో॥ 62)

చౌ- నర అహార రజనీచర చరహీం । కపట బేష బిధి కోటిక కరహీం ॥
లాగఇ అతి పహార కర పానీ । బిపిన బిపతి నహిం జాఇ బఖానీ ॥ 1 ॥
బ్యాల కరాల బిహగ బన ఘోరా । నిసిచర నికర నారి నర చోరా ॥
డరపహిం ధీర గహన సుధి ఆఏఁ । మృగలోచని తుమ్హ భీరు సుభాఏఁ ॥ 2 ॥
హంసగవని తుమ్హ నహిం బన జోగూ । సుని అపజసు మోహి దేఇహి లోగూ ॥
మానస సలిల సుధాం ప్రతిపాలీ । జిఅఇ కి లవన పయోధి మరాలీ ॥ 3 ॥
నవ రసాల బన బిహారనసీలా । సోహ కి కోకిల బిపిన కరీలా ॥
రహహు భవన అస హృదయం బిచారీ । చందబదని దుఖు కానన భారీ ॥ 4 ॥

అక్కడ నరమాంసభక్షకులైన రాక్షసులు సంచరించుచుందురు. వారు అనేకవిధములగు కామరూపములను ధరించుచుందురు. కొండలలో ఉండెడినీరు ఆరోగ్యమునకు భంగకరము. అడవులలో ఎదురగుకష్టములు వర్ణింపనలవికానివి. భయంకరమైన సర్పములు, పక్షులు తిరుగుచుండును. స్త్రీపురుషులను ఎత్తుకొనిపోవు రాక్షసులు గుంపులుగుంపులుగా తిరుగాడుచుందురు. ఆకారడవులను తలంచుకొన్నచో ఎంతటి ధైర్యముగలవారైనను భయపడుదురు. ఓ మృగనయనా! నీవు సహజముగ భయస్థురాలవు. హంసగమనా! నీవు వన వాసమునకు తగవు. నీవు వనవాసముచేసినచో జనులు నన్ను నిందింతురు. మానస సరోవరమున అమృతజలములచే మనుగడ సాగించు హంస సముద్రపుఉప్పునీటితో ఎట్లు జీవింపగలదు? లేతచిగురుమామిడితోపులలో విహరించుకోయిలలు కరీల (బలుసు/కలే) పొదలలో సంతోషమును పొందునా? చంద్రముఖీ! ఈ విషయములనన్నింటిని బాగుగా ఆలోచింపుము. ఇంటి యొద్దనే యుండుట యుక్తము. వనములలో చాలా కష్టములుండును. (చౌ॥ 1-4)

దో- సహజ సుహృద గుర స్వామి సిఖ, జో న కరఇ సిర మాని ।
సో పఛితాఇ అఘాఇ ఉర, అవసి హోఇ హిత హాని ॥ 63 ॥

గురువులు, ప్రభువులు, సుహృదులు స్వాభావికముగా మేలుగోరువారు. వారి ఉపదేశములను శిరసావహింపనివారికి తప్పక హానికలుగును. తరువాత పశ్చాత్తాపపడవలసి వచ్చును." (దో॥ 63)

చౌ- సుని మృదు బచన మనోహర పియ కే । లోచన లలిత భరే జల సియ కే ॥
సీతల సిఖ దాహక భఇ కైసేం । చకఇహి సరద చంద నిసి జైసేం ॥ 1 ॥
ఉతరు న ఆవ బికల బైదేహీ । తజన చహత సుచి స్వామి సనేహీ ॥
బరబస రోకి బిలోచన బారీ । ధరి ధీరజు ఉర అవనికుమారీ ॥ 2 ॥
లాగి సాసు పగ కహ కర జోరీ । ఛమబి దేబి బడి అబినయ మోరీ ॥
దీన్హి ప్రానపతి మోహి సిఖ సోఈ । జెహి బిధి మోర పరమ హిత హోఈ ॥ 3 ॥
మైం పుని సముఝి దీఖి మన మాహీం । పియ బియోగ సమ దుఖు జగ నాహీం ॥ 4 ॥

తనకు ప్రియతముడైన శ్రీరామునిమృదుమధురవచనములను విని, సీతాదేవి యొక్క మనోహరనేత్రములు సజలములాయెను. ఆయన చల్లనిఉపదేశము చక్రవాకపక్షులను శరదృతువునందలి వెన్నెలరాత్రివలె ఆమెను బాధించెను. సంతప్తహృదయముతో ఆమె నిరుత్తరయయ్యెను. "నాపై ఎనలేని పవిత్రప్రేమగల నాభర్త నన్ను ఇచటనే వదలిపోవుటకు ఇష్టపడుచున్నాడు." అని ఆమె భావించెను. అశ్రుధారలను బలవంతముగా ఆపుకొని, ధైర్యమును కూడగట్టుకొని, భూమిసుత (సీత) అత్తగారి పాదములను గట్టిగా పట్టుకొని వగచెను. "అత్తగారూ! నన్ను క్షమింపుడు. నాకు పరమహితకరమైన ఉపదేశమునే నా ప్రాణపతి ఇచ్చినారు. కాని పతివియోగముకంటెను ప్రపంచములో స్త్రీకి మఱియొకదుఃఖము లేదని నామనస్సునకు తోచుచున్నది. (చౌ॥ 1-4)

దో- ప్రాననాథ కరునాయతన, సుందర సుఖద సుజాన ।
తుమ్హ బిను రఘుకుల కుముద బిధు, సురపుర నరక సమాన ॥ 64 ॥

ఓ ప్రాణనాథా! కరుణానిధీ! సుందర! సుఖప్రదా! సజ్జన శిరోమణీ! రఘువంశకుముద చంద్రుడా! మీరు లేని స్వర్గముగూడ నాకు నరకప్రాయమే. (దో॥ 64)

చౌ- మాతు పితా భగినీ ప్రియ భాఈ । ప్రియ పరివారు సుహృద సముదాఈ ॥
సాసు ససుర గుర సజన సహాఈ । సుత సుందర సుసీల సుఖదాఈ ॥ 1 ॥
జహఁ లగి నాథ నేహ అరు నాతే । పియ బిను తియహి తరనిహు తే తాతే ॥
తను ధను ధాము ధరని పుర రాజూ । పతి బిహీన సబు సోక సమాజూ ॥ 2 ॥
భోగ రోగసమ భూషన భారూ । జమ జాతనా సరిస సంసారూ ॥
ప్రాననాథ తుమ్హ బిను జగ మాహీఁ । మో కహుఁ సుఖద కతహుఁ కఛు నాహీఁ ॥ 3 ॥
జియ బిను దేహ నదీ బిను బారీ । తైసిఅ నాథ పురుష బిను నారీ ॥
నాథ సకల సుఖ సాథ తుమ్హారేఁ । సరద బిమల బిధు బదను నిహారేఁ ॥ 4 ॥

తల్లిదండ్రులు, సోదరులు, బంధువులు, సుహృదులు, అత్తమామలు, గురువు, కుటుంబ సభ్యులు, సేవకులు, కడకు కుమారులు గూడ ఎంతటి సజ్జనులు, సుశీలురు ఐనను భర్త లేనిచో సూర్యునికంటెను ఎక్కువగా తపింపజేయువారే. శరీరము, ధనము, గృహము, భూమి, నగరము, రాజ్యము ఇవియన్నియు భర్తకు దూరమైనప్పుడు స్త్రీకి శోకకారణములే. భోగము రోగతుల్యమే యగును. ఆభరణములు భారమగును. సంసారము యమయాతన వంటిదగును. ఓ ప్రాణేశ్వరా! మీరు లేకుండ ఇవి యేవియును ఈ ప్రపంచమున నాకు సుఖమునియ్యజాలవు. జీవుడులేని శరీరమువలె, నీరులేని నదిలాగున నాథా! భర్తలేనిభార్యజీవితముగూడ శోభిల్లదు. మీతోకూడియుండి శరత్పూర్ణిమనాటి చంద్రునిబోలు మీముఖమును చూచుచుండుటవలన నాకు సమస్తసుఖములును లభించును.
(చౌ॥ 1-4)

దో- ఖగ మృగ పరిజన నగరు బను, బలకల బిమల దుకూల।
నాథ సాథ సురసదన సమ, పరనసాల సుఖ మూల॥ 65 ॥

నాథా! మీతో కూడియుండుటవలన పశుపక్ష్యాదులే కుటుంబసభ్యులు. వనమే మహా నగరము. వల్కలములే నిర్మలవస్త్రములు. పర్ణశాలయే స్వర్గధామము- అగును. (దో॥ 65)

చౌ- బనదేబీం బనదేవ ఉదారా। కరిహహిం సాసు ససుర సమ సారా॥
కుస కిసలయ సాథరీ సుహాఈ। ప్రభు సఁగ మంజు మనోజ తురాఈ॥ 1 ॥
కంద మూల ఫల అమిఅ అహారూ। అవధ సౌధ సత సరిస పహారూ॥
ఛిను ఛిను ప్రభు పద కమల బిలోకీ। రహిహఉఁ ముదిత దివస జిమి కోకీ॥ 2 ॥
బన దుఖ నాథ కహే బహుతేరే। భయ బిషాద పరితాప ఘనేరే॥
ప్రభు బియోగ లవలేస సమానా। సబ మిలి హోహిం న కృపానిధానా॥ 3 ॥
అస జియఁ జాని సుజాన సిరోమని। లేఇఅ సంగ మోహి ఛాడిఅ జని॥
బినతీ బహుత కరౌం కా స్వామీ। కరునామయ ఉర అంతరజామీ॥ 4 ॥

ఉదారహృదయములుగల వనదేవతలే నన్ను అత్తమామలవలె సంరక్షించెదరు. నా ప్రభువుప్రక్కన ఉన్నచో కుశకిసలయములే మన్మథతల్పములు. కందమూలఫలములే అమృతప్రాయభోజనపదార్థములు. వనపర్వతములన్నియును అయోధ్యారాజభవనములతో సమానము. ప్రతిక్షణము పతిదేవునిచరణకమలములను జూచుచు పగటివేళ చక్రవాకమువలె ఆనందించెదను. నాథా! వనములలో మిక్కిలి దుఃఖము, భయము, విషాదము, సంతాపములను అనుభవింపవలసి వచ్చునని మీరు తెలిపియుంటిరి. కాని దయానిధీ! ఇవి అన్నియును కలిసిగూడ భర్తృవిరహదుఃఖముతో లేశమాత్రమైనను సమానముగావు. ఓ సజ్జనశిరోమణీ! ఈ విషయములనన్నింటిని బాగుగా పరిశీలించి, నన్ను మీతోపాటు తీసికొనిపొండు. ఇక్కడ వదలివేయకుడు. స్వామీ! ఇంతకంటె ఎక్కువగా ఏమని ప్రార్థింపను? మీరు కరుణామయులు. సర్వప్రాణులహృదయములలో నివసించువారు. (చౌ॥ 1-4)

దో- రాఖిఅ అవధ జో అవధి లగి, రహత న జనిఅహిం ప్రాన।
దీనబంధు సుందర సుఖద, సీల సనేహ నిధాన॥ 66 ॥

ఓ దీనబంధూ! సుందరా! సుఖప్రదాతా! స్నేహసౌశీల్యనిధానా! మీ వనవాసకాలము వఱకు నన్ను ఇక్కడనే ఉంచి వెళ్లినచో మీరు లేకుండా నేను ఒక్కక్షణము గూడ బ్రతికి యుండజాలను. ఇది ముమ్మాటికిని నిజము. (దో॥ 66)

చౌ- మొహి మగ చలత న హోఇహి హారీ। ఛిను ఛిను చరన సరోజ నిహారీ॥
సబహి భాఁతి పియ సేవా కరిహౌం। మారగ జనిత సకల శ్రమ హరిహౌం॥ 1 ॥
పాయ పఖారి బైఠి తరు ఛాహీం। కరిహఉఁ బాఉ ముదిత మన మాహీం॥
శ్రమ కన సహిత స్యామ తను దేఖేం। కహఁ దుఖ సమఉ ప్రానపతి పేఖేం॥ 2 ॥

సమ మహి తృన తరుపల్లవ డాసీ । పాయ పలోటిహి సబ నిసి దాసీ ॥
బార బార మృదు మూరతి జోహీ । లాగిహి తాత బయారి న మోహీ ॥ 3 ॥
కో ప్రభు సంగ మొహి చితవనిహారా । సింఘబధుహి జిమి ససక సిఆరా ॥
మైం సుకుమారి నాథ బన జోగూ । తుమ్హహి ఉచిత తప మో కహుం భోగూ ॥ 4 ॥

ప్రతిక్షణము మీపాదపద్మసందర్శనప్రభావమున వనములలో నాకు మార్గాయాసము ఏ మాత్రము కలుగదు. ప్రాణేశ్వరా! నేను పెక్కువిధముల మీకు సేవలొనర్చుచు, మీకు మార్గాయాసము లేకుండ మీ బడలికలను తీర్చెదను. శీతలవృక్షచ్ఛాయలయందు కూర్చుండి, మీచరణములను కడిగెదను. ప్రసన్నచిత్తముతో వీచెదను. స్వేదబిందువులతో శోభించు మీశ్యామసుందరశరీరమును చూచునప్పుడు దుఃఖములు నన్నెట్లు స్పృశించును? సమతలమైన నేలపై గడ్డితో, ఆకులతో శయ్యను ఏర్పఱచి, ఈ దాసి రాత్రియంతయు మీపాదసేవచేయును. మీకోమలమూర్తిని అనుక్షణము చూచుచున్నప్పుడు వేడిగాలులు నన్ను తాకనే తాకవు. నా స్వామి చెంతనుండగా నావైపు కన్నెత్తి చూడగల వారెవ్వరు? ఆడుసింహమువైపు కుందేళ్ళు, నక్కలు చూడగలవా? నన్ను సుకుమారినిగా తెలిసి, ఇంటిలో (ఇచటనే) నన్ను వదలి, మీరు మాత్రమే వనములకు వెళ్లుచున్నారు. నన్ను విషయభోగములను అనుభవింపు మనుచు మీరు వనములలో తపస్సు చేయుటకై వెళ్లుచున్నట్లు తెల్పుచున్నారు- (చౌ॥ 1-4)

దో- ఐసెఉ బచన కఠోర సుని, జౌం న హృదఉ బిలగాన ।
తౌ ప్రభు బిషమ బియోగ దుఖ, సహిహహిం పావంర ప్రాన ॥ 67 ॥

ఇట్టి కఠోర వచనములను వినియు నా గుండె పగులలేదనగా ఈ తుచ్ఛప్రాణములు మీ వియోగక్లేశములకుగూడ తట్టు కొనగలవు. (అర్థాత్ మీ వియోగమునకు నా ప్రాణములు నిలువనే నిలువవు.)"- (దో॥ 67)

చౌ- అస కహి సీయ బికల భఇ భారీ । బచన బియోగు న సకీ సంభారీ ॥
దేఖి దసా రఘుపతి జియం జానా । హఠి రాఖేం నహిం రాఖిహి ప్రానా ॥ 1 ॥
కహెఉ కృపాల భానుకులనాథా । పరిహరి సోచు చలహు బన సాథా ॥
నహిం బిషాద కర అవసరు ఆజూ । బేగి కరహు బన గవన సమాజూ ॥ 2 ॥
కహి ప్రియ బచన ప్రియా సముఝాఈ । లగే మాతు పద ఆసిష పాఈ ॥
బేగి ప్రజా దుఖ మేటబ ఆఈ । జననీ నిఠుర బిసరి జని జాఈ ॥ 3 ॥
ఫిరిహి దసా బిధి బహురి కి మోరీ । దెఖిహఉం నయన మనోహర జోరీ ॥
సుదిన సుఘరీ తాత కబ హోఇహి । జననీ జిఅత బదన బిధు జోఇహి ॥ 4 ॥

ఈ విధముగా పలికి, సీతాదేవి అత్యంతము వ్యాకులచిత్త అయ్యెను. (శారీరిక వియోగము కంటెను ముందు) ఆమెకు వియోగమును మాటయే సహింపరానిదయ్యెను. ఆమె స్థితిని జూచిన రఘునాథుడు" ఆమెను ఇంటిలో (ఇచట)నే యుంచినచో ఆమె మరణము తథ్యము" అని విశ్వసించెను. కావున దయాళువు, సూర్యవంశ ప్రభువు ఐన

శ్రీరాముడు ఇట్లు పలికెను. "ప్రియా! చింతింపకుము. నాతోపాటు విచ్చేయుము. దుఃఖింపనవసరములేదు. త్వరగా వనగమనమునకు సిద్ధము కమ్ము." ఇట్టి ప్రియవచనములతో శ్రీరామచంద్రుడు తనసీతను ఓదార్చెను. మఱల తల్లికి పాదాభివందనము చేసి, ఆమె ఆశీర్వాదములను పొందెను. అపుడు తల్లి పచించెను. "కుమారా! వెంటనే వెళ్లి నీప్రజలదుఃఖములను దూరముచేయుము. కఠినాత్ములైన ఈ తల్లిని మఱువకుము. విధాతా! నా అదృష్టము తిరిగివచ్చునా? చూడ ముచ్చటైన ఈ జంటను నేను మఱల చూడగలనా? నాయనా! చంద్రబింబమునుబోలు నీ మనోహర ముఖమును మఱల చూచుశుభక్షణములు నీ తల్లికి ఎప్పుడు లభించునో గదా? (చౌ॥ 1-4)

దో- బహురి బచ్ఛ కహి లాలు కహి, రఘుపతి రఘుబర తాత ।
కబహిఁ బొలాఇ లగాఇ హియఁ, హరషి నిరఖిహఉఁ గాత ॥ 68 ॥

"వత్సా! ముద్దులతనయా! రఘుపతీ! రఘువరా! అని పదే పదే పిలుచుచు నిన్ను నా హృదయమునకు హత్తుకొని, నీ వదనమును మఱల ఎప్పుడు చూడగలను?" (దో॥ 68)

చౌ- లఖి సనేహ కాతరి మహతారీ । బచను న ఆవ బికల భఇ భారీ ॥
రామ ప్రబోధు కీన్హ బిధి నానా । సమఉ సనేహు న జాఇ బఖానా ॥ 1 ॥
తబ జానకీ సాసు పగ లాగీ । సునిఅ మాయ మైఁ పరమ అభాగీ ॥
సేవా సమయ దైఅఁ బను దీన్హా । మోర మనోరథు సఫల న కీన్హా ॥ 2 ॥
తజబ ఛోభు జని ఛాడిఅ ఛోహూ । కరము కఠిన కఛు దోసు న మోహూ ॥
సునిసియ బచన సాసు అకులానీ । దసా కవని బిధి కహౌఁ బఖానీ ॥ 3 ॥
బారహిఁ బార లాఇ ఉర లీన్హీ । ధరి ధీరజు సిఖ ఆసిష దీన్హీ ॥
అచల హోఉ అహివాతు తుమ్హారా । జబ లగి గంగ జమున జల ధారా ॥ 4 ॥

ప్రేమ విహ్వలయై నోట మాటకూడ పలుకలేని తనతల్లిని జూచి, శ్రీరాముడు ఆమెను పెక్కురీతుల ఓదార్చెను. ఆ దృశ్యమును గాని, ఆ ప్రేమనుగాని వర్ణించుట అసాధ్యము. అపుడు జానకి అత్తగారిపాదములకు ప్రణమిల్లి పలికెను. "అమ్మా! నేను మిక్కిలి దురదృష్ట వంతురాలిని. మీకు సేవచేయవలసిన సమయమున విధాత నాకు వనవాసమును విధించెను. నా మనోరథము సఫలముకాలేదు. మీరు మీదుఃఖమును వీడుడు. కాని నాపైగల ప్రేమవాత్సల్యములను మఱవవలదు. కర్మగతి కఠినమైనది. నాదోషమేమియును లేదు." సీతాదేవివచనములకు కౌసల్య మిక్కిలి పరితపించెను. అప్పటి ఆమెస్థితిని తులసీదాసు వర్ణింపజాలడు. ఆమె మాటిమాటికిని సీతను అక్కున జేర్చుకొనుచు ధైర్యము వహించి, ఇట్లు పలికెను." గంగా యమునా నదులలో జలధారలు ఉన్నంత వఱకు నీ సౌభాగ్యము చెక్కుచెదరక నిలుచును." అని యాశీర్వదించెను. (చౌ॥ 1-4)

దో- సీతహి సాసు అసీస సిఖ, దీన్హి అనేక ప్రకార ।
చలీ నాఇ పద పదుమ సిరు, అతి హిత బారహిఁ బార ॥ 69 ॥

సీతాదేవికి కౌసల్య పెక్కు ఆశీర్వచనములను, ఉపదేశములను ఇచ్చెను. సీతాదేవి పదే పదే ఆమెకు పాదాభివందన మొనర్చి ఆమె ఆజ్ఞగైకొని వెళ్లెను. (దో॥ 69)

## లక్ష్మణుని విన్నపము-అన్న ఆమోదము

చౌ- సమాచార జబ లఛిమన పాఏ । బ్యాకుల బిలఖ బదన ఉఠి ధాఏ ॥
కంప పులక తన నయన సనీరా । గహే చరన అతి ప్రేమ అధీరా ॥ 1 ॥
కహి న సకత కఛు చితవత ఠాఢే । మీను దీన జను జల తేఁ కాఢే ॥
సోచు హృదయఁ బిధి కా హోనిహారా । సబు సుఖు సుకృతు సిరాన హమారా ॥ 2 ॥
మో కహుఁ కాహ కహబ రఘునాథా । రఖిహహిఁ భవన కి లేహహిఁ సాథా ॥
రామ బిలోకి బంధు కర జోరేఁ । దేహ గేహ సబ సన తృను తోరేఁ ॥ 3 ॥
బోలే బచను రామ నయనాగర । సీల సనేహ సరల సుఖ సాగర ॥
తాత ప్రేమ బస జని కదరాహూ । సముఝి హృదయఁ పరినామ ఉఛాహూ ॥ 4 ॥

లక్ష్మణునకు ఈ సమాచారము అంతయును తెలియగానే వ్యాకులమనస్కుడై విచారవదనుడై, పరుగుపరుగున అన్నకడకు వచ్చెను. శరీరము కంపించుచుండగా సజలనయనుడై, ప్రేమవిహ్వలుడై శ్రీరామునిచరణములను పట్టుకొనెను. లక్ష్మణుడేమియు మాట్లాడలేక పోయెను. కేవలము నిలబడి చూచుచుండెను. నీటిలో నుండి బయటికి తీయబడిన చేపవలె అతడు దీనముగా గిలగిలలాడుచుండెను. అతడు మానసికముగా విచారగ్రస్తుడై ఆందోళనపడసాగెను. "భగవంతుడా! ఏమి కానున్నది? మాసుఖము, పూర్వపుణ్యములు పూర్తియైనవా? శ్రీరామచంద్రుడు నాకేమి ఆజ్ఞనిచ్చును? నన్ను ఇంటియొద్దనే ఉంచునా? లేక వెంటదీసికొని పోవునా?" ఈ విధముగా లక్ష్మణుడు విచారవదనుడై దేహగేహపరివారముల యందు ఆసక్తిని, మమకారమును వదలి, చేతులు కట్టుకొని నిలబడియుండుట జూచి, నీతి శాస్త్రనిపుణుడు, స్నేహశీలసుఖసాగరుడైన శ్రీరాముడు ఇట్లు పలికెను. "నాయనా! ప్రేమాతిరేకమున నీవు అధైర్యమునకు లోనుకావలదు. నీవు ఇచ్చట ఉండుటవలన పరిణామము శుభమే అగునని ఎఱుంగుము. (చౌ॥ 1-4)

దో- మాతు పితా గురు స్వామి సిఖ, సిర ధరి కరహిఁ సుభాయఁ ।
లహేఉ లాభు తిన్హ జనమ కర, నతరు జనము జగ జాయఁ ॥ 70 ॥

సహజముగా తల్లిదండ్రుల హితోక్తులను, గురువుల ఉపదేశములను, ప్రభువుల ఆజ్ఞలను పొదలదాల్చు వాని జన్మయే సార్థకము. అట్లు చేయని వానిజన్మనిరర్థకము. (దో॥ 70)

చౌ- అస జియఁ జాని సునహు సిఖ భాఈ । కరహు మాతు పితు పద సేవకాఈ ॥
భవన భరతు రిపుసూదను నాహీఁ । రాఉ బృద్ధ మమ దుఖు మన మాహీఁ ॥ 1 ॥
మైఁ బన జాఉఁ తుమ్హహి లెఇ సాథా । హోఇ సబహి బిధి అవధ అనాథా ॥
గురు పితు మాతు ప్రజా పరివారూ । సబ కహుఁ పరఇ దుసహ దుఖ భారూ ॥ 2 ॥
రహహు కరహు సబ కర పరితోషూ । నతరు తాత హోఇహి బడ దోషూ ॥
జాసు రాజ ప్రియ ప్రజా దుఖారీ । సో నృపు అవసి నరక అధికారీ ॥ 3 ॥

రహహు తాత అసి నీతి బిచారీ । సునత లఖను భఏ బ్యాకుల భారీ ॥
సిఅరేఁ బచన సూఖి గఏ కైసేఁ । పరసత తుహిన తామరసు జైసేఁ ॥ 4 ॥

"సోదరా! దీనిని మనసులో ఉంచుకొని, నాసూచనను పాటించి, తల్లిదండ్రులను సేవించుచు ఇక్కడనే యుండుము. భరతశత్రుఘ్నులును ఇంటలేరు. మహారాజుగారు వృద్ధులు. నాగుటించి వారు చాల దుఃఖితులగుచున్నారు. ఇట్టిస్థితిలో నేను నిన్నుగూడ వనమునకు తీసికొని పోయినచో అయోధ్య అన్నివిధముల అనాథయగును. గురువుగారు, తల్లిదండ్రులు, ప్రజలు, పరివారము అందఱును దుర్భరమైన దుఃఖమును పొందెదరు. కావున నీవిచ్చటనే యుండి అందఱిని ఓదార్చి, సంతుష్టులను జేయుము. లేనిచో సోదరా! గొప్ప తప్పిదమే యగును. తనను ప్రేమించుప్రజలను దుఃఖములపాలుసేయురాజు నిశ్చయముగా నరకమునకే పోవును. కావున నాయనా! దీనిని నీ ధర్మముగా భావించి ఇచటనే యుండుము." లక్ష్మణుడు ఈ మాటలను విని, అత్యంత వ్యాకులుడాయెను. శ్రీరాముని అనునయ వచనములు చల్లనివేయైనను మంచు తాకిడికి కమలము వలె ఆవచనములలోని తీవ్రతకు లక్ష్మణుని ముఖము వాడిపోయెను. (చౌ॥ 1-4)

దో- ఉతరు న ఆవత ప్రేమబస, గహే చరన అకులాఇ ।
నాథ దాసు మైఁ స్వామి తుమ్హ, తజహు త కాహ బసాఇ ॥ 71 ॥

ప్రేమాధిక్యమున లక్ష్మణుడు సమాధానమియ్యలేక పోయెను. కాని ఎంతో వ్యాకులుడై శ్రీరాముని చరణములపై బడి పలికెను. "ప్రభూ! నేను సేవకుడను, మీరు నా ప్రభువులు. మీరే నన్ను త్యజించినచో నేనేమిజేయగలను? (దో॥ 71)

చౌ- దీన్హి మోహి సిఖ నీకి గోసాఈఁ । లాగి అగమ అపనీ కదరాఈఁ ॥
నరబర ధీర ధరమ ధుర ధారీ । నిగమ నీతి కహుఁ తే అధికారీ ॥ 1 ॥
మైఁ సిసు ప్రభు సనేహఁ ప్రతిపాలా । మందరు మేరు కి లేహిఁ మరాలా ॥
గుర పితు మాతు న జానఉఁ కాహూ । కహఉఁ సుభాఉ నాథ పతిఆహూ ॥ 2 ॥
జహఁ లగి జగత సనేహ సగాఈ । ప్రీతి ప్రతీతి నిగమ నిజు గాఈ ॥
మోరేఁ సబఇ ఏక తుమ్హ స్వామీ । దీనబంధు ఉర అంతరజామీ ॥ 3 ॥
ధరమ నీతి ఉపదేసిఅ తాహీ । కీరతి భూతి సుగతి ప్రియ జాహీ ॥
మన క్రమ బచన చరన రత హోఈ । కృపాసింధు పరిహరిఅ కి సోఈ ॥ 4 ॥

స్వామీ! మీరు నాకు చాలా మంచిఉపదేశమునే ఇచ్చితిరి. కాని నేను దుర్బల హృదయుడనగుటవలన దానిని అనుసరించుట కష్టతరము. ధీరులు, ధర్మనిరతులు ఐన శ్రేష్ఠులు మాత్రమే వేద, నీతి శాస్త్ర ప్రబోధములకు అధికారులు. నేను ప్రభువులవారిప్రేమతో పెఱిగిన పసిబాలుడను. హంసయెప్పుడైనను మందరాచలమును, మేరుపర్వతమును ఎత్తగలదా? ప్రభూ! నిక్కము వచించుచున్నాను. విశ్వసింపుడు. మిమ్ము దప్ప తల్లిని, తండ్రిని,

గురువును ఎవ్వరినీ నేనెఱుగను. ఓ దీనబంధూ! అంతర్యామీ! వేదములు ప్రవచించిన స్నేహబంధములు, ప్రేమ, విశ్వాసము, అన్నియును ఈ జగత్తున నాకు మీరే. యశమును, ఐశ్వర్యమును, సద్గతిని కోరుకొను వానికి ధర్మమును నీతిశాస్త్రమును బోధింపవలెను. కాని, నాకు అవియేమియు వద్దు. ఓ కృపాసింధూ! మనోవాక్కర్మలచే మీయందనురక్తుడై యుండు వానిని త్యజింపదగునా? (చౌ॥ 1-4)

దో- కరునాసింధు సుబంధు కే, సుని మృదు బచన బినీత।
సముఝాఏ ఉర లాఇ ప్రభు, జాని సనేహఀ సభీత ॥ 72 ॥

కరుణాసింధువైన శ్రీరామచంద్రుడు తనసోదరునివినయపూర్వకకోమలవచనములను విని, ప్రేమాతిరేకముచే అతడు కలతచెందినాడని యెఱింగి, అతనిని హృదయమునకు హత్తుకొని, అనునయించెను. (దో॥ 72)

## లక్ష్మణునకు సుమిత్రా మాత అనుజ్ఞ

చౌ- మాగహు బిదా మాతు సన జాఈ। ఆవహు బేగి చలహు బన భాఈ॥
ముదిత భఏ సుని రఘుబర బానీ। భయఉ లాభ బడ గఇ బడి హానీ ॥ 1 ॥
హరషిత హృదయఀ మాతు పహిఀ ఆఏ। మనహుఀ అంధ ఫిరి లోచన పాఏ॥
జాఇ జనని పగ నాయఉ మాథా। మను రఘునందన జానకి సాథా ॥ 2 ॥
పూఀఛే మాతు మలిన మన దేఖీ। లఖన కహీ సబ కథా బిసేషీ॥
గఈ సహమి సుని బచన కఠోరా। మృగీ దేఖి దవ జను చహు ఓరా ॥ 3 ॥
లఖన లఖేఉ భా అనరథ ఆజూ। ఏహిఀ సనేహ బస కరబ అకాజూ॥
మాగత బిదా సభయ సకుచాహీఀ। జాఇ సంగ బిధి కహిహి కి నాహీఀ ॥ 4 ॥

(మఱియు పల్కెను) "సోదరా! నీవు వెళ్ళి తల్లిగారిఅనుజ్ఞను తీసికొని రమ్ము. త్వరగా వనములకు వెళ్ళుదము." రఘునాథుని పల్కులను విని, లక్ష్మణుడు సంతసించెను. గొప్ప సంకటము తొలగి, ఎంతో లాభము చేకూరినట్లు అతడు హాయిని అనుభవించెను. అంధునకు చూపువచ్చినంత ఆనందముతో అతడు తల్లి సుమిత్రకడకు చేరెను. ఆమె పాదములకు ప్రణమిల్లెను. కాని అతని మనస్సు రఘుకులానందప్రదుడగు శ్రీరామునిపాదములమీదను, జగజ్జననియైన జానకీదేవిచరణకమలములయందును ఉండెను. చింతాకులుడైయున్న లక్ష్మణుని గాంచి సుమిత్ర కారణమడిగెను. లక్ష్మణుడు జరిగినకథనంతయును తెల్పెను. లక్ష్మణుడు తెల్పిన కఠోరమైన వనవాసవార్తను విని, అడవిలో నలువైపులా అగ్ని జ్వాలలనుజూచినలేడివలె ఆమె భయకంపిత యయ్యెను. వాత్సల్యకారణముగ తల్లి తనకోరికను కాదనుననియు, అనర్థము వాటిల్లుననియు లక్ష్మణుడు భావించెను. కనుక అనుజ్ఞనడుగుటకు వెనుకాడెను. మనస్సులో, "భగవంతుడా! వనములకు వెళ్ళుచున్న శ్రీరాముని అనుసరించుటకు తల్లి అనుమతించునో లేదో?" అని ఆందోళన చెందెను. (చౌ॥ 1-4)

దో- సమురిఝ సుమిత్రాఁ రామ సియ, రూపు సుసీలు సుభాఉ ।
నృప సనేహు లఖి ధునెఉ సిరు, పాపిని దీన్హ కుదాఉ ॥ 73 ॥

సుమిత్రాదేవి శ్రీ సీతారాములరూపములను, సౌశీల్యములను, స్వభావములను తలంచుకొని, అట్లే రాజునకు వారిపై గల ప్రేమాను రాగములనుగూడ స్మరించి, తన తలబాదు కొనుచు "కైకేయి ఆయువు పట్టుపై పెద్ద దెబ్బ కొట్టినది" అని తలచెను. (దో॥ 73)

చౌ- ధీరజు ధరెఉ కుఅవసర జానీ । సహజ సుహ్నద బోలీ మృదు బానీ ॥
తాత తుమ్హారి మాతు బైదేహీ । పితా రాము సబ భాఁతి సనేహీ ॥ 1 ॥
అవధ తహాఁ జహఁ రామ నివాసూ । తహఁఇఁ దివసు జహఁ భాను ప్రకాసూ ॥
జౌఁ పై సీయ రాము బన జాహీఁ । అవధ తుమ్హార కాజు కఛు నాహీఁ ॥ 2 ॥
గుర పితు మాతు బంధు సుర సాఈఁ । సెఇఅహిఁ సకల ప్రాన కీ నాఈఁ ॥
రాము ప్రానప్రియ జీవన జీ కే । స్వారథ రహిత సఖా సబహీ కే ॥ 3 ॥
పూజనీయ ప్రియ పరమ జహాఁ తేఁ । సబ మానిఅహిఁ రామ కే నాతేఁ ॥
అస జియఁ జాని సంగ బన జాహూ । లేహు తాత జగ జీవన లాహూ ॥ 4 ॥

సహజముగా మంచిహృదయముగలదియగుటచే సుమిత్ర అది శోకమునకు తగిన సమయముగాదని గ్రహించి, ధైర్యము వహించి, మృదువచనములతో ఇట్లనెను. "నాయనా! వైదేహియే నీకు తల్లి, ప్రేమ స్వరూపుడైన శ్రీరాముడే నీకు తండ్రి, రాముడున్నచోటే అయోధ్య, సూర్యుడు వెలుగొందుచున్న సమయమే పగలు. నిజముగా సీతారాములు వనవాసమునకు పోవుచున్నచో నీకు అయోధ్యతో పనియేలేదు. గురువు, తల్లిదండ్రులు, సోదరుడు, దేవతలు, ప్రభువు- వీరందరిని ప్రాణతుల్యముగా భావించి సేవింపవలెను. కాని శ్రీరామచంద్రుడు ప్రాణములకంటెను ప్రీతిపాత్రుడు. అందరికిని ఆత్మయైనవాడు, నిఃస్వార్థ మిత్రుడు, శ్రీరామునియెడ భక్తిశ్రద్ధలుగలవారే ఈ ప్రపంచమున అందరికిని పూజ్యులు, పరమప్రియులు.[1] దీనిని మనసులో నిలుపుకొని, అన్నతో నీవును వనములకు వెళ్లుము. ఈ జగత్తులో నీజన్మను సార్థక మొనర్చుకొనుము. (చౌ॥ 1-4)

దో- భూరి భాగ భాజను భయహు, మోహి సమేత బలి జాఉఁ ।
జౌఁ తుమ్హరేఁ మన ఛాడి ఛలు, కీన్హ రామ పద ఠాఉఁ ॥ 74 ॥

"కుమారా! నీ చిత్తము సర్వదా శ్రీరాముని చరణములకు నెలవు అగుటవలన నీవు ఎంతో భాగ్యశాలివి. నీకు తల్లినగుటవలన నేనును మిక్కిలి అదృష్టవంతురాలను. నీ రామభక్తికి నివాళులర్పించుచున్నాను. (దో॥ 74)

1. రామభక్తి సామ్రాజ్యము ఏ మానవులకబ్బెనో మనసా!
ఆమానవుల సందర్శన మత్యంత బ్రహ్మానందమే ॥ రామ ॥ (త్యాగరాజ)

చౌ- పుత్రవతీ జుబతీ జగ సోఈ । రఘుపతి భగతు జాసు సుతు హోఈ ॥
నతరు బాఁఝ భలి బాది బిఆనీ । రామ బిముఖ సుత తేఁ హిత జానీ ॥ 1 ॥
తుమ్హరేహిఁ భాగ రాము బన జాహీఁ । దూసర హేతు తాత కఛు నాహీఁ ॥
సకల సుకృత కర బడ ఫలు ఏహూ । రామ సీయ పద సహజ సనేహూ ॥ 2 ॥
రాగు రోషు ఇరిషా మదు మోహూ । జని సపనేహుఁ ఇన్హ కే బస హోహూ ॥
సకల ప్రకార బికార బిహాఈ । మన క్రమ బచన కరేహు సేవకాఈ ॥ 3 ॥
తుమ్హ కహుఁ బన సబ భాఁతి సుపాసూ । సఁగ పితు మాతు రాము సియ జాసూ ॥
జేహిఁ న రాము బన లహహిఁ కలేసూ । సుత సోఇ కరేహు ఇహఇ ఉపదేసూ ॥ 4 ॥

శ్రీరఘునాథునకు భక్తుడైనపుత్రునిగన్న స్త్రీయే నిజముగా పుత్రవతి. రామునకు విరోధియైన పుత్రునిగనుటకంటెను గొడ్రాలుగానుండుటయే మేలు. పశువువలె అట్టి వానికి జన్మనిచ్చుట వ్యర్థము. శ్రీరాముడు వనములకు వెళ్లుట నీ అదృష్ట ఫలమే. వేఱే కారణము లేనే లేదు. నాయనా! శ్రీ సీతారాములపాదపద్మములపై నిసర్గమైన ప్రేమయుండుట పురాకృత సుకృత ఫలమే. రాగము, రోషము, ఈర్ష్య, మదము, మోహము- వీటికి స్వప్నములో గూడ వశము కారాదు. అన్ని రకముల వికారములను త్యజించి, మనోవాక్కర్మలచే సీతారాములను సేవింపుము. వారు నీకు తల్లిదండ్రులుగా ఉన్నప్పుడు వనములోనే నీకు సుఖశాంతులు లభించును. పుత్రా! శ్రీరామునికి క్లేశములు కలుగకుండా నీవు మెలగవలెను. ఇదియే నా ఉపదేశము. (చౌ॥ 1-4)

ఛం- ఉపదేసు యహు జేహిఁ తాత తుమ్హరే రామ సియ సుఖ పావహీఁ ।
పితు మాతు ప్రియ పరివార పుర సుఖ సురతి బన బిసరావహీఁ ॥
తులసీ ప్రభుహి సిఖ దేఇ ఆయసు దీన్హ పుని ఆసిష దఈ ।
రతి హోఉ అబిరల అమల సియ రఘుబీర పద నిత నిత నఈ ॥

నాయనా! నీవు తోడుగా ఉండుటవలన సీతారాములు సుఖముగా ఉండవలెను. వారు తల్లిదండ్రులను, ప్రియపరివారమును, నగరసుఖములను మఱచి పోవలెను. ఇదియే నా ఉపదేశము." తులసీదాసు చెప్పుచున్నాడు ఈ విధముగా సుమిత్రాదేవి మన లక్ష్మణస్వామికి ఉపదేశించి, వనవాసగమనమునకు అతనిని అనుమతించెను. "శ్రీ సీతారాములచరణములపై నీ విశుద్ధ ప్రగాఢప్రేమ నిత్యనూతనముగా ఉండుగాక" అని దీవించెను. (ఛం)

సో- మాతు చరన సిరు నాఇ, చలే తురత సంకిత హృదయఁ ।
బాగుర బిషమ తోరాఇ, మనహుఁ భాగ మృగు భాగ బస ॥ 75 ॥

లక్ష్మణుడు మాతృపదములకు మోకరిల్లి, భాగ్యవశమున వలనుండి తప్పించు కొనిన జింకవలె భయపడుచు వెళ్లెను. (మఱియేమి విఘ్నము వచ్చిపడునోయని భయము.) (సో॥ 75)

చౌ- గఏ లఖను జహఁ జానకినాథూ । భే మన ముదిత పాఇ ప్రియ సాథూ ॥
బంది రామ సియ చరన సుహాఏ । చలే సంగ నృపమందిర ఆఏ ॥ 1 ॥

కహహిం పరసపర పుర నర నారీ । భలి బనాఇ బిధి బాత బిగారీ ॥
తన కృస మన దుఖు బదన మలీనే । బికల మనహుఁ మాఖీ మధు ఛీనే ॥ 2 ॥
కర మీజహిఁ సిరు ధుని పఛితాహీఁ । జను బిను పంఖ బిహగ అకులాహీఁ ॥
భఇ బడి భీర భూప దరబారా । బరని న జాఇ బిషాదు అపారా ॥ 3 ॥
సచివఁ ఉఠాఇ రాఉ బైఠారే । కహి ప్రియ బచన రాము పగు ధారే ॥
సియ సమేత దోఉ తనయ నిహారీ । బ్యాకుల భయఉ భూమిపతి భారీ ॥ 4 ॥

పిమ్మట లక్ష్మణుడు మిక్కిలి ప్రసన్న చిత్తుడై, శ్రీరామునికడకు వెళ్లెను. సీతారాములకు నమస్కరించి, వారితోగూడ రాజప్రాసాదమునకు నడిచెను. "బాగుగా ఆలోచించి నిర్ణయించిన కార్యమును విధాత యెట్లు భంగపఱచెను?" అని నగరవాసులందఱును తమలో తాము చర్చించు కొనుచుండిరి. వారి శరీరములు కృశించెను. మనస్సులు దుఃఖభరితములాయెను. ముఖములు వాడిపోయెను. తేనెపట్టులోని తేనెను తొలగింపగా బాధపడు తేనెటీగలవలె వారందఱును వ్యాకులచిత్తులైరి. ఱెక్కలుతెగినపక్షులవలె కలవరపాటునకు గురియైరి, చేతులు పిసుకుకొనుచుండిరి. తలలుబాదుకొనుచుండిరి. రాజభవనద్వారముకడ ప్రజలు గుమిగూడిరి. 'శ్రీరామచంద్రుడు విచ్చేసినాడు' అని పల్కుచు మంత్రి రాజుగారిని లేపి కూర్చుండ బెట్టెను. సీతా, లక్ష్మణ సహితుడై శ్రీరాముడు వనవాసమునకు సిద్ధమగుట జూచి, రాజు మిక్కిలి శోకాకులుడయ్యెను. (చౌ॥ 1-4)

దో- సీయ సహిత సుత సుభగ దోఉ, దేఖి దేఖి అకులాఇ ।
బారహిఁ బార సనేహబస, రాఉ లేఇ ఉర లాఇ ॥ 76 ॥

సుకుమారియైన జానకిని, రామలక్ష్మణులను రాజు పరికించి, పరికించి చూచెను. అతడు కుమారులనిద్దఱిని ప్రేమతో పిచ్చిగా తనహృదయమునకు హత్తుకొనెను. (దో॥ 76)

చౌ- సకఇ న బోలి బికల నరనాహూ । సోక జనిత ఉర దారున దాహూ ॥
నాఇ సీసు పద అతి అనురాగా । ఉఠి రఘుబీర బిదా తబ మాగా ॥ 1 ॥
పితు అసీస ఆయసు మోహి దీజై । హరష సమయ బిసమఉ కత కీజై ॥
తాత కిఏఁ ప్రియ ప్రేమ ప్రమాదూ । జసు జగ జాఇ హోఇ అపబాదూ ॥ 2 ॥
సుని సనేహ బస ఉఠి నరనాహాఁ । బైఠారే రఘుపతి గహి బాహాఁ ॥
సునహు తాత తుమ్హ కహుఁ ముని కహహీఁ । రాము చరాచర నాయక అహహీఁ ॥ 3 ॥
సుభ అరు అసుభ కరమ అనుహారీ । ఈసు దేఇ ఫలు హృదయఁ బిచారీ ॥
కరఇ జో కరమ పావ ఫల సోఈ । నిగమ నీతి అసి కహ సబు కోఈ ॥ 4 ॥

మిక్కిలి శోకగ్రస్తుడగుటచే రాజు ఏమియు మాట్లాడలేక పోయెను. శ్రీరామచంద్రుడు ప్రేమతో రాజుగారిపాదములకు ప్రణమిల్లి, అనుజ్ఞను అర్థించెను. "నాయనగారూ! నన్ను ఆశీర్వదించి, ఆజ్ఞయిండు. హర్షింపవలసిన సమయమున మీరెందులకు దుఃఖించెదరు? తండ్రీ! ప్రియమైన వస్తువునెడగల వ్యామోహముతో కర్తవ్యము విస్మరించినచో కీర్తి దెబ్బతినును. నిందలుకల్గును." ఈ మాటలకు మహారాజు ప్రేమతో లేచి, రఘునాథుని స్వయముగా కూర్చుండ బెట్టి, పలికెను. "కుమారా! వినుము. శ్రీరాముడు సకల చరాచర ప్రాణికోటికిని ప్రభువని

నిన్ను గూర్చి మునులు పల్కుచుందురు. శుభాశుభకర్మలను పరిశీలించి, విధాత వాటిఫలితములను ప్రసాదించును. చేసిన కర్మలకు ఫలితములను అనుభవించుట అనివార్యము. (అవశ్యం అనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్) ఇదియే సర్వసమ్మతమైన వేదనీతి. (చౌ॥ 1-4)

దో- ఔరు కరై అపరాధు కోఉ, ఔర పావ ఫల భోగు।
అతి బిచిత్ర భగవంత గతి, కో జగ జానై జోగు ॥ 77 ॥

కాని విధివైపరీత్యమున ఈ సమయమున అపరాధము ఒకరిది కాగా దాని ఫలితమును వేఱొకరు అనుభవించుచున్నారు. భగవంతునిలీలలు విచిత్రములైనవి. ప్రపంచమున వాటిని ఎవ్వరును తెలిసికొన జాలరు." (దో॥ 77)

చౌ- రాయఁ రామ రాఖన హిత లాగీ । బహుత ఉపాయ కిఏ ఛలు త్యాగీ ॥
లఖీ రామ రుఖ రహాత న జానే । ధరమ ధురంధర ధీర సయానే ॥ 1 ॥
తబ నృప సీయ లాఇ ఉర లీన్హీ । అతి హిత బహుత భాఁతి సిఖ దీన్హీ ॥
కహి బన కే దుఖ దుసహ సునాఏ । సాసు ససుర పితు సుఖ సముఝాఏ ॥ 2 ॥
సియ మను రామ చరన అనురాగా । ఘరు న సుగము బను బిషము న లాగా ॥
ఔరఉ సబహిఁ సీయ సముఝాఈ । కహి కహి బిపిన బిపతి అధికాఈ ॥ 3 ॥
సచివ నారి గుర నారి సయానీ । సహిత సనేహ కహహిఁ మృదు బానీ ॥
తుమ్హ కహుఁ తౌ న దీన్హ బనబాసూ । కరహు జో కహహిఁ ససుర గుర సాసూ ॥ 4 ॥

శ్రీరాముని ఆపుటకు దశరథుడు నిండు మనస్సుతో అనేకవిధముల ప్రయత్నించెను. కాని శ్రీరాముడు ధర్మనిరతుడు, ధీరుడు, బుద్ధిమంతుడు అనియు, తాను ఎంతగా ప్రయత్నించినను అతడు తనదృఢనిశ్చయమును మార్చుకొనడనియు తెలిసికొని, రాజు సీతాదేవిని దగ్గఱకుదీసికొని ఆమెకు పెక్కురీతుల బోధించెను. వనవాసక్లేశములనుగూర్చియు, అత్తమామలకును, తల్లిదండ్రులకును సేవలు చేయుటలోగల సుఖములను గూర్చియు తెలిపెను. కాని సీతాదేవిమనస్సు శ్రీరామునిచరణములమీదనే యుండెను. కావున గృహవాసము సుఖమని గాని, వనవాసము కష్టమనిగాని ఆమె భావింప లేదు. ఇతరులును వనవాస కష్టములనుగూర్చి మిక్కిలి భయావహముగా వర్ణించిరి. సుమంత్రుని భార్యయు, వసిష్ఠ మహర్షిభార్యయైన అరుంధతియు ఇంకను వివేకవతులైన కొందఱును మిక్కిలి ప్రేమతో మృదుమధురముగా ఆమెతో పల్కిరి. "రాజుగారు నిన్ను వనవాసము చేయుమని ఆదేశింపలేదు గదా! కావున నీ అత్తమామలు, గురువు ఆజ్ఞాపించినట్లు చేయుము." (చౌ॥ 1-4)

దో- సిఖ సీతలి హిత మధుర మృదు, సుని సీతహి న సోహాని।
సరద చంద చందిని లగత, జను చకఈ అకులాని ॥ 78 ॥

హితకరములైన ఈ చల్లనిమధురవచనములు సీతాదేవికి ఏ మాత్రమూ రుచింపలేదు. శరదృతువునందలి చంద్రుని వెన్నెలలకు చక్రవాకమువలె ఆమె వ్యాకులత నొందెను. (దో॥ 78)

చౌ- సీయ సకుచ బస ఉతరు న దేఈ। సో సుని తమకి ఉఠీ కైకేఈ॥
ముని పట భూషన భాజన ఆనీ। ఆగేఁ ధరి బోలీ మృదు బానీ ॥ 1 ॥
నృపహి ప్రానప్రియ తుమ్హ రఘుబీరా। సీల సనేహ న ఛాడిహి భీరా ॥
సుకృతు సుజసు పరలోకు నసాఊ। తుమ్హహి జాన బన కహిహి న కాఊ ॥ 2 ॥
అస బిచారి సోఇ కరహు జో భావా। రామ జనని సిఖ సుని సుఖు పావా ॥
భూపహి బచన బానసమ లాగే। కరహిఁ న ప్రాన పయాన అభాగే ॥ 3 ॥
లోగ బికల మురుఛిత నరనాహూ। కాహ కరిఅ కఛు సూఝు న కాహూ ॥
రాము తురత ముని బేషు బనాఈ। చలే జనక జననిహి సిరు నాఈ ॥ 4 ॥

సంకోచవశమున సీతాదేవి సమాధానమును చెప్పలేదు. ఇది చూచి, కైకేయి తమకముతో వనవాసమునకు తగిన వల్కలములను ఆభరణములను, పాత్రలను తెచ్చి, శ్రీరాముని ముందుంచి, మృదువుగా ఇట్లు పలికెను. "ఓ రామా! నీవు రాజుగారికి ప్రాణసమానుడవు. ప్రేమ వశమున దుర్బలహృదయుడైన రాజు స్నేహశీలములను విడిచిపెట్టలేరు. రాజుగారు తన యశమును, పుణ్యమును, పరలోకసౌఖ్యములనుసైతము వదలుకొందురు. నిన్ను మాత్రము వనములకు పోనియ్యరు. ఈ విషయమును బాగుగా యోచించి, నీకు యుక్తమైన దానిని ఆచరింపుము." కైకేయిమాతఉపదేశవచనములకు శ్రీరాముడు సంతసించెను. మహారాజునకు ఈ మాటలు ములుకులవలె గ్రుచ్చుకొనెను. "నా ప్రాణములింకను ఏలనిలిచియున్నవి?" అనినుడువుచు రాజు మూర్ఛితుడాయెను. ప్రజలు వికలులైరి. ఏమి చేయుటకును వారికి తోచదాయెను. శ్రీరామచంద్రుడు వెంటనే మునివేషము దాల్చి తల్లిదండ్రులకు నమస్కరించి ముందునకు సాగెను. (చౌ॥ 1-4)

## శ్రీ సీతారామలక్ష్మణుల వనగమనము

దో- సజి బన సాజు సమాజు సబు, బనితా బంధు సమేత।
బంది బిప్ర గుర చరన ప్రభు, చలె కరి సబహి అచేత ॥ 79 ॥

వనవాసమునకు అవసరములగు వస్తువులను గైకొని, సీతాలక్ష్మణసహితుడై శ్రీరాముడు బ్రాహ్మణులకును, వసిష్ఠునకును ప్రణమిల్లెను. వనములకు బయలుదేఱుచున్న రాముని జూచి, అందఱును అచేతనులైరి. (దో॥ 79)

చౌ- నికసి బసిష్ఠ ద్వార భఏ ఠాఢే। దేఖే లోగ బిరహ దవ దాఢే ॥
కహి ప్రియ బచన సకల సముఝాఏ। బిప్ర బృంద రఘుబీర బొలాఏ ॥ 1 ॥
గుర సన కహి బరషాసన దీన్హే। ఆదర దాన బినయ బస కీన్హే ॥
జాచక దాన మాన సంతోషే। మీత పునీత ప్రేమ పరితోషే ॥ 2 ॥
దాసీఁ దాస బొలాఇ బహోరీ। గురహి సౌంపి బోలే కర జోరీ ॥
సబ కై సార సఁభార గోసాఈఁ। కరబి జనక జననీ కీ నాఈఁ ॥ 3 ॥

బారహిఀ బార జోరి జుగ పానీ । కహత రాము సబ సన మృదు బానీ ॥
సోఇ సబ భాఀతి మోర హితకారీ । జెహి తేఀ రహై భుఆల సుఖారీ ॥ 4 ॥

అక్కడినుండి బయలుదేతి, వారు వసిష్ఠునినివాసమునకు చేరిరి. అక్కడనూ ప్రజలెల్లరు గుమిగూడి, రామునియెడబాటునకు తట్టుకొనలేక విరహాగ్నికి విలవిలలాడు చుండుటను వారు చూచిరి. రఘురాముడు తన ప్రియ వచనములతో వారిని ఓదార్చి, బ్రాహ్మణులను పిలిపించెను. వారికి సంవత్సర గ్రాసమును ఇప్పింపవలసినదిగా, అతడు వసిష్ఠుని ప్రార్థించెను, ఆదరముతో దానములతో వినయముతో వారి మనస్సులను ఆనందింపజేసెను. పిదప దానసమ్మానములతో అర్థులను సంతోషపఱచెను. మిత్రులను తన ప్రేమతో సంతుష్టులను గావించెను. పిమ్మట దాసదాసీలను పిలిపించి, వారిని గురువునకు అప్పగించి, చేతులు జోడించి, "స్వామీ! మీరు తల్లిదండ్రులవలె వీరిని కాపాడుడు." అని ప్రార్థించెను. ఆచటనున్న ప్రతివ్యక్తికిని నమస్కరించి, మృదుమధురముగా పలికెను. "రాజుగారిని ఆనందపఱచువారే నాకు హితులు. (చౌ॥ 1-4)

దో- మాతు సకల మోరే బిరహఀ, జెహిఀ న హోహిఀ దుఖ దీన ।
సోఇ ఉపాఉ తుమ్హ కరెహు సబ, పుర జన పరమ ప్రబీన ॥ 80 ॥

పరమసహృదయులైన ఓ పౌరులారా! నాతల్లులకు నావియోగబాధ తెలియకుండ చేయుడు. (దో॥ 80)

చౌ- ఏహి బిధి రామ సబహి సముఝావా । గుర పద పదుమ హరషి సిరు నావా ॥
గనపతి గౌరి గిరీసు మనాఈ । చలే అసీస పాఇ రఘురాఈ ॥ 1 ॥
రామ చలత అతి భయఉ బిషాదూ । సుని న జాఇ పుర ఆరత నాదూ ॥
కుసగున లంక అవధ అతి సోకూ । హరష బిషాద బిబస సురలోకూ ॥ 2 ॥
గఇ మురుఛా తబ భూపతి జాగే । బోలి సుమంత్రు కహన అస లాగే ॥
రాము చలే బన ప్రాన న జాహీఀ । కెహి సుఖ లాగి రహత తన మాహీఀ ॥ 3 ॥
ఏహి తేఀ కవన బ్యథా బలవానా । జో దుఖు పాఇ తజహిఀ తను ప్రానా ॥
పుని ధరి ధీర కహఇ నరనాహూ । లై రథు సంగ సఖా తుమ్హ జాహూ ॥ 4 ॥

ఈ విధముగా శ్రీరాముడు పురప్రముఖులందఱికిని నచ్చజెప్పి, గురువుగారి పాదపద్మములకు సాదరముగా ప్రణమిల్లి, గణేశుని, గౌరీదేవిని, పరమేశ్వరుని ధ్యానించి, వారి ఆశీర్వాదములతో బయలుదేఱెను. శ్రీరాముడు బయలుదేఱువేళ నగరమంతయును విషాదముతో ఆర్తనాదములతో నిండిపోయెను. లంకలో అపశకునములు పొడసూపెను. అయోధ్య శోకవిహ్వలమాయెను. దేవలోకము హర్షశోకసమ్మిళితమాయెను. మూర్ఛనుండి స్పృహలోనికి వచ్చిన రాజు సుమంత్రుని బిలిచి, యిట్లు పలికెను. "శ్రీరాముడు వనములకు పోయినను నా ప్రాణములుమాత్రము పోకున్నవి. ఏ సుఖము నాసించి, అవి ఈ శరీరమును అంటిపెట్టుకొనియున్నవో తెలియుట లేదు. దుఃఖమునకు గురియైగూడ ఈ ప్రాణములు పోవుటలేదు. ఇంతకంటెను వ్యథ ఏముండును?" మఱల ధైర్యమును దెచ్చుకొని రాజు ఇట్లు పలికెను. "మిత్రమా! నీవు రథమును దీసికొని రామునితో వెళ్లుము. (చౌ॥ 1-4)

దో- సుఠి సుకుమార కుమార దోఉ, జనకసుతా సుకుమారి ।
రథ చఢాఇ దెఖరాఇ బను, ఫిరెహు గఏఀ దిన చారి ॥ 81 ॥

రాజకుమారులిద్దఱును, జానకియు మిక్కిలి సుకుమారులు. వారిని రథముపై ఎక్కించుకొని, వనమును చూపి, నాలుగుదినములలో తిరిగిరమ్ము. (దో॥ 81)

చౌ- జౌ౯ నహి౯ ఫిరహి౯ ధీర దోఉ భాఈ। సత్యసంధ ధృఢవ్రత రఘురాఈ॥
తౌ తుమ్హ బినయ కరేహు కర జోరీ। ఫేరిఅ ప్రభు మిథిలేసకిసోరీ॥ 1 ॥
జబ సియ కానన దేఖి డెరాఈ। కహేహు మోరి సిఖ అవసరు పాఈ॥
సాసు ససుర అస కహేఉ సందేసూ। పుత్రి ఫిరిఅ బన బహుత కలేసూ॥ 2 ॥
పితుగృహ కబహు౯ కబహు౯ ససురారీ। రహేహు జహా౯ రుచి హోఇ తుమ్హారీ॥
ఏహి బిధి కరేహు ఉపాయ కదంబా। ఫిరఇ త హోఇ ప్రాన అవలంబా॥ 3 ॥
నాహి౯ త మోర మరను పరినామా। కఛు న బసాఇ భఏ౯ బిధి బామా॥
అస కహి మురుఛి పరా మహి రాఊ। రాము లఖను సియ ఆని దేఖాఊ॥ 4 ॥

రఘునాథుడు సత్యవ్రతుడు గావున సోదరులిద్దఱును 'మేము తిరిగిరాము' అని చెప్పినచో చేతులు జోడించి, 'దయచేసి జనకసుత నైనను అయోధ్యకు పంపుడు' అని ప్రార్థింపుము. సీతాదేవి అడవిదృశ్యములకు భయపడినప్పుడు దానిని అవకాశముగా తీసికొని, ఇట్లు నా సందేశమును వినిపింపుము. 'కుమారీ! నీ అత్తమామలసందేశమును అనుసరించి, ఈ భయంకరవనమునుండి మఱలిరమ్ము. నీవు తండ్రిగారి ఇంటిలోనైనను అత్తగారింటిలోనైనను నీయిష్టప్రకారము నీకు తోచినంతకాలము ఉండవచ్చును.' ఏవిధముగనైనను ఏ ఉపాయములతోడనైనను, ఆమెను అయోధ్యకు తోడ్కొనిరమ్ము. కనీసము సీతమ్మ వచ్చినను నాప్రాణములకు ఆలంబనముదొరకును. లేనిచో పర్యవసానము నా మరణమే. విధి వైపరీత్యమునకు ఎవ్వరును ఏమియు చేయజాలరు." అనియిట్లు పలికిన పిమ్మట "నాకు సీతారామలక్ష్మణులను తెచ్చిచూపుము." అని పల్కుచు దశరథ మహారాజు మూర్ఛితుడాయెను. (చౌ॥ 1-4)

దో- పాఇ రజాయసు నాఇ సిరు, రథు అతి బేగ బనాఇ।
గయఉ జహా౯ బాహెర నగర, సీయ సహిత దోఉ భాఇ॥ 82 ॥

రాజాజ్ఞను పొందిన సుమంత్రుడు ఆయనకు నమస్కరించి, వెంటనే వేగవంతములైన హయములనుబూన్చిన రథముపై నగరపుపొలిమేరలను చేరెను. అక్కడ సీతారామలక్ష్మణులుండిరి. (దో॥ 82)

చౌ- తబ సుమంత్ర నృప బచన సునాఏ। కరి బినతీ రథ రాము చఢాఏ॥
చఢి రథ సీయ సహిత దోఉ భాఈ। చలే హృదయ౯ అవధహి సిరు నాఈ॥ 1 ॥
చలత రాము లఖి అవధ అనాథా। బికల లోగ సబ లాగే సాథా॥
కృపాసింధు బహుబిధి సముఝావహి౯। ఫిరహి౯ ప్రేమబస పుని ఫిరి ఆవహి౯॥ 2 ॥
లాగతి అవధ భయావని భారీ। మానహు౯ కాలరాతి అ౦ధిఆరీ॥
ఘోర జంతు సమ పుర నర నారీ। డరపహి౯ ఏకహి ఏక నిహారీ॥ 3 ॥
ఘర మసాన పరిజన జను భూతా। సుత హిత మీత మనహు౯ జమదూతా॥
బాగన్హ బిటప బేలి కుమ్హిలాహీ౯। సరిత సరోవర దేఖి న జాహీ౯॥ 4 ॥

పిదప సుమంత్రుడు శ్రీరామునకు రాజుగారిసందేశమును వినిపించి, రథమును అధిరోహింపుమని ప్రార్థించి, వారిని రథారూఢులుగా జేసెను. అంతట వారు అయోధ్యకు ప్రణమిల్లి, ముందునకుసాగిరి. శ్రీరామచంద్రుడు అయోధ్యను అనాథగా చేసిపోవుట చూచి, వ్యాకులురైన ప్రజలు వారిరథమువెంట పరుగులుదీసిరి. దయామూర్తియైన ఆ రామచంద్రుడు వారికి అనేకవిధముల నచ్చజెప్పి, తిరిగిపొండని పల్కెను. వారు కొంత దూరము అయోధ్యవైపునకునడచి ప్రేమవశమున మరల శ్రీరాముని అనుసరింపసాగిరి. ఇప్పుడు అయోధ్యలో కాళరాత్రి వ్యాపించినట్లు భయానకవాతావరణము ఏర్పడెను. నగరములోని స్త్రీ పురుషులు ఒకరికిమతియొకరు కూరమృగములుగా కన్పట్టుచుండిరి. వారిగృహములు శ్మశానములవలెను, అందున్నవారు భూతప్రేతములవలెను, మిత్రులు, పుత్రులు, హితైషులు యమదూతలవలెను కనబడసాగిరి. తోటలోని వృక్షములు, లతలు తేజోవిహీనములయ్యెను. నదులు, తటాకములు భయంకరముగా కన్పట్టుచుండెను. (చౌ॥ 1-4)

దో- హయ గయ కోటిన్హ కేలిమృగ, పురపసు చాతక మోర।
పిక రథాంగ సుక సారికా, సారస హంస చకోర ॥ 83 ॥

అసంఖ్యాకములైన ఏనుగులు, గుఱ్ఱములు, వినోదమునకై పెంచిన జింకలు, నగరములోని పశువులు, కోయిలలు, నెమళ్ళు, చిలుకలు, గోర్వంకలు, మైనా పక్షులు, హంసలు, చకోర పక్షులు- (దో॥ 83)

చౌ- రామ బియోగ బికల సబ ఠాఢే । జహఁ తహఁ మనహుఁ చిత్ర లిఖి కాఢే ॥
నగరు సఫల బను గహబర భారీ । ఖగ మృగ బిపుల సకల నర నారీ ॥ 1 ॥
బిధి కైకఈ కిరాతిని కీన్హీ । జెహిఁ దవ దుసహ దసహుఁ దిసి దీన్హీ ॥
సహి న సకే రఘుబర బిరహాగీ । చలే లోగ సబ బ్యాకుల భాగీ ॥ 2 ॥
సబహిఁ బిచారు కీన్హ మన మాహీఁ । రామ లఖన సియ బిను సుఖు నాహీఁ ॥
జహాఁ రాము తహఁ సబుఇ సమాజూ । బిను రఘుబీర అవధ నహిఁ కాజూ ॥ 3 ॥
చలే సాథ అస మంత్రు దృఢాఈ । సుర దుర్లభ సుఖ సదన బిహాఈ ॥
రామ చరన పంకజ ప్రియ జిన్హహీ । బిషయ భోగ బస కరహిఁ కి తిన్హహీ ॥ 4 ॥

శ్రీరాముని యెడబాటునకు కలతచెంది కలవరపాటునకులోనై ఎక్కడివక్కడ చిత్రములోనిబొమ్మలవలె నిలిచిపోయినవి. ఇంతకుముందు నగరమంతయు ఫలవృక్షములతో నిండిన దట్టమైన వనము వలెనుండెను. అందలి స్త్రీపురుషులు, పశు పక్షులు సుఖసంపదలతో హాయిగా నుండిరి. కాని విధాత కైకేయి యనెడి కిరాత స్త్రీని సృష్టించెను. ఆమె ఈ వనమును కాల్చుటకు దశదిశల దుస్సహదావాగ్నులను ప్రజ్వలింపజేసెను. తత్ఫలితముగా ఏర్పడిన శ్రీరామచంద్రుని విరహాగ్నిని భరింపలేక అందఱును వ్యాకులురై పరుగులు దీసిరి. అందఱును తమ తమ మనస్సులలో ఒకే ఆలోచనను కలిగియుండిరి. "సీతారామ లక్ష్మణులు లేనిదే సుఖము లేదు. శ్రీరాముడున్నచోటనే

సమాజము సుఖముగా ఉండును. శ్రీరాముడు లేని అయోధ్యలో మాకేమి పని?"[1] ఇట్లు దృఢనిశ్చయము చేసికొని, వారు శ్రీరాముని అనుసరించిరి. దేవతలకుగూడ అసూయను గలిగించు సుఖశాంతులకు నెలవైన తమఇండ్లనుగూడ వదలి వేసిరి. శ్రీరాముని చరణకమలములను ప్రేమించు వారు విషయభోగములలో చిక్కుపడుదురా? (చౌ॥ 1-4)

దో- బాలక బృద్ధ బిహాఇ గృహఁ, లగే లోగ సబ సాథ।
తమసా తీర నివాసు కియ, ప్రథమ దివస రఘునాథ ॥ 84 ॥

బాలురను వృద్ధులను తమ ఇండ్లలో వదలి, నగర ప్రజలందఱును ఆయనను అనుసరించిరి. శ్రీ రఘురాముడు మొదటి దినమున తమసానదీతీరమున బసచేసెను. (దో॥ 84)

చౌ- రఘుపతి ప్రజా ప్రేమబస దేఖీ । సదయ హృదయఁ దుఖు భయఉ బిసేషీ ॥
కరునామయ రఘునాథ గొసాఁఈ । బేగి పాఇఅహిఁ పీర పరాఈ ॥ 1 ॥
కహి సప్రేమ మృదు బచన సుహాఏ । బహుబిధి రామ లోగ సముఝాఏ ॥
కిఏ ధరమ ఉపదేస ఘనేరే । లోగ ప్రేమ బస ఫిరహిఁ న ఫేరే ॥ 2 ॥
సీలు సనేహు ఛాడి నహిఁ జాఈ । అసమంజస బస భే రఘురాఈ ॥
లోగ సోగ శ్రమ బస గఏ సోఈ । కఛుక దేవమాయాఁ మతి మోఈ ॥ 3 ॥
జబహిఁ జామ జుగ జామిని బీతీ । రామ సచివ సన కహేఉ సప్రీతీ ॥
ఖోజ మారి రథు హాఁకహు తాతా । ఆన ఉపాయఁ బనిహి నహిఁ బాతా ॥ 4 ॥

ప్రేమ (భక్తి) పరవశులైన తనప్రజలను జూచి, దయాళువైన శ్రీరామునిహృదయము ద్రవించెను. శ్రీరామచంద్రప్రభువు కరుణామయుడు. ఇతరుల దుఃఖమును వెంటనే గ్రహించును. ప్రేమపూర్వకముగా కోమలమధురవచనములతో వారికి అనేకవిధముల నచ్చజెప్పెను. ధార్మికమైన ఉపదేశములనిచ్చెను. కాని ప్రేమవిహ్వలురైన వారు తిరిగి పోవుటకు సమ్మతింపలేదు. శ్రీరామచంద్రునియెడగల తమస్నేహశీలములను వారు విడువలేకపోయిరి. శ్రీరాముడు ఇట్టి ధర్మసంకటమున చిక్కుకొనెను. ఆ రాత్రి శోకశ్రమలకారణముగ ప్రజలందఱును నిద్రలో మునిగియుండిరి. దేవతల మాయవలన గూడ వారి బుద్ధి మోహములో పడిపోయెను. రాత్రి రెండు జాములు గడిచిన పిమ్మట శ్రీరామచంద్రుడు ప్రేమపూర్వకముగా సుమంత్రునితో ఇట్లు పలికెను. "తండ్రీ! రథమును ఇచ్చటి నుండియే మళ్లించుకొనిపొండు. ఆ రథచక్రముల జాడలుగూడ ఎవ్వరికిని తెలియకుండునట్లు చూడుడు. ఆకారణమున రథము ఏ దిశకు వెళ్లినదియు ఎవ్వరును తెలిసికొన జాలరు. ఇంతకంటె గత్యంతరము లేదు.
(చౌ॥ 1-4)

దో- రామ లఖన సియ జాన చఢి, సంభు చరన సిరు నాఇ।
సచివఁ చలాయఉ తురత రథు, ఇత ఉత ఖోజ దురాఇ ॥ 85 ॥

---

1. సీతమ్మ మాయమ్మ, శ్రీరాముడు మాకుతండ్రి ॥ సీతమ్మ ॥
వాతాత్మజ సౌమిత్రి వైన తేయరిపుమర్దన
ధాత భరతాదులు సోదరులు మాకు ఓ మనసా! ॥ సీతమ్మ ॥ (త్యాగరాజ)

శివుని ప్రార్థించి, సీతారామలక్ష్మణులు రథమును అధిరోహించిరి. మంత్రి వెంటనే రథమును అటునిటు త్రిప్పుచు జాడలు గుర్తుపట్టకుండునట్లు చేసెను. (దో॥ 85)

చౌ- జాగే సకల లోగ భఏఁ భోరూ । గే రఘునాథ భయఉ అతి సోరూ ॥
రథ కర ఖోజ కతహుఁ నహిఁ పావహిఁ । రామ రామ కహి చహు దిసి ధావహిఁ ॥ 1 ॥
మనహుఁ బారినిధి బూడ జహాజూ । భయఉ బికల బడ బనిక సమాజూ ॥
ఏకహి ఏక దేహిఁ ఉపదేసూ । తజే రామ హమ జాని కలేసూ ॥ 2 ॥
నిందహిఁ ఆపు సరాహహిఁ మీనా । ధిగ జీవను రఘుబీర బిహీనా ॥
జౌఁ పై ప్రియ బియోగు బిధి కీన్హా । తౌ కస మరను న మాగేఁ దీన్హా ॥ 3 ॥
ఏహి బిధి కరత ప్రలాప కలాపా । ఆఏ అవధ భరే పరితాపా ॥
బిషమ బియోగు న జాఇ బఖానా । అవధి ఆస సబ రాఖహిఁ ప్రానా ॥ 4 ॥

తెల్లవాఱినంతనే నిద్ర నుండి లేచి, సీతారామ లక్ష్మణులను గాంచక ప్రజలు గగ్గోలుపడి, 'రఘునాథుడు వెళ్లిపోయినాడు.' అని పలికిరి. రథచక్రపుజాడలు ఎచ్చటను గన్పింపలేదు. 'రామా! రామా!' అనుచు నలుదెలనకును పరుగెత్తిరి. సముద్రమున ఓడ మునిగినప్పుడు వికలురైనవ్యాపారులస్థితివలె ఆ ప్రజలస్థితి కనపడెను. 'మనము వనవాస క్లేశములకు తట్టుకొన లేమని భావించి, శ్రీరాముడు మనలను ఇచటనే వదలివెళ్లినాడు'- అనుచు వారు పరస్పరము చెప్పికొనసాగిరి. వారు తమనుతాము (అందఱును ఒక్కుమ్మడిగా నిద్రావశులైనందులకు) దూషించుకొనసాగిరి. శ్రీరాముని ఎడబాసి, జీవించుట వ్యర్థము. విధాత మనప్రియతమప్రభువును మననుండి వేఱుచేసి, అతడు మనకు మృత్యువును ఏల ప్రసాదింపలేదు?' అని ఒకరినొకరు ప్రశ్నించు కొనుచు, (నీటినుండి తీయగానే చనిపోవు) చేపల నెంతో పొగడిరి. ఇట్లు పరిపరి విధములుగా పరితపించుచు వారు అయోధ్యకు తిరిగి వచ్చిరి. వారి విరహబాధ వర్ణనాతీతము. శ్రీరాముడు వనవాసమునుండి తిరిగివచ్చునను ఆశతో వారు జీవించుచుండిరి. (చౌ॥ 1-4)

దో- రామ దరస హిత నేమ బ్రత, లగే కరన నర నారి ।
మనహుఁ కోక కోకీ కమల, దీన బిహీన తమారి ॥ 86 ॥

శ్రీరాముని పునరాగమనమునకై స్త్రీ పురుషులందఱును ఉపవాసాదివ్రతనియమములను పాటింపసాగిరి. సూర్యుడు లేనప్పుడు చక్రవాక పక్షులవలె, కమలముల భంగి, శ్రీరాముడు లేనందున వారు దీనావస్థకు గురియైరి. (దో॥ 86)

చౌ- సీతా సచివ సహిత దోఉ భాఈ । స్పంగబేరపుర పహుఁచే జాఈ ॥
ఉతరే రామ దేవసరి దేఖీ । కీన్హ దండవత హరషు బిసేషీ ॥ 1 ॥
లఖన సచివఁ సియఁ కిఏ ప్రనామా । సబహి సహిత సుఖు పాయఉ రామా ॥
గంగ సకల ముద మంగల మూలా । సబ సుఖ కరని హరని సబ సూలా ॥ 2 ॥

కహి కహి కోటిక కథా ప్రసంగా । రాము బిలోకహిఁ గంగ తరంగా ॥
సచివహి అనుజహి ప్రియహి సునాఈ । బిబుధ నదీ మహిమా అధికాఈ ॥ 3 ॥
మజ్జను కీన్హ పంథశ్రమ గయఊ । సుచి జలు పిఅత ముదిత మన భయఊ ॥
సుమిరత జాహి మిటఇ శ్రమ భారూ । తెహి శ్రమ యహ లౌకిక బ్యవహారూ ॥ 4 ॥

సీతాదేవితోడను, మంత్రి తోడను సోదరులిద్దఱును శృంగబేరపురమునకు చేరిరి. అచట సురనదియైన గంగనుజూచి, శ్రీరాముడు రథమునుండి దిగి, సంతోషముతో జాహ్నవికి దండ ప్రణామములాచరించెను. లక్ష్మణుడుమ, సీతాదేవియు, సుమంత్రుడును గంగాదేవికి ప్రణమిల్లిరి. అందఱును అమితానందమును పొందిరి. భాగీరథి ఆనందస్వరూపిణి, సర్వమంగళములకును ఆలవాలము, సకల సుఖప్రదాయిని, సమస్త దుఃఖములను దూరము చేయునది. గంగాతరంగములను జూచుచు శ్రీరాముడు గంగానదీమహిమలనుగూర్చి పెక్కుకథలను సుమంత్రునకు లక్ష్మణునకు సీతాదేవికి చెప్పెను. తరువాత వారందఱును నదిలో స్నానములాచరించి, ప్రయాణపుబడలికలను దీర్చుకొనిరి. పవిత్రనదీతీర్థమును స్వీకరించుటచే వారిమనస్సులు ప్రసన్నములాయెను. శ్రీరామునినామశ్రవణమాత్రముననే సకలశ్రమలు దూరమగును. అట్టి ప్రభువు స్వచ్ఛందముగా మానవశరీరమును దాల్చి, లౌకిక శ్రమలకు గురియగుట ఆయన లీలావిలాసమే. (చౌ॥ 1-4)

దో- సుద్ధ సచ్చిదానందమయ, కంద భానుకుల కేతు ।
చరిత కరత నర అనుహరత, సంసృతి సాగర సేతు ॥ 87 ॥

శ్రీరామచంద్రుడు సత్త్వ రజస్తమో గుణములకతీతుడైన సచ్చిదానందవిగ్రహుడు. ఐనను ఆతడు సామాన్య మానవులవలె ప్రవర్తించుచుండెను. సూర్యవంశమునకే ఆయన అలంకారము. మానవులు భవసాగరమును దాటుటకు అతడొకసేతువు. (దో॥ 87)

## శ్రీరామ గుహుల సమాగమము

చౌ- యహ సుధి గుహఁ నిషాద జబ పాఈ । ముదిత లిఏ ప్రియ బంధు బొలాఈ ॥
లిఏ ఫల మూల భేఁట భరి భారా । మిలన చలేఉ హియఁ హరషు అపారా ॥ 1 ॥
కరి దండవత భేఁట ధరి ఆగేఁ । ప్రభుహి బిలోకత అతి అనురాగేఁ ॥
సహజ సనేహ బిబస రఘురాఈ । పూఁఛీ కుసల నికట బైఠాఈ ॥ 2 ॥
నాథ కుసల పద పంకజ దేఖేఁ । భయఉఁ భాగభాజన జన లేఖేఁ ॥
దేవ ధరని ధను ధాము తుమ్హారా । మైఁ జను నీచు సహిత పరివారా ॥ 3 ॥
కృపా కరిఅ పుర ధారిఅ పాఊ । థాపిఅ జను సబు లోగు సిహాఊ ॥
కహేహు సత్య సబు సఖా సుజానా । మోహి దీన్హ పితు ఆయసు ఆనా ॥ 4 ॥

నిషాదరాజైన గుహునకు శ్రీరాముని ఆగమనవార్త తెలియగనే అతడు సంతోషముతో తనబంధుమిత్రులను పిలిచి, ఫలమూలాదిఉపాయనములను కావళ్లకు ఎత్తుకొని, శ్రీరాముని దర్శించుటకై అపారహర్షముతో వచ్చెను. కానుకలను ప్రభువుముందుంచి, ఆయనకు ప్రణామములను ఆచరించి, మిక్కిలి భక్తితో దర్శింపసాగెను. శ్రీరామచంద్రుడు అతని సహజ ప్రేమకు వశుడై, దగ్గరకు పిలిచి, కుశలమడిగెను. నిషాదరాజు పలికెను. "ప్రభూ! మీ చరణకమలముల దర్శనమే మా సర్వసుఖములకును మూలము. నేను మిక్కిలి భాగ్యశాలిని. ఈ నేల, సంపదలు, అన్నియు మీవే. నేను, నా పరివారము మీ సామాన్య సేవకులము. దయతో మానగరమునకు (శృంగబేర పురమునకు) విచ్చేసి, ఈ దాసునికీర్తిని ఇనుమడింపజేయుడు. అందఱును నా అదృష్టమును కొనియాడెదరు." శ్రీరామచంద్రుడు పలికెను. "ప్రియమిత్రమా! నీవు లెస్స పలికితివి. కాని తండ్రిగారు నాకొసంగిన ఆజ్ఞవేఱుగా ఉన్నది. (చౌ॥ 1-4)

దో- బరష చారిదస బాసు బన, ముని బ్రత బేషు అహారు।
గ్రామ బాసు నహిఁ ఉచిత సుని, గుహహి భయఉ దుఖు భారు ॥ 88 ॥

నేను మునివేషముతో కందమూలఫలములను భుజించుచు పదునాలుగు సంవత్సరములు వనములలో నివసింపవలెను. గ్రామములోనుండుట నాకు ఉచితముగాదు." ఈ మాటలకు గుహుడు మిగుల దుఃఖితుడాయెను. (దో॥ 88)

చౌ- రామ లఖన సియ రూప నిహారీ। కహహిఁ సప్రేమ గ్రామ నర నారీ ॥
తే పితు మాతు కహహు సఖి కైసే। జిన్హ పఠఏ బన బాలక ఐసే ॥ 1 ॥
ఏక కహహిఁ భల భూపతి కీన్హా। లోయన లాహు హమహి బిధి దీన్హా ॥
తబ నిషాదపతి ఉర అనుమానా। తరు సింసుపా మనోహర జానా ॥ 2 ॥
లై రఘునాథహి ఠాఉఁ దెఖావా। కహెఉ రామ సబ భాఁతి సుహావా ॥
పురజన కరి జోహారు ఘర ఆఏ। రఘుబర సంధ్యా కరన సిధాఏ ॥ 3 ॥
గుహఁ సఁవారి సాఁథరీ డసాఈ। కుస కిసలయ మయ మృదుల సుహాఈ ॥
సుచి ఫల మూల మధుర మృదు జానీ। దోనా భరి భరి రాఖేసి పానీ ॥ 4 ॥

సీతారామలక్ష్మణులసౌందర్యమును జూచి ఆ గ్రామములోని స్త్రీపురుషులు మిక్కిలి సంబరపడి, ఇట్లు చర్చించుకొనిరి. "ఈ సుకుమారులైన బాలకులను అడవులకు పంపిన ఆ తల్లిదండ్రులెట్టివారు? వారిలో ఒకరు "రాజు చేసినది మంచిపనియే. ఈ నెపమున విధాత మనకు నేత్రానందమును గల్గించినాడు". అనిరి. శ్రీరామాదులు బసచేయుటకు నిషాదరాజు ఒక చక్కని శింశుపావృక్షచ్ఛాయలో ఏర్పాట్లు కావించెను. అతడు ఆ రఘువరునకు ఆ స్థానమును చూపెను. రామచంద్రుడు దానిని ఎంతో మెచ్చుకొనెను. నగరప్రజలు వారికి నమస్కరించి ఇండ్లకు చేరిరి. శ్రీరాముడు, సౌమిత్రియు సాయంసంధ్యోపాసన నిర్వర్తించుటకై వెళ్లిరి. గుహుడు మెత్తని చిగురుటాకులతో, కుశలతో చూడముచ్చటైన పరుపును సిద్ధముచేసి, స్వయముగా తీసికొని వచ్చి పఱచెను. నిర్మలమధురఫలములను, మూలములను దొన్నెలలో గొనివచ్చెను. నీటిని గూడ దొన్నెలలో తెచ్చెను. (చౌ॥ 1-4)

దో- సియ సుమంత్ర భ్రాతా సహిత, కంద మూల ఫల ఖాఇ।
సయన కీన్హ రఘుబంసమని, పాయ పలోటత భాఇ ॥ 89 ॥

శ్రీరాముడు, సీతాదేవి, లక్ష్మణుడు, సుమంత్రుడు కందమూల ఫలములను ఆరగించిరి. పిదప రఘుకులమణి నిద్రింపగా లక్ష్మణుడు ఆయన పాదముల నొత్తెను. (దో॥ 89)

చౌ- ఉఠే లఖను ప్రభు సోవత జానీ । కహి సచివహి సోవన మృదు బానీ ॥
కఛుక దూరి సజి బాన సరాసన । జాగన లగే బైఠి బీరాసన ॥ 1 ॥
గుహఁ బోలాఇ పాహరూ ప్రతీతీ । ఠావఁ ఠావఁ రాఖే అతి ప్రీతీ ॥
ఆపు లఖన పహిఁ బైఠేఉ జాఈ । కటి భాథీ సర చాప చఢాఈ ॥ 2 ॥
సోవత ప్రభుహి నిహారి నిషాదూ । భయఉ ప్రేమబస హృదయఁ బిషాదూ ॥
తను పులకిత జలు లోచన బహఈ । బచన సప్రేమ లఖన సన కహఈ ॥ 3 ॥
భూపతి భవన సుభాయఁ సుహావా । సురపతి సదను న పటతర పావా ॥
మనిమయ రచిత చారు చౌబారే । జను రతిపతి నిజ హాథ సఁవారే ॥ 4 ॥

శ్రీరామచంద్ర ప్రభువు నిద్రింపగానే లక్ష్మణుడు సుమంత్రుని గూడ "నిద్రింపుము" అని చెప్పి, తాను ధనుర్బాణములను గైకొని, అల్లంతదూరమున వీరాసనమున కూర్చొని మేల్కొనియుండెను. గుహుడు విశ్వాసపాత్రులైన కాపలాదారులను వేర్వేఱు స్థలములలో నియమించి, తానును స్వయముగా అమ్ములపొదితోను, ధనుర్బాణములతోను లక్ష్మణుని ప్రక్కన కూర్చుండెను. ప్రభువు నిద్రించుటను జూచి, నిషాదరాజుహృదయము ప్రేమవశమున విషాదమునకు లోనయ్యెను. అతని శరీరము పులకితమాయెను. కన్నులు చెమర్చెను. లక్ష్మణునితో ప్రేమపూర్వకముగా ఇట్లు పలికెను. " దశరథ మహారాజు ప్రాసాదము సహజముగా మిక్కిలి అందముగా నుండును. దానికి ఇంద్రభవనముగూడ సాటిరాదు. మన్మథుడు స్వయముగా నిర్మించెనా? అనునట్లు ఆ ప్రాసాదము యొక్క పైగదులు (బాల్కనీలు) మణి ఖచితములైనవి. (చౌ॥ 1-4)

దో- సుచి సుబిచిత్ర సుభోగమయ, సుమన సుగంధ సుబాస ।
పలఁగ మంజు మనిదీప జహఁ, సబ బిధి సకల సుపాస ॥ 90 ॥

ఆ భవనములు పవిత్రములు. మధుర భోగపదార్థములతో నిండినవి. పూలసువాసనలతో గుబాళించునవి. చిత్రవిచిత్రములైన మెత్తని పాన్పులు మణిదీపములు, అనేక సౌకర్యములు గలవి. (దో॥ 90)

చౌ- బిబిధ బసన ఉపధాన తురాఈఁ । ఛీర ఫేన మృదు బిసద సుహాఈఁ ॥
తహఁ సియ రాము సయన నిసి కరహీఁ । నిజ ఛబి రతి మనోజ మదు హరహీఁ ॥ 1 ॥
తే సియ రాము సాథరీఁ సోఏ । శ్రమిత బసన బిను జాహిఁ న జోఏ ॥
మాతు పితా పరిజన పురబాసీ । సఖా సుసీల దాస అరు దాసీ ॥ 2 ॥
జోగవహిఁ జిన్హహి ప్రాన కీ నాఈఁ । మహి సోవత తేఇ రామ గోసాఈఁ ॥
పితా జనక జగ బిదిత ప్రభాఊ । ససుర సురేస సఖా రఘురాఊ ॥ 3 ॥

రామచందు పతి సో బైదేహీ । సోవత మహి బిధి బామ న కేహీ ॥
సియ రఘుబీర కి కానన జోగూ । కరమ ప్రధాన సత్య కహ లోగూ ॥ 4 ॥

పరుపులపై పరువ వస్త్రములు దిండ్లు మొదలగునవి పాలమీగడలవలె స్వచ్ఛమై, సుందరమై, కోమలమై యుండును. అట్టి పరుపులపై అచ్చట నిద్రించుచుండెడివారు. అందచందములలో రతీమన్మథులను గూడ అధః కరించునట్టి సీతారాములు నేడు ఈ ఆకులలములతో ఏర్పఱచబడి వస్త్రములుగూడ లేని చాపపై అలసి సొలసి పరుండినారు. వారిని చూచుటకు గూడ బాధ వేయుచున్నది. వారిని తను ప్రాణములతో సమానముగా చూచుకొను తల్లిదండ్రులను, కుటుంబసభ్యులను, ప్రజలను, మిత్రులను, దాస, దాసీజనులను వదలి, ఈనాడు ఇచట నేలపై పరుండినారు. జగద్విఖ్యాతినందిన జనకునియంతటి మహారాజునకు కూతురై, ఇంద్ర సఖుడైన దశరథమహారాజునకు కోడలై, పురుషోత్తముడైన శ్రీరామచంద్రునకు పత్నియైన సీతాదేవి నేడు ఇక్కడ భూమిపై శయనించినది. "విధి బలీయమైనది. కర్మ ప్రభావము అధిగమించరానిది" అని లోకులు పలుకుట నిజమే. సీతారాములు వనవాసమునకు అర్హులా? (చౌ॥ 1-4)

దో- కైకయనందిని మందమతి, కఠిన కుటిలపను కీన్హ ।
జెహిఁ రఘునందన జానకిహి, సుఖ అవసర దుఖ దీన్హ ॥ 91 ॥

నీచబుద్ధిగల కైకేయి తన కుటిలత్వమువలన సుఖింపవలసిన సమయమున సీతారాములను దుఃఖములపాలు చేసినది. (దో॥ 91)

చౌ- భఇ దినకర కుల బిటప కుఠారీ । కుమతి కీన్హ సబ బిస్వ దుఖారీ ॥
భయఉ బిషాదు నిషాదహి భారీ । రామ సీయ మహి సయన నిహారీ ॥ 1 ॥
బోలే లఖన మధుర మృదు బానీ । గ్యాన బిరాగ భగతి రస సానీ ॥
కాహు న కోఉ సుఖ దుఖ కర దాతా । నిజ కృత కరమ భోగ సబు భ్రాతా ॥ 2 ॥
జోగ బియోగ భోగ భల మందా । హిత అనహిత మధ్యమ భ్రమ ఫందా ॥
జనము మరను జహఁ లగి జగ జాలూ । సంపతి బిపతి కరము అరు కాలూ ॥ 3 ॥
ధరని ధాము ధను పుర పరివారూ । సరగు నరకు జహఁ లగి బ్యవహారూ ॥
దేఖిఅ సునిఅ గునిఅ మన మాహీఁ । మోహమూల పరమారథు నాహీఁ ॥ 4 ॥

కైకేయి సూర్యవంశమనెడి వృక్షమునకు ఒక గొడ్డలియైనది. ఆదుర్బుద్ధి ప్రపంచమునే దుఃఖమునముంచినది." సీతారాములు నేలపై పండుకొని యుండుట నిషాదరాజునకు మిక్కిలి విషాదమును కలిగించెను. అపుడు లక్ష్మణుడు జ్ఞానభక్తివైరాగ్యములతోగూడిన మృదుమధుర వచనములు పలికెను. "సోదరా! ఒకరి సుఖములకు గాని దుఃఖములకుగాని మఱియొక రెవ్వరును కారణముకాదు. ప్రతివ్యక్తియు తన కర్మఫలమును తానే అనుభవింపవలయును. సంయోగవియోగములు, సుఖదుఃఖానుభవములు శత్రుమిత్రోదాసీనులు- ఇవియన్నియును

భ్రమపాశములు. జననమరణములు, సంపదలు- ఆపదలు, కర్మలు. కాలములు- ఇవియన్నియును సంసారబంధములు. భూమి, ఇల్లు, ధనము, నగరము, పరివారములు, స్వర్గనరకములు మొదలగునవి, చూచినవి, వినినవి, మనస్సులో ఆలోచించినవి- ఇవియన్నియును అజ్ఞాన జనితములు. నిజముగా ఇవియెవ్వియును సత్యములుగావు. (చౌ॥ 1-4)

దో- సపనేం హోఇ భిఖారి నృపు, రంకు నాకపతి హోఇ ।
జాగేం లాభు న హాని కఛు, తిమి ప్రపంచ జియఁ జోఇ ॥ **92** ॥

ఒకవేళ బిచ్చగాడు స్వప్నములో రాజైనను లేదా ఇంద్రుడు దరిద్రుడైనను మేల్కొనిన పిదప వారికి లాభముగాని, నష్టముగాని ఉండదు. అట్లే దృశ్యప్రపంచవిషయమును మనము గ్రహింపవలెను. (దో॥ 92)

చౌ- అస బిచారి నహిఁ కీజిఅ రోసూ । కాహుహి బాది న దేఇఅ దోసూ ॥
మోహ నిసాఁ సబు సోవనిహారా । దేఖిఅ సపన అనేక ప్రకారా ॥ **1** ॥
ఏహిఁ జగ జామిని జాగహిఁ జోగీ । పరమారథీ ప్రపంచ బియోగీ ॥
జానిఅ తబహిఁ జీవ జగ జాగా । జబ సబ విషయ బిలాస బిరాగా ॥ **2** ॥
హోఇ బిబేకు మోహ భ్రమ భాగా । తబ రఘునాథ చరన అనురాగా ॥
సఖా పరమ పరమారథు ఏహూ । మన క్రమ బచన రామ పద నేహూ ॥ **3** ॥
రామ బ్రహ్మ పరమారథ రూపా । అబిగత అలఖ అనాది అనూపా ॥
సకల బికార రహిత గతభేదా । కహి నిత నేతి నిరూపహిఁ బేదా ॥ **4** ॥

ఇట్లాలోచించి, ఎవ్వరినీ కోపగించుటగాని, దోషారోపణ చేయుటగాని తగదు. అందఱును మోహమనెడి రాత్రిలో నిద్రించువారే. నిద్రించునపుడు అనేక విధములైన స్వప్నములు కలుగును. ఈ జగత్తనెడి రాత్రియందు యోగులు జాగరూకులైయుందురు. వారు పరమార్థమునందులీనమై దృశ్య ప్రపంచమునెడ విరక్తులయ్యెదరు. సంసారభోగవిలాసవస్తువులనుండి విరక్తుడైన వాడే నిజముగా మేల్కొనిన వాడని గ్రహింపవలెను. వివేకవంతుని నుండి మోహభ్రమలు పాఱిపోవును. అపుడు పారమార్థికసత్యజ్ఞానముచే శ్రీరఘునాథునిచరణములయందు ప్రేమ ఏర్పడును. మిత్రమా! మనో వాక్కర్మలచే శ్రీరాముని చరణములయందుగల ప్రేమయే పరమ పురుషార్థము. శ్రీరాముడు పరమార్థ స్వరూపుడైన బ్రహ్మ. అతడు అనిర్దేశ్య స్వరూపుడు, అగోచరుడు, ఆద్యంత రహితుడు, అనుపమసత్యస్వరూపుడు, అవికారుడు, భేద శూన్యుడు. వేదములు నేతి, నేతి యని పల్కుచు అతని స్వరూప నిరూపణమును చేయుచున్నవి. (చౌ॥ 1-4)

దో- భగత భూమి భూసుర సురభి, సుర హిత లాగి కృపాల ।
కరత చరిత ధరి మనుజ తను, సునత మిటహిఁ జగ జాల ॥ **93** ॥

కృపాళువైన శ్రీరాముడు భూగోబ్రాహ్మణదేవతాభక్త బృందముల దుఃఖనివారణకై మానవ శరీరము దాల్చి, లీలలు ప్రదర్శించు చుండును. ఆలీలావిశేషములను వినినంత మాత్రముననే భవబంధములు తొలగిపోవును." (దో॥ 93)

**మాసపారాయణము-పదునైదవ విరామము**

చౌ- సఖా సముఝి అస పరిహరి మోహూ । సియ రఘుబీర చరన రత హోహూ ॥
కహత రామ గున భా భినుసారా । జాగే జగ మంగల సుఖదారా ॥ 1 ॥
సకల సౌచ కరి రామ నహావా । సుచి సుజాన బట ఛీర మగావా ॥
అనుజ సహిత సిర జటా బనాఏ । దేఖి సుమంత్ర నయన జల ఛాఏ ॥ 2 ॥
హృదయఁ దాహు అతి బదన మలీనా । కహ కర జోరి బచన అతి దీనా ॥
నాథ కహెఉ అస కోసలనాథా । లై రథు జాహు రామ కేఁ సాథా ॥ 3 ॥
బను దేఖాఇ సురసరి అన్హవాఈ । ఆనేహు ఫేరి బేగి దోఉ భాఈ ॥
లఖను రాము సియ ఆనేహు ఫేరీ । సంసయ సకల సఁకోచ నిబేరీ ॥ 4 ॥

లక్ష్మణుడు పలికెను. "మిత్రమా! దీనిని గ్రహించి, మోహమును వీడుము. శ్రీరామచంద్రుని చరణములను సేవింపుము." ఈ విధముగా శ్రీరాముని గుణములను వర్ణించు చుండగా తెల్లవాఱెను. జగత్కల్యాణకరుడు, సుఖప్రదాయకుడు అగు శ్రీరాముడు మేల్కాంచెను. పవిత్రుడు, సచ్ఛీలుడు ఐన శ్రీరాముడు స్నానాది నిత్యకృత్యములనాచరించిన పిమ్మట మఱ్ఱిపాలు తెప్పించెను. తాను, తన తమ్ముడైన లక్ష్మణుడు జటాజూటములను చుట్టుకొనిరి. ఈ దృశ్యమును జూచి, సుమంత్రునిహృదయము పరితపించెను. నేత్రములు సజలములాయెను. విషాదవదనుడై, చేతులు జోడించి, అతడు ఇట్లు విన్నవించెను. "ఓ ప్రభూ! కోసలరాజు దశరథుడు నన్ను ఇట్లు ఆజ్ఞాపించెను. 'రథమును తీసికొని, శ్రీరామునకు అడవి వఱకు తోడుగా వెళ్లుము. అడవిని చూపించి, గంగానదిలో స్నానము చేసినపిమ్మట సోదరులిద్దఱిని ఇంటికి తీసికొని రమ్ము. అన్ని సంశయములను, సంకోచములను దూరమొనర్చి, సీతారామలక్ష్మణులను తోడ్కొని రమ్ము.' (చౌ॥ 1-4)

దో- నృప అస కహెఉ గొసాఇఁ జస, కహఇ కరౌఁ బలి సోఇ ।
కరి బినతీ పాయన్హ పరెఉ, దీన్హ బాల జిమి రోఇ ॥ 94 ॥

ప్రభూ! మహారాజు ఈ విధముగా నుడివెను. కాని ఇప్పుడు మీరు చెప్పిన రీతిగా నడచుకొందునని ప్రమాణపూర్వకముగా పల్కుచున్నాను. ఇట్లు విన్నవించి, సుమంత్రుడు శ్రీరామచంద్రుని పాదములపై బడి, బాలుని వలె ఏడ్వసాగెను. (దో॥ 94)

చౌ- తాత కృపా కరి కీజిఅ సోఈ । జాతేఁ అవధ అనాథ న హోఈ ॥
మంత్రిహి రామ ఉఠాఇ ప్రబోధా । తాత ధరమ మతు తుమ్హ సబు సోధా ॥ 1 ॥
సిబి దధీచ హరిచంద నరేసా । సహే ధరమ హిత కోటి కలేసా ॥
రంతిదేవ బలి భూప సుజానా । ధరము ధరెఉ సహి సంకట నానా ॥ 2 ॥
ధరము న దూసర సత్య సమానా । ఆగమ నిగమ పురాన బఖానా ॥
మైఁ సోఇ ధరము సులభ కరి పావా । తజేఁ తిహూఁ పుర అపజసు ఛావా ॥ 3 ॥
సంభావిత కహుఁ అపజస లాహూ । మరన కోటి సమ దారున దాహూ ॥
తుమ్హ సన తాత బహుత కా కహఊఁ । దిఏఁ ఉతరు ఫిరి పాతకు లహఊఁ ॥ 4 ॥

"తండ్రీ! దయచేసి, అయోధ్యను దిక్కులేని దానినిగా చేయవద్దు." శ్రీరాముడు మంత్రిని లేవనెత్తి, ఆయనకు నచ్చజెప్పుచు ఇట్లు పలికెను. మిత్రమా! మీరు అన్ని ధర్మములను బాగుగా తెలిసినవారు. శిబి, దధీచి, హరిశ్చంద్రుడు ధర్మరక్షణకై అనేకకష్టములను సహించిరి. బుద్ధిమంతులైన రంతిదేవుడు, బలిచక్రవర్తి పెక్కు ఇడుములకు ఓర్చి ధర్మమును పాలించిరి. సత్యపాలనముతో సమానమైన ధర్మము ఏదియును లేదని వేదశాస్త్ర పురాణములు ముక్త కంఠముతో పలుకుచున్నవి. అప్రయత్నముగాలభించిన ఆ ధర్మపాలనావకాశమును హాయిగా పాటించుచున్నాను. ధర్మమును విడిచి పెట్టినచో ముల్లోకములలో అపకీర్తితప్పదు. పరువు ప్రతిష్ఠలుగలవానికి అపకీర్తి కోటిమృత్యువులతో తుల్యమగు దారుణసంతాపమును గల్గించును. మిత్రమా! నేనునీకు ఎక్కువగా చెప్పవలసినది యేమున్నది? పెద్దలముందు ఇంతకంటె ఎక్కువగా చెప్పుటయు పాపహేతువేయగును. (చౌ॥ 1-4)

దో- పితు పద గహి కహి కోటి నతి, బినయ కరబ కర జోరి।
చింతా కవనిహు బాత కై, తాత కరిఅ జని మోరి ॥ 95 ॥

మీరు అయోధ్య చేరి తండ్రిగారి పాదములకు ప్రణమిల్లి, అంజలి ఘటించి, నాకు మాటుగా "నన్ను గూర్చి చింతింప వలదు" అని విన్నవింపుడు. (దో॥ 95)

చౌ- తుమ్హ పుని పితు సమ అతి హిత మోరేం। బినతీ కరఉం తాత కర జోరేం॥
సబ బిధి సోఇ కరతబ్య తుమ్హారేం। దుఖ న పావ పితు సోచ హమారేం ॥ 1 ॥
సుని రఘునాథ సచివ సంబాదూ। భయఉ సపరిజన బికల నిషాదూ ॥
పుని కఛు లఖన కహీ కటు బానీ। ప్రభు బరజే బడ అనుచిత జానీ ॥ 2 ॥
సకుచి రామ నిజ సపథ దేవాఈ। లఖన సందేసు కహిఅ జని జాఈ ॥
కహ సుమంత్రు పుని భూప సందేసూ। సహి న సకిహి సియ బిపిన కలేసూ ॥ 3 ॥
జెహి బిధి అవధ ఆవ ఫిరి సీయా। సోఇ రఘుబరహి తుమ్హహి కరనీయా ॥
నతరు నిపట అవలంబ బిహీనా। మైం న జిఅబ జిమి జల బిను మీనా ॥ 4 ॥

మీరును మా పితృపాదులవలె నా హితమును గోరెడువారు. మా తండ్రిగారు మా కొఱకై విచారపడుచు దుఃఖమగ్నులు కాకుండ చూచెడి బాధ్యత మీపై గూడ ఉన్నదను విషయమును మీరు మరువవలదని, చేతులు జోడించి, మిమ్ముఅర్థించుచున్నాను. "శ్రీరామచంద్రునకును సుమంత్రునకును మధ్యజరిగిన సంభాషణమును విని, నిషాదరాజు, అతనికుటుంబసభ్యులు మిక్కిలి వ్యాకులపడిరి. లక్ష్మణుడు కొన్ని కఠినవచనములను పలికెను. అట్లుపలుకుట అనుచితమని శ్రీరాముడు లక్ష్మణుని వారించెను. లక్ష్మణుని పరుషపుమాటలు ఎవరితోడను చెప్పవలదు. అని "శ్రీరాముడు తనపై ఒట్టు పెట్టుకొని" సుమంత్రునితో వినయముగా పలికెను. సుమంత్రుడు 'సీతాదేవి వనవాసక్లేశములకు తట్టుకొనజాలదు' అని రాజుగారి సందేశమును రామునకు వినిపించెను. కావున "కనీసము సీతాదేవియైనను అయోధ్యకు తిరిగి వచ్చుటకు ఆమెకు నచ్చజెప్పవలెను. లేనిచో రాజుగారు ఎట్టి ఆధారమూ లేక నీటి నుండి బయట పడిన చేపవలె విలవిలలాడెదరు. (చౌ॥ 1-4)

దో- మఇకేం ససురేం సకల సుఖ, జబహిం జహాం మను మాన।
తహం తబ రహిహి సుఖేన సియ, జబ లగి బిపతి బిహాన ॥ 96 ॥

ఆమె పుట్టింటనైనను మెట్టినింటనైనను ఈ వనవాసకాలము ముగియువఱకు తన యిష్టము వచ్చినచోట సుఖముగా నుండవచ్చును. (దో॥ 96)

చౌ- బినతీ భూప కీన్హ జెహి భాఀతీ । ఆరతి ప్రీతి న సో కహి జాతీ ॥
పితు సందేసు సుని కృపానిధానా । సియహి దీన్హ సిఖ కోటి బిధానా ॥ 1 ॥
సాసు ససుర గుర ప్రియ పరివారూ । ఫిరహు త సబ కర మిటై ఖభారూ ॥
సుని పతి బచన కహతి బైదేహీ । సునహు ప్రానపతి పరమ సనేహీ ॥ 2 ॥
ప్రభు కరునామయ పరమ బిబేకీ । తను తజి రహతి ఛాఀహ కిమి ఛేఀకీ ॥
ప్రభా జాఇ కహఀ భాను బిహాఈ । కహఀ చంద్రికా చందు తజి జాఈ ॥ 3 ॥
పతిహి ప్రేమమయ బినయ సునాఈ । కహతి సచివ సన గిరా సుహాఈ ॥
తుమ్హ పితు ససుర సరిస హితకారీ । ఉతరు దేఉఀ ఫిరి అనుచిత భారీ ॥ 4 ॥

"ప్రేమతో ఈ సందేశమును ఇచ్చుచు రాజుగారు ఎట్టి దైన్యమునకు లోనైయుండిరో తెల్పుటకు మాటలు చాలవు" దయానిధియైన శ్రీరాముడు తండ్రిగారి సందేశము విని, సీతాదేవికి పెక్కువిధముల నచ్చజెప్పుటకు యత్నించెను. "నీవు తిరిగి అయోధ్యకు పోయినచో అత్తమామలు, గురువుగారు, ప్రియజనములు, కుటుంబసభ్యులు మొదలగు వారి అందఱి దుఃఖములు దూరమగును." పతిదేవుని వచనములు విని జానకీ దేవి ఇట్లనెను. "నా ప్రాణనాథా! వినుడు. మీరు కరుణామయులు, పరమజ్ఞానులు. ప్రాణసఖులు. శరీరమునువీడి, దానిఛాయ వేఱుగా ఉండగలదా? తెలుపుడు. సూర్యుని వదలి సూర్యకాంతియు, చంద్రుని వదలి చంద్రికయు వేఱుగా ఉండునా?" ఇట్లు పతిదేవునితో ప్రేమపూర్వకముగా పలికి, మంత్రితో మృదు మధురముగా ఇట్లనెను. "మీరు మా తండ్రిగారివలె, మామగారివలె నా హితమును అభిలషించు వారు. మీ యెదుట మాటకుమాట చెప్పుట ఎంతయు అనుచితము." (చౌ॥ 1-4)

దో- ఆరతి బస సనముఖ భఇఉఀ, బిలగు న మానబ తాత ।
ఆరజసుత పద కమల బిను, బాది జహాఀ లగి నాత ॥ 97 ॥

ఐనప్పటికిని ఆర్తితో నేను మీముందు మాట్లాడుచున్నందులకు మీరు అన్యథా భావింప వలదు. నా ప్రభువు చరణ కమలములకు దూరముగా నాకెట్టి బంధములునూ వ్యర్థమే. (దో॥ 97)

చౌ- పితు బైభవ బిలాస మైఀ డీఠా । నృప మని ముకుట మిలిత పద పీఠా ॥
సుఖనిధాన అస పితు గృహ మోరేఀ । పియ బిహీన మన భావ న భోరేఀ ॥ 1 ॥
ససుర చక్కవఇ కోసలరాఊ । భువన చారిదస ప్రగట ప్రభాఊ ॥
ఆగేఀ హోఇ జెహి సురపతి లేఈ । అరధ సింఘాసన ఆసను దేఈ ॥ 2 ॥
ససుర ఏతాదృస అవధ నివాసూ । ప్రియ పరివారు మాతు సమ సాసూ ॥
బిను రఘుపతి పద పదుమ పరాగా । మొహి కేఉ సపనేహుఀ సుఖద న లాగా ॥ 3 ॥

అగమ పంథ బనభూమి పహారా । కరి కేహరి సర సరిత అపారా ॥
కోల కిరాత కురంగ బిహంగా । మొహి సబ సుఖద ప్రానపతి సంగా ॥ 4 ॥

నా తండ్రిగారిఐశ్వర్యవైభవములను జూచితిని. వారిపాదపీఠమునకు మహారాజు లెల్లరును తమ మణికిరీటములతో ప్రణమిల్లెడి వారు. అట్టి సుఖనిధానమైన నా తండ్రిగారిఇల్లు గూడ నాపతి దేవుడు నాచెంత లేనిచో పొరపాటున నైనను సుఖమునీయదు. కోసలప్రభువులును నాకు మామగారును ఐన దశరథమహారాజుగారి వైభవము, కీర్తి ప్రతిష్ఠలు పదునాలుగు లోకములయందును ప్రసిద్ధములు. దేవేంద్రుడుగూడ వారికి తనఅర్ధసింహాసనమునిచ్చి గౌరవించుచుండును. అట్టి మామగారు, అయోధ్యానివాసులు, ప్రియకుటుంబజనులు, మాతృప్రేమను వర్షించు అత్తగార్లు - వీరందఱును రఘునాథుని చరణ కమల ధూళి లేకుండ నాకు కలలోనైనను ఆనందమును ఈయజాలరు. నా ప్రాణేశ్వరుడు చెంతనుండినచో దుర్గమములైన అడవిత్రోవలు, వనభూములు, కొండలు, నదులు, తటాకములు నాకడ్డుకావు. ఏనుగులు, సింహములు భయంకరములు కానే కావు. జింకలు, పక్షులు ప్రియమిత్రములే యగును. కోలులు, భిల్లులు ఆత్మీయులేయగుదురు. ఇవి యున్నియు నాకు సుఖములను ఇచ్చునవియే యగును. (చౌ॥ 1-4)

దో- సాసు ససుర సన మోరి హుఁతి, బినయ కరబి పరి పాయఁ ।
మోర సోచు జని కరిఅ కఛు, మైఁ బన సుఖీ సుభాయఁ ॥ 98 ॥

నన్నుగూర్చి ఏమాత్రమూ దిగులుపడవలదని నాకుమాఱుగా నా అత్తమామలకు విన్నవింపుడు. సహజముగా నాకు వనములయందు మక్కువ ఎక్కువ. (దో॥ 98)

చౌ- ప్రాననాథ ప్రియ దేవర సాథా । బీర ధురీన ధరేఁ ధను భాథా ॥
నహిఁ మగ శ్రము భ్రము దుఖ మన మోరేఁ । మొహి లగి సోచు కరిఅ జని భోరేఁ ॥ 1 ॥
సుని సుమంత్రు సియ సీతలి బానీ । భయఉ బికల జను ఫని మని హానీ ॥
నయన సూఝ నహిఁ సునఇ న కానా । కహి న సకఇ కఛు అతి అకులానా ॥ 2 ॥
రామ ప్రబోధు కీన్హ బహు భాఁతీ । తదపి హోతి నహిఁ సీతలి ఛాతీ ॥
జతన అనేక సాథ హిత కీన్హే । ఉచిత ఉతర రఘునందన దీన్హే ॥ 3 ॥
మేటి జాఇ నహిఁ రామ రజాఈ । కఠిన కరమగతి కఛు న బసాఈ ॥
రామ లఖన సియ పద సిరు నాఈ । ఫిరేఉ బనిక జిమి మూర గవాఁఈ ॥ 4 ॥

వీరులలో అగ్రగణ్యులైన నా ప్రాణనాథుడు, నా మఱది, ధనుర్బాణధారులై, నాతో గూడి యున్నారు. కావున మార్గాయాసము గాని, భ్రమగాని, మనోవ్యధగాని ఏ మాత్రము నన్ను తాకవు. మీరు పొరపాటునగూడ నన్ను గూర్చి విచారింపకుడు" సీతాదేవి చల్లని మాటలను పలికినను (ఆమె అయోధ్యకు మఱలుటకు సమ్మతింపకుండటచే) సుమంత్రుడు మణిని పోగొట్టుకొన్న సర్పమువలె వికలమనస్కుడాయెను. ఆ స్థితిలో ఆయనకన్నులు కనలేకుండెను. చెవులు వినలేకుండెను, మిక్కిలి పరితాపమువలన ఆయననోట మాటరాకుండెను. శ్రీరాముడు ఆయనను ఎంతగానో ఓదార్చెను. కాని ఆయనమనస్సు ఊరటచెందలేదు. మంత్రి శ్రీరాముని మఱల్చుటకు మిక్కిలి ప్రయత్నించెను. కాని

అందులకు సమ్మతింపక రఘురాముడు ఆయనను తగు రీతిగా సముదాయించెను. శ్రీరాముని ఆజ్ఞ అనుల్లంఘ్యము. కర్మగతి అనివార్యము. అదియెవ్వరికిని స్వాధీనములో ఉండదు. సుమంత్రుడు శ్రీ సీతారామలక్ష్మణులకు శిరసా ప్రణమిల్లి, మూల ధనముతోపాటు సర్వమునుకోల్పోయిన వ్యాపారి వలె వెనుకకు మఱలెను. (చౌ॥ 1-4)

దో- రథు హాఁకెఉ హయ రామ తన, హేరి హేరి హిహినాహిఁ ।
దేఖి నిషాద బిషాదబస, ధునహిఁ సీస పఛితాహిఁ ॥ 99 ॥

సుమంత్రుడు రథాశ్వములను అదలింపగానే అవి శ్రీరామునివైపుచూచుచు సకిలింపసాగెను. ఈ దృశ్యమును గాంచి, నిషాదులెల్లరును విషాదముతో తలలు బాదుకొనుచు దుఃఖింప సాగిరి. (దో॥ 99)

## నావికుని అనుగ్రహించుట-నావపై గంగను దాటుట

చౌ- జాసు బియోగ బికల పసు ఐసేఁ । ప్రజా మాతు పితు జిఇహహిఁ కైసేఁ ॥
బరబస రామ సుమంత్రు పఠాఏ । సురసరి తీర ఆపు తబ ఆఏ ॥ 1 ॥
మాగీ నావ న కేవటు ఆనా । కహఇ తుమ్హార మరము మైఁ జానా ॥
చరన కమల రజ కహుఁ సబు కహఈ । మానుష కరని మూరి కఛు అహఈ ॥ 2 ॥
ఛుఅత సిలా భఇ నారి సుహాఈ । పాహన తేఁ న కాఠ కఠినాఈ ॥
తరనిఉముని ఘరినీ హోఇ జాఈ । బాట పరఇ మోరి నావ ఉడాఈ ॥ 3 ॥
ఏహిఁ ప్రతిపాలఉఁ సబు పరివారూ । నహిఁ జానఉఁ కఛు అఉర కబారూ ॥
జౌఁ ప్రభు పార అవసి గా చహహూ । మోహి పద పదుమ పఖారన కహహూ ॥ 4 ॥

నోరులేని మూగ జీవులు సైతము శ్రీరాముని యెడబాటునకు తట్టుకొనలేక వ్యాకుల పాటునకు లోనైనవి. ఇక ప్రజలు, తల్లిదండ్రులు ఆయన వియోగమును ఎట్లు సహింపగలరు? ఎట్లు జీవించియుండ గలరు? శ్రీరామచంద్రుడు ఎట్టకేలకు సుమంత్రుని అయోధ్యకు మఱల్చెను. పిదప ఆయన గంగానదీతీరమునకు జేరెను. గంగను దాటుటకు శ్రీరాముడు నావికుని అడిగెను. కాని అతడు పడవను తీసికొని రాలేదు. సరిగదా ఇట్లు పలికెను. "నాకు మీ రహస్యము తెలియును. మీ చరణకమలధూళిలో మనుష్యులను సృష్టించు మూలికయున్నదని ప్రతీతి. ఆ ధూళి సోకినంతనే ఒక పాషాణము అందమైన స్త్రీగా మాఱినదట! చెక్క, ఱాతికంటెను కఠినమైనది కాదు గదా! నా నావగూడ నారీమణి (అహల్యవలె) అయిననో నేను నావను, నా జీవికను గూడ కోల్పోవలసివచ్చును. ఈ నావవలననే నా కుటుంబపోషణ జరుగుచున్నది. ఇది నాకు ప్రాణము. ఏలనన మఱి యొక పని (వృత్తి)ని నేను చేయజాలను. ప్రభూ! నిజముగా మీరు గంగానదిని దాట దలచినచో మొదట మీ చరణములను కడుగనిండు. (చౌ॥ 1-4)

ఛం- పద కమల ధోఇ చఢాఇ నావ న నాథ ఉతరాఈ చహౌఁ ।
మోహి రామ రాఉరి ఆన దసరథ సపథ సబ సాచీ కహౌఁ ॥

బరు తీర మారహిం లఖను పై జబ లగి న పాయ పఖారిహౌం ।
తబ లగి న తులసీదాస నాథ కృపాల పారు ఉతారిహౌం ॥

ఓ ప్రభూ! మీచరణకమలములను కడిగినతరువాతనే మిమ్ములను నావను ఎక్కనిచ్చెదను. నాకు సుంకము అక్కరలేదు. మీమీద, దశరథ మహారాజుపైన ప్రమాణముచేసి నిజము పల్కుచున్నాను. లక్ష్మణుడు తనబాణములతో నన్ను కొట్టినను కొట్టనిమ్ము. ఓతులసీ దాస ప్రభూ! కృపాళూ! మీ కాళ్లు కడుగనంత వఱకు మిమ్ము నదిని దాటింపను. (ఛం)

సో- సుని కేవట కే బైన, ప్రేమ లపేటే అటపటే ।
బిహసే కరునాఐన, చితఇ జానకీ లఖన తన ॥ 100 ॥

పడవ వాని మాటలు నర్మగర్భితములు. ప్రేమ పూర్ణములు. దయానిధియైన శ్రీరాముడు ఆ మాటల ఆంతర్యమును గ్రహించి, జానకీదేవివైపును లక్ష్మణునివైపును జూచి నవ్వెను. (సో॥ 100)

చౌ- కృపాసింధు బోలే ముసుకాఈ । సోఇ కరు జెహి తవ నావ న జాఈ ॥
బేగి ఆను జల పాయ పఖారూ । హోత బిలంబు ఉతారహి పారూ ॥ 1 ॥
జాసు నామ సుమిరత ఎక బారా । ఉతరహిం నర భవసింధు అపారా ॥
సోఇ కృపాలు కేవటహి నిహోరా । జెహిం జగు కియ తిహు పగహు తె థోరా ॥ 2 ॥
పద నఖ నిరఖి దేవసరి హరషీ । సుని ప్రభు బచన మోహం మతి కరషీ ॥
కేవట రామ రజాయసు పావా । పాని కఠవతా భరి లెఇ ఆవా ॥ 3 ॥
అతి ఆనంద ఉమగి అనురాగా । చరన సరోజ పఖారన లాగా ॥
బరషి సుమన సుర సకల సిహాహీం । ఎహి సమ పున్యపుంజ కోఉ నాహీం ॥ 4 ॥

దయాళువైన శ్రీరాముడు చిఱునవ్వులొలుకుచు పడవవానితో ఇట్లనెను. "సోదరా! నీ నావను రక్షించుచర్యనే చేయుము. త్వరగా నీళ్లు తెచ్చి కాళ్లు కడుగుము. ఆలస్యమగుచున్నది. మమ్ము నదిని దాటింపుము." శ్రీరాముని యొక్క నామస్మరణమాత్రముననే మనుజుడు అపార భవసాగరమును దాటును. ఆయన వామనావతారమున ముల్లోకములును తన మూడు పాదములకంటెను చిన్నవని నిరూపించెను. అట్టి కృపాళువైన శ్రీరామచంద్రుడు గంగానదిని దాటుటకు ఒక పడవవానిని ప్రార్థించుచున్నాడు. ప్రభువు మాటలువిని, ఆ విష్ణుమూర్తియేనా? ఈ నావికుని ప్రార్థించుచున్నది.' అని గంగ తలంచెను. వెంటనే ఆమె మనస్సు ప్రభువు కృప వైపునకు ఆకర్షిత మయ్యెను. బలిచక్రవర్తి యొక్క తలపై మోపినపాదమునే కడుగుమని ఒక నావికుని అతనిపై తన కృపను ప్రసరింప జేయుటకు అడుగుచున్నాడు నిజముగా ప్రభువెంత దయాళువు?" ఇట్లాలోచించుచు గంగ శ్రీ రామపాదనఖములను జూచి, అవితన పుట్టుక స్థానములని గుర్తించి, ఎంతయో పొంగిపోయెను. శ్రీరాముని ఆజ్ఞతో నావికుడు ఒక చెక్కగిన్నెలో నీళ్లు తెచ్చెను. అతడు ప్రేమ పూరితమనస్కుడై, పరమానందభరితుడై భగవంతుని చరణములను కడిగెను. దేవతలు విరులజల్లులుగురిపించుచు "ఈయనతో సరితూగగల పుణ్యపురుషుడు లేడు" అని ఆయనను ప్రశంసించిరి.

(చౌ॥ 1-4)

దో- పద పఖారి జలు పాన కరి, ఆపు సహిత పరివార ।
పితర పారు కరి ప్రభుహి పుని, ముదిత గయఉ లెఇ పార ॥ 101 ॥

శ్రీరామచంద్రుని చరణములను కడిగి నావికుడు ఆ పాదతీర్థమును తన పరివారముతో గూడి స్వీకరించెను. తత్పుణ్యప్రభావమున వాని పితరులును భవసాగరమును దాటిరి. పిమ్మట ఆనందోత్సాహములతో ఆ పడవవాడు సీతారామలక్ష్మణులను గంగానదిని దాటించెను. (దో॥ 101)

చౌ- ఉతరి ఠాఢ భఏ సురసరి రేతా । సీయ రాము గుహ లఖన సమేతా ॥
కేవట ఉతరి దండవత కీన్హా । ప్రభుహి సకుచ ఏహి నహిం కఛు దీన్హా ॥ 1 ॥
పియ హియ కీ సియ జాననిహారీ । మని ముదరీ మన ముదిత ఉతారీ ॥
కహేఉ కృపాల లేహి ఉతరాఈ । కేవట చరన గహే అకులాఈ ॥ 2 ॥
నాథ ఆజు మై కాహ న పావా । మిటే దోష దుఖ దారిద దావా ॥
బహుత కాల మైం కీన్హి మజూరీ । ఆజు దీన్హ బిధి బని భలి భూరీ ॥ 3 ॥
అబ కఛు నాథ న చాహిఅ మోరేం । దీనదయాల అనుగ్రహ తోరేం ॥
ఫిరతీ బార మోహి జో దేబా । సో ప్రసాదు మైం సిర ధరి లేబా ॥ 4 ॥

నిషాద రాజైన గుహునితో, లక్ష్మణునితో సీతారాములు పడవను దిగి, భాగీరథీ తీరమున నిలిచిరి. పడవవాడును పడవనుండి దిగి, శ్రీరామునకు నమస్కరించెను. అది చూచి శ్రీరాముడు నావికునకు బహుమతి నీయ దలచెను. తన పతిమనమునందలి భావమును పసిగట్టిన సీతాదేవి రత్న ఖచితమైన ఉంగరమును దీసెను. శ్రీరాముడు నావికునితో "నీ సుంకమును దీసికొనుము" అని పలికెను. నావికుడు అందులకు నొచ్చుకొని, ప్రభుపాదములను పట్టుకొని, పలికెను. "ప్రభూ! నేను ఈనాడు మీనుండి పొందనిది ఏమున్నది? నా పాపములు, దుఃఖము, దారిద్ర్యము అన్నియు నానుండి దూరమైనవి. నా జీవిక కొఱకై చాలాకాలమునుండి శ్రమపడుచుంటిని. కాని విధాత నిజముగా నాకు ఈనాడే సంతృప్తికరముగా ప్రతిఫలములనిచ్చినాడు. ప్రభూ! దీనావనా! నీ అనుగ్రహముతప్ప నాకు ఇంకేమియు అక్కఱలేదు. మీరు తిరిగి వచ్చునప్పుడు మీరేమిచ్చినను ఆ ప్రసాదమును నేను స్వీకరించెదను.

(చౌ॥ 1-4)

దో- బహుత కీన్హ ప్రభు లఖన సియఁ, నహిం కఛు కేవటు లేఇ ।
బిదా కీన్హ కరునాయతన, భగతి బిమల బరు దేఇ ॥ 102 ॥

శ్రీరామచంద్ర ప్రభువు, సీతాదేవి, లక్ష్మణుడు ఎంతగా బలవంతము చేసినను నావికుడేమియు తీసికొనలేదు. కరుణానిధియైన శ్రీరాముడు అతనికి నిర్మల భక్తిని వరముగా అనుగ్రహించి, వీడ్కొనెను. (దో॥ 102)

చౌ- తబ మజ్జను కరి రఘుకులనాథా । పూజి పారథివ నాయఉ మాథా ॥
సియఁ సురసరిహి కహేఉ కర జోరీ । మాతు మనోరథ పురఉబి మోరీ ॥ 1 ॥

పతి దేవర సంగ కుసల బహోరీ । ఆఇ కరౌం జేహిం పూజా తోరీ ॥
సుని సియ బినయ ప్రేమ రస సానీ । భఇ తబ బిమల బారి బర బానీ ॥ 2 ॥
సును రఘుబీర ప్రియా బైదేహీ । తవ ప్రభాఉ జగ బిదిత న కేహీ ॥
లోకప హోహిం బిలోకత తోరేం । తోహి సేవహిం సబ సిధి కర జోరేం ॥ 3 ॥
తుమ్హ జో హమహి బడి బినయ సునాఈ । కృపా కీన్హి మోహి దీన్హి బడాఈ ॥
తదపి దేబి మైం దేబి అసీసా । సఫల హోన హిత నిజ బాగీసా ॥ 4 ॥

పిదప రఘునాథుడు స్నానమాచరించి, పార్థివ పూజనొనర్చి, పరమశివునకు ప్రణమిల్లెను. సీతాదేవి గంగాదేవిని పూజించి, అంజలి ఘటించి, "మాతా! నా మనోరథమును పూర్తి చేయుము. మఱల నా పతిదేవునితో, మఱదితో తిరిగి వచ్చి, నీకు పూజలొనర్తును." అని ప్రార్థించెను. సీతాదేవి యొక్క ప్రేమపూర్వక ప్రార్థనను విని, నిర్మలగంగాజలములనుండి ఒక దివ్యవాణి వినిపించెను. "రఘురాముని ప్రియపత్నీ! ఓ సీతా! నీ మహత్త్వమును ఈ జగత్తున ఎఱుంగని వారెవరు? నీ కృపాదృష్టి సోకినంతనే జనులు లోకపాలకులగుదురు. సర్వ సిద్ధులును కరములు మోడ్చి, నీకు ఊడిగములు చేయుచుండును. నీవు వినయముతో నన్ను ప్రార్థించి, నీ అపారకృపను నాపై ప్రసరింపచేసితివి. నాకు ఔన్నత్యమును కూర్చితివి. నావాణిని సఫలమొనర్చు కొనుటకు నీకు మంగళవచనములు పలుకుచున్నాను. (చౌ॥ 1-4)

దో- ప్రాననాథ దేవర సహిత, కుసల కోసలా ఆఇ ।
పూజిహి సబ మనకామనా, సుజసు రహిహి జగ ఛాఇ ॥ 103 ॥

నీవు నీప్రాణేశ్వరునితో, మఱదితో క్షేమముగా అయోధ్యకు తిరిగిరాగలవు. నీ మనోరథములన్నియును నెఱవేఱును. నీ కీర్తి ప్రపంచమునందంతటను వ్యాపించును. (దో॥ 103)

చౌ- గంగ బచన సుని మంగల మూలా । ముదిత సీయ సురసరి అనుకూలా ॥
తబ ప్రభు గుహహి కహేఉ ఘర జాహూ । సునత సూఖ ముఖు భా ఉర దాహూ ॥ 1 ॥
దీన బచన గుహ కహ కర జోరీ । బినయ సునహు రఘుకులమని మోరీ ॥
నాథ సాథ రహి పంథు దేఖాఈ । కరి దిన చారి చరన సేవకాఈ ॥ 2 ॥
జేహిం బన జాఇ రహబ రఘురాఈ । పరనకుటీ మైం కరబి సుహాఈ ॥
తబ మోహి కహం జసి దేబ రజాఈ । సోఇ కరిహఉం రఘుబీర దోహాఈ ॥ 3 ॥
సహజ సనేహ రామ లఖి తాసూ । సంగ లీన్హ గుహ హృదయం హులాసూ ॥
పుని గుహం గ్యాతి బోలి సబ లీన్హే । కరి పరితోషు బిదా తబ కీన్హే ॥ 4 ॥

మంగళకరములైన ఈ పల్కులను విని, దేవనదీ వచనములు శుభంకరములని విశ్వసించి, సీతాదేవి సంతోషించెను. పిదప శ్రీరామచంద్రుడు గుహుని 'తిరిగి పొమ్ము' అని చెప్పెను. ఆ మాట చెవిసోకినంతనే అతనిముఖము పాలిపోయెను. హృదయము పరితపించెను. చేతులు జోడించి, గుహుడు దీనముగా వేడుకొనెను. "ఓ రఘుకుల శిరోమణీ! నాదొక విన్నపము. నేను కొన్నిదినములు మీతోపాటు ఉండి, మీకు దారి చూపుచు

మీపాదపద్మముల సేవచేసెదను. మీరున్న వనములలో మీకై పర్ణకుటీరములను నిర్మించుచుందును. సిదప మీ ఆజ్ఞానుసారము నడచుకొందును అని ప్రమాణము చేయుచున్నాను." అతనిసహజస్నేహశీల్యములను జూచి, శ్రీరామచంద్రుడు ఆతనిని తనతో వచ్చుటకు అనుమతించెను. గుహునిహృదయము ఆనందముతో ఉప్పొంగెను. పిమ్మట గుహుడు తనవారినందఱిని పిలిచి, తగిన మాటలతో సంతృప్తుల గావించి, వారిని గృహోన్ముఖులజేసెను. (చౌ॥ 1-4)

దో- తబ గనపతి సివ సుమిరి ప్రభు, నాఇ సురసరిహి మాథ ।
సఖా అనుజ సియ సహిత బన, గవను కీన్హ రఘునాథ ॥ 104 ॥

పిమ్మట శ్రీరామచంద్రప్రభువు గణపతిని, శివుని స్మరించి, గంగాదేవికి ప్రణమిల్లి, గుహునితో, లక్ష్మణునితో, సీతాదేవితో గూడి వనములకు బయలు దేఱెను. (దో॥ 104)

## శ్రీరాముడు ప్రయాగను చేరుట-భరద్వాజుని దర్శించుట

చౌ- తేహి దిన భయఉ బిటప తర బాసూ । లఖన సఖాఀ సబ కీన్హ సుపాసూ ॥
ప్రాత ప్రాతకృత కరి రఘురాఈ । తీరథరాజు దీఖ ప్రభు జాఈ ॥ 1 ॥
సచివ సత్య శ్రద్ధా ప్రియ నారీ । మాధవ సరిస మీతు హితకారీ ॥
చారి పదారథ భరా భఀడారూ । పున్య ప్రదేస దేస అతి చారూ ॥ 2 ॥
ఛేత్రు అగమ గఢు గాఢ సుహావా । సపనేహుఀ నహిఀ ప్రతిపచ్ఛిన్హ పావా ॥
సేన సకల తీరథ బర బీరా । కలుష అనీక దలన రనధీరా ॥ 3 ॥
సంగము సింహాసను సుఠి సోహా । ఛత్రు అఖయబటు ముని మను మోహా ॥
చవఀర జమున అరు గంగ తరంగా । దేఖి హోహిఀ దుఖ దారిద భంగా ॥ 4 ॥

ఆనాడు ప్రభువు సీతాదేవితో గూడ ఒక చెట్టు క్రింద నివసించెను. లక్ష్మణుడు, గుహుడు వారికి అనుకూలమైన ఏర్పాట్లు కావించిరి. ప్రాతఃకాలమున శ్రీరాముడు శౌచస్నానాదులాచరించి, అచటినుండి బయలుదేఱి, తీర్థములకురాజైన ప్రయాగకు చేరెను. ఈ తీర్థ రాజమునకు సత్యమే మంత్రి, విశ్వాసము అతనిభార్య. వేణీమాధవుడు ఆతనిస్నేహితుడు. నాలుగు పురుషార్థములును అతనిసంపదలు. గంగాయమునాసంగమప్రదేశమే అతని రాజ్యము. ఆ పుణ్యభూమి దుర్గమము, దృఢము, బలమైన కోట. ఎట్టి శత్రువులును స్వప్నములో గూడ అచట అడుగిడలేరు. సకలతీర్థములును ఈ తీర్థరాజము యొక్క యోధులు. వారు పాపములనెడి శత్రువులను పాఱద్రోలురణధీరులు. గంగా యమునా సరస్వతీ సంగమస్థానమే ఆ తీర్థరాజ సింహాసనము. మునుల మనస్సులను ముగ్ధులగావించు అక్షయవటము ఆతనిఛత్రము. గంగా యమునా తరంగములాయన చామరములు, వాటిదర్శనమే దుఃఖములను, దారిద్ర్యములను దూరము చేయును. (చౌ॥ 1-4)

దో- సేవహిఀ సుకృతీ సాధు సుచి, పావహిఀ సబ మనకామ।
బందీ బేద పురాన గన, కహహిఀ బిమల గున గ్రామ ॥ 105 ॥

పుణ్యాత్ములును, పవిత్రమనస్కులునైన సాధువులును ఆ తీర్థరాజమును సేవించి, తమ మనోరథములను పొందెదరు. వేదపురాణములు అతని వందిమాగధులు. వారతని నిర్మల గుణములను గానము చేసెదరు. (దో॥ 105)

చౌ- కో కహి సకఇ ప్రయాగ ప్రభాఊ। కలుష పుంజ కుంజర మృగరాఊ॥
అస తీరథపతి దేఖి సుహావా। సుఖ సాగర రఘుబర సుఖు పావా ॥ 1 ॥
కహి సియ లఖనహి సఖహి సునాఈ। శ్రీముఖ తీరథరాజ బడాఈ॥
కరి ప్రనాము దేఖత బన బాగా। కహత మహాతమ అతి అనురాగా ॥ 2 ॥
ఏహి బిధి ఆఇ బిలోకీ బేనీ। సుమిరత సకల సుమంగల దేనీ॥
ముదిత నహాఇ కీన్హి సివ సేవా। పూజి జథాబిధి తీరథ దేవా ॥ 3 ॥
తబ ప్రభు భరద్వాజ పహిఀ ఆఏ। కరత దండవత ముని ఉర లాఏ॥
ముని మన మోద న కఛు కహి జాఈ। బ్రహ్మానంద రాసి జను పాఈ ॥ 4 ॥

పాపములనెడి గజసమూహములను హతమార్చు సింహమగు ప్రయాగరాజు మాహాత్మ్యమును ఎవరు వర్ణింపగలరు. ఇట్టి శోభాసంపన్నమైన తీర్థరాజమును జూచి, సుఖసాగరుడైన శ్రీరాముడు ఆనందమున మునిగెను. ఆయన ఆ తీర్థరాజమహిమను సీతాదేవికిని, లక్ష్మణునకును, గుహునకును స్వయముగా వినిపించెను. ఆ తీర్థరాజమునకు నమస్కరించి, అచటి వనములను, ఉపవనములను దర్శించి, వాటిమహిమను మిక్కిలి ప్రేమాదరములతో వర్ణించెను. స్మరణ మాత్రముననే సకలశుభములనొసగెడి ఆ త్రివేణీ సంగమమును శ్రీరాముడు తనివిదీర దర్శించెను. అందు స్నానమాచరించి, భక్తి ప్రపత్తులతో పరమశివుని, తీర్థదేవతలను ఆరాధించెను. పిదప శ్రీరామచంద్రుడు భరద్వాజమునియొద్దకు వెళ్లి, దండప్రణామములను ఆచరించెను. ముని బ్రహ్మానందభరితుడై శ్రీరాముని ఆలింగనము చేసికొనెను. (చౌ॥ 1-4)

దో- దీన్హి అసీస మునీస ఉర, అతి అనందు అస జాని।
లోచన గోచర సుకృత ఫల, మనహుఀ కిఏ బిధి ఆని ॥ 106 ॥

భరద్వాజ మహర్షి శ్రీరాముని ఆశీర్వదించెను. శ్రీ సీతారామలక్ష్మణులదర్శనముద్వారా తమపుణ్యఫలములను అన్నింటిని విధాత ఆ దినముననే తమకు అనుగ్రహించినట్లు భావించి, ముని మిక్కిలి సంతసించెను. (దో॥ 106)

చౌ- కుసల ప్రస్న కరి ఆసన దీన్హే। పూజి ప్రేమ పరిపూరన కీన్హే॥
కంద మూల ఫల అంకుర నీకే। దిఏ ఆని ముని మనహుఀ అమీ కే ॥ 1 ॥
సీయ లఖన జన సహిత సుహాఏ। అతి రుచి రామ మూల ఫల ఖాఏ॥
భఏ బిగతశ్రమ రాము సుఖారే। భరద్వాజ మృదు బచన ఉచారే ॥ 2 ॥

ఆజు సుఫల తపు తీరథ త్యాగూ । ఆజు సుఫల జప జోగ బిరాగూ ॥
సఫల సకల సుభ సాధన సాజూ । రామ తుమ్హహి అవలోకత ఆజూ ॥ 3 ॥
లాభ అవధి సుఖ అవధి న దూజీ । తుమ్హరేఀ దరస ఆస సబ పూజీ ॥
అబ కరి కృపా దేహు బర ఏహూ । నిజ పద సరసిజ సహజ సనేహూ ॥ 4 ॥

క్షేమసమాచారములను తెలిసికొనిన పిమ్మట ముని శ్రీరామునకు ఉచితాసనమును సమకూర్చి, భక్తితో పూజించి, ఆయనను సంతృప్తుని గావించెను. అమృతతుల్యములై రుచికరములైన కందమూలఫలములను, అంకురములను సమర్పించెను. సీతా లక్ష్మణ గుహులతో గూడి శ్రీరామచంద్రుడు ఆ పదార్థములను ప్రీతితో ఆరగించెను. సేదదీరి ప్రభువు ప్రశాంత చిత్తుడాయెను. భరద్వాజుడు ఆయనతో మృదువుగా ఇట్లనెను. "రామా! నీ దర్శనము వలన నాతపస్సు, తీర్థసేవనము, త్యాగము నేడు సఫలములైనవి. నా జపము, యోగము, వైరాగ్యము సాఫల్యమును పొందినవి. నేనొనర్చిన పుణ్యకార్యములకు ఫలము లభించినది. ఇంత కంటె అధికమైన సుఖలాభములేముండును? నీ దర్శనములో నా మనోరథములన్నియును నెఱవేఱినవి. అంతే గాదు నా జన్మమే ధన్యమైనది. నీ చరణకమలములయందే నాకు సహజ భక్తి కలుగునట్లు దయతో వరమును ప్రసాదింపుడు.
(చౌ॥ 1-4)

దో- కరమ బచన మన ఛాడి ఛలు, జబ లగి జను న తుమ్హార ।
తబ లగి సుఖు సపనెహుఀ నహీఀ, కిఏఀ కోటి ఉపచార ॥ 107 ॥

మనో వాక్కాయకర్మలచే నీపై అనన్యభక్తి కలిగియున్ననేతప్ప మానవుడెన్ని ఉపాయములు చేసినను ఆతనికి కలలోగూడ సుఖశాంతులు కలుగవు. (దో॥ 107)

చౌ- సుని ముని బచన రాము సకుచానే । భావ భగతి ఆనంద అఘానే ॥
తబ రఘుబర ముని సుజసు సుహావా । కోటి భాఀతి కహి సబహి సునావా ॥ 1 ॥
సో బడ సో సబ గున గన గేహూ । జెహి మునీస తుమ్హ ఆదర దేహూ ॥
ముని రఘుబీర పరసపర నవహీఀ । బచన అగోచర సుఖు అనుభవహీఀ ॥ 2 ॥
యహ సుధి పాఇ ప్రయాగ నివాసీ । బటు తాపస ముని సిద్ధ ఉదాసీ ॥
భరద్వాజ ఆశ్రమ సబ ఆఏ । దేఖన దసరథ సుఅన సుహాఏ ॥ 3 ॥
రామ ప్రనామ కీన్హ సబ కాహూ । ముదిత భఏ లహి లోయన లాహూ ॥
దేహిఀ అసీస పరమ సుఖు పాఈ । ఫిరే సరాహత సుందరతాఈ ॥ 4 ॥

మునివచనములకు శ్రీరాముడు కొంతసిగ్గుపడెను. కాని ఆయనయొక్కభక్తి భావమునకు మిక్కిలి సంతృప్తుడాయెను. పిదప రఘువీరుడు భరద్వాజునియశమును వేనోళ్ల పొగడెను. "మునీశ్వరా! మీ ఆదరణకుపాత్రుడైనవాడు గుణాఢ్యుడు, ఉత్తముడు. "ఈ విధమైన సంభాషణలతో శ్రీరాముడును,

భరద్వాజమహర్షియు పరస్పరము ప్రేమాదరములతో వినమ్రముగా నమస్కరించు కొనిరి. వారు పొందిన ఆనందమునకు మేరయే లేకుండెను. శ్రీరాముని రాకను విని, ప్రయాగలోని బ్రహ్మచారులు, తపోధనులు, మునులు, సిద్ధులు, సన్న్యాసులు మొదలగు వారందఱును దశరథ కుమారులను చూచుటకై భరద్వాజాశ్రమమునకు వచ్చిరి. శ్రీరామచంద్రుడు అందఱికిని నమస్కరించెను. వారికి నేత్రానందమును కలిగించెను. వారు సీతారామలక్ష్మణుల సౌందర్యములను మెచ్చుకొని, ఆశీర్వదించి,హర్షముతో వెళ్లిపోయిరి. (చౌ॥ 1-4)

దో- రామ కీన్హ బిశ్రామ నిసి, ప్రాత ప్రయాగ నహాఇ।
చలే సహిత సియ లఖన జన, ముదిత మునిహి సిరు నాఇ ॥ 108 ॥

శ్రీరాముడు ఆ రాత్రి ఆ ఆశ్రమమునందే విశ్రమించెను. ఉదయమున ప్రయాగలో స్నానమాచరించి, ప్రసన్నచిత్తుడై, మునికి నమస్కరించి, సీతాలక్ష్మణగుహులతో ముందునకు సాగెను. (దో॥ 108)

చౌ- రామ సప్రేమ కహేఉ ముని పాహీఀ। నాథ కహిఅ హమ కెహి మగ జాహీఀ॥
ముని మన బిహసి రామ సన కహహీఀ। సుగమ సకల మగ తుమ్హ కహుఀ అహహీఀ ॥ 1 ॥
సాథ లాగి ముని సిష్య బోలాఏ। సుని మన ముదిత పచాసక ఆఏ ॥
సబన్హి రామ పర ప్రేమ అపారా। సకల కహహిఀ మగు దీఖ హమారా ॥ 2 ॥
ముని బటు చారి సంగ తబ దీన్హే। జిన్హ బహు జనమ సుకృత సబ కీన్హే ॥
కరి ప్రనాము రిషి ఆయసు పాఈ। ప్రముదిత హృదయఀ చలే రఘురాఈ ॥ 3 ॥
గ్రామ నికట జబ నికసహిఀ జాఈ। దేఖహిఀ దరసు నారి నర ధాఈ ॥
హోహిఀ సనాథ జనమ ఫలు పాఈ। ఫిరహిఀ దుఖిత మను సంగ పఠాఈ ॥ 4 ॥

అటనుండి బయలుదేఱుటకుముందు శ్రీరామచంద్రుడు సాదరముగా ఆ మునీశ్వరునితో "ప్రభూ! మేము ఏ దారిన వెళ్లవలెనో తెల్పుడు" అని పలికెను. ముని మనస్సులో నవ్వుకొని "నీకు అన్ని మార్గములును సుగమములే" అనియనెను. శ్రీరామునకు దారిచూపుటకై భరద్వాజుడు తనశిష్యులను పిలిచెను. వెంటనే పెక్కుమంది శిష్యులు అచ్చటికి చేరిరి. వారందఱికిని శ్రీరామునిపైగల ప్రేమ అపారము. కావున అందఱును "త్రోవ మాకు తెలియును, మాకు తెలియును" అనిరి. అపుడు భరద్వాజమహర్షి వారిలో నలుగురు బ్రహ్మచారులను శ్రీరామునకు తోడుగా నిచ్చెను. శ్రీరామునకు మార్గమును జూపుటయు, ఆ నిదముగనైనను శ్రీరాముని సాంగత్యము లభించుటయు నిజముగా అనేకజన్మలలో చేసికొనిన తమపుణ్య ఫలముగా వారు భావించిరి. శ్రీ రఘునాథుడు మునికి నమస్కరించి, ఆయన అనుజ్ఞను పొంది, ప్రసన్న చిత్తుడై అటనుండి బయలు దేఱెను. వారేదైననొక గ్రామమును సమీపించినపుడు అచటి స్త్రీ పురుషులెల్లరును వారిదర్శనములకై పరుగెత్తుకొనివచ్చుచుండిరి. వారు తమజన్మలు సఫలములైనట్లు తలంచుచుండిరి. కొంతదూరము వారిని అనుగమించుచువచ్చిరి. తాము ధన్యులైనట్లు తలచి పొంగిపోవుచుండిరి. విధిలేక విచారముతో గృహోన్ముఖులగుచుండిరి. (చౌ॥ 1-4)

దో- బిదా కిఏ బటు బినయ కరి, ఫిరే పాఇ మన కామ।
ఉతరి నహాఏ జమున జల, జో సరీర సమ స్యామ ॥ 109 ॥

కొంతదూరము వెళ్లినపిదప శ్రీరామచంద్రుడు 'ఇంక మఱలిపొండు' అని అబ్రహ్మావారులకు విన్నవించెను. వారు తమ మనోవాంఛితమైన అనన్యభక్తిని పొంది, మఱలిరి. నీలవర్ణశోభలతో విలసిల్లుచున్న యమునాజలములలో శ్రీరాముడు మొదలగు వారందఱును స్నానములనాచరించిరి. (దో॥ 109)

చౌ- సునత తీరబాసీ నర నారీ । ధాఏ నిజ నిజ కాజ బిసారీ ॥
లఖన రామ సియ సుందరతాఈ । దేఖి కరహిఁ నిజ భాగ్య బడాఈ ॥ 1 ॥
అతి లాలసా బసహిఁ మన మాహీఁ । నాఉఁ గాఉఁ బూఝత సకుచాహీఁ ॥
జే తిన్హ మహుఁ బయబిరిధ సయానే । తిన్హ కరి జుగుతి రాము పహిచానే ॥ 2 ॥
సకల కథా తిన్హ సబహి సునాఈ । బనహి చలే పితు ఆయసు పాఈ ॥
సుని సబిషాద సకల పఛితాహీఁ । రానీ రాయఁ కీన్హ భల నాహీఁ ॥ 3 ॥

యమునానదీతీరమునసుండు ప్రజలు వారిఆగమనవార్తను విని, తమతమ పనులనన్నింటిని ప్రక్కనబెట్టి, పరుగుపరుగున విచ్చేసిరి. శ్రీ సీతారామలక్ష్మణుల అందచందములకు అబ్బురపడి, వారు తమ భాగ్యములకు పొంగిపోయిరి. వారితో పరిచయములకై వారెల్లరును ఉవ్విళ్లూరుచుండిరి. కాని ఊరుపేర్లడుగుటకు సంకోచపడుచుండిరి. వయోవృద్ధులును, బుద్ధిమంతులును యుక్తితో శ్రీరాముని గుర్తించిరి. వారు అచటివారికి రామలక్ష్మణులు తమ పితృవాక్య పాలనకై వనములకు వచ్చినట్లు తెల్పిరి. ఈ విషయములను విన్న పిమ్మట 'రాజు-రాణులు' మంచి పనిచేయలేదని వగచిరి. (చౌ॥ 1-3)

తెహి అవసర ఎక తాపసు ఆవా । తేజపుంజ లఘుబయస సుహావా ॥
కబి అలఖిత గతి బేషు బిరాగీ । మన క్రమ బచన రామ అనురాగీ ॥ 4 ॥

అదే సమయమున అచటికి ఒక 'తపస్వి' వచ్చెను అతడు ఒక మహాతేజస్వి, యువకుడు, సుందరుడు. అతడెవరో కవికిని తెలియరాదు. ఆ భగవంతునకు మాత్రమే యెఱుక. అతడు విరాగి, కాని సహజముగనే త్రికరణ శుద్ధిగా శ్రీరామచంద్రునిపై అనురాగి. (చౌ॥ 4)

దో- సజల నయన తన పులకి నిజ, ఇష్టదేఉ పహిచాని ।
పరెఉ దండ జిమి ధరనితల, దసా న జాఇ బఖాని ॥ 110 ॥

తన ఇష్టదైవమును గుర్తింపగానే ఆయనకనులు చెమర్చెను, శరీరము పులకించెను, ఆయన భక్తిపారవశ్యమునమునిగెను. వెంటనే సాష్టాంగప్రణామములనాచరించెను. ఆ ప్రేమావేశము వర్ణింపతరముగాదు. (దో॥ 110)

F.N. తేజస్వియైన తపస్వి యొక్క ప్రస్తావన ప్రక్షిప్తము-అని కొందఱు టీకాకారులు భావింతురు. మఱికొందఱు ఈ ప్రస్తావన సందర్భోచితముగా లేదని తలంతురు. కాని ప్రాచీన ప్రతులన్నింటిలోను ఇది కనబడుచున్నది. శ్రీ తులసీదాసు అలౌకికానుభవము గలవాడు. ఈ ప్రసంగ రహస్యమేమో ఎవ్వరికిని తెలియదు. కనుక దీనిని ప్రక్షిప్తమనుట-ఏమాత్రము తగదు. ఈ తాపసిని "కబిఅలఖితగతి" అని చెప్పుటచే అతడెవరో నిశ్చయముగా చెప్పజాలము. ఆ తాపసి ధ్యానస్థుడైన 'తులసీదాసు' ఐనను లేదా 'ఆంజనేయుడు' ఐనను కావచ్చును. తులసీదాసు ఈవిషయమును ఎందులకో నిగూఢముగా ఉంచెను.

చౌ- రామ సప్రేమ పులకి ఉర లావా । పరమ రంక జను పారసు పావా ॥
మనహుఁ ప్రేము పరమారథు దోఊ । మిలత ధరేఁ తన కహ సబు కోఊ ॥ 1 ॥
బహురి లఖన పాయన్హ సోఇ లాగా । లీన్హ ఉఠాఇ ఉమగి అనురాగా ॥
పుని సియ చరన ధూరి ధరి సీసా । జనని జాని సిసు దీన్హి అసీసా ॥ 2 ॥
కీన్హ నిషాద దండవత తేహీ । మిలేఉ ముదిత లఖి రామ సనేహీ ॥
పిఅత నయన పుట రూపు పియూషా । ముదిత సుఅసను పాఇ జిమి భూఖా ॥ 3 ॥

శ్రీరాముడు పులకితగాత్రుడై ఆతాపసిని ప్రేమతో ఆలింగనమొనర్చుకొనెను. నిర్ధనునకు పరుసవేది దొరకినప్పుడు కలుగునంత ఆనందమును అతడు అనుభవించెను. వారి కలయికను చూచిన వారందఱును ప్రేమ-పరమార్థములు శరీరములను ధరించి, కలిసినవనిరి. పిదప ఆ తాపసి లక్ష్మణునకు నమస్కరించెను. సౌమిత్రి అతనిని లేవనెత్తి ప్రేమతో కౌగిలించుకొనెను. పిదప తాపసి సీతామాతపాదధూళిని తనశిరసున దాల్చెను. ఆమె అతని తనతనయునిగా ఆదరించి, ఆశీర్వదించెను. నిషాదుడు ఆ తాపసికి నమస్కరించెను. అతడు శ్రీరామచంద్రునిభక్తుడని యెఱింగి తాపసి అతనిని సాదరముగా కౌగిలించుకొనెను. శ్రీరామచంద్రుని సౌందర్యామృతమును అతడు తనకనులతో తనివిదీరగ్రోలెను. ఆకలిగొన్న వానికి ఆహారము లభించినట్లు ఆనందించెను. (చౌ॥ 1-3)

తే పితు మాతు కహహు సఖి కైసే । జిన్హ పఠఏ బన బాలక ఐసే ॥
రామ లఖన సియ రూపు నిహారీ । హోహిఁ సనేహ బికల నర నారీ ॥ 4 ॥

ఒకగ్రామీణ స్త్రీ ఇతర స్త్రీలతో పలుకుచుండెను. "సఖీ ఇట్టి బాలకులను అడవులపాలు చేసిన ఆ తలిదండ్రులు ఎంతకఠినాత్ములో కదా!" శ్రీ సీతారామలక్ష్మణుల అందచందములను గాంచి, వారందఱును ప్రేమ పరవశులై వ్యాకుల చిత్తులైరి. (చౌ॥ 4)

దో- తబ రఘుబీర అనేక బిధి, సఖహి సిఖావను దీన్హ ।
రామ రజాయసు సీస ధరి, భవన గవను తెఇఁ కీన్హ ॥ 111 ॥

అప్పుడు రఘువీరుడు గుహునకు పెక్కురీతుల నచ్చజెప్పి, మఱలి పొమ్మని పలికెను. శ్రీరామచంద్రుని ఆజ్ఞను శిరసావహించి, అతడు గృహోన్ముఖుడాయెను. (దో॥ 111)

చౌ- పుని సియఁ రామ లఖన కర జోరీ । జమునహి కీన్హ ప్రనాము బహోరీ ॥
చలే ససీయ ముదిత దోఉ భాఈ । రబితనుజా కఇ కరత బడాఈ ॥ 1 ॥
పథిక అనేక మిలహిఁ మగ జాతా । కహహిఁ సప్రేమ దేఖి దోఉ భ్రాతా ॥
రాజ లఖన సబ అంగ తుమ్హారేఁ । దేఖి సోచు అతి హృదయ హమారేఁ ॥ 2 ॥
మారగ చలహు పయాదేహి పాఏఁ । జ్యోతిషు ఝూఠ హమారేఁ భాఏఁ ॥
అగము పంథు గిరి కానన భారీ । తెహి మహఁ సాథ నారి సుకుమారీ ॥ 3 ॥
కరి కేహరి బన జాఇ న జోఈ । హమ సంగ చలహిఁ జో ఆయసు హోఈ ॥
జాబ జహాఁ లగి తహఁ పహుఁచాఈ । ఫిరబ బహోరి తుమ్హహి సిరు నాఈ ॥ 4 ॥

సీతారామలక్ష్మణులు యమునా నదికి నమస్కరించిరి. వారు సూర్యసుతయైన యమునా దేవిని కీర్తించుచు ఆనందముతో ముందునకు నడచిరి. త్రోవలో పెక్కుమంది ప్రయాణికులు వారిని కలిసిరి. వారు ఈ సోదరులను జూచి ప్రేమతో ఇట్లనిరి. "మీ రాజలక్షణములను చూచి, మాకు విచారము కలుగుచున్నది. మీరు పాదచారులై సంచరించుచున్నారు. దీనినిబట్టి జ్యోతిష శాస్త్రము అసత్యమని మేము తలంచుచున్నాము. దట్టమైన అడవి, ఎత్తైన కొండల మార్గము దుర్గమము. అంతేగాక మీతోపాటు సుకుమారియైన స్త్రీకూడ కలదు. ఈ అడవులలో భయంకరములైన ఏనుగులు, సింహములు గలవు. మీ ఆజ్ఞయైనచో మేము మీతో పాటు వచ్చెదము. మీరు వెళ్లదలచినచోటికి మిమ్ము చేర్చెదము. పిదప మీకు నమస్కరించి, తిరిగి వచ్చెదము" (చౌ॥ 1-4)

**దో- ఏహి బిధి పూఁఛహిఁ ప్రేమ బస, పులక గాత జలు నైన।**
**కృపాసింధు ఫేరహిఁ తిన్హహి, కహి బినీత మృదు బైన ॥ 112 ॥**

ఈ విధముగా సజలనయనులై, పులకిత శరీరులై వారు అడుగ సాగిరి. దయాసాగరుడైన శ్రీరామచంద్రుడు వినయముతో మధురవచనములతో వారిని వారిగృహములకు పంపెను. (దో॥ 112)

చౌ- జే పుర గాఁవ బసహిఁ మగ మాహీఁ। తిన్హహి నాగ సుర నగర సిహాహీఁ ॥
కెహి సుకృతీఁ కెహి ఘరీఁ బసాఏ। ధన్య పున్యమయ పరమ సుహాఏ ॥ 1 ॥
జహఁ జహఁ రామ చరన చలి జాహీఁ। తిన్హ సమాన అమరావతి నాహీఁ ॥
పున్యపుంజ మగ నికట నివాసీ। తిన్హహి సరాహహిఁ సురపురబాసీ ॥ 2 ॥
జే భరి నయన బిలోకహిఁ రామహి। సీతా లఖన సహిత ఘనస్యామహి ॥
జే సర సరిత రామ అవగాహహిఁ। తిన్హహి దేవ సర సరిత సరాహహిఁ ॥ 3 ॥
జెహి తరు తర ప్రభు బైఠహిఁ జాఈ। కరహిఁ కలపతరు తాసు బడాఈ ॥
పరసి రామ పద పదుమ పరాగా। మానతి భూమి భూరి నిజ భాగా ॥ 4 ॥

సీతారామలక్ష్మణులకు దారిలో సౌభాగ్యవంతములైన పెక్కు పల్లెలు, గ్రామములు కనువిందు గావించుచుఒప్పారెను. వాటిశోభలకు నాగలోక, దేవలోకముల నివాసులు గూడ ఈర్ష్యపడుచు వాటిని ప్రశంసించుచుండిరి. వాటినిగూర్చి దేవతలు ఇట్లు అనుకొనుచుండిరి. "ఏ పుణ్యాత్ముడు ఏ శుభముహూర్తమున ఈ గ్రామములను నెలకొల్పెనోగాని ఈనాడు అవి ధన్యములు, పవిత్రములు, సుందరములునై ఒప్పుచున్నవి." శ్రీరామచంద్రుడు అడుగిడిన స్థలములన్నియును అమరావతిని మించి విలసిల్లుచున్నవి. ఆ దారుల ప్రక్కన నివసించు వారు మిక్కిలి పుణ్యాత్ములు. స్వర్గవాసులుగూడ వారిని మెచ్చుకొనుచుండిరి. వారు శ్యామసుందరుడైన శ్రీరాముని, సీతాలక్ష్మణులను కన్నులవిందుగా జూచిరి. శ్రీరాముడు స్నానమాడిన సరస్సులును, నదులును, దేవనదీ సరోవరముల ప్రశంసలకు పాత్రములైనవి. తమనీడలలో శ్రీరాముని సేదదీర్చిన వృక్షములను కల్పతరువు పొగడుచుండెను. శ్రీరామునిచరణస్పర్శకు నోచుకొనిన భూమి తనను భాగ్యశాలినిగా భావించుకొనెను. (చౌ॥ 1-4)

దో- ఛాంహ కరహిం ఘన బిబుధగన, బరషహిం సుమన సిహాహిం ।
దేఖత గిరి బన బిహగ మృగ, రాము చలే మగ జాహిం ॥ 113 ॥

శ్రీరాముడు పర్వతములను వనములను, పశుపక్షులను చూచుచునెళ్ళుచుండగా మేఘములు ఆయనకు ఛత్రములవలె నీడనిచ్చుచుండెను. దేవతలు వారిని ప్రశంసించుచు పూలవానలను కురిపించుచుండిరి. (దో॥ 113)

## గ్రామప్రజల ప్రేమ పారవశ్యములు

చౌ- సీతా లఖన సహిత రఘురాఈ । గాంవ నికట జబ నికసహిం జాఈ ॥
సుని సబ బాల బృద్ధ నర నారీ । చలహిం తురత గృహకాజు బిసారీ ॥ 1 ॥
రామ లఖన సియ రూప నిహారీ । పాఇ నయనఫలు హోహిం సుఖారీ ॥
సజల బిలోచన పులక సరీరా । సబ భఏ మగన దేఖి దోఉ బీరా ॥ 2 ॥
బరని న జాఇ దసా తిన్హ కేరీ । లహి జను రంకన్హ సురమని ఢేరీ ॥
ఏకన్హ ఏక బోలి సిఖ దేహీం । లోచన లాహు లేహు ఛన ఏహీం ॥ 3 ॥
రామహి దేఖి ఏక అనురాగే । చితవత చలే జాహిం సంగ లాగే ॥
ఏక నయన మగ ఛబి ఉర ఆనీ । హోహిం సిథిల తన మన బర బానీ ॥ 4 ॥

సీతారామలక్ష్మణులు సమీపింపగనే ప్రతిగ్రామములోని బాలురు, వృద్ధులు, స్త్రీ పురుషులు తమ ఇళ్ల వాకిళ్లను, పనులను వదలి వారిని దర్శించుటకై వచ్చుచుండిరి. వారిని దర్శించి, తమ నేత్రములు సఫలములైనవని భావించుచుండిరి. వారినేత్రములు ఆనందబాష్పములు కురియుచుండెను. శరీరములు హర్షవిహ్వలములగుచుండెను. సోదరులిద్దఱిని గాంచి జనులు ప్రేమానందములలో మునుగుచుండిరి. వారిహర్షాతిరేకస్థితి వర్ణనాతీతము. నిఱుపేదకు చింతామణి లభించినంత ఆనందమును అనుభవించుచుండిరి. తమ నేత్రములసాఫల్యక్షణమిదియేయని వారు చెప్పుకొనుచుండిరి. వారిలో కొందఱు శ్రీరాముని జూచి ప్రేమపరవశులై ఆయన వెంట నడచు చుండిరి. నేత్రములద్వారా వారిసౌందర్యములను తమహృదయములలోనికి చేర్చుకొని, వారు తను మనో వచనముల విహ్వలస్థితిని పొందిరి. (చౌ॥ 1-4)

దో- ఏక దేఖి బట ఛాంహ భలి, డాసి మృదుల తృన పాత ।
కహహిం గవాంఇఅ ఛినుకు శ్రము, గవనబ అబహిం కి ప్రాత ॥ 114 ॥

మఱి కొందఱు చక్కని వటవృక్షములను జూచి, వాటి క్రింద మెత్తని గడ్డిని పఱచి "ఇచ్చట విశ్రమించి సేదదీర్చుకొనుడు, కొద్దిసేపు ఐన తరువాతగాని, లేక ఉదయమునగాని వెళ్లుదురుగాక" అనియనుచుండిరి. (దో॥ 114)

చౌ- ఏక కలస భరి ఆనహిం పానీ । అంచఇఅ నాథ కహహిం మృదు బానీ ॥
సుని ప్రియ బచన ప్రీతి అతి దేఖీ । రామ కృపాల సుసీల బిసేషీ ॥ 1 ॥
జానీ శ్రమిత సీయ మన మాహీం । ఘరిక బిలంబు కీన్హ బట ఛాహీం ॥
ముదిత నారి నర దేఖహిం సోభా । రూప అనూప నయన మను లోభా ॥ 2 ॥
ఏకటక సబ సోహహిం చహుం ఓరా । రామచంద్ర ముఖ చంద చకోరా ॥
తరున తమాల బరన తను సోహా । దేఖత కోటి మదన మను మోహా ॥ 3 ॥

దామిని బరన లఖన సుఠి నీకే । నఖ సిఖ సుభగ భావతే జీ కే ॥
మునిపట కటిన్హ కసేఁ తూనీరా । సోహహిఁ కర కమలని ధను తీరా ॥ 4 ॥

మఱికొందఱు కడవలలో నీరుతెచ్చి, మధురవచనములతో "ప్రభూ! కొద్దిగా ఈ నీటిని స్వీకరింపుడు" అని అనుచుండిరి. వారితియ్యని మాటలకును అపారప్రేమలకును, కృపాళువైన శ్రీరాముడు ముగ్ధుడాయెను. సీతాదేవి అలసిపోయినట్లు గమనించి, కొంతసేపు మఱ్ఱిచెట్టు నీడలో విశ్రమించెను. అచటి స్త్రీ పురుషులెల్లరును వారిఅనుపమసౌందర్యములను జూచిఆనందించిరి. సీతారాములఅందచందములు వారిమనస్సులను దోచెను. నేత్రములకువిందొనర్చెను నలుదెసల నిలబడి ప్రజలు శ్రీరామచంద్రుని సౌందర్య చంద్రికలకు చకోరములైరి. తమాల వృక్షచ్ఛాయలతో కోటి మన్మథాకారుడైన ప్రభువు వారిని ముగ్ధులను జేసెను. విద్యుత్కాంతి సమానదేహుడగు లక్ష్మణుడు ఆపాదమస్తకము సుశోభితుడై ఒప్పారెను. మునివల్కలములను, అమ్ములపొదిని, కరకమలములలో ధనుర్బాణములను ధరించి, సోదరులిద్దఱును శోభాయమానులైరి. (చౌ॥ 1-4)

దో- జటా ముకుట సీసని సుభగ, ఉర భుజ నయన బిసాల ।
సరద పరబ బిధు బదన బర, లసత స్వేద కన జాల ॥ 115 ॥

వారితలలపై జటామకుటములు, వారివిశాలవక్షములు, దీర్ఘబాహువులు, మనోహర నేత్రములు, చూడముచ్చట గొలుపుచుండెను. వారిసుందరవదనములు శరత్పూర్ణిమనాటి చంద్రునివోలి స్వేదబిందువులతో శోభిల్లుచుండెను. (దో॥ 115)

చౌ- బరని న జాఇ మనోహర జోరీ । సోభా బహుత థోరి మతి మోరీ ॥
రామ లఖన సియ సుందరతాఈ । సబ చితవహిఁ చిత మన మతి లాఈ ॥ 1 ॥
థకే నారి నర ప్రేమ పిఆసే । మనహుఁ మృగీ మృగ దేఖి దిఆ సే ॥
సీయ సమీప గ్రామతియ జాహీఁ । పూఁఛత అతి సనేహఁ సకుచాహీఁ ॥ 2 ॥
బార బార సబ లాగహిఁ పాఏఁ । కహహిఁ బచన మృదు సరల సుభాఏఁ ॥
రాజకుమారి బినయ హమ కరహీఁ । తియ సుభాయఁ కఛు పూఁఛత డరహీఁ ॥ 3 ॥
స్వామిని అబినయ ఛమబి హమారీ । బిలగు న మానబ జాని గవాఁరీ ॥
రాజకుఅఁర దోఉ సహజ సలోనే । ఇన్హ తేఁ లహీ దుతి మరకత సోనే ॥ 4 ॥

అన్ని విధములుగా ఈడుజోడైన ఆ సీతారాముల జంటను వర్ణించుటకు ఎవరి తరము? వారి సౌందర్యము అద్భుతావహము. నాబుద్ధి చాల అల్పము. అందఱును తమమనస్సులను, చిత్తములను, బుద్ధులను జతపఱచి శ్రీ సీతారామలక్ష్మణులదివ్యసౌందర్యములను చూచుచుండిరి. సౌందర్యపిపాసగల స్త్రీపురుషులు దీపశిఖనుజూచిన జింకలవలె తమనుతాము మఱచిపోయిరి. గ్రామీణస్త్రీలు సీతాదేవిని సమీపించిరి. కాని ప్రేమాధిక్యముచే అమెనడుగుటకు సంకోచించిరి. అందఱును సీతామాత చరణములపైబడి, కోమలసరళస్వరములతో ఇట్లనిరి. "రాజకుమారీ! మా విన్నపము ఒకటి గలదు. స్త్రీ స్వభావ కారణమున అడుగుటకు భయపడుచున్నాము. మా సాహసమును మన్నింపుడు. మేము పల్లె వాసులము. మా మాటలకు అన్యథా భావింపవలదు. ఈ రాకుమారులిద్దఱును సహజ సౌందర్య లావణ్యమూర్తులు. మరకతమణులు, బంగారము వీరినుండి కాంతులను గ్రహించి, శోభిల్లుచున్నవి. (చౌ॥ 1-4)

దో- స్యామల గౌర కిసోర బర, సుందర సుషమా ఐన।
సరద సర్బరీనాథ ముఖు, సరద సరోరుహ నైన ॥ 116 ॥

వీరిలో ఒకరిది శ్యామ వర్ణము. మఱియొకరిది గౌరవర్ణము. ఇద్దఱును సుందరులు, సుకుమారులు, శోభాపుంజములు, వీరి ముఖములు శరచ్చంద్రులు, నేత్రములు శరత్కాల కమలములు. "వీరిద్దఱెవరు?"
(దో॥ 116)

మాసపారాయణము - పదునాఱవ విరామము
నవాహ్నికపారాయణము - నాల్గవ విరామము

చౌ- కోటి మనోజ లజావనిహారే । సుముఖి కహహు కో ఆహిఁ తుమ్హారే ॥
సుని సనేహమయ మంజుల బానీ । సకుచీ సియ మన మహుఁ ముసుకానీ ॥ 1 ॥
తిన్హహి బిలోకి బిలోకతి ధరనీ । దుహుఁ సకోచ సకుచతి బరబరనీ ॥
సకుచి సప్రేమ బాల మృగ నయనీ । బోలీ మధుర బచన పికబయనీ ॥ 2 ॥
సహజ సుభాయ సుభగ తన గోరే । నాము లఖను లఘు దేవర మోరే ॥
బహురి బదను బిధు అంచల ఢాఁకీ । పియ తన చితఇ భౌఁహ కరి బాఁకీ ॥ 3 ॥
ఖంజన మంజు తిరీఛే నయనని । నిజ పతి కహేఉ తిన్హహి సియఁ సయనని ॥
భఈఁ ముదిత సబ గ్రామబధూటీఁ । రంకన్హ రాయ రాసి జను లూటీఁ ॥ 4 ॥

"ఓ సుందర వదనా! కోటి మన్మథులను మించి ప్రకాశించు వీరు నీకేమి కావలయును? తెలుపుము"- వారి ప్రేమపూర్వక మధురవ్యాకములను విని, సీతాదేవి బిడియపడుచు తనలో తానే నవ్వుకొనెను. మొదట రామలక్ష్మణులవైపును, పిదప భూమి వైపును చూచి, సీతాదేవి లజ్జా సంకోచములతో మౌనము వహించెను. పిమ్మట ఆహరిణలోచన సిగ్గుపడుచు కోకిలవంటి మధురస్వరముతో వారికి ప్రేమతో సమాధానమిచ్చెను. "సరళ స్వభావుడు, సుందరుడు, గౌరవర్ణము గల ఆ చిన్న వాడు నా మఱిది, ఆయన పేరు లక్ష్మణుడు." తరువాత చంద్ర బింబమును బోలు తన ముఖమును చీర కొంగుతో కప్పుకొని, తన ప్రభువువైపు చూచి, భ్రూకుటి ముడిచి, కాటుక పిట్ట వంటి కన్నులతో ఓర చూపుతో ఆతడు 'తనపతి' యని కను సన్నలతోడనే తెలిపెను. ఆ గ్రామీణ యువతులు అందఱు నిఱుపేదకు ధననిధులు లభించినంతగా సంతసించిరి.
(చౌ॥ 1-4)

దో- అతి సప్రేమ సియ పాయఁ పరి, బహుబిధి దేహిఁ అసీస ।
సదా సోహాగిని హోహు తుమ్హ, జబ లగి మహి అహి సీస ॥ 117 ॥

వారు అత్యంత భక్తితో సీతామాత పాదములకు ప్రణమిల్లిరి. పిదప "శేషునితలపై ఈ పృథ్వీభారము ఉన్నంతవఱకును నీవు సౌభాగ్యవతివై ఉందువుగాక" అని ఆశీర్వదించిరి.
(దో॥ 117)

చౌ- పారబతీ సమ పతిప్రియ హోహూ । దేబి న హమ పర ఛాడబ ఛోహూ ॥
పుని పుని బినయ కరిఅ కర జోరీ । జౌఁ ఏహి మారగ ఫిరిఅ బహోరీ ॥ 1 ॥

దరసను దేబ జాని నిజ దాసీ । లఖీఁ సీయఁ సబ ప్రేమ పిఆసీ ॥
మధుర బచన కహి కహి పరితోషీఁ । జను కుముదినీఁ కౌముదీఁ పోషీఁ ॥ 2 ॥
తబహిఁ లఖన రఘుబర రుఖ జానీ । పూఁఛెఉ మగు లోగన్హి మృదు బానీ ॥
సునత నారి నర భఏ దుఖారీ । పులకిత గాత బిలోచన బారీ ॥ 3 ॥
మిటా మోదు మన భఏ మలీనే । బిధి నిధి దీన్హ లేత జను ఛీనే ॥
సముఝి కరమ గతి ధీరజు కీన్హా । సోధి సుగమ మగు తిన్హ కహి దీన్హా ॥ 4 ॥

వారు ఇంకను ఇట్లు పలికిరి. "పరమ శివునకు పార్వతీదేవివలె నీవును నీ పతికి ప్రేమ పాత్రురాలవు కమ్ము. దేవీ! మాపై నీ కృపాప్రేమలను మాత్రము విడువవలదు. మఱల ఈ దారిలోనే రావలసినదిగా చేతులు జోడించి మేము ప్రార్థించుచున్నాము. మమ్ము మీ చెలులుగా భావించి, మీ దర్శనభాగ్యమును ప్రసాదింపుడు." వారి ప్రేమపిపాసను జూచి, సీతాదేవి తనమధురవచనములతో వెన్నెల కలువలనువలె వారిని సంతోషపఱచెను. అదే సమయమున లక్ష్మణుడు శ్రీరామచంద్రుని అభిప్రాయము నెఱింగి, కోమల స్వరములో వారిని మార్గమడిగెను. ఈ మాటను వినిన వెంటనే స్త్రీపురుషులు దుఃఖితులైరి. వారు గగుర్పాటు పొందిరి, కన్నులనీరు నిండెను. హృదయముల యందలి ఆనందములు మటు మాయమాయెను. విధాత తానొసంగిన సంపదలను తిరిగి లాగుకొనినట్లు వారు నిస్పృహకు లోనైరి. ఇది కర్మగతి యని భావించి ధైర్యము వహించి, తమలో తాము చర్చించుకొని వారికి సుగమమైన మార్గమును జూపిరి. (చౌ॥ 1-4)

దో- లఖన జానకీ సహిత తబ, గవను కీన్హ రఘునాథ ।
ఫేరే సబ ప్రియ బచన కహి, లిఏ లాఇ మన సాథ ॥ 118 ॥

శ్రీరాముడు సీతాలక్ష్మణ సమేతుడై అక్కడి నుండి ముందునకు సాగెను. వెంటవచ్చిన వారిని ప్రియ వచనములతో తిరిగి పంపెను. వారి హృదయములను మాత్రము తనతో తీసికొని పోయెను. (దో॥ 118)

చౌ- ఫిరత నారి నర అతి పఛితాహీఁ । దైఅహి దోషు దేహీఁ మన మాహీఁ ॥
సహిత బిషాద పరసపర కహహీఁ । బిధి కరతబ ఉలటే సబ అహహీఁ ॥ 1 ॥
నిపట నిరంకుస నిఠుర నిసంకూ । జెహిఁ ససి కీన్హ సరుజ సకలంకూ ॥
రూఖ కలపతరు సాగరు ఖారా । తెహిఁ పఠఏ బన రాజకుమారా ॥ 2 ॥
జౌఁ పై ఇన్హహి దీన్హ బనబాసూ । కీన్హ బాది బిధి భోగ బిలాసూ ॥
ఏ బిచరహిఁ మగ బిను పదత్రానా । రచే బాది బిధి బాహన నానా ॥ 3 ॥
ఏ మహి పరహిఁ డాసి కుస పాతా । సుభగ సేజ కత సృజత బిధాతా ॥
తరుబర బాస ఇన్హహి బిధి దీన్హా । ధవల ధామ రచి రచి శ్రము కీన్హా ॥ 4 ॥

మఱలి వెళ్లునప్పుడు ఆ జానపదులు మిక్కిలిపరితపించిరి. లోలోన దైవమును నిందించిరి. 'విధాత కార్యములన్నియును విపరీతములే' అని మిక్కిలి చింతాక్రాంతులై పలుకుచుండిరి." విధాత అతిస్వతంత్రుడు, నిరంకుశుడు, నిర్దయుడు, భయరహితుడు, అమృతకిరణుడైన చంద్రుని రోగిగా (క్షీణించువానినిగా) కళంకసహితునిగా ఒనర్చెను, కల్పవృక్షమును చెట్టుగా, స్థావరముగాజేసెను, సముద్రమును ఉప్పునీటితో నింపెను. అతడే ఈ రాజకుమారులను వనములకు పంపెను. వీరిని అడవులపాలుగావించినవిధాత భోగవిలాసములను వ్యర్థముగా సృష్టించెను. పాదరక్షలుగూడ లేకుండ వీరిని తిరుగునట్లుగా జేసిన విధాత నానావిధ వాహనములనువృథాగాసృజించెను. వీరు కుశలను ఆకులను పఱచుకొని, పవళించునట్లుగాజేసి, అతడు మెత్తనిపాన్పులను ఏల సృష్టించెను? వీరికి చెట్లక్రింద నివాసములను ఏర్పఱచిన అతడు ఉజ్జ్వల సౌధములను నిర్మించి, మిక్కిలి ప్రయాసపడెను. (చౌ॥ 1-4)

దో- జౌఁ ఏ ముని పట ధర జటిల, సుందర సుఠి సుకుమార।
బిబిధ భాఁతి భూషన బసన, బాది కిఏ కరతార ॥ 119 ॥

ఈ సుందరసుకుమార యువకులు మునివస్త్రములను, జడలను ధరించునట్లుగాజేసి, విధాత వివిధాభరణములను, వస్త్రములను నిర్మించుటవ్యర్థమే. (దో॥ 119)

చౌ- జౌఁ ఏ కంద మూల ఫల ఖాహీఁ । బాది సుధాది అసన జగ మాహీఁ ॥
ఏక కహహిఁ ఏ సహజ సుహాఏ । ఆపు ప్రగట భఏ బిధి న బనాఏ ॥ 1 ॥
జహఁ లగి బేద కహీ బిధి కరనీ । శ్రవన నయన మన గోచర బరనీ ॥
దేఖహు ఖోజి భుఅన దస చారీ । కహఁ అస పురుష కహాఁ అసి నారీ ॥ 2 ॥
ఇన్హహి దేఖి బిధి మను అనురాగా । పటతర జోగ బనావై లాగా ॥
కీన్హ బహుత శ్రమ ఐక న ఆఏ । తెహిఁ ఇరిషా బన ఆని దురాఏ ॥ 3 ॥
ఏక కహహిఁ హము బహుత న జానహిఁ । ఆపుహి పరమ ధన్య కరి మానహిఁ ॥
తే పుని పున్యపుంజ హము లేఖే । జే దేఖహిఁ దేఖిహహిఁ జిన్హ దేఖే ॥ 4 ॥

వీరికి కందమూలఫలములను ఆహారముగాజేసి, అతడు అమృతము మొదలగు మధుర పదార్థములను ఏలసృజించెను?" మఱి కొందఱీ విధముగా పలికిరి. "వీరు సహజసుందరులు. బ్రహ్మ వీరిని సృజింపలేదు. వీరు తమను తామే ప్రకటించుకొనిరి. విధాతసృష్టినిగూర్చి వేదములు వర్ణించినవి. దాని ప్రకారము ఇట్టి స్త్రీగాని, పురుషులు గాని పదునాల్గు లోకములలో ఎక్కడ వెదకిచూచినను కానరారు. వీరిరూపసౌభాగ్యములు కని, విని యెఱుగనట్టివి, ఊహలకు అందనట్టివి. వీరిని జూచి విధాత అనురక్తుడై వీరివంటివారిని సృష్టింప ప్రయత్నించి యుండవచ్చును. ఎంతగా పరిశ్రమించినను వీరిని పోలిన వారిని సృజించుటకు సాధ్యము గాక అసూయతో వీరిని వనములలో దాచెనేమో?"- మఱికొందఱు ఈ విధముగా నుడివిరి. " మాకు ఎక్కువగా తెలియదు. కాని మేము మాత్రము ఎంతయో ధన్యులము. మా ఉద్దేశ్యములో వీరిని చూచిన వారును, చూచుచున్నవారును, చూడబోవు వారును అందఱును ధన్యజీవులే పుణ్యాత్ములే. (చౌ॥ 1-4)

దో- ఏహి బిధి కహి కహి బచన ప్రియ, లేహిఁ నయన భరి నీర।
కిమి చలిహహిఁ మారగ అగమ, సుఠి సుకుమార సరీర ॥ 120 ॥

ఇట్టి ప్రియవచనములను పలుకుచు వారు కన్నీరు గార్చిరి. "మిక్కిలి సుకుమారులైన వీరు ఈ కారడవులలో దుర్గమమార్గములలో ఎట్లు నడువగలరు?" అని అనుచుండిరి. (దో॥ 120)

చౌ- నారి సనేహ బికల బస హోహీఁ । చకఈఁ సాఁఝ సమయ జను సోహీఁ ॥
మృదు పద కమల కఠిన మగు జానీ । గహబరి హృదయఁ కహహిఁ బర బానీ ॥ 1 ॥
పరసత మృదుల చరన అరునారే । సకుచతి మహి జిమి హృదయ హమారే ॥
జౌఁ జగదీస ఇన్హహి బను దీన్హా । కస న సుమనమయ మారగు కీన్హా ॥ 2 ॥
జౌఁ మాగా పాఇఅ బిధి పాహీఁ । ఏ రఖిఅహిఁ సఖి ఆఁఖిన్హ మాహీఁ ॥
జే నర నారి న అవసర ఆఏ । తిన్హ సియ రాము న దేఖన పాఏ ॥ 3 ॥
సుని సురూపు బూఝహిఁ అకులాఈ । అబ లగి గఏ కహాఁ లగి భాఈ ॥
సమరథ ధాఇ బిలోకహిఁ జాఈ । ప్రముదిత ఫిరహిఁ జనమఫలు పాఈ ॥ 4 ॥

సంధ్యా సమయమున తమకు కలుగబోవు వియోగమును శంకించి, చక్రవాకులు వ్యాకుల పాటునకు గురియగును. అట్లే ఆ స్త్రీలు తమకు సీతారామలక్ష్మణులతో ఎడబాటు కలుగునను శంకతో స్నేహవికలురైరి. వారిచరణ కమలకోమలత్వమును మార్గ కాఠిన్యమును తలంచుకొని, దుఃఖితలై గద్గదకంఠములతో పలికిరి. "వీరి ఎఱ్ఱనిమృదుపాదములను స్పృశించుటకు భూమి మా హృదయములవలె మిక్కిలి సంకోచపడుచున్నది. జగదీశ్వరుడు వీరికి వనవాసములను నిర్దేశించినపుడు మార్గములను పూలతో ఏల నింపలేదు? విధాత మనము కోరినవరములను ఇచ్చునట్లయితే వీరిని సర్వదా మనకన్నులలోనే ఉంచుకొనవలెనని కోరెడివారము." సమయమునకు అచటికి రానివారు సీతారాములను దర్శింపలేకపోయిరి. అట్టి వారు ఆ దంపతులసహజసౌందర్యములనుగూర్చి విని, "మిత్రమా! వారెంతదూరము పోయి ఉందురు?" అని అడుగుచుండిరి. వారిలో సమర్థులు పరుగెత్తుకొని వెళ్లి వారిని చూచుచుండిరి. తమజన్మలు ధన్యములైనవని తలచి, ఆనందముతో మఱలి వచ్చుచుండిరి. (చౌ॥ 1-4)

దో- అబలా బాలక బృద్ధ జన, కర మీజహిఁ పఛితాహిఁ।
హోహిఁ ప్రేమబస లోగ ఇమి, రాము జహాఁ జహఁ జాహిఁ॥ 121 ॥

అబలలైన ఆతివలు, పిల్లలు, వృద్ధులు, చేయునదిలేక చేతులు నలుపుకొనుచు పరితపించుచుండిరి. ఈ విధముగా శ్రీరాముడు ఎక్కడికి వెళ్లినను అచటివారు ప్రేమ పారవశ్యములనే పొందుచు వచ్చిరి. (దో॥ 121)

చౌ- గావఁ గావఁ అస హోఇ అనందూ । దేఖి భానుకుల కైరవ చందూ ॥
జే కఛు సమాచార సుని పావహిఁ । తే నృప రానిహి దోసు లగావహిఁ ॥ 1 ॥
కహహిఁ ఏక అతి భల నరనాహూ । దీన్హ హమహి జోఇ లోచన లాహూ ॥
కహహిఁ పరసపర లోగ లోగాఈఁ । బాతేఁ సరల సనేహ సుహాఈఁ ॥ 2 ॥

తే పితు మాతు ధన్య జిన్హ జాఏ । ధన్య సో నగరు జహాఁ తేఁ ఆఏ ॥
ధన్య సో దేసు సైలు బన గాఉఁ । జహఁ జహఁ జాహిఁ ధన్య సోఇ ఠాఉఁ ॥ 3 ॥
సుఖు పాయఉ బిరంచి రచి తేహీ । ఏ జెహి కే సబ భాఁతి సనేహీ ॥
రామ లఖన పథి కథా సుహాఈ । రహీ సకల మగ కానన ఛాఈ ॥ 4 ॥

సూర్యవంశమనెడి కలువను వికసింపజేయు శ్రీరాముడనెడి చంద్రుడు ఏ గ్రామమును సమీపించినను ఆ గ్రామము ఆనంద డోలికలలో తేలియాడుచు ఉండెను. వనవాస కథను వినిన జనులు రాజును, రాణిని తూలనాడుచుండిరి. కొందఱు, "ఒక విధముగా రాజుగారు చేసినది మంచిపనే. దానివలన మాకు నేత్రానందము కలిగినది. మేము ధన్యులమైతిమి." అని అనుచుండిరి. ఇతరులు సరళమైన ప్రేమపూరిత మధురవచనములను పలుకుచుండిరి. వారు అనుచుండిరి. "వీరికి జన్మనిచ్చిన ఆ తల్లిదండ్రులు ధన్యులు. వీరు నివసించు నగరము ధన్యము. వీరు నడచిన మైదానములు, పర్వతములు, అడవులు, గ్రామములు ధన్యాతి ధన్యములు. వీరు దర్శించిన ప్రదేశములన్నియును ధన్యములు. వీరిని సృష్టించిన విధాతయు తన సృష్టిసాఫల్యమునకు సంతసించి యుండును." తాను శ్రీరామునకు ప్రీతిపాత్రుడగుటచే మిక్కిలి భాగ్యశాలిగా బ్రహ్మతలపోసెను. బాటసారులై సాగిపోవుచున్న రామలక్ష్మణులమధురవృత్తాంతము సమస్తమార్గములయందును, వనములయందును వ్యాపించెను. (చౌ॥ 1-4)

దో- ఏహి బిధి రఘుకుల కమల రబి, మగ లోగన్హ సుఖ దేత ।
జాహిఁ చలే దేఖత బిపిన, సియ సౌమిత్రి సమేత ॥ 122 ॥

రఘువంశకమలమునకు సూర్యునివంటి శ్రీరామచంద్రుడు అందఱికిని సుఖములను గూర్చుచు సీతా లక్ష్మణులతో వనములను దర్శించుచుముందునకు సాగుచుండెను. (దో॥ 122)

చౌ- ఆగేఁ రాము లఖను బనే పాఛేఁ । తాపస బేష బిరాజత కాఛేఁ ॥
ఉభయ బీచ సియ సోహతి కైసేఁ । బ్రహ్మ జీవ బిచ మాయా జైసేఁ ॥ 1 ॥
బహురి కహఉఁ ఛబి జసి మన బసఈ । జను మధు మదన మధ్య రతి లసఈ ॥
ఉపమా బహురి కహఉఁ జియఁ జోహీ । జను బుధ బిధు బిచ రోహిని సోహీ ॥ 2 ॥
ప్రభు పద రేఖ బీచ బిచ సీతా । ధరతి చరన మగ చలతి సభీతా ॥
సీయ రామ పద అంక బరాఏఁ । లఖన చలహిఁ మగు దాహిన లాఏఁ ॥ 3 ॥
రామ లఖన సియ ప్రీతి సుహాఈ । బచన అగోచర కిమి కహి జాఈ ॥
ఖగ మృగ మగన దేఖి ఛబి హోహీఁ । లిఏ చోరి చిత రామ బటోహీఁ ॥ 4 ॥

ముందు శ్రీరామచంద్రుడు, వెనుక లక్ష్మణుడు తాపసివేషములలో హాయిగా నడచుచుండగా వారిమధ్య సీతాదేవి బ్రహ్మజీవులమధ్య మాయవలె విలసిల్లుచుండెను. మన్మథునకును వసంతునకును నడుమ రతీదేవివలెను, చంద్రునకును ఆతనికుమారుడైన బుధునకును మధ్య రోహిణివలెను, సీతాదేవి ప్రకాశించుచుండెను. శ్రీరామచంద్రుని పాదముద్రలపైన తాను అడుగులిడక నెమ్మదిగా మర్యాదతో సీతాదేవి నడచుచుండెను.

వారిద్దఱిపాదముద్రలకు ఎడమవైపున తనమర్యాదను పాటించుచు లక్ష్మణుడు నడచుచుండెను. శ్రీ సీతారామలక్ష్మణుల అలౌకికప్రేమ వర్ణింపనలవికానిది. పశుపక్షులుగూడ వారిసౌందర్యములకు పరవశించి పోవుచున్నవి. పథికుడైన శ్రీరాముడు వాటిమనస్సులనుగూడ హరించెను. (చౌ॥ 1-4)

దో- జిన్హ జిన్హ దేఖే పథిక ప్రియ, సియ సమేత దోఉ భాఇ।
భవ మగు అగము అనందు తెఇ, బిను శ్రమ రహే సిరాఇ ॥ 123 ॥

శ్రీ సీతారామలక్ష్మణులను బాటసారులుగా జూచిన వారందఱును ఎట్టి శ్రమలేకుండగనే ఆనందముతో పునర్జన్మరాహిత్యమును పొందుచుండిరి. (దో॥ 123)

చౌ- అజహుఁ జాసు ఉర సపనెహుఁ కాఊ । బసహుఁ లఖను సియ రాము బటాఊ ॥
రామ ధామ పథ పాఇహి సోఈ । జో పథ పావ కబహుఁ ముని కోఈ ॥ 1 ॥
తబ రఘుబీర శ్రమిత సియ జానీ । దేఖి నికట బటు సీతల పానీ ॥
తహఁ బసి కంద మూల ఫల ఖాఈ । ప్రాత నహాఇ చలే రఘురాఈ ॥ 2 ॥
దేఖత బన సర సైల సుహాఏ । బాలమీకి ఆశ్రమ ప్రభు ఆఏ ॥
రామ దీఖ ముని బాసు సుహావన । సుందర గిరి కానను జలు పావన ॥ 3 ॥
సరని సరోజ బిటప బన ఫూలే । గుంజత మంజు మధుప రస భూలే ॥
ఖగ మృగ బిపుల కోలాహల కరహీఁ । బిరహిత బైర ముదిత మన చరహీఁ ॥ 4 ॥

నేటికిని పాంథులుగానున్న సీతారామలక్ష్మణులపవిత్రరూపములను తమ హృదయములలో నిలుపుకొనినవారు శ్రీరాముని సాకేతధామమును జేరుదురు. తపోధనులైన మునీశ్వరులకును ఆ స్థానము ప్రాప్తించుట దుర్లభము. సీతాదేవిబడలికలను గమనించిన శ్రీరామచంద్రుడు చల్లనినీటివసతిగల ప్రదేశమున ఒకవటవృక్షచ్ఛాయలో ఆ దినము విశ్రాంతి దీసికొనెను. కందమూలఫలముల నారగించి, వారు ఆరాత్రి అచటనే గడిపిరి. ప్రాతఃకాలమున స్నానాదికములనాచరించి, శ్రీరఘురాముడు అచటనుండి బయలుదేఱెను. సుందర వనములను, సరస్సులను, కొండలను చూచుచు శ్రీరామచంద్రుడు వాల్మీకిఆశ్రమమునకు చేఱెను. మనోహర పర్వతములతో, వనములతో పవిత్రజలములతో ఆ ఋష్యాశ్రమము అత్యంత శోభాయమానముగా ఉండెను. అక్కడి సరోవరములయందలి కమలములు. వనవృక్షముల పుష్పములు వికసింపగా వాటిమకరందములను ఆస్వాదించిన తుమ్మెదలు మత్తిల్లి 'ఝుంకార' ధ్వనులను చేయుచుండెను. పలురకములపక్షులు మధురాలాపములను కావించుచుండెను. జంతువులు తమతమ సహజవైరములను మాని, హాయిగా సంచరించుచుండెను. (చౌ॥ 1-4)

## వాల్మీకి మహర్షితో సమాగమము

దో- సుచి సుందర ఆశ్రము నిరఖి, హరషే రాజివనేన।
సుని రఘుబర ఆగమను ముని, ఆగేఁ ఆయఉ లేన ॥ 124 ॥

రాజీవలోచనుడైన శ్రీరాముడు ఆ సుందరపవిత్ర-ఆశ్రమమును గాంచి, ప్రసన్నాంతరంగుడాయెను. రఘునాథునిఆగమనవార్తను విని, వాల్మీకిమహాముని వారిని ఆహ్వానించుటకు వచ్చెను. (దో॥ 124)

చౌ- ముని కహుఁ రామ దండవత కీన్హా । ఆసిరబాదు బిప్రబర దీన్హా ॥
దేఖి రామ ఛబి నయన జుడానే । కరి సనమాను ఆశ్రమహిఁ ఆనే ॥ 1 ॥
మునిబర అతిథి ప్రానప్రియ పాఏ । కంద మూల ఫల మధుర మగాఏ ॥
సియ సౌమిత్రి రామ ఫల ఖాఏ । తబ ముని ఆశ్రమ దిఏ సుహాఏ ॥ 2 ॥
బాలమీకి మన ఆనఁదు భారీ । మంగల మూరతి నయన నిహారీ ॥
తబ కర కమల జోరి రఘురాఈ । బోలే బచన శ్రవన సుఖదాఈ ॥ 3 ॥
తుమ్హ త్రికాల దరసీ మునినాథా । బిస్వ బదర జిమి తుమ్హరేఁ హాథా ॥
అస కహి ప్రభు సబ కథా బఖానీ । జెహి జెహి భాఁతి దీన్హ బను రానీ ॥ 4 ॥

శ్రీరాముడు మునీశ్వరునకు నమస్కరించి, ఆయనఆశీస్సులను పొందెను. రాముని నిరుపమానశోభలను ముని కనులపండువుగా చూచెను. సాదరముగా వారిని ఆయన తన ఆశ్రమమునకు తీసికొని వచ్చెను. వాల్మీకి మహాముని తనప్రియతమ - అతిథులకై మధురములైన కందమూల ఫలములను తెప్పించెను. వారు ఆ ఫలములను ఆరగించినపిదప, విశ్రమించుటకై చక్కని ఆసనములను ఏర్పాటుచేయించెను. దివ్యమంగళరూపుడైన శ్రీరాముని జూచిన వాల్మీకి హృదయము ఆనందముతో ఉప్పొంగిపోయెను. శ్రీరామచంద్రుడు తనకరకమలములుజోడించి, వీనులవిందుగొల్పుమధురవచనములను పలికెను. "మునీశ్వరా! మీరు త్రికాలవేదులు. విశ్వమంతయు మీకు కరతలామలకము" అని పలికి శ్రీరాముడు కైకేయి తమను వనవాసమునకు పంపిన వృత్తాంతమును దెలిపెను. (చౌ॥ 1-4)

దో- తాత బచన పుని మాతు హిత, భాఇ భరత అస రాఉ ।
మో కహుఁ దరస తుమ్హార ప్రభు, సబు మమ పున్య ప్రభాఉ ॥ 125 ॥

శ్రీరాముడు మఱల పలికెను. "ప్రభూ! తండ్రిగారిఆజ్ఞను పాలించుట తల్లిగారికి (కైకేయికి) హితమును చేకూర్చుట, భరతునివంటి తమ్ముడు రాజగుట, మీ దర్శనభాగ్యము గల్గుట ఇవియన్నియు నాపుణ్యఫలములే. (దో॥ 125)

చౌ- దేఖి పాయ మునిరాయ తుమ్హారే । భఏ సుకృత సబ సుఫల హమారే ॥
అబ జహఁ రాఉర ఆయసు హోఈ । ముని ఉదబేగు న పావై కోఈ ॥ 1 ॥
ముని తాపస జిన్హ తేఁ దుఖు లహహీఁ । తే నరేస బిను పావక దహహీఁ ॥
మంగల మూల బిప్ర పరితోషూ । దహఇ కోటి కుల భూసుర రోషూ ॥ 2 ॥

అస జియఁ జాని కహిఅ సోఇ ఠాఊఁ । సియ సౌమిత్రి సహిత జహఁ జాఊఁ ॥
తహఁ రచి రుచిర పరన తృన సాలా । బాసు కరౌఁ కఛు కాల కృపాలా ॥ 3 ॥
సహజ సరల సుని రఘుబర బానీ । సాధు సాధు బోలే ముని గ్యానీ ॥
కస న కహహు అస రఘుకులకేతూ । తుమ్హ పాలక సంతత శ్రుతి సేతూ ॥ 4 ॥

"మునీశ్వరా! మీ పాదదర్శనమువలన నాపుణ్యకర్మలు సఫలములైనవి. మీయాజ్ఞ ప్రకారము మునీశ్వరులకును తపోధనులకును ఎట్టి ఆటంకములును కలుగనిచోట రమణీయమైన ఒక పర్ణశాలను నిర్మించుకొని, అక్కడ సీతాలక్ష్మణులతో నివసింపదలచితిని. మునులకోపము అగ్నిలేకుండగనే రాజులను భస్మము చేయును. బ్రాహ్మణులసంతోషము సర్వశుభములకును మూలము. వారికోపము అసంఖ్యాకవంశములను నిర్మూలించును. నేను సీతాలక్ష్మణులతో గూడి నివసింపదగిన స్థానమును తెల్పుడు. అచట చక్కనిపర్ణకుటీరమును నిర్మించుకొని, కొంతకాలము నివసింపగలము." సహజసరళములైన రఘువరునిపల్కులను విని, వాల్మీకి ఇట్లనెను. "బాగుబాగు ఓరఘుకులతిలకా! చక్కగా సెలవిచ్చితివి. సర్వదా వేదమర్యాదలను కాపాడు నీవు ఇట్లు పలుకుటయే తగును.
(చౌ॥ 1-4)

ఛం- శ్రుతి సేతు పాలక రామ తుమ్హ జగదీస మాయా జానకీ ।
జో సృజతి జగు పాలతి హరతి రుఖ పాఇ కృపానిధాన కీ ॥
జో సహససీసు అహీసు మహిధరు లఖను సచరాచర ధనీ ।
సుర కాజ ధరి నరరాజ తను చలె దలన ఖల నిసిచర అనీ ॥

రామచంద్రా! నీవు వేదమర్యాదలను సంరక్షించుజగదీశ్వరుడవు. ఆదిశక్తియు, కరుణామూర్తియుఐన జానకీదేవి నీ కనుసన్నలతో ప్రేరణతో జగదుత్పత్తియు, పాలనసంహారములను కావించును. తనసహస్రఫణములపై భూభారమును మోయు సకలచరాచరములకు స్వామియైన శేషుడే ఈ లక్ష్మణుడు. దేవతల కార్యసిద్ధికై మీరు రాజకుమారులుగా అవతరించి, నిశాచరుల నాశనమునకై బయలు దేఱితిరి. (ఛం)

సో- రామ సరూప తుమ్హార, బచన అగోచర బుద్ధిపర ।
అబిగత అకథ అపార, నేతి నేతి నిత నిగమ కహ ॥ 126 ॥

రామా! నీ స్వరూపము వాక్కులకును, బుద్ధికిని అగోచరము. అది అవ్యక్తము, అవర్ణనీయము, అనంతము. వేదములుగూడ దానిని 'నేతి-నేతి' అని వర్ణించినవి. (సో॥ 126)

చౌ- జగు పేఖన తుమ్హ దేఖనిహారే । బిధి హరి సంభు నచావనిహారే ॥
తేఉ న జానహిఁ మరము తుమ్హారా । ఔరు తుమ్హహి కో జాననిహారా ॥ 1 ॥
సోఇ జానఇ జెహి దేహు జనాఈ । జానత తుమ్హహి తుమ్హఇ హోఇ జాఈ ॥
తుమ్హరిహి కృపాఁ తుమ్హహి రఘునందన । జానహిఁ భగత భగత ఉర చందన ॥ 2 ॥
చిదానందమయ దేహ తుమ్హారీ । బిగత బికార జాన అధికారీ ॥
నర తను ధరెహు సంత సుర కాజా । కహహు కరహు జస ప్రాకృత రాజా ॥ 3 ॥

రామ దేఖి సుని చరిత తుమ్హారే । జడ మోహహిఁ బుధ హోహిఁ సుఖారే ॥
తుమ్హ జో కహహు కరహు సబు సాఁచా । జస కాఛిఅ తస చాహిఅ నాచా ॥ 4 ॥

రామా! ఈ జగత్తు నీ లీలావిలాసము. నీవు దీనికి దర్శకుడవు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులనే నీవు ఆడించుచున్నావు. వారే నీతత్త్వమును ఎఱుగనిచో మఱియెవ్వరెఱుగుదురు?[1] నీవు స్వయముగా ఎవ్వరికి ప్రకటితుడవగుదువో వారేనిన్ను తెలిసికొన గల్గుదురు. వారు నిన్ను తెలిసికొనినంతనే నీ రూపమును పొందుదురు. భక్తుల హృదయములను ఆహ్లాదపఱచు చందనరూపమైన ఓ స్వామీ! నీ అనుగ్రహము ప్రసరించినప్పుడే భక్తులు నిన్ను తెలిసికొనగలరు. నీ దేహము పాంచభౌతికముకాదు. అది చిదానందమయము, వికారరహితము-అని విజ్ఞులుమాత్రమే గ్రహింపగలరు. నీవు సత్పురుషుల, దేవతల కార్యములను నెఱవేర్చుటకై దివ్యమానవశరీరమును ధరించితివి. ప్రాకృతులైన రాజులవలె మాట్లాడెదవు, చరించెదవు, రామా! నీ చరితమును కని, విని, మూర్ఖులు మోహ పరవశులగుదురు. కాని, జ్ఞానులు ఆనందించెదరు. నీవు చెప్పునదియు, చేయునదియు సత్యము. వేషమునకు తగినరీతిగా వ్యవహరించుటయే యుక్తముగదా! (చౌ॥ 1-4)

దో- పూఁఛేహు మోహి కి రహౌఁ కహఁ, మైఁ పూఁఛత సకుచాఉఁ ।
జహఁ న హోహు తహఁ దేహు కహి, తుమ్హహి దేఖావౌఁ ఠాఉఁ ॥ 127 ॥

'నేనెక్కడ నివసింపవలెను?'అని నీవు నన్నడిగితివి. ముందు నీవు లేని చోటును చూపుము. అప్పుడు నీవు ఉండవలసిన స్థలమును నేను తెల్పెదను.'' (దో॥ 127)

చౌ- సుని ముని బచన ప్రేమ రస సానే । సకుచి రామ మన మహుఁ ముసుకానే ॥
బాలమీకి హఁసి కహహిఁ బహోరీ । బానీ మధుర అమిఅ రస బోరీ ॥ 1 ॥
సునహు రామ అబ కహఉఁ నికేతా । జహాఁ బసహు సియ లఖన సమేతా ॥
జిన్హ కే శ్రవన సముద్ర సమానా । కథా తుమ్హారి సుభగ సరి నానా ॥ 2 ॥
భరహిఁ నిరంతర హోహిఁ న పూరే । తిన్హకే హియ తుమ్హ కహుఁ గృహ రూరే ॥
లోచన చాతక జిన్హ కరి రాఖే । రహహిఁ దరస జలధర అభిలాషే ॥ 3 ॥
నిదరహిఁ సరిత సింధు సర భారీ । రూప బిందు జల హోహిఁ సుఖారీ ॥
తిన్హ కేఁ హృదయ సదన సుఖదాయక । బసహు బంధు సియ సహ రఘునాయక ॥ 4 ॥

1. ఏమయ్య! రామా! బ్రహ్మేంద్రాదులకునైన నీమాయదెలియ వశమా!
కామారి వినుత గుణధామ! కువలయదళ
శ్యామా నను గన్న తండ్రీ రామా! ॥ ఏమయ్య ॥
సుతుడనుచు దశరథుడు హితుడనుచు సుగ్రీవుడు
అతి బలుండనుచు గపులు
క్షితి నాథుడనుచు భూపతులు గొలిచిరిగాని
పతిత పావనుడనుచు మతిదెలియలేరైరి ॥ ఏమయ్య ॥ (రామదాసు)

ప్రేమామృతపూర్ణమైన మునివచనములకు శ్రీరామచంద్రుడు కొద్దిగా సిగ్గుపడి దరహాసమొనర్చెను. వాల్మీకి మహర్షియు నవ్వి, మఱల సుధాసిక్తములైన తియ్యని పలుకులతో ఇట్లనెను. "రామా! వినుము. నీవు సీతాలక్ష్మణులతోగూడి నివసింపదగిన స్థానములను తెల్పెదను. రాత్రింబవళ్లు నీ దివ్యకథలనెడినదులతో నిండుచున్నను ఎవరి చెవులు సముద్రములవలె తృప్తి చెందవో అట్టివారి హృదయములు నీకు సుందర సదనములు. ఎవరి నేత్రములు చాతకములవలె నీ శరీరమనెడి మేఘమును దర్శించుటకు ఇచ్ఛగించుచు నీ సౌందర్య మేఘము యొక్క ఒకే ఒక్క చినుకుతో తృప్తిచెంది నదులను, సముద్రములను గూడ తిరస్కరించునో అట్టివారి హృదయములు నీకు నివాసస్థానములు. అనగా-చాతక పక్షి మేఘజలబిందువునుమాత్రమే స్వీకరించి(త్రాగి) తన దాహమును తీర్చుకొనును. దానితో తృప్తి పడును. నదీజలములనుగాని, సముద్రజలములనుగాని అది కోరుకొనదు. అట్లే నీ సచ్చిదానందస్వరూపములోని ఒక్క అంశమునైనను దర్శించి, పరమానందమును పొందెడివారు భూలోకము మొదలుకొని బ్రహ్మలోకమువఱకుగల వివిధలోకసౌందర్యములనుసైతము చూచుటకు ఇష్టపడరు. అక్కడనే నీవు సీతాదేవితో, సౌమిత్రితో నివసింపుము. (చౌ॥ 1-4)

**దో- జను తుమ్హార మానస బిమల, హంసిని జీహ్ జాసు ।**
**ముకతాహల గున గన చునఇ, రామ బసహు హియఁ తాసు ॥ 128 ॥**

నీ నిర్మలయశస్సు అనెడి మానససరోవరమునందలి నీ సద్గుణములనెడి ముత్యములను హంసవలె ఎవడు తననాలుకతో ఏరుకొనునో (లీనమై నీ గుణగానము చేయునో) అట్టి వారి హృదయములలో నీవు నివసింపుము. (దో॥ 128)

చౌ- ప్రభు ప్రసాద సుచి సుభగ సుబాసా । సాదర జాసు లహఇ నిత నాసా ॥
తుమ్హహి నిబేదిత భోజన కరహీఁ । ప్రభు ప్రసాద పట భూషన ధరహీఁ ॥ 1 ॥
సీస నవహిఁ సుర గురు ద్విజ దేఖీ । ప్రీతి సహిత కరి బినయ బిసేషీ ॥
కర నిత కరహిఁ రామ పద పూజా । రామ భరోస హృదయఁ నహిఁ దూజా ॥ 2 ॥
చరన రామ తీరథ చలి జాహీఁ । రామ బసహు తిన్హ కే మన మాహీఁ ॥
మంత్రరాజు నిత జపహిఁ తుమ్హారా । పూజహిఁ తుమ్హహి సహిత పరివారా ॥ 3 ॥
తరపన హోమ కరహిఁ బిధి నానా । బిప్ర జెవాఁఇ దేహిఁ బహు దానా ॥
తుమ్హ తేఁ అధిక గురహి జియఁ జానీ । సకల భాయఁ సేవహిఁ సనమానీ ॥ 4 ॥

రామా! ఎవరి నాసికలు నీ కర్పింపబడిన పవిత్రపుష్పసుగంధములను నిత్యము సాదరముగా ఆఘ్రాణించునో, ఎవరు నీకు నివేదింపబడిన పదార్థములను భుజించెదరో ఎవరు నీ పాదములకడ సమర్పింపబడిన వస్త్రాభరణములను ప్రసాదముగా ధరించెదరో అట్టి వారి హృదయములు నీ నివాసస్థానములు. ఎవరిమస్తకములు దేవతలకును, గురువులకును, బ్రాహ్మణులకును వినయముతో ప్రణమిల్లునో, ఎవరిచేతులు సర్వదా నీ పాదపద్మములను సేవించునో, ఎవరి హృదయములలో నీపై అనన్య భక్తివిశ్వాసములు గాఢముగా ఉండునో, ఎవరిపాదములు నీ పవిత్రక్షేత్రములవైపు నడుచునో, అట్టివారి హృదయములలో నివసింపుము. ఎవరైతే 'రామనామ'మనెడి 'మంత్రరాజము'ను సంతతము జపింతురో, సపరివారముగా నిన్ను పూజింతురో, వివిధ

తర్పణములను, హోమములను చేయుదురో, బ్రాహ్మణులను భోజనములతో, దానములతో తృప్తిపఱుచుదురో, ఎవరైతే నిన్ను పూజించుటకంటెను తమగురువులను ఎక్కువభక్తిభావముతో సేవించెదరో- (చౌ॥ 1-4)

దో- సబు కరి మాగహిఁ ఏక ఫలు, రామ చరన రతి హోఉ ।
తిన్హ కేఁ మన మందిర బసహు, సియ రఘునందన దోఉ ॥ **129** ॥

ఈ పనులను అన్నింటిని చేయుచునే 'శ్రీరామ చరణముల యందే ఎల్లప్పుడును మాకు భక్తియుండును గాక' అను ఏకైకఫలమును ఆశించువారి హృదయములనెడి మందిరముల యందే నీవు సీతాలక్ష్మణసమేతుడవై నివసింపుము.[1] (దో॥ 129)

చౌ- కామ కోహ మద మాన న మోహా । లోభ న ఛోభ న రాగ న ద్రోహా ॥
జిన్హ కేఁ కపట దంభ నహిఁ మాయా । తిన్హ కేఁ హృదయ బసహు రఘురాయా ॥ **1** ॥
సబ కే ప్రియ సబ కే హితకారీ । దుఖ సుఖ సరిస ప్రసంసా గారీ ॥
కహహిఁ సత్య ప్రియ బచన బిచారీ । జాగత సోవత సరన తుమ్హారీ ॥ **2** ॥
తుమ్హహి ఛాడి గతి దూసరి నాహీఁ । రామ బసహు తిన్హ కే మన మాహీఁ ॥
జననీ సమ జానహిఁ పరనారీ । ధను పరావ బిష తేఁ బిష భారీ ॥ **3** ॥
జే హరషహిఁ పర సంపతి దేఖీ । దుఖిత హోహిఁ పర బిపతి బిసేషీ ॥
జిన్హహి రామ తుమ్హ ప్రానపిఆరే । తిన్హ కే మన సుభ సదన తుమ్హారే ॥ **4** ॥

కామము, క్రోధము, మదము, అభిమానము, మోహము, లోభము, క్షోభము, రాగము, ద్వేషము, కపటము, దంభము, మాయ, అనునవి మచ్చునకైన లేని మనస్సులుగలవారి హృదయములలో నీవు నివసింపుము. అందఱికిని ప్రీతిపాత్రులు, హితకారులు, సుఖదుఃఖములను మానావమానములను సమానముగా భావించువారు, సత్యమునే గ్రహించి, బాగుగా ఆలోచించి ప్రియముగ పలికెడివారు, నిద్రించునపుడును, మేల్కొనియున్నప్పుడును నిన్నే శరణుజొచ్చువారు, నిన్ను తప్ప వేరెవరినిఆశ్రయించనివారు, పరస్త్రీలను తల్లులవలెను పరధనమును విషము వలెను భావించువారు మహాత్ములు- అట్టివారి హృదయములలో నివసింపుము. ఇతరుల అభివృద్ధిని జూచి సంతోషపడువారు, ఇతరుల దుఃఖములనుగాంచి మిక్కిలి బాధపడు వారు, నిన్ను ప్రాణాధికముగా భావించి సేవించు వారు ధన్యాత్ములు. అట్టివారి హృదయములే నీకు నివాస స్థానములు. (చౌ॥ 1-4)

దో- స్వామి సఖా పితు మాతు గురు, జిన్హ కే సబ తుమ్హ తాత ।
మన మందిర తిన్హ కేఁ బసహు, సీయ సహిత దోఉ భ్రాత ॥ **130** ॥

1. కమలాక్షునర్చించుకరములు కరములు- ఆంధ్రమహాభాగవతము సప్తమస్కంధము – పద్యము. 169 – పోతన ప్రణీతము

ప్రభూ! స్వామి, మిత్రుడు, తల్లి, తండ్రి, గురువు, సర్వము నీవేయని భావించు మనస్సులుగలవారి హృదయమందిరములలో నీవు సీతాలక్ష్మణ సమేతుడవై నివసింపుము. (దో॥ 130)

చౌ- అవగున తజి సబ కే గున గహహీం । బిప్ర ధేను హిత సంకట సహహీం ॥
నీతి నిపున జిన్హ కఇ జగ లీకా । ఘర తుమ్హార తిన్హ కర మను నీకా ॥ 1 ॥
గున తుమ్హార సముఝఇ నిజ దోసా । జేహి సబ భాంతి తుమ్హార భరోసా ॥
రామ భగత ప్రియ లాగహిం జేహీ । తేహి ఉర బసహు సహిత బైదేహీ ॥ 2 ॥
జాతి పాంతి ధను ధరము బడాఈ । ప్రియ పరివార సదన సుఖదాఈ ॥
సబ తజి తుమ్హహి రహఇ ఉర లాఈ । తేహి కే హృదయం రహహు రఘురాఈ ॥ 3 ॥
సరగు నరకు అపబరగు సమానా । జహఁ తహఁ దేఖ ధరేం ధను బానా ॥
కరమ బచన మన రాఉర చేరా । రామ కరహు తేహి కేం ఉర డేరా ॥ 4 ॥

ఇతరులదోషములను ఏ మాత్రము పట్టించుకొనక, కేవలము వారిసద్గుణములనే స్వీకరించువారు, నీతి నైపుణ్యములద్వారా జగత్తునందు నియమనిబంధనలను నిల్పెడివారు, ఎన్ని కష్టములకైనను ఓర్చుకొని గోబ్రాహ్మణరక్షణకై పాటుపడువారు సుకృతాత్ములు. అట్టి వారి హృదయములలో నివసింపుము. గుణములు నీవిగా దోషములు తమవిగా భావించువారు, నీమీద అనన్యభక్తి గలిగి, నీ భక్తులను ప్రేమించువారు ధన్యజీవులు. అట్టి వారి హృదయములలో సీతాదేవితోగూడి నివసింపుము. తమజాతిని, బంధువులను, సంపదలను, లౌకికములైన సర్వధర్మములను, కీర్తి ప్రతిష్ఠలను, ప్రియపరివారములను , గృహసుఖసంతోషములను వదలి, కేవలము నిన్ను తమలో నిలుపుకొనువారిహృదయములే నీకు నివాసస్థానములు. ధనుర్బాణధారులైన మిమ్ములనే సర్వత్ర దర్శించువారు, స్వర్గ, నరక, మోక్షములను సమానముగా భావించు వారు, మనోవాక్కాయ కర్మలచే మీకు దాసులు ఐన వారు పరమభక్తులు. అట్టి వారి హృదయములలో నివసింపుము. (చౌ॥ 1-4)

దో- జాహి న చాహిఅ కబహుం కఛు, తుమ్హ సన సహజ సనేహు ।
బసహు నిరంతర తాసు మన, సో రాఉర నిజ గేహు ॥ **131** ॥

నీపై సహజప్రేమ గలిగి, ఇంకేమియు అపేక్షింపనివానిమనస్సులోనే నీవు నిరంతరము నివాసము చేయుము- అదియే నీ నిజనివాసము." (దో॥ 131)

చౌ- ఏహి బిధి మునిబర భవన దేఖాఏ । బచన సప్రేమ రామ మన భాఏ ॥
కహ ముని సునహు భానుకులనాయక । ఆశ్రమ కహఉం సమయ సుఖదాయక ॥ 1 ॥
చిత్రకూట గిరి కరహు నివాసూ । తహఁ తుమ్హార సబ భాంతి సుపాసూ ॥
సైలు సుహావన కానన చారూ । కరి కేహరి మృగ బిహగ బిహారూ ॥ 2 ॥
నదీ పునీత పురాన బఖానీ । అత్రిప్రియా నిజ తపబల ఆనీ ॥
సురసరి ధార నాఉఁ మందాకిని । జో సబ పాతక పోతక డాకిని ॥ 3 ॥

అత్రి ఆది మునిబర బహు బసహీం । కరహిం జోగ జప తప తన కసహీం ॥
చలహు సఫల శ్రమ సబ కర కరహూ । రామ దేహు గౌరవ గిరిబరహూ ॥ 4 ॥

ఈ విధముగా మునిశ్రేష్ఠుడైన వాల్మీకి శ్రీరామచంద్రుని నివాసస్థానములను దెల్పెను. ప్రేమపూర్ణములైన ఆ వచనములు శ్రీరామునకు మిక్కిలి ప్రీతిని గూర్చెను. మఱల ముని పల్కెను. "ఓ సూర్యకులతిలకా! నీకు ఒక సుఖప్రదమైన స్థానమును దెలిపెదను. నీవు చిత్రకూట పర్వతముపై నివసింపుము. నీకు కావలసిన వసతులన్నియును అచట గలవు. ఆ పర్వతము మిక్కిలి మనోహరమైనది. ఏనుగులు, సింహములు, జింకలు, పక్షులు నిర్భయముగా విహరించు ఆ వనము అతి రమణీయమైనది. అత్రిమహర్షిపత్నియైన అనసూయాదేవి తన తపః ప్రభావముచే రప్పించిన పవిత్రమందాకినీనది అచటగలదు. అది పురాణ ప్రసిద్ధమైనది. అది గంగానదియొక్క ఒక పాయ. ఢాకిని పసిబాలురను భక్షించినంత అవలీలగా పాపహారిణియైన ఈ పవిత్ర మందాకిని గోహత్యాది సమస్తఘోరపాపములను సైతము హరించును. యోగము, జపము, తపస్సులచే తమ శరీరములను తపింపజేయు 'అత్రి' మొదలగు పెక్కుమందిఋషులు అచటనే నివసింతురు. శ్రీరామా! అచటికి వెళ్లి, వారి తపస్సులను సఫలమొనర్పుము. చిత్రకూట పర్వత గౌరవమును పెంచుము." (చౌ॥ 1-4)

దో- చిత్రకూట మహిమా అమిత, కహీ మహాముని గాఇ।
ఆఇ నహాఏ సరిత బర, సియ సమేత దోఉ భాఇ ॥ 132 ॥

వాల్మీకిమహాముని చిత్రకూటపర్వతముయొక్క అపారమహిమలను వర్ణించెను. సోదరులిద్దఱును సీతాదేవితో గూడి, ఆ పర్వతమును జేరి, మందాకినీపవిత్రజలములలో స్నానములు చేసిరి. (దో॥ 132)

## చిత్రకూట నివాసము

చౌ- రఘుబర కహేఉ లఖన భల ఘాటూ । కరహు కతహుం అబ ఠాహర ఠాటూ ॥
లఖన దీఖ పయ ఉతర కరారా । చహుం దిసి ఫిరేఉ ధనుష జిమి నారా ॥ 1 ॥
నదీ పనచ సర సమ దమ దానా । సకల కలుష కలి సాఉజ నానా ॥
చిత్రకూట జను అచల అహేరీ । చుకఇ న ఘాత మార ముఠభేరీ ॥ 2 ॥
అస కహి లఖన ఠాఉం దేఖరావా । థలు బిలోకి రఘుబర సుఖు పావా ॥
రమేఉ రామ మను దేవన్హ జానా । చలే సహిత సుర థపతి ప్రధానా ॥ 3 ॥
కోల కిరాత బేష సబ ఆఏ । రచే పరన తృన సదన సుహాఏ ॥
బరని న జాహిం మంజు దుఇ సాలా । ఏక లలిత లఘు ఏక బిసాలా ॥ 4 ॥

రఘునాథుడు పలికెను. "లక్ష్మణా! ఈ నదీతీరము మిక్కిలి చూడముచ్చటగా నున్నది. ఇచ్చటనే ఒకచోట మనము ఉండుటకు ఏర్పాటు చేయుము. లక్ష్మణుడు పయస్వినీ(మందాకినీ) నదికి ఉత్తర దిశయందు నాలుగువైపుల విల్లువలె ప్రవహించు కాలువగల ఒక ఎత్తైన ప్రదేశమును జూచెను. "నదియే ఈ ధనుస్సు యొక్క అల్లెత్రాడు. శమదమదానములు బాణములు. కలియుగ పాపములు దానివేటజంతువులు. చిత్రకూటపర్వతమే ఒక మొక్కవోని

వేటగాడు. ఈ ధనుస్సుతో చిత్రకూటము చాటుమాటుగా గాక ఎదురుగానుండియే వేటాడును. కొట్టికొట్టి వాటిని పారద్రోలును. దానిగురి తప్పదు" అని పలుకుచు లక్ష్మణుడు ఆ స్థలమును రామునకు చూపించెను. ఆస్థలమును గాంచి శ్రీరాముడు సంతసించెను. శ్రీరాముని మనస్సును ఆ స్థలము తృప్తి పఱచినదని తెలిసికొనిన దేవతలు తమశిల్పియైన విశ్వకర్మను తోడ్కొని అచటికి వచ్చిరి. వారందఱును కోలుల, భిల్లుల వేషములలో వచ్చి, ఆకులతో గడ్డితో రమణీయములైన కుటీరములను రెండింటిని నిర్మించిరి. వాటిలో ఒకటి చిన్నది. రెండవది పెద్దది. (చౌ॥ 1-4)

దో- లఖన జానకీ సహిత ప్రభు, రాజత రుచిర నికేత।
సోహ మదను ముని బేష జను, రతి రితురాజ సమేత॥ 133 ॥

ఆ సుందరపర్ణకుటీరములయందు శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణులతో మదనుడే మునివేషము దాల్చి, తన భార్యయైన రతీదేవితో, స్నేహితుడగు వసంతునితో గూడి ఉన్నాడా? అనునట్లు శోభాయమానుడైయుండెను. (దో॥ 133)

మాసపారాయణము-పదునేడవ విరామము

చౌ- అమర నాగ కిన్నర దిసిపాలా। చిత్రకూట ఆఏ తెహి కాలా॥
రామ ప్రనాము కీన్హ సబ కాహూ। ముదిత దేవ లహి లోచన లాహూ॥ 1 ॥
బరషి సుమన కహ దేవ సమాజూ। నాథ సనాథ భఏ హమ ఆజూ॥
కరి బినతీ దుఖ దుసహ సునాఏ। హరషిత నిజ నిజ సదన సిధాఏ॥ 2 ॥
చిత్రకూట రఘునందను ఛాఏ। సమాచార సుని సుని ముని ఆఏ॥
ఆవత దేఖి ముదిత మునిబృందా। కీన్హ దండవత రఘుకుల చందా॥ 3 ॥
ముని రఘుబరహి లాఇ ఉర లేహీం। సుఫల హోన హిత ఆసిష దేహీం॥
సియ సౌమిత్రి రామ ఛబి దేఖహిం। సాధన సకల సఫల కరి లేఖహిం॥ 4 ॥

ఒకనాడు దేవతలు, నాగులు, కిన్నరులు, దిక్పాలురు చిత్రకూటమునకు వచ్చిరి. వారికి శ్రీరాముడు ప్రణామములాచరించెను. ఆనందముతో వారిని దర్శించి దేవతలుగూడ తమనేత్ర సాఫల్యముల నొందిరి. వారు పుష్పములను గురిపించి, "ప్రభూ! సర్వరక్షకులైన మీ నీడలో మేము భద్రముగానుంటిమి. సర్వసమర్థులైన మీ రక్షణలో నుండుటచే మా గౌరవము ఇనుమడించినది. మా మనస్సులు స్తిమిత పడినవి" అని పలుకుచు, వారి కష్టములను ఏకరువు పెట్టిరి. శ్రీరాముని అనునయవాక్యములకు వారు తృప్తి చెంది, వెళ్లిపోయిరి. శ్రీరాముడు చిత్రకూటమునకు వచ్చిన వార్తను విని, పెక్కుమందిమునులు అచటికి చేరిరి. రఘువంశ చంద్రుడు ప్రసన్నచిత్తులైన ఆ మునులకు నమస్కరించెను. వారు ఆయనను గాఢాలింగములతో ఆదరించి, ఆశీర్వదించిరి. శ్రీ సీతారామ లక్ష్మణుల సౌందర్యములకు ముగ్ధులై తమ తపస్సులు ఫలించినవని భావించిరి. (చౌ॥ 1-4)

దో- జథాజోగ సనమాని ప్రభు, బిదా కిఏ మునిబృంద।
కరహిం జోగ జప జాగ తప, నిజ ఆశ్రమన్హి సుఛంద॥ 134 ॥

శ్రీరామచంద్రుడు వారిని సముచితగౌరవాదరములతో సమ్మానించి పంపెను. వారు తమఆశ్రమములకు వెళ్లి, నిరాటంకముగా తమయోగజపయజ్ఞములలో తపస్సులలో నిమగ్నులైరి. (దో॥ 134)

చౌ- యహ సుధి కోల కిరాతన్హ పాఈ । హరషే జను నవ నిధి ఘర ఆఈ ॥
కంద మూల ఫల భరి భరి దోనా । చలే రంక జను లూటన సోనా ॥ 1 ॥
తిన్హ మహఁ జిన్హ దేఖే దోఉ భ్రాతా । అపర తిన్హహి పూఁఛహిఁ మగు జాతా ॥
కహత సునత రఘుబీర నికాఈ । ఆఇ సబన్హి దేఖే రఘురాఈ ॥ 2 ॥
కరహిఁ జోహారు భేంట ధరి ఆగే । ప్రభుహి బిలోకహిఁ అతి అనురాగే ॥
చిత్ర లిఖే జను జహఁ తహఁ ఠాఢే । పులక సరీర నయన జల బాఢే ॥ 3 ॥
రామ సనేహ మగన సబ జానే । కహి ప్రియ బచన సకల సనమానే ॥
ప్రభుహి జోహారి బహోరి బహోరీ । బచన బినీత కహహిఁ కర జోరీ ॥ 4 ॥

అడవులలో నున్న కోలులు కిరాతులు ఈ సమాచారమును విని, నవనిధులు తమ ఇండ్లకు వచ్చినంతగా పొంగిపోయిరి. కందమూలఫలములను దొన్నెలలో దీసికొని, అత్యుత్సాహముతో నిర్ధనుడు బంగారు గనిని దోచుకొనుటకై పరుగులు దీసినట్లు, వారు బారులుదీర్చి, శ్రీరాముని గాంచుటకై పరుగెత్తిరి. అనగా వారు శ్రీరాముని అనుగ్రహరూపమైన బంగారమును దోచుకొనుటకై పరుగుదీసిరి. శ్రీరామలక్ష్మణులను ఇదివఱకే చూచినవారిని ఇతరులు త్రోవలో వారిని గూర్చి అడుగుచుండిరి. శ్రీరాముని అందచందములను గూర్చి మార్గమున చర్చించుకొనుచు వారందఱును వచ్చి రఘునాథుని జూచిరి. వారు తాము తెచ్చిన కానుకలను ప్రభువు ముందఱనుంచి, నమస్కరించి అతిప్రేమతో శ్రీరాముని జూడసాగిరి. ఎక్కడివారక్కడనే బొమ్మల వలె నిలిచిపోయిరి. వారి శరీరములు పులకరించెను. కన్నుల ప్రేమాశ్రువులు వరదలై పారెను. శ్రీరాముడు తనయెదుట ప్రేమమగ్నులైయున్న వారినందఱిని ప్రియవచనములతో గౌరవించెను. వారు శ్రీరామచంద్రునకు పదే పదే ప్రణమిల్లి, అంజలి ఘటించి వినయముతో పలికిరి. (చౌ॥ 1-4)

దో- అబ హమ నాథ సనాథ సబ, భఏ దేఖి ప్రభు పాయ ।
భాగ హమారేఁ ఆగమను, రాఉర కోసలరాయ ॥ 135 ॥

"ప్రభూ! మీ పాదదర్శనముతోడనే మాకుకొండంతఅండ లభించినది. మా భాగ్యవశమున మీరు ఇచటికి ఏతెంచితిరి. (దో॥ 135)

చౌ- ధన్య భూమి బన పంథ పహారా । జహఁ జహఁ నాథ పాఉ తుమ్హ ధారా ॥
ధన్య బిహగ మృగ కాననచారీ । సఫల జనమ భఏ తుమ్హహి నిహారీ ॥ 1 ॥
హమ సబ ధన్య సహిత పరివారా । దీఖ దరసు భరి నయన తుమ్హారా ॥
కీన్హ బాసు భల ఠాఉఁ బిచారీ । ఇహాఁ సకల రితు రహబ సుఖారీ ॥ 2 ॥

హమ సబ భాఁతి కరబ సెవకాఈ । కరి కేహరి అహి బాఘ బరాఈ ॥
బన బేహడ గిరి కందర ఖోహా । సబ హమార ప్రభు పగ పగ జోహా ॥ 3 ॥
తహఁ తహఁ తుమ్హహి అహేర ఖేలాఉబ । సర నిరఝర జలఠాఉఁ దెఖాఉబ ॥
హమ సేవక పరివార సమేతా । నాథ న సకుచబ ఆయసు దేతా ॥ 4 ॥

ప్రభూ! మీరు పాదముమోపినభూమి, అరణ్యములు, మార్గములు, పర్వతములు ధన్యములు. వనములలో సంచరించు పశు పక్ష్యాదులు గూడ ధన్యజీవులు. ఏలనన వాటి జన్మలు మీ దర్శనముచే సఫలములైనవి. కనుల పండువుగా మిమ్ములను దర్శించిన మేమందఱము మా కుటుంబములతో గూడ పునీతుల మైతిమి. మీరు నివసించుటకు మంచి చోటును ఎన్నుకొంటిరి. అన్ని కాలములలో (సర్వదా) ఇచట మీరు సుఖముగా ఉందురు. ఏనుగులు, సింహములు, సర్పములు, పులులు మొదలగువాటిప్రమాదములనుండి రక్షణపొందుటలో మేము తోడుగానుండి మిమ్ము సేవించుచుందుము. ఇక్కడి కీకారణ్యములను, పర్వతములను, గుహలను, లోయలను మేము అడుగడుగునను ఎఱుగుదుము. వేటాడుటకు మిమ్ము వేర్వేఱు ప్రదేశములకు తీసికొని వెళ్ళెదము. సరస్సులు, జలపాతములు మొదలగు జలాశయములను మీకు చూపగలము. మేము, మా పరివారములు మీకు సేవకులము. ప్రభూ! మమ్ములను ఆజ్ఞాపింపుడు. సంకోచింప వలదు- (చౌ॥ 1-4)

దో- బేద బచన ముని మన అగమ, తే ప్రభు కరునా ఐన ।
బచన కిరాతన్హ కే సునత, జిమి పితు బాలక బైన ॥ 136 ॥

వేదములు గూడ వర్ణింపలేని, మునుల మనస్సులకును గ్రాహ్యము గాని కరుణానిధియైన ప్రభువు వారి మాటలను తండ్రి బాలురమాటలనువలె ప్రేమతో వినెను. (దో॥ 136)

చౌ- రామహి కేవల ప్రేము పిఆరా । జాని లేఉ జో జాననిహారా ॥
రామ సకల బనచర తబ తోషే । కహి మృదు బచన ప్రేమ పరిపోషే ॥ 1 ॥
బిదా కెఏ సిర నాఇ సిధాఏ । ప్రభు గున కహత సునత ఘర ఆఏ ॥
ఏహి బిధి సియ సమేత దోఉ భాఈ । బసహిఁ బిపిన సుర ముని సుఖదాఈ ॥ 2 ॥
జబ తేఁ ఆఇ రహే రఘునాయకు । తబ తేఁ భయఉ బను మంగలదాయకు ॥
ఫూలహిఁ ఫలహిఁ బిటప బిధి నానా । మంజు బలిత బర బేలి బితానా ॥ 3 ॥
సురతరు సరిస సుభాయఁ సుహాఏ । మనహుఁ బిబుధ బన పరిహరి ఆఏ ॥
గుంజ మంజుతర మధుకర శ్రేనీ । త్రిబిధ బయారి బహఇ సుఖ దేనీ ॥ 4 ॥

"శ్రీరాముడు భక్తవత్సలుడు. అతడు భక్తులనుండి ప్రేమనే కోరుకొనును". అది తెలిసినవాడే నిజముగా తెలిసినవాడు. అప్పుడు రామచంద్రుడు వనవాసులైన కోలులను భిల్లులను ప్రేమపూర్వకవచనములతో సంతృప్తి పఱచి, వీడ్కొలిపెను. వారు శిరసా ప్రణమిల్లి, గృహోన్ముఖులై, వెళ్లుచు ప్రభు గుణములను ప్రశంసించుచు ముందునకు సాగిరి. ఈ విధముగా దేవతలకును, మునులకును సుఖదాయకులైన సోదరులు సీతాదేవితో గూడి, ఆ వనములో నివసించుచుండిరి. అది మొదలుకొని వనమంతయు మంగళప్రదమాయెను. వివిధవృక్షములు పుష్పఫల

భరితములాయెను. వాటిపై ప్రాకిన తీగెలు చక్కని లతామండపములను ఏర్పఱచెను. అవి కల్ప వృక్షములవలె సహజమనోహరములై నందనవనమునుండివచ్చినవా యనునట్లుండెను. భ్రమర శ్రేణులు మధురముగా ఝుంకారములను గావించుచుండెను. శీతల మంద సుగంధ పవనములు వీచుచుండెను. (చౌ॥ 1-4)

దో- నీలకంఠ కలకంఠ సుక, చాతక చక్క చకోర ।
భాఁతి భాఁతి బోలహిఁ బిహగ, శ్రవన సుఖద చిత చోర ॥ 137 ॥

నీలకంఠములు, (మయూరములు) కోయిలలు, చిలుకలు, గోరువంకలు, చక్రవాకములు, చకోరములు, మున్నగు వివిధములైన పక్షులు మనోహరములైన తమపలుకులతో వీనులవిందుగావించుచుండెను. (దో॥ 137)

చౌ- కరి కేహరి కపి కోల కురంగా । బిగతబైర బిచరహిఁ సబ సంగా ॥
ఫిరత అహేర రామ ఛబి దేఖీ । హోహిఁ ముదిత మృగబృంద బిసేషీ ॥ 1 ॥
బిబుధ బిపిన జహఁ లగి జగ మాహీఁ । దేఖి రామబను సకల సిహాహీఁ ॥
సురసరి సరసఇ దినకర కన్యా । మేకలసుతా గోదావరి ధన్యా ॥ 2 ॥
సబ సర సింధు నదీఁ నద నానా । మందాకిని కర కరహిఁ బఖానా ॥
ఉదయ అస్త గిరి అరు కైలాసూ । మందర మేరు సకల సురబాసూ ॥ 3 ॥
సైల హిమాచల ఆదిక జేతే । చిత్రకూట జసు గావహిఁ తేతే ॥
బింధి ముదిత మన సుఖు న సమాఈ । శ్రమ బిను బిపుల బడాఈ పాఈ ॥ 4 ॥

ఏనుగులు, సింహములు, వానరములు, అడవిపందులు, జింకలు మొదలగు జంతువులన్నియు తమతమ సహజవైరములను వదలి, మైత్రితో మసలుచుండెను. వనమున తిరుగుచున్న శ్రీరామచంద్రుని గాంచి, జంతువులన్నియును ఆనందించుచుండెను. విశ్వము నందలి దివ్య వనములన్నియును శ్రీరామవనమును జూచి, కొనియాడుచుండెను. గంగ యమున సరస్వతి నర్మద గోదావరి మొదలగు పుణ్య నదులును, సమస్త సరోవరములును, సముద్రములును, ఇతర నదీనదములును మందాకినిని ప్రస్తుతించుచుండెను. ఉదయాచలము, అస్తాచలము, కైలాసము, మేరువు, మందరాచలము మున్నగు దేవతానివాసస్థానములు, హిమాలయము మొదలగు పర్వతములు రామ నివాసమైన చిత్ర కూటమును పొగడుచుండెను. వింధ్యాచలము మిక్కిలి ప్రసన్నమై యుండెను. దాని యానందమునకు అవధి లేకుండెను. అనాయాసముగా దాని గౌరవము ఇనుమడించెను. (చౌ॥ 1-4)

దో- చిత్రకూట కే బిహగ మృగ, బేలి బిటప తృన జాతి ।
పున్య పుంజ సబ ధన్య అస, కహహిఁ దేవ దిన రాతి ॥ 138 ॥

చిత్రకూటము నందలి పశుపక్ష్యాదులు, లతా వృక్షములు, తృణములు, అంకురములు మొదలగునవి అన్నియును పుణ్యరాసులు- అని దేవతలు అహర్నిశలు కొనియాడుచుండిరి. (దో॥ 138)

చౌ- నయనవంత రఘుబరహి బిలోకీ । పాఇ జనమ ఫల హోహిఁ బిసోకీ ॥
పరసి చరన రజ అచర సుఖారీ । భఏ పరమ పద కే అధికారీ ॥ 1 ॥
సో బను సైలు సుభాయఁ సుహావన । మంగలమయ అతి పావన పావన ॥
మహిమా కహిఅ కవని బిధి తాసూ । సుఖసాగర జహఁ కీన్హ నివాసూ ॥ 2 ॥

పయ పయోధి తజి అవధ బిహాఈ । జహఁ సియ లఖను రాము రహే ఆఈ ॥
కహి న సకహిఁ సుషమా జసి కానన । జౌఁ సత సహస హోహిఁ సహసానన ॥ 3 ॥
సో మైఁ బరని కహౌఁ బిధి కేహీఁ । డాబర కమఠ కి మందర లేహీఁ ॥
సేవహిఁ లఖను కరమ మన బానీ । జాఇ న సీలు సనేహు బఖానీ ॥ 4 ॥

సకల ప్రాణులు శ్రీరాముని దర్శించి, కన్నులున్నందులకు తమ జన్మలు సఫలములైనవని భావించి, ఆనందించినవి. జడములైన గిరులు, తరులు, భూమి, నదులు మొదలగునవి భగవంతునిపాదధూళిని స్పృశించి, సుఖించినవి. ఈ విధముగ చరాచరములన్నియును పరమ పదప్రాప్తికి అర్హతను సంపాదించినవి. ఆ వనము, పర్వతము మిక్కిలి మనోజ్ఞములు, మంగళ ప్రదములు, అవి పవిత్రములైన వానినిగూడ అత్యంత పవిత్రములుగా జేయునవి. సుఖ సాగరుడైన శ్రీరామునకు నివాసస్థానమగు చిత్రకూటమును వర్ణించుటకు ఎవరికి తరము? లోక కల్యాణార్థమై క్షీరసాగరమును వదలి, అయోధ్యను గూడ విడిన శ్రీరాముడు సీతాలక్ష్మణ సమేతుడై నివసించుచున్న ఆ వనశోభావైభవములను వేయితలలుగలశేషులు లక్షమందియైనను వర్ణింపజాలరు. ఇక దానిని వర్ణింప నేనెంతవాడను? చిన్న సరస్సులో ఉన్న తాబేలు మందరపర్వతమును ఎత్తగలదా? లక్ష్మణుడు మనోవాక్కాయ కర్మలచే అనవరతము శ్రీరాముని సేవలు చేయుచుండెను. అతని స్నేహశీలములు వర్ణనాతీతములు. (చౌ॥ 1-4)

దో- ఛిను ఛిను లఖి సియ రామ పద, జాని ఆపు పర నేహు ।
కరత న సపనేహుఁ లఖను చితు, బంధు మాతు పితు గేహు ॥ 139 ॥

శ్రీసీతారాముల పాదములను అనుక్షణము దర్శించుచు, వారికి తనపైగల వాత్సల్యమును తెలిసికొని, లక్ష్మణుడు స్వప్నములోగూడ తనసోదరులను, తల్లిదండ్రులను, ఇంటిని, బంధువులను స్మరింపకుండెను. (దో॥ 139)

చౌ- రామ సంగ సియ రహతి సుఖారీ । పుర పరిజన గృహ సురతి బిసారీ ॥
ఛిను ఛిను పియ బిధు బదను నిహారీ । ప్రముదిత మనహుఁ చకోరకుమారీ ॥ 1 ॥
నాహ నేహు నిత బఢత బిలోకీ । హరషిత రహతి దివస జిమి కోకీ ॥
సియ మను రామ చరన అనురాగా । అవధ సహస సమ బను ప్రియ లాగా ॥ 2 ॥
పరనకుటీ ప్రియ ప్రియతమ సంగా । ప్రియ పరివారు కురంగ బిహంగా ॥
సాసు ససుర సమ మునితియ మునిబర । అసను అమిఅ సమ కంద మూల ఫర ॥ 3 ॥
నాథ సాథ సాఁథరీ సుహాఈ । మయన సయన సయ సమ సుఖదాఈ ॥
లోకప హోహిఁ బిలోకత జాసూ । తేహి కి మోహి సక బిషయ బిలాసూ ॥ 4 ॥

అయోధ్యను, తనకుటుంబసభ్యులను, ఇంటినిగూడ మఱచి, సీతాదేవి తన పతియైన శ్రీరామునితో సంతోషముగా నుండెను. అనుక్షణము ఆమె చకోరము చంద్రుని జూచినట్లు తన పతిని జూచుచు

ఆనందించుచుండెను. తనపై పతిప్రేమగూడ నిత్యము పెఱుగుచుండుట జూచి, పగటిపూట చక్రవాకమువలె ప్రసన్నురాలగుచుండెను. సీతాదేవి మనస్సు శ్రీరామచంద్రుని పాదపద్మములపైననే మిక్కిలి మక్కువ గలిగియుండెను. ఆ వనము ఆమెకు వేయి అయోధ్యలను మించి ప్రీతి గొల్పుచుండెను. తన ప్రియునితో గూడి నివసించుచుండుటచే ఆ పర్ణకుటీరముగూడ ఆమెకు మిక్కిలి ఆనందదాయకముగానుండెను. మృగములు, పక్షులు, కుటుంబ పరివారములాయెను. మునిపత్నులు అత్తగార్లవలెను, మునీశ్వరులు మామగార్ల వలెను ఆమెపై వాత్సల్యమును ప్రకటించుచుండిరి. కందమూలఫలములు అమృతతుల్యములైయుండెను. తనస్వామితోగూడి శయనించిన కుశపత్రములశయ్యగూడ మన్మథునిమాఱుపాన్పులతో సమానముగా హాయిని గొల్పుచుండెను. సకల వైభవములకును కుదురైన లక్ష్మీ(సీతా)దేవి దర్శనమాత్రమున జీవులు లోకపాలురగుచుండగా ఆమెను భోగవిలాస వస్తువులు మోహింపజేయునా? (చౌ॥ 1-4)

దో- సుమిరత రామహి తజహిఁ జన, తృన సమ బిషయ బిలాసు।
రామప్రియా జగ జనని సియ, కఛు న ఆచరజు తాసు ॥ **140** ॥

రామచంద్రునిస్మరణానందమును అనుభవించు భక్తులకు భోగవిలాసములు తృణప్రాయములు. అట్టి శ్రీరామచంద్రునిప్రియపత్నియు, జగన్మాతయు ఐన సీతాదేవి భోగవిలాసములను త్యాగము చేయుట ఏమాత్రమూ ఆశ్చర్యకరమైన విషయముగాదు (దో॥ 140)

చౌ- సీయ లఖన జేహి బిధి సుఖు లహహీఁ । సోఇ రఘునాథ కరహిఁ సోఇ కహహీఁ ॥
కహహిఁ పురాతన కథా కహానీ । సునహిఁ లఖను సియ అతి సుఖు మానీ ॥ **1** ॥
జబ జబ రాము అవధ సుధి కరహీఁ । తబ తబ బారి బిలోచన భరహీఁ ॥
సుమిరి మాతు పితు పరిజన భాఈ । భరత సనేహు సీలు సెవకాఈ ॥ **2** ॥
కృపాసింధు ప్రభు హోహిఁ దుఖారీ । ధీరజు ధరహిఁ కుసమఉ బిచారీ ॥
లఖి సియ లఖను బికల హోఇ జాహీఁ । జిమి పురుషహి అనుసర పరిఛాహీఁ ॥ **3** ॥
ప్రియా బంధు గతి లఖి రఘునందను । ధీర కృపాల భగత ఉర చందను ॥
లగే కహన కఛు కథా పునీతా । సుని సుఖు లహహిఁ లఖను అరు సీతా ॥ **4** ॥

శ్రీరాముడు నిరంతరము సీతాలక్ష్మణులు సంతోషముగా ఉండునట్లుచేయు చుండెను. ఆయన పౌరాణికకథలను ఉపాఖ్యానములను చెప్పుచుండగా వారు వాటిని మిక్కిలి శ్రద్ధగా విని ఆనందించుచుండిరి. అయోధ్యనుగూర్చి ఆలోచనలు వచ్చినప్పుడు శ్రీరామునికన్నులు చెమ్మగిల్లుచుండెను. తనతల్లిదండ్రులను, కుటుంబసభ్యులను, సోదరులను, భరతునిస్నేహసౌశీల్యసేవాభావములను తలంచుకొనినప్పుడు దయాళువైన శ్రీరాముడు దుఃఖితుడగుచుండెను. కాని అందులకు అది తగినసమయము గాదని తలచి, ధైర్యము వహించుచుండెను. శ్రీరాముడు దుఃఖితుడగుటను చూచినప్పుడు సీతా లక్ష్మణులును కలవరపడుచుండిరి. మనుష్యుని నీడ అతనినే అనుసరించును గదా! ధీరుడు, దయాళువు, భక్తులహృదయములను చందనమువలె చల్లబఱచువాడును ఐన శ్రీరామచంద్రుడు పత్నియైన సీతాదేవిదశను, సోదరుడైన లక్ష్మణుని స్థితినిచూచి, ధార్మిక కథలను చెప్పుచుండెను. వాటిని విని, వారు సుఖమును పొందుచుండిరి. (చౌ॥ 1-4)

దో- రాము లఖన సీతా సహిత, సోహత పరన నికేత।
జిమి బాసవ బస అమరపుర, సచీ జయంత సమేత ॥ 141 ॥

అమరావతీనగరమున ఇంద్రుడు తనభార్యయైన శచీదేవితో కుమారుడైన జయంతునితో శోభిల్లునట్లు శ్రీరాముడు ఆ పర్ణకుటీరములో సీతాలక్ష్మణులతో సుశోభితుడై యుండెను. (దో॥ 141)

చౌ- జోగవహిఁ ప్రభు సియ లఖనహిఁ కైసేఁ । పలక బిలోచన గోలక జైసేఁ ॥
సేవహిఁ లఖను సీయ రఘుబీరహి । జిమి అబిబేకీ పురుష సరీరహి ॥ 1 ॥
ఏహి బిధి ప్రభు బన బసహిఁ సుఖారీ । ఖగ మృగ సుర తాపస హితకారీ ॥
కహేఉఁ రామ బన గవను సుహావా । సునహు సుమంత్ర అవధ జిమి ఆవా ॥ 2 ॥

కనురెప్పలు కన్నులను కాపాడుచుండునట్లు శ్రీ సీతారాములు లక్ష్మణుని పరిరక్షించు చుండిరి. అట్లే సామాన్య మానవుడు తనశరీరమునువలె లక్ష్మణుడు సీతారాములను నిరంతరము సేవించుచుండెను. ఈ విధముగా పక్షులకును, మృగములకును, దేవతలకును తాపసులకును హితకారియైన శ్రీరామచంద్రప్రభువు వనమునందు సుఖముగా నివసించుచుండెను. (తులసీదాసు చెప్పుచున్నాడు) నేనింత వఱకును మనోహరమైన రామవనగమనకథలను తెల్పితిని. సుమంత్రుడు అయోధ్యకు చేరినవిధమును వినుడు.[1] (చౌ॥ 1-2)

## అయోధ్యకు సుమంత్రుని ఆగమనము

చౌ- ఫిరేఉ నిషాదు ప్రభుహి పహుఁచాఈ । సచివ సహిత రథ దేఖేసి ఆఈ ॥
మంత్రీ బికల బిలోకి నిషాదూ । కహి న జాఇ జస భయఉ బిషాదూ ॥ 3 ॥
రామ రామ సియ లఖన పుకారీ । పరేఉ ధరనితల బ్యాకుల భారీ ॥
దేఖి దఖిన దిసి హయ హిహినాహీఁ । జను బిను పంఖ బిహగ అకులాహీఁ ॥ 4 ॥

శ్రీరామచంద్రునినుండి సెలవుదీసికొని, నిషాదరాజు గృహోన్ముఖుడై తిరిగి వచ్చుచు శృంగబేరపురము కడ గంగాతీరమున సుమంత్రుని, ఆతని రథమును గుఱ్ఱములను జూచెను. వ్యాకులుడైన మంత్రిని జూచి, గుహుడు మిక్కిలి పరితపించెను. (నిషాదరాజు ఒంటరిగా వచ్చుటను జూచి) సుమంత్రుడు "హా రామా! హా సీతా! హా లక్ష్మణా!" అని రోదించుచు వ్యాకులత చెంది, నేలపై బడిపోయెను. రథమునకు గట్టిన గుఱ్ఱములు (రాముడు వెళ్లిన) దక్షిణ దిశకు మఱలి సకిలించు చుండెను. వాటిస్థితి ఱెక్కలు విఱిగిన పక్షులవలె నుండెను. (చౌ॥ 3-4)

1. శ్రీ సీతారామలక్ష్మణులు వాల్మీకి ఆశ్రమమునకు చేరకముందే యమునానదీ తీరమునుండి శ్రీరాముడు గుహుని శృంగబేరమునకు పంపివైచెను. (ఈ ప్రస్తావన 111వ దోహాలో గలదు) అంతవఱకును సీతారామ లక్ష్మణులు అయోధ్యకు మఱలివత్తురని భావించుచు వారి రాకకై సుమంత్రుడు శృంగబేరపురముకడ గంగాతీరమున నిరీక్షించు చుండెను. గుహుడు ఒక్కడే తిరిగి వచ్చుటచూచి అతడు నిరాశపడెను.

దో- నహిఁ తృన చరహిఁ న పిఅహిఁ జలు, మోచహిఁ లోచన బారి ।
బ్యాకుల భఏ నిషాద సబ, రఘుబర బాజి నిహారి ॥ 142 ॥

ఆ గుఱ్ఱములు గడ్డిని మేయుటలేదు. నీరు త్రాగుటయు లేదు. దిగులుతో కన్నీరు కార్చుచున్నవి. వాటిని జూచి నిషాదులందఱును కలత చెందిరి. (దో॥ 142)

చౌ- ధరి ధీరజు తబ కహఇ నిషాదూ । అబ సుమంత్ర పరిహరహు బిషాదూ ॥
తుమ్హ పండిత పరమారథ గ్యాతా । ధరహు ధీర లఖి బిముఖ బిధాతా ॥ 1 ॥
బిబిధ కథా కహి కహి మృదు బానీ । రథ బైఠారెఉ బరబస ఆనీ ॥
సోక సిథిల రథు సకఇ న హాఁకీ । రఘుబర బిరహ పీర ఉర బాఁకీ ॥ 2 ॥
చరఫరాహిఁ మగ చలహిఁ న ఘోరే । బన మృగ మనహుఁ ఆని రథ జోరే ॥
అఢుకి పరహిఁ ఫిరి హేరహిఁ పీఛేఁ । రామ బియోగ బికల దుఖ తీఛేఁ ॥ 3 ॥
జో కహ రాము లఖను బైదేహీ । హిఁకరి హిఁకరి హిత హేరహిఁ తేహీ ॥
బాజి బిరహ గతి కహి కిమి జాతీ । బిను మని ఫనిక బికల జేహి భాఁతీ ॥ 4 ॥

ధైర్యము వహించి, నిషాదరాజు ఇట్లు పలికెను. "సుమంత్రా! విషాదమును మానుడు. మీరు జ్ఞానులు, పరమార్థమును ఎఱిగినవారు. విధాత ప్రతికూలుడని తెలిసికొని, ధైర్యమును వూనుడు." మృదుమధురముగా పెక్కుకథలను వినిపించి, ఓదార్చి, గుహుడు ఎట్టకేలకు సుమంత్రుని రథమునెక్కించెను. కాని మంత్రి శోకవిహ్వలుడగుటచే రథమును నడుపలేక పోయెను. శ్రీరామునివిరహమువలన అతనిమనస్సు మిక్కిలి బాధపడుచుండెను. రామవియోగ దుఃఖమున గుఱ్ఱములు మార్గమున సరిగా నడువ జాలకుండెను. వాటి అడుగులు తడబడు చుండెను. లాగుటకు అలవాటులేని అడవిజంతువులను దెచ్చి రథమునకు కట్టినట్లుండెను. అవి తట్టుకొని క్రిందపడుచుండెను. పదే పదే వెనుదిరిగి చూచుచుండెను. రామ వియోగముచే అవి మిక్కిలి దుఃఖపడుచుండెను. ఎవ్వరైనను సీతారామలక్ష్మణుల నామములను ఉచ్చరించినచో అవి వారి వైపు తిరిగి, సకిలించుచు ప్రేమతో చూచుచుండెను. వాటివిరహవ్యాకులస్థితి మణిరహిత సర్పమువలెనుండెను. (చౌ॥ 1-4)

దో- భయఉ నిషాదు బిషాదబస, దేఖత సచివ తురంగ ।
బోలి సుసేవక చారి తబ, దిఏ సారథీ సంగ ॥ 143 ॥

మంత్రిని గుఱ్ఱములను గాంచి, నిషాదరాజుగూడ విషాదమునకు లోనయ్యెను. అతడు తనకు విశ్వాసపాత్రులైన నలుగురు సేవకులను సుమంత్రునితో పంపెను. (దో॥ 143)

చౌ- గుహ సారథిహి ఫిరెఉ పహుఁచాఈ । బిరహు బిషాదు బరని నహిఁ జాఈ ॥
చలే అవధ లేఇ రథహి నిషాదా । హోహిఁ ఛనహిఁ ఛన మగన బిషాదా ॥ 1 ॥

సోచ సుమంత్ర బికల దుఖ దీనా । ధిగ జీవన రఘుబీర బిహీనా ॥
రహిహి న అంతహుఁ అధమ సరీరూ । జసు న లహేఉ బిఛురత రఘుబీరూ ॥ 2 ॥
భఏ అజస అఘ భాజన ప్రానా । కవన హేతు నహిఁ కరత పయానా ॥
అహహ మంద మను అవసర చూకా । అజహుఁ న హృదయ హోత దుఇ టూకా ॥ 3 ॥
మీజి హాథ సిరు ధుని పఛితాఈ । మనహుఁ కృపన ధన రాసి గవాఁఈ ॥
బిరిద బాఁధి బర బీరు కహాఈ । చలేఉ సమర జను సుభట పరాఈ ॥ 4 ॥

సుమంత్రునకు తోడుగా కొంతదూరము వెళ్లి, పిమ్మట ఆయునను వీడ్కొని, నిషాదరాజైన గుహుడు తనయింటికి మఱలెను. అతని విరహమును దుఃఖమును వర్ణించుటకు మాటలు చాలవు. నలుగురు నిషాదులును మంత్రి వెంట అయోధ్యకు పోవుచుండిరి. దీనావస్థకు లోనైన సుమంత్రుని, గుఱ్ఱములను జూచి, వారు అనుక్షణము శోకమగ్నులగుచుండిరి. వ్యాకులుడైన సుమంత్రుడు ఇట్లు ఆలోచించెను. "శ్రీ రఘువీరుడు లేకుండ నా జీవితము వ్యర్థము. ఈ తుచ్ఛ శరీరము ఏ విధముగను శాశ్వతము గాదు. శ్రీరాముడు వనములకు వెళ్లినంతనే ఈ శరీరము నశించియున్నచో కీర్తియైనను దక్కెడిది. నా ప్రాణములు అపయశమునకును, పాపములకును భాండములైనవి. ఇవి ఈ దేహమును ఏల వదలి పోలేకయున్నవి? ఓ మూఢమనసా! చక్కని సదవకాశమును నీవు కోల్పోయినావు. ఇప్పటికిని నా హృదయము ఏల ముక్కలు ముక్కలు గాలేదు?" చేతులునలుపుకొనుచు, తలబాదుకొనుచు, తన ధనమును కోల్పోయిన లోభివలె అతడు పశ్చాత్తాపపడసాగెను. ఉత్తమవీరుడనిపించుకొన్నవాడు వీరవేషముతో తలపాగా చుట్టి విజయాభిమానముతో రణరంగమునకు పోయి, మూలధనమునుకూడా కోల్పోయి, పాఱివచ్చినవానివలె అతడు ఇంటి ముఖము పట్టెను. (చౌ॥ 1-4)

దో- బిప్ర బిబేకీ బేదబిద, సమ్మత సాధు సుజాతి ।
జిమి ధోఖేఁ మదపాన కర, సచివ సోచ తెహి భాఁతి ॥ 144 ॥

ఒక వివేకవంతుడు, వేదవిదుడు, సదాచారనిరతుడు, ఐన ఉత్తమ బ్రాహ్మణుడు ప్రమాద వశమున సురాపానము చేసి, పశ్చాత్తప్తుడగుచున్నవానివలె సుమంత్రుడు శోకించుచు బాధపడుచుండెను. (దో॥ 144)

చౌ- జిమి కులీన తియ సాధు సయానీ । పతిదేవతా కరమ మన బానీ ॥
రహై కరమ బస పరిహరి నాహూ । సచివ హృదయఁ తిమి దారున దాహూ ॥ 1 ॥
లోచన సజల డీఠి భఇ థోరీ । సునఇ న శ్రవన బికల మతి భోరీ ॥
సూఖహిఁ అధరఁ లాగి ముఁహ లాటీ । జిఉ న జాఇ ఉర అవధి కపాటీ ॥ 2 ॥
బిబరన భయఉ న జాఇ నిహారీ । మారేసి మనహుఁ పితా మహతారీ ॥
హాని గలాని బిపుల మన బ్యాపీ । జమపుర పంథ సోచ జిమి పాపీ ॥ 3 ॥
బచను న ఆవ హృదయఁ పఛితాఈ । అవధ కాహ మైఁ దేఖబ జాఈ ॥
రామ రహిత రథ దేఖిహి జోఈ । సకుచిహి మోహి బిలోకత సోఈ ॥ 4 ॥

చతురురాలు, కులీనయైన సాధ్వి, మనోవాక్కాయ కర్మలచే పతిని దైవముగా ఆరాధించు ఒక స్త్రీ విధివశమున తనభర్తకు దూరమైనచో ఎట్లు హృదయపరితాపము నొందునో ఆ విధముగా సుమంత్రుడు దుఃఖించుచుండెను. నేత్రములు అశ్రుపూరితములాయెను. దృష్టి మందగించెను. చెవులకు ఏమియు వినబడకుండెను. వ్యాకులితమైన బుద్ధి నిలకడగా లేకుండెను. పెదవులు ఎండిపోయెను. నోరు పిడచగట్టుకొని పోయెను. ఐనను అతని ప్రాణములు మాత్రము పోకుండెను. ఏలనన పదునాలుగు సంవత్సరముల వనవాసానంతరము శ్రీరాముడు తిరిగి వచ్చునని 'ఆశ' అతని హృదయములో మిగిలియుండెను. ఈ 'ఆశ' యనెడి కవాటమే అతని ప్రాణములను నిలిపెను. సుమంత్రునిముఖము చూచుటకు వీలులేనంతగా వివర్ణమై యుండెను. పశ్చాత్తాపమునకు లోనైన మాతాపితృహంతకునివలె ఆయనహృదయము గగ్గోలు పడుచుండెను. మహాపాపి యమపురికి(నరకమునకు) పోవుచు దారిలో ఆలోచించుచున్నట్లు ఆయనమనస్సు శ్రీరామవియోగమున విచారగ్రస్తమై యుండెను. అతని నోట మాటరాకుండెను. "అయోధ్యకు వెళ్లి నేను చూడవలసినదేమి? శ్రీరామచంద్రుడు లేని రథమును జూచి, ఎవ్వరును నా ముఖమునే చూడరు. (చౌ॥ 1-4)

**దో- ధాఇ పూఁఛిహహిఁ మోహి జబ, బికల నగర నర నారి।**
**ఉతరు దేబ మైఁ సబహి తబ, హృదయఁ బజ్రు బైఠారి॥ 145 ॥**

నగరములోని వికలురైన ప్రజలు పరుగెత్తుకొని వచ్చి అడిగినప్పుడు నేను నా గుండెను బాయి చేసికొని, వారిని సమాధాన పఱచవలెను. (దో॥ 145)

చౌ- పుఛిహహిఁ దీన దుఖిత సబ మాతా। కహాబ కాహ మైఁ తిన్హహి బిధాతా॥
పూఛిహి జబహిఁ లఖన మహతారీ। కహిహఉఁ కవన సఁదేస సుఖారీ॥ 1 ॥
రామ జనని జబ ఆఇహి ధాఈ। సుమిరి బచ్ఛు జిమి ధేను లవాఈ॥
పూఁఛత ఉతరు దేబ మైఁ తేహీ। గే బను రామ లఖను బైదేహీ॥ 2 ॥
జోఇ పూఁఛిహి తెహి ఊతరు దేబా। జాఇ అవధ అబ యహు సుఖు లేబా॥
పూఁఛిహి జబహిఁ రాఉ దుఖ దీనా। జివను జాసు రఘునాథ అధీనా॥ 3 ॥
దేహఉఁ ఉతరు కౌను ముహు లాఈ। ఆయఉఁ కుసల కుఅఁర పహుఁచాఈ॥
సునత లఖన సియ రామ సఁదేసూ। తృన జిమి తను పరిహరిహి నరేసూ॥ 4 ॥

ఓ విధాతా! దీనవదనలై దుఃఖితలైన తల్లులు అడిగినప్పుడు నేనేమి చెప్పవలెను? లక్ష్మణుని తల్లి నన్నడిగినచో ఆమెకు ఏ సంతోషవార్తను తెల్పవలెను? అప్పుడే ప్రసవించిన గోవు తన దూడనుగూర్చి ఆలోచించుచు పరుగెత్తునట్లు కౌసల్యదేవి శ్రీరామచంద్రునిగూర్చి ఆలోచించుచు పరుగు పరుగున వచ్చినచో ఆమెకు నా సమాధాన మేమి? శ్రీరాముడు, సీతాదేవి, లక్ష్మణుడు వనములకేగిరి." అని మాత్రమే చెప్పవలసి వచ్చును. ఎవ్వరడిగినను ఈ సమాధానమునే ఇయ్యవలసివచ్చును. అయ్యో! అయోధ్యకు వెళ్లి, నేనుపొందెడిసుఖము ఇది? శోక విహ్వలుడైన దశరథమహారాజు తనపంచప్రాణములను శ్రీరామునిపైననే నిలుపుకొని, నన్నడిగినచో నేను ఏ మొగము పెట్టుకొని సమాధానమును ఇయ్యవలెను? "రాజకుమారులను అడవులలో భద్రముగా వదలి వచ్చినాను." అని సీతారామ లక్ష్మణులను గూర్చి వినుచుండగనే ఆ దశరథ మహారాజు గారి ప్రాణములు వెంటనే అనంతాకాశములో కలిసి పోవును. ఇంతమందిని కష్టపెట్టి ఇంకను బ్రతికి, నేను ఏమి బావుకొందును? (చౌ॥ 1-4)

దో- హృదఉ న బిదరెఉ పంక జిమి, బిఛురత ప్రీతము నీరు ।
జానత హౌं మెహి దీన్హ బిధి, యహు జాతనా సరీరు ॥ 146 ॥

నీరులేక ఎండిపోయిననేల నెఱ్ఱెలతో బీటలువాఱినట్లు ప్రియతముడైన శ్రీరాముని విరహముచే నాహృదయము బ్రద్దలు కావలసినది. కాని అట్లు కాలేదు. ప్రాణములు పోలేదు. జీవులకు మరణానంతరము ప్రాప్తించు యాతనా శరీరమును విధాత నాకు ఇప్పుడే ఇచ్చినాడని అనిపించుచున్నది. (దో॥ 146)

చౌ- ఏహి బిధి కరత పంథ పఛితావా । తమసా తీర తురత రథు ఆవా ॥
బిదా కిఏ కరి బినయ నిషాదా । ఫిరే పాయం పరి బికల బిషాదా ॥ 1 ॥
పైఠత నగర సచివ సకుచాఈ । జను మారెసి గుర బాంభన గాఈ ॥
బైఠి బిటప తర దివసు గవాంవా । సాంఝ సమయ తబ అవసరు పావా ॥ 2 ॥
అవధ ప్రబేసు కీన్హ అంధిఆరేం । పైఠ భవన రథు రాఖి దుఆరేం ॥
జిన్హ జిన్హ సమాచార సుని పాఏ । భూప ద్వార రథు దేఖన ఆఏ ॥ 3 ॥
రథు పహిచాని బికల లఖి ఘోరే । గరహిం గాత జిమి ఆతప ఓరే ॥
నగర నారి నర బ్యాకుల కైసేం । నిఘటత నీర మీనగన జైసేం ॥ 4 ॥

సుమంత్రుడు ఈ విధముగా పరితపించుచుండగనే తమసానదీ తీరమునకు జేరెను. అతడు తనవెంట వచ్చిన నిషాదులను ప్రార్థనాపూర్వకముగా వీడ్కొలిపెను. వారు వ్యాకుల చిత్తులై సుమంత్రుని పాదములకు మ్రొక్కి, ఎట్టకేలకు గృహోన్ముఖులైరి. గోబ్రాహ్మణ గురువులను హత్య చేసిన వానివలె వెలవెలబోవుచు మంత్రి అయోధ్యా నగరమును సమీపించెను. ఒక చెట్టు క్రింద గూర్చొని దినమంతయు గడిపెను. సంధ్యాకాలమున చీకటి పడగానే నగరమున ప్రవేశించెను. సుమంత్రునిరాకను గూర్చి తెలియగనే జనులు రథమును జూచుటకు రాజద్వారమునొద్దకు వచ్చిరి. రథమును గుర్తించి, గుఱ్ఱముల దైన్యస్థితిని జూచిరి. వ్యాకులమైన శ్వేతహయములశరీరములు సూర్యాతపమున కఱిగిపోవుచున్న వడగండ్లవలె తోచెను. ఆ నగరపౌరులుగూడ ఎండిపోవుచున్న చెఱువులోని చేపలవలె వ్యాకుల చిత్తులైరి. (చౌ॥ 1-4)

## సుమంత్రుడు ఓదార్చుట-పుత్ర శోకముతో దశరథుడు స్వర్గస్థుడగుట

దో- సచివ ఆగమను సునత సబు, బికల భయఉ రనివాసు ।
భవను భయంకరు లాగ తెహి, మానహుం ప్రేత నివాసు ॥ 147 ॥

ఒంటరిగా వచ్చిన మంత్రిని జూచి రాణివాసమంతయును శోకాకులమయ్యెను. రాజ భవనము ఆయనకు నిర్జీవమై ప్రేతభూమిగా కన్పట్టెను. (దో॥ 147)

చౌ- అతి ఆరతి సబ పూఁఛహిఁ రానీ । ఉతరు న ఆవ బికల భఇ బానీ ॥
సునఇ న శ్రవన నయన నహిఁ సూఝా । కహహు కహాఁ నృపు తెహి తెహి బూఝా ॥ 1 ॥
దాసిన్హ దీఖ సచివ బికలాఈ । కౌసల్యా గృహఁ గఈఁ లవాఈ ॥
జాఇ సుమంత్ర దీఖ కస రాజా । అమిఅ రహిత జను చందు బిరాజా ॥ 2 ॥
ఆసన సయన బిభూషన హీనా । పరెఉ భూమితల నిపట మలీనా ॥
లేఇ ఉసాసు సోచ ఎహి భాఁతీ । సురపుర తేఁ జను ఖఁసెఉ జజాతీ ॥ 3 ॥
లేత సోచ భరి ఛిను ఛిను ఛాతీ । జను జరి పంఖ పరెఉ సంపాతీ ॥
రామ రామ కహ రామ సనేహీ । పుని కహ రామ లఖన బైదేహీ ॥ 4 ॥

మిక్కిలి దుఃఖముతో రాణులు అతనిని ప్రశ్నించిరి. కాని సుమంత్రుడు ప్రత్యుత్తరము నీయలేక పోయెను. అతనిగొంతు మూగవోయెను. చెవులు వినబడుట లేదు. కన్నులు కనబడుట లేదు. కలిసినవారినందఱిని "రాజుగారెక్కడ? రాజుగారెక్కడ?" అనియడుగుచుండెను.. మంత్రిగారి వ్యాకులపాటును గమనించిన దాసీలు ఆయనను కౌసల్యాదేవిమందిరమునకు తీసికొని వెళ్లిరి. అక్కడ కళావిహీనుడైన చంద్రుని వలె పడియున్న మహారాజును అతడు చూచెను సింహాసనమును శయ్యను ఆభరణములను త్యజించి, ఆతడు అతిదీనావస్థలో నేలపై పడియుండెను. దీర్ఘనిశ్వాసములను విడుచుచు 'యయాతి'యే స్వర్గమునుండి క్రింద పడియున్నాడా? అనునట్లు చింతామగ్నుడై యుండెను. హృదయము విచారముచే వికలముకాగా గృధ్రరాజైన సంపాతి ఱెక్కలు కాలిపోగా నేలపైబడినట్లు రాజు వెక్కివెక్కి ఏడ్చుచు పడియుండెను. "ఓ రామ! రామా! సీతా! లక్ష్మణా! అని మాటిమాటికి అనుచు రోదించు చుండెను. (చౌ॥ 1-4)

దో- దేఖి సచివఁ జయ జీవ కహి, కీన్హెఉ దండ ప్రనాము ।
సునత ఉఠెఉ బ్యాకుల నృపతి, కహు సుమంత్ర కహఁ రాము ॥ 148 ॥

సుమంత్రుడు రాజును జూచి, 'మహారాజునకు జయము జయము' అనియనుచు ప్రణమిల్లెను. ఇది వినగానే రాజు వ్యాకులుడై కూర్చొని, "సుమంత్రా! రాముడెచ్చటనున్నాడో చెప్పుము" అనిపలికెను. (దో॥ 148)

చౌ- భూప సుమంత్రు లీన్హ ఉర లాఈ । బూడత కఛు అధార జను పాఈ ॥
సహిత సనేహ నికట బైఠారీ । పూఁఛత రాఉ నయన భరి బారీ ॥ 1 ॥
రామ కుసల కహు సఖా సనేహీ । కహఁ రఘునాథు లఖను బైదేహీ ॥
ఆనే ఫేరి కి బనహి సిధాఏ । సునత సచివ లోచన జల ఛాఏ ॥ 2 ॥
సోక బికల పుని పూఁఛ నరేసూ । కహు సియ రామ లఖన సందేసూ ॥
రామ రూప గున సీల సుభాఊ । సుమిరి సుమిరి ఉర సోచత రాఊ ॥ 3 ॥

రాఉ సునాఇ దీన్హ బనబాసూ । సుని మన భయఉ న హరషు హరా(సూ ॥
సో సుత బిఛురత గఏ న (ప్రానా । కో పాపీ బడ మోహి సమానా ॥ 4 ॥

నీటిలో మునిగిపోవుచున్న వానికి ఆధారము దొరికినవెంటనే పట్టుకొన్నట్లు దశరథుడు సుమంత్రుని తన హృదయమునకు హత్తుకొనెను. ప్రేమతో మంత్రిని తనయొద్ద కూర్చుండ బెట్టుకొని, అశ్రుపూర్ణ నేత్రుడై అడుగసాగెను. "ప్రియమైన నేస్తమా! రామచంద్రునికుశల వార్తను దెలుపుము. శ్రీరాముడు, లక్ష్మణుడు, జానకి ఎక్కడనున్నారు? తెల్పుము. నీవు వారిని తీసికొని వచ్చినావా? లేక వారు వనములకు వెళ్లినారా?" ఈ మాటలను వినగానే మంత్రి నేత్రములు అశ్రుపూరితములాయెను. శోకవిహ్వలుడైన రాజు "సీతారామలక్ష్మణుల సందేశమేమి?" అని ప్రశ్నించెను. శ్రీరాముని రూపగుణశీలస్వభావములను తలచుకొని, విచార పడుచు రాజు పలికెను. "రాజును చేయుదునని చెప్పి వనముల పాలు చేసితిని. ఐనను రాముని మనస్సులో హర్షముగాని విషాదముగాని లేవు. ఇట్టి కుమారుని ఎడబాటునకు గురియైయుగూడ నా ప్రాణములు పోవుట లేదు. నా వంటి మహాపాపి ఎవడుండును?
(చౌ॥ 1-4)

దో- సఖా రాము సియ లఖను జహఁ, తహాఁ మోహి పహుఁచాఉ ।
నాహిఁ త చాహత చలన అబ, (ప్రాన కహఉఁ సతిభాఉ ॥ 149 ॥

మిత్రమా! శ్రీరాముడు, సీత, లక్ష్మణుడు ఉన్న చోటికి నన్నును చేర్చుము. లేనిచో నిజము పల్కుచున్నాను నా ప్రాణములు వెంటనే పోవును."
(దో॥ 149)

చౌ- పుని పుని పూఁఛత మంత్రిహి రాఊ । ప్రియతమ సుఅన సఁదేస సునాఊ ॥
కరహి సఖా సోఇ బేగి ఉపాఊ । రాము లఖను సియ నయన దెఖాఊ ॥ 1 ॥
సచివ ధీర ధరి కహ మృదు బానీ । మహారాజ తుమ్హ పండిత గ్యానీ ॥
బీర సుధీర ధురంధర దేవా । సాధు సమాజు సదా తుమ్హ సేవా ॥ 2 ॥
జనమ మరన సబ దుఖ సుఖ భోగా । హాని లాభు ప్రియ మిలన బియోగా ॥
కాల కరమ బస హోహిఁ గోసాఈఁ । బరబస రాతి దివస కీ నాఈఁ ॥ 3 ॥
సుఖ హరషహిఁ జడ దుఖ బిలఖాహీఁ । దోఉ సమ ధీర ధరహిఁ మన మాహీఁ ॥
ధీరజ ధరహు బిబేకు బిచారీ । ఛాడిఅ సోచ సకల హితకారీ ॥ 4 ॥

రాజు మాటిమాటికిని మంత్రితో ఇట్లు పలికెను. "నా ప్రియతమపుత్రులసందేశమును వినిపింపుము. మిత్రమా! సీతారామలక్ష్మణులను నాయెదుట నిలుపుఉపాయమును ఆలోచింపుము." మంత్రి ధైర్యము వహించి, మృదుమధురముగా ఇట్లు పలికెను. "మహారాజా! మీరు పండితులు, జ్ఞానులు, శూరులు, వీరులు, ధీరులలో శ్రేష్ఠులు. మీరెల్లప్పుడు దేవతలను, సాధువులను సేవించువారు. జనన మరణములు, సుఖ దుఃఖములు, లాభ నష్టములు, ప్రియ వ్యక్తులతోడి సంయోగ వియోగములు మొదలగునవి యన్నియును కాల కర్మ వశములు. రాత్రింబవళ్లవలె ఇవి నిరంతరము పరిభ్రమించుచునేయుండెను. మూర్ఖులు సుఖములకు పొంగెదరు, దుఃఖములకు క్రుంగెదరు. ధీరులైనవారు సుఖదుఃఖములను సమానముగా జూచెదరు. మీరు వివేకముతో ధైర్యము వహింపుడు. మీరందఱికిని హితమును గూర్చువారు. కనుక విచారింప వలదు.
(చౌ॥ 1-4)

దో- ప్రథమ బాసు తమసా భయఉ, దూసర సురసరి తీర ।
న్హాఇ రహే జలపాను కరి, సియ సమేత దోఉ బీర ॥ 150 ॥

సీతారామలక్ష్మణులు మొదట తమసానదీతీరమునను, పిమ్మట పవిత్రగంగానదీ తటమునను బసచేసిరి. వారు గంగానదిలో స్నానములనాచరించి, పవిత్ర జలములను పానముచేసిరి. (దో॥ 150)

చౌ- కేవట కీన్హి బహుత సేవకాఈం । సో జామిని సింగరౌర గవాఁఈం ॥
హోత ప్రాత బట ఛీరు మగావా । జటా ముకుట నిజ సీస బనావా ॥ 1 ॥
రామ సఖాఁ తబ నావ మగాఈం । ప్రియా చఢాఇ చఢే రఘురాఈం ॥
లఖన బాన ధను ధరే బనాఈం । ఆపు చఢే ప్రభు ఆయసు పాఈం ॥ 2 ॥
బికల బిలోకి మోహి రఘుబీరా । బోలే మధుర బచన ధరి ధీరా ॥
తాత ప్రనాము తాత సన కహేహూ । బార బార పద పంకజ గహేహూ ॥ 3 ॥
కరబి పాయఁ పరి బినయ బహోరీ । తాత కరిఅ జని చింతా మోరీ ॥
బన మగ మంగల కుసల హమారేం । కృపా అనుగ్రహ పున్య తుమ్హారేం ॥ 4 ॥

గుహుడను నిషాదరాజు వారికి చాలాసేవలు చేసెను. వారు ఆరాత్రి శృంగిబేర పురమునందు గడిపిరి. రెండవ దినము ప్రాతఃకాలమున వారు మఱ్ఱిపాలను తెప్పించి దానితో శిరమున జటాజూటములను కట్టుకొనిరి. శ్రీరామచంద్రుని మిత్రుడైన నిషాదరాజు పడవను సిద్ధపఱచెను. శ్రీరాముడు మొదట తనధర్మపత్నియైన సీతాదేవిని ఎక్కించి, పిమ్మట తానెక్కెను. రాముని ఆజ్ఞ మేరకు లక్ష్మణుడు ధనుర్బాణములను అందులో నుంచి, తానుగూడ ఎక్కెను. నా వ్యాకుల పాటును జూచి, శ్రీరాముడు ధైర్యము వహించి, మృదుమధురముగా ఇట్లు పలికెను. "మిత్రమా! తండ్రీ గారికి నా ప్రణామములను తెలుపుము. నాకు మాఱుగా వారికి నీవు పాదాభివందనములను జేయుము. నా మాటగా తండ్రి గారికి ఇట్లు విన్నవింపుము. 'మీరు నా గుఱించి చింతింపవలదు. మీ కృపతో అనుగ్రహముతో మీ పుణ్యకర్మల ఫలితముగా మా వనవాసము శుభప్రదమగును. (చౌ॥ 1-4)

ఛం- తుమ్హరేం అనుగ్రహ తాత కానన జాత సబ సుఖు పాఇహౌం ।
ప్రతిపాలి ఆయసు కుసల దేఖన పాయ పుని ఫిరి ఆఇహౌం ॥
జననీం సకల పరితోషి పరి పరి పాయఁ కరి బినతీ ఘనీ ।
తులసీ కరహు సోఇ జతను జేహిం కుసలీ రహహిం కోసలధనీ ॥

"తండ్రిగారూ! మీ దయచే వనమున నాకు శుభమే లభించును. మీ ఆజ్ఞాపాలనము చేసిన పిదప మీ పాదములను దర్శించెదను." మఱియునాతో ఇట్లనెను. తల్లులందఱి చరణములకు మ్రొక్కి, వారిని సంతృప్తి పఱచి, వారికి విన్నవించుము. (తులసీదాసు ప్రభువైన శ్రీరాముడిట్లు పలికెను) 'కోసలపతియైన దశరథుడు క్షేమముగానుండుటకు అన్ని ప్రయత్నములను చేయుచుండుడు. (ఛం)

సో- గుర సన కహబ సందేసు, బార బార పద పదుమ గహి ।
కరబ సోఇ ఉపదేసు, జెహిం న సోచ మొహి అవధపతి ॥ 151 ॥

గురువైన వసిష్ఠులవారిచరణములకు నా ప్రణామములను తెల్పుము. 'అయోధ్యాపతియైన దశరథ మహారాజు నాకొఱకై చింతింప కుండునట్లుగా ఉపదేశింపుడు'. అనుమ నా ప్రార్థనగా తెల్పుము. (సో॥ 151)

చౌ- పురజన పరిజన సకల నిహోరీ । తాత సునాఏహు బినతీ మోరీ ॥
సోఇ సబ భాంతి మోర హితకారీ । జాతేం రహ నరనాహు సుఖారీ ॥ 1 ॥
కహబ సందేసు భరత కే ఆఏం । నీతి న తజిఅ రాజపదు పాఏం ॥
పాలెహు ప్రజహి కరమ మన బానీ । సేఏహు మాతు సకల సమ జానీ ॥ 2 ॥
ఓర నిబాహేహు భాయప భాఈ । కరి పితు మాతు సుజన సేవకాఈ ॥
తాత భాంతి తెహి రాఖబ రాఊ । సోచ మోర జెహిం కరై న కాఊ ॥ 3 ॥
లఖన కహే కఛు బచన కఠోరా । బరజి రామ పుని మోహి నిహోరా ॥
బార బార నిజ సపథ దెవాఈ । కహబి న తాత లఖన లరికాఈ ॥ 4 ॥

నగర వాసులకును కుటుంబ సభ్యులకును నామాటగా తెల్పుము. రాజుగారి క్షేమమునకు పాటుపడువారే నాకు నిజమైన హితకారులు. భరతుడు వచ్చిన తరువాత నా సందేశమును వినిపింపుము. "రాజ పదవిని పొందిన తరువాత నీతిని విస్మరింపరాదు. (తమ్మునకు అన్నఇచ్చు ఈ ఉపదేశము నీతిశాస్త్ర సమ్మతమే మహారాజు రాజ పదవిని నీకు ఇచ్చెను. ఇయ్యబడిన రాజ్యమును త్యజింపరాదు. దానిని పాలింపవలెను. అని రాజనీతి తెల్పుచున్నది.) మనోవాక్కాయకర్మలచే ప్రజాపాలనము చేయవలెను. తల్లులను అందఱిని సమానముగా గౌరవింపుము. సోదరా! తల్లిదండ్రులకును స్వజనులకును సేవలొనర్చి, నీ భ్రాతృత్వమును కడవఱకు నిల్పుకొనుము. నన్నుగూర్చి చింతింపకుండునట్లు తండ్రిగారిని ప్రేమతో సేవించుచుండుము' ఈ సమయమున లక్ష్మణుడు కొన్ని నిష్ఠురోక్తులాడెను. కాని శ్రీరాముడు అతనిని వారించి, తనపై ప్రమాణము చేసి, పసివాడైన లక్ష్మణుని మాటలను చెప్ప వలదని నన్ను ప్రార్థించెను.(ఇది లక్ష్మణునకు రాముని యెడలగల ప్రేమకు నిదర్శనము). (చౌ॥ 1-4)

దో- కహి ప్రనాము కఛు కహన లియ, సియ భఇ సిథిల సనేహ ।
థకిత బచన లోచన సజల, పులక పల్లవిత దేహ ॥ 152 ॥

సీతాదేవియు ప్రణమిల్లుచు ఏదియో చెప్పదలచెను. కాని ప్రేమవిహ్వలయైనందున గొంతుపెగలక ఏమియు చెప్పలేకపోయెను. ఆమె కన్నులలో నీరు నిండెను. శరీరము రోమాంచమాయెను. (దో॥ 152)

చౌ- తెహి అవసర రఘుబర రుఖ పాఈ । కేవట పారహి నావ చలాఈ ॥
రఘుకులతిలక చలే ఎహి భాంతీ । దేఖఉం ఠాఢ కులిస ధరి ఛాతీ ॥ 1 ॥
మైం ఆపన కిమి కహౌం కలేసూ । జిఅత ఫిరెఉం లెఇ రామ సందేసూ ॥

మైం( అపన కిమి కహౌం( కలేసూ । జిఅత ఫిరెఉం( లెఇ రామ సం(దేసూ ॥
అస కహి సచివ బచన రహి గయఊ । హాని గలాని సోచ బస భయఊ ॥ 2 ॥
సూత బచన సునతహిం( నరనాహూ । పరెఉ ధరని ఉర దారున దాహూ ॥
తలఫత బిషమ మోహ మన మాపా । మాజా మనహుం( మీన కహుం( బ్యాపా ॥ 3 ॥
కరి బిలాప సబ రోవహిం( రానీ । మహా బిపతి కిమి జాఇ బఖానీ ॥
సుని బిలాప దుఖహూ దుఖు లాగా । ధీరజహూ కర ధీరజు భాగా ॥ 4 ॥

ఇంతలో నావికుడు శ్రీరామచంద్రుని అనుమతిని పొంది, పడవను ఆవలితీరమునకు చేర్చెను. రఘుకులమణియైన రామచంద్రుడు వనములకు వెళ్లిపోయెను. నేనుగుండెజాయి చేసికొని చూచుచు నిలబడిపోయితిని. శ్రీరాముని ఈ సందేశమును తీసికొని వచ్చుటకే కాబోలు ఈ బొందిలో ప్రాణములు ఇంకను మిగిలియున్నవి. ఇట్లు చెప్పుచుండగనే దుఃఖాతిరేకమున మంత్రి నోటమాట పెగలలేదు. అతడు శోకతప్త హృదయుడాయెను. సారథియైన సుమంత్రుని మాటలు వినినంతనే దశరథుడు తొలకరి జల్లునుఱుగును సేవించిన చేపలాగున విలవిలలాడుచు నేలపై బడిపోయెను. దుఃఖముచే ఆయనహృదయము పరితపించిపోయెను. మనస్సు మోహవశమున కొట్టుమిట్టాడుచుండెను. రాణులందఱును విలపించుచుండిరి. హృదయవిదారకమైన ఈ దృశ్యము వర్ణింపనలవికానిది. ఈ విలాపమును విని, దుఃఖమునకే దుఃఖము కలుగుచుండెను. ధైర్యము యొక్క ధీరత్వము సడలు చుండెను. (చౌ॥ 1-4)

దో- భయఉ కోలాహలు అవధ అతి, సుని నృప రాఉర సోరు ।
బిపుల బిహగ బన పరెఉ నిసి, మానహుం( కులిస కఠోరు ॥ 153 ॥

మహారాణి కౌసల్యాదేవిభవనములోని ఈ రోదనములను విని, అయోధ్యా నగరమంతయును హాహాకారములతో నిండిపోయెను. విశాలమైనపక్షులవనమున రాత్రి సమయమున కఠోరవజ్రపాతము జరిగినట్లాయెను. (దో॥ 153)

చౌ- ప్రాన కంఠగత భయఉ భుఆలూ । మని బిహీన జను బ్యాకుల బ్యాలూ ॥
ఇంద్రీం( సకల బికల భఇం( భారీ । జను సర సరసిజ బను బిను బారీ ॥ 1 ॥
కౌసల్యాం( నృపు దీఖ మలానా । రబికుల రబి అఁథయఉ జియం( జానా ॥
ఉర ధరి ధీర రామ మహతారీ । బోలీ బచన సమయ అనుసారీ ॥ 2 ॥
నాథ సముఝి మన కరిఅ బిచారూ । రామ బియోగ పయోధి అపారూ ॥
కరనధార తుమ్హ అవధ జహాజూ । చఢెఉ సకల ప్రియ పథిక సమాజూ ॥ 3 ॥
ధీరజు ధరిఅ త పాఇఅ పారూ । నాహిం( త బూడిహి సబు పరివారూ ॥
జౌం( జియం( ధరిఅ బినయ పియ మోరీ । రాము లఖను సియ మిలహిం( బహోరీ ॥ 4 ॥

రాజుగారిప్రాణములు కంఠగతములాయెను. అతడు మణినిగోల్పోయిన సర్పమువలె వ్యాకులుడాయెను. నీరులేనిసరస్సునందలి కమలములవలె ఆయన ఇంద్రియములన్నియును వికలములాయెను. రాజుగారిదుఃఖమును జూచి సూర్యవంశపుభానుడు అస్తమింప బోవుచున్నట్లు కౌసల్య గ్రహించెను. ధైర్యమును చిక్కబట్టుకొని ఆమె

సందర్భోచితముగా ఇట్లు పలికెను. "నాథా! యోచింపుడు శ్రీరామవియోగము అనెడి అపారసముద్రముపై ప్రయాణించు అయోధ్య యనెడి ఓడకు మీరు కర్ణధారులు. ఈ ప్రియజనులందఱును యాత్రికులు. వీరు ఈ ఓడను ఎక్కి వియోగసముద్రమును దాటదలచినారు. మీరు ధైర్యమును వహించినచో అందఱును తీరమును చేరగలరు. లేనిచో పరివారమంతయును అందు మునిగిపోవును. నా ప్రార్థనను మన్నించినచో సీతారామలక్ష్మణులను మఱల మీరు చూడగలరు. (చౌ॥ 1-4)

దో- ప్రియా బచన మృదు సునత నృపు, చితయఉ ఆఁఖి ఉఘారి ।
తలఫత మీన మలీన జను, సీఁచత సీతల బారి ॥ 154 ॥

కొనయూపిరితో కొట్టుకొనుచున్న చేపపై చల్లని నీరు చల్లినట్లు తన ప్రియపత్ని కౌసల్య మృదువచనములను పలుకగా వాటినివినినంతనే దశరథుడు తిన్నగా కన్నులు తెఱచి చూచెను. (దో॥ 154)

చౌ- ధరి ధీరజు ఉఠి బైఠ భుఆలూ । కహు సుమంత్ర కహఁ రామ కృపాలూ ॥
కహఁ లఖను కహఁ రాము సనేహీ । కహఁ ప్రియ పుత్రబధూ బైదేహీ ॥ 1 ॥
బిలపత రాఉ బికల బహు భాఁతీ । భఇ జుగ సరిస సిరాతి న రాతీ ॥
తాపస అంధ సాప సుధి ఆఈ । కౌసల్యహి సబ కథా సునాఈ ॥ 2 ॥
భయఉ బికల బరనత ఇతిహాసా । రామ రహిత ధిగ జీవన ఆసా ॥
సో తను రాఖి కరబ మైఁ కాహా । జెహిఁ న ప్రేమ పను మోర నిబాహా ॥ 3 ॥
హా రఘునందన ప్రాన పిరీతే । తుమ్హ బిను జిఅత బహుత దిన బీతే ॥
హా జానకీ లఖన హా రఘుబర । హా పితు హిత చిత చాతక జలధర ॥ 4 ॥

రాజు ధైర్యము వహించి, లేచి కూర్చొని ఇట్లనెను. "సుమంత్రా! చెప్పుము. మతిమెత్తని హృదయముగలవాడైన, దయాళువైన నా రాముడెక్కడ? చిన్నారి లక్ష్మణుడెక్కడ? స్నేహశీలియైన నా రాముడెక్కడ? నా ప్రాణములకు ప్రాణమైన మా కోడలు జానకి ఎక్కడ?" రాజు వికలుడై పరిపరివిధముల పరితపించుచుండెను. ఆ రాత్రి ఒక యుగమువలెగడిచెను. అప్పుడు ఆయనకు అంధుడైన తాపసి (శ్రవణకుమారుని తండ్రి) శాపము స్మృతికి వచ్చెను. ఆ కథనంతయును కౌసల్యకు వినిపించెను. ఆ గాథను వర్ణించుచు ఇంకను వికలమనస్కుడాయెను. "శ్రీరాముడు లేకుండ నేను జీవించుట అసంభవము. ప్రేమను సఫలము చేయలేని ఈ శరీరమువలన లాభమేమి? నా ప్రాణసమానా! రఘునందనా! నీవు కనబడకున్నను నేను ఇంతకాలము జీవించి యుంటిని. హా! జానకీ! హా! లక్ష్మణా! హా! రఘురామా! తండ్రి చిత్తమనెడి చాతకమునకు జీవనమునిచ్చు మేఘమా! (చౌ॥ 1-4)

దో- రామ రామ కహి రామ కహి, రామ రామ కహి రామ ।
తను పరిహరి రఘుబర బిరహఁ, రాఉ గయఉ సురధామ ॥ 155 ॥

రామా! రామా! "అని పదే పదే కలవరించుచు రాజు రామవియోగబాధను భరింపలేక శరీరమును వీడి స్వర్గస్థుడాయెను. (దో॥ 155)

చౌ- జిఅన మరన ఫలు దసరథ పావా । అండ అనేక అమల జసు ఛావా ॥
జిఅత రామ బిధు బదను నిహారా । రామ బిరహ కరి మరను సఁవారా ॥ 1 ॥
సోక బికల సబ రోవహిఁ రానీ । రూపు సీలు బలు తేజు బఖానీ ॥
కరహిఁ బిలాప అనేక ప్రకారా । పరహిఁ భూమితల బారహిఁ బారా ॥ 2 ॥
బిలపహిఁ బికల దాస అరు దాసీ । ఘర ఘర రుదను కరహిఁ పురబాసీ ॥
అఁథయఉ ఆజు భానుకుల భానూ । ధరమ అవధి గున రూప నిధానూ ॥ 3 ॥
గారీఁ సకల కైకఇహి దేహీఁ । నయన బిహీన కీన్హ జగ జేహీఁ ॥
ఎహి బిధి బిలపత రైని బిహానీ । ఆఏ సకల మహాముని గ్యానీ ॥ 4 ॥

దశరథుడు తనజీవితమునూ, మరణమునుగూడ సఫలము చేసికొనెను. ఆయననిర్మలకీర్తి బ్రహ్మాండములన్నింటను వ్యాపించెను. జీవితకాలమున శ్రీరామునిముఖచంద్రుని దర్శించెను. శ్రీరామునివిరహమున ఆ రాముని స్మరించుచునే అసువులనువీడి, మరణమునూ సార్థకము జేసికొనెను. రాణులందఱును శోకవిహ్వాలలై విలపించిరి. రాజుగారిరూపశీలబలతేజస్సులను అనేకవిధముల వర్ణించుచు రోదించిరి. నేలపైబడి దొర్లిరి. దాసదాసీజనులు వ్యాకులపాటుతో పరితపించిరి. అయోధ్యానగరములోని ప్రతిగృహమునందును రోదనలే. నేడు "ధర్మమునకును, రూపగుణములకును, ఆధారము ఐన, సూర్యవంశదీపకుడు అస్తమించెను." అని ఎల్లరును అనుకొనుచుండిరి. లోకమును నయనవిహీనమొనర్చిన కైకేయిని తిట్టసాగిరి. ఏడ్పులతో పెడబొబ్బలతో ఆ రాత్రి గడచెను. ప్రాతఃకాలమున జ్ఞానులైన మునులు ఏతెంచిరి. (చౌ॥ 1-4)

దో- తబ బసిష్ఠ ముని సమయ సమ, కహి అనేక ఇతిహాస ।
సోక నెవారెఉ సబహి కర, నిజ బిగ్యాన ప్రకాస ॥ 156 ॥

వసిష్ఠ మహాముని సమయోచితముగా పెక్కు ఇతిహాసగాథలను చెప్పి, తన విజ్ఞానము ద్వారా వారి శోకమును కొంతవఱకు నివారించెను. (దో॥ 156)

## అయోధ్యకు భరతుని ఆగమనము

చౌ- తేల నావఁ భరి నృప తను రాఖా । దూత బోలాఇ బహురి అస భాషా ॥
ధావహు బేగి భరత పహిఁ జాహూ । నృప సుధి కతహుఁ కహహు జని కాహూ ॥ 1 ॥
ఏతనెఇ కహేహు భరత సన జాఈ । గుర బోలాఇ పఠయఉ దోఉ భాఈ ॥
సుని ముని ఆయసు ధావన ధాఏ । చలే బేగ బర బాజి లజాఏ ॥ 2 ॥
అనరథు అవధ అరంభెఉ జబ తేఁ । కుసగున హోహిఁ భరత కహుఁ తబ తేఁ ॥
దేఖహిఁ రాతి భయానక సపనా । జాగి కరహిఁ కటు కోటి కలపనా ॥ 3 ॥
బిప్ర జెవాఁఇ దేహిఁ దిన దానా । సివ అభిషేక కరహిఁ బిధి నానా ॥
మాగహిఁ హృదయఁ మహేస మనాఈ । కుసల మాతు పితు పరిజన భాఈ ॥ 4 ॥

నావలో నూనెను నింపి, అందులో రాజుగారి కళేబరమును భద్రపఱచుటకు ఆ మహర్షి ఆదేశించెను. పిదప దూతలను పిలిచి, వారితో ఇట్లు పలికెను. "మీరు వేగముగా భరతునికడకు వెళ్లుడు. రాజుగారిమరణవార్తను ఎవ్వరికిని తెలుపవలదు. వెళ్లి 'గురువుగారు మీ ఇద్దఱిని వెంటనే బయలుదేఱి రమ్మనినారు' అని చెప్పుడు." గురువుగారి ఆజ్ఞతో దూతలు వెంటనే గుఱ్ఱముల కంటెను వేగముగా పరుగెత్తుకొని పోయిరి. అయోధ్యలో ఈ అనర్థములు ప్రారంభమైనప్పటినుండి భరతునకు అపశకునములే ఎదురగుచుండెను. రాత్రులయందు భయంకరస్వప్నములు వచ్చుచుండెను. మేల్కొనినపిదప పలురకములైనఆలోచనలు వచ్చుచుండెను. అతడు అరిష్టనివారణకొఱకు బ్రాహ్మణులను భోజనదానములతో తృప్తి పఱచుచుండెను. విధ్యుక్తముగా రుద్రాభిషేకములను చేయుచుండెను. మాతాపితరుల కుటుంబ సభ్యుల, సోదరుల క్షేమమునకై, పరమేశ్వరుని ప్రార్థించుచుండెను.(చౌ॥ 1-4)

దో- ఏహి బిధి సోచత భరత మన, ధావన పహుఁచే ఆఇ।
గుర అనుసాసన శ్రవన సుని, చలే గనేసు మనాఇ ॥ 157 ॥

ఈ విధముగా భరతుడు విచారగ్రస్తుడై యుండెను. ఇంతలో దూతలు వచ్చిరి. గురువుగారి ఆదేశమును వినగానే గణేశుని ప్రార్థించి, భరతుడు, శత్రుఘ్నునితోగూడి వెంటనే అయోధ్యకు బయలు దేఱెను. (దో॥ 157)

చౌ- చలే సమీర బేగ హయ హాఁకే । నాఘత సరిత సైల బన బాఁకే ॥
హృదయఁ సోచు బడ కఛు న సోహాఈ । అస జానహిఁ జియఁ జాఉఁ ఉడాఈ ॥ 1 ॥
ఏక నిమేష బరష సమ జాఈ । ఏహి బిధి భరత నగర నిఅరాఈ ॥
అసగున హోహిఁ నగర పైఠారా । రటహిఁ కుభాఁతి కుఖేత కరారా ॥ 2 ॥
ఖర సిఆర బోలహిఁ ప్రతికూలా । సుని సుని హోఇ భరత మన సూలా ॥
శ్రీహత సర సరితా బన బాగా । నగరు బిసేషి భయావను లాగా ॥ 3 ॥
ఖగ మృగ హయ గయ జాహిఁ న జోఏ । రామ బియోగ కురోగ బిగోఏ ॥
నగర నారి నర నిపట దుఖారీ । మనహుఁ సబన్హి సబ సంపతి హారీ ॥ 4 ॥

గుఱ్ఱములను వాయువేగముతో పఱుగులు దీయించుచు భరతుడు నదులను, కొండలను దుర్గమారణ్యములను దాటివచ్చెను. అతని మనస్సు పరిపరివిధముల ఆందోళన చెందుచుండెను. "ఆకాశమున ఎగిరిపోయిన బాగుండును." అని అతడు అనుకొనసాగెను. ఆయనకు ప్రతి క్షణము ఒక యుగముగా తోచుచుండెను. ఆలోచించుచు నగరమును సమీపించుచుండగా అపశకునములు పొడసూపెను. కాకులు చెడుస్థలములయందు కూర్చుండి అఱవసాగెను. గాడిదలు, నక్కలు అశుభములను సూచించుచు కూయసాగెను. వాటిని విని, భరతునిమనస్సు కలవరపడెను. నదులు, తటాకములు, వనములు, ఉపవనములు శోభావిహీనములుగా కన్పట్టుచుండెను. నగరము అతి భయానకముగా తోచెను. శ్రీరాముని వియోగమనెడి రోగముచే పీడింపబడు పశుపక్షులు, అశ్వములు గజములు దీనావస్థలోనుండెను. నగరపౌరులు తమ సంపదలను అన్నింటిని కోల్పోయినవారివలె దుఃఖితులైయుండిరి. (చౌ॥ 1-4)

దో- పురజన మిలహిఁ న కహహిఁ కఛు, గవహిఁ జోహారహిఁ జాహిఁ ।
భరత కుసల పూఁఛి న సకహిఁ, భయ బిషాద మన మాహిఁ ॥ 158 ॥

అయోధ్యావాసులు భరతునితో కలిసినను ఏమియు మాట్లాడక మౌనముగా నమస్కరించి వెళ్లుచుండిరి. భరతునిమనస్సు భయవిషాదములతో నిండియుండుటవలన అతడెవ్వరిని కుశలము అడుగకుండెను. పౌరులును అతనితో కుశలప్రశ్నలు చేయకుండిరి. (దో॥ 158)

చౌ- హాట బాట నహిఁ జాఇ నిహారీ । జను పుర దహఁ దిసి లాగి దవారీ ॥
అవత సుత సుని కైకయనందిని । హరషీ రబికుల జలరుహ చందిని ॥ 1 ॥
సజి ఆరతీ ముదిత ఉఠి ధాఈఁ । ద్వారెహిఁ భేఁటి భవన లెఇ ఆఈఁ ॥
భరత దుఖిత పరివారు నిహారా । మానహుఁ తుహిన బనజ బను మారా ॥ 2 ॥
కైకేఈఁ హరషిత ఎహి భాఁతీ । మనహుఁ ముదిత దవ లాఇ కిరాతీ ॥
సుతహి ససోచ దేఖి మను మారేఁ । పూఁఛతి నైహర కుసల హమారేఁ ॥ 3 ॥
సకల కుసల కహి భరత సునాఈఁ । పూఁఛీ నిజ కుల కుసల భలాఈఁ ॥
కహు కహఁ తాత కహాఁ సబ మాతా । కహఁ సియ రామ లఖన ప్రియ భ్రాతా ॥ 4 ॥

అంగళ్లు, వీధులు వెలవెలబోవుచుండెను. నగరమునకు అన్ని దిశలయందును దావానలము వ్యాపించినట్లుండెను. సూర్యవంశమనుకమలముపాలిటి వెన్నెలయైన కైకేయి తన కుమారుడైన భరతుని ఆగమనమునకు ఆనందించెను. హారతి సిద్ధపఱచి, లేచి పరుగెత్తి ద్వారమునొద్దనే భరతుని కలిసికొని, లోనికి తీసికొనివచ్చెను. భరతుడు తనపరివారమును జూడగా వారు తుషారపాతముచే కొట్టబడి, కాంతివిహీనమైన కమలోద్యానమువలె కనబడిరి. కైకేయి వనమును గాల్చినకిరాత స్త్రీవలె అతిప్రసన్నురాలైయుండెను. విచారగ్రస్తుడైన కుమారుని గాంచి "మా తల్లిగారి ఇంటిలో అందఱును కుశలమా?" అని ప్రశ్నించెను. 'కుశలమే' అని సమాధానమిచ్చి, భరతుడు తమఇంటిలోనివారిక్షేమసమాచారములను అడిగెను. "తండ్రిగారెక్కడ? తల్లులందఱును ఎక్కడ? సీతాదేవియు, ప్రియ సోదరులైన రామలక్ష్మణులును ఎక్కడ?" అని యడిగెను. (చౌ॥ 1-4)

దో- సుని సుత బచన సనేహమయ, కపట నీర భరి నైన ।
భరత శ్రవన మన సూల సమ, పాపిని బోలీ బైన ॥ 159 ॥

ప్రేమతో గూడిన భరతుని వచనములను విని, కైకేయి మొసలి కన్నీరు కార్చుచు పలికిన కపట వచనములు భరతుని చెవులకును మనస్సునకు శూలముల వలె గ్రుచ్చుకొనెను. (దో॥ 159)

చౌ- తాత బాత మైఁ సకల సఁవారీ । భై మంథరా సహాయ బిచారీ ॥
కఛుక కాజ బిధి బీచ బిగారెఉ । భూపతి సురపతి పుర పగు ధారెఉ ॥ 1 ॥

సునత భరతు భఏ బిబస బిషాదా । జను సహమెఉ కరి కేహరి నాదా ॥
తాత తాత హా తాత పుకారీ । పరే భూమితల బ్యాకుల భారీ ॥ 2 ॥
చలత న దేఖన పాయఉఁ తోహీ । తాత న రామహి సౌఁపేహు మోహీ ॥
బహురి ధీర ధరి ఉఠే సఁభారీ । కహు పితు మరన హేతు మహతారీ ॥ 3 ॥
సుని సుత బచన కహతి కైకేఈ । మరము పాఁఛి జను మాహుర దేఈ ॥
ఆదిహు తేఁ సబ ఆపని కరనీ । కుటిల కఠోర ముదిత మన బరనీ ॥ 4 ॥

"నాయనా! నేను అన్నియు సక్రమముగనే ఏర్పాటు చేసితిని. మంథర నాకు చాల సహాయపడినది- కాని విధాత నా పనికి కొంత విఘాతమును కల్గించెను. రాజుగారు స్వర్గస్థులైరి" ఈ మాటలు వినినంతనే సింహగర్జనను వినిన ఏనుగువలె భరతుడు విషాదముతో వివశుడై "తండ్రీ! తండ్రీ! నాయనా!" అని రోదించుచు చతికిలబడెను. "తండ్రీ! మీ అవసాన కాలమున గూడ నేను మిమ్ముదర్శింపలేకపోయితిని. అయ్యో! మీరు నన్ను శ్రీరామచంద్రునకు అప్పగింపక పోయితిరి." పిమ్మట భరతుడు ధైర్యమును కూడగట్టుకొని, పలికెను. "అమ్మా! తండ్రిగారి మృతికి కారణమేమో తెలుపుము." సుతుని మాటలను విని కఠినాత్మురాలైన కైకేయి హర్షముతో తాను జేసిన పనిని మొదటినుండియు వివరించెను. ఆమె పలుకులు భరతునకు 'మర్మ స్థానమును గాయపఱచి, అందు విషము నింపినంతగా' మిక్కిలి బాధాకరములయ్యెను. (చౌ॥ 1-4)

## భరతుని పరితాపము

దో- భరతహి బిసరెఉ పితు మరన, సునత రామ బన గౌను ।
హేతు అపనపఉ జాని జియఁ, థకిత రహే ధరి మౌను ॥ 160 ॥

శ్రీరామచంద్రునివనవాసవార్తను విని, భరతుడు తండ్రిగారిమరణ విషయమునే మఱచెను. దీనికంతటికిని తానే కారణమని గ్రహించి, కొంత తడవు మౌనమువహించి, కొయ్యబారిపోయెను. (దో॥ 160)

చౌ- బికల బిలోకి సుతహి సముఝావతి । మనహుఁ జరే పర లోను లగావతి ॥
తాత రాఉ నహిఁ సోచై జోగూ । బిఢఇ సుకృత జసు కీన్హెఉ భోగూ ॥ 1 ॥
జీవత సకల జనమ ఫల పాఏ । అంత అమరపతి సదన సిధాఏ ॥
అస అనుమాని సోచ పరిహరహూ । సహిత సమాజ రాజ పుర కరహూ ॥ 2 ॥
సుని సుఠి సహమెఉ రాజకుమారూ । పాకేఁ ఛత జను లాగ అఁగారూ ॥
ధీరజ ధరి భరి లేహిఁ ఉసాసా । పాపిని సబహి భాఁతి కుల నాసా ॥ 3 ॥
జౌఁ పై కురుచి రహీ అతి తోహీ । జనమత కాహె న మారే మోహీ ॥
పేడ కాటి తైఁ పాలఉ సీఁచా । మీన జిఅన నితి బారి ఉలీచా ॥ 4 ॥

మిక్కిలి క్షోభకులోనైన కుమారుని సమాధాన పఱచుటకు కైకేయి ప్రయత్నించెను. దాని వలన 'పుండుపై కారము చల్లినట్లు' భరతునకు మిక్కిలి బాధ కలిగెను. కైకేయి పలికెను. "నాయనా! మీ నాయనగారికై

దుఃఖింపకుము. ఆయన పుణ్యమును, యశమును సంపాదించికొనినాడు. విశేషసుఖములను అనుభవించినాడు. జీవితకాలమున తనజన్మను సార్థక మొనర్చుకొని కడకు స్వర్గలోకమును జేరినాడు. బాగుగా ఆలోచించి, విచారమును మాని, రాజ్యపాలనము చేపట్టుము." ఈ మాటలు చెవిన పడినంతనే భరతుడు తీవ్రమైన (పక్వమైన) గాయముపై నిప్పు కణికలు పడినట్లు ఉలిక్కిపడెను. ధైర్యమును వహించి పెద్దగా నిట్టూర్పులు విడిచి, ఇట్లనెను. "దుర్మార్గురాలా! నీవు మన వంశమును అన్నివిధములుగా సర్వనాశనము చేసితివి. నీకు ఇంత దురాశయే యున్నచో నన్ను పుట్టినప్పుడే ఏల చంపలేదు? నీవు చెట్టునుగొట్టి, దాని ఆకులను తడిపితివి. చేపలను బ్రతికించుటకై చెఱువులోని నీటిని తీసి వేసితివి. (చౌ॥ 1-4)

దో- హంసబంసు దసరథు జనకు, రామ లఖన సే భాఇ।
జననీ తూఁ జననీ భఈ, బిధి సన కఛు న బసాఇ ॥ 161 ॥

విధాత ఒకవైపున నాకు సూర్యవంశమున జన్మను, దశరథునివంటితండ్రిని, రామలక్ష్మణులవంటి సోదరులను ప్రసాదించినాడు. కాని మఱొక వైపున నీ వంటి దుష్టురాలిని తల్లిగా జేసినాడు. విధికెదురీదుట నిష్ప్రయోజనము. (దో॥ 161)

చౌ- జబ తైఁ కుమతి కుమత జియఁ ఠయఊ। ఖండ ఖండ హోఇ హృదఉ న గయఊ॥
బర మాగత మన భఇ నహిఁ పీరా। గరి న జీహ ముహఁ పరెఉ న కీరా ॥ 1 ॥
భూపఁ ప్రతీతి తోరి కిమి కీన్హీ। మరనకాల బిధి మతి హరి లీన్హీ॥
బిధిహుఁ న నారి హృదయ గతి జానీ। సకల కపట అఘ అవగున ఖానీ ॥ 2 ॥
సరల సుసీల ధరమ రత రాఊ। సో కిమి జానై తీయ సుభాఊ॥
అస కో జీవ జంతు జగ మాహీఁ। జెహి రఘునాథ ప్రానప్రియ నాహీఁ ॥ 3 ॥
భే అతి అహిత రాము తేఉ తోహీ। కో తూ అహసి సత్య కహు మోహీ॥
జో హసి సో హసి ముహఁ మసి లాఈ। ఆఁఖి ఓట ఉఠి బైఠహి జాఈ ॥ 4 ॥

ఓ దుర్మతీ! నీ మనస్సున ఈ దురాలోచన రాగానే నీ హృదయము ఏల ముక్కలు ముక్కలు గాలేదు? వరములడిగినప్పుడు నీ అంతరాత్మ బాధపడలేదా? నీ నాలుక ఎండిపోలేదా? నీ నోటిలో పురుగులుపడలేదా? మహారాజు నీ మీద ఎట్లు విశ్వాసమును ఉంచెను? బహుశా మరణకాలమున విధాత ఆయన బుద్ధిని అపహరించి యుండవచ్చును. స్త్రీ హృదయమును బ్రహ్మకూడ తెలిసికొనజాలడు. అది పాపములకును కపటములకును, దుర్గుణములకును కూడలి. రాజుగారు పట్టి అమాయికుడు, సుశీలుడు, ధర్మపరాయణుడు. ఆయనకు స్త్రీ స్వభావము ఎట్లు తెలియును? ఈ ప్రపంచములో శ్రీరామచంద్రుని ప్రాణసమముగా ప్రేమించని ప్రాణులను చూపుము. అట్టి శ్రీరాముడు నీకు శత్రువాయెనా? ఇంతకూ నీవెవరు? చెప్పుము. నీవు ఎవరైనను సరే- ముఖమునకు మసిపూసికొనుము. నీ ముఖమునే నాకు చూపక నాయెదుట నుండి తొలగి పొమ్ము. (చౌ॥ 1-4)

దో- రామ బిరోధీ హృదయ తేఁ, ప్రగట కీన్హ బిధి మోహి।
మో సమాన కో పాతకీ, బాది కహఉఁ కఛు తోహి ॥ 162 ॥

శ్రీరామునియెడ వైరభావము కలిగియున్న నీ వంటి స్త్రీకడుపున విధాత నన్ను పుట్టించినాడు. నా వంటి మహాపాపి ఎవ్వడును ఉండడు. నీకు ఏమి చెప్పినను వ్యర్థమే (దో॥ 162)

చౌ- సుని సత్రుఘున మాతు కుటిలాఈ । జరహిం గాత రిస కఛు న బసాఈ ॥
తెహి అవసర కుబరీ తహఁ ఆఈ । బసన బిభూషన బిబిధ బనాఈ ॥ 1 ॥
లఖి రిస భరేఉ లఖన లఘు భాఈ । బరత అనల ఘృత ఆహుతి పాఈ ॥
హుమగి లాత తకి కూబర మారా । పరి ముహ భర మహి కరత పుకారా ॥ 2 ॥
కూబర టూటెఉ ఫూట కపారూ । దలిత దసన ముఖ రుధిర ప్రచారూ ॥
ఆహ దఇఅ మైఁ కాహ నసావా । కరత నీక ఫలు అనఇస పావా ॥ 3 ॥
సుని రిపుహన లఖి నఖ సిఖ ఖోటీ । లగే ఘసీటన ధరి ధరి ఝోఁటీ ॥
భరత దయానిధి దీన్హి ఛడాఈ । కౌసల్యా పహిఁ గే దోఉ భాఈ ॥ 4 ॥

కైకేయి కుటిలత్వమునకు శత్రుఘ్నుడుకూడ కోపముతో మండిపడెను. కాని ఏమియు చేయలేకపోయెను. అదే సమయమున మంథర విలువైన వివిధ వస్త్రములను, ఆభరణములను ధరించి వచ్చెను. ఆమెరాక శత్రుఘ్నునకు అగ్నిలో ఆజ్యము పోసినట్లాయెను. వెంటనే కోపోద్రిక్తుడై వేగముగా ఆమె గూనిపై కాలితో తన్నెను. ఆమె ముఖము నేలకు కొట్టుకొని పడిపోయెను. గూని బ్రద్దలాయెను, తలపగిలెను, పండ్లూడెను. నోటినుండిరక్తము కారుచుండెను. "అయ్యో దేవుడా! నేనేమిచేసితిని? నేను చేసిన సేవలకు ఇతి ప్రతిఫలమా? అనుచు కేకలుపెట్టెను. అది విని అతడు నఖశిఖ పర్యంతము దుష్టురాలైన ఆమె కొప్పును పట్టుకొని ఈడ్చెను. దయాళువైన భరతుడు ఆమెను విడిపించెను. ఆ సోదరులిద్దఱును కౌసల్యా మందిరమున కేగిరి. (చౌ॥ 1-4)

## కౌసల్యా భరతుల సంవాదము

దో- మలిన బసన బిబరన బికల, కృస సరీర దుఖ భార ।
కనక కలప బర బేలి బన, మానహుఁ హనీ తుసార ॥ 163 ॥

కౌసల్యాదేవివస్త్రములు మలినములై యుండెను. ముఖము వివర్ణమైయుండెను. మనస్సు వ్యాకులతచెందియుండెను. దుఃఖభారముచే ఆమెశరీరము శుష్కించియుండెను. ఒక బంగారు కల్పలత మంచుచే కొట్టబడినట్లు ఆమె తేజోవిహీనయై కన్పట్టెను. (దో॥ 163)

చౌ- భరతహి దేఖి మాతు ఉఠి ధాఈ । మురుఛిత అవని పరీ ఝుఇఁ ఆఈ ॥
దేఖత భరతు బికల భఏ భారీ । పరే చరన తన దసా బిసారీ ॥ 1 ॥
మాతు తాత కహఁ దేహి దెఖాఈ । కహఁ సియ రాము లఖను దోఉ భాఈ ॥
కైకఇ కత జనమీ జగ మాఝా । జౌం జనమి త భఇ కాహె న బాఁఝా ॥ 2 ॥
కుల కలంకు జెహిఁ జనమెఉ మోహీ । అపజస భాజన ప్రియజన ద్రోహీ ॥
కో తిభువన మొహి సరిస అభాగీ । గతి అసి తోరి మాతు జెహి లాగీ ॥ 3 ॥

పితు సురపుర బన రఘుబర కేతూ । మైఀ కేవల సబ అనరథ హేతూ ॥
ధిగ మోహి భయఉఀ బేను బన ఆగీ । దుసహ దాహ దుఖ దూషన భాగీ ॥ 4 ॥

భరతుని చూడగనే ఆమె లేచి పరుగెత్తుకొని వచ్చెను. కాని తలతిరుగటచే మధ్యలోనే మూర్ఛిల్లి నేలపైబడెను. అదిచూచి భరతుడు మిగుల వ్యాకులుడై, తనస్థితినిగూడ మఱచి, ఆమె పాదములపై బడెను. అతడిట్లడిగెను. "అమ్మా! నాన్న గారెక్కడ? వారిని చూపుము. సీతాదేవియు, నా సోదరులిద్దఱును ఎక్కడ? ఈ లోకములో కైకేయి ఏల జననమందినది? జన్మించినను గొడ్రాలుగా ఏల ఉండలేదు. ఆమె కడుపున పుట్టిన నేరమునకు నేను అపకీర్తి పాలైతిని. ప్రియజనులకు ద్రోహినైతిని. వంశకళంకితుడనైతిని. అమ్మా! ముల్లోకములలో నా వంటి దురదృష్ట వంతుడు ఉండడు. నామూలముననే నీకు ఈ దుర్దశ ప్రాప్తించినది. తండ్రిగారు స్వర్గములో, రఘువంశశ్రేష్ఠుడైన శ్రీరామచంద్రుడు వనములలో ఉన్నారు. కేతుగ్రహము వలె నేను ఈ అనర్థములకు కారణమైతిని. ఇంక నా బ్రతుకే వ్యర్థము. వంశవనమునకు నేను అగ్నినైతిని. భరింపరాని దావాగ్నికిని, దుఃఖములకును, పాపాలకును కారకుడనైతిని.

(చౌ॥ 1-4)

దో- మాతు భరత కే బచన మృదు, సుని పుని ఉఠీ సఀభారి ।
లిఏ ఉఠాఇ లగాఇ ఉర, లోచన మోచతి బారి ॥ 164 ॥

కలతచెందినభరతునిమార్దవవచనములను విని, కౌసల్యాదేవి తనవేదనను తమాయించుకొని, లేచి కూర్చొనెను. ఆమె భరతుని లేవనెత్తి తనహృదయమునకు హత్తుకొనెను. ఆమె కన్నులలో నీరు నిండెను.

(దో॥ 164)

చౌ- సరల సుభాయ మాయఀ హియఀ లాఏ । అతి హిత మనహుఀ రామ ఫిరి ఆఏ ॥
భేఀటెఉ బహురి లఖన లఘు భాఈ । సోకు సనేహు న హృదయఀ సమాఈ ॥ 1 ॥
దేఖి సుభాఉ కహత సబు కోఈ । రామ మాతు అస కాహె న హోఈ ॥
మాతాఀ భరతు గోద బైఠారే । ఆఁసు పోఁఛి మృదు బచన ఉచారే ॥ 2 ॥
అజహుఀ బచ్ఛ బలి ధీరజ ధరహూ । కుసమఉ సముఝి సోక పరిహరహూ ॥
జని మానహు హియఀ హాని గలానీ । కాల కరమ గతి అఘటిత జానీ ॥ 3 ॥
కాహుహి దోసు దేహు జని తాతా । భా మోహి సబ బిధి బామ బిధాతా ॥
జో ఏతెహుఀ దుఖ మోహి జిఆవా । అజహుఀ కో జానఇ కా తెహి భావా ॥ 4 ॥

సరళ స్వభావయైన కౌసల్యాదేవి శ్రీరాముడే వనమునుండి తిరిగివచ్చినట్లు భావించి, అత్యంత ప్రేమతో భరతుని తనఅక్కున జేర్చుకొనెను. పిమ్మట లక్ష్మణానుజుడైన శత్రుఘ్నుని కౌగిలించు కొనెను. ఆమెహృదయములో ప్రేమశోకములు ఉప్పొంగెను. కౌసల్య స్వభావము నెఱింగిన వారు "ఆమె శ్రీరాముని తల్లిగదా! అందులకే ఆమె ప్రేమ స్వరూపిణి" అని పల్కుచుండిరి. ఆమె భరతుని తన యొడిలో కూర్చుండ బెట్టుకొని, అతని కన్నీరు తుడిచి, అనునయించుచు మృదువుగా ఇట్లు పలికెను. "కుమారా! ధైర్యముగా నుండుము. ఇది ఆపత్కాలమనిగ్రహించి,

శోకమును మానుము. కాలకర్మగతి అనివార్యము. దీనిని గ్రహించి, హృదయములో హానికి, గ్లానికి తావీయ వలదు. నాయనా! ఎవ్వరినీ దోషిగా భావింప రాదు. విధాత నాకన్ని విధములుగా ప్రతికూలుడైనాడు. ఇంత దుఃఖములోగూడ నాకు మరణమును ఇయ్యలేదు. అతని నిర్ణయమేమో? ఇంకను అతడు ఏమి చేయదలచినాడో? ఎవరికి తెలియును? (చౌ॥ 1-4)

దో- పితు ఆయసు భూషన బసన, తాత తజే రఘుబీర ।
బిసమఉ హరషు న హృదయఁ కఛు, పహిరే బలకల చీర ॥ 165 ॥

నాయనా! తండ్రిగారిఆజ్ఞప్రకారము శ్రీరఘువీరుడు భూషణములను, వస్త్రములను త్యజించి, వల్కలములను ధరించినాడు. ఆతని హృదయములో హర్షవిషాదములు లేవు. (దో॥ 165)

చౌ- ముఖ ప్రసన్న మన రంగ న రోషూ । సబ కర సబ బిధి కరి పరితోషూ ॥
చలే బిపిన సుని సియ సఁగ లాగీ । రహఇ న రామ చరన అనురాగీ ॥ 1 ॥
సునతహిఁ లఖను చలే ఉఠి సాథా । రహహిఁ న జతన కిఏ రఘునాథా ॥
తబ రఘుపతి సబహీ సిరు నాఈ । చలే సంగ సియ అరు లఘు భాఈ ॥ 2 ॥
రాము లఖను సియ బనహి సిధాఏ । గఇఉఁ న సంగ న ప్రాన పఠాఏ ॥
యహు సబు భా ఇన్హ ఆంఖిన్హ ఆగేఁ । తఉ న తజా తను జీవ అభాగేఁ ॥ 3 ॥
మోహి న లాజ నిజ నేహు నిహారీ । రామ సరిస సుత మైఁ మహతారీ ॥
జిఐ మరై భల భూపతి జానా । మోర హృదయ సత కులిస సమానా ॥ 4 ॥

అతనిముఖము ప్రసన్నముగానుండెను. ఎవ్వరిపైనను ఆసక్తి గాని, ద్వేషముగాని లేవు. అందఱినీ అన్ని విధములుగా సంతృప్తి పఱచి, వనములకుబోయెను. శ్రీరామునిచరణములపై మిక్కిలి అనురక్తిగల సీతయు ఆతనిని అనుసరించెను. లక్ష్మణుడును వారివెంట వెళ్లెను. ఆతనిని ఆపుటకు శ్రీరాముడు ఎంతగా ప్రయత్నించినను అతడు ఆగలేదు. అందఱికిని శిరసా ప్రణమిల్లి, శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణ సహితుడై బయలు దేఱెను. ఈ విధముగా వారు వనములకు వెళ్లిరి. వారితోనేనుగాని, నా ప్రాణములుగాని పోవుట జరుగ లేదు. ఇదియంతయు నా కనుల ముందే జరిగినను అభాగ్యురాలినైన నా ప్రాణములు మాత్రము నా శరీరమును వదల లేదు. రాజుగారు మాత్రము జీవించుట, మరణించుట అనువానిని చక్కగా ఎఱిగిరి. నా హృదయము మాత్రము వజ్రముకంటెను వందరెట్లు కఠినాతికఠినమైనది. ఇట్టినేను రాముని వంటి పుత్రునకు తల్లిని. నా ప్రేమపై నాకు సిగ్గువేయుటలేదు. (చౌ॥ 1-4)

దో- కౌసల్యా కే బచన సుని, భరత సహిత రనివాసు ।
బ్యాకుల బిలపత రాజగృహ, మానహుఁ సోక నెవాసు ॥ 166 ॥

కౌసల్య వచనములను విని, భరతుడును, ఇతర రాణి వాసమువారును శోక విహ్వలులైరి. రాజ భవనము శోకమునకు ఆవాసమయ్యెను. (దో॥ 166)

చౌ- బిలపహిఀ బికల భరత దోఉ భాఈ । కౌసల్యాఀ లివి హృదయఀ లగాఈ ॥
భాఀతి అనేక భరతు సముఝాఏ । కహి బిబేకమయ బచన సునాఏ ॥ 1 ॥
భరతహుఀ మాతు సకల సముఝాఈఀ । కహి పురాన శ్రుతి కథా సుహాఈఀ ॥
ఛల బిహీన సుచి సరల సుబానీ । బోలే భరత జోరి జుగ పానీ ॥ 2 ॥
జే అఘ మాతు పితా సుత మారేఀ । గాఇ గోఠ మహిసుర పుర జారేఀ ॥
జే అఘ తియ బాలక బధ కీన్హేఀ । మీత మహీపతి మాహుర దీన్హేఀ ॥ 3 ॥
జే పాతక ఉపపాతక అహహీఀ । కరమ బచన మన భవ కబి కహహీఀ ॥
తే పాతక మొహి హోహుఀ బిధాతా । జౌఀ యహు హోఇ మోర మత మాతా ॥ 4 ॥

భరత శత్రుఘ్నులు వ్యాకులపాటుతో విలపింపసాగిరి. కౌసల్య వారిని అక్కున జేర్చుకొని, ఓదార్చుచు వివేక యుక్తమైన పెక్కు వచనములను పలికెను. భరతుడును వేద పురాణములలోని అనేక ప్రస్తావనలతో రాజమాతలను ఓదార్చి, చేతులు జోడించి, నిష్కపటముగా ఋజుభావనముతో పలికెను. "ఓ విధాతా! ఒకవేళ నా సమ్మతితో ఈ పని జరిగియున్నచో తలిదండ్రులను, పుత్రులను చంపిన పాపము, గోశాలలను, బ్రాహ్మణాగ్రహారములను తగుల బెట్టిన పాపము, స్త్రీ శిశు హత్యాపాపము, మిత్రునకును, రాజునకును విషమిచ్చిన పాపము మనోవాక్కర్మలచే చేసెడి పాపములన్నియును- నాకు అంటునుగాక. (చౌ॥ 1-4)

దో- జే పరిహరి హరి హర చరన, భజహిఀ భూతగన ఘోర ।
తేహి కఇ గతి మొహి దేఉ బిధి, జౌఀ జననీ మత మోర ॥ 167 ॥

మాతా! ఈ కుట్రలో నాకు భాగమున్నచో శ్రీహరిని, పరమేశ్వరుని వదలి, భయంకరములైన భూతప్రేతములను పూజించువారికి పట్టెడిగతి నాకు ప్రాప్తించు గాక. (దో॥ 167)

చౌ- బేచహిఀ బేదు ధరము దుహి లేహీఀ । పిసున పరాయ పాప కహి దేహీఀ ॥
కపటీ కుటిల కలహప్రియ క్రోధీ । బేద బిదూషక బిస్వ బిరోధీ ॥ 1 ॥
లోభీ లంపట లోలుపచారా । జే తాకహిఀ పరధను పరదారా ॥
పావౌఀ మైఀ తిన్హ కై గతి ఘోరా । జౌఀ జననీ యహు సమ్మత మోరా ॥ 2 ॥
జే నహిఀ సాధుసంగ అనురాగే । పరమారథ పథ బిముఖ అభాగే ॥
జే న భజహిఀ హరి నరతను పాఈ । జిన్హహి న హరి హర సుజసు సోహాఈ ॥ 3 ॥
తజి శ్రుతిపంథు బామ పథ చలహీఀ । బంచక బిరచి బేష జగు ఛలహీఀ ॥
తిన్హ కై గతి మొహి సంకర దేఉ । జననీ జౌఀ యహు జానౌఀ భేఉ ॥ 4 ॥

అమ్మా! ఈ కుట్రలో నాకు భాగమున్నట్లయితే వేదములను విక్రయించువారు, ధర్మము పేర ఇతరులను మోసగించు వారు, చాడీలు చెప్పెడివారు, పరదూషణ చేయువారు, కపటులు, కుటిలురు, మోసకారులు, పోట్లాడు

వారు, కోపిష్ఠులు, వేదనింద, పరిహాసములను చేయు వారు, లోకవిరోధులు, వ్యభిచారులు, చంచలస్వభావులు, పరస్త్రీలను, పరధనమును అపహరింప జూచువారు, పొందెడి దుర్గతి నాకు పట్టుగాక. అంతేగాక తల్లీ! సజ్జన సాంగత్యమునకు ఇష్టపడని వారు, పరమార్థమునకు విముఖులు, మానవజన్మనెత్తి హరిని భజింపని వారు, హరి హరుల గుణగానమునకు ఆనందింపనివారు, వైదికమార్గములను వదలి, వామమార్గములను అనుసరించువారు, కపటవేషములను ధరించి ధనార్జన చేయువారు, పొందెడి దురవస్థలను శంకరుడు నాకు ప్రసాదించు గాక.

(చౌ॥ 1-4)

**దో- మాతు భరత కే బచన సుని, సాఁచే సరల సుభాయఁ।**
**కహతి రామ ప్రియ తాత తుమ్హ, సదా బచన మన కాయఁ॥ 168 ॥**

భరతునినిష్కపటములైన స్వాభావికవచనములను విని, కౌసల్యాదేవి "నాయనా! నీవు త్రికరణ శుద్ధిగా సర్వదా శ్రీరామునకు ప్రీతిని గూర్చువాడవు. (శ్రీరామునకు ప్రీతిపాత్రుడవు)" అని పలికెను. (దో॥ 168)

చౌ- రామ ప్రానహు తేఁ ప్రాన తుమ్హారే। తుమ్హ రఘుపతిహి ప్రానహు తేఁ ప్యారే ॥
బిధు బిష చవై స్రవై హిము ఆగీ । హోఇ బారిచర బారి బిరాగీ ॥ 1 ॥
భఏఁ గ్యాను బరు మిటై న మోహూ । తుమ్హ రామహి ప్రతికూల న హోహూ ॥
మత తుమ్హార యహు జో జగ కహహీఁ । సో సపనేహుఁ సుఖ సుగతి న లహహీఁ ॥ 2 ॥
అస కహి మాతు భరతు హియఁ లాఏ । థన పయ స్రవహిఁ నయన జల ఛాఏ ॥
కరత బిలాప బహుత ఏహి భాఁతీ । బైఠేహిఁ బీతి గఈ సబ రాతీ ॥ 3 ॥
బామదేఉ బసిష్ఠ తబ ఆఏ । సచివ మహాజన సకల బోలాఏ ॥
ముని బహు భాఁతి భరత ఉపదేసే । కహి పరమారథ బచన సుదేసే ॥ 4 ॥

"శ్రీరాముడు నీకు ప్రాణములకంటెను ప్రియమైనవాడు. అట్లే శ్రీరామునకు నీవు ప్రీతి పాత్రుడవు. చంద్రుడు విషమును వెదజల్లవచ్చును, మంచు మంటలను చిమ్మవచ్చును, జలచరములు జలములయెడ విముఖత చూపవచ్చును, జ్ఞానులైనప్పటికినీ వారు మోహమునకు దూరము కాలేకపోవచ్చును, కాని ఎట్టి పరిస్థితులలోను నీవు శ్రీరామునకు ప్రతికూలుడవు కానే కావు. ఈ కుట్ర నీ సమ్మతితో జరిగినదని భావించిన వారికి ఈ జగత్తులో పుట్టగతులుండవు. వారికి కలలోగూడ సుఖశాంతులుండవు." ఇట్లు పలికి, కౌసల్య భరతుని అక్కున జేర్చుకొనెను. ఆమెకు స్తన్యములు (చనుబాలు) స్రవించెను. నేత్రములు అశ్రుపూర్ణములాయెను. ఈ విధముగా వారు విలపించుచుండగా ఆ రాత్రి గడిచెను. ఉదయముననే వామదేవుడును వసిష్ఠుడును అచటికి వచ్చిరి. వారు మంత్రులను, నగరములోని ప్రముఖులను పిలిపించిరి. పిమ్మట వసిష్ఠమహర్షి సందర్భోచితములైన పరమార్థ విషయములను దెలిపి, భరతునకు అనేకములైన ఉపదేశములను ఇచ్చెను. (చౌ॥ 1-4)

## భరతుడు తండ్రికి అంత్య సంస్కారములను ఆచరించుట

దో- తాత హృదయఁ ధీరజు ధరహు, కరహు జో అవసర ఆజు।
ఉఠే భరత గుర బచన సుని, కరన కహేఉ సబు సాజు ॥ 169 ॥

వసిష్ఠ మహర్షి "నాయనా! ధైర్యమును వహించి, ఇప్పుడు చేయవలసిన విధులను ఆచరింపుము"- అని పలికెను. గురువుగారి మాటలను విని, భరతుడు లేచి, తండ్రిగారి అంత్యక్రియలకు ఏర్పాట్లు చేయవలసినదిగా తగినవారితో పలికెను. (దో॥ 169)

చౌ- నృపతను బేద బిదిత అన్హవావా। పరమ బిచిత్ర బిమాను బనావా ॥
గహి పద భరత మాతు సబ రాఖీ। రహీఁ రాని దరసన అభిలాషీ ॥ 1 ॥
చందన అగర భార బహు ఆఏ। అమిత అనేక సుగంధ సుహాఏ ॥
సరజు తీర రచి చితా బనాఈ। జను సురపుర సోపాన సుహాఈ ॥ 2 ॥
ఏహి బిధి దాహ క్రియా సబ కీన్హీ। బిధివత న్హాఇ తిలాంజులి దీన్హీ ॥
సోధి సుమృతి సబ బేద పురానా। కీన్హ భరత దసగాత బిధానా ॥ 3 ॥
జహఁ జస మునిబర ఆయసు దీన్హా। తహఁ తస సహస భాఁతి సబు కీన్హా ॥
భఏ బిసుద్ధ దిఏ సబ దానా। ధేను బాజి గజ బాహన నానా ॥ 4 ॥

వేదోక్తముగా రాజుగారికళేబరమునకు స్నానాదివిధులు నిర్వహింపబడెను. పిదప విచిత్రముగా నిర్మింపబడిన విమానమున రాజమర్యాదలతో ఆకళేబరము, సరయూనదీతీరమునకు చేర్చబడెను. భరతుడు తల్లులకు పాదాభివందనము చేసి, సహగమనము చేయకుండ వారిని ఆపెను. వారును శ్రీరాముని దర్శనాభిలాషులై నిలిచిపోయిరి. చందనము, అగరు మొదలగు అనేకసుగంధద్రవ్యములు అచటికి తీసికొనిరాబడెను సరయూతీరమున 'చితి' ఏర్పాటు చేయబడెను. అది స్వర్గమును అధిరోహించుటకు 'నిచ్చెన'యా అనునట్లుండెను. దహనసంస్కారములు ముగిసినపిదప విధ్యుక్తముగా అందఱును స్నానములుచేసి, తిలాంజలులను అర్పించిరి. శ్రుతి, స్మృతి, పురాణములలో చెప్పబడిన రీతిగా పదిరోజుల కార్యక్రమములను భరతుడు సక్రమముగా నిర్వర్తించెను. వసిష్ఠునిఆజ్ఞలను అన్నింటిని భరతుడు చక్కగా నెఱవేర్చెను. శుచియైన పిమ్మట అతడు అనేక దానములను చేసెను. గోవులు, గుఱ్ఱములు, ఏనుగులు అనేక వాహనములు- (చౌ॥ 1-4)

దో- సింఘాసన భూషన బసన, అన్న ధరని ధన ధామ।
దిఏ భరత లహి భూమిసుర, భే పరిపూరన కామ ॥ 170 ॥

సింహాసనములు, ఆభరణములు, అన్నవస్త్రములు, భూములు గృహములు, మున్నగు దానములను చేసెను. ఆదానములతో బ్రాహ్మణులు సంతృప్తులైరి. (దో॥ 170)

చౌ- పితు హిత భరత కీన్హి జసి కరనీ । సో ముఖ లాఖ జాఇ నహిఁ బరనీ ।
సుదిను సోధి మునిబర తబ ఆఏ । సచివ మహాజన సకల బోలాఏ ॥ 1 ॥
బైఠే రాజసభాఁ సబ జాఈ । పఠఏ బోలి భరత దోఉ భాఈ ॥
భరతు బసిష్ఠ నికట బైఠారే । నీతి ధరమమయ బచన ఉచారే ॥ 2 ॥
ప్రథమ కథా సబ మునిబర బరనీ । కైకఇ కుటిల కీన్హి జసి కరనీ ॥
భూప ధరము బ్రతు సత్య సరాహా । జెహిఁ తను పరిహరి ప్రేము నిబాహా ॥ 3 ॥
కహత రామ గున సీల సుభాఊ । సజల నయన పులకెఉ మునిరాఊ ॥
బహురి లఖన సియ ప్రీతి బఖానీ । సోక సనేహ మగన ముని గ్యానీ ॥ 4 ॥

భరతుడు తండ్రిగారిఅంత్య క్రియలను విధివిధానముగా ఆచరించిన రీతియు, అతడు చూపిన భక్తి శ్రద్ధలును శ్లాఘనీయములు. పిదప ఒక శుభదినమున వసిష్ఠుడు మంత్రులను, విశిష్ట పౌరులను పిలిపించెను. అందఱును రాజసభలో ఆసీనులైనపిదప వసిష్ఠుడు భరత శత్రుఘ్నులను పిలిపించెను. భరతుని తనయొద్ద కూర్చుండబెట్టుకొని, పెక్కు నీతులను, ధర్మములను ఉపదేశించెను. మొదట ఆ మహాముని కైకేయినడిపిన కుటిలకార్యములను వివరించెను. అనంతరము రాజుగారి ధర్మవ్రతమును, సత్యనిష్ఠను ప్రశంసించెను. రాజుగారి ఈ ప్రాణత్యాగము ఆయనకు శ్రీరామచంద్రునిపైగల గాఢప్రేమను సూచించుచున్నదని అతడు పేర్కొనెను. శ్రీరామచంద్రునిగుణశీలస్వభావములను వర్ణించుచుండగా మునీశ్వరుని నేత్రములు అశ్రుపూరితములాయెను. శరీరము గగుర్పొడిచెను. శ్రీరామునియెడ సీతాలక్ష్మణుల ప్రేమను వర్ణించుచు ముని శోకస్నేహములలో మునిగిపోయెను. (చౌ॥ 1-4)

## భరతునకు వసిష్ఠుని ఉపదేశము

దో- సునహు భరత భావీ ప్రబల, బిలఖి కహేఉ మునినాథ ।
హాని లాభు జీవను మరను, జసు అపజసు బిధి హాథ ॥ 171 ॥

వికల మనస్కుడైన వసిష్ఠుడు ఇట్లు పలికెను. 'భరతా! వినుము. విధి చాల బలీయమైనది. హానివృద్ధులు, జీవన-మరణములు, కీర్తి-అపకీర్తులు విధి అధీనములు. (దో॥ 171)

చౌ- అస బిచారి కేహి దేఇఅ దోసూ । బ్యరథ కాహి పర కీజిఅ రోసూ ॥
తాత బిచారు కరహు మన మాహీఁ । సోచ జోగు దసరథు నృపు నాహీఁ ॥ 1 ॥
సోచిఅ బిప్ర జో బేద బిహీనా । తజి నిజ ధరము బిషయ లయలీనా ॥
సోచిఅ నృపతి జో నీతి న జానా । జెహి న ప్రజా ప్రియ ప్రాన సమానా ॥ 2 ॥
సోచిఅ బయసు కృపన ధనవానూ । జో న అతిథి సివ భగతి సుజానూ ॥
సోచిఅ సూద్రు బిప్ర అవమానీ । ముఖర మానప్రియ గ్యాన గుమానీ ॥ 3 ॥

సోచిఅ పుని పతి బంచక నారీ । కుటిల కలహప్రియ ఇచ్ఛాచారీ ॥
సోచిఅ బటు నిజ బ్రతు పరిహరఈ । జో నహిఁ గుర ఆయసు అనుసరఈ ॥ 4 ॥

ఈ విషయములను గ్రహించినచో ఎవ్వరినీ దోషిగా ఎంచరాదు. కోపగింపరాదు. దీనిని సావధానముగా ఆలోచింపుము. దశరథునికై విచారపడవలదు. వేదవిజ్ఞానహీనులై తమ విధ్యుక్త ధర్మములను వదలి, విషయ భోగములలో మునిగిన బ్రాహ్మణులకై విచారపడవలెను. నీతికిని ధర్మములకును తిలోకములిచ్చి, ప్రజలను ప్రాణసమానముగాచూడనిరాజులకై విచారపడవలెను. ధనవంతులైనను లోభులై, అతిథి సత్కారములను, శివపూజలను చేయని వైశ్యులకై విచారపడవలెను. బ్రాహ్మణులను అవమానపఱచుచు వాచాలురై, తమ గౌరవము, జ్ఞానమునందు మాత్రమే అభిమానముగల శూద్రులకై విచారపడవలెను. పతిని మోసగించు కుటిలస్వభావురాలు, కలహప్రియ, స్వేచ్ఛాచారిణి, ఐన స్త్రీకై విచారపడవలయును. బ్రహ్మ చర్య వ్రతమును వదలి, గురునాజ్ఞను ఆచరింపని బ్రహ్మచారికై విచారపడవలెను. (చౌ॥ 1-4)

దో- సోచిఅ గృహీ జో మోహ బస, కరఇ కరమ పథ త్యాగ ।
సోచిఅ జతీ ప్రపంచ రత, బిగత బిబేక బిరాగ ॥ 172 ॥

మోహవశమున కర్మమార్గమునువదలిన గృహస్థునకై, వివేకవైరాగ్యహీనుడై మాయా ప్రపంచమగ్నుడైన సన్న్యాసికై విచారపడవలెను. (దో॥ 172)

చౌ- బైఖానస సోఇ సోచై జోగూ । తపు బిహాఇ జెహి భావఇ భోగూ ॥
సోచిఅ పిసున అకారన క్రోధీ । జనని జనక గుర బంధు బిరోధీ ॥ 1 ॥
సబ బిధి సోచిఅ పర అపకారీ । నిజ తను పోషక నిరదయ భారీ ॥
సోచనీయ సబహిఁ బిధి సోఈ । జో న ఛాడి ఛలు హరి జన హోఈ ॥ 2 ॥
సోచనీయ నహిఁ కోసలరాఊ । భువన చారిదస ప్రగట ప్రభాఊ ॥
భయఉ న అహఇ న అబ హోనిహారా । భూప భరత జస పితా తుమ్హారా ॥ 3 ॥
బిధి హరి హరు సురపతి దిసినాథా । బరనహిఁ సబ దసరథ గున గాథా ॥ 4 ॥

తన తపస్సులను మాని, భోగలాలసుడైన వానప్రస్థునకై విచారపడవలయును. చాడీలను చెప్పెడివారు, అకారణముగ కోపగించువారు, తలిదండ్రులను గురువులను సోదరులను బంధువులను ద్వేషించు వారు మొదలగు వారికై విచారపడవలెను. ఇతరులకు కీడు తలపెట్టుచు తమఉదరపోషణార్థమైజీవించు నిర్దయులకై విచారపడవలెను. కపటస్వభావముగలిగిన హరిభక్తి హీనులకై విచారపడవలెను. కాని పదునాలుగు లోకములయందు కీర్తిగాంచిన కోసలాధిపతి దశరథునికై విచారపడనవసరమేలేదు. మీ తండ్రివంటి మహారాజు భూత, వర్తమాన కాలములలో ఇంతవఱకును ఉండలేదు. ఇక ముందు ఉండబోడు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, ఇంద్రాది దిక్పాలకులు దశరథుని గుణములను కీర్తించెదరు. (చౌ॥ 1-4)

దో- కహహు తాత కేహి భాఁతి కోఉ, కరిహి బడాఈ తాసు ।
రామ లఖన తుమ్హ సత్రుహన, సరిస సుఅన సుచి జాసు ॥ 173 ॥

నాయనా! రామలక్ష్మణులను, శత్రుఘ్నుని, నిన్ను కుమారులనుగా గన్న ఆయన గొప్పదనమును ఎవరు వర్ణింపగలరు? నీవే తెలుపుము. (దో॥ 173)

చౌ- సబ ప్రకార భూపతి బడభాగీ । బాది బిషాదు కరిఅ తెహి లాగీ ॥
యహ సుని సముఝి సోచు పరిహరహూ । సిర ధరి రాజ రజాయసు కరహూ ॥ 1 ॥
రాయఁ రాజపదు తుమ్హ కహుఁ దీన్హా । పితా బచను పుర చాహిఅ కీన్హా ॥
తజే రాము జెహిఁ బచనహి లాగీ । తను పరిహరేఉ రామ బిరహాగీ ॥ 2 ॥
నృపహి బచన ప్రియ నహిఁ ప్రియ ప్రానా । కరహు తాత పితు బచన ప్రవానా ॥
కరహు సీస ధరి భూప రజాఈ । హఇ తుమ్హ కహఁ సబ భాఁతి భలాఈ ॥ 3 ॥
పరసురామ పితు అగ్యా రాఖీ । మారీ మాతు లోక సబ సాఖీ ॥
తనయ జజాతిహి జౌబను దయఊ । పితు అగ్యాఁ అఘ అజసు న భయఊ ॥ 4 ॥

రాజాగారు అన్నివిధములుగా అదృష్టవంతులు. ఆయన కొఱకు విచారింప వలదు. సావధానముగా ఆలోచించి, ఊరటను పొంది, రాజాజ్ఞను శిరసావహింపుము. ఆయన రాజ పదవిని నీకు ఇచ్చినాడు. ఆయనను గౌరవింపవలెను. సత్యవాక్య పాలనకొఱకే శ్రీరాముని వనవాసమునకు పంపినారు. శ్రీరాముని వియోగాగ్నికి తన ప్రాణములను ఆహుతిగా నిచ్చినారు. రాజుగారికి ప్రాణములకంటెను సత్యవాక్పరిపాలనమే ప్రియమైనది. కనుక నాయనా! ఆయన మాటను నిలబెట్టుము. రాజాజ్ఞను శిరసావహింపుము. దీనివలన నీకు మేలుకలుగును. పరశురాముడు తండ్రిగారి ఆజ్ఞను పాలించి, తల్లిని గూడ వధించెను. లోకములన్నియు దీనికి సాక్షులే. యయాతి పుత్రుడు తన యౌవనమును తండ్రికి ఇచ్చెను. పితృాజ్ఞాపరిపాలనమువలన వారికి పాపముగాని, అపకీర్తిగాని రాలేదు. (చౌ॥ 1-4)

దో- అనుచిత ఉచిత బిచారు తజి, జే పాలహిఁ పితు బైన ।
తే భాజన సుఖ సుజస కే, బసహిఁ అమరపతి ఐన ॥ 174 ॥

ఉచితానుచితములనుగూర్చి విచారింపక తండ్రి యాజ్ఞను పాలించు వారు లోకములో కీర్తి ప్రతిష్ఠలను, సుఖమును పొందెదరు. కడకు స్వర్గధామమును చేరెదరు. (దో॥ 174)

చౌ- అవసి నరేస బచన పుర కరహూ । పాలహు ప్రజా సోకు పరిహరహూ ॥
సురపుర నృపు పాఇహి పరితోషూ । తుమ్హ కహుఁ సుకృతు సుజసు నహిఁ దోషూ ॥ 1 ॥
బేద బిదిత సమ్మత సబహీ కా । జెహి పితు దేఇ సో పావఇ టీకా ॥
కరహు రాజు పరిహరహు గలానీ । మానహు మోర బచన హిత జానీ ॥ 2 ॥

సుని సుఖు లహబ రామ బైదేహీఁ । అనుచిత కహబ న పండిత కేహీఁ ॥
కౌసల్యాది సకల మహతారీఁ । తేఉ ప్రజా సుఖ హోహిఁ సుఖారీఁ ॥ 3 ॥
పరమ తుమ్హార రామ కర జానిహి । సో సబ బిధి తుమ్హ సన భల మానిహి ॥
సౌఁపెహు రాజు రామ కే ఆఏఁ । సేవా కరెహు సనేహ సుహాఏఁ ॥ 4 ॥

రాజుగారి వచనములను సత్యము చేయుము. శోకమును వీడి, ప్రజలను పాలింపుము. దీని వలన స్వర్గము చేరిన రాజుగారు సంతోషించెదరు. నీకు పుణ్యము దక్కును. నీవు వాసికెక్కెదవు. దోషము అంటదు. తండ్రి ఎవరికి రాజ్యమును అప్పగించునో ఆతడే రాజగును- అని వేదములలో స్మృతిపురాణాది శాస్త్రములలో పేర్కొనబడినది. కావున నామాట విని, విచారమును మాని, రాజ్యమును పాలింపుము. నీవు రాజైనవార్తను విన్నచో సీతారాములును సంతసించెదరు. పండితులెవ్వరును దీనిని అనుచితముగా భావింపరు. ప్రజలు సుఖముగా నుండుటచే కౌసల్యాది రాజమాతలుగూడ తృప్తిపడెదరు. శ్రీరాముడు నీకు పరమ-ఆరాధ్యుడు. నీకును శ్రీరామునకును మధ్యగలప్రేమానురాగములను తెలిసినవారు అన్నివిధములుగా నిన్ను మెచ్చుకొందురు. శ్రీరామచంద్రుడు తిరిగివచ్చినపిదప రాజ్యమును ఆయనకు అప్పగించి, ప్రేమతో సేవచేయుము"- (చౌ॥ 1-4)

దో- కీజిఅ గుర ఆయసు అవసి, కహహిఁ సచివ కర జోరి ।
రఘుపతి ఆఏఁ ఉచిత జస, తస తబ కరబ బహోరి ॥ 175 ॥

మంత్రులు అంజలి ఘటించి, భరతుని ప్రార్థించిరి. "గురువుగారి ఆజ్ఞను అవశ్యముగా పాలింపుడు. శ్రీరాముడు తిరిగి వచ్చిన పిమ్మట మీకు ఉచితమని తోచినట్లు చేయుడు." (దో॥ 175)

చౌ- కౌసల్యా ధరి ధీరజు కహఈ । పూత పథ్య గుర ఆయసు అహఈ ॥
సో ఆదరిఅ కరిఅ హిత మానీ । తజిఅ బిషాదు కాల గతి జానీ ॥ 1 ॥
బన రఘుపతి సురపతి నరనాహూ । తుమ్హ ఏహి భాఁతి తాత కదరాహూ ॥
పరిజన ప్రజా సచివ సబ అంబా । తుమ్హహీ సుత సబ కహఁ అవలంబా ॥ 2 ॥
లఖి బిధి బామ కాలు కఠినాఈ । ధీరజు ధరహు మాతు బలి జాఈ ॥
సిర ధరి గుర ఆయసు అనుసరహూ । ప్రజా పాలి పరిజన దుఖు హరహూ ॥ 3 ॥
గుర కే బచన సచివ అభినందను । సునే భరత హియ హిత జను చందను ॥
సునీ బహోరి మాతు మృదు బానీ । సీల సనేహ సరల రస సానీ ॥ 4 ॥

ధైర్యమును కూడగట్టుకొని, కౌసల్యాదేవి పలికెను. "కుమారా! గురువుగారి ఆజ్ఞ శ్రేయోదాయకము. దానిని హితముగా భావించి ఆదరింపుము. ఇది యంతయు విధి నిర్ణయముగా తలంచి, విషాదమును వీడుము. శ్రీరామచంద్రుడు వనములలోనున్నాడు. మహారాజు స్వర్గస్థులైనారు. నాయనా! నీవు ఈ విధముగా వెనుకాడుచున్నావు. కుటుంబమునకును, ప్రజలకును, మంత్రులకును, తల్లులకును- అందటికిని నీవే ఆధారము.

విధి వైపరీత్యమును, ప్రతికూలకాల పరిస్థితిని గమనించి ధైర్యమును వహింపుము. నేను నీ తల్లిగా చెప్పుచున్నాను. గుర్వాజ్ఞను శిరసావహింపుము. ప్రజలను పాలించి, వారి దుఃఖములను పోగొట్టుము." భరతుడు గురువుగారి వచనములను, దానికి మంత్రుల సమర్థనననుగ్రహించెను. అవి అతని హృదయమును చందనమువలె చల్లబఱచెను. కౌసల్యాదేవి సౌశీల్యముతో వాత్సల్యముతో పలికిన అమృతతుల్యములైన మృదువచనములనుగూడ వినెను. (చౌ॥ 1-4)

ఛం- సానీ సరల రస మాతు బానీ సుని భరతు బ్యాకుల భఏ ।
లోచన సరోరుహ స్రవత సీంచత బిరహ ఉర అంకుర నఏ ॥
సో దసా దేఖత సమయ తెహి బిసరీ సబహి సుధి దేహ కీ ।
తులసీ సరాహత సకల సాదర సీవఁ సహజ సనేహ కీ ॥

అతి కోమలములై నిష్కపటములైన మాతృవాక్యములను విని, భరతుడు మిక్కిలి కలత చెందెను. కమలములవంటి అతనికన్నులనుండి అశ్రువులు ప్రవహించి విరహాంకురములను తడుపసాగెను. అతని ఈ స్థితిని జూచి అందఱును తమ శరీరస్మృతిని గోల్పోయిరి. భరతుని ఈ సహజమైన భ్రాతృప్రేమలోకమునకే ఆదర్శమని ఎల్లరును శ్లాఘించిరి.- అని తులసీదాసు చెప్పుచున్నాడు. (ఛం)

సో- భరతు కమల కర జోరి, ధీర ధురంధర ధీర ధరి ।
బచన అమిఅఁ జను బోరి, దేత ఉచిత ఉత్తర సబహి ॥ 176 ॥

సహజముగా ధీరవరుడగుటచే భరతుడు ధైర్యమును కూడగట్టుకొని, తన కరకమలములను జోడించి, అమృతసిక్తములైన వాక్కులతో అందఱికిని సమాధానముల నీయసాగెను. (సో॥ 176)

మాసపారాయణము-పదునెనిమిదవ విరామము

## భరతుని విన్నపము

చౌ- మొహి ఉపదేసు దీన్హ గుర నీకా । ప్రజా సచివ సమ్మత సబహీ కా ॥
మాతు ఉచిత ధరి ఆయసు దీన్హా । అవసి సీస ధరి చాహఉఁ కీన్హా ॥ 1 ॥
గుర పితు మాతు స్వామి హిత బానీ । సుని మన ముదిత కరిఅ భలి జానీ ॥
ఉచిత కి అనుచిత కిఏఁ బిచారూ । ధరము జాఇ సిర పాతక భారూ ॥ 2 ॥
తుమ్హ తౌ దేహు సరల సిఖ సోఈ । జో ఆచరత మోర భల హోఈ ॥
జద్యపి యహ సముఝత హఉఁ నీకేఁ । తదపి హోత పరితోషు న జీ కేఁ ॥ 3 ॥
అబ తుమ్హ బినయ మోరి సుని లేహూ । మొహి అనుహరత సిఖావను దేహూ ॥
ఊతరు దేఉఁ ఛమబ అపరాధూ । దుఖిత దోష గున గనహిఁ న సాధూ ॥ 4 ॥

"గురువుగారు నాకు మిక్కిలి మంచి ఉపదేశము నిచ్చిరి. మంత్రులకును ప్రజలకును అది సమ్మతమే. తల్లిగారు(కౌసల్య)కూడ అదే యుచితమని ఆదేశించిరి. నేను గూడ దానిని గౌరవముతో పాటింపదలచితిని. గురువు, తల్లి దండ్రులు, ప్రభువు, మిత్రులు- వీరిమాటలను సంతోషముతో స్వీకరింపవలెను. ఉచితానుచితములనుగూర్చి ఆలోచించినచో ధర్మము నష్టమగును. పాపమును తలపై మోయవలసివచ్చును. నాకు హితకరమైన దానిని అనుసరించుటకు మీరు సూచనలను ఇచ్చుచున్నారు. ఆ విషయమును నేను చక్కగా గ్రహించినను నా హృదయము ఊరట చెందుటలేదు. ఇంక నా విన్నపమును వినుడు. తరువాత నా శక్తి సామర్థ్యములను, స్వభావమును బట్టి నాకు ఏది ఉచితమో దానిని ఉపదేశింపుడు. దానిని నేను పాటించెదను. నేను ఇట్లు చెప్పుచున్నందులకు నన్ను మన్నింపుడు. 'మహాత్ములు దుఃఖితుల గుణదోషములను లెక్కింపరు.' (చౌ॥ 1-4)

**దో- పితు సురపుర సియ రాము బన, కరన కహహు మోహి రాజు ।**
**ఏహి తేఁ జానహు మోర హిత, కై ఆపన బడ కాజు ॥ 177 ॥**

తండ్రిగారు స్వర్గములోనున్నారు. శ్రీరామచంద్రుడు వనములలో నున్నాడు. మీరు నన్ను రాజ్యమును పాలింపుమనుచున్నారు. దీనివలన నాకు మంచి జరుగునా? లేక మీకేమైనను లాభము జరుగునని ఆసించుచున్నారా? (దో॥ 177)

చౌ- హిత హమార సియపతి సేవకాఈఁ । సో హరి లీన్హ మాతు కుటిలాఈఁ ॥
మై అనుమాని దీఖ మన మాహీఁ । ఆన ఉపాయఁ మోర హిత నాహీఁ ॥ 1 ॥
సోక సమాజు రాజు కేహి లేఖేఁ । లఖన రామ సియ బిను పద దేఖేఁ ॥
బాది బసన బిను భూషన భారూ । బాది బిరతి బిను బ్రహ్మ బిచారూ ॥ 2 ॥
సరుజ సరీర బాది బహు భోగా । బిను హరిభగతి జాయఁ జప జోగా ॥
జాయఁ జీవ బిను దేహ సుహాఈ । బాది మోర సబు బిను రఘురాఈ ॥ 3 ॥
జాఉఁ రామ పహిఁ ఆయసు దేహూ । ఏకహిఁ ఆఁక మోర హిత ఏహూ ॥
మోహి నృప కరి భల ఆపన చహహూ । సోఉ సనేహ జడతా బస కహహూ ॥ 4 ॥

సీతాపతిసేవలోనే నాకు హితముగలదు. కాని, నా తల్లి కుటిలత్వముచేత అది హరింపబడినది. నేను నా మనస్సును చక్కగా శోధించిన పిమ్మట 'సీతారాముల సేవలు తప్ప మఱియే ఉపాయమువలనగూడ నాకు హితము కలుగదు' అని గ్రహించితిని. పరమసుఖ ప్రదమైన శ్రీ సీతారామ లక్ష్మణుల పాదములను దర్శింపని నాకు ఈ రాజ్యమువలన ఏమి ప్రయోజనము? నిజముగా ఇది శోకసముదాయహేతువే. వస్త్రములను ధరింపక ఎన్ని ఆభరణములను ధరించినను ఏమి ప్రయోజనము? వైరాగ్యములేకుండ బ్రహ్మవిచారమువలన ప్రయోజనమేమి? రోగగ్రస్తమైనశరీరమునకు వివిధభోగములు వ్యర్థములు. హరి భక్తిలేని జప యోగములూ, ఆత్మలేనిశరీరమూ నిష్ప్రయోజనములు. అట్లే శ్రీరాముడులేనిదే నాకు ఎన్నియున్నను వ్యర్థమే. నేను శ్రీరామునికడకు వెళ్లుటకు నాకు ఆజ్ఞను ప్రసాదింపుడు. దీని వలననే నాకు సర్వశ్రేయస్సులును కలుగునని నా ఏకైక నిశ్చయము. నన్ను రాజుగా జేసినచో మీకు లాభముండునని మీరు తలచుచున్నారు. కాని దానికి నామీద మీకుగల స్నేహజాడ్యమే (పిచ్చిమోహమే) కారణము. (చౌ॥ 1-4)

దో- కైకేఈ సుఅ కుటిలమతి, రామ బిముఖ గతలాజ ।
తుమ్హ చాహత సుఖు మోహబస, మొహి సే అధమ కె( రాజ ॥ 178 ॥

కైకేయి పుత్రుడు, కుటిలబుద్ధి, రామునకు విముఖుడు, లజ్జావిహీనుడు ఐన నావంటి అధమునిరాజ్యములో సుఖములను ఆసించుట కేవలము మోహముమాత్రమే. (దో॥ 178)

చౌ- కహఉ( సాఁచు సబ సుని పతిఆహూ । చాహిఅ ధరమసీల నరనాహూ ॥
మోహి రాజు హఠి దేఇహహు జబహీఁ । రసా రసాతల జాఇహి తబహీఁ ॥ 1 ॥
మొహి సమాన కో పాప నివాసూ । జెహి లగి సీయ రామ బనబాసూ ॥
రాయఁ రామ కహుఁ కానను దీన్హా । బిఛురత గమను అమరపుర కీన్హా ॥ 2 ॥
మైఁ సఠు సబ అనరథ కర హేతూ । బైఠ బాత సబ సునఉఁ సచేతూ ॥
బిను రఘుబీర బిలోకి అబాసూ । రహే ప్రాన సహి జగ ఉపహాసూ ॥ 3 ॥
రామ పునీత బిషయ రస రూఖే । లోలుప భూమి భోగ కే భూఖే ॥
కహఁ లగి కహౌఁ హృదయ కఠినాఈ । నిదరి కులిసు జెహిఁ లహీ బడాఈ ॥ 4 ॥

నేను నిజమును పలుకుచున్నాను. అందఱును విని విశ్వసింపుడు. ధర్మశీలుడే రాజు కావలెను. మీరు బలవంతముగా నన్ను రాజునుజేసినచో ఈ భూతలము రసాతలమును జేరును. నాకారణముగా సీతాదేవియు, శ్రీరాముడును అడవులపాలైరి. అట్టి నావంటి పాపాత్ముడు ఎవ్వడుండును? రాజుగారు శ్రీరామునకు వనవాసమును ఇచ్చి, వారి వియోగమునకు తట్టుకొనలేక స్వర్గస్థులైరి. నేను దుష్టుడను. అన్ని అనర్థములకును మూలకారణమైనవాడను. ప్రాణములతో కూర్చొని మీ మాటలను వినుచున్నాను. శ్రీరఘునాథుడు లేని ఈ భవనమును శూన్యప్రాయముగా చూచుచును, లోకము చేయు పరిహాసమును భరించుచును, ఈ ప్రాణములు ఇంకను పోకున్నవి. ఈ ప్రాణములు పవిత్రమైన శ్రీరామునిప్రేమరసమునందు ఆసక్తములు కావు. ఇది ముమ్మాటికి నిజము- ఇవి రాజ్యలోభము, విషయభోగములకై ఆకలి గొనియున్నవి. నా హృదయము వజ్రముకంటెను కఠినమైనది. (చౌ॥ 1-4)

దో- కారన తేఁ కారజు కఠిన, హోఇ దోసు నహిఁ మోర ।
కులిస అస్థి తేఁ ఉపల తేఁ, లోహ కరాల కఠోర ॥ 179 ॥

కారణములకంటెను కార్యము కఠినమగును. కనుక ఇందులో నా దోషము ఏమియునులేదు. ఎముకకంటెను వజ్రము, ఱాతికంటెను ఇనుము కఠినమైనవి. (దో॥ 179)

చౌ- కైకేఈ భవ తను అనురాగే । పావఁర ప్రాన అఘాఇ అభాగే ॥
జౌఁ ప్రియ బిరహఁ ప్రాన ప్రియ లాగే । దేఖబ సునబ బహుత అబ ఆగే ॥ 1 ॥
లఖన రామ సియ కహుఁ బను దీన్హా । పఠఇ అమరపుర పతి హిత కీన్హా ॥
లీన్హ బిధవపన అపజసు ఆపూ । దీన్హేఉ ప్రజహి సోకు సంతాపూ ॥ 2 ॥

మోహి దీన్హ సుఖు సుజసు సురాజూ । కీన్హ కైకఈఀ సబ కర కాజూ ॥
ఏహి తేఀ మోర కాహ అబ నీకా । తేహి పర దేన కహహు తుమ్హ టీకా ॥ 3 ॥
కైకఇ జఠర జనమి జగ మాహీఀ । యహ మోహి కహఀ కఛు అనుచిత నాహీఀ ॥
మోరి బాత సబ బిధిహిఀ బనాఈ । ప్రజా పాఀచ కత కరహు సహాఈ ॥ 4 ॥

కైకేయిగర్భమునుండిజన్మించిన ఈ శరీరమును అంటిపెట్టుకొనియున్న ఈ నీచప్రాణములు మిక్కిలి అదృష్టహీనములు. నా ప్రేమనిధానమైనవానివియోగమునకు పిమ్మట గూడ నా ప్రాణములునాకు ప్రియమైనచో మున్ముందు ఇంకను చూడవలసినవి, వినవలసినవి ఐన దుర్భరవిషయములు ఎన్నియున్నవో? ఆమె (కైక) శ్రీరామలక్ష్మణులను, సీతాదేవిని అడవులకంపెను. పతిని దేవలోకమునకు పంపి ఆయనకు ఉపకారమే చేసెను. తాను దుర్భర వైధవ్యమును కొండంత అపకీర్తిని తలకెత్తుకొనెను. ప్రజలను శోకసంతప్తులనుజేసెను. నాకు మాత్రము సుఖమును, రాజ్యమును సత్కీర్తిని కట్టబెట్టెను. కైకేయి అందఱి పనులను ఎంత నైపుణ్యముతో జేసినది? నాకింతకంటెను శుభమేముండును? ఇంతేగాక ఇంకను నన్ను మీరు రాజుగా చేయదలచుకొనినారు. కైకేయి గర్భమున జన్మించినందులకునేను రాజగుట అనుచితము ఏ మాత్రము గాదు. విధాతయే నాకు అన్నింటిని సమకూర్చినాడు. మీరును నా ప్రజలును కలిసి ఇంకను నాకు చేయవలసిన సహాయమేమున్నది? (చౌ॥ 1-4)

దో- గ్రహ గ్రహీత పుని బాత బస, తేహి పుని బీఛీ మార ।
తేహి పిఆఇఅ బారునీ, కహహు కాహ ఉపచార ॥ 180 ॥

క్రూరగ్రహములచేతనో లేక పిశాచముల వలననో గ్రసితుడైనవాడు వాతరోగముచే పీడితుడగుచుండగా వానిని తేలుకఱచినచో వానిచే మద్యమును త్రాగించుట చికిత్సయగునా? (అనగా వానికి ఎట్టి చికిత్సయును లేదు. వాడు బ్రతికి బయట పడలేడు.) (దో॥ 180)

చౌ-కైకఇ సుఅన జోగు జగ జోఈ । చతుర బిరంచి దీన్హ మోహి సోఈ ॥
దసరథ తనయ రామ లఘు భాఈ । దీన్హి మోహి బిధి బాది బడాఈ ॥ 1 ॥
తుమ్హ సబ కహహు కఢావన టీకా । రాయ రజాయసు సబ కహఀ నీకా ॥
ఉతరు దేఉఀ కేహి బిధి కేహి కేహీ । కహహు సుఖేన జథా రుచి జేహీ ॥ 2 ॥
మోహి కుమాతు సమేత బిహాఈ । కహహు కహిహి కే కీన్హ భలాఈ ॥
మో బిను కో సచరాచర మాహీఀ । జేహి సియ రాము ప్రానప్రియ నాహీఀ ॥ 3 ॥
పరమ హాని సబ కహఀ బడ లాహూ । అదిను మోర నహిఀ దూషన కాహూ ॥
సంసయ సీల ప్రేమ బస అహహూ । సబుఇ ఉచిత సబ జో కఛు కహహూ ॥ 4 ॥

కైకేయికొడుకుగా నేను దేనికి అర్హుడనో చతురుడైనవిధాత నాకు దానిని ప్రసాదించినాడు. కాని దశరథునిపుత్రునిగా శ్రీరామునితమ్మునిగా జేసి ప్రసాదించిన వరము వ్యర్థమైనది. ఇది చాలదన్నట్లు మీరు గూడ నన్ను పట్టాభిషిక్తుని కమ్మనుచున్నారు. ఇది రాజుగారి ఆజ్ఞ. మీకు అందఱికిని సమ్మతమైనది. నేనూ ఎవరికి ఏ

విధముగా సమాధానమీయవలెను? ఎవరికి ఏది సుఖప్రదమో? దానిని తెల్పుడు. నా కుమాత, నేనూ తప్ప 'జరిగిన పని మంచిది' అని ఎవరు అందురు? తెల్పుడు. జడ చేతనాత్మకమైన ఈ జగత్తులో నేను తప్ప శ్రీ జానకీరామునకు ప్రాణసమానప్రియులు కానివారెవరు? ఈ పరమహాని మీకందటికిని 'మేలు' అనిపించుచున్నదా? నాకివి చెడ్డరోజులు. ఇందులో ఎవరి దోషమూ లేదు. మీరు సంశయము, సౌశీల్యము, ప్రేమలకు వశులైనారు. కావున మీరు చెప్పుచున్నదంతయును ఉచితమేయనిపించును. (చౌ॥ 1-4)

దో- రామ మాతు సుఠి సరలచిత, మో పర ప్రేము బిసేషి ।
కహఇ సుభాయ సనేహ బస, మోరి దీనతా దేఖి ॥ 181 ॥

శ్రీరామచంద్రుని తల్లి అతి సరళ హృదయురాలు. నాపై మిక్కిలి ప్రేమ గలది. కనుక నా దైన్యస్థితిని జూచి, తనసహజప్రేమకు లోనై అట్లు పలికినది. (దో॥ 181)

చౌ- గుర బిబేక సాగర జగు జానా । జిన్హహి బిస్వ కర బదర సమానా ।
మో కహఁ తిలక సాజ సజ సోఊ । భఏఁ బిధి బిముఖ బిముఖ సబు కోఊ ॥ 1 ॥
పరిహరి రాము సీయ జగ మాహీఁ । కోఉ న కహిహి మోర మత నాహీఁ ॥
సో మైఁ సునబ సహబ సుఖు మానీ । అంతహుఁ కీచ తహాఁ జహఁ పానీ ॥ 2 ॥
డరు న మోహి జగ కహిహి కి పోచూ । పరలోకహు కర నాహిన సోచూ ॥
ఏకఇ ఉర బస దుసహ దవారీ । మోహి లగి భే సియ రాము దుఖారీ ॥ 3 ॥
జీవన లాహు లఖన భల పావా । సబు తజి రామ చరన మను లావా ॥
మోర జనమ రఘుబర బన లాగీ । ఝూఠ కాహ పఛితాఉఁ అభాగీ ॥ 4 ॥

గురుదేవులు వివేకసముద్రులు. ఇది జగమెఱిగిన సత్యము. వారికి విశ్వమంతయు కరతలామలకము. వారుమ నన్ను రాజ్యాభిషిక్తుని జేయసంకల్పించినారు. విధాతయే ప్రతికూలుడైనప్పుడు ప్రతివారును ప్రతికూలురేయగుదురు. ఇది తథ్యము. ఈ కుట్రలో నాకు భాగము లేదని శ్రీ సీతారాములు తప్ప ప్రపంచములో మఱియెవ్వరూ చెప్పరు. దీనిని పూర్తిగా విని, సుఖమనుకొని సహింపవలెను. ఏలనన నీరున్నచోట బురదకూడ ఉండును. ప్రపంచము'నన్ను' దూషించునని నాకు చింతలేదు. నాకు పరలోకచింతయులేదు. నా కారణముచే శ్రీరామచంద్రుడు దుఃఖముల పాలయినాడు. అది నా హృదయములో ఒక దుస్సహ దావాగ్నియై మండుచున్నది. జీవితములో సర్వోత్తమమైన లాభమును లక్ష్మణుడు పూర్తిగా పొందెను. అన్నింటిని త్యజించి, అతడు తన చిత్తమును శ్రీరాముని పాదములయందే నిల్పెను. నా జన్మ శ్రీరాముని వనములకు పంపుటకే ఏర్పడినది. కనుక కపటినైన నేను పశ్చాత్తాపపడుట వృథా (చౌ॥ 1-4)

దో- అపని దారున దీనతా, కహఉఁ సబహి సిరు నాఇ ।
దేఖేఁ బిను రఘునాథ పద, జియ కై జరని న జాఇ ॥ 182 ॥

అందఱికివి శిరసా ప్రణమిల్లి దారుణమైన నాదైన్యస్థితిని వినిపించెదను. శ్రీరాముని చరణములను దర్శింపనిదే నా ఆత్మక్షోభ చల్లారదు. (దో॥ 182)

చౌ- అస ఉపాఉ మోహి నహిఁ సూఝా । కో జియ కై రఘుబర బిను బూఝా ॥
ఏకహిఁ ఆఁక ఇహఇ మన మాహీఁ । ప్రాతకాల చలిహఉఁ ప్రభు పాహీఁ ॥ 1 ॥
జద్యపి మైఁ అనభల అపరాధీ । భై మోహి కారన సకల ఉపాధీ ॥
తదపి సరన సనముఖ మోహి దేఖీ । ఛమి సబ కరిహహిఁ కృపా బిసేషీ ॥ 2 ॥
సీల సకుచ సుఠి సరల సుభాఊ । కృపా సనేహ సదన రఘురాఊ ॥
అరిహుక అనభల కీన్హ న రామా । మైఁ సిసు సేవక జద్యపి బామా ॥ 3 ॥
తుమ్హ పై పాఁచ మోర భల మానీ । ఆయసు ఆసిష దేహు సుబానీ ॥
జెహిఁ సుని బినయ మోహి జను జానీ । ఆవహిఁ బహురి రాము రజధానీ ॥ 4 ॥

మఱియొక ఉపాయమేమియు నాకు కనబడుటలేదు. శ్రీరాముడు తప్ప నా మనసులోని మాటను ఇతరులెవ్వరును తెలిసికొనజాలరు. నేను తిరుగులేని ఒక నిర్ణయమునకు వచ్చితిని. ప్రాతఃకాలముననే బయలుదేఱి శ్రీరామచంద్రప్రభు సన్నిధికి చేరెదను. ఒక వేళ నేను అపరాధిననియు ఈ అనర్థములకు నేనే కారణమనియు ఆయన భావించినను, శరణుజొచ్చిన నన్ను జూచి శ్రీరామచంద్రుడు నా అపరాధములను క్షమించి, తప్పక నాపై మిక్కిలి కృప జూపును. శ్రీ రఘునాథుడు సుశీలుడు, అత్యంతసరళస్వభావుడు. కృపాస్నేహములకు పట్టుగొమ్మ, శత్రువులకును ఆయన అపకారమును తలపెట్టడు. నేనతనికి కీడుచేసినను బాలుడను, సేవకుడను ఐన నన్నతడు క్షమించును. కావున మీరు నా నిర్ణయమును మంచిగా భావించి, శ్రీరామచంద్రుని పిలుచుకొని వచ్చుటకు ప్రసన్నమనస్కులై నాకు ఆశీర్వాదములను, అనుజ్ఞను దయచేయుడు. నా విన్నపమును ఆలించి, నన్ను తనదాసునిగా తలంచి, శ్రీరామచంద్రుడు రాజధానికి తిరిగి రాగలడు. (చౌ॥ 1-4)

దో- జద్యపి జనము కుమాతు తేఁ, మైఁ సఠు సదా సదోస ।
ఆపన జాని న త్యాగిహహిఁ, మోహి రఘుబీర భరోస ॥ 183 ॥

"నేను కుమాతగర్భమున జన్మించినను, దుష్టుడను దోషిని ఐనను శ్రీరాముడు నన్ను తనవానినిగా భావించును, వదలడు." అను విశ్వాసము నాకు కలదు. (దో॥ 183)

చౌ- భరత బచన సబ కహఁ ప్రియ లాగే । రామ సనేహ సుధాఁ జను పాగే ॥
లోగ బియోగ బిషమ బిష దాగే । మంత్ర సబీజ సునత జను జాగే ॥ 1 ॥
మాతు సచివ గుర పుర నర నారీ । సకల సనేహఁ బికల భఏ భారీ ॥
భరతహి కహహిఁ సరాహి సరాహీ । రామ ప్రేమ మూరతి తను ఆహీ ॥ 2 ॥
తాత భరత అస కాహె న కహహూ । ప్రాన సమాన రామ ప్రియ అహహూ ॥
జో పావఁరు అపనీ జడతాఈఁ । తుమ్హహి సుగాఇ మాతు కుటిలాఈఁ ॥ 3 ॥

సో సఠు కోటిక పురుష సమేతా । బసహిఁ కలప సత నరక నికేతా ॥
అహి అఘ అవగున నహిఁ మని గహఈ । హరఇ గరల దుఖ దారిద దహఈ ॥ 4 ॥

భరతుని వచనములు అందఱికిని ప్రియములాయెను. అవి స్నేహామృతములో ముంచబడినవిగా ఉండెను. జనులందఱును రామవియోగమనెడి భీషణవిషాగ్నిచే దగ్ధమగుచుండిరి. బీజయుక్తమైన మంత్రముచే ఆ విషము దిగిపోయినట్లు భరతుని వచనామృత సేచనములచే వారు ఉపశమనమును పొందిరి, హర్షితులైరి. అప్పుడు తల్లులు, మంత్రులు, గురువులు నగరములోని స్త్రీ పురుషులు ప్రేమ విహ్వలులై యుండిరి. భరతుని మాటలతో వారు తేరుకొని, ఆయనను శ్లాఘించుచు, "మీరు ఆకృతి దాల్చిన శ్రీరామప్రేమయే" అని ప్రశంసించిరి. "నాయనా! భరతా! నీ వంటి వానివలుకులు ఇట్లుగాక మఱి ఎట్లుండును? నీవు శ్రీరామునకు ప్రాణసముడవు. ఇందు సందేహము లేదు. ఎవ్వడైన నీచుడు తన అజ్ఞానమువలన మీ తల్లి కైకేయి కుటిలత్వ కారణమున నిన్ను సందేహించినచో వాడు తన వంశమువారితోసహా నూఱు కల్పములవఱకును నరకమును అనుభవించును. సర్పము తలపైనున్న మణికి ఆ సర్పము చేసిన పాపములును దోషములును అంటవు. పైగా ఆ మణి సర్పదష్టులైనవారిని పరిరక్షించును. దుఃఖ దారిద్ర్యములను రూపుమాపును. (కైకేయి చేసిన దుష్కృత్యముల ఫలితములు భరతునకు అంటవు. పైగా అతడు బాధితులను ఆదుకొనును, సేవించును) (చౌ॥ 1-4)

## భరతుడు సపరివారముగా చిత్రకూటమునకు బయలుదేఱుట

దో- అవసి చలిఅ బన రాము జహఁ, భరత మంత్రు భల కీన్హ ।
సోక సింధు బూడత సబహి, తుమ్హ అవలంబను దీన్హ ॥ 184 ॥

"భరతా! నీ నిర్ణయము సరియైనదే. శ్రీరాముడున్న వనమునకు మనము అందఱము వెళ్లుదము. శోక సముద్రమున మునిగియున్న మాకు అందఱికిని నీవు చేయూత నిచ్చితివి. (దో॥ 184)

చౌ- భా సబ కేఁ మన మోదు న థోరా । జను ఘన ధుని సుని చాతక మోరా ॥
చలత ప్రాత లఖి నిరనఉ నీకే । భరతు ప్రానప్రియ భే సబహీ కే ॥ 1 ॥
మునిహి బంది భరతహి సిరు నాఈ । చలే సకల ఘర బిదా కరాఈ ॥
ధన్య భరత జీవను జగ మాహీఁ । సీలు సనేహు సరాహత జాహీఁ ॥ 2 ॥
కహహిఁ పరసపర భా బడ కాజూ । సకల చలై కర సాజహిఁ సాజూ ॥
జేహి రాఖహిఁ రహు ఘర రఖవారీ । సో జానఇ జను గరదని మారీ ॥ 3 ॥
కోఉ కహ రహన కహిఅ నహిఁ కాహూ । కో న చహఇ జగ జీవన లాహూ ॥ 4 ॥

మేఘగర్జనలను వినిన చాతకపక్షులవలెను, నెమళ్లవలెను భరతునివచనములకు అందఱును ఆనందించిరి. ప్రాతఃకాలముననే బయలుదేఱవలెనని నిర్ణయించిన భరతుడు అందఱికిని ప్రాణప్రియుడాయెను. వసిష్ఠ మహామునికిని, భరతునకును నమస్కరించి ఎల్లరును, సెలవు గైకొని, తమతమ ఇండ్లకు తరలిపోయిరి. తనహృదయమును శ్రీరామునకు అంకిత మొనర్చిన భరతునివంటి ధన్యజీవి మఱియొకడు లేడని, పౌరులెల్లరును

అయనస్నేహ శీలములను పొగడుచు వెళ్లిరి. 'చాలా మంచిపని జరిగినది' అని తమలో తామనుకొనుచు వారు అందఱును శ్రీరామునికడకు వెళ్లుటకు సిద్ధమైరి. 'ఇంటి సంరక్షణకై నీవు ఇచటనే యుండుము' అని ఎవ్వరికైనను చెప్పినచో వారు తమ మెడపై కత్తివేటు పడినట్లు భావించుచుండిరి. "ఎవ్వరినీ ఆపవద్దు. తమ జీవితములను సఫలమొనర్చుకొనుటకు ఎవరు ఇష్టపడరు? అని కొందరు అనుచుండిరి. (చౌ॥ 1-4)

దో- జరఉ సో సంపతి సదన సుఖు, సుహృద మాతు పితు భాఇ।
సనముఖ హోత జో రామ పద, కరై న సహస సహాఇ ॥ 185 ॥

'శ్రీరామచంద్రుని చరణములను దర్శించుటకు తోడ్పడని సంపదలు, గృహములు, సుఖములు, మిత్రులు, తల్లిదండ్రులు, సోదరులు, అంతరించినను దిగులు పడవలసిన పనిలేదు' అని పల్కుచుండిరి. (దో॥ 185)

చౌ- ఘర ఘర సాజహిఀ బాహన నానా। హరషు హృదయఀ పరభాత పయానా ॥
భరత జాఇ ఘర కీన్హ బిచారూ। నగరు బాజి గజ భవన భండారూ ॥ 1 ॥
సంపతి సబ రఘుపతి కై ఆహీ। జౌఀ బిను జతన చలౌఀ తజి తాహీ ॥
తౌ పరినామ న మోరి భలాఈ। పాప సిరోమని సాఇఀ దోహాఈ ॥ 2 ॥
కరఇ స్వామి హిత సేవకు సోఈ। దూషన కోటి దేఇ కిన కోఈ ॥
అస బిచారి సుచి సేవక బోలే। జే సపనెహుఀ నిజ ధరమ న డోలే ॥ 3 ॥
కహి సబు మరము ధరము భల భాషా। జో జెహి లాయక సో తెహిఀ రాఖా ॥
కరి సబు జతను రాఖి రఖవారే। రామ మాతు పహిఀ భరతు సిధారే ॥ 4 ॥

ప్రతి గృహమునందును ప్రజలు వాహనములను సిద్ధపఱచుకొనుచుండిరి. ప్రాతఃకాలము సందే బయలుదేఅవలెనని వారిహృదయములు ఆరాటపడుచు హర్షోల్లాసములలో మునిగియుండెను. భరతుడు తనభవనమునకు వెళ్లి, ఇట్లు ఆలోచించెను. "ఈ నగరము, గుఱ్ఱములు, ఏనుగులు, భవనములు, సంపదలు అన్నియును శ్రీరామునివే. వీటిరక్షణకు ఏర్పాట్లు చేయకుండ వెళ్లినచో పరిణామము నాకు క్షేమకరముగాదు. ఏలనన స్వామి ద్రోహమునకు మించిన పాపమేయుండదు. ఇతరులు ఎంతగా దూషించినను స్వామి హితమును కోరువాడే నిజమైన సేవకుడు." ఇట్లు ఆలోచించి, స్వప్నములోగూడ తమధర్మ పథమును వీడని విశ్వాసపాత్రులైన సేవకులను పిలిపించెను. భరతుడు వారికి ముఖ్య విషయములను అన్నింటిని వివరముగా తెలిపి, వారిని తగినపనులయందు నియమించెను. రక్షణకై ఏర్పాట్లు పూర్తిచేసి, రక్షకులను నియమించి, కౌసల్యాదేవి యొద్దకు వెళ్లెను. (చౌ॥ 1-4)

దో- ఆరత జననీ జాని సబ, భరత సనేహ సుజాన।
కహేఉ బనావన పాలకీఀ, సజన సుఖాసన జాన ॥ 186 ॥

ప్రేమస్వరూపమును దెలిసిన భరతుడు శ్రీరామవిరహార్తులైన తల్లులకై పల్లకీలను, వాటిలో సుఖాసనములను సిద్ధము చేయించెను. (దో॥ 186)

చౌ- చక్క చక్కి జిమి పుర నర నారీ । చహత ప్రాత ఉర ఆరత భారీ ॥
జాగత సబ నిసి భయఉ బిహానా । భరత బొలాఏ సచివ సుజానా ॥ 1 ॥
కహేఉ లేహు సబు తిలక సమాజూ । బనహిఁ దేబ ముని రామహి రాజూ ॥
బేగి చలహు సుని సచివ జొహారే । తురత తురగ రథ నాగ సఁవారే ॥ 2 ॥
అరుంధతీ అరు అగిని సమాఊ । రథ చఢి చలే ప్రథమ మునిరాఊ ॥
బిప్రబృంద చఢి బాహన నానా । చలే సకల తప తేజ నిధానా ॥ 3 ॥
నగర లోగ సబ సజి సజి జానా । చిత్రకూట కహఁ కీన్హ పయానా ॥
సిబికా సుభగ న జాహిఁ బఖానీ । చఢి చఢి చలత భఈఁ సబ రానీ ॥ 4 ॥

చక్రవాకపక్షులవలె నగరములోని స్త్రీపురుషులు అత్యంతార్తితో ప్రాతఃకాలమునకై వేచియుండిరి. ఆ రాత్రియంతయు మెలకువతోడనే యుండిరి. ప్రభాతసమయమున భరతుడు సర్వసమర్థులైన మంత్రులను పిలిపించి పలికెను."రాజ్యాభిషేకమునకు వలసిన వస్తువులను అన్నింటిని తీసికొని వెళ్లుదము. వనమునందే వసిష్ఠమహర్షి శ్రీరామునకు రాజ్యమును అప్పగించును." వెంటనే మంత్రులు 'చిత్తము' అని పలికి, ప్రణమిల్లి వెళ్లిరి. గుఱ్ఱములు, ఏనుగులు, రథములు సిద్ధపఱచబడెను, మొదట వసిష్ఠ మహర్షి తన భార్యయైన అరుంధతితోపాటు హోమములకు అవసరమగు వస్తువులనన్నింటిని తీసికొని రథమును అధిరోహించెను. పిమ్మట తపస్తేజోనిధులైన విప్రులు వేర్వేఱు వాహనములను ఎక్కిరి. నగర ప్రజలు తమతమ వాహనములపై నెక్కి బయలుదేఱిరి. వారందఱును చిత్రకూటమునకు పయనమైరి. చిత్ర విచిత్రములై వర్ణనాతీతములైన పల్లకీలలో రాణులు ప్రయాణమైరి. (చౌ॥ 1-4)

దో- సౌఁపి నగర సుచి సేవకని, సాదర సకల చలాఇ।
సుమిరి రామ సియ చరన తబ, చలే భరత దోఉ భాఇ ॥ 187 ॥

విశ్వాసపాత్రులైనసేవకులకు నగరరక్షణభారమును అప్పగించి, అందఱిని ముందు వరుసలలో పంపి, భరతశత్రుఘ్నులు శ్రీరాముని చరణములను సంస్మరించుచు బయలు దేఱిరి. (దో॥ 187)

చౌ- రామ దరస బస సబ నర నారీ । జను కరి కరిని చలే తకి బారీ ॥
బన సియ రాము సముఝి మన మాహీఁ । సానుజ భరత పయాదేహిఁ జాహీఁ ॥ 1 ॥
దేఖి సనేహు లోగ అనురాగే । ఉతరి చలే హయ గయ రథ త్యాగే ॥
జాఇ సమీప రాఖి నిజ డోలీ । రామ మాతు మృదు బానీ బోలీ ॥ 2 ॥
తాత చఢహు రథ బలి మహతారీ । హోఇహి ప్రియ పరివారు దుఖారీ ॥
తుమ్హరేఁ చలత చలిహి సబు లోగూ । సకల సోక కృస నహిఁ మగ జోగూ ॥ 3 ॥

సిర ధరి బచన చరన సిరు నాఈ । రథ చఢి చలత భఏ దోఉ భాఈ ॥
తమసా ప్రథమ దివస కరి బాసూ । దూసర గోమతి తీర నివాసూ ॥ 4 ॥

దప్పిగొన్నఏనుగులు నీటికై వేగముగా పరుగెత్తునట్లు శ్రీరామదర్శనలాలసతో స్త్రీ పురుషులెల్లరును పరుగులు దీయసాగిరి. "శ్రీరామచంద్రుడు వనములలో కష్టములు అనుభవించుచుండును" అనితలంచుచు భరతశత్రుఘ్నులు కాలినడకతోడనే పోవుచుండిరి. భరతుని ప్రేమను జూచి, ప్రజలు తాము గూడ ప్రేమమగ్నులై తమవాహనములపైనుండి దిగి నడవసాగిరి. తన పల్లకీని భరతుని సమీపమున ఆపి, కౌసల్యాదేవి కోమలవచనములను పలికెను. "నాయనా! నా మాట వినుము. రథమును ఎక్కుము. లేనిచో పరివారమంతయును బాధపడును. నీవు కాలినడకతో వెళ్లినచో అందఱును అట్లే చేసెదరు. శోకతప్తులై వారు మొదటనే బలహీనులైరి, నడువలేరు." మాతృవచనములను తలదాల్చి, ఆమెకు ప్రణమిల్లి, ఇద్దఱును రథము నెక్కిరి. మొదటినాడు తమసానదీతీరమునను, రెండవనాడు గోమతీనదీతీరమునను వారు బసచేసిరి. (చౌ॥ 1-4)

దో- పయ అహార ఫల అసన ఎక, నిసి భోజన ఎక లోగ ।
కరత రామ హిత నేమ బ్రత, పరిహరి భూషన భోగ ॥ 188 ॥

కొందఱు కేవలము పాలుత్రాగియుండిరి. కొందఱు ఫలములను మాత్రమే భుజించిరి. మఱికొందఱు రాత్రులయందుమాత్రమే భుజించిరి. భూషణములను, భోగవిలాస వస్తువులను త్యజించి, అందఱును శ్రీరామచంద్రుని కొఱకు నియమవ్రతములను పూనిరి. (దో॥ 188)

## భరత గుహుల సమాగమము

చౌ- సఈ తీర బసి చలే బిహానే । సృంగబేరపుర సబ నిఅరానే ॥
సమాచార సబ సునే నిషాదా । హృదయఁ బిచార కరఇ సబిషాదా ॥ 1 ॥
కారన కవన భరతు బన జాహీఁ । హై కఛు కపట భాఉ మన మాహీఁ ॥
జౌఁ పై జియఁ న హోతి కుటిలాఈ । తౌ కత లీన్హ సంగ కటకాఈ ॥ 2 ॥
జానహిఁ సానుజ రామహి మారీ । కరఉఁ అకంటక రాజు సుఖారీ ॥
భరత న రాజనీతి ఉర ఆనీ । తబ కలంకు అబ జీవన హానీ ॥ 3 ॥
సకల సురాసుర జురహిఁ జుఝారా । రామహి సమర న జీతనిహారా ॥
కా ఆచరజు భరతు అస కరహీఁ । నహిఁ బిష బేలి అమిఅ ఫల ఫరహీఁ ॥ 4 ॥

ఆ రాత్రి 'సఈ' నదీతీరమున గడిపి, రెండవనాడు తెలవాఱగనే బయలు దేఱి శృంగవేర పురమును సమీపించిరి. భరతుడు చతురంగ బలములతో వచ్చు విషయమునంతయును విషాదరాజైన గుహుడు విని, దుఃఖితుడై మనస్సులో ఇట్లు ఆలోచించెను. "భరతుడు వనమునకు వచ్చు కారణము ఏమై యుండును? ఈతని మనస్సున ఏదో కపటభావము ఉన్నది. లోపల కుటిలత్వము లేనిచో సైన్యములతో రావలసిన పనియేమున్నది?

లక్ష్మణునితో సహా శ్రీరాముని జంపి, నిష్కంటకముగా రాజ్యమును ఏలదలచి యుండును. కాని భరతుడు రాజనీతినిగూర్చి ఆలోచింపలేదు. మొదటనే ఈతనికి కళంకము అంటినది. ఇప్పుడు జీవితమునే చాలింపవలసివచ్చును. దేవదానవులందఱును ఏకమైవచ్చినను రణభూమిలో శ్రీరాముని ఎదురింపలేరు. భరతుడీవిధముగా ప్రవర్తించుటలో ఆశ్చర్యము లేదు. విషపుతీగెలకు అమృత ఫలములు కాయవుగదా! (చౌ॥ 1-4)

దో- అస బిచారి గుహఁ గ్యాతి సన, కహేఉ సజగ సబ హోహు ।
హథవాఁసహు బోరహు తరని, కీజిఅ ఘాటారోహు ॥ 189 ॥

ఈ విధముగా ఆలోచించి, నిషాదరాజు గుహుడు తనజాతివారితో "అందఱును జాగ్రత్తగా నుండుడు." అని హెచ్చరించెను. "నావలను స్వాధీనములో ఉంచుకొనుడు. వాటిని నీటిలో ముంచుడు. అన్ని రేవులను మూసి వేయుడు." అనియనెను. (దో॥ 189)

చౌ- హోహు సఁజోఇల రోకహు ఘాటా । ఠాటహు సకల మరై కే ఠాటా ॥
సనముఖ లోహ భరత సన లేఊఁ । జిఅత న సురసరి ఉతరన దేఊఁ ॥ 1 ॥
సమర మరను పుని సురసరి తీరా । రామ కాజు ఛనభంగు సరీరా ॥
భరత భాఇ నృపు మైఁ జన నీచూ । బడేఁ భాగ అసి పాఇఅ మీచూ ॥ 2 ॥
స్వామి కాజ కరిహఉఁ రన రారీ । జస ధవళిహఉఁ భువన దస చారీ ॥
తజఉఁ ప్రాన రఘునాథ నిహోరేఁ । దుహూఁ హాథ ముద మోదక మోరేఁ ॥ 3 ॥
సాధు సమాజ న జాకర లేఖా । రామ భగత మహుఁ జాసు న రేఖా ॥
జాయఁ జిఅత జగ సో మహి భారూ । జననీ జౌబన బిటప కుఠారూ ॥ 4 ॥

"యుద్ధసామగ్రిని సిద్ధమొనర్చుకొని, రేవులయొద్దనుండుడు. మరణించుట కైనను సిద్ధముగా ఉండుడు. నేను ముందుండి భరతుని ఎదుర్కొనెదను. నా బొందిలో ప్రాణములున్నంతవఱకును అతనిని గంగానదిని దాటనీయను. ఈ శరీరము క్షణభంగురము. ఏదో ఒకనాడు పోవలసినదే. యుద్ధములో మరణించుట, అదియు గంగానదీ తీరమున, అందునా శ్రీరాముని కార్యార్థమై! ఇంతకంటెనుపుణ్యమేముండును? భరతుడు శ్రీరాముని సోదరుడు, మఱియు రాజు. నేను సామాన్య సేవకుడను ఇట్టి మృత్యువు లభించుట నా భాగ్యము. నా స్వామికొఱకు నేను యుద్ధమొనర్తును. పదునాల్గు లోకములలో కీర్తిని గాంచెదను. శ్రీరామునికై నాఅసువులను అర్పించెదను. జయమైనను, అపజయమైనను నాకు ఆనందమే. నాకు ఏ విధముగనైనను మేలే జరుగును. సాధుసమాజములో చేరనివాడు, శ్రీరామభక్తుడు కానివాడు పృథ్వికిభారముగా ప్రపంచమున జీవించుటవ్యర్థము- అట్టివాడు మాతృయౌవనమనెడి వృక్షమును నఱకుగొడ్డలి వంటివాడు. (చౌ॥ 1-4)

దో- బిగత బిషాద నిషాదపతి, సబహి బఢాఇ ఉఛాహు ।
సుమిరి రామ మాగేఉ తురత, తరకస ధనుష సనాహు ॥ 190 ॥

నిషాదరాజు విషాదరహితుడై తనవారిఉత్సాహమును ఇనుమడింపజేసి, శ్రీరాముని స్మరించుచు తన అమ్ముల పొదిని, ధనుస్సును, కవచమును అడిగెను. (దో॥ 190)

చౌ- బేగహు భాఇహు సజహు సంజోఊ । సుని రజాఇ కదరాఇ న కోఊ ॥
భలేహిం నాథ సబ కహహిం సహరషా । ఏకహిం ఏక బఢావఇ కరషా ॥ 1 ॥
చలే నిషాద జోహారి జోహారీ । సూర సకల రన రూచఇ రారీ ॥
సుమిరి రామ పద పంకజ పనహీం । భాథీం బాంధి చఢాఇన్హి ధనహీం ॥ 2 ॥
అంగరీ పహిరి కూండి సిర ధరహీం । ఫరసా బాంస సేల సమ కరహీం ॥
ఏక కుసల అతి ఓడన ఖాండే । కూదహిం గగన మనహుం ఛితి ఛాండే ॥ 3 ॥
నిజ నిజ సాజు సమాజు బనాఈ । గుహ రాఉతహి జోహారే జాఈ ॥
దేఖి సుభట సబ లాయక జానే । లై లై నామ సకల సనమానే ॥ 4 ॥

"సోదరులారా! నా ఆజ్ఞను వినినంతనే వెంటనే యుద్ధమునకు సిద్ధముగా ఉండుడు. ఎవ్వరునూ పిరికితనమునకు లోనుకారాదు." అందఱును సంతోషముతో "అట్లే ప్రభూ" అని పలికిరి. వారు ఒకరినొకరు ఉత్సాహపఱచుకొనిరి. నిషాదులందఱును తమరాజునకు వందనమాచరించి, యుద్ధసన్నద్ధులై నదీతీరమునకు చేరిరి. వారందఱును రణశూరులు, వీరులు. యుద్ధము చేయుట యనిన వారికి వెన్నతోబెట్టినవిద్య. శ్రీరామచరణకమలముల పాదుకలను స్మరించుచు వారు కవచములను తూణీరములను, ధనుస్సులను శిరస్త్రాణములను ధరించిరి. గొడ్డళ్లకును, ఈటెలకును, బల్లెములకును పదునుపెట్టిరి. కొందఱు ఖడ్గయుద్ధములో నిపుణులు: వారు భూమిని వదలి ఆకాశములో ఎగురుచున్నంత ఉత్సాహముతో ఉండిరి. వారు తమఆయుధములను ధరించి, జట్టుకట్టి నిషాదరాజునకు నమస్కరించిరి. తమవీర సైనికులను జూచి, గుహుడు పేరుపేరున వారిని పిలిచి, గౌరవించెను. (చౌ॥ 1-4)

దో- భాఇహు లావహు ధోఖ జని, ఆజు కాజ బడ మోహి ।
సుని సరోష బోలే సుభట, బీర అధీర న హోహి ॥ 191 ॥

నిషాదరాజైన గుహుడు పలికెను. "సోదరులారా! మృత్యువునకు భయపడవలదు. ఈ దినము మనకొకమహత్కార్యము లభించినది." ఇది విని, శూరులును, వీరులును, రణోత్సాహముతో పలికిరి. "ఓ వీరాధివీరా! ధైర్యముగా నుండుడు." (దో॥ 191)

చౌ- రామ ప్రతాప నాథ బల తోరే । కరహిం కటకు బిను భట బిను ఘోరే ॥
జీవత పాఉ న పాఛేం ధరహీం । రుండ ముండమయ మేదిని కరహీం ॥ 1 ॥
దీఖ నిషాదనాథ భల టోలూ । కహెఉ బజాఉ జుఝాఊ ఢోలూ ॥
ఏతనా కహత ఛీంక భఇ బాంఏ । కహెఉ సగునిఅన్హ ఖేత సుహాఏ ॥ 2 ॥

బూఝు ఏకు కహ సగున బిచారీ । భరతహి మిలిఅ న హోఇహి రారీ ॥
రామహి భరతు మనావన జాహీఁ । సగున కహఇ అస బిగ్రహు నాహీఁ ॥ 3 ॥
సుని గుహ కహఇ నీక కహ బూఢా । సహసా కరి పఛితాహిఁ బిమూఢా ॥
భరత సుభాఉ సీలు బిను బూఝేఁ । బడి హిత హాని జాని బిను జూఝేఁ ॥ 4 ॥

ప్రభూ! శ్రీరామచంద్రుని ప్రతాపముతో, మీ బలములతో భరతుని సైన్యములో వీరులుగాని, గుఱ్ఱములుగాని లేకుండ చేసెదము. ప్రాణములున్నంతవరకు వెనుకడుగువేయము. పృథ్విని తలలతో మొండెములతో నింపెదము." నిషాదరాజు వీరులను జూచి పలికెను. "యుద్ధ భేరీలను మ్రోగింపుడు." ఈ మాటపలుకగానే ఎడమవైపున ఎవరోతుమ్మిరి. శకునములను తెలిసినవాడొకడు "తుమ్ము మంచిదిశనుండి వచ్చినది" మనకు విజయము తథ్యము" అనెను. మఱియొక వృద్ధుడు శకునమును పరిశీలించి పలికెను. "మనము వెళ్లి భరతుని కలియవలెను. అతనితో యుద్ధము చేయవలదు. భరతుడు శ్రీరామచంద్రుని 'తిరిగి అయోధ్యకురమ్ము' అని ప్రార్థించుటకై వచ్చుచున్నాడు. విరోధము ఉండదు. పోరాటము జరుగదు. శకునము చెప్పుచున్నదిదియే." ఈ మాటలను విని గుహుడు పలికెను, "ఈ వృద్ధుడు మంచిమాటనే వచించుచున్నాడు. మూర్ఖులు తొందరపడి పనిచేయుదురు. తరువాత పశ్చాత్తాపపడెదరు. భరతుని శీలస్వభావములను ఎఱుంగక యుద్ధము చేయుటలో మేలుకంటెను హానియే ఎక్కువగా కలదు. (చౌ॥ 1-4)

దో- గహహు ఘాట భట సమిటి సబ, లేఉఁ మరమ మిలి జాఇ।
బూఝి మిత్ర అరి మధ్య గతి, తస తబ కరిహఉఁ ఆఇ ॥ 192 ॥

సైనికులారా! మీరందఱును ఒకచోట చేరి, రేవులను మూసి వేయుడు. నేను వెళ్లి భరతుని కలిసి, అతని ఉద్దేశ్యమును తెలిసికొనెదను. అతని మనోభావము మైత్రితోకూడియుండెనా? వైరముతో కూడియుండెనా? తటస్థముగా ఉండెనా? దీనిని ఎఱింగిన తరువాతనే తగిన ఏర్పాట్లను చేయుదము. (దో॥ 192)

చౌ- లఖబ సనేహు సుభాయఁ సుహాఏఁ । బైరు ప్రీతి నహిఁ దురఇఁ దురాఏఁ ॥
అస కహి భేఁట సఁజోవన లాగే । కంద మూల ఫల ఖగ మృగ మాగే ॥ 1 ॥
మీన పీన పాఠీన పురానే । భరి భరి భార కహారన్హ ఆనే ॥
మిలన సాజు సజి మిలన సిధాఏ । మంగల మూల సగున సుభ పాఏ ॥ 2 ॥
దేఖి దూరి తేఁ కహి నిజ నామూ । కీన్హ మునీసహి దండ ప్రనామూ ॥
జాని రామప్రియ దీన్హి అసీసా । భరతహి కహేఉ బుఝాఇ మునీసా ॥ 3 ॥
రామ సఖా సుని సందను త్యాగా । చలే ఉతరి ఉమగత అనురాగా ॥
గాఉఁ జాతి గుహఁ నాఉఁ సునాఈ । కీన్హ జోహారు మాథ మహి లాఈ ॥ 4 ॥

అతని స్నేహస్వభావముచేతనే అతని ప్రేమను తెలిసికొన గలను. ఏలనన ప్రేమగాని, వైరముగాని దాచిననూ దాగదు." ఈ విధముగా పలికి, అతడు కానుకలను సమకూర్చుకొనెను. పిమ్మట కందమూలఫలములకై, పక్షులకై జింకలకై సేవకులను పంపెను. బెస్తవారు పెద్ద పెద్ద పహినా చేపలను దెచ్చిరి. ఈ విధముగా కానుకలను ఏర్పఱుచుకొని, గుహుడు భరతుని కలియుటకై పోయెను. త్రోవలో అతనికి శుభశకునములు ఎదురాయెను. మునీశ్వరుడైన వసిష్ఠుని జూచి నిషాదరాజు అతనికి తనపేరును తెల్పుచు దూరమునుండియే దండప్రణామములను ఆచరించెను. అతడు శ్రీరామునకు ప్రియ భక్తుడని యెఱింగి, వసిష్ఠుడు ఆశీర్వదించెను. అతనిని శ్రీరామునిమిత్రునిగా భరతునకు పరిచయము చేసెను. అతడు రాముని సఖుడని వినినంతనే భరతుడు రథమును దిగి అనురాగముప్పొంగగా అతనిని కలిసి కొనుటకు వచ్చెను. గుహుడు తన పేరును, ఊరును, జాతిని దెలిపి, భూమిపై తలమోపి నమస్కరించెను. (చౌ॥ 1-4)

దో- కరత దండవత దేఖి తెహి, భరత లీన్హ ఉర లాఇ ।
మనహుఁ లఖన సన భేఁట భఇ, ప్రేము న హృదయఁ సమాఇ ॥ **193** ॥

గుహుడు దండ ప్రణామములను ఆచరించుటను జూచి, భరతుడు అతనిని లేపి, గుండెకు హత్తుకొనెను. భరతుని హృదయములో ప్రేమ కట్టలుతెంచుకొని, ప్రవహించెను. అతడు లక్ష్మణుని కలిసినంత ఆనందమును అనుభవించెను. (దో॥ 193)

చౌ- భేఁటత భరతు తాహి అతి ప్రీతీ । లోగ సిహాహిఁ ప్రేమ కై రీతీ ॥
ధన్య ధన్య ధుని మంగల మూలా । సుర సరాహి తెహి బరిసహిఁ ఫూలా ॥ **1** ॥
లోక బేద సబ భాఁతిహిఁ నీచా । జాసు ఛాఁహ ఛుఇ లేఇఅ సీఁచా ॥
తెహి భరి అంక రామ లఘు భ్రాతా । మిలత పులక పరిపూరిత గాతా ॥ **2** ॥
రామ రామ కహి జే జముహాహీఁ । తిన్హహి న పాప పుంజ సముహాహీఁ ॥
యహ తౌ రామ లాఇ ఉర లీన్హా । కుల సమేత జగు పావన కీన్హా ॥ **3** ॥
కరమనాస జలు సురసరి పరఈ । తెహి కో కహహు సీస నహిఁ ధరఈ ॥
ఉలటా నాము జపత జగు జానా । బాలమీకి భఏ బ్రహ్మ సమానా ॥ **4** ॥

భరతుడు గుహుని అత్యంత ప్రేమతో ఆలింగనము చేసికొనుట చూచి, ప్రజలందఱును ప్రశంసింపసాగిరి. వారు అందఱును 'ధన్యులు ధన్యులు' అని జయ జయ ధ్వానములు చేయుచుండగా దేవతలు గుహుని కొనియాడుచు పూలవర్షము కురిపించిరి. "ఈ నిషాదుడు నిమ్నజాతివాడనియు, అతనినీడసోకినను స్నానమాచరింపవలెననియు లోకులు, వేదములు భావించును. అట్టి నిషాదుని శ్రీరామచంద్రునిసోదరుడు అతిప్రేమతో హృదయమునకు హత్తుకొనుచున్నాడు. అతనిశరీరము రోమాంచమగుచున్నది." అని వారు పలుకుచుండిరి. ఆవులించుచు రామనామస్మరణ చేయువారి సమీపమునకు పాపములు రానేరావు. ఇక శ్రీరాముడేస్వయముగా అట్టిగుహుని ఆలింగనము చేసికొని, అతనిని, అతని జాతిని పావనమొనర్చుటచే జగత్తునే

పవిత్రమొనర్చువానినిగా జేసెను. 'కర్మనాశ' నది గంగానదిని గలిసినప్పుడు దాని జలములను ఎవరు నెత్తిన చల్లుకొనరు? అనగా ఆ నీటిని సాదరముగా గ్రహింతురు. వాల్మీకి రామనామమును తలక్రిందులుగా 'మరా మరా' యని జపించినను అతడు బ్రహ్మ సమానుడైన విషయము జగద్విదితము. (చౌ॥ 1-4)

దో- స్వపచ సబర ఖస జమన జడ, పావఁర కోల కిరాత ।
రాము కహత పావన పరమ, హోత భువన బిఖ్యాత ॥ 194 ॥

చండాలురు, శబరులు, ఖసులు, యవనులు, కోలురు, కిరాతులు మొదలగు నిమ్నజాతివారు, మూర్ఖులు సైతము రామనామమును స్మరించుటచే పవిత్రులై ముల్లోకములలో ప్రసిద్ధులయ్యెదరు. ఆ రామనామ ప్రభావము అట్టిది. (దో॥ 194)

చౌ- నహిఁ అచిరిజు జుగ జుగ చలి ఆఈ । కెహి న దీన్హి రఘుబీర బడాఈ ॥
రామ నామ మహిమా సుర కహహీఁ । సుని సుని అవధ లోగ సుఖు లహహీఁ ॥ 1 ॥
రామసఖహి మిలి భరత సప్రేమా । పూఁఛీ కుసల సుమంగల ఖేమా ॥
దేఖి భరత కర సీలు సనేహూ । భా నిషాద తెహి సమయ బిదేహూ ॥ 2 ॥
సకుచ సనేహు మోదు మన బాఢా । భరతహి చితవత ఎకటక ఠాఢా ॥
ధరి ధీరజు పద బంది బహోరీ । బినయ సప్రేమ కరత కర జోరీ ॥ 3 ॥
కుసల మూల పద పంకజ పేఖీ । మైఁ తిహుఁ కాల కుసల నిజ లేఖీ ॥
అబ ప్రభు పరమ అనుగ్రహ తోరేఁ । సహిత కోటి కుల మంగల మోరేఁ ॥ 4 ॥

శ్రీరఘునాథుడు భక్తులను కరుణించుచుండుట యుగయుగములనుండియు జరుగుచునే యున్నది. కావున గుహుని కరుణించి ఇంతటియోగ్యునిగా జేయుటలో ఆశ్చర్యము లేదు. ఈ విధముగా దేవతలు శ్రీరామనామమహిమను పొగడుటను విని, అయోధ్యావాసులు పొంగిపోయిరి. శ్రీరాముని మిత్రుడైన నిషాదరాజును అత్యంత ప్రేమతో కలిసి, భరతుడు ఆయన క్షేమసమాచారములను అడిగెను. భరతుని సౌశీల్య ప్రేమస్వభావములను, భ్రాతృప్రేమను జూచి గుహుడు ముగ్ధుడై, తన్నుతానుమఱచెను. నిషాదరాజు మొదట మనస్సులో సంకోచపడెను. పిమ్మట స్నేహము ఆనందము పెల్లుబుకగా అతడు నిశ్చేష్టుడై ఱెప్పలార్పక భరతుని జూడసాగెను. పిదప ధైర్యమును దెచ్చుకొని, భరతునిపాదములకు మఱల మ్రొక్కి, సాదరముగా చేతులు జోడించి, విన్నవింపసాగెను. ప్రభూ! మీ పాదములు శుభములకు మూలములు. వాటిని జూచి, సర్వదా సర్వథా ధన్యుడనైనట్లు భావించుచున్నాను. ఇప్పుడు మీ పరమానుగ్రహమువలన నాకు తరతరాలకు మేలేజరుగును. (చౌ॥ 1-4)

దో- సముఝి మోరి కరతూతి కులు, ప్రభు మహిమా జియఁ జోఇ ।
జో న భజఇ రఘుబీర పద, జగ బిధి బంచిత సోఇ ॥ 195 ॥

'నేను ఆటవికుడను, నిమ్నజాతివాడను. ఐనను శ్రీరాముడు నన్ను అనుగ్రహించి ధన్యునిగా జేసెను. ఇట్టి శ్రీరామమహిమలను ఎఱింగియు, ఆయన చరణములను భజింపని వాడు జగత్తులో విధివంచితుడగును.
(దో॥ 195)

చౌ- కపటీ కాయర కుమతి కుజాతీ । లోక బేద బాహేర సబ భాఁతీ ॥
రామ కీన్హ ఆపన జబహీ తేఁ । భయఉఁ భువన భూషన తబహీ తేఁ ॥ 1 ॥
దేఖి ప్రీతి సుని బినయ సుహాఈ । మిలెఉ బహోరి భరత లఘు భాఈ ॥
కహి నిషాద నిజ నామ సుబానీఁ । సాదర సకల జోహారీఁ రానీఁ ॥ 2 ॥
జాని లఖన సమ దేహిఁ అసీసా । జిఅహు సుఖీ సయ లాఖ బరీసా ॥
నిరఖి నిషాదు నగర నర నారీ । భఏ సుఖీ జను లఖను నిహారీ ॥ 3 ॥
కహహిఁ లహెఉ ఏహిఁ జీవన లాహూ । భేఁటెఉ రామభద్ర భరి బాహూ ॥
సుని నిషాదు నిజ భాగ బడాఈ । ప్రముదిత మన లఇ చలెఉ లెవాఈ ॥ 4 ॥

కపటిని, పిఱికివాడను, దుర్బుద్ధిని, నిమ్నజాతివాడను, లోకముచే వేదములచే బహిష్కరింప బడినవాడను-ఐన నేను శ్రీరామచంద్రునిచే అనుగ్రహింపబడుటవలన లోకమున గౌరవార్హుడనైతిని"- నిషాదరాజు యొక్క ప్రేమను జూచి, అతని వినయవచనములను విని, శత్రుఘ్నుడు అతనిని కలిసెను. నిషాదరాజు తనపేరు తెల్పుకొని, సాదరముగా రాణులందఱికిని ప్రణమిల్లెను. వారు అతనిని లక్ష్మణునితో సమానముగా భావించి 'నీవు కలకాలము సుఖముగా వర్ధిల్లుము' అని ఆశీర్వదించిరి. అయోధ్యావాసులు నిషాదరాజును గాంచి, లక్ష్మణుని జూచినంత ఆనందమును పొందిరి. 'కల్యాణ స్వరూపుడైన శ్రీరామచంద్రుని గాఢాలింగన సౌఖ్యమును అనుభవించిన ఇతని జీవితము నిజముగా ధన్యమైనది" అని వారు అనుకొనిరి. తన భాగ్యమును వారు కొనియాడుటను విని ప్రసన్నచిత్తుడైన నిషాదరాజు వారిని అందఱిని తనతో పాటు తీసికొని పోయెను. (చౌ॥ 1-4)

దో- సనకారే సేవక సకల, చలే స్వామి రుఖ పాఇ ।
ఘర తరు తర సర బాగ బన, బాస బనాఏన్హి జాఇ ॥ 196 ॥

అతడు తన సేవకులకు సైగ చేసెను. వారు అతనిఅభిమతమును గ్రహించి, తమ ఇండ్లలోను, వృక్షచ్ఛాయలయందును, చెఱువుగట్టులపైనను, ఉపవనములయందును విడుదులను ఏర్పాటు చేసిరి. (దో॥ 196)

చౌ- సృంగబేరపుర భరత దీఖ జబ । భే సనేహఁ సబ అంగ సిథిల తబ ॥
సోహత దిఏఁ నిషాదహి లాగూ । జను తను ధరేఁ బినయ అనురాగూ ॥ 1 ॥
ఏహి బిధి భరత సేను సబు సంగా । దీఖి జాఇ జగ పావని గంగా ॥
రామఘాట కహఁ కీన్హ ప్రనామూ । భా మను మగను మిలే జను రామూ ॥ 2 ॥
కరహిఁ ప్రనామ నగర నర నారీ । ముదిత బ్రహ్మమయ బారి నిహారీ ॥
కరి మజ్జను మాగహిఁ కర జోరీ । రామచంద్ర పద ప్రీతి న థోరీ ॥ 3 ॥
భరత కహెఉ సురసరి తవ రేనూ । సకల సుఖద సేవక సురధేనూ ॥
జోరి పాని బర మాగఉఁ ఏహూ । సీయ రామ పద సహజ సనేహూ ॥ 4 ॥

భరతుడు 'శృంగవేర' పురమును జూడగనే స్నేహావశమున అతని శరీరము పులకించెను. భరతుడు నిషాదరాజు భుజముపై చేయివేసి నడచునప్పుడు వినయానురాగములు ఆకృతిదాల్చినట్లు ఉండెను. భరతుడు తనసేనతోపాటు జగత్పావనియైన గంగానదిని దర్శించెను. శ్రీరామఘట్టమును దర్శించి, నమస్కరించి, స్వయముగా శ్రీరాముని జూచినంత ఆనందమును పొందెను. నగర వాసులు దివ్యగంగానదిని జూచి, ప్రసన్న చిత్తులై ప్రణమిల్లిరి. ఆ నదిలో స్నానమాచరించి, అంజలి ఘటించి వారు 'శ్రీరామునిపై మా భక్తి వర్ధిల్లుచు ఉండుగాక' అని ప్రార్థించిరి. భరతుడు ఇట్లు పలికెను. ' ఓగంగాభవానీ! నీ ఇసుకరేణువులు సమస్తసుఖములకును మూలములు. సేవించు వారికి నీవు కామధేనువవు. శ్రీ సీతారాముల చరణములపై నాకు అనన్య భక్తి ఉండుగాక' అని నిన్ను ప్రార్థించుచున్నాను.
(చౌ॥ 1-4)

దో- ఏహి బిధి మజ్జను భరతు కరి, గుర అనుసాసన పాఇ ।
మాతు నహానీం జాని సబ, డేరా చలే లవాఇ ॥ 197 ॥

భరతుడు స్నానమాచరించి, గురునాజ్ఞను పొంది, తల్లులందఱును స్నానాదులాచరించిన పిదప, తమగుడారములను వేఱొక చోటికి తరలించెను. (దో॥ 197)

చౌ- జహం తహం లోగన్హ డేరా కీన్హా । భరత సోధు సబహీ కర లీన్హా ॥
సుర సేవా కరి ఆయసు పాఈ । రామ మాతు పహిం గే దోఉ భాఈ ॥ 1 ॥
చరన చాంపి కహి కహి మృదు బానీ । జననీం సకల భరత సనమానీ ॥
భాఇహి సౌంపి మాతు సేవకాఈ । ఆపు నిషాదహి లీన్హ బోలాఈ ॥ 2 ॥
చలే సఖా కర సోం కర జోరేం । సిథిల సరీరు సనేహ న థోరేం ॥
పూంఛత సఖహి సో ఠాఉం దేఖాఊ । నేకు నయన మన జరని జుడాఊ ॥ 3 ॥
జహం సియ రాము లఖను నిసి సోఏ । కహత భరే జల లోచన కోఏ ॥
భరత బచన సుని భయఉ బిషాదూ । తురత తహాం లఇ గయఉ నిషాదూ ॥ 4 ॥

ఆ మాతినప్రదేశమున జనులుగూడ తమతమ గుడారములను అక్కడక్కడ ఏర్పఱచుకొనిరి. అందఱును సురక్షితముగా వచ్చిచేరిన విషయమును భరతుడు తెలిసికొనెను. దేవతలను పూజించి, గురువుగారి ఆజ్ఞతో భరతశత్రుఘ్నులు కౌసల్యాదేవియొద్దకు వెళ్లిరి. భరతుడు తల్లులందఱికిని పాదములొత్తి, మృదుమధురవచనములతో వారిని ఆదరించెను. పిదప శత్రుఘ్నునకు మాతృసేవలబాధ్యతలను అప్పగించి, తాను నిషాదరాజును పిలిపించెను. గుహుడు భరతుడు చేతులు కలిపినడిచిరి. ప్రేమాతిశయముచే వారితనువులు పులకరించెను. "శ్రీరాముడు విశ్రమించిన స్థలమును చూపి, నా నేత్రములను మనస్సును చల్లబఱచుము" అని భరతుడు గుహుని అడిగెను. 'శ్రీ సీతారాములు, లక్ష్మణుడు రాత్రివేళ ఎక్కడ విశ్రమించిరి?' అని పలుకుచుండగా అతని కన్నులలో అశ్రువులు నిండెను. భరతుని మాటలకు నిషాదుడు దుఃఖితుడాయెను. వెంటనే ఆ స్థలమునకు ఆయనను గొనిపోయెను. (చౌ॥ 1-4)

దో- జహఁ సింసుపా పునీత తర, రఘుబర కియ బిశ్రాము ।
అతి సనేహఁ సాదర భరత, కీన్హేఉ దండ ప్రనాము ॥ 198 ॥

శ్రీరాముడు విశ్రమించిన శింశుపావృక్షమునకు భరతుడు ప్రేమాదరములతో దండ ప్రణామములాచరించెను.
(దో॥ 198)

చౌ- కుస సాఁథరీ నిహారి సుహాఈ । కీన్హ ప్రనాము ప్రదచ్ఛిన జాఈ ॥
చరన రేఖ రజ ఆఁఖిన్హ లాఈ । బనఇ న కహత ప్రీతి అధికాఈ ॥ 1 ॥
కనక బిందు దుఇ చారిక దేఖే । రాఖే సీస సీయ సమ లేఖే ॥
సజల బిలోచన హృదయఁ గలానీ । కహత సఖా సన బచన సుబానీ ॥ 2 ॥
శ్రీహత సీయ బిరహఁ దుతిహీనా । జథా అవధ నర నారి బిలీనా ॥
పితా జనక దేఉఁ పటతర కేహీ । కరతల భోగు జోగు జగ జేహీ ॥ 3 ॥
ససుర భానుకుల భాను భుఆలూ । జెహి సిహాత అమరావతిపాలూ ॥
ప్రాననాథు రఘునాథ గోసాఈఁ । జో బడ హోత సో రామ బడాఈఁ ॥ 4 ॥

అచటి దర్భశయ్యను జూచి, దానికి ప్రదక్షిణమొనర్చి నమస్కరించెను. శ్రీరామచంద్రుని పాదముద్రలధూళిని కన్నులకు అద్దుకొనెను. అతని ప్రేమాధిక్యస్థితి వర్ణింపనలవికానిది. సీతాదేవి వస్త్రములనుండి, ఆభరణముల నుండి రాలిన రెండు మూడు కనకబిందువులను జూచి, వాటిని సీతాదేవితో సమానముగా గౌరవించి, శిరస్సున ధరించెను. అతని నేత్రములు సజలములాయెను. హృదయము పరితపించుచుండగా తనసఖునితో మిక్కిలి విచారపడుచు పలికెను. "శ్రీరాముని వియోగ కారణమున అయోధ్యయందలి స్త్రీ పురుషులవలె ఈ కనక బిందువులుగూడ సీతాదేవివియోగమునకు లోనై కాంతిని గోల్పోయి, నిస్తేజములైనవి. సీతాదేవికి తండ్రియైన జనకమహారాజునకు ప్రపంచములోని భోగయోగములు రెండును కరతలామలకములు. అట్టి మహాత్ముని ఎవరితో పోల్చగలను? ఆమెమామగారైనదశరథ మహారాజుయొక్క ప్రతాప-ఐశ్వర్యములను జూచి అమరాధిపతియైన దేవేంద్రుడు ఈర్ష్యపడియు కొనియాడుచుండెను. ఆమె ప్రాణనాథుడైన శ్రీరామునివైభవముచేతనే లోకులందఱును గొప్పదనమును పొందెదరు.
(చౌ॥ 1-4)

దో- పతి దేవతా సుతీయ మని, సీయ సాఁథరీ దేఖి ।
బిహరత హృదఉ న హహరి హర, పబి తేఁ కఠిన బిసేషి ॥ 199 ॥

అట్టి పతివ్రతాశిరోమణియైన సీతాదేవి పరుండిన ఈ దర్భశయ్యను జూచి, నా హృదయము హాహాకారము'లతో ఏల బ్రద్దలు కాదు? ఈశ్వరా! నా హృదయము వజ్రమువలె, కాదు అంత కంటెను కఠినమైనది.
(దో॥ 199)

చౌ- లాలన జోగు లఖన లఘు లోనే । భే న భాఇ అస అహహిఁ న హోనే ॥
పురజన ప్రియ పితు మాతు దులారే । సియ రఘుబీరహి ప్రానపిఆరే ॥ 1 ॥

మృదు మూరతి సుకుమార సుభాఊ । తాత బాఉ తన లాగ న కాఊ ॥
తే బన సహహిం బిపతి సబ భాంతీ । నిదరే కోటి కులిస ఏహిం ఛాతీ ॥ 2 ॥
రామ జనమి జగు కీన్హ ఉజాగర । రూప సీల సుఖ సబ గున సాగర ॥
పురజన పరిజన గుర పితు మాతా । రామ సుభాఉ సబహి సుఖదాతా ॥ 3 ॥
బైరిఉ రామ బడాఈ కరహీం । బోలని మిలని బినయ మన హరహీం ॥
సారద కోటి కోటి సత సేషా । కరి న సకహిం ప్రభు గున గన లేఖా ॥ 4 ॥

నాతమ్ముడు లక్ష్మణుడు పసివాడు. ముద్దుచేయదగినవాడు. మృదుమనోహర స్వభావుడు. అట్టి సోదరుడు 'న భూతో న భవిష్యతి' పౌరులకు ప్రీతిపాత్రుడు. తల్లిదండ్రులకు గారాల బిడ్డడు. సీతారాములకు ప్రాణతుల్యుడు. అతని దేహము కోమలము, స్వభావము సుకుమారము. అతని శరీరము ఎన్నడును వేడిగాలులకు తట్టుకొనలేదు. అయినను అతడు వనములలో ఆపదలను ఓర్చుకొనుచున్నాడు. నా ఈ హృదయము కోటివజ్రములకంటెను కఠినమైనది. శ్రీరామచంద్రుడవతరించి లోకమునంతటిని ప్రకాశింపజేసెను. ఆయన రూపగుణశీలసుఖసముద్రుడు. పురవాసులకును, కుటుంబ సభ్యులకును, గురువులకును, తలిదండ్రులకును అందఱికిని సుఖప్రదుడు. ఆయనయెడ శత్రుభావముకలవారుగూడ ఆయనను శ్లాఘింతురు. అతనిపలుకులు, ప్రవర్తన, వినయము ఎల్లరిని ముగ్ధులను గావించును. కోటిమంది సరస్వతీదేవతలు గాని, శతకోటి శేషులుగాని శ్రీరామచంద్రుని గుణములను లెక్కింపజాలరు. (చౌ॥ 1-4)

దో- సుఖస్వరూప రఘుబంసమని, మంగల మోద నిధాన ।
తే సోవత కుస డాసి మహి, బిధి గతి అతి బలవాన ॥ 200 ॥

సుఖస్వరూపుడు, రఘుకుల శిరోమణి, శుభములకును, ఆనందములకు పెన్నిధియైన శ్రీరామచంద్రుడు ఈ దర్భశయ్యపై పరుండినాడు. విధి యెంత బలీయమైనది? (దో॥ 200)

చౌ- రామ సునా దుఖు కాన న కాఊ । జీవనతరు జిమి జోగవఇ రాఊ ॥
పలక నయన ఫని మని జేహి భాంతీ । జోగవహిం జనని సకల దిన రాతీ ॥ 1 ॥
తే అబ ఫిరత బిపిన పదచారీ । కంద మూల ఫల ఫూల అహారీ ॥
ధిగ కైకఈ అమంగల మూలా । భఇసి ప్రాన ప్రియతమ ప్రతికూలా ॥ 2 ॥
మైం ధిగ ధిగ అఘ ఉదధి అభాగీ । సబు ఉతపాతు భయఉ జేహి లాగీ ॥
కుల కలంకు కరి సృజేఉ బిధాతాం । సాఇఁదోహ మోహి కీన్హ కుమాతాం ॥ 3 ॥
సుని సప్రేమ సముఝావ నిషాదూ । నాథ కరిఅ కత బాది బిషాదూ ॥
రామ తుమ్హహి ప్రియ తుమ్హ ప్రియ రామహి । యహ నిరజోసు దోసు బిధి బామహి ॥ 4 ॥

శ్రీరాముడు 'దుఃఖము' అనుమాటనే వినియెఱుగడు. మా తండ్రి ఆయనను స్వయముగా తన జీవన తరువుగా పెంచెరి. తల్లులందఱును కంటికి రెప్పవలె, మణిని పామువలె అహర్నిశలు కాపాడుకొనుచు వచ్చిరి. అట్టి శ్రీరాముడు వనములలో కాలినడకన ప్రయాణించుచున్నాడు. కందమూలఫలములను భుజించుచున్నాడు. తనను

ప్రాణసమానముగా చూచుకొనిన పతియెడ ప్రతికూలముగా ప్రవర్తించి, ఈ అమంగళములకు (అనర్థములకు) మూలమైన కైకేయి జీవితము వ్యర్థము. పాపసముద్రుడను, దురదృష్టవంతుడను, ఈ ఉపద్రవములకుకారణమైన నేను బ్రతుకుటయే నిష్ప్రయోజనము. విధాత నన్ను వంశమునకు కళంకముగా పుట్టించెను. నా 'కుమాత' నన్ను స్వామిద్రోహిగా చేసెను." ఈ మాటలను విని, నిషాదరాజు ప్రేమాదరములతో భరతునకు నచ్చజెప్పసాగెను. "ప్రభూ! మీరేల వృథాగా విచారపడెదరు? శ్రీరామచంద్రుడు మీకు ప్రియతముడు. మీరు ఆయనకు ప్రియతములు. ఇది ముమ్మాటికి నిజము. ఈ దోషము విధివైపరీత్యమువలన గలిగినది. (చౌ॥ 1-4)

ఛం- బిధి బామ కీ కరనీ కఠిన జెహిం మాతు కీన్హీ బావరీ ।
తెహి రాతి పుని పుని కరహిం ప్రభు సాదర సరహనా రావరీ ॥
తులసీ న తుమ్హ సో రామ ప్రీతము కహతు హౌం సౌంహేం కిఏం ।
పరినామ మంగల జాని అపనే ఆనిఏ ధీరజు హిఏం ॥

విధి వైపరీత్యము క్రూర మైనది. అది కైకేయీ మాతకు పిచ్చెక్కించినది. ఆ రాత్రి ప్రభువు మిమ్ములను సౌజన్యముతో మాటిమాటికిని శ్లాఘించెను. తులసీదాసు చెప్పుచున్నాడు "శ్రీరామచంద్రునకు మీతో సమానమైన ప్రీతిపాత్రులులేరు. చివరకు శుభమే జరుగును. నేను ప్రమాణము చేసి చెప్పుచున్న మాటయిది. కనుక మీరు ధైర్యమును వహింపుడు." (ఛం)

సో- అంతరజామీ రాము, సకుచ సప్రేమ కృపాయతన ।
చలిఅ కరిఅ బిశ్రాము, యహ బిచారి దృఢ ఆని మన ॥ 201 ॥

"శ్రీరామచంద్రుడు అంతర్యామి. వినయప్రేమదయాస్వరూపుడు. దీనిని విశ్వసించి ఎట్టిచింతయులేక మీరు హాయిగా విశ్రమింపుడు." అని నిషాదుడనెను. (సో॥ 201)

చౌ- సఖా బచన సుని ఉర ధరి ధీరా । బాస చలే సుమిరత రఘుబీరా ॥
యహ సుధి పాఇ నగర నర నారీ । చలే బిలోకన ఆరత భారీ ॥ 1 ॥
పరదఖినా కరి కరహిం ప్రనామా । దేహిం కైకఇహి ఖోరి నికామా ॥
భరి భరి బారి బిలోచన లేహీం । బామ బిధాతహి దూషన దేహీం ॥ 2 ॥
ఏక సరాహహిం భరత సనేహూ । కోఉ కహ నృపతి నిబాహేఉ నేహూ ॥
నిందహిం ఆపు సరాహి నిషాదహి । కో కహి సకఇ బిమోహ బిషాదహి ॥ 3 ॥
ఏహి బిధి రాతి లోగు సబు జాగా । భా భినుసార గుదారా లాగా ॥
గురహి సునావఁ చఢాఇ సుహాఈం । నఈం నావ సబ మాతు చఢాఈం ॥ 4 ॥
దండ చారి మహఁ భా సబు పారా । ఉతరి భరత తబ సబహి సఁభారా ॥ 5 ॥

తన సఖుని పలుకులను విని, మనస్సును దిటవుచేసికొని, శ్రీరామచంద్రుని స్మరించుచు భరతుడు తనబసకు చేరెను. ఇంతలో అయోధ్యా పురజనులు శ్రీరాముని విశ్రాంతి స్థలమును దర్శించుటకై ఆతురతతో వెళ్లిరి. వారాస్థలమును గాంచి, ప్రదక్షిణపూర్వకముగా ప్రణమిల్లిరి. కైకేయి దోషములను ప్రస్తావించి, ఆమెను నిందించిరి. కంటనీరు పెట్టుచు విధాతను తప్పుపట్టిరి. కొందఱు భరతుని ప్రేమను ప్రశంసించుచుండిరి. మఱికొందఱు "రాజు రామునిపై తనకు గల ప్రేమను బాగుగా నిరూపించుకొనెను. అందులకై తనప్రాణములనే అర్పించెను." అని అనుచుండిరి. అందఱును తమను నిందించుకొనుచు నిషాదరాజును కొనియాడుచుండిరి. ఆ సమయమున వారు పొందిన విషాదమును, మోహమును ఎవరు వర్ణింపగలరు? జనులందఱును ఆ రాత్రి మేల్కొనియే యుండిరి. ప్రాతఃకాలమున నావలద్వారా పౌరులు నదినిదాటుచుండిరి. భరతుడు ముందుగా ఒక చక్కని నావపై గురువును ఎక్కించి, మఱియొక క్రొత్తనావపై తల్లులను సుఖాసీనలను జేసెను. నాలుగు గడియలలో అందఱును నదిని దాటిరి. భరతుడు గంగను దాటి అందఱూ వచ్చినదీ లేనిదీ చూచుకొనెను. (చౌ॥ 1-4)

దో- ప్రాతక్రియా కరి మాతు పద, బంది గురహి సిరు నాఇ ।
ఆగేం కిఏ నిషాద గన, దీన్హెఉ కటకు చలాఇ ॥ 202 ॥

ప్రాతఃకాల కృత్యములను నిర్వర్తించుకొని, భరతుడు తల్లులకు పాదాభివందనమొనర్చెను. గురువుగారికి ప్రణమిల్లెను. నిషాదరాజును ముందుంచుకొని, తన పరివారములను నడిపించెను. (దో॥ 202)

చౌ- కియఉ నిషాదనాథు అగుఆఈం । మాతు పాలకీం సకల చలాఈం ॥
సాథ బోలాఇ భాఇ లఘు దీన్హా । బిప్రన్హ సహిత గవను గుర కీన్హా ॥ 1 ॥
ఆపు సురసరిహి కీన్హ ప్రనామూ । సుమిరే లఖన సహిత సియ రామూ ॥
గవనే భరత పయాదెహిం పాఏ । కోతల సంగ జాహిం డోరిఆఏ ॥ 2 ॥
కహహిం సుసేవక బారహిం బారా । హోఇఅ నాథ అస్వ అసవారా ॥
రాము పయాదెహి పాయఁ సిధాఏ । హమ కహఁ రథ గజ బాజి బనాఏ ॥ 3 ॥
సిర భర జాఉఁ ఉచిత అస మోరా । సబ తేం సేవక ధరము కఠోరా ॥
దేఖి భరత గతి సుని మృదు బానీ । సబ సేవక గన గరహిం గలానీ ॥ 4 ॥

నిషాదరాజు ముందుండి దారిచూపు చుండెను. తరువాత రాజమాతలపల్లకీలు శత్రుఘ్నుని రక్షణలో ముందునకు సాగుచుండెను. వసిష్ఠుడు బ్రాహ్మణులతోగూడి పయనించు చుండెను. భరతుడు గంగకు ప్రణమిల్లి, శ్రీ సీతారామ లక్ష్మణులను స్మరించుచూ, కాలినడకతోడనే వెళ్లుచుండెను. రౌతు ఆయన ప్రక్కన కళ్లెముతో గుఱ్ఱమును పట్టుకొని నడచు చుండెను. విశ్వాసపాత్రులైన సేవకులు మాటిమాటికిని 'ప్రభూ! మీరు గుఱ్ఱమునధిరోహింపుడు' అని ప్రార్థించుచుండిరి. భరతుడు ఇట్లు పలికెను. "శ్రీరామచంద్రుడు కాలినడకనే వెళ్లెను. మనకొఱకై గుఱ్ఱములను ఏనుగులను రథములను ఉంచిపోయెనా! నేను శిరస్సును భూమికానించి నడచుట ఉచితము. సేవకుని ధర్మము అన్ని ధర్మముల కంటెను కఠినాతికఠినము." భరతుని సౌశీల్యమునకును, అతని పలుకులకును సేవకులందఱును సిగ్గుపడిరి. (చౌ॥ 1-4)

## ప్రయాగను చేరి భరతుడు భరద్వాజ మహర్షిని దర్శించుట

దో- భరత తీసరే పహర కహఀ, కీన్హ ప్రబేసు ప్రయాగ।
కహత రామ సియ రామ సియ,ఉమగి ఉమగి అనురాగా॥ 203 ॥

అపరిమితమైన భక్తితో 'సీతారామ్-సీతారామ్' అని స్మరించుచు భరతుడు సపరివారముగా మూడు జాముల వేళకు ప్రయాగను చేరెను. (దో॥ 203)

చౌ- ఝలకా ఝలకత పాయన్హ కైసేఀ। పంకజ కోస ఓస కన జైసేఀ॥
భరత పయాదేహిఀ ఆఏ ఆజూ। భయఉ దుఖిత సుని సకల సమాజూ॥ 1 ॥
ఖబరి లీన్హ సబ లోగ నహాఏ। కీన్హ ప్రనాము త్రిబేనిహిఀ ఆఏ॥
సబిధి సితాసిత నీర నహానే। దిఏ దాన మహిసుర సనమానే॥ 2 ॥
దేఖత స్యామల ధవల హలోరే। పులకి సరీర భరత కర జోరే॥
సకల కామ ప్రద తీరథరాఊ। బేద బిదిత జగ ప్రగట ప్రభాఊ॥ 3 ॥
మాగఉఀ భీఖ త్యాగి నిజ ధరమూ। ఆరత కాహ న కరఇ కుకరమూ॥
అస జియఀ జాని సుజాన సుదానీ। సఫల కరహిఀ జగ జాచక బానీ॥ 4 ॥

కమలముకుళములపైగల మంచుబిందువులవలె భరతునికోమలపాదములపై బొబ్బలు కన్పట్టెను. భరతునికాలినడక ప్రయాణమునుగూర్చి విని, అందఱును బాధపడిరి. అందఱును స్నానములను ఆచరించిన పిదప భరతుడు 'త్రివేణీ సంగమము'నకు వచ్చి ప్రణమిల్లెను. విధ్యుక్తముగా గంగాయమునల 'శ్వేత శ్యామజలసంగమము'న స్నానవిధులను ఆచరించెను. బ్రాహ్మణులను దానములతో సమ్మానించెను. సంగమస్థానమునందు ధవళనీలజలములను జూచి, పులకిత శరీరుడై చేతులు జోడించి పలికెను. "ఓ తీర్థరాజా! నీవు అందఱికోర్కెలను తీర్చువాడవు. నీ ప్రభావము వేదములలో ఖ్యాతికెక్కినది. అది లోకవిదితము. నా క్షత్రియ ధర్మమును గూడ వీడి, నేను నిన్ను భిక్షనడుగు చున్నాను. దుఃఖములలో మునిగినవాడు ఏ అధర్మమునకు దిగడు? దీని భావమును గమనించి, సజ్జన శ్రేష్ఠుడైన దాత యాచకులకు వరములను ఇచ్చును. (చౌ॥ 1-4)

దో- అరథ న ధరమ న కామ రుచి, గతి న చహఉఀ నిరబాన।
జనమ జనమ రతి రామ పద, యహ బరదాను న ఆన॥ 204 ॥

నాకు ధనముపై అభిలాషలేదు. ధర్మము, కామము, మోక్షము గూడ నాకు అక్కఱయే లేదు. జన్మజన్మలయందును శ్రీరామునిచరణములయందే నాకు దృఢమైన భక్తిని ప్రసాదింపుము. దీనిని తప్ప ఇంకే వరమును కోరను. (దో॥ 204)

చౌ- జానహిం రామ కుటిల కరి మోహీ । లోగ కహఉ గుర సాహిబ ద్రోహీ ॥
సీతా రామ చరన రతి మోరేం । అనుదిన బఢఉ అనుగ్రహ తోరేం ॥ 1 ॥
జలదు జనమ భరి సురతి బిసారఉ । జాచత జలు పబి పాహన డారఉ ॥
చాతకు రటని ఘటేం ఘటి జాఈ । బఢేం ప్రేము సబ భాఁతి భలాఈ ॥ 2 ॥
కనకహిం బాన చఢఇ జిమి దాహేం । తిమి ప్రియతమ పద నేమ నిబాహేం ॥
భరత బచన సుని మాఝ త్రిబేనీ । భఇ మృదు బాని సుమంగల దేనీ ॥ 3 ॥
తాత భరత తుమ్హ సబ బిధి సాధూ । రామ చరన అనురాగ అగాధూ ॥
బాది గలాని కరహు మన మాహీం । తుమ్హ సమ రామహి కోఉ ప్రియ నాహీం ॥ 4 ॥

శ్రీరాముడు స్వయముగా నన్ను కుటిలుడని భావించినను, ప్రజలు నన్ను 'స్వామిద్రోహి' 'గురుద్రోహి' అనుచు దూషించినను, నీ దయవలన నాకు శ్రీ సీతారాముల చరణములపై ప్రేమ దినదినాభివృద్ధిగాంచు గాక. మేఘము చాతకమును దానిజీవితాంతము వఱకును విస్మరించి, అది నీరడిగినప్పుడు పిడుగులను, వడగండ్లను వర్షింపవచ్చును. కాని చాతక పక్షి మాత్రము మేఘమునెడ తన ప్రేమను వీడి, 'పీ, పీ' అనుచు జలమును కోరనిచో, అదియే అప్రతిష్ఠపాలగును. మేఘముపై ప్రీతిని కల్గియుండుటయే దానికి మేలు. అట్లే ప్రభువైన శ్రీరామునియెడ భక్తి కల్గి యుండుటయే భరతునకు శ్రేయస్కరము. బంగారము అగ్నిలో తప్తమైనప్పుడే అది వన్నెకెక్కును. అట్లే ప్రియప్రభుని చరణములపై భక్తి ఎక్కువదైనప్పుడే సేవకుని ప్రతిష్ఠవెలుగును." భరతుని వాక్యములను విని, త్రివేణీ సంగమమధ్యనుండి మంగళ ప్రదమైన మధురవాణి వినిపించెను. "నాయనా! భరతా! నీవు అన్ని విధముల ఉత్తముడవు. శ్రీరాముని చరణములపైన నీకు గాఢమైన భక్తిగలదు. మనస్సులో అనవసరముగా కలత చెందుచున్నావు. శ్రీరామచంద్రునకు నీతో సమానముగా ప్రీతి పాత్రులైన వారు ఎవ్వరును లేరు. (చౌ. 1-4)

దో- తను పులకేఉ హియఁ హరషు సుని, బేని బచన అనుకూల ।
భరత ధన్య కహి ధన్య సుర, హరషిత బరషహిం ఫూల ॥ 205 ॥

త్రివేణీదేవి యొక్క అనుగ్రహ వచనములను విని, భరతుని శరీరము పులకితమయ్యెను. హృదయము ఆనందముతో పొంగిపోయెను. "భరతుడు ధన్యుడు ధన్యుడు ధన్యుడు" అనుచు దేవతలు హర్షోల్లాసములతో పూలను వర్షించిరి. (దో. 205)

చౌ- ప్రముదిత తీరథరాజ నివాసీ । బైఖానస బటు గృహీ ఉదాసీ ॥
కహహిం పరసపర మిలి దస పాఁచా । భరత సనేహు సీలు సుచి సాఁచా ॥ 1 ॥
సునత రామ గున గ్రామ సుహాఏ । భరద్వాజ మునిబర పహిం ఆఏ ॥
దండ ప్రనాము కరత ముని దేఖే । మూరతిమంత భాగ్య నిజ లేఖే ॥ 2 ॥
ధాఇ ఉఠాఇ లాఇ ఉర లీన్హే । దీన్హి అసీస కృతారథ కీన్హే ॥
ఆసను దీన్హ నాఇ సిరు బైఠే । చహత సకుచ గృహఁ జను భజి పైఠే ॥ 3 ॥

మని పూఁఛబ కథు యహ బడ సోచూ । బోలే రిషి లఖి సీలు సఁకోచూ ॥
సునహు భరత హమ సబ సుధి పాఈం । బిధి కరతబ పర కిఛు న బసాఈం ॥ 4 ॥

తీర్థరాజమైన ప్రయాగలో నివసించు బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు, సన్న్యాసులు- అందఱును అత్యంతప్రసన్నచిత్తులైరి. చిన్న చిన్న గుంపులుగా చేరి 'భరతుని శీలస్నేహములు పవిత్రములు, సత్యములు' అని పరస్పరము చెప్పికొనుచుండిరి. శ్రీరామచంద్రుని మనోహర గుణములను వారి ద్వారా వినుచు భరతుడు భరద్వాజ ముని కడకు వెళ్లెను. తనకు సాష్టాంగనమస్కారములు చేయుచున్న భరతుని జూచి, భరద్వాజ మహర్షి తన సౌభాగ్యము ఆకృతి దాల్చి వచ్చెనని తలంచెను. మహర్షి దిగ్గున లేచి భరతుని లేవనెత్తి, హృదయమునకు హత్తుకొని, ఆశీర్వాదమునిచ్చి, కృతార్థుని జేసెను. ముని ఆయనకు ఉచితాసనమునిచ్చి, ఆదరించెను. భరతుడు తనముఖమును క్రిందికి వాల్చి, పాటిపోయిన వాడు తిరిగి వచ్చి, ఇంటిలో ప్రవేశించి, సంకోచ పడుచున్నట్లు కూర్చొనెను. 'ముని అడిగినచో తాను ఏమని సమాధానమియ్య వలెను? అని అతడు మనస్సులో మిక్కిలి చింతించుచుండెను. భరతుని శీలసంకోచములను గ్రహించి, భరద్వాజమహర్షి పలికెను. "భరతా! వినుము. నాకంతయును తెలిసినది. విధాత కృత్యములు మన అధీనములో ఉండవు. (చౌ॥ 1-4)

దో- తుమ్హ గలాని జియఁ జని కరహు, సముఝి మాతు కరతూతి ।
తాత కైకఇహి దోసు నహిఁ, గఈ గిరా మతి ధూతి ॥ 206 ॥

నీ తల్లి చేసిన కృత్యమునకు నీవు చింతింపకుము. నాయనా! వాస్తవముగా ఇందులో కైకేయి దోషము కూడ లేదు. ఆమె బుద్ధిని సరస్వతి దేవి కలుషితమొనర్చినది. (దో॥ 206)

చౌ- యహఉ కహత భల కహిహి న కోఊ । లోకు బేదు బుధ సమ్మత దోఊ ॥
తాత తుమ్హార బిమల జసు గాఈ । పాఇహి లోకఉ బేదు బడాఈ ॥ 1 ॥
లోక బేద సమ్మత సబు కహఈ । జెహి పితు దేఇ రాజు సో లహఈ ॥
రాఉ సత్యబ్రత తుమ్హహి బోలాఈ । దేత రాజు సుఖు ధరము బడాఈ ॥ 2 ॥
రామ గవను బన అనరథ మూలా । జో సుని సకల బిస్వ భఇ సూలా ॥
సో భావీ బస రాని అయానీ । కరి కుచాలి అంతహుఁ పఛితానీ ॥ 3 ॥
తహఁఉఁ తుమ్హార అలప అపరాధూ । కహై సో అధమ అయాన అసాధూ ॥
కరతెహు రాజు త తుమ్హహి న దోషూ । రామహి హోత సునత సంతోషూ ॥ 4 ॥

అట్లని సరస్వతీ దేవిపై దోషారోపణ చేయుటగూడ సమంజసము గాదు. ఏలనన ఆమెను దేవతలు తమ కార్యమునకై ఆ విధముగా ప్రేరేపించిరి. లోకదృష్టిలో కైకేయి దోషి. వేద ప్రమాణమునను సరించి, కైకేయి నిర్దోషి. పండితులు వేదప్రమాణములను, జనవాక్యమును రెండింటినీ గౌరవింతురు. కావున, ఓ నాయనా! నీ నిర్మలయశస్సును కొనియాడి, వేదములు, లోకులుగూడ కీర్తి ప్రతిష్ఠలను పొందుచున్నారు. 'తండ్రి ఎవరికి రాజ్యమునప్పగించునో అతడే రాజ్యాధికారి' అనుమాటను వేదములు ఆమోదించును, లోకులును సమ్మతింతురు. మీ తండ్రి సత్య ప్రతిజ్ఞుడు. నిన్ను పిలిచి, రాజ్యమును అప్పగించినచో అతనికి సంతోషము, ధర్మనిష్ఠ, యశస్సు,

దక్కియుండెడిని. కాని శ్రీరాముని వనగమనము అన్ని అనర్థములకును మూలమాయెను. దానిని విని ప్రపంచమంతయు శోకమున మునిగెను. ఈ రాముని వనగమనము గూడ భగవంతుని ఇచ్ఛయే. రాణి తాను చేసిన పనికి పశ్చాత్తాప పడినది. నిన్ను దోషిగా భావించినవాడు, నీచుడు, అసాధువు, బుద్ధిహీనుడు, నీవు రాజ్యమును అంగీకరించి యున్నప్పటికిని నీ దోషము ఏమియు ఉండెడిదిగాదు. శ్రీరాముడు గూడ దానిని విని, సంతోషించి యుండెడివాడు. (చౌ॥ 1-4)

దో- అబ అతి కీన్హెహు భరత భల, తుమ్హహి ఉచిత మత ఏహు।
సకల సుమంగల మూల జగ, రఘుబర చరన సనేహు ॥ 207 ॥

కాని భరతా! ఇప్పుడు నీవు చేసినపని మిక్కిలి ఉత్తమమైనది, సముచితమైనది. రఘునాథుని చరణములపై భక్తి కలుగుటయే సమస్త శుభములకు మూలము. (దో॥ 207)

చౌ- సో తుమ్హార ధను జీవను ప్రానా । భూరిభాగ కో తుమ్హహి సమానా ॥
యహ తుమ్హార ఆచరజు న తాతా । దసరథ సుఅన రామ ప్రియ భ్రాతా ॥ 1 ॥
సునహు భరత రఘుబర మన మాహీం । పేమపాత్రు తుమ్హ సమ కోఉ నాహీం ॥
లఖన రామ సీతహి అతి ప్రీతీ । నిసి సబ తుమ్హహి సరాహత బీతీ ॥ 2 ॥
జానా మరము నహాత ప్రయాగా । మగన హోహిం తుమ్హరేం అనురాగా ॥
తుమ్హ పర అస సనేహు రఘుబర కేం । సుఖ జీవన జగ జస జడ నర కేం ॥ 3 ॥
యహ న అధిక రఘుబీర బడాఈ । ప్రనత కుటుంబ పాల రఘురాఈ ॥
తుమ్హ తౌ భరత మోర మత ఏహూ । ధరేం దేహ జను రామ సనేహూ ॥ 4 ॥

అది (శ్రీరాముని పాదములపై గల భక్తి)యే నీకు ధనము, జీవనము, ప్రాణము. నాయనా! నీ వంటి భాగ్యశాలి ఎవడు? ఈ విషయము ఏ మాత్రము ఆశ్చర్యకరముగాదు. ఏలనన నీవు దశరథమహారాజకుమారుడవు, శ్రీరామచంద్రునిప్రియసోదరుడవు. భరతా! వినుము. శ్రీరామచంద్రునకు నీతోసమానముగా ప్రీతిపాత్రుడైనవాడు ఎవ్వడును లేడు. శ్రీ సీతారామలక్ష్మణులు ప్రయాగలో (ఇక్కడ) ఉన్నప్పుడు ఆ రాత్రి యంతయు నీ ప్రశంసలోనే గడిపిరి. నేను ఈ సంగతిని వారు త్రివేణీ సంగమములో స్నానములుచేయుచుండగా గ్రహించితిని. ప్రయాగలో శ్రీరాముడు స్నానముచేయుసమయమున స్నాన సంకల్పమును జెప్పుచు, 'భరతఖండే' అనునప్పుడు మాటిమాటికిని 'భరత! భరత! అనుచు నీ ప్రేమలో మగ్నుడై గంగలో మునకలువేయుచుండెను. ప్రయాగలోనివారందఱును ఈ విషయమునుఎఱుగుదురు. వారికి నీపై గల ప్రేమానురాగములు అసమానములు. అజ్ఞానికి ప్రపంచములో సుఖమయ జీవితమునెడ ఎంత మక్కువ యుండునో - శ్రీరామునకు నీమీద అంతటి ప్రగాఢ ప్రేమ గలదు. అది అతని సహజ స్వభావము. రఘునాథుడు శరణాగతులను, వారికుటుంబములను కాపాడును. నీవు మూర్తీభవించిన శ్రీరాముని ప్రేమావతారము- అని నా అభిప్రాయము. (చౌ॥ 1-4)

దో- తుమ్హ కహఁ భరత కలంక యహ, హమ సబ కహఁ ఉపదేసు ।
రామ భగతి రస సిద్ధి హిత, భా యహ సమఉ గనేసు ॥ 208 ॥

భరత! నీవు 'కళంకము' అని అనుకొనిన విషయము లోకమునకు ఉపదేశము. శ్రీరామభక్తి రసామృతమును పొందుటకు ఇది శుభారంభము.(అనగా నిన్ను జూచి రామునిపై భక్తిని అలవరుచు కొందుము) (దో॥ 208)

చౌ- నవ బిధు బిమల తాత జసు తోరా । రఘుబర కింకర కుముద చకోరా ॥
ఉదిత సదా అఁథఇహి కబహూఁ నా । ఘటిహి న జగ నభ దిన దిన దూనా ॥ 1 ॥
కోక తిలోక ప్రీతి అతి కరిహీ । ప్రభు ప్రతాప రబి ఛబిహి న హరిహీ ॥
నిసి దిన సుఖద సదా సబ కాహూ । గ్రసిహి న కైకఇ కరతబు రాహూ ॥ 2 ॥
పూరన రామ సుపేమ పియూషా । గుర అవమాన దోష నహిఁ దూషా ॥
రామ భగత అబ అమిఅఁ అఘూహూఁ । కీన్హెహు సులభ సుధా బసుధాహూఁ ॥ 3 ॥
భూప భగీరథ సురసరి ఆనీ । సుమిరత సకల సుమంగల ఖానీ ॥
దసరథ గున గన బరని న జాహీఁ । అధికు కహా జెహి సమ జగ నాహీఁ ॥ 4 ॥

నాయనా! నీ నిర్మల కీర్తి చంద్రికా ప్రసారముతో శ్రీరామ భక్తులు అనెడి కుముదములు, చకోరములు హాయిగా తృప్తి గాంచును. నీ యశోరూపమైన చంద్రునిపై త్రిలోకములనెడి చకోరములు అత్యంతప్రేమను కల్గియుండును. (అనగా ముల్లోకములును నీపై ప్రేమ కలిగియుండును. శ్రీరాముడు నిన్ను ప్రేమించును) నీ కీర్తి చంద్రుడు ఎల్లప్పుడును వెల్గుచునే యుండును. ఎన్నడును అస్తమించడు. పైగా దినదినము వృద్ధిగాంచును. శ్రీరాముని ప్రతాపమనెడిభానునికాంతులకు నీ కీర్తిచంద్రికలు వెలవెలబోవు. నీ నిర్మలకీర్తిచంద్రుడు రాత్రింబవళ్లు అందఱికిని సుఖమును గూర్చును. కైకేయి కృత్యములనెడి రాహువు ఈ చంద్రుని కబళింపజాలడు. వెన్నెలలు శ్రీరాముని అమృతమయమైన ప్రేమతో నిండినవి. బృహస్పతి శిష్యుడైన చంద్రునకు గురుద్రోహ కళంకము కలదు. కాని నీయశో రూపచంద్రునకు ఎట్టి కళంకములేదు. రామభక్తి రసామృతమును నీవు జగమునందంతటను పంచితివి. దానిని శ్రీరామ భక్తులు అవలీలగా పొంది, తనివితీర ఆస్వాదించి, ఆనందింతురు. నీ వంశపూర్వజుడైన భగీరథుడు 'గంగ'ను భూమికి దీసికొనివచ్చెను. గంగాస్మరణము సర్వశుభములకును మూలము. దశరథునిగుణములు వర్ణింపనలవికానివి. అతనికి సమానుడెవ్వడును లేడు. ఇక అధికుడెట్లుండును? (చౌ॥ 1-4)

దో- జాసు సనేహ సకోచ బస, రామ ప్రగట భఏ ఆఇ ।
జే హర హియ నయనని కబహుఁ, నిరఖే నహీఁ అఘాఇ ॥ 209 ॥

ఆ దశరథుని ప్రేమకును, సౌశీల్యమునకును వశుడై స్వయముగా ఆ పరమాత్మయే శ్రీరాముడుగా అవతరించెను. శంకరునియంతటివాడు తనమనోనేత్రముతో నిరంతరము శ్రీరామచంద్రుని జూచుచు, స్మరించుచుగూడ తృప్తి చెందడు. (దో॥ 209)

చౌ- కీరతి బిధు తుమ్హ కీన్హ అనూపా । జహఁ బస రామ పేమ మృగరూపా ॥
తాత గలాని కరహు జియఁ జాఏఁ । డరహు దరిద్రహి పారసు పాఏఁ ॥ 1 ॥
సునహు భరత హమ ఝూఠ న కహహీఁ । ఉదాసీన తాపస బన రహహీఁ ॥
సబ సాధన కర సుఫల సుహావా । లఖన రామ సియ దరసను పావా ॥ 2 ॥
తేహి ఫల కర ఫలు దరస తుమ్హారా । సహిత పయాగ సుభాగ హమారా ॥
భరత ధన్య తుమ్హ జసు జగు జయఊ । కహి అస పేమ మగన ముని భయఊ ॥ 3 ॥
సుని ముని బచన సభాసద హరషే । సాధు సరాహి సుమన సుర బరషే ॥
ధన్య ధన్య ధుని గగన పయాగా । సుని సుని భరతు మగన అనురాగా ॥ 4 ॥

వారి కంటెను ఎక్కువగా నీవు కీర్తిచంద్రుని సృష్టించితివి. అందులో శ్రీరామభక్తి యనెడి మృగచిహ్నము అలరారును. నాయనా! నీవు అనవసరముగా దుఃఖించుచున్నావు. పరుసవేదిని పొందియు, దారిద్ర్యమునకు భయపడుచున్నావు- భరతా! వినుము. నేను పల్కునది పూర్తిగా యథార్థము. నేను విరాగిని, తాపసిని, వనవాసిని. మా సకలతపస్సాధనల ఫలమే శ్రీసీతారామలక్ష్మణుల దర్శనము. వారి దర్శన ఫలస్వరూపమే నీ దర్శనము. ఈ ప్రయాగతో పాటు మేమును భాగ్యశాలురమైతిమి. భరతా! నీవు ధన్యుడవు. నీ కీర్తి ప్రభావముచే నీవు సమస్త జగత్తును జయించితివి." ఈ విధముగా పలికి మునీశ్వరుడు భరతప్రేమలో మగ్నుడాయెను. ముని వచనములను విని, సభాసదులెల్లరును ప్రసన్నచిత్తులైరి. 'బాగు,బాగు' అనుచు దేవతలు విరులవాన కురిసిరి. ఆకాశమునందును, ప్రయాగలోను 'ధన్యుడు, ధన్యుడు' అను మాటలను విని, భరతుడు అనురాగ మగ్నుడాయెను. (చౌ॥ 1-4)

దో- పులక గాత హియఁ రాము సియ, సజల సరోరుహ నైన ।
కరి ప్రనాము ముని మండలిహి, బోలే గదగద బైన ॥ 210 ॥

అతని శరీరము పులకించెను. హృదయమున శ్రీ సీతారాములు నిలిచిరి. కమలముల వంటి నేత్రములు ఆనందాశ్రుపూర్ణములాయెను. మునులకు నమస్కరించి, భరతుడు గద్గదస్వరముతో పలికెను. (దో॥ 210)

చౌ- ముని సమాజు అరు తీరథరాజూ । సాఁచిహుఁ సపథ అఘాఇ అకాజూ ॥
ఏహిఁ థల జౌఁ కిఛు కహిఅ బనాఈ । ఏహి సమ అధిక న అఘ అధమాఈ ॥ 1 ॥
తుమ్హ సర్బగ్య కహఉఁ సతిభాఊ । ఉర అంతరజామీ రఘురాఊ ॥
మొహి న మాతు కరతబ కర సోచూ । నహిఁ దుఖు జియఁ జగు జానిహి పోచూ ॥ 2 ॥
నాహిన డరు బిగరిహి పరలోకూ । పితహు మరన కర మోహి న సోకూ ॥
సుకృత సుజస భరి భుఅన సుహాఏ । లఛిమన రామ సరిస సుత పాఏ ॥ 3 ॥
రామ బిరహఁ తజి తను ఛనభంగూ । భూప సోచ కర కవన ప్రసంగూ ॥
రామ లఖన సియ బిను పగ పనహీఁ । కరి ముని బేష ఫిరహిఁ బన బనహీఁ ॥ 4 ॥

"మునుల సమూహాములో ఆదియును సర్వతీర్థరాజమైన ప్రయాగలో సత్యము మీద ప్రమాణము చేయుటగూడ ఒక మహాపాపము. ఇట్టి ప్రదేశములో అసత్యమాడినచో దానికి సమానమగు మహాపాపముగాని, నీచకృత్యముగాని మఱియొకటి ఉండదు. నేను విశుద్ధ భావముతో పల్కుచున్నాను. మీరు సర్వజ్ఞులు. శ్రీరామచంద్రుడు అంతర్యామి. అందఱిమనస్సులలోని భావములను గ్రహించువాడు. నా తల్లియైనకైకేయికృత్యములకును నాకు విచారము లేదు. లోకము నన్ను నీచునిగా భావించుననుదుఃఖముగూడ నాకు లేదు. పరలోకగతినిగూర్చిన భయముగూడ నాకులేదు. తండ్రిగారిమృత్యుశోకము గూడ లేదు. ఏలనన వారి కీర్తి పుణ్యములు విశ్వవ్యాప్తములు. శ్రీరామలక్ష్మణులవంటి అనుపమపుత్రరత్నములనుగన్న పుణ్యాత్ముడాయన. శ్రీరామచంద్రునివియోగబాధను భరింపలేక క్షణభంగురమైన పార్థివశరీరమును వదలెను. అట్టి మహా పురుషునకై విచారింపనేల? కాని శ్రీ సీతారామలక్ష్మణులు పాదరక్షలుగూడ లేకుండ ముని వేషములతో వనములలో సంచరించుటయే నాకు విచారమును కలిగించు విషయము. (చౌ॥ 1-4)

దో- అజిన బసన ఫల అసన మహీ, సయన డాసి కుస పాత ।
బసి తరు తర నిత సహత హిమ, ఆతప బరషా బాత ॥ 211 ॥

వారు అజినములను వల్కలములను ధరించి, కందమూలఫలములనుమాత్రమే భుజించుచు ఆకులలములే శయ్యగా భూమిపై పరుండి చెట్లక్రింద నివసించుచున్నారు. అనుక్షణము వారు శీతవర్షాతపవాతబాధలకు గురియగు చున్నారు. (దో॥ 211)

చౌ- ఏహి దుఖ దాహఁ దహఇ దిన ఛాతీ । భూఖ న బాసర నీద న రాతీ ॥
ఏహి కురోగ కర ఔషధు నాహీఁ । సోధేఉఁ సకల బిస్వ మన మాహీఁ ॥ 1 ॥
మాతు కుమత బఢఈ అఘ మూలా । తేహిఁ హమార హిత కీన్హ బఁసూలా ॥
కలి కుకాఠ కర కీన్హ కుజంత్రూ । గాడి అవధి పఢి కఠిన కుమంత్రూ ॥ 2 ॥
మోహి లగి యహు కుఠాటు తేహిఁ ఠాటా । ఘాలేసి సబ జగు బారహబాటా ॥
మిటఇ కుజోగు రామ ఫిరి ఆఏఁ । బసఇ అవధ నహిఁ ఆన ఉపాఏఁ ॥ 3 ॥
భరత బచన సుని ముని సుఖు పాఈ । సబహిఁ కీన్హి బహు భాఁతి బడాఈ ॥
తాత కరహు జని సోచు బిసేషీ । సబ దుఖు మిటిహి రామ పగ దేఖీ ॥ 4 ॥

ఈ దుఃఖతాపము నిత్యము నా హృదయమును దహించివేయుచున్నది. పగలు ఆకలి వేయుటలేదు. రాత్రులయందు నిద్రపట్టుటలేదు. ఎంతగా గాలించినను ఈ భయంకర రోగమునకు ఔషధమే కన్పట్టుటలేదు. నా తల్లి చెడు ఆలోచనలే ఈ పాపకార్యములకు మూలములు. నాకు హితము చేయగోరి, ఆసాకుతో ఆమె ఈ దురాలోచనలను పెంచుకొనినది. నా తల్లి దురాలోచనయే ఈ అనర్థములకు మూలమైన ఒక వడ్రంగి. అతడు నా హితమనెడి 'బాడిస'ను చేసెను. దానితో కలహరూపమనెడి కొయ్యను సిద్ధపఱచి, దానిని 'శ్రీరామ వనవాసము' అను

మంత్రమును పఠించుచు అయోధ్యలో నాటెను. (శత్రువులను రూపుమాపుటకై తాంత్రికులు 'శాతబడి' వంటి దుష్ట ప్రయోగములను జేసెదరు. ఈ సందర్భమున అట్టి దుష్ట వామాచార ప్రయోగములను గూర్చి తులసీదాసు వ్రాయుచున్నాడు.) నాకొఱకే ఆమె ఈ కుతంత్రములను పన్ని జగత్తును ఛిన్నాభిన్నము చేసి, చెఱుపు చేసినది. శ్రీరామచంద్రుడు తిరిగివచ్చిననేగాని ఈ ఉపద్రవము చల్లారదు. అప్పుడే అయోధ్య నిలబడును. మఱియొక ఉపాయమేలేదు." భరతుని వచనములకు ముని సంతుష్టుడాయెను. అతనిని పెక్కు విధముల ప్రశంసించెను. భరద్వాజుడు పలికెను. "నాయనా! నీవింత ఎక్కువగా మథనపడవలదు. శ్రీరామచంద్రుని చరణములను దర్శించినంతనే నీ దుఃఖమంతయు చల్లారును. (చౌ॥ 1-4)

## భరతునకు భరద్వాజుని ఆతిథ్యము

దో- కరి ప్రబోధు మునిబర కహేఉ, అతిథి పేమప్రియ హోహు।
కంద మూల ఫల ఫూల హమ, దేహిఁ లేహు కరి ఛోహు॥ 212॥

ఈ విధముగా అనునయించి, ముని శ్రేష్ఠుడైన భరద్వాజుడు భరతునితో పలికెను. "ఇప్పుడు మీరు అందఱును మాకు ప్రియమైన అతిథులు. మేమిచ్చిన ఈ కందమూల ఫలములు, పూవులు దయతో స్వీకరింపుడు." (దో॥ 212)

చౌ- సుని ముని బచన భరత హియఁ సోచూ। భయఉ కుఅవసర కఠిన సఁకోచూ॥
జాని గరుఇ గుర గిరా బహోరీ। చరన బంది బోలే కర జోరీ॥ 1॥
సిర ధరి ఆయసు కరిఅ తుమ్హారా। పరమ ధరమ యహు నాథ హమారా॥
భరత బచన మునిబర మన భాఏ। సుచి సేవక సిష నికట బోలాఏ॥ 2॥
చాహిఅ కీన్హి భరత పహునాఈ। కంద మూల ఫల ఆనహు జాఈ॥
భలేహిఁ నాథ కహి తిన్హ సిర నాఏ। ప్రముదిత నిజ నిజ కాజ సిధాఏ॥ 3॥
మునిహి సోచ పాహున బడ నేవతా। తసి పూజా చాహిఅ జస దేవతా॥
సుని రిధి సిధి అనిమాదిక ఆఈఁ। ఆయసు హోఇ సో కరహిఁ గోసాఈఁ॥ 4॥

ముని వచనములను విని, భరతుడు మనసులోనే అనుకొనెను. "అనవసరముగా ఈ సమస్య వచ్చి పడినది." కాని పెద్దల మాటలు శిరోధార్యములని తలచి, ఆయన పాదములకు నమస్కరించి, అంజలి ఘటించి పలికెను. "ప్రభూ! మీ ఆజ్ఞ శిరోధార్యము. దానిని పాలించుట నాకు పరమధర్మము." భరతుని మాట మునీశ్వరునకు మిక్కిలి ప్రియమును గూర్చెను. అతడు విశ్వాసపాత్రులైన సేవకులను శిష్యులను పిలిచి యిట్లు చెప్పెను. "భరతునకు ఆతిథ్యమును ఇయ్యవలెను. వెళ్ళి కందమూలఫలములను తీసికొని రండు." వారు చిత్తము అని తలలూపి, సంతోషముతో తమపనులను నిర్వర్తించుటకై వెళ్ళిరి. ముని తనమనస్సులో ఆలోచించెను. "నేనొక గొప్ప అతిథిని ఆహ్వానించినాను. అతిథి దేవుని ఔన్నత్య స్థితిని బట్టి అతనికి తగిన మర్యాదలను నెరపవలెను." ముని ఆలోచనలను గ్రహించి, కుబేరుని సేవకులైన బుద్ధులు, అణిమాది-అష్ట సిద్ధులు ప్రత్యక్షమై "ప్రభూ! మాకు ఆజ్ఞను ఇండు." అని పలికిరి. (చౌ॥ 1-4)

దో- రామ బిరహ బ్యాకుల భరతు, సానుజ సహిత సమాజ ।
పహునాఈ కరి హరహు శ్రమ, కహా ముదిత మునిరాజ ॥ 213 ॥

మునివరుడు ప్రసన్నుడై పలికెను. "భరతుడును, అతని సోదరుడైన శత్రుఘ్నుడును వారి పరివారములును శ్రీరాముని విరహమువలన వ్యాకులపాటునకు లోనైరి. వారికి తగిన అతిథి సపర్యలు గావించి వారి శ్రమను తొలగింపుడు. (దో॥ 213)

చౌ- రిధి సిధి సిర ధరి మునిబర బానీ । బడభాగిని ఆపుహి అనుమానీ ॥
కహహిఁ పరసపర సిధి సముదాఈ । అతులిత అతిథి రామ లఘు భాఈ ॥ 1 ॥
ముని పద బంది కరిఅ సొఇ ఆజూ । హోఇ సుఖీ సబ రాజ సమాజూ ॥
అస కహి రచేఉ రుచిర గృహ నానా । జెహి బిలోకి బిలఖాహిఁ బిమానా ॥ 2 ॥
భోగ బిభూతి భూరి భరి రాఖే । దేఖత జిన్హహి అమర అభిలాషే ॥
దాసీఁ దాస సాజు సబ లీన్హేఁ । జోగవత రహహిఁ మనహి మను దీన్హేఁ ॥ 3 ॥
సబ సమాజు సజి సిధి పల మాహీఁ । జే సుఖ సురపుర సపనేహుఁ నాహీఁ ॥
ప్రథమహిఁ బాస దిఏ సబ కేహీ । సుందర సుఖద జథా రుచి జేహీ ॥ 4 ॥

ఋద్ధులు, సిద్ధులు ముని ఆజ్ఞను 'శిరోధార్యము' గానెంచి, తాము అదృష్టవంతులైనట్లు భావించుకొనిరి. వారు తమలో తాము ఇట్లనుకొనసాగిరి. "శ్రీరామచంద్రుని సోదరుడైన భరతుడు సాటిలేని అరుదైన అతిథి. మునిచరణములను పూజించి, ఈ రాజ సమూహమంతయు తృప్తి పడునట్లు మనము నేడు తగు ఏర్పాట్లు చేయవలెను." ఇట్లు అనుకొని దేవతల ప్రాసాదములను గూడ త్రోసి పుచ్చు సౌధములను కల్పించిరి. వాటిలో అనేక భోగైశ్వర్య సామగ్రులను ఉంచిరి. వాటిని జూచి, దేవతలుగూడ వాటిని పొందుటకై ఉబలాటపడిరి. దాస దాసీలు అవసరములగు వస్తువులను అన్నింటిని ప్రసన్న చిత్తములతో సమకూర్చి, ఎవరేది కోరినను దానిని అందించుటకు సిద్ధముగా నిల్చిరి. స్వర్గములో స్వప్నములోగూడ చూడని సుఖములను సిద్ధులు క్షణములో సమకూర్చిరి. మొదట అయోధ్యావాసులందఱికిని వారివారి అభిరుచులకు తగినట్లు సుందరములును, సుఖదములును ఐన నివాసములను కల్పించిరి. (చౌ॥ 1-4)

దో- బహురి సపరిజన భరత కహుఁ, రిషి అస ఆయసు దీన్హ ।
బిధి బిసమయ దాయకు బిభవ, మునిబర తపబల కీన్హ ॥ 214 ॥

పిమ్మట భరతునకును, అతనికుటుంబసభ్యులకును అదే విధముగా తగు నివాస స్థానములను ఏర్పఱచిరి. విలసన భరద్వాజుని ఆజ్ఞ అట్టిది. మునీశ్వరుని తపోబలమునకు బ్రహ్మ గూడ ఆశ్చర్యపడెను. (దో॥ 214)

చౌ- ముని ప్రభాఉ జబ భరత బిలోకా । సబ లఘు లగే లోకపతి లోకా ॥
సుఖ సమాజు నహిఁ జాఇ బఖానీ । దేఖత బిరతి బిసారహిఁ గ్యానీ ॥ 1 ॥
ఆసన సయన సుబసన బితానా । బన బాటికా బిహగ మృగ నానా ॥
సురభి ఫూల ఫల అమిఅ సమానా । బిమల జలాసయ బిబిధ బిధానా ॥ 2 ॥

అసన పాన సుచి అమిఅ అమీ సే । దేఖి లోగ సకుచాత జమీ సే ॥
సుర సురభీ సురతరు సబహీ కేఀ । లఖి అభిలాషు సురేస సచీ కేఀ ॥ 3 ॥
రితు బసంత బహ త్రిబిధ బయారీ । సబ కహఀ సులభ పదారథ చారీ ॥
స్రక చందన బనితాదిక భోగా । దేఖి హరష బిసమయ బస లోగా ॥ 4 ॥

ముని ప్రభావము చూచిన భరతునకు లోకపాలకుల వైభవములుగూడ అల్పములని పించెను. వర్ణనాతీతమైన ఆ సుఖ సామగ్రిని చూచి, పరమ జ్ఞానులు గూడ తమ వైరాగ్యములను మఱచెదరు. ఆసనములు, పఱుపులు, సుందరవస్త్రములు గుడారములు, వనములు, ఉపవనములు వివిధ పశుపక్ష్యాదులు, సుగంధ పుష్పములు, రుచిగలఫలములు, నిర్మల జలాశయములు, అమృతతుల్యములైన స్వాదిష్టఖాద్యపదార్థములు ఏర్పఱచబడెను. (వాటిని జూచి కనివిని యెఱుగని ఆ సుఖభోగవస్తువులను తాము అనుభవింపవచ్చునో లేదోయని అయోధ్యా వాసులు సంకోచించుచు విరక్తులవలె నిలిచి పోయిరి.) శ్రీరామ వియోగమువలన అయోధ్యావాసులు వ్రత దీక్షలో ఉన్నందున సంయమమును అవలంబించుచుండిరి. వారు ఈ భోగైశ్వర్యములను పొందుటకు విరక్తులవలె సంకోచించు చుండిరి. ప్రతి గృహమున కామధేనువు, కల్పతరువు ఉండెను. వాటిని గాంచి ఇంద్రుడును శచీదేవియు ఆశ పడుదురు. వసంత ఋతువునందువలె శీతలమందసుగంధవాయువులు వీచుచుండెను. చతుర్విధ పురుషార్థఫలములు అచట అందుబాటులో ఉన్నట్లుండెను. స్రక్చందనవనితాది భోగ్య వస్తువులను జూచి జనులందఱును హర్ష విస్మయములకు లోనగుచు ఉండిరి. (చౌ॥ 1-4)

దో- సంపతి చకఈ భరతు చక, ముని ఆయస ఖేలవార ।
తెహి నిసి ఆశ్రమ పింజరాఀ, రాఖే భా భినుసార ॥ 215 ॥

ఈ సంపద ఆడుచక్రవాకము వంటిది. భరతుడు మగచక్రవాకము వంటివాడు. ముని ఆజ్ఞ తన లీలలచే వాటిని ఆడించు చుండెను. ఈ రెండును ఆ రాత్రి ఆశ్రమమనెడి పంజరములో బంధింపబడెను. (ఒకే పంజరములో నున్నను రాత్రివేళ స్త్రీ పురుష చక్రవాకములు కలియనట్లు ప్రలోభ పఱచు విలాసవస్తువుల మధ్యనున్నను భరతుని మనస్సు వాటివే ఆకర్షితము కాలేదు) ఇంతలో ప్రాతఃకాలమాయెను. (దో॥ 215)

మాసపారాయణము - పందొమ్మిదవ విరామము

చౌ- కీన్హ నిమజ్జను తీరథరాజా । నాఇ మునిహి సిరు సహిత సమాజా ॥
రిషి ఆయసు అసీస సిర రాఖీ । కరి దండవత బినయ బహు భాషీ ॥ 1 ॥
పథగతి కుసల సాథ సబ లీన్హేఀ । చలే చిత్రకూటహిఀ చితు దీన్హేఀ ॥
రామసఖా కర దీన్హే లాగూ । చలత దేహ ధరి జను అనురాగూ ॥ 2 ॥
నహిఀ పద త్రాన సీస నహిఀ ఛాయా । పేము నేము బ్రతు ధరము అమాయా ॥
లఖన రామ సియ పంథ కహానీ । పూఀఛత సఖహి కహత మృదు బానీ ॥ 3 ॥

రామ బాస థల బిటప బిలోకేఁ । ఉర అనురాగ రహత నహిఁ రోకేఁ ॥
దేఖి దసా సుర బరిసహిఁ ఫూలా । భఇ మృదు మహి మగు మంగల మూలా ॥ 4 ॥

ప్రాతఃకాలమున భరతుడు తీర్థరాజమైన ప్రయాగలో త్రివేణీ స్నానములను ఆచరించి, సవినయముగా, సపరివారముగా మునికి నమస్కరించి, ఆయనఆజ్ఞను, ఆశీర్వాదమును పొందెను. పిదప త్రోవలను ఎఱిగిన వారిని, ఇతర జనులను తనతోపాటు వెంటనిడుకొని, భరతుడు చిత్రకూటమున మనస్సును నిలిపి బయలుదేఱెను. సాక్షాత్తు శ్రీరామ ప్రేమయే ఆకృతి దాల్చినదా? అనునట్లు రామసఖుడైనగుహునిచేతిలో చేయివేసి, అతడు నడచుచుండెను. కాళ్లకు పాదరక్షలు లేవు. శిరమునకు ఆచ్ఛాదనముగా ఛత్రములేదు. అతని ప్రేమ, నియమము, వ్రతము, ధర్మము నిష్కపటములైనవి. శ్రీ సీతారాములేవిధముగా సంచరించినదియు తెల్పుమని అతడు నిషాదరాజును కోరెను. అతడు ఆ విషయములను అన్నింటిని భరతునకు మృదుమధురముగా తెల్పుచు నడచుచుండెను. శ్రీరాముడాగిన స్థలములను, ఆచటి వృక్షములను జూచి భరతుని హృదయములోని ప్రేమ ఆపినను ఆగకయుండెను. భరతుని ఈ స్థితిని జూచి దేవతలు పూలను వర్షించిరి. పృథ్వి కోమలమాయెను. త్రోవలు సుఖప్రదములుగా నుండెను.(చౌ॥ 1-4)

దో- కిఏఁ జాహిఁ ఛాయా జలద, సుఖద బహఇ బర బాత ।
తస మగు భయఉ న రామ కహఁ, జస భా భరతహి జాత ॥ 216 ॥

మేఘములు వారికి నీడనిచ్చెను. వాయువులు హాయినిగొల్పుచుండెను. భరతుని ప్రయాణము శ్రీరాముని ప్రయాణము కంటెను సుఖదాయకముగా నుండెను. (దో॥ 216)

చౌ- జడ చేతన మగ జీవ ఘనేరే । జే చితఏ ప్రభు జిన్హ ప్రభు హేరే ॥
తే సబ భఏ పరమపద జోగూ । భరత దరస మేటా భవ రోగూ ॥ 1 ॥
యహ బడి బాత భరత కఇ నాహీఁ । సుమిరత జినహి రాము మన మాహీఁ ॥
బారక రామ కహత జగ జేఊ । హోత తరన తారన నర తేఊ ॥ 2 ॥
భరతు రామ ప్రియ పుని లఘు భ్రాతా । కస న హోఇ మగు మంగలదాతా ॥
సిద్ధ సాధు మునిబర అస కహహీఁ । భరతహి నిరఖి హరషు హియఁ లహహీఁ ॥ 3 ॥
దేఖి ప్రభాఉ సురేసహి సోచూ । జగు భల భలేహి పోచ కహుఁ పోచూ ॥
గుర సన కహేఉ కరిఅ ప్రభు సోఈ । రామహి భరతహి భేట న హోఈ ॥ 4 ॥

మార్గమున శ్రీరామునిజూచినవి, ఆయనచే జూడబడినవియైన జడ, చేతన జీవులన్నియును తత్ క్షణమే మోక్షాధికారమును పొందినవి. కాని ఇప్పుడు భరతుని దర్శనముచే అవి జనన మరణ రూపములైన భవరోగములనుండి ముక్తినందినవి. భరతునకిది గొప్ప విషయముగాదు. ఏలనన శ్రీరాముడే స్వయముగా తన మనస్సున భరతుని స్మరించును. "ఈ ప్రపంచములో ఒక్కసారియైనను 'శ్రీరామ' అని స్మరించినచో ఆ వ్యక్తి తాను తరించుటయే గాక ఇతరులను గూడ తరింపజేయును. భరతుడు అయితే శ్రీరామునకు ప్రీతిపాత్రుడు మాత్రమే గాక అతనికి తమ్ముడు గూడ. అట్టి స్థితిలో ఆతనిమార్గము శుభప్రదమేలగాదు?" అని ఈ విధముగా సిద్ధులు,

సాధువులు, మునీశ్వరులును వల్కుచుండిరి. భరతునిజూచి, వారి హృదయములు ఆనందమున ఉప్పొంగుచుండెను. భరతుని ఈ ప్రేమ పారవశ్యములను జూచి (ఈ ప్రేమకు వశమై శ్రీరాముడు తిరిగి అయోధ్యకు మఱలి పోయినచో తమ కార్యము నెఱవేఱదేమోయని) ఇంద్రునకు భయము కలిగెను. ప్రపంచము మంచివారికి మంచిగా చెడ్డ వారికి చెడ్డగా కన్పట్టును. ఇంద్రుడు తమ గురువగు బృహస్పతితో పలికెను. "ప్రభూ! భరతునకు శ్రీరాముని దర్శనమే కలుగకుండ జేయుడు. (చౌ॥ 1-4)

## ఇంద్రుని భయము - బృహస్పతి అభయము

దో- రాము సఁకోచీ ప్రేమ బస, భరత సపేమ పయోధి ।
బనీ బాత బెగరన చహతి, కరిఅ జతను ఛలు సోధి ॥ 217 ॥చౌ

శ్రీరామచంద్రుడు సౌశీల్యము, ప్రేమ కలవాడు. భరతుడు ప్రేమసముద్రుడు. ఇంత వఱకు ఫలించిన మన ప్రయాస వృథా కావచ్చును. కావున ఏదైననొక కపటోపాయమును ఆలోచింపుడు." (దో॥ 217)

చౌ- బచన సునత సురగురు ముసుకానే । సహసనయన బిను లోచన జానే ॥
మాయాపతి సేవక సన మాయా । కరఇ త ఉలటి పరఇ సురరాయా ॥ 1 ॥
తబ కిఛు కీన్హ రామ రుఖ జానీ । అబ కుచాలి కరి హోఇహి హానీ ॥
సును సురేస రఘునాథ సుభాఊ । నిజ అపరాధ రిసాహిఁ న కాఊ ॥ 2 ॥
జో అపరాధు భగత కర కరఈ । రామ రోష పావక సో జరఈ ॥
లోకహుఁ బేద బిదిత ఇతిహాసా । యహ మహిమా జానహిఁ దురబాసా ॥ 3 ॥
భరత సరిస కో రామ సనేహీ । జగు జప రామ రాము జప జేహీ ॥ 4 ॥

ఇంద్రునిమాటలను విని, దేవగురువైన బృహస్పతి చిఱునవ్వుతో "ఇతడు వేయి కన్నులున్నను గ్రుడ్డివాడే" అని భావించుచు ఇట్లనెను. "దేవేంద్రా! మాయాప్రభువైన శ్రీరామచంద్రుని సేవకుని పైననే మాయోపాయములను పన్నినచో అది పన్నినవానినే దెబ్బతీయును. మొదట నేను శ్రీరాముని సంకల్పానుసారమే చేసితిని. ఇప్పుడు దానికి విరుద్ధముగా ఎట్టి పన్నాగమును పన్నినను హాని జరుగును. ఇంద్రా! రఘునాథుని స్వభావమును వినుము. అతడు తన యెడ అపరాధము చేసిన వారినెవ్వరిని కోపగింపడు. కాని ఆయనభక్తుని యెడ అపరాధము చేసిన వాడు శ్రీరామునిక్రోధాగ్నికి ఆహుతి యగును. వేదములలో ప్రస్తావింపబడిన ఈ విషయము లోకప్రసిద్ధము. దీనిని దుర్వాసుడు బాగుగా ఎఱుగును. (మహా భక్తుడైన అంబరీషుని యెడ అపరాధమొనర్చి, దుర్వాసుడు అనేకకష్టములపాలయ్యెను ఈ కథ సుప్రసిద్ధము.) లోకములన్నియును శ్రీరామ నామమును జపించును. ఆ శ్రీరాముడు భరతుని నామమును స్మరించును. శ్రీరామునకు భరతునితో సమానమైన ప్రీతిపాత్రుడు ఎవ్వడును లేడు. (చౌ॥ 1-4)

దో- మనహుఁ న ఆనిఅ అమరపతి, రఘుబర భగత అకాజు ।
అజసు లోక పరలోక దుఖ, దిన దిన సోక సమాజు ॥ 218 ॥

కావున ఇంద్రా! రఘుకులశ్రేష్ఠుడైన శ్రీరామచంద్రునిభక్తునకు అహితభావమును ఎప్పుడునూ ఏ రూపముననూ మనస్సునకు రానీయకుము. లేనిచో ఈ లోకములో అపకీర్తి, పరలోకములో దుఃఖము కల్గును. అనుక్షణము శోకము వెంటాడును. (దో॥ 218)

చౌ- సును సురేస ఉపదేసు హమారా । రామహి సేవకు పరమ పిఆరా ॥
మానత సుఖు సేవక సెవకాఈఁ । సేవక బైర బైరు అధికాఈఁ ॥ 1 ॥
జద్యపి సమ నహిఁ రాగ న రోషూ । గహహిఁ న పాప పూను గున దోషూ ॥
కరమ ప్రధాన బిస్వ కరి రాఖా । జో జస కరఇ సో తస ఫలు చాఖా ॥ 2 ॥
తదపి కరహిఁ సమ బిషమ బిహారా । భగత అభగత హృదయ అనుసారా ॥
అగున అలేప అమాన ఏకరస । రాము సగున భఏ భగత పేమ బస ॥ 3 ॥
రామ సదా సేవక రుచి రాఖీ । బేద పురాన సాధు సుర సాఖీ ॥
అస జియఁ జాని తజహు కుటిలాఈ । కరహు భరత పద ప్రీతి సుహాఈ ॥ 4 ॥

దేవేంద్రా! నా ఉపదేశమును వినుము. శ్రీరామునకు తన భక్తుడు అత్యంత ప్రియుడు. తన భక్తులను సేవించిన వారికి అతడు ప్రసన్నుడగును. తన భక్తులకు ప్రతికూలురైన వారిని శత్రువులుగా భావించును. ప్రభువు సమదృష్టి గలవాడు. ఆయనలో రాగద్వేషములుండవు. ఇతరుల పాపపుణ్యములను గాని, గుణదోషములను గాని, ఆయన గ్రహింపడు. విశ్వమునందు జీవుల సుఖదుఃఖములకు కర్మయే ప్రధానకారణము. ఎవరెట్టి కర్మలను ఆచరింతురో వారు వాటికి తగిన ఫలితములను అనుభవించెదరు. ఐనను భక్తులయెడ సమవ్యవహారమును, భక్తులను బాధించువారియెడ విషమవ్యవహారమును జరుపును. (అతడు భక్తులను ప్రేమతో అక్కున చేర్చుకొనును. తన భక్తులను బాధించు వారిని సంహరించి, మోక్షము ప్రసాదించును.) శ్రీరాముడు త్రిగుణాతీతుడు, నిస్సంగుడు, నిరహంకారి, శాశ్వతుడు. ఐనను భక్తుల ప్రేమకు వశుడై సగుణుడుగాగూడ ఒప్పుచుండును. శ్రీరాముడు ఎల్లప్పుడును తన భక్తుల కోరికలను తీర్చుచుండును. వేద పురాణములు, సాధువులు, దేవతలు దీనికి సాక్ష్యముగా నిలుతురు. దీనిని మనస్సులో గ్రహించి, నీ కుటిలత్వమును మానుము. భరతుని చరణములను బాగుగా ప్రేమించుము. (చౌ॥ 1-4)

దో- రామ భగత పరహిత నిరత, పర దుఖ దుఖీ దయాల ।
భగత సిరోమని భరత తేఁ, జని డరపహు సురపాల ॥ 219 ॥

ఇంద్రా! రామభక్తులు నిరంతరము ఇతరులహితమునందే నిరతులైయుందురు. ఇతరులు దుఃఖితులైనప్పుడు వారును దుఃఖితులగుదురు. దయచూపుదురు. భరతుడు భక్త శిరోమణి. కావున అతనిని గూర్చి నీవు భయపడవలదు. (దో॥ 219)

చౌ- సత్యసంధ ప్రభు సుర హితకారీ । భరత రామ ఆయస అనుసారీ ॥
స్వారథ బిబస బికల తుమ్హ హోహూ । భరత దోసు నహిం రాఉర మోహూ ॥ 1 ॥
సుని సురబర సురగుర బర బానీ । భా ప్రమోదు మన మిటీ గలానీ ॥
బరషి ప్రసూన హరషి సురరాఊ । లగే సరాహన భరత సుభాఊ ॥ 2 ॥
ఎహి బిధి భరత చలే మగ జాహీం । దసా దేఖి ముని సిద్ధ సిహాహీం ॥
జబహిం రాము కహి లేహిం ఉసాసా । ఉమగత పేము మనహుం చహు పాసా ॥ 3 ॥
ద్రవహిం బచన సుని కులిస పషానా । పురజన పేము న జాఇ బఖానా ॥
బీచ బాస కరి జమునహిం ఆఏ । నిరఖి నీరు లోచన జల ఛాఏ ॥ 4 ॥

ప్రభువు సత్యప్రతిజ్ఞుడు. దేవతలకు హితమునుగూర్చువాడు. భరతుడు శ్రీ రామచంద్రుని ఆజ్ఞనే అనుసరించి, నడచువాడు. నీవు నీ స్వార్థమున మునిగి అనవసరముగా కలవరపడుచున్నావు. ఇందు భరతునిదోషమేమియు లేదు. ఇది నీ అజ్ఞానము మాత్రమే.'' దేవ గురువైన బృహస్పతి పలికిన హితవచనములను విని, ఇంద్రుని మనస్సు ప్రశాంతత నొందెను. అతని చింత దూరమాయెను. అతడు ప్రసన్న చిత్తుడై, భరతుని స్వభావమును ప్రశంసించుచు పుష్ప వృష్టిని గురిపించెను. భరతుడు దారివెంట భక్తి ప్రపత్తులతో వెళ్లుచుండగా మునులు, సిద్ధులు ఆయనను కొనియాడుచుండిరి. ఆయన నిట్టూర్పులలో గూడ రామ! రామ! అని వినిపించు చుండగా నాలుగుదెసల ప్రేమ పొంగిపొరలుచుండెను. అతని మాటలకు రాళ్ళు, వజ్రములు గూడ కరిగిపోవుచుండెను. అయోధ్యావాసులకు సీతారాములపై గల ప్రేమ వర్ణింపనలవి కానిది. దారిలో అచ్చటచ్చట బస చేయుచు భరతుడు యమునాతీరమునకు జేరెను. యమునా నదీ జలములను దర్శింపగనే ఆయన కన్నులు చెమర్చెను. (చౌ॥ 1-4)

దో- రఘుబర బరన బిలోకి బర, బారి సమేత సమాజ ।
హోత మగన బారిధి బిరహ, చఢే బిబేక జహాజ ॥ 220 ॥

శ్రీరామవిరహసముద్రములో మునిగిన భరతుడు, అతని పరివారము శ్యామవర్ణ శోభితములైన యమునానదీ జలములను జూచి, ప్రేమ విహ్వలురైరి. పిమ్మట వారు వివేకమనెడి ఓడనెక్కి, శ్రీరామదర్శనమునకై ఉత్సాహితులైరి. (దో॥ 220)

చౌ- జమున తీర తెహి దిన కరి బాసూ । భయఉ సమయ సమ సబహి సుపాసూ ॥
రాతిహిం ఘాట ఘాట కీ తరనీ । ఆఈం అగనిత జాహిం న బరనీ ॥ 1 ॥
ప్రాత పార భఏ ఏకహి ఖేవాం । తోషే రామసఖా కీ సేవాం ॥
చలే నహాఇ నదిహి సిర నాఈ । సాథ నిషాదనాథ దోఉ భాఈ ॥ 2 ॥
ఆగేం మునిబర బాహన ఆఛేం । రాజసమాజ జాఇ సబు పాఛేం ॥
తెహి పాఛేం దోఉ బంధు పయాదేం । భూషన బసన బేష సుఠి సాదేం ॥ 3 ॥
సేవక సుహ్లద సచివసుత సాథా । సుమిరత లఖను సీయ రఘునాథా ॥
జహం జహం రామ బాస బిశ్రామా । తహం తహం కరహిం సప్రేమ ప్రనామా ॥ 4 ॥

ఆ దినమున వారు యమునా తీరమున బసచేసిరి. సమయాను కూలముగా వారికి భోజన, వసతి సౌకర్యములు ఏర్పఱచబడెను. నిషాదరాజుఆజ్ఞచే రాత్రికి రాత్రే అన్ని ఘట్టముల యందును అసంఖ్యాకములైన ఓడలు వచ్చి చేరెను. వాటి శోభలు కన్నులకు మిఱుమిట్లు గొలుపు చుండెను. ఉదయమున ఒకే సారి అందఱును నదిని దాటిరి. రామ సఖుడైన గుహుని సేవలకు ఎల్లరును సంతసించిరి. యమునానదిలో స్నానములనాచరించి, ప్రణమిల్లి నిషాద రాజుతో పాటు సోదరులిద్దఱును బయలుదేఱిరి. ముందుగా అందమైన వాహనములలో వసిష్ఠుడు మున్నగు మునీశ్వరులుండిరి, వారి వెంట రాజ పరివారము ఉండెను, వారి వెంట సోదరులిద్దఱును అతిసామాన్యములైన దుస్తులు ధరించి, నడచుచు పోవుచుండిరి. వారి ననుసరించి, సేవకులు, మిత్రులు, మంత్రికుమారులు శ్రీ సీతారామలక్ష్మణులను స్మరించుచు నడుచుచుండిరి.[1] శ్రీరాముడు విశ్రమించిన ప్రదేశములకు భక్తితో ప్రణమిల్లు చుండిరి. (చౌ॥ 1-4)

దో- మగబాసీ నర నారి సుని, ధామ కామ తజి ధాఇ ।
దేఖి సరూప సనేహ సబ, ముదిత జనమ ఫలు పాఇ ॥ 221 ॥

మార్గముల ప్రక్కన గల గ్రామవాసులు వారి రాకను విని, వెంటనే తమ పనులనన్నింటిని మానుకొని వచ్చి, వారి (భరతాదుల) స్వరూపములను, ప్రేమను చూచి, తమ జన్మలు సఫలములైనవని భావించుచుండిరి. (దో॥ 221)

చౌ- కహహిఀ సపేమ ఏక ఏక పాహీఀ । రాము లఖను సఖి హోహిఀ కి నాహీఀ ॥
బయ బపు బరన రూపు సోఇ ఆలీ । సీలు సనేహు సరిస సమ చాలీ ॥ 1 ॥
బేషు న సో సఖి సీయ న సంగా । ఆగేఀ అనీ చలీ చతురంగా ॥
నహిఀ ప్రసన్న ముఖ మానస ఖేదా । సఖి సందేహు హోఇ ఏహిఀ భేదా ॥ 2 ॥
తాసు తరక తియగన మన మానీ । కహహిఀ సకల తేహి సమ న సయానీ ॥
తేహి సరాహి బానీ ఫురి పూజీ । బోలీ మధుర బచన తియ దూజీ ॥ 3 ॥
కహి సపేమ సబ కథాప్రసంగూ । జేహి బిధి రామరాజ రస భంగూ ॥
భరతహి బహురి సరాహన లాగీ । సీల సనేహ సుభాయ సుభాగీ ॥ 4 ॥

1) శ్రీరఘురామ! చారుతులసీదళదామ! శమక్షమాది శృం
గారగుణాభిరామ! త్రిజగన్నుతశౌర్య రమాలలామ! దు
ర్వారకబంధ రాక్షసవిరామ! జగజ్జన కల్మషార్ణవో
త్తారకనామ! భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ! (1)
రాముడు, ఘోర పాతక విరాముడు, సద్గుణకల్పవల్లికా
రాముడు, షడ్వికార జయరాముడు, సాధుజనావనవ్రతో
ద్దాముడు, రాముడే పరమ దైవము మాకని నీయడుంగు కెం
దామరలే భజించెదను దాశరథీ! కరుణాపయోనిధీ! (2)

భరత శత్రుఘ్నులనుజూచి స్త్రీలు ప్రేమపూర్వకముగా తమలోతాము ఇట్లనుకొనుచుండిరి. "చెలీ! వీరు రామలక్ష్మణులా? కాదు. కాని వీరి వయస్సులు శరీర వర్ణములు, రూపములు ఆ విధముగనే యున్నవి. వీరి శీల స్నేహములు గూడ అట్లే యున్నవి. వీరి నడకలుగూడ ఆ తీరుననే యున్నవి. కాని వీరి వేషములట్లు లేవు. వీరు మునుల వలె వల్కలధారులై లేరు. సీతాదేవియు తోడుగా లేదు. "వీరి ముందు చతురంగబలములు నడచుచున్నవి. వీరి ముఖములు ప్రసన్నములుగా లేవు. మనస్సులలో విచారమున్నది. ఈ వ్యత్యాసములవలన సందేహములు కలుగుచున్నవి." వీరి సహేతుకములైన సంభాషణలు తదితర స్త్రీలకును నిజమనిపించెను. వారు ఒక వనితతో ఇట్లనిరి, "నీ వంటి బుద్ధిమంతురాలు ఎవ్వరును లేరు." ఆమెను పొగడుచు, 'నీ మాటలు నిజము' అని పల్కుచు ఆమెతో మధురవచనములను నుడివిరి. శ్రీరాముని రాజ్యపట్టాభిషేకము భంగమైన రీతిని, దానికి సంబంధించిన పూర్తివృత్తాంతమును వారు సంభాషించు కొనుచు, భరతుని స్నేహశీలములను, సౌభాగ్యమును ప్రశంసించిరి.

(చౌ॥ 1-4)

**దో- చలత పయాదేఁ ఖాత ఫల, పితా దీన్హ తజి రాజు ।**
**జాత మనావన రఘుబరహి, భరత సరిస కో ఆజు ॥ 222 ॥**

చూడుము. తండ్రిగారు ఇచ్చిన రాజ్యమునుగూడ వదలిపెట్టి వీరు కందమూలములను భుజించుచు కాలినడకన వచ్చుచున్నారు. 'మరల అయోధ్యకు రమ్ము' అని శ్రీరాముని వేడుకొనుటకు భరతుడు ఏతెంచుచున్నాడు. ఇట్టి భరతునకు సాటిరాగలవారెవ్వరు? (దో॥ 222)

చౌ- భాయప భగతి భరత ఆచరనూ । కహత సునత దుఖ దూషన హరనూ ॥
జో కిఛు కహబ థోర సఖి సోఈ । రామ బంధు అస కాహే న హోఈ ॥ 1 ॥
హమ సబ సానుజ భరతహి దేఖేఁ । భఇన్హ ధన్య జుబతీ జన లేఖేఁ ॥
సుని గున దేఖి దసా పఛితాహీఁ । కైకఇ జనని జోగు సుతు నాహీఁ ॥ 2 ॥
కోఉ కహ దూషను రానిహి నాహిన । బిధి సబు కీన్హ హమహి జో దాహిన ॥
కహఁ హమ లోక బేద బిధి హీనీ । లఘు తియ కుల కరతూతి మలీనీ ॥ 3 ॥
బసహిఁ కుదేస కుగాఁవ కుబామా । కహఁ యహ దరసు పున్య పరినామా ॥
అస అనందు అచిరిజు ప్రతి గ్రామా । జను మరుభూమి కలపతరు జామా ॥ 4 ॥

భరతునిభ్రాతృభావము, అతని భక్తిఆచరణలను కీర్తించుటవలన, వినుటవలన దుఃఖములు, దోషములు అంతరించును. చెల్లీ! ఈ విషయమున ఎంత చెప్పినను తక్కువయే. అతడు శ్రీరామచంద్రుని సోదరుడుగదా! ఇట్టి మహాత్మ్యసంపన్నుడగుటలో ఆశ్చర్యమేమున్నది? తమ్మునితోగూడియున్న భరతునిజూచి మనమందఱము ధన్యాత్ములమైతిమి. భరతుని సద్గుణములను విని, అతని ప్రస్తుత స్థితిని జూచి, స్త్రీలు విచారపడుచు 'కైకేయి వంటి కుటిల మహిళ కడుపున పుట్టవలసినవాడు కాడితడు" అని యనుచుండిరి, మఱొక వనిత "ఇందులో రాణి దోషము లేదు. ఇది విధాతకల్పితము. ఒక విధముగా ఇట్లు జరుగుట మనఅదృష్టము. లేనిచో లోకమునకును, వేద విధులకును కులగౌరవములకును నిమ్నస్థితిలోనుండి, కుగ్రామములలో నివసించుచున్న మనకు ఈ మహాపుణ్యపురుషుల

దర్శనము ఎట్లు లభించును?" అని పలికెను. పల్లె సీమలకు వారి ఆగమనము మఱుభూములలో కల్పవృక్షము వెలసినట్లుండెను. ఇందువలన ప్రతిపల్లెయందును ఆశ్చర్యానందములు వెల్లి విరియుచుండెను. (చౌ॥ 1-4)

దో- భరత దరసు దేఖత ఖులెఉ, మగ లోగన్హ కర భాగు।
జను సింఘలబాసిన్హ భయఉ, బిధి బస సులభ ప్రయాగు ॥ 223 ॥

సింహళద్వీపవాసులకు దైవయోగముచే తీర్థరాజమైన ప్రయాగయే నడచివచ్చి దర్శనమిచ్చినట్లు దారిప్రక్కనగల పల్లెప్రజలకు పుణ్యపురుషుడైన భరతుడు స్వయముగా దర్శనమిచ్చుటచే వారు తమ భాగ్యములు పండినట్లు మురిసిపోయిరి. (దో॥ 223)

చౌ- నిజ గున సహిత రామ గున గాథా । సునత జాహిఁ సుమిరత రఘునాథా ॥
తీరథ ముని ఆశ్రమ సురధామా । నిరఖి నిమజ్జహిఁ కరహిఁ ప్రనామా ॥ 1 ॥
మనహీఁ మన మాఁగహిఁ బరు ఏహూ । సీయ రామ పద పదుమ సనేహూ ॥
మిలహిఁ కిరాత కోల బనబాసీ । బైఖానస బటు జతీ ఉదాసీ ॥ 2 ॥
కరి ప్రనాము పూఁఛహిఁ జెహి తేహీ । కెహి బన లఖను రాము బైదేహీ ॥
తే ప్రభు సమాచార సబ కహహీఁ । భరతహి దేఖి జనమ ఫలు లహహీఁ ॥ 3 ॥
జే జన కహహిఁ కుసల హమ దేఖే । తే ప్రియ రామ లఖన సమ లేఖే ॥
ఏహి బిధి బూఝత సబహి సుబానీ । సునత రామ బనబాస కహానీ ॥ 4 ॥

తన గుణములతోపాటు శ్రీరామచంద్రునిగుణప్రశంసలను వినుచు శ్రీరఘునాథుని స్మరించుచు భరతుడు ముందునకు సాగిపోవుచుండెను. అతడు తీర్థములలో స్నానములాడుచు, ఋష్యాశ్రమములను, దైవమందిరములను దర్శించుచు వినమ్రుడై ప్రణమిల్లుచుండెను. శ్రీరామచంద్రుని చరణకమలములపై నిరంతరము తనభక్తి చెక్కుచెదరకుండునట్లు వరమును ప్రసాదింపుమని భరతుడు ప్రార్థించు చుండెను. దారిలో ఆయనను కోలులు, కిరాతులు మున్నగు వనవాసులును, వానప్రస్థులును సన్న్యాసులును, బ్రహ్మచారులును, విరాగులును కలిసికొనుచుండిరి. వారికి ప్రణమిల్లి, శ్రీ సీతారామలక్ష్మణులు ఏవనములో ఉన్నారు? అని అడుగుచుండెను. వారు ప్రభువుల సమాచారములను తెలుపుచుండిరి. భరతుని దర్శనముచే జన్మసాఫల్యములను పొందుచుండిరి. 'సీతారామలక్ష్మణులను క్షేమముగా దర్శించినాము' అని తెలిపిన వారిని భరతుడు రామలక్ష్మణులతో సమానులుగా భావించు చుండెను. ఈ విధముగా శ్రీరాముని వనవాస విశేషములను గూర్చి వినుచు భరతాదులు ముందునకు సాగుచుండిరి. (చౌ॥ 1-4)

దో- తెహి బాసర బసి ప్రాతహీఁ, చలే సుమిరి రఘునాథ।
రామ దరస కీ లాలసా, భరత సరిస సబ సాథ ॥ 224 ॥

ఆనాడు అక్కడ ఆగి, మఱునాటి ఉదయముననే రాముని స్మరించుచు వారు బయలుదేఱిరి. భరతునివెంటనున్న వారందఱును అతనివలెనే శ్రీరామ దర్శనోత్సుకులై యుండిరి. (దో॥ 224)

చౌ- మంగల సగున హోహిఀ సబ కాహూ । ఫరకహిఀ సుఖద బిలోచన బాహూ ॥
భరతహి సహిత సమాజ ఉఛాహూ । మిలిహహిఀ రాము మిటిహి దుఖ దాహూ ॥ 1 ॥
కరత మనోరథ జస జియఀ జాకే । జాహిఀ సనేహ సురాఀ సబ ఛాకే ॥
సిథిల అంగ పగ మగ డగి డోలహిఀ । బిహబల బచన పేమ బస బోలహిఀ ॥ 2 ॥
రామసఖాఀ తేహి సమయ దేఖావా । సైల సిరోమని సహజ సుహావా ॥
జాసు సమీప సరిత పయ తీరా । సీయ సమేత బసహిఀ దోఉ బీరా ॥ 3 ॥
దేఖి కరహిఀ సబ దండ ప్రనామా । కహి జయ జానకి జీవన రామా ॥
ప్రేమమగన అస రాజసమాజూ । జను ఫిరి అవధ చలే రఘురాజూ ॥ 4 ॥

అందఱికిని శుభ శకునములు కనబడెను. పురుషులకు, స్త్రీలకు క్రమముగా కుడి, ఎడమ నేత్రములు, భుజములు అదరినవి. భరతుడు, అతనిపరివారము 'శ్రీరాముని దర్శనము అగును. మన దుఃఖదాహము తీరును' అని భావించిరి. హృదయములోని భావములకు అనుగుణముగనే కోరికలు కలుగు చుండును. అందఱును స్నేహ మదిరామత్తులైయుండిరి. వారి తనువులు ప్రేమ విహ్వలములై యుండెను. కాళ్ళు తడబడుచుండెను. మాటలు అస్పష్టములై యుండెను. అదే సమయమున రామసఖుడైన నిషాదరాజు సహజసుందరమై, పర్వత శిరోమణియైన 'కామదగిరి'ని వారికి చూపించెను. 'దానికి సమీపముననే పయస్వినీ నదీతీరమున సీతాలక్ష్మణులతో గూడి శ్రీరాముడు నివసించుచున్నాడు' అని తెలిపెను. ఆ పర్వతమును చూడగానే అందఱును జానకీజీవనశ్రీరామప్రభువునకు జయము' అనుచు సాష్టాంగదండ ప్రణామములను ఆచరించిరి. అప్పుడు వారు 'శ్రీ రఘునాథుడు అయోధ్యకు తిరిగి వచ్చినంతగా' ఆనందించిరి. (చౌ॥ 1-4)

దో- భరత ప్రేము తేహి సమయ జస, తస కహి సకఇ న సేషు ।
కబిహి అగమ జిమి బ్రహ్మసుఖు, అహ మమ మలిన జనేషు ॥ 225 ॥

ఆ సమయమున భరతుడు పొందిన భక్తిపారవశ్యములను ఆ ఆదిశేషుడుగూడ వర్ణింప జాలడు. అహంకార మమకారములతో మలిన హృదయులైన వారికి బ్రహ్మానందముఅగమ్యమైనట్లు కవులకు భరతుని ప్రేమ పారవశ్యస్థితిని వర్ణించుట అసాధ్యము. (దో॥ 225)

చౌ- సకల సనేహ సిథిల రఘుబర కేఀ । గఏ కోస దుఇ దినకర ఢరకేఀ ॥
జలు థలు దేఖి బసే నిసి బీతేఀ । కీన్హ గవన రఘునాథ పిరీతేఀ ॥ 1 ॥
ఉహాఀ రాము రజనీ అవసేషా । జాగే సీయఀ సపన అస దేఖా ॥
సహిత సమాజ భరత జను ఆఏ । నాథ బియోగ తాప తన తాఏ ॥ 2 ॥
సకల మలిన మన దీన దుఖారీ । దేఖీఀ సాసు ఆన అనుహారీ ॥
సుని సియ సపన భరే జల లోచన । భఏ సోచబస సోచబిమోచన ॥ 3 ॥
లఖన సపన యహ నీక న హోఈ । కఠిన కుచాహ సునాఇహి కోఈ ॥
అస కహి బంధు సమేత నహానే । పూజి పురారి సాధు సనమానే ॥ 4 ॥

శ్రీరామ భక్తి పారవశ్యములతో విహ్వలులై యున్నందున ఆ దినమంతయును అందఱును రెండుక్రోసులదూరముమాత్రమే నడువ గలిగిరి. ఇంతలో సూర్యుడు అస్తమించెను. జలస్థల వసతులను జూచి, ఆ రాత్రి అచటనే (నిరాహారముగా) బసచేసిరి. ప్రాతఃకాలమున రామభక్తుడైన భరతుడు ముందుగా ప్రయాణము సాగించెను. అక్కడ శ్రీరామచంద్రుడు వేకువ జాముననే మేల్కొనెను. సపరివారముగా భరతుడు వచ్చినట్లు కలగన్న సీతాదేవి తనస్వప్నమును శ్రీరామునకు వివరించుచుండెను. "ప్రభువు యొక్క వియోగాగ్నిలో భరతునితనువు తప్తమైనది. అతని అనుయాయులందఱును దైన్యదుఃఖములతో విచారగ్రస్తులై యుండిరి. అత్తగార్ల స్వరూపములు పూర్తిగా మాఱిపోయినవి." సీతాదేవి స్వప్న వృత్తాంతమును విని, శ్రీరాముని కన్నులలో నీరునిండెను. అందఱిని శోకమునుండి విముక్తులను జేయు ప్రభువే శోకమగ్నుడాయెను. శ్రీరాముడు "ఈ స్వప్నము మంచిది గాదు. ఏదో అశుభవార్తను వినబోవుచున్నాము" అని పలికి, తమ్మునితోపాటు స్నానమాచరించి, మహాదేవుని పూజించి, సాధువులను సమ్మానించెను. (చౌ॥ 1-4)

ఛం- సనమాని సుర ముని బంది బైఠే ఉతర దిసి దేఖత భఏ।
నభ ధూరి ఖగ మృగ భూరి భాగే బికల ప్రభు ఆశ్రమ గఏ॥
తులసీ ఉఠే అవలోకి కారను కాహ చిత సచకిత రహే।
సబ సమాచార కిరాత కోలన్హి ఆఇ తేహి అవసర కహే॥

దేవతలను పూజించి, మునులకు వందనములొనర్చి, శ్రీరామచంద్రుడు ఆసీనుడై ఉత్తర దిశకు చూడసాగెను. ఆకాశము ధూళి దూసరితమై యుండెను పశుపక్ష్యాదులు వ్యాకులపాటుతో పరుగెత్తుకొని ఆశ్రమమువైపునకు వచ్చుట చూచెను. శ్రీరాముడు లేచి నిలబడి 'దీనికి కారణము ఏమైయుండును?' అని ఆలోచింపసాగెను. మనస్సు ఆశ్చర్యచకితమగుచుండగా, కోలులు, కిరాతులు భరతుని ఆగమన సమాచారమును పూర్తిగా దెలిపిరి- అని తులసీదాసు పలుకుచున్నాడు. (ఛం)

## భరతుడు చిత్రకూటమును చేరుట

సో- సునత సుమంగల బైన, మన ప్రమోద తన పులక భర।
సరద సరోరుహ నైన, తులసీ భరే సనేహ జల॥ 226 ॥

ఆహ్లాదకరములైన మంగళవచనములను వినగానే శ్రీరాముని మనస్సు సంతసించెను, తనువు పులకరించెను. ఆయన యొక్క కమలములవంటి కన్నులలో నీరునిండెను- అని తులసీదాసు నుడువుచున్నాడు. (సో॥ 226)

చౌ- బహురి సోచబస భే సియరవనూ। కారన కవన భరత ఆగవనూ॥
ఏక ఆఇ అస కహా బహోరీ। సేన సంగ చతురంగ న థోరీ॥ 1 ॥
సో సుని రామహి భా అతి సోచూ। ఇత పితు బచ ఇత బంధు సకోచూ॥
భరత సుభాఉ సముఝి మన మాహీం। ప్రభు చిత హిత థితి పావత నాహీం॥ 2 ॥

సమాధాన తబ భా యహ జానే । భరతు కహే మహుఁ సాధు సయానే ॥
లఖన లఖెఉ ప్రభు హృదయఁ ఖభారూ । కహత సమయ సమ నీతి బిచారూ ॥ 3 ॥
బిను పూఛేఁ కఛు కహఉఁ గోసాఈఁ । సేవకు సమయఁ న ఢీఠ ఢిఠాఈఁ ॥
తుమ్హ సర్బగ్య సిరోమని స్వామీ । ఆపని సముఝి కహఉఁ అనుగామీ ॥ 4 ॥

"భరతునిరాకకు కారణమేమి?" శ్రీరాముడు ఆలోచనలో మునిగెను. మఱియొకరువచ్చి, "ఆయనవెంట చతురంగబలములు గూడ ఉన్నవి" అని తెలిపిరి. ఇది వినగానే శ్రీరాముడు మిక్కిలి విచారపడెను. ఒకవైపు తండ్రియాజ్ఞ. మఱియొకవైపు సోదరునియెడ ప్రేమ. భరతుని స్వభావమును బాగుగాఎఱిగిన శ్రీరామచంద్రునిమనస్సునకు నిలకడ చిక్కలేదు. (భరతుని స్వభావమును, అతనికి తనపైగల భక్తి విశ్వాసములను పూర్తిగా తెలిసినవాడు గావున ఒక వేళ భరతుడు తండ్రిగారి ఆజ్ఞను త్రోసి రాజని రాజ్యమును చేపట్టక పోయినచో ఏమి చేయవలెను? అని ప్రభువు ఆలోచింపసాగెను) 'భరతుడు సాధుస్వభావుడు, బుద్ధిమంతుడు, నామాట మీఱడు' అని ఆలోచించి, మనస్సును కుదుటబఱచుకొనెను. అప్పుడు లక్ష్మణుడు ప్రభుహృదయము క్షోభపడుచుండుట చూచి, సమయానుకూలముగా, నీతియుక్తముగా ఇట్లు పలికెను. "స్వామీ! మీరు అడుగకయున్నను నేనొక విషయమును చెప్పెదను. సేవకుడు సాహసించి పలికినచో హద్దుమీఱినట్లు అగునేమో? ఐనను సందర్భమును అనుసరించి దృఢముగా నుడువుచున్నాను. నాచొరవను మన్నింపగలరు. ప్రభూ! మీరు సర్వజ్ఞులు. ఐనను నేను నా మనసులోని మాటను తెల్పుచున్నాను. (చౌ॥ 1-4)

దో- నాథ సుహృద సుఠి సరల చిత, సీల సనేహ నిధాన ।
సబ పర ప్రీతి ప్రతీతి జియఁ, జానిఅ ఆపు సమాన ॥ 227 ॥

ప్రభూ! మీరు అవ్యాజకరుణామయులు. సరళస్వభావులు. స్నేహసౌశీల్యసముద్రులు. మీరు అందఱిని సమానముగా ప్రేమించెదరు, విశ్వసించెదరు, అందఱును మీ వలెనే యుందురని భావించెదరు. (దో॥ 227)

చౌ- బిషఈ జీవ పాఇ ప్రభుతాఈ । మూఢ మోహ బస హోహిఁ జనాఈ ॥
భరతు నీతి రత సాధు సుజానా । ప్రభు పద ప్రేము సకల జగు జానా ॥ 1 ॥
తేఊ ఆజు రామ పదు పాఈ । చలే ధరమ మరజాద మెటాఈ ॥
కుటిల కుబంధు కుఅవసరు తాకీ । జాని రామ బనబాస ఏకాకీ ॥ 2 ॥
కరి కుమంత్రు మన సాజి సమాజూ । ఆఏ కరై అకంటక రాజూ ॥
కోటి ప్రకార కలపి కుటిలాఈ । ఆఏ దల బటోరి దోఉ భాఈ ॥ 3 ॥
జౌఁ జియఁ హోతి న కపట కుచాలీ । కేహి సోహాతి రథ బాజి గజాలీ ॥
భరతహి దోసు దేఇ కో జాఏఁ । జగ బౌరాఇ రాజపదు పాఏఁ ॥ 4 ॥

కాని మూఢులు, విషయలోలురైనవారు రాజ్యాధికారమును పొందినచో వారు మోహపరవశులగుదురు. అప్పుడు వారినిజస్వరూపములు బయటపడుచుండును. భరతుడు నీతి పరాయణుడు, సాధువు, సమర్థుడు, మీపై

అమితప్రేమగలవాడు. ఇది లోకవిదితము. కాని నేడు ఆ భరతుడే మీ రాజ్యాధికారమును పొంది, ధర్మ మార్గమును వీడి, వచ్చుచున్నాడు. కుటిలుడైన భరతుడు ఈ సమయమును ఎన్నుకొనినాడు. మీరు వనవాసములో ఒంటరిగా ఉన్నారు. అతడు దుర్బుద్ధితో తనసైన్యమును వెంటబెట్టుకొని రాజ్యమును నిష్కంటక మొనర్చుకొనుటకై వచ్చుచున్నాడు. ఈ సోదరులు పెక్కు కుటిలోపాయములను పన్ని, సేనలను సమీకరించుకొని వచ్చుచున్నారు. వారిలో ఎట్టి దురుద్దేశ్యములు లేనిచో రథములను, ఏనుగులను, గుఱ్ఱములను కాల్బలములను వెంటదీసికొని రావలసిన పనియేమి? భరతుని నిందించి లాభమేమి? జగత్తులో రాజ్యాధికారము ఎట్టివారినైనను మదోన్మత్తులనుగా జేయును. (చౌ॥ 1-4)

దో- ససి గురతియగామీ నఘుషు, చఢేఉ భూమిసుర జాన ।
లోక బేద తేఁ బిముఖ భా, అధమ న బేన సమాన ॥ 228 ॥

చంద్రుడు గురుపత్నిగామియయ్యెను. నహుషుడు మహర్షులచే బ్రహ్మరథమును మోయించుకొనెను. లోకమునకును వేదములకును విరుద్ధముగా ప్రవర్తించిన వేనరాజువంటి అధముడు లోకములో ఎవ్వడును ఉండడు. (దో॥ 228)

చౌ- సహసబాహు సురనాథు త్రిసంకూ । కెహి న రాజమద దీన్హ కలంకూ ॥
భరత కీన్హ యహ ఉచిత ఉపాఊ । రిపు రిన రంచ న రాఖబ కాఊ ॥ 1 ॥
ఏక కీన్హి నహిఁ భరత భలాఈ । నిదరే రాము జాని అసహాఈ ॥
సముఝి పరిహి సోఉ ఆజు బిసేషీ । సమర సరోష రామ ముఖు పేఖీ ॥ 2 ॥
ఎతనా కహత నీతి రస భూలా । రన రస బిటపు పులక మిస ఫూలా ॥
ప్రభు పద బంది సీస రజ రాఖీ । బోలే సత్య సహజ బలు భాషీ ॥ 3 ॥
అనుచిత నాథ న మానబ మోరా । భరత హమహి ఉపచార న థోరా ॥
కహఁ లగి సహిఅ రహిఅ మను మారేఁ । నాథ సాథ ధను హాథ హమారేఁ ॥ 4 ॥

సహస్రబాహువు, ఇంద్రుడు, త్రిశంకుడు మొదలగు వారినందఱిని రాజ్యాధికారమదము కళంకితులనుగా జేసెను. శత్రుశేషమును, ఋణశేషమును ఏమాత్రమూ మిగులనీయరాదని భరతుడీయుపాయమును పన్నియుండవచ్చును. కాని మీకు సహాయపడువారు ఎవ్వరును లేరని తలచియే కాబోలు నిరాదరముతో ఈ పనికి పూనుకొనుట భరతునివంటివానికి ఎంతమాత్రమూ తగదు. నేడు సమరములో మీరోషపరాక్రమములను రుచిచూచి అతడు తన తప్పును తెలిసికొనగలడు." -ఈ విధముగా పలికి, లక్ష్మణుడు ఔచిత్యమును మఱచెను. అతనివీరరసవృక్షము వెంటనే పుష్పించెను. ప్రభుచరణములకు ప్రణమిల్లి, ఆయన పాదధూళిని శిరమున దాల్చి, అతడు తన సహజమైన ఆవేశముతో పలికెను. "స్వామీ! నేను చెప్పెడి విషయమును అనుచితమని భావింపవలదు. భరతునివలన మనకు తక్కువ హాని జరుగలేదు. ఈ దుష్కృత్యములను మనమెంతవఱకు సహింప గలము? ప్రభువు నా సమీపముననే ఉన్నప్పుడు, ధనుస్సు చేతిలో ఉన్నప్పుడు నా మనస్సు ఎట్లు ఓర్చుకొనును? (చౌ॥ 1-4)

దో- ఛత్రి జాతి రఘుకుల జనము, రామ అనుగ జగు జాన ।
లాతహుఀ మారేఀ చఢతి సిర, నీచ కో ధూరి సమాన ॥ 229 ॥

నేను క్షత్రియుడను, రఘువంశమున జన్మించినవాడను. శ్రీరాముని అనుసరించు సేవకుడను. ఇది లోకవిదితము. ధూళికంటెను నీచమైనదేది? కాని అదికూడ కాలితో తన్నినచో పైకిలేచి శిరముపై వ్రాలును.
(దో॥ 229)

చౌ- ఉఠి కర జోరి రజాయసు మాగా । మనహుఀ బీర రస సోవత జాగా ॥
బాఀధి జటా సిర కసి కటి భాథా । సాజి సరాసను సాయకు హాథా ॥ 1 ॥
ఆజు రామ సేవక జసు లేఊఀ । భరతహి సమర సిఖావన దేఊఀ ॥
రామ నిరాదర కర ఫలు పాఈ । సోవహుఀ సమర సేజ దోఉ భాఈ ॥ 2 ॥
ఆఇ బనా భల సకల సమాజూ । ప్రగట కరఉఀ రిస పాఛిల ఆజూ ॥
జిమి కరి నికర దలఇ మృగరాజూ । లేఇ లపేటి లవా జిమి బాజూ ॥ 3 ॥
తైసేహిఀ భరతహి సేన సమేతా । సానుజ నిదరి నిపాతఉఀ ఖేతా ॥
జౌఀ సహాయ కర సంకరు ఆఈ । తౌ మారఉఀ రన రామ దోహాఈ ॥ 4 ॥

ఈ విధముగా పలికి, లక్ష్మణుడు నిలబడి అంజలిఘటించి, భరతుని ఎదుర్కొనుటకై ఆజ్ఞను ఇమ్మని ప్రార్థించెను. నిద్రించిన వీరరసము మేల్కొనినదా? అన్నట్లు అతడుండెను. శిరస్సున జడలను కొప్పుగా జేసికొని, నడుమునకు తూణీరమును కట్టుకొని, చేతులలో ధనుర్బాణములను ధరించి, ఇట్లనెను. "నేడు నేను శ్రీరామునిసేవకుడను - అను కీర్తిని పొందెదను. భరతునకు గుణపాఠమును నేర్పెదను. శ్రీరాముని అవమానించిన నేరమునకు భరత శత్రుఘ్నులు ఇద్దఱును రణరంగమున భూశయ్యపై పరుండెదరు. పరివారములన్నియు ఒకేసారి వచ్చుట మంచిదే ఐనది. నాలోదాగియున్న క్రోధమును నేడు ప్రకటించెదను. సింహము గజయూధములను చీల్చి చెండాడినట్లు, డేగ తన గోళ్లతో పిట్టలను పట్టినట్లు, భరతుని ఆయన సేనలతో సహా, సోదరునితో గూడ యుద్ధభూమిలో పరాజితులను గావించెదను. శ్రీరామునిపై ప్రమాణముచేసి చెప్పుచున్నాను. శంకరుడే అతనికి సహాయపడినను రణభూమిలో భరతుని మట్టి కఱిపించెదను.
(చౌ॥ 1-4)

దో- అతి సరోష మాఖే లఖను, లఖి సుని సపథ ప్రవాన ।
సభయ లోక సబ లోకపతి, చాహత భభరి భగాన ॥ 230 ॥

లక్ష్మణుడు క్రోధాగ్నితో మండి పడుటను జూచి, అతడు చేసిన ప్రతిజ్ఞను విని లోకములు కంపించెను. లోకపాలకులు తమలోకములను వీడి భయముతో పాఱిపోవుచుండిరి.
(దో॥ 230)

చౌ- జగు భయ మగన గగన భఇ బానీ । లఖన బాహుబలు బిపుల బఖానీ ॥
తాత ప్రతాప ప్రభాఉ తుమ్హారా । కో కహి సకఇ కో జాననిహారా ॥ 1 ॥

అనుచిత ఉచిత కాజు కిఛు హోఈ । సముఝి కరిఅ భల కహ సబు కోఈ ॥
సహసా కరి పాఛేఁ పఛితాహీఁ । కహహిఁ బేద బుధ తే బుధ నాహీఁ ॥ 2 ॥
సుని సుర బచన లఖన సకుచానే । రామ సీయఁ సాదర సనమానే ॥
కహీ తాత తుమ్హ నీతి సుహాఈ । సబ తేఁ కఠిన రాజమదు భాఈ ॥ 3 ॥
జో అచవఁత నృప మాతహిఁ తేఈ । నాహిన సాధుసభా జెహిఁ సేఈ ॥
సునహు లఖన భల భరత సరీసా । బిధి ప్రపంచ మహఁ సునా న దీసా ॥ 4 ॥

జగత్తంతయు భయముతో గడగడవణకెను. అప్పుడు లక్ష్మణుని అపార బాహుబలమును ప్రశంసించుచు ఆకాశవాణిపలికెను. "నాయనా! నీ ప్రతాపప్రభావములను ప్రశంసించుటకు ఎవరికి సాధ్యము? నీబలసామర్థ్యములను ఎవరెఱుంగగలరు? కాని ఏకార్యమునైనను ఉచితానుచితములను బాగుగా పరిశీలించి చేయవలెను. అపుడందఱును మెచ్చుకొందురు. అనాలోచితముగా తొందరపాటుతో ఏదైననొక పనిచేసి, తరువాత పశ్చాత్తాపపడుట బుద్ధిమంతుల లక్షణముకాదని వేదములు, బుధులు నొక్కిపల్కుచున్నారు. "ఈ దివ్య వచనములను విని, లక్ష్మణుడు పునరాలోచనలో పడెను. శ్రీరాముడును సీతాదేవియు ప్రేమాదరములతో ఇట్లు పలికిరి. "నాయనా! నీవు పల్కినది లోకసహజమే. రాజ్యమదము ఎవ్వరినైనను ఉన్మత్తులనుగా జేయును. సాధుపుంగవులను సేవింపనివారు రాజ్యాధికారమదిరచే ఉన్మత్తులయ్యెదరు. కాని! లక్ష్మణా! వినుము. బ్రహ్మ సృష్టిలో ఇంతవఱకును భరతునివంటి ఉత్తముని కని,విని, ఎఱుగను. (చౌ॥ 1-4)

దో- భరతహి హోఇ న రాజమదు, బిధి హరి హర పద పాఇ ।
కబహుఁ కి కాఁజీ సీకరని, ఛీరసింధు బినసాఇ ॥ 231 ॥

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులపదవులు లభించినను భరతుడు రాజ్యమదమునకు లోనుకాడు. ఇంక అయోధ్యరాజ్యాధికారము అనగా ఎంత? అనగా పుల్లనిగంజిబొట్లు కొన్నింటిని చిలకరించినంత మాత్రమున పాల సముద్రము విఱిగి పోవునా? (దో॥ 231)

చౌ- తిమిరు తరున తరనిహి మకు గిలఈ । గగను మగన మకు మేఘహిఁ మిలఈ ॥
గోపద జల బూడహిఁ ఘటజోనీ । సహజ ఛమా బరు ఛాడై ఛోనీ ॥ 1 ॥
మసక ఫూఁక మకు మేరు ఉడాఈ । హోఇ న నృపమదు భరతహి భాఈ ॥
లఖన తుమ్హార సపథ పితు ఆనా । సుచి సుబంధు నహిఁ భరత సమానా ॥ 2 ॥
సగును ఖీరు అవగున జలు తాతా । మిలఇ రచఇ పరపంచు బిధాతా ॥
భరతు హంస రబిబంస తడాగా । జనమి కీన్హ గున దోష బిభాగా ॥ 3 ॥
గహి గున పయ తజి అవగున బారీ । నిజ జస జగత కీన్హి ఉజిఆరీ ॥
కహత భరత గున సీలు సుభాఊ । పేమ పయోధి మగన రఘురాఊ ॥ 4 ॥

మధ్యాహ్న సూర్యుని అంధకారము కబళించుగాక, అనంతాకాశము మేఘములలో పూర్తిగా విలీనమైపోవుగాక, సముద్రమును ఆపోశనము పట్టిన అగస్త్యుడు గోష్పాదమంత నీటిలో మునుగు గాక, పృథ్వి తనసహజసహనశీలమును గోల్పోవును గాక, దోమల నిట్టూర్పులకు మేరు పర్వతము ఎగిరిపోవును గాక, సోదరా! భరతునకు రాజ్యమదము ఎన్నటికిని కలుగదు. లక్ష్మణా! నీ మీద, తండ్రిగారి మీద ప్రమాణము చేసి చెప్పుచున్నాను. భరతునివంటి సర్వశ్రేష్ఠుడైన సోదరుడు ఎక్కడను దొరకడు. నాయనా! సద్గుణములుగల పాలను, దుర్గుణములుగల నీటిని గలిపి, బ్రహ్మ ఈ జగత్తును సృష్టించెను. కాని సూర్యవంశమనెడి సరస్సులో భరతుడను హంస జన్మించి, నీరక్షీరములను అనగా గుణదోషములను వేర్వేరు చేసెను. సద్గుణరూపమైన పాలను గ్రహించి, దుర్గుణరూపమైన నీటిని త్యజించి, అతడు తనయశమును ప్రపంచమున ప్రకాశింపజేసెను." భరతుని గుణశీలస్వభావములను వర్ణించుచు శ్రీరాముడు ప్రేమసాగరమున మునిగి పోయెను. (చౌ॥ 1-4)

దో- సుని రఘుబర బానీ బిబుధ, దేఖి భరత పర హేతు।
సకల సరాహత రామ సో, ప్రభు కో కృపానికేతు ॥ 232 ॥

శ్రీరామచంద్రుని పలుకులను విని, భరతునిపై ఆయనకు గల ప్రేమను జూచి, దేవతలు ఆయనను శ్లాఘించిరి. శ్రీరామునివంటి దయామయుడైన ప్రభువు ఎవరు? అని పొగడిరి. (దో॥ 232)

చౌ- జౌం న హోత జగ జనమ భరత కో। సకల ధరమ ధుర ధరని ధరత కో ॥
కబి కుల అగమ భరత గున గాథా। కో జానఇ తుమ్హ బిను రఘునాథా ॥ 1 ॥
లఖన రామ సియఁ సుని సురబానీ। అతి సుఖు లహేఉ న జాఇ బఖానీ ॥
ఇహాఁ భరతు సబ సహిత సహాఏ। మందాకినీఁ పునీత నహాఏ ॥ 2 ॥
సరిత సమీప రాఖి సబ లోగా। మాగి మాతు గుర సచివ నియోగా ॥
చలే భరతు జహఁ సియ రఘురాఈ। సాథ నిషాదనాథు లఘు భాఈ ॥ 3 ॥
సముఝి మాతు కరతబ సకుచాహీం। కరత కుతరక కోటి మన మాహీం ॥
రాము లఖను సియ సుని మమ నాఉఁ। ఉఠి జని అనత జాహిఁ తజి ఠాఉఁ ॥ 4 ॥

"ప్రపంచములో భరతుడు జన్మించనిచో భూమిపై ధర్మమును నిలబెట్టెడి వారెవ్వరు? రఘునాథా! కవులకు గూడ ఊహాలకందని భరతునిగుణములనుగూర్చి నీవుతప్ప ఇతరులు ఎవ్వరెఱుగుదురు?" శ్రీ సీతారామలక్ష్మణులు ఈ దివ్యవాణిని విని, అంతులేని ఆనందమును పొందిరి. ఇక్కడ భరతుడు తనపరివారములతోగూడి పవిత్రమందాకినిలో స్నానములను ఆచరించెను. అందఱినీ మందాకినీతీరమున ఉంచి, తల్లుల యొక్క, గురువుల యొక్క, మంత్రుల యొక్క ఆజ్ఞలను పొంది, నిషాదరాజును శత్రుఘ్నుని తన వెంటబెట్టుకొని, భరతుడు శ్రీ సీతారాములున్న చోటికి బయలు దేఱెను. అతడు తనతల్లి కైకేయి చేసిన కృత్యములను దలచుకొని 'శ్రీ సీతారామలక్ష్మణులు నా రాకను వినగానే ఆ స్థలమును వదలి వేఱే ప్రదేశమునకు వెళ్లుదురేమో?' యను జంకుతో-ఆలోచనలో పడెను. (చౌ॥ 1-4)

చౌ- బానర కటక ఉమా మైం దేఖా । సో మూరుఖ జో కరన చహ లేఖా ॥
ఆఇ రామ పద నావహిం మాథా । నిరఖి బదను సబ హోహిం సనాథా ॥ 1 ॥
అస కపి ఏక న సేనా మాహీం । రామ కుసల జెహి పూఛీ నాహీం ॥
యహ కఛు నహిం ప్రభు కఇ అధికాఈ । బిస్వరూప బ్యాపక రఘురాఈ ॥ 2 ॥
ఠాఢే జహం తహం ఆయసు పాఈ । కహ సుగ్రీవ సబహి సముఝాఈ ॥
రామ కాజు అరు మోర నిహోరా । బానర జూథ జాహు చహుం ఓరా ॥ 3 ॥
జనకసుతా కహుం ఖోజహు జాఈ । మాస దివస మహం ఆఏహు భాఈ ॥
అవధి మేటి జో బిను సుధి పాఏం । ఆవఇ బనిహి సో మోహి మరాఏం ॥ 4 ॥

(శివుడు వచించుచున్నాడు.) భవానీ! నేను ఆ వానరసేనను చూచితిని. అవి అసంఖ్యాకములుగానున్నవి. లెక్కింపనెవ్వరికిని తరముగాదు. వాటిని లెక్కింపబూనినవాడు నిజముగా మూర్ఖుడే. వానరములన్నియును శ్రీరాముని చరణములకు ప్రణమిల్లెను. అవి శ్రీరాముని దర్శనముచే కృతార్థతనొందుచుండెను. అంతటి అసంఖ్యాక సైన్యములో గూడ శ్రీరాముని కుశల ప్రశ్నలకు నోచుకొనని వానరము ఒక్కటియు లేదు. ప్రభువు ప్రతి వానరమును కుశలమడిగెను. ఆయనకిది ఒక గొప్ప విషయముగాదు. ఏలనన శ్రీరఘునాథుడు విశ్వరూపుడు, సర్వవ్యాపకుడు. సుగ్రీవుని ఆజ్ఞల మేరకు ఆ వానరములు ఎక్కడివక్కడ నిలిచి పోయెను. అప్పుడతడు వారినందరిని ఇట్లాదేశించెను. "వానరులారా! ఇది శ్రీరామచంద్రుని కార్యము. నా ఆజ్ఞ. మీరన్నిదిశలకును వెళ్ళి, సీతాదేవి జాడ తెలిసి కొని రండు. సోదరులారా! ఒక్క నెలలోపల తప్పక తిరిగి రావలెను. ఈ అవధి దాటిన పిదప సీతాదేవి వార్తను తెలిసి కొనకుండా వచ్చిన వారికి నా చేతిలో మరణముతప్పదు. (చౌ॥ 1-4)

దో- బచన సునత సబ బానర, జహం తహం చలే తురంత ।
తబ సుగ్రీవం బోలాఏ, అంగద నల హనుమంత ॥ 22 ॥

సుగ్రీవాజ్ఞను విని, వానరులందఱును నలుదిశలకును వెళ్లిపోయిరి. అప్పుడు సుగ్రీవుడు అంగద, నల, హనుమదాది ప్రముఖ వీరులను పిలిచెను. (దో॥ 22)

చౌ- సునహు నీల అంగద హనుమానా । జామవంత మతిధీర సుజానా ॥
సకల సుభట మిలి దచ్ఛిన జాహూ । సీతా సుధి పూంఛెహు సబ కాహూ ॥ 1 ॥
మన క్రమ బచన సో జతన బిచారెహు । రామచంద్ర కర కాజు సంవారెహు ॥
భాను పీఠి సేఇఅ ఉర ఆగీ । స్వామిహి సర్బ భావ ఛల త్యాగీ ॥ 2 ॥
తజి మాయా సేఇఅ పరలోకా । మిటహిం సకల భవసంభవ సోకా ॥
దేహ ధరే కర యహ ఫలు భాఈ । భజిఅ రామ సబ కామ బిహాఈ ॥ 3 ॥
సోఇ గునగ్య సోఈ బడభాగీ । జో రఘుబీర చరన అనురాగీ ॥
ఆయసు మాగి చరన సిరు నాఈ । చలే హరషి సుమిరత రఘురాఈ ॥ 4 ॥

పాఛేఁ పవనతనయ సిరు నావా । జాని కాజ ప్రభు నికట బొలావా ॥
పరసా సీస సరోరుహ పానీ । కరముద్రికా దీన్హి జన జానీ ॥ 5 ॥
బహు ప్రకార సీతహి సముఝాఏహుఁ । కహి బల బిరహ బేగి తుమ్హ ఆఏహు ॥
హనుమత జన్మ సుఫల కరి మానా । చలేఉ హృదయఁ ధరి కృపానిధానా ॥ 6 ॥
జద్యపి ప్రభు జానత సబ బాతా । రాజనీతి రాఖత సురత్రాతా ॥ 7 ॥

సుగ్రీవుడు ఇట్లు వచించెను. సర్వసమర్థులైన ఓ ధీరులారా! నీల! అంగద! హనుమంత! జాంబవంత! వినుడు. మీరందరును దక్షిణ దిశగా పొండు. కలిసిన ప్రతివ్యక్తిని 'సీతాదేవి జాడను గూర్చి' అడుగుడు. త్రికరణశుద్ధిగా ప్రయత్నింపుడు, ఆలోచింపుడు. శ్రీరామచంద్రుని కార్యమును నెరవేర్పుడు. సూర్యకిరణముల తాపమును వీపున భరించుచు వినమ్రులై ఆయనను సేవింపవలెను. చలికి బాధపడువాడు సూర్య కిరణములకు వీపును జూపుచు సేవింపవలెను. అభిముఖులై అగ్నిని సేవింపవలెను. ప్రభువును త్రికరణశుద్ధిగా నిష్కపటముగా సేవింపవలెను. మమతాసక్తులను వీడి, పరలోక ప్రాప్తికై భగవత్సేవ చేయవలెను. దానివలన జననమరణజనిత శోకసంతాపములు అన్నియును పటాపంచలగును. సోదరులారా! మనోరథములనన్నింటిని పరిత్యజించి, శ్రీరామసేవలను కొనసాగింపవలెను. శరీరమును ధరించినందులకు శ్రీరాముని భజించుటయే గొప్పఫలము. శ్రీరామునిచరణములపై భక్తిగలవాడే గుణవంతుడు, మహాభాగ్యశాలి." ఈమాటలను శ్రద్ధగా విని, ఆజ్ఞలను గైకొని, నమస్కరించి,అంగదాదులందఱును, శ్రీరాముని స్మరించుచు, ప్రసన్నచిత్తులై దక్షిణదిశగా బయలుదేఱిరి. అందఱికంటెను చివర హనుమంతుడు శ్రీరామునకు ప్రణమిల్లెను. ఆయనద్వారా మాత్రమే తన కార్యము నెఱవేఱునని గ్రహించి, శ్రీరాముడు అతనిని తన యొద్దకు పిలిచెను. తన కరకమలములతో అతని శిరమును నిమిరెను. అతడు తనపరమభక్తుడని ఎఱింగి, తనవ్రేలిఉంగరమును తీసి అతనికి ఇచ్చి, ఇట్లు పలికెను "సీతకు ఊరట కలుగునట్లుగా అనువగు విధములనచ్చజెప్పుము. నా బలపరాక్రమములను గూర్చియు, ఆమెకై నా విరహమును గుఱించియు తెలిపి, శీఘ్రముగా తిరిగి రమ్ము." ఇది విని, హనుమంతుడు తనజన్మ సఫలమైనట్లు భావించి, కృపాళువైన ప్రభువును తనహృదయమునందే నిలుపుకొని, బయలుదేఱెను. దేవతలకును రక్షకుడైన ప్రభువు అన్నింటిని ఎఱింగియు, రాజనీతిని పాటించు చున్నాడు. (రావణుడు దేవతలను బాధించుచుండుటచే వారిని రక్షించుటకై శ్రీరాముడు అవతరించెను. యుద్ధమునకు ముందుగా దూతను పంపి, శత్రు సమాచారమును తెలిసికొనుట రాజనీతి. ప్రభువు మానవ ధర్మము ననుసరించి, రాజనీతిని పాటించుచున్నాడు.) (చౌ॥ 1-7)

దో- చలే సకల బన ఖోజత, సరితా సర గిరి ఖోహ ।
రామకాజ లయలీన మన, బిసరా తన కర ఛోహ ॥ 23 ॥

అంగదాదివానరులందఱును వనములను, నదులను, చెఱువులను, పర్వతములను, లోయలను, దాటుచు 'సీతాన్వేషణ'ను కొనసాగించుచుండిరి. వారిమనస్సులు శ్రీరామకార్యసాధనయందే లగ్నమైయుండుటచే వారికి శరీరవాంఛలపైగూడ ఏ మాత్రము ధ్యాసయేలేకుండెను. (దో॥ 23)

చౌ- కతహుఁ హోఇ నిసిచర సైఁ భేటా । ప్రాన లేహిఁ ఏక ఏక చపేటా ॥
బహు ప్రకార గిరి కానన హేరహిఁ । కోఉముని మిలఇ తాహి సబ ఘేరహిఁ ॥ 1 ॥

లాగి తృషా అతిసయ అకులానే । మిలఇ న జల ఘన గహన భులానే ॥
మన హనుమాన కీన్హ అనుమానా । మరన చహత సబ బిను జలపానా ॥ 2 ॥
చఢి గిరి సిఖర చహూఁ దిసి దేఖా । భూమి బిబర ఏక కౌతుక పేఖా ॥
చక్రబాక బక హంస ఉడాహీఁ । బహుతక ఖగ ప్రబిసహిఁ తెహి మాహీఁ ॥ 3 ॥
గిరి తే ఉతరి పవనసుత ఆవా । సబ కహుఁ లై సోఇ బిబర దేఖావా ॥
ఆగేఁ కై హనుమంతహి లీన్హా । పైఠే బిబర బిలంబు న కీన్హా ॥ 4 ॥

వారు గిరులు, కాననములు, పరిపరివిధముల గాలించుచుండిరి. ఎవ్వడైన నొక రాక్షసుడు కంట బడినచో వానిని వారు ఒక్కదెబ్బతో హతమార్చుచుండిరి. మునులు కనబడినప్పుడు వారి చుట్టునుజేరి సీతాదేవిసమాచారమును అడిగి తెలిసికొనుచుండిరి. ఇంతలోనే ఆ అంగదాదులు మిక్కిలి దప్పిగొని వ్యాకులపాటునకు గురియైరి. ఎచ్చటను నీరుదొరకక వారు ఆ దట్టమైన అడవులలో దారితప్పి తిరుగుచుండిరి. దాహబాధచే వారందఱు మరణింతురేమో అని ఆందోళనపడి హనుమంతుడు ఒక పర్వతశిఖరమునెక్కి నలుదెసల పరికించెను. నేలపై ఒక బిలము నొద్ద ఆయనకు ఆశ్చర్యకరమైన దృశ్యము కనబడెను. అకందరముపైన చక్రవాక పక్షులు, కొంగలు, హంసలు మొదలగునవి ఎగురుచుండెను. పెక్కుపక్షులు లోపలికి పోవుచు వచ్చుచుండెను. పవన సుతుడు పర్వతమునుండి దిగి వచ్చి, వారందఱికిని ఆ గుహను చూపించెను. హనుమంతుని ముందిడుకొని, వానరులందఱును వెంటనే ఆ కందరమున ప్రవేశించిరి. (చౌ॥ 1-4)

## స్వయంప్రభ వృత్తాంతము

దో- దీఖ జాఇ ఉపబన బర, సర బిగసిత బహు కంజ।
మందిర ఏక రుచిర తహఁ, బైఠి నారి తపపుంజ ॥ 24 ॥

వానరులందఱును ఆగుహలో ప్రవేశించి, అచట ఒక ఉపవనమును, అందొక సరోవరమును జూచిరి. వికసితసుందరకమలశోభలతో అది మనోహరముగా నుండెను. అచటనే ఒక మనోజ్ఞ మందిరము గలదు. అందొక తపస్విని కూర్చొని యుండెను. (దో॥ 24)

చౌ- దూరి తె తాహి సబన్హి సిరు నావా । పూఛేఁ నిజ బృత్తాంత సునావా ॥
తెహిఁ తబ కహా కరహు జలపానా । ఖాహు సురస సుందర ఫల నానా ॥ 1 ॥
మజ్జను కీన్హ మధుర ఫల ఖాఏ । తాసు నికట పుని సబ చలి ఆఏ ॥
తెహిఁ సబ ఆపని కథా సునాఈ । మైఁ అబ జాబ జహాఁ రఘురాఈ ॥ 2 ॥
మూదహు నయన బిబర తజి జాహూ । పైహహు సీతహి జని పఛితాహూ ॥
నయన మూది పుని దేఖహిఁ బీరా । ఠాఢే సకల సింధు కేఁ తీరా ॥ 3 ॥
సో పుని గఈ జహాఁ రఘునాథా । జాఇ కమల పద నాఏసి మాథా ॥
నానా భాఁతి బినయ తెహిఁ కీన్హీ । అనపాయనీ భగతి ప్రభు దీన్హీ ॥ 4 ॥

దూరము నుండియే అందఱును ఆమెకు నమస్కరించిరి. ఆమె అడిగిన పిమ్మట విషయము నంతయు చెప్పిరి. అప్పుడామె "ముందుగా మీరు దప్పిక తీర్చుకొనుడు. మధురములైన ఫలములను ఆరగింపుడు" అని వారితో పల్కెను. వానరులందరును స్నానములనాచరించి, తియ్యనిపండ్లను కడుపునిండా ఆరగించి, ఆమెకడకు చేరిరి. అప్పుడామె తన కథను వివరించెను, "నా పేరు స్వయంప్రభ. నేను ఇప్పుడు రఘునాథునియొద్దకు వెళ్లెదను. మీరు కన్నులను మూసికొనుడు. గుహనుండి బయటపడగలరు. సీతాదేవిని కనుగొనుటలో మీరు సఫలురయ్యెదరు. నిరాశ చెందవలదు" అని పలికెను. వారందఱును కనులు మూసికొని తెఱవగనే సముద్ర తీరమున నుండిరి. ఆ తపస్విని స్వయముగా శ్రీరాముడున్న స్థలమునకు చేరెను. ఆమె ప్రభుచరణములకు నమస్కరించి, అనేక విధముల ప్రార్థించెను. ప్రభువు ఆమెకు అచంచల భక్తిని ప్రసాదించెను. (చౌ॥ 1-4)

దో- బదరీబన కహుఀ సో గఈ, ప్రభు అగ్యా ధరి సీస।
ఉర ధరి రామచరన జుగ, జే బందత అజ ఈస ॥ 25 ॥

నిరంతరము బ్రహ్మ రుద్రాదులచేతను సేవింపబడుచుండు పరమ పవిత్రములైన శ్రీరాముని చరణయుగమును తనమనస్సున నిలుపుకొని, తపస్విని యైన ఆ స్వయంప్రభ ప్రభువు యొక్క ఆజ్ఞను శిరసావహించి, బదరికాశ్రమమునకు వెడలిపోయెను. (దో॥ 25)

చౌ- ఇహాఀ బిచారహిఀ కపి మన మాహీఀ। బీతీ అవధి కాజు కఛు నాహీఀ ॥
సబ మిలి కహహిఀ పరస్పర బాతా। బిను సుధి లఏఀ కరబ కా భ్రాతా ॥ 1 ॥
కహ అంగద లోచన భరి బారీ। దుహుఀ ప్రకార భఇ మృత్యు హమారీ ॥
ఇహాఀ న సుధి సీతా కై పాఈ। ఉహాఀ గఏఀ మారిహి కపిరాఈ ॥ 2 ॥
పితా బధే పర మారత మోహీ। రాఖా రామ నిహోర న ఓహీ ॥
పుని పుని అంగద కహ సబ పాహీఀ। మరన భయఉ కఛు సంసయ నాహీఀ ॥ 3 ॥
అంగద బచన సునత కపి బీరా। బోలి న సకహిఀ నయన బహ నీరా ॥
ఛన ఎక సోచ మగన హోఇ రహే। పుని అస బచన కహత సబ భఏ ॥ 4 ॥
హమ సీతా కై సుధి లీన్హేఀ బినా। నహిఀ జైహైఀ జుబరాజు ప్రబీనా ॥
అస కహి లవనసింధు తట జాఈ। బైఠే కపి సబ దర్భ డసాఈ ॥ 5 ॥
జామవంత అంగద దుఖ దేఖీ। కహీఀ కథా ఉపదేస బిసేషీ ॥
తాత రామ కహుఀ నర జని మానహు। నిర్గున బ్రహ్మ అజిత అజ జానహు ॥ 6 ॥
హమ సబ సేవక అతి బడభాగీ। సంతత సగున బ్రహ్మ అనురాగీ ॥ 7 ॥

ఇచ్చట సముద్రతీరమున వానరులందఱును ఇట్లు ఆలోచింపసాగిరి. ఇప్పటికే గడువు దాటినది. కాని కార్యము నెఱవేఱలేదు." అందఱును కూర్చొని పరస్పరము మాట్లాడు కొనసాగిరి. "సోదరా! సీతాదేవిసమాచారమును తెలిసికొనకుండ మనము కిష్కింధకు వెళ్లుటవలన ప్రయోజనమేమి? అంగదుడు సజలనయనుడై పలికెను." ఏ విధముగ నైనను మనకు మృత్యువేగతి. ఇక్కడ సీతాదేవిజాడ మనకు తెలియలేదు. అక్కడికి వెళ్లినచో కపిరాజు

సుగ్రీవుని చేతిలో మనకు చావు తప్పదు. శ్రీరాముడే నన్ను ఆదుకొనక పోయినచో మా తండ్రిగారు మృతి చెందిన వెంటనే సుగ్రీవుడు నన్ను హతమార్చియుండెడివాడు. ఇందులో నాపై సుగ్రీవుడు చూపిన దయయేమియును లేదు. ఇకమనకు మరణమే శరణ్యము!' అంగదునిమాటలను వినియు వానరవీరులు ఏమియు మాటు పలుకకుండిరి. నిశ్శబ్దము తాండవించెను. వారినేత్రములు అశ్రు పూర్ణములాయెను. ఒక్కక్షణ కాలము వారు శోకమగ్నులైరి. చివరకు వారందఱును "యువరాజా! మనము సీతాదేవిజాడను తెలిసికొనకుండ అచటికి ఎట్లుతిరిగి వెళ్లగలము?" అని పలికి, ఆ లవణ సముద్రతీరమున కుశాసనము పఱుచుకొని, కూర్చొనిరి. నిరశనవ్రతము ద్వారా ప్రాణత్యాగమునకు సిద్ధపడిరి. అంగదునిదుఃఖమునుజూచి, జాంబవంతుడు ఉపదేశాత్మకములైన కథలను చెప్పసాగెను. నాయనా! శ్రీరాముని మానవమాత్రునిగా తలంపవలదు. అతడు నిర్గుణ పరబ్రహ్మము, అజేయుడు, జన్మరహితుడు- అని యెఱుంగుము. మనమందఱము ఆయనసేవకులము కనుక మిక్కిలి భాగ్యశాలురము. సగుణ బ్రహ్మయునైన ఆ శ్రీరామునియందు నిరంతరము ప్రేమ గలవారము. (చౌ॥ 1-7)

దో- నిజ ఇచ్ఛాఀ ప్రభు అవతరఇ, సుర మహి గో ద్విజ లాగి ।
సగున ఉపాసక సంగ తహఀ, రహహిఀ మోచ్ఛ సబ త్యాగి॥ 26 ॥

దేవతలను, భూదేవిని, గోవులను, బ్రాహ్మణులను సంరక్షించుటకై భగవంతుడు తన ఇచ్ఛాను సారము అవతారములను ఎత్తుచుండును. అప్పుడు సగుణోపాసకులగు భక్తులందఱును సర్వ సుఖములను త్యజించి, మోక్షమునుగూడ ఆసింపక, ఆయన సేవలలోనే నిమగ్నులైయుందురు. (దో॥ 26)

## సంపాతి సహకారము

చౌ- ఏహి బిధి కథా కహహిఀ బహు భాఀతీ । గిరికందరాఀ సునీ సంపాతీ ॥
బాహెర హోఇ దేఖి బహు కీసా । మోహి అహార దీన్హ జగదీసా ॥ 1 ॥
ఆజు సబహి కహఀ భచ్ఛన కరఊఀ । దిన బహు చలే అహార బిను మరఊఀ ॥
కబహుఀ న మిల భరి ఉదర అహారా । ఆజు దీన్హ బిధి ఏకహిఀ బారా ॥ 2 ॥
డరపే గీధ బచన సుని కానా । అబ భా మరన సత్య హమ జానా ॥
కపి సబ ఉఠే గీధ కహఀ దేఖీ । జామవంత మన సోచ బిసేషీ ॥ 3 ॥
కహ అంగద బిచారి మన మాహీఀ । ధన్య జటాయూ సమ కోఉ నాహీఀ ॥
రామ కాజ కారన తను త్యాగీ । హరి పుర గయఉ పరమ బడభాగీ ॥ 4 ॥
సుని ఖగ హరష సోక జుత బానీ । ఆవా నికట కపిన్హ భయ మానీ ॥
తిన్హహి అభయ కరి పూఛేసి జాఈ । కథా సకల తిన్హ తాహి సునాఈ ॥ 5 ॥
సుని సంపాతి బంధు కై కరనీ । రఘుపతి మహిమా బహుబిధి బరనీ ॥ 6 ॥

ఈ విధముగా జాంబవంతుడు నానా విధ గాథలను తెల్పుచుండగా ఆ సమీప గుహయందున్న సంపాతియను గృధ్రరాజు (జటాయువు అన్న) వాటి నన్నింటిని వినెను. పిమ్మట అతడు బయటకి వచ్చి, ఆ వానరములను జూచి, ఇట్లు పలికెను. "భగవంతుడు నాకు ఆహారమును ఇంటికే పంపినాడు. నేను ఈనాడు వీరందఱిని భక్షించెదను.

చాలా దినములనుండి ఆహారము లేక నేను విలవిలలాడుచున్నాను. కడుపునిండా ఆహారము దొరకక చాల కాలమైనది. నేడు విధాత ఒక్కసారే చాల ఆహారమును సమకూర్చినాడు." గ్రద్ద పలికిన మాటలను వినగానే వానరములు భయపడి, "ఇప్పుడు నిజముగానే మరణము ఆసన్నమైనది" అని పలుకసాగెను. పిదప ఆగ్రద్దను చూచుటకు, వానరములన్నియు కొద్దిగా లేచి నిలబడెను. జాంబవంతుని మనస్సులో విచారము అధికమాయెను. అప్పుడు బాగుగా ఆలోచించి, అంగదుడు ఇట్లనెను. "ఆహా! జటాయువు వంటి పుణ్యాత్ముడు ఎవ్వడును లేడు అతడు పరమభాగ్యశాలి. శ్రీరాముని కార్యమునకై అసువులను వీడి, ఆ పరమ పదమునే పొందెను." హర్షశోకములనుగూర్చు ఈమాటలను వినగానే ఆ గృధ్రము వారిచెంతకు వచ్చెను. వానరములు మఱింతగా భయపడెను. సంపాతి వారికి ముందుగా అభయమిచ్చి, జటాయువు వృత్తాంతము నడిగెను. అపుడంగదుడు ఆ కథనంతయును వినిపించెను. సోదరుడైన జటాయువు యొక్క అద్భుతకృత్యగాథను విని, సంపాతి శ్రీరఘునాథుని మహిమను అనేక విధముల ప్రస్తుతించెను. (చౌ॥ 1-6)

దో- మొహి లై జాహు సింధుతట, దేఉఁ తిలాంజలి తాహి।
బచన సహాఇ కరబి మైఁ, పైహహు ఖోజహు జాహి ॥ 27 ॥

సంపాతి నుడివెను "నన్ను సముద్ర తీరమునకు తీసికొని పొండు. నేను నా సోదరునకు 'తిలాంజలులను' ఇచ్చెదను. ఈ సేవలకు మాఱుగా మీకు మాటసాయము చేసెదను. మీరు వెదకుచున్న సీతాదేవి జాడను తెల్పెదను. ఆమె తప్పక లభింపగలదు. (దో॥ 27)

చౌ- అనుజ క్రియా కరి సాగర తీరా। కహి నిజ కథా సునహు కపి బీరా ॥
హమ ద్వౌ బంధు ప్రథమ తరునాఈ। గగన గఏ రబి నికట ఉడాఈ ॥ 1 ॥
తేజ న సహి సక సో ఫిరి ఆవా। మైఁ అభిమానీ రబి నిఅరావా ॥
జరే పంఖ అతి తేజ అపారా। పరెఉఁ భూమి కరి ఘోర చికారా ॥ 2 ॥
ముని ఏక నామ చంద్రమా ఓహీ। లాగీ దయా దేఖి కరి మోహీ ॥
బహు ప్రకార తెహిఁ గ్యాన సునావా। దేహ జనిత అభిమాన ఛడావా ॥ 3 ॥
త్రేతాఁ బ్రహ్మ మనుజ తను ధరిహీ। తాసు నారి నిసిచర పతి హరిహీ ॥
తాసు ఖోజ పఠఇహి ప్రభు దూతా। తిన్హహి మిలేఁ తైఁ హోబ పునీతా ॥ 4 ॥
జమిహహిఁ పంఖ కరసి జని చింతా। తిన్హహి దేఖాఇ దెహేసు తైఁ సీతా ॥
ముని కఇ గిరా సత్య భఇ ఆజూ। సుని మమ బచన కరహు ప్రభు కాజూ ॥ 5 ॥
గిరి త్రికూట ఊపర బస లంకా। తహఁ రహ రావన సహజ అసంకా ॥
తహఁ అసోక ఉపబన జహఁ రహఈ। సీతా బైఠి సోచరత అహఈ ॥ 6 ॥

సంపాతి సముద్రతీరమున తనతమ్ముడైన జటాయువునకు శ్రాద్ధతర్పణాదులను ఆచరించిన పిమ్మట తనకథను వివరింపసాగెను. "ఓ వానర వీరులారా! వినుడు. జటాయువు, నేను సోదరులము. మేము మా తొలియౌవనదశలో ఆకాశమున ఎగురుచు సూర్యుని సమీపించితిమి. జటాయువు సూర్యతేజస్సునకు తాళలేక తిరిగి వచ్చెను. నేను

అభిమానిని గాన సూర్యుని సమీపమునకు వెళ్ళితిని సూర్యుని ప్రచండ కిరణ జ్వాలలకు నారెక్కలు మాడి పోయినవి. అప్పుడు నేను గట్టిగా అఱచుచు 'చంద్రమా' అను మునియొక్కఆశ్రమమున నేలపై పడితిని. నా స్థితిని జూచిన పిమ్మట ఆయనకు నాపై జాలికలిగెను. అతడు నాకు పెక్కు రీతుల జ్ఞాన బోధను గావించి, నా దేహాభిమానమును తొలగించెను. పిమ్మట ఆ ముని నాతో ఇట్లు పలికెను. "త్రేతాయుగమున పరబ్రహ్మ స్వయముగా మానవావతారమును దాల్చును. రాక్షస రాజైన రావణుడు అతనిభార్యను అపహరించును. ఆమెజాడను దెలిపి కొనుటకు ప్రభువు దూతలను పంపును. వారితో గలిసినప్పుడు నీవు పావనమయ్యెదవు. అప్పుడు నీరెక్కలు తిరిగి రాగలవు. చింతింపవలదు. నీవు సీతాదేవి జాడను వారికి తెలుపుము'. ఆ ముని పలుకులు ఈనాడు సత్యములైనవి. నా మాటను విని, మీరు శ్రీరామచంద్రప్రభుకార్యమును నెఱవేర్పుడు. త్రికూట పర్వతముపై లంకానగరమున్నది. సహజముగా నిర్భయుడైన రావణుడు అక్కడ ఉన్నాడు. ఆ లంకానగరమున 'అశోకవనము' అను ఒక ఉపవనము గలదు. అందు సీతాదేవి శ్రీరామచంద్రుని స్మరించుచు శోకమగ్నురాలై కూర్చొని యున్నది. (చౌ॥ 1-6)

## సముద్రమును లంఘించుటకై అంగదాదులచర్చ

దో- మైం దేఖఉం తుమ్హ నాహీం, గీధహి దృష్టి అపార ।
బూఢ భయఉం న త కరతెఉం, కఛుక సహాయ తుమ్హార ॥ 28 ॥

ఇక్కడి నుండియే ఆమెను నేను చూచుచున్నాను. మీరు చూడజాలరు. ఏలనన గ్రద్ద దృష్టి అపారశక్తిమంతమైనది. నేను ఇప్పుడు చాల ముదుసలిని. లేనిచో మీకు కొంత తోడ్పడగలిగి యుండెడి వాడను. (దో॥ 28)

చౌ- జో నాఘఇ సత జోజన సాగర । కరఇ సో రామ కాజ మతి ఆగర ॥
మోహి బిలోకి ధరహు మన ధీరా । రామ కృపాం కస భయఉ సరీరా ॥ 1 ॥
పాపిఉ జా కర నామ సుమిరహీం । అతి అపార భవసాగర తరహీం ॥
తాసు దూత తుమ్హ తజి కదరాఈ । రామ హృదయం ధరి కరహు ఉపాఈ ॥ 2 ॥
అస కహి గరుడ గీధ జబ గయఊ । తిన్హ కేం మన అతి బిసమయ భయఊ ॥
నిజ నిజ బల సబ కాహూం భాషా । పార జాఇ కర సంసయ రాఖా ॥ 3 ॥
జరఠ భయఉం అబ కహఇ రిఛేసా । నహిం తన రహా ప్రథమ బల లేసా ॥
జబహిం త్రిబిక్రమ భఏ ఖరారీ । తబ మైం తరున రహేఉం బల భారీ ॥ 4 ॥

నూఱు యోజనములవిస్తీర్ణముగల సముద్రమును లంఘింపగల్గిన మహావీరుడైన ప్రజ్ఞాశాలియే శ్రీరాముని ఈ కార్యమును సాధింపగలడు. నన్ను జూచి, మీరు ధైర్యము వహింపుడు. శ్రీరామునికృపచే నాశరీరము అతిసుందరముగా రూపొందినది. అతని నామస్మరణముచే పాపులుగూడ అపారభవసాగరమును దాటగల్గుదురు. మీరు ఆయనదూతలు. అధైర్యమును వీడి, హృదయములలో శ్రీరామచంద్రుని నిలుపుకొని కార్యసాధనకు సిద్ధముకండు." (కాకభుశుండి పలుకుచున్నాడు) ఓ ఖగరాజా! సంపాతి ఇట్లు పలికి, క్రొత్త రెక్కలతో ఎగిరి పోయిన పిమ్మట వానరులు విస్మితులైరి. అందఱును తమతమ బలములను గూర్చి తెల్పుచు సముద్రమును దాటుటకు తమసందేహములను ప్రకటించిరి. భల్లూక రాజైన జాంబవంతుడు ఇట్లు పలికెను. 'నేనిప్పుడు వృద్ధుడను. నా

శరీరమున మునుపటి బలము లేశమైనను లేదు. ఖరారియైన శ్రీరాముడు వామనావతారమును దాల్చినప్పుడు నేను యువకునిగా ఉంటిని. అప్పుడు నా శరీరము బలిష్ఠమై యుండెను. (చౌ॥ 1-4)

దో- బలి బాఁధత ప్రభు బాఢేఉ, సో తను బరని న జాఇ।
ఉభయ ఘరీ మహఁ దీన్హీఁ, సాత ప్రదచ్ఛిన ధాఇ ॥ 29 ॥

బలిచక్రవర్తిని బంధించునప్పుడు ప్రభువు శరీరమును పెంచినప్పటి ఆ విరాట్ స్వరూపమును వర్ణించుటకు ఎవ్వరికిని శక్యము గాదు. కాని నేను రెండు గడియలలోనే ఆ విరాడ్రూపమునకు ఏడు ప్రదక్షిణములు గావించితిని." (దో॥ 29)

చౌ- అంగద కహఇ జాఉఁ మైఁ పారా। జియఁ సంసయ కఛు ఫిరతీ బారా ॥
జామవంత కహ తుమ్హ సబ లాయక। పఠఇఅ కిమి సబహీ కర నాయక ॥ 1 ॥
కహఇ రీఛపతి సును హనుమానా। కా చుప సాధి రహేహు బలవానా ॥
పవనతనయ బల పవన సమానా। బుధి బిబేక బిగ్యాన నిధానా ॥ 2 ॥
కవన సో కాజ కఠిన జగ మాహీఁ। జో నహిఁ హోఇ తాత తుమ్హ పాహీఁ ॥
రామకాజ లగి తవ అవతారా। సునతహిఁ భయఉ పర్బతాకారా ॥ 3 ॥
కనకబరన తన తేజ బిరాజా। మానహుఁ అపర గిరిన్హ కర రాజా।
సింహనాద కరి బారహిఁ బారా। లీలహిఁ నాఘఉఁ జలనిధి ఖారా ॥ 4 ॥
సహిత సహాయ రావనహి మారీ। ఆనఉఁ ఇహాఁ త్రికూట ఉపారీ ॥
జామవంత మైఁ పూఁఛఉఁ తోహీ। ఉచిత సిఖావను దీజహు మోహీ ॥ 5 ॥
ఏతనా కరహు తాత తుమ్హ జాఈ। సీతహి దేఖి కహహు సుధి ఆఈ ॥
తబ నిజ భుజబల రాజివనైనా। కౌతుక లాగి సంగ కపి సేనా ॥ 6 ॥

అపుడు అంగదుడు ఇట్లు పల్కెను. "నేను సముద్రమును దాటగలను. కాని తిరిగి వచ్చు విషయములో నాకు సందేహము గలదు" జాంబవంతుడు అతనితో పల్కెను. "నీవు అన్ని విధముల యోగ్యుడవు. కాని నీవు అందఱికిని నాయకుడవు. నిన్నెట్లు పంపగలము?" భల్లూక రాజు హనుమంతునితో ఇట్లనెను. "ఆంజనేయా! నీవెంతో బలవంతుడవు. మౌనముగా నుంటివేల? నీవు పవనపుత్రుడవు. బలమున ఆ పవనునితో సమానుడవు. బుద్ధి, వివేకము విజ్ఞానములకు నిధివి. నాయనా! విశ్వములో నీవు సాధింపలేని కఠినకార్యమేమున్నది? శ్రీరామచంద్రుని కార్యమునకే నీవు అవతరించితివి." ఇది వినగానే హనుమంతుడు పర్వతమంత పెరిగెను. ఆయన శరీరము స్వర్ణ కాంతులతో విరాజిల్లుచుండెను. అది వేఱొక మేరుపర్వతమువలె భాసించుచుండెను. హనుమంతుడు సింహమువలె గర్జించుచు పల్కెను. "నేను ఈ లవణసముద్రమును అవలీలగా లంఘించెదను. రావణుని సపరివారముగా పరిమార్చి, త్రికూట పర్వతమును ఇక్కడికి పెకలించుకొని రాగలను. జాంబవంతా! నిన్నడుగుచుంటిని. సరియైన

సూచనలనిమ్ము." జాంబవంతుడు నుడివెను. "నాయనా! నీవు వెళ్లి, సీతాదేవిని జూచి, ఆమె జాడను తెలిసికొని రమ్ము. నీవు చేయవలసినదింతమాత్రమే. తదనంతరము రాజీవలోచనుడు శ్రీరామచంద్రుడు తన భుజబలముచే తనలీలలను జూపుటకు వానరసైన్యమును తీసికొని పోయి, శత్రువుల ఏనిబట్టును. (చౌ॥ 1-6)

ఛం- కపి సేన సంగ సంఘారి నిసిచర రాము సీతహి ఆనిహైఁ ।
త్రైలోకపావన సుజసు సుర ముని నారదాది బఖానిహైఁ ॥
జో సునత గావత కహత సముఝత పరమపద నర పావఈ ।
రఘుబీర పద పాథోజ మధుకర దాస తులసీ గావఈ ॥

వానర సైన్యమును తోడుగా దీసికొని శ్రీరామచంద్రుడు రాక్షసులను సంహరించి, సీతాదేవిని తీసికొని వచ్చును. అప్పుడు దేవతలు, నారదాది మహర్షులు ముల్లోకములను పవిత్రమొనర్చు భగవంతుని వైభవమును గానము చేయుదురు. దానిని విని, గానము చేసి, మనుజులు పరమపదమును జేరెదరు. శ్రీ రఘువీరుని చరణకమలములయందు విహరించు భ్రమరమైన తులసీదాసు ఆ గుణగణములను గానము చేయును. (ఛం)

దో- భవ భేషజ రఘునాథ జసు, సునహిఁ జె నర అరు నారి ।
తిన్హ కర సకల మనోరథ, సిద్ధ కరహిఁ త్రిసిరారి ॥ 30 (క) ॥

శ్రీ రఘునాథుని కీర్తి జననమరణరూపభవరోగములను రూపుమాపెడి అమోఘమైన ఔషధము. దీనిని శ్రద్ధగా వినిన స్త్రీ పురుషులందఱికిని 'త్రిశిరారి' యైన శ్రీరాముడు సర్వ మనోరథములను సిద్ధింప జేయును. (దో॥ 30.క)

సో- నీలోత్పల తన స్యామ, కామ కోటి సోభా అధిక ।
సునిఅ తాసు గున గ్రామ, జాసు నామ అఘ ఖగ బధిక ॥ 30 (ఖ) ॥

నీలోత్పలసమానశ్యామసుందరగాత్రుడును, కోటిమన్మథులనుగూడ మించు మనోహరశోభామూర్తియు, పాపములనెడి పక్షులను వేటగానివలె రూపు మాపునట్టి నామప్రభావము గలవాడును అగు శ్రీరామచంద్రుని పావనగుణగణములను నిరంతరము అవశ్యము శ్రవణము చేయవలెను. (సో॥ 30.ఖ)

మాసపారాయణము ఇఱువదిమూడవ విరామము

ఇతి శ్రీమద్రామచరితమానసే సకలకలికలుషవిధ్వంసనే చతుర్థ సోపానః సమాప్తః

కలియుగపాపములను నశింపజేయు శ్రీరామచరితమానసమునందలి కిష్కింధాకాండము

అను చతుర్థ సోపానము సమాప్తము

(కిష్కింధాకాండము సమాప్తము)

శ్రీ గణేశాయ నమః
శ్రీజానకీవల్లభో విజయతే

# శ్రీరామచరితమానసము

## పంచమ సోపానము

# సుందరకాండము

## ప్రస్తుతి

శ్లో॥ శాంతం శాశ్వతమప్రమేయమనఘం నిర్వాణశాంతిప్రదం
బ్రహ్మాశంభుఫణీంద్రసేవ్యమనిశం వేదాంతవేద్యం విభుమ్ ।
రామాఖ్యం జగదీశ్వరం సురగురుం మాయామనుష్యం హరిం
వందేఽహం కరుణాకరం రఘువరం భూపాలచూడామణిమ్ ॥ 1 ॥

రఘువంశశ్రేష్ఠుడు, సర్వపాపహారియగు శ్రీరాముడను పేరుగల శ్రీహరికి నేను నమస్కరించుచున్నాను. ఆయన పరమశాంత స్వరూపుడు, శాశ్వతుడు, అప్రమేయుడు, అనఘుడు, మోక్షమును- పరమశాంతిని ప్రసాదించువాడు, బ్రహ్మ శంభు ఫణీంద్రులచే నిరంతరము సేవింప బడువాడు, వేదాంతవేద్యుడు, విభుడు, జగదీశ్వరుడు, మాయామానుషవిగ్రహుడు, కరుణాకరుడు సర్వరాజశిరోమణి వేయేల? అతడు దేవాదిదేవుడు. (1)

శ్లో॥ నాన్యా స్పృహా రఘుపతే హృదయేఽస్మదీయే
సత్యం వదామి చ భవానఖిలాంతరాత్మా ।
భక్తిం ప్రయచ్ఛ రఘుపుంగవ నిర్భరాం మే
కామాదిదోషరహితం కురు మానసం చ ॥ 2 ॥

ఓ రఘువర! నీవు సర్వాత్మ స్వరూపుడవు. నాకు నీ ప్రగాఢభక్తిని అనుగ్రహింపుము. నా మనస్సును కామాదివికార (దోష) రహితముగా జేయుము. ఓ రఘువీర! నేను నిజము వచించు చున్నాను. ఇంతకు మించి నా హృదయమున మఱియొక మనోరథమేమియును లేదు. (2)

శ్లో॥ అతులితబలధామం హేమశైలాభదేహం
దనుజవనకృశానుం జ్ఞానినామగ్రగణ్యమ్ ।
సకలగుణనిధానం వానరాణామధీశం
రఘుపతిప్రియభక్తం వాతజాతం నమామి ॥ 3 ॥

శ్రీ రఘురామునకు పరమభక్తుడైన వాయునందనుడు నిరుపమానబలసంపదలకు నిధాన మైనవాడు, మేరుపర్వతసమానతనుశోభలుగలవాడు, దానవులనెడివనములను దహించివేయుటలో అగ్నివంటివాడు, జ్ఞానులలో సర్వశ్రేష్ఠుడు, వానరులలో ప్రముఖుడు, అంతేగాదు అతడు సకలసద్గుణరాశి, అట్టి ఆంజనేయునకు నేను నమస్కరించు చున్నాను. (3)

## మారుతి సముద్రమును లంఘించుట

చౌ- జామవంత కే బచన సుహాఏ । సుని హనుమంత హృదయ అతి భాఏ ॥
తబ లగి మొహి పరిఖెహు తుమ్హ భాఈ । సహి దుఖ కంద మూల ఫల ఖాఈ ॥ 1 ॥
జబ లగి ఆవౌం సీతహి దేఖీ । హోఇహి కాజు మొహి హరష బిసేషీ ॥
యహ కహి నాఇ సబన్హి కహుం మాథా । చలెఉ హరషి హియం ధరి రఘునాథా ॥ 2 ॥
సింధు తీర ఏక భూధర సుందర । కౌతుక కూది చఢెఉ తా ఊపర ॥
బార బార రఘుబీర సంభారీ । తరకెఉ పవనతనయ బల భారీ ॥ 3 ॥
జెహిం గిరి చరన దేఇ హనుమంతా । చలెఉ సో గా పాతాల తురంతా ॥
జిమి అమోఘ రఘుపతి కర బానా । ఏహీ భాంతి చలెఉ హనుమానా ॥ 4 ॥
జలనిధి రఘుపతి దూత బిచారీ । తైం మైనాక హోహి శ్రమహారీ ॥ 5 ॥

జాంబవంతుని మనోహరవచనములు హనుమంతునిహృదయమునకు మిక్కిలి ఆహ్లాదకరములాయెను. అప్పుడు అతడు పలికెను. "సోదరులారా! మీరు దుఃఖములను సహించుచు, కందమూలఫలములను భుజించుచు, నాకై నిరీక్షించుచుండుడు. నేను సీతాదేవిని చూచి, తిరిగిరాగలను. కార్యము తప్పక సఫలము కాగలదు. ఏలనన నాకు మిక్కిలి సంతోషముగా ఉన్నది." ఈ విధముగా పలికి, అందరికిని నమస్కరించి, మనస్సున శ్రీరామచంద్రుని ధ్యానించుచు ఆంజనేయుడు ప్రసన్నచిత్తుడై బయలుదేరెను. సముద్రతీరమున ఒక సుందర పర్వతముగలదు. మహాబలవంతుడైన హనుమంతుడు ఆటలలోవలె గంతులు వేయుచు అవలీలగా దానిపై నెక్కెను. మాటిమాటికిని శ్రీరఘువీరుని స్మరించుచు అతివేగముతో ఎగిరెను. అతడు కాలుమోపిన ఆ మహేంద్రపర్వతము వెంటనే పాతాళమునకు క్రుంగిపోయెను. శ్రీరామచంద్రుని అమోఘమైనబాణమురీతి హనుమంతుడు మిక్కిలి వేగముగా ఆకాశమార్గమున వెళ్ళుచుండెను. సముద్రుడు ఆయనను శ్రీరామదూతగా నెఱిగి, మైనాక పర్వతముతో పలికెను. "మైనాక! నీవు అతనిశ్రమను తొలగింపుము. (సముద్రమునుండి పైకి లెమ్ము నీపై అతనిని విశ్రమింప నిమ్ము.) (చౌపాఈ॥ 1-5)

దో-హనూమాన తెహి పరసా, కర పుని కీన్హ ప్రనామ।
రామ కాజు కీన్హేఁ బిను, మోహి కహాఁ బిశ్రామ ॥ 1 ॥

హనుమంతుడు ఆమైనాక పర్వతమును చేతితో తాకి, నమస్కరించి, ఇట్లు నుడివెను. "సోదరా! శ్రీరామచంద్రునికార్యము పూర్తికానిదే నాకు విశ్రాంతి యెక్కడిది?" (దో॥ 1)

చౌ-జాత పవనసుత దేవన్హ దేఖా। జానైఁ కహుఁ బల బుద్ధి బిసేషా ॥
సురసా నామ అహిన్హ కై మాతా। పఠఇన్హి ఆఇ కహీ తెహిఁ బాతా ॥ 1 ॥
ఆజు సురన్హ మొహి దీన్హ అహారా। సునత బచన కహ పవనకుమారా ॥
రామ కాజు కరి ఫిరి మైఁ ఆవౌఁ। సీతా కఇ సుధి ప్రభుహి సునావౌఁ ॥ 2 ॥
తబ తవ బదన పైఠిహఉఁ ఆఈ। సత్య కహఉఁ మొహి జాన దె మాఈ ॥
కవనెహుఁ జతన దేఇ నహిఁ జానా। గ్రససి న మోహి కహెఉ హనుమానా ॥ 3 ॥
జోజన భరి తెహిఁ బదను పసారా। కపి తను కీన్హ దుగున బిస్తారా ॥
సోరహ జోజన ముఖ తెహిఁ ఠయఊ। తురత పవనసుత బత్తిస భయఊ ॥ 4 ॥
జస జస సురసా బదను బఢావా। తాసు దూన కపి రూప దెఖావా ॥
సత జోజన తెహిఁ ఆనన కీన్హా। అతి లఘు రూప పవనసుత లీన్హా ॥ 5 ॥
బదన పఇఠి పుని బాహెర ఆవా। మాగా బిదా తాహి సిరు నావా ॥
మోహి సురన్హ జెహి లాగి పఠావా। బుధి బల మరము తోర మైఁ పావా ॥ 6 ॥

పవనసుతుడైన హనుమంతుడు సాగిపోవుచుండుట చూచి, దేవతలు ఆతని బలమును, బుద్ధి వైశిష్ట్యములను పరీక్షింపదలచిరి. వారు 'సురస' అను నాగమాతను పంపిరి. ఆమె హనుమంతుని సమీపించి, ఇట్లు వచించెను. "దేవతలు నాకు ఈనాడు భోజనమును ప్రసాదించినారు." ఈ మాటలను వినగానే పావని పలికెను. "శ్రీరాముని కార్యమును నెఱవేర్చి, తిరిగి వచ్చి, సీతాదేవి సమాచారమును శ్రీరామునకు తెల్పిన పిదప నేను నీ నోటిలో ప్రవేశించెదను. తల్లీ! నేను సత్యమును పచించుచున్నాను. ఇప్పుడు నన్ను పోనిమ్ము". కాని ఏవిధముగను ఆమె ఆయనను పోనీయలేదు. అప్పుడు హనుమంతుడు "ఐతే నన్ను మ్రింగుము" అనెను. ఆమె తననోటిని ఒక యోజనము వెడల్పు చేసెను. అప్పుడతడు తన శరీరమును దానికి రెండింతలు విస్తరింప జేసెను. సురస తన నోటిని పదునాఱు యోజనముల వెడల్పు చేయుగా ఆయన తన దేహమును ముప్పది రెండు యోజనములు పెంచెను. ఇట్లు సురసతన నోటిని వెడల్పుచేసినకొలదియు, ఆయన తన తనువును దానికి రెండింతలుగా పెంచుచువచ్చెను. చివరకు ఆమె నోటిని నూఱు యోజనముల వెడల్పుచేసి తెఱవగనే వాయుసూనుడు అతి సూక్ష్మరూపమును దాల్చి, అతివేగముగా ఆమె నోటిలో దూరి వెంటనే బయటికి వచ్చి, ఆమెకు నమస్కరించి, వెళ్ళుటకు అనుమతిని అడిగెను. ఆమె అనెను. "నేను నీ బుద్ధిబలకౌశలములను తెలిసికొంటిని. దాని కొఱకే దేవతలునన్ను పంపియుండిరి.
(చౌ॥ 1-6)

దో-రామ కాజు సబు కరిహహు, తుమ్హ బల బుద్ధి నిధాన ।
ఆసిష దేఇ గఈ సో, హరషి చలేఉ హనుమాన ॥ 2 ॥

నీవు శ్రీరామచంద్రుని పనులనన్నింటిని నెఱవేర్చెదవు. నీవు బుద్ధిబలములకు పెన్నిధివి", ఇట్లాశీర్వదించి, సురస తననివాసమునకు మఱలిపోయెను. హనుమంతుడు ప్రసన్నచిత్తుడై ముందునకు సాగెను. (దో॥ 2)

చౌ- నిసిచరి ఏక సింధు మహుఁ రహఈ । కరి మాయా నభు కే ఖగ గహఈ ॥
జీవ జంతు జే గగన ఉడాహీఁ । జల బిలోకి తిన్హ కై పరిఛాహీఁ ॥ 1 ॥
గహఇ ఛాహఁ సక సో న ఉడాఈ । ఏహి బిధి సదా గగనచర ఖాఈ ॥
సోఇ ఛల హనూమాన కహఁ కీన్హా । తాసు కపటు కపి తురతహిఁ చీన్హా ॥ 2 ॥
తాహి మారి మారుతసుత బీరా । బారిధి పార గయఉ మతిధీరా ॥
తహాఁ జాఇ దేఖీ బన సోభా । గుంజత చంచరీక మధు లోభా ॥ 3 ॥
నానా తరు ఫల ఫూల సుహాఏ । ఖగ మృగ బృంద దేఖి మన భాఏ ॥
సైల బిసాల దేఖి ఏక ఆగేఁ । తా పర ధాఇ చఢేఉ భయ త్యాగేఁ ॥ 4 ॥
ఉమా న కఛు కపి కై అధికాఈ । ప్రభు ప్రతాప జో కాలహి ఖాఈ ॥
గిరి పర చఢి లంకా తెహిఁ దేఖీ । కహి న జాఇ అతి దుర్గ బిసేషీ ॥ 5 ॥
అతి ఉతంగ జలనిధి చహు పాసా । కనక కోట కర పరమ ప్రకాసా ॥ 6 ॥

సముద్రములో ఒక రాక్షసి (సింహిక) నివసించుచుండెను. అది తన మాయవలన ఆకాశములో ఎగురు పక్షులను పట్టుకొనుటకు ఉపాయములను పన్నుచుండెను. ఆకాశమున తిరుగుచున్న ప్రాణులనీడలను పట్టుకొనుచుండెను. అప్పుడవి ముందుకు సాగిపోలేకయుండగా వాటిని ఆకర్షించి భక్షించుచుండెను. అదే ఉపాయమును హనుమంతునిపైగూడ ప్రయోగించెను. అతడు వెంటనే దాని మాయోపాయములను కనిపెట్టెను. ధీరబుద్ధియు, వీరుడును ఐన మారుతి ఆ సింహికను హతమార్చి, సముద్రమును దాటెను. ఆవలితీరమును జేరి, అచటి వనశోభను తిలకించెను. మధులోభముచే మధుపములు రొదచేయుచుండెను. నానా విధములైన వృక్షములు ఫలపుష్పములచే విరాజిల్లుచుండెను. పశుపక్షి సమూహములను జూచి, ఆయన మనస్సు మిక్కిలి ప్రసన్న మాయెను. ఎదుటనున్న విశాలపర్వతమును జూచి, నిర్భయముగా దానిపైకి ఎక్కెను. (శివుడు పలుకు చున్నాడు) ఉమా! ఇందు హనుమంతుని గొప్పదనమేమియులేదు. ఇదియంతయును ఆప్రభుమహిమయే. ఆయన కాలునిగూడ కడతేర్చగలడు. హనుమంతుడు పర్వతముపైనుండి లంకా నగరమును జూచెను. అక్కడ వర్ణనాతీతమైన ఒక దుర్గముండెను. అది మిక్కిలి ఎత్తైనది. దానికి నాలుగువైపుల సముద్రము ఉండెను. దానిబంగారుప్రాకారములు తమతేజస్సులను వెదజల్లుచుండెను. (చౌ॥ 1-6)

ఛం-కనక కోట బిచిత్ర మని కృత సుందరాయతనా ఘనా ।
చఉహట్ట హట్ట సుబట్ట బీథీఁ చారు పుర బహు బిధి బనా ॥

గజ బాజి ఖచ్చర నికర పదచర రథ బరూథన్హి కో గనై ।
బహురూప నిసిచర జూథ అతిబల సేన బరనత నహిం బనై ॥ 1 ॥
బన బాగ ఉపబన బాటికా సర కూప బాపీం సోహహీం ।
నర నాగ సుర గంధర్బ కన్యా రూప ముని మన మోహహీం ॥
కహుఀ మాల దేహ బిసాల సైల సమాన అతిబల గర్జహీం ।
నానా అఖారెన్హ భిరహీం బహుబిధి ఏక ఏకన్హ తర్జహీం ॥ 2 ॥
కరి జతన భట కోటిన్హ బికట తన నగర చహుఀ దిసి రచ్ఛహీం ।
కహుఀ మహిష మానుష ధేను ఖర అజ ఖల నిసాచర భచ్ఛహీం ॥
ఏహి లాగి తులసీదాస ఇన్హ కీ కథా కఛు ఏక హై కహీ ।
రఘుబీర సర తీరథ సరీరన్హి త్యాగి గతి పైహహిం సహీ ॥ 3 ॥

చిత్రవిచిత్రములైన మణులచేపొదగబడిన ఆ ప్రాకారములలోపల అనేక సుందర భవనములుండెను. వీధికూడలులు, అంగళ్ళు, వీధులు, సుందరమార్గములతో అలంకరింపబడి, ఆ నగరము చూడముచ్చటగానుండెను. ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, కంచరగాడిదలు, పదాతిదళములు మున్నగు వానితోగూడిన ఆ సైన్యమును ఎవరు లెక్కింపగలరు? కామరూపధారులైన రాక్షసగణములు వారిబలమైనసైన్యములు, వర్ణింపనలవిగాకున్నవి. వనములు, తోటలు, ఉపవనములు, లతానికుంజములు, తటాకములు, బావులు, సరస్సులు చూపరులకు ఆహ్లాదకరములుగా నున్నవి. మనుష్య, నాగ, దేవతా, గంధర్వ కన్యలు తమతమ రూపవిలాసవైభవములచే మునులమనస్సులనుగూడ దోచుకొనునట్లుండిరి. అక్కడక్కడ పర్వతాకారులైన మల్లులు గర్జించుచుండిరి. వారు పరస్పరము పెక్కురీతుల దెబ్బగొట్టుకొనుచు కయ్యమునకు కాలుదువ్వుచుండిరి. మహాకాయులై భయంకరముగానున్న పెక్కుమందియోధులు ఆనగరముయొక్క నలుదిక్కులను జాగరూకతతో రక్షించుచుండిరి. దుష్టులైనకొందఱు రాక్షసులు దున్నపోతులను, మనుష్యులను, ఆవులను, గాడిదలను, మేకలను భక్షించుచుండిరి. వీరందఱును శ్రీరామచంద్రుని బాణసమూహములనెడి తీర్థములలో శరీరములను త్యజించి, తప్పక సద్గతులను పొందెడివారే. కావున తులసీదాసు వీరినిగూర్చి చాల సంక్షిప్తముగా తెల్పెను. (ఛంద॥ 1-3)

## హనుమంతుని లంకానగర ప్రవేశము

దో-పుర రఖవారే దేఖి బహు, కపి మన కీన్హ బిచార ।
అతి లఘు రూప ధరౌం నిసి, నగర కరౌం పఇసార ॥ 3 ॥

అసంఖ్యాకులైన రక్షకభటులు నగరమును రక్షించుచుండుటను జూచి, మారుతి తనమనస్సులో ఇట్లు ఆలోచించుచుండెను. నేను మిక్కిలి సూక్ష్మరూపమును ధరించి, రాత్రియందు నగర ప్రవేశము చేయవలయును. (దో॥ 3)

చౌ- మసక సమాన రూప కపి ధరీ । లంకహి చలేఉ సుమిరి నరహరీ ॥
నామ లంకినీ ఏక నిసిచరీ । సో కహ చలేసి మోహి నిందరీ ॥ 1 ॥
జానేహి నహీఀ మరము సఠ మోరా । మోర అహార జహాఀ లగి చోరా ॥
ముఠికా ఏక మహా కపి హనీ । రుధిర బమత ధరనీఀ ఢనమనీ ॥ 2 ॥
పుని సంభారి ఉఠీ సో లంకా । జోరి పాని కర బినయ ససంకా ॥
జబ రావనహి బ్రహ్మ బర దీన్హా । చలత బిరంచి కహా మొహి చీన్హా ॥ 3 ॥
బికల హోసి తైఀ కపి కేఀ మారే । తబ జానేసు నిసిచర సంఘారే ॥
తాత మోర అతి పున్య బహూతా । దేఖేఉఀ నయన రామ కర దూతా ॥ 4 ॥

మశకసమానమైన సూక్ష్మరూపమును దాల్చి, మానవావతారమునుదాల్చిన విష్ణువును (శ్రీరాముని) స్మరించుచు హనుమంతుడు లంకలో ప్రవేశించెను. లంకాద్వారముపైనున్న 'లంకిణి' అను రాక్షసి "నా అనుమతి లేకుండ లోపల ప్రవేశించిన నీవు ఎవరు?" అని ప్రశ్నించెను. "మూర్ఖుడా! నా సంగతి నీవెఱుగవా? ప్రపంచములోని చోరులందఱును నాకు ఆహారము కావలసినదే." అనెను. మహాబలశాలియైన ఆంజనేయుడు దానిపైనొక్క ముష్టిఘాతమువేయగా అదిరక్తమునుగ్రక్కుచు నేలపై బడెను. మఱల ఆ రాక్షసి తనను తాను సంబాళించుకొని, లేచి నిలబడి, వినయముతో చేతులు జోడించి పలికెను." బ్రహ్మదేవుడు రావణునకు వరములను ఇచ్చి వెళ్ళునపుడు సంకేతముగా నాకొక మాట చెప్పియుండెను. ఒక వానరము నిన్ను ముష్టి ప్రహారములచే బాధించినపుడు రాక్షససంహారకాలము సమీపించినదని ఎఱుంగుము. 'నాయనా! శ్రీరాముని దూతను కన్నులార గాంచుట నా మహద్భాగ్యముగా తలంచుచున్నాను. (చౌ॥ 1-4)

దో- తాత స్వర్గ అపబర్గ సుఖ, ధరిఅ తులా ఏక అంగ ।
తూల న తాహి సకల మిలి, జో సుఖ లవ సతసంగ ॥ 4 ॥

నాయనా! స్వర్గమోక్షములవలన లభించు సుఖములన్నింటిని త్రాసులో ఒక ప్రక్కన ఉంచినను అవియన్నియును ఒక క్షణమాత్రము లభించిన సాధుజనసాంగత్యసుఖముతో సమానముగావు. (దో॥ 4)

చౌ- ప్రబిసి నగర కీజే సబ కాజా । హృదయఀ రాఖి కోసలపుర రాజా ॥
గరల సుధా రిపు కరహిఀ మితాఈ । గోపద సింధు అనల సితలాఈ ॥ 1 ॥
గరుడ సుమేరు రేను సమ తాహీ । రామ కృపా కరి చితవా జాహీ ॥
అతి లఘు రూప ధరేఉ హనుమానా । పైఠా నగర సుమిరి భగవానా ॥ 2 ॥
మందిర మందిర ప్రతి కరి సోధా । దేఖే జహఀ తహఀ అగనిత జోధా ॥
గయఉ దసానన మందిర మాహీఀ । అతి బిచిత్ర కహి జాత సో నాహీఀ ॥ 3 ॥

సయన కిఏఁ దేఖా కపి తేహీ । మందిర మహుఁ న దీఖి బైదేహీ ॥
భవన ఏక పుని దీఖ సుహావా । హరి మందిర తహఁ భిన్న బనావా ॥ 4 ॥

నీవు కోసలాధిపతియైన శ్రీరామచంద్రుని నీ మనస్సులో స్మరించుచు లంకలో ప్రవేశించి, నీ కార్యములనన్నింటిని నెఱవేర్చుకొనుము. (కాక భుశుండి పలుకుచున్నాడు) వైనతేయా! శ్రీరామచంద్రునికృపకుపాత్రుడైన వ్యక్తికి విషముగూడ అమృతమగును. శత్రువులు మిత్రులయ్యెదరు. సముద్రము గోష్పదమంతయగును. అగ్ని శీతలమగును. అతనికి మేరు పర్వతముగూడ సైకతరేణుతుల్యమగును. హనుమంతుడు అతి సూక్ష్మరూపమును దాల్చి రాముని స్మరించుచు నగరమున ప్రవేశించెను. అతడు ప్రతి భవనమునందును వెదకెను. అక్కడక్కడ అసంఖ్యాకులైన యోధులుండిరి. పిదప అతివిచిత్రమై వర్ణనాతీతమైన రావణునిభవనమున అడుగిడెను. గాఢనిద్రలోనున్న రావణుని అచ్చట చూచెను. కానీ సీతాదేవిజాడ కనబడలేదు. పిదప శ్రీహరిమందిరముగల ఒక మహాభవనమును గాంచెను. (చౌ॥ 1-4)

## హనుమద్విభీషణుల సమాగమము - సీతాదేవి దర్శనము

దో-రామాయుధ అంకిత గృహ, సోభా బరని న జాఇ ।
నవ తులసికా బృంద తహఁ, దేఖి హరష కపిరాఇ ॥ 5 ॥

ఆ భవనముపై శ్రీరామునిధనుర్బాణములు చెక్కబడియున్నవి. వాటిశోభలు వర్ణింపనలవికానివి. అచట నూతనములైన తులసిమొక్కలను జూచి కపివరుడు మిక్కిలి సంతసించెను. (దో॥ 5)

చౌ-లంకా నిసిచర నికర నివాసా । ఇహాఁ కహాఁ సజ్జన కర బాసా ॥
మన మహుఁ తరక కరైఁ కపి లాగా । తేహీఁ సమయ బిభీషను జాగా ॥ 1 ॥
రామ రామ తెహిఁ సుమిరన కీన్హా । హృదయఁ హరష కపి సజ్జన చీన్హా ॥
ఏహి సన హఠి కరిహఉఁ పహిచానీ । సాధు తె హోఇ న కారజ హానీ ॥ 2 ॥
బిప్ర రూప ధరి బచన సునాఏ । సునత బిభీషన ఉఠి తహఁ ఆఏ ॥
కరి ప్రనామ పూఁఛీ కుసలాఈ । బిప్ర కహహు నిజ కథా బుఝాఈ ॥ 3 ॥
కీ తుమ్హ హరి దాసన్హ మహఁ కోఈ । మోరేఁ హృదయ ప్రీతి అతి హోఈ ॥
కీ తుమ్హ రాము దీన అనురాగీ । ఆయహు మోహి కరన బడభాగీ ॥ 4 ॥

ఆ మారుతి తనమనమున ఇట్లాలోచింపసాగెను. "ఈ లంక రాక్షసులమూకలకు నివాస స్థానము. ఇచ్చట సజ్జనులు ఉండుట ఎట్లు?" ఈ విధముగా అతడు ఆలోచించుచుండగా విభీషణుడు నిద్రనుండి మేల్కొని రామనామస్మరణ చేసెను. అందువలన ఆతనిని సజ్జనునిగా గుర్తించి, హనుమంతుడు మనస్సున సంతసించెను. "ఇతనితో అవశ్యముగా పరిచయము చేసికొన వలసినదే. ఏలనన సాధుజన సాంగత్యమువలన కార్యహాని ఎన్నడును జరుగదు." అని తలంచెను. బ్రాహ్మణ రూపముధరించి, హనుమంతుడతనిని పిలిచెను. ఆ పిలుపు విని విభీషణుడు

లేచి వచ్చి, ప్రణమిల్లి, కుశలమడిగి పల్కెను. "బ్రాహ్మణోత్తమా! మీ వృత్తాంతమును దెల్పుడు. మీరు హరిభక్తులలో (నారదాదులలో) ఒకరా? లేక దీనదయాళువులైన శ్రీరామచంద్రులా? నన్ను భాగ్యశాలిగా జేయుటకు విచ్చేసినారా? మిమ్ము చూచుటవలన నా హృదయమున ప్రేమ ఉప్పొంగు చున్నది. (చౌ॥ 1-4)

దో- తబ హనుమంత కహీ సబ, రామ కథా నిజ నామ ।
సునత జుగల తన పులక మన, మగన సుమిరి గునగ్రామ ॥ 6 ॥

అపుడు హనుమంతుడు శ్రీరామునికథను పూర్తిగా తెలిపి, తన పేరును వెల్లడించెను. శ్రీరాముని గుణములను స్మరించుచు ఉభయులమనస్సులు ఆనందమున తేలియాడెను. ఇరువురితనువులు ఒక్కసారిగా పులకితములయ్యెను. (దో॥ 6)

చౌ- సునహు పవనసుత రహని హమారీ । జిమి దసనన్హి మహుఁ జీభ బిచారీ ॥
తాత కబహుఁ మోహి జాని అనాథా । కరిహహిఁ కృపా భానుకుల నాథా ॥ 1 ॥
తామస తను కఛు సాధన నాహీఁ । ప్రీతి న పద సరోజ మన మాహీఁ ॥
అబ మోహి భా భరోస హనుమంతా । బిను హరికృపా మిలహిఁ నహిఁ సంతా ॥ 2 ॥
జౌఁ రఘుబీర అనుగ్రహ కీన్హా । తౌ తుమ్హ మోహి దరసు హఠి దీన్హా ॥
సునహు బిభీషన ప్రభు కై రీతీ । కరహిఁ సదా సేవక పర ప్రీతీ ॥ 3 ॥
కహహు కవన మైఁ పరమ కులీనా । కపి చంచల సబహీఁ బిధి హీనా ॥
ప్రాత లేఇ జో నామ హమారా । తెహి దిన తాహి న మిలై అహారా ॥ 4 ॥

విభీషణుడు పలికెను. ఓ పవనకుమారా! ఇచ్చట నా ఉనికినిగూర్చి వినుము. నేను దంతముల మధ్య నాలుకవలె నిస్సహాయస్థితిలో నున్నాను. నాయనా! సూర్య వంశ ప్రభువైన శ్రీరామచంద్రుడు దిక్కులేని స్థితిలోనున్న నాపై అనుగ్రహము చూపునా? నా శరీరము తామసికమైనది. భగవత్ప్రాప్తి సాధనలనునేను ఎఱుగను. శ్రీరామచంద్రుని చరణకమలములపై ప్రీతియు నా మనస్సున లేదు. కాని ఆంజనేయా! ఆ ప్రభుకృపమాత్రము నా యెడగలదని నాకు గట్టి నమ్మకము ఏర్పడినది. ఏలనన శ్రీహరి కరుణలేనిదే సాధుసమాగమము జరుగదు. శ్రీ రఘునాథుని దయయున్నది గావుననే మీరు స్వయముగా వచ్చి నాకు మీ దర్శనమును గల్గించితిరి" హనుమంతుడు వచించెను. " విభీషణా! తనసేవకులపై నిరంతరము ప్రేమను ప్రసరింపజేయుటయే ప్రభువుయొక్క స్వభావము. మీరే వచింపుడు నేను ఉన్నతకులజుడనా? చంచలస్వభావముగల వానరుడను. దీనుడను, హీనుడను. ప్రాతఃకాలమున మాపేర్లు ఉచ్చరించినవారికి ఆదినమంతయు అన్నము దొరకదు. (ఈ విధముగ పలుకుట భక్తియందలి దైన్యభావము, ఆంజనేయుని భక్తికి పరాకాష్ఠ) (చౌ॥ 1-4)

దో- అస మైఁ అధమ సఖా సును, మోహూ పర రఘుబీర ।
కీన్హీ కృపా సుమిరి గున, భరే బిలోచన నీర ॥ 7 ॥

కాని మిత్రమా! "అధముడనైన నాపైగూడ శ్రీరామచంద్రుడు తనకృపను ప్రసరింపజేసెను." భగవంతునిగుణగణములను స్మరింపగానే హనుమంతునినయనములు ప్రేమాశ్రుపూరితములాయెను. (దో॥ 7)

చౌ- జానతహూఁ అస స్వామి బిసారీ । ఫిరహిఁ తె కాహె న హోహిఁ దుఖారీ ॥
ఏహి బిధి కహత రామ గున గ్రామా । పావా అనిర్బాచ్య బిశ్రామా ॥ 1 ॥
పుని సబ కథా బిభీషన కహీ । జెహి బిధి జనకసుతా తహఁ రహీ ॥
తబ హనుమంత కహా సును భ్రాతా । దేఖీ చహఉఁ జానకీ మాతా ॥ 2 ॥
జుగుతి బిభీషన సకల సునాఈ । చలేఉ పవనసుత బిదా కరాఈ ।
కరి సోఇ రూప గయఉ పుని తహవాఁ । బన అసోక సీతా రహ జహవాఁ ॥ 3 ॥
దేఖి మనహి మహుఁ కీన్హ ప్రనామా । బైఠెహిఁ బీతి జాత నిసి జామా ॥
కృస తను సీస జటా ఏక బేనీ । జపతి హృదయఁ రఘుపతి గున శ్రేనీ ॥ 4 ॥

"ఇవి యన్నియు తెలిసియు అట్టి స్వామిని మఱచి, విషయ వాసనలయందు భ్రమించువారు దుఃఖితులుగాక యుందురా?" ఈ విధముగా శ్రీరామునిమహాత్మ్యమును వర్ణించుచు ఆంజనేయుడు అనిర్వచనీయపరమశాంతిని పొందెను. పిమ్మట విభీషణుడు జానకీదేవి అక్కడ (లంకలో) ఏ విధముగ నున్నదియు – విపులముగా దెలిపెను. అప్పుడు హనుమంతుడు విభీషణునితో "సోదరా! నేను జానకీ మాతను దర్శింపవలెను" అని నుడివెను. విభీషణుడు అతనికి ఉపాయములనన్నింటిని తెలిపెను. హనుమంతుడు ఆయనకడ సెలవుగైకొని, అటనుండి బయలు దేఱెను. పిదప సూక్ష్మరూపమును దరించి, సీతాదేవియున్న అశోకవనమునకు పోయెను. ఆమెను చూడగనే మారుతి తనమనస్సులోనే ఆమెకు ప్రణామములను ఆచరించెను. రాత్రియంతయు ఆమె ఒకేవిధముగా కూర్చొనియున్నట్లు గమనించెను. ఆమెశరీరము కృశించియుండెను. తలపైనికేశములు జడలుగట్టి ఒకే కొప్పుగా ఉండెను. ఆమె నిరంతరము శ్రీ రఘునాథునినాను గుణములనే స్మరించుచుండెను. (చౌ॥ 1-4)

దో- నిజ పద నయన దిఏఁ మన, రామ పద కమల లీన ।
పరమ దుఖీ భా పవనసుత, దేఖి జానకీ దీన ॥ 8 ॥

ఆమె తన దృష్టిని నిజపాదములపై నుంచి, మనస్సును మాత్రము శ్రీరాముని చరణకమలములపై నిలిపెను. ఖిన్నురాలైన జానకీదేవిని జూచి, పావనియు మిక్కిలి విచారపడెను. (దో॥ 8)

## రావణుని బెదరింపు - సీత హెచ్చరిక

చౌ- తరు పల్లవ మహుఁ రహా లుకాఈ । కరఇ బిచార కరౌఁ కా భాఈ ॥
తెహి అవసర రావను తహఁ ఆవా । సంగ నారి బహు కిఏఁ బనావా ॥ 1 ॥
బహు బిధి ఖల సీతహి సముఝావా । సామ దాన భయ భేద దెఖావా ॥
కహ రావను సును సుముఖి సయానీ । మందోదరీ ఆది సబ రానీ ॥ 2 ॥

తవ అనుచరీఁ కరఉఁ పన మోరా । ఏక బార బిలోకు మమ ఓరా ॥
తృన ధరి ఓట కహతి బైదేహీ । సుమిరి అవధపతి పరమ సనేహీ॥ 3 ॥
సును దసముఖ ఖద్యోత ప్రకాసా । కబహుఁ కి నలినీ కరఇ బికాసా ॥
అస మన సముఝు కహతి జానకీ । ఖల సుధి నహిఁ రఘుబీర బాన కీ ॥ 4 ॥
సఠ సూనేఁ హరి ఆనెహి మోహీ । అధమ నిలజ్జ లాజ నహిఁ తోహీ ॥ 5 ॥

హనుమంతుడు చెట్లఆకులమధ్య దాగుకొని కూర్చుండి "ఈమె యొక్క దుఃఖమును తొలగించుటకు నేనేమి చేయవలయును?" అని ఆలోచింపసాగెను. అదే సమయమున వివిధాలంకార భూషితులైన స్త్రీలతోపాటు రావణుడు అచటికి వచ్చెను. దుష్టరావణుడు సీతాదేవికి అనేక విధముల నచ్చజెప్ప ప్రయత్నించెను. సామ, దాన, భయ భేదోపాయములతో ఆమెను తన వైపు త్రిప్పుకొనజూచెను. ఇంకను అతడు ఇట్లు నుడివెను. " ఓ సుముఖీ, బుద్ధిమతీ! వినుము. మండోదరి మున్నగు రాణులనందఱిని నీకు దాసీలనుగా జేసెదను. ఇదియే నాప్రతిజ్ఞ. ఒక్కసారి నావైపు చూడుము." జానకీదేవి తనప్రాణేశ్వరుడైన శ్రీరాముని స్మరించి, ఒక గడ్డిపోచను ముందుంచుకొని పలికెను. "ఓ దశాననా! వినుము. మిణుగురు పురుగు ప్రకాశముతో కమలము వికసించునా? నీవు మిణుగురు పురుగుతో సమానము - అని తెలిసికొనుము. దుష్టుడా! శ్రీరఘు వీరుని బాణములశక్తి నీ వెఱుగవా? శఠుడా! ఒంటరిగా నున్న నన్ను అపహరించి తీసికొని వచ్చితివి. నీచుడా! నీకు సిగ్గులేదా! (చౌ॥ 1-5)

దో- ఆపుహి సుని ఖద్యోత సమ, రామహి భాను సమాన ।
పరుష బచన సుని కాఢి అసి, బోలా అతి ఖిసిఆన ॥ 9 ॥

తనను మిణుగురుపురుగుతోడను, శ్రీరామచంద్రుని సూర్యునితోడను పోల్చుచు సీతాదేవి పలికిన కఠోరవచనములను విని, రావణుడు సిగ్గుపడుచు తనకరవాలమును గైకొని, కోపముతో పలికెను. (దో॥ 9)

చౌ-సీతా తైఁ మమ కృత అపమానా । కటిహఉఁ తవ సిర కఠిన కృపానా ॥
నాహిఁ త సపది మాను మమ బానీ । సుముఖి హోతి న త జీవన హానీ ॥ 1 ॥
స్యామ సరోజ దామ సమ సుందర । ప్రభు భుజ కరి కర సమ దసకంధర ॥
సో భుజ కంఠ కి తవ అసి ఘోరా । సును సఠ అస ప్రవాన పన మోరా ॥ 2 ॥
చంద్రహాస హరు మమ పరితాపం । రఘుపతి బిరహ అనల సంజాతం ॥
సీతల నిసిత బహసి బర ధారా । కహ సీతా హరు మమ దుఖ భారా ॥ 3 ॥
సునత బచన పుని మారన ధావా । మయతనయాఁ కహి నీతి బుఝావా ॥
కహేసి సకల నిసిచరిన్హ బోలాఈ । సీతహి బహు బిధి త్రాసహు జాఈ ॥ 4 ॥
మాస దివస మహుఁ కహా న మానా । తౌ మైఁ మారబి కాఢి కృపానా ॥ 5 ॥

"ఓ సీతా! నీవు నన్ను అవమానించితివి. ఈ కఠోర ఖడ్గముచే నీ శిరస్సును ఖండించెదను. ఓ సుముఖీ! ఇప్పటికైనను నా మాటను అంగీకరింపుము. లేనిచో ప్రాణములపై ఆశ వదలు కొనుము." సీతాదేవి నుడివెను

"ఓదశకంఠా! నీలకమలములహారమువలె సుందరములై, ఏనుగు తొండమువలె బలిష్ఠములును, విశాలములునైన నాస్వామిబాహువులు నా కంఠమును అలంకరించును. లేనిచో నీ కరవాలమైనను నాకంఠమును ఖండించును. వినుము. ఇదియే నా నిజమైన ప్రతిజ్ఞ. ఓ చంద్రహాసమా! (ఖడ్గమా!) శ్రీరామవియోగాగ్నివలన కలిగిన నాసంతాపమును చల్లార్చుము. ఖడ్గమా! నీ ధార తీక్ష్ణమైనది, శీతలమైనది, తిరుగులేనిది. నా దుర్భరదుఃఖమును హరింపుము".

సీతాదేవి పలుకులను విని రావణుడామెను చంపుటకు ఉద్యుక్తుడాయెను. అపుడు మయుని పుత్రికయైన మండోదరి అతనిని వారించుచు నీతి వాక్యములతో సమాధాన పఱచెను. రావణుడు రాక్షస స్త్రీలను పిలిచి, "మీరందఱును సీతను అనేకవిధముల భయపెట్టుడు" అని ఆజ్ఞాపించెను. " ఒక మాసములోగా నామాటలను అంగీకరింపనిచో ఈమెను నా ఖడ్గమునకు బలియిచ్చెదను. (చౌ॥ 1-5)

దో- భవన గయఉ దసకంధర, ఇహాఁ పిసాచిని బృంద ।
సీతహి త్రాస దేఖావహిఁ, ధరహిఁ రూప బహు మంద ॥ 10 ॥

ఈ విధముగా పలికి, రావణుడు తన భవనమునకు వెళ్లెను. ఇచట భయంకరాకారలైన రాక్షస స్త్రీలు సీతాదేవిని అనేక విధముల భయపెట్టసాగిరి. (దో॥ 10)

## త్రిజటాస్వప్నము

చౌ- త్రిజటా నామ రాచ్ఛసీ ఏకా । రామ చరన రతి నిపున బిబేకా ॥
సబన్హౌ బోలి సునాఏసి సపనా । సీతహి సేఇ కరహు హిత అపనా ॥ 1 ॥
సపనేఁ బానర లంకా జారీ । జాతుధాన సేనా సబ మారీ ॥
ఖర ఆరూఢ నగన దససీసా । ముండిత సిర ఖండిత భుజ బీసా ॥ 2 ॥
ఏహి బిధి సో దచ్ఛిన దిసి జాఈ । లంకా మనహుఁ బిభీషన పాఈ ॥
నగర ఫిరీ రఘుబీర దోహాఈ । తబ ప్రభు సీతా బోలి పఠాఈ ॥ 3 ॥
యహ సపనా మైఁ కహఉఁ పుకారీ । హోఇహి సత్య గఏఁ దిన చారీ ॥
తాసు బచన సుని తే సబ డరీఁ । జనకసుతా కే చరనన్హి పరీఁ ॥ 4 ॥

వారిలో 'త్రిజట' అను ఒక రాక్షస స్త్రీ యుండెను. ఆమె వివేకవతి, శ్రీరామచరణములయందు అనురాగము గలది. ఆమె వారినందఱిని పిలిచి, తన స్వప్నమును గూర్చి తెలుపుచు "సీతాదేవికి సేవచేసినచో మీకు మేలు కలుగును." అని పలికెను. "ఒక వానరము లంకను పూర్తిగా కాల్చివేయుటను నేను స్వప్నమున జూచితిని. రాక్షససేనయంతయు నశించెను. రావణుడు దిగంబరుడై గాడిదనెక్కి పోవుచుండెను. అతని శిరస్సులన్నియు ముండనము గావింపబడినవి. ఇరువది భుజములును ఖండింపబడినవి. అతడు దక్షిణదిశగా యమపురికి పోవుచుండెను. లంకారాజ్యమునకు విభీషణుడు రాజయ్యెను. శ్రీరామచంద్రుని విజయమునుగూర్చి నగరమున చాటింపు వేయబడెను. అపుడు ప్రభువు సీతాదేవికై వార్తను పంపెను. ఈ స్వప్నము కొలది దినములలో నిజమగును.

ఇది ముమ్మాటికి జరిగితీరునని నా నమ్మకము." ఆమె మాటలకు రాక్షస స్త్రీలందఱును భయపడి, జానకీ దేవి పాదములపై బడిరి. (చౌ॥ 1-4)

దో- జహఁ తహఁ గఈఁ సకల తబ, సీతా కర మన సోచ ।
మాస దివస బీతేఁ మొహి, మారిహి నిసిచర పోచ ॥ 11 ॥

పిమ్మట వారందఱును వేర్వేఱు దిశలకు వెళ్లిపోయిరి. సీతాదేవి తనలో తాను ఆలోచింపసాగెను. "ఒకనెల తరువాత ఈ రాక్షసాధముడు నన్ను వధించును". (దో॥ 11)

చౌ- త్రిజటా సన బోలీఁ కర జోరీ । మాతు బిపతి సంగిని తైఁ మోరీ ॥
తజౌఁ దేహ కరు బేగి ఉపాఈ । దుసహ బిరహు అబ నహిఁ సహి జాఈ ॥ 1 ॥
ఆని కాఠ రచు చితా బనాఈ । మాతు అనల పుని దేహి లగాఈ ॥
సత్య కరహి మమ ప్రీతి సయానీ । సునై కో శ్రవన సూల సమ బానీ ॥ 2 ॥
సునత బచన పద గహి సముఝాఏసి । ప్రభు ప్రతాప బల సుజసు సునాఏసి ॥
నిసి న అనల మిల సును సుకుమారీ । అస కహి సో నిజ భవన సిధారీ ॥ 3 ॥
కహ సీతా బిధి భా ప్రతికూలా । మిలిహి న పావక మిటిహి న సూలా ॥
దేఖిఅత ప్రగట గగన అంగారా । అవని న ఆవత ఏకఉ తారా ॥ 4 ॥
పావకమయ ససి స్రవత న ఆగీ । మానహుఁ మోహి జాని హతభాగీ ॥
సునహి బినయ మమ బిటప అసోకా । సత్య నామ కరు హరు మమ సోకా ॥ 5 ॥
నూతన కిసలయ అనల సమానా । దేహి అగిని జని కరహి నిదానా ॥
దేఖి పరమ బిరహాకుల సీతా । సో ఛన కపిహి కలప సమ బీతా ॥ 6 ॥

సీతాదేవి చేతులు జోడించి, త్రిజటతో పలికెను. "మాతా! ఈ దుఃఖసమయమున నీవే నాకు తోడునీడ. ఈ నా తనువు చాలించుటకు నీవే ఏదైననొక ఉపాయమును వెంటనే దెల్పుము. ఈ విరహవేదనను ఇంక నేను భరింపజాలను. కట్టెలను దెచ్చి, చితిని బేర్చి నిప్పంటించుము. ఓ బుద్ధిమతీ! నా పతిభక్తిని నిరూపించుకొననిమ్ము. శూలములవంటి రావణుని పలుకులను నేను వినజాలను." సీతాదేవి మాటలనువిని, త్రిజట ఆమె పాదములపై బడి, ఆమెను సమాధాన పఱచెను. శ్రీరామచంద్రుని బలపరాక్రమములను, కీర్తిని కొనియాడెను. " ఓసుకుమారీ! వినుము. రాత్రివేళలలో అగ్ని లభింపదు." అని పలికి ఆమె తన నివాసమునకు వెళ్లెను. అపుడు సీతాదేవి తన మనసులో ఇట్లు ఆలోచించెను. "విధాతయే నాకు ప్రతికూలుడు ఐనాడు. ఈ స్థితిలో నేనేమి చేయగలను? నిప్పుదొరకదు. బాధ తొలగదు. ఆకాశమున నిప్పులు (తారకలు) వెలుగుచున్నవి. కాని ఒక్కటిగూడ భూమిపై బడుటలేదు. చంద్రుడు పావక (అగ్ని) మయుడైనను, నేను అభాగ్యురాలను. అని తెలిసికొని, అతడును అగ్నిని ప్రకటించుటలేదు. ఓ అశోకవృక్షమా! నీవైనను నా వినతిని ఆలకింపుము. నా శోకమును హరించి, నీ పేరును సార్థకము చేసికొనుము. నీ నూతన కోమలపల్లవములు అగ్నివలె ఎఱ్ఱగా నున్నవి. ఎట్టి సంకోచమును పెట్టుకొనక అగ్నినిమ్ము. నా విరహబాధను

ఉపశమింపజేయుము." ఈ విధముగా మిక్కిలి వ్యాకులపడుచున్న సీతాదేవిని చూచిన హనుమంతుడు క్షణమొక కల్పముగా గడిపెను. (చౌ॥ 1-6)

# ముద్రికా ప్రదానము - హనుమత్సందేశము

సో- కపి కరి హృదయఀ బిచార, దీన్హి ముద్రికా డారి తబ ।
జను అసోక అంగార, దీన్హ హరషి ఉఠి కర గహెఉ ॥ 12 ॥

అప్పుడు హనుమంతుడు కొద్దిసేపు ఆలోచించి, పైనుండి శ్రీరాముని ఉంగరమును సీతాదేవిముందు పడవేసెను. తన ప్రార్థనను ఆలకించి అశోకవృక్షము నిప్పుకణమును పడవేసినదని భావించి, సీతాదేవి ప్రసన్నచిత్తయై ఆ యుంగరమును తన చేతిలోనికి దీసికొనెను! (సో॥ 12)

చౌ- తబ దేఖీ ముద్రికా మనోహర । రామ నామ అంకిత అతి సుందర ॥
చకిత చితవ ముదరీ పహిచానీ । హరష బిషాద హృదయఀ అకులానీ ॥ 1 ॥
జీతి కొ సకఇ అజయ రఘురాఈ । మాయా తేఀ అసి రచి నహిఀ జాఈ ॥
సీతా మన బిచార కర నానా । మధుర బచన బోలెఉ హనుమానా ॥ 2 ॥
రామచంద్ర గున బరనైఀ లాగా । సునతహిఀ సీతా కర దుఖ భాగా ॥
లాగీఀ సునైఀ శ్రవన మన లాఈ । ఆదిహు తేఀ సబ కథా సునాఈ ॥ 3 ॥
శ్రవనామృత జెహిఀ కథా సుహాఈ। కహీ సొ ప్రగట హోతి కిన భాఈ ॥
తబ హనుమంత నికట చలి గయఊ । ఫిరి బైఠీఀ మన బిసమయ భయఊ । 4 ॥
రామ దూత మైఀ మాతు జానకీ । సత్య సపథ కరునానిధాన కీ ॥
యహ ముద్రికా మాతు మైఀ ఆనీ । దీన్హి రామ తుమ్హ కహఀ సహిదానీ ॥ 5 ॥
నర బానరహి సంగ కహు కైసేఀ । కహీ కథా భఇ సంగతి జైసేఀ ॥ 6 ॥

శ్రీరామనామాంకితమైన సుందరమైన ఆ ఉంగరమును ఆమె గుర్తించి, ఆశ్చర్యచకితయై తదేకదృష్టితో చూడసాగెను. హర్ష విషాదములచే హృదయమున ఆందోళన పడి ఆలోచింపసాగెను. "శ్రీ రఘునాథుడు అజేయుడు. ఆయనను ఎవ్వరూ జయింపజాలరు. ఇట్టి దివ్యమైన చిన్మయమైన అంగుళీయకమును ఎవ్వరును కల్పింపలేరు." అని ఆమె తర్కించుకొనుచుండగా ఆంజనేయుడు తనమధురవచనములతో శ్రీరామచంద్రుని గుణములను వర్ణింపసాగెను. వానిని విని, సీతాదేవి దుఃఖము మటుమాయమయ్యెను. ఆమె దానియందే మనసును లగ్నముచేసి, చెవులప్పగించి, వినసాగెను. పవనపుత్రుడు శ్రీరామగాథను ప్రారంభమునుండియు వినిపించెను. "శ్రవణామృతమైన ఈ మనోహరగాథను వినిపించినదెవరు? నా యెదుటకేలరారు?" అని సీతాదేవి నుడివెను. అప్పుడు మారుతి ఆమె సమీపమునకు వచ్చెను. అంతట సీతాదేవి భయ విస్మయములతో ముఖమును ప్రక్కకు దిప్పుకొనెను అప్పుడు హనుమంతుడు పలికెను. "మాతా! జానకీదేవీ! నేను శ్రీరామచంద్రుని దూతను. కరుణానిధియైన ఆ స్వామిపై

ఆన. ఇది సత్యము తల్లీ! ఈ యుంగరమును నేనే తెచ్చితిని. ఆ ప్రభువు మీ కొఱకై దీనిని ఆనవాలుగా నాకిచ్చి పంపినారు." సీతాదేవి నుడివెను "నరవానరులకు సమాగమము ఎట్లు జరిగినది? తెల్పుము" అప్పుడు ఆ పావని జరిగిన సంఘటనలనన్నింటిని పూర్తిగా వివరించెను. (చౌ॥ 1-6)

దో- కపి కే బచన సప్రేమ సుని, ఉపజా మన బిస్వాస ।
జానా మన క్రమ బచన యహ, కృపాసింధు కర దాస ॥ 13 ॥

ఆంజనేయుని ప్రేమైకవచనములను విని, ఆమెకతనిపై సంపూర్ణ విశ్వాసము కుదురుకొనెను. కృపాళువైన శ్రీరామునకు ఇతడు త్రికరణ శుద్ధిగా నిజమైన దాసుడు". అని ఆమె తలంచెను. (దో॥ 13)

చౌ- హరిజన జాని ప్రీతి అతి గాఢీ । సజల నయన పులకావలి బాఢీ ॥
బూడత బిరహ జలధి హనుమానా । భయహు తాత మో కహుఁ జలజానా ॥ 1 ॥
అబ కహు కుసల జాఉఁ బలిహారీ । అనుజ సహిత సుఖ భవన ఖరారీ ॥
కోమలచిత కృపాల రఘురాఈ । కపి కెహి హేతు ధరీ నిఠురాఈ ॥ 2 ॥
సహజ బాని సేవక సుఖదాయక । కబహుఁక సురతి కరత రఘునాయక ॥
కబహుఁ నయన మమ సీతల తాతా । హోఇహహిఁ నిరఖి స్యామ మృదు గాతా ॥ 3 ॥
బచను న ఆవ నయన భరే బారీ । అహహ నాథ హౌఁ నిపట బిసారీ ॥
దేఖి పరమ బిరహాకుల సీతా । బోలా కపి మృదు బచన బినీతా ॥ 4 ॥
మాతు కుసల ప్రభు అనుజ సమేతా । తవ దుఖ దుఖీ సుకృపానికేతా ॥
జని జననీ మానహు జియఁ ఊనా । తుమ్హ తే ప్రేము రామ కేఁ దూనా ॥ 5 ॥

భగవంతుని సేవకుడని తెలిసిన పిమ్మట ఆతనియెడ ఆమెప్రీతి ఇనుమడించెను. నేత్రములు ఆనందాశ్రువులతో నిండెను. తనువు పులకితమయ్యెను. సీతాదేవి వచించెను. "నాయనా! మారుతీ! నేను ప్రమాణపూర్వకముగా చెప్పుచున్నాను. విరహసముద్రములో మునిగిపోవుచున్న నన్ను రక్షించుటకు నీవు నిజముగా ఓడనైతివి. ఖరారియు, సుఖనిధానము అగు శ్రీరాముని కుశలమును, ఆయనతమ్ముడగు లక్ష్మణునిక్షేమమును ఇప్పుడు వినిపింపుము. శ్రీ రఘునాథుడు కోమల స్వభావుడు, దయాళువు. ఆంజనేయా! ఇపుడు ఆయన నాయెడ నిష్ఠురత్వమును వహించుటకు కారణమేమి? తనసేవకులకు సుఖశాంతులను గూర్చుటయే ఆయనకు సహజలక్షణము. శ్రీరఘువరుడు ఎప్పుడైనను నన్ను జ్ఞాపకము చేసికొనుచుండునా? నాయనా! నా కన్నులు వారి కోమలశ్యామలశరీరమును జూచి శాంతిని పొందునా?" సీతాదేవి ఇట్లు నుడువుచుండగనే ఆమె నేత్రములయందు విరహాశ్రువులు నిండెను. అంతట ఆమె శోకతప్త ఆయెను. "హా నాథా! మీరు నన్ను పూర్తిగా విస్మరించినారు." అని పరిపరివిధముల పరితపింపసాగెను. సీతాదేవి విరహాకులిత యగుటను జూచి, హనుమంతుడు తనవినమ్రమృదువచనములను పలికెను. "తల్లీ! అత్యంత కరుణానిధియైన శ్రీరామచంద్రుడు సోదరుడైన లక్ష్మణునితో గూడి కుశలముగా ఉన్నాడు. కాని మీ విరహమువలన దుఃఖితుడై యున్నాడు. మీరు మీ మనస్సున చిన్నబుచ్చుకొనవలదు. శ్రీరామచంద్రునిపై మీకు గల ప్రేమకు రెండింతలప్రేమ ఆయనకు మీపై గలదు.

(చౌ॥ 1-5)

దో- రఘుపతి కర సందేసు అబ, సును జననీ ధరి ధీర ।
అస కహి కపి గదగద భయఉ, భరే బిలోచన నీర ॥ 14 ॥

మాతా! ఇప్పుడు శ్రీరఘునాథుని సందేశమును నిబ్బరముగా వినుడు. "ఇట్లు పలికుచు మారుతి ప్రేమపరవశుడాయెను. అతని తనువున పులకలెత్తెను. కన్నుల నీరునిండెను. (దో॥ 14)

చౌ- కహేఉ రామ బియోగ తవ సీతా । మో కహుఀ సకల భఏ బిపరీతా ॥
నవ తరు కిసలయ మనహుఀ కృసానూ । కాల నిసా సమ నిసి ససి భానూ ॥ 1 ॥
కుబలయ బిపిన కుంత బన సరిసా । బారిద తపత తేల జను బరిసా ॥
జే హిత రహే కరత తెఇ పీరా । ఉరగ స్వాస సమ త్రిబిధ సమీరా ॥ 2 ॥
కహేహూ తేఀ కఛు దుఖ ఘటి హోఈ । కాహి కహౌఀ యహ జాన న కోఈ ॥
తత్త్వ ప్రేమ కర మమ అరు తోరా । జానత ప్రియా ఏకు మను మోరా ॥ 3 ॥
సో మను సదా రహత తోహి పాహీఀ । జాను ప్రీతి రసు ఏతనేహి మాహీఀ ॥
ప్రభు సందేసు సునత బైదేహీ । మగన ప్రేమ తన సుధి నహిఀ తేహీ ॥ 4 ॥
కహ కపి హృదయఀ ధీర ధరు మాతా । సుమిరు రామ సేవక సుఖదాతా ॥
ఉర ఆనహు రఘుపతి ప్రభుతాఈ । సుని మమ బచన తజహు కదరాఈ ॥ 5 ॥

"అమ్మా ఇవి శ్రీ రఘువరుని పలుకులు ' ఓ సీతా! నీ విరహకారణమున నాకు చరాచరములన్నియును ప్రతికూలములై యొప్పుచున్నవి. వృక్షముల లేలేత కిసలయములుగూడ నిప్పుకణికలైనవి. రాత్రులు కాళరాత్రులైనవి. చంద్రుడు సూర్యునివలె తపింపజేయుచున్నాడు. కలువవనములు ఈటెలవలె బాధించుచున్నవి. మేఘములు మఱుగుచున్న తైలమును వర్షించు చున్నట్లున్నవి. నా హితకారులును నన్ను బాధించు చుండిరి. శీతల మంద సుగంధ పవనములు పాముల బుసలవలె భయంకరములై తాపకారకములగుచున్నవి. ఇతరులతో చెప్పి కొనుటవలన దుఃఖము కొంచెము ఉపశమించును. కాని ఎవరితో చెప్పికొనగలను? దీనిని ఎవ్వరును అర్థము చేసికొనలేరు. ప్రియా! మన ప్రేమతత్త్వము నా మనస్సునకే తెలియును. కాని ఆ మనస్సు నీ యొద్దనే యున్నది. ఇదియే నా ప్రేమసారము- అని యెఱుంగుము.' "అమ్మా! ఇదియే ప్రభు సందేశము" ఈ మాటలను వినగానే సీతమ్మ ప్రేమాకులితయై తనశరీరస్మృతినే కోల్పోయెను. హనుమంతుడు పలికెను. "మాతా! మనస్సును చిక్కబట్టుకొనుము. సేవకులకు సుఖప్రదాతయగు శ్రీరామచంద్రుని స్మరింపుము. స్వామిమహిమను ధ్యానింపుము. కలవర పాటును త్యజింపుము.

(చౌ॥ 1-5)

దో- నిసిచర నికర పతంగ సమ, రఘుపతి బాన కృసాను ।
జననీ హృదయఀ ధీర ధరు, జరే నిసాచర జాను ॥ 15 ॥

ఈ రాక్షససమూహములు శలభములతో సమానములు. శ్రీరాముని బాణాగ్నికి అవి ఆహుతి కాగలవు. తల్లీ! ధైర్యము వహింపుము. ఈరాక్షసులు నశించినారనియే భావింపుము. (దో॥ 15)

చౌ- జౌం రఘుబీర హోతి సుధి పాఈం । కరతే నహిం బిలంబు రఘురాఈం ॥
రామ బాన రబి ఉఏం జానకీ । తమ బరూథ కహం జాతుధాన కీ ॥ 1 ॥
అబహిం మాతు మైం జాఉం లవాఈం । ప్రభు ఆయసు నహిం రామ దొహాఈం ॥
కఛుక దివస జననీ ధరు ధీరా । కపిన్హ సహిత అఇహహిం రఘుబీరా ॥ 2 ॥
నిసిచర మారి తోహి లై జైహహిం । తిహుం పుర నారదాది జసు గైహహిం ॥
హైం సుత కపి సబ తుమ్హహి సమానా । జాతుధాన అతి భట బలవానా ॥ 3 ॥
మోరేం హృదయ పరమ సందేహా । సుని కపి ప్రగట కీన్హి నిజ దేహా ॥
కనక భూధరాకార సరీరా । సమర భయంకర అతిబల బీరా ॥ 4 ॥
సీతా మన భరోస తబ భయఊ । పుని లఘు రూప పవనసుత లయఊ ॥ 5 ॥

శ్రీరామచంద్రుడు మీ సమాచారమును ఎఱిగియుండినట్లైతే వారు ఏమాత్రము ఆలస్యము (విలంబము) చేసియుండెడి వారుకారు. ఓ సీతమ్మ తల్లీ! శ్రీరాముని బాణములనెడి సూర్యుని కిరణముల ధాటికి ఈ రాక్షస సేన యనెడి చీకటి నిలువ గలదా? మాతా! నేనే మిమ్ములను ఇక్కడ నుండి తీసికొని పోయి ఉండెడి వాడను. కాని అందులకు ప్రభునాజ్ఞ లేదు. ఇది ముమ్మాటికి నిజము. జననీ! కొన్ని దినముల వఱకు ఓపిక పట్టుము. ప్రభువు వానరులతోగూడి త్వరలో ఇచ్చటికి రాగలడు. రాక్షసులను సంహరించి, మిమ్ము ఇక్కడినుండి తీసికొని వెళ్లగలడు. నారదాదిమహర్షులు ముల్లోకములలో ఆయనకీర్తిని గానము చేయుదురు." ఈ మాటలను విని, సీతాదేవి పలికెను. "కుమారా! వానరులందఱును నీవలె చిన్నవారై యుందురు గదా! రాక్షసులు మిగుల బలవంతులు, యోధులు, అందుచే నాకు మిక్కిలి సంశయము కలుగుచున్నది." ఇది వినగానే హనుమంతుడు తన శరీరమును పెంచెను. అది బంగారువన్నె గలిగి మేరుపర్వతసమానముగా ఉండెను. మహాబలిష్ఠమై, పరాక్రమశోభితమై అది అరివీరభయంకరమై, ఒప్పుచుండెను. సీతాదేవి మనస్సు కుదుటబడెను, విశ్వాసము బలపడెను. హనుమంతుడు మఱల లఘు రూపమును ధరించెను. (చౌ॥ 1-5)

దో- సును మాతా సాఖామృగ, నహిం బల బుద్ధి బిసాల ।
ప్రభు ప్రతాప తేం గరుడహి, ఖాఇ పరమ లఘు బ్యాల ॥ 16 ॥

"జననీ! వినుడు. వానరులకు ఎక్కువగా బుద్ధి బలములు ఉండవు. కాని ప్రభుమహిమవలన చిన్నపాము గూడ గరుడుని తినివేయగలదు (అనగా మిక్కిలి దుర్బలుడు గూడ గొప్ప బలవంతుని చంపివేయగలడు) (దో॥ 16)

చౌ- మన సంతోష సునత కపి బానీ । భగతి ప్రతాప తేజ బల సానీ ॥
ఆసిష దీన్హి రామప్రియ జానా । హోహు తాత బల సీల నిధానా ॥ 1 ॥
అజర అమర గుననిధి సుత హోహూ । కరహుం బహుత రఘునాయక ఛోహూ ॥
కరహుం కృపా ప్రభు అస సుని కానా । నిర్భర ప్రేమ మగన హనుమానా ॥ 2 ॥
బార బార నాఏసి పద సీసా । బోలా బచన జోరి కర కీసా ॥
అబ కృతకృత్య భయఉం మైం మాతా । ఆసిష తవ అమోఘ బిఖ్యాతా ॥ 3 ॥

మీపాదపద్మముల దర్శన ప్రభావమున నేనిపుడు క్షేమముగా ఉన్నాను. నా మహాభయమంతయును దూరమైనది. ఓ కృపాళూ! మీ దయకు పాత్రులైనవారిని తాపత్రయములు వెంటాడజాలవు. నేను అధమ స్వభావముగల రాక్షసుడను. నేనెన్నడును పుణ్యకార్యములను ఆచరింపలేదు. మీ రూపము మునీశ్వరులుకును, సామాన్యముగా ధ్యానగోచరము గాదు. అట్టి మీరు స్వయముగా ప్రసన్నులై నాకు ఆలింగన సుఖానందములను అనుగ్రహించితిరి. (చౌ॥ 1-4)

దో- అహోభాగ్య మమ అమిత అతి, రామ కృపా సుఖ పుంజ ।
దేఖెఉఁ నయన బిరంచి సివ, సేబ్య జుగల పద కంజ ॥ 47 ॥

శ్రీరామా! కృపాసుఖస్వరూపా! నా భాగ్యమును ఎంతని కొనియాడెదను? బ్రహ్మ, మహేశ్వరులచే సేవింపబడు మీ చరణకమలద్వయమును దర్శించితిని. (దో॥ 47)

చౌ- సునహు సఖా నిజ కహఉఁ సుభాఊ । జాన భుసుండి సంభు గిరిజాఊ ॥
జౌఁ నర హోఇ చరాచర ద్రోహీ । ఆవై సభయ సరన తకి మోహీ ॥ 1 ॥
తజి మద మోహ కపట ఛల నానా । కరఉఁ సద్య తేహి సాధు సమానా ॥
జననీ జనక బంధు సుత దారా । తను ధను భవన సుహృద పరివారా ॥ 2 ॥
సబ కై మమతా తాగ బటోరీ । మమ పద మనహి బాఁధ బరి డోరీ ॥
సమదరసీ ఇచ్ఛా కఛు నాహీఁ । హరష సోక భయ నహిఁ మన మాహీఁ ॥ 3 ॥
అస సజ్జన మమ ఉర బస కైసేఁ । లోభీ హృదయఁ బసఇ ధను జైసేఁ ॥
తుమ్హ సారిఖే సంత ప్రియ మోరేఁ । ధరఉఁ దేహ నహిఁ ఆన నిహోరేఁ ॥ 4 ॥

శ్రీరామచంద్రుడు ఇట్లనెను. "మిత్రమా! వినుము. కాకభుశుండి, ఉమా మహేశ్వరులెఱిగిన నా స్వభావమును నీకు తెల్పెదను. చరాచర జగత్తునకు ద్రోహము చేసియు, భయకంపితుడై నా శరణు జొచ్చి, మదము, మోహము, మోసము, కపటము మొదలగు అవగుణములను త్యజించిన వాడు నా అనుగ్రహమున సజ్జనుడు అగును. తల్లిదండ్రులు, సోదరులు, పుత్రులు, భార్య, శరీరము, సంపదలు, మిత్రులు, పరివారములు, గృహములు మున్నగు వానిపైగల మమకారములను ఒకే త్రాడుగా పేని నాచరణములకు బంధించు వాడును (అనగా వాటన్నింటిపై గల ప్రేమను నాకు సమర్పించు వాడును) సమదర్శియు, హర్ష, శోక, భయ, వాంఛలు లేనివాడును ఐన సజ్జనుడు-లోభివాని మనస్సున ధనమువలె నా హృదయమున వసించును. నీ వంటి సజ్జనులే నాకు ప్రాణ ప్రియులు. సజ్జనుల రక్షణమునకే నేను అవతరించుచుందును. నేను అవతారములను ఎత్తుటకు మఱియొక కారణము ఏదియును లేదు. (చౌ॥ 1-4)

దో- సగున ఉపాసక పరహిత, నిరత నీతి దృఢ నేమ ।
తే నర ప్రాన సమాన మమ, జిన్హ కేఁ ద్విజ పద ప్రేమ ॥ 48 ॥

సగుణబ్రహ్మను ఉపాసించువారును, పరహితమునకై పాటుపడువారును, నీతి నియమములను దృఢముగా పాటించు వారును, బ్రాహ్మణ పాదములను సేవించు వారును నాకు ప్రాణతుల్యులు. (దో॥ 48)

చౌ- సును లంకేస సకల గున తోరేఁ । తాతేఁ తుమ్హ అతిసయ ప్రియ మోరేఁ ॥
రామ బచన సుని బానర జూథా । సకల కహహిఁ జయ కృపా బరూథా ॥ 1 ॥
సునత బిభీషను ప్రభు కై బానీ । నహిఁ అఘాత శ్రవనామృత జానీ ॥
పద అంబుజ గహి బారహిఁ బారా । హృదయఁ సమాత న ప్రేము అపారా ॥ 2 ॥
సునహు దేవ సచరాచర స్వామీ । ప్రనతపాల ఉర అంతరజామీ ॥
ఉర కఛు ప్రథమ బాసనా రహీ । ప్రభు పద ప్రీతి సరిత సో బహీ ॥ 3 ॥
అబ కృపాల నిజ భగతి పావనీ । దేహు సదా సివ మన భావనీ ॥
ఏవమస్తు కహి ప్రభు రనధీరా । మాగా తురత సింధు కర నీరా ॥ 4 ॥
జదపి సఖా తవ ఇచ్ఛా నాహీఁ । మోర దరసు అమోఘ జగ మాహీఁ ॥
అస కహి రామ తిలక తెహి సారా । సుమన బృష్టి నభ భఈ అపారా ॥ 5 ॥

ఓ లంకేశ్వరా! వినుము. నీలో అన్నియును సద్గుణములే గలవు. కనుక నీవు నాకు అత్యంత ప్రీతిపాత్రుడవు." శ్రీరాముని మృదుమధురవచనములను వినినవానరులు "కృపాసాగరుడైన శ్రీరామచంద్రప్రభువునకు జయమగుగాక" అని పలికిరి. కర్ణ రసాయనములైన ప్రభు వచనములను ఎంతగా వినినను విభీషణునకు తనివి తీరలేదు. అతడు మాటిమాటికి ప్రభుపాదములను పట్టుకొనుచుండెను. అపారమైనప్రేమతో అతనిహృదయము నిండిపోయెను. అప్పుడతడు ఇట్లనెను. " దేవా! చరాచరజగత్ప్రభూ! శరణాగత రక్షకా! అందఱి హృదయములను ఎఱిగిన వాడా! ఇంత వఱకును నాలోనున్న విషయవాసనలన్నియును ప్రభు చరణములపై గల భక్తి ప్రవాహమున కొట్టుకొనిపోయినవి. ఓ కృపాళూ! సదాశివుని మనస్సునందుగల అనన్యభక్తిని నాకు అనుగ్రహింపుము. శ్రీరామచంద్రప్రభువు "ఏవమస్తు" (అట్లే కానిమ్ము) అని పల్కుచు, రణధీరుడైన ప్రభువు వెంటనే సముద్రజలములను తీసికొని రమ్మని లక్ష్మణుని ఆజ్ఞాపించెను. పిమ్మట విభీషణునితో ఇట్లనెను. "జగత్తులో నా దర్శనము అమోఘము. అది యెన్నడును నిష్ఫలము గాదు. నీకు కోరిక లేకున్నను నిన్ను 'రాజ్యాభిషిక్తుని చేయుచున్నాను." అనియనుచు శ్రీరాముడు అతనిని లంకారాజ్యమునకు రాజునుగా జేసెను. అంతరిక్షమునుండి అపారముగా పుష్పవర్షము గురిసెను.(1) (చౌ॥ 1-5)

దో- రావన క్రోధ అనల నిజ, స్వాస సమీర ప్రచండ ।
జరత బిభీషను రాఖేఉ, దీన్హేఉ రాజు అఖండ ॥ 49(క) ॥
జో సంపతి సివ రావనహి, దీన్హి దిఏఁ దస మాథ ।
సోఇ సంపదా బిభీషనహి, సకుచి దీన్హి రఘునాథ ॥ 49(ఖ) ॥

---

(1) మున్ను రావణ బాధలోర్వక విభీషణుడు మొఱపెట్టగ రామచంద్ర! ॥మున్ను॥
మన్నింతువనుచు కులబిరుదులను పొగడిన
మాటనుఆచితివో? శ్రీరామచంద్ర! ॥మున్ను॥
రాజ రాజ! విరాజివాహ! రవి కుల జలధి
రాజ! రాఘవ! రామచంద్ర!
రాజీవ నేత్ర! భవస్తుత! త్యాగ
రాజ వందిత! రామచంద్ర! ॥మున్ను॥ (త్యాగరాజ)

రావణుని క్రోధము అగ్నివంటిది. విభీషణుని హితవచనములు చల్లనిగాలులవంటివి. అయినను ఆ వచనవాయువులచే రావణుని క్రోధాగ్ని ప్రచండమాయెను. ఆ అగ్నిజ్వాలలకు లోనైన విభీషణుని తాపములను తనవచనామృతధారలచే చల్లార్చి, కరుణామూర్తియైన శ్రీరామచంద్రప్రభువు ఆతనిని రక్షించెను. అఖండరాజ్యమును అనుగ్రహించెను. తన దశశిరస్సులను బలిదానము గావించిన రావణునకు పరమశివుడు అనుగ్రహించిన సంపదను రఘునాథుడు విభీషణునకు ఇప్పుడు సంకోచపడుచు ఇచ్చెను. ( తానేమియు ఇయ్యలేదని తలచెను.) (దో॥ 49. క,ఖ)

చౌ- అస ప్రభు ఛాడి భజహిఀ జె ఆనా । తే నర పసు బిను పూఀఛ బిషానా ॥
నిజ జన జాని తాహి అపనావా । ప్రభు సుభావ కపి కుల మన భావా ॥ 1 ॥
పుని సర్బగ్య సర్బ ఉర బాసీ । సర్బరూప సబ రహిత ఉదాసీ ॥
బోలే బచన నీతి ప్రతిపాలక । కారన మనుజ దనుజ కుల ఘాలక ॥ 2 ॥
సును కపీస లంకాపతి బీరా । కేహి బిధి తరిఅ జలధి గంభీరా ॥
సంకుల మకర ఉరగ ఝష జాతీ । అతి అగాధ దుస్తర సబ భాఀతీ ॥ 3 ॥
కహ లంకేస సునహు రఘునాయక । కోటి సింధు సోషక తవ సాయక ॥
జద్యపి తదపి నీతి అసి గాఈ । బినయ కరిఅ సాగర సన జాఈ ॥ 4 ॥

ఇట్టి కృపాళువైన ప్రభువును విస్మరించి, ఇతరులను భజించువారు కొమ్ములు, తోకలు లేని పశువులు. విభీషణుడు తనభక్తుడని యెఱింగి, అతనిని తనఆత్మీయునిగా జేసికొనెను. ప్రభుస్వభావము వానరులనందఱిని సంతోషపఱచెను. పిమ్మట సర్వజ్ఞుడును, సర్వ హృదయాంతర్యామియు, సమస్తరూపములలో ప్రకటితమగువాడును, సర్వరహితుడును (దేనిచేతనులిప్తుడు కానివాడును) ఉదాసీనుడును, భక్తులను అనుగ్రహించుటకై మానవశరీరమును ధరించినవాడును, రాక్షసజాతిని నిర్మూలించి, నీతిని నిలుపువాడును ఐన శ్రీరామచంద్రుడు ఇట్లనెను. "ఓ కపీశ్వరా! సుగ్రీవా! ఓలంకేశ్వరా! విభీషణా! ఈగంభీరజలధిని దాటుటయెట్లు? అనేకజాతుల మొసళ్ళు, సర్పములు, మత్స్యములు మున్నగు వానితో నిండి, అపారమైన అగాధమైన ఈ సముద్రమును దాటుట ఎంతేని కష్టము" లంకాధిపతి విభీషణుడు ఇట్లు నుడివెను. "ఓ రఘునాయకా! మీ బాణమొక్కటియే కోటి సముద్రములనైనను శుష్కింప జేయును. ఐనను మొట్టమొదట సముద్రుని ప్రార్థించుటయే నీతి. (చౌ॥ 1-4)

దో- ప్రభు తుమ్హార కులగుర జలధి, కహిహి ఉపాయ బిచారి ।
బిను ప్రయాస సాగర తరిహి, సకల భాలు కపి ధారి ॥ 50 ॥

ప్రభూ! మీ పూర్వజులలో 'పెద్ద'యైన సముద్రుడు ఏదేని ఒక ఉపాయమును చెప్పకపోడు. దాని వలన ఈ వానర భల్లూక సైన్యములు ఎట్టి ప్రయాసయు లేకుండ జలధిని దాటగలవు. (దో॥ 50)

చౌ- సఖా కహీ తుమ్హ నీకి ఉపాఈ । కరిఅ దైవ జౌఀ హోఇ సహాఈ ॥
మంత్ర న యహ లఛిమన మన భావా । రామ బచన సుని అతి దుఖ పావా ॥ 1 ॥

నాథ దైవ కర కవన భరోసా । సోషిఅ సింధు కరిఅ మన రోసా ॥
కాదర మన కహుఁ ఏక అధారా । దైవ దైవ ఆలసీ పుకారా ॥ 2 ॥
సునత బిహసి బోలే రఘుబీరా । ఐసెహిఁ కరబ ధరహు మన ధీరా ॥
అస కహి ప్రభు అనుజహి సముఝాఈ । సింధు సమీప గఏ రఘురాఈ ॥ 3 ॥
ప్రథమ ప్రనామ కీన్హ సిరు నాఈ । బైఠే పుని తట దర్భ డసాఈ ॥
జబహిఁ బిభీషన ప్రభు పహిఁ ఆఏ । పాఛేఁ రావన దూత పఠాఏ ॥ 4 ॥

విభీషణునిసూచనను విని, శ్రీరాముడు పచించెను. "మిత్రమా! నీవు చక్కని ఉపాయమును తెల్పితివి. దైవము తోడ్పడునేమో చూచెదను. ఈ సూచన లక్ష్మణునకు రుచింప లేదు. శ్రీరాముని మాటలను విని, అతడు మిగుల వగచి, పలికెను. "ప్రభూ! దైవము దైవము-అని అనుట ఎందుకు? మనస్సున రోషమును నింపి, జలనిధిని ఇంకిపోవునట్లు చేయుడు. పిఱికివారే దైవమును అడ్డుపెట్టుకొందురు. సోమరులే 'దైవము, దైవము' అని గగ్గోలు చేయుదురు." ఈ మాటలకు శ్రీరాముడు దరహాసము చేయుచు, "అట్లే చేసెదము, కొంచెము ఓపికపట్టుము" అని లక్ష్మణునకు సైగ చేసెను. శ్రీరాముడు ఉదధిని సమీపించి, సముద్రునకు శిరసా ప్రణమిల్లెను. పిదప తీరమున దర్భలు పఱచుకొని, కూర్చుండెను. విభీషణుడు శ్రీరాముని ఆశ్రయించుటకు లంకను వీడగనే రావణుడు అతనిని వెంబడించుటకై తనదూతలను పంపెను. (చౌ॥ 1-4)

## శుకసారణుల వృత్తాంతము

దో- సకల చరిత తిన్హ దేఖే, ధరేఁ కపట కపి దేహ ।
ప్రభు గున హృదయఁ సరాహహిఁ, సరనాగత పర నేహ ॥ 51 ॥

ఆ దూతలు కపటవానరరూపములను ధరించి, జరిగినవృత్తాంతము నంతయును గమనించిరి. వారు తమమనస్సులలో ప్రభుగుణములను, శరణు జొచ్చినవారిపై ఆయన అపార ప్రేమను ప్రశంసించిరి. (దో॥ 51)

చౌ- ప్రగట బఖానహిఁ రామ సుభాఊ । అతి సప్రేమ గా బిసరి దురాఊ ॥
రిపు కే దూత కపిన్హ తబ జానే । సకల బాఁధి కపీస పహిఁ ఆనే ॥ 1 ॥
కహ సుగ్రీవ సునహు సబ బానర । అంగ భంగ కరి పఠవహు నిసిచర ॥
సుని సుగ్రీవ బచన కపి ధాఏ । బాఁధి కటక చహు పాస ఫిరాఏ ॥ 2 ॥
బహు ప్రకార మారన కపి లాగే । దీన పుకారత తదపి న త్యాగే ॥
జో హమార హర నాసా కానా । తేహి కోసలాధీస కై ఆనా ॥ 3 ॥
సుని లఛిమన సబ నికట బోలాఏ । దయా లాగి హఁసి తురత ఛోడాఏ ॥
రావన కర దీజహు యహ పాతీ । లఛిమన బచన బాచు కులఘాతీ ॥ 4 ॥

భక్తిభావనిమగ్నులగుటవలన వారు చద్మవేషములను మఱచి, నిజరూపములలోనే రామచంద్రుని స్వభావములను ప్రీతితో కీర్తింపసాగిరి. అప్పుడు వానరులు వారిని శత్రుదూతలుగా గుర్తించి, బంధించి, సుగ్రీవుని యొద్దకు తీసికొనిపోయిరి. సుగ్రీవుడు "వానరులారా! ఈ రాక్షసులను 'అంగభంగము గావించి' పంపుడు- అని ఆదేశించెను. సుగ్రీవుని మాటలను వినగానే వానరులు వారిని బంధించి, సేనలచుట్టును త్రిప్పిరి. పెక్కురీతుల శిక్షించిరి. వారు

గట్టిగా అరచుచున్నను వానరులు వారిని వదలిపెట్టలేదు. అప్పుడాదూతలు బిగ్గరగా 'శ్రీరామునిపై ఆన. మా ముక్కుచెవులను కోయుకవలదు' అని అఱచిరి. వారి అరపులను విని. లక్ష్మణుడు అందఱిని తన యొద్దకు పిలిచెను. నవ్వుచు జాలిపడి ఆ దూతలను విడిపించెను. పిమ్మట పలికెను. "కులఘాతకుడైన రావణునకు ఈ ఉత్తరమును అందించి, చదువుడని తెల్పుడు. (చౌ॥ 1-4)

దో- కహేహు ముఖాగర మూఢ సన, మమ సందేసు ఉదార।
సీతా దేఇ మిలహు న త, ఆవా కాలు తుమ్హార ॥ 52 ॥

ఆ మూర్ఖరావణునకు దయతో గూడిన నా ఈ మౌఖిక సందేశమును వినిపింపుడు "సీతాదేవిని అప్పగించి, శ్రీరామునితో సంధి చేసికొనుము. లేనిచో నీకు ఈ నేలమీద నూకలుచెల్లినట్లు భావింపుము" (దో॥ 52)

చౌ- తురత నాఇ లఛిమన పద మాథా । చలే దూత బరనత గున గాథా ॥
కహత రామ జసు లంకాఁ ఆఏ । రావన చరన సీస తిన్హ నాఏ ॥ 1 ॥
బిహసి దసానన పూఁఛీ బాతా । కహసి న సుక ఆపని కుసలాతా ॥
పుని కహు ఖబరి బిభీషన కేరీ । జాహి మృత్యు ఆఈ అతి నేరీ ॥ 2 ॥
కరత రాజ లంకా సఠ త్యాగీ । హోఇహి జవ కర కీట అభాగీ ॥
పుని కహు భాలు కీస కటకాఈ । కఠిన కాల ప్రేరిత చలి ఆఈ ॥ 3 ॥
జిన్హ కే జీవన కర రఖవారా । భయఉ మృదుల చిత సింధు బిచారా ॥
కహు తపసిన్హ కై బాత బహోరీ । జిన్హ కే హృదయఁ త్రాస అతి మోరీ ॥ 4 ॥

లక్ష్మణుని చరణములకు ప్రణమిల్లి, శ్రీరాముని గుణములను కీర్తించుచు ఆ రాక్షసదూతలు వెంటనే వెళ్లిపోయిరి. శ్రీరాముని కీర్తిని కొనియాడుచు వారు లంకను జేరి, రావణునకు ప్రణమిల్లిరి. దశముఖుడు ఆ శుకసారణులను పరిహసించుచు, ఇట్లనెను. ఓరీ! శుకా! నీ కుశల సమాచారమును ఏల తెల్పవు? మృత్యువునకు చేరువగా నున్న ఆవిభీషణుని విషయమును వినిపింపుము. ఆమూర్ఖుడు రాజ్యపాలనాధికారములను పోగొట్టుకొని పోయెను. ఇప్పుడు ఆ అభాగ్యుడు యవలలోని పురుగులవలె ఐనాడు. యవలను తిరుగలిలో పోసి త్రిప్పునప్పుడు వాటితో పాటు పురుగులుగూడ నశించును. అట్లే నరవానరులతోపాటు విభీషణుడుగూడ నశించును. కాలునిచే ప్రేరితులై వచ్చిన ఆ వానరభల్లూకసైన్యములను గూర్చి తెల్పుము. సముద్రుడే దయాహృదయుడై వారిని రక్షింపకున్నచో (అడ్డులేకున్నచో) ఆ వానరభల్లూకములను మన రాక్షసులే చంపి, భక్షించియుండెడివారు. నా భయముచే విహ్వలహృదయులైన ఆ తాపసుల గూర్చి తెలుపుము. (చౌ॥ 1-4)

దో- కీ భఇ భేఁట కి ఫిరి గఏ, శ్రవన సుజసు సుని మోర।
కహసి న రిపు దల తేజ బల, బహుత చకిత చిత తోర ॥ 53 ॥

మీరు వారిని కలిసినారా? లేక వారు నాయశోవైభవములను గూర్చి విని, మఱలి వెళ్లినారా! శత్రు సేనలతేజోబలములను గుఱించి ఏల తెల్పరు? ఓరీ శుకా! నీవు చకితునిగా కన్పించు చున్నావు." (దో॥ 53)

చౌ- నాథ కృపా కరి పూఁఛేహు జైసేఁ । మానహు కహా క్రోధ తజి తైసేఁ ॥
మిలా జాఇ జబ అనుజ తుమ్హారా । జాతహిఁ రామ తిలక తెహి సారా ॥ 1 ॥
రావన దూత హమహి సుని కానా । కపిన్హ బాఁధి దీన్హే దుఖ నానా ॥
శ్రవన నాసికా కాటైఁ లాగే । రామ సపథ దీన్హేఁ హమ త్యాగే ॥ 2 ॥
పూఁఛిహు నాథ రామ కటకాఈ । బదన కోటి సత బరని న జాఈ ॥
నానా బరన భాలు కపి ధారీ । బికటానన బిసాల భయకారీ ॥ 3 ॥
జెహిఁ పుర దహెఉ హతెఉ సుత తోరా । సకల కపిన్హ మహఁ తెహి బలు థోరా ॥
అమిత నామ భట కఠిన కరాలా । అమిత నాగ బల బిపుల బిసాలా ॥ 4 ॥

దూత వచించెను. "ప్రభూ! మీరు దయతో ప్రశ్నించిన రీతిగనే నేను తెలిపెడి విషయమును గూడ కోపపడక ఆలకింపుడు. మీ సోదరుడు విభీషణుడు శ్రీరాముని కలియుగనే అతనిని శ్రీరాముడు లంకారాజ్యపట్టాభిషిక్తునిగా జేసెను. మేము మీ దూతలమని తెలియగనే వానరులు మమ్ము బంధించి, మిక్కిలి బాధించిరి. వారు మా ముక్కు చెవులను కోఱుకుటకు సిద్ధపడిరి. శ్రీరామునిపై ప్రమాణము చేయుటచే వారు మమ్ము వదలిరి. మీరు శ్రీరాముని సేనను గూర్చి అడిగితిరి. ప్రభూ! వారి సేనలను వర్ణింపనెవ్వరికిని తరముగాదు. ఆ సేనయందలి వివిధ వర్ణములుగల వానరములు, భల్లూకములు అసంఖ్యాకములు. వారి ముఖములు భయంకరములు, శరీరములు దీర్ఘములు, అతిభయానకములు, మన నగరమునకు వచ్చి, అక్షకుమారుని హతమార్చి లంకను గాల్చిన వానరుని బలము మిగిలిన (అక్కడి)వారితో పోల్చినప్పుడు చాలా తక్కువ. వారు కఠినాత్ములు, అసమానయోధులు, అజేయులు, వారి బలము అపరిమితగజబలములతో సమానము. (చౌ॥ 1-4)

దో- ద్వివిద మయంద నీల నల, అంగద గద బికటాసి ।
దధిముఖ కేహరి నిసఠ సఠ, జామవంత బలరాసి ॥ 54 ॥

ద్వివిదుడు, మైందుడు, నీలుడు, నలుడు, అంగదుడు, గదుడు, వికటాస్యుడు, దధిముఖుడు, కేసరి, నిశఠుడు, శఠుడు, జాంబవంతుడు మున్నగు వారందఱును సాటిలేని పరాక్రమశాలురు. (దో॥ 54)

చౌ- ఏ కపి సబ సుగ్రీవ సమానా । ఇన్హ సమ కోటిన్హ గనఇ కో నానా ॥
రామ కృపాఁ అతులిత బల తిన్హహీఁ । తృన సమాన త్రైలోకహి గనహీఁ ॥ 1 ॥
అస మైఁ సునా శ్రవన దసకంధర । పదుమ అఠారహ జూథప బందర ॥
నాథ కటక మహఁ సో కపి నాహీఁ । జో న తుమ్హహి జీతై రన మాహీఁ ॥ 2 ॥
పరమ క్రోధ మీజహిఁ సబ హాథా । ఆయసు పై న దేహిఁ రఘునాథా ॥
సోషహిఁ సింధు సహిత ఝష బ్యాలా । పూరహిఁ న త భరి కుధర బిసాలా ॥ 3 ॥
మర్ది గర్ద మిలవహిఁ దససీసా । ఐసెఇ బచన కహహిఁ సబ కీసా ॥
గర్జహిఁ తర్జహిఁ సహజ అసంకా । మానహుఁ గ్రసన చహత హహిఁ లంకా ॥ 4 ॥

ఈ వానరులందరును బలములో సుగ్రీవునితో సమానులు. ఇట్టివారు ఒకరిద్దఱుగాదు కోట్లకొలది గలరు. వారిని లెక్కించుట అసాధ్యము. అపారబలపరాక్రమములను గలిగి, శ్రీరామునికృపకు పాత్రులైనట్టి ఆ మహాయోధులు ముల్లోకములనుగూడ తృణప్రాయముగా చూతురు. దశాననా! వారి సేనలకు సేనానాయకులే 18,000కోట్ల మందియున్నట్లు నేను అచటి వారి నోట వింటిని. ఆసేనలోని ప్రతియోధుడును మిమ్ము జయింపగలవాడే. వారు అందఱును క్రుద్ధులై మనతో కయ్యమునకు కాలుదువ్వుచున్నారు. కాని శ్రీరాముడు వారికి ఆజ్ఞలనొసగలేదు. వారు ఇట్లు పలుకుచుండిరి. "ప్రమాదకరమైన మత్స్యములతో భయంకరసర్పములతో నిండియున్న ఈ మహాసముద్రమును ఒక్క దెబ్బతో శుష్కింపజేయుదుము. లేదా దీనిని పర్వతములతో నింపెదము. దశాననుని అణచివేసి, మట్టిలో కలిపెదము" వారందఱును సహజముగా కఠినాత్ములు. లంకానగరమును మ్రింగి వేయునట్లు వారు గర్జించెదరు, ఫీంకరించెదరు. (చౌ॥ 1-4)

దో- సహజ సూర కపి భాలు సబ, పుని సిర పర ప్రభు రామ ।
రావన కాల కోటి కహుఁ, జీతి సకహిఁ సంగ్రామ ॥ 55 ॥

ఆ వానరులు, భల్లూకములు సహజముగా శౌర్య పరాక్రమములకు నిధులు, మహా సమర వీరులు, పైగా వారికి నాయకుడు శ్రీరామచంద్రప్రభువు. రావణా! వారితో తలపడినచో కోట్ల కొలది యములుగూడ పరాజితులు కావలసినదే. (దో॥ 55)

చౌ- రామ తేజ బల బుధి బిపులాఈ । సేష సహస సత సకహిఁ న గాఈ ॥
సక సర ఏక సోషి సత సాగర । తవ భ్రాతహి పూఁఛేఉ నయ నాగర ॥ 1 ॥
తాసు బచన సుని సాగర పాహీఁ । మాగత పంథ కృపా మన మాహీఁ ॥
సునత బచన బిహసా దససీసా । జౌఁ అసి మతి సహాయ కృత కీసా ॥ 2 ॥
సహజ భీరు కర బచన దృఢాఈ । సాగర సన ఠానీ మచలాఈ ॥
మూఢ మృషా కా కరసి బడాఈ । రిపు బల బుద్ధి థాహ మైఁ పాఈ ॥ 3 ॥
సచివ సభీత బిభీషన జాకేఁ । బిజయ బిభూతి కహాఁ జగ తాకేఁ ॥
సుని ఖల బచన దూత రిస బాఢీ । సమయ బిచారి పత్రికా కాఢీ ॥ 4 ॥
రామానుజ దీన్హీ యహ పాతీ । నాథ బచాఇ జుడావహు ఛాతీ ॥
బిహసి బామ కర లీన్హీ రావన । సచివ బోలి సఠ లాగ బచావన ॥ 5 ॥

శ్రీరామచంద్రునితేజోబలపరాక్రమములు అసమానములు, బుద్ధి వైభవములు అద్భుతములు- వాటిని సహస్రముఖములుగల శేషుడు గూడ వర్ణింపజాలడు. ఒక్క బాణము తోడనే అతడు వందల కొలది సముద్రములను నిర్జలములుగా జేయగలడు. ఐనను నీతికుశలుడైన శ్రీరాముడు మీ సోదరుని ఉపాయమునడిగెను. విభీషణునిసూచన మేరకు ఆయన దారియిమ్మని సముద్రుని ప్రార్థించుచున్నాడు. ఏలనన రాముడు దయాళువు. (కావున సముద్రుని దండించుటకు పూనుకొనలేదు) దూత పలికిన ఈ మాటలను విని, రావణుడు పరిహాసించుచు బిగ్గరగా నవ్వుచూ పలికెను. "ఇంతటి బుద్ధిహీనుడగుటచేతనే అతడు వానరులను తనకు సహాయకులుగా

చేసికొనెను. సహజముగా పిఱికివాడు. కావుననే విభీషణుని మాటలను విశ్వసించి, అతడు బాలునివలె సముద్రుని వేడుకొనుచున్నాడు. ఓరీ! మూర్ఖుడా! అతని గొప్పదనమునుగూర్చి ఊరక తెగపొగడుచున్నావేల? చాలుచాలు. అతనిశక్తిబలముల స్థాయి ఎట్టిదో ఇప్పుడు నాకు తెలిసినది. విభీషణుని వంటి భీరువు అతనికి సలహాలను ఇచ్చెడివాడైనప్పుడు విజయవైభవములు ఎట్లు ప్రాప్తించును?" దుష్ట రావణుని మాటలు వినగానే దూతకు కోపము అధికమయ్యెను. ఇదే సరియైన సమయమని భావించి, అతడు లక్ష్మణుడిచ్చిన లేఖను రావణునకు ఇచ్చుచు, "శ్రీరాముని సోదరుడు లక్ష్మణుడు మీకొఱకై ఈ పత్రమును ఇచ్చినాడు. ప్రభూ! దీనిని చదివినచో మీ మనస్సు శాంతించును." అని పలికెను. మూర్ఖుడైన రావణుడు నవ్వి, దానిని ఎడమచేతితో తీసుకొని, 'చదువుము' అని మంత్రికి ఇచ్చెను. (చౌ॥ 1-5)

దో- బాతన్హ మనహి రిఝాఇ సఠ, జని ఘాలసి కుల ఖీస ।
రామ బిరోధ న ఉబరసి, సరన బిష్ను అజ ఈస ॥ 56(క) ॥
కీ తజి మాన అనుజ ఇవ, ప్రభు పద పంకజ భృంగ ।
హోహి కి రామ సరానల, ఖల కుల సహిత పతంగ ॥ 56(ఖ) ॥

(అతడు చదివెను) "ఓరీ! శఠుడా! కేవలము బీరములతోడనే నీ మనస్సును సంతృప్తి పఱచుకొనుచు, నీవంశనాశనమును కొనితెచ్చుకొనవలదు. శ్రీరామునితో వైరమును పెంచుకొని, నీవు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను శరణుజొచ్చినను వారెవ్వరును నిన్ను రక్షింపజాలరు. అభిమానమును వీడి, నీ సోదరుడైన విభీషణునివలె ప్రభుచరణకమలములకు భ్రమరము కమ్ము. లేనిచో దుష్టుడా! నీవు సపరివారముగా శ్రీరాముని బాణాగ్నికి శలభమయ్యెదవు." (దో॥ 56. క,ఖ)

చౌ- సునత సభయ మన ముఖ ముసుకాఈ । కహత దసానన సబహి సునాఈ ॥
భూమి పరా కర గహత అకాసా । లఘు తాపస కర బాగ బిలాసా ॥ 1 ॥
కహ సుక నాథ సత్య సబ బానీ । సముఝహు ఛాడి ప్రకృతి అభిమానీ ॥
సునహు బచన మమ పరిహరి క్రోధా । నాథ రామ సన తజహు బిరోధా ॥ 2 ॥
అతి కోమల రఘుబీర సుభాఊ । జద్యపి అఖిల లోక కర రాఊ ॥
మిలత కృపా తుమ్హ పర ప్రభు కరిహీ । ఉర అపరాధ న ఏకఉ ధరిహీ ॥ 3 ॥
జనకసుతా రఘునాథహి దీజే । ఏతనా కహా మోర ప్రభు కీజే ॥
జబ తెహిఁ కహా దేన బైదేహీ । చరన ప్రహార కీన్హ సఠ తేహీ ॥ 4 ॥
నాఇ చరన సిరు చలా సో తహాఁ । కృపాసింధు రఘునాయక జహాఁ ॥
కరి ప్రనాము నిజ కథా సునాఈ । రామ కృపాఁ ఆపని గతి పాఈ ॥ 5 ॥
రిషి అగస్తి కీఁ సాప భవానీ । రాఛస భయఉ రహా ముని గ్యానీ ॥
బంది రామ పద బారహిఁ బారా । ముని నిజ ఆశ్రమ కహుఁ పగు ధారా ॥ 6 ॥

లక్ష్మణునిలేఖాంశములను విని, రావణునిమనస్సులో భయాందోళనలు కల్గెను. కాని పైకి నవ్వుచు అందఱును వినునట్లు పలికెను. "నేలపైబడినవ్యక్తి ఆకసమునందుకొనుటకు ప్రయత్నించునట్లు ఈ లఘుతాపసి తనవాచాలతను చాటుకొనినాడు" అపుడు శుకుడు(దూత) పలికెను. "ప్రభూ! మీ అభిమానమునువీడి లక్ష్మణునిమాటలను సత్యములుగా తలంపుడు. క్రోధమును త్యజించి నా పలుకులను వినుడు. శ్రీరామునితో విరోధము మానుడు. అతడు సమస్త లోకములకు అధిపతియైనను శ్రీ రఘువీరుని స్వభావము మిక్కిలి కోమలము మీరు ఆయన కడకు వెళ్లినంతనే ఆ ప్రభువు మీపై కృప జూపును. మీ అపరాధములలో ఏ ఒక్కదానినిగూడ ఆయన తనమనస్సులో తలపడు. జానకీదేవిని శ్రీ రఘునాథునకు అప్పగింపుడు. ప్రభూ! నా ఈ విన్నపమును ఆలకింపుడు." ఇట్లు పలికిన ఆ దూతను దుష్ట రావణుడు కాలితో ఒక్క తన్ను తన్నెను. విభీషణునివలె అతడును రావణునకు ఒక్క దండముపెట్టి 'మహాప్రసాదము' అనుచూ కరుణాళువైన శ్రీరాముని యొద్దకు వెళ్లి, ప్రణమిల్లి, అతడు తన కథను వినిపించెను. ప్రభుకృపవలన అతనికి నిజస్వరూపము (మునిరూపము) ప్రాప్తించెను. (శంకరుడు పలుకుచున్నాడు) భవానీ! ఆ శుకుడు మొదట జ్ఞానియైన ఒక ముని. అగస్త్యుని శాపమున రాక్షసుడయ్యెను. ఇట్లు మునిరూపము లభించుటచే శ్రీరాముని చరణకమలములకు మాటి మాటికిని నమస్కరించి, తన ఆశ్రమమునకు వెళ్లెను. (చౌ॥ 1-6)

# సముద్రుని గర్వభంగము

దో- బినయ న మానత జలధి జడ, గఏ తీని దిన బీతి ।
బోలే రామ సకోప తబ, భయ బిను హోఇ న ప్రీతి ॥ 57 ॥

మూడు దినములు గడిచినప్పటికిని జడుడైన సముద్రుడు ప్రభుప్రార్థనకు స్పందింపలేదు. అప్పుడు శ్రీరాముడు కినుకవహించి ఇట్లనెను. సామోపాయముతో ఈతడు దారికిరాడు. భయపెట్టనిదే మాటవినడు. (దో॥ 57)

చౌ- లఛిమన బాన సరాసన ఆనూ । సోషౌఁ బారిధి బిసిఖ కృసానూ ॥
సఠ సన బినయ కుటిల సన ప్రీతీ । సహజ కృపన సన సుందర నీతీ ॥ 1 ॥
మమతా రత సన గ్యాన కహానీ । అతి లోభీ సన బిరతి బఖానీ ॥
క్రోధిహి సమ కామిహి హరికథా । ఊసర బీజ బఏఁ ఫల జథా ॥ 2 ॥
అస కహి రఘుపతి చాప చఢావా । యహ మత లఛిమన కే మన భావా ॥
సంధానేఉ ప్రభు బిసిఖ కరాలా । ఉఠీ ఉదధి ఉర అంతర జ్వాలా ॥ 3 ॥
మకర ఉరగ ఝష గన అకులానే । జరత జంతు జలనిధి జబ జానే ॥
కనక థార భరి మని గన నానా । బిప్ర రూప ఆయఉ తజి మానా ॥ 4 ॥

లక్ష్మణా! నా ధనుర్బాణములను తెమ్ము. అగ్ని బాణమును ప్రయోగించి, ఈ సముద్రము ఎండిపోవునట్లు చేసెదను. మూర్ఖునకు విన్నవించుటయు, కుటిలుని యెడ ప్రీతి కనబఱచుటయు, సహజలోభికి ఔదార్యమునుగూర్చి ఉపదేశించుటయు, మమతాసక్తునకు జ్ఞానబోధ చేయుటయు, అత్యాశాపరునకు వైరాగ్యమునుగూర్చి వర్ణించి చెప్పుటయు, ముక్కోపికి మనోనిగ్రహమును గుఱించి నూరిపోయుటయు, కాముకునకు శ్రీహరికథలను

వినిపించుటయు- ఊసర క్షేత్రమున విత్తనములు చల్లినట్లు నిష్ఫలములగును." ఈవిధముగా పలికిన శ్రీ రఘువీరుడు తన ధనువును ఎక్కు పెట్టెను. శ్రీరాముని చర్య లక్ష్మణునకు ఎంతయు ప్రీతి కరమయ్యెను. ప్రభువు భయానకమైన అగ్నిబాణమును సంధించెను. సముద్రుని హృదయమున అగ్నిజ్వాలలు చెలరేగెను. అగ్ని బాణముచే మంటలు ప్రజ్వరిల్లినసముద్రమునందలి మొసళ్ళు, సర్పములు, చేపలు క్షోభకు లోనయ్యెను. జలచరములన్నియును మంటలలో మాడిపోవు చుండుట చూచి, సముద్రుడు బంగారు పళ్లెములో మణులను నింపుకొని, అభిమానమును వీడి, బ్రాహ్మణ వేషముతో వచ్చెను. (చౌ॥ 1-4)

దో- కాటెహిం పఇ కదరీ ఫరఇ, కోటి జతన కొఉ సీంచ।
బినయ న మాన ఖగేస సును, డాటెహిం పఇ నవ నీచ ॥ 58 ॥

కాకభుశుండి పలుకుచున్నాడు. గరుడా! కదళీ వృక్షమును ఎన్నెన్ని శ్రమలకోర్చి నీరు పోసి పెంచినను, కోసినప్పుడే అది ఫలములనిచ్చును. అట్లే నీచుడు వినయపూర్వకప్రార్థనలకంటెను, భయపెట్టినప్పుడే మాటవినును. (దో॥ 58)

చౌ- సభయ సింధు గహి పద ప్రభు కేరే । ఛమహు నాథ సబ అవగున మేరే ॥
గగన సమీర అనల జల ధరనీ । ఇన్హ కఇ నాథ సహజ జడ కరనీ ॥ 1 ॥
తవ ప్రేరిత మాయాఀ ఉపజాఏ । సృష్టి హేతు సబ గ్రంథని గాఏ ॥
ప్రభు ఆయసు జెహి కహఀ జస అహఈ । సో తెహి భాంతి రహేఀ సుఖ లహఈ ॥ 2 ॥
ప్రభు భల కీన్హ మోహి సిఖ దీన్హీ । మరజాదా పుని తుమ్హరీ కీన్హీ ॥
ఢోల గవాఀర సూద్ర పసు నారీ । సకల తాడనా కే అధికారీ ॥ 3 ॥
ప్రభు ప్రతాప మైఀ జాబ సుఖాఈ । ఉతరిహి కటకు న మోరి బడాఈ ॥
ప్రభు అగ్యా అపేల శ్రుతి గాఈ । కరౌఀ సో బేగి జో తుమ్హహి సోహాఈ ॥ 4 ॥

సముద్రుడు భయముతో వణకుచు ప్రభుపాదములను పట్టుకొని వేడుకొనెను. "నాథా! నా అపరాధములను మన్నింపుడు. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి- ఇవియన్నియును సహజముగా జడములు. నీ ప్రేరణచే మాయ వీటినన్నింటిని సృష్టించినదని ప్రామాణికగ్రంథములు పేర్కొనుచున్నవి. ప్రభునాజ్ఞను పాలించుటచే సుఖశాంతులు సమకూరును. నాకు ఈ శిక్షనిచ్చి, ప్రభువు మేలే చేసెను. కానీ జీవులస్వభావమును, పరిమితులను ఏర్పఱచినది మీరేగదా" అనుచూ ఇంకనూ సముద్రుడు పల్కెను! ఢోలు, అనాగరికుడు, శూద్రుడు, పశువు, స్త్రీ వీరందఱును శిక్షార్హులు. ప్రభు ప్రతాపము చేత నేను శుష్కించెదను. ఈ సైన్యము ఆవలి తీరము చేరగలదు. కాని దీని వలన నాఔన్నత్యము ప్రకటితము కాదు. (నాకు మర్యాద (పరిమితి) యుండదు) మీ ఆజ్ఞ 'అనుల్లంఘనీయము' అని వేదములు తెలుపుచున్నవి. కావున మీకు ఉచితమైన దానిని నేను చేయగలను. (చౌ॥ 1-4)

దో- సునత బినీత బచన అతి, కహ కృపాల ముసుకాఇ।
జెహి బిధి ఉతరై కపి కటకు, తాత సో కహహు ఉపాఇ ॥ 59 ॥

సముద్రుని వినమ్రవాక్యములను విని, కృపాళువు ఐన శ్రీరామచంద్రుడు చిఱునవ్వుతో పలికెను. "నాయనా! ఈ వానర సైన్యము ఆవలి తీరమును చేరుటకు ఉపాయమును తెల్పుము"- (దో॥ 59)

చౌ- నాథ నీల నల కపి ద్వౌ భాఈ । లరికాఈం రిషి అసిష పాఈ ॥
తిన్హ కేం పరస కిఏం గిరి భారే । తరిహహిం జలధి ప్రతాప తుమ్హారే ॥ 1 ॥
మైం పుని ఉర ధరి ప్రభు ప్రభుతాఈ । కరిహఉం బల అనుమాన సహాఈ ॥
ఏహి బిధి నాథ పయోధి బంధాఇఅ । జేహిం యహ సుజసు లోక తిహుం గాఇఅ ॥ 2 ॥
ఏహిం సర మమ ఉత్తర తట బాసీ । హతహు నాథ ఖల నర అఘ రాసీ ॥
సుని కృపాల సాగర మన పీరా । తురతహిం హరీ రామ రన ధీరా ॥ 3 ॥
దేఖి రామ బల పౌరుష భారీ । హరషి పయోనిధి భయఉ సుఖారీ ॥
సకల చరిత కహి ప్రభుహి సునావా । చరన బంది పాథోధి సిధావా ॥ 4 ॥

సముద్రుడు ప్రత్యుత్తరమిచ్చెను. "దేవా! నీలుడు, నలుడు-అను వానరసోదరులిద్దఱికిని బాల్యమున ఒక మహర్షి 'వరము' నిచ్చెను. వారు తాకిన గొప్ప గొప్ప శైలములు గూడ మీ మహిమ వలన సముద్రముపై తేలియాడును. ప్రభు మహత్త్వమును నేను హృదయమున పదిల పఱచుకొని, నా శక్తికొలది సహాయపడుదును. ప్రభూ! ముల్లోకములలో మీ కీర్తిని అందఱూ గానము చేయునట్లు సముద్రముపై 'వారధి'ని నిర్మింపుడు. ఈ బాణముచే నా ఉత్తరతీరమున గల ('ద్రుమకుల్యము' అను స్థానమున నివసించు ఆభీరులు-అను) పాపాత్ములను రూపుమాపుడు" కృపాళువు, రణధీరుడును ఐన శ్రీరాముడు సముద్రుని వినతిని ఆలకించి, అతనిని బాధావిముక్తుని గావించెను. శ్రీరామచంద్రునిబలపరాక్రమములకు సముద్రుడు పొంగి పోయెను. ఆ దుష్టుల (ద్రుమకుల్య వాసుల) చరిత్రను ప్రభువునకు వివరించెను. (1)

సముద్రమునకు ఉత్తరతీరమున 'ద్రుమకుల్య' అను పవిత్ర ప్రసిద్ధ స్థానము గలదు. అచ్చట ఆభీరజాతివారు నివసించుచుందురు. వారు ఉగ్రదర్శనులు, ఉగ్రకర్ములు, మిక్కిలి పాపాత్ములు. వారు సముద్ర జలములను త్రాగుచుందురు. వారి సంస్పర్శను సముద్రుడు సహింపలేకుండెను. సముద్రునికోరికమేరకు శ్రీరాముడు తనబాణమును వారిపై ప్రయోగించి, ఆ పాపాత్ములను హతమార్చెను. పిమ్మట శ్రీరాముని అనుగ్రహమువలన ఆ ప్రదేశమంతయును పుష్ప ఫలభరితమై 'మరుకాంతారము' అను పేర ప్రసిద్ధి వహించెను. శ్రీరామునకు పాదాభివందన మొనర్చి, సముద్రుడు వెళ్లి పోయెను. (చౌ॥ 1-4)

---

ఉత్తరేణావకాశోఽస్తి కశ్చిత్ పుణ్యతమో మమ ।
'ద్రుమకుల్య' ఇతిఖ్యాతో లోకే ఖ్యాతో యథా భవాన్॥
ఉగ్రదర్శన కర్మాణో బహవస్తత్ర దస్యవః॥
ఆభీర ప్రముఖాః పాపాః పిబన్తి సలిలం మమ॥
తైస్తు సంస్పర్శనం పాపైః, న సహే పాపకర్మభిః॥
అమోఘః క్రియతాం రామ తత్ర తేషు శరోత్తమః॥
శ్రీమద్రామాయణము యుద్ధ- సర్గ 22
శ్లోక - 31,32,33 ॥

ఛం-నిజ భవన గవనేఉ సింధు శ్రీరఘుపతిహి యహ మత భాయఉ ।
యహ చరిత కలి మలహర జథామతి దాస తులసీ గాయఉ ॥
సుఖ భవన సంసయ సమన దవన బిషాద రఘుపతి గున గనా ॥
తజి సకల ఆస భరోస గావహి సునహి సంతత సఠ మనా ॥

సముద్రుడు తన భవనమునకు వెళ్లెను. శ్రీరఘునాథునకు ఆతని సూచన నచ్చెను. కలియుగ పాపములను దూరమొనర్చు ఈ కథను తులసీదాసు తన బుద్ధిననుసరించి, గానము జేసెను. శ్రీ రఘునాథుని గుణగణములు సుఖధామములు. అవి సందేహములను తొలగించును. విషాదములను రూపుమాపును. ఓ మూఢమనసా! నీవు సాంసారికములైన ఆశలను, విశ్వాసములను వీడి, నిరంతరము భగవంతుని గుణములశ్రవణకీర్తనములయందే నిమగ్నమగుము. (ఛం)

దో- సకల సుమంగల దాయక, రఘునాయక గున గాన ।
సాదర సునహిం తే తరహిం భవ, సింధు బినా జలజాన ॥ 60 ॥

శ్రీ రఘునాథుని గుణగానమే సర్వశుభప్రదాయకము. ఆదరానురాగములతో చేయబడు దీని శ్రవణమే అగాథభవసాగరమును దాటించు నౌక. (దో॥ 60)

మాసపారాయణము-ఇఱువది నాల్గవ విరామము

ఇతి శ్రీమద్రామచరితమానసే సకలకలికలుషవిధ్వంసనే
పంచమ సోపానః సమాప్తః

కలియుగపాపములను నశింపజేయు శ్రీరామచరితమానసమునందలి సుందరకాండము
అను పంచమ సోపానము సమాప్తము

(సుందరకాండము సమాప్తము)

శ్రీ గణేశాయ నమః
శ్రీజానకీవల్లభో విజయతే

# శ్రీరామచరితమానసము

షష్ఠ సోపానము

# లంకా కాండము

## భగవత్ప్రార్థన

శ్లో॥ రామం కామారిసేవ్యం భవభయహరణం కాలమత్తేభసింహం
యోగీంద్రం జ్ఞానగమ్యం గుణనిధిమజితం నిర్గుణం నిర్వికారమ్ ।
మాయాతీతం సురేశం ఖలవధనిరతం బ్రహ్మవృందైకదేవం
వందే కందావదాతం సరసిజనయనం దేవముర్వీశరూపమ్ ॥ 1 ॥

పృథ్వీపతి (రాజశిరోమణి)గా అవతరించిన శ్రీరామచంద్రునకు వందనమాచరించెదను. అతడు కామారియైన శివునకు ఆరాధ్యదైవము. భవభయములను దూరమొనర్చువాడు. కాలమనుమత్తేభముపాలిటిసింహము, యోగీశ్వరుడు, జ్ఞానైకగమ్యుడు, సర్వసద్గుణనిధి, అజేయుడు, నిర్గుణుడు, నిర్వికారరహితుడు, మాయాతీతుడు, దుష్టసంహారనిరతుడు, బ్రాహ్మణ బృందములకు ముఖ్యదైవము, మేఘశ్యామసుందరుడు, కమలాక్షుడు, అంతే గాదు, అతడు దేవాది దేవుడు. (1)

శ్లో॥ శంఖేంద్వాభమతీవసుందరతనుం శార్దూలచర్మాంబరం
కాలవ్యాలకరాలభూషణధరం గంగాశశాంకప్రియమ్ ।
కాశీశం కలికల్మషౌఘశమనం కల్యాణకల్పద్రుమం
నౌమీడ్యం గిరిజాపతిం గుణనిధిం కందర్పహం శంకరమ్ ॥ 2 ॥

పార్వతీ పతియైన శంకరునకు నమస్కరించుచున్నాను. అతడు శంఖ, చంద్రులవలె ధవళ వర్ణ శోభితుడు, అత్యంతతనుసౌందర్యశోభలతో విలసిల్లువాడు, వ్యాఘ్రచర్మాంబరధరుడు, భయంకరకాలసర్పములను

భూషణములుగా ధరించువాడు, గంగాధరుడు, శశాంక శేఖరుడు, కాశీనాథుడు, కలియుగపాపసమూహములను నాశమొనర్చు వాడు, పరమసుఖములను ప్రసాదించు కల్పవృక్షము, మన్మథుని భస్మమొనర్చిన వాడు, వేయేల అతడుసకలకల్యాణగుణ నిధానము, జగత్ప్రభువు. (2)

శ్లో॥ యో దదాతి సతాం శంభుః కైవల్యమపి దుర్లభమ్ ।
ఖలానాం దండకృద్యో ఽ సౌ శంకరః శం తనోతు మే ॥ 3 ॥

అత్యంత దుర్లభమైన కైవల్యమునుగూడ సజ్జనులకు ప్రసాదించువాడును, దుష్టులను శిక్షించువాడును ఐన శంకరుడు నాకు సమస్తశుభములను అనుగ్రహించు గాక- (3)

(తులసీదాసు నుడువుచున్నాడు)

దో- లవ నిమేష పరమాను జుగ, బరష కలప సర చండ ।
భజసి న మన తేహి రామ కో, కాలు జాసు కోదండ ॥

ఓ మనసా! కాలమును ధనుస్సుగా, క్షణములు, నిముసములు, పరమాణువులు, సంవత్సరములు, యుగములు, కల్పములు తనప్రచండ బాణములుగా గల్గిన శ్రీరామచంద్రుని నీవేల భజింపవు? (దోహా)

## వారధి నిర్మాణము

సో- సింధు బచన సుని రామ, సచివ బోలి ప్రభు అస కహేఉ ।
అబ బిలంబు కేహి కామ, కరహు సేతు ఉతరై కటకు ॥
సునహు భానుకుల కేతు, జామవంత కర జోరి కహ ।
నాథ నామ తవ సేతు, నర చఢి భవ సాగర తరహిఀ ॥

సముద్రునిసూచనను ఆదరించి, శ్రీరామచంద్రుడు తన అంతరంగికులతో ఇట్లనెను. "ఇప్పుడింక అలస్యమేల? వెంటనే వారధిని నిర్మింపుడు. వానరులందఱును సముద్రమును దాటెదరు. "జాంబవంతుడు చేతులు జోడించి, సవినయముగా ఇట్లు నుడివెను. "ఓ సూర్య వంశ భూషణమా! శ్రీరామా! ప్రభూ! మనుష్యుడు భవసాగరమును దాటుటకు మీనామమే ఒక సేతువు. (సోరఠ)

చౌ- యహ లఘు జలధి తరత కతి బారా। అస సుని పుని కహ పవనకుమారా ॥
ప్రభు ప్రతాప బడవానల భారీ । సోషేఉ ప్రథమ పయోనిధి బారీ ॥ 1 ॥
తవ రిపు నారి రుదన జల ధారా । భరేఉ బహోరి భయఉ తేహిఀ ఖారా ॥
సుని అతి ఉకుతి పవనసుత కేరీ । హరషే కపి రఘుపతి తన హేరీ ॥ 2 ॥
జామవంత బోలే దోఉ భాఈ । నల నీలహి సబ కథా సునాఈ ॥
రామ ప్రతాప సుమిరి మన మాహీఀ । కరహు సేతు ప్రయాస కఛు నాహీఀ ॥ 3 ॥

బోలి లిఏ కపి నికర బహోరీ । సకల సునహు బినతీ కఛు మోరీ ॥
రామ చరన పంకజ ఉర ధరహూ । కౌతుక ఏక భాలు కపి కరహూ ॥ 4 ॥
ధావహు మర్కట బికట బరూథా। ఆనహు బిటప గిరిన్హ కే జూథా ॥
సుని కపి భాలు చలే కరి హూహా । జయ రఘుబీర ప్రతాప సమూహా ॥ 5 ॥

అట్టి తజి ఈ చిన్న సముద్రము మీకొక లెక్కా" ఈ మాటలను విని, పవనసుతుడు ఇట్లు పలికెను- "ప్రభుపరాక్రమము బడబానలతుల్యము. అదిమొదట సముద్రుని శుష్కింపజేసినది. కానీ మీ శత్రువనితల దుఃఖాశ్రుజలములచే ఆ సముద్రము మరల నిండినది. అందువలన ఆ జలములు క్షారమయ్యైనవి." హనుమంతునియుక్తియుక్తములైన పలుకులు విని, వానరులు శ్రీరాముని వైపు చూచి, ఆనందముతో పొంగిపోయిరి. జాంబవంతుడు నలుడు, నీలుడు అను సోదరులను బిలిచి, వారికి జరిగిన వృత్తాంతమును దెలిపి, ఇట్లు పలికెను. "మనస్సులో శ్రీరాముని మహిమను స్మరించుచు సేతువును నిర్మింపుడు. ప్రభుమహత్త్వమువలన మీకేమియు శ్రమ కలుగదు" పిదప వానరసైన్యమును బిలిచి, అతడు ఇట్లనెను. "మీ అందఱికిది నాదొక విన్నపము. మీ హృదయములలో శ్రీరామునిచరణకమలములను నిలుపుకొనుడు. భల్లూకములు, వానరులు శ్రమలేని ఈ క్రీడలో నిమగ్నులగుదురు గాక. ఓ వీరవానరయోధులారా! మీరు వెళ్లి వృక్షములను, పర్వతములను పెకలించి తీసికొనిరండు." ఈ మాటలను విని, వానరులు, భల్లూకయోధులు, 'హుంకరించుచు' శ్రీరఘునాథునిప్రతాపమునకు 'జేజేలు' పలుకుచు వెళ్లిరి. (చౌపా ఈ॥ 1-5)

దో- అతి ఉతంగ గిరి పాదప, లీలహిం లేహిం ఉఠాఇ ।
ఆని దేహిం నల నీలహి, రచహిం తె సేతు బనాఇ ॥ 1 ॥

వారు అత్యంతమహోన్నతపర్వతములను, వృక్షములను అవలీలగా మోసికొనివచ్చి, నలునకును, నీలునకును అప్పగించుచుండిరి. వెంటనే వారు అద్భుతముగా మిక్కిలి దృఢముగా చక్కనిసేతువును నిర్మింపసాగిరి. (దో॥ 1)

చౌ- సైల బిసాల ఆని కపి దేహీం । కందుక ఇవ నల నీల తె లేహీం ॥
దేఖి సేతు అతి సుందర రచనా । బిహసి కృపానిధి బోలే బచనా ॥ 1 ॥
పరమ రమ్య ఉత్తమ యహ ధరనీ । మహిమా అమిత జాఇ నహిం బరనీ ॥
కరిహఉం ఇహాం సంభు థాపనా । మోరే హృదయం పరమ కలపనా ॥ 2 ॥
సుని కపీస బహు దూత పఠాఏ । మునిబర సకల బోలి లై ఆఏ ॥
లింగ థాపి బిధివత కరి పూజా । సివ సమాన ప్రియ మోహి న దూజా ॥ 3 ॥
సివ ద్రోహీ మమ భగత కహావా । సో నర సపనేహుం మోహి న పావా ॥
సంకర బిముఖ భగతి చహ మోరీ । సో నారకీ మూఢ మతి థోరీ ॥ 4 ॥

వానరులు గొప్పగొప్ప పర్వతములను తెచ్చి ఇచ్చుచుండిరి. నలుడు, నీలుడు వాటిని బంతులవలె అందుకొనుచుండిరి. లోకోత్తరమైన ఆ సేతునిర్మాణవైశిష్ట్యమును గాంచి, శ్రీరాముడు హర్షోల్లసితుడై పల్కెను. ఇక్కడి భూమి మిక్కిలి రమ్యమైనది, శ్రేష్ఠమైనది. దీనిఅపారమైన మహిమ వర్ణనాతీతము. నేనిచట పరమశివుని

(శివలింగమును) ప్రతిష్ఠించెదను. ఇది నా సంకల్పము. "శ్రీరామచంద్ర ప్రభువచనములను విని, వానరరాజు సుగ్రీవుడు దూతలను బంపగా వారు మునీశ్వరులను పిలుచుకొని వచ్చిరి. శ్రీరాముడు శివలింగమును ప్రతిష్ఠించి, యథావిధిగా పూజించి, పలికెను. "శివునివలె ప్రియమైనవారు నాకెవ్వరును లేరు. శివునకు ద్రోహము తలపెట్టి, నాకు భక్తుడనని పలికెడు వాడు స్వప్నములోగూడ నన్ను పొందజాలడు. శంకరునకు విముఖుడై నా యెడ భక్తిని ప్రకటించువాడు మూర్ఖుడు, అల్పబుద్ధి. వానికి నరకము తప్పదు. (చౌ॥ 1-4)

దో- సంకరప్రియ మమ ద్రోహీ, సివ ద్రోహీ మమ దాస ।
తే నర కరహిఀ కలప భరి, ఘోర నరక మహుఀ బాస ॥ 2 ॥

శంకరుని ప్రేమించి, నా యందు వైరము పూనువారును, శంకరునికి వైరులై నాకు దాసులగు వారును కల్పాంతమువఱకు రౌరవాది నరకయాతనలను అనుభవింతురు.[1] (దో॥ 2)

చౌ- జే రామేస్వర దరసను కరిహహిఀ । తే తను తజి మమ లోక సిధరిహహిఀ ॥
జో గంగాజలు ఆని చఢాఇహి । సో సాజుజ్య ముక్తి నర పాఇహి ॥ 1 ॥
హోఇ అకామ జో ఛల తజి సేఇహి । భగతి మోరి తెహి సంకర దేఇహి ॥
మమ కృత సేతు జో దరసను కరిహీ । సో బిను శ్రమ భవసాగర తరిహీ ॥ 2 ॥
రామ బచన సబ కే జియ భాఏ । మునిబర నిజ నిజ ఆశ్రమ ఆఏ ॥
గిరిజా రఘుపతి కై యహ రీతీ । సంతత కరహిఀ ప్రనత పర ప్రీతీ ॥ 3 ॥
బాంధా సేతు నీల నల నాగర । రామ కృపాఀ జసు భయఉ ఉజాగర ॥
బూడహిఀ ఆనహి బోరహిఀ జేఈ । భఏ ఉపల బోహిత సమ తేఈ ॥ 4 ॥
మహిమా యహ న జలధి కఇ బరనీ । పాహన గున న కపిన్హ కఇ కరనీ ॥ 5 ॥

రామేశ్వరమును దర్శించినవారు శరీరత్యాగమును చేసినపిమ్మట నాలోకమును (వైకుంఠమును) చేరెదరు. గంగాజలములతో శివునకు అభిషేకము చేసిన వారికి సాయుజ్యముక్తి లభించును. నిష్కాములై కపటమును త్యజించి, శ్రీ రామేశ్వరుని సేవించినవానికి శంకరుడు నా భక్తిని ప్రసాదించును. నేను నిర్మించిన ఈ సేతువును దర్శించువాడు ఎట్టి ప్రయాసయు లేకుండగనే సంసారసాగరమును దాటును. "శ్రీరాముని వచనములను విని, అందఱి మనస్సులును ఆనందపరవశములాయెను. మునీశ్వరులు తమతమఆశ్రమములకు వెళ్ళిరి. (శివుడు పల్కుచున్నాడు) గిరిజా! శరణాగతుని సర్వదా ప్రేమించుటయే శ్రీ రఘునాథునిస్వభావము. నేర్పరులైన నలుడు, నీలుడు సేతువును నిర్మించిరి. శ్రీరామునికృపచే వారియశస్సు సర్వత్ర వ్యాపించెను. తాము మునుగుటయేగాక ఇతరులనుగూడ ముంచివేయు మహాశిలలు సముద్రములో ఓడలవలె తేలిపోవుచుండెను. ఇది సముద్రునిమహిమయు గాదు, ఱాళ్ల గుణమూగాదు, వానరులకౌశలమూగాదు. అది అంతయు రామప్రభావవిశేషము. (కర్తుమ్, అకర్తుమ్, అన్యథాకర్తుం సమర్థః = శ్రీరామః) (1-5)

1. 'రామేశ్వరః' అనుసమాసమునకు పండిత వివరణము-
రామస్య ఈశ్వరః = రామేశ్వరః = శంకరుడు రామునకు దైవము.
రామః ఈశ్వరః యస్యసః = రామేశ్వరః = రాముడు శంకరునకు దైవము.

దో- శ్రీ రఘుబీర ప్రతాప తే, సింధు తరే పాషాన ।
తే మతిమంద జె రామ తజి, భజహిం జాఇ ప్రభు ఆన ॥ 3 ॥

శ్రీ రఘువీరునిమహిమచే ఱాళ్లుగూడ సముద్రముపై తేలియాడెను. అట్టి శ్రీరాముని వీడి, ఇతర ప్రభువులను గొల్చెడి వారు మంద బుద్ధులు (దో. 3)

చౌ- బాంధి సేతు అతి సుదృఢ బనావా । దేఖి కృపానిధి కే మన భావా ॥
చలీ సేన కఛు బరని న జాఈ । గర్జహిం మర్కట భట సముదాఈ ॥ 1 ॥
సేతుబంధ ఢిగ చఢి రఘురాఈ । చితవ కృపాల సింధు బహుతాఈ ॥
దేఖన కహుఁ ప్రభు కరునా కందా । ప్రగట భఏ సబ జలచర బృందా ॥ 2 ॥
మకర నక్ర నానా ఝుష బ్యాలా । సత జోజన తన పరమ బిసాలా ॥
అఇసెఉ ఏక తిన్హహి జే ఖాహీం । ఏకన్హ కేం డర తేపి డెరాహీం ॥ 3 ॥
ప్రభుహి బిలోకహిం టరహిం న టారే । మన హరషిత సబ భఏ సుఖారే ॥
తిన్హ కీ ఓట న దేఖిఅ బారీ । మగన భఏ హరి రూప నిహారీ ॥ 4 ॥
చలా కటకు ప్రభు ఆయసు పాఈ । కో కహి సక కపి దల బిపులాఈ ॥ 5 ॥

నలుడు, నీలుడు సేతువును నిర్మించి, దానిని అత్యంతదృఢముగా జేసిరి. కరుణానిధియైన శ్రీరాముడు దానిని జూచి, మిక్కిలి సంతసించెను. వానరసేనలు ముందునకు నడచుచున్న తీరు వర్ణనాతీతము. వానర వీరులు గర్జించుచుండిరి. కృపాళువైన శ్రీరాముడు సేతువునెక్కి ఆ అపార జలనిధివిస్తృతిని తిలకించెను. ఆ దయామయుని దర్శించుటకై జలచరములన్నియును గుంపులు గుంపులుగా ఎగురుచు పైకి చేరుచుండెను. వానిలో నానావిధములైన మొసళ్లు, నక్రములు, చేపలు, సర్పములు గలవు. వాటి శరీరములు నూరు యోజనములప్రమాణము గలిగియుండెను. వాటిని మ్రింగగలిగిన జలజంతువులును గలవు. ఇవియు ఇతరజలచరములకు భయపడుచుండెను. ఇప్పుడు అవి పరస్పరవైరములు మాని ప్రభువును దర్శించుచుండెను. వానిని మళ్లించినను మఱలిపోకుండెను. అన్నియును సుఖానందడోలికలలో తేలియాడుచుండెను. అవి సర్వత్ర ఒక దానినొకటి ఒరిసికొనియుండుటచే నీరు కనబడకుండెను. ప్రభువును దర్శించిన వాటి ఆనందమునకు అవధులు లేకుండెను. ప్రభువాజ్ఞచే వానరసైన్యము ముందునకు నడువ సాగెను. ఆ వానర సైన్య వైపుల్యము వర్ణింప నలవి కానిది. (చౌ. 1-5)

దో- సేతుబంధ భఇ భీర అతి, కపి నభ పంథ ఉడాహిం ।
అపర జలచరన్హి ఊపర, చఢి చఢి పారహి జాహిం ॥ 4 ॥

చూచుచుండగనే సేతువు వానరసైన్యముతో నిండిపోయెను. కొందఱు ఆకాశములో ఎగురుచు పోవుచుండిరి. మఱి కొందఱు. జలజంతువులపై గంతులువేయుచు పోవుచుండిరి. (దో. 4)

చౌ- అస కౌతుక బిలోకి ద్వౌ భాఈ । బిహఁసి చలే కృపాల రఘురాఈ ॥
సేన సహిత ఉతరే రఘుబీరా । కహి న జాఇ కపి జూథప భీరా ॥ 1 ॥

సింధు పార ప్రభు డేరా కీన్హా । సకల కపిన్హ కహుఁ ఆయసు దీన్హా ॥
ఖాహు జాఇ ఫల మూల సుహాఏ । సునత భాలు కపి జహఁ తహఁ ధాఏ ॥ 2 ॥
సబ తరు ఫరే రామ హిత లాగీ । రితు అరు కురితు కాల గతి త్యాగీ ॥
ఖాహిఁ మధుర ఫల బిటప హలావహిఁ । లంకా సన్ముఖ సిఖర చలావహిఁ ॥ 3 ॥
జహఁ కహుఁ ఫిరత నిసాచర పావహిఁ । ఘేరి సకల బహు నాచ నచావహిఁ ॥
దసనన్హి కాటి నాసికా కానా । కహి ప్రభు సుజసు దేహిఁ తబ జానా ॥ 4 ॥
జిన్హ కర నాసా కాన నిపాతా । తిన్హ రావనహి కహీ సబ బాతా ॥
సునత శ్రవన బారిధి బంధానా । దస ముఖ బోలి ఉఠా అకులానా. ॥ 5 ॥

శ్రీరాముడును, లక్ష్మణుడును ఈ దృశ్యమును కుతూహలముతో చూచుచు, చిఱునవ్వులను చిందించుచు ముందునకు నడచుచుండిరి. వారు సేనాసహితముగ సముద్రమును దాటిరి. పరివారములన్నియును రామలక్ష్మణులతో ఆవలితీరమున విడిసినదృశ్యము వర్ణింపనెవరితరము? ఆ తీరమున శ్రీరామునకై గుడారము నిర్మింపబడెను. రుచికరములైన ఫలమూలములను భుజింపుడని వానరభల్లూకములకు ప్రభువు ఆజ్ఞను ఇచ్చెను. ఆజ్ఞను వినినంతనే వారు నలుదెసలకు పరుగెత్తిరి. శ్రీరాముని సేవకై వృక్షములన్నియును కాలగతిని, ఋతుధర్మములను పాటింపక ఫలభరితములయ్యెను. వానరభల్లూకములు మధురఫలములను ఆరగించుచు వృక్షములను కదలించుచుండెను. వారు పర్వతశిఖరములను లంక వైపునకు విసరివేయుచుండిరి. అటు నిటు సంచరించుచు రాక్షసుడెవ్వడైనను కనబడినచో వాని చుట్టును మూగి వానితో నాట్యము చేయించుచుండిరి. వానిముక్కును, చెవులను కొఱికి, ప్రభు కీర్తిని చెప్పి, వానితో చెప్పించి, విడిచి పెట్టుచుండిరి. ముక్కు, చెవులను కోల్పోయిన రాక్షసులు రావణునియొద్దకు వెళ్ళి, విషయములను వివరించిరి. సముద్రముపై సేతువును నిర్మించినారనుసమాచారమును వినగానే దశాననుడు మిక్కిలి భయపడుచు, అతివిస్మయముతో ఒక్కసారిగా పదినోళ్లతో బిగ్గరగా అఱచెను.

(చౌ॥ 1-5)

దో-బాఁధ్యో బననిధి నీరనిధి, జలధి సింధు బారీస ।
సత్య తోయనిధి కంపతి, ఉదధి పయోధి నదీస ॥ 5 ॥

ఏమీ! నిజముగా వననిధి, నీరనిధి, జలధి, సింధు, వారీశ, తోయనిధి, కంపతి, ఉదధి, పయోధి, నదీశులపై సేతునిర్మాణము జరిగెనా? (పదిముఖములచే సముద్రుని యొక్క పది పేర్లను పలికెను) అనగా వాస్తవముగానే సముద్రముపై వారధి కట్టినారా? – అని మిక్కిలి విస్మయముతో అడిగెను. (దో॥ 5)

## రావణునకు మందోదరి విన్నపము

చౌ-నిజ బికలతా బిచారి బహోరీ । బిహఁసి గయఉ గృహ కరి భయ భోరీ ॥
మందోదరీఁ సున్యో ప్రభు ఆయో । కౌతుకహీఁ పాథోధి బఁధాయో ॥ 1 ॥
కర గహి పతిహి భవన నిజ ఆనీ । బోలీ పరమ మనోహర బానీ ॥
చరన నాఇ సిరు అంచలు రోపా । సునహు బచన పియ పరిహరి కోపా ॥ 2 ॥

నాథ బయరు కీజే తాహీ సోఁ । బుధి బల సకిఅ జీతి జాహీ సోఁ ॥
తుమ్హహి రఘుపతిహి అంతర కైసా । ఖలు ఖద్యోత దినకరహి జైసా ॥ 3 ॥
అతిబల మధు కైటభ జెహిఁ మారే । మహాబీర దితిసుత సంఘారే ॥
జెహిఁ బలి బాఁధి సహసభుజ మారా । సోఇ అవతరేఉ హరన మహి భారా ॥ 4 ॥
తాసు బిరోధ న కీజిఅ నాథా । కాల కరమ జివ జాకేఁ హాథా ॥ 5 ॥

పిదప తన వ్యాకులతను గుర్తించి, తెచ్చుకొన్న నవ్వుతో బయమును కప్పిపుచ్చుకొని, అతడు తన భవనమునకు పోయెను. శ్రీరామచంద్ర ప్రభువు అవలీలగా సముద్రమునకు సేతువు గట్టి, లంకకు ఏతెంచిన విషయమును వినిన మండోదరి పతివేతిని పట్టుకొని, అతనిని తన భవనమునకు తీసికొని పోయెను. ఆమె పతిచరణములకు ప్రణమిల్లి, భర్త మనస్సు కఱుగునట్లు తన కొంగుబట్టి దీనముగా ఇట్లు ప్రార్థించెను. "ప్రాణేశ్వరా! కోపమును మాని, నా మాటలను ఆలకింపుడు. నాథా! బుద్ధిబలములస్థాయిని బట్టి, మనము జయింపగలవారితోడనే వైరము పెట్టుకొనవలెను. మీకును, శ్రీ రఘునాథునకును మధ్యగలఅంతరము దీపపుపురుగునకును, సూర్యునకును మధ్యగల అంతరము వంటిది. అత్యంతబలశాలురైన మధుకైటభులనెడి రాక్షసులను సంహరించినవాడతడు. వరాహ నరసింహ రూపములలో దితిసుతులైన హిరణ్యాక్ష, హిరణ్య కశిపులను పరిమార్చినవాడు. వామనుడై బలిచక్రవర్తిని బంధించినవాడు. పరశురాముడై సహస్ర బాహువును హతమార్చినవాడు ఐన శ్రీమహావిష్ణువే భూభారమునుబాపుటకై శ్రీరాముడుగా అవతరించినాడు. కాలము, కర్మలు, జీవులు, అతని అధీనములోనే గలవు. (నీవును జీవుడవే కావున నీకును అతడు ప్రభువే) కనుక ఆయనతో విరోధము మానుడు. (చౌ॥ 1-5)

దో- రామహి సౌఁపి జానకీ, నాఇ కమల పద మాథ ।
సుత కహుఁ రాజ సమర్పి బన, జాఇ భజిఅ రఘునాథ ॥ 6 ॥

శ్రీరామునిచరణకమలములపై తలయుంచి నమస్కరించి, జానకీదేవిని అతనికి సమర్పింపుడు. కుమారునకు రాజ్యమును అప్పగించి, వనములకు వెళ్లి, శ్రీ రఘునాథుని సేవింపుడు. (దో॥ 6)

చౌ- నాథ దీనదయాల రఘురాఈ । బాఘఉ సనముఖ గఏఁ న ఖాఈ ॥
చాహిఅ కరన సో సబ కరి బీతే । తుమ్హ సుర అసుర చరాచర జీతే ॥ 1 ॥
సంత కహహిఁ అసి నీతి దసానన । చౌథేఁపన జాఇహి నృప కానన ॥
తాసు భజను కీజిఅ తహఁ భర్తా । జో కర్తా పాలక సంహర్తా ॥ 2 ॥
సోఇ రఘుబీర ప్రనత అనురాగీ । భజహు నాథ మమతా సబ త్యాగీ ॥
మునిబర జతను కరహిఁ జెహి లాగీ । భూప రాజు తజి హోహిఁ బిరాగీ ॥ 3 ॥
సోఇ కోసలాధీస రఘురాయా । ఆయఉ కరన తోహి పర దాయా ॥
జౌఁ పియ మానహు మోర సిఖావన । సుజసు హోఇ తిహుఁ పుర అతి పావన ॥ 4 ॥

నాథా! శ్రీ రఘునాథుడు దీనదయాళువు. (అతడు తప్పక మిమ్ము క్షమించును) క్రూరమైన పులిగూడ శరణుజొచ్చిన వానిని (జంతువును) చంపదు. మీరు చేయవలసిన సమస్త కార్యములను చేసితిరి. దేవతలను, రాక్షసులనే గాక చరాచరప్రపంచమునంతటిని జయించినారు. దశాననా! రాజులు తమనాల్గవ దశ (వార్ధక్యము)లో రాజ్యమును వదలి, అడవులకు పోవలెనని సజ్జనులు తెల్పిన నీతివచనము. స్వామీ! మీరును వనములకు వెళ్లి, సృష్టి

స్థితి లయకారకుడైన పరమాత్మను భజింపుడు. నాథా! మీరు మమకారములను త్యజించి, శరణాగతవత్సలుడైన శ్రీరఘువీరుని ఆరాధింపుడు. అతనికొఱకే మునీశ్వరులు తపస్సులను ఆచరింతురు, రాజులు రాజ్యములను త్యజించి, విరాగులయ్యెదరు. అట్టి కోసలాధిపతి శ్రీరాముడు మీపై దయచూపుటకై విచ్చేసి యున్నాడు. ప్రియతమా! మీరు నా మాటలను పాటించినచో పవిత్రమైన మీ ఉజ్జ్వలకీర్తి, ముల్లోకములయందును వ్యాపించును. (చౌ॥ 1-4)

దో- అస కహి నయన నీర భరి, గహి పద కంపిత గాత ।
నాథ భజహు రఘునాథహి, అచల హోఇ అహివాత ॥ 7 ॥

ఈ విధముగా పలికి, పతివ్రతయైన మండోదరి కన్నీరు పెట్టినదై, కంపితశరీరయై పతిపాదములను పట్టుకొని, మఱలనిట్లనెను. "నాథా! శ్రీ రఘునాథుని భజింపుడు, పూజింపుడు. దాని వలన నా మాంగల్యము భద్రముగా నిల్చును." (దో॥ 7)

చౌ- తబ రావన మయసుతా ఉఠాఈ । కహై లాగ ఖల నిజ ప్రభుతాఈ ॥
సును తైం ప్రియా బృథా భయ మానా । జగ జోధా కో మోహి సమానా ॥ 1 ॥
బరున కుబేర పవన జమ కాలా । భుజ బల జితేఉఁ సకల దిగపాలా ॥
దేవ దనుజ నర సబ బస మోరేం । కవన హేతు ఉపజా భయ తోరేం ॥ 2 ॥
నానా బిధి తేహి కహేసి బుఝాఈ । సభాఁ బహోరి బైఠ సో జాఈ ॥
మందోదరీం హృదయఁ అస జానా । కాల బస్య ఉపజా అభిమానా ॥ 3 ॥
సభాఁ ఆఇ మంత్రిన్హ తేహిఁ బూఝా । కరబ కవన బిధి రిపు సైం జూఝా ॥
కహహిఁ సచివ సును నిసిచర నాహా । బార బార ప్రభు పూఛహు కాహా ॥ 4 ॥
కహహు కవన భయ కరిఅ బిచారా । నర కపి భాలు అహార హమారా ॥ 5 ॥

రావణుడు మండోదరిని లేవనెత్తి కూర్చుండ జేసెను. ఆ దుష్టుడు తనవైభవమును గూర్చి వర్ణింపసాగెను. "ఓ ప్రియా! వినుము. నీవు అనవసరముగా భయపడుచున్నావు. ఈ జగత్తులో నాకు సరితూగగల యోధుడెవడు? యమ వరుణ వాయు కుబేరాది దిక్పాలురనే గాక మృత్యువును గూడ జయించితిని. దేవతలు, రాక్షసులు, మనుష్యులు, అందఱును నాకులోబడియున్నవారే. మఱి నీ భయమునకు కారణమేమి?" ఇట్లు రావణుడనేక విధములుగా ఆమెకు నచ్చజెప్పి, మఱల తనసభకు వెళ్లెను. మృత్యువు ఆసన్నమగుటచేతనే ఇతడింతగా గర్వపడుచున్నాడని మండోదరి భావించెను. రావణుడు సభలో మంత్రులతో ఇట్లనెను. "శత్రువుతో తలపడు ఉపాయమేమి?" మంత్రులు ప్రత్యుత్తరమిచ్చిరి. "రాక్షసరాజా! మాటి మాటికిని మమ్ము ఏల ప్రశ్నించెదరు? మీరింతగా భయపడుటకుగల కారణమేమి? మానవులు, వానరులు, భల్లూకములు మనకు ఆహారమే గదా!' (చౌ॥ 1-5)

దో- సబ కే బచన శ్రవన సుని, కహ ప్రహస్త కర జోరి ।
నీతి బిరోధ న కరిఅ ప్రభు, మంత్రిన్హ మతి అతి థోరి ॥ 8 ॥

వారు చెప్పినదంతయును విని, రావణునికుమారుడైన ప్రహస్తుడు అంజలి ఘటించి యిట్లు పలికెను. "ప్రభూ! నీతికి విరుద్ధమైన ఏ పనినీ చేయవలదు. మంత్రులందఱును అల్పబుద్ధులు (వారు సరియైన సూచనలను ఇచ్చుట లేదు.) (దో॥ 8)

చౌ- కహహిఀ సచివ సఠ ఠకురసోహాతీ । నాథ న పూర ఆవ ఏహి భాఀతీ ॥
బారిధి నాఘి ఏక కపి ఆవా । తాసు చరిత మన మహుఀ సబు గావా ॥ 1 ॥
ఛుధా న రహీ తుమ్హహి తబ కాహూ । జారత నగరు కస న ధరి ఖాహూ ॥
సునత నీక ఆగేఀ దుఖ పావా । సచివన అస మత ప్రభుహి సునావా ॥ 2 ॥
జేహిఀ బారీస బఀధాయఉ హేలా । ఉతరేఉ సేన సమేత సుబేలా ॥
సో భను మనుజ ఖాబ హమ భాఈ । బచన కహహిఀ సబ గాల ఫులాఈ ॥ 3 ॥
తాత బచన మమ సును అతి ఆదర । జని మన గునహు మోహి కరి కాదర ॥
ప్రియ బానీ జే సునహిఀ జె కహహీఀ । ఐసే నర నికాయ జగ అహహీఀ ॥ 4 ॥
బచన పరమ హిత సునత కఠోరే । సునహిఀ జె కహహిఀ తె నర ప్రభు థోరే ॥
ప్రథమ బసీఠ పఠఉ సును నీతీ । సీతా దేఇ కరహు పుని ప్రీతీ ॥ 5 ॥

మంత్రులందఱును ముఖస్తుతులు చేయుచున్నారు. ప్రభూ! ఇట్టి మాటలతో ప్రయోజనము ఉండదు. ఒక వానరము సముద్రమును లంఘించి వచ్చెను. దాని అద్భుతకార్యములను అందఱును ఇప్పటికిని మనస్సులలో పొగడుచున్నారు. ఆ వానరుడు సభలో మాట్లాడునప్పుడు మీకు ఎవ్వరికిని ఆకలి కాలేదా? (వానరము మీ ఆహారమే గదా?) నగరమును తగుల బెట్టుచున్నప్పుడు అతనిని పట్టుకొని మీరేల తినలేదు. మీ మంత్రులిచ్చిన సలహాలు వినుటకు బాగుగనే యున్నవి. కాని వాటి ఫలితము మిగుల దుఃఖదాయకము. అవలీలగా సముద్రముపై సేతువును నిర్మించి, సువేల పర్వతముపై తనసేనలతో చేరియున్నవాడు సామాన్య మానవుడా? మీ తృప్తికొఱకై మంత్రులందఱును గొంతులు చించుకొనుచు ఇచ్చకములను పలుకుచున్నారు. తండ్రీ! నా మాటలను సాదరముగా వినుడు. నన్ను పిఱికివానినిగా భావింపవలదు. ప్రపంచములో పెక్కుమంది ఎదుట తీయని మాటలను మాట్లాడుదురు, వినెదరు. కాని ప్రభూ! వినుటకు చేదుగా ఉన్నను పరిణామమున శుభప్రదమైన మాటలను పలికెడివారు, వినెడివారు చాల కొద్ది మంది మాత్రమే ఉందురు. నా సూచనలను ఆలకింపుడు. మొదట మీ దూతను పంపుడు, పిమ్మట సీతాదేవిని అప్పగించి, శ్రీరామునితో స్నేహము చేయుడు. (చౌ॥ 1-5)

దో- నారి పాఇ ఫిరి జాహిఀ జౌఀ, తౌ న బఢాఇఅ రారి ।
నాహిఀ త సన్ముఖ సమర మహి, తాత కరిఅ హఠి మారి ॥ 9 ॥

ఒకవేళ శ్రీరాముడు తనభార్యతోగూడి మఱలి పోయినచో అతనితో కలహమును పెంచవలదు. యుద్ధమే అనివార్యమైనచో ఎదుర్కొని పోరాడుడు. (దో॥ 9)

చౌ- యహ మత జౌఀ మానహు ప్రభు మోరా । ఉభయ ప్రకార సుజసు జగ తోరా ॥
సుత సన కహ దసకంఠ రిసాఈ । అసి మతి సఠ కేహిఀ తోహి సిఖాఈ ॥ 1 ॥
అబహీఀ తే ఉర సంసయ హోఈ । బేనుమూల సుత భయహు ఘమోఈ ॥
సుని పితు గిరా పరుష అతి ఘోరా । చలా భవన కహి బచన కఠోరా ॥ 2 ॥
హిత మత తోహి న లాగత కైసేఀ । కాల బిబస కహుఀ భేషజ జైసేఀ ॥
సంధ్యా సమయ జాని దససీసా । భవన చలేఉ నిరఖత భుజ బీసా ॥ 3 ॥

లంకా సిఖర ఉపర ఆగారా । అతి బిచిత్ర తహఁ హోఇ అఖారా ॥
బైఠ జాఇ తేహిఁ మందిర రావన । లాగే కిన్నర గున గన గావన ॥ 4 ॥
బాజహిఁ తాల పఖాఉజ బీనా । నృత్య కరహిఁ అపఛరా ప్రబీనా ॥ 5 ॥

ప్రభూ! మీరు నా సలహాను మన్నించినచో ప్రపంచమున మీకు రెండు విధములుగా కీర్తి లభించును." దశాననుడైన రావణుడు ఈ మాటలను విని, మండిపడుచు "ఓరీ మూర్ఖుడా! నీకు ఈమాటలను ఎవరునూరి పోసిరి?" అని అఱచెను. "అప్పుడే నీ మనస్సులో భయసందేహములు కలుగుచున్నవా? వెదురు వ్రేళ్ల దగ్గర పుట్టిన పురుగు వలెనున్నావు." (ఇది వెదురును గూడ నాశనము చేయును.) తండ్రిగారిపరుషవచనములను విని, ప్రహస్తుడు "చావు దగ్గరపడిన వానికి మందులు రుచింపనట్లు నీకు మంచి మాటలు రుచింపవు." అని నిష్ఠురోక్తులను పలుకుచు ఇంటికి వెళ్లెను. సాయంకాలమైనందున దశకంఠుడు తన ఇరువది భుజములను చూచుకొనుచు తన భవనమునకు వెళ్లెను. లంకలో ఎత్తైన ఒక శిఖరముపై అతివిచిత్రమైన భవనమొకటి కలదు. అచట సంగీతనృత్యసభలు జరుగును. రావణుడు ఆ భవనమునకు చేరి, అందు ఆసీనుడయ్యెను. కిన్నరులు ఆతని గుణగణములను కీర్తించుచు గీతములను పాడసాగిరి. వీణలు, మృదంగములు, తాళములు మున్నగు వాద్యముల గోష్ఠి జరిగెను. అప్సరసలు నాట్యములాడిరి. (చౌ॥ 1-5)

దో- సునాసీర సత సరిస సో, సంతత కరఇ బిలాస ।
పరమ ప్రబల రిపు సీస పర, తద్యపి సోచ న త్రాస ॥ 10 ॥

ఈవిధముగా నిత్యము అతడు ఇంద్రవైభవములకు నూఱురెట్లుభోగములను అనుభవించుచుండెను. శ్రీరామునివంటి ప్రబలశత్రువు అతని ముంగిలి చేరియున్నను అతనికి భయమూ లేదు, చింతయును లేదు. (దో॥ 10)

చౌ- ఇహాఁ సుబేల సైల రఘుబీరా । ఉతరే సేన సహిత అతి భీరా ॥
సిఖర ఏక ఉతంగ అతి దేఖీ । పరమ రమ్య సమ సుభ్ర బిసేషీ ॥ 1 ॥
తహఁ తరు కిసలయ సుమన సుహాఏ । లఛిమన రచి నిజ హాథ డసాఏ ॥
తా పర రుచిర మృదుల మృగఛాలా । తేహి ఆసన ఆసీన కృపాలా ॥ 2 ॥
ప్రభు కృత సీస కపీస ఉఛంగా । బామ దహిన దిసి చాప నిషంగా ॥
దుహుఁ కర కమల సుధారత బానా । కహ లంకేస మంత్ర లగి కానా ॥ 3 ॥
బడభాగీ అంగద హనుమానా । చరన కమల చాపత బిధి నానా ॥
ప్రభు పాఛేఁ లఛిమన బీరాసన । కటి నిషంగ కర బాన సరాసన ॥ 4 ॥

ఇక్కడ శ్రీ రఘువీరుడు సువేలపర్వతముపై మహాయోధులుగల సైన్యముతో గూడియుండెను. ఆ పర్వతముపై ఎత్తైనమహోజ్జ్వలశిఖరమునందు పరమసుందరమైన ఒక సమతలభూమిపై లక్ష్మణుడు స్వయముగా వృక్షములలేతఆకులను, మనోహరమైన మృదుకుసుమములను తెచ్చి చక్కగా పఱచెను. వాటిపై కోమలమైన కృష్ణాజినమును ఉంచెను. కృపాళువైన శ్రీరాముడు దానిపై ఆసీనుడయ్యెను. ప్రభువు వానరరాజైన సుగ్రీవునియొడిలో

తలనుంచి విశ్రమించెను. ఎడమ వైపున ధనుస్సు, కుడివైపున అమ్ములపొది యుండెను. రెండు చేతులతో బాణములను సరిచేయుచుండెను. లంకేశుడైన విభీషణుడు ప్రభువెనికి చేరువగాఉండి రహస్యములను మాట్లాడుచుండెను. మహాభాగ్యశాలురైన అంగదహనుమంతులు ప్రభుచరణములను ఒత్తుచుండిరి. నడుమున తూణీరమును, చేతులతో ధనుర్బాణములను ధరించి, లక్ష్మణుడు వీరాసనమున ప్రభువెనుకనుండెను.

(చౌ॥ 1-4)

దో- ఎహి బిధి కృపా రూప గున, ధామ రాము ఆసీన।
ధన్య తే నర ఎహిఁ ధ్యాన జే, రహత సదా లయలీన ॥ 11(క) ॥
పూరబ దిసా బిలోకి ప్రభు, దేఖా ఉదిత మయంక।
కహత సబహి దేఖహు ససిహి, మృగపతి సరిస అసంక ॥ 11(ఖ) ॥

కృపాసౌందర్యసద్గుణోపేతుడై శ్రీరాముడు ఇట్లు శోభిల్లుచుండెను. ఈ దృశ్యమును మనస్సులో ముద్రించుకొని, ధ్యానించువారు మిగులధన్యులు. తూర్పుదిశయందు ప్రభువు చంద్రోదయమును గాంచి, ఇట్లు నుడివెను. "సింహమువలె ఆ చంద్రుడు ఎంత నిర్భయముగా నున్నాడో చూడుడు. (దో॥ 11. క,ఖ)

చౌ- పూరబ దిసి గిరిగుహా నివాసీ। పరమ ప్రతాప తేజ బల రాసీ ॥
మత్త నాగ తమ కుంభ బిదారీ। ససి కేసరీ గగన బన చారీ ॥ 1 ॥
బిథురే నభ ముకుతాహల తారా। నిసి సుందరీ కేర సింగారా ॥
కహ ప్రభు ససి మహుఁ మేచకతాఈ। కహహు కాహ నిజ నిజ మతి భాఈ ॥ 2 ॥
కహ సుగ్రీవ సునహు రఘురాఈ। ససి మహుఁ ప్రగట భూమి కై ఝాఁఈ ॥
మారెఉ రాహు ససిహి కహ కోఈ। ఉర మహఁ పరీ స్యామతా సోఈ ॥ 3 ॥
కోఉ కహ జబ బిధి రతి ముఖ కీన్హా। సార భాగ ససి కర హరి లీన్హా ॥
ఛిద్ర సో ప్రగట ఇందు ఉర మాహీఁ। తేహి మగ దేఖిఅ నభ పరిఛాహీఁ ॥ 4 ॥
ప్రభు కహ గరల బంధు ససి కేరా। అతి ప్రియ నిజ ఉర దీన్హ బసేరా ॥
బిష సంజుత కర నికర పసారీ। జారత బిరహవంత నర నారీ ॥ 5 ॥

పూర్వ దిశయనుపర్వతగుహాయందు నివసించు పరమప్రతాపవంతుడు, తేజోబల సంపన్నుడు ఐన చంద్రుడను సింహము అంధకారమనెడి మదపుటేనుగుమస్తకమును ఛేదించి, ఆకాశమనెడి వనమున నిర్భయముగా సంచరించుచున్నాడు. ఆకాశమున వెదజల్లబడిన తారలనెడి ముత్యములచే రాత్రి యనెడి స్త్రీ అలంకృతయై, మనోహరముగానున్నది. ప్రభువు మరల పలికెను. "సోదరులారా! చంద్రునిలోని ఆ మచ్చయేమిటో మీ బుద్ధిబలముతో తెల్పుడు." సుగ్రీవుడు పలికెను. "రఘునాథా! వినుడు. చంద్రునియందు భూమినీడ ప్రతిబింబించినది." మఱియొకరు పలికిరి. "రాహువు చంద్రుని గ్రహించునప్పుడు ఆయన హృదయముపై ఆనల్లని మచ్చ ఏర్పడినది." ఇంకను వేఱొకరు ఇట్లు పలికిరి. "బ్రహ్మ దేవుడు మన్మథుని భార్యయైన రతీదేవి ముఖమును తీర్చిదిద్దునపుడు చంద్రునినుండి సారభాగమును దీసెను. దానివలన చంద్రునిలో రంధ్రమేర్పడినది. ఆ రంధ్రమే

చంద్రుని హృదయమున కనబడుచున్నది. ఆకాశము యొక్క నీలచ్ఛాయ ఆ రంధ్రము నుండి గోచరించు చున్నది." శ్రీరామచంద్ర ప్రభువు ఇట్లు పలికెను. "క్షీరాబ్ధిజాతమైన విషము చంద్రునకత్యంత ప్రియ సోదరుడు. కనుక చంద్రుడు విషమును తన హృదయమునందుంచుకొనెను. విషపూరితములైన తనకిరణపుంజములను ప్రసరింపజేసి, విరహమునకు లోనైన స్త్రీ పురుషులను కాల్చివేయుచున్నాడు. (చౌ. 1-5)

దో- కహ హనుమంత సునహు ప్రభు, ససి తుమ్హార ప్రియ దాస ।
తవ మూరతి బిధు ఉర బసతి, సోఇ స్యామతా అభాస ॥ 12(క) ॥

హనుమంతుడు అప్పుడు ఇట్లనెను. "ప్రభూ వినుడు చంద్రుడు మీకు ప్రియమైన దాసుడు, మీ సుందరశ్యామలమూర్తి చంద్రుని హృదయములో నివసించుచున్నది. మీ శ్యామసుందరవర్ణమే చంద్రునిలో భాసించుచున్నది. (దో. 12. క)

నవాహ్నికపారాయణము, ఏడవ విరామము

దో- పవన తనయ కే బచన సుని, బిహఁసే రాము సుజాన ।
దచ్ఛిన దిసి అవలోకి ప్రభు, బోలే కృపానిధాన ॥ 12(ఖ) ॥

పావని వచనములను విని జ్ఞాననిధానమైన శ్రీరాముడు నవ్వుకొనెను. పిమ్మట దక్షిణ దిశవైపు చూచి, కృపానిధియైన ఆ ప్రభువు విభీషణునితో పలికెను. (దో. 12. ఖ)

చౌ- దేఖు బిభీషన దచ్ఛిన ఆసా । ఘన ఘమండ దామినీ బిలాసా ॥
మధుర మధుర గరజఇ ఘన ఘోరా । హోఇ బృష్టి జని ఉపల కఠోరా ॥ 1 ॥
కహత బిభీషన సునహు కృపాలా । హోఇ న తడిత న బారిద మాలా ॥
లంకా సిఖర ఉపర అగారా । తహఁ దసకంధర దేఖ అఖారా ॥ 2 ॥
ఛత్ర మేఘడంబర సిర ధారీ । సోఇ జను జలద ఘటా అతి కారీ ॥
మందోదరీ శ్రవన తాటంకా । సోఇ ప్రభు జను దామినీ దమంకా ॥ 3 ॥
బాజహిఁ తాల మృదంగ అనూపా । సోఇ రవ మధుర సునహు సురభూపా ॥
ప్రభు ముసుకాన సముఝి అభిమానా । చాప చఢాఇ బాన సంధానా ॥ 4 ॥

"విభీషణా! దక్షిణదిశయందు మేఘములు దట్టముగా ఒకచోట ఎట్లులముకొనుచున్నవో చూడుము. మెఱుపులు మిఱుమిట్లు గొలుపుచున్నవి. భయంకరమైన మేఘములు మందస్వరము తీసుచు గర్జించుచున్నవి. బహుశా వడగండ్ల వానకుఱియునేమో!" విభీషణుడు పలికెను, "ఓ కృపాళూ! వినుము. మెఱుపుగాదు, మేఘసముదాయమూగాదు. లంకలో శిఖరముపై ఒక భవనము గలదు. దశకంఠుడు అక్కడ నృత్యసంగీతానందములను అనుభవించుచున్నాడు. అతడు తనశిరస్సుపై మేఘసముదాయమునుబోలిన విశాలమైన నల్లని ఛత్రమును ధరించియున్నాడు. అదియే మేఘములగుంపువలె కనబడుచున్నది. మండోదరీదేవియొక్క కర్ణాభరణములు మెఱుపులవలె తళుక్కుమనుచున్నవి. ఓ దేవాధిదేవా! అక్కడి మృదంగతాళధ్వనులే మధురముగా వినబడుచున్నవి. రావణునిఅహంకారమును గుర్తించి, ప్రభువు చిఱునవ్వుతో ధనుస్సును ఎక్కుపెట్టి బాణమును సంధించెను.
(చౌ. 1-4)

దో- ఛత్ర ముకుట తాటంక తబ, హతే ఏకహిం బాన ।
సబ కేం దేఖత మహి పరే, మరము న కోఊ జాన ॥ 13(క) ॥
అస కౌతుక కరి రామ సర, ప్రబిసేఉ ఆఇ నిషంగ ।
రావన సభా ససంక సబ, దేఖి మహా రసభంగ ॥ 13(ఖ) ॥

ప్రభువు ఒకేబాణముతో రావణునిఛత్రమకుటమును, మండోదరి కర్ణతాటంకములను పడగొట్టెను. అందఱును చూచుచుండగనే అవి భూమిపై పడిపోయెను. అక్కడి వారికెవ్వరికిని అంతుపట్టక పోయెను. ఇట్టి చమత్కారమునొనర్చి, ఆ రామబాణము మఱలివచ్చి తూణీరములో చేరెను. ఇట్టి మహారసభంగదృశ్యమును గాంచి, రావణుని సభలోని వారందఱును భయభ్రాంతులైరి. (దో. 13. క,ఖ)

చౌ- కంప న భూమి న మరుత బిసేషా । అస్త్ర సస్త్ర కఛు నయన న దేఖా ॥
సోచహిం సబ నిజ హృదయ మఝారీ । అసగున భయఉ భయంకర భారీ ॥ 1 ॥
దసముఖ దేఖి సభా భయ పాఈ । బిహసి బచన కహ జుగుతి బనాఈ ॥
సిరఉ గిరే సంతత సుభ జాహీ । ముకుట పరే కస అసగున తాహీ ॥ 2 ॥
సయన కరహు నిజ నిజ గృహ జాఈ । గవనే భవన సకల సిర నాఈ ॥
మందోదరీ సోచ ఉర బసేఊ । జబ తే శ్రవనపూర మహి ఖసేఊ ॥ 3 ॥
సజల నయన కహ జుగ కర జోరీ । సునహు ప్రానపతి బినతీ మోరీ ॥
కంత రామ బిరోధ పరిహరహూ । జాని మనుజ జని హఠ మన ధరహూ ॥ 4 ॥

భూకంపమూ లేదు, గాలి వానయూ లేదు. ఏ అస్త్ర శస్త్రములును కానరావు మఱి ఈ ఛత్ర మకుటమూ, కర్ణాభరణములును ఎట్లు నేలపై వాలినవి? అందఱును దీనిని గొప్ప భయంకరాపశకునముగా తలంచిరి. సభలోని వారందఱును భయవిహ్వలురగుటను చూచి, రావణుడు కృత్రిమమైన నవ్వుతో ఇట్లు సమర్థించుకొనెను. "నాతలలు తెగిపడుటయు శుభకరమేయయినపుడు మకుటము క్రిందపడుట అపశకునము ఎట్లగును? నిశ్చింతగా నిర్భయులై మీమీగృహములకు వెళ్లి నిద్రింపుడు." అందఱును అతనికి ప్రణమిల్లి, గృహోన్ముఖులైరి. తనతాటంకములు నేలపై పడిపోయినప్పటినుండియు మండోదరికి విచారము అధికమాయెను. కన్నుల నీరు నిండగా చేతులు జోడించి, ఆమె రావణునితో పలికెను. "ఓ ప్రాణనాథా! నా విన్నపమును ఆలకింపుడు. శ్రీరామునితో విరోధమును మానుడు. అతడు మానవమాత్రుడను భావమును మనస్సునుండి తొలగింపుడు. (చౌ. 1-4)

దో- బిస్వరూప రఘుబంస మని, కరహు బచన బిస్వాసు ।
లోక కల్పనా బేద కర, అంగ అంగ ప్రతి జాసు ॥ 14 ॥

నా మాటను విశ్వసింపుడు. రఘువంశశిరోమణియైన శ్రీరామచంద్రుడు విశ్వరూపుడు. జగత్తంతయు ఆయనరూపమే. ఆయనప్రత్యంగమునందును చతుర్దశభువనములు కలవని వేదములు తెలుపుచున్నవి. (దో. 14)

చౌ- పద పాతాల సీస అజ ధామా । అపర లోక అఁగ అఁగ బిశ్రామా ॥
భృకుటి బిలాస భయంకర కాలా । నయన దివాకర కచ ఘన మాలా ॥ 1 ॥

జాసు ఘ్రాన అస్వినీకుమారా । నిసి అరు దివస నిమేష అపారా ॥
శ్రవన దిసా దస బేద బఖానీ । మారుత స్వాస నిగమ నిజ బానీ ॥ 2 ॥
అధర లోభ జమ దసన కరాలా । మాయా హాస బాహు దిగపాలా ॥
ఆనన అనల అంబుపతి జీహా । ఉతపతి పాలన ప్రలయ సమీహా ॥ 3 ॥
రోమ రాజి అష్టాదస భారా । అస్థి సైల సరితా నస జారా ॥
ఉదర ఉదధి అధగో జాతనా । జగమయ ప్రభు కా బహు కలపనా ॥ 4 ॥

విశ్వరూపుడైన శ్రీరామునకు పాతాళము చరణములు. బ్రహ్మలోకము మస్తకము. ఇతరాంగములన్నియును సమస్తలోకములకు నివాసస్థానములు. ఆయన భృకుటిసంచలనమే భయంకరకాలుడు. సూర్యచంద్రులే ఆయన నేత్రములు. కేశరాశియే మేఘసమూహము. అశ్వనీ కుమారులు ఆయన నాసారంధ్రములు. ఆయన యొక్క కనురెప్ప పాటులవలన రాత్రింబవళ్ళు ఏర్పడుచున్నవి. ఆయన చెవులు దశదిశలు అనియు, శ్వాసయే వాయువనియు ఆయనవాణియైన వేదములు నుడువుచున్నవి. లోభమే ఆయన అధరము. భయంకరమైన దంతసమూహమే మృత్యు దేవత. మాయయే అతని నవ్వు. దిక్పాలురు అతనిభుజములు. అగ్ని ముఖము, వరుణుడు నాలుక. సృష్టి స్థితి లయములు ఆతని నిత్య కృత్యములు. అష్టాదశ విధములైన అసంఖ్యాక వనస్పతులు అతని రోమావళి. పర్వతములే ఆతని ఎముకలు, నదులాతని నరములు. సముద్రమే ఉదరము. క్రింది ఇంద్రియములు నరకము. ఈ విధముగా ప్రభువు జగన్మయుడు. ఇంతకంటె ఎక్కువ కల్పనలతో పనిలేదు. (చౌ॥ 1-4)

దో- అహంకార సివ బుద్ధి అజ, మన ససి చిత్త మహాన ।
మనుజ బాస సచరాచర, రూప రామ భగవాన ॥ 15(క) ॥
అస బిచారి సును ప్రానపతి, ప్రభు సన బయరు బిహాఇ ।
ప్రీతి కరహు రఘుబీర పద, మమ అహివాత న జాఇ ॥ 15(ఖ) ॥

శివుడే అతని అహంకారము. బ్రహ్మ ఆతని బుద్ధి. చంద్రుడు మనస్సు. అతని చిత్తము విష్ణువు. చరాచర రూపుడైన భగవంతుడే మనుష్యరూపుడైన శ్రీరాముడుగా అవతరించెను. ప్రాణనాథా! వినుడు. బాగుగా ఆలోచించి, శ్రీరామునితో వైరమును మాని, ఆయనచరణములపై భక్తిని నిలుపుడు. దానివలన నా మాంగల్యము శాశ్వతముగా నిలబడును." (దో॥ 15. క,ఖ)

చౌ- బిహఁసా నారి బచన సుని కానా । అహో మోహ మహిమా బలవానా ॥
నారి సుభాఉ సత్య సబ కహహీఁ । అవగున ఆఠ సదా ఉర రహహీఁ ॥ 1 ॥
సాహస అనృత చపలతా మాయా । భయ అబిబేక అసౌచ అదాయా ॥
రిపు కర రూప సకల తైఁ గావా । అతి బిసాల భయ మోహి సునావా ॥ 2 ॥
సో సబ ప్రియా సహజ బస మోరేఁ । సముఝి పరా ప్రసాద అబ తోరేఁ ॥
జానిఉఁ ప్రియా తోరి చతురాఈ । ఏహి బిధి కహహు మోరి ప్రభుతాఈ ॥ 3 ॥

తవ బలకహీ గూఢ మృగలోచని । సముఝత సుఖద సునత భయ మోచని ॥
మందోదరి మన మహుఁ అస ఠయఉః । పియహి కాల బస మతిభ్రమ భయఉః ॥ 4 ॥

తన భార్యవచనములను చెవులారవినిన రావణుడు ఆమెను గేలిచేయుచు బిగ్గరగా నవ్వి, ఇట్లనెను. "ఆహా! మోహప్రభావము ఎంత బలవత్తరమైనది? స్త్రీ హృదయమున ఎనిమిది దోషములుండునని కవులు పేర్కొనిన విషయము సత్యమే గదా! సాహసము, అనృతము, చాపల్యము, మాయ, భయము, అవివేకము, అపవిత్రత, దయారాహిత్యము, అనునవియే ఈ ఎనిమిది దోషములు. నీవు నా బద్ధవిరోధి యొక్క విరాట్ స్వరూపమును కీర్తించి, నన్ను మిక్కిలి భయపెట్ట జూచితివి. కాని ప్రియా! ఇప్పుడు నీ చాతుర్యమును గ్రహించితిని. ఈచరాచరవిశ్వమంతయును నా గుప్పిటనున్నది. బ్రహ్మ శివ వరుణ కుబేరాదులందఱును నావశములోని వారు. నీ దయవలన నాకు ఇప్పుడు అది తేటతెల్లమైనది. ఈ నెపముతో నీవు నావైభవమునే వర్ణించితివి. (విశ్వరూపుడగుశత్రువు నా వశములోనున్నాడు) ఓ మృగలోచనా! నీ మాటలు మిక్కిలి గంభీరములు, భావయుక్తములు. వీని అవగాహన చేసికొనిన వారికి భయము తొలగి సుఖము కలుగును". కాలము సమీపించుటచే పతికి మతిభ్రమించినదని మందోదరి భావించెను. (చౌ॥ 1-4)

దో- ఏహి బిధి కరత బినోద బహు, ప్రాత ప్రగట దసకంధ ।
సహజ అసంక లంకపతి, సభాఁ గయఉ మద అంధ ॥ 16(క) ॥

అజ్ఞానవశమున ఈ విధమైన హాసవిలాసములతో రావణునకు తెల్లవారెను. సహజముగా కఠినాత్ముడును, మదాంధుడును ఐన లంకాధిపతి తనసభాభవనమున ప్రవేశించెను. (దో॥ 16. క)

సో- ఫూలఇ ఫరఇ న బేత, జదపి సుధా బరషహిఁ జలద ।
మూరుఖ హృదయఁ న చేత, జౌఁ గుర మిలహిఁ బిరంచి సమ ॥ 16(ఖ) ॥

మేఘములు అమృతజలములను వర్షించినను బెత్తముతీగ పుష్పింపదు, ఫలింపదు. అట్లే బ్రహ్మయే వచ్చి ఉపదేశించినను మూర్ఖుని హృదయమున జ్ఞానము ఉదయింపదు. (సో॥ 16. ఖ)

చౌ- ఇహాఁ ప్రాత జాగే రఘురాఈ । పూఛా మత సబ సచివ బోలాఈ ॥
కహహు బేగి కా కరిఅ ఉపాఈ । జామవంత కహ పద సిరు నాఈ ॥ 1 ॥
సును సర్బగ్య సకల ఉర బాసీ । బుధి బల తేజ ధర్మ గున రాసీ ॥
మంత్ర కహఉఁ నిజ మతి అనుసారా । దూత పఠాఇఅ బాలికుమారా ॥ 2 ॥
నీక మంత్ర సబ కే మన మానా । అంగద సన కహ కృపానిధానా ॥
బాలితనయ బుధి బల గున ధామా । లంకా జాహు తాత మమ కామా ॥ 3 ॥
బహుత బుఝాఇ తుమ్హహి కా కహఊఁ । పరమ చతుర మైఁ జానత అహఊఁ ॥
కాజు హమార తాసు హిత హోఈ । రిపు సన కరేహు బతకహీ సోఈ ॥ 4 ॥

ఇక్కడ సువేలశైలముపై శ్రీ రఘునాథుడు ప్రాతఃకాలమునే మేల్కొని, మంత్రులందఱిని రప్పించి, 'కర్తవ్య మేమో తెలుపుడు" అని వారిని కోరెను. జాంబవంతుడు శ్రీరామునిచరణములకు మ్రొక్కి, పలికెను. "ఓ సర్వజ్ఞా! ప్రాణుల అంతఃకరణములయందు వసించువాడా! బుద్ధిబలతేజములకును, ధర్మగుణములకును నిధానమైనవాడా! వినుడు. నాకుతోచిన సలహాను ఇచ్చెదను. వాలిపుత్రుడైన అంగదుని 'దూత'గా పంపుడు" ఈ ప్రతిపాదన అందఱికిని నచ్చెను. కృపాళువైన శ్రీరాముడు అంగదునితో పలికెను. "ఓ వాలి తనయా! బుద్ధిబలగుణనిధానమా! నాయనా! నా కార్యమునకై నీవు లంకకు ఏగుము. నీకు అంతగా ఉపదేశింప పనిలేదు. నీవు మిక్కిలి కార్య శూరుడవని నేను ఎఱుగుదును. మనపని సఫలమగునట్లును, శత్రువునకు హితమగునట్లును మాట్లాడుము. (చౌ॥ 1-4)

## అంగద రాయబారము

సో- ప్రభు అగ్యా ధరి సీస, చరన బంది అంగద ఉఠెఉ ।
సోఇ గున సాగర ఈస, రామ కృపా జా పర కరహు ॥ 17(క) ॥
స్వయంసిద్ధ సబ కాజ, నాథ మోహి ఆదరు దియఉ ।
అస బిచారి జుబరాజ, తన పులకిత హరషిత హియఉ ॥ 17(ఖ) ॥

శ్రీరామచంద్ర ప్రభువుఆజ్ఞను శిరసావహించి, ఆయన చరణములకు ప్రణమిల్లి అంగదుడు పలికెను. "ప్రభూ! మీ కృపకునోచుకొనినవారు సద్గుణ నిధులయ్యెదరు. మీ కార్యములన్నియును స్వయం సిద్ధములు. స్వామీ! నన్ను ఈ పనికి నియోగించి, ఆదరించితిరి" ఇట్లు పలుకుచుండగా అంగదుని హృదయము ఆనందతరంగితమైనది. శరీరము పులకితమైనది. (సో॥ 17. క,ఖ)

చౌ- బంది చరన ఉర ధరి ప్రభుతాఈ । అంగద చలెఉ సబహి సిరు నాఈ ॥
ప్రభు ప్రతాప ఉర సహజ అసంకా । రన బాఁకురా బాలిసుత బంకా ॥ 1 ॥
పుర పైఠత రావన కర బేటా । ఖేలత రహా సో హోఇ గై భేటా ॥
బాతహిఁ బాత కరష బఢ़ి ఆఈ । జుగల అతుల బల పుని తరునాఈ ॥ 2 ॥
తెహిఁ అంగద కహుఁ లాత ఉఠాఈ । గహి పద పటకెఉ భూమి భవాఁఈ ॥
నిసిచర నికర దేఖి భట భారీ । జహఁ తహఁ చలే న సకహిఁ పుకారీ ॥ 3 ॥
ఏక ఏక సన మరము న కహహీఁ । సముఝి తాసు బధ చుప కరి రహహీఁ ॥
భయఉ కొలాహల నగర మఝారీ । ఆవా కపి లంకా జెహిఁ జారీ ॥ 4 ॥
అబ ధౌఁ కహా కరిహి కరతారా । అతి సభీత సబ కరహిఁ బిచారా ॥
బిను పూఛేఁ మగు దేహిఁ దిఖాఈ । జెహి బిలోక సోఇ జాఇ సుఖాఈ ॥ 5 ॥

శ్రీరామచరణములకు వందనమాచరించి, ఆయన వైభవమును హృదయమున నిలుపుకొని, అందఱికిని నమస్కరించి, అంగదుడు బయలుదేఱెను. అతనిహృదయము ప్రభుప్రతాపపూర్ణమై యుండెను. రణధీరుడైన వాలిపుత్రుడు సహజముగా నిర్భయుడు. అతడు లంకానగరమును ప్రవేశింపగనే అక్కడ ఆటలలోనున్న

రావణపుత్రుడు అతనిని కలిసికొనెను. ఆ ఇద్దరి మధ్య మాటలుపెరిగినవి. ఇద్దఱును మిక్కిలి బలశాలురు, యువకులు. రావణకుమారుడు అంగదుని తన్నుటకై కాలెత్తెను. వెంటనే అంగదుడు వానికాలిని పట్టుకొని, గిరగిర త్రిప్పి నేలకేసి కొట్టి, అక్కడికక్కడే వానిని హతమార్చెను. రాక్షసులగుంపులు గొప్పయోధుడు వచ్చినాడని తలంచి, వారు వెంటనే పాఱిపోయిరి. భయముతో బిగ్గరగా అరవలేకపోయిరి. రావణకుమారునిమరణవార్త తెలిసియు, అందఱును మిన్నకుండిరి. ఒకరితోనొకరు రహస్యముగాగూడ సంభాషించుకొనరైరి. మునుపు లంకను గాల్చిన వానరుడే మఱలవచ్చినాడనువార్త నగరమంతయు ప్రాకెను. ఇకముందు విధాత మనకు ఎట్టి కీడు తలపెట్టునో యని అందఱును భయభ్రాంతులై విచారపడసాగిరి. అడుగకుండగనే వారు అంగదునకు రావణ సభామార్గమును జూపిరి. అంగదుని చూపులుపడినవారు అందఱును భయముతో వణకుచు శుష్కితులైరి. (చౌ. 1-5)

దో- గయఉ సభా దరబార తబ, సుమిరి రామ పద కంజ ।
సింహ ఠవని ఇత ఉత చితవ, ధీర బీర బల పుంజ ॥ 18 ॥

పిమ్మట ధీరవీరమహాబలుడైన అంగదుడు శ్రీరామచరణములను స్మరించుచు, సభాభవనద్వారము నొద్దకు చేరి, సింహపు ఠీవితో ఇటు నటు చూడసాగెను. (దో. 18)

చౌ- తురత నిసాచర ఏక పఠావా । సమాచార రావనహి జనావా ॥
సునత బిహఁసి బోలా దససీసా । ఆనహు బోలి కహాఁ కర కీసా ॥ 1 ॥
ఆయసు పాఇ దూత బహు ధాఏ । కపికుంజరహి బోలి లై ఆఏ ॥
అంగద దీఖ దసానన బైసేఁ । సహిత ప్రాన కజ్జలగిరి జైసేఁ ॥ 2 ॥
భుజా బిటప సిర స్పంగ సమానా । రోమావలీ లతా జను నానా ॥
ముఖ నాసికా నయన అరు కానా । గిరి కందరా ఖోహ అనుమానా ॥ 3 ॥
గయఉ సభాఁ మన నేకు న మురా । బాలితనయ అతిబల బాఁకురా ॥
ఉఠే సభాసద కపి కహుఁ దేఖీ । రావన ఉర భా క్రోధ బిసేషీ ॥ 4 ॥

వెంటనే అతడు ఒక రాక్షసునిద్వారా రావణునకు తనరాకను విన్నవించెను. అది వినగానే రావణుడు పరిహసించుచు "తీసికొని రమ్ము, ఎక్కడి వానరమో చూచెదము" అనెను. రావణుని 'అనుజ్ఞ కాగానే పెక్కుమంది రాక్షసులు పరుగు పరుగున వెళ్లి, కపికుంజరుడైన అంగదుని పిలుచుకొని వచ్చిరి. ప్రాణముగల ఒక కాటుకకొండవలెనున్న నల్లని రావణుని అంగదుడు చూచెను. అతని భుజములు వృక్షములవలెను, తలలు గిరిశిఖరములవలెను ఉండెను. శరీరముపైగల రోమావళి పెక్కుతీగలవలె ఒప్పుచుండెను. నోళ్ళు, ముక్కులు, నేత్రములు, చెవులు పర్వతగుహలవలెను, బిలములవలెను ఉండెను. మహా బలశాలియు, సాటిలేని వీరుడును ఐన వాలిసూనుడు ఏ మాత్రము జంకుగొంకులులేకుండ సభాభవనమును ప్రవేశించెను. అంగదుని గాంచి, సభాసదులందఱును లేచి నిలుచుండిరి. ఇది చూచి, రావణుని హృదయము క్రోధముతో ఉడికి పోయెను. (చౌ. 1-4)

దో- జథా మత్త గజ జూథ మహుఁ, పంచానన చలి జాఇ ।
రామ ప్రతాప సుమిరి మన, బైఠ సభాఁ సిరు నాఇ ॥ 19 ॥

మదపుటేనుగులమధ్య సింహమువలె నిర్భయముగా అంగదుడు సభను ప్రవేశించి, శ్రీరాముని ప్రతాపమును స్మరించుచు తలనువంచి కూర్చుండెను. (దో॥ 19)

చౌ- కహ దసకంఠ కవన తైఀ బందర । మైఀ రఘుబీర దూత దసకంధర ॥
మమ జనకహి తోహి రహీ మితాఈ । తవ హిత కారన ఆయఉఀ భాఈ ॥ 1 ॥
ఉత్తమ కుల పులస్తి కర నాతీ । సివ బిరంచి పూజెహు బహు భాఀతీ ॥
బర పాయహు కీన్హెహు సబ కాజా । జీతెహు లోకపాల సబ రాజా ॥ 2 ॥
నృప అభిమాన మోహ బస కింబా । హరి ఆనిహు సీతా జగదంబా ॥
అబ సుభ కహా సునహు తుమ్హ మోరా । సబ అపరాధ ఛమిహి ప్రభు తోరా ॥ 3 ॥
దసన గహహు తృన కంఠ కుఠారీ । పరిజన సహిత సంగ నిజ నారీ ॥
సాదర జనకసుతా కరి ఆగేఀ । ఏహి బిధి చలహు సకల భయ త్యాగేఀ ॥ 4 ॥

దశగ్రీవుడు "ఓరీ! వానరా! నీవెవ్వడవు?" అని ప్రశ్నించెను. అంగదుడు ఇట్లు ప్రత్యుత్తరము నిచ్చెను. "ఓ దశాననా! నేను రఘువీరుని దూతను. నా తండ్రి వాలికిని నీకును మైత్రియుండుటచే నీ మేలుగోరి ఇచటికి వచ్చితిని. నీది ఉత్తమవంశము. నీవు పులస్త్యమునిమనుమడవు. శివుని, బ్రహ్మను పెక్కురీతుల పూజించి యుంటివి. వారినుండి వరములను పొంది, నీ కార్యములనన్నింటిని సఫలమొనర్చుకొనియుంటివి. లోక పాలురను, సమస్తరాజన్యులను జయించితివి. రాజననుగర్వముననూ, మోహకారణముననూ జగజ్జననియైన సీతాదేవిని అపహరించితివి. నీకు శుభప్రదమైన వచనమును తెలిపెదను వినుము. నా మాట వినినచో శ్రీరామచంద్ర ప్రభువు నీ అపరాధములను అన్నింటిని క్షమింపగలడు. పండ్ల (దంతముల) మధ్య ఎండు గడ్డిపోచను, కంఠమున గొడ్డలిని ఉంచుకొనుము. (అనగా ఆవువలె సరళస్వభావము గలిగి, వినమ్రతతో నీదురభిమానమును త్యజించి, శరణాగతుడవుకమ్ము.) నీ భార్యలను, పరివారములను వెంటనిడుకొని, సీతాదేవిని ముందుంచి, భయమును వీడి, ప్రభువునొద్దకు పొమ్ము. (చౌ॥ 1-4)

దో- ప్రనతపాల రఘుబంసమని, త్రాహి త్రాహి అబ మోహి ।
ఆరత గిరా సునత ప్రభు, అభయ కరైగో తోహి ॥ 20 ॥

'ఓ శరణాగత రక్షకా! రఘువంశ శిరోమణీ! నన్ను రక్షింపుము, రక్షింపుము' అని వేడుకొనుము. అపుడునీ ఆర్తనాదమును ఆలకించి, ప్రభువైన శ్రీరాముడు నిన్ను భయరహితునిగా జేయును." (దో॥ 20)

చౌ- రే కపిపోత బోలు సంభారీ । మూఢ న జానెహి మోహి సురారీ ॥
కహు నిజ నామ జనక కర భాఈ । కెహి నాతేఀ మానిఐ మితాఈ ॥ 1 ॥
అంగద నామ బాలి కర బేటా । తాసోఀ కబహుఀ భఈ హీ భేటా ॥
అంగద బచన సునత సకుచానా । రహా బాలి బానర మైఀ జానా ॥ 2 ॥
అంగద తహీఀ బాలి కర బాలక । ఉపజెహు బంస అనల కుల ఘాలక ॥
గర్భ న గయహు బ్యర్థ తుమ్హ జాయహు । నిజ ముఖ తాపస దూత కహాయహు ॥ 3 ॥

అబ కహు కుసల బాలి కహఁ అహఈ । బిహఁసి బచన తబ అంగద కహఈ ॥
దిన దస గఏఁ బాలి పహిఁ జాఈ । బూఝేహు కుసల సఖా ఉర లాఈ ॥ 4 ॥
రామ బిరోధ కుసల జసి హోఈ । సో సబ తోహి సునాఇహి సోఈ ॥
సును సఠ భేద హోఇ మన తాకేఁ । శ్రీరఘుబీర హృదయ నహిఁ జాకేఁ ॥ 5 ॥

రావణుడు పలికెను. "ఓరీ! పిల్లకోతీ! మాటలను జాగ్రత్తగా రానిమ్ము, మూర్ఖుడా! దేవతలకు నేను శత్రువునని నీ వెఱుంగవు. నీ పేరును, నీ తండ్రి పేరును చెప్పుము. నీ తండ్రికిని నాకును మైత్రి ఎట్టిది?" అంతట అంగదుడు ఇట్లనెను. "నా పేరు అంగదుడు. నేను వాలికుమారుడను. నీవెప్పుడైనను మా తండ్రిని కలిసి యుంటివా?" అంగదుని మాటలను వినినంతనే రావణుడు కొంత జంకెను. పిమ్మట ఇట్లు పలికెను. "ఆ! ఔను, ఇప్పుడు జ్ఞప్తికి వచ్చినది. 'వాలి' అని ఒక వానరము ఉండెడిది. ఓరీ! అంగదా! నీవు వాలి కొడుకువా? కులనాశకుడా! నీ కులమనెడి వెదురు సమూహములమధ్య నీవు అగ్నివలె జన్మించితివి. నీవు నీతల్లి గర్భమునమున్నప్పుడే ఏల మరణింపలేదు. నీజన్మ వ్యర్థము. తాపసులకు దూతగా వచ్చినట్లు నీవే చెప్పుకొంటివి. వాలి క్షేమ సమాచారములను తెల్పుము. ఇప్పుడతడు ఎక్కడనున్నాడు?" అప్పుడు అంగదుడు నవ్వి, ప్రత్యుత్తరమిచ్చెను. పది దినముల తరువాత నీవే వాలి కడకు వెళ్ళి, నీ మిత్రుని హృదయమునకు హత్తుకొని, అతని క్షేమసమాచారములను అడుగుదువు లెమ్ము. శ్రీరామునితో వైరముపెట్టుకొనినచో ఎట్టి క్షేమము కలుగునో అతడే నీకు తెలుపును. ఓరీ! శఠుడా! శ్రీ రఘువీరుడు ఉండని మనస్సులోనే నీభేదనీతి ప్రభావము ఏర్పడవచ్చును. (చౌ॥ 1-5)

దో- హమ కుల ఘాలక సత్య తుమ్హ, కులపాలక దససీస ।
అంధఉ బధిర న అస కహహిం, నయన కాన తవ బీస ॥ 21 ॥

ఓరీ! దశాననా! నిజమే. నేను కులనాశకుడను. నీవు కులరక్షకుడవు. ఈ మాటలను గ్రుడ్డి వారును, చెవిటి వారును సైతము పలుకరు. నీకు మాత్రము ఇఱువది కన్నులు, ఇఱువది చెవులును కలవు. (దో॥ 21)

చౌ- సివ బిరంచి సుర ముని సముదాఈ । చాహత జాసు చరన సేవకాఈ ॥
తాసు దూత హోఇ హమ కుల బోరా । అఇసిహుఁ మతి ఉర బిహర న తోరా ॥ 1 ॥
సుని కఠోర బానీ కపి కేరీ । కహత దసానన నయన తరేరీ ॥
ఖల తవ కఠిన బచన సబ సహఊఁ । నీతి ధర్మ మైఁ జానత అహఊఁ ॥ 2 ॥
కహ కపి ధర్మసీలతా తోరీ । హమహుఁ సునీ కృత పర త్రియ చోరీ ॥
దేఖీ నయన దూత రఖవారీ । బూడి న మరహు ధర్మ బ్రతధారీ ॥ 3 ॥
కాన నాక బిను భగిని నిహారీ । ఛమా కీన్హి తుమ్హ ధర్మ బిచారీ ॥
ధర్మసీలతా తవ జగ జాగీ । పావా దరసు హమహుఁ బడభాగీ ॥ 4 ॥

శివుడు, బ్రహ్మ, మొదలగు దేవతలును, మునీశ్వరులును, శ్రీరామునిపాదసేవలకై ఉవ్విళ్లూరు చుందురు. అతని దూతగా వచ్చిన నేను నా కులమును నాశమొందించితినా? ఇట్టి బుద్ధిగల నీ హృదయమేల ముక్కలు కాలేదు?" అంగదుని పరుష వచనములను విని, రావణుడు కన్నులెఱ్ఱజేసి పలుక సాగెను. "ఓరీ! అధముడా! నేను నీతిధర్మములను ఎఱింగినవాడను గావున నీ కఠోరవచనములను సహించితిని." అంగదుడు నుడివెను. 'పర స్త్రీని

దొంగిలించికొనివచ్చిన నీ ధర్మ శీలమును గూర్చి నేనును వినియుంటిని. దూత నేవిధముగా నీవు కాపాడితివో నేను స్వయముగా చూచితిని. ఓరీ! ధర్మాచరణ పరాయణా! నీటమునిగి ఏల చావవు? ముక్కుచెవులు కోయబడిన నీ చెల్లెలిని జూచి, నీవు ధర్మమును గూర్చి, ఆలోచించి, క్షమించినావా? నీ ధర్మశీలము జగద్విదితము. నీ దర్శనమైనందులకు మిక్కిలి అదృష్టవంతుడను." (చౌ. 1-4)

దో- జని జల్పసి జడ జంతు కపి, సఠ బిలోకు మమ బాహు ।
లోకపాల బల బిపుల ససి, గ్రసన హేతు సబ రాహు ॥ 22(క) ॥
పుని నభ సర మమ కర నికర, కమలన్హి పర కరి బాస ।
సోభత భయఉ మరాల ఇవ, సంభు సహిత కైలాస ॥ 22(ఖ) ॥

రావణుడు వచించెను. "ఓరీ! మూఢుడా! వానరుడా! వ్యర్థప్రలాపములను చేయవలదు. శఠుడా! నాభుజములను చూడుము. లోకపాలురవిశాలబలమనెడి చంద్రుని గ్రసించుటలో రాహువువంటివి. ఆకాశమనెడి సరోవరమున నా భుజములనెడి కమలములపై కైలాససహితముగా శివుడు హంసవలె శోభిల్లిన విషయమును నీవు వినియే యుందువు. (దో. 22. క,ఖ)

చౌ- తుమ్హరే కటక మాఝ సును అంగద । మో సన భిరిహి కవన జోధా బద ॥
తవ ప్రభు నారి బిరహఁ బలహీనా । అనుజ తాసు దుఖ దుఖీ మలీనా ॥ 1 ॥
తుమ్హ సుగ్రీవ కూలద్రుమ దోఊ । అనుజ హమార భీరు అతి సోఊ ॥
జామవంత మంత్రీ అతి బూఢా । సో కి హోఇ అబ సమరారూఢా ॥ 2 ॥
సిల్పి కర్మ జానహిఁ నల నీలా । హై కపి ఏక మహా బలసీలా ॥
ఆవా ప్రథమ నగరు జెహిఁ జారా । సునత బచన కహ బాలికుమారా ॥ 3 ॥
సత్య బచన కహు నిసిచర నాహా । సాఁచెహుఁ కీస కీన్హ పుర దాహా ॥
రావన నగర అల్ప కపి దహఈ । సుని అస బచన సత్య కో కహఈ ॥ 4 ॥
జో అతి సుభట సరాహెహు రావన । సో సుగ్రీవ కేర లఘు ధావన ॥
చలఇ బహుత సో బీర న హోఈ । పఠవా ఖబరి లేన హమ సోఈ ॥ 5 ॥

అంగదా! వినుము. మీ సేనలో నన్ను ఎదిరింపగల సాహసి ఎవ్వడో తెలుపుము. నీ ప్రభువు తనభార్యా విరహముతో దుర్బలుడైనాడు. ఆయనదుఃఖములో పాలుపంచుకొనిన ఆతని తమ్ముడు శక్తిహీనుడైనాడు. నీవును, సుగ్రీవుడూ నదీతీరముననున్న వృక్షములవంటివారు. (వరదలు వచ్చినచో నిలువజాలనివారు) నా తమ్ముడు విభీషణుడు ఉత్త పిరికివాడు. మంత్రి జాంబవంతుడు వృద్ధుడు. అతడును యుద్ధములో నిలువజాలడు. నలుడును, నీలుడును శిల్పకర్మను దప్పవేఱేమియును ఎఱుగరు? ఐతే ఒక్క వానరుడు మాత్రము ఆ సేనలో బలిష్ఠుడు గలడు అతడు మునుపు వచ్చి, లంకను కాల్చి వెళ్లినాడు" ఇది వినగానే వాలి సుతుడైన అంగదుడు పలికెను. "రాక్షస రాజా! రావణా! సత్యము వచింపుము. ఆ వానరుడు నిజముగా నీ నగరమును కాల్చియుండెనా? విశ్వవిజేతయైన రావణునినగరమును ఒక చిన్నవానరము కాల్చ గలదా? ఈ మాటలు సత్యములని నమ్ముట యెట్లు? ఓ రావణా! ఉత్తమయోధుడని నీవు పొగడిన వాడు సుగ్రీవుని పనికై పరుగెత్తు చిన్న సంచారదూత మాత్రమే. అతడు ఎక్కువ

దూరము నడువగలడు. వీరుడుగాడు. కేవలము వార్తలను తెలిసికొనివచ్చుటకై అతనిని మేము పంపియుంటిమి.
(చౌ॥ 1-5)

దో- సత్య నగరు కపి జారేఉ, బిను ప్రభు ఆయసు పాఇ।
ఫిరి న గయఉ సుగ్రీవ పహిం, తేహిం భయ రహా లుకాఇ ॥ 23(క) ॥
సత్య కహహి దసకంఠ సబ, మోహి న సుని కఛు కోహ।
కొఉ న హమారేం కటక అస, తో సన లరత జో సోహ ॥ 23(ఖ) ॥
ప్రీతి బిరోధ సమాన సన, కరిఅ నీతి అసి ఆహి।
జౌం మృగపతి బధ మేడుకన్హి, భల కి కహఇ కొఉ తాహి ॥ 23(గ) ॥
జద్యపి లఘుతా రామ కహుం, తోహి బధేం బడ దోష।
తదపి కఠిన దసకంఠ సును, ఛత్ర జాతి కర రోష ॥ 23(ఘ) ॥
బక్ర ఉక్తి ధను బచన సర, హృదయ దహేఉ రిపు కీస।
ప్రతిఉత్తర సడసిన్హ మనహుం, కాఢత భట దససీస ॥ 23(ఙ) ॥
హంసి బోలేఉ దసమౌలి తబ, కపి కర బడ గున ఏక।
జో ప్రతిపాలఇ తాసు హిత, కరఇ ఉపాయ అనేక ॥ 23(చ) ॥

ఆ వానరుడు నిజముగా తన ప్రభువాజ్ఞలేనిదే మీ నగరమును కాల్చినాడా? ఆ భయమువలననే అతడు మరల సుగ్రీవుని యొద్దకు రాకుండ ఎక్కడో దాగికొనినాడు. దశకంఠా! నీవు నుడువునది సత్యమే. ఆ సమాచారమును వినిన నాకు ఏ మాత్రము కోపము వచ్చుట లేదు. నిజముగా మా సేనలో నీతో పోట్లాడుటవలన ఎవ్వరికిని శోభ చేకూరదు. ప్రేమగాని, విరోధముగాని సమానులతో పెట్టుకొనవలెను. (వియ్యానికీ కయ్యానికీ ఈడూ, జోడూ కావలెను.) ఇదియే లోక నీతి. సింహము కప్పలను చంపినచో అది సింహమునకు గొప్పదనమును తెచ్చిపెట్టునా? అట్లే నిన్ను చంపుట వలన శ్రీరామునకు గొప్పదనము రాబోదు. సరిగదా అది దోషము గూడ. ఐనను దశాననా! వినుము. క్షత్రియుల కోపము అతిభయంకరము" వ్యంగ్యరూపధనుస్సునుండి వదలిన అంగదుని వచన బాణములు రావణునిహృదయమును కాల్చివేసెను. రావణుడు ఆ బాణములను తన ప్రత్యుత్తర వచనములనెడి పటకార్లతో తీసివేయసాగెను. అతడు నవ్వుచు పలికెను. "తనను పోషించిన వాని హితమునకై పెక్కు ఉపాయములను ఆశ్రయించుట వానరుని ఉదాత్తగుణము.
(దో॥ 23. క, ఖ, గ, ఘ, ఙ, చ)

చౌ- ధన్య కీస జో నిజ ప్రభు కాజా। జహం తహం నాచఇ పరిహరి లాజా ॥
నాచి కూది కరి లోగ రిఝాఈ। పతి హిత కరఇ ధర్మ నిపునాఈ ॥ 1 ॥
అంగద స్వామిభక్త తవ జాతీ। ప్రభు గున కస న కహసి ఏహి భాంతీ ॥
మైం గున గాహక పరమ సుజానా। తవ కటు రటని కరఉం నహిం కానా ॥ 2 ॥

కహ కపి తవ గున గాహకతాఈం । సత్య పవనసుత మోహి సునాఈం ॥
బన బిధంసి సుత బధి పుర జారా । తదపి న తేహిఀ కఛు కృత అపకారా ॥ 3 ॥
సోఇ బిచారి తవ ప్రకృతి సుహాఈం । దసకంధర మైంఀ కీన్హి ఢిఠాఈం ॥
దేఖేఉఀ ఆఇ జో కఛు కపి భాషా । తుమ్హరేఀ లాజ న రోష న మాఖా ॥ 4 ॥
జౌఀ అసి మతి పితు ఖాఏ కీసా । కహి అస బచన హఀసా దససీసా ॥
పితహి ఖాఇ ఖాతేఉఀ పుని తోహీ । అబహీఀ సముఝి పరా కఛు మోహీ ॥ 5 ॥
బాలి బిమల జస భాజన జానీ । హతఉఀ న తోహి అధమ అభిమానీ ॥
కహు రావన రావన జగ కేతే । మైంఀ నిజ శ్రవన సునే సును జేతే ॥ 6 ॥
బలిహి జితన ఏక గయఉ పతాలా । రాఖేఉ బాఀధి సిసున్హ హయసాలా ॥
ఖేలహిఀ బాలక మారహిఀ జాఈం । దయా లాగి బలి దీన్హ ఛోడాఈం ॥ 7 ॥
ఏక బహోరి సహసభుజ దేఖా । ధాఇ ధరా జిమి జంతు బిసేషా ॥
కౌతుక లాగి భవన లై ఆవా । సో పులస్తిముని జాఇ ఛోడావా ॥ 8 ॥

తన యజమాని సేవలో సిగ్గు విడిచి ఎక్కడైనను సరే నాట్యము చేయు వానరజాతి ధన్యము. నాట్యము చేయుచు, గంతులు వేయుచు, ప్రజలను సంతోషము పెట్టి, వానరము తన యజమానికి మేలు చేయును. ఇది దాని ధర్మనిరతికి తార్కాణము. అంగదా! మీ జాతి వారందఱును స్వామిభక్తిపరాయణులే. కావున నీ స్వామి గుణములను పొగడకుండ ఎట్లుండ గలవు? నేను సద్గుణములను ఆదరించెదను. చతురుడను. కావున నీ కఠోర వాచాలత్వమునుగూడ నేను పట్టించు కొనలేదు." అంగదుడు పలికెను. "నీ గుణగ్రహణ లక్షణము సత్యము. నాకు హనుమంతుడు వినిపించెను. అతడశోకవనమును నాశమొనర్చి, నీ పుత్రుని సంహరించి, నీ నగరమును బుగ్గి చేసెను. ఐనను నీవు గుణగ్రాహివి గనుక అతడు నీకట్టి కీడును తలపెట్టియుండలేదు. నీ మంచి స్వభావమును, విషయములనన్నింటిని నేనిప్పుడు ప్రత్యక్షముగా చూచితిని. నీకు సిగ్గులేదు, కోపము లేదు, రోతయును లేదు." అప్పుడు రావణుడు "ఓరీ! వానరుడా! నీవింతటి బుద్ధిశాలివగుటవలననే నీ తండ్రి మృతికి కారణమైతివి." అని పల్కుచు అట్టహాసము చేసెను. అంగదుడు పలికెను. "నా తండ్రికే గాదు నీ మరణమునకును కారణమయ్యెదను. ఇప్పుడే నా మనస్సునకు ఒక విషయము తట్టినది. ఓరీ! అధమాభిమానీ! నీవు వాలినిర్మలయశస్సునకు ప్రత్యక్ష ప్రమాణమగుటచే నిన్ను చంపుట లేదు. ఓరీ! రావణా! ప్రపంచములో రావణులు ఎంతమంది కలరు? నాకు తెలిసిన రావణులను గూర్చి నేను తెలిపెదను. ఒక రావణుడు బలిచక్రవర్తిని జయించుటకై పాతాళమున కేగగా అక్కడి పిల్లలు వానిని గుఱ్ఱపుశాలలో కట్టివేసి ఆడుకొనుచు వానిని తమ కాళ్ళతో తన్నుచుండిరి. బలికి అతనిపై దయ గలిగి విడిపించెను. మఱొక రావణుని సహస్రబాహువు చూచి, జంతు విశేషముగా భావించి, పరుగెత్తి పట్టుకొనెను. కుతూహలముతో తనయింటికి తీసుకొని వెళ్లగా పులస్త్యముని వానిని విడిపించెను. (చౌ॥ 1-8)

దో- ఏక కహత మొహి సకుచ అతి, రహా బాలి కీఀ కాఀఖ ।
ఇన్హ మహుఀ రావన తైఀ కవన, సత్య బదహి తజి మాఖ ॥ 24 ॥

మఱియొక రావణుని గూర్చి తెల్పుటకు నాకు సంకోచముగా నున్నది. వానిని వాలి చాలకాలము తన చంకలలో ఇరికించుకొనెను. వీరిలో నీవు ఏ రావణుడవు? కోపగింపక నిజము పలుకుము." (దో॥ 24)

చౌ- సును సఠ సోఇ రావన బలసీలా । హరగిరి జాన జాసు భుజ లీలా ॥
జాన ఉమాపతి జాసు సురాఈ । పూజేఉఁ జేహి సిర సుమన చఢాఈ ॥ 1 ॥
సిర సరోజ నిజ కరన్హి ఉతారీ । పూజేఉఁ అమిత బార త్రిపురారీ ॥
భుజ బిక్రమ జానహిఁ దిగపాలా । సఠ అజహూఁ జిన్హ కేఁ ఉర సాలా ॥ 2 ॥
జానహిఁ దిగ్గజ ఉర కఠినాఈ । జబ జబ భిరఉఁ జాఇ బరిఆఈ ॥
జిన్హ కే దసన కరాల న ఫూటే । ఉర లాగత మూలక ఇవ టూటే ॥ 3 ॥
జాసు చలత డోలతి ఇమి ధరనీ । చఢత మత్త గజ జిమి లఘు తరనీ ॥
సోఇ రావన జగ బిదిత ప్రతాపీ । సునేహి న శ్రవన అలీక ప్రలాపీ ॥ 4 ॥

రావణుడిట్లు పలికెను. ఓరీ! మూర్ఖుడా! నా భుజపరాక్రమమునుగూర్చి శివునికైలాసమునకు తెలియును. నా శిరస్సులను పుష్పములుగా ఉమాపతికి సమర్పించి పూజించితిని. నేను ఆ రావణుడను. నా శిరస్సులనెడి కమలములను పెక్కు పర్యాయములు త్రిపురారికి సమర్పించి, ఆయనను సేవించితిని. ఓరీ! శఠుడా! నా భుజ పరాక్రమము దిక్పాలురకు తెలియును. వారి హృదయములపై నేర్పడిన గాయములు ఈ నాటికిని ఉన్నవి. నా గుండెలగట్టితనము దిగ్గజములును ఎఱుంగును. ఏలనన నేను వాటితో తల పడినప్పుడు అవి తమభయంకరములైన కోఱలతో నా వక్షఃస్థలమును క్రుమ్మినవి. వనను ఒక్క మచ్చను గూడ ఏర్పఱచలేక పోయినవి. పైగా ఆ దంతములే ముల్లంగికాడలవలె ముక్కలు ముక్కలైనవి. మదపుటేనుగు ఎక్కిన చిన్న నావవలె నేను నడచునపుడు భూమి డోలాయమానమగును. జగత్ప్రసిద్ధుడైన ఆ రావణుడను నేను. ఓరీ! వ్యర్థప్రలాపీ! నా గురించి ఎప్పుడును విని యుండలేదా? (చౌ॥ 1-4)

దో- తెహి రావన కహఁ లఘు కహసి, నర కర కరసి బఖాన ।
రే కపి బర్బర ఖర్బ ఖల, అబ జానా తవ గ్యాన ॥ 25 ॥

అట్టి ప్రతాపశాలియైన రావణుని అల్పునిగా భావించి, ఒక మనుష్యమాత్రుని పొగడుచున్నావు. దుష్టుడా! అసభ్యవర్తనుడా? తుచ్ఛవానరుడా నీ బుద్ధి తెలిసినది." (దో॥ 25)

చౌ- సుని అంగద సకోప కహ బానీ । బోలు సఁభారి అధమ అభిమానీ ॥
సహసబాహు భుజ గహన అపారా । దహన అనల సమ జాసు కుఠారా ॥ 1 ॥
జాసు పరసు సాగర ఖర ధారా । బూడే నృప అగనిత బహు బారా ॥
తాసు గర్బ జేహి దేఖత భాగా । సో నర క్యోఁ దససీస అభాగా ॥ 2 ॥
రామ మనుజ కస రే సఠ బంగా । ధన్వీ కాము నదీ పుని గంగా ॥
పసు సురధేను కల్పతరు రూఖా । అన్న దాన అరు రస పీయూషా ॥ 3 ॥
బైనతేయ ఖగ అహి సహసానన । చింతామని పుని ఉపల దసానన ॥
సును మతిమంద లోక బైకుంఠా । లాభ కి రఘుపతి భగతి అకుంఠా ॥ 4 ॥

రావణుని వచనములను విని, అంగదుడు మిక్కిలి క్రుద్ధుడై పలికెను. "ఓరీ! అధముడా! దురభిమానీ! ఆలోచించుకొని మాట్లాడుము. తేజఃప్రతాపశాలియైన భార్గవ రామునిపరశువనెడి దావాగ్నికి సహస్ర బాహువుయొక్క భుజములనెడి వనము ఆహుతియైనది. ఆయన గండ్రగొడ్డలితీక్ష్ణధారాసముద్రములో అసంఖ్యాకులైన రాజులు మునిగి

పోయిరి. అట్టి పరశురాముని గర్వము శ్రీరాముని చూడగానే పటాపంచలయ్యెను. అట్టి మహాత్ముడైన శ్రీరాముడు మానవమాత్రుడెట్లగును? మూర్ఖుడా! శ్రీరాముడు సామాన్య మానవుడా? మన్మథుడు సామాన్య ధనుర్ధారియగునా? గంగాదేవి సర్వ సాధారణ నదియా? కామధేనువు సామాన్యమైన పశువా? కల్పవృక్షమొక సాధారణ పాదపమేనా? అన్నదానము ఒక సామాన్య దానమా? అమృతమొక సాధారణ రసమా? గరుడుడు ఒక సామాన్య పక్షియా? సహస్ర ముఖుడైన శేషుడు ఒక సాధారణసర్పమా? చింతామణి ఒక సామాన్యమైన రాయియా? మూర్ఖుడా! వైకుంఠము ఒక సాధారణలోకమా? శ్రీ రఘురామునిపై గల అఖండభక్తి ఇతర లాభములవలె సర్వసామాన్యమైనదా? (చౌ॥ 1-4)

దో- సేన సహిత తవ మాన మథి, బన ఉజారి పుర జారి ।
కస రే సఠ హనుమాన కపి, గయఉ జో తవ సుత మారి ॥ 26 ॥

సైన్య సహితముగా నీ మదమణచి, అశోక వనమును ధ్వంస మొనర్చి, నీ 'అక్ష' కుమారుని హతమార్చి, లంకను గాల్చి, హాయిగా తిరిగి వెళ్ళిన హనుమంతుడు వానరమాత్రుడనుకొంటివా? (దో॥ 26)

చౌ- సును రావన పరిహరి చతురాఈ । భజసి న కృపాసింధు రఘురాఈ ॥
జౌం ఖల భఏసి రామ కర ద్రోహీ । బ్రహ్మ రుద్ర సక రాఖి న తోహీ ॥ 1 ॥
మూఢ బృథా జని మారసి గాలా । రామ బయర అస హోఇహి హాలా ॥
తవ సిర నికర కపిన్హ కే ఆగేం । పరిహహిం ధరని రామ సర లాగేం ॥ 2 ॥
తే తవ సిర కందుక సమ నానా । ఖేలిహహిం భాలు కీస చౌగానా ॥
జబహిం సమర కోపిహి రఘునాయక । ఛుటిహహిం అతి కరాల బహు సాయక ॥ 3 ॥
తబ కి చలిహి అస గాల తుమ్హారా । అస బిచారి భజు రామ ఉదారా ॥
సునత బచన రావన పరజరా । జరత మహానల జను ఘృత పరా ॥ 4 ॥

రావణా! కపటమును వీడి, కరుణాళువైన శ్రీ రఘురాముని భజింపుము. దుష్టుడా! నీవు శ్రీరామ ప్రభువుతో ఇట్లే శత్రుత్వమును పెంచుకొన్నచో నిన్ను ఆ బ్రహ్మ రుద్రాదులును కాపాడలేరు. మూఢుడా! వ్యర్థముగా నీ గొప్పలు చెప్పికొనవలదు. శ్రీరామునితో వైరము పెంచుకొనినచో ఆయన బాణముల తాకిడితో నీ శిరస్సులన్నియు తెగి, వానరుల పాదములముందు పడును. భల్లూకములు, వానరులు నీ తలలతో బంతులాటలాడెదరు. క్రుద్ధుడైన రఘురాముడును యుద్ధములో కోపగించి భయానకబాణములను సంధించి వదలినప్పుడు నీవిట్లే ప్రగల్భములాడెదవా? ఈ విషయమును యోచించి, కృపాళువైన శ్రీరాముని భజింపుము" అంగదుని వచనములను విని, మండుచున్న అగ్ని జ్వాలలలో ఆజ్యము పోసినట్లు రావణుడు పట్టరాని క్రోధముతో అత్యుగ్రుడాయెను. (చౌ॥ 1-4)

దో- కుంభకరన అస బంధు మమ, సుత ప్రసిద్ధ సక్రారి ।
మోర పరాక్రమ నహిం సునేహి, జితేఉం చరాచర ఝారి ॥ 27 ॥

అతడు పలికెను. "మహాబలశాలియైన కుంభకర్ణుడు నాకు సోదరుడు. ఇంద్రుని జయించి, వాసికెక్కిన మేఘనాదుడు నా కుమారుడు. నేను ఈ చరాచర జగత్తునంతయును జయించితిని. నా పరాక్రమమును గూర్చి నీవు వినలేదు. (దో॥ 27)

చౌ- సఠ సాఖామృగ జోరి సహాఈ । బాఁధా సింధు ఇహఇ ప్రభుతాఈ ॥
నాఘహిఁ ఖగ అనేక బారీసా । సూర న హోహిఁ తే సుము సబ కీసా ॥ 1 ॥
మమ భుజ సాగర బల జల పూరా । జహఁ బూడే బహు సుర నర సూరా ॥
బీస పయోధి అగాధ అపారా । కో అస బీర జో పాఇహి పారా ॥ 2 ॥
దిగపాలన్హ మైఁ నీర భరావా । భూప సుజస ఖల మోహి సునావా ॥
జౌఁ పై సమర సుభట తవ నాథా । పుని పుని కహసి జాసు గున గాథా ॥ 3 ॥
తౌ బసీఠ పఠవత కెహి కాజా । రిపు సన ప్రీతి కరత నహిఁ లాజా ॥
హరగిరి మథన నిరఖు మమ బాహూ । పుని సఠ కపి నిజ ప్రభుహి సరాహూ ॥ 4 ॥

ఓరీ! శఠుడా! వానరులసహాయముతో నీ స్వామి సేతువును గట్టెను. ఇది యొక ఘనకార్యమా? సముద్రమును పెక్కుపక్షులు లంఘించును. కాని అవియన్నియును శూరులలో చేరవు. ఓరీ! మూర్ఖ వానరమా! వినుము. నా ఒక్కొక్క బాహువనెడి సాగరము బలమనెడి జలములతో నిండియున్నది. అందులో పెక్కుమంది వీరులైన దేవతలును, మనుష్యులును, మునిగి అసువులను వీడిరి. నా ఈ ఇరువది అగాధ సముద్రములను దాటగల్గిన వీరుడును, శూరుడును అగు వాడెవ్వడో తెలుపుము. నేను దిక్పాలురతో వెట్టి చాకిరి చేయించుచున్నాను. నీవు ఒక రాజు కీర్తిని నాకు వినిపించుచున్నావు. నీచే పదే పదే కీర్తింపబడుచున్న గుణములను గల్గినవాడు నిజముగా యోధుడేయైనచో దూతను పంపుట యెందులకు? శత్రువునకు ప్రీతిగూర్చుటకు అతనికి సిగ్గు వేయుటలేదా? కైలాసపర్వతమునే పైకెత్తిన నా భుజములను మొదట చూడుము. ఓ మూర్ఖవానరుడా! తరువాత నీ ప్రభువును పొగడుము. (చౌ॥ 1-4)

దో- సూర కవన రావన సరిస, స్వకర కాటి జెహిఁ సీస ।
హునే అనల అతి హరష బహు, బార సాఖి గౌరీస ॥ 28 ॥

ఈ రావణునితో సమానుడగు శూరుడు ఎవ్వడో చెప్పుము. నేను స్వయముగా నా చేతులలో నా తలలను కోసి, సంతోషముగా వాటిని పెక్కు మార్లు అగ్నికి ఆహుతిగానిచ్చితిని. గౌరీ పతియైన శివుడే ఇందులకు సాక్షి. (దో॥ 28)

చౌ- జరత బిలోకెఉఁ జబహిఁ కపాలా । బిధి కే లిఖే అంక నిజ భాలా ॥
నర కేఁ కర ఆపన బధ బాఁచీ । హసెఉఁ జాని బిధి గిరా అసాఁచీ ॥ 1 ॥
సోఉ మన సముఝి త్రాస నహిఁ మోరేఁ । లిఖా బిరంచి జరఠ మతి భోరేఁ ॥
ఆన బీర బల సఠ మమ ఆగేఁ । పుని పుని కహసి లాజ పతి త్యాగేఁ ॥ 2 ॥
కహ అంగద సలజ్జ జగ మాహీఁ । రావన తోహి సమాన కోఉ నాహీఁ ॥
లాజవంత తవ సహజ సుభాఊ । నిజ ముఖ నిజ గున కహసి న కాఊ ॥ 3 ॥
సిర అరు సైల కథా చిత రహీ । తాతే బార బీస తైఁ కహీ ॥
సో భుజబల రాఖెహు ఉర ఘాలీ । జీతెహు సహసబాహు బలి బాలీ ॥ 4 ॥
సును మతిమంద దేహి అబ పూరా । కాటేఁ సీస కి హోఇఅ సూరా ॥
ఇంద్రజాలి కహుఁ కహిఅ న బీరా । కాటఇ నిజ కర సకల సరీరా ॥ 5 ॥

నా మస్తకములు అగ్నిలో కాలునప్పుడు ఒక మానవునిచే నేను మరణించుదునని నా లలాటమున బ్రహ్మ వ్రాసిన వ్రాతను జూచి, నాకు నవ్వువచ్చినది. విధాతవ్రాతలు అసత్యములు. దానిని తలచినను నాకు భయము కలుగదు. ఏలనన వృద్ధుడైన బ్రహ్మ మతిభ్రమించి, అట్లు వ్రాసియుండునని నా అభిప్రాయము. ఓరీ! శఠుడా! మర్యాద లేకుండ సిగ్గు విడిచి నీవు నా యెదుట మాటిమాటికిని వేఱొక పురుషుని వీరునిగా పొగడుటకు నీకెన్ని గుండెలు?" అంగదుడు నుడివెను. "ఓరీ! రావణా! నీ వంటి సిగ్గుదప్పినవాడు ప్రపంచములో మఱియొకడు ఉండడు. తలవంపుల జీవనము నీకు సహజము. లేనిచో నీ గుణములను నీవే కీర్తించుకొనవు. తలలను నఱకుకొనుట, కైలాసమునెత్తుట, ఈ రెండు విషయములే నీకు ఘనకార్యములుగా తోచుచున్నట్లున్నవి. అందులకే లెక్కలేనన్ని సార్లు వాటిని గూర్చి వర్ణించుచుంటివి. ఆ భుజముల బలమునే హృదయమున దాచికొని యుంటివి. దానివలననే సహస్ర బాహువును, బలిని, వాలిని జయించితివి. ఓరీ మందబుద్ధీ! వినుము. ఎక్కువగా వదరకుము. మస్తకములను తెగగోసికొనుటవలన ఎవ్వడైనను. శూరుడగునా? తన చేతితోడనే తన దేహమును కోసికొను గారడీవాడు (ఇంద్ర జాలికుడు) వీరుడగునా? (చౌ॥ 1-5)

దో- జరహిఀ పతంగ మోహ బస, భార బహహిఀ ఖర బృంద ।
తే నహిఀ సూర కహావహిఀ, సముఝి దేఖు మతిమంద ॥ 29 ॥

ఓరీ! బుద్ధి హీనుడా? దీపపు పురుగులు మోహావేశమున అగ్నిలోబడి చనిపోవును. గాడిదలు బరువులు మోయుచు నడచును. వాటిని శూరులు, వీరులు అనియందుమా? (దో॥ 29)

చౌ- అబ జని బతబఢావ ఖల కరహీ । సును మమ బచన మాన పరిహరహీ ॥
దసముఖ మైఀ న బసీఠీఀ ఆయఉఀ । అస బిచారి రఘుబీర పఠాయఉఀ ॥ 1 ॥
బార బార అస కహఇ కృపాలా । నహిఀ గజారి జసు బధేఀ సృకాలా ॥
మన మహుఀ సముఝి బచన ప్రభు కేరే । సహేఉఀ కఠోర బచన సఠ తేరే ॥ 2 ॥
నాహిఀ త కరి ముఖ భంజన తోరా । లై జాతేఉఀ సీతహి బరజోరా ॥
జానేఉఀ తవ బల అధమ సురారీ । సూనేఀ హరి ఆనిహి పరనారీ ॥ 3 ॥
తైఀ నిసిచర పతి గర్బ బహూతా । మైఀ రఘుపతి సేవక కర దూతా ॥
జౌఀ న రామ అపమానహి డరఊఀ । తోహి దేఖత అస కౌతుక కరఊఀ ॥ 4 ॥

ఓరీ! దుష్టుడా! ఇంక వివాదమును పెంచవలదు. నా మాట వినుము. గర్వమును మానుము. నేను దూత వలె సంధిచేయుటకు రాలేదు. శ్రీ రఘువీరుడు మఱియొక ఆలోచనతో నన్ను ఇక్కడికి పంపినాడు. 'గుంట నక్కను చంపుటవలన సింహమునకు కీర్తి రాదు.' అని, కృపాళువైన శ్రీరాముడు మాటి మాటికిని అనుచుండెడి వాడు. ఓరీ! దుర్మార్గుడా! ప్రభువులవచనములఆంతర్యమును గ్రహించి, నీ కఠోర వచనములను సహించినాను. లేనిచో నీ ముఖములను అన్నింటిని భగ్నములు గావించి, సీతాదేవిని తీసికొని పోయి యుండెడి వాడను. దుష్టుడా! ఓరీ! సురవైరీ! ఒంటరిగా నున్న పరస్త్రీని దొంగిలించినప్పుడే నీ శక్తి యెట్టిదో తెలిసినది. నీవు రాక్షసరాజువు. దురభిమానివి. కాని నేను శ్రీ రఘునాథుని సేవకుడైన సుగ్రీవుని దూతను. శ్రీరాముని యశస్సునకు భంగము వాటిల్లునను భయమున నేను మిన్నకుంటిని. (చౌ॥ 1-4)

దో- తోహి పటక మహి సేన హతి, చౌపట కరి తవ గాఉఁ ।
తవ జుబతిన్హ సమేత సఠ, జనకసుతహి లై జాఉఁ ॥ 30 ॥

లేనిచో నిన్ను భూమిపై పడగొట్టి, నీ సైన్యమును హతమార్చి, నీ నగరమును నాశమొనర్చి, సీతాదేవిని, నీ కుటుంబినులను తీసికొని వెళ్ళియుండెడి వాడను. (దో॥ 30)

చౌ- జౌఁ అస కరౌఁ తదపి న బడాఈ । ముఏహి బధేఁ నహిఁ కఛు మనుసాఈ ॥
కౌల కామబస కృపిన బిమూఢా । అతి దరిద్ర అజసీ అతి బూఢా ॥ 1 ॥
సదా రోగబస సంతత క్రోధీ । బిష్ను బిముఖ శ్రుతి సంత బిరోధీ ॥
తను పోషక నిందక అఘ ఖానీ । జీవత సవ సమ చౌదహ ప్రానీ ॥ 2 ॥
అస బిచారి ఖల బధఉఁ న తోహీ । అబ జని రిస ఉపజావసి మోహీ ॥
సుని సకోప కహ నిసిచర నాథా । అధర దసన దసి మీజత హాథా ॥ 3 ॥
రే కపి అధమ మరన అబ చహసీ । ఛోటే బదన బాత బడి కహసీ ॥
కటు జల్పసి జడ కపి బల జాకేఁ । బల ప్రతాప బుధి తేజ న తాకేఁ ॥ 4 ॥

ఒకవేళ నేను అట్లొనర్చినను నాకే మాత్రమూ గొప్పదనము రాబోదు. ఏలనన చచ్చినవానిని చంపుటలో పౌరుషమేమున్నది? వామమార్గమును అనుసరించువాడు, కామాతురుడు, లోభి, అత్యంత మూఢుడు, అతి దరిద్రుడు, కళంకము గలవాడు, అతి వృద్ధుడు, దీర్ఘ రోగి, నిరంతర క్రోధి, శ్రీ మహా విష్ణువునకు విముఖుడు వేదములకును, సజ్జనులకును విరోధి, అనవరతము తనశరీరపోషణచేసికొనువాడు, పరనిందాపరుడు, మహా పాపి,- ఈ పదునాలుగు మందియు బ్రతికి యున్నను చచ్చిన వారితో సమానులే. ఓరీ! దుష్టుడా! ఇట్లు భావించుటవలన నిన్ను వధింపకుంటిని. ఇప్పుడు నాకు కోపము తెప్పింపవలదు." అంగదుని మాటలకు మండిపడుచు రావణుడు పండ్లు పటపటపట కొఱకుచు, చేతులు నలుపు కొనుచు బిగ్గరగా అఱచెను. "ఓరీ! వానరాధమా! నీకు చావు మూడినది. 'పిట్టకొంచెము-కూత ఘనము'- అన్నట్లైనది. ఓ మూర్ఖ వానరుడా! నీవెవని బలము చూచుకొని, మిడిసిపడుచున్నావో ఆతనికడ బలము ప్రతాపము, బుద్ధి, తేజస్సు ఏమాత్రమూ లేవు. (చౌ॥ 1-4)

దో- అగున అమాన జాని తెహి, దీన్హ పితా బనబాస ।
సో దుఖ అరు జుబతీ బిరహ, పుని నిసి దిన మమ త్రాస ॥ 31(క) ॥
జిన్హ కే బల కర గర్బ తోహి, అఇసే మనుజ అనేక ।
ఖాహిఁ నిసాచర దివస నిసి, మూఢ సముఝు తజి టేక ॥ 31(ఖ) ॥

గుణహీనుడనియు, మానరహితుడనియు, ఎఱింగియే ఆతనితండ్రి ఆతనిని వనవాసమునకు పంపెను. ఒక వైపు ఆ దుఃఖము, దానికితోడు తన భార్యావిరహ బాధ మఱియొకవైపు అహర్నిశలు నావలని భయము ఆతనిని పట్టి పీడించుచున్నవి. అట్టి వానిని (మానవుని) బలవంతుడనుకొని గర్వపడుచున్నావు. అట్టి మానవులను మా రాక్షసులు రాత్రింబవళ్లు భక్షించుచునేయున్నారు. నీవు హఠముమాని సరిగా ఆలోచింపుము. (దో॥ 31.క.ఖ.)

చౌ- జబ తెహిఁ కీన్హి రామ కై నిందా । క్రోధవంత అతి భయఉ కపిందా ॥
హరి హర నిందా సునఇ జో కానా । హోఇ పాప గోఘాత సమానా ॥ 1 ॥
కటకటాన కపికుంజర భారీ । దుహు భుజదండ తమకి మహి మారీ ॥
డోలత ధరని సభాసద ఖసే । చలే భాజి భయ మారుత గ్రసే ॥ 2 ॥
గిరత సఁభారి ఉఠా దసకంధర । భూతల పరే ముకుట అతి సుందర ॥
కఛు తెహిఁ లై నిజ సిరన్హి సఁవారే । కఛు అంగద ప్రభు పాస పబారే ॥ 3 ॥
ఆవత ముకుట దేఖి కపి భాగే । దినహీఁ లూక పరన బిధి లాగే ॥
కీ రావన కరి కోప చలాఏ । కులిస చారి ఆవత అతి ధాఏ ॥ 4 ॥
కహ ప్రభు హఁసి జని హృదయఁ డెరాహూ । లూక న అసని కేతు నహిఁ రాహూ ॥
ఏ కిరీట దసకంధర కేరే । ఆవత బాలితనయ కే ప్రేరే ॥ 5 ॥

రావణుడు శ్రీరామ ప్రభువును నిందించుటచే కపివరుడైన అంగదుడు మిక్కిలి క్రుద్ధుడాయెను. ఏలనన హరి హరులనిందను వినువానికి గోహత్యా పాపము వచ్చును. వానర శ్రేష్ఠుడైన అంగదుడు కోపముతో పండ్లు పటపట కొఱికెను. తన రెండు హస్తములతో వేగముగా నేలను టపటప కొట్టెను. భూమి అదిరెను. సభాసదులు క్రింద పడిరి. భయవాయుగ్రస్తులై పరుగులు దీసిరి. రావణుడు పడుచు, లేచుచు తమాయించు కొని నిలబడెను. కాని అతని సుందర కిరీటములు నేల వ్రాలెను. కొన్నింటిని తీసికొని, రావణుడు తన తలలపై ధరించెను. మఱికొన్నింటిని అంగదుడు శ్రీరామచంద్రుని కడకు విసరివేసెను. ఆ మకుటముల రాకను జూచి, వానరులు గంతులు వేయుచు అఱచిరి. "విధాతా! పగలే చుక్కలు రాలుచున్నవా? లేక రావణుడు కోపముతో అతివేగముగా నాలుగు వజ్రాయుధములను పంపెనా?" శ్రీరామచంద్ర ప్రభువు నవ్వుచు పలికెను. "భయపడకుడు. ఇవి ఉల్కలుగావు. వజ్రములు కానే కావు. రాహుకేతువులును గారు. ఇవి దశాననుని కిరీటములు. వాటిని అంగదుడు విసరివేయుటవలన అవి ఇచటికి వచ్చి పడుచున్నవి. (చౌ. 1-5)

దో- తరకి పవన సుత కర గహే, ఆని ధరే ప్రభు పాస ।
కౌతుక దేఖహిఁ భాలు కపి, దినకర సరిస ప్రకాస ॥ 32(క) ॥
ఉహాఁ సకోపి దసానన, సబ సన కహత రిసాఇ ।
ధరహు కపిహి ధరి మారహు, సుని అంగద ముసుకాఇ ॥ 32(ఖ) ॥

వాయుసుతుడైన ఆంజనేయుడు ఎగిరి వాటిని తన చేతులతో పట్టుకొనెను. వాటిని తీసికొని వచ్చి ప్రభువు ముందుంచెను. సూర్యప్రభలవలె ప్రకాశించుచున్న ఆ కిరీటములను భల్లూకవానరులు ఆశ్చర్యముతో తిలకించిరి. అక్కడ క్రుద్ధుడైన దశాననుడు అందఱిపై కోపపడుచు 'ఈ వానరుని పట్టుకొనుడు, చంపి వేయుడు' అని అఱచెను. అది విని అంగదుడు ఆఁ సరే! అని అనుకొని ఒక చిఱునవ్వు నవ్వెను. (దో. 32. క,ఖ)

చౌ- ఏహి బధి బేగి సుభట సబ ధావహు । ఖాహు భాలు కపి జహఁ జహఁ పావహు ॥
మర్కటహీన కరహు మహి జాఈ । జిఅత ధరహు తాపస ద్వౌ భాఈ ॥ 1 ॥

పుని సకోప బోలేఉ జుబరాజా । గాల బజావత తోహి న లాజా ॥
మరు గర కాటి నిలజ కులఘాతీ । బల బిలోకి బిహరతి నహిఁ ఛాతీ ॥ 2 ॥
రే త్రియ చోర కుమారగ గామీ । ఖల మల రాసి మందమతి కామీ ॥
సన్యపాత జల్పసి దుర్బాదా । భఏసి కాలబస ఖల మనుజాదా ॥ 3 ॥
యాకో ఫలు పావహిగో ఆగేఁ । బానర భాలు చపేటన్హి లాగేఁ ॥
రాము మనుజ బోలత అసి బానీ । గిరహిఁ న తవ రసనా అభిమానీ ॥ 4 ॥
గిరిహహిఁ రసనా సంసయ నాహీఁ । సిరన్హి సమేత సమర మహి మాహీఁ ॥ 5 ॥

రావణుడు మరల పలికెను. "వీనిని చంపి, యోధులందఱును వెళ్లి, భల్లూకములను, వానరములను దొరకినచోట దొరకినట్లు పట్టుకొని, చంపుడు, తినుడు. ఈ నేలపై వానరజాతియే లేకుండునట్లు చేయుడు. ఆ తాపససోదరులిద్దఱిని బంధించి, ప్రాణములతో తీసికొని రండు" రావణుని క్రోధపూరితములైన అనుచితవచనములను విని, యువరాజైన అంగదుడు క్రుద్ధుడై పలికెను. "ఓరీ! ఈ విధముగా ప్రేలుటకు నీకు సిగ్గులేదా? లజ్జాహీనుడా! కులనాశకుడా! నీ గొంతును నీవే ఖండించుకొని చావుము. నా బలమును చూచిన తరువాతగూడ నీ గుండె పగులలేదా? ఓరీ! స్త్రీ చోరుడా! దుర్మార్గుడా! దుష్టుడా! మూర్ఖుడా! పాపాత్ముడా! కాముకుడా! సన్నిపాతవశమున దుర్భాషలాడుచున్నావు. నరభక్షకుడా! నీకు చావు మూడినది. వానరములు, భల్లూకములు నిన్ను చుట్టుముట్టి ముష్టిఘాతములు చేసినపుడు నీ పాపఫలమును అనుభవించెదవు. శ్రీరాముడు మానవుడా? ఇట్లు మాట్లాడిన నీనాలుకలు ఏల తెగిపడవు? అవి శిరస్సులతో గూడ రణభూమిలో క్రింద పడును. దీనికి సందేహమే లేదు. (చౌ॥ 1-5)

సో- సో నర క్యోఁ దసకంధ, బాలి బధ్యో జెహిఁ ఏక సర ।
బీసహుఁ లోచన అంధ, ధిగ తవ జన్మ కుజాతి జడ ॥ 33(క) ॥
తవ సోనిత కీఁ ప్యాస, తృషిత రామ సాయక నికర ।
తజఉఁ తోహి తెహి త్రాస, కటు జల్పక నిసిచర అధమ ॥ 33(ఖ) ॥

ఓరీ!దశకంఠా! ఒకే బాణముతో వాలిని వధించిన శ్రీరాముడు మానవమాత్రుడా? నీ ఇరువది కన్నులు గూడ గ్రుడ్డివే. జడుడా! ఛీ! నీ జన్మగూడ నీచమైనదే. శ్రీరాముని బాణములు నీ రక్తమునకై దప్పిగొన్నవి. అందులకే నీ పిచ్చి పిచ్చి వాగుడును సహించి విడిచి పెట్టుచున్నాను. (సో॥ 33. క,ఖ)

చౌ- మైఁ తవ దసన తోరిబే లాయక । ఆయసు మోహి న దీన్హ రఘునాయక ॥
అసి రిస హోతి దసఉ ముఖ తోరౌఁ । లంకా గహి సముద్ర మహఁ బోరౌఁ ॥ 1 ॥
గూలరి ఫల సమాన తవ లంకా । బసహు మధ్య తుమ్హ జంతు అసంకా ॥
మైఁ బానర ఫల ఖాత న బారా । ఆయసు దీన్హ న రామ ఉదారా ॥ 2 ॥

జాగుతి సునత రావన మునుకాఈం । మూఢ సిఖిహి కహఁ బహుత ఝుఠాఈం ॥
బాలి న కబహుఁ గాల అస మారా । మిలి తపసిన్హ తైఁ భఏసి లబారా ॥ 3 ॥
సాఁచెహుఁ మైఁ లబార భుజ బీహా । జౌఁ న ఉపారిఉఁ తవ దస జీహా ॥
సముఝి రామ ప్రతాప కపి కోపా । సభా మాఝ పన కరి పద రోపా ॥ 4 ॥
జౌఁ మమ చరన సకసి సఠ టారీ । ఫిరహిఁ రాము సీతా మైఁ హారీ ॥
సునహు సుభట సబ కహ దససీసా । పద గహి ధరని పఛారహు కీసా ॥ 5 ॥
ఇంద్రజీత ఆదిక బలవానా । హరషి ఉఠే జహఁ తహఁ భట నానా ॥
ఝపటహిఁ కరి బల బిపుల ఉపాఈం । పద న టరఇ బైఠహిఁ సిరు నాఈం ॥ 6 ॥
పుని ఉఠి ఝపటహిఁ సుర ఆరాతీ । టరఇ న కీస చరన ఏహి భాఁతీ ॥
పురుష కుజోగీ జిమి ఉరగారీ । మోహ బిటప నహిఁ సకహిఁ ఉపారీ ॥ 7 ॥

నేను నీ పండ్లను ఊడగొట్టగలను. కాని అందులకు రఘునాథుని ఆజ్ఞ లేదు. నీ తలలను పగుల గొట్టవలెనన్నంతగా, నీలంకను సముద్రముతో ముంచివేయవలెనన్నంతగా కోపము వచ్చుచున్నది. నీ లంక మేడిపండు వంటిది. మీ రాక్షసులందఱును పురుగులవలె అజ్ఞానవశమున నిర్భయముగా అందు నివసించు చున్నారు. నేను వానరుడను. పండ్లను తినుటకు నాకెంతో కాలము పట్టదు. కాని ఉదారుడైన శ్రీరాముని ఆదేశము లేదు. "అంగదుని యుక్తి యుక్తములైన మాటలను విని, రావణుడు పరిహాసముతో పలికెను. "ఓరీ! మూఢుడా! ఇట్టి అబద్ధములను ఎచ్చట నేర్చితివి. వాలి సైతము ఎన్నడును ఇట్టి ప్రగల్భములను పలుక లేదు. బహుశా ఆ తాపసులతోగూడి అబద్ధములను, ప్రగల్భములను నేర్చితివేమో?" పిమ్మట అంగదుడు నుడివెను. "ఓరీ! ఇఱువది భుజముల రావణుడా! నీ పదినాల్కలను కోసి వేయనిచో నేను నిజముగా ప్రగల్భములను, అసత్యములను పలికెడి వాడనే." శ్రీరామచంద్రుని ప్రతాపమును స్మరించుచు, అంగదుడు క్రుద్ధుడై, సభామధ్యమున నేలపై పాదమును గట్టిగా మోపుచు ప్రతిజ్ఞా పూర్వకముగ ఇట్లు పలికెను. "ఓరీ శఠుడా! నీవు నాకాలిని కదిలింప గలిగినచో శ్రీరాముడు తిరిగి వెళ్ళి పోగలడు. సీతాదేవినిగూడ వదలుకొనగలడు-" రావణుడు తన యోధులతో అనెను. "ఓ వీరులారా! వినుడు. ఈ వానరుని కాళ్లను పట్టుకొని నేలపై పడగొట్టుడు" ఇంద్రజిత్తు మొదలగు పెక్కుమంది బలిష్ఠులైన యోధులు హర్షముతో ఎక్కడి వారక్కడ లేచినిలుచుండిరి. వారుతమబలమును పూర్తిగా ఉపయోగించి, కాలును కదుపుటకు పెక్కు ఉపాయములను నడిపిరి. కాలు కొంచెము గూడ కదలలేదు. మొగములను వ్రేలాడవేసికొని తిరిగి వెళ్లి తమ తమ ఆసనములపై కూర్చుండిరి. (కాక భుశుండి పలుకు చున్నాడు) ఆ దేవతా శత్రువులందఱును ఒక్క సారిగా రివ్వున లేచి వచ్చి, అతని కాలిని పట్టుకొనిరి. కాని ఓ గరుడుడా! విషయవాసనాపరుడైన మనుజుడు తన మనస్సునుండి మోహవృక్షమును కదలింపలేనట్లు వారు అంగదుని పాదమును చీమంతైనను కదలింప లేకపోయిరి.

(చౌ॥ 1-7)

దో- కోటిన్హ మేఘనాద సమ, సుభట ఉఠే హరషాఇ ।
ఝపటహిఁ టరై న కపి చరన, పుని బైఠహిఁ సిర నాఇ ॥ 34(క) ॥

**భూమి న ఛాఁడత కపి చరన, దేఖత రిపు మద భాగ ।**
**కోటి బిఘ్న తే సంత కర, మన జిమి నీతి న త్యాగ ॥ 34(ఖ) ॥**

మేఘనాదునితో సమానమైన బలముగల అసంఖ్యాకులైన యోధులు హర్షముతో లేచి తలపడిరి. కాని అంగదుని కాలు ఏ మాత్రమూ కదలలేదు. వారందఱును సిగ్గుతో తలలు వంచుకొని, తమ తమ పీఠములపై ఆసీనులైరి. కోటి విఘ్నములు ఎదురైనను సజ్జనునిమనస్సు నీతిని వదలనట్లు అంగదుని చరణము ఆవంతైనను చలింపలేదు. ఇది చూచి శత్రువు యొక్క గర్వము అణగిపోయెను. (దో. 34. క,ఖ)

చౌ- కపి బల దేఖి సకల హియఁ హారే । ఉఠా ఆపు కపి కే పరచారే ॥
గహత చరన కహ బాలికుమారా । మమ పద గహేఁ న తోర ఉబారా ॥ 1 ॥
గహసి న రామ చరన సఠ జాఈ । సునత ఫిరా మన అతి సకుచాఈ ॥
భయఉ తేజహత శ్రీ సబ గఈ । మధ్య దివస జిమి ససి సోహఈ ॥ 2 ॥
సింఘాసన బైఠేఉ సిర నాఈ । మానహుఁ సంపతి సకల గఁవాఈ ॥
జగదాతమా ప్రానపతి రామా । తాసు బిముఖ కిమి లహ బిశ్రామా ॥ 3 ॥
ఉమా రామ కీ భృకుటి బిలాసా । హోఇ బిస్వ పుని పావఇ నాసా ॥
తృన తే కులిస కులిస తృన కరఈ । తాసు దూత పన కహు కిమి టరఈ ॥ 4 ॥
పుని కపి కహీ నీతి బిధి నానా । మాన న తాహి కాలు నిఅరానా ॥
రిపు మద మథి ప్రభు సుజసు సునాయో । యహ కహి చల్యో బాలి నృప జాయో ॥ 5 ॥
హతౌఁ న ఖేత ఖేలాఇ ఖేలాఈ । తోహి అబహిఁ కా కరౌఁ బడాఈ ॥
ప్రథమహిఁ తాసు తనయ కపి మారా । సో సుని రావన భయఉ దుఖారా ॥ 6 ॥
జాతుధాన అంగద పన దేఖీ । భయ బ్యాకుల సబ భఏ బిసేషీ ॥ 7 ॥

కపిరాజైన అంగదుని బలమును జూచి, రాక్షసులు తమ మనస్సులలోనే ఓటమిని అంగీకరించిరి. అపుడు వానరుని ప్రేరణతో రావణుడే స్వయముగా లేచెను. అతడు అంగదునిపాదమును పట్టుకొనుటకు సిద్ధపడగా వాలి పుత్రుడు పలికెను. "నా కాళ్లు పట్టుకొనినంత మాత్రమున నిన్ను ఎవ్వరును రక్షింపరు. ఓరీ! శఠుడా! నీవు వెళ్లి శ్రీరాముని పాదములను ఎందుకు పట్టుకొనవు?" ఇది విని మనస్సులోనే సిగ్గుపడుచు రావణుడు మఱలి పోయెను. అతడు తనతేజస్సును కోల్పోయెను. మధ్యాహ్నకాలమునందలి చంద్రునివలె అతడు కాంతిహీనుడయ్యెను. తలలు వంచుకొని తనసింహాసనముపై కూర్చుండెను. తన సంపదనంతయును పోగొట్టుకొనినవానివలె ఉండెను. (శివుడు పలుకుచున్నాడు) ఉమా! శ్రీరామచంద్రుడు జగత్తునకు ఆత్మ. అందఱి ప్రాణములకు స్వామి. అతనికి ప్రతికూలుడైన వానికి సుఖ శాంతులు ఎట్లు లభించును? ఆయనకనుసన్నలతోడనే (సంకల్ప మాత్రముననే) జగత్ సృష్టి, స్థితి, లయములు జరుగుచుండును. అతడు గడ్డిపోచను వజ్రముగను, వజ్రమును గడ్డిపోచగను మార్చగల మహిమాన్వితుడు. అతని దూతకు ప్రతిజ్ఞ భంగమెట్లగును? పిమ్మట అంగదుడు అనేకవిధముల నీతివాక్యములను పలికెను. కాని రావణుడు వాటిని పెడచెవిన బెట్టెను. ఏలనన వానికి చావు సమీపించినది. శత్రుగర్వమునణచి, అంగదుడు శ్రీరామునినిర్మలకీర్తిని వినిపించెను. మఱల వాలిపుత్రుడు ఈ విధముగా పలుకుచు పోయెను.

"ఆడుచుపాడుచు (పిల్లి ఎలుకును వలె) రణభూమిలో నిన్ను హతమార్చునంత వఱకు నా గొప్పదనమును గూర్చి నేను తెల్పను." అంగదుడు రాజసభకు రాక పూర్వమే తన కుమారుని చంపినాడను విషయము నెటింగి, రావణుడు మిగుల దుఃఖపడెను. అంగదుని ప్రతిజ్ఞ సఫలమగుటను జూచి, రాక్షసులందఱును భయకంపితులైరి. (చౌ॥ 1-7)

దో- రిపు బల ధరషి హరషి కపి, బాలితనయ బల పుంజ ।
పులక సరీర నయన జల, గహే రామ పద కంజ ॥ 35(క) ॥
సాఁఝ జాని దసకంధర, భవన గయఉ బిలఖాఇ ।
మందోదరీఁ రావనహి, బహురి కహా సముఝాఇ ॥ 35(ఖ) ॥

శత్రుబలమును నిర్వీర్యమొనర్చి, బలశాలియైన వాలిపుత్రుడు ప్రసన్నచిత్తుడై మఱలి వచ్చి శ్రీరామచంద్రుని చరణ కమలములపై వ్రాలెను. అతనితనువు పులకించెను. కనులు ఆనందాశ్రు పూర్ణములయ్యెను. సంధ్యా సమయమైనందున రావణుడు విచార గ్రస్తుడై తన భవనమునకేగెను. మందోదరి మఱల తనపతికి ఇట్లు నచ్చజెప్పసాగెను. (దో॥ 35. క,ఖ)

చౌ- కంత సముఝి మన తజహు కుమతిహీ । సోహ న సమర తుమ్హహి రఘుపతిహీ ॥
రామానుజ లఘు రేఖ ఖచాఈ । సోఉ నహిఁ నాఘేహు అసి మనుసాఈ ॥ 1 ॥
పియ తుమ్హ తాహి జితబ సంగ్రామా । జాకే దూత కేర యహ కామా ॥
కౌతుక సింధు నాఘి తవ లంకా । ఆయఉ కపి కేహరీ అసంకా ॥ 2 ॥
రఖవారే హతి బిపిన ఉజారా । దేఖత తోహి అచ్ఛ తెహిఁ మారా ॥
జారి సకల పుర కీన్హేసి ఛారా । కహాఁ రహా బల గర్బ తుమ్హారా ॥ 3 ॥
అబ పతి మృషా గాల జని మారహు । మోర కహా కఛు హృదయఁ బిచారహు ॥
పతి రఘుపతిహి నృపతి జని మానహు । అగ జగ నాథ అతులబల జానహు ॥ 4 ॥
బాన ప్రతాప జాన మారీచా । తాసు కహా నహిఁ మానెహి నీచా ॥
జనక సభాఁ అగనిత భూపాలా । రహే తుమ్హఉ బల అతుల బిసాలా ॥ 5 ॥
భంజి ధనుష జానకీ బిఆహీ । తబ సంగ్రామ జితెహు కిన తాహీ ॥
సురపతి సుత జానఇ బల థోరా । రాఖా జిఅత ఆఁఖి గహి ఫోరా ॥ 6 ॥
సూపనఖా కై గతి తుమ్హ దేఖీ । తదపి హృదయఁ నహిఁ లాజ బిసేషీ ॥ 7 ॥

ప్రాణేశ్వరా! బాగుగా ఆలోచించి, మీ దురాలోచనలను వీడుడు. మీకును శ్రీ రఘునాథునకును మధ్య యుద్ధము తగదు. (అతనితో యుద్ధము చేయుటకు మీరు యోగ్యులు కారు.) అతని తమ్ముడైన లక్ష్మణుడు గీచిన గీతమగూడ మీరు దాటలేకపోయితిరి. ఇదియే మీ సామర్థ్యము. అతని దూతయొన్నో ఘనకార్యములాచరించెను. అట్టి ప్రభువును మీరు యుద్ధమున జయింపగలరా? ప్రాణనాథా! ఆ కపిసింహము హనుమంతుడు అవలీలగా సముద్రమును లంఘించి, మీ లంకలో నిర్భయముగా ప్రవేశించెను. అశోకవనములోని రక్షకులను వధించి, దానిని ధ్వంసము చేసెను.

మీరు చూచుచుండగనే అక్షకుమారుని వధించెను. లంకను పూర్తిగా కాల్చి బూడిద చేసెను. అప్పుడు మీ బలగర్వమేమైనది? స్వామీ! ఇప్పుడు ఈ అసత్యడంబములను పలుకవద్దు. నా మాటలను శ్రద్ధగా ఆలకింపుడు. స్వామీ! శ్రీరామచంద్రుని కేవలము ఒక రాజుగా భావింపకుడు. ఆయనను చరాచరజగత్తునకు ప్రభువుగా, అద్వితీయపరాక్రమశాలిగా ఎఱుంగుడు. అతని బాణధాటిని మారీచుడు ఎఱింగియుడెను. కాని మీరు ఆతని సలహానుగూడ వినలేదు. ఆతని మాటలను చులకనచేసితిరి. జనకునిసభలో పెక్కుమంది రాజులుండిరి. అసమాన బలశాలురైన మీరుగూడ అక్కడనే యుంటిరి. ధనుర్భంగమొనర్చి, అతడు జానకిని వివాహమాడెను. అప్పుడు యుద్ధములో అతనిని మీరేల జయింపలేదు? ఇంద్రునికుమారుడైన జయంతుడు (వాయసము) ఆతని బలమును కొంత యెఱుగును. శ్రీరాముడు కేవలము ఒక కంటిని మాత్రమే పొగొట్టి, ఆతనిని ప్రాణములతో విడిచి పెట్టెను. శూర్పణఖదుర్దశను మీరు స్వయముగా చూడనే చూచితిరి. ఐనను 'ఆతనితో పోరాడగలన'ని తలంచుటకు మీకు సిగ్గువేయుట లేదా? (చౌ॥ 1-7)

దో- బధి బిరాధ ఖర దూషనహి, లీలాఀ హత్యో కబంధ ।
బాలి ఏక సర మార్యో, తెహి జానహు దసకంధ ॥ 36 ॥

ఓ దశకంఠా! విరాధుని, ఖరదూషణాదులను చంపి, లీలా మాత్రముగా కబంధుని వధించి, ఒకే బాణముతో వాలిని సంహరించిన శ్రీరాముని అపక్రపరాక్రమమును స్మరింపుడు. ఈ సంఘటనలన్నింటిని మీరును ఎఱుగుదురు. దీనివలననైనను శ్రీరామునిమహత్త్వమును తెలిసికొనుడు. (దో॥ 36)

చౌ- జెహిఀ జలనాథ బఁధాయఉ హేలా । ఉతరే ప్రభు దల సహిత సుబేలా ॥
కారునీక దినకర కుల కేతూ । దూత పఠాయఉ తవ హిత హేతూ ॥ 1 ॥
సభా మాఝ జెహిఀ తవ బల మథా । కరి బరూథ మహుఀ మృగపతి జథా ॥
అంగద హనుమత అనుచర జాకే । రన బాఀకురే బీర అతి బాఀకే ॥ 2 ॥
తెహి కహఀ పియ పుని పుని నర కహహూ । ముధా మాన మమతా మద బహహూ ॥
అహహ కంత కృత రామ బిరోధా । కాల బిబస మన ఉపజ న బోధా ॥ 3 ॥
కాల దండ గహి కాహు న మారా । హరఇ ధర్మ బల బుద్ధి బిచారా ॥
నికట కాల జెహి ఆవత సాఈఀ । తెహి భ్రమ హోఇ తుమ్హారిహి నాఈఀ ॥ 4 ॥

అనాయాసముగా సముద్రముపై వారధిని నిర్మించి, తనసైన్యముతోగూడి సువేలపర్వతముపై దిగిన సూర్యవంశ శ్రేష్ఠుడు కరుణామయుడును ఐన శ్రీరామచంద్ర ప్రభువు మీ హితమును గోరియే తనదూతను పంపెను. ఆ దూత నిండుసభలో ఏనుగుల గుంపులో సింహమువలె మీ బలమును నిస్తేజమొనర్చెను. అట్టి హనుమంతుడు, అంగదుడు మొదలగు మహాయోధులు పెక్కుమంది ఆయనకు సేవకులుగా ఉన్నారు. అట్టి మహావీరుని మీరు మాటి మాటికిని 'మానవుడు' 'తాపసుడు' అని పలుకుచు, అభిమానగర్వమమకార భారములను మూర్ఖముగా మోయుచున్నారు. ప్రియా! నాథా! శ్రీరామునితో వైరము పూనుట దుఃఖహేతువు. కాలుని వశమగుటచే మీకు జ్ఞానోదయమగుట లేదు. కాలుడు తన దండముతో నెవ్వరినీ కొట్టడు. కాని ధర్మమును, బలమును, బుద్ధిని విచక్షణాశక్తిని హరించును. స్వామీ! కాలము ఆసన్నమైనవాడు మీవలె స్వయముగా భ్రమలో పడిపోవును. (చౌ॥ 1-4)

దో- దుఇ సుత మరే దహేఉ పుర, అజహుఁ పూర పియ దేహు ।
కృపాసింధు రఘునాథ భజి, నాథ బిమల జసు లేహు ॥ 37 ॥

మీ పుత్రులు ఇరువురును చంపబడిరి. నగరము అగ్నికి ఆహుతి చేయబడెను. నాథా! అయినదేదో ఐనది. ఇప్పుడైనను మీ తప్పును దిద్దుకొని, కృపాసింధువైన రఘునాథుని భజింపుడు. నిర్మల యశస్సును పొందుడు"
(దో॥ 37)

చౌ- నారి బచన సుని బిసిఖ సమానా । సభాఁ గయఉ ఉఠి హోత బిహానా ॥
బైఠ జాఇ సింఘాసన ఫూలీ । అతి అభిమాన త్రాస సబ భూలీ ॥ 1 ॥
ఇహాఁ రామ అంగదహి బోలావా । ఆఇ చరన పంకజ సిరు నావా ॥
అతి ఆదర సమీప బైఠారీ । బోలే బిహఁసి కృపాల ఖరారీ ॥ 2 ॥
బాలితనయ కౌతుక అతి మోహీ । తాత సత్య కహు పూఛఉఁ తోహీ ॥
రావను జాతుధాన కుల టీకా । భుజ బల అతుల జాసు జగ లీకా ॥ 3 ॥
తాసు ముకుట తుమ్హ చారి చలాఏ । కహహు తాత కవనీ బిధి పాఏ ॥
సును సర్బగ్య ప్రనత సుఖకారీ । ముకుట న హోహిఁ భూప గున చారీ ॥ 4 ॥
సామ దాన అరు దండ బిభేదా । నృప ఉర బసహిఁ నాథ కహ బేదా ॥
నీతి ధర్మ కే చరన సుహాఏ । అస జియఁ జాని నాథ పహిఁ ఆఏ ॥ 5 ॥

ములుకులవంటి తనభార్యపలుకులను వినియు వాటిని పట్టించుకొనక, తెల్ల వాఱగనే లేచి, యథా ప్రకారము రావణుడు తనసభాభవనమునకు చేరెను. భయమును మఱచి, గర్వముతో పొంగిపోవుచు అతడు సింహాసనముపై కూర్చుండెను. ఇక్కడ సువేలపర్వతముపై శ్రీరాముడు అంగదుని పిలిపించెను. అతడు వచ్చి శ్రీరాముని చరణ కమలములకు శిరసా ప్రణమిల్లెను. అంతట ఖరారి అతనిని సాదరముగా తన యొద్ద కూర్చుండ బెట్టుకొని, చిఱునవ్వుతో పలికెను. "ఓ వాలి పుత్రా! నాకు వినుటకు చాల కుతూహలముగా ఉన్నది. సత్యము వచింపుము. రావణుడు రాక్షసవంశశిరోమణి. అతని అతులిత భుజబలము జగత్ప్రసిద్ధము గదా! అతని నాలుగుకిరీటములను నాయొద్దకు విసరివేసితివి. నాయనా! అవి నీకెట్లు లభించినవి?"- అంగదుడు పలికెను. "ఓ సర్వజ్ఞా! శరణాగతవత్సలా! వినుడు. అవి మకుటములుగావు. అవి నాల్గును రాజ గుణములు. స్వామీ! సామ, దాన, భేద, దండోపాయములు నాల్గును రాజునందు నివసించుచుండునని వేదములు పల్కును. 'రావణుడు అధర్మపరుడు. మీచరణములు నీతిధర్మములచే శోభిల్లుచున్నవి, అని భావించియే అవి మీ యొద్దకు చేరినవి. మీ చరణములచెంత అవి శోభిల్లినవి.
(చౌ॥ 1-5)

దో- ధర్మహీన ప్రభు పద బిముఖ, కాల బిబస దససీస ।
తెహి పరిహరి గున ఆఏ, సునహు కోసలాధీస ॥ 38(క) ॥
పరమ చతురతా శ్రవన సుని, బిహఁసే రాము ఉదార ।
సమాచార పుని సబ కహే, గఢ కే బాలికుమార ॥ 38(ఖ) ॥

దశకంఠరావణుడు ధర్మహీనుడు, ప్రభుచరణములకు విముఖుడు, కాలవశుడు. కోసలాధీశ! అందులకే ఆ గుణములు రావణుని వీడి, మిమ్ము ఆశ్రయించినవి. అంగదునివాక్చాతుర్యమునకు శ్రీరామచంద్రుడు నవ్వసాగెను. పిమ్మట వాలిసూనుడు లంకావిశేషములన్నియును తెలిపెను. (దో. 38. క,ఖ)

## లంకపైముట్టడి - రాక్షసులతో వానర భల్లూకముల పోరాటము

చౌ- రిపు కే సమాచార జబ పాఏ । రామ సచివ సబ నికట బొలాఏ ॥
లంకా బాఁకే చారి దుఆరా । కెహి బిధి లాగిఅ కరహు బిచారా ॥ 1 ॥
తబ కపీస రిచ్ఛేస బిభీషన । సుమిరి హృదయఁ దినకర కుల భూషన ॥
కరి బిచార తిన్హ మంత్ర దృఢావా । చారి అనీ కపి కటకు బనావా ॥ 2 ॥
జథాజోగ సేనాపతి కీన్హే । జూథప సకల బోలి తబ లీన్హే ॥
ప్రభు ప్రతాప కహి సబ సముఝాఏ । సుని కపి సింఘనాద కరి ధాఏ ॥ 3 ॥
హరషిత రామ చరన సిర నావహిఁ । గహి గిరి సిఖర బీర సబ ధావహిఁ ॥
గర్జహిఁ తర్జహిఁ భాలు కపీసా । జయ రఘుబీర కోసలాధీసా ॥ 4 ॥
జానత పరమ దుర్గ అతి లంకా । ప్రభు ప్రతాప కపి చలే అసంకా ॥
ఘటాటోప కరి చహుఁ దిసి ఘేరీ । ముఖహిఁ నిసాన బజావహిఁ భేరీ ॥

శత్రుసమాచారము పూర్తిగా తెలియవచ్చిన పిదప శ్రీరాముడు తనమంత్రులందఱిని దగ్గరకు పిలిచి పలికెను." లంకకు నాలుగు పెద్ద దుర్గమద్వారములున్నవి. వాటిని ముట్టడించుట యెట్లో యోచన చేయుడు అపుడు వానరరాజైన సుగ్రీవుడు, భల్లూకరాజైన జాంబవంతుడు, లంకేశుడైన విభీషణుడు సూర్యవంశభూషణుడైన శ్రీరాముని స్మరించుచు కర్తవ్యమును ఆలోచించిరి. వారు వానరసేనను నాలుగుదళములుగా విభజించిరి. వాటికి సమర్థులైన సేనాపతులను నియమించిరి. వారు (సేనాపతులు) యూథపతులనందఱిని పిలిచి, శ్రీరామచంద్రప్రభుప్రతాపమును వినిపించి ప్రోత్సహించిరి. అది విని వానరులు అందఱును సింహగర్జనలను జేయుచు పరుగులు దీసిరి. మొదట ఆనందమున శ్రీరామునిపాదములకు శిరసా ప్రణమిల్లి, 'కోసలరాజు శ్రీరామచంద్రునకు జయము, జయము'- అనుచు భల్లూకములు, వానరులు పర్వత శిఖరములను మోయుచు గర్జించుచు, గంతులు వేయుచు ముందునకు సాగిరి. లంక అజేయమైన కోట అని తెలిసియు, శ్రీరామచంద్రుని పరాక్రమప్రభావముచే వారు నిర్భయముగా వెళ్లిరి. నలుదిశలయందును వ్యాపించిన మేఘములవలె లంకకు నలువైపుల చుట్టుముట్టి, వారు నోళ్లతోడనే నగారాభేరీధ్వనులను చేయసాగిరి. (చౌ. 1-5)

దో- జయతి రామ జయ లఛిమన, జయ కపీస సుగ్రీవ ।
గర్జహిఁ సింహనాద కపి, భాలు మహా బల సీంవ ॥ 39 ॥

అపార బలశాలురైన భల్లూకవానరులు "శ్రీరామునకు జయము, లక్ష్మణునకు జయము, వానరరాజు సుగ్రీవునకు జయము"(1) అని గర్జించుచు సింహనాదములను గావించుచుండిరి. (దో. 39)

1. జయత్యతిబలో రామో లక్ష్మణశ్చమహాబలః ।
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః ॥
వాల్మీకి రామాయణము ॥ సుందర కాండము ॥

చౌ- లంకాఁ భయఉ కోలాహల భారీ । సునా దసానన అతి అహఁకారీ ॥
దేఖహు బనరన్హ కేరి ఢిఠాఈ । బిహఁసి నిసాచర సేన బొలాఈ ॥ 1 ॥
ఆఏ కీస కాల కే ప్రేరే । ఛుధావంత సబ నిసిచర మేరే ॥
అస కహి అట్టహాస సఠ కీన్హా । గృహ బైఠేఁ అహార బిధి దీన్హా ॥ 2 ॥
సుభట సకల చారిహుఁ దిసి జాహూ । ధరి ధరి భాలు కీస సబ ఖాహూ ॥
ఉమా రావనహి అస అభిమానా । జిమి టిట్టిభ ఖగ సూత ఉతానా ॥ 3 ॥
చలే నిసాచర ఆయసు మాగీ । గహి కర భిండిపాల బర సాఁగీ ॥
తోమర ముద్గర పరసు ప్రచండా । సూల కృపాన పరిఘ గిరిఖండా ॥ 4 ॥
జిమి అరునోపల నికర నిహారీ । ధావహిఁ సఠ ఖగ మాంస అహారీ ॥
చోఁచ భంగ దుఖ తిన్హహి న సూఝా । తిమి ధాఏ మనుజాద అబూఝా ॥ 5 ॥

ఆ నినాదములకు లంకలో ఉవ్వెత్తుగా కోలాహలములు చెలరేగినవి. దురహంకారియైన రావణుడు వాటిని విని "ఈ వానరుల సాహసమును పరికింపుడు" అనియనుచు నవ్వుకొనుచు తన నిశాచరసేనను పిలిపించెను. "కాలుని ప్రేరణతో ఈ వానరులందఱును వచ్చినట్లున్నారు. నా రాక్షసులందఱును ఆకలి గొనియున్నారు. బ్రహ్మదేవుడు మనకందఱికిని, బయటికి పోకుండా ఇంటికే ఆహారమును సమకూర్చినాడు." అని పలికి ఆ మూర్ఖుడు వికటాట్టహాసముతో నుడివెను. "ఓ వీరులారా! నలుదెసలకును వెళ్లుడు. భల్లూకములను వానరములను పట్టుకొని భక్షింపుడు." (శివుడు పల్కుచున్నాడు) భవానీ! కాళ్లను పైకెత్తి పండుకొను టిట్టిభపక్షి వంటిదే రావణుని గర్వము. (రాత్రి వేళ ఆకాశము తన మీద పడునేమోయను భయముతో టిట్టిభ పక్షి తన కాళ్లతో ఆకాశమును నిలుపగలనని గర్వపడును- అని ఒక కథ) ఆజ్ఞయైన వెంటనే నిశాచరులు పదునైన ఈటెలను, తోమరములను, ముద్గరములను ప్రచండములైన పరశువులను, త్రిశూలములను, పొడవైన కత్తులను, పరిఘలను, తదితరములైన వివిధాయుధములను, పర్వత శిఖరములను గైకొని బయలుదేఱిరి. మాంసాహారులైన పక్షులు ఎఱ్ఱని శిలలను జూచి, మాంసభ్రమతో వాటిపైబడి, తమ ముక్కులకు బాధ కల్గించుకొనునట్లు బుద్ధిలేని నరమాంసభక్షకులైన రాక్షసులు వానర సైన్యముల మీదికి పరుగులు దీసిరి. (చౌ॥ 1-5)

దో- నానాయుధ సర చాప ధర, జాతుధాన బల బీర ।
కోట కంగూరన్హి చఢీ గాఏ, కోటి కోటి రనధీర ॥ 40 ॥

నానా విధములైన అస్త్రశస్త్రములను ధనుర్బాణములను ధరించి, బలశాలురు, రణధీరులు, వీరులు ఐన అసంఖ్యాకులైన రాక్షసులు కోటగోడలను ఎక్కిరి. (దో॥ 40)

చౌ- కోట కఁగూరన్హి సోహహిఁ కైసే । మేరు కె సృంగని జను ఘన బైసే ॥
బాజహిఁ ఢోల నిసాన జుఝాఊ । సుని ధుని హోఇ భటన్హి మన చాఊ ॥ 1 ॥
బాజహిఁ భేరి నఫీరి అపారా । సుని కాదర ఉర జాహిఁ దరారా ॥
దేఖిన్హ జాఇ కపిన్హ కే ఠట్టా । అతి బిసాల తను భాలు సుభట్టా ॥ 2 ॥
ధావహిఁ గనహిఁ న అవఘట ఘాటా । పర్బత ఫోరి కరహిఁ గహి బాటా ॥
కటకటాహిఁ కోటిన్హ భట గర్జహిఁ । దసన ఓఠ కాటహిఁ అతి తర్జహిఁ ॥ 3 ॥

ఉత రావన ఇత రామ దోహాఈ । జయతి జయతి జయ పరీ లరాఈ ॥
నిసిచర సిఖర సమూహ ఢహావహిఁ । కూది ధరహిఁ కపి ఫేరి చలావహిఁ ॥ 4 ॥

సుమేరు గిరిపై మేఘములు క్రమ్ముకొనినట్లు రాజ ప్రాసాదముల కోట గోడలు ఒప్పారెను. డోళ్ళు, ఢంకాల మ్రోతలను విని, యోధులమనస్సులలో ఉత్సాహములు వెల్లువెత్తెను. అసంఖ్యాకములైన వాద్యఘోషలకు పిరికివారిగుండెలు అదరుచుండెను. రాక్షసులు కొంత ముందుకు నడచి, అతికాయులైన భల్లూకవానర యోధులను గాంచిరి. వానరులు ఎత్తుపల్లములయందును, సమతలముగానుండు లోయలలోను లెక్కచేయక ఎగురుచూ పరుగెత్తుచుండుటను వారు గాంచిరి. వానరయోధులు కొండలను చేతులతో పట్టుకొని, పెగులగొట్టుచు మార్గములను ఏర్పఱచుచుండిరి. పండ్లను పటపట గొఱుకుచు వానరసహజములైన భయంకర ధ్వనులతో బెదరించుచు, గర్వించుచుండిరి. శత్రువులను భయపెట్టుచుండిరి. అక్కడ రావణునకును, ఇక్కడ శ్రీరామచంద్రునకును 'జయము, జయము' అను నినాదములు మిన్నుముట్టగా యుద్ధము ప్రారంభమాయెను. రాక్షసులు కొండలను, శిఖరములను దొర్లించుచుండిరి. వానరులు ఎగిరి వాటిని పట్టుకొని, మఱల వారి మీదనే విసరి వేయుచుండిరి. (చౌ॥ 1-4)

ఛం-ధరి కుధర ఖండ ప్రచండ మర్కట భాలు గఢ పర డారహీఁ ।
ఝుపటహిఁ చరన గహి పటకి మహి భజి చలత బహురి పచారహీఁ ॥
అతి తరల తరున ప్రతాప తరపహిఁ తమకి గఢ చఢి చఢి గఏ ।
కపి భాలు చఢి మందిరన్హ జహఁ తహఁ రామ జసు గావత భఏ ॥

భయంకరముగానున్న వానరభల్లూకములు పర్వతశిలలను కోటలపై విసరుచుండిరి. నిశాచరులపైకి దూకి, వారి కాళ్లను చిక్కించు కొని, గిరగిర త్రిప్పి, వారిని నేలకేసి కొట్టుచుండిరి. పరుగెత్తుకొనిపోవువారిని యుద్ధమునకు కవ్వించుచుండిరి. అతిలాఘవము, పరాక్రమముగల వానరభల్లూకములు అవలీలగా కోటలపైకి, భవనములమీదికి ఎక్కి, శ్రీరాముని యశోవైభవములను కీర్తించుచుండిరి. (ఛం)

దో- ఏకు ఏకు నిసిచర గహి, పుని కపి చలే పరాఇ ।
ఊపర ఆపు హేఠ భట, గిరహిఁ ధరని పర ఆఇ ॥ 41 ॥

వానర వీరులు నిశాచరయోధులను పట్టుకొని, ఎత్తైన భవనములనుండి క్రిందికి పడద్రోయుచుండిరి. క్రిందబడిన రాక్షసులు నుగ్గునుగ్గగుచుండిరి. పైగా వానరులు వారిపై దుమికి, పిడికిళ్లతో మర్దించుచుండిరి. కొన ఊపిరితో మిగిలియున్న వారుకూడా ఈ ముష్టిఘాతములకు మట్టిగఱచుచుండిరి. (దో॥ 41)

చౌ- రామ ప్రతాప ప్రబల కపిజూథా । మర్దహిఁ నిసిచర సుభట బరూథా ॥
చఢే దుర్గ పుని జహఁ తహఁ బానర । జయ రఘుబీర ప్రతాప దివాకర ॥ 1 ॥
చలే నిసాచర నికర పరాఈ । ప్రబల పవన జిమి ఘన సముదాఈ ॥
హాహాకార భయఉ పుర భారీ । రోవహిఁ బాలక ఆతుర నారీ ॥ 2 ॥
సబ మిలి దేహిఁ రావనహిఁ గారీ । రాజ కరత ఏహిఁ మృత్యు హఁకారీ ॥
నిజ దల బిచల సునీ తెహిఁ కానా । ఫేరి సుభట లంకేస రిసానా ॥ 3 ॥

జో రన బిముఖ సునా మైఁ కానా । సో మైఁ హతబ కరాల కృపానా ॥
సర్బసు ఖాఇ భోగ కరి నానా । సమర భూమి భఏ బల్లభ ప్రానా ॥ 4 ॥
ఉగ్ర బచన సుని సకల డెరానే । చలే క్రోధ కరి సుభట లజానే ॥
సన్ముఖ మరన బీర కై సోభా । తబ తిన్హ తజా ప్రాన కర లోభా॥ 5 ॥

శ్రీరామునిప్రతాపప్రభావమున ప్రబలమైన వానరసేన రాక్షసయోధులను వణికించేయుచుండెను. అక్కడక్కడ వానరులు కోటగోడలపైకెక్కి, "సూర్యప్రతాపుడైన శ్రీరామచంద్రునకు జయము-జయము" అని నినాదములు చేయుచుండిరి. రాక్షసయోధులను మర్దించుచుండిరి. వాయువేగధాటికి తట్టుకొనలేక మేఘములు చెల్లాచెదరైనట్లు వానరసేనదెబ్బకు నిలువలేక రాక్షససైనికులు ఇటునటు పరుగులు దీసిరి. నగరము 'హాహాకారముల'తో నిండిపోయెను. బాలురు, స్త్రీలు ఆర్తనాదములతో అల్లాడుచుండిరి. 'రాజ్య పాలనకు మాఱుగా వీడు మృత్యువును ఆహ్వానించినాడు' అని అందఱును రావణుని తిట్టిపోయుచుండిరి. తన 'సేనలు 'చెల్లాచెదరు' ఐన విషయమును వినగానే రావణుడు క్రుద్ధుడై పాఱిపోవుచున్న యోధులతో ఇట్లనెను. "రణభూమికి వెన్నుచూపివచ్చినవారిని నా ఖడ్గమునకు బలియిచ్చెదను. ఇంతవఱకును నా ఉప్పుపులుసులను తిని, నానావిధభోగవిలాసములను అనుభవించినవారికి ఇప్పుడు రణభూమిలో 'ప్రాణములు తీపి' ఐనవా?" రావణునికఠోరవచనములను విని, వీరులందఱును సిగ్గుపడుచు బుసలు కొట్టుచు పోరాడసాగిరి. యుద్ధ భూమిలో పోరాడి అసువులను వీడుటవలననే వీరులకు శోభ కలుగునని తలంచి, వారు ప్రాణములపై ఆశలు వదలుకొనిరి. (చౌ॥ 1-5)

దో- బహు ఆయుధ ధర సుభట సబ, భిరహిఁ పచారి పచారి ।
బ్యాకుల కిఏ భాలు కపి, పరిఘ త్రిసూలన్హి మారి ॥ 42 ॥

అనేక శస్త్రాస్త్రములను దాల్చి, ఆ రాక్షస వీరులు వానరవీరులను పిల్చుచు పోరుసల్పుచుండిరి. వారు పరిఘలతో, త్రిశూలములతో కొట్టి, భల్లూక వానరములను చికాకు పఱచుచుండిరి. (దో॥ 42)

చౌ- భయ ఆతుర కపి భాగన లాగే । జద్యపి ఉమా జీతిహహిఁ ఆగే ॥
కొఉ కహ కహఁ అంగద హనుమంతా । కహఁ నల నీల దుబిద బలవంతా ॥ 1 ॥
నిజ దల బికల సునా హనుమానా । పచ్ఛిమ ద్వార రహా బలవానా ॥
మేఘనాద తహఁ కరఇ లరాఈ । టూట న ద్వార పరమ కఠినాఈ ॥ 2 ॥
పవనతనయ మన భా అతి క్రోధా । గర్జెఉ ప్రబల కాల సమ జోధా ॥
కూది లంక గఢ ఊపర ఆవా । గహి గిరి మేఘనాద కహుఁ ధావా ॥ 3 ॥
భంజెఉ రథ సారథీ నిపాతా । తాహి హృదయ మహుఁ మారేసి లాతా ॥
దుసరేఁ సూత బికల తెహి జానా । స్యందన ఘాలి తురత గృహ ఆనా ॥ 4 ॥

(శివుడు పలుకుచున్నాడు) ఉమా! వానరులు భయవ్యాకులురై పాఱిపోసాగిరి. ఐనను చివరకు వారే గెలిచెదరు. వానరులు ఇట్లడుగు చుండిరి. " హనుమంతుడు ఎక్కడ? అంగదుడెక్కడ? బలశాలురైన నల, నీల, ద్వివిదులు ఎక్కడ?" తమసేనలు వికలమైనవని తెలిసినప్పుడు ఆంజనేయుడు పశ్చిమద్వారముకడ ఉండెను. అక్కడ మేఘనాదునితో పోరాడుచుండెను. ఆ ద్వారమును పగులగొట్టుట మిగుల కష్టముగా ఉండెను. కావున పావని

మనస్సు మిక్కిలి క్రోధముతో నిండియుండెను. అప్పుడు కాలునితో సమానుడైన ఆ వానర యోధుడు గర్జించి, లంకకోటగోడపైకెగిరి, ఒక పర్వతశిలను దీసికొని మేఘనాదుని వైపు పరుగెత్తెను. అతడు మేఘనాదునిరథమును విఱుగగొట్టెను. సారథిని హతమార్చెను. మేఘనాదుని వక్షముపై తన్నెను. వ్యాకులుడైన మేఘనాదుని మఱియొక సారథి తన రథముపై చేర్చుకొని, ఇంటి ముఖముపట్టెను. (చౌ॥ 1-4)

దో- అంగద సునా పవనసుత, గఢ పర గయఉ అకేల।
రన బాఁకురా బాలిసుత, తరకి చఢేఉ కపి ఖేల ॥ 43 ॥

పవనసుతుడు ఒంటరిగా కోటగోడపైకెక్కినాడని తెలిసి రణయోధుడైన అంగదుడు అవలీలగా ఎగురుచు ఒక్కగంతులో కోటమీదికి చేరెను. (దో॥ 43)

చౌ- జుద్ధ బిరుద్ధ క్రుద్ధ ద్వౌ బందర। రామ ప్రతాప సుమిరి ఉర అంతర ॥
రావన భవన చఢే ద్వౌ ధాఈ। కరహిఁ కోసలాధీస దొహాఈ ॥ 1 ॥
కలస సహిత గహి భవను ఢహావా। దేఖి నిసాచరపతి భయ పావా ॥
నారి బృంద కర పీటహిఁ ఛాతీ। అబ దుఇ కపి ఆఏ ఉతపాతీ ॥ 2 ॥
కపిలీలా కరి తిన్హహి డెరావహిఁ। రామచంద్ర కర సుజసు సునావహిఁ ॥
పుని కర గహి కంచన కే ఖంభా। కహేన్హి కరిఅ ఉతపాత అరంభా ॥ 3 ॥
గర్జి పరే రిపు కటక మఝారీ। లాగే మర్దై భుజ బల భారీ ॥
కాహుహి లాత చపేటన్హి కేహూ। భజహు న రామహి సో ఫల లేహూ ॥ 4 ॥

శత్రువులను ఎదిరించి పోరాడుచు, యోధులిద్దఱును మహావేశముతో శ్రీరాముని ప్రతాపమును స్మరించుచు పరుగెత్తుకొని పోయి, రావణుని ప్రాసాదముమీదికి చేరిరి. అక్కడ వారు 'శ్రీరామునకు జయము జయము' అని పలుకసాగిరి. వారు కలశములతోపాటు భవనమును ధ్వంసము చేసిరి. ఇది చూచి, రాక్షసరాజు రావణుడు భయభ్రాంతుడాయెను. స్త్రీలు తమగుండెలపై బాదుకొనుచు "అయ్యో! ఇదిగో! ఇప్పుడీ రెండు వానరములును ఒక్కుమ్మడిగా వచ్చినవి. ఎట్టి ఉత్పాతములను కల్గించునో- అని గగ్గోలుపెట్టసాగిరి. వారిద్దఱును కపిచేష్టలతో ఆ స్త్రీలను భయపెట్టిరి. శ్రీరామునిపావనయశమును వినిపించిరి. మఱల బంగారు స్తంభములను చేతులతో పట్టుకొని "ఇప్పుడు ఉపద్రవమును ప్రారంభించెదము"- అనియనిరి. వారు గర్జించుచు శత్రుసేనల మధ్యలో దూకి, బలీయములైన తమ బాహువులచే వారిని మర్దింప సాగిరి. కొందఱిని కాళ్లతో తన్నిరి. చేతులతో కొందఱిచెంపలను వాయించిరి. "మీరు శ్రీరాముని భజింపరు. దానికి ఇదియే శాస్తి" అని నుడువుచుండిరి. (చౌ॥ 1-4)

దో- ఏక ఏక సోఁ మర్దహిఁ, తోరి చలావహిఁ ముండ।
రావన ఆగేఁ పరహిఁ తే, జను ఫూటహిఁ దధి కుండ ॥ 44 ॥

రాక్షసులతలలను హేలగా పరస్పరము ఢీకొట్టించిరి. ఆ తలలను రావణునియొద్ద పడునట్లు విసరివేసిరి. అవి పెఱుగుకుండలవలె పగులుచుండెను. (దో॥ 44)

చౌ- మహా మహా ముఖిఅ జే పావహిఁ । తే పద గహి ప్రభు పాస చలావహిఁ ॥
కహఇ బిభీషను తిన్హ కే నామా । దేహిఁ రామ తిన్హహూ నిజ ధామా ॥ 1 ॥
ఖల మనుజాద ద్విజామిష భోగీ । పావహిఁ గతి జో జాచత జోగీ ॥
ఉమా రామ మృదుచిత కరునాకర । బయిర భావ సుమిరత మోహి నిసిచర ॥ 2 ॥
దేహిఁ పరమ గతి సో జియఁ జానీ । అస కృపాల కో కహహు భవానీ ॥
అస ప్రభు సుని న భజహిఁ భ్రమ త్యాగీ । నర మతిమంద తే పరమ అభాగీ ॥ 3 ॥
అంగద అరు హనుమంత ప్రబేసా । కీన్హ దుర్గ అస కహ అవధేసా ॥
లంకాఁ ద్వౌ కపి సోహహిఁ కైసేఁ । మథహిఁ సింధు దుఇ మందర జైసేఁ ॥ 4 ॥

ఆ ఇరువురు వానరులును ప్రముఖరాక్షసయోధులను పట్టుకొని వారి కాళ్లను చిక్కించుకొని గిరగిరత్రిప్పుచు, శ్రీరామునిచెంత పడునట్లు వారిని విసరి వేయుచుండిరి. విభీషణుడు వారివారి పేర్లను ప్రభువునకు తెలుపుచుండెను. ప్రభువు వారికి తన ధామమును (వైకుంఠమును) అనుగ్రహించుచుండెను. బ్రాహ్మణులను చంపి, తినెడువారైనఆ నరమాంసభక్షకులు, యోగులు కోరుకొనునట్టి సద్గతిని పొందుచుండిరి. (శివుడు తెల్పుచున్నాడు) పార్వతీ! శ్రీరాముడు కోమలచిత్తుడు, కరుణానిధి. "రాక్షసులు వైరభావముతోనైనను సరే నా స్మరణ చేయుచుండెడివారుగదా!" అని తలంచి, ప్రభువు వారికి సర్వోత్తమగతిని (ముక్తిని) ప్రసాదించెను. భవానీ! ఇట్టి కృపాళువు ఎవరున్నారు? తెల్పుము. ప్రభువు యొక్క ఇట్టి ఉదారస్వభావమును ఎఱింగియు, మోహకారణముగ సాంసారికభ్రమలను వీడక ప్రభువును భజింపనివాడు మిక్కిలి మందబుద్ధి, భాగ్యహీనుడు" అయోధ్యాపతియైన శ్రీరాముడు (సుగ్రీవవిభీషణాదులతో) పలికెను." అంగదుడు, హనుమంతుడు కోటలోపలికి ప్రవేశించిరి. వారిద్దఱును లంకను విధ్వంసము చేయుచున్నప్పుడు రెండు మందరాచలములు సముద్రమును మథించుచున్నట్లు శోభిల్లు చున్నారు. (చౌ॥ 1-4)

దో- భుజ బల రిపు దల దలమలి, దేఖి దివస కర అంత ।
కూదే జుగల బిగత శ్రమ, ఆఏ జహఁ భగవంత ॥ 45 ॥

తమబాహుబలములచే శత్రుసేనలను నుగ్గునుగ్గుగావించి, ఆ వానరవీరులిద్దఱును సాయం సమయమగుటవలన యుద్ధముచేయుట మాని, అవలీలగా దూకుచు శ్రీరామచంద్ర ప్రభువునొద్దకు వచ్చిరి. (దో॥ 45)

చౌ- ప్రభు పద కమల సీస తిన్హ నాఏ । దేఖి సుభట రఘుపతి మన భాఏ ॥
రామ కృపా కరి జుగల నిహారే । భఏ బిగతశ్రమ పరమ సుఖారే ॥ 1 ॥
గఏ జాని అంగద హనుమానా । ఫిరే భాలు మర్కట భట నానా ॥
జాతుధాన ప్రదోష బల పాఈ । ధాఏ కరి దససీస దోహాఈ ॥ 2 ॥
నిసిచర అనీ దేఖి కపి ఫిరే । జహఁ తహఁ కటకటాఇ భట భిరే ॥
ద్వౌ దల ప్రబల పచారి పచారీ । లరత సుభట నహిఁ మానహిఁ హారీ ॥ 3 ॥
మహాబీర నిసిచర సబ కారే । నానా బరన బలీముఖ భారే ॥
సబల జుగల దల సమబల జోధా । కౌతుక కరత లరత కరి క్రోధా ॥ 4 ॥

ప్రాబిట సరద పయోద ఘనేరే । లరత మనహుఁ మారుత కే ప్రేరే ॥
అనిప అకంపన అరు అతికాయా । బిచలత సేన కీన్హి ఇన్హ మాయా ॥ 5 ॥
భయఉ నిమిష మహఁ అతి అంధిఆరా । బృష్టి హోఇ రుధిరోపల ఛారా ॥ 6 ॥

వారు ప్రభువుచరణకమలములకు శిరసా ప్రణమిల్లిరి. ఆ ఇద్దఱు వీరులను జూచి, శ్రీరామచంద్రుడు మిక్కిలి ప్రసన్నచిత్తుడై, వారిపై తనకృపాదృష్టిని ప్రసరింపజేసెను. వారు ప్రశాంతిని బొంది ఆనందభరితులైరి. హనుమంతుడు, అంగదుడు రణరంగమునుండి వెళ్లినారని యెఱింగి, భల్లూకవానరయోధులు అందఱును తమ గుడారములకు చేరిరి. ప్రదోషకాలమునందు బలమధికమగుటచే రాక్షసులు అప్పుడు రావణునకు 'జయము-జయము' అని, నినాదములు చేయుచు వానరులపై బడిరి. రాక్షససేనలు వచ్చుటను జూచి, వానరులు మఱల రణభూమికి చేరి, పండ్లు పటపట కొఱుకుచు అన్ని వైపులనుండియు శత్రువులను ఎదుర్కొనిరి. వారు ఒకరిని మఱియొకరు కవ్వించుకొనుచు పోరాడిరి. ఎవ్వరును వెనకంజవేయులేదు. నిశాచరులందఱును నల్లనివారు, అత్యంతవీరులు, అట్లే వానరులు విశాలదృఢకాయులు, అనేకవర్ణముల వారు. ఇరుసైన్యములును ప్రబలమైనవే. యోధులును సములే. వారు అత్యుత్సాహములతో విజృంభించి పోరాడుచుండిరి. వారిపోరాటము వర్షశరదృతుమేఘములు వాయుప్రేరణతో పరస్పరము తలపడుచున్నట్లు ఉండెను. తమ సైన్యములబలము సన్నగిల్లుట చూచి, అనిపుడు, అకంపనుడు, అతి కాయుడు-అను సేనాపతులు మాయోపాయములకు దిగిరి. ఒక్క క్షణములో నిబిడాంధకారము వ్యాపించెను. వారు రక్తము, రాళ్లు, బూడిదను వానరసేనలపై వర్షింప సాగిరి.

(చౌ॥ 1-6)

దో- దేఖి నిబిడ తమ దసహుఁ దిసి, కపిదల భయఉ ఖభార ।
ఏకహి ఏక న దేఖఈ, జహఁ తహఁ కరహిఁ పుకార ॥ 46 ॥

దశదిశలయందును కాఱుచీకట్లు క్రమ్ముకొనుట జూచి, వానరసేనలు చెల్లాచెదరయ్యెను. ఒకరికొకరు కన్పింపకుండిరి. అంతటను అరపులే వినబడుచుండెను. (దో॥ 46)

చౌ- సకల మరము రఘునాయక జానా । లిఏ బోలి అంగద హనుమానా ॥
సమాచార సబ కహి సముఝాఏ । సునత కోపి కపికుంజర ధాఏ ॥ 1 ॥
పుని కృపాల హఁసి చాప చఢావా । పావక సాయక సపది చలావా ॥
భయఉ ప్రకాస కతహుఁ తమ నాహీఁ । గ్యాన ఉదయఁ జిమి సంసయ జాహీఁ ॥ 2 ॥
భాలు బలీముఖ పాఇ ప్రకాసా । ధాఏ హరష బిగత శ్రమ త్రాసా ॥
హనూమాన అంగద రన గాజే । హాఁక సునత రజనీచర భాజే ॥ 3 ॥
భాగత భట పటకహిఁ ధరి ధరనీ । కరహిఁ భాలు కపి అద్భుత కరనీ ॥
గహి పద డారహిఁ సాగర మాహీఁ । మకర ఉరగ ఝుష ధరి ధరి ఖాహీఁ ॥ 4 ॥

శ్రీ రఘునాథుడీ రహస్యమును గుర్తించెను. అంగదుని, హనుమంతుని పిలిచి, విషయమును వివరించెను. అది వినగానే ఆ కపివీరులిద్దఱును కోపావేశములతో రణరంగమునకు పరుగెత్తిరి. పిమ్మట కృపాళువైన శ్రీరాముడు నవ్వి, ధనుస్సును ఎక్కుపెట్టి, అగ్నిబాణమును వేసెను. అంతటను వెలుగులు ప్రసరించెను. జ్ఞానోదయముతో

సందేహములు దూరమైనట్లు చీకట్లు మాయమైపోయెను. భల్లూకములు, వానరములు వెలుగులను జూచి, శ్రమ, భయము తొలగినవారై ప్రసన్న చిత్తులై, సమరభూమికి సాగి పోయిరి. ఇంతలోనే హనుమంతుడు, అంగదుడు రణ గర్జనల నొనర్చుచుహుంకారములతో అచటికి రానేవచ్చిరి. వారిగర్జనలకు భీతిల్లి, నిశాచరులు కాలికి బుద్ధిచెప్పిరి. వానరులు పాఱిపోవుచున్నరాక్షసయోధులను పట్టుకొని, నేలకేసికొట్టుచుండిరి. అనేకాద్భుతయుద్ధనైపుణ్యములను ప్రదర్శించుచుండిరి. వారు రాక్షసులకాళ్లను చిక్కించుకొని, వారిని గిరగిర త్రిప్పుచు సముద్రములో పడవేయుచుండిరి. అచట వారిని మొసళ్లు, పాములు, చేపలు తినివేయుచుండెను. (చౌ॥ 1-4)

దో- కఛు మారే కఛు ఘాయల, కఛు గఢ చఢే పరాఇ।
గర్జహిఀ భాలు బలీముఖ, రిపు దల బల బిచలాఇ ॥ **47** ॥

ఈ విధముగా కొందఱు రాక్షసులు మరణించిరి, కొందఱు గాయపడిరి. మఱి కొందఱు పాఱిపోయి, కోటగోడలనెక్కిరి. తమబలములతో శత్రుసైన్యములను కకావికలొనర్చి, వానరభల్లూకవీరులు రణోత్సాహముతో గర్జించిరి. (దో॥ 47)

చౌ- నిసా జాని కపి చారిఉ అనీ। ఆఏ జహాఀ కోసలా ధనీ॥
రామ కృపా కరి చితవా సబహీ। భఏ బిగతశ్రమ బానర తబహీ ॥ **1** ॥
ఉహాఀ దసానన సచివ హఀకారే। సబ సన కహేసి సుభట జే మారే॥
ఆధా కటకు కపిన్హ సంఘారా। కహహు బేగి కా కరిఅ బిచారా ॥ **2** ॥
మాల్యవంత అతి జరఠ నిసాచర। రావన మాతు పితా మంత్రీ బర॥
బోలా బచన నీతి అతి పావన। సునహు తాత కఛు మోర సిఖావన ॥ **3** ॥
జబ తే తుమ్హ సీతా హరి ఆనీ। అసగున హోహిఀ న జాహిఀ బఖానీ॥
బేద పురాన జాసు జసు గాయో। రామ బిముఖ కాహుఀ న సుఖ పాయో ॥ **4** ॥

బాగుగా ఆరాత్రి ప్రొద్దు పోయిన పిమ్మట నాలుగు దళముల వానరులును కోసలాధిపతి శ్రీరాముని కడకు చేరిరి. శ్రీరాముని చల్లనిచూపు వారిపై ప్రసరింపగానే వారు తమశ్రమలనే మఱచిపోయిరి. అక్కడ రావణుడు తన అంతరంగికులను బిలిచి, "వానరులు మనసైన్యములలో సగభాగమును హతమార్చిరి. పెక్కుమంది రాక్షసవీరులు రణరంగమునకు బలియైరి. వెంటనే కర్తవ్యమును దెల్పుడు" అని యడిగెను. రావణునకు మాతామహుడును, మంత్రివరేణ్యుడును ఐన మాల్యవంతుడను వృద్ధరాక్షసుడు చక్కని నీతి వాక్యములను ఇట్లు పలికెను. "నాయనా! నా ఉపదేశమును కొంచెమాలకింపుము. నీవు సీతను అపహరించి తెచ్చినప్పటినుండియు ఎదురైన అపశకునములకు లెక్కయే లేదు. వేదపురాణములచే ప్రస్తుతింపబడిన శ్రీరామచంద్రుడు మహామహితాత్ముడు. ఆయనను కాదనినవాడెవ్వడును బ్రతికి బట్టకట్టలేదు. (చౌ॥ 1-4)

దో- హిరన్యాచ్ఛ భ్రాతా సహిత, మధు కైటభ బలవాన।
జెహిఀ మారే సోఇ అవతరెఉ, కృపాసింధు భగవాన ॥ **48(క)** ॥

హిరణ్యాక్షుని, అతనిసోదరుడైన హిరణ్యకశిపుని చంపినవాడును, మధుకైటభులను సంహరించిన వాడును ఐన శ్రీహరియే ఇప్పుడు శ్రీరాముడుగా అవతరించినాడు. (దో॥ 48. క.)

మాసపారాయణము-ఇఱువది ఐదవ విరామము

దో- కాలరూప ఖల బన దహన, గునాగార ఘనబోధ।
సివ బిరంచి జెహి సేవహిం, తాసోం కవన బిరోధ ॥ 48(ఖ) ॥

అతడు కాలస్వరూపుడు. దుష్టసమూహమనెడి వనమును భస్మమొనర్చుటయందు అగ్నితుల్యుడు. గుణనిధి, జ్ఞానఖని, బ్రహ్మరుద్రాదులు ఆతనిని సేవింతురు. ఆతనితో వైరమేల? (దో॥ 48. ఖ)

చౌ- పరిహరి బయరు దేహు బైదేహీ । భజహు కృపానిధి పరమ సనేహీ ॥
తాకే బచన బాన సమ లాగే । కరిఆ ముహ కరి జాహి అభాగే ॥ 1 ॥
బూఢ భఏసి న త మరతేఉఁ తోహీ । అబ జని నయన దేఖావసి మోహీ ॥
తెహిం అపనే మన అస అనుమానా । బధ్యో చహత ఏహి కృపానిధానా ॥ 2 ॥
సో ఉఠి గయఉ కహత దుర్బాదా । తబ సకోప బోలెఉ ఘననాదా ॥
కౌతుక ప్రాత దేఖిఅహు మోరా । కరిహఉఁ బహుత కహౌం కా థోరా ॥ 3 ॥
సుని సుత బచన భరోసా ఆవా । ప్రీతి సమేత అంక బైఠావా ॥
కరత బిచార భయఉ భినుసారా । లాగే కపి పుని చహూం దుఆరా ॥ 4 ॥
కోపి కపిన్హ దుర్ఘట గఢు ఘేరా । నగర కోలాహలు భయఉ ఘనేరా ॥
బిబిధాయుధ ధర నిసిచర ధాఏ । గఢ తే పర్బత సిఖర ఢహాఏ ॥ 5 ॥

కావున వైరమును మాని, వైదేహిని ఆయనకు అప్పగింపుము. దయాసాగరుడును, పరమస్నేహశీలియునైన శ్రీరాముని భజింపుము. "రావణునకీమాటలు బాణములవలె గ్రుచ్చుకొనెను. అతడిట్లనెను. "ఓరీ! దౌర్భాగ్యుడా! నీ ముఖానికి మసిపూసికొని వెళ్లు. దానిని నాకు చూపకుము. ముసలి వాడవు గావున నిన్ను చంపక వదలివేయుచున్నాను. ఇకమీదట నాకు కన్పింపవలదు. దూరముగా వెళ్లిపో" మాల్యవంతుడు తన మనస్సులో "కృపానిధియైన శ్రీరామునిచేతిలో వీనికి చావుతప్పదు" అని యనుకొనుచు రావణుని దుర్భాషలకు బాధపడుచు వెళ్లి పోయెను. పిమ్మట మేఘనాదుడు క్రోధావేశముతోనిట్లనెను. "తండ్రీ! రేపు ఉదయమున నేను చేయబోవు ఘనకార్యములను చూడుడు. నేను మాటలు చెప్పను. క్రియ చేసి చూపింతును. ఇప్పుడు ఎంత చెప్పినను తక్కువయే" పుత్రుని వచనములను విని, వానిపై రావణునకు నమ్మకము ఏర్పడెను. ప్రేమతో అతనిని తన యొడిలో కూర్చుండ బెట్టుకొనెను. వారు సమాలోచనములను చేయుచుండగనే తెల్లవారెను. వానరులు మరల నాలుగు ద్వారములకడ గుమిగూడిరి. వారు దుర్గమమైన కోటలను ముట్టడించిరి. నగరమున కోలాహలములు చెలరేగెను. రాక్షససైనికులు వివిధశస్త్రాస్త్రములతో కోటలపైకెక్కి పర్వత శిఖరములను శత్రు సైనికులపై విసరి వేసిరి. (చౌ॥ 1-5)

ఛం-ఢాహే మహీధర సిఖర కోటిన్హ బిబిధ బిధి గోలా చలే ।
ఘహరాత జిమి పబిపాత గర్జత జను ప్రలయ కే బాదలే ॥
మర్కట బికట భట జుటత కటత న లటత తన జర్జర భఏ ।
గహి సైల తెహి గఢ పర చలావహిం జహం సో తహం నిసిచర హఏ ॥

వారు అసంఖ్యాకములైన పర్వతశిఖరములను విసరివేసిరి. నానావిధమారణాయుధములను ప్రయోగించిరి. అవి వజ్రాయుధములవలె దిక్కులను పిక్కటిల్ల జేయుచు గర్జాధ్వనులతో వచ్చెను. యోధులు ప్రళయకాలగర్జనలను గావించిరి. భయంకర వానరయోధులు శత్రువులతో తలపడిరి. గాయపడినను, శరీరము జర్జరీ భూతమైనను వారు ఓడలేదు. ఓటమినంగీకరింప లేదు. వారు ఆశిఖరములనే చేతులతో పట్టుకొని, కోటమీదికి విసరి వేయుచుండిరి. రాక్షసులు అక్కడికక్కడే మరణించుచుండిరి. (ఛం)

దో- మేఘనాద సుని శ్రవన అస, గఢు పుని ఛేఁకా ఆఇ ।
ఉతర్యో బీర దుర్గ తేఁ, సన్ముఖ చల్యో బజాఇ ॥ 49 ॥

వానరులు వచ్చి మఱల కోటను ముట్టడించినారని విని, మేఘనాదుడు కోట క్రింది భాగమునకు వచ్చి, ఢంకాలను మ్రోగించుచు వారిని ఎదుర్కొనెను. (దో॥ 49)

## మేఘనాదుని భీకరసమరము

చౌ- కహఁ కోసలాధీస ద్వౌ భ్రాతా । ధన్వీ సకల లోక బిఖ్యాతా ॥
కహఁ నల నీల దుబిద సుగ్రీవా । అంగద హనూమంత బల సీఁవా ॥ 1 ॥
కహఁ బిభీషను భ్రాతాద్రోహీ । ఆజు సబహి హఠి మారఉఁ ఓహీ ॥
అస కహి కఠిన బాన సంధానే । అతిసయ క్రోధ శ్రవన లగి తానే ॥ 2 ॥
సర సమూహా సో ఛాడై లాగా । జను సపచ్ఛ ధావహిఁ బహు నాగా ॥
జహఁ తహఁ పరత దేఖిఅహిఁ బానర । సన్ముఖ హోఇ న సకే తేహి అవసర ॥ 3 ॥
జహఁ తహఁ భాగి చలే కపి రీఛా । బిసరీ సబహి జుద్ధ కై ఈఛా ॥
సో కపి భాలు న రన మహఁ దేఖా । కీన్హేసి జెహి న ప్రాన అవసేషా ॥ 4 ॥

అతడు బిగ్గరగా అరచుచు పలికెను. "సమస్త లోకములలో ధనుర్ధారులుగా ప్రసిద్ధి గాంచిన సోదరులైన ఆ ఇద్దఱు కోసలరాజకుమారు లెక్కడ? నల, నీల, ద్వివిద, సుగ్రీవులును, అపార బలశాలురైన అంగద హనుమదాదులును ఎక్కడ? ఆ భ్రాతృద్రోహి విభీషణుడెక్కడ? నేడు వీరినందఱిని తప్పక చేంపెదను." ఇట్లు పలికి, భయంకరములైన బాణములను సంధించి, ధనుస్సును ఆకర్ణాంతము లాగెను. బాణముల వర్షమును గురిపించెను. అవి రెక్కలున్న సర్పములవలె వేగముగా సాగిపోవుచుండెను. వానరులు ఎక్కడివారక్కడనే పడిపోవుచుండిరి. ఆ సమయమున అతనిని ఎదిరించువారు ఎవ్వరును అక్కడ లేకుండిరి. భల్లూకవానరులు నలుదెసలకును పాఱిపోయిరి. పోరాటవిషయమునే మఱచిరి. రణభూమిలో వారు మూర్ఛితులై, ప్రాణావశిష్టులై యుండిరి. (చౌ॥ 1-4)

దో- దస దస సర సబ మారెసి, పరే భూమి కపి బీర ।
సింహనాద కరి గర్జా, మేఘనాద బల ధీర ॥ 50 ॥

పిమ్మట మేఘనాదుడు ఒక్కొక్కరిపై పదేసి బాణములను ప్రయోగించెను. వానర వీరులందఱును నేలపై పడిపోయిరి. అప్పుడు ప్రబలుడైన ధీర మేఘనాదుడు సింహగర్జన చేయసాగెను. (దో॥ 50)

చౌ- దేఖి పవనసుత కటక బిహాలా । క్రోధవంత జను ధాయఉ కాలా ॥
మహాసైల ఎక తురత ఉపారా । అతి రిస మేఘనాద పర డారా ॥ 1 ॥

ఆవత దేఖి గయఉ నభ సోఈం । రథ సారథీ తురగ సబ ఖోఈం ॥
బార బార పచార హనుమానా । నికట న ఆవ మరము సో జానా ॥ 2 ॥
రఘుపతి నికట గయఉ ఘననాదా । నానా భాఁతి కరేసి దుర్బాదా ॥
అస్త్ర సస్త్ర ఆయుధ సబ డారే । కౌతుకహీఁ ప్రభు కాటి నివారే ॥ 3 ॥
దేఖి ప్రతాప మూఢ ఖిసిఆనా । కరై లాగ మాయా బిధి నానా ॥
జిమి కోఉ కరై గరుడ సైఁ ఖేలా । డరపావై గహి స్వల్ప సపేలా ॥ 4 ॥

తమ సైన్యమంతయును వ్యాకులపాటునకు గురియైనట్లు గమనించి, పవనసూనుడు అతిక్రోధముతో సాక్షాత్తు కాలునివలె శత్రువులమీదికి పరుగుదీసెను. అందఱును చూచుచుండగనే అతడు మిగుల క్రుద్ధుడై ఒక మహాపర్వతమును పెకలించి ఎత్తి, మేఘనాదునిపై కోపముతో విసరి వేసెను. తనమీదికి వచ్చుచున్న పర్వతమును జూచి అతడు ఆకాశమునకు ఎగిరెను. అంతట రథము ముక్కలాయెను. సారథి హతుడయ్యెను. గుఱ్ఱములు మరణించెను. హనుమంతుడతనిని మాటి మాటికిని యుద్ధమునకు రెచ్చగొట్టెను. కాని హనుమంతుని బల రహస్యమును ఎఱిగిన వాడు గావున మేఘనాదుడు అతని కడకు రాలేదు. పిమ్మట మేఘనాదుడు శ్రీరాముని కడకు వచ్చి, పెక్కురీతుల దుర్భాషలాడెను. అతడు శ్రీరామునిపై అనేకశస్త్రాస్త్రములను, ఆయుధములను ప్రయోగించెను. కాని ప్రభువు వాటినన్నింటిని అవలీలగా వమ్ముగావించెను. శ్రీరాముని బలపరాక్రమములను జూచి, ఆ మూర్ఖుడు లజ్జితుడై, నానావిధములగు మాయలు పన్నెను. అతనిప్రయత్నము 'చిన్న పామును చేత బట్టుకొని గరుడుని బెదరించినట్లు' ఉండెను. (చౌ॥ 1-4)

దో- జాసు ప్రబల మాయా బస, సివ బిరంచి బడ ఛోట ।
తాహి దిఖావఇ నిసిచర, నిజ మాయా మతి ఖోట ॥ 51 ॥

తన మాయ చేత బ్రహ్మరుద్రాది మహామహులనే వశపఱచుకొనగలిగిన శ్రీరామచంద్రప్రభువుపై దుష్టబుద్ధియైన ఆ నిశాచరుడు తనరాక్షసమాయలను ప్రయోగించెను. (దో॥ 51)

చౌ- నభ చఢి బరష బిపుల అంగారా । మహి తే ప్రగట హోహిఁ జలధారా ॥
నానా భాఁతి పిసాచ పిసాచీ । మారు కాటు ధుని బోలహిఁ నాచీ ॥ 1 ॥
బిష్టా పూయ రుధిర కచ హాడా । బరషఇ కబహుఁ ఉపల బహు ఛాడా ॥
బరషి ధూరి కీన్హేసి అఁధిఆరా । సూఝ న ఆపన హాథ పసారా ॥ 2 ॥
కపి అకులానే మాయా దేఖేఁ । సబ కర మరన బనా ఏహి లేఖేఁ ॥
కౌతుక దేఖి రామ ముసుకానే । భఏ సభీత సకల కపి జానే ॥ 3 ॥
ఏక బాన కాటీ సబ మాయా । జిమి దినకర హర తిమిర నికాయా ॥
కృపాదృష్టి కపి భాలు బిలోకే । భఏ ప్రబల రన రహహిఁ న రోకే ॥ 4 ॥

ఆకాశమునకెగిరి ఆ ఇంద్రజిత్తు నిప్పుల వర్షమును కురిపింపసాగెను. భూమినుండి జలధారలు బయటికి చిమ్మునట్లు చేసెను. నానా విధములైన పిశాచములు నాట్యము చేయుచు 'చంపుడు, నఱుకుడు' అని అఱవ సాగెను. ఒక్కొక్కసారి అతడు మలమూత్రములను చీము, నెత్తురు, వెంట్రుకలు, ఎముకలు మొదలగు వానిని

వర్షించుచుండెను. మఱియొక సారి ఎడతెగని ఱాళ్లవర్షమును కురిపించుచుండెను. వేఱొకతరి ధూళిని గుర్పించి, 'తమ చేతులనే తాము చూడలేనంతగా' చీకటిని సృష్టించెను. ఈ మాయలకు వానరులు తికమకలపాలై 'ఈ దెబ్బతో అందఱును మరణించుట తథ్యము' అని భావించిరి. ఈ దృశ్యమును జూచి, శ్రీరాముడు ఒక చిఱునవ్వు నవ్వెను. వానరులందఱును భయభ్రాంతులైనట్లు గ్రహించి, సూర్యుడు చిమ్మచీకట్లను పాఱద్రోలినట్లు ఒకేఒక బాణముతో వానిమాయలనన్నింటిని పటాపంచలు గావించెను. పిమ్మట భల్లూక వానరములపై తనకృపాదృష్టిని ప్రసరింపజేసెను. వారు మఱల శక్తిసంపన్నులై నిలువరింప రాని ఆవేశముతో పోరాడుచుండిరి. (చౌ॥ 1-4)

దో- ఆయసు మాగి రామ పహిఁ, అంగదాది కపి సాథ ।
లఛిమన చలే క్రుద్ధ హోఇ, బాన సరాసన హాథ ॥ 52 ॥

శ్రీరాముని ఆజ్ఞను పొంది, లక్ష్మణుడు ధనుర్బాణములను గైకొని, క్రుద్ధుడై అంగదాది వానర ప్రముఖులతో బయలుదేఱెను. (దో॥ 52)

చౌ- ఛతజ నయన ఉర బాహు బిసాలా । హిమగిరి నిభ తను కఛు ఏక లాలా ॥
ఇహాఁ దసానన సుభట పఠాఏ । నానా అస్త్ర సస్త్ర గహి ధాఏ ॥ 1 ॥
భూధర నఖ బిటపాయుధ ధారీ । ధాఏ కపి జయ రామ పుకారీ ॥
భిరే సకల జోరిహి సన జోరీ । ఇత ఉత జయ ఇచ్ఛా నహిఁ థోరీ ॥ 2 ॥
ముఠికన్హ లాతన్హ దాతన్హ కాటహిఁ । కపి జయసీల మారి పుని డాటహిఁ ॥
మారు మారు ధరు ధరు ధరు మారూ । సీస తోరి గహి భుజా ఉపారూ ॥ 3 ॥
అసి రవ పూరి రహీ నవ ఖండా । ధావహిఁ జహఁ తహఁ రుండ ప్రచండా ॥
దేఖహిఁ కౌతుక నభ సుర బృందా । కబహుఁక బిసమయ కబహుఁ అనందా ॥ 4 ॥

అతని కన్నులు నిప్పులు కురియుచుండెను. వెడల్పైన వక్షస్థలముతో, దీర్ఘబాహువులతో హిమాలయ పర్వతమువలెనున్న అతనిగౌరవర్ణశరీరకాంతి ఎఱుపెక్కెను. రావణుడును మేఘనాదునకు బాసటగా సమరయోధులను కొందఱిని పంపెను. వారనేక శస్త్రాస్త్రములను దీసికొని, ఒక్కుమ్మడిగా రణరంగమున దూకిరి. 'శ్రీరామచంద్రునకు జయము జయము' అనుచు వానరులు పర్వతములను, వృక్షములను నఖములను ఆయుధములుగా జేసికొని వారిని ముప్పు తిప్పలు పెట్టుచుండిరి. వానరులును, రాక్షసులును ప్రబలమైన విజయ కాంక్షలతో వీరోచితముగా పోరాడుచుండిరి. వానరులు రాక్షసులపై విరుచుకొని పడి వారిని పిడికిళ్లతో పొడిచిరి, కాళ్ళతో తన్నిరి, పండ్లతో కొఱికిరి, కొట్టి కొట్టి బాధించిరి. "కొట్టుడు, కొట్టుడు, పట్టుకొని చంపుడు, చంపుడు, తలలు నఱకుడు, భుజములను ఖండింపుడు" ఇట్టి అఱుపులతో నవఖండములు నిండిపోయెను. తలలులేని మొండెములు అటునిటు పఱుగెత్తుచుండెను. దేవతలు ఆకాశము నుండి ఈ దృశ్యములను వినోదముగా చూచుచుండిరి. వారికి విస్మయానందములు కలుగు చుండెను. (చౌ॥ 1-4)

దో- రుధిర గాడ భరి భరి జమ్యో, ఊపర ధూరి ఉడాఇ ।
జను అఁగార రాసిన్హ పర, మృతక ధూమ రహ్యో ఛాఇ ॥ 53 ॥

రణ భూమి రక్తసిక్తమయ్యెను. దానిపై ధూళి క్రమ్ముకొని నిప్పులపై బూడిద కప్పినట్లుండెను. (దో॥ 53)

## లక్ష్మణుడు మూర్ఛిల్లుట-

చౌ- ఘాయల బీర బిరాజహిఀ కైసే । కుసుమిత కింసుక కే తరు జైసే ॥
లఛిమన మేఘనాద ద్వౌ జోధా । భిరహిఀ పరసపర కరి అతి క్రోధా ॥ 1 ॥
ఏకహి ఏక సకఇ నహిఀ జీతీ । నిసిచర ఛల బల కరఇ అనీతీ ॥
క్రోధవంత తబ భయఉ అనంతా । భంజేఉ రథ సారథీ తురంతా ॥ 2 ॥
నానా బిధి ప్రహార కర సేషా । రాచ్ఛస భయఉ ప్రాన అవసేషా ॥
రావన సుత నిజ మన అనుమానా । సంకఠ భయఉ హరిహి మమ ప్రానా ॥ 3 ॥
బీరఘాతినీ ఛాడిసి సాఀగీ । తేజపుంజ లఛిమన ఉర లాగీ ॥
మురుఛా భఈ సక్తి కే లాగేఀ । తబ చలి గయఉ నికట భయ త్యాగేఀ ॥ 4 ॥

గాయపడిన యోధులు పూలతోనిండిన మోదుగుచెట్లవలె ఒప్పుచుండిరి. లక్ష్మణుడును, మేఘనాదుడును (ఇరువురును) సమాన యోధులే. వారు అత్యంతావేశములతో పరస్పరము ఒడలు మఱచి, పోరాడుచుండిరి. రాక్షసుడైన మేఘనాదుడు మోసమునకును, అధర్మమునకును ఒడిగట్టుచుండెను. అనంతుడైన (శేషుడు) లక్ష్మణుడు భీకరకోపాకృతితో ఇంద్రజిత్తు రథమును భగ్నమొనర్చి, సారథిని కొట్టి క్రింద పడిపోవునట్లు చేసెను. అతని ప్రహారములకు ఇంద్రజిత్తుప్రాణములు అన్నుబట్టెను. "ఇప్పుడు తీవ్ర సంకటపరిస్థితి వచ్చిపడినది. ఇతని చేతిలో నా ప్రాణములు దక్కవు" అని భావించి రావణ పుత్రుడు 'వీరఘాతిని' అను శక్తిని ప్రయోగించెను. తేజోరాశియైన ఆ శక్తి లక్ష్మణుని వక్షమునకు తగిలెను. లక్ష్మణుడు మూర్ఛితుడాయెను. అప్పుడు మేఘనాదుడు నిర్భయముగా అతనిని సమీపించెను. (చౌ॥ 1-4)

దో- మేఘనాద సమ కోటి సత, జోధా రహే ఉఠాఇ ।
జగదాధార సేష కిమి, ఉఠై చలే ఖిసిఆఇ ॥ 54 ॥

మేఘనాదునితో సమానమైన బలముగల అసంఖ్యాకయోధులు లక్ష్మణుని ఎత్తుకొనిపోవుటకు ప్రయత్నించిరి. కాని జగదాధారుడైన ఆదిశేషుని అవతారమును ఎవరెత్తగలరు? వారు సిగ్గుతో వెనుదిరిగిరి. (దో॥ 54)

చౌ- సును గిరిజా క్రోధానల జాసూ । జారఇ భువన చారిదస ఆసూ ॥
సక సంగ్రామ జీతి కో తాహీ । సేవహిఀ సుర నర అగ జగ జాహీ ॥ 1 ॥
యహ కౌతూహల జానఇ సోఈ । జా పర కృపా రామ కై హోఈ ॥
సంధ్యా భఇ ఫిరి ద్వౌ బాహనీ । లగే సఀభారన నిజ నిజ అనీ ॥ 2 ॥
బ్యాపక బ్రహ్మ అజిత భువనేస్వర । లఛిమన కహాఀ బూఝ కరునాకర ॥
తబ లగి లై ఆయఉ హనుమానా । అనుజ దేఖి ప్రభు అతి దుఖ మానా ॥ 3 ॥

జామవంత కహ బైద సుషేనా । లంకా( రహఇ కో పఠఈ లేనా ॥
ధరి లఘు రూప గయఉ హనుమంతా । ఆనేఉ భవన సమేత తురంతా ॥ 4 ॥

(శివుడు పల్కుచున్నాడు) గిరిజా! వినుము. లక్ష్మణుని క్రోధాగ్ని పదునాలుగులోకములను భస్మమొనర్పగలదు. సమస్త స్థావరజంగమ ప్రాణులు, దేవతలు, మనుష్యులు, అతనిని సేవించుచుందురు. అట్టి మహావీరుని యుద్ధమున ఎవరు జయింపగలరు? శ్రీరామునికృపకు పాత్రుడైనవాడే ఈ అద్భుత లీలలను తెలిసికొనగలడు. సాయంసమయమగుటచే ఉభయపక్షములవారును యథాస్థానములకు చేరిరి. సేనాపతులు తమతమసేనలను కూడగట్టుకొనసాగిరి. సర్వవ్యాపకుడును, పరబ్రహ్మయు, అజేయుడును, సకలభువనాధిపతియు, కరుణానిధియు ఐన శ్రీరాముడు 'లక్ష్మణుడు ఎక్కడ? అని యడిగెను. అప్పటికే హనుమంతుడు లక్ష్మణుని అచటికి తీసికొనివచ్చియుండెను. తన తమ్ముని స్థితిని జూచి, శ్రీరాముడు మిగుల దుఃఖితుడాయెను. జాంబవంతుడిట్లనెను. "లంకలోసుషేణుడు అనువైద్యుడు గలడు. అతనిని ఇచటికి ఎవరు తీసికొని రాగలరు?" వెంటనే హనుమంతుడు సూక్ష్మరూపియై వెళ్లి, ఇంటితో గూడ అతనిని తీసికొని వచ్చెను. (చౌ॥ 1-4)

దో- రామ పదారబింద సిర, నాయఉ ఆఇ సుషేన ।
కహా నామ గిరి ఔషధీ, జాహు పవనసుత లేన ॥ 55 ॥

సుషేణుడు శ్రీరామునిపాదపద్మములకు శిరసా ప్రణమిల్లెను. అతడు ఒక పర్వతము పేరును, దానిపై నుండెడి ఒక ఓషధినామమును దెలిపి. "ఆంజనేయా! నీవు వెళ్లి, ఆ ఓషధిని తీసికొని రమ్ము" అని పలికెను. (దో॥ 55)

## ఓషధికై హనుమంతుడు వెడలుట - కాలనేమిని హతమార్చుట

చౌ- రామ చరన సరసిజ ఉర రాఖీ । చలా ప్రభంజనసుత బల భాషీ ॥
ఉహా( దూత ఏక మరము జనావా । రావను కాలనేమి గృహ ఆవా ॥ 1 ॥
దసముఖ కహా మరము తేహి( సునా । పుని పుని కాలనేమి సిరు ధునా ॥
దేఖత తుమ్హహి నగరు జెహి( జారా । తాసు పంథ కో రోకన పారా ॥ 2 ॥
భజి రఘుపతి కరు హిత ఆపనా । ఛా(డహు నాథ మృషా జల్పనా ॥
నీల కంజ తను సుందర స్యామా । హృదయ( రాఖు లోచనాభిరామా ॥ 3 ॥
మై( తై( మోర మూఢతా త్యాగూ । మహా మోహ నిసి సూతత జాగూ ॥
కాల బ్యాల కర భచ్ఛక జోఈ । సపనెహు( సమర కి జీతిఅ సోఈ ॥ 4 ॥

వాయుసుతుడైన హనుమంతుడు "సరే! ఇప్పుడే తీసికొనిరాగలను" అనియనుచు-తన హృదయమున శ్రీరాముని పాదసరోజములను స్మరించుచు ఓషధికై బయలుదేరెను. అక్కడ ఒక దూత రావణునకు ఈ వృత్తాంతమునంతయు వివరించెను. దశముఖుడు 'కాలనేమి' అను రాక్షసునియింటికి వెళ్లి, విషయమును వివరించి, సహాయమడిగెను. కాలనేమి తననెత్తి బాదుకొనుచు పలికెను. "మార్గమధ్యములో ఇప్పుడా హనుమంతుని ఆపగలవాడెవ్వడు? నీ కనులముందే అతడు లంకను కాల్చలేదా? శ్రీ రఘునాథుని ఆరాధించి, హాయిగా ఉండుము. ప్రభూ! ఈ మిథ్యాప్రగల్భములను మానుము. నేత్రానందకరుడు నీలోత్పలశ్యామసుందరుడు ఐన శ్రీరాముని నీ

హృదయమున నిలుపుకొనుము. నేను, నీవు, అనెడి భేదభావమును, మమత్వమును, మూఢత్వమును త్యజింపుము. నీవు మహామోహములో నిద్రించుచున్నావు. ఇప్పుడైనను దానినుండి మేల్కొనుము. కాలసర్పమునుగూడ కబళింపగలవానిని కలలో నైనను యుద్ధమున ఎవడు జయింపగలడు.?" (చౌ॥ 1-4)

దో- సుని దసకంఠ రిసాన అతి, తేహిఁ మన కీన్హ బిచార ।
రామ దూత కర మరౌఁ బరు, యహ ఖల రత మల భార ॥ 56 ॥

ఈ మాటలను వినినంతనే రావణుడు మిక్కిలి క్రుద్ధుడాయెను. అప్పుడు కాలనేమి తన మనస్సులో ఇట్లనుకొనెను. "ఈ దుష్టుడు పాపకృత్యములలో మునిగినాడు. నేను శ్రీరామునిదూతచేతిలో మృతిచెందుటయే మేలు." (దో॥ 56)

చౌ- అస కహి చలా రచిసి మగ మాయా । సర మందిర బర బాగ బనాయా ॥
మారుతసుత దేఖా సుభ ఆశ్రమ । మునిహి బూఝి జల పియౌఁ జాఇ శ్రమ ॥ 1 ॥
రాచ్ఛస కపట బేష తహఁ సోహా । మాయాపతి దూతహి చహ మోహా ॥
జాఇ పవనసుత నాయఉ మాథా । లాగ సో కహై రామ గున గాథా ॥ 2 ॥
హోత మహా రన రావన రామహిఁ । జితిహహిఁ రామ న సంసయ యా మహిఁ ॥
ఇహాఁ భఏఁ మైఁ దేఖఉఁ భాఈ । గ్యానదృష్టి బల మొహి అధికాఈ ॥ 3 ॥
మాగా జల తేహిఁ దీన్హ కమండల । కహ కపి నహిఁ అఘాఉఁ థోరేఁ జల ॥
సర మజ్జన కరి ఆతుర ఆవహు । దిచ్ఛా దేఉఁ గ్యాన జేహిఁ పావహు ॥ 4 ॥

ఇట్లాలోచించి కాలనేమి ఆంజనేయుడు వెళ్లుచున్నమార్గములో మాయలు పన్నెను. ఒక అందమైన వనమును, అందు ఒక సరోవరమును, మందిరమును కల్పించెను. పవనసుతుడు ఆశ్చర్యకరమైన ఒక సుందర-ఆశ్రమమును గాంచి, 'ఇక్కడ మునియనుమతితో దాహము తీర్చుకొని బడలికను తొలగించు కొందును' అని తలంచెను. కాలనేమి అచట కపటముని వేషముతో ఉండెను. అతడు తనమాయచేత మాయాపతియైన శ్రీరామునిదూతను మోహింప జేయుదలచెను. పావని ఆయనకు నమస్కరించెను. ఆ రాక్షసుడు శ్రీరామునిగుణములను గానముచేయుచు ఇట్లు పల్కెను. "రామరావణులమధ్య ఘోరమైన యుద్ధము జరుగుచున్నది. శ్రీరాముడు గెలుచును. ఇందు సందేహము లేదు. సోదరా! నాజ్ఞాన దృష్టితో ఇక్కడినుండియే అన్నింటిని చూచుచున్నాను." హనుమంతుడతనిని నీరడుగగానే అతడు తన కమండలమును ఇచ్చెను. హనుమంతుడు "ఈ కొంచెము జలముతో నా దాహము తీరదు" అని పలికెను. కాలనేమి "ఈ చెఱువులో స్నానము చేసిరమ్ము, నేను నీకు దీక్షను ఇచ్చెదను." నీకు జ్ఞానోదయమగును అని పలికెను. (చౌ॥ 1-4)

దో- సర పైఠత కపి పద గహా, మకరీఁ తబ అకులాన ।
మారీ సో ధరి దిబ్య తను, చలీ గగన చఢి జాన ॥ 57 ॥

హనుమంతుడు సరోవరమున దిగగానే అతి శీఘ్రముగా ఒక మొసలి ఆయన పాదమును గట్టిగా ఒడిసిపట్టుకొనెను. మారుతి దానిని చంపి వేసెను. అది దివ్యశరీరమును దాల్చి అప్సరసయై విమానముపై ఆకాశ మార్గమున వెళ్లెను. (దో॥ 57)

చౌ- కపి తవ దరస భఇఉఁ నిష్పాపా । మిటా తాత మునిబర కర సాపా ॥
ముని న హోఇ యహ నిసిచర ఘోరా । మానహు సత్య బచన కపి మోరా ॥ 1 ॥
అస కహి గఈ అపఛరా జబహీఁ । నిసిచర నికట గయఉ కపి తబహీఁ ॥
కహ కపి ముని గురదఛినా లేహూ । పాఛేఁ హమహి మంత్ర తుమ్హ దేహూ ॥ 2 ॥
సిర లంగూర లపేటి పఛారా । నిజ తను ప్రగటేసి మరతీ బారా ॥
రామ రామ కహి ఛాడేసి ప్రానా । సుని మన హరషి చలేఉ హనుమానా ॥ 3 ॥
దేఖా సైల న ఔషధ చీన్హా । సహసా కపి ఉపారి గిరి లీన్హా ॥
గహి గిరి నిసి నభ ధావత భయఊ । అవధపురీ ఊపర కపి గయఊ ॥ 4 ॥

ఆ సుందరి వెళ్లుచు ఇట్లు పలికెను. "ఓ వానరా! నీ దర్శనమువలన నాకు పాపవిముక్తి కలిగినది. నాకు మునీశ్వరుడిచ్చిన శాపముకూడ తొలగినది. ఓ కపీశ్వరా! ఇతడు మునిగాడు ఘోరరాక్షసుడు నా మాట సత్యము, నమ్ముము" అట్లు పలికి ఆ అప్సరస వెళ్లిపోయిన పిమ్మట హనుమంతుడు ఆరాక్షసుని కడకు వచ్చి ఇట్లనెను "ఓ మునీశ్వరా మొదట మీరు గురుదక్షిణ స్వీకరింపుడు. ఉపదేశమును ఆ పిమ్మట చేయవచ్చును" అంజనేయుడు అతనితలచుట్టును వాలమునుచుట్టి అతనిని నేలకేసి కొట్టెను. మరణ సమయమున కాలనేమి తననిజరూపమును దాల్చి 'రామ రామ' అనుచు ప్రాణములను వదిలెను. అతనినోటినుండి రామనామమును విని మారుతి ప్రసన్న మనస్కుడయ్యెను. అచ్చట నుండి బయలు దేఱి, ఆ పర్వతము పైకి చేరెను. కాని ఓషధిని గుర్తింపలేకపోయెను. అప్పుడు హనుమంతుడు ఆ పర్వతమునే పెకలించుకొని, రాత్రికి రాత్రే దానిని దీసికొని ఆకాశమార్గమున బయలు దేఱెను. ఆయన ప్రయాణము అయోధ్యా నగరము మీదుగా సాగుచుండెను. (చౌ॥ 1-4)

# సంజీవని పర్వతమును తీసికొని వచ్చు మారుతితో భరతుని సమాగమము

దో- దేఖా భరత బిసాల అతి, నిసిచర మన అనుమాని ।
బిను ఫర సాయక మారేఉ, చాప శ్రవన లగి తాని ॥ 58 ॥

ఆకాశమున ఒక బృహత్స్వరూపము వెళ్లుచుండగా దానిని భరతుడు గాంచెను. అతడొక రాక్షసుడై యుండవచ్చునని అనుమానించెను. ధనుస్సును ఆకర్ణాంతములాగి, ములికిలేని బాణమును వదలెను. (దో॥ 58)

చౌ- పరేఉ మురుఛి మహి లాగత సాయక । సుమిరత రామ రామ రఘునాయక ॥
సుని ప్రియ బచన భరత తబ ధాఏ । కపి సమీప అతి ఆతుర ఆఏ ॥ 1 ॥
బికల బిలోకి కీస ఉర లావా । జాగత నహిఁ బహు భాఁతి జగావా ॥
ముఖ మలీన మన భఏ దుఖారీ । కహత బచన భరి లోచన బారీ ॥ 2 ॥
జెహిఁ బిధి రామ బిముఖ మోహి కీన్హా । తెహిఁ పుని యహ దారున దుఖ దీన్హా ॥
జౌఁ మోరేఁ మన బచ అరు కాయా । ప్రీతి రామ పద కమల అమాయా ॥ 3 ॥

తా కపి హోఇ బిగత శ్రమ సూలా । జౌఁ మో పర రఘుపతి అనుకూలా ॥
సునత బచన ఉఠి బైఠ కపీసా । కహి జయ జయతి కోసలాధీసా ॥ 4 ॥

ఆ బాణము యొక్క దాటికి సంజీవని పర్వతమును దీసికొని వచ్చుచున్న హనుమంతుడు 'రామా! రామా! రఘుపతీ!' అనుచు నేలపై బడి మూర్ఛితుడాయెను. ఈ ప్రియవచనములను విని వెంటనే భరతుడు మిక్కిలి ఆతురతతో పరుగెత్తుకొని హనుమంతునికడకు వచ్చెను. వికలుడైన ఆ మారుతిని జూచి భరతుడు అతనిని తనహృదయమునకు హత్తుకొనెను. అతనికి స్పృహ తెప్పించుటకై పెక్కు ప్రయత్నములను జేసెను. కాని స్పృహరాలేదు. భరతునిముఖము వెలవెలబోయెను. మనస్సులో బాధ పడెను, కన్నుల నీరు నిండెను. అతడిట్లనెను. "విధాత నన్ను శ్రీరామునకు విముఖునిగా జేసెను. మరల ఈ ఆపదగూడ సంభవించినది. త్రికరణశుద్ధిగా నాకు శ్రీరామునిచరణకమలములయందు నిశ్చలమైన భక్తి యున్నచో, శ్రీరామచంద్రునికృప నాపై ప్రసరించుచున్నచో, ఈ వానరుడు శ్రమనుండియు ఈ బాధనుండియు బయటపడుగాక". ఈ మాటలు చెవిన బడినంతనే కపీశ్వరుడైన హనుమంతుడు అయోధ్యానాథుడైన శ్రీరామచంద్రునకు 'జయము, జయము' అనియనుచు లేచి కూర్చొనెను.

(చౌ॥ 1-4)

సో -లీన్హ కపిహి ఉర లాఇ, పులకిత తను లోచన సజల ।
ప్రీతి న హృదయఁ సమాఇ, సుమిరి రామ రఘుకుల తిలక ॥ 59 ॥

భరతుడు పావనిని తన హృదయమునకు హత్తుకొనెను. అతని శరీరము పులకించెను. నేత్రములలో ఆనందాశ్రువులు నిండెను. రఘువంశతిలకుడైన శ్రీరామచంద్రుని స్మరణముతో అతని హృదయము ప్రేమతో నిండిపోయెను.

(సో॥ 59)

చౌ- తాత కుసల కహు సుఖనిధాన కీ । సహిత అనుజ అరు మాతు జానకీ ॥
కపి సబ చరిత సమాస బఖానే । భఏ దుఖీ మన మహుఁ పఛితానే ॥ 1 ॥
అహహ దైవ మైఁ కత జగ జాయఉఁ । ప్రభు కే ఏకహు కాజ న ఆయఉఁ ॥
జాని కుఅవసరు మన ధరి ధీరా । పుని కపి సన బోలే బలబీరా ॥ 2 ॥
తాత గహరు హోఇహి తోహి జాతా । కాజు నసాఇహి హోత ప్రభాతా ॥
చఢు మమ సాయక సైల సమేతా । పఠవౌఁ తోహి జహఁ కృపానికేతా ॥ 3 ॥
సుని కపి మన ఉపజా అభిమానా । మోరేఁ భార చలిహి కిమి బానా ॥
రామ ప్రభావ బిచారి బహోరీ । బంది చరన కహ కపి కర జోరీ ॥ 4 ॥

భరతుడు పలికెను. "నాయనా! తమ్ముడైన లక్ష్మణుడును, తల్లి జానకీ దేవియు, శ్రీరామచంద్ర ప్రభువూ క్షేమమే గదా!" హనుమంతుడు సంక్షిప్తముగా జరిగిన కథనంతయును దెలిపెను. దానిని విని, భరతుడు దుఃఖితుడై మనస్సులోనే పశ్చాత్తాపపడెను. "ఓ దేవా! నేనీ ప్రపంచములో ఎందులకు జన్మించితిని? శ్రీరాముని కార్యములలో ఒక్కదానికిగూడ నేను ఉపయోగపడలేక పోయితిని." పరిస్థితులు తనకు అనుకూలముగా లేవని యెఱింగి, ధైర్యము వహించి, పరాక్రమశాలియైన భరతుడు హనుమంతునితో పలికెను. "నాయనా! నీవు అక్కడికి చేరుటలో ఆలస్యమగును. తెల్లవాఱినచో నీప్రయత్నము సఫలముగాక పోవచ్చును. కావున పర్వతముతో గూడ నా బాణముపై

అధిరోహించుము. నేను కృపానిధియైన శ్రీరాముడున్న చోటికి నిన్ను చేర్చెదను. ఈ మాటలను విని "నా బరువుతో ఈ బాణము ఎట్లు పోగలదు." అని మారుతి మనస్సున సందేహించెను. కాని శ్రీరామచంద్ర ప్రభావమును తలచి కొని, భరతుని పాదములను ఆరాధించి, చేతులు మోడ్చి పలికెను. (చౌ॥ 1-4)

దో- తవ ప్రతాప ఉర రాఖి ప్రభు, జైహఉఁ నాథ తురంత ।
అస కహి ఆయసు పాఇ పద, బంది చలేఉ హనుమంత ॥ 60(క) ॥
భరత బాహు బల సీల గున, ప్రభు పద ప్రీతి అపార ।
మన మహుఁ జాత సరాహత, పుని పుని పవనకుమార ॥ 60(ఖ) ॥

"ప్రభూ! మీ ప్రతాపమును నా హృదయమున నిడుకొని, నేను వేగముగా వెళ్లగలను." అని పలికి, భరతుని ఆజ్ఞను గైకొని, అతనిచరణములకు ప్రణమిల్లి, హనుమంతుడు బయలుదేఱెను. భరతుని భుజ బలమును, గుణశీలములను, శ్రీరామచంద్రప్రభుచరణములపై అతనికిగల అపారప్రేమను మాటి మాటికిని ప్రశంసించుచు పావని ముందునకు సాగెను. (దో॥ 60. క,ఖ)

## లక్ష్మణునకై శ్రీరాముని ఆవేదన

చౌ- ఉహాఁ రామ లఛిమనహి నిహారీ । బోలే బచన మనుజ అనుసారీ ॥
అర్ధ రాతి గఇ కపి నహిఁ ఆయఉ । రామ ఉఠాఇ అనుజ ఉర లాయఉ ॥ 1 ॥
సకహు న దుఖిత దేఖి మొహి కాఊ । బంధు సదా తవ మృదుల సుభాఊ ॥
మమ హిత లాగి తజెహు పితు మాతా । సహెహు బిపిన హిమ ఆతప బాతా ॥ 2 ॥
సో అనురాగ కహాఁ అబ భాఈ । ఉఠహు న సుని మమ బచ బికలాఈ ॥
జౌఁ జనతేఉఁ బన బంధు బిఛోహూ । పితా బచన మనతేఉఁ నహిఁ ఓహూ ॥ 3 ॥
సుత బిత నారి భవన పరివారా । హోహిఁ జాహిఁ జగ బారహిఁ బారా ॥
అస బిచారి జియఁ జాగహు తాతా । మిలఇ న జగత సహోదర భ్రాతా ॥ 4 ॥
జథా పంఖ బిను ఖగ అతి దీనా । మని బిను ఫని కరిబర కర హీనా ॥
అస మమ జివన బంధు బిను తోహీ । జౌఁ జడ దైవ జిఆవై మోహీ ॥ 5 ॥
జైహఉఁ అవధ కవన ముహు లాఈ । నారి హేతు ప్రియ భాఇ గఁవాఈ ॥
బరు అపజస సహతేఉఁ జగ మాహీఁ । నారి హాని బిసేష ఛతి నాహీఁ ॥ 6 ॥
అబ అపలోకు సోకు సుత తోరా । సహిహి నిఠుర కఠోర ఉర మోరా ॥
నిజ జననీ కే ఏక కుమారా । తాత తాసు తుమ్హ ప్రాన అధారా ॥ 7 ॥
సౌఁపెసి మోహి తుమ్హహి గహి పానీ । సబ బిధి సుఖద పరమ హిత జానీ ॥
ఉతరు కాహ దైహఉఁ తెహి జాఈ । ఉఠి కిన మోహి సిఖావహు భాఈ ॥ 8 ॥
బహు బిధి సోచత సోచ బిమోచన । స్రవత సలిల రాజివ దల లోచన ॥
ఉమా ఏక అఖండ రఘురాఈ । నర గతి భగత కృపాల దెఖాఈ ॥ 9 ॥

అక్కడ లక్ష్మణుని స్థితిని జూచి, శ్రీరాముడు సామాన్య మానవునివలె పరితాపమునకు లోనగుచు పలికెను. "అర్ధరాత్రి గడిచినది. హనుమంతుడు ఇంకను రాలేదు" అంతట అతడు లక్ష్మణుని అక్కున జేర్చుకొని, మఱల మఱల వగచుచు పల్కెను. "సోదరా! నీవు నన్నెప్పుడును దుఃఖతునిగా చూడకుంటివి. నా దుఃఖభారమును ఎల్లప్పుడును నీపై వేసికొనుచుంటివి. నీ స్వభావము మిక్కిలి కోమలమైనది. నన్ను సుఖపెట్టుటకై నీవు తల్లిదండ్రులను గూడ వీడి వచ్చితివి. వనములలో శీతవాత-ఆతపబాధలనుగూడ ఓర్చుకొంటివి. ఆకలి దప్పులను సైతము విస్మరించి, ప్రేమతో నన్ను సేవించుచు వచ్చితివి. సోదరా! ఇప్పుడా ప్రేమ ఏమైనది? నా వ్యాకులవచనములను వినిగూడ నీవు ఏలలేవవు? నాతో మాట్లాడవేమి? ఇప్పుడు నేను మిక్కిలి దుఃఖితుడనై యున్నాను. సోదరా! నీవు ఆదర్శసేవాపరాయణుడవు. వనవాసమున అహర్నిశలు అన్నివిధముల నీవు నాకు కుడిభుజముగానుంటివి. అట్టి నిరుపమాన సోదరుడవైన నీ వియోగము ఈ వనవాసమున సంభవించునని ఊహకైనను అందినచో తండ్రిగారి ఆజ్ఞను కూడ తలదాల్చి, యుండెడివాడను గాను.[1] సంతానము, సంపద, భార్య ఇల్లు పరివారము మొదలగునవి అన్నియును ప్రపంచములో పదే పదే లభించుచుండును, దూరమగు చుండును. కాని నాయనా! జగత్తులో నీవంటి సహోదరుడుమాత్రము లభింపడు.[2] ఈ విషయమును ఆలోచించి లెమ్ము. సోదరా! జడుడైన విధాత ఒక వేళ నన్ను జీవితునిగా ఉంచినచో నీవు లేని నా జీవితము ఱెక్కలులేని పక్షివలె, మణిలేని సర్పమువలె, తొండములేని గజరాజువలె దీనము, దుఃఖ ప్రదము అగును. భార్య కారణముగ తమ్ముని పోగొట్టుకొని, నేనేముఖము పెట్టుకొని అయోధ్యకు చేరగలను? స్త్రీని కాపాడుకొనలేక పోయితినను అపకీర్తినైనను సహించియుండెడివాడను, సోదరుని కోల్పోవుట కంటెను. స్త్రీని కోల్పోవుట ఎక్కువ హానికరము గాదు. నాయనా! ఇప్పుడు నా కఠోరహృదయము ఈ అపకీర్తిని, భ్రాతృశోకమును రెండింటిని సహింపవలసియున్నది. సుమిత్రాదేవికి నీవు అద్వితీయ పుత్రుడవు. ముద్దుల కుమారుడవు. ఆమెకు ప్రాణతుల్యుడవు. నేను అన్నివిధముల సుఖకారకుడననియు, హితైషిననియు తెలిసి, తల్లి సుమిత్రాదేవి నిన్ను నాకప్పగించినది. ఇప్పుడు వెళ్లి, ఆమెకు నేనేమి సమాధానమును చెప్పగలను? సోదరా! నీవు స్పృహను పొంది, నాకు తగినసలహాను ఏల ఇయ్యవు?" భక్తులు తనను స్మరించినంతమాత్రముననే వారిశోకములను తొలగించు శ్రీరాముడే పెక్కుభంగుల శోకించెను. కమలదళములవంటి ఆయనకన్నులనుండి అశ్రువులు ప్రవహించెను. (శివుడు పల్కుచున్నాడు) పార్వతీ! శ్రీ రఘునాథుడు అఖండుడు, అద్వితీయుడు. భక్తవత్సలుడైన భగవంతుడు తనలీలలను మనుష్యునిగా ప్రదర్శించు చున్నాడు.

(చౌ. 1-9)

సో- ప్రభు ప్రలాప సుని కాన, బికల భఏ బానర నికర ।
ఆఇ గయఉ హనుమాన, జిమి కరునా మహఁ బీర రస ॥ 61 ॥

శ్రీరామచంద్రప్రభువిలాపవచనములను ఆలకించి, వానరసమూహములు మిక్కిలి వికలములయ్యెను. ఇంతలో హనుమంతుడు సంజీవని పర్వతముతో రానేవచ్చెను. కరుణరసముతో వీరరసము చేరినట్లాయెను. (సో. 61)

1. సోదర ప్రేమాతిరేకముచే శ్రీరాముడు ఇట్లు పల్కుచున్నాడేగాని కలలో సైతము అతడు పిత్రాజ్ఞను ఉల్లంఘించెడివాడు కానేకాడు.।
2. దేశే దేశే కళత్రాణి, దేశే దేశే చ బాంధవాః తం తు దేశం నపశ్యామి, యత్ర భ్రాతా సహోదరః ॥ వాల్మీకి రామాయణము ॥యుద్ధ 102/ 12,13

చౌ- హరషి రామ భేంటెఉ హనుమానా । అతి కృతగ్య ప్రభు పరమ సుజానా ॥
తురత బైద తబ కీన్హి ఉపాఈ । ఉఠి బైఠే లఛిమన హరషాఈ ॥ 1 ॥
హృదయఁ లాఇ ప్రభు భేంటేఉ భ్రాతా । హరషే సకల భాలు కపి బ్రాతా ॥
కపి పుని బైద తహాఁ పహుఁచావా । జెహి బిధి తబహిఁ తాహి లఇ ఆవా ॥ 2 ॥
యహ బృత్తాంత దసానన సునేఊ । అతి బిషాద పుని పుని సిర ధునేఊ ॥
బ్యాకుల కుంభకరన పహిఁ ఆవా । బిబిధ జతన కరి తాహి జగావా ॥ 3 ॥
జాగా నిసిచర దేఖిఅ కైసా । మానహుఁ కాలు దేహ ధరి బైసా ॥
కుంభకరన బూఝా కహు భాఈ । కాహే తవ ముఖ రహే సుఖాఈ ॥ 4 ॥
కథా కహీ సబ తేహిఁ అభిమానీ । జెహి ప్రకార సీతా హరి ఆనీ ॥
తాత కపిన్హ సబ నిసిచర మారే । మహా మహా జోధా సంఘారే ॥ 5 ॥
దుర్ముఖ సురరిపు మనుజ అహారీ । భట అతికాయ అకంపన భారీ ॥
అపర మహోదర ఆదిక బీరా । పరే సమర మహి సబ రనధీరా ॥ 6 ॥

శ్రీరాముడు సంతుష్టుడై హనుమంతుని ఆలింగనము చేసికొనెను. ప్రభువు అత్యంతకృతజ్ఞుడు, విజ్ఞాని. వైద్యుడైన సుషేణుడు వెంటనే చికిత్స చేయుగా లక్ష్మణుడు స్పృహలోనికి వచ్చి, హర్షితుడై యథారీతిగా కూర్చొనెను. శ్రీరామచంద్రుడు ప్రేమపారవశ్యముతో తమ్ముని గాఢాలింగనము చేసికొనెను. వానర భల్లూకములు మిక్కిలి సంతసించెను. పిమ్మట మారుతి వైద్యుని యథారీతి హాయిగా ఇంటికి చేర్చివచ్చెను. ఈ సమాచారమునంతయును విని, రావణుడు అతివిషాదముతో తలలను బాదుకొనెను. వ్యాకులితుడై కుంభకర్ణుని యొద్దకు వెళ్లి, వివిధోపాయముల ద్వారా అతనిని నిద్రనుండి మేల్కొల్పెను. సాక్షాత్తు మృత్యువే శరీరధారణచేసి వచ్చినదా? అనునట్లు కుంభకర్ణుడు మేల్కొని రావణుని అడిగెను. "సోదరా! తెలుపుము. నీ ముఖములు వాడిపోయినవేల?" దురభిమానియైన రావణుడు తాను సీతను అపహరించి తీసికొనివచ్చిన విధమును, తదాదిగా జరిగిన వృత్తాంతములను తెలిపి, ఇట్లనెను. "సోదరా! వానరులు రాక్షసులనందఱిని మట్టిగరపించిరి. గొప్పగొప్ప యోధులనుగూడ మట్టుపెట్టిరి. దుర్ముఖుడు, దేవాంతకుడు, నరాంతకుడు, మహాయోధులైన అతికాయుడు, అకంపనుడు, మహోదరుడు మొదలగు రణధీరులు, వీరులు అందఱును రణరంగమున నేలకొరిగిరి. (చౌ॥ 1-6)

## కుంభకర్ణుని వధ

దో- సుని దసకంధర బచన తబ, కుంభకరన బిలఖాన ।
జగదంబా హరి ఆని అబ, సఠ చాహత కల్యాన ॥ 62 ॥

దశాననుని వచనములను విని, కుంభకర్ణుడు మిక్కిలి విచారముతో నుడివెను. "మూర్ఖుడా! జగన్మాతయైన జానకీదేవిని అపహరించి, ఇప్పుడునీకుమేలు జరుగునని తలంచుచున్నావా? (దో॥ 62)

చౌ- భల న కీన్హ తైఀ నిసిచర నాహా । అబ మొహిఀ ఆఇ జగాఏహి కాహా ॥
అజహూఀ తాత త్యాగి అభిమానా । భజహు రామ హోఇహి కల్యానా ॥ 1 ॥
హైఀ దససీస మనుజ రఘునాయక । జాకే హనూమాన సే పాయక ॥
అహహ బంధు తైఀ కీన్హి ఖోటాఈ । ప్రథమహిఀ మొహి న సునాఏహి ఆఈ ॥ 2 ॥
కీన్హెహు ప్రభు బిరోధ తెహి దేవక । సివ బిరంచి సుర జాకే సేవక ॥
నారదముని మొహి గ్యాన జో కహా । కహతెఉఀ తోహి సమయ నిరబహా ॥ 3 ॥
అబ భరి అంక భేఁటు మొహి భాఈ । లోచన సుఫల కరౌఀ మైఀ జాఈ ॥
స్యామ గాత సరసీరుహ లోచన । దేఖౌఀ జాఇ తాప త్రయ మోచన ॥ 4 ॥

ఓ రాక్షసరాజా! నీవు చేసినది మంచిపనిగాదు. ఇప్పుడు నన్నేల మేల్కొల్పితివి? నాయనా! ఇప్పటికైనను అహంకారమును వీడి శ్రీరాముని భజింపుము. దశాననా! నీకు శుభమగును. హనుమంతునివంటి సేవకులుగల శ్రీరఘునాథుడు సామాన్య మానవుడా? సోదరా! నీవు చేసినది ఘోరమైన తప్పిదము. మొదటనే ఈ సంగతిని నాకేల తెలుపలేదు? శివుడు, బ్రహ్మ మొదలగు దేవతలచే సేవింపబడు దేవదేవునితో నీవు వైరము పెట్టుకొంటివి. నారదుడు నాకు చేసిన జ్ఞానోపదేశములను నీకు వివరించి యుండెడివాడను. కాని ఇప్పుడు సమయము మించిపోయినది. సోదరా! చివరిసారిగా నన్ను గాఢముగా ఆలింగనము చేసికొనుము. నేను వెళ్ళి, నా కన్నులను సార్థకముచేసికొందును. తాపత్రయములను రూపుమాపువాడును, శ్యామలగాత్రుడును, కమలనేత్రుడును ఐన శ్రీరాముని దర్శింతును."
(చౌ. 1-4)

దో- రామ రూప గున సుమిరత, మగన భయఉ ఛన ఏక ।
రావన మాగెఉ కోటి ఘట, మద అరు మహిష అనేక ॥ 63 ॥

శ్రీరామచంద్రుని రూపగుణములను స్మరించుచు కుంభకర్ణుడు ఒక్క క్షణకాలముపాటు భక్తి పరవశుడాయెను. పిదప రావణుడు కుంభకర్ణునికొఱకై అసంఖ్యాకములైన దున్నపోతులను, మదిరా భాండములను తెప్పించెను.
(దో. 63)

చౌ- మహిష ఖాఇ కరి మదిరా పానా । గర్జా బజ్రాఘాత సమానా ॥
కుంభకరన దుర్మద రన రంగా । చలా దుర్గ తజి సేన న సంగా ॥ 1 ॥
దేఖి బిభీషను ఆగేఀ ఆయఉ । పరెఉ చరన నిజ నామ సునాయఉ ॥
అనుజ ఉఠాఇ హృదయఀ తెహి లాయో । రఘుపతి భక్త జాని మన భాయో ॥ 2 ॥
తాత లాత రావన మొహి మారా । కహత పరమ హిత మంత్ర బిచారా ॥
తెహిఀ గలాని రఘుపతి పహిఀ ఆయఉఀ । దేఖి దీన ప్రభు కే మన భాయఉఀ ॥ 3 ॥
సును సుత భయఉ కాలబస రావన । సో కి మాన అబ పరమ సిఖావన ॥
ధన్య ధన్య తైఀ ధన్య బిభీషన । భయహు తాత నిసిచర కుల భూషన ॥ 4 ॥
బంధు బంస తైఀ కీన్హ ఉజాగర । భజెహు రామ సోభా సుఖ సాగర ॥ 5 ॥

దున్నపోతులను భక్షించి, మదిరను పానముచేసి, అతడు వజ్రఘాతమువలె గర్జించెను. మదోన్మత్తుడైన కుంభకర్ణుడు రణోత్సాహముతో కోటను వీడి, బయటికి వచ్చెను. తన సేననుగూడ వెంటబెట్టుకొనలేదు. కుంభకర్ణునిజూచి, విభీషణుడు ముందుకు వచ్చి, తన పేరు చెప్పికొని, అతని చరణములపై వ్రాలెను. తమ్ముడైన విభీషణుని లేవనెత్తి కుంభకర్ణుడు అతనిని అక్కున జేర్చుకొనెను. అతడు శ్రీరఘునాథుని భక్తుడని యెఱింగి మిక్కిలి సంతసించెను. విభీషణుడు నుడివెను. "అన్నా! పరమ హితకరమైన సలహాను ఇచ్చినందున రావణుడు నన్ను కాలితో తన్నెను. ఆ బాధతో నేను శ్రీ రఘునాథుని శరణుజొచ్చితిని. ప్రభువునన్ను ఆర్తునిగా ఎఱింగి, ఆత్మీయునిగా భావించి, ఆశ్రయమునిచ్చెను." కుంభకర్ణుడు పలికెను. "నాయనా! వినుము. రావణుడు మృత్యుముఖమునకు చేరువగా ఉన్నాడు. అతడు మరణించుట తథ్యము. ఇప్పుడు సౌమ్యములైన నీ హితవచనములను వినునా? విభీషణా! నీవు ముమ్మాటికిని ధన్యుడవు. రాక్షసకులభూషణుడవు. సుందరసుఖనిధానుడైన శ్రీరాముని భజించి, సోదరా! మన వంశముయొక్క పరువు ప్రతిష్ఠలను ఇనుమడింపజేసితివి. (చౌ. 1-5)

**దో- బచన కర్మ మన కపట తజి, భజెహు రామ రనధీర ।**
**జాహు న నిజ పర సూఝ మోహి, భయఉఁ కాలబస బీర ॥ 64 ॥**

త్రికరణశుద్ధిగా కపటములేనివాడవై రణధీరుడైన శ్రీరాముని సేవింపుము. సోదరా! నేనైతే ప్రాణములపై ఆశవదలుకొన్నాను. నాకు తనవారెవరో పెఱవారెవరో తెలియుట లేదు. నీవు ఇప్పుడు, ఇక వెళ్లుము." (దో. 64)

**చౌ- బంధు బచన సుని చలా బిభీషన । ఆయఉ జహఁ త్రైలోక బిభూషన ॥**
**నాథ భూధరాకార సరీరా । కుంభకరన ఆవత రనధీరా ॥ 1 ॥**
**ఏతనా కపిన్హ సునా జబ కానా । కిలకిలాఇ ధాఏ బలవానా ॥**
**లిఏ ఉఠాఇ బిటప అరు భూధర । కటకటాఇ డారహిఁ తా ఊపర ॥ 2 ॥**
**కోటి కోటి గిరి సిఖర ప్రహారా । కరహిఁ భాలు కపి ఎక ఎక బారా ॥**
**ముర్యో న మను తను టర్యో న టార్యో । జిమి గజ అర్క ఫలని కో మార్యో ॥ 3 ॥**
**తబ మారుతసుత ముఠికా హన్యో । పర్యో ధరని బ్యాకుల సిర ధున్యో ॥**
**పుని ఉఠి తెహిఁ మారెఉ హనుమంతా । ఘుర్మిత భూతల పరెఉ తురంతా ॥ 4 ॥**
**పుని నల నీలహి అవని పఛారెసి । జహఁ తహఁ పటకి పటకి భట డారెసి ॥**
**చలీ బలీముఖ సేన పరాఈ । అతి భయ త్రసిత న కోఉ సముహాఈ ॥ 5 ॥**

సోదరుడైన కుంభకర్ణునివచనములను విని, విభీషణుడు త్రిజగద్భూషణుడైన శ్రీరాముని చేరువకుచేరి నుడివెను. "ప్రభూ! పర్వతాకారుడును, రణధీరుడును ఐన కుంభకర్ణుడు వచ్చుచున్నాడు". ఈ మాటలను విన్నంతనే శక్తిశాలురైన వానరులు, హర్షధ్వనులతో సమరాంగణమునకు పరుగులు పెట్టిరి. వారు పండ్లు కొఱుకుచు, వృక్షములను, పర్వతములను పెకలించి, అతనిపై వేయసాగిరి. భల్లూకవానరములు ఒక్కొక్కసారి పెక్కు పర్వత శిఖరములను అతనిపై విసరిరి. కాని కించిత్తైనను అతని మనస్సు చలింపలేదు. శరీరము కదలలేదు. అర్కఫలములచే (జిల్లేడు కాయలచే) కొట్టబడిన ఏనుగువలె నిశ్చలముగా నుండెను. అప్పుడు పవనపుత్రుడు అతనికి ఒక్క ముష్టిఘాతమును రుచిచూపించెను. దానిచే అతడు నేలపైబడి, వ్యాకులుడై తలబాదుకొనెను. పిదప లేచి

అతడు హనుమంతుని కొట్టెను. దానిచే నతడు గిరగిర తిరిగి నేలపై బడెను. ఆ పిమ్మట కుంభకర్ణుడు నలుని, నీలుని,నేలపై పడగొట్టెను. ఇతర యోధులను అందరిని ఒకరి తరువాత ఒకరిని పట్టుకొని నేలపై విసరివేసెను. కపి సేనయంతయు పారిపోయెను. భయభ్రాంతులై వారిలో ఎవ్వరును అతనిని ఎదుర్కొనుటకు సాహసింపలైరి.
(చౌ॥ 1-5)

దో- అంగదాది కపి మురుఛిత, కరి సమేత సుగ్రీవ ।
కాఁఖ దాబి కపిరాజ కహుఁ, చలా అమిత బల సీఁవ ॥ 65 ॥

సుగ్రీవుడు, అంగదుడు మొదలగువారినందరిని మూర్ఛితులనుగాజేసి, అపారబలశాలియైన కుంభకర్ణుడు వానరరాజైన సుగ్రీవుని తనచంకలో ఇరికించుకొని పోయెను. (దో॥ 65)

చౌ- ఉమా కరత రఘుపతి నరలీలా । ఖెలత గరుడ జిమి అహిగన మీలా ॥
భృకుటి భంగ జో కాలహి ఖాఈ । తాహి కి సోహఇ ఐసి లరాఈ ॥ 1 ॥
జగ పావని కీరతి బిస్తరిహహిఁ । గాఇ గాఇ భవనిధి నర తరిహహిఁ ॥
మురుఛా గఇ మారుతసుత జాగా । సుగ్రీవహి తబ ఖోజన లాగా ॥ 2 ॥
సుగ్రీవహు కై మురుఛా బీతీ । నిబుకి గయఉ తెహి మృతక ప్రతీతీ ॥
కాటెసి దసన నాసికా కానా । గరజి అకాస చలెఉ తెహిఁ జానా ॥ 3 ॥
గహెఉ చరన గహి భూమి పఛారా । అతి లాఘవఁ ఉఠి పుని తెహి మారా ॥
పుని ఆయఉ ప్రభు పహిఁ బలవానా । జయతి జయతి జయ కృపానిధానా ॥ 4 ॥
నాక కాన కాటే జియఁ జానీ । ఫిరా క్రోధ కరి భఇ మన గ్లానీ ॥
సహజ భీమ పుని బిను శ్రుతి నాసా । దేఖత కపి దల ఉపజీ త్రాసా ॥ 5 ॥

(శివుడు పలుకుచున్నాడు) భవానీ! సర్పసమూహములమధ్య గరుడునివలె శ్రీరఘునాథుడు మానవలీలలను ప్రదర్శించుచున్నాడు. తన బొమముడితోడనే కాలునిగూడ కబళించి వేయుగల ప్రభువునకు ఇట్టి యుద్ధము ఒక లెక్కలోనిదా? భగవంతుడు జగమును పావనమొనర్చు తనయశస్సును ఈ సమరముద్వారా విస్తరింపజేసెను. దానిని గానము చేసెడివారు భవసాగరమును దాటగలరు. మూర్ఛనుండి తేరుకొనిన వాయునందనుడు సుగ్రీవునకై వెదకెను. ఇంతలో స్పృహనుపొందిన సుగ్రీవుడు కుంభకర్ణుని చంకలోనుండి జారెను. అతడు మరణించి యుండెనని కుంభకర్ణుడు తలచియుండెను. కాని సుగ్రీవుడు అతని, ముక్కు చెవులను కొరికి ఘోరముగా గర్జించి, ఆకాశమునకెగిరెను. అప్పుడు సుగ్రీవుడు తప్పించుకొనినాడనువిషయమును కుంభకర్ణుడు గ్రహించెను. వెంటనే అతడు సుగ్రీవునికాలుపట్టుకొని నేలకేసి కొట్టెను. బలశాలియైన సుగ్రీవుడు శీఘ్రముగాలేచి, అతనిని కొట్టి, ప్రభువునొద్దకు వచ్చి, "కృపానిధియైన ప్రభువునకు 'జయము జయము' అని పలికెను. తన ముక్కుచెవులు కొఱుకబడినవని తెలిసికొనిన కుంభ కర్ణుడు మిక్కిలి బాధపడెను. అతి క్రుద్ధుడై, మార్గమునుండి మఱలివచ్చెను. సహజముగా భయంకరాకృతిగలయతడు ముక్కు చెవులు లేక పోవుటచే ఇంకను వికృతముగా కనబడెను. అతనిని జూచిన వానరసైన్యము భయభ్రాంతమాయెను. (చౌ॥ 1-5)

దో- జయ జయ జయ రఘుబంస మని, ధాఏ కపి దై హూహా ।
ఏకహి బార తాసు పర, ఛాడెన్హి గిరి తరు జూహా ॥ 66 ॥

"రఘువంశమణికి జయము జయము" అని జయజయ ధ్వానములనుగావించుచు వానరులందఱును పరుగెత్తి, 'హాహాహూహూ' అనుచు అందఱును ఒక్కసారిగా వృక్షములను, పర్వతములను కుంభకర్ణుని మీదికి విసరిరి. (దో॥ 66)

చౌ- కుంభకరన రన రంగ బిరుద్ధా । సన్ముఖ చలా కాల జను క్రుద్ధా ॥
కోటి కోటి కపి ధరి ధరి ఖాఈ । జను టీడీ గిరి గుహాఀ సమాఈ ॥ 1 ॥
కోటిన్హ గహి సరీర సన మర్దా । కోటిన్హ మీజి మిలవ మహి గర్దా ॥
ముఖ నాసా శ్రవనన్హి కీఀ బాటా । నిసరి పరాహిఀ భాలు కపి ఠాటా ॥ 2 ॥
రన మద మత్త నిసాచర దర్పా । బిస్వ గ్రసిహి జను ఏహి బిధి అర్పా ॥
మురే సుభట సబ ఫిరహిఀ న ఫేరే । సూఝ న నయన సునహిఀ నహిఀ టేరే ॥ 3 ॥
కుంభకరన కపి ఫౌజ బిడారీ । సుని ధాఈ రజనీచర ధారీ ॥
దేఖీ రామ బికల కటకాఈ । రిపు అనీక నానా బిధి ఆఈ ॥ 4 ॥

మూర్తీభవించిన వీరరసమా? అనునట్లున్న కుంభకర్ణుడు వారియెదుట నడచుచు కాలుడే క్రుద్ధుడై వచ్చుచున్నట్లు ఒప్పెను. అతడు అసంఖ్యాక వానరులను ఒకరి తరువాత మఱియొకరిని పట్టుకొని, భక్షింపసాగెను. మిడుతలదండు పర్వతగుహలోనికి పోవుచున్నట్లు వారతనిముఖములోనికి ప్రవేశించిరి. లెక్కలేనంత మంది వానరులను పట్టుకొని, అతడు తన దేహముతో అణచివేసెను. కొందఱిని చేతులతో నలిపి మట్టిలో గలిపెను. పొట్టలోనికి పోయిన వానరులు, భల్లూకములు అతనినోరు, ముక్కు, చెవులనుండి బయటికి వచ్చి, పరుగెత్తసాగిరి. విధాత సమస్తవిశ్వమును తనకప్పగించినట్లును, దానిని తాను మ్రింగుచున్నట్లును భావించుచు కుంభకర్ణుడు రణోన్మత్తుడై గర్వించెను. యోధులందఱును వెన్ను చూపి పరుగులు దీసిరి. తిరిగి రమ్మన్నను వారు రారైరి. ఎవ్వరినీ చూడరైరి. ఎవ్వరిమాటలనూ వినరైరి. కుంభకర్ణుడు వానరసేనను చెల్లాచెదరు చేసినాడని విని, రాక్షససేన ఉత్సాహముతో ముందునకు దూసికొనిపోవుచుండెను. తమ సైన్యము కలవరపాటుతో చెదరిపోయినట్లును, శత్రుసైన్యము ముందడుగు వేయుచున్నట్లును శ్రీరాముడు గమనించెను. (చౌ॥ 1-4)

దో- సును సుగ్రీవ బిభీషన, అనుజ సఀభారెహు సైన ।
మైఀ దేఖఉఀ ఖల బల దలహి, బోలే రాజివనైన ॥ 67 ॥

అప్పుడు కమలనయనుడైన శ్రీరాముడు పలికెను. "సుగ్రీవా! విభీషణా! లక్ష్మణా! వినుడు మీరు సేనలను సమాయత్తపఱచుడు. నేనే దుష్టుని శక్తిని, వాని సైన్యబలమును చూచెదను. (దో॥ 67)

చౌ- కర సారంగ సాజి కటి భాథా । అరి దల దలన చలే రఘునాథా ॥
ప్రథమ కీన్హి ప్రభు ధనుష టఀకోరా । రిపు దల బధిర భయఉ సుని సోరా ॥ 1 ॥

సత్యసంధ ఛాఁడే సర లచ్ఛా । కాలసర్ప జను చలే సపచ్ఛా ॥
జహఁ తహఁ చలే బిపుల నారాచా । లగే కటన భట బికట పిసాచా ॥ 2 ॥
కటహిఁ చరన ఉర సిర భుజదండా । బహుతక బీర హోహిఁ సత ఖండా ॥
ఘుర్మి ఘుర్మి ఘాయల మహి పరహీఁ । ఉఠి సంభారి సుభట పుని లరహీఁ ॥ 3 ॥
లాగత బాన జలద జిమి గాజహీఁ । బహుతక దేఖి కఠిన సర భాజహీఁ ॥
రుండ ప్రచండ ముండ బిను ధావహిఁ । ధరు ధరు మారు మారు ధుని గావహిఁ ॥ 4 ॥

చేతిలో శార్ఙ్గధనువును, నడుమున తూణీరమును ధరించి, శ్రీరఘునాథుడు శత్రుసేనను పరిమార్చుటకు బయలుదేరెను. ప్రభువు మొదట ధనుష్టంకారమును గావించెను. దాని భయంకరధ్వనితో శత్రుసైనికులు బధిరులైరి. సత్యప్రతిజ్ఞుడైన శ్రీరాముడు శరములను పరంపరగా ప్రయోగించెను. అవి రెక్కలున్న కాలసర్పములవలె నలుదెసల దూసికొనిపోయెను. వాటి శక్తికి ఘోరరాక్షసయోధులు ముక్కలు ముక్కలైరి కాళ్లు, వక్షములు, మస్తకములు, భుజదండములు తెగిపడెను. పెక్కుమంది రాక్షసులు గిరగిర తిరుగుచు నేలకొరిగిరి. కొందఱుయోధులు మఱలలేచి, పోరాడుచుండిరి. వారందఱును బాణములు తగులగానే మేఘములవలె గర్జించుచుండిరి. పెక్కుమంది రాక్షసయోధులు బాణములను అల్లంతదూరమున చూడగానే పలాయనము చిత్తగించుచుండిరి. శిరస్సులులేని మొండెములు బయంకరముగా ఎగిరెగిరిపోవుచుండెను. తెగిన తలలు 'పట్టుకో, పట్టుకో, చంపుము చంపుము' అని కేకలు వేయుచుండెను. (చౌ॥ 1-4)

దో- ఛన మహుఁ ప్రభు కే సాయకన్హి, కాటే బికట పిసాచ ।
పుని రఘుబీర నిషంగ మహుఁ, ప్రబిసే సబ నారాచ ॥ 68 ॥

శ్రీరామచంద్రప్రభువు విడిచిన బాణములు క్షణకాలములో ఆ ఘోరరాక్షసులను ముక్కలు ముక్కలుగావించి, మఱలివచ్చి, ప్రభువుయొక్క తూణీరమున ప్రవేశించెను. (దో॥ 68)

చౌ- కుంభకరన మన దీఖ బిచారీ । హతి ఛన మాఝ నిసాచర ధారీ ॥
భా అతి క్రుద్ధ మహాబల బీరా । కియో మృగనాయక నాద గఁభీరా ॥ 1 ॥
కోపి మహీధర లేఇ ఉపారీ । డారఇ జహఁ మర్కట భట భారీ ॥
ఆవత దేఖి సైల ప్రభు భారే । సరన్హి కాటి రజ సమ కరి డారే ॥ 2 ॥
పుని ధను తాని కోపి రఘునాయక । ఛాఁడే అతి కరాల బహు సాయక ॥
తను మహుఁ ప్రబిసి నిసరి సర జాహీఁ । జిమి దామిని ఘన మాఝ సమాహీఁ ॥ 3 ॥
సోనిత స్రవత సోహ తన కారే । జను కజ్జల గిరి గేరు పనారే ॥
బికల బిలోకి భాలు కపి ధాఏ । బిహఁసా జబహిఁ నికట కపి ఆఏ ॥ 4 ॥

కుంభకర్ణుడు తనలో "నాకనులయెదుటనే శ్రీరాముడు ఒక్కక్షణములో రాక్షససేనను పూర్తిగా హతమార్చెను." అని అనుకొనుచు అత్యంత క్రుద్ధుడై, భీకరముగా సింహనాదమొనర్చెను. పర్వతములను పెకలించి, వానరములపై

వేయుచుండెను. అది గమనించిన ప్రభువు ఆ పర్వతములను తన బాణములతో పొడిపొడిగావించి, దూరముగా పడిపోవునట్లు చేయుచుండెను. పిదప శ్రీ రఘువీరుడు అతిక్రుద్ధుడై ధనుస్సును ఎక్కుపెట్టి, అత్యంత భయానకములైన బాణములను పెక్కింటిని ప్రయోగించెను. ఆ ఆశుగములు (బాణములు) కుంభకర్ణుని శరీరములోనికి 'విద్యుల్లతలు మేఘములలోనికి ప్రవేశించునట్లు' చొచ్చుకొని పోవుచుండెను. కుంభకర్ణుని నల్లనిశరీరమునుండి కారెడి రక్తపు జాలులు నల్లని కాటుక కొండనుండి స్రవించు గైరికధాతు ప్రవాహములవలెనుండెను. అతడు వికలుడగుట చూచి వానర భల్లూకములు అతని మీదికి దాడికి వెడలుచుండెను. వానరములు సమీపింపగనే అతడు వికటాట్టహాసము చేయుచుండెను. (చౌ॥ 1-4)

దో- మహానాద కరి గర్జా, కోటి కోటి గహి కీస।
మహి పటకఇ గజరాజ ఇవ, సపథ కరఇ దససీస ॥ 69 ॥

ఘోరగర్జనలనుజేయుచు, అతడు అసంఖ్యాకములైన వానరములను పట్టుకొని, మదపుటేనుగువలె నేలకేసి కొట్టుచుండెను. 'రావణునకు జయము, జయము' అని బిగ్గరగా అరచుచుండెను. (దో॥ 69)

చౌ- భాగే భాలు బలీముఖ జూథా। బృకు బిలోకి జిమి మేష బరూథా ॥
చలే భాగి కపి భాలు భవానీ। బికల పుకారత ఆరత బానీ ॥ 1 ॥
యహ నిసిచర దుకాల సమ అహఈ। కపికుల దేస పరన అబ చహఈ ॥
కృపా బారిధర రామ ఖరారీ। పాహి పాహి ప్రనతారతి హారీ ॥ 2 ॥
సకరున బచన సునత భగవానా। చలే సుధారి సరాసన బానా ॥
రామ సేన నిజ పాఛేం ఘాలీ। చలే సకోప మహా బలసాలీ ॥ 3 ॥
ఖైంచి ధనుష సర సత సంధానే। ఛూటే తీర సరీర సమానే ॥
లాగత సర ధావా రిస భరా। కుధర డగమగత డోలతి ధరా ॥ 4 ॥
లీన్హ ఏక తెహిం సైల ఉపాటీ। రఘుకులతిలక భుజా సోఇ కాటీ ॥
ధావా బామ బాహు గిరి ధారీ। ప్రభు సోఉ భుజా కాటి మహి పారీ ॥ 5 ॥
కాటేం భుజా సోహ ఖల కైసా। పచ్ఛహీన మందర గిరి జైసా ॥
ఉగ్ర బిలోకని ప్రభుహి బిలోకా। గ్రసన చహత మానహుం త్రైలోకా ॥ 6 ॥

తోడేలును జూచిన గొఱ్ఱెలవలె ఆ వానరభల్లూకములు కుంభకర్ణునిజూచి, పరుగులు దీయసాగెను. (శివుడు పలుకుచున్నాడు) భవానీ! వానరభల్లూకములు చెల్లాచెదరై ఆర్తనాదములతో పిక్కబలము చూపెను. వారు " ఓ కృపానిధీ! ఖరారీ! ప్రణతార్తిహరా! శ్రీరామా! ఈనిశాచరుడు వానరలోకమును సర్వనాశనము చేయుటకై వచ్చిన కాలకమువలె ఉన్నాడు. మమ్ము రక్షింపుము, రక్షింపుము" అని ఆర్తితో వేడుకొనిరి. వారిదీనాలాపములనువినిన భగవంతుడు ధనుర్బాణములను ధరించి, వానరభల్లూకసేనను తన వెంట నిడుకొని, ముందునకు సాగెను. ధనుస్సును లాగి, నూఱుబాణములను ఒక్కసారి ప్రయోగింపగా అవి ఆ రాక్షసునిశరీరమున గ్రుచ్చుకొనెను. బాణములు తగులగానే కుంభకర్ణుడు క్రోధావేశముతో శ్రీరామునివైపు వేగముగా దూసికొని రాసాగెను. అతని వేగమునకు పర్వతములు గిరగిర తిరిగెను. భూమి కంపించెను. కుంభకర్ణుడొకపర్వతమును చేతబట్టి

వచ్చుచుండెను. రఘువీరుడు వాని ఆభుజమును ఖండించెను. అప్పుడతడు ఎడమచేతితో పర్వతమునెత్తికొని వచ్చుచుండెను. ప్రభువు ఆతనిఎడమచేతిని గూడ ముక్కలు ముక్కలుగావించి అతనిని నేలపై పడగొట్టెను. భుజములను కోల్పోయిన ఆ దుష్టరాక్షసుడు రెక్కలుతెగిన మందరాచలమువలె ఒప్పుచుండెను. ముల్లోకములను మ్రింగివేయునంతటిక్రూరదృష్టితో అతడు ప్రభువును జూచెను. (చౌ 1-6)

దో- కరి చిక్కార ఘోర అతి, ధావా బదను పసారి ।
గగన సిద్ధ సుర త్రాసిత, హా హా హేతి పుకారి ॥ 70 ॥

అతిఘోరముగా కేకలుపెట్టుచు అతడు నోరు తెఱచుకొని ముందునకు పరుగెత్తెను. ఆకాశమున సిద్ధులు, దేవతలు భయభ్రాంతులకులోనై హాహాకారములు చేసిరి. (దో 70)

చౌ- సభయ దేవ కరునానిధి జాన్యో । శ్రవన ప్రజంత సరాసను తాన్యో ॥
బిసిఖ నికర నిసిచర ముఖ భరెఉ । తదపి మహాబల భూమి న పరెఉ ॥ 1 ॥
సరన్హి భరా ముఖ సన్ముఖ ధావా । కాల త్రోన సజీవ జను ఆవా ॥
తబ ప్రభు కోపి తీబ్ర సర లీన్హా । ధర తే భిన్న తాసు సిర కీన్హా ॥ 2 ॥
సో సిర పరెఉ దసానన ఆగేఁ । బికల భయఉ జిమి ఫని మని త్యాగేఁ ॥
ధరని ధసఇ ధర ధావ ప్రచండా । తబ ప్రభు కాటి కీన్హ దుఇ ఖండా ॥ 3 ॥
పరే భూమి జిమి నభ తేఁ భూధర । హేఠ దాబి కపి భాలు నిసాచర ॥
తాసు తేజ ప్రభు బదన సమానా । సుర ముని సబహిఁ అచంభవ మానా ॥ 4 ॥
సుర దుందుభీఁ బజావహిఁ హరషహిఁ । అస్తుతి కరహిఁ సుమన బహు బరషహిఁ ॥
కరి బినతీ సుర సకల సిధాఏ । తేహీ సమయ దేవరిషి ఆఏ ॥ 5 ॥
గగనోపరి హరి గున గన గాఏ । రుచిర బీరరస ప్రభు మన భాఏ ॥
బేగి హతహు ఖల కహి ముని గఏ । రామ సమర మహి సోభత భఏ ॥ 6 ॥

దేవతలు భీతచిత్తులైనట్లు ఎఱింగి, దయాళువైన రఘునాథుడు ధనుస్సును ఆకర్ణాంతములాగి, రాక్షసుని ముఖమును బాణములతో నింపెను. ఐనను మహాబలుడైన ఆ రాక్షసుడు నేలగూలలేదు. ముఖమునిండా బాణములు గ్రుచ్చుకొనియున్నను మృత్యువే సజీవమైన తూణీరముగా వచ్చుచున్నట్లు అతడు ప్రభువుముందునకు వేగముగా ఏతెంచెను. అప్పుడు ప్రభువు క్రుద్ధుడై ఒక తీవ్రమైన బాణముతో వాని తలను మొండెమునుండి వేఱుచేసెను. ఆ కుంభకర్ణుని శిరస్సు ఎగిరిపోయి, రావణుని ముందుపడెను. దానిని జూచి దశాననుడు మణిని పోగొట్టుకొన్న సర్పమువలె హతాశుడయ్యెను. తలలేని కుంభకర్ణుని కళేబరము రణరంగమున పెఱుగెత్తుచుండెను. దాని భారమునకు భూమి క్రుంగిపోయెను. రామచంద్రప్రభువు దానిని రెండు ముక్కలుగా జేసెను: ఆ రెండు ఖండములును ఆకాశమునుండి రెండు పర్వతములు కూలిపోయినట్లు నేలపై పడిపోయెను. వాటిక్రిందబడి పెక్కుమంది భల్లూకవానరులు, నిశాచరులు నలిగిపోయిరి. ఆ శరీరఖండములనుండి ఒక తేజస్సు వెడలి, శ్రీరామునిలో లీనమాయెను. ఆ దృశ్యమునుగాంచి, దేవతలును, మునులును ఆశ్చర్యచకితులైరి. దేవతలు హర్షముతో దుందుభులను మ్రోగించిరి. శ్రీరామునిగుణములను కీర్తించుచు పుష్పములను వర్షించిరి. అనేక

స్తోత్రములను చేసి, దేవతలు వెళ్లిన పిదప దేవర్షి నారదుడు విచ్చేసెను. అతడు ఆకసమున నిలబడి, భగవంతుని వీర్యపరాక్రమములను, దివ్యగుణములను గానము చేసెను. ప్రభువు ప్రసన్నుడాయెను. 'ఆలసింపక దుష్టరావణునిగూడ సంహరింపుడు' అని పలికి నారదుడు వెళ్ళిపోయెను. ఆసమయమున శ్రీరామచంద్రుడు సమరాంగణమున దివ్యతేజస్సులతో విరాజిల్లెను. (చౌ॥ 1-6)

ఛం-సంగ్రామ భూమి బిరాజ రఘుపతి అతుల బల కోసల ధనీ ।
శ్రమ బిందు ముఖ రాజీవ లోచన అరున తన సోనిత కనీ ॥
భుజ జుగల ఫేరత సర సరాసన భాలు కపి చహు దిసి బనే ।
కహ దాస తులసీ కహి న సక ఛబి సేష జెహి ఆనన ఘనే ॥

అతులితబలధాముడైన కోసలపతి శ్రీరామచంద్రుడు రణరంగమున విరాజమానుడైయుండెను. ఆయన ముఖముపై శ్రమబిందువులు రుచిరములైయుండెను. కమలములవంటిలోచనములు ఎఱ్ఱబాఱెను. తనువుపై రక్తబిందువులు ఒప్పుచుండెను. కరద్వయమున ధనుర్బాణములు తిరుగుచుండెను. నలువైపులయందును వానరభల్లూకములచే పరివేష్టితుడై యుండెను. అప్పటి ప్రభు సౌందర్యమును వేయిముఖములుగల ఆదిశేషుడుగూడ వర్ణింపజాలడని తులసీదాసునుడువుచున్నాడు. (ఛం)

దో- నిసిచర అధమ మలాకర, తాహి దీన్హ నిజ ధామ ।
గిరిజా తే నర మందమతి, జే న భజహిఀ శ్రీరామ ॥ 71 ॥

(శివుడు పలుకుచున్నాడు) గిరిజా! నీచనిశాచరుడును, పాపాలపుట్టయు ఐన కుంభకర్ణునకును శ్రీరాముడు పరమపదమును అనుగ్రహించెను. అట్టి స్వామిని భజింపనివాడు నిజముగా మందబుద్ధియని భావింపవలెను. (దో॥ 71)

## లక్ష్మణ మేఘనాదుల సమరము

చౌ- దివ కేఀ అంత ఫిరీఀ ద్వౌ అనీ । సమర భఈ సుభటన్హ శ్రమ ఘనీ ॥
రామ కృపాఀ కపి దల బల బాఢా । జిమి తృన పాఇ లాగ అతి డాఢా ॥ 1 ॥
ఛీజహిఀ నిసిచర దిను అరు రాతీ । నిజ ముఖ కహేఀ సుకృత జెహి భాఀతీ ॥
బహు బిలాప దసకంధర కరఈ । బంధు సీస పుని పుని ఉర ధరఈ ॥ 2 ॥
రోవహిఀ నారి హృదయ హతి పానీ । తాసు తేజ బల బిపుల బఖానీ ॥
మేఘనాద తెహి అవసర ఆయఉ । కహి బహు కథా పితా సముఝాయఉ ॥ 3 ॥
దేఖేహు కాలి మోరి మనుసాఈ । అబహిఀ బహుత కా కరౌఀ బడాఈ ॥
ఇష్టదేవ సైఀ బల రథ పాయఉఀ । సో బల తాత న తోహి దెఖాయఉఀ ॥ 4 ॥

ఏహి బిధి జల్పత భయఉ బిహానా । చహుఀ దుఆర లాగే కపి నానా ॥
ఇత కపి భాలు కాల సమ బీరా । ఉత రజనీచర అతి రనధీరా ॥ 5 ॥
లరహిఀ సుభట నిజ నిజ జయ హేతూ । బరని న జాఇ సమర ఖగకేతూ ॥ 6 ॥

సాయంసమయమగుటవలన ఉభయసేనలును తమతమ శిబిరములకు జేరెను. ఆనాటియుద్ధమున యోధులు మిక్కిలి అలిసిపోయిరి. కాని అగ్నిసహాయమున గడ్డిపోచలుగూడ బాగుగా ప్రజ్వరిల్లునట్లు శ్రీరామునికృపవలన వానరసేనలబలము ప్రబలమాయెను. చేసిన ఘన (పుణ్య) కార్యములను గూర్చి తామే స్వోత్కర్షతో నిరంతరము చెప్పికొనుటవలన ఆపుణ్యఫలములు నశించి పోవునట్లు రాక్షసులబలము క్రమముగా క్షీణించుచుండెను. రావణుడు కుంభకర్ణునిశిరస్సును తనగుండెకు మాటిమాటికిని హత్తుకొనుచు మిక్కిలి విలపింపసాగెను. స్త్రీలు కుంభకర్ణునితేజస్సును, బలమును విశేషముగా వర్ణించుచు తమ గుండెలను బాదుకొనుచు ఏడువసాగిరి. అదే సమయమున మేఘనాదుడు అచటికి వచ్చి ధైర్యోత్సాహములను గూర్చు పెక్కుకథలను విన్పించి, రావణునకు ఊరట గూర్చుచు ఇట్లు పలికెను. 'రేపు నా పరాక్రమమును చూడుడు. ఇప్పుడే నన్ను నేనేల ప్రశంసించుకొనవలెను? నా ఇష్టదైవమునుండి నేను పొందిన బలమును రథమును మీకింతవఱకు చూపలేదు. ఈ విధముగా అతడు ప్రగల్భములను పలుకుచుండగా తెల్లవాఱెను. లంకయొక్క నాలుగుద్వారములకడ వానరసైన్యములు సమీకరించియుండెను. కాలునివలె ప్రళయ భయంకరులైన భల్లూకవానరులేనైనను, అత్యంతరణధీరులైన రాక్షససైనికులానైనను యుద్ధసన్నద్ధులై యుండిరి. ఉభయపక్షముల యోధులును విజయకాంక్షతో వీరోచితముగా పోరాడుచుండిరి. ఓ గరుడుడా! అట్టి భీకర యుద్ధమును వర్ణింపజాలము. (చౌ॥ 1-6)

దో- మేఘనాద మాయామయ, రథ చఢి గయఉ అకాస ।
గర్జెఉ అట్టహాస కరి, భఇ కపి కటకహి త్రాస ॥ 72 ॥

మేఘనాదుడు తనఇష్టదైవమునుండిపొందిన మాయారథమునెక్కి, ఆకసమునకు ఎగిరెను. అట్టహాసముతో గర్జించెను. ఆ గర్జనలను విని, వానరసేనలు భయకంపితములయ్యేను. (దో॥ 72)

చౌ- సక్తి సూల తరవారి కృపానా । అస్త్ర సస్త్ర కులిసాయుధ నానా ॥
డారఇ పరసు పరిఘ పాషానా । లాగేఉ బృష్టి కరై బహు బానా ॥ 1 ॥
దస దిసి రహే బాన నభ ఛాఈ । మానహుఀ మఘా మేఘ ఝరి లాఈ ॥
ధరు ధరు మారు సునిఅ ధుని కానా । జో మారఇ తెహి కోఉ న జానా ॥ 2 ॥
గహి గిరి తరు అకాస కపి ధావహిఀ । దేఖహిఀ తెహి న దుఖిత ఫిరి ఆవహిఀ ॥
అవఘట ఘాట బాట గిరి కందర । మాయా బల కీన్హేసి సర పంజర ॥ 3 ॥
జాహిఀ కహాఀ బ్యాకుల భఏ బందర । సురపతి బంది పరే జను మందర ॥
మారుతసుత అంగద నల నీలా । కీన్హేసి బికల సకల బలసీలా ॥ 4 ॥
పుని లఛిమన సుగ్రీవ బిభీషన । సరన్హి మారి కీన్హేసి జర్జర తన ॥
పుని రఘుపతి సైఀ జూఝై లాగా । సర ఛాఀడఇ హోఇ లాగహిఀ నాగా ॥ 5 ॥

బ్యాల పాస బస భఏ ఖరారీ । స్వబస అనంత ఏక అబికారీ ॥
నట ఇవ కపట చరిత కర నానా । సదా స్వతంత్ర ఏక భగవానా ॥ 6 ॥
రన సోభా లగి ప్రభుహిఁ బఁధాయో । నాగపాస దేవన్హ భయ పాయో ॥ 7 ॥

మేఘనాదుడు శక్తి, శూలము, ఖడ్గము, కృపాణము, మున్నగు అస్త్రశస్త్రములను, వజ్రాయుధ తుల్యములగు వివిధాయుధములను శత్రుసైన్యములపై ప్రయోగించెను. పరశువు, పరిఘ, శిలలు, మున్నగువాటిని, వివిధశరములను వర్షింపసాగెను. ఆకాశమును మఖకార్తెలో మేఘములు కప్పివేసినట్లు, ఇంద్రజిత్తుబాణములు దశదిశలను కప్పివేసెను. 'పట్టుకొనుము, పట్టుకొనుము, చంపుము, చంపుము' అను అఱపులుఅంతట వినబడుచుండెను. కాని ఇంద్రజిత్తుమాయవలన ఆ శస్త్రాస్త్రములను ప్రయోగించెడి ఇంద్రజిత్తుమాత్రము ఎవ్వరికిని కనబడుటలేదు. ఆ ఇంద్రజిత్తునకు మాత్రము అందఱును కనబడుచుండిరి. పర్వతములను, వృక్షములను గైకొని, వానరవీరులు ఆకసమునకెగిరిరి. కాని ఎవ్వరును కనబడనందున నిరాశతో మఱలివచ్చిరి. తనమాయాప్రభావమున మేఘనాదుడు దుర్గమములైన లోయలను, మార్గములను, కొండగుహలను శరపంజరములలో బంధించెను. వానరులు దిక్కుతోచక ఇంద్రునకు పర్వతములు బందీలైనట్లు మిక్కిలి వ్యాకులపాటునకు లోనైరి. మేఘనాదుడు పవనసుతుడైన హనుమంతుని, అంగదుని, నలుడు, నీలుడు మొదలగు బలశాలురైన మహా యోధులందఱిని కలవరపఱచెను. పిదప లక్ష్మణుని, సుగ్రీవుని, విభీషణుని, తన బాణములతో బాధించి, వారి శరీరములను జర్జరితములుగాజేసెను. పిదప ఆతడు శ్రీరఘునాథునితో యుద్ధము చేయసాగెను. అతడు వదలిన బాణములు సర్పములై వచ్చిపడుచుండెను. స్వతంత్రుడు అనంతుడు, అఖండుడు, నిర్వికారుడు, ఖరారియైన శ్రీరాముడు లీలగా నాగపాశబద్ధుడయ్యెను. శ్రీరామచంద్రుడు సర్వదా స్వతంత్రుడు, అద్వితీయుడైన భగవంతుడు అతడు ఒక నటునివలె అనేక ప్రకారముల లీలావిలాసములను ప్రదర్శించుచుండును. కనుక యుద్ధమునకు శోభను గూర్చుటకై ప్రభువు తనకుతానై ఇప్పుడు నాగపాశమునకు కట్టుబడెను. ఆ దృశ్యమును గాంచి, దేవతలు భయపడిరి. (చౌ॥ 1-7)

దో- గిరిజా జాసు నామ జపి, ముని కాటహిఁ భవ పాస ।
సో కి బంధ తర ఆవఇ, బ్యాపక బిస్వ నివాస ॥ 73 ॥

(శివుడు పలుకుచున్నాడు) ఓ గిరిజా! రామనామమును జపించినంత మాత్రముననే మునులు భవ బంధములనుండి విముక్తులయ్యెదరు. సర్వవ్యాపకుడును, జగన్నివాసుడును ఐన అట్టి ప్రభువు ఎవరి బంధములకైనను చిక్కునా? (దో॥ 73)

చౌ- చరిత రామ కే సగున భవానీ । తర్కి న జాహిఁ బుద్ధి బల బానీ ॥
అస బిచారి జే తగ్య బిరాగీ । రామహి భజహిఁ తర్క సబ త్యాగీ ॥ 1 ॥
బ్యాకుల కటకు కీన్హ ఘననాదా । పుని భా ప్రగట కహఇ దుర్బాదా ॥
జామవంత కహ ఖల రహు ఠాఢా । సుని కరి తాహి క్రోధ అతి బాఢా ॥ 2 ॥
బూఢ జాని సఠ ఛాఁడేఉఁ తోహీ । లాగేసి అధమ పచారై మోహీ ॥
అస కహి తరల త్రిసూల చలాయో । జామవంత కర గహి సోఇ ధాయో ॥ 3 ॥

మారిసి మేఘనాద కై ఛాతీ । పరా భూమి ఘుర్మిత సురఘాతీ ॥
పుని రిసాన గహి చరన ఫిరాయో । మహి పఛారి నిజ బల దెఖరాయో ॥ 4 ॥
బర ప్రసాద సో మరఇ న మారా । తబ గహి పద లంకా పర డారా ॥
ఇహాఁ దేవరిషి గరుడ పఠాయో । రామ సమీప సపది సో ఆయో ॥ 5 ॥

శర్వాణీ! సగుణస్వరూపుడైన శ్రీరామునిలీలలు వాక్కునకును, బుద్ధికిని అతీతములు. దీనిని గ్రహించియే తత్త్వజ్ఞానులును, విరాగులును తర్కములజోలికిపోక శ్రీరాముని ఆరాధించెదరు. మేఘనాదుడు వానరసైన్యములను టికమకల పాలుచేసెను. పిమ్మట అందఱికిని కనబడుచు దుర్భాషలాడసాగెను. అప్పుడు జాంబవంతుడు "ఓరీదుష్టుడా! నిలువుము." అనిపలికెను. ఈ మాటను విని, మేఘనాదుడుక్రుద్ధుడై "ఓరీ మూర్ఖుడా! ముసలివాడవని నిన్ను నేను వదలివేసితిని. ఇప్పుడు నన్ను కవ్వించుచున్నావు." అని పలికి నిశితమైన త్రిశూలమును ప్రయోగించెను. జాంబవంతుడు ఆత్రిశూలమును చేతితో పట్టుకొని, ముందునకు పరుగెత్తి, దానితోడనే అతని వక్షస్థలముపై దెబ్బతీసెను. దేవతలకు శత్రువైన మేఘనాదుడు ఆదెబ్బకు గిరగిర తిరిగి నేలపై వ్రాలెను. జాంబవంతుడు క్రుద్ధుడై, అతని కాలిని చిక్కించుకొని, గిరగిర త్రిప్పి, నేలకేసికొట్టి తన బలమును ప్రదర్శించెను. కాని ఇంద్రజిత్తు కొట్టబడినను వరప్రభావమున చావలేదు. జాంబవంతుడు అతని కాలిని చిక్కించుకొని లంకలోనికి విసరివేసెను. ఇంతలో దేవర్షినారదుడు శ్రీరామునికడకు గరుడుని పంపెను. (చౌ॥ 1-5)

దో- ఖగపతి సబ ధరి ఖాఏ, మాయా నాగ బరూథ ।
మాయా బిగత భఏ సబ, హరషే బానర జూథ ॥ 74(క) ॥
గహి గిరి పాదప ఉపల నఖ, ధాఏ కీస రిసాఇ ।
చలే తమీచర బికలతర, గఢ పర చఢే పరాఇ ॥ 74(ఖ) ॥

పక్షిరాజైన గరుత్మంతుడు మాయారచిత సర్పములనన్నింటిని పట్టుకొని తినివేసెను. అప్పుడు వానరులందఱును మాయావిముక్తులై, ప్రసన్నులైరి. పర్వతములను వృక్షములను, ఱాళ్లను, నఖములను ఆయుధములుగా గలిగి, వానరులు క్రుద్ధులై యుద్ధ భూమికి పరుగెత్తిరి. రాక్షసులు వారి ధాటికి తట్టుకొనలేక వ్యాకుల పాటుతో పాఱిపోయి కోటలపైకెక్కిరి. (దో॥ 74 క,ఖ)

చౌ- మేఘనాద కై మురఛా జాగీ । పితహి బిలోకి లాజ అతి లాగీ ॥
తురత గయఉ గిరిబర కందరా । కరౌఁ అజయ మఖ అస మన ధరా ॥ 1 ॥
ఇహాఁ బిభీషన మంత్ర బిచారా । సునహు నాథ బల అతుల ఉదారా ॥
మేఘనాద మఖ కరఇ అపావన । ఖల మాయావీ దేవ సతావన ॥ 2 ॥
జౌఁ ప్రభు సిద్ధ హోఇ సో పాఇహి । నాథ బేగి పుని జీతి న జాఇహి ॥
సుని రఘుపతి అతిసయ సుఖ మానా । బోలే అంగదాది కపి నానా ॥ 3 ॥

లఛిమన సంగ జాహు సబ భాఈ । కరహు బిధంస జగ్య కర జాఈ ॥
తుమ్హ లఛిమన మారెహు రన ఓహీ । దేఖి సభయ సుర దుఖ అతి మోహీ ॥ 4 ॥
మారెహు తెహి బల బుద్ధి ఉపాఈ । జెహిఁ ఛీజై నిసిచర సును భాఈ ॥
జామవంత సుగ్రీవ బిభీషన । సేన సమేత రహేహు తీనిఉ జన ॥ 5 ॥
జబ రఘుబీర దీన్హి అనుసాసన । కటి నిషంగ కసి సాజి సరాసన ॥
ప్రభు ప్రతాప ఉర ధరి రనధీరా । బోలే ఘన ఇవ గిరా గఁభీరా ॥ 6 ॥
జౌఁ తెహి ఆజు బధేఁ బిను ఆవౌఁ । తౌ రఘుపతి సేవక న కహావౌఁ ॥
జౌఁ సత సంకర కరహిఁ సహాఈ । తదపి హతఉఁ రఘుబీర దోహాఈ ॥ 7 ॥

మేఘనాదుడు మూర్ఛనుండి లేవగానే తండ్రిని జూచి సిగ్గుపడెను. "నేను 'అజేయయజ్ఞము'ను జేసెదను"- అని సంకల్పము చేసి, వెంటనే ఒక పర్వతగుహలోనికి వెళ్లెను. ఇక్కడ విభీషణుడు శ్రీరామునకు సలహానిచ్చెను. "అతులిత బలశాలీ! ఉదారగుణనిధీ! ప్రభూ! దుష్టుడును మాయావియు ఐన మేఘనాదుడు అపవిత్ర యజ్ఞమును జేయుచున్నాడు. ఆ యజ్ఞము ఫలించినచో అతనిని జయించుట కష్టము."- ఈ మాటలను విని, రఘునాథుడు మిక్కిలి సంతుష్టుడై అంగదాదివానరులనుబిలిచి పలికెను. "వానర వీరులారా! మీరందఱును లక్ష్మణునితో వెళ్లి, ఆయజ్ఞమును ధ్వంసము చేయుడు. లక్ష్మణా! నీవు వానిని యుద్ధములో సంహరింపుము. భయభ్రాంతులకు లోనైన దేవతలను జూచి నేను మిక్కిలి విచార పడుచున్నాను. సోదరా! నీ బలము, బుద్ధి, ఉపాయములచే ఆ రాక్షసుని ఏదొక విధముగా తుదముట్టింప వలెను. జాంబవంతా! సుగ్రీవా! విభీషణా! మీరు ముగ్గురును మీమీసేనలతోగూడి ఇతనికి తోడుగా చనుడు"- శ్రీరామునిఆజ్ఞమేరకు రణధీరుడైన లక్ష్మణుడు నడుమునకు తూణీరమును కట్టుకొని, ధనుర్బాణములను చేబూని, శ్రీరాముని ప్రతాపమును మనస్సులో నిలుపుకొని, మేఘగంభీరస్వరముతో ఇట్లనెను. "నేను శ్రీ రఘునాథునకు నిజమైన సేవకుడనేఐనచో ఆ దుష్టుని వధింపక మఱలిరాను. రఘు వీరునిపై శపథము చేయుచున్నాను. ఆ శంకరుడే అతనికి తోడై నిలిచినను మేఘనాదునకు నా చేతిలో చావు తప్పదు."

(చౌ. 1-7)

## మేఘనాదుని వధ

దో- రఘుపతి చరన నాఇ సిరు, చలెఉ తురంత అనంత ।
అంగద నీల మయంద నల, సంగ సుభట హనుమంత ॥ 75 ॥

శ్రీ రఘునాథుని చరణములకు శిరసా ప్రణమిల్లి, శేషావతారుడైన లక్ష్మణుడు వెంటనే రణభూమికి చేరెను. అతనితోపాటు అంగదుడు, నలుడు, నీలుడు, మయందుడు, హనుమంతుడు మొదలగు మహా యోధులు వెళ్లిరి.

(దో. 75)

చౌ- జాఇ కపిన్హ సో దేఖా బైసా । ఆహుతి దేత రుధిర అరు భైఁసా ॥
కీన్హ కపిన్హ సబ జగ్య బిధంసా । జబ న ఉఠఇ తబ కరహిఁ ప్రసంసా ॥ 1 ॥
తదపి న ఉఠఇ ధరేన్హి కచ జాఈ । లాతన్హి హతి హతి చలే పరాఈ ॥
లై త్రిసూల ధావా కపి భాగే । ఆఏ జహఁ రామానుజ ఆగే ॥ 2 ॥

ఆవా పరమ క్రోధ కర మారా । గర్జ ఘోర రవ బారహిఁ బారా ॥
కోపి మరుతసుత అంగద ధాఏ । హతి త్రిసూల ఉర ధరని గిరాఏ ॥ 3 ॥
ప్రభు కహఁ ఛాఁడేసి సూల ప్రచండా । సర హతి కృత అనంత జుగ ఖండా ॥
ఉఠి బహోరి మారుతి జుబరాజా । హతహిఁ కోపి తెహి ఘాఉ న బాజా ॥ 4 ॥
ఫిరే బీర రిపు మరఇ న మారా । తబ ధావా కరి ఘోర చికారా ॥
ఆవత దేఖి క్రుద్ధ జను కాలా । లఛిమన ఛాడే బిసిఖ కరాలా ॥ 5 ॥
దేఖేసి ఆవత పబి సమ బానా । తురత భయఉ ఖల అంతరధానా ॥
బిబిధ బేష ధరి కరఇ లరాఈ । కబహుఁక ప్రగట కబహుఁ దురి జాఈ ॥ 6 ॥
దేఖి అజయ రిపు డరపే కీసా । పరమ క్రుద్ధ తబ భయఉ అహీసా ॥
లఛిమన మన అస మంత్ర దృఢావా । ఏహి పాపిహి మైఁ బహుత ఖేలావా ॥ 7 ॥
సుమిరి కోసలాధీస ప్రతాపా । సర సంధాన కీన్హ కరి దాపా ॥
ఛాడా బాన మాఝ ఉర లాగా । మరతీ బార కపటు సబ త్యాగా ॥ 8 ॥

వానరులు వెళ్లి చూడగా మేఘనాదుడు దున్నపోతులను ఆహుతిగా ఇచ్చుచుండెను. రక్తముతో హోమము చేయుచుండెను. వానరులు వానియజ్ఞమును ధ్వంసమొనర్చిరి. ఐనను అతడు యజ్ఞ పీఠము నుండి లేవలేదు. అప్పుడు వారు అతనిని వ్యంగ్యముగా పొగడదొడగిరి. ఈ వ్యంగ్యోక్తులకును అతడు చలింపకుండెను. అప్పుడు వారతనికేశములను పట్టుకొని, కాళ్లతో తన్ని పరుగెత్తిరి. త్రిశూలముతో అతడు వారిని వెంబడింపగా వారు లక్ష్మణుని కడకు చేరిరి. మేఘనాదుడు మిక్కిలి క్రోధావేశములతో భయంకరముగా గర్జించెను. పవనసుతుడును, అంగదుడును, కోపముతో వానిని ఎదుర్కొనిరి. అతడు వారిగుండెలపై త్రిశూలముతో కొట్టి నేలపై పడిపోవునట్లు చేసెను. అనంతరము అతడు త్రిశూలమును లక్ష్మణునిపై విసరెను. అనంతుడైన ఆ లక్ష్మణుడు త్రిశూలమును తనబాణముతో కొట్టి, రెండు ముక్కలు గావించెను. హనుమంతుడును, అంగదుడును, క్రోధముతో అతనిని కొట్టసాగిరి. ఎంతగా కొట్టినను అతనికి దెబ్బతగులుటలేదు. ఏవిధముగను అతడు తమచేతులలో మరణింపడని భావించి, ఆ వానర వీరులందఱును తిరిగి వచ్చిరి. అతడు ఘోరముగా గర్జించుచు ముందునకు వచ్చెను. క్రుద్ధుడై మృత్యువువలె వచ్చుచున్న అతనిని జూచి, లక్ష్మణుడు అతనిపై తీక్ష్ణములైన బాణములను వదలెను. వజ్రతుల్యములైన ఆ బాణములు వచ్చుటను జూచి, వెంటనే అతడు అంతర్ధాన మాయెను. మాయతో వివిధ రూపములను ధరించి, యుద్ధము చేయసాగెను. ఒక్కొక్కసారి ప్రకటితుడగుచుండెను. మఱియొకపర్యాయము దాగుకొనుచుండెను. శత్రువు అజేయుడని తెలిసి, వానరులు భయపడుచుండిరి. కోపోద్రిక్తుడైన లక్ష్మణుడు" ఇంక ఈ పాపితో ఆటలు చాలును. వీనిని ఇప్పుడు చంపుటయే యుక్తము" అని తలంచెను. శ్రీరాముని ప్రభావమును తలంచుకొని, లక్ష్మణుడు వీరోచిత దర్పముతో బాణమును సంధించి, వదలెను. అది సూటిగా వెళ్లి మేఘనాదుని గుండెలో గ్రుచ్చుకొనెను. మరణ సమయమున అతడు కపటమును త్యజించెను. (చౌ॥ 1-8)

దో- రామానుజ కహఁ రాము కహఁ, అస కహి ఛాఁడేసి ప్రాన ।
ధన్య ధన్య తవ జననీ, కహ అంగద హనుమాన ॥ 76 ॥

(అతని హృదయములో ఈ భావము కలిగెను) "రాముని తమ్ముడు లక్ష్మణుడు ఎక్కడ? రాముడెక్కడ?" అనుచు అతడు అసువులు వీడెను. అంగదుడును, హనుమంతుడును ఇట్లు పలికిరి. "నీ తల్లి ధన్యురాలు. ధన్యురాలు. నీవు లక్ష్మణుని చేతిలో మరణించితివి. మరణసమయమున రామలక్ష్మణనామములను స్మరించితివి"
(దో. 76)

చౌ- బిను ప్రయాస హనుమాన ఉఠాయో । లంకా ద్వార రాఖి పుని ఆయో ॥
తాసు మరన సుని సుర గంధర్బా । చఢి బిమాన ఆఏ నభ సర్బా ॥ 1 ॥
బరషి సుమన దుందుభీం బజావహిం । శ్రీరఘునాథ బిమల జసు గావహిం ॥
జయ అనంత జయ జగదాధారా । తుమ్హ ప్రభు సబ దేవన్హి నిస్తారా ॥ 2 ॥
అస్తుతి కరి సుర సిద్ధ సిధాఏ । లఛిమన కృపాసింధు పహిం ఆఏ ॥
సుత బధ సునా దసానన జబహీం । మురుఛిత భయఉ పరేఉ మహి తబహీం ॥ 3 ॥
మందోదరీ రుదన కర భారీ । ఉర తాడన బహు భాంతి పుకారీ ॥
నగర లోగ సబ బ్యాకుల సోచా । సకల కహహిం దసకంధర పోచా ॥ 4 ॥

హనుమంతుడు మేఘనాదుని కళేబరమును అనాయాసముగ తీసికొని పోయి, లంకాద్వారముకడనుంచి తిరిగి వచ్చెను. మేఘనాదుని మరణవార్తవిని, దేవతలును, గంధర్వాదులును విమానములపై ఆకాశ మార్గమున వచ్చిరి. వారు దుందుభులను మ్రోగించుచు పూలను వర్షించిరి. శ్రీ రఘునాథుని నిర్మల కీర్తిని గానము చేసిరి. "ఓ అనంతా! నీకు జయము. ఓ జగదాధారా! నీకు జయము. ప్రభూ! మీరు మహావిపత్తు నుండి దేవతలను ఉద్ధరించితిరి." దేవతలు, సిద్ధులు మొదలగువారును స్తుతులొనర్చి, వెళ్లినపిమ్మట లక్ష్మణుడు దయాళువైన శ్రీరాముని చెంతకు వచ్చెను. రావణుడు తన కుమారునిమరణవార్తను వినగానే మూర్ఛితుడై నేలపై పడెను. మందోదరి గుండెలు బాదుకొనుచు అనేకవిధముల విలపించెను. లంకా నివాసులందఱును 'అయ్యో! పాపము' అని రోదించుచు శోక విహ్వలురైరి. రావణుడు పరమనీచుడని తిట్టసాగిరి.
(చౌ. 1-4)

దో- తబ దసకంఠ బిబిధి బిధి, సముఝాఈం సబ నారి ।
నస్వర రూప జగత సబ, దేఖహు హృదయం బిచారి ॥ 77 ॥

అప్పుడు దశకంఠుడైన రావణుడు స్త్రీలనందఱిని ఓదార్చెను. "దృశ్యమానమగు బాహ్యజగత్తంతయు నశించునదియే. ఈ విషయమును గ్రహించి, ధైర్యమును వహింపుడు"- అనెను.
(దో. 77)

చౌ- తిన్హహి గ్యాన ఉపదేసా రావన । ఆపున మంద కథా సుభ పావన ॥
పర ఉపదేస కుసల బహుతేరే । జే ఆచరహిం తే నర న ఘనేరే ॥ 1 ॥
నిసా సిరాని భయఉ భినుసారా । లగే భాలు కపి చారిహుం ద్వారా ॥
సుభట బోలాఇ దసానన బోలా । రన సన్ముఖ జా కర మన డోలా ॥ 2 ॥
సో అబహీం బరు జాఉ పరాఈ । సంజుగ బిముఖ భఏం న భలాఈ ॥
నిజ భుజ బల మైం బయరు బఢావా । దేహఉం ఉతరు జో రిపు చఢి ఆవా ॥ 3 ॥

అస కహి మరుత బేగ రథ సాజా । బాజే సకల జుఝాఊ బాజా ॥
చలే బీర సబ అతులిత బలీ । జను కజ్జల కై ఆంధీ చలీ ॥ 4 ॥
అసగున అమిత హోహిం తెహి కాలా । గనఇ న భుజబల గర్బ బిసాలా ॥ 5 ॥

రావణుడు వారికి జ్ఞానోపదేశము గావించెను. అతడు నీచుడైనను, అతనిఉపదేశము మాత్రము హితమును గూర్చునదియై పవిత్రమైనదిగా ఉండెను. లోకములో ఇతరులకు ఉపదేశములనిచ్చువారికి లోటు లేదు. కాని తమ ఉపదేశములను తాము ఆచరించువారు మాత్రము తక్కువగా ఉందురు. రాత్రి గడచినది. తెల్లవారినది. భల్లూకవానరులు మరల లంకయొక్క నాలుగుద్వారములనొద్ద చేరిరి. దశముఖుడు క్రుద్ధుడై తన వీర యోధులను పిలిచి ఇట్లనెను. "యుద్ధములో శత్రుసేనలను జూచి, మనస్సులో భీతిల్లుచు తటపటాయించువారు ఇప్పుడే వెనుదిరుగుట మంచిది. రణరంగమునకు వచ్చిన పిదప వెన్ను చూపుట తగదు. నేను నా భుజబలమును నమ్మి వైరమును పెంచుకొన్నాను. మన్సై దండెత్తి వచ్చిన శత్రువునకు తగినసమాధానమును నేనే ఇయ్యగలను." ఇట్లు పలికి వాయువేగముతో సాగిపోగల తనరథమును సిద్ధముగావింపజేసెను. యుద్ధభేరీలు మ్రోగినవి. అసమానబలశాలురైన వీరులు కాటుక తుఫానువలె బయలుదేటిరి. ఆ సమయమున పొడసూపిన అపశకునములకు అంతులేకుండెను. కాని తనభుజబలగర్వమున రావణుడు వాటిని లెక్క చేయకుండెను. (చౌ॥ 1-5)

ఛం-అతి గర్బ గనఇ న సగున అసగున స్రవహిం ఆయుధ హాథ తే ।
భట గిరత రథ తే బాజి గజ చిక్కరత భాజహిం సాథ తే ॥
గోమాయ గీధ కరాల ఖర రవ స్వాన బోలహిం అతి ఘనే ।
జను కాలదూత ఉలూక బోలహిం బచన పరమ భయావనే ॥

అత్యంత గర్వ కారణమున అతడు శుభాశుభ శకునములను ఏమాత్రమూ పట్టించుకొనలేదు. చేతుల నుండి ఆయుధములు జారిపడెను. యోధులు తమతమ రథములనుండి క్రిందపడిరి. గుఱ్ఱములు సకిలించుచును, ఏనుగులు ఘీంకరించుచును యుద్ధభూమిని వీడి, పాటిపోయెను. నక్కలు, రాబందులు, తీవ్రస్వరముతో కర్ణకఠోరముగా కూయసాగెను. కుక్కలు అంతులేకుండ మొఱుగుచుండెను. గ్రుడ్లగూబలు కాలునిదూతలాయనునట్లు భయంకరశబ్దములు చేయుచుండెను. భీకరములైన ఈ అపశకునములన్నియును మృత్యువుయొక్క రాకను సూచించుచుండెను. (ఛం)

దో- తాహి కి సంపతి సగున సుభ, సపనేహుఁ మన బిశ్రామ ।
భూత ద్రోహ రత మోహబస, రామ బిముఖ రతి కామ॥ 78 ॥

ప్రాణులయెడ వైరముపూనువాడును, మోహమునకు వశుడగువాడును శ్రీరామునకు విముఖుడును, కామమునకు దాసుడును అగువాడు కలలోగూడ శుభశకునములను, సంపదలను, మనశ్శాంతిని ఎన్నడునూ, ఏ విధముగనూ పొందజాలడు. (దో॥ 78)

# రావణుడు వానరయోధులతో తలపడుట

చౌ- చలెఉ నిసాచర కటకు అపారా। చతురంగినీ అనీ బహు ధారా॥
బిబిధి భాఁతి బాహన రథ జానా। బిపుల బరన పతాక ధ్వజ నానా ॥ 1 ॥
చలే మత్త గజ జూథ ఘనేరే। ప్రాబిట జలద మరుత జను ప్రేరే॥
బరన బరన బిరదైత నికాయా। సమర సూర జానహిఁ బహు మాయా ॥ 2 ॥
అతి బిచిత్ర బాహినీ బిరాజీ। బీర బసంత సేన జను సాజీ॥
చలత కటక దిగసింధుర డగహీఁ। ఛుభిత పయోధి కుధర డగమగహీఁ ॥ 3 ॥
ఉఠీ రేను రబి గయఉ ఛపాఈ। మరుత థకిత బసుధా అకులాఈ॥
పనవ నిసాన ఘోర రవ బాజహిఁ। ప్రలయ సమయ కే ఘన జను గాజహిఁ ॥ 4 ॥
భేరి నఫీరి బాజ సహనాఈ। మారూ రాగ సుభట సుఖదాఈ॥
కేహరి నాద బీర సబ కరహీఁ। నిజ నిజ బల పౌరుష ఉచ్చరహీఁ ॥ 5 ॥
కహఇ దసానన సునహు సుభట్టా। మర్దహు భాలు కపిన్హ కే ఠట్టా॥
హౌఁ మారిహఉఁ భూప ద్వౌ భాఈ। అస కహి సన్ముఖ ఫౌజ రెఁగాఈ ॥ 6 ॥
యహ సుధి సకల కపిన్హ జబ పాఈ। ధాఏ కరి రఘుబీర దోహాఈ ॥ 7 ॥

అపారమైన నిశాచరసేన ముందునకుపోగెను. చతురంగబలములు అనేకదళములుగా విభజింపబడెను. ఆ దళములు వివిధవాహనములను, రథములను, విమానములను, నానావర్ణములధ్వజపతాకములను కలిగి యుండెను. మదపుటేనుగుల గుంపులు పవన ప్రేరితములైన వర్షాకాలమేఘములవలె వడివడిగా కదలుచుండెను. వీరులు చిత్రవిచిత్రములైన దుస్తులను ధరించి యుండిరి. వారు అందఱును రణవిద్యాకుశలురు, మాయావులు. సేన అత్యంత విచిత్రముగను, వీర వసంతుడే తన సైన్యముతో వచ్చినట్లుగనుఉండెను. ఆ సేన నడచుచుండుట చూచి, దిగ్గజములే త్రుళ్లిపడుచుండెను. సముద్రము అల్లకల్లోలమాయెను. పర్వతములు కంపించెను. సేనలు నడుచునప్పుడు చెలరేగుచున్న ధూళి సూర్యుని కప్పి వేయుచుండెను. అకస్మాత్తుగా గాలి ఆగిపోయెను. పృథ్వి వ్యాకులతనొందెను. ప్రళయకాలమేఘములు గర్జించినట్లు డోళ్లు, నగారాలు భయంకరముగా మ్రోగింపబడెను. నగారాలు, మేళములు, సన్నాయిలు యోధులకు ఉత్సాహమును ఇనుమడింప జేయు 'కదన కుతూహల' రాగమును ఆలపించుచుండెను. వీరులందఱును సింహనాదములను జేయుచు తమతమబలపౌరుషములను ప్రకటించుచుండిరి. అప్పుడు దశకంఠుడు తన సేనలను సంబోధించుచు ఇట్లు పలికెను. "ఉత్తమ మహాయోధులారా! వినుడు. భల్లూక వానరసమూహములను మర్దించి, నలిపివేయుడు. నేను ఆ యిద్దఱు రాజకుమారులను హతమార్చెదను." ఇట్లనుచు అతడు తనసైన్యమును ముందునకు నడిపెను. ఈ వార్త తెలియగనే వానరులు 'శ్రీరామునకు జయము, జయము' అనుచు రణరంగమున దూకిరి. (1) (చౌ. 1-7)

1) రఘువంశ సుధాంబుధి చంద్రశ్రీ రామరాజ రాజేశ్వరా! ॥రఘు॥
అఘమేఘమారుత శీకరా! అఘమేఘ మారుత శీకరా! ॥రఘు॥ (త్యాగరాజ)

ఛం-ధావఏ బిసాల కరాల మర్కట భాలు కాల సమాన తే ।
మానహుఁ సపచ్ఛ ఉడాహిఁ భూధర బృంద నానా బాన తే ॥
నఖ దసన సైల మహాద్రుమాయుధ సబల సంక న మానహీఁ ।
జయ రామ రావన మత్త గజ మృగరాజ సుజసు బఖానహీఁ ॥

కాలునితోసమానులైన భీకరభల్లూకవానరులు పెక్కురంగులుగల తెక్కలపర్వతములవలె ఎగురసాగిరి. నఖములు, దంతములు, పర్వతములు, వృక్షములు వారి శస్త్రాస్త్రములు. వారు గొప్ప బలశాలురు, నిర్భయులు. రావణుడనెడి మదపుటేనుగుపాలిటిసింహమైన శ్రీరామునకు జయజయ నాదములను బల్కుచు అతని యశో వైభవములను గానము చేయుచుండిరి. (ఛం)

దో- దుహు దిసి జయ జయకార కరి, నిజ నిజ జోరీ జాని ।
భిరే బీర ఇత రామహి, ఉత రావనహి బఖాని ॥ 79 ॥

ఇరుపక్షముల వారును జయ జయ ధ్వానములు చేయుచు, తమతమప్రతిపీరులతో యుద్ధము చేయసాగిరి. ఈపక్షమున భల్లూకవానరులు శ్రీరామచంద్రుని, ఆపక్షమున రక్కసుల మూకలు రావణుని, కొనియాడుచు పరస్పరము భయంకరముగా పోరాడసాగిరి. (దో॰ 79)

చౌ- రావను రథీ బిరథ రఘుబీరా । దేఖి బిభీషన భయఉ అధీరా ॥
అధిక ప్రీతి మన భా సందేహా । బంది చరన కహ సహిత సనేహా ॥ 1 ॥
నాథ న రథ నహిఁ తన పద త్రానా । కెహి బిధి జితబ బీర బలవానా ॥
సునహు సఖా కహ కృపానిధానా । జెహిఁ జయ హోఇ సో స్యందన ఆనా ॥ 2 ॥
సౌరజ ధీరజ తెహి రథ చాకా । సత్య సీల దృఢ ధ్వజా పతాకా ॥
బల బిబేక దమ పరహిత ఘోరే । ఛమా కృపా సమతా రజు జోరే ॥ 3 ॥
ఈస భజను సారథీ సుజానా । బిరతి చర్మ సంతోష కృపానా ॥
దాన పరసు బుధి సక్తి ప్రచండా । బర బిగ్యాన కఠిన కోదండా ॥ 4 ॥
అమల అచల మన త్రోన సమానా । సమ జమ నియమ సిలీముఖ నానా ॥
కవచ అభేద బిప్ర గుర పూజా । ఏహి సమ బిజయ ఉపాయ న దూజా ॥ 5 ॥
సఖా ధర్మమయ అస రథ జాకేఁ । జీతన కహఁ న కతహుఁ రిపు తాకేఁ ॥ 6 ॥

రావణుడు రథముపై నుండెను. శ్రీరాముడు రథములేకుండ ఉండుట చూచి, విభీషణుడు భీతిల్లి, అధైర్యమునకు లోనయ్యెను. ప్రేమాతిశయమువలన అతని మనస్సులో సంశయము గలిగి, శ్రీరామునకు పాదాభివందనమొనర్చి, ఇట్లు పలికెను. "ప్రభూ! మీకు రథము లేదు. శరీర రక్షణకు కవచమూ లేదు. కాళ్లకు పాదరక్షలును లేవు.

బలశాలియు, వీరుడునువైన రావణుని ఎట్లు జయింపగలరు?"- కృపాళువైన శ్రీరాముడు పలికెను. "మిత్రమా! వినుము. విజయమును పొందుటకు అవసరమైన రథము వేఱొకటి గలదు. పరాక్రమము, ధైర్యము ఆ రథమునకు చక్రములు, సత్యశీల (సదాచార)ములే దానిదృఢమైన ధ్వజపతాకములు. బలము, వివేకము, దమము, పరోపకారము అను నాలుగూ దాని గుఱ్ఱములు. క్షమ, దయ, సమతా సూత్రములతో అవి రథమునకు పూన్చబడును. భగవద్భజన (ఆరాధన)యే ఆ రథమునకు సమర్థుడైన సారథి. వైరాగ్యమే డాలు. సంతోషమే ఖడ్గము. దానమే పరశువు. బుద్ధియే ప్రచండశక్తి. ఉత్తమవిజ్ఞానమే కఠోరధనుస్సు. సర్వదోషములనుండియు విముక్తమైన స్థిరమైన మనస్సే తూణీరము. శమము, యమనియమములే బాణ సమూహములు. బ్రాహ్మణుల, గురువుల పూజయే అభేద్యకవచము. విజయమునకు ఇట్టి రథముతో సమానమైన సాధనము మఱియొకటి లేదు.మిత్రుడా! ధర్మమయమైన ఇట్టి రథముగలవానిని ఎవ్వరును జయింప జాలరు. అట్టివానికి శత్రువుకూడ ఉండడు. (యుద్ధసమయమున భగవంతుడు విభీషణునకిచ్చిన ఈ ఉపదేశము అపూర్వము.) (చౌ॥ 1-6)

దో- మహా అజయ సంసార రిపు, జీతి సకఇ సో బీర ।
జాకేఀ అస రథ హోఇ దృఢ, సునహు సఖా మతి ధీర ॥ 80(క) ॥
సుని ప్రభు బచన బిభీషన, హరషి గహే పద కంజ ।
ఏహి మిస మోహి ఉపదేసేహు, రామ కృపా సుఖ పుంజ ॥ 80(ఖ) ॥
ఉత పచార దసకంధర, ఇత అంగద హనుమాన ।
లరత నిసాచర భాలు కపి, కరి నిజ నిజ ప్రభు ఆన ॥ 80(గ) ॥

ఓ ధీరమతీ! మిత్రమా! ఇట్టి దృఢమైనరథముగలబలశాలి జననమరణరూపమైన గొప్ప అజేయశత్రువునుగూడ గెలువగలడు." శ్రీరామచంద్ర ప్రభువచనములను విని, విభీషణుడు ప్రసన్నచిత్తుడై, ఆయనపాదపద్మములపై మోకరిల్లి, ఇట్లనెను. "కృపానిధీ! సుఖనిధానా! శ్రీరామా! ఈ నెపముతో నాకొక అమూల్యమైన మహోపదేశమును ప్రసాదించితిరి. ఆ పక్షమున రావణుడు యుద్ధసన్నద్ధుడై వానర భల్లూకయోధులను రెచ్చగొట్టుచుండెను. ఈ పక్షమున అంగదుడు, ఆంజనేయుడు ప్రతియోధులను కవ్వించుచు యుద్ధమునకు సిద్ధముగా ఉండిరి. రాక్షసులు, భల్లూక వానరులు తమ తమ ప్రభువులకు 'జయ జయ ధ్వానములను' పల్కుచు పోరాడుచుండిరి.

(దో॥ 80. క,ఖ,గ.)

చౌ- సుర బ్రహ్మాది సిద్ధ ముని నానా । దేఖత రన నభ చఢే బిమానా ॥
హముహూ ఉమా రహే తేహిఀ సంగా । దేఖత రామ చరిత రన రంగా ॥ 1 ॥
సుభట సమర రస దుహు దిసి మాతే । కపి జయసీల రామ బల తాతే ॥
ఏక ఏక సన భిరహిఀ పచారహిఀ । ఏకన్హ ఏక మర్ది మహి పారహిఀ ॥ 2 ॥
మారహిఀ కాటహిఀ ధరహిఀ పఛారహిఀ । సీస తోరి సీసన్హ సన మారహిఀ ॥
ఉదర బిదారహిఀ భుజా ఉపారహిఀ । గహి పద అవని పటకి భట డారహిఀ ॥ 3 ॥
నిసిచర భట మహి గాడహిఀ భాలూ । ఊపర ఢారి దేహిఀ బహు బాలూ ॥
బీర బలీముఖ జుద్ధ బిరుద్ధే । దేఖిఅత బిపుల కాల జను క్రుద్ధే ॥ 4 ॥

బ్రహ్మాది దేవతలు, సిద్ధులు, మునులు ఆకాశమున విమానములలో కూర్చొని, యుద్ధ దృశ్యములను దర్శించుచుండిరి. (శివుడు నుడువుచున్నాడు.) "ఉమా! నేనును వారితోపాటు శ్రీరాముని రణరంగ విశేషములను, శౌర్య ప్రదర్శనలీలలను తిలకించుచుంటిని. ఇరుపక్షముల వీరయోధులు రణోన్మత్తులై యుండిరి. వానరులు జయశీలురు. ఏలనన వారికి ధర్మ స్వరూపుడైన శ్రీరామునిబలము గలదు. ఉభయ పక్షముల యోధులు పరస్పరము కవ్వించుకొనుచు ఒకరి నొకరు అణచి వేయుచు, నేలపై పడగొట్టుచుండిరి. వారు కొట్టుచు, కొఱుకుచు, పట్టుకొనుచు, నేలకేసి కొట్టుచు పోరుసల్పుచుండిరి. తలలను నఱికి, వాటిచే వాటిని ఢీకొట్టించుచు, వైరి శిరములను పగులగొట్టుచుండిరి. పొట్టలను చీల్చివేయుచుండిరి. భుజములను నఱుకుచుండిరి. యోధుల కాళ్లను చిక్కించుకొని, నేలకేసి బాదుచుండిరి. భల్లూకములు నిశాచరులను చంపి, భూమిలో పాతి పెట్టి, పైన ఇసుకతో కప్పుచుండిరి. శత్రువులను యుద్ధమునకు ప్రేరేపించుచు మిక్కిలి క్రుద్ధమైన మృత్యువువలె కన్పట్టు చుండిరి. (చౌ॥ 1-4)

ఛం-క్రుద్ధే కృతాంత సమాన కపి తన స్రవత సోనిత రాజహీం।
మర్దహిం నిసాచర కటక భట బలవంత ఘన జిమి గాజహీం॥
మారహిం చపేటన్హి డాటి దాతన్హ కాటి లాతన్హ మీజహీం।
చిక్కరహిం మర్కట భాలు ఛల బల కరహిం జెహిం ఖల ఛీజహీం॥ 1 ॥
ధరి గాల ఫారహిం ఉర బిదారహిం గల అంతావరి మేలహీం।
ప్రహ్లాదపతి జను బిబిధ తను ధరి సమర అంగన ఖేలహీం॥
ధరు మారు కాటు పఛారు ఘోర గిరా గగన మహి భరి రహీ।
జయ రామ జో తృన తే కులిస కర కులిస తే కర తృన సహీ॥ 2 ॥

శరీరములపై రక్తము ఓడికలుగట్టుచుండగా వానరులు క్రుద్ధులై భయంకరకాలసదృశులై కన్పట్టు చుండిరి. వారు బలశాలురైన వీర రాక్షససేనలోని యోధులను నలిపి, అణచి వేయుచుండిరి. మేఘములవలె గర్జించుచు వారిని గర్జించుచు చెంపలువాయించుచుండిరి. దంతములతో కొఱుకుచుండిరి. వారిని పడద్రోసి, కాళ్లతో త్రొక్కుచుండిరి. భల్లూక వానరులు 'ఛీత్కారముల' జేయుచు దుష్టరాక్షసులను చంపి వేయుటకు బలప్రదర్శన చేయుచుండిరి. నిశాచర యోధుల దవడలను పట్టుకొని, చీల్చివేయుచుండిరి. వారి ఱొమ్ములను చీల్చి, ప్రేగులను మెడలలో వేసికొనుచుండిరి. రణోత్సాహభరితులైన వానరులు ప్రహ్లాదునకుస్వామియైన నృసింహుడే పెక్కురూపములను ధరించి రణమొనర్చుచున్నట్లు కనబడుచుండిరి. 'పట్టుకొనుడు, చంపుడు, కొఱుకుడు, నలుపుడు' మొదలగు భీకర శబ్దములు భూమ్యాకాశములయందు నిండెను. 'తృణమును వజ్రాయుధముగాను, వజ్రాయుధమును తృణముగాను చేయసమర్థుడైన శ్రీరామచంద్రునకు జయము' అని పల్కుచుండిరి. (ఛం॥ 1/2)

దో- నిజ దల బిచలత దేఖెసి, బీస భుజాం దస చాప।
రథ చఢి చలెఉ దసానన, ఫిరహు ఫిరహు కరి దాప॥ 81 ॥

దశముఖుడైన రావణుడు తనసైన్యము తత్తరపడుటచూచి తనఇఱువది బాహువులతో పది ధనుర్బాణములను ధరించి, రథముపైనెక్కి గర్వముతో (యుద్ధభూమినుండి పాఱిపోవుచున్న తన సైన్యమును తిరిగి రణరంగమునకు మఱలించుటకై) 'రండు, రండు' అని అఱచుచు ముందునకు సాగెను. (దో॥ 81)

చౌ- ధాయఉ పరమ క్రుద్ధ దసకంధర । సన్ముఖ చలే హూహ దై బందర ॥
గహి కర పాదప ఉపల పహారా । డారేన్హి తా పర ఏకహిం బారా ॥ 1 ॥
లాగహిం సైల బజ్ర తన తాసూ । ఖండ ఖండ హోఇ ఫూటహిం ఆసూ ॥
చలా న అచల రహా రథ రోపీ । రన దుర్మద రావన అతి కోపీ ॥ 2 ॥
ఇత ఉత ఝపటి దపటి కపి జోధా । మర్దై లాగ భయఉ అతి క్రోధా ॥
చలే పరాఇ భాలు కపి నానా । త్రాహి త్రాహి అంగద హనుమానా ॥ 3 ॥
పాహి పాహి రఘుబీర గోసాఈం । యహ ఖల ఖాఇ కాల కీ నాఈం ॥
తేహిం దేఖే కపి సకల పరానే । దసహుం చాప సాయక సంధానే ॥ 4 ॥

అత్యంతక్రుద్ధుడైన దశకంధరుడు పరుగెత్తుచు ముందునకుసాగెను. యుద్ధతత్పరులైన వానరులు హుంకరించుచు అతనిముందుకు పోయిరి. వారు వృక్షములను, ఱాళ్లను, పర్వతములను తీసికొని, ఒక్కుమ్మడిగా రావణునిపై విసరి వేసిరి. వజ్రసదృశమైన అతని దేహమునకు తగులగానే అవి ముక్కలు ముక్కలాయెను. రణోన్మత్తుడైన రావణుడు మిక్కిలి క్రోధావేశములతో బుసలుకొట్టుచు, రథమునాపి నిశ్చలుడై నిలబడెను. ఏ మాత్రము కదలలేదు. అతడు మిక్కిలిక్రుద్ధుడై, ఇటునటు తిరుగుచు శత్రువులపై విరుచుకొనిపడి, వానర యోధులను నలిపివేయుచుండెను. పెక్కుభల్లూకవానరములు "అంగదా! అంజనేయా! రక్షింపుడు, రక్షింపుడు" అని మొఱపెట్టుకొనుచు లోకలెత్తుకొని, పరుగులుదీయుచుండెను. "ఓ రఘునాథా! ప్రభూ! రక్షింపుము. యమునివలె ఈ దుష్టుడు మమ్ములను భక్షించుచున్నాడు" అని ఆక్రందించుచుండెను. వానరులందఱును పాఱిపోవుట చూచి, రావణుడు తన పది ధనుస్సులపై బాణములను ఎక్కుపెట్టెను. (చౌ॥ 1-4)

ఛం-సంధాని ధను సర నికర ఛాడేసి ఉరగ జిమి ఉడి లాగహీం ।
రహా పూరి సర ధరనీ గగన దిసి బిదిసి కహం కపి భాగహీం ॥
భయొ అతి కోలాహల బికల కపి దల భాలు బోలహిం ఆతురే ।
రఘుబీర కరునా సింధు ఆరత బంధు జన రచ్ఛక హరే ॥

రావణుడు ధనుస్సులపై అనేకబాణములను సంధించి, ఒకేసారి వాటిని వదలెను. అవి సర్పములవలె ఎగురుచు పోయి, ఆ వానరులకు తగిలెను. భూమ్యాకాశములయందును, ఎనిమిది దిశలలోను బాణములు నిండిపోయెను. వానరభల్లూకము లెక్కడికి వెళ్లగలవు? కనుక అచట కోలాహలము చెలరేగెను. వారు భయముతో ఆర్తనాదములు చేయసాగిరి. 'ఓ రఘువీరా! కరుణాసింధూ! దీనబంధూ! భక్త రక్షకా! ఆర్తత్రాణపరాయణా! శ్రీహరీ! రక్షింపుము రక్షింపుము' అని ప్రార్థించిరి. (ఛం)

దో- నిజ దల బికల దేఖి కటి, కపి నిషంగ ధను హాథ।
లఛిమన చలే క్రుద్ధ హోఇ, నాఇ రామ పద మాథ ॥ 82 ॥

తనసైన్యములు వికలమగుట చూచి, లక్ష్మణుడు నడుమున తూణీరమును ధరించి, ధనుస్సును చేతబట్టి, శ్రీరాముని చరణములకు మ్రొక్కి, కుపితుడై రణరంగమున అడుగిడెను. (దో॥ 82)

చౌ-రే ఖల కా మారసి కపి భాలూ । మోహి బిలోకు తోర మైఀ కాలూ ॥
ఖోజత రహేఉఀ తోహి సుతఘాతీ । ఆజు నిపాతి జుడావఉఀ ఛాతీ ॥ 1 ॥
అస కహి ఛాడేసి బాన ప్రచండా । లఛిమన కిఏ సకల సత ఖండా ॥
కోటిన్హ ఆయుధ రావన డారే । తిల ప్రవాన కరి కాటి నివారే ॥ 2 ॥
పుని నిజ బానన్హ కీన్హ ప్రహారా । స్యందను భంజి సారథీ మారా ॥
సత సత సర మారే దస భాలా । గిరి సృంగన్హ జను ప్రబిసహిఀ బ్యాలా ॥ 3 ॥
పుని సత సర మారా ఉర మాహీఀ । పరేఉ ధరని తల సుధి కఛు నాహీఀ ॥
ఉఠా ప్రబల పుని మురుఛా జాగీ । ఛాడిసి బ్రహ్మ దీన్హి జో సాఀగీ ॥ 4 ॥

అతడు రావణుని సమీపించి, ఇట్లనెను. "ఓరీ! దుష్టుడా! భల్లూక వానరులను ఏల కొట్టెదవు? నాతో పోరాడుము. నేను నీ పాలిట మృత్యువును". రావణుడు పలికెను," "ఓరీ! నా పుత్రుని వధించినవాడా! నేను నిన్నేవెదకుచుంటిని. నేడు నిన్ను చంపి నా మనస్సునకు ఊరట గల్గింతును." అనంతరము అతడు ప్రచండ బాణవర్షమును గురిపించెను. వాటినన్నింటిని లక్ష్మణుడు ముక్కలు ముక్కలుగావించెను. అప్పుడు రావణుడు బాణములను అసంఖ్యాకముగా ప్రయోగించెను. లక్ష్మణుడు వాటినన్నింటిని నువ్వులవలె తుత్తునియలుగా జేసెను. పిమ్మట లక్ష్మణుడు రావణుని తనబాణములతో కొట్టెను. అతని రథమును ముక్కలుగావించి, సారథిని చంపివేసెను. అతని పదితలలలో ప్రతి శిరస్సుపై నూటేసి బాణములను వేసెను. పర్వత శిఖరములలో పాములు ప్రవేశించినట్లు అవి అతని శిరస్సులలో దూరెను. పిదప లక్ష్మణుడు అతని వక్షస్థలమున వందలకొలది బాణములను ప్రయోగించెను. రావణుడు స్పృహనుకోల్పోయి నేలపై పడెను. మూర్ఛనుండి తేరుకొనిన పిమ్మట అతడు బ్రహ్మతనకు ఇచ్చిన 'శక్తి'ని వదలెను (చౌ॥ 1-4)

ఛం-సో బ్రహ్మ దత్త ప్రచండ సక్తి అనంత ఉర లాగీ సహీ।
పర్యో బీర బికల ఉఠావ దసముఖ అతుల బల మహిమా రహీ॥
బ్రహ్మాండ భవన బిరాజ జాకేఀ ఏక సిర జిమి రజ కనీ।
తేహి చహ ఉఠావన మూఢ రావన జాన నహిఀ త్రిభుఅన ధనీ॥

బ్రహ్మదత్తమైన ఆ'ప్రచండశక్తి' లక్ష్మణుని గుండెలమధ్య గ్రుచ్చుకొనెను. వీరుడైన లక్ష్మణుడు వికలుడై పడిపోయెను. అపుడు దశకంఠుడు అతనిని ఎత్తుకొని పోవ ప్రయత్నించెను. లక్ష్మణుని నిరుపమానబలము చెక్కుచెదరక యథాతథముగ నుండెను. ఆ ప్రచండశక్తిగాని, రావణుని ప్రయత్నముగాని లక్ష్మణుని బలముముందు ఏ మాత్రము పనిచేయలేకపోయెను. మహామహితాత్ముడైన వేయి శీర్షములుగల ఆ ఆదిశేషుని ఒకే ఒక్క మస్తకముపై

బ్రహ్మాండమనెడి భవనము ధూళికణమువలె విలసిల్లుచుండును. అట్టి ఆదిశేషునిఅవతారమైన లక్ష్మణుని ఎత్తుటకు మూఢరావణుడు పూనుకొనెను. లక్ష్మణుడు ముల్లోకములకును ప్రభువని అతడెరుగడు. (ఛం॥)

దో- దేఖి పవనసుత ధాయఉ, బోలత బచన కఠోర।
ఆవత కపిహి హన్యో తెహిం, ముష్టి ప్రహార ప్రఘోర ॥ 83 ॥

నేలపై పడియున్న లక్ష్మణుని జూచిన పిమ్మట పవనసుతుడు రావణునివైపు మిక్కిలి కఠోరవచనములను పల్కుచు అతని మీదికి పరుగెత్తెను. మారుతి వచ్చుచుండగనే రావణుడు అతనికి భయంకరమైన ఒక ముష్టి ప్రహారము నిచ్చెను. (దో॥ 83)

చౌ- జాను టేకి కపి భూమి న గిరా। ఉఠా సంభారి బహుత రిస భరా ॥
ముఠికా ఏక తాహి కపి మారా। పరెఉ సైల జను బజ్ర ప్రహారా ॥ 1 ॥
మురుఛా గై బహోరి సో జాగా। కపి బల బిపుల సరాహన లాగా ॥
ధిగ ధిగ మమ పౌరుష ధిగ మోహీ। జౌం తైం జిఅత రహేసి సురద్రోహీ ॥ 2 ॥
అస కహి లఛిమన కహుం కపి ల్యాయో। దేఖి దసానన బిసమయ పాయో ॥
కహ రఘుబీర సముఝు జియం భ్రాతా। తుమ్హ కృతాంత భచ్ఛక సుర త్రాతా ॥ 3 ॥
సునత బచన ఉఠి బైఠ కృపాలా। గఈ గగన సో సకతి కరాలా ॥
పుని కోదండ బాన గహి ధాఏ। రిపు సన్ముఖ అతి ఆతుర ఆఏ ॥ 4 ॥

ఆ పిడికిలిదెబ్బకు హనుమంతుడు క్రిందపడకుండ నిలువరించుకొని, మోకాళ్లపై కూర్చుండెను. అతి క్రోధావేశముతో లేచి, అతడు రావణునకు ఒక ముష్టిఘాతమునిచ్చెను. దానితో అతడు వజ్రప్రహారమున పడిపోవు పర్వతమువలె క్రిందబడెను. మూర్ఛనుండి తేరుకొని లేచిన పిదప అతడు హనుమంతునిగొప్ప బలమును కొనియాడసాగెను. అప్పుడు హనుమంతుడిట్లనెను. "ఓ సురద్రోహీ! నీవింకను జీవించి యుండుట నాకును, నా పౌరుషమునకును తీరని కళంకము." ఈ విధముగా పలికి, హనుమంతుడు లక్ష్మణుని దీసికొని, శ్రీ రఘునాథుని యొద్దకు వెళ్లెను. రావణుడు ఈ దృశ్యమును జూచి, మిక్కిలి ఆశ్చర్యపడెను. (ఏలనన రావణుడు తన ఇరువది చేతులతో గూడ లక్ష్మణుని ఎత్తుటకు సమర్థుడు కాలేక పోయెను. కాని ఆంజనేయుడు అతనిని అవలీలగా ఎత్తుకొని పోవుటను జూచి, రావణుడు ఆశ్చర్యపడెను.) అంతట శ్రీ రఘురాముడు పలికెను. "సోదరా! నీవు మృత్యువునుగూడ మింగెడివాడవు. దేవతలను సైతము రక్షింపగలవాడవు." శ్రీరాముని వచనములను వినగానే లక్ష్మణుడు లేచి కూర్చుండెను. ఆ భయంకరశక్తి ఆకాశమునకు చేరెను. లక్ష్మణుడు మరల ధనుర్బాణములను గైకొని, పరుగుపరుగున వెళ్లి, శత్రువునెదుర్కొనెను. (చౌ॥ 1-4)

ఛం-ఆతుర బహోరి బిభంజి స్యందన సూత హతి బ్యాకుల కియో।
గిర్యో ధరని దసకంధర బికలతర బాన సత బేధ్యో హియో ॥
సారథీ దూసర ఘాలి రథ తెహి తురత లంకా లై గయో।
రఘుబీర బంధు ప్రతాప పుంజ బహోరి ప్రభు చరనన్హి నయో ॥

లక్ష్మణుడు అతిశీఘ్రముగా రావణునిరథమును ముక్కలుచేసి, సారథిని హతమార్చెను. రావణుని వ్యాకులపఱచెను. నూఱుబాణములతో రావణుని వక్షస్థలములను చీల్చెను. దానితో అతడు అతి వ్యాకులుడై నేలపై బడెను. అంతట మఱియొక సారథి అతనిని రథమున కూర్చుండబెట్టుకొని, లంకకు దీసికొని పోయెను. మహాప్రతాపశాలియైన లక్ష్మణుడు శ్రీరామచంద్రునిజేరి, ఆయన పాదములకు ప్రణమిల్లెను. (ఛం)

దో- ఉహాఁ దసానన జాగి కరి, కరై లాగ కఛు జగ్య।
రామ బిరోధ బిజయ చహ, సఠ హఠ బస అతి అగ్య ॥ 84 ॥

మూర్ఛనుండి తేరుకొనిన రావణుడు ఒక యజ్ఞమును చేయనారంభించెను. మూర్ఖుడు, అజ్ఞానియైన అతడు శ్రీరామునితో వైరమును బూని, విజయకాంక్షతో పట్టుబట్టి, యజ్ఞమును కొనసాగించుచుండెను. (దో॥ 84)

చౌ- ఇహాఁ బిభీషన సబ సుధి పాఈ। సపది జాఇ రఘుపతిహి సునాఈ॥
నాథ కరఇ రావన ఏక జాగా। సిద్ధ భఏఁ నహిఁ మరిహి అభాగా ॥ 1 ॥
పఠవహు నాథ బేగి భట బందర। కరహిఁ బిధంస ఆవ దసకంధర ॥
ప్రాత హోత ప్రభు సుభట పఠాఏ। హనుమదాది అంగద సబ ధాఏ ॥ 2 ॥
కౌతుక కూది చఢే కపి లంకా। పైఠే రావన భవన అసంకా ॥
జగ్య కరత జబహీఁ సో దేఖా। సకల కపిన్హ భా క్రోధ బిసేషా ॥ 3 ॥
రన తే నిలజ భాజి గృహ ఆవా। ఇహాఁ ఆఇ బక ధ్యాన లగావా ॥
అస కహి అంగద మారా లాతా। చితవ న సఠ స్వారథ మన రాతా ॥ 4 ॥

యజ్ఞముయొక్క పొగను జూచిన విభీషణుడు వెంటనే శ్రీరామునితో ఇట్లుపలికెను. "ప్రభూ! రావణుడు ఒక యజ్ఞమును చేయుచున్నాడు. అది సిద్ధించినచో ఆ దుష్టుని చంపుట కష్టము. స్వామీ! వెంటనే వానరయోధులను పంపుడు. వారువెళ్లి, ఆ యజ్ఞమును ధ్వంసమొనర్చినచో దశాననుడు మఱల యుద్ధమునకు రాగలడు". ప్రాతఃకాలమున ప్రభువు తనవీరయోధులను యజ్ఞమును ధ్వంసము చేయుటకు పంపెను. హనుమంతుడు, అంగదుడు, మొదలగువారందఱును పరుగెత్తుచు పోయిరి. వానరులు అవలీలగా ఎగురుచు వెళ్లి, లంకను జేరిరి. రావణభవనములో నిర్భయముగా ప్రవేశించిరి. అతడు యజ్ఞమును చేయుచుండుట చూచి, వానర వీరులు క్రుద్ధులై పల్కిరి. "ఓరీ! సిగ్గులేని వాడా! రణభూమి నుండి పాఱిపోయి వచ్చి, ఇక్కడ కొంగ జపము చేయుచున్నావా?" ఇట్లు పలికి అంగదుడు అతనిని కాలితో తన్నెను. ముష్టిఘాతములతో మర్యాదచేసెను. కాని అతడు వీరివైపు కన్నెత్తియైనను చూడలేదు. ఆ దుష్టుని మనస్సు స్వార్థముతో నిండియున్నది గదా!

(చౌ॥ 1-4)

ఛం-నహిఁ చితవ జబ కరి కోప కపి గహి దసన లాతన్హ మారహీఁ।
ధరి కేస నారి నికారి బాహేర తేఽతిదీన పుకారహీఁ॥
తబ ఉఠెఉ క్రుద్ధ కృతాంత సమ గహి చరన బానర డారఈ।
ఏహి బీచ కపిన్హ బిధంస కృత మఖ దేఖి మన మహుఁ హారఈ ॥

రావణుడు వారి వైపు చూడకుండుటచే వానరులు కుపితులై, అతనిని పండ్లతో కొఱికిరి, కాళ్లతో తన్నిరి. స్త్రీలను కొప్పుపట్టుకొని, బయటికి ఈడ్చుకొని వచ్చిరి. వారు అతిదీనముగా విలపింపసాగిరి. అప్పుడు రావణుడు కాలునివలె క్రుద్ధుడై లేచి, వానరుల కాళ్లు పట్టుకొని నేలపై కొట్టసాగెను. ఈ లోగా వానరులు అతని యజ్ఞమును ధ్వంసమొనర్చిరి. ఇది చూచి రావణునిధైర్యము సడలెను. (ఛం)

దో- జగ్య బిధంసి కుసల కపి, ఆఏ రఘుపతి పాస ।
చలేఉ నిసాచర క్రుద్ధ హోఇ, త్యాగి జీవన కై ఆస ॥ 85 ॥

యజ్ఞమును ధ్వంస మొనర్చిన పిమ్మట రణ కోవిదులైన వానరులు శ్రీ రఘునాథుని యొద్దకు వచ్చిరి. ఆ నిశాచరుడు క్రోధాగ్నిలో మండుచు తన జీవితముపై ఆశలువదలు కొనెను. (దో॥ 85)

## రామ రావణ యుద్ధము

చౌ- చలత హోహిఁ అతి అసుభ భయంకర । బైఠహిఁ గీధ ఉడాఇ సిరన్హ పర ॥
భయఉ కాలబస కాహు న మానా । కహేసి బజావహు జుద్ధ నిసానా ॥ 1 ॥
చలీ తమీచర అనీ అపారా । బహు గజ రథ పదాతి అసవారా ॥
ప్రభు సన్ముఖ ధాఏ ఖల కైసేఁ । సలభ సమూహ అనల కహఁ జైసేఁ ॥ 2 ॥
ఇహాఁ దేవతన్హ అస్తుతి కీన్హీ । దారున బిపతి హమహి ఏహిఁ దీన్హీ ॥
అబ జని రామ ఖేలావహు ఏహీ । అతిసయ దుఖిత హోతి బైదేహీ ॥ 3 ॥
దేవ బచన సుని ప్రభు ముసుకానా । ఉఠి రఘుబీర సుధారే బానా ॥
జటా జూట దృఢ బాఁధేఁ మాథే । సోహహిఁ సుమన బీచ బిచ గాథే ॥ 4 ॥
అరున నయన బారిద తను స్యామా । అఖిల లోక లోచనాభిరామా ॥
కటితట పరికర కస్యో నిషంగా । కర కోదండ కఠిన సారంగా ॥ 5 ॥

రావణుడు బయలుదేఱుసమయమున పెక్కుఅపశకునములు ఎదురయ్యెను. గ్రద్దలు అటునిటు తిరుగుచు అతనితలలపై కూర్చొనుచుండెను. మృత్యువు ఆసన్నమగుచుండుటచే అతడు వాటిని లెక్క చేయలేదు. 'యుద్ధ భేరీలు మ్రోగింపుడు' అని అఱచెను. పెక్కు ఏనుగులు, రథములు, అశ్వములు, కాల్బలములునుగల వాని అపారములైన చతురంగబలములు యుద్ధోన్ముఖములై బయలు దేఱెను. శలభములు అగ్ని వైపు పరుగెత్తినట్లు ఆ దుష్ట రాక్షసులు తమ నాశము కొఱకు స్వయముగా ప్రభు సమ్ముఖమునకు పరుగులుదీయుచు వచ్చిరి. ఈలోగా దేవతలందఱును అచటికి చేరి, ప్రభువును ప్రార్థించిరి. "శ్రీరామా! ఇతడు మమ్ములను మిక్కిలి బాధించినాడు. ఇక వీనిని ఇంక ఎక్కువగా ఆడింపవలదు త్వరగా వధింపుము. జానకీదేవి మిక్కిలి దుఃఖితురాలైయున్నది" దేవతల వచనములను విని, శ్రీరామచంద్ర ప్రభువు ఒక చిఱునవ్వు చిందించెను. పిమ్మట లేచి, తనబాణములు సిద్ధము చేసికొనెను. తలపై జటాజూటమును సవరించుకొనెను. వాటిమధ్యగల పూవులు అతిమనోహరముగా ఉండెను. ఆయన నేత్రములు ఎఱ్ఱబాఱియుండెను. ఆయన యొక్క మేఘశ్యామలశరీరశోభలు లోకమునకు నేత్రానందమును గూర్చుచుండెను. నడుమున తూణీరమును, చేత కోదండమును (ధనుస్సును) ధరించెను. (చౌ॥ 1-5)

ఛం-సారంగ కర సుందర నిషంగ సిలీముఖాకర కటి కస్యో ।
భుజదండ పీన మనోహరాయత ఉర ధరాసుర పద లస్యో ॥
కహ దాస తులసీ జబహిఁ ప్రభు సర చాప కర ఫేరన లగే ।
బ్రహ్మాండ దిగ్గజ కమఠ అహి మహి సింధు భూధర డగమగే ॥

శ్రీ రాముడు చేతిలో కోదండమును, నడుమున తూణీరమును దాల్చెను. పరిపుష్టములైన భుజదండములతో మనోహరవిశాలవక్షస్థలముపై భృగుమహర్షిపదచిహ్నములతో ప్రభువు శోభిల్లుచుండెను. ధనుర్బాణములను చేపట్టి, త్రిప్పగనే బ్రహ్మాండములు, దిగ్గజములు, ఆది కూర్మము, శేషుడు, పృథ్వి, సముద్రములు, పర్వతములు అన్నియు డోలాయమానములాయెనని తులసీదాసు పలుకుచున్నాడు. (ఛం)

దో- సోభా దేఖి హరషి సుర, బరషహిఁ సుమన అపార ।
జయ జయ జయ కరునానిధి, ఛబి బల గున ఆగార ॥ 86 ॥

శ్రీరామచంద్రప్రభుశోభలను జూచి, దేవతలు ప్రసన్నచిత్తులై, పూలవానను అపరిమితముగా కురిపించిరి. శోభాశక్తిగుణముల నిధానము, కరుణాళువు ఐన ప్రభువునకు 'జయము, జయము' అనుచు నినాదముల జేసిరి. (దో॥ 86)

చౌ- ఏహీఁ బీచ నిసాచర అనీ । కసమసాత ఆఈ అతి ఘనీ ॥
దేఖి చలే సన్ముఖ కపి భట్టా । ప్రలయకాల కే జను ఘన ఘట్టా ॥ 1 ॥
బహు కృపాన తరవారి చమంకహిఁ । జను దహఁ దిసి దామినీఁ దమంకహిఁ ॥
గజ రథ తురగ చికార కఠోరా । గర్జహిఁ మనహుఁ బలాహక ఘోరా ॥ 2 ॥
కపి లంగూర బిపుల నభ ఛాఏ । మనహుఁ ఇంద్రధను ఉఏ సుహాఏ ॥
ఉఠఇ ధూరి మానహుఁ జలధారా । బాన బుంద భై బృష్టి అపారా ॥ 3 ॥
దుహుఁ దిసి పర్బత కరహిఁ ప్రహారా । బజ్రపాత జను బారహిఁ బారా ॥
రఘుపతి కోపి బాన ఝురి లాఈ । ఘాయల భై నిసిచర సముదాఈ ॥ 4 ॥
లాగత బాన బీర చిక్కరహీఁ । ఘుర్మి ఘుర్మి జహఁ తహఁ మహి పరహీఁ ॥
స్రవహిఁ సైల జను నిర్ఝర భారీ । సోనిత సరి కాదర భయకారీ ॥ 5 ॥

ఈ లోపున అత్యంత ఘనమైన నిశాచర సైన్యము యుద్ధావేశముతో అతివేగముగా రణభూమికి వచ్చెను. వానరయోధులు ప్రళయకాలమేఘసమూహములవలె వారిని ఎదుర్కొనిరి. అనేకకృపాణములు, ఖడ్గములు అన్ని దిశలయందును తళుకులీనుచు మెఱయుచుండెను. ఏనుగుల ఘీంకారములు, గుఱ్ఱముల సకిలింపులు, రథచక్రముల శబ్దములు, మేఘగర్జనలవలె మిక్కిలి భయమును గొల్పుచుండెను. వానరుల లాంగూలములు (వాలములు) ఆకాశమును కప్పివేసి, సుందరమైన ఇంద్రధనుస్సులు ఉదయించి నట్లుండెను. జలధారలు పైకి ఉబుకుచున్నట్లు రణధూళి ఎగురుచుండెను. బాణపరంపరలు వర్షధారలవలె కురియుచుండెను. ఉభయపక్షములనుండి పర్వత ప్రహారములు నిరంతర వజ్రపాతములవలె ఒప్పుచుండెను. శ్రీరఘునాథుడు క్రుద్ధుడై

తనశరములను పరంపరగా ప్రయోగించెను. అవి నిశాచరసేనలను గాయపఱచెను. రామబాణములతాకిడికి తట్టుకొనలేక రాక్షసవీరులు ఛీత్కారముల జేయుచు, గిరిగిర తిరుగుచు మూర్ఛితులై నేలకొరుగుచుండిరి. పర్వతములనుండి జలపాతములవలె వారిశరీరములనుండి రక్తములు ప్రవహించుచుండెను. పిఱికివారిని భయభ్రాంతులకు లోనుగావించుచు నెత్తుటేరులు ప్రవహించు చుండెను. (చౌ॥ 1-5)

ఛం-కాదర భయంకర రుధిర సరితా చలీ పరమ అపావనీ ।
దౌఁడ కూల దల రథ రేత చక్ర అబర్త బహతి భయావనీ ॥
జలజంతు గజ పదచర తురగ ఖర బిబిధ బాహన కో గనే ।
సర సక్తి తోమర సర్ప చాప తరంగ చర్మ కమఠ ఘనే ॥

పిఱికివారిని భయపెట్టుచు అపవిత్రరక్తనదీప్రవాహములు కొనసాగుచుండెను. రెండు దళములును ఈ రక్తనదికి తీరములు. రథములు ఇసుక తిన్నెలు. చక్రములు ఆవృత్తములు. ఈ నది అత్యంత భయంకరమైనది. ఏనుగులు, గుఱ్ఱములు, గాడిదలు, భటులు, వివిధవాహనములు ఈ నదియందలి అసంఖ్యాక జలజంతువులు. బాణ, శక్తి, తోమరములు సర్పములు, ధనుస్సులు తరంగములు, డాళ్లు (డాలు+లు) తాబేళ్ళు- (ఛం)

దో- బీర పరహిఁ జను తీర తరు, మజ్జా బహు బహ ఫేన ।
కాదర దేఖి డరహిఁ తహఁ, సుభటన్హ కే మన చేన ॥ 87 ॥

నదీప్రవాహవేగమునకు తటమునందలి మహావృక్షములు పడిపోవుచున్నట్లు మహావీరులు పెక్కుమంది నేలగూలుచుండిరి. వారియెముకలయందుండు మజ్జ నుఱుగుగా నుండెను. పిఱికివారు ఈ దృశ్యములను జూచి భయపడుచుండిరి. ధైర్యము గలవారు ఆనందించుచుండిరి. (దో॥ 87)

చౌ- మజ్జహిఁ భూత పిసాచ బెతాలా । ప్రమథ మహా ఝోటింగ కరాలా ॥
కాక కంక లై భుజా ఉడాహీఁ । ఏక తె ఛీని ఏక లై ఖాహీఁ ॥ 1 ॥
ఏక కహహిఁ ఐసెఉ సౌఁఘాఈ । సఠహు తుమ్హార దరిద్ర న జాఈ ॥
కహఁరత భట ఘాయల తట గిరే । జహఁ తహఁ మనహుఁ అర్ధజల పరే ॥ 2 ॥
ఖైఁచహిఁ గీధ ఆఁత తట భఏ । జను బంసీ ఖేలత చిత దఏ ॥
బహు భట బహహిఁ చఢే ఖగ జాహీఁ । జను నావరి ఖేలహిఁ సరి మాహీఁ ॥ 3 ॥
జోగిని భరి భరి ఖప్పర సంచహిఁ । భూత పిసాచ బధూ నభ నంచహిఁ ॥
భట కపాల కరతాల బజావహిఁ । చాముండా నానా బిధి గావహిఁ ॥ 4 ॥
జంబుక నికర కటక్కట కట్టహిఁ । ఖాహిఁ హుఆహిఁ అఘాహిఁ దపట్టహిఁ ॥
కోటిన్హ రుండ ముండ బిను డొల్లహిఁ । సీస పరే మహి జయ జయ బోల్లహిఁ ॥ 5 ॥

భూత పిశాచ బేతాళులును, భయంకరమైన వెంట్రుకలుగల దయ్యములును, ప్రమథగణములును ఈసమరనదిలో స్నానముచేయుచుండిరి. కాకులు, గ్రద్దలు చనిపోయిన వారిభుజములను నోటగఱచుకొని,

ఎగిరిపోవుచుండెను. అవి ఒకదానినుండి మఱియొకటి లాగుకొని తినుచుండెను. "ఓరీ మూర్ఖులారా! ఇన్ని కళేబరములు పుష్కలముగా ఇచ్చట పడియుండగా మీ దారిద్ర్యము తీరుటలేదా?" అనుపలుకులు వినబడుచుండెను. గాయపడిన సీరులు ఈరక్తనదీతీరమున మూల్గుచు పడియుండిరి. వారి ఆర్తిని చూచినచో వారు అర్ధజలములో ఉంచబడినట్లు కనబడిరి. (మృత్యువాసన్నమైనప్పుడు అర్ధజలములో అనగా సగముశరీరము నీటిలోను, తక్కిన సగము తీరమునందును ఉంచినట్లుండిరి.) నదీతీరమున నుండు బెస్తవారు గాలమును లాగినట్లు రాబందులు ప్రేగులను లాగుచుండెను. పెక్కుమంది యోధుల కళేబరములు ఈ నదీప్రవాహమున కొట్టుకొనిపోవుచుండెను. వాటిపై పక్షులు కూర్చొనియుండెను. ఆ పక్షులు నదిలో నౌకావిహారము సలుపుచున్నట్లుండెను. యోగినులు (భూత పిశాచములు) పుఱ్ఱెలలో రక్తమును సేకరించుచుండిరి. భూతపిశాచములపత్నులు ఆకాశమున నాట్యము సేయుచున్నట్లు ఉండిరి. చాముండులు యోధుల పుఱ్ఱెలతో తాళములు వేయుచు నానావిధములగు పాటలు పాడుచుండిరి. నక్కలగుంపులు శవములను కొఱుకుచు 'కటకట' శబ్దములను చేయుచుండెను. అవి వాటిని భక్షించుచు పలురకములైన శబ్దములను చేయుచు, కూతలు కూయుచుండెను. కడుపులు నిండగా ఒక దానినొకటి గద్దించుచుండెను. తలలులేని అసంఖ్యాకములైన మొండెములు యుద్ధభూమిలో పెలుగులు పెట్టుచుండెను. తలలు నేలపై దొర్లుచు జయజయ ధ్వానములను కావించుచుండెను. (చౌ॥ 1-5)

ఛం- బోల్లహిఀ జో జయ జయ ముండ రుండ ప్రచండ సిర బిను ధావహీఀ ।
ఖప్పరిన్హ ఖగ్గ అలుజ్ఝి జుజ్ఝహిఀ సుభట భటన్హ ఢహావహీఀ ॥
బానర నిసాచర నికర మర్దహిఀ రామ బల దర్పిత భఏ ।
సంగ్రామ అంగన సుభట సోవహిఀ రామ సర నికరన్హి హఏ ॥

తెగినతలలు జయజయ నాదములు చేయుచుండగా, తలలులేని మొండెములు పెలుగులు దీయు చుండెను. పక్షులు పుఱ్ఱెలకై పరస్పరము కలహించు కొనుచుండెను. యోధులు ఇతర యోధులను పడగొట్టు చుండిరి. శ్రీరామునిబలమును జూచుకొని దర్పితులైన వానరులు రాక్షసులను నలిపివేయుచుండిరి. శ్రీరామునిబాణ సమూహములతాకిడికి గురియైన యోధులు యుద్ధభూమిలో దీర్ఘనిద్రలో మునిగి పోవుచుండిరి. (ఛం)

దో- రావన హృదయఀ బిచారా, భా నిసిచర సంఘార ।
మైఀ అకేల కపి భాలు బహు, మాయా కరౌఀ అపార ॥ 88 ॥

రావణుడు తీవ్రవిచారములో పడెను. "రాక్షసులందఱును నిహతులైరి. నేనొక్కడనే మిగిలి యుంటిని. వానర భల్లూకములు అనేకములున్నవి. కావున ఇప్పుడు అపారమైన మాయను కల్పించి పోరాడెదను." (దో॥ 88)

చౌ- దేవన్హ ప్రభుహి పయాదేఀ దేఖా । ఉపజా ఉర అతి ఛోభ బిసేషా ॥
సురపతి నిజ రథ తురత పఠావా । హరష సహిత మాతలి లై ఆవా ॥ 1 ॥
తేజ పుంజ రథ దిబ్య అనూపా । హరషి చఢే కోసలపుర భూపా ॥
చంచల తురగ మనోహర చారీ । అజర అమర మన సమ గతికారీ ॥ 2 ॥

రథారూఢ రఘునాథహి దేఖీ । ధాఏ కపి బలు పాఇ బిసేషీ ॥
సహీ న జాఇ కపిన్హ కై మారీ । తబ రావన మాయా బిస్తారీ ॥ 3 ॥
సో మాయా రఘుబీరహి బాఁచీ । లఛిమన కపిన్హ సో మానీ సాఁచీ ॥
దేఖీ కపిన్హ నిసాచర అనీ । అనుజ సహిత బహు కోసలధనీ ॥ 4 ॥

రథములేకుండ రణరంగమున నేలపై నిలబడి, యుద్ధము చేయుచున్న ప్రభువును దేవతలు చూచిరి. వారిహృదయములు మిగుల క్షోభించెను. ఇంద్రుని ఆజ్ఞతో మాతలి వెంటనే ఒకరథమును తీసికొని వచ్చెను. నిరుపమానమైన, తేజోమయమైన ఆ దివ్యరథమును కోసలాధిపతియైన శ్రీరాముడు హర్షముతో అధిరోహించెను. దానికి పూన్చబడిన గుఱ్ఱములు మనోహరమైనవి. అవి చంచలములు. అజరామరములు, అంతే గాదు, మనోవేగముతో సాగిపోవునవి. రఘువీరుడు రథారూఢుడగుటను జూచి, వానరులు విశేషమైన బలమును పొంది, హర్షోల్లాసములతో పరుగెత్తుకొనివచ్చిరి. వానరుల దెబ్బలకు తట్టుకొనలేక రావణుడు తన మాయను విస్తరింప జేసెను. ఆమాయలు శ్రీరఘురాముని ముందు ఏమియు పని చేయజాలక పోయెను. లక్ష్మణుడును, వానరులును ఆ మాయలను నిజమని నమ్మిరి. మాయా ప్రభావమున ఆ వానరులు నిశాచర సైన్యమున పెక్కుమంది రామలక్ష్మణులను గాంచిరి. (చౌ॥ 1-4)

ఛం-బహు రామ లఛిమన దేఖి మర్కట భాలు మన అతి అపడరే ।
జను చిత్ర లిఖిత సమేత లఛిమన జహఁ సో తహఁ చితవహిఁ ఖరే ॥
నిజ సేన చకిత బిలోకి హఁసి సర చాప సజి కోసలధనీ ।
మాయా హరీ హరి నిమిష మహుఁ హరషీ సకల మర్కట అనీ ॥

వానరులు పెక్కుమంది రామ లక్ష్మణులను జూచి, మిథ్యా భయములకు లోనైరి. లక్ష్మణునితో గూడ ఎక్కడి వారక్కడ భ్రమకులోనై, చిత్రములలోని బొమ్మలవలె నిలబడిపోయిరి. తనసేనలు ఆశ్చర్య చకితులగుట జూచి, కోసలాధిపతి నవ్వి, బాణములను సంధించి, క్షణములో ఆ మాయను తొలగించెను. సమస్త వానరులును ప్రసన్నులైరి. (ఛం)

దో- బహురి రామ సబ తన చితఇ, బోలే బచన గఁభీర ।
ద్వందజుద్ధ దేఖహు సకల, శ్రమిత భఏ అతి బీర ॥ 89 ॥

అనంతరము అందరి వైపు చూచుచు శ్రీరాముడు గంభీరముగా పల్కెను. "వీరులైన మీరందఱును చాల డస్సి యుంటిరి. కావున నాకును రావణునకును మధ్య జరుగబోవు ద్వంద్వ యుద్ధమును జూడుడు. (దో॥ 89)

చౌ- అస కహి రథ రఘునాథ చలావా । బిప్ర చరన పంకజ సిరు నావా ॥
తబ లంకేస క్రోధ ఉర ఛావా । గర్జత తర్జత సమ్ముఖ ధావా ॥ 1 ॥
జీతేహు జే భట సంజుగ మాహీఁ । సును తాపస మైఁ తిన్హ సమ నాహీఁ ॥
రావన నామ జగత జస జానా । లోకప జాకేఁ బందీఖానా ॥ 2 ॥
ఖర దూషన బిరాధ తుమ్హ మారా । బధేహు బ్యాధ ఇవ బాలి బిచారా ॥
నిసిచర నికర సుభట సంఘారేహు । కుంభకరన ఘననాదహి మారేహు ॥ 3 ॥

ఆజు బయరు సబు లేఉఁ నిబాహీ । జౌఁ రన భూప భాజి నహిఁ జాహీ ॥
ఆజు కరఉఁ ఖలు కాల హవాలే । పరెహు కఠిన రావన కే పాలే ॥ 4 ॥
సుని దుర్బచన కాలబస జానా । బిహఁసి బచన కహ కృపానిధానా ॥
సత్య సత్య సబ తవ ప్రభుతాఈ । జల్పసి జని దెఖాఉ మనుసాఈ ॥ 5 ॥

ఈ విధముగా పలికి, శ్రీ రఘునాథుడు బ్రాహ్మణచరణకమలములను మనస్సులో స్మరించుచు వారికి శిరసా ప్రణమిల్లి, రథమును ముందునకు నడిపెను. అపుడు రావణుడు క్రోధముతో మండిపడుచు గర్జించుచు ముందుకు వచ్చి పలికెను. "ఓరీ! తాపసీ! వినుము. నేను యుద్ధములో నీచే విజితులైన యోధుల వంటివాడను కాను. నా పేరు రావణుడు. నా యశస్సు జగద్విదితము. దిక్పాలురు సైతము నా చేతిలో బందీలు. నీవు ఖర, దూషణ, త్రిశిరులను, విరాధుని గూడ వధించితివి. పాపము, వాలిని వేటగానివలె చెట్టు చాటునుండి చంపితివి. గొప్ప గొప్ప నిశాచర వీరులను సంహరించితివి. కుంభకర్ణ, మేఘనాదుల ప్రాణములను దీసితివి. ఓరీ! రాకుమారా! నేడు నీవు యుద్ధ రంగమునుండి పాఱిపోకుండ నిలిచియున్నచో ఆ పగను అంతయును తీర్చుకొందును. ఈనాడు నిజముగా నేను నిన్ను యమునకు అప్పగించెదను. ఏలనన నీవు కఠినాత్ముడైన రావణునిపాలబడితివి." రావణునిదుర్భాషలను విని, వాడు యముని కఠీనుడైనాడని భావించి, కృపాళువైన శ్రీరాముడు నవ్వి, ఇట్లనెను "నీవు చెప్పినట్లు నీ గొప్పదన మంతయు సత్యమే. కాని ఇంక ప్రేలకుము. నీ పౌరుషమును జూపుము. (చౌ॥ 1-5)

ఛం-జని జల్పనా కరి సుజసు నాసహి నీతి సునహి కరహి ఛమా ।
సంసార మహఁ పూరుష త్రిబిధ పాటల రసాల పనస సమా ॥
ఏక సుమనప్రద ఏక సుమన ఫల ఏక ఫలఇ కేవల లాగహీఁ ।
ఏక కహహిఁ కహహిఁ కరహిఁ అపర ఏక కరహిఁ కహత న బాగహీఁ ॥

నిరర్థకముగా వాగుచు నీ కీర్తిని పాడుచేసికొనవద్దు, క్షమింపుము. నీకు నీతిని గఱపుచున్నాను. వినుము. ప్రపంచములో మూడు విధములగు పురుషులున్నారు. వారు గులాబీ, మామిడి, పనస చెట్లవంటివారు. గులాబీ కేవలము పూవులను మాత్రమే ఇచ్చును. మామిడి పూవుల(పూత)ను, పండ్లను గూడ ఇచ్చును. పనస కేవలము పండ్లను ఇచ్చును. అట్లే పురుషులలో కొందఱు మాట్లాడెదరు (కాని వారుక్రియా శూన్యులు) మఱికొందఱు మాట్లాడెదరు, వాటిని ఆచరించెదరు. మూడవ వర్గము వారు మాట్లాడరు కాని చేసి చూపించెదరు (క్రియా శూరులు.) (ఛం)

దో- రామ బచన సుని బిహఁసా, మోహి సిఖావత గ్యాన ।
బయరు కరత నహిఁ తబ డరే, అబ లాగే ప్రియ ప్రాన ॥ 90 ॥

శ్రీరాముని వచనములను విని, రావణుడు నవ్వి, ఇట్లనెను. "నీవు నాకు జ్ఞానబోధ చేయుచుంటివా? మొదట నాతో వైరము పూని, ఏ మాత్రము భయములేక యుద్ధమునకు సిద్ధమైతివి. ఇప్పుడు నీకు ప్రాణములపై తీపి ఏర్పడినదా?" (దో॥ 90)

చౌ- కహి దుర్బచన క్రుద్ధ దసకంధర । కులిస సమాన లాగ ఛాఁడై సర ॥
నానాకార సిలీముఖ ధాఏ । దిసి అరు బిదిసి గగన మహి ఛాఏ ॥ 1 ॥
పావక సర ఛాఁడేఉ రఘుబీరా । ఛన మహుఁ జరే నిసాచర తీరా ॥
ఛాడిసి తీబ్ర సక్తి ఖిసిఆఈ । బాన సంగ ప్రభు ఫేరి చలాఈ ॥ 2 ॥
కోటిన్హ చక్ర త్రిసూల పబారై । బిను ప్రయాస ప్రభు కాటి నివారై ॥
నిఫల హోహిఁ రావన సర కైసేఁ । ఖల కే సకల మనోరథ జైసేఁ ॥ 3 ॥
తబ సత బాన సారథీ మారేసి । పరేఉ భూమి జయ రామ పుకారేసి ॥
రామ కృపా కరి సూత ఉఠావా । తబ ప్రభు పరమ క్రోధ కహుఁ పావా ॥ 4 ॥

ఇట్లు కటువుగా పలికి, రావణుడు కుపితుడై వజ్రతుల్యమైన బాణములను ప్రయోగించెను. అనేకాకారములుగల ఆ బాణములు దిశావిదిశలయందును, భూమ్యాకాశములయందును సర్వత్ర నిండెను. శ్రీరఘునాథుడు ఆగ్నేయాస్త్రము ప్రయోగింపగా అది రావణుని బాణములను అన్నింటిని ఒక్కక్షణములో భస్మమొనర్చెను. అప్పుడతడు లజ్జితుడై కోపముతో తీక్ష్ణమైన ఒక 'శక్తి'ని వదలెను. శ్రీరామచంద్రుడు ఒక బాణముతో దానిని త్రిప్పికొట్టెను. రావణుడు అసంఖ్యాకములైన చక్రములను త్రిశూలములను రాముని మీదికి పంపెను. కాని ప్రభువు వాటినన్నింటిని అనాయాసముగా ముక్కలు ముక్కలుగా జేసెను. ఖలుని మనోరథములవలె రావణునిబాణములు అన్నియును నిష్ఫలములాయెను. పిమ్మట అతడు నూఱు బాణములతో రాముని రథసారథియైన మాతలిని కొట్టెను. అతడు 'శ్రీరామునకు జయము' అనుచు క్రిందికొరిగెను. శ్రీరాముడు కృపతో సారథిని లేపెను. పిమ్మట ప్రభువు మిక్కిలి క్రుద్ధుడయ్యెను. (చౌ. 1-4)

ఛం-భఏ క్రుద్ధ జుద్ధ బిరుద్ధ రఘుపతి త్రోన సాయక కసమసే ।
కోదండ ధుని అతి చండ సుని మనుజాద సబ మారుత గ్రసే ॥
మందోదరీ ఉర కంప కంపతి కమఠ భూ భూధర త్రసే ।
చిక్కరహిఁ దిగ్గజ దసన గహి మహి దేఖి కౌతుక సుర హఁసే ॥

శ్రీరాముడు శత్రువుపై క్రుద్ధుడుకాగా తూణీరములోని బాణములు తమంతట తామే బయటికి వచ్చుటకు త్వరపడుచుండెను. శ్రీరాముని ప్రచండమైన ధనుష్టంకారమును విని, నరభక్షకులైన రాక్షసులందఱును వాతగ్రస్తులై, వణకి పోవుచుండిరి. మందోదరి హృదయము కంపించెను. సముద్రములు కల్లోలితములైనవి. ఆదికూర్మము చలించెను. భూమి అదిరెను. పర్వతములు క్రక్కదలెను. దిగ్గజములు మిక్కిలి భీతిల్లి దంతములతో నేలను పట్టుకొని, ఘీంకారములు సల్పుచుండెను. ఈ అద్భుతములను చూచి, దేవతలు సంబరపడిరి. (ఛం)

దో- తానేఉ చాప శ్రవన లగి, ఛాఁడే బిసిఖ కరాల ।
రామ మారగన గన చలే, లహలహాత జను బ్యాల ॥ 91 ॥

ధనుస్సును ఆకర్ణాంతము లాగి శ్రీరామచంద్రుడు అనేక భయానకబాణములను ప్రయోగించెను. అవి సర్ప సదృశములై వేగముగా సాగిపోయెను. (దో. 91)

చౌ- చలే బాన సపచ్ఛ జను ఉరగా । ప్రథమహిఁ హతేఉ సారథీ తురగా ॥
రథ బిభంజి హతి కేతు పతాకా । గర్జా అతి అంతర బల థాకా ॥ 1 ॥
తురత ఆన రథ చఢి ఖిసిఆనా । అస్త్ర సస్త్ర ఛాఁడేసి బిధి నానా ॥
బిఫల హోహిఁ సబ ఉద్యమ తాకే । జిమి పరద్రోహ నిరత మనసా కే ॥ 2 ॥
తబ రావన దస సూల చలావా । బాజి చారి మహి మారి గిరావా ॥
తురగ ఉఠాఇ కోపి రఘునాయక । ఖైంచి సరాసన ఛాఁడే సాయక ॥ 3 ॥
రావన సిర సరోజ బనచారీ । చలి రఘుబీర సిలీముఖ ధారీ ॥
దస దస బాన భాల దస మారే । నిసరి గఏ చలె రుధిర పనారే ॥ 4 ॥
స్రవత రుధిర ధాయఉ బలవానా । ప్రభు పుని కృత ధను సర సంధానా ॥
తీస తీర రఘుబీర పబారే । భుజన్హి సమేత సీస మహి పారే ॥ 5 ॥
కాటతహీఁ పుని భఏ నబీనే । రామ బహోరి భుజా సిర ఛీనే ॥
ప్రభు బహు బార బాహు సిర హఏ । కటత ఝటితి పుని నూతన భఏ ॥ 6 ॥
పుని పుని ప్రభు కాటత భుజ సీసా । అతి కౌతుకీ కోసలాధీసా ॥
రహే ఛాఇ నభ సిర అరు బాహూ । మానహుఁ అమిత కేతు అరు రాహూ ॥ 7 ॥

ఆ బాణములు తెక్కలుగల సర్పములవలె పరుగు పరుగున బోయెను. మొదట ప్రభువు రావణుని సారథిని, గుఱ్ఱములను సంహరించెను. పిమ్మట రథమును ముక్కలు ముక్కలుగావించి, ధ్వజపతాకములను ధ్వంసమొనర్చెను. రావణుడు బిగ్గరగా గర్జించెను. కాని అతనిగుండెబలము సన్నగిల్లెను. వెంటనే క్రుద్ధుడై మఱియొక రథముపైనెక్కి వివిధాస్త్రశస్త్రములను ప్రయోగింపసాగెను. కాని అతని ప్రయత్నములన్నియును వమ్మగుచుండెను. పరద్రోహమునందు నిరతుడైనవాని ప్రయత్నములన్నియును నిష్ఫలములగుట సహజమే గదా! అప్పుడు రావణుడు పది త్రిశూలములను వదలగా శ్రీరాముని నాలుగు గుఱ్ఱములును దెబ్బతిని క్రిందపడెను. శ్రీరాముడు గుఱ్ఱములను లేవనెత్తి, క్రుద్ధుడై ధనుస్సునెక్కుపెట్టి ఆకర్ణాంతము లాగి బాణములను వదలెను. రావణుని శిరస్సులనెడి కమలవనములో శ్రీరాముని బాణములనెడి తుమ్మెదలగుంపులు చరింపసాగెను. శ్రీరాముడు రావణుని ఒక్కొక్క తలపై పదేసి బాణములను ప్రయోగింపగా అవి ఇటునుండి అటు దూసికొని పోయెను. శిరస్సులనుండి రక్తధారలు ప్రవహించుచుండెను. బలశాలియైన రావణుడు ఆరక్తధారలతోడనే పరుగుపరుగున రామునిమీదికి వచ్చెను. ఇంతలో ప్రభువు మఱల ధనుస్సును ఎక్కుపెట్టి ముప్పది శరములను ప్రయోగించి అతని ఇఱువది భుజములను, పది శిరస్సులను ఖండించి, నేలపై బడగొట్టెను. కాని ఆ శిరస్సులును, భుజములును వెంటనే మఱల ఉత్పన్నములాయెను. శ్రీరాముడు మఱల వాటిని ఖండించెను. ఎప్పటివలె వెంటనే అవి మఱల ఉత్పన్నము లాయెను. ఈ విధముగా శ్రీరాముడు మఱల మఱల వాటిని ఖండించుచుండుటయు, వెంట వెంటనే అవి పుట్టుకొని వచ్చుచుండుటయు పెక్కుసాఱులు జరిగెను. ఇట్లు శ్రీరాముడు పెక్కు పర్యాయములు తన లీలా విలాసములను ప్రదర్శించెను. ఖండింపబడిన తలలు, భుజములు ఆకాశమును గప్పి, అసంఖ్యాక రాహుకేతువులుగా కన్పించెను.

(చౌ॥ 1-7)

ఛం-జను రాహు కేతు అనేక నభ పథ స్రవత సోనిత ధావహీఀ ।
రఘుబీర తీర ప్రచండ లాగహిఀ భూమి గిరన న పావహీఀ ॥
ఏక ఏక సర సిర నికర ఛేదే నభ ఉడత ఇమి సోహహీఀ ।
జను కోపి దినకర కర నికర జహఀ తహఀ బిధుంతుద పోహహీఀ ॥

పెక్కుమంది రాహుకేతువులు ఆకాశమునజేరి రక్తమును ప్రవహింపజేసి పరుగెత్తుచున్నారా యనునట్లుండెను. శ్రీ రఘువీరుని ప్రచండమైన బాణములు నిరంతరము తగులుచుండుటచే అవి క్రింద బడుట లేదు. శ్రీరాముని ప్రతిబాణమునకు గ్రుచ్చుకొనియున్న తలలసమూహములు ఆకాశమున తీవ్ర సూర్యకిరణములకు గ్రుచ్చుకొనియున్న రాహువుల సముదాయమువలె కనబడుచుండెను. (ఛం)

దో- జిమి జిమి ప్రభు హర తాసు సిర, తిమి తిమి హోహిఀ అపార ।
సేవత బిషయ బిబర్ధ జిమి, నిత నిత నూతన మార ॥ 92 ॥

విషయభోగములను అనుభవించిన కొలది వాటిపై కాంక్ష పెఱిగినట్లే ప్రభువు ఆ శిరస్సులను ఖండించిన కొలదియు అవి అపారముగా పెఱిగి పోవుచుండెను. (దో॥ 92)

చౌ- దసముఖ దేఖి సిరన్హ కై బాఢీ । బిసరా మరన భఈ రిస గాఢీ ॥
గర్జేఉ మూఢ మహా అభిమానీ । ధాయఉ దసహు సరాసన తానీ ॥ 1 ॥
సమర భూమి దసకంధర కోప్యో । బరషి బాన రఘుపతి రథ తోప్యో ॥
దండ ఏక రథ దేఖి న పరేఊ । జను నిహార మహుఀ దినకర దురేఊ ॥ 2 ॥
హాహాకార సురన్హ జబ కీన్హా । తబ ప్రభు కోపి కారముక లీన్హా ॥
సర నివారి రిపు కే సిర కాటే । తే దిసి బిదిసి గగన మహి పాటే ॥ 3 ॥
కాటే సిర నభ మారగ ధావహిఀ । జయ జయ ధుని కరి భయ ఉపజావహిఀ ॥
కహఀ లఛిమన సుగ్రీవ కపీసా । కహఀ రఘుబీర కోసలాధీసా ॥ 4 ॥

శిరస్సులు పునరుత్పన్నములగుచుండుటచే రావణుడు తనమృత్యు భయమును మఱచిపోయెను. మహా దురభిమానియు, మూర్ఖుడును, ఐన రావణుడు గర్జించుచు పదిధనుస్సులను ఒక్కసారిగా, ఎక్కుపెట్టి ఆకర్ణాంతము లాగి బాణముల వర్షమును గురిపించి, శ్రీరఘునాథుని రథమును కప్పివేసెను. ఒక్క క్షణ కాలముపాటు మంచుతో కప్పబడిన సూర్యునివలె రథము కన్పడలేదు. దేవతలు హాహా కారములు చేసిరి. అప్పుడు ప్రభువు క్రుద్ధుడై ధనుస్సును ఎక్కుపెట్టి తనబాణములతో శత్రుశరములను తొలగించి, అతని మస్తకములను ఖండించి, అన్ని దిశలయందును, పృథివ్యాకాశములయందును పడవైచెను. ఖండింపబడిన శిరస్సులు ఆకాశమార్గమున పరుగెత్తుచు జయ జయ ధ్వానములను గావించుచు అందఱి హృదయములలో భయోత్పాతములను గలిగించెను. ఆ తలలు "లక్ష్మణుడు ఎక్కడ? వానర రాజు సుగ్రీవుడెక్కడ? కోసల పతి రఘువీరుడెక్కడ?" అని గర్జించు చుండెను. (చౌ॥ 1-4)

ఛం-కహ౯ రాము కహి సిర నికర ధాఏ దేఖి మర్కట భజి చలే ।
సంధాని ధను రఘుబంసమని హ౯సి సరన్హి సిర బేధే భలే ॥
సిర మాలికా కర కాలికా గహి బ్బంద బ్బందన్హి బహు మిలీ౯ ।
కరి రుధిర సరి మజ్జను మనహు౯ సంగ్రామ బట పూజన చలీ౯ ॥

'రాముడెక్కడ' అని అఱచుచు ఖండింపడిన రావణుని తలలు ఆకాశమున ఎగురుచుండెను. వాటిని జూచి, వానరులు పాఱిపోయిరి. అప్పుడు రఘుకులమణి శ్రీరాముడు ధనుస్సును ఎక్కుపెట్టి, నవ్వుచు బాణములకు ఆ శిరస్సులను గ్రుచ్చి,మాలలుగా జేసెను. అప్పటి అదృశ్యము దుర్గాదేవియే రాక్షస సంహారమునకై పెక్కుమంది చెలులతోగూడిన కాళికగా ఆకపాలమాలికలను చేతబట్టి, రక్తనదిలో స్నానమాచరించి, సంగ్రామమను వటవృక్షమును పూజించుటకై బయలుదేఱినదా? అన్నట్లు ఉండెను. (ఛం)

దో- పుని దసకంఠ క్రుద్ధ హోఇ, ఛా౯డీ సక్తి ప్రచండ ।
చలీ బిభీషన సన్ముఖ, మనహు౯ కాల కర దండ ॥ 93 ॥

పిమ్మట దశాననుడు క్రుద్ధుడై ఒక ప్రచండశక్తిని విభీషణుని పైకి వదలెను. అది యమదండమా? అనునట్లు విభీషణుని మీదికి వచ్చుచుండెను. (దో॰ 93)

చౌ- ఆవత దేఖి సక్తి అతి ఘోరా । ప్రనతారతి భంజన పన మోరా ॥
తురత బిభీషన పాఛే౯ మేలా । సన్ముఖ రామ సహేఉ సోఇ సేలా ॥ 1 ॥
లాగి సక్తి మురుఛా కఛు భఈ । ప్రభు కృత ఖేల సురన్హ బికలఈ ॥
దేఖి బిభీషన ప్రభు శ్రమ పాయో । గహి కర గదా క్రుద్ధ హోఇ ధాయో ॥ 2 ॥
రే కుభాగ్య సఠ మంద కుబుద్ధే । తై౯ సుర నర ముని నాగ బిరుద్ధే ॥
సాదర సివ కహు౯ సీస చఢాఏ । ఏక ఏక కే కోటిన్హ పాఏ ॥ 3 ॥
తేహి కారన ఖల అబ లగి బా౯చ్యో । అబ తవ కాలు సీస పర నాచ్యో ॥
రామ బిముఖ సఠ చహసి సంపదా । అస కహి హనేసి మాఝ ఉర గదా ॥ 4 ॥

శ్రీరాముడు శరణాగతులను రక్షించెదనని ప్రతిజ్ఞ చేసియుండెను. కావున విభీషణుని వెనుకకు నెమ్మని తానే ముందుకువచ్చి, శ్రీరాముడు అతిభయంకరముగా వచ్చుచున్న ఆ శక్తిని ఎదిరించెను. ప్రభువు ఆశక్తి తాకిడికి కొంతతడవు మూర్ఛిల్లినట్లు లీలలను ప్రదర్శించెను. కాని దేవతలుమాత్రము ఆ లీలలను తెలిసికొనలేక వ్యాకులత నొందిరి. విభీషణుడు ప్రభువు యొక్క శ్రమను జూచి, తానే గదను చేబూని క్రుద్ధుడై ముందుకు పరుగెత్తుచు పలికెను. "ఓరీ! దౌర్భాగ్యుడా! నీచుడా! నీవు నర సుర ముని నాగులందఱితో విరోధమును పెట్టుకొంటివి. సాదరముగా శివునకు నీతలలను అర్పించితివి. అందువలన ఒక్కొక్క శిరస్సునకు మాఱుగా పెక్కు శిరస్సులను పొందుచుంటివి. దుష్టుడా! ఆ కారణమువలన ఇప్పటివఱకును నీవు రక్షింపబడితివి. ఇప్పుడు మృత్యువు నీతలపై నాట్యము చేయుచున్నది. శఠుడా! నీవు రామునకు విరోధివై సుఖ సంపదలను కోరుకొనుచున్నావా?" అని పలికి విభీషణుడు రావణుని వక్షస్థలమున గదతో కొట్టెను. (చౌ॰ 1-4)

ఛం-ఉర మాఝు గదా ప్రహార ఘోర కఠోర లాగత మహి పర్యో ।
దస బదన సోనిత స్రవత పుని సంభారి ధాయో రిస భర్యో ॥
ద్వౌ భిరే అతిబల మల్లజుద్ధ బిరుద్ధ ఏకు ఏకహి హనై ।
రఘుబీర బల దర్పిత బిభీషను ఘాలి నహిఁ తా కహుఁ గనై ॥

కఠోరమైన గదాప్రహారమువలన రావణునిరొమ్మున మిక్కిలి బలమైన దెబ్బతగిలెను. అతడునేలపై బడెను. పదిముఖములనుండియు రక్తముప్రవహించెను. కాని అతడు తమాయించుకొని క్రుద్ధుడై ముందుకు పరుగెత్తెను. ఇద్దఱును మిక్కిలి బలశాలురే. పరస్పరము ఎదుర్కొని మల్లయుద్ధము కావించిరి. శ్రీ రఘువీరునిబలప్రభావమున విభీషణుడు జగత్ప్రసిద్ధబలశాలియైన రావణుని ఏమాత్రమూ లెక్కచేయలేదు. (ఛం)

దో- ఉమా బిభీషను రావనహి, సన్ముఖ చితవ కి కాఉ ।
సో అబ భిరత కాల జ్యోఁ, శ్రీరఘుబీర ప్రభాఉ ॥ **94** ॥

(శివుడు పలుకుచున్నాడు) ఉమా! ఇంతకుముందు విభీషణుడు ఎప్పుడైనను రావణునివైపు కన్నెత్తి చూడగలిగి యుండెనా? కాని ఇప్పుడు ఆ విభీషణుడే కాలునివలె అతనిని ఎదిరించుచున్నాడు. ఇది శ్రీ రఘువీరుని ప్రతాప ప్రభావము. (దో 94)

చౌ- దేఖా శ్రమిత బిభీషను భారీ । ధాయఉ హనూమాన గిరి ధారీ ॥
రథ తురంగ సారథీ నిపాతా । హృదయ మాఝు తెహి మారెసి లాతా ॥ **1** ॥
ఠాఢ రహా అతి కంపిత గాతా । గయఉ బిభీషను జహఁ జనత్రాతా ॥
పుని రావన కపి హతెఉ పచారీ । చలెఉ గగన కపి పూఁఛ పసారీ ॥ **2** ॥
గహిసి పూఁఛ కపి సహిత ఉడానా । పుని ఫిరి భిరెఉ ప్రబల హనుమానా ॥
లరత అకాస జుగల సమ జోధా । ఏకహి ఏకు హనత కరి క్రోధా ॥ **3** ॥
సోహహిఁ నభ ఛల బల బహు కరహీఁ । కజ్జల గిరి సుమేరు జను లరహీఁ ॥
బుధి బల నిసిచర పరఇ న పార్యో । తబ మారుత సుత ప్రభు సంభార్యో ॥ **4** ॥

విభీషణుడు మిక్కిలి అలసియున్నట్లు గ్రహించిన హనుమంతుడు చెంతనున్న ఒక పర్వతమునుగైకొని పరుగుపరుగున వచ్చెను. దానితో అతడు రావణుని రథమును, గుఱ్ఱములను, సారథిని కొట్టి, క్రింద పడవేసి, అతని రొమ్మపై కాలితో తన్నెను. కాలితన్నులవలన రావణునిశరీరము వణకసాగెను. ఐనను అతడు నిలదొక్కుకొనెను. ఇంతలో శరణాగత రక్షకుడగు శ్రీరామునికడకు విభీషణుడు వెళ్లెను. రావణుడు మఱల యుద్ధమునకు పిలుచుచు హనుమంతుని కొట్టెను. ఆంజనేయుడు తనవాలమును పెంచి, ఆకాశమున కెగిరెను. రావణుడతని వాలమును పట్టుకొనెను. హనుమంతుడు అతనితోపాటు పైకెగిరెను. మహాబలశాలియైన మారుతి ఆకాశమునందే రావణునితో పోరాడసాగెను. ఆఇద్దఱు యోధులు ఆకాశమున పోరాడుచు ఒకరినొకరు కొట్టుకొనసాగిరి. తమతమబలములను

యుక్తి ప్రయుక్తులను ప్రదర్శించిరి. ఒక కాటుక కొండయు సుమేరుగిరియు పరస్పరము ఢీకొనుచున్నట్లు కొట్టిల్లిరి. బుద్ధి బలములచేగూడ రాక్షసుని పడగొట్టుటకు సాధ్యముకాక పోవుటచే పవనసుతుడు ప్రభువును స్మరించెను. (చౌ॥ 1-4)

ఛం-సంభారి శ్రీరఘుబీర ధీర పచారి కపి రావను హన్యో ।
మహి పరత పుని ఉఠి లరత దేవన్హ జుగల కహుఁ జయ జయ భన్యో ॥
హనుమంత సంకట దేఖి మర్కట భాలు క్రోధాతుర చలే ।
రన మత్త రావన సకల సుభట ప్రచండ భుజ బల దలమలే ॥

ధీరుడైన హనుమంతుడు శ్రీ రఘురాముని స్మరించి యుద్ధమునకు రావణుని పిలిచెను. ఇద్దఱును నేలపై పడుచు లేచుచు పోరాడుచుండిరి. ఈ దృశ్యమును గాంచుచు దేవతలు ఉభయులకును (భయముతో రావణునకును భక్తితో ఆంజనేయస్వామికిని) 'జయము, జయము' అని పలికిరి. హనుమంతుని సంకటస్థితిని జూచి, భల్లూకవానరులు క్రుద్ధులై పరుగెత్తుకొనివచ్చిరి. కాని రణమదోన్మత్తుడైన రావణుడు యోధులందఱిని తన ప్రచండభుజములతో అణచివేసెను. (ఛం)

దో- తబ రఘుబీర పచారే, ధాఏ కీస ప్రచండ ।
కపి బల ప్రబల దేఖి తెహిఁ, కీన్హ ప్రగట పాషండ ॥ 95 ॥

అప్పుడు శ్రీ రఘువీరుడు పిలువగానే ప్రచండవీరులైన వానరులు పరుగెత్తుకొనివచ్చిరి. ప్రబలమైన వానర సైన్యమును జూచి, రావణుడు తన మాయను ప్రదర్శించెను. (దో॥ 95)

చౌ- అంతరధాన భయఉ ఛన ఏకా । పుని ప్రగటే ఖల రూప అనేకా ॥
రఘుపతి కటక భాలు కపి జేతే । జహఁ తహఁ ప్రగట దసానన తేతే ॥ 1 ॥
దేఖే కపిన్హ అమిత దససీసా । జహఁ తహఁ భజే భాలు అరు కీసా ॥
భాగే బానర ధరహిఁ న ధీరా । త్రాహి త్రాహి లఛిమన రఘుబీరా ॥ 2 ॥
దహఁ దిసి ధావహిఁ కోటిన్హ రావన । గర్జహిఁ ఘోర కఠోర భయావన ॥
డరే సకల సుర చలే పరాఈ । జయ కై ఆస తజహు అబ భాఈ ॥ 3 ॥
సబ సుర జితే ఏక దసకంధర । అబ బహు భఏ తకహు గిరి కందర ॥
రహే బిరంచి సంభు ముని గ్యానీ । జిన్హ జిన్హ ప్రభు మహిమా కఛు జానీ ॥ 4 ॥

ఒక్క క్షణము అతడు అంతర్ధానమయ్యెను. పిమ్మట ఆ దుష్టుడు తనఅనేక రూపములను ప్రకటించెను. శ్రీరాముని సైన్యములోని భల్లూకవానరులందఱికిని రావణుడు వేర్వేఱుగా అంతటను కనిపించెను. అసంఖ్యాకులైన రావణులను జూచి, భల్లూకవానరులు భయముతో ఇటునటు పాఱిపోయిరి. వారి ధైర్యము సడలెను. వారు "ఓ లక్ష్మణా! ఓ రఘువీరా! రక్షింపుడు, రక్షింపుడు" అని అఱచుచు పాఱిపోవుచుండిరి. దశదిశలయందును

కోట్లాదిరావణులు పరుగిడుచు భయంకరగర్జనలను గావించుచుండిరి. దేవతలందఱును భీతిల్లుచు "సోదరా! ఇపుడు గెలుపునపై మనము ఆశలు వదలుకొనవలసినదే." అనియనుచు పరుగెత్తిరి. "మునుపు ఒక్క రావణుడే దేవతలపై విజయమును సాధించెను. ఇప్పుడు పెక్కుమంది రావణులైరి. కనుక మనము పర్వతగుహలను ఆశ్రయింపవలసినదే. అక్కడ బ్రహ్మ, శివుడు, జ్ఞానులైనమునులు నిర్భయులై యుండిరి. ఏలనన వారు ప్రభుమహిమనెఱిగినవారు.

(చౌ॥ 1-4)

ఛం-జానా ప్రతాప తె రహే నిర్భయ కపిన్హ రిపు మానే ఫురే ।
చలె బిచలి మర్కట భాలు సకల కృపాల పాహి భయాతురే ॥
హనుమంత అంగద నీల నల అతిబల లరత రన బాఁకురే ।
మర్దహిఁ దసానన కోటి కోటిన్హ కపట భూ భట అంకురే ॥

వారు ప్రభుప్రతాపమునుగూర్చి తెలిసినవారే. కనుక నిర్భయముగా నిలువగలిగిరి. వానరులు నిజముగనే అసంఖ్యాకులైన రావణులు ఉన్నట్లు తలంచిరి. వారు విచలితులై 'ఓ కృపాళూ! రక్షింపుము' అని అఱచుచు భయాతురులై పాఱిపోవుచుండిరి. అత్యంత బలశాలురు, రణకోవిదులును ఐన హనుమంతుడు, అంగదుడు, నలుడు, నీలుడు సాహసముతో పోరాడుచుండిరి. వారు కపటరూపభూమినుండి అంకురించిన కోట్ల కొలది మాయా రావణులను నలిపినలిపి వేసిరి. (ఛం)

దో- సుర బానర దేఖే బికల, హఁస్యో కోసలాధీస ।
సజి సారంగ ఏక సర, హతే సకల దససీస॥ 96 ॥

సురలు, వానరులు వ్యాకులురగుటచూచి, కోసలాధిపతి శ్రీరాముడు దరహాసముచేసి, శార్ఙ్గధనువునెక్కుపెట్టి, మాయా రావణులందఱిని ఒకే బాణముతో మట్టుపెట్టెను. (దో॥ 96)

చౌ- ప్రభు ఛన మహుఁ మాయా సబ కాటీ । జిమి రబి ఉఏఁ జాహిఁ తమ ఫాటీ ॥
రావను ఏకు దేఖి సుర హరషే । ఫిరే సుమన బహు ప్రభు పర బరషే ॥ 1 ॥
భుజ ఉఠాఇ రఘుపతి కపి ఫేరే । ఫిరే ఏక ఏకన్హ తబ టేరే ॥
ప్రభు బలు పాఇ భాలు కపి ధాఏ । తరల తమకి సంజుగ మహి ఆఏ ॥ 2 ॥
అస్తుతి కరత దేవతన్హి దేఖేఁ । భయఉఁ ఏక మైఁ ఇన్హ కే లేఖేఁ ॥
సఠహు సదా తుమ్హ మోర మరాయల । అస కహి కోపి గగన పర ధాయల ॥ 3 ॥
హాహాకార కరత సుర భాగే । ఖలహు జాహు కహఁ మోరేఁ ఆగే ॥
దేఖి బికల సుర అంగద ధాయో । కూది చరన గహి భూమి గిరాయో ॥ 4 ॥

సూర్యోదయముతో అంధకారము పటాపంచలైనట్లు ప్రభువు ఒక్క క్షణములో మాయను పూర్తిగా అంత మొందించెను. ఇప్పుడు ఒకే రావణుడుండుట చూచి, దేవతలు ప్రశాంత చిత్తులై, ప్రభువుపై పుష్పవర్షమును

గురిపించిరి. శ్రీ రఘునాథుడు చేతులుచాచి, అభయమునిచ్చుచు వానరులందఱిని పిలిచెను. వారు ఒకరినొకరు పిలుచుకొనుచు అందఱును ప్రభువుబలమును పొంది, రణోత్సాహముతో అక్కడికి పరుగు పరుగున జేరిరి. దేవతలు శ్రీరాముని స్తుతించిరి. అంత రావణుడు "నేను ఒంటరి వాడనని ఈ దేవతలు భావించుచున్నారు." (వీరిని హతమార్చుటకు నేనొక్కడనే చాలునని వీరెరుగరు) అని ఆలోచించి, "ఓ మూర్ఖులారా! మీరు ఎల్లప్పుడును నాదెబ్బలకు లోనగుచుండువారే!" అని పల్కుచు క్రోధావేశముతో అతడు ఆకాశమార్గమున వారిపైకి ఉరికెను. హాహాకారములు చేయుచు దేవతలు పాఱిపోయిరి. రావణుడు పలికెను. "ఓ దుష్టులారా! నానుండి తప్పించుకొని, మీరెక్కడికి పోగలరు?" దేవతలు వ్యాకులురై యుండుట చూచి, అంగదుడు ఎగిరిపోయి, రావణుని కాలు చిక్కించుకొని, వానిని భూమిపై విసరి వేసెను. (చౌ॥ 1-4)

ఛం-గహి భూమి పార్యో లాత మార్యో బాలిసుత ప్రభు పహిఀ గయో ।
సంభారి ఉఠి దసకంఠ ఘోర కఠోర రవ గర్జత భయో ॥
కరి దాప చాప చఢాఇ దస సంధాని సర బహు బరషఈ ।
కిఏ సకల భట ఘాయల భయాకుల దేఖి నిజ బల హరషఈ ॥

అంగదుడు అతనిని పట్టుకొని భూమిపై పడవేసి కాళ్లతో తన్నెను. పిదప అతడు ప్రభువు నొద్దకువచ్చెను. రావణుడు తమాయించుకొని లేచిన పిదప భయంకరముగా గర్జింపసాగెను. పిమ్మట బలదర్పితుడై పది చేతులతో ధనుస్సులనెక్కుపెట్టి బాణములను అసంఖ్యాకముగా వర్షింపసాగెను. వానర యోధులనందఱిని గాయపఱిచెను. వారు వ్యాకులపాటునకులోనైరి. రావణుడు తనబలమును చూచుకొని పొంగిపోయెను. (ఛం)

దో- తబ రఘుపతి రావన కే, సీస భుజా సర చాప ।
కాటే బహుత బఢే పుని, జిమి తీరథ కర పాప ॥ 97 ॥

అప్పుడు రఘువీరుడు రావణుని తలలను, భుజములను ధనుర్బాణములను ఖండించెను. కాని తలలు భుజములు తీర్థస్థానములలో చేసిన పాపములవలె మరలమరల పెఱుగజొచ్చెను. (దో॥ 97)

చౌ-సిర భుజ బాఢి దేఖి రిపు కేరీ । భాలు కపిన్హ రిస భఈ ఘనేరీ ॥
మరత న మూఢ కటేహుఀ భుజ సీసా । ధాఏ కోపి భాలు భట కీసా ॥ 1 ॥
బాలితనయ మారుతి నల నీలా । బానరరాజ దుబిద బలసీలా ॥
బిటప మహీధర కరహిఀ ప్రహారా । సోఇ గిరి తరు గహి కపిన్హ సో మారా ॥ 2 ॥
ఏక నఖన్హి రిపు బపుష బిదారీ । భాగి చలహిఀ ఏక లాతన్హ మారీ ॥
తబ నల నీల సిరన్హి చఢి గయఊ । నఖన్హి లిలార బిదారత భయఊ ॥ 3 ॥
రుధిర దేఖి బిషాద ఉర భారీ । తిన్హహి ధరన కహుఀ భుజా పసారీ ॥
గహే న జాహిఀ కరన్హి పర ఫిరహీఀ । జను జుగ మధుప కమల బన చరహీఀ ॥ 4 ॥

కోపి కూది ద్వౌ ధరేసి బహోరీ । మహి పటకత భజె భుజా మరోరీ ॥
పుని సకోప దస ధను కర లీన్హే । సరన్హి మారి ఘాయల కపి కీన్హే॥ 5 ॥
హనుమదాది మురుఛిత కరి బందర । పాఇ ప్రదోష హరష దసకంధర ॥
మురుఛిత దేఖి సకల కపి బీరా । జామవంత ధాయఉ రనధీరా ॥ 6 ॥
సంగ భాలు భూధర తరు ధారీ । మారన లగే పచారి పచారీ ॥
భయఉ క్రుద్ధ రావన బలవానా । గహి పద మహి పటకఇ భట నానా ॥ 7 ॥
దేఖి భాలుపతి నిజ దల ఘాతా । కోపి మాఝ ఉర మారెసి లాతా॥ 8 ॥

శత్రువుయొక్క తలలు, భుజములు మఱల పెఱుగుటచూచి, భల్లూకవానరములు మిక్కిలి క్రుద్ధములాయెను. "ఈ మూర్ఖుని తలలు, భుజములు తెగినను ఇతడు మరణించుటలేదు." అని మిగులవగచిరి. అంగదుడు, మారుతి, నలుడు, నీలుడు, సుగ్రీవుడు, ద్వివిదుడు మొదలగు మహాబలశాలురు అతనిపై వృక్షములను, పర్వతములను విసరివేసిరి. అతడు ఆ వృక్షములను, పర్వతములను పట్టుకొని, వాటితోడనే వానరములను కొట్టెను. ఒకడు అతనిశరీరమును గోళ్లతో చీరి పరుగెత్తెను. మఱియొకడు అతనిని కాళ్లతో తన్నెను. అపుడు నలుడు, నీలుడు రావణుని తలలపైనెక్కి గోళ్లతో అతని లలాటములను చీల్చిరి. లలాటములనుండి రక్తము స్రవించుచుండుట జూచి అతడు మిక్కిలి బాధపడెను. వారిని పట్టుకొనుటకు అతడు చేతులు చాచెను. కాని వారు అతనికి అందలేదు. కమలవనముపై భ్రమరములు తిరుగుచున్నట్లు అతని చేతులు పైపైననే తిరుగుచుండెను. చివరకు అతడు క్రోధముతో వారిపైకి దూకి పట్టుకొనెను. కాని నేలకేసి కొట్టకముందే వారు అతని చేతులను మెలిపెట్టి తప్పించుకొనిపోయిరి. పిదప అతడు తన చేతులలో పది ధనుస్సులు పట్టుకొని, బాణములతో కొట్టి వానరములను గాయపఱచెను. హనుమదాదివానరులందఱిని మూర్ఛితులను గావించి, సంధ్యా సమయమగుటచే రావణుడు సంతసించెను. వానరులందఱును మూర్ఛపోవుట చూచి, రణధీరుడైన జాంబవంతుడు పరుగెత్తుకొని రావణునిమీదికి వచ్చెను. అతని అనుచరభల్లూకములు పర్వతములను వృక్షములను దీసికొని, రావణుని పిలిచి, పిలిచి కొట్టసాగిరి. శక్తిశాలియైన రావణుడు భల్లూకములకాళ్ళను పట్టుకొని , వారిని కోపముతో నేలకేసి కొట్టసాగెను. జాంబవంతుడు తనసైన్యము విధ్వంసమగుచుండుట చూచి, క్రుద్ధుడై అతని ఱొమ్ముపై కాలితో తన్నెను. (చౌ॥ 1-8)

ఛం-ఉర లాత ఘాత ప్రచండ లాగత బికల రథ తే మహి పరా ।
గహి భాలు బీసహుఁ కర మనహుఁ కమలన్హి బసే నిసి మధుకరా ॥
మురుఛిత బిలోకి బహోరి పద హతి భాలుపతి ప్రభు పహిఁ గయో ।
నిసి జాని స్యందన ఘాలి తెహి తబ సూత జతను కరత భయో ॥

జాంబవంతుని కాలితాకిడికి బాధకలిగి రావణుడు వికలుడై, భూమిపై పడెను. అతడు తన ఇఱువది చేతులతో భల్లూకములను పట్టుకొనియుండెను. అవి రాత్రులయందు భ్రమరములు కమలములలో చిక్కుకొనినట్లుండెను. అతడు మూర్ఛితుడైనాడని గమనించి, అతనిని కాలితో తన్ని, భల్లూకరాజైన జాంబవంతుడు ప్రభువుకడకు వెళ్లెను. రాత్రియైనదని తెలిసికొని, సారథి రావణుని రథముపై చేర్చుకొని, అతనిని మేల్కొలుపుటకు ప్రయత్నించెను. (ఛం)

దో- మురుఛా బిగత భాలు కపి, సబ ఆఏ ప్రభు పాస ।
నిసిచర సకల రావనహి, ఘేరి రహే అతి త్రాస ॥ 98 ॥

మూర్ఛనుండి తేరుకొనిన భల్లూకవానరములన్నియును ప్రభువునొద్దకు చేరెను. అక్కడ నిశాచరులందఱును భయగ్రస్తులై రావణుని చుట్టును జేరిరి. (దో॥ 98)

మాసపారాయణము-ఇఱువది ఆఱవ విరామము

## త్రిజట సీతాదేవిని ఓదార్చుట

చౌ- తేహీ నిసి సీతా పహిం జాఈ । త్రిజటా కహి సబ కథా సునాఈ ॥
సిర భుజ బాఢి సునత రిపు కేరీ । సీతా ఉర భఇ త్రాస ఘనేరీ ॥ 1 ॥
ముఖ మలీన ఉపజీ మన చింతా । త్రిజటా సన బోలీ తబ సీతా ॥
హోఇహి కహా కహసి కిన మాతా । కెహి బిధి మరిహి బిస్వ దుఖదాతా ॥ 2 ॥
రఘుపతి సర సిర కటెహుం న మరఈ । బిధి బిపరీత చరిత సబ కరఈ ॥
మోర అభాగ్య జిఆవత ఓహీ । జేహిం హౌం హరి పద కమల బిఛోహీ ॥ 3 ॥
జెహిం కృత కపట కనక మృగ ఝూఠా । అజహుం సో దైవ మోహి పర రూఠా ॥
జెహిం బిధి మోహి దుఖ దుసహ సహాఏ । లఛిమన కహుం కటు బచన కహాఏ ॥ 4 ॥
రఘుపతి బిరహ సబిష సర భారీ । తకి తకి మార బార బహు మారీ ॥
ఐసెహుం దుఖ జో రాఖ మమ ప్రానా । సోఇ బిధి తాహి జిఆవ న ఆనా ॥ 5 ॥
బహు బిధి కర బిలాప జానకీ । కరి కరి సురతి కృపానిధాన కీ ॥
కహ త్రిజటా సును రాజకుమారీ । ఉర సర లాగత మరఇ సురారీ ॥ 6 ॥
ప్రభు తాతే ఉర హతఇ న తేహీ । ఏహి కే హృదయం బసతి బైదేహీ ॥ 7 ॥

అదేరాత్రి త్రిజట సీతాదేవియొద్దకు వచ్చి, ఆమెకు యుద్ధ విషయములను వినిపించెను. శత్రు శిరములు, భుజములు పెఱుగుచున్న సమాచారమును విని సీతాదేవి, మిక్కిలి భయాందోళనలకు గురియయ్యెను. ఆమె ముఖము వాడిపోయెను. మనస్సు చింతాక్రాంతమయ్యెను. సీతాదేవి త్రిజటతో ఇట్లనెను. "మాతా! ఏమి జరుగనున్నదో? ఏల చెప్పవు? విశ్వమునకే దుఃఖకారకుడైన ఇతడు ఎట్లు మరణించును? శ్రీ రఘునాథుని బాణములచే అతనితలలు తెగిపోవుచున్నను అతడు మరణించుట లేదు. విధాతలీలలన్నియును విపరీతముగానున్నవి. నా దురదృష్టమువలననే అతడు బ్రతుకగల్గుచున్నాడు. అదియే నన్ను శ్రీహరి చరణములనుండి వేఱుచేసినది. నా దౌర్భాగ్యకారణముననే అచటికి కపట స్వర్ణమృగమువచ్చినది. ఆ దైవమే ఇంతవఱకు నాపై క్రుద్ధుడైయున్నాడు. నేను ఈ దుఃఖములను తట్టుకొనియుండుటకు విధివైపరీత్యమే కారణము. నేను కఠినవచనములతో లక్ష్మణుని బాధపెట్టుట, శ్రీ రఘునాథుని విరహబాణములు నన్ను మాటిమాటికిని కొట్టుచుండుట, ఇప్పటిసంకటపరిస్థితులలోగూడ నా ప్రాణములు ఇంకను పోకుండుట, వీటన్నింటికిని ఆ దైవమే కారణము. ఆ రావణుడు ఇంకను జీవించియుండుటకును ఆ దైవమే కారణము, వేఱెవ్వరునుగాదు." కృపాళువైన శ్రీరాముని మాటిమాటికిని స్మరించుచు జానకీదేవి పరిపరివిధముల విలపింపసాగెను. త్రిజట పలికెను.

"ఓరాజకుమారీ! వినుము. హృదయమునందు బాణము తగిలినంతటనే దేవతలకు శత్రువైన రావణుడు మరణించును. కాని అతని హృదయమున వైదేహి నివసించుచున్నది. (నీవు నివసించుచున్నావు) కావున శ్రీరామచంద్ర ప్రభువు అతని హృదయముపై కొట్టుటలేదు. (చౌ॥ 1-7)

ఛం-ఏహి కే హృదయఁ బస జానకీ జానకీ ఉర మమ బాస హై।
మమ ఉదర భుఅన అనేక లాగత బాన సబ కర నాస హై॥
సుని బచన హరష బిషాద మన అతి దేఖి పుని త్రిజటాఁ కహా।
అబ మరిహి రిపు ఏహి బిధి సునహి సుందరి తజహి సంసయ మహా॥

(ప్రభువు ఆలోచించుచున్నాడు) "ఇతని హృదయములో జానకీదేవి యున్నది. జానకీ హృదయమున నా నివాసమున్నది. నా ఉదరములో అనేక భువనములున్నవి. కావున రావణునిహృదయమున బాణము తగిలినచో సర్వనాశనమగును" త్రిజట పలికిన ఈ మాటలు వినగానే సీతాదేవి మనస్సున హర్షవిషాదములు ముసురుకొనెను. ఇది చూచి త్రిజట మఱలపల్కెను. "ఓసుందరీ! నీ మిథ్యా సందేహమును వీడుము. శత్రువు ఏ విధముగా మరణించునో వినుము." (ఛం)

దో- కాటత సిర హోఇహి బికల, ఛుటి జాఇహి తవ ధ్యాన।
తబ రావనహి హృదయ మహుఁ, మరిహహిఁ రాము సుజాన॥ 99॥

తనతలలు మాటిమాటికిని తెగిపడుచుండుటవలన రావణుడు వికలమనస్కుడై నీ ధ్యాసమఱచి పోవును. అపుడంతర్యామియైన శ్రీరాముడు అతని (రావణుని) హృదయముపై బాణము వేయును." (దో॥ 99)

చౌ - అస కహి బహుత భాఁతి సముఝాఈ। పుని త్రిజటా నిజ భవన సిధాఈ॥
రామ సుభాఉ సుమిరి బైదేహీ। ఉపజీ బిరహ బిథా అతి తేహీ॥ 1॥
నిసిహి ససిహి నిందతి బహు భాఁతీ। జుగ సమ భఈ సిరాతి న రాతీ॥
కరతి బిలాప మనహిఁ మన భారీ। రామ బిరహఁ జానకీ దుఖారీ॥ 2॥
జబ అతి భయఉ బిరహ ఉర దాహూ। ఫరకేఉ బామ నయన అరు బాహూ॥
సగున బిచారి ధరీ మన ధీరా। అబ మిలిహహిఁ కృపాల రఘుబీరా॥ 3॥
ఇహాఁ అర్ధనిసి రావను జాగా। నిజ సారథి సన ఖీఝన లాగా॥
సఠ రనభూమి ఛడాఇసి మోహీ। ధిగ ధిగ అధమ మందమతి తోహీ॥ 4॥
తేహిఁ పద గహి బహు బిధి సముఝావా। భోరు భఏఁ రథ చఢి పుని ధావా॥
సుని ఆగవను దసానన కేరా। కపిదల ఖరభర భయఉ ఘనేరా॥ 5॥
జహఁ తహఁ భూధర బిటప ఉపారీ। ధాఏ కటకటాఇ భట భారీ॥ 6॥

ఈ విధముగా అనేకవచనములతో సీతాదేవిని ఊరడించి, త్రిజట తననివాసమునకేగెను. శ్రీరామచంద్రుని స్వభావమును దలచుకొని జానకీదేవిహృదయమున భరింపరానివిరహవ్యథ కలిగెను. ఆమె రాత్రిని, చంద్రుని పరిపరి

విధముల నిందించుచు పలికెను. "రాత్రులు యుగములవలె దీర్ఘములగు చున్నవి, కడచుట కష్టముగా నున్నది." శ్రీరామవియోగవ్యథకులోనై జానకీదేవి లోలోన మిక్కిలి పరితపించెను. విరహాగ్ని అధికమగుచుండగా ఆమె ఎడమకన్ను, భుజము అదిరెను. అది శుభసూచకమని తలంచి, కృపాళువైన రఘువీరుడు తనను కలిసికొనునని, భావించి, ఆమె ధైర్యము వహించెను. అక్కడ అర్ధరాత్రి సమయమున రావణుడు మూర్ఛనుండి తేరుకొని, తన సారథిపై కోపముతో పలుకసాగెను. "ఓరీ మూర్ఖుడా! నీవు నన్ను రణరంగమునుండి వేఱుచేసితివి. అధముడా! జడుడా! ఛీ!ఛీ! ధిక్కారము" అతడు రావణుని పాదములను పట్టుకొని, 'క్షమింపుడు' అనుచు పదేపదే ప్రార్థించెను. తెల్లవాఱగనే రావణుడు రథముపైనెక్కి, మరల రణభూమికి పరుగులుదీసెను. రావణుడు వచ్చినవార్తను వినగానే వానరులలో రణోత్సాహము చెలరేగెను. వారెక్కడెక్కడనుండియో పర్వతములను, వృక్షములను పెకలించుకొని, కోపముతో పండ్లు గొఱుకుచు పరుగెత్తికొనివచ్చిరి. (చౌ॥ 1-6)

## రావణవధ-మందోదరి విలాపము

ఛం-ధాఏ జౌ మర్కట బికట భాలు కరాల కర భూధర ధరా ।
అతి కోప కరహిం ప్రహార మారత భజి చలే రజనీచరా ॥
బిచలాఇ దల బలవంత కీసన్హ ఘేరి పుని రావను లియో ।
చహుఁ దిసి చపేటన్హి మారి నఖన్హి బిదారి తను బ్యాకుల కియో ॥

భయంకరులు, వీరులునైన వానరభల్లూకములు పర్వతములను చేతబట్టి పరుగుపరుగునవచ్చి, కోపముతో రాక్షసులను చావమోదుచుండిరి. వారు కొట్టుటచే రాక్షసులు ధైర్యమునడలి వెక్కబలము చూపిరి. ఆ విధముగా శత్రుయోధులను విచలితులనుగాజేసి, వానరులు రావణుని చుట్టుముట్టిరి. నాలుగువైపులజేరి, చెంపలు వాయించుచు, కొట్టుచు, తిట్టుచు, గోళ్లతో ఱక్కుచు అతని శరీరమును గాయపఱచి, వారు అతనిని మిక్కిలి వ్యాకులపఱచిరి. (ఛం)

దో- దేఖి మహా మర్కట ప్రబల, రావన కీన్హ బిచార ।
అంతరహిత హోఇ నిమిష మహుఁ, కృత మాయా బిస్తార ॥ 100 ॥

మహాప్రబలురైన వానరులను జూచి, రావణుడు విచారముతో అంతర్ధానమాయెను. తన మాయను ఒక్క క్షణములో విస్తరింపజేసెను. (దో॥ 100)

ఛం-జబ కీన్హ తేహిఁ పాషండ । భఏ ప్రగట జంతు ప్రచండ ॥
బేతాల భూత పిసాచ । కర ధరేఁ ధను నారాచ ॥ 1 ॥
జోగిని గహేఁ కరబాల । ఎక హాథ మనుజ కపాల ॥
కరి సద్య సోనిత పాన । నాచహిఁ కరహిఁ బహు గాన ॥ 2 ॥

ధరు మారు బోలహిం ఘోర । రహి పూరి ధుని చహుం ఓర ॥
ముఖ బాఇ ధావహిం ఖాన । తబ లగే కీస పరాన ॥ 3 ॥
జహం జాహిం మర్కట భాగి । తహం బరత దేఖహిం ఆగి ॥
భఏ బికల బానర భాలు । పుని లాగ బర్షై బాలు ॥ 4 ॥
జహం తహం థకిత కరి కీస । గర్జైఉ బహురి దససీస ॥
లఛిమన కపీస సమేత । భఏ సకల బీర అచేత ॥ 5 ॥
హా రామ హా రఘునాథ । కహి సుభట మీజహిం హాథ ॥
ఏహి బిధి సకల బల తోరి । తెహిం కీన్హ కపట బహోరి ॥ 6 ॥
ప్రగటేసి బిపుల హనుమాన । ధాఏ గహే పాషాన ॥
తిన్హ రాము ఘేరే జాఇ । చహుం దిసి బరూథ బనాఇ ॥ 7 ॥
మారహు ధరహు జని జాఇ । కటకటహిం పూంఛ ఉఠాఇ ॥
దహం దిసి లంగూర బిరాజ । తెహిం మధ్య కోసలరాజ ॥ 8 ॥

అతడు మాయాశక్తిని విస్తరింపజేయగనే భయంకరభేతాళభూతపిశాచములు చేతులలో ధనుర్బాణములను ధరించి, ప్రకటితులైరి. యోగినులు ఒక చేతితో కత్తినిబూని, మఱియొక చేతితో మానవ కపాలములను బూనుచు వాటియందలి సద్యోరక్తమును త్రాగుచు, నాట్యములతో పాటలు పాడుచుండిరి. "పట్టుకొనుము, వధింపుము" అను భీకర శబ్దములు అన్ని దిశలయందును ప్రతిధ్వనించెను. వారు నోళ్ళు తెఱచి, మ్రింగుటకు ప్రయత్నించుచుండిరి. అపుడు వానరులు పాఱిపోసాగిరి. వారు పాఱిపోయిన ప్రదేశములయందెల్లెడల అగ్ని జ్వాలలను గాంచిరి. ఇట్లు వానరభల్లూకములు వ్యాకులపాటునకు లోనుకాగా రావణుడు ఇసుకను కురిపించెను. కపటోపాయములచే అతడు వానరులను స్తంభింపజేసి గర్జించెను. లక్ష్మణ సుగ్రీవాదులతోసహా వీరులందఱును స్పృహనుగోల్పోయిరి. "హా రామా! హా రఘునాథా!" అనుచు ఆ మహాయోధులందఱును ఏమియుతోచక చేతులునలుపుకొనుచుండిరి. ఈ విధముగా వారిని దుర్బలులగావించి, రావణుడు మఱియొక మాయను సృష్టించెను. ఆ మాయా ప్రభావమున అసంఖ్యాకులైన హనుమంతులు పాషాణములను చేతబట్టి ప్రకటితులైరి. వారందఱును వేలసంఖ్యలో గుమిగూడి శ్రీరాముని చుట్టుముట్టిరి. వాలములను ఎత్తుకొని, పండ్లుగొఱుకుచు వారు "వధింపుము, పట్టుకొనుము' పోనియ్యవద్దు," అని అఱచుచుండిరి. వారివాలములు దశదిశలయందును విలసిల్లుచుండెను. వారివాలవలయములమధ్య కోసల రాజా శ్రీరాముడు విరాజమానుడయ్యెను. (చౌ॥ 1-8)

ఛం-తెహిం మధ్య కోసలరాజ సుందర స్యామ తన సోభా లహీ ।
జను ఇంద్రధనుష అనేక కీ బర బారి తుంగ తమాలహీ ॥
ప్రభు దేఖి హరష బిషాద ఉర సుర బదత జయ జయ జయ కరీ ।
రఘుబీర ఏకహిం తీర కోపి నిమేష మహుం మాయా హరీ ॥ 1 ॥

మాయా బిగత కపి భాలు హరషే బిటప గిరి గహి సబ ఫిరే ।
సర నికర ఛాడే రామ రావన బాహు సిర పుని మహి గిరే ॥
శ్రీరామ రావన సమర చరిత అనేక కల్ప జో గావహీఁ ।
సత సేష సారద నిగమ కబి తేఉ తదపి పార న పావహీఁ ॥ 2 ॥

ఆ వాలములమధ్య శ్యామసుందరగాత్రుడై, కోసలరాజు అనేకములైన హరివిల్లులమధ్య ఎత్తైన తమాల వృక్షమువలె శోభిల్లుచుండెను. ప్రభువును గాంచి, దేవతలు హర్షవిషాదహృదయులై 'జయ జయ ధ్వానములను' జేసిరి. అప్పుడు శ్రీ రఘువీరుడు క్రుద్ధుడై ఒక్క క్షణములో ఒకే బాణముతో రావణుని మాయను హరించెను. మాయ తొలగిపోయిన పిమ్మట భల్లూక వానరులు ప్రసన్నచిత్తులైరి. వారు వృక్షములను, పర్వతములను దీసికొని మరల యుద్ధ రంగమునకు ఏతెంచిరి. శ్రీరాముడు బాణ పరంపరను ప్రయోగింపగా రావణునిశిరస్సులు, భుజములు తెగి క్రిందబడెను. శ్రీరామరావణ యుద్ధమును వందలకొలది శేషులుగాని, శారదాది దేవతలుగాని, వేదములుగాని, కడకు కవీశ్వరులుగాని కల్పములకొలది వర్ణించినను దానిని సమగ్రముగా తెలుపజాలరు. (ఛం॥ 1,2)

దో- తాకే గున గన కఛు కహే, జడమతి తులసీదాస ।
జిమి నిజ బల అనురూప తే, మాఛీ ఉడఇ అకాస॥ 101(క) ॥
కాటే సిర భుజ బార బహు, మరత న భట లంకేస ।
ప్రభు క్రీడత సుర సిద్ధ ముని, బ్యాకుల దేఖి కలేస॥ 101 (ఖ) ॥

అల్పశక్తిగల ఒక దోమ అనంతాకాశమును కొలుచుటకు పూనుకొనినట్లు మందబుద్ధియైన తులసీదాసు ఆ అపూర్వయుద్ధవిశేషములలో కొన్నింటిని వర్ణించెను. శిరస్సులు, భుజములు పెక్కుపర్యాయములు తెగిపడినను వీరుడైన రావణుడు చావలేదు. శ్రీరామచంద్రునకు అదియొక లీలమాత్రమే కాని మునులు, సిద్ధులు దేవతలు ఆ దృశ్యములను జూచి, శ్రీరాముడు క్లేశములకు లోనైనాడని భావించి, వ్యాకులపడిరి. (దో॥ 101 క,ఖ)

చౌ- కాటత బఢహిఁ సీస సముదాఈ । జిమి ప్రతి లాభ లోభ అధికాఈ ॥
మరఇ న రిపు శ్రమ భయఉ బిసేషా । రామ బిభీషన తన తబ దేఖా ॥ 1 ॥
ఉమా కాల మర జాకీఁ ఈఛా । సో ప్రభు జన కర ప్రీతి పరీఛా ॥
సును సరబగ్య చరాచర నాయక । ప్రనతపాల సుర ముని సుఖదాయక ॥ 2 ॥
నాభికుండ పియూష బస యాకేఁ । నాథ జిఅత రావను బల తాకేఁ ॥
సునత బిభీషన బచన కృపాలా । హరషి గహే కర బాన కరాలా ॥ 3 ॥
అసుభ హోన లాగే తబ నానా । రోవహిఁ ఖర సృకాల బహు స్వానా ॥
బోలహిఁ ఖగ జగ ఆరతి హేతూ । ప్రగట భఏ నభ జహఁ తహఁ కేతూ ॥ 4 ॥
దస దిసి దాహ హోన అతి లాగా । భయఉ పరబ బిను రబి ఉపరాగా ॥
మందోదరి ఉర కంపతి భారీ । ప్రతిమా స్రవహిఁ నయన మగ బారీ ॥ 5 ॥

ధనలాభము కలిగినకొలదియు లోభము అధికమైనట్లు ఖండింపబడిన కొలదియు రావణుని శిరస్సులు పెఱుగుచు వచ్చెను. శత్రువు చనిపోవుటలేదు. శ్రమ అధికమగుచుండెను. అప్పుడు శ్రీరామచంద్రుడు విభీషణుని వైపు చూచెను. (శివుడు పలుకుచున్నాడు) ఓ ఉమా! ఇచ్ఛామాత్రముననే మృత్యువునుగూడ సమయింపజేయగల శ్రీరాముడు తన భక్తులప్రేమను పరీక్షించుచున్నాడు. విభీషణుడు పలికెను. "ఓ సర్వజ్ఞా! చరాచర ప్రభూ! శరణాగత సంరక్షకా! దేవతలకును, మునులకును సుఖములను ప్రసాదించువాడా! వినుడు. రావణునినాభికుండములో అమృతకలశమున్నది. ప్రభూ! దానిప్రభావమున అతడు జీవించియున్నాడు." విభీషణుని వచనములను విని, కృపాళువైన శ్రీరాముడు ప్రసన్నుడై భీషణశరమును చేతబట్టెను. అప్పుడనేక విధముల అపశకునములాయెను. పెద్ద సంఖ్యలో గాడిదలు, నక్కలు, కుక్కలు ఏడువ సాగెను. దుఃఖములను సూచించుచు పక్షులు కూసెను. ఆకాశములో అంతటను తోకచుక్కలు కనబడెను. అన్నిదిశలయందును అగ్నిజ్వాలలు ప్రజ్వలించెను. పర్వదినము (అమావాస్య) కాకున్నను సూర్యగ్రహణము సంభవించెను. మందోదరి హృదయము మిగులకంపించెను. విగ్రహముల నేత్రములనుండి అశ్రుధారలు స్రవించెను. (చౌ॥ 1-5)

ఛం-ప్రతిమా రుదహిఀ పబిపాత నభ అతి బాత బహ డోలతి మహీ ।
బరషహిఀ బలాహక రుధిర కచ రజ అసుభ అతి సక కో కహీ ॥
ఉతపాత అమిత బిలోకి నభ సుర బికల బోలహిఀ జయ జఏ ।
సుర సభయ జాని కృపాల రఘుపతి చాప సర జోరత భఏ ॥

ప్రతిమలు రోదించుచుండెను. ఆకాశమునుండి వజ్రపాతము సంభవించెను. వాయువులు అత్యంత ప్రచండములై వీవసాగెను. పృథ్వి డోలాయమానమగుచుండెను. మేఘములు రక్తమును, వెంట్రుకలను, ధూళులను వర్షించుచుండెను. లెక్కింపసాధ్యముకానన్ని అపశకునములు పొడసూపెను. అంతులేని ఉత్పాతములనుజూచి, ఆకాశమున దేవతలు వికలులైరి. 'జయజయధ్వానములు' చేసిరి. దేవతలు భయభ్రాంతులగుట చూచి, కృపాళువైన రఘునాథుడు ధనుస్సున బాణములను సంధించెను. (ఛం)

దో- ఖైఀచి సరాసన శ్రవన లగి, ఛాడే సర ఏకతీస ।
రఘునాయక సాయక చలే, మానహుఀ కాల ఫనీస ॥ 102 ॥

ధనస్సును ఆకర్ణాంతములాగి, శ్రీ రఘువీరుడు ఒకేసారి ముప్పదియొక్క బాణములను వదిలెను. అవి కాలసర్పములవలె వెళ్లెను. (దో॥ 102)

చౌ- సాయక ఏక నాభి సర సోషా । అపర లగే భుజ సిర కరి రోషా ॥
లై సిర బాహు చలే నారాచా । సిర భుజ హీన రుండ మహి నాచా ॥ 1 ॥
ధరని ధసఇ ధర ధావ ప్రచండా । తబ సర హతి ప్రభు కృత దుఇ ఖండా ॥
గర్జెఉ మరత ఘోర రవ భారీ । కహాఀ రాము రన హతౌఀ పచారీ ॥ 2 ॥
డోలీ భూమి గిరత దసకంధర । ఛుభిత సింధు సరి దిగ్గజ భూధర ॥
ధరని పరేఉ ద్వౌ ఖండ బఢాఈ । చాపి భాలు మర్కట సముదాఈ ॥ 3 ॥

మందోదరి ఆగేఁ భుజ సీసా । ధరి సర చలే జహాఁ జగదీసా ॥
ప్రబిసే సబ నిషంగ మహు జాఈఁ । దేఖి సురన్హ దుందుభీఁ బజాఈఁ ॥ 4 ॥
తాసు తేజ సమాన ప్రభు ఆనన । హరషే దేఖి సంభు చతురానన ॥
జయ జయ ధుని పూరీ బ్రహ్మాండా । జయ రఘుబీర ప్రబల భుజదండా ॥ 5 ॥
బరషహిఁ సుమన దేవ ముని బృందా । జయ కృపాల జయ జయతి ముకుందా ॥ 6 ॥

ఒక బాణము రావణుని నాభియందలి అమృతభాండమును శుష్కింపజేసెను. మిగిలిన ముప్పది బాణములు అతని పదిశిరస్సులను, ఇరువది చేతులను ఖండించి, వాటిని తమతో పాటు తీసికొనిపోయెను. శిరస్సులు, భుజములు లేని మొండెము నేలపై నాట్యమాడసాగెను. మొండెము ప్రచండవేగముతో పరుగెత్తుచుండగా భూమి కంపించెను. అప్పుడు ప్రభువు ఒక బాణముతో దానిని రెండు ముక్కలుగాజేసెను. మరణ సమయమున రావణుడు గర్జించుచు రాముడెక్కడ? రాముడెక్కడ? నేను అతనిని యుద్ధమున చంపవలెను' అని పలికెను. దశకంధరుడు పడిపోగానే భూమి దద్దరిల్లెను. సముద్రములు, నదులు, దిగ్గజములు, పర్వతములు క్షోభించెను. మొండెము యొక్క రెండు ముక్కలును తమ క్రిందబడిన భల్లూక వానరములను అణచివేసెను. శ్రీరాముని బాణములన్నియును రావణుని భుజములను, మస్తకములను మందోదరి ముందుంచి, తిరిగివచ్చి రామునితూణీరమున జేరెను. ఈ దృశ్యమునంతయును గాంచి, దేవతలు దుందుభులను మ్రోగించిరి. రావణుని తేజస్సు ప్రభుముఖమున ప్రవేశించెను. దీనిని గాంచి, శివుడు, బ్రహ్మయు ప్రసన్నులైరి. బ్రహ్మాండమంతయును 'జయ జయ ధ్వానములతో మాఱుమ్రోగెను. " ప్రబలభుజదండములుగల శ్రీరఘువీరునకు జయము జయము, కృపాళువైన ముకుందునకు జయము జయము. "అనుచు దేవతలు, మునులు, పుష్పములను వర్షించిరి.[1] (చౌ॥ 1-6)

ఛం-జయ కృపా కంద ముకుంద ద్వంద హరన సరన సుఖప్రద ప్రభో ।
ఖల దల బిదారన పరమ కారన కారునీక సదా బిభో ॥
సుర సుమన బరషహిఁ హరష సంకుల బాజ దుందుభి గహగహీ ।
సంగ్రామ అంగన రామ అంగ అనంగ బహు సోభా లహీ ॥ 1 ॥
సిర జటా ముకుట ప్రసూన బిచ బిచ అతి మనోహర రాజహీఁ ।
జను నీలగిరి పర తడిత పటల సమేత ఉడుగన భ్రాజహీఁ ॥
భుజదండ సర కోదండ ఫేరత రుధిర కన తన అతి బనే ।
జను రాయమునీఁ తమాల పర బైఠీఁ బిపుల సుఖ ఆపనే ॥ 2 ॥

1) సరసపామదానభేదదండచతుర సాటి దైవమా వేగ్రోవవే ॥సరస॥
పరమ శాంభవాగ్రేసరుండనుచు పలుకు రావణుడు తెలియలేక పోయె ॥సరస॥ (త్యాగరాయ)

(శ్రీరాముని వారు ఇట్లు స్తుతించిరి) "ఓ కరుణానిధీ! మోక్షప్రదాయకా! ముకుందా! రాగద్వేషములు, హర్ష శోకములు, జనన మరణములు మొదలగు ద్వంద్వములను హరించువాడా! శరణాగతులకు సుఖ ప్రదాతా! ప్రభూ! ఖలులసమూహమును నాశమొనర్చువాడా! కారణకారణా! కరుణామయా! సర్వసమర్థా! శాశ్వతా! నీకు 'జయమగుగాక' ఇట్లు స్తుతించుచు దేవతలు ఆనందాతిరేకముతో పూలవానకురిపించిరి. ఘనమైన నగారాలను మ్రోగించిరి. సంగ్రామరంగమున విజేతయైన శ్రీరామచంద్రుని అందచందములు కోటిమన్మథ సౌందర్యములను మించి ప్రకాశించుచుండెను. శ్రీరాముని జటామకుటముపై అలరారుచున్న పుష్పములు అత్యంత మనోహర శోభలను విరజిమ్ముచుండెను. శ్రీరాముని మేనికాంతులు నీలగిరి శోభలవలెను, జటా జూటచ్ఛటలు విద్యుల్లతా ప్రభలవలెను, జటలపై విలసిల్లుచున్న పుష్పద్యుతులు నక్షత్రశోభలవలెను మనోహరములై భాసిల్లుచుండెను. శ్రీరాముడు తన బాహువులతో ధనుర్బాణములను త్రిప్పుచుండెను. శ్యామసుందరుని మేనిపైగల రక్తబిందువులు తమాల వృక్షముపై నిశ్చలముగా హాయిగా కూర్చునియున్న రాయముని పక్షులవలె మనోజ్ఞములై అలరారుచుండెను. (ఛం)

దో- కృపాదృష్టి కరి బృష్టి ప్రభు, అభయ కిఏ సుర బృంద ।
భాలు కీస సబ హరషే, జయ సుఖ ధామ ముకుంద ॥ 103 ॥

శ్రీరామచంద్ర ప్రభువుతనకృపాదృష్టివర్షముతో దేవతలకు అభయమొసంగెను. వానరులందఱును. హర్షోల్లాసములతో "ఓ సుఖ నిధానా! ముకుందా! నీకు జయము జయము" అని పలికిరి. (దో॥ 103)

చౌ- పతి సిర దేఖత మందోదరీ । మురుఛిత బికల ధరని ఖసి పరీ ॥
జుబతి బృంద రోవత ఉఠి ధాఈం । తెహి ఉఠాఇ రావన పహిం ఆఈం ॥ 1 ॥
పతి గతి దేఖి తె కరహిం పుకారా । ఛూటే కచ నహిం బపుష సంభారా ॥
ఉర తాడనా కరహిం బిధి నానా । రోవత కరహిం ప్రతాప బఖానా ॥ 2 ॥
తవ బల నాథ డోల నిత ధరనీ । తేజ హీన పావక ససి తరనీ ॥
సేష కమఠ సహి సకహిం న భారా । సో తను భూమి పరేఉ భరి ఛారా ॥ 3 ॥
బరున కుబేర సురేస సమీరా । రన సన్ముఖ ధరి కాహుం న ధీరా ॥
భుజబల జితెహు కాల జమ సాఈం । ఆజు పరెహు అనాథ కీ నాఈం ॥ 4 ॥
జగత బిదిత తుమ్హారి ప్రభుతాఈ । సుత పరిజన బల బరని న జాఈ ॥
రామ బిముఖ అస హాల తుమ్హారా । రహా న కోఉ కుల రోవనిహారా ॥ 5 ॥
తవ బస బిధి ప్రపంచ సబ నాథా । సభయ దిసిప నిత నావహిం మాథా ॥
అబ తవ సిర భుజ జంబుక ఖాహీం । రామ బిముఖ యహ అనుచిత నాహీం ॥ 6 ॥
కాల బిబస పతి కహా న మానా । అగ జగ నాథు మనుజ కరి జానా ॥ 7 ॥

తన భర్త శిరస్సులను చూడగనే మందోదరి శోక విహ్వలయై మూర్ఛిల్లి, పడిపోయెను. తక్కిన రాణులు విలపించుచు లేచి పరుగిడి ఆమెను లేవనెత్తి, రావణుని కళేబరము నొద్దకు తీసికొని వచ్చిరి. తమ పతికి పట్టిన ఈ దుస్థితిని జూచి, వారు బిగ్గఱగా వాపోవుచు విలవిలలాడిరి. వారి కొప్పులు చెదరిపోయెను. శరీరములపై స్పృహ

లేకుండెను. గుండెలపై బాదుకొనుచు, విలపించుచు వారు అనేక విధముల రావణుని ప్రతాపమును ప్రస్తుతించిరి. "ఓ నాథా! నీ బలమునకు నిత్యము పృథ్వి గడగడలాడుచుండెను. సూర్యచంద్రాగ్నులు నీ ముందు తేజో విహీనులగుచుండిరి. శేషుడు, కూర్మము గూడ నీ భారమును మోయ జాలకుండిరి. అట్టి నీ మహోన్నత శరీరము అయ్యో! ధూళి ధూసరితమై నేలపై బడియున్నది. ఇంద్ర వాయు వరుణ కుబేరులలో ఎవ్వరును యుద్ధములో నిన్ను ఎదురించుటకు సాహసింపకుండిరి. స్వామీ! నీవు నీభుజబలముచే మృత్యువును, యమధర్మరాజునుగూడ జయించితివి. అట్టి నీవు ఇప్పుడు దిక్కులేని స్థితిలో పడియుంటివి. నీప్రతాపము జగద్విదితము. నీపుత్రులబలము, కుటుంబసభ్యుల పరాక్రమము వర్ణనాతీతము. జగత్ప్రభువైన శ్రీరామచంద్రునితో వైరముపెట్టుకొనుటచే నీకీదుఃస్థితి దాపురించినది. నేడు నీ వంశములో నీకై విలపించు వారు ఎవ్వరును మిగుల లేదు. నాథా! విధాత సృష్టి యంతయును నీ యధీనములో ఉండెను. దిక్పాలురు నీకు భయపడి నీ ముందు తలలు వంచుకొనుచుండిరి. కాని నేడు నీ శిరస్సులను, భుజములను అయ్యయ్యో!! నక్కలు తినుచున్నవి. శ్రీరాముని విరోధికి ఇట్టి గతి పట్టుట అనుచితము గాదు. నాథా! కాలుని వశమైయుండుటచే నీవు ఎవ్వరి మాటలనూ వినకుంటివి. చరాచర సృష్టికి ప్రభువైన పరమాత్మను మానవ మాత్రునిగా భావించితివి. (చౌ॥ 1-7)

ఛం-జాన్యో మనుజ కరి దనుజ కానన దహన పావక హరి స్వయం ।
జెహి నమత సివ బ్రహ్మాది సుర పియ భజెహు నహిం కరునామయం ॥
ఆజన్మ తే పరద్రోహ రత పాపౌఘమయ తవ తను అయం ।
తుమ్హహూ దియో నిజ ధామ రామ నమామి బ్రహ్మ నిరామయం ॥

దైత్యలోకమనెడివనమును కాల్చి, భస్మమొనర్చుటకు అగ్నియైన శ్రీరాముని సామాన్య మానవుడనుకొంటివి. బ్రహ్మరుద్రాది దేవతలచే సేవింపబడు, కరుణామయుడైన శ్రీరాముని నీవు భజింప కుంటివి. పుట్టినది మొదలుకొని ఈ శరీరము ఇతరులకు ద్రోహము చేయుటలోనే నిమగ్నమై యుండెను. ఇది అనేక పాపములకు కూడలి. ఐనను శ్రీరాముడు నీకు తనలోకమున స్థానమును ప్రసాదించెను. అట్టి నిర్వికార పరబ్రహ్మకు నేను ప్రణమిల్లుచున్నాను. (శ్రీరామునియెడ నీవు పరమద్రోహమునకు ఒడిగట్టినను రాగద్వేషములకు అతీతుడైన ఆకృపాళువు నీకు పరమగతిని ప్రాప్తింపజేయుట ఆయన నిర్వికారస్వభావమునకు పరమతార్కాణము). (ఛం)

దో- అహహ నాథ రఘునాథ సమ, కృపాసింధు నహిం ఆన ।
జోగి బృంద దుర్లభ గతి, తోహి దీన్హి భగవాన ॥ 104 ॥

అహో! నాథా! యోగులకుకూడ దుర్లభమైన పరమపదమును నీకు అనుగ్రహించిన భగవంతుడే ఆ శ్రీరాముడు. అట్టి దయాళువు మఱియొకడు లేనే లేడు." (దో॥ 104)

చౌ- మందోదరీ బచన సుని కానా । సుర ముని సిద్ధ సబన్హి సుఖ మానా ॥
అజ మహేస నారద సనకాదీ । జే మునిబర పరమారథబాదీ ॥ 1 ॥

భరి లోచన రఘుపతిహి నిహారీ । ప్రేమ మగన సబ భఈ సుఖారీ ॥
రుదన కరత దేఖీఁ సబ నారీ । గయఉ బిభీషను మన దుఖ భారీ ॥ 2 ॥
బంధు దసా బిలోకి దుఖ కీన్హా । తబ ప్రభు అనుజహి ఆయసు దీన్హా ॥
లఛిమన తెహి బహు బిధి సముఝాయో । బహురి బిభీషన ప్రభు పహిఁ ఆయో ॥ 3 ॥
కృపాదృష్టి ప్రభు తాహి బిలోకా । కరహు క్రియా పరిహరి సబ సోకా ॥
కీన్హి క్రియా ప్రభు ఆయసు మానీ । బిధివత దేస కాల జియఁ జానీ ॥ 4 ॥

మందోదరి వచనములను చెవులార విని, దేవతలు, సిద్ధులు, మునులు సంతసించిరి. బ్రహ్మ, పరమ శివుడు, నారదమహర్షి, సనకాది మహామునులు ఇతర తత్త్వజ్ఞులు మొదలగు వారందఱును శ్రీ రఘునాథుని కన్నులపండువుగా జూచి, ప్రేమమగ్నులై, తన్మయులై అపారమైన ఆనందమును అనుభవించిరి. తన కుటుంబ స్త్రీలు అందఱును విలపించుటను జూచి, విభీషణుడు మిక్కిలి దుఃఖితుడై వారి యొద్దకు వెళ్లెను. సోదరుని ఈస్థితిని జూచి, అతడు మిగుల బాధపడెను. ప్రభువు యొక్క ఆజ్ఞ మేరకు లక్ష్మణుడు విభీషణుని పెక్కురీతుల ఓదార్చెను. అపుడు విభీషణుడు ప్రభువు నొద్దకు వచ్చెను. ప్రభువు తనకరుణాపూరిత దృష్టితో అతనిని జూచి పలికెను. "ఇప్పుడు శోకమును వీడి, రావణునకు అంత్యక్రియలను నెఱవుము. ప్రభువు యొక్క ఆజ్ఞను శిరసావహించి, దేశకాలపరిస్థితులను గమనించి, విభీషణుడు విధ్యుక్తముగా రావణునకు అంత్యక్రియలను జరిపెను. (చౌ॥ 1-4)

దో- మందోదరీ ఆది సబ, దేఇ తిలాంజలి తాహి ।
భవన గఈఁ రఘుపతి గున, గన బరనత మన మాహి ॥ 105 ॥

మందోదరి మొదలగు రాణులందఱును రావణునకు తిలాంజలులనిచ్చి, మనస్సులో శ్రీరాముని దివ్యగుణములను కొనియాడుచు తమభవనములకు చేరిరి. (దో॥ 105)

## విభీషణుడు రాజ్యాభిషిక్తుడగుట

చౌ- అస బిభీషన పుని సిరు నాయో । కృపాసింధు తబ అనుజ బొలాయో ॥
తుమ్హ కపీస అంగద నల నీలా । జామవంత మారుతి నయసీలా ॥ 1 ॥
సబ మిలి జాహు బిభీషన సాథా । సారెహు తిలక కహేఉ రఘునాథా ॥
పితా బచన మైఁ నగర న ఆవఉఁ । ఆపు సరిస కపి అనుజ పఠావఉఁ ॥ 2 ॥
తురత చలే కపి సుని ప్రభు బచనా । కీన్హీ జాఇ తిలక కీ రచనా ॥
సాదర సింహాసన బైఠారీ । తిలక సారి అస్తుతి అనుసారీ ॥ 3 ॥
జోరి పాని సబహీఁ సిర నాఏ । సహిత బిభీషన ప్రభు పహిఁ ఆఏ ॥
తబ రఘుబీర బోలి కపి లీన్హే । కహి ప్రియ బచన సుఖీ సబ కీన్హే ॥ 4 ॥

అంత్యక్రియలు ముగిసినపిమ్మట విభీషణుడు వచ్చి ప్రభువునకు పాదాభివందనమాచరించెను. కృపానిధానమైన శ్రీరాముడు లక్ష్మణుని బిలిచి పలికెను. "నీవు, వానరరాజైన సుగ్రీవుడు, అంగదుడు, నలుడు, నీలుడు,

జాంబవంతుడు, హనుమంతుడు అందఱును నీతి కుశలురు. మీరు విభీషణునితో గూడి పోయి, అతనిని రాజ్యాభిషిక్తుని గావింపుడు." పిమ్మట విభీషణునితో, "తండ్రిగారి ఆజ్ఞమేరకు నేను స్వయముగా నగరములోనికి రారాదు. కాని నాతో సమానులైన వానరులను, నా అనుజుడైన లక్ష్మణుని పంపుచున్నాను" అని పలికెను. ప్రభు వచనములను వినగానే వానరులు వెంటనే వెళ్లి, రాజ్యపట్టాభిషేకమునకు ఏర్పాట్లుగావించిరి. విభీషణుని సాదరముగా సింహాసనముపై కూర్చుండ బెట్టి, రాజ్యాభిషిక్తునిగా జేసి, సందర్భోచితముగా శ్లాఘించిరి. పిమ్మట అంజలి ఘటించి, అందఱును ఆయనకు నమస్కరించిరి. విభీషణునితోపాటు అందఱును ప్రభువు నొద్దకు వచ్చిరి. శ్రీ రఘువీరుడు వానరులను పిలిచి, వారిని తన మధురవచనములతో సంతృప్తి పఱచెను. (చౌ॥ 1-4)

ఛం-కిపి సుఖీ కహి బానీ సుధా సమ బల తుమ్హారేఁ రిపు హాయో ।
పాయో బిభీషన రాజ తిహుఁ పుర జసు తుమ్హారో నిత నయో ॥
మోహి సహిత సుభ కీరతి తుమ్హారీ పరమ ప్రీతి జో గాఇహైఁ ।
సంసార సింధు అపార పార ప్రయాస బిను నర పాఇహైఁ ॥

"మీ బలపరాక్రమములవలననే రావణునియంతటి శత్రువుగూడ వధింపబడెను. విభీషణుడు రాజయ్యెను. మీ యశస్సు ముల్లోకములలో చిరస్థిరముగా నుండును. అమృతప్రాయములైన ఇట్టి మధురవచనములతో వారినందఱిని సంతృప్తి పఱచెను. నాతోపాటు మీ బలపరాక్రమ యశోవైభవములను గూడ ప్రేమ పూర్వకముగా గానము చేయువారు ఎట్టి శ్రమయులేకుండగనే అపారభవసాగరమును దాటెదరు. (ఛం)

దో- ప్రభు కే బచన శ్రవన సుని, నహిఁ అఘాహిఁ కపి పుంజ ।
బార బార సిర నావహిఁ, గహహిఁ సకల పద కంజ ॥ 106 ॥

ప్రభువచనములను ఎంతగా విన్నను వానరులకు తనివితీరలేదు. వారందఱును మాటిమాటికి ప్రభు చరణములకు శిరసా ప్రణమిల్లిరి. (దో॥ 106)

చౌ- పుని ప్రభు బోలి లియఉ హనుమానా । లంకా జాహు కహేఉ భగవానా ॥
సమాచార జానకిహి సునావహు । తాసు కుసల లై తుమ్హ చలి ఆవహు ॥ 1 ॥
తబ హనుమంత నగర మహుఁ ఆఏ । సుని నిసిచరీ నిసాచర ధాఏ ॥
బహు ప్రకార తిన్హ పూజా కీన్హీ । జనకసుతా దేఖాఇ పుని దీన్హీ ॥ 2 ॥
దూరిహి తే ప్రనామ కపి కీన్హా । రఘుపతి దూత జానకీఁ చీన్హా ॥
కహహు తాత ప్రభు కృపానికేతా । కుసల అనుజ కపి సేన సమేతా ॥ 3 ॥
సబ బిధి కుసల కోసలాధీసా । మాతు సమర జీత్యో దససీసా ॥
అబిచల రాజు బిభీషన పాయో । సుని కపి బచన హరష ఉర ఛాయో ॥ 4 ॥

పిదప ప్రభువు హనుమంతుని పిలిచి ఇట్లనెను. "నీవు లంకకు వెళ్లి, విషయమునంతయును జానకీదేవికి తెలుపుము. ఆమె క్షేమసమాచారములనుగూడ తెలిసికొని రమ్ము"- పిమ్మట హనుమంతుడు నగరమునకు

వెళ్లెను. ఆ విషయము నెఱిగిన రాక్షస స్త్రీ పురుషులందఱును ఆయనకు స్వాగతము పలుకుటకై పరుగెత్తుకొనివచ్చిరి. హనుమంతుని అనేకవిధముల గౌరవించి, జానకీదేవిని చూపించిరి. హనుమంతుడు సీతామాతకు దూరమునుండి నమస్కరించెను. జానకీదేవి అతనిని శ్రీరాముని ప్రత్యేకదూతగా ఎఱింగి పలికెను. "నాయనా! తెలుపుము. కృపానిధియైన నా స్వామి, సోదరుడు లక్ష్మణుడు, వానరసేనతో సహా కుశలమే గదా?"– హనుమంతుడు పలికెను. "మాతా! కోసలాధీశుడును తక్కిన వారందఱును అన్ని విధముల కుశలమే. ప్రభువు యుద్ధములో దశాననుని సంహరించెను. అఖండ లంకారాజ్యమునకు ఇప్పుడు విభీషణుడు రాజు". హనుమంతుని మాటలను విని, సీతాదేవిహృదయము ఆనందభరితమాయెను. (చౌ॥ 1-4)

ఛం-అతి హరష మన తన పులక లోచన సజల కహ పుని పుని రమా ।
కా దేఉఀ తోహి త్రైలోక మహుఀ కపి కిమపి నహిఀ బానీ సమా ॥
సును మాతు మైఀ పాయో అఖిల జగ రాజు ఆజు న సంసయం ।
రన జీతి రిపుదల బంధు జుత పస్యామి రామమనామయం ॥

శ్రీ జానకీదేవిహృదయము హర్షభరితమాయెను. ఆమెశరీరము పులకరించెను. నేత్రములు ఆనందాశ్రువులతో నిండెను. పదే పదే ఇట్లు పలికెను. "హనుమ! నేను నీకేమి ఇయ్యగలను? ఇట్టి సంతోషకరమైన సమాచారము ముల్లోకములలో ఏదియును లేదు." హనుమంతుడు పలికెను. "అమ్మా! వినుడు. సంగ్రామములో శత్రుసేనలను జయించి, సోదరునితో సహా నిర్వికారుడైయున్న శ్రీరాముని చూచి, నేను నిస్సందేహముగా విశ్వమునకే ఆధిపత్యము వహించిన వాడనైతిని.– (ఇట్టి ప్రబల శత్రువును వధించినను కోమలస్వభావుడైన శ్రీరామచంద్రప్రభువు నిర్వికారుడై ఉన్నాడని అంజనేయస్వామి వచించెను.) (ఛం)

దో-సును సుత సదగున సకల తవ, హృదయఀ బసహుఀ హనుమంత ।
సానుకూల కోసలపతి, రహహుఀ సమేత అనంత ॥ 107 ॥

జానకి దేవి పలికెను. "కుమారా! వినుము. నీ హృదయము సర్వసద్గుణములకును నివాసమైయుండు గాక. అనంత(లక్ష్మణ)సహితుడైన కోసలాధిపతి నీయెడల సదాప్రసన్నుడై యుండుగాక. (దో॥ 107)

చౌ- అబ సోఇ జతన కరహు తుమ్హ తాతా । దేఖౌఀ నయన స్యామ మృదు గాతా ॥
తబ హనుమాన రామ పహిఀ జాఈ । జనకసుతా కై కుసల సునాఈ ॥ 1 ॥
సుని సందేసు భానుకులభూషన । బోలి లిఏ జుబరాజ బిభీషన ॥
మారుతసుత కే సంగ సిధావహు । సాదర జనకసుతహి లై ఆవహు ॥ 2 ॥
తురతహిఀ సకల గఏ జహఀ సీతా । సేవహిఀ సబ నిసిచరీఀ బినీతా ॥
బేగి బిభీషన తిన్హహి సిఖాయో । తిన్హ బహు బిధి మజ్జన కరవాయో ॥ 3 ॥
బహు ప్రకార భూషన పహిరాఏ । సిబికా రుచిర సాజి పుని ల్యాఏ ॥
తా పర హరషి చఢీ బైదేహీ । సుమిరి రామ సుఖధామ సనేహీ ॥ 4 ॥

బేతపాని రచ్ఛక చహు పాసా । చలే సకల మన పరమ హులాసా ॥
దేఖన భాలు కీస సబ ఆఏ । రచ్ఛక కోపి నివారన ధాఏ ॥ 5 ॥
కహ రఘుబీర కహా మమ మానహు । సీతహి సఖా పయాదేఀ ఆనహు ॥
దేఖహుఀ కపి జననీ కీ నాఈఀ । బిహసి కహా రఘునాథ గోసాఈఀ ॥ 6 ॥
సుని ప్రభు బచన భాలు కపి హరషే । నభ తే సురన్హ సుమన బహు బరషే ॥
సీతా ప్రథమ అనల మహుఀ రాఖీ । ప్రగట కీన్హి చహ అంతర సాఖీ ॥ 7 ॥

వత్సా! ఇప్పుడీకన్నులలో ప్రభువు యొక్క కోమలశ్యామలశరీరమును దర్శించు ఉపాయమును జూడుము. "అపుడు హనుమంతుడు శ్రీరాముని యొద్దకు వెళ్ళి, జానకీదేవి కుశల సమాచారమును దెలిపెను. సూర్యవంశ భూషణుడైన శ్రీరాముడు సీతాదేవి సందేశమును విని, యువరాజైన అంగదుని లంకాధిపతియైన విభీషణుని పిలిచి, "మీరు పావనితోపాటు వెళ్ళి, జానకీదేవిని సాదరముగా తీసికొని రండు"- అని పలికెను. వెంటనే వారు సీతాదేవి కడకేగిరి. రాక్షస స్త్రీలందఱును వినమ్ర భావముతో సీతాదేవికి సేవలొనర్చుచుండిరి. విభీషణుడు వెంటనే వారందఱికిని తగుసూచనలను ఇచ్చెను. వారు ఆమెకు సంప్రదాయానుసారముగా స్నానము చేయించి, ఆమెను వివిధాభరణములతో అలంకరించిరి. ఒక అందమైన పల్లకీని అలంకరించి, తీసికొని వచ్చిరి. సుఖనిధానమై, ప్రియతముడైన శ్రీరామచంద్రప్రభువును స్మరించుచు సీతాదేవి ఆనందముగా ఆ పల్లకీని ఎక్కెను. వేత్రహస్తులైన రక్షకభటులు పరమోల్లాసముతో నాలుగు వైపుల నడిచిరి. భల్లూక వానరములు సీతాదేవిని దర్శించుటకై ముందుకు రాగా భటులు వారిని వారించిరి. అప్పుడు శ్రీ రఘువీరుడు పలికెను. "మిత్రమా! నా మాటలను వినుము. సీతాదేవిని కాలినడకతోడనే రానిమ్ము. దాని వలన వానరులందఱును ఆమెను తల్లివలె చూడగలరు." అనంతరము ఆ ప్రభువు దరహాసము చేసెను. ప్రభు వచనములను విని, భల్లూక వానరములు ప్రసన్నచిత్తులైరి. ఆకాశమునుండి దేవతలు పూలను వర్షించిరి. నిజమైన సీతాదేవి అగ్నిదేవునికడ ఉంచబడెను. సర్వసాక్షియైన శ్రీరాముడు ఇప్పుడు ఆమెను ప్రకటిత మొనర్పదలచెను. (చౌ॥ 1-7)

## అవనిజాతకు అగ్నిపరీక్ష

దో- తెహి కారన కరునానిధి, కహే కఛుక దుర్బాద ।
సునత జాతుధానీఀ సబ, లాగీఀ కరై బిషాద ॥ 108 ॥

ఈ కారణముచే కరుణానిధియైన శ్రీరాముడు కొన్ని పరుషవచనములను లీలగా నుడివెను. ఆ మాటలకు రాక్షసస్త్రీలందఱును దుఃఖితలైరి. (దో॥ 108)

చౌ- ప్రభు కే బచన సీస ధరి సీతా । బోలీ మన క్రమ బచన పునీతా ॥
లఛిమన హోహు ధరమ కే నేగీ । పావక ప్రగట కరహు తుమ్హ బేగీ ॥ 1 ॥
సుని లఛిమన సీతా కై బానీ । బిరహ బిబేక ధరమ నితి సానీ ॥
లోచన సజల జోరి కర దోఊ । ప్రభు సన కఛు కహి సకత న ఓఊ ॥ 2 ॥

దేఖి రామ రుఖ లఛిమన ధాఏ । పావక ప్రగటి కాఠ బహు లాఏ ॥
పావక ప్రబల దేఖి బైదేహీ । హృదయఁ హరష నహిఁ భయ కఛు తేహీ ॥ 3 ॥
జౌఁ మన బచ క్రమ మమ ఉర మాహీఁ । తజి రఘుబీర ఆన గతి నాహీఁ ॥
తౌ కృసాను సబ కై గతి జానా । మో కహుఁ హోఉ శ్రీఖండ సమానా ॥ 4 ॥

ప్రభు వచనములను శిరసావహించి, మనోవాక్కర్మలచే పరమ పవిత్రురాలైన సీతాదేవి పలికెను. "లక్ష్మణా! ఈ ధర్మరక్షణకార్యమునందు నీవు నాకు సహాయకుడవుగా ఉండుము. వెంటనే అగ్నిని ప్రజ్వరిల్ల జేయుము." విరహము, వివేకము, ధర్మము, నీతియుక్తములైన సీతాదేవి పలుకులను వినగానే లక్ష్మణుని కన్నులనుండి దుఃఖాశ్రువులు దొరలెను. చేతులు జోడించి మౌనముగా నిలబడియున్నకుండెను- శ్రీరాముని సంకేతమును గమనించి, లక్ష్మణుడు వెంటనే కట్టెలను దెచ్చి, అగ్నిని ప్రజ్వలింప జేసెను. ప్రజ్వలింపజేయబడిన అగ్నిని జూచి సీతాదేవి ప్రసన్న చిత్తురాలాయెను. లేశమాత్రమైనను భయపడక ఆమెయిట్లు వచించెను. మనోవాక్కర్మలచే నా హృదయము సర్వధర్మజ్ఞుడైన శ్రీ రఘువీరుని మాత్రమే ఆశ్రయించియున్నచో అందరి మనస్సులను ఎరింగిన అగ్నిదేవుడా! నీవు చందనము వలె చల్లబడుము." (చౌ॥ 1-4)

ఛం-శ్రీఖండ సమ పావక ప్రబేస కియో సుమిరి ప్రభు మైథిలీ ।
జయ కోసలేస మహేస బందిత చరన రతి అతి నిర్మలీ ॥
ప్రతిబింబ అరు లౌకిక కలంక ప్రచండ పావక మహుఁ జరే ।
ప్రభు చరిత కాహుఁ న లఖే నభ సుర సిద్ధ ముని దేఖహిఁ ఖరే ॥ 1 ॥
ధరి రూప పావక పాని గహి శ్రీ సత్య శ్రుతి జగ బిదిత జో ।
జిమి ఛీరసాగర ఇందిరా రామహి సమర్పీ ఆని సో ॥
సో రామ బామ బిభాగ రాజతి రుచిర అతి సోభా భలీ ।
నవ నీల నీరజ నికట మానహుఁ కనక పంకజ కీ కలీ ॥ 2 ॥

శ్రీరామచంద్రప్రభుచరణములు ఆ మహాదేవునిచే సర్వదా పూజలనందుకొనుచుండును. అవి సీతాదేవికి అత్యంత ప్రీతిపాత్రములు. అట్టి పవిత్ర పాదపద్మములను స్మరించుచు "కోసలాధిపతికి జయము" అని పల్కుచు సీతాదేవి అగ్నిలో ప్రవేశింపగనే అది చందనము వలె చల్లదనమును వహించెను. అంతట సీతాదేవి ప్రతిబింబము బింబములో గలిసెను. లౌకికకళంకము ఆ ప్రచండాగ్నిలో భస్మమాయెను. ప్రభులీలారహస్యమెవ్వరికిని గోచరముగాలేదు. దేవతలు సిద్ధులు మునులుగూడ ఆకసమునుండి చూచుచుండిరి. అప్పుడు అగ్నిదేవుడు స్వయముగా ఆకృతిని దాల్చి, వేదప్రకటితమైన, జగత్ప్రసిద్ధమైన వాస్తవ 'శ్రీ'ని (సీతాదేవిని) తనయొడిలో కూర్చుండబెట్టుకొని వచ్చి, క్షీరసాగరుడు లక్ష్మీదేవిని విష్ణుమూర్తికి సమర్పించినట్లు, సీతాదేవిని శ్రీరామచంద్రునకు సమర్పించెను. సీతాదేవి శ్రీరాముని వామభాగమున సుశోభితయయ్యెను. ఆమెయొక్క పరమశోభ అతిమనోజ్ఞమయ్యెను. నవవికసితనీలకమలముసరసన బంగారు కమలముకుళము (మొగ్గ) వలె ఆమె శోభిల్లెను. (ఛం॥ 1,2)

దో- బరషహిఀ సుమన హరషి సుర, బాజహిఀ గగన నిసాన।
గావహిఀ కిన్నర సురబధూ, నాచహిఀ చఢీఀ బిమాన ॥ 109(క) ॥
జనకసుతా సమేత ప్రభు, సోభా అమిత అపార।
దేఖి భాలు కపి హరషే, జయ రఘుపతి సుఖ సార ॥ 109(ఖ) ॥

హర్షోల్లాసములతో దేవతలు పుష్పములను వర్షించిరి. ఆకాశమున దుందుభులు మ్రోగెను. కిన్నరులు గానము చేసిరి. విమానములయందు నిలిచి, దివ్యాంగనలు నాట్యములాడిరి. శ్రీ జానకీదేవితోగూడిన శ్రీరామచంద్రుని అపారసౌందర్యమును దర్శించి, భల్లూక వానరులు సంతోషమును పట్టజాలక పోయిరి. 'సుఖనిధి' యైన 'రఘురామునకు జయము జయము' అని పలికిరి. (దో॥ 109. క,ఖ)

చౌ- తబ రఘుపతి అనుసాసన పాఈ। మాతలి చలేఉ చరన సిరు నాఈ॥
ఆఏ దేవ సదా స్వారథీ। బచన కహహిఀ జను పరమారథీ ॥ 1 ॥
దీన బంధు దయాల రఘురాయా। దేవ కీన్హి దేవన్హ పర దాయా ॥
బిస్వ ద్రోహ రత యహ ఖల కామీ। నిజ అఘ గయఉ కుమారగగామీ ॥ 2 ॥
తుమ్హ సమరూప బ్రహ్మ అబినాసీ। సదా ఏకరస సహజ ఉదాసీ ॥
అకల అగున అజ అనఘ అనామయ। అజిత అమోఘసక్తి కరునామయ ॥ 3 ॥
మీన కమఠ సూకర నరహరీ। బామన పరసురామ బపు ధరీ ॥
జబ జబ నాథ సురన్హ దుఖు పాయో। నానా తను ధరి తుమ్హఇఀ నసాయో ॥ 4 ॥
యహ ఖల మలిన సదా సురద్రోహీ। కామ లోభ మద రత అతి కోహీ ॥
అధమ సిరోమని తవ పద పావా। యహ హమరేఀ మన బిసమయ ఆవా ॥ 5 ॥
హమ దేవతా పరమ అధికారీ। స్వారథ రత ప్రభు భగతి బిసారీ ॥
భవ ప్రబాహఀ సంతత హమ పరే। అబ ప్రభు పాహి సరన అనుసరే ॥ 6 ॥

పిమ్మట శ్రీ రఘురాముని అనుమతిగైకొని, ఇంద్రునిరథసారథియగు మాతలి ప్రభుచరణములకు ప్రణమిల్లి సురపురికి జేరెను. తదనంతరము స్వకార్యఫలనిరతులైన దేవతలు వచ్చి, తత్త్వజ్ఞానులవలె, పరోపకారులరీతి మాట్లాడిరి. "ఓ దీనబంధూ! కృపాళూ! శ్రీ రఘునాథా! దేవా! మీరు దేవతలపై మిగుల కృప జూపితిరి. ఈ దుష్టరావణుడు విశ్వద్రోహి, కామాతురుడు, కుపథవర్తనుడు. తాను చేసికొనిన మహా పాపములకు తగినఫలమును పొందినాడు. మీరు సమరూపులు, పరబ్రహ్మ స్వరూపులు, నాశరహితులు, నిత్యులు, రసానందైక స్థితులు, శత్రుమిత్రభావములకు అతీతులు, అఖండస్వరూపులు, గుణాతీతులు, జన్మరహితులు, అనఘులు, నిర్వికారులు, అజేయులు, అమోఘశక్తిశాలురు, కరుణామయులు, మీరు మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన పరశురామావతారములను స్వీకరించియుంటిరి. ప్రభూ! దేవతల సంకటనివారణమునకై అనేకావతారములనెత్తి, మీరు వారిని రక్షించితిరి. ఈ దుష్టుడు మహాపాపి, దేవతలకు నిత్యశత్రువు, కామ, లోభ, మద నిరతుడు. అతి క్రోధనుడు, ఇట్టి అధమాధమునకు మీరు పరమ పదమును ప్రసాదించితిరి. ఇది జగదాశ్చర్యకరము. దేవతలమైన మేము ఉత్తమ-అధికారములను కలిగియున్నను స్వార్థపరులమై నీ భక్తిని మఱచి, నిరంతరము భవసాగర ప్రవాహములో మునకలు వేయుచున్నాము. ప్రభూ! ఇప్పుడు మేము మీకు శరణాగతులము. మమ్ము ఆదుకొనుడు."
(చౌ॥ 1-6)

దో- కరి బినతీ సుర సిద్ధ సబ, రహే జహఁ తహఁ కర జోరి।
అతి సప్రేమ తన పులకి బిధి, అస్తుతి కరత బహోరి ॥ 110 ॥

ఈ విధముగా ప్రార్థించి, దేవతలు అంజలి ఘటించి, ఎక్కడి వారక్కడనే నిలబడి పోయిరి. అప్పుడు బ్రహ్మ దేవుడు పులకిత శరీరుడై, అత్యంత భక్తి ప్రపత్తులతో స్వామిని స్తుతింప సాగెను. (దో॥ 110)

## బ్రహ్మస్తుతి

ఛం-జయ రామ సదా సుఖధామ హరే । రఘునాయక సాయక చాప ధరే ॥
భవ బారన దారన సింహ ప్రభో । గున సాగర నాగర నాథ బిభో ॥ 1 ॥
తన కామ అనేక అనూప ఛబీ । గున గావత సిద్ధ మునీంద్ర కబీ ॥
జసు పావన రావన నాగ మహా । ఖగనాథ జథా కరి కోప గహా ॥ 2 ॥
జన రంజన భంజన సోక భయం । గతక్రోధ సదా ప్రభు బోధమయం ॥
అవతార ఉదార అపార గునం । మహి భార బిభంజన గ్యానఘనం ॥ 3 ॥
అజ బ్యాపకమేకమనాది సదా । కరునాకర రామ నమామి ముదా ॥
రఘుబంస బిభూషన దూషన హా । కృత భూప బిభీషన దీన రహా ॥ 4 ॥
గున గ్యాన నిధాన అమాన అజం । నిత రామ నమామి బిభుం బిరజం ॥
భుజదండ ప్రచండ ప్రతాప బలం । ఖల బృంద నికంద మహా కుసలం ॥ 5 ॥
బిను కారన దీన దయాల హితం । ఛబి ధామ నమామి రమా సహితం ॥
భవ తారన కారన కాజ పరం । మన సంభవ దారున దోష హరం ॥ 6 ॥
సర చాప మనోహర త్రోన ధరం । జలజారున లోచన భూపబరం ॥
సుఖ మందిర సుందర శ్రీరమనం । మద మార ముధా మమతా సమనం ॥ 7 ॥
అనవద్య అఖండ న గోచర గో । సబరూప సదా సబ హోఇ న సో ॥
ఇతి బేద బదంతి న దంతకథా । రబి ఆతప భిన్నమభిన్న జథా ॥ 8 ॥
కృతకృత్య బిభో సబ బానర ఏ । నిరఖంతి తవానన సాదర ఏ ॥
ధిగ జీవన దేవ సరీర హరే । తవ భక్తి బినా భవ భూలి పరే ॥ 9 ॥
అబ దీనదయాల దయా కరిఐ । మతి మోరి బిభేదకరీ హరిఐ ॥
జెహి తే బిపరీత క్రియా కరిఐ । దుఖ సో సుఖ మాని సుఖీ చరిఐ ॥ 10 ॥
ఖల ఖండన మండన రమ్య ఛమా । పద పంకజ సేవిత సంభు ఉమా ॥
నృప నాయక దే బరదానమిదం । చరనాంబుజ ప్రేమ సదా సుభదం ॥ 11 ॥

"సదా సుఖధామా! హరీ! ధనుర్బాణధారీ! రఘునాయకా! శ్రీరామా! నీకు జయము "ప్రభూ! నీవు జననమరణ రూపగజములకు సింహమువంటి వాడవు. సద్గుణసాగరుడవు. సర్వ సమర్థుడవు. నీవు కోటిమన్మథ

సుంధరాకారుడవు. సిద్ధులు, మునులు, కవులు నీ గుణములను నిరంతము గానముచేయుచుందురు. నీయశస్సు ఉజ్జ్వలమైనది. రావణుడను మహాసర్పమును అవలీలగా క్రోధావేశముతో హతమార్చిన గరుత్మంతుడవు. ప్రభూ! సేవకులకు ఆనందప్రదాయకుడవు, శోకభయనాశకుడవు, క్రోధరహితుడవు, నిత్య జ్ఞాన స్వరూపుడవు. నీ అవతారము ఉదార- అపారదివ్యగుణశోభితము. పృథ్వీ భారమును తొలగించునది. జ్ఞాననిధానము, అవతారము దాల్చినను మీరునిత్యులు, జన్మరహితులు, సర్వవ్యాపకులు, అద్వితీయులు, అనాది. ఓ కరుణాకరా! శ్రీరామా! మిక్కిలి హర్షముతో నీకు ప్రణమిల్లు చున్నాను. రఘువంశ భూషణా! దుష్టరాక్షససంహారకా! సమస్తదోషాపహారీ! దీనుడై శరణుజొచ్చిన విభీషణుని రాజుగా జేసితివి. జ్ఞానగుణనిధానా! నిరభిమానీ! అజ! సర్వ వ్యాపీ! నిర్వికారా! శ్రీరామా! నీకు నమస్కారములు. నీ భుజ దండ ప్రతాప బలములు ప్రచండములైనవి. దుష్టసమూహములను మట్టుపెట్టుటలో నిరుపమానుడవు, దీనులపై అవ్యాజ కరుణ జూపుచు వారికి శుభములను గూర్చువాడవు. ఓ శోభానిధానా! జానకీసహితుడవై విలసిల్లు నీకు నమస్కారములు. నీవు సంసారసాగరమునుండి ఎల్లరను తరింపజేయువాడవు. కారణ(మాయ) కార్యముల (జగత్తు)లకు అతీతుడవు. మనస్సులయందుత్పన్నములగు దారుణ దోషములను హరించువాడవు. మంజులతూణీరధనుర్బాణధారీ! జలజారుణలోచనా! రాజశిరోమణీ! సుఖనిధానా! సుందరశ్రీరమణా! నీవు మమతాహంకారకామములను నశింపజేయువాడవు. అనవద్యుడవు, అఖండుడవు, ఇంద్రియములకు గోచరము కానివాడవు. అన్ని రూపములును నీవేయైనను ఏ రూపమునను ఒదుగనివాడవు. అని వేదములు తెలుపుచున్నవి. ఇది కల్పితము గాదు. సూర్యుడును, సూర్యకాంతియు ఒకటేయైనను వేర్వేరైనట్లు, నీవు జగత్తునందు భిన్నుడవు, అభిన్నుడవు, ఓ సర్వవ్యాపకప్రభూ! ఈ వానరులందఱును కృతార్థులు. సాదరముగా మీముఖశోభలను దర్శించుచున్నారు. మా అమరజీవనము దివ్యశరీరము వ్యర్థములు. ఏలనన మేము మీయెడ భక్తిని మఱచి, సంసార విషయలంపటులమైతిమి. ఓ దీనశరణ్యా! విపరీతక్రియలను ఆచరించుచు విభేదములను సృష్టించు నా బుద్ధిని దయతో హరింపుము. దుఃఖమునే సుఖమని భావించి అందులోమునిగితేలుచున్నాను. నీవు దుష్టసంహారకుడవు. సృష్టికి మనోహరాలంకారమైనవాడవు. మీ చరణకమలములను సర్వదా శివపార్వతులు సేవింతురు. ఓ రాజాధిరాజా! మీ పాదపద్మములను సేవించునట్టి అనన్యభక్తిని నాకు ప్రసాదింపుడు."

(ఛం॥ 1-11)

**దో- బినయ కీన్హి చతురానన, ప్రేమ పులక అతి గాత ।**
**సోభాసింధు బిలోకత, లోచన నహీఀ అఘాత ॥ 111 ॥**

అత్యంతభక్తితో పులకితగాత్రుడై బ్రహ్మదేవుడు ప్రార్థన చేసెను. అతని నేత్రములు ఆనందాశ్రుపూరితములాయెను. శ్రీరాముని సౌందర్యమును ఎంతగా దర్శించుచున్నను ఆయనకు తనివి తీరుటలేదు. (దో॥ 111)

**చౌ- తెహి అవసర దసరథ తహఀ ఆఏ । తనయ బిలోకి నయన జల ఛాఏ ॥**
**అనుజ సహిత ప్రభు బందన కీన్హా । ఆసిరబాద పితాఀ తబ దీన్హా ॥ 1 ॥**
**తాత సకల తవ పున్య ప్రభాఊ । జీత్యోఀ అజయ నిసాచర రాఊ ॥**
**సుని సుత బచన ప్రీతి అతి బాఢీ । నయన సలిల రోమావలి ఠాఢీ ॥ 2 ॥**

రఘుపతి ప్రథమ ప్రేమ అనుమానా । చితఇ పితహి దీన్హేఉ దృఢ గ్యానా ॥
తాతే ఉమా మోచ్ఛ నహిఁ పాయో । దసరథ భేద భగతి మన లాయో ॥ 3 ॥
సగునోపాసక మోచ్ఛ న లేహీఁ । తిన్హ కహుఁ రామ భగతి నిజ దేహీఁ ॥
బార బార కరి ప్రభుహి ప్రనామా । దసరథ హరషి గఏ సురధామా ॥ 4 ॥

ఆదే సమయమున దశరథుడు అచటికి విచ్చేసెను. పుత్రులను చూడగానే ఆయన కన్నులు చెమర్చెను. రామ లక్ష్మణులిద్దఱును తండ్రికి ప్రణమిల్లిరి. అతడు వారిని ఆశీర్వదించెను. శ్రీరాముడిట్లనెను. "తండ్రీ మీ పుణ్య ప్రభావముననే నేను అజేయుడైన రాక్షసరాజును జయించితిని." పుత్రునివచనములను విని, అతని ప్రేమ ఇనుమడించెను. కన్నులు సజలములాయెను. శరీరము రోమాంచమాయెను. దశరథుని జీవిత కాల ప్రేమను స్మరించుకొని, శ్రీ రఘునాథుడు ఆయనకు తన నిజరూపజ్ఞానమును ప్రసాదించెను. దశరథుడు భేదభక్తియందు తనమనస్సును లగ్నము చేసెను. అందువలన ఓ ఉమా! ఆయనకు కైవల్యము లభింపలేదు. సగుణరూపమును ఉపాసించు భక్తులు మోక్షమును కాంక్షింపరు. వారికి ప్రభువు తన భక్తిని ప్రసాదించును. ప్రభువునకు మాటి మాటికిని నమస్కరించి, దశరథుడు సంతుష్టుడై దేవలోకమునకు వెళ్లెను. (చౌ॥ 1-4)

దో- అనుజ జానకీ సహిత ప్రభు, కుసల కోసలాధీస ।
సోభా దేఖి హరషి మన, అస్తుతి కర సుర ఈస ॥ 112 ॥

సీతాలక్ష్మణసమేతుడైన కోసలాధీశుని పరమశోభలను గాంచి, సురరాజైన ఇంద్రుడు హర్షాతిరేకముతో స్తుతింప సాగెను. (దో॥ 112)

## ఇంద్రుడు శ్రీరాముని స్తుతించుట

ఛం-జయ రామ సోభా ధామ । దాయక ప్రనత బిశ్రామ ॥
ధృత త్రోన బర సర చాప । భుజదండ ప్రబల ప్రతాప ॥ 1 ॥
జయ దూషనారి ఖరారి । మర్దన నిసాచర ధారి ॥
యహ దుష్ట మారేఉ నాథ । భఏ దేవ సకల సనాథ ॥ 2 ॥
జయ హరన ధరనీ భార । మహిమా ఉదార అపార ॥
జయ రావనారి కృపాల । కిఏ జాతుధాన బిహాల ॥ 3 ॥
లంకేస అతి బల గర్బ । కిఏ బస్య సుర గంధర్బ ॥
ముని సిద్ధ నర ఖగ నాగ । హఠి పంథ సబ కేఁ లాగ ॥ 4 ॥
పరద్రోహ రత అతి దుష్ట । పాయో సో ఫలు పాపిష్ట ॥
అబ సునహు దీన దయాల । రాజీవ నయన బిసాల ॥ 5 ॥
మోహి రహా అతి అభిమాన । నహిఁ కోఉ మోహి సమాన ॥
అబ దేఖి ప్రభు పద కంజ । గత మాన ప్రద దుఖ పుంజ ॥ 6 ॥

కౌఉ బ్రహ్మ నిర్గున ధ్యావ । అబ్యక్త జెహి శ్రుతి గావ ॥
మొహి భావ కోసల భూప । శ్రీరామ సగున సరూప ॥ 7 ॥
బైదేహి అనుజ సమేత । మమ హృదయఁ కరహు నికేత ॥
మొహి జానిఅ నిజ దాస । దే భక్తి రమానివాస ॥ 8 ॥

ఓ శోభానిధీ! శరణాగత వత్సలా! శ్రేష్ఠ తూణీర ధనుర్బాణధారీ! ప్రబల ప్రతాప శోభిత భుజ బలశాలీ! శ్రీ రామా! 'నీకు జయము' నీవు ఖరదూషణాదిరాక్షసులను జయించినవాడవు. ప్రభూ! రాక్షసరాజైన రావణునివధించి, దేవతలకు ఆత్మీయుడవుగా నిలిచితివి. పృథ్వీభారమునుబాపువాడా! అపారమహిమాన్వితా! నీకు జయము. ఓ రావణారీ! కృపాళూ! నీవు రాక్షసులను మట్టి కలిపించితివి. నీకు జయము. లంకేశుడు అతిమదోన్మత్తుడై దేవతలను, గంధర్వులను అతని అధీనులనుగా చేసికొనెను. మునులను, సిద్ధులను, మనుష్యులను, పక్షులను, నాగులను నిర్దాక్షిణ్యముగా తఱిమి తఱిమి కొట్టెను. ఆ దుష్టుడు ఇతరులందఱికిని ద్రోహము చేయుటలోనే నిరతుడై యుండెను. అతడు ఆ పాపఫలమును అనుభవించినాడు. ఓ దీనదయాళూ! కమలములవలె విశాలనయనములుగలవాడా! 'నాతో సమానబలసంపదలు గలవాడెవ్వడును లేడని నేను మిగుల గర్వపడుచుంటిని. మీ పాదపద్మ దర్శనముచే ఆ గర్వము తొలగిపోయినది. 'అవ్యక్తము' అని వేదములచే పొగడబడిన నిర్గుణ పరబ్రహ్మను కొందఱు ఉపాసింతురు. కాని శ్రీరామా! నాకు మాత్రము సగుణస్వరూపుడైన శ్రీరాముడే పరమ దైవము. శ్రీ జానకీదేవితో లక్ష్మణస్వామితోగూడి మీరు నా హృదయమున వసింపుడు. ఓ శ్రీనివాసా! నన్ను మీ సేవకునిగా భావించి, మీ భక్తిని అనుగ్రహింపుడు. (ఛం॥ 1-8)

ఛం- దే భక్తి రమానివాస త్రాస హరన సరన సుఖదాయకం ।
సుఖ ధామ రామ నమామి కామ అనేక ఛబి రఘునాయకం ॥
సుర బృంద రంజన ద్వంద భంజన మనుజతను అతులితబలం ।
బ్రహ్మాది సంకర సేబ్య రామ నమామి కరునా కోమలం ॥

ఓ రమాపతీ! శరణాగతులభయమును తొలగించి, వారికి సుఖములను ప్రసాదించువాడా! నీ భక్తిని అనుగ్రహింపుడు. ఓ సుఖనిధానా! కోటిమన్మథసుందరా! రఘుకులశిరోమణీ! రామచంద్రా! నీకు నమస్కారము. దేవతలకు ఆనందమును గూర్చువాడా! జన్మమృత్యుసుఖదుఃఖాదిద్వంద్వములను రూపుమాపువాడా! మాయామానుషవిగ్రహా! అతులితబలశాలీ! బ్రహ్మరుద్రాదులచే సేవింపబడువాడా! కరుణామూర్తీ! కోమలస్వభావా! శ్రీరామా! నీకు ప్రణమిల్లెదను. (ఛం)

దో- అబ కరి కృపా బిలోకి మొహి, ఆయసు దేహు కృపాల ।
కాహ కరౌఁ సుని ప్రియ బచన, బోలే దీనదయాల ॥ 113 ॥

ఓ కృపాళూ! నాపై నీ కరుణా దృష్టిని ప్రసరింపజేసి, నా కర్తవ్యమును దెలుపుడు." ఇంద్రుని ప్రియ వచనములను విని, దీనదయాళువైన ప్రభువు నుడివెను. (దో॥ 113)

చౌ- సును సురపతి కపి భాలు హమారే । పరే భూమి నిసిచరన్హి జె మారే ॥
మమ హిత లాగి తజే ఇన్హ ప్రానా । సకల జిఆఉ సురేస సుజానా ॥ 1 ॥
సును ఖగేస ప్రభు కై యహ బానీ । అతి అగాధ జానహిఁ ముని గ్యానీ ॥
ప్రభు సక త్రిభుఅన మారి జిఆఈఁ । కేవల సక్రహి దీన్హి బడాఈఁ ॥ 2 ॥
సుధా బరషి కపి భాలు జిఆఏ । హరషి ఉఠే సబ ప్రభు పహిఁ ఆఏ ॥
సుధాబృష్టి భై దుహు దల ఊపర । జిఏ భాలు కపి నహిఁ రజనీచర ॥ 3 ॥
రామాకార భఏ తిన్హ కే మన । ముక్త భఏ ఛూటే భవ బంధన ॥
సుర అంసిక సబ కపి అరు రీఛా । జిఏ సకల రఘుపతి కీఁ ఈఛా ॥ 4 ॥
రామ సరిస కో దీన హితకారీ । కీన్హే ముకుత నిసాచర ఝారీ ॥
ఖల మల ధామ కామ రత రావన । గతి పాఈ జో మునిబర పావ న ॥ 5 ॥

"ఓ దేవేంద్రా! వినుము. రాక్షసులచే కొట్టబడిన భల్లూకవానరులందఱును రణభూమిలో బడియున్నారు. వీరు నాకు తోడ్పడుటకై తమ ప్రాణములనొడ్డిరి. వీరిని బ్రతికింపుము. (కాకభుశుండి పలుకుచున్నాడు) గరుడుడా వినుము. ప్రభువచనములు అత్యంత నిగూఢములు, గంభీరములు. జ్ఞానులైన మునులే వాటిని గ్రహింపగలరు. శ్రీరామచంద్ర ప్రభువు ముల్లోకములను సమయింప జేసి, తిరిగి బ్రతికింపగలరు. కాని ఇంద్రుని ఔన్నత్యమును నిలుపదలచెను. ఇంద్రుడు అమృతమును వర్షింపజేసి, భల్లూక వానరులను బ్రతికించెను. అందఱును లేచి, ఆనందముతో ప్రభువు నొద్దకు వచ్చిరి. అమృతవర్షము ఉభయపక్ష బలములపై కురిసినను కేవలము భల్లూక వానరులే జీవించిరి. రాక్షసులు పునరుజ్జీవితులు కాలేదు. ఏలనన చనిపోవునపుడు రాక్షసులమనస్సులలో శ్రీరాముని ఆకారము నిలియుండెను. కావున వారు భవబంధ విముక్తులైరి. కాని భల్లూక వానరులు దైవాంశ సంభూతులు. కనుక రఘుపతికోరికననుసరించి వారు ఉజ్జీవితులైరి. రాక్షసులందఱికిని ముక్తిని ప్రసాదించిన శ్రీరామచంద్రునివంటిదీనజనసంరక్షకులెవరున్నారు? దుష్టుడును, మహాపాపియు, కామాతురుడును ఐనప్పటికిని రావణుడు రామానుగ్రహమున మునీశ్వరులుగూడ పొందజాలని పరమగతిని పొందగలిగెను. (చౌ॥ 1-5)

దో- సుమన బరషి సబ సుర చలే, చఢి చఢి రుచిర బిమాన ॥
దేఖి సుఅవసర ప్రభు పహిఁ, ఆయఉ సంభు సుజాన ॥114(క)॥
పరమ ప్రీతి కర జోరి జుగ, నలిన నయన భరి బారి ।
పులకిత తన గదగద గిరాఁ, బినయ కరత త్రిపురారి ॥114(ఖ) ॥

దేవతలు పుష్పవృష్టిని గురిపించి, తమ విమానములపై వెళ్లి పోయిరి. ఇదియే తగిన సమయమని భావించి, విజ్ఞానియైన శివుడు శ్రీరాముని కడకు ఏతెంచెను. అత్యంత భక్తితో చేతులు మోడ్చి, తన నేత్రకమలములనుండి ఆనందాశ్రువులు వెల్లుబుకుచుండగా పులకిత గాత్రుడై, గద్గద కంఠముతో త్రిపురారియైన శివుడు విన్నపము చేయసాగెను. (దో॥ 114. క,ఖ)

## పరమశివుని విన్నపము

ఛం- మామభిరక్షయ రఘుకుల నాయక । ధృత బర చాప రుచిర కర సాయక ॥
మోహ మహా ఘన పటల ప్రభంజన । సంసయ బిపిన అనల సుర రంజన ॥ 1 ॥
అగున సగున గున మందిర సుందర । భ్రమ తమ ప్రబల ప్రతాప దివాకర ॥
కామ క్రోధ మద గజ పంచానన । బసహు నిరంతర జన మన కానన ॥ 2 ॥
బిషయ మనోరథ పుంజ కంజ బన । ప్రబల తుషార ఉదార పార మన ॥
భవ బారిధి మందర పరమం దర । బారయ తారయ సంసృతి దుస్తర ॥ 3 ॥
స్యామ గాత రాజీవ బిలోచన । దీన బంధు ప్రనతారతి మోచన ॥
అనుజ జానకీ సహిత నిరంతర । బసహు రామ నృప మమ ఉర అంతర ॥ 4 ॥
ముని రంజన మహి మండల మండన । తులసిదాస ప్రభు త్రాస బిఖండన ॥ 5 ॥

"ఓ రఘువంశశిరోమణీ! మీ దివ్యహస్తములతో ధనుర్బాణములను ధరించి, నన్ను రక్షింపుడు. మోహమనెడి మేఘ సమూహములకు మీరు ప్రభంజనస్వరూపులు. సంశయ వనములకు మీరు అగ్నికల్పులు. దేవతలకు ఆనందప్రదాతలు. మీరు నిర్గుణులు, సగుణులు, దివ్యగుణ సంపన్నులు. పరమసుందరులు భ్రమయనెడి అంధకారమునకు ప్రచండభానుసదృశులు. కామక్రోధమదములనెడి గజయూథములను సంహరించుటలో సింహసమానులు. ఈ సేవకునిమనోవనమున నిత్యము విహరింపుడు. విషయవాసనాసమూహములనెడి కమలవనమునకు మీరు మంచువంటివారు. ఉదారులు, మనస్సునకు అగోచరులు. భవసాగరమును మథించుటయందు మందరాచలసదృశులు. మాభయములను తొలగించి, దుస్తరసంసారసాగరమును దాటింపుడు. ఓ శ్యామసుందరా! కమలదళవిశాలనేత్రా! దీనబంధూ! ప్రణతార్తిహరా! శ్రీరామచంద్రా! సహోదరుడైన లక్ష్మణునితో, జానకీదేవితోగూడి నాహృదయమున వసింపుడు. మీరు మునీశ్వరులకుఆనందదాయకులు, పృథ్వికే అలంకారమైనవారు. భయనివారకులు. తులసీదాసునకు ప్రభువులు. (ఛం॥ 1-5)

దో- నాథ జబహిఁ కోసలపురీఁ, హోఇహి తిలక తుమ్హార ।
కృపాసింధు మైఁ ఆఉబ, దేఖన చరిత ఉదార ॥ 115 ॥

ఓ ప్రభూ! అయోధ్యా నగరమునందు మీ పట్టాభిషేకసమయమున నేనచటికి వచ్చి మీ మహోదార లీలా విలాసములను గాంచెదను." (దో॥ 115)

చౌ- కరి బినతీ జబ సంభు సిధాఏ । తబ ప్రభు నికట బిభీషను ఆఏ ॥
నాఇ చరన సిరు కహ మృదు బానీ । బినయ సునహు ప్రభు సారఁగపానీ ॥ 1 ॥
సకుల సదల ప్రభు రావన మార్యో । పావన జస త్రిభువన బిస్తార్యో ॥
దీన మలీన హీన మతి జాతీ । మో పర కృపా కీన్హి బహు భాఁతీ ॥ 2 ॥
అబ జన గృహ పునీత ప్రభు కీజే । మజ్జను కరిఅ సమర శ్రమ ఛీజే ॥
దేఖి కోస మందిర సంపదా । దేహు కృపాల కపిన్హ కహుఁ ముదా ॥ 3 ॥

సబ బిధి నాథ మోహి అపనాఇఅ । పుని మొహి సహిత అవధపుర జాఇఅ ॥
సునత బచన మృదు దీనదయాలా । సజల భఏ ద్వౌ నయన బిసాలా ॥ 4 ॥

ఇట్లు ప్రార్థించి, పరమశివుడు కైలాసమునకేగెను. పిమ్మట విభీషణుడు ప్రభువుచెంతకు వచ్చి, పాదములకు ప్రణమిల్లి, ఇట్లు మృదువచనములు పలికెను. "ఓ శార్ఙ్గపాణీ! నా వినతిని ఆలకింపుడు. మీరు రావణుని, అతని పరివారములను సంహరించితిరి. మీ విమలయశస్సును ముల్లోకములలో విస్తరింపజేసితిరి. నావంటిదీనుని, పాపిని, మంద బుద్ధిని రాక్షసుని అనేకవిధముల కనికరించితిరి. ప్రభూ! ఇప్పుడు ఈ సేవకుని గృహమునకు ఒక్కసారి దయచేసి, పావనమొనర్పుడు. స్నానముచేసి, సమరశ్రమను దీర్చుకొనుడు. కృపాళూ! ఈకోశాగారమును, ధనమును, భవనమును, సంపదలనుజూచి, మీ యిష్టప్రకారము వాటిని భల్లూక వానరులకు కానుకలుగా ఇచ్చివేయుడు. స్వామీ! నన్ను మీవానిగా పరిగణించి, మీతో పాటు అయోధ్యానగరమునకు కొనిపొండు" విభీషణుని వినమ్రవచనములను విని, దీనదయాళువైన ప్రభువిశాలనేత్రములు ప్రేమాశ్రువులతో నిండెను. (చౌ॥ 1-4)

దో- తోర కోస గృహ మోర సబ, సత్య బచన సును భ్రాత ।
భరత దసా సుమిరత మొహి, నిమిష కల్ప సమ జాత ॥116 (క) ॥
తాపస బేష గాత కృస, జపత నిరంతర మోహి ।
దేఖౌఁ బేగి సో జతను కరు, సఖా నిహోరఉఁ తోహి ॥116 (ఖ) ॥
బీతేఁ అవధి జాఉఁ జౌఁ, జిఅత న పావఉఁ బీర ।
సుమిరత అనుజ ప్రీతి ప్రభు, పుని పుని పులక సరీర ॥116(గ) ॥
కరేహు కల్ప భరి రాజు తుమ్హ, మొహి సుమిరేహు మన మాహిఁ ।
పుని మమ ధామ పాఇహహు, జహాఁ సంత సబ జాహిఁ ॥116(ఘ)॥

శ్రీరాముడు నుడివెను. "సోదరా! వినుము నీసంపద, భవనములు, మొదలగునవి అన్నియును నావియే. ఇది నిజము. కాని భరతునిస్థితి నాతలంపునకు వచ్చినప్పుడెల్ల ప్రతిక్షణము నాకు ఒక యుగముగా గడచుచున్నది. తాపసివేషములో కృశించినశరీరముతో అతడు అనుక్షణము నా నామమునే జపించుచున్నాడు. సఖా! నేను అతనిని త్వరగా చూచెడి ఉపాయమును ఆలోచింపుము. మిత్రమా! ఇదియే నా ప్రార్థన. ఈపదునాలుగు సంవత్సరముల అవధి ముగిసినపిదప వెళ్లినచో నా సోదరుని సజీవునిగా చూడలేను." తనతమ్ముడైన భరతుని ప్రేమను గూర్చి తలంచినకొలదియు ప్రభువు శరీరము పదేపదే రోమాంచిత మాయెను. శ్రీరాముడు మరల పలికెను. "విభీషణా! నీవు ఈ కల్పాంతమువఱకును నా నామమును స్మరించుచు రాజ్యపాలన చేయుచుండుము. పిమ్మట సజ్జనులు మరణానంతరము పొందెడి పరమధామమును చేరెదవు". (దో॥ 116 క,ఖ,గ,ఘ)

## పుష్పకముపై శ్రీరాముడు సపరివారముగా అయోధ్యకు బయలుదేరుట

చౌ- సునత బిభీషన బచన రామ కే । హరషి గహే పద కృపాధామ కే ॥
బానర భాలు సకల హరషానే । గహి ప్రభు పద గున బిమల బఖానే ॥ 1 ॥

బహురి బిభీషన భవన సిధాయో । మని గన బసన బిమాన భరాయో ॥
లై పుష్పక ప్రభు ఆగేఁ రాఖా । హఁసి కరి కృపాసింధు తబ భాషా ॥ 2 ॥
చఢి బిమాన సును సఖా బిభీషన । గగన జాఇ బరషహు పట భూషన ॥
నభ పర జాఇ బిభీషన తబహీ । బరషి దిఏ మని అంబర సబహీ ॥ 3 ॥
జోఇ జోఇ మన భావఇ సోఇ లేహీఁ । మని ముఖ మేలి డారి కపి దేహీఁ ॥
హఁసే రాము శ్రీ అనుజ సమేతా । పరమ కౌతుకీ కృపా నికేతా ॥ 4 ॥

శ్రీరామచంద్రుని పలుకులు వినగానే విభీషణుడు ప్రసన్నచిత్తుడై, దయానిధియైన శ్రీరాముని పాదములకు ప్రణమిల్లెను. భల్లూకవానరులందఱును సంతోషముతో ప్రభుపాదములను పట్టుకొని, ఆయననిర్మలగుణములను కీర్తించిరి. తదనంతరము విభీషణుడు తన భవనముచేరి, మణులతో విలువైన వస్త్రములతో విమానమును నింపెను. పిదప ఆ పుష్పక విమానమును తెచ్చి ప్రభువు ముందుంచెను. అపుడు దయాసింధువైన శ్రీరాముడు నవ్వుచు పలికెను. "మిత్రమా! విభీషణా! విమానముపైనెక్కి, ఆకాశమునుండి వస్త్రములను, భూషణములను వర్షించుము." వెంటనే విభీషణుడు ఆకాశమునుండి మణులను, వస్త్రములను వెదజల్లెను. వానరులు తమకు ఇష్టమైన వాటిని తీసికొనిరి. మణులను తినదగిన పదార్థములుగా భావించి, వాటిని తమ నోటనుంచుకొనిరి. నిజమును గ్రహించి, ఉమిసిరి. ఈ లీలావినోదములనుజూచి, సీతారామ లక్ష్మణులు ఆనందించిరి. (చౌ॥ 1-4)

దో- ముని జెహి ధ్యాన న పావహిఁ, నేతి నేతి కహ బేద ।
కృపాసింధు సోఇ కపిన్హ సన, కరత అనేక బినోద ॥117॥ (క) ॥
ఉమా జోగ జప దాన తప, నానా మఖ బ్రత నేమ ।
రామ కృపా నహిఁ కరహిఁ తసి, జసి నిష్కేవల ప్రేమ ॥117 (ఖ)॥

మునీశ్వరులు తమ ధ్యానములద్వారాకూడా శ్రీరాముని దర్శింపజాలరు. వేదములు ఆయనను 'నేతి నేతి' అని వర్ణించినవి. అట్టి కృపానిధియైన పరమాత్మ వానరులతో పలువిధముల వినోదములను గావించెను. (శివుడు పలుకుచున్నాడు) ఉమా! నిర్మలభక్తితో లభించు శ్రీరాముని కృప నానావిధములైన యోగజపదాన తపోయజ్ఞవ్రత నియమములచేతను లభింపదు. (దో॥ 117 క,ఖ)

చౌ- భాలు కపిన్హ పట భూషన పాఏ । పహిరి పహిరి రఘుపతి పహిఁ ఆఏ ॥
నానా జినస దేఖి సబ కీసా । పుని పుని హఁసత కోసలాధీసా ॥ 1 ॥
చితఇ సబన్హి పర కీన్హి దాయా । బోలే మృదుల బచన రఘురాయా ॥
తుమ్హరేఁ బల మైఁ రావను మార్యో । తిలక బిభీషన కహఁ పుని సార్యో ॥ 2 ॥
నిజ నిజ గృహ అబ తుమ్హ సబ జాహూ । సుమిరెహు మోహి డరపహు జని కాహూ॥
సునత బచన ప్రేమాకుల బానర । జోరి పాని బోలే సబ సాదర ॥ 3 ॥
ప్రభు జోఇ కహహు తుమ్హహి సబ సోహా । హమరేఁ హోత బచన సుని మోహా ॥
దీన జాని కపి కిఏ సనాథా । తుమ్హ త్రైలోక ఈస రఘునాథా ॥ 4 ॥

సుని ప్రభు బచన లాజ హమ మరహీఁ । మసక కహాఁ ఖగపతి హిత కరహీఁ ॥
దేఖి రాము రుఖ బానర రీఛా । ప్రేమ మగన నహిఁ గృహ కై ఈంఛా ॥ 5 ॥

భల్లూకవానరులు వస్త్రములను, ఆభరణములను దీసికొని, వాటిని ధరించి, శ్రీరఘునాథునికడకు వచ్చిరి. అనేకజాతుల వానరులను జూచి, కోసలపతి శ్రీరాముడు మాటిమాటికి నవ్వుకొనెను. శ్రీరఘునాథుడు తనకృపాదృష్టిని అందఱిపై ప్రసరింపజేసి, మృదుమధురస్వరముతో ఇట్లనెను. "సోదరులారా! మీ బల పరాక్రమములవలననే నేను రావణుని వధించి, విభీషణుని రాజును గావించితిని. ఇప్పుడు మీరు మీ గృహములకు చేరుడు. అక్కడనన్ను స్మరింపుడు. ఎవ్వరికిని భయపడవలదు." ఈ మాటలను వినినంతనే వానరులు ప్రేమ విహ్వలురై, చేతులు జోడించి, సాదరముగా పలికిరి. "ప్రభూ! మీరేమిచెప్పినను అది మీకే తగును. కాని మీ మాటలను విని, మేము మోహవశులమైతిమి. శ్రీరఘునాథా! మీరు ముల్లోకములకును ప్రభువులు, వానరులమైన మమ్ము దీనులనుగా ఎఱింగి, మాకు మీ అండదండలను సమకూర్చితిరి. ప్రభువచనములను విని, మేము సిగ్గుపడుచున్నాము. ఎప్పుడైనను దోమలు గరుడునకు సహాయపడగలవా?" శ్రీరాముని ముఖ కమలమును జూచి భల్లూక వానరులు ప్రేమవిహ్వలురైరి. తమ ఇండ్లకు వెళ్లుటకు వారికి ఏ మాత్రము ఇష్టములేదు. (చౌ॥ 1-5)

దో- ప్రభు ప్రేరిత కపి భాలు సబ, రామ రూప ఉర రాఖి ।
హరష బిషాద సహిత చలే, బినయ బిబిధ బిధి భాషి ॥118(క)॥
కపిపతి నీల రీఛపతి, అంగద నల హనుమాన ।
సహిత బిభీషన అపర జే, జూథప కపి బలవాన ॥118(ఖ)॥
కహి న సకహిఁ కఛు ప్రేమ బస, భరి భరి లోచన బారి ।
సన్ముఖ చితవహిఁ రామ తన, నయన నిమేష నివారి ॥118(గ)॥

కాని ప్రభునాజ్ఞను శిరసావహించి, భల్లూక వానరులు శ్రీరాముని రూపమును తమ హృదయములలో నిలుపుకొని, అనేకవిధముల ప్రార్థించి, హర్షవిషాదములతో తమతమ నివాసములకు జనిరి. వానరరాజు సుగ్రీవుడు, నలుడు, నీలుడు, భల్లూకరాజు జాంబవంతుడు, అంగదుడు, హనుమంతుడు, విభీషణుడు, మహాబలశాలురైన ఇతరసేనాపతులు ఏమియు చెప్పలేక మిన్నకుండిరి. ప్రేమ వశమున కన్నులలో నీరు నిండగా ఱెప్పలార్పక శ్రీరాముని తదేక దృష్టితో చూచుచుండిరి. (దో॥ 118 క,ఖ,గ)

చౌ- అతిసయ ప్రీతి దేఖి రఘురాఈ । లీన్హే సకల బిమాన చఢాఈ ॥
మన మహుఁ బిప్ర చరన సిరు నాయో । ఉత్తర దిసిహి బిమాన చలాయో ॥ 1 ॥
చలత బిమాను కొలాహల హోఈ । జయ రఘుబీర కహఇ సబు కోఈ ॥
సింహాసన అతి ఉచ్చ మనోహర । శ్రీ సమేత ప్రభు బైఠే తా పర ॥ 2 ॥
రాజత రాము సహిత భామినీ । మేరు సృంగ జను ఘన దామినీ ॥
రుచిర బిమాను చలెఉ అతి ఆతుర । కీన్హీ సుమన బృష్టి హరషే సుర ॥ 3 ॥
పరమ సుఖద చలి త్రిబిధ బయారీ । సాగర సర సరి నిర్మల బారీ ॥
సగున హోహిఁ సుందర చహుఁ పాసా । మన ప్రసన్న నిర్మల నభ ఆసా ॥ 4 ॥

కహ రఘుబీర దేఖు రన సీతా । లఛిమన ఇహాఁ హత్యో ఇఁద్రజీతా ॥
హనూమాన అంగద కే మారే । రన మహి పరే నిసాచర భారే ॥ 5 ॥
కుంభకరన రావన ద్వౌ భాఈ । ఇహాఁ హతే సుర ముని దుఖదాఈ ॥ 6 ॥

శ్రీ రఘునాథుడు వారిగాఢప్రేమను జూచి, వారందరిని విమానములో కూర్చుండుడనెను. సీతాలక్ష్మణులతో తానును ఆ విమానమున ఆసీనుడయ్యెను. తదనంతరము మనస్సులోనే బ్రాహ్మణులకు నమస్కరించి, ఉత్తరదిశగా వెళ్లుటకు విమానమునకు ఆజ్ఞనిచ్చెను. పుష్పకవిమానము మిక్కిలి కోలాహలముతో చూడముచ్చట గొల్పుచు బయలుదేఱగానే అందఱును 'శ్రీరఘువీరునకు జయము, జయము' అని నినాదములను గావించిరి. విమానములో ఒక ఎత్తైన మనోహరసింహాసనముపై సీతాదేవితోగూడి, శ్రీరామచంద్రుడు విరాజిల్లుచుండెను. పత్నీసమేతుడైన శ్రీరాముడు సుమేరుపర్వతముపై విద్యుల్లతతో గూడిన మేఘమువలె శోభిల్లెను. ఆ సుందరవిమానము అతివేగముగా వెళ్లుచుండెను. దేవతలు ప్రసన్నులై పూలను వర్షించిరి. శీతలమందసుగంధపవనములు ఆహ్లాదకరముగా వీవసాగెను. సముద్రనదీతటాకముల జలములు నిర్మలములాయెను. నలుదెసల శుభశకునములు పొడసూపెను. అందఱి మనస్సులు ప్రసన్నములాయెను. ఆకాశము, దిక్కులు స్వచ్ఛములై విలసిల్లుచుండెను. శ్రీరఘునాథుడు ఇట్లనెను. "ఓ సీతా! ఈరణభూమిని చూడుము. ఇంద్రుని జయించిన మేఘనాదుడు ఇచ్చట లక్ష్మణునిచే సంహరింపబడెను. హనుమంతునిచే, అంగదునిచే హతులైన నిశాచరవీరులు ఈ యుద్ధభూమిలో నేలపాలైరి. దేవతలను, మునులను బాధించు రావణ కుంభకర్ణులు ఇచటనే హతులైరి. (చౌ॥ 1-6)

దో- ఇహాఁ సేతు బాఁధ్యో అరు, థాపేఉఁ సివ సుఖ ధామ ।
సీతా సహిత కృపానిధి, సంభుహి కీన్హ ప్రనామ ॥119 (క)॥
జహఁ జహఁ కృపాసింధు బన, కీన్హ బాస బిశ్రామ ।
సకల దెఖాఏ జానకిహి, కహే సబన్హి కే నామ ॥119 (ఖ)॥

"నేనిచట వారధిని నిర్మించితిని. సుఖధాముడైన పరమేశ్వరుని ఇచటనే ప్రతిష్ఠించితిని." ఇట్లు పలికి కృపానిధి శ్రీరాముడు సీతాసమేతుడై మహాదేవుడైన శ్రీరామేశ్వరునకు ప్రణమిల్లెను. కృపానిధియైన శ్రీరాముడు వనములలో తాను నివసించిన ప్రదేశములను, విశ్రమించిన స్థలములను సీతాదేవికి చూపించుచు, వాటిపేర్లను గూడ తెలిపెను. (దో॥ 119 క,ఖ)

చౌ- తురత బిమాన తహాఁ చలి ఆవా । దండక బన జహఁ పరమ సుహావా ॥
కుంభజాది మునినాయక నానా । గఏ రాము సబ కేఁ అస్థానా ॥ 1 ॥
సకల రిషిన్హ సన పాఇ అసీసా । చిత్రకూట ఆఏ జగదీసా ॥
తహఁ కరి మునిన్హ కేర సంతోషా । చలా బిమాను తహాఁ తే చోఖా ॥ 2 ॥
బహురి రామ జానకిహి దెఖాఈ । జమునా కలి మల హరని సుహాఈ ॥
పుని దేఖీ సురసరీ పునీతా । రామ కహా ప్రనామ కరు సీతా ॥ 3 ॥

తీరథపతి పుని దేఖు ప్రయాగా । నిరఖత జన్మ కోటి అఘ భాగా ॥
దేఖు పరమ పావని పుని బేనీ । హరని సోక హరి లోక నిసేనీ ॥ 4 ॥
పుని దేఖు అవధపురీ అతి పావని । త్రిబిధ తాప భవ రోగ నసావని ॥ 5 ॥

పుష్పకవిమానము త్వరగా అగస్త్యాదిమునులు నివసించు దండకారణ్యమునకు జేరెను. శ్రీరాముడు ఆయాస్థానాములయందు ఋషీశ్వరుల ఆశీర్వాదములను స్వీకరించి, చిత్రకూటమును జేరెను. అచట మునీశ్వరులను ప్రసన్నులనుగావించెను. పిమ్మట, విమానమును వేగముగా ముందునకు పోనిచ్చెను. అనంతరము శ్రీ సీతారాములు కలియుగ పాపములను కడిగివేయు యమునానదిని దర్శించిరి. తదుపరి పవిత్రగంగానదిని దర్శించి, శ్రీరాముడు "సీతా! ఈమెకు నమస్కరింపుము దర్శనమాత్రమున అనేక జన్మలసంచితపాపములనుగూడ ప్రక్షాళనచేయు తీర్థరాజమైన ప్రయాగను తిలకింపుము. శోకములను హరించునదియు, శ్రీహరిపదమునకు సోపానమైనదియుఐన త్రివేణీసంగమమును దర్శింపుము. పిమ్మట తాపత్రయములను, భవరోగములను రూపు మాపునట్టి పవిత్ర-అయోధ్యానగరము అదిగో! కనబడుచున్నది, తిలకింపుము. (చౌ॥ 1-5)

దో- సీతా సహిత అవధ కహుఁ, కీన్హ కృపాల ప్రనామ ।
సజల నయన తన పులకిత, పుని పుని హరషిత రామ ॥120(క)॥
పుని ప్రభు ఆఇ త్రిబేనీఁ, హరషిత మజ్జను కీన్హ ।
కపిన్హ సహిత బిప్రన్హ కహుఁ, దాన బిబిధ బిధి దీన్హ ॥120 (ఖ)॥

కృపాళువైన శ్రీరామచంద్రుడును, సీతాదేవియు అయోధ్యానగరమునకు నమస్కరించిరి. వారి నేత్రములు ఆనందాశ్రుపూర్ణములయ్యెను. శరీరములు పులకితములయ్యెను. వారు పదేపదే మిగుల హర్షోల్లాసములను ప్రకటించిరి. త్రివేణీసంగమమున ప్రభువు వానరములతోసహా స్నానములనాచరించెను. బ్రాహ్మణులకు అనేకదానములను ఒసఁగెను. (దో॥ 120. క,ఖ)

చౌ- ప్రభు హనుమంతహి కహా బుఝాఈ । ధరి బటు రూప అవధపుర జాఈ ॥
భరతహి కుసల హమారి సునాఏహు । సమాచార లై తుమ్హ చలి ఆఏహు ॥ 1 ॥
తురత పవనసుత గవనత భయఊ । తబ ప్రభు భరద్వాజ పహిఁ గయఊ ॥
నానా బిధి ముని పూజా కీన్హీ । అస్తుతి కరి పుని ఆసిష దీన్హీ ॥ 2 ॥
ముని పద బంది జుగల కర జోరీ । చఢ़ి బిమాన ప్రభు చలే బహోరీ ॥
ఇహాఁ నిషాద సునా ప్రభు ఆఏ । నావ నావ కహఁ లోగ బొలాఏ ॥ 3 ॥
సురసరి నాఘి జాన తబ ఆయో । ఉతరేఉ తట ప్రభు ఆయసు పాయో ॥
తబ సీతాఁ పూజీ సురసరీ । బహు ప్రకార పుని చరనన్హి పరీ ॥ 4 ॥
దీన్హి అసీస హరషి మన గంగా । సుందరి తవ అహివాత అభంగా ॥
సునత గుహా ధాయఉ ప్రేమాకుల । ఆయఉ నికట పరమ సుఖ సంకుల ॥ 5 ॥
ప్రభుహి సహిత బిలోకి బైదేహీ । పరేఉ అవని తన సుధి నహిఁ తేహీ ॥
ప్రీతి పరమ బిలోకి రఘురాఈ । హరషి ఉఠాఇ లియో ఉర లాఈ ॥ 6 ॥

శ్రీరామచంద్రుడు హనుమంతుని ఇట్లాదేశించెను. "నీవు బ్రహ్మచారివేషమున అయోధ్యానగరమునకు వెళ్లుము. అచ్చట భరతునకు మా క్షేమములను దెలిపి, అతని క్షేమసమాచారములను తెలిసికొనిరమ్ము." వెంటనే పవనసుతుడు అయోధ్యకు బయలుదేరెను. ప్రభువు భరద్వాజమహర్షికడకు వెళ్లెను. మహర్షి నిండుమనస్సుతో ప్రభువును అనేకవిధముల పూజించి, స్తుతించి, ఆశీర్వదించెను. శ్రీరామచంద్రప్రభువు భరద్వాజమునికి పాదాభివందనములనాచరించి, ఆయనను వీడ్కొని విమానమునెక్కి, ముందునకు సాగెను. ఇక్కడ నిషాదరాజు ప్రభుని ఆగమన వార్తనువిని " నావ ఎక్కడ? నావ ఎక్కడ?" అనియనుచు తన వారిని పిలిచెను. ఇంతలో విమానము గంగానదిని దాటి ఆ నదీతీరమున దిగెను. సీతాదేవి గంగాదేవిని అనేకవిధముల పూజించి, ఆమె పాదములపై వ్రాలెను. ప్రసన్నమనస్కురాలైన గంగానది "ఓ సుందరీ! నీ సౌభాగ్యము శాశ్వతమగుగాక" అని ఆశీస్సులను పలికెను. నిషాదరాజైన గుహుడు భగవంతుడు నదీతీరమునకు చేరినాడని విని, ప్రేమపరవశుడై, పరుగెత్తుకొని వచ్చి, ప్రభువును సమీపించి, పరమానందభరితుడయ్యెను. జానకీసమేతుడైన శ్రీరామునిజూచి గుహుడు ఆనందాతిరేకముతో భూమిపై సాగిలపడెను. అతనికి శరీరముపై ధ్యాసయేలేదు. శ్రీరఘునాథుడు అతనిప్రేమపారవశ్యమునుగాంచి లేవనెత్తి, ప్రసన్నత్వముతో హృదయమునకు హత్తుకొనెను. (చౌ॥ 1-6)

ఛం- లియొ హృదయఀ లాఇ కృపా నిధాన సుజాన రాయఀ రమాపతీ ।
బైఠారి పరమ సమీప బూఝీ కుసల సో కర బీనతీ ॥
అబ కుసల పద పంకజ బిలోకి బిరంచి సంకర సేబ్య జే ।
సుఖ ధామ పూరనకామ రామ నమామి రామ నమామి తే ॥ 1 ॥
సబ భాఀతి అధమ నిషాద సో హరి భరత జ్యోఀ ఉర లాఇయో ।
మతిమంద తులసీదాస సో ప్రభు మోహ బస బిసరాఇయో ॥
యహ రావనారి చరిత్ర పావన రామ పద రతిప్రద సదా ।
కామాదిహర బిగ్యానకర సుర సిద్ధ ముని గావహిఀ ముదా ॥ 2 ॥

విజ్ఞాన శిరోమణియు, లక్ష్మీపతియు, కృపానిధానమునైన శ్రీరామచంద్రుడు నిషాదరాజును అక్కునజేర్చుకొని, తన ప్రక్కనే కూర్చుండ బెట్టుకొని, కుశల సమాచారములను అడిగెను. గుహుడు ఇట్లు విన్నవించెను. " ఓ ప్రభూ! బ్రహ్మ పరమేశ్వరులచే సేవింపబడు మీచరణ కమలములదర్శనముచే నేనిప్పుడు కుశలిని. ఓ సుఖధామా! పూర్ణకామా! శ్రీరామా! మీకు నమస్కారములు". అనేక విధముల అతిసామాన్యుడైన నిషాదుని శ్రీరామచంద్రప్రభువు తనసోదరుడైన భరతునివలె అక్కునజేర్చుకొనెను. తులసీదాసు చెప్పుచున్నాడు. "మందబుద్ధినైన నేను మోహవశమున అట్టి కరుణామూర్తియైన స్వామిని మఱచితిని. రావణశత్రువైన శ్రీరాముని యొక్క ఈ పవిత్రచరిత్రము సర్వదా శ్రీరాముని చరణములపై అనురాగమును కల్గించును. ఇది కామాది- అంతశ్శత్రువులను నాశనమొనరించును. భగవత్స్వరూపజ్ఞానమును గూర్చును. దేవతలు, సిద్ధులు, మునులు, దీనిని ఆనందముతో గానము చేయుదురు. (ఛం॥ 1,2)

దో- సమర బిజయ రఘుబీర కే, చరిత జె సునహిఀ సుజాన ।
బిజయ బిబేక బిభూతి నిత, తిన్హహి దేహిఀ భగవాన ॥121(క)॥

యహ కలికాల మలాయతన, మన కరి దేఖు బిచార ।
శ్రీరఘునాథ నామ తజి, నాహిన ఆన అధార ॥121(ఖ)॥

శ్రీరఘువీరుని సమరవిజయగాథను వినునట్టి సజ్జనులకును, భగవంతుడు శాశ్వతముగా సంపదలను, జయమును, వివేకమును అనుగ్రహించును. ఓ మనసా! ఆలోచింపుము. ఈ కలియుగము. పాపముల పుట్ట. ఇందు శ్రీ రఘునాథుని నామస్మరణము తప్ప జీవులకు వేఱొక తరణోపాయమేలేదు. (దో॥ 121 క.ఖ)

మాసపారాయణము-ఇరువది ఏడవ విరామము

ఇతి శ్రీమద్రామచరితమానసే సకలకలికలుషవిధ్వంసనే
షష్ఠః సోపానః సమాప్తః

కలియుగపాపములను నశింపజేయు శ్రీరామచరితమానసమునందలి లంకాకాండము
అను షష్ఠ సోపానము సమాప్తము

(లంకాకాండము సమాప్తము)



నాస్తి వేదసమం శాస్త్రం, నాస్తి శాంతిమయం సుఖమ్ ।
నాస్తి శాంతిపరం జ్యోతిః నాస్తి రామాయణాత్ పరమ్ ॥
నాస్తి క్షమా సమం సారం, నాస్తి కీర్తి సమం ధనమ్ ।
నాస్తి జ్ఞానసమోలాభో నాస్తి రామాయణాత్ పరమ్ ॥



శ్రీ గణేశాయ నమః
శ్రీజానకీవల్లభో విజయతే

# శ్రీరామచరితమానసము

## సప్తమ సోపానము

# ఉత్తరకాండము

### భగవన్నుతి

శ్లో॥ కేకీకంఠాభనీలం సురవరవిలసద్విప్రపాదాబ్జచిహ్నం
శోభాఢ్యం పీతవస్త్రం సరసిజనయనం సర్వదా సుప్రసన్నమ్ ।
పాణౌ నారాచచాపం కపినికరయుతం బంధునా సేవ్యమానం
నౌమీడ్యం జానకీశం రఘువరమనిశం పుష్పకారూఢరామమ్ ॥ 1 ॥

పుష్పక విమానమును అధిరోహించి యున్నవాడును, రఘువంశశిరోమణియు, జానకీనాథుడునగు శ్రీరామచంద్రప్రభువునకు నిరంతరము నమస్కరించుచుందును. ఆ మహితాత్ముడు మయూరకంఠశోభాసదృశమైన హరితనీలవర్ణుడు, దేవతలలో శ్రేష్ఠుడు, బ్రాహ్మణోత్తముడైన భృగుమహర్షి యొక్క పాదపద్మముల చిహ్నములు హృదయమున నిలుపుకొన్నవాడు, శోభాసంపన్నుడు, పీతాంబరధారి, కమలనయనుడు, చేతులయందు ధనుర్బాణములను ధరించియున్నవాడు, వానరసమూహములతో ఒప్పుచున్నవాడు, సహోదరుడైన లక్ష్మణస్వామిచే సేవింపబడుచున్నవాడు, స్తుతింపదగినవాడు. అంతేగాదు అతడు సర్వకాలములయందును నిరంతరము చిఱునవ్వులను చిందించుచు ప్రసన్నుడై యుండెడి జగత్ప్రభువు. (1)

శ్లో॥ కోసలేంద్రపదకంజమంజులౌ కోమలావజమహేశవందితౌ ।
జానకీకరసరోజలాలితౌ చింతకస్య మనభృంగసంగినౌ ॥ 2 ॥
కుందఇందుదరగౌరసుందరం అంబికాపతిమభీష్టసిద్ధిదమ్ ।
కారుణీకకలకంజలోచనం నౌమి శంకరమనంగమోచనమ్ ॥ 3 ॥

కోసలేంద్రుడైన శ్రీరామచంద్రప్రభు పాదపద్మములు మిక్కిలి మనోహరములు, అతి సుకుమారములు, బ్రహ్మ పరమశివులచే సర్వదా సేవింపబడుచుండునవి. జానకీదేవి యొక్క సుతిమెత్తనికరకమలములచే నిరంతరము లాలింపబడుచుండునవి. స్మరించువారిమనస్సులనెడి తుమ్మెదలకు ఆశ్రయములైనవి. మహామహిమోపేతములైన ఆ ప్రభుచరణకమలములు నా మనోభృంగమునకును ఆశ్రయమిచ్చుగాక. (2)

కామ వికారములనుండి ముక్తిని ప్రసాదించు (అరిషడ్వర్గములను పారద్రోలి ముక్తిని అనుగ్రహించు) నట్టి ఆ పరమశివునకు నమస్కరించుచున్నాను. అతడు మల్లెపూవులు, చంద్రుడు, శంఖమువలె శ్వేతవర్ణ శోభితుడు, జగజ్జనని పార్వతీదేవికి స్వామి, భక్తుల కోరికలను సిద్ధింప జేయువాడు. మనోహరమైన కమలనయనశోభితుడు, అంతేగాదు దీనులను, దుఃఖితులను కనికరముతో కాపాడు కారుణ్యమూర్తి. (3)

## అయోధ్యలో శ్రీరామ భరత సమాగమము

దో- రహా ఏక దిన అవధి కర, అతి ఆరత పుర లోగ ।
జహఁ తహఁ సోచహిఁ నారి నర, కృస తన రామ బియోగ ॥
సగున హోహిఁ సుందర సకల, మన ప్రసన్న సబ కేర ।
ప్రభు ఆగవన జనావ జను, నగర రమ్య చహుఁ ఫేర ॥
కౌసల్యాది మాతు సబ, మన అనంద అస హోఇ ।
ఆయఉ ప్రభు శ్రీ అనుజజుత, కహన చహత అబ కోఇ ॥
భరత నయన భుజ దచ్ఛిన, ఫరకత బారహిఁ బార ।
జాని సగున మన హరష అతి, లాగే కరన బిచార ॥

శ్రీరామచంద్రుడు అయోధ్యకు తిరిగి వచ్చుటకు ఒక్కదినము మాత్రమే వ్యవధియుండెను. కావున నగరప్రజలు ఆ ప్రభుదర్శనమునకై ఆతురతతో ఎదురుచూచుచుండిరి. శ్రీరాముని వియోగముచే స్త్రీపురుషులందఱును వసివాడి యుండిరి. "శ్రీరాముడింకను ఏల తిరిగి రాలేదు?" అని తమలో తాము చర్చించుకొనుచుండిరి. అంతలోనే శుభ శకునములాయెను. నగరప్రజలు ప్రసన్నులైరి. ప్రభువు యొక్క ఆగమనమును సూచించుచున్నవా? అనునట్లు నగరము నాలుగు వైపుల శోభలు విరజిమ్ముచుండెను. శ్రీరామచంద్రప్రభువు సీతాలక్ష్మణసమేతుడై వచ్చుచున్నాడని ఎవరో తెలుపుచున్నట్లు కౌసల్యాది రాజమాతలు మానసోల్లాసములను పొందిరి. భరతునకు కుడి భుజము, కుడి కన్ను అదరెను. అది శుభశకునముగా భావించి, అతడు మనస్సులో మిక్కిలి సంతసించెను. కాని వెంటనే అతడిట్లు తలంపసాగెను. (దోహా)

చౌ- రహెఉ ఏక దిన అవధి అధారా । సముఝత మన దుఖ భయఉ అపారా ॥
కారన కవన నాథ నహిఁ ఆయఉ । జాని కుటిల కిధౌఁ మోహి బిసరాయఉ ॥ 1 ॥
అహహ ధన్య లఛిమన బడభాగీ । రామ పదారబిందు అనురాగీ ॥
కపటీ కుటిల మోహి ప్రభు చీన్హా । తాతే నాథ సంగ నహిఁ లీన్హా ॥ 2 ॥

జౌఁ కరనీ సముఝై ప్రభు మోరీ । నహిఁ నిస్తార కలప సత కోరీ ॥
జన అవగున ప్రభు మాన న కాఊ । దీన బంధు అతి మృదుల సుభాఊ ॥ 3 ॥
మోరే జియఁ భరోస దృఢ సోఈ । మిలిహహిఁ రామ సగున సుభ హోఈ ॥
బీతేఁ అవధి రహహిఁ జౌఁ ప్రానా । అధమ కవన జగ మోహి సమానా ॥ 4 ॥

"నా ప్రాణములకు ఆధారమైన వ్యవధి ఒక్కదినము మాత్రమే మిగిలియున్నది" ఇట్లు ఆలోచించుచుండగనే భరతునిమనస్సు మిక్కిలి దుఃఖాక్రాంతమయ్యెను. "స్వామి ఇంకను రాకుండుటకుగల కారణమేమి? నన్ను కుటిలునిగా భావించి మఱచిపోయెనా? శ్రీరాముని చరణకమలములనాశ్రయించుకొనియున్న లక్ష్మణుడు ఎంత ధన్యుడు? ఆహా! ఎంత భాగ్యశాలి? ప్రభువు నన్ను కపటిగాను, కుటిలునిగాను భావించి యుండవచ్చును. అందువలననే ఆతడు నన్ను తనతో పాటు తీసికొని పోలేదు. నా కృత్యములను ఆయన తనమనస్సులో పెట్టుకొన్నచో ఎన్ని కల్పములవఱకైనను నాకు నిష్కృతి యుండదు. కాని ప్రభువు తనసేవకులదోషములను ఎన్నడును లెక్కింపడు. ఆతడు దీనజనబంధువు. ఆయన స్వభావము అతి కోమలము. శ్రీరామచంద్ర ప్రభువు తప్పకరాగలడని నా మనస్సు విశ్వసించుచున్నది. ఏలనన అన్నియు శుభశకునములే యగుచున్నవి. కాని గడువు ముగిసినపిమ్మటగూడ నేను ప్రాణములతో మిగిలి యున్నచో నా వంటి అధముడెవ్వడును ఉండడు, ఉండబోడు. (చౌపాఈ॥ 1-4)

దో- రామ బిరహ సాగర మహఁ, భరత మగన మన హోత ।
బిప్ర రూప ధరి పవన సుత, ఆఇ గయఉ జను పోత ॥ 1 (క) ॥
బైఠే దేఖి కుసాసన, జటా ముకుట కృస గాత ।
రామ రామ రఘుపతి జపత, స్రవత నయన జలజాత ॥ 1 (ఖ) ॥

భరతునిమనస్సు శ్రీరామునివిరహసముద్రమున మునిగిపోవుచుండగా రక్షించుటకు వచ్చిన ఓడవలె హనుమంతుడు బ్రాహ్మణవేషముతో వచ్చెను. దుర్బలశరీరుడై జటాముకుటధారియై నిరంతరము 'రామరామ' అని జపించుచు అశ్రువులను గార్చుచు కుశాసనముపై కూర్చున్న భరతుని ఆంజనేయుడు చూచెను. (దో॥ 1. క,ఖ)

చౌ- దేఖత హనూమాన అతి హరషేఉ । పులక గాత లోచన జల బరషేఉ ॥
మన మహఁ బహుత భాఁతి సుఖ మానీ । బోలేఉ శ్రవన సుధా సమ బానీ ॥ 1 ॥
జాసు బిరహఁ సోచహు దిన రాతీ । రటహు నిరంతర గున గన పాఁతీ ॥
రఘుకుల తిలక సుజన సుఖదాతా । ఆయఉ కుసల దేవ ముని త్రాతా ॥ 2 ॥
రిపు రన జీతి సుజస సుర గావత । సీతా సహిత అనుజ ప్రభు ఆవత ॥
సునత బచన బిసరే సబ దూఖా । తృషావంత జిమి పాఇ పియూషా ॥ 3 ॥
కో తుమ్హ తాత కహాఁ తే ఆఏ । మోహి పరమ ప్రియ బచన సునాఏ ॥
మారుత సుత మైఁ కపి హనుమానా । నాము మోర సును కృపానిధానా ॥ 4 ॥
దీనబంధు రఘుపతి కర కింకర । సునత భరత భేఁటేఉ ఉఠి సాదర ॥
మిలత ప్రేమ నహిఁ హృదయఁ సమాతా । నయన స్రవత జల పులకిత గాతా ॥ 5 ॥

కపి తవ దరస సకల దుఖ బీతే । మిలే ఆజు మొహి రామ పిరీతే ॥
బార బార బూఝీ కుసలాతా । తో కహుఁ దేఉఁ కాహ సును భ్రాతా ॥ 6 ॥
ఏహి సందేస సరిస జగ మాహీఁ । కరి బిచార దేఖేఉఁ కఛు నాహీఁ ॥
నాహిన తాత ఉరిన మైఁ తోహీ । అబ ప్రభు చరిత సునావహు మోహీ ॥ 7 ॥
తబ హనుమంత నాఇ పద మాథా । కహే సకల రఘుపతి గున గాథా ॥
కహు కపి కబహుఁ కృపాల గొసాఈఁ । సుమిరహిఁ మోహి దాస కీ నాఈఁ ॥ 8 ॥

భరతుని జూడగనే హనుమంతుడు అమితానందమునొందెను. శరీరము పులకితమయ్యెను. కన్నుల ప్రేమాశ్రువులు స్రవింపసాగెను. మనస్సు ఆనందమగ్నము కాగా అతడు వీనులవిందు గావించుచు మధురవచనములను పలికెను. "శ్రీరామచంద్రుని వియోగములో మీరు రాత్రింబవళ్ళు చింతాక్రాంతులైయున్నారు. ఆయనమహోన్నతగుణములనే మీరు సంతతము స్మరించుచున్నారు. ఆ మహానుభావుడు భక్తులకు సుఖప్రదుడు, దేవతలకును మునులకును రక్షకుడు, అట్టి రఘువంశశిరోమణి అదిగో! క్షేమముగా రానే వచ్చినాడు. యుద్ధమున శత్రువులను పరిమార్చి, సీతాలక్ష్మణసమేతుడై ఆప్రభువు నగరమునకు విచ్చేయుచున్నాడు. ఆయనపవిత్రకీర్తిని దేవతలు గానముచేయుచున్నారు." ఈ మాటలను, వినగానే దప్పిగొన్నవాడు అమృతము లభింపగా దాహార్తిని మఱచినట్లు భరతుడు తనదుఃఖమునంతయును మఱచి, ఇట్లు పలికెను. "ఓ మహాత్మా! మీరు ఎవరు? ఎక్కడనుండి వచ్చుచున్నారు? అమృత ప్రాయములైన వచనములను నాకు వినిపించితిరి." మారుతి ప్రత్యుత్తరమును ఇచ్చెను. "కృపానిధీ! నేను పవన పుత్రుడను, వానరుడును, నాపేరు హనుమంతుడు. దీనబంధునైన శ్రీరామునకు నేను దాసుడను." ఇది వినగానే భరతుడు లేచి, సాదరముగా హనుమంతుని కౌగిలించుకొనెను. ఆగాఢాలింగనమున హృదయమున ప్రేమ ఉప్పొంగెను, ఆనందాశ్రువులు స్రవించెను. గాత్రము పులకితమయ్యెను. భరతుడు నుడివెను. "ఆంజనేయా! నీ దర్శనమాత్రమున నా దుఃఖములన్నియును దూరములైనవి. ఏలనన నీ పలుకులద్వారా నా రాముని చూచినట్లైనది." మాటి మాటికిని కుశలములను అడుగుచు భరతుడు "సోదరా! శుభవార్తను వినిపించి, నీవొసర్చిన ఈ యుపకారమునకు మాఱుగా నీకు నేను ఏమీయగలను? ఆలోచించి చూడగా ఈ సందేశముతో సరితూగగలవస్తువు ఈ జగత్తులోనే లేదని తోచుచున్నది. కావున ఎట్టిపరిస్థితిలోను నేను ఋణవిముక్తుడను కాలేను. ఇప్పుడు ప్రభువుచరితమును వినిపింపుము." అని పలికెను. అపుడు హనుమంతుడు భరతునిచరణములకు ప్రణమిల్లి, రఘుపతియైన శ్రీరాముని గుణ గాథనంతయును వినిపించెను. భరతుడు అడిగెను. "వాయుసుతా! దయాళువైన శ్రీరాముడు ఎప్పుడైనను నన్ను తనసేవకునిగా జ్ఞాపకము ఉంచుకొనెనా? (చౌ॥ 1-8)

ఛం-నిజ దాస జ్యోఁ రఘుబంసభూషన కబహుఁ మమ సుమిరన కర్యో ।
సుని భరత బచన బినీత అతి కపి పులకి తన చరనన్హి పర్యో ।
రఘుబీర నిజ ముఖ జాసు గున గన కహత అగ జగ నాథ జో ।
కాహే న హోఇ బినీత పరమ పునీత సదగున సింధు సో ॥

రఘుకులభూషణుడైన శ్రీరాముడు ఎన్నడైనను నన్ను తనదాసునివలె తలచుకొనెనా?" భరతుని వినమ్రవచనములను విని, హనుమంతుడు పులకితగాత్రుడై ఆయనపాదములపై బడెను. మనస్సున అతడు

ఇట్లనుకొనెను. "చరాచర జగత్తునకు స్వామియైన శ్రీ రఘునాథుడు భరతునిగుణసమూహములనే నిరంతరము వర్ణించుచుండును. అట్టి భరతుడు వినయమునకును, పరమపవిత్రసద్గుణములకును నిలయుడేలకాకుండును?
(ఛంద్)

దో- రామ ప్రాన ప్రియ నాథ తుమ్హ, సత్య బచన మమ తాత ।
పుని పుని మిలత భరత సుని, హరష న హృదయఁ సమాత ॥ 2(క) ॥

హనుమంతుడు పలికెను. "ప్రభూ! శ్రీరామునకు మీరు బహిఃప్రాణము. నా పలుకులు నిజము." ఇది వినగానే భరతుడు ఆయనను పదే పదే కౌగిలించుకొనుచు పట్టలేని ఆనందమును అనుభవించెను. (దో॥ 2. క)

సో- భరత చరన సిరు నాఇ, తురిత గయఉ కపి రామ పహిఁ ।
కహీ కుసల సబ జాఇ, హరషి చలేఉ ప్రభు జాన చఢి ॥ 2(ఖ) ॥

భరతునిచరణములకు ప్రణమిల్లి, హనుమంతుడు వెంటనే శ్రీరామునియొద్దకు వచ్చి, ఆయనకు భరతుని క్షేమ సమాచారములను దెలిపెను. అప్పుడు శ్రీరామచంద్రప్రభువు ప్రసన్నుడై, విమానమునధిరోహించి, అయోధ్యకు బయలుదేఱెను. (సోరఠ॥ 2. ఖ.)

చౌ- హరషి భరత కోసలపుర ఆఏ । సమాచార సబ గురహి సునాఏ ॥
పుని మందిర మహఁ బాత జనాఈ । ఆవత నగర కుసల రఘురాఈ ॥ 1 ॥
సునత సకల జననీఁ ఉఠి ధాఈఁ । కహి ప్రభు కుసల భరత సముఝాఈఁ ॥
సమాచార పురబాసిన్హ పాఏ । నర అరు నారి హరషి సబ ధాఏ ॥ 2 ॥
దధి దుర్బా రోచన ఫల ఫూలా । నవ తులసీ దల మంగల మూలా ॥
భరి భరి హేమ థార భామినీ । గావత చలిఁ సింధురగామినీ ॥ 3 ॥
జే జైసేహిఁ తైసేహిఁ ఉఠి ధావహిఁ । బాల బృద్ధ కహఁ సంగ న లావహిఁ ॥
ఏక ఏకన్హ కహఁ బూఝహిఁ భాఈ । తుమ్హ దేఖే దయాల రఘురాఈ ॥ 4 ॥
అవధపురీ ప్రభు ఆవత జానీ । భఈ సకల సోభా కై ఖానీ ॥
బహఇ సుహావన త్రిబిధ సమీరా । భఇ సరజూ అతి నిర్మల నీరా ॥ 5 ॥

భరతుడానందముతో (నందిగ్రామమునుండి) అయోధ్యానగరమునకు వచ్చి, విషయములను గురువుగారికి వినిపించెను. శ్రీ రఘురాముడు క్షేమముగా నగరమునకు వచ్చుచున్నాడని రాజ భవనములోని వారందఱికిని తెల్పెను. ఈ విషయము చెవులబడినంతటనే రాజమాతలు లేచి, ఆనందముతో ఉప్పొంగిపోవుచు పరుగుపరుగున భరతునికడకు వచ్చిరి. భరతుడు ప్రభువు యొక్క కుశలములను తెలిపి, వారిని తృప్తిపఱచెను. నగరవాసులును ఈ సంతోషవార్తను వినినంతనే హర్షోల్లాసములతో పరుగులుదీయుచు అచటికి వచ్చిరి. సౌభాగ్యవతులైన స్త్రీలు శ్రీరామునకు స్వాగతమును పలుకుటకై పెరుగు, గరికెలు, గోరోజనము, పండ్లు, పూలు, పవిత్రములైన తులసీదళములు మొదలగు మంగళద్రవ్యములను బంగారుపళ్లెరములలో దీసికొని, మంగళగీతములను

గానముచేయుచు ఉన్నవారున్నట్లే బయలు దేఱిరి. ఆ వేగవశమున పిల్లలను, వృద్ధులనుగూడ తమవెంట తీసికొనిపోవుట మఱచిపోయిరి. "సోదరా! నీవు కృపాళువైన శ్రీరఘునాథుని చూచితివా?" అని ఒకరినొకరు అడుగుచుండిరి. ప్రభువుయొక్క ఆగమన వార్తను విని, అయోధ్యానగరము సకలసౌందర్యనిధియయ్యెను. సరయూనదీ జలములు నిర్మలములాయెను. శీతలమందసుగంధపవనములు వీవసాగెను. (చౌ॥ 1-5)

దో- హరషిత గుర పరిజన అనుజ, భూసుర బృంద సమేత ।
చలే భరత మన ప్రేమ అతి, సన్ముఖ కృపానికేత ॥ 3(క) ॥
బహుతక చఢీఀ అటారిన్హ, నిరఖహిఀ గగన బిమాన ।
దేఖి మధుర సుర హరషిత, కరహిఀ సుమంగల గాన ॥ 3(ఖ) ॥
రాకా ససి రఘుపతి పుర, సింధు దేఖి హరషాన ।
బఢ్యౌ కొలాహల కరత జను, నారి తరంగ సమాన ॥ 3(గ) ॥

గురువైన వసిష్ఠుడు, ఆత్మీయులైన కుటుంబసభ్యులు, తమ్ముడైన శత్రుఘ్నుడు, బ్రాహ్మణ సమూహములు వెంటరాగా భరతుడు మిక్కిలి ప్రసన్నహృదయుడై కృపాధాముడైన శ్రీరామునకు స్వాగతమిచ్చుటకు భక్తిపరిపూర్ణుడై బయలుదేఱెను. స్త్రీలు మేడలమీద, మిద్దెలపైన చేరి, విమానమునకై ఆకసము వైపు నిరీక్షించుచుండిరి. ఇంతలో ఆ విమానము రానేవచ్చెను. దానిని చూడగానే వారు ఆనందపరవశులై మధురస్వరములతో మంగళగీతములను పాడిరి. పూర్ణచంద్రదర్శనమున సముద్రమువలె శ్రీరఘుపతిని గాంచిన అయోధ్యానగరము కోలాహలముతో ఉప్పొంగిపోయెను. ఇటునటు పరుగిడుచున్న స్త్రీలు ఆ సముద్రపుటలలవలె విలసిల్లిరి. (దో॥ 3. క,ఖ,గ)

చౌ- ఇహాఀ భానుకుల కమల దివాకర । కపిన్హ దేఖావత నగర మనోహర ॥
సును కపీస అంగద లంకేసా । పావన పురీ రుచిర యహ దేసా ॥ 1 ॥
జద్యపి సబ బైకుంఠ బఖానా । బేద పురాన బిదిత జగు జానా ॥
అవధపురీ సమ ప్రియ నహిఀ సోఊ । యహ ప్రసంగ జానఇ కొఉ కోఊ ॥ 2 ॥
జన్మభూమి మమ పురీ సుహావని । ఉత్తర దిసి బహ సరజూ పావని ॥
జా మజ్జన తే బినహిఀ ప్రయాసా । మమ సమీప నర పావహిఀ బాసా ॥ 3 ॥
అతి ప్రియ మోహి ఇహాఀ కే బాసీ । మమ ధామదా పురీ సుఖ రాసీ ॥
హరషే సబ కపి సుని ప్రభు బానీ । ధన్య అవధ జో రామ బఖానీ ॥ 4 ॥

విమానములో ఆసీనుడైయున్న సూర్యవంశభూషణుడైన శ్రీరాముడు వానరులకు మనోహరమైన అయోధ్యానగరమును చూపించుచుండెను. "ఓ సుగ్రీవా! అంగదా! లంకాపతి విభీషణా! వినుడు. ఈ అయోధ్యానగరము అతిపవిత్రమైనది. ఈ దేశము అతిసౌభాగ్యవంతమైనది. అందఱును వైకుంఠమును పొగడెదరు. అది వేదపురాణప్రసిద్ధము, జగద్విదితము. కాని నాకుమాత్రము వైకుంఠముకంటెను అయోధ్యానగరమే మిగులప్రీతిపాత్రము. ఈ రహస్యమును కొద్దిమంది మాత్రమే యెఱుంగుదురు. ఈ సుందరనగరము నా జన్మభూమి. దీనికి ఉత్తరమున పవిత్ర సరయూనది ప్రవహించును. దీనియందు స్నానములనాచరించువారు

ఆనాయసముగా నన్ను సమీపింతురు. (సామీప్యముక్తిని పొందెదరు.) అయోధ్యావాసులు నాకు అత్యంతప్రియులు. ఈ పురము సర్వసుఖములకును కాణాచి. ఇది నా పరమపదమును ప్రాప్తింపజేయును." ప్రభు వచనములను విని, వానరులు ప్రసన్నచిత్తులైరి. శ్రీరామచంద్రప్రభువుయొక్క ప్రశంసలకు నోచుకొనిన ఈ అయోధ్యానగరము మిక్కిలి ధన్యమైనది" అనిరి. (చౌ॥ 1-4)

దో- ఆవత దేఖి లోగ సబ, కృపాసింధు భగవాన।
నగర నికట ప్రభు ప్రేరేఉ, ఉతరేఉ భూమి బిమాన ॥ 4(క) ॥
ఉతరి కహేఉ ప్రభు పుష్పకహి, తుమ్హ కుబేర పహిఀ జాహు ।
ప్రేరిత రామ చలేఉ సో, హరషు బిరహు అతి తాహు ॥ 4(ఖ) ॥

ప్రజలందఱును తనను దర్శించుటకై పరుగెత్తుచు వచ్చుచుండుటను జూచి, కృపాసింధువైన శ్రీరామచంద్రప్రభువు నగరసమీపమున క్రిందికి దిగవలసినదిగా విమానమునాదేశించెను. అప్పుడది భూమిపైన దిగెను. అందఱును విమానమునుండి దిగినపిదప "నీవు కుబేరుని కడకు వెళ్లుము" అని పుష్పకమును ఆదేశించెను. శ్రీరాముని ఆజ్ఞమేరకు అది అలకాపురి దిశగా బయలు దేఱెను. తనయజమానికడకువెళ్లుచున్నానమసంతోషము, శ్రీరాముని వీడి వెళ్లుచున్నందులకు విరహవేదన కలుగగా అది తిన్నగా ముందునకు సాగెను. (దో॥ 4. క,ఖ)

చౌ- ఆఏ భరత సంగ సబ లోగా । కృస తన శ్రీరఘుబీర బియోగా ॥
బామదేవ బసిష్ఠ మునినాయక । దేఖే ప్రభు మహి ధరి ధను సాయక ॥ 1 ॥
ధాఇ ధరే గుర చరన సరోరుహ । అనుజ సహిత అతి పులక తనోరుహ ॥
భేఀటి కుసల బూఝీ మునిరాయా । హమరేఀ కుసల తుమ్హారిహిఀ దాయా ॥ 2 ॥
సకల ద్విజన్హ మిలి నాయఉ మాథా । ధర్మ ధురంధర రఘుకులనాథా ॥
గహే భరత పుని ప్రభు పద పంకజ । నమత జిన్హహి సుర ముని సంకర అజ ॥ 3 ॥
పరే భూమి నహిఀ ఉఠత ఉఠాఏ । బర కరి కృపాసింధు ఉర లాఏ ॥
స్యామల గాత రోమ భఏ ఠాఢే । నవ రాజీవ నయన జల బాఢే ॥ 4 ॥

ప్రజలందఱును భరతుని అనుసరించి వచ్చిరి. శ్రీ రఘువీరునియెడబాటుచే వారిదేహములు కృశించియుండెను. వామదేవుడు, వసిష్ఠుడు మొదలగు మునీశ్వరులను జూచి, ప్రభువు ధనుర్బాణములను నేలపై నుంచి, సోదరుడైన లక్ష్మణునితోగూడి పరుగిడుచు వెళ్ళి, గురువుగారి పాదపద్మములకు ప్రణమిల్లెను. వారిదేహములు అణువణువునను రోమాంచితములయ్యెను. ముని శ్రేష్ఠుడైన వసిష్ఠుడు వారిని ఆలింగనము చేసికొని, కుశలమడిగెను. "మీ కృపవలన మేము క్షేమమే" అని ప్రభువు పలికెను. ధర్మధురంధరుడైన రఘుకులస్వామి బ్రాహ్మణులనందఱిని కలిసి, వారికెల్లరకును ప్రణమిల్లెను. దేవతలు మునులు బ్రహ్మరుద్రాదులు సేవించు ప్రభుపాదములకు భరతుడు ప్రణమిల్లెను. పాదములపై వ్రాలియున్న భరతుడు ఎంత లేపినను లేవలేదు. అపుడు కృపానిధియైన శ్రీరాముడు బలవంతముగా అతనిని లేవనెత్తి తన హృదయమునకు హత్తుకొనెను. అతనిశ్యామలశరీరము పులకితమయ్యెను. నవనీరజసమమైన నేత్రములయందు ఆనందాశ్రువులు నిండెను. (చౌ॥ 1-4)

ఛం-రాజీవ లోచన స్రవత జల తన లలిత పులకావలి బనీ ।
అతి ప్రేమ హృదయఁ లగాఇ అనుజహి మిలే ప్రభు త్రిభుఅన ధనీ ॥
ప్రభు మిలత అనుజహి సోహ మో పహిఁ జాతి నహిఁ ఉపమా కహీ ।
జను ప్రేమ అరు సింగార తను ధరి మిలే బర సుషమా లహీ ॥ 1 ॥
బూఝత కృపానిధి కుసల భరతహి బచన బేగి న ఆవఈ ।
సును సివా సో సుఖ బచన మన తే భిన్న జాన జో పావఈ ॥
అబ కుసల కౌసలనాథ ఆరత జాని జన దరసన దియో ।
బూడత బిరహ బారీస కృపానిధాన మొహి కర గహి లియో ॥ 2 ॥

కమలములవంటి కన్నులనుండి ప్రేమాశ్రువులు ప్రవహింపసాగెను. శరీరము పులకించెను. ముల్లోకములకును స్వామియైన శ్రీరామచంద్రప్రభువు తమ్ముడగు భరతుని అత్యంత ప్రేమతో హృదయమునకు హత్తుకొనెను. సోదరునితో కలియుసమయమున ఆ ప్రభుశోభను వర్ణించుట నాతరము గాదు. ప్రేమవాత్సల్యములు ఆకృతిదాల్చినట్లుండెను. దయానిధియైన స్వామి భరతుని కుశల ప్రశ్నలడిగెను. కాని ఆనంద పారవశ్యముచే భరతుని నోట మాటరాలేదు. (శివుడు పల్కుచున్నాడు) పార్వతీ! వినుము. భరతుని సుఖము మనోవాక్కులకు అతీతము. అది అనుభవైక వేద్యము. భరతుడు పలికెను. "కోసలాధీశా! నన్ను ఆర్తునిగా గుర్తించి, దర్శన మొసంగినారు. కావున నేను ఇప్పుడుకుశలినే. విరహసముద్రములో మునిగిపోవుచున్న నన్ను కృపాళువులై చేయూత నిచ్చి కాపాడితిరి. (ఛం॥ 1-2)

దో- పుని ప్రభు హరషి సత్రుహన, భేఁటే హృదయఁ లగాఇ ।
లఛిమన భరత మిలే తబ, పరమ ప్రేమ దోఉ భాఇ ॥ 5 ॥

పిమ్మట శ్రీరామచంద్ర ప్రభువు ప్రసన్నతతో శత్రుఘ్నుని అక్కున జేర్చుకొనెను. లక్ష్మణుడును, భరతుడును అత్యంత ప్రేమతో పరస్పరము ఆలింగనమొనర్చుకొనిరి. (దో॥ 5)

చౌ- భరతానుజ లఛిమన పుని భేఁటే । దుసహ బిరహ సంభవ దుఖ మేటే ॥
సీతా చరన భరత సిరు నావా । అనుజ సమేత పరమ సుఖ పావా ॥ 1 ॥
ప్రభు బిలోకి హరషే పురబాసీ । జనిత బియోగ బిపతి సబ నాసీ ॥
ప్రేమాతుర సబ లోగ నిహారీ । కౌతుక కీన్హ కృపాల ఖరారీ ॥ 2 ॥
అమిత రూప ప్రగటే తెహి కాలా । జథా జోగ మిలె సబహి కృపాలా ॥
కృపాదృష్టి రఘుబీర బిలోకీ । కిఏ సకల నర నారి బిసోకీ ॥ 3 ॥
ఛన మహిఁ సబహి మిలే భగవానా । ఉమా మరము యహ కాహుఁ న జానా ॥
ఏహి బిధి సబహి సుఖీ కరి రామా । ఆగేఁ చలే సీల గున ధామా ॥ 4 ॥
కౌసల్యాది మాతు సబ ధాఈ । నిరఖి బచ్ఛ జను ధేను లవాఈ ॥ 5 ॥

పిదప లక్ష్మణుడు శత్రుఘ్నుని కౌగిలించుకొని వియోగజనితమైన దుస్సహదుఃఖమును దూరమొనర్చెను. అనంతరము భరతశత్రుఘ్నులు సీతాదేవిచరణములకు ప్రణమిల్లి, పరమానంద భరితులైరి. శ్రీరామచంద్ర ప్రభువును గాంచి, అయోధ్యావాసులు ఆనందజలధిలో ఓలలాడిరి. వారివిరహజనితదుఃఖము మటుమాయమయ్యెను. ప్రేమ విహ్వలురైన వారిని జూచి దయాళువైన శ్రీరాముడు ఒక లీలనుప్రదర్శించెను. ఒకే సమయమున ప్రభువు అనేక రూపములలో ప్రకటితుడై ప్రతివ్యక్తికిని ఒకేసమయమున వారివారి యోగ్యతలకు అనుగుణముగ దర్శనమిచ్చెను. శ్రీరఘువీరుని దయాదృష్టిచే స్త్రీపురుషులందఱును శోకరహితులైరి. ఒక్క క్షణముననే భగవంతుడు అందఱిని ఆనందింప చేసెను. ఉమా! ప్రతి యొక్కరును 'ప్రభువు మొట్ట మొదట తననే కలిసికొన్నాడు' అని భావించిరి. ఎవ్వరును ఈ లీలా రహస్యమును ఎఱుగరు. శీల గుణనిధానమైన శ్రీరామచంద్రుడు ఈ విధముగా సుఖసంతోషములను పంచియిచ్చి, ముందుకు నడిచెను. ఇంతలో కౌసల్యాది రాజమాతలు ప్రభువును జూచి, తమ వత్సములకై పరుగెత్తు గోవులవలె త్వరపడుచు వచ్చిరి. (చౌ॥ 1-5)

ఛం-జను ధేను బాలక బచ్ఛ తజి గృహఀ చరన బన పరబస గఈం।
దిన అంత పుర రుఖ స్రవత థన హుంకార కరి ధావత భఈం॥
అతి ప్రేమ ప్రభు సబ మాతు భేటీఀ బచన మృదు బహుబిధి కహే।
గఇ బిషమ బిపతి బియోగ భవ తిన్హ హరష సుఖ అగనిత లహే॥

నూతనముగా ప్రసవించినగోవులు దూడలను ఇంటికడనే వదలి, మనస్సులు వాటిపైననే ఉన్నను, వనమున గడ్డిమేసి, సాయంసమయమున దూడలను చేరుటకు తహతహ పడుచుండును. అప్పుడు వాటి పొదుగులయందు పాలుగారుచుండగా 'అంబా' అని అఱచుచు ఆఆవులు పరుగులుదీయుచు వచ్చునట్లు రాజమాతలు వారికడకు వచ్చిరి. ప్రభువు అత్యంత ప్రేమానురాగములతో తల్లులనందఱిని కలిసి, అనేకవిధముల మృదుమధుర వచనములను పలికెను. వియోగముచే ఉత్పన్నమైన భయానకవిపత్తు దూరమై, వారికి అపార సుఖసంతోషములు ప్రాప్తించెను. (ఛం)

దో- భేటేఉ తనయ సుమిత్రాఀ, రామ చరన రతి జాని।
రామహి మిలత కైకఈ, హృదయఀ బహుత సకుచాని॥ 6(క)॥
లఛిమన సబ మాతన్హ మిలి, హరషే ఆసిష పాఇ।
కైకఇ కహఀ పుని పుని మిలే, మన కర ఛోభు న జాఇ॥ 6(ఖ)॥

శ్రీరామునిచరణములకే అంకితమైన లక్ష్మణుని సుమిత్రాదేవి అక్కున జేర్చుకొనెను. కైకేయి మనస్సుమాత్రము శ్రీరాముని కలియునపుడు మిక్కిలి సంకోచమునకు లోనయ్యెను. లక్ష్మణుడు తల్లులందఱికిని ప్రణమిల్లి, వారి ఆశీస్సులను పొంది, ఆనందించెను. అతడు కైకేయితో మాటిమాటికి కలిసినను ఆమెమానసికక్షోభ(పరితాపము) మాత్రము తొలగలేదు. (దో॥ 6. క.ఖ)

చౌ- సాసున్హ సబని మిలీ బైదేహీ। చరనన్హి లాగి హరషు అతి తేహీ॥
దేహిఀ అసీస బూఝి కుసలాతా। హోఇ అచల తుమ్హార అహివాతా॥ 1॥

సబ రఘుపతి ముఖ కమల బిలోకహిఁ । మంగల జాని నయన జల రోకహిఁ ॥
కనక థార ఆరతీ ఉతారహిఁ । బార బార ప్రభు గాత నిహారహిఁ ॥ 2 ॥
నానా భాఁతి నిఛావరి కరహీఁ । పరమానంద హరష ఉర భరహీఁ ॥
కౌసల్యా పుని పుని రఘుబీరహి । చితవతి కృపాసింధు రనధీరహి ॥ 3 ॥
హృదయఁ బిచారతి బారహిఁ బారా । కవన భాఁతి లంకాపతి మారా ॥
అతి సుకుమార జుగల మేరె బారే । నిసిచర సుభట మహాబల భారే ॥ 4 ॥

జానకీదేవి తనఅత్తలనందఱిని కలిసి, అమితానందముతో వారిపాదములకు అభివాదము చేసెను. వారు ఆమెకుశములనడిగి "నిత్య సుమంగళీ భవ" అని ఆశీర్వదించిరి. తల్లులందఱును శ్రీరఘునాథుని ముఖకమలమును జూచుచుండిరి. అది శుభసమయమని తెలిసికొని, అశ్రువులను ఆపుకొనుచుండిరి. బంగారు పళ్లెములలో హారతులెత్తిరి. మాటిమాటికిని ప్రభుదివ్య మంగళవిగ్రహమును తనవితీర దర్శించుచుండిరి. వారు ప్రభువునకు అనేకవిధముల కాన్కలను సమర్పించిరి. హృదయములు పరమానందభరితములయ్యెను. కౌసల్యాదేవి దయాసాగరుడు, రణధీరుడు ఐన రఘువీరుని పదేపదే కన్నులార చూచుచుండెను. నాకుమారులిద్దఱును అత్యంత సుకుమారులు. ఆ రాక్షసులు మిక్కిలి పరాక్రమశాలురు, యోధులు. వారిని, ఆ దుష్ట రావణుని వీరు ఎట్లు వధించియుండ వచ్చును?" అని ఆమె ఆలోచించుచుండెను. (చౌ॥ 1-4)

దో- లఖిమన అరు సీతా సహిత, ప్రభుహి బిలోకతి మాతు ।
పరమానంద మగన మన, పుని పుని పులకిత గాతు ॥ 7 ॥

సీతాలక్ష్మణసహితుడైన శ్రీరామచంద్రుని గాంచుచు, కౌసల్యాదేవి ఆనందడోలికలలో ఊఁగి పోయెను. ఆమెతనువు మాటిమాటికిని పులకాంకితమయ్యెను. (దో॥ 7)

చౌ- లంకాపతి కపీస నల నీలా । జామవంత అంగద సుభసీలా ॥
హనుమదాది సబ బానర బీరా । ధరే మనోహర మనుజ సరీరా ॥ 1 ॥
భరత సనేహ సీల బ్రత నేమా । సాదర సబ బరనహిఁ అతి ప్రేమా ॥
దేఖి నగరబాసిన్హ కై రీతీ । సకల సరాహహిఁ ప్రభు పద ప్రీతీ ॥ 2 ॥
పుని రఘుపతి సబ సఖా బోలాఏ ।ముని పద లాగహు సకల సిఖాఏ ॥
గుర బసిష్ట కులపూజ్య హమారే । ఇన్హ కీ కృపాఁ దనుజ రన మారే ॥ 3 ॥
ఏ సబ సఖా సునహు ముని మేరే । భఏ సమర సాగర కహఁ బేరే ॥
మమ హిత లాగి జన్మ ఇన్హ హారే । భరతహు తే మోహి అధిక పిఆరే ॥ 4 ॥
సుని ప్రభు బచన మగన సబ భఏ । నిమిష నిమిష ఉపజత సుఖ నఏ ॥ 5 ॥

లంకాపతి విభీషణుడు, వానరరాజు సుగ్రీవుడు, నలుడు, నీలుడు, జాంబవంతుడు, అంగదుడు, హనుమంతుడు, మొదలగు ప్రముఖవానరోత్తములందఱును సుందర మానవాకృతులను ధరించిరి. వారందఱును

భరతునిస్నేహసౌశీల్యస్వభావములను, అతని వ్రతనియమదీక్షాపటిమలను మిక్కిలి ప్రేమాదరములతో కొనియాడిరి. నగరవాసులప్రేమ వినయశీలములు చూచి, ప్రభువునెడ వారికిగల భక్తి విశ్వాసములను మెచ్చుకొనిరి. పిదప శ్రీ రఘునాథుడు తన మిత్రులందఱిని పిలిచి, "వసిష్ఠ మునీశ్వరుని చరణములకు నమస్కరింపుడని సూచించుచు, వీరు మనకులగురువులు, పూజ్యులు, వీరికృపచేతనే యుద్ధములో రాక్షసులు హతులైరి."- అని పలికెను. "మునీశ్వరా! వీరందఱును నా మిత్రులు. సంగ్రామసాగరమునుండి గట్టెక్కుటకు వీరు నాకు ఓడలవలె తోడ్పడిరి. నాహితముకొఱకు వారు తమ ప్రాణములను సైతము పణముగా పెట్టిరి. వీరు నాకు భరతునికంటెను ఎక్కువగా ప్రీతి పాత్రులు" అని పలికెను. ప్రభువచనములను విని, వారందఱును భక్తిపరవశులైరి. ఈ విధముగా వారు అనుక్షణము నూతనసుఖములను అనుభవించిరి. (చౌ. 1-5)

దో- కౌసల్యా కే చరనన్హి, పుని తిన్హ నాయఉ మాథ।
ఆసిష దీన్హే హరషి తుమ్హ, ప్రియ మమ జిమి రఘునాథ ॥ 8(క) ॥
సుమన బృష్టి నభ సంకుల, భవన చలే సుఖకంద।
చఢీ అటారిన్హ దేఖహిం, నగర నారి నర బృంద ॥ 8(ఖ) ॥

పిమ్మట ఆ వానరులు కౌసల్యాదేవి చరణములకు ప్రణమిల్లిరి. ఆమె ప్రసన్నురాలై, ఆశీర్వదించి, "మీరందరును నాకు రఘునాథునితో సమానముగా ప్రియమైనవారు" అని పలికెను. ఆనంద కందుడగు శ్రీరఘునాథుడు తనభవనమునకు పోవునపుడు ఆకాశము పుష్పవృష్టిచే నిండి పోయెను. నగరవాసులు మేడలపై నుండి, మిద్దెల మీద నుండి ప్రభువును దర్శించుచుండిరి. (దో. 8. క,ఖ)

చౌ- కంచన కలస బిచిత్ర సంవారే। సబహిం ధరే సజి నిజ నిజ ద్వారే ॥
బందనవార పతాకా కేతూ। సబన్హి బనాఏ మంగల హేతూ ॥ 1 ॥
బీథీం సకల సుగంధ సించాఈం। గజమని రచి బహు చౌక పురాఈం ॥
నానా భాంతి సుమంగల సాజే। హరషి నగర నిసాన బహు బాజే ॥ 2 ॥
జహం తహం నారి నిఛావరి కరహీం। దేహిం అసీస హరష ఉర భరహీం ॥
కంచన థార ఆరతీం నానా। జుబతీం సజేం కరహిం సుభ గానా ॥ 3 ॥
కరహిం ఆరతీ ఆరతిహర కేం। రఘుకుల కమల బిపిన దినకర కేం ॥
పుర సోభా సంపతి కల్యానా। నిగమ సేష సారదా బఖానా ॥ 4 ॥
తేఉ యహ చరిత దేఖి ఠగి రహహీం। ఉమా తాసు గున నర కిమి కహహీం ॥ 5 ॥

వారు స్వర్ణకలశములను చిత్రవిచిత్రములుగా అలంకరించి, తమతమ గుమ్మములయందుంచిరి. మంగళతోరణములతో ధ్వజపతాకములతో గృహములను అలంకరించిరి. వీధులలో సుగంధ ద్రవ్యములతో కలాపి చల్లిరి. ప్రాంగణములు గజముత్యములతో అలంకరింపబడెను. అనేకవిధములైన శుభప్రదములగు అలంకారములు చేయబడెను. హర్షముతో నగరమున ఢంకాలు మ్రోగింపబడెను. ప్రభువు నడచుమార్గమున ప్రతిప్రదేశమునందును స్త్రీలు కానుకలను సమర్పించిరి. ఆనందహృదయలై ఆశీర్వాదములను పలికిరి. సౌభాగ్యవతులైన యువతులు

బంగారుపళ్లెములతో అనేకవిధములగుహారతులను ఇచ్చుచు, మంగళగీతములు పాడిరి. దుఃఖములను హరించువాడును, సూర్యవంశమనెడి కమలవనమును వికసింపజేసెడి సూర్యుడును ఐన శ్రీరామునకు హారతులెత్తిరి. ఆ నగర సౌందర్యములను, వైభవములను, సౌభాగ్యములను, వేదములును, శేషుడును, సరస్వతీ దేవియు మాత్రమే వర్ణింపగలరు. కాని వారు గూడ ఈ దృశ్యములను గాంచి చకితులైరి. ఓ ఉమా! మనుష్యులు వాటిని ఎట్లు వర్ణింపగలరు? (చౌ॥ 1-5)

దో- నారి కుముదినీం అవధ సర, రఘుపతి బిరహ దినేస ।
అస్త భఏం బిగసత భఈం, నిరఖి రామ రాకేస ॥ 9(క) ॥
హోహిం సగున సుభ బిబిధి బిధి, బాజహిం గగన నిసాన ।
పుర నర నారి సనాథ కరి, భవన చలే భగవాన ॥ 9(ఖ) ॥

అయోధ్యయను సరోవరమున వనితలనెడి కలువలు శ్రీరామవిరహమనెడి సూర్యతాపముచే వసివాడినవి. ఇప్పుడు ఆ విరహతాపమును దూరముచేయు శ్రీ రఘునాథుడనెడి పూర్ణచంద్రుని కిరణస్పర్శచే ఆ కలువలు వికసించెను. అనేకములైన శుభశకునములయ్యెను. ఆకాశమున నగారాలధ్వనులు నిండెను. నగరమునందలి స్త్రీ పురుషులందఱిని ధన్యులనుగా జేసి, శ్రీరామచంద్రుడు తనభవనమునకేగెను. (దో॥ 9. క,ఖ)

చౌ- ప్రభు జానీ కైకఈ లజానీ । ప్రథమ తాసు గృహ గఏ భవానీ ॥
తాహి ప్రబోధి బహుత సుఖ దీన్హా । పుని నిజ భవన గవన హరి కీన్హా ॥ 1 ॥
కృపాసింధు జబ మందిర గఏ । పుర నర నారి సుఖీ సబ భఏ ॥
గుర బసిష్ట ద్విజ లిఏ బులాఈ । ఆజు సుఘరీ సుదిన సముదాఈ ॥ 2 ॥
సబ ద్విజ దేహు హరషి అనుసాసన । రామచంద్ర బైఠహిం సింఘాసన ॥
ముని బసిష్ట కే బచన సుహాఏ । సునత సకల బిప్రన్హ అతి భాఏ ॥ 3 ॥
కహహిం బచన మృదు బిప్ర అనేకా । జగ అభిరామ రామ అభిషేకా ॥
అబ మునిబర బిలంబ నహిం కీజై । మహారాజ కహం తిలక కరీజై ॥ 4 ॥

(శివుడు పలుకుచున్నాడు) ఓ భవానీ! కైకేయి మిక్కిలి లజ్జితురాలైనదనువిషయమును ప్రభు వెఱుంగును. కావున ప్రభువు మొదట ఆమెభవనమునకు వెళ్లెను. ఆమెను అనేకవిధముల ఓదార్చి, పూర్తిగా తృప్తిపఱచెను. పిమ్మట ఆ కృపానిధి తనభవనమునకు వెళ్లెను. శ్రీరాముడు తన భవనమున ప్రవేశింపగనే అయోధ్యయందలి స్త్రీ పురుషులు సంతుష్టులైరి. గురువైన వసిష్ఠుడు బ్రాహ్మణులను పిలిచి, "ఈనాడు ఈవేళ శకునములన్నియును శుభావహములైయున్నవి. శ్రీరామచంద్రుడు సింహాసనమును అధిష్ఠించుటకు మీరందఱును అనుజ్ఞనొసంగుడు" అని వారిని ప్రార్థించెను. వసిష్ఠమహర్షి పలికినమధురవచనములను విని, బ్రాహ్మణులందఱును పరమానందమును పొందిరి. వారు మృదుమధురముగా ఇట్లు పలికిరి. "శ్రీరామచంద్రుని రాజ్యాభిషేకము విశ్వమునకే ఆనందదాయకము. మునీశ్వరా! ఇంక ఏ మాత్రమూ ఆలసింపక శ్రీరాముని పట్టాభిషిక్తునిగా జేయుడు" అని యనిరి. (చౌ॥ 1-4)

దో- తబ ముని కహేఉ సుమంత్ర సన, సునత చలేఉ హరషాఇ ।
రథ అనేక బహు బాజి గజ, తురత సఁవారే జాఇ ॥ 10(క) ॥
జహఁ తహఁ ధావన పఠఇ పుని, మంగల ద్రబ్య మగాఇ ।
హరష సమేత బసిష్ఠ పద, పుని సిరు నాయఉ ఆఇ ॥ 10(ఖ) ॥

అంతట వసిష్ఠమహాముని సుమంత్రునితో పట్టాభిషేకమునకు తగినఏర్పాట్లు చేయుమని పలికెను. అతడు హర్షముతో వెళ్లెను. అనేకరథగజతురగములు అలంకరింపబడెను. పిమ్మట సుమంత్రుడు నలుదిశలకును దూతలను పంపి, మంగళద్రవ్యములను తెప్పించెను. పిమ్మట ఆనందముతో అతడు వసిష్ఠునికడకేగి, ఆయనచరణములకు ప్రణమిల్లెను. (దో॰ 10. క,ఖ)

నవాహ్నికపారాయణము-ఎనిమిదవ విరామము

## శ్రీరామ పట్టాభిషేకము

చౌ- అవధపురీ అతి రుచిర బనాఈ । దేవన్హ సుమన బృష్టి ఝరి లాఈ ॥
రామ కహా సేవకన్హ బులాఈ । ప్రథమ సఖన్హ అన్హవావహు జాఈ ॥ 1 ॥
సునత బచన జహఁ తహఁ జన ధాఏ । సుగ్రీవాది తురత అన్హవాఏ ॥
పుని కరునానిధి భరతు హఁకారే । నిజ కర రామ జటా నిరుఆరే ॥ 2 ॥
అన్హవాఏ ప్రభు తీనిఉ భాఈ । భగత బఛల కృపాల రఘురాఈ ॥
భరత భాగ్య ప్రభు కోమలతాఈ । సేష కోటి సత సకహిఁ న గాఈ ॥ 3 ॥
పుని నిజ జటా రామ బిబరాఏ । గుర అనుసాసన మాగి నహాఏ ॥
కరి మజ్జన ప్రభు భూషన సాజే । అంగ అనంగ దేఖి సత లాజే ॥ 4 ॥

అయోధ్యా నగరము మిక్కిలి అందముగా అలంకరింపబడెను. దేవతలు నిరంతరము పుష్పవృష్టి కురిపించుచుండిరి. శ్రీరామచంద్రుడు సేవకులను పిలిచి, "మొదట నా మిత్రులకు స్నానములను చేయింపుడు" అని పలికెను. ప్రభువచనములను వినగానే ఎక్కడివారక్కడ పరుగెత్తుకొని పోయి, సుగ్రీవాదులకు స్నానములు చేయించిరి. పిదప కరుణాళువు శ్రీరాముడు భరతుని పిలిచి, తన మృదువైన కరకమలములతో స్వయముగా అతని జటాజూటమును విప్పి దువ్వెను. ఆ సమయమున రామునిహృదయమున భరతునియెడ గూడుకట్టికొనియున్న అపారప్రేమ ఉప్పొంగుచుండెను. పిమ్మట భక్తవత్సలుడైన రఘునాథుడు తనముగ్గురుసోదరులకును స్నానములను జేయించెను. భరతునిభాగ్యమును ప్రభుకారుణ్యమును ఎంతమంది శేషులైనను వర్ణింపజాలరు. పిమ్మట శ్రీరాముడు తనజటాజూటమును విప్పుకొని, గురునాజ్ఞప్రకారము స్నానమునాచరించెను. స్నానానంతరము భూషణములను ధరించెను. ప్రభువుయొక్క ప్రత్యంగము కోటిమన్మథసౌందర్యములనుగూడ త్రోసిరాజని శోభించెను. (చౌ॰ 1-4)

దో- సాసున్హ సాదర జానకిహి, మజ్జన తురత కరాఇ ।
దిబ్య బసన బర భూషన, అఁగ అఁగ సజే బనాఇ ॥ 11(క) ॥

రామ బామ దిసి సోభతి, రమా రూప గున ఖాని।
దేఖి మాతు సబ హరషీఁ, జన్మ సుఫల నిజ జాని ॥ 11(ఖ) ॥
సును ఖగేస తేహి అవసర, బ్రహ్మ సివ ముని బృంద।
చఢి బిమాన ఆఏ సబ, సుర దేఖన సుఖకంద ॥ 11(గ) ॥

ఇక్కడ సీతాదేవిని అత్తగార్లు వెంటనే సాదరముగా స్నానముచేయించి, దివ్య వస్త్రములను ధరింపజేసి, ప్రత్యంగమును ఆభరణములచే అలంకరింపజేసిరి. శ్రీరామునివామభాగమున సుగుణాలరాశియైన సీతాదేవి శోభిల్లెను. వారిని జూచి తల్లులు తమజన్మలు ధన్యములైనవని తలంచుచు సంతసించిరి. కాకభుశుండి పలుకుచున్నాడు. ఓ పక్షిరాజా! గరుడుడా! వినుము. అదే సమయమున బ్రహ్మదేవుడు, శివుడు, మునిబృందములు, విమానములపైవచ్చినదేవతలు, ఆనందకందుడగు భగవంతుని దర్శనమునకై విచ్చేసిరి. (దో॥ 11.క,ఖ,గ)

చౌ- ప్రభు బిలోకి ముని మన అనురాగా। తురత దిబ్య సింఘాసన మాగా ॥
రబి సమ తేజ సో బరని న జాఈ। బైఠే రామ ద్విజన్హ సిరు నాఈ ॥ 1 ॥
జనకసుతా సమేత రఘురాఈ। పేఖి ప్రహరషే ముని సముదాఈ ॥
బేద మంత్ర తబ ద్విజన్హ ఉచారే। నభ సుర ముని జయ జయతి పుకారే ॥ 2 ॥
ప్రథమ తిలక బసిష్ఠ ముని కీన్హా। పుని సబ బిప్రన్హ ఆయసు దీన్హా ॥
సుత బిలోకి హరషీఁ మహతారీ। బార బార ఆరతీ ఉతారీ ॥ 3 ॥
బిప్రన్హ దాన బిబిధి బిధి దీన్హే। జాచక సకల అజాచక కీన్హే ॥
సింఘాసన పర త్రిభుఅన సాఈఁ। దేఖి సురన్హ దుందుభీఁ బజాఈఁ ॥ 4 ॥

శ్రీరామచంద్రుని గాంచి, వసిష్ఠమహర్షి ప్రేమపరవశుడాయెను. వెంటనే ఆయన ఒక దివ్య సింహాసనమును దెప్పించెను. అది సూర్యతేజస్సును మించి ప్రకాశించుచుండెను. దాని సౌందర్యము వర్ణనాతీతము. శ్రీరామచంద్రప్రభువు బ్రాహ్మణులకు నమస్కరించి, ఆ సింహాసనముపై ఆసీనుడయ్యెను. జనకసుతయైన సీతతోగూడిన శ్రీరామచంద్రుని జూచి, మునులు అత్యంత హర్షోల్లాసములతో విలసిల్లిరి. బ్రాహ్మణులు వేదమంత్రములను పఠించిరి. ఆకాశమునుండి దేవతలు, మునులు 'శ్రీరామునకు జయము, జయము' అను నినాదములను గావించిరి. మొట్టమొదట వసిష్ఠమహాముని శ్రీరామునకు తిలకము దిద్దెను. పిమ్మట బ్రాహ్మణులందఱిని 'తిలకమునుంచుడ'ని ఆదేశించెను. పుత్రునిపట్టాభిషేక మహోత్సవమును జూచి, తల్లులు అత్యంతానందమునొందిరి. వారు మాటిమాటికిని మంగళహారతులనెత్తిరి. బ్రాహ్మణులకు అనేకదానములనొసంగిరి. అర్థులకు తృప్తికరముగా దానములనిచ్చిరి. ముల్లోకములకును ప్రభువగు శ్రీరామచంద్రుడు సింహాసనముపై విరాజిల్లుచుండగా ఆవైభవమునుగాంచి, దేవతలు-నగారాలను మ్రోగించిరి. (చౌ॥ 1-4)

ఛం-నభ దుందుభీఁ బాజహిఁ బిపుల గంధర్బ కిన్నర గావహీఁ।
నాచహిఁ అపఛరా బృంద పరమానంద సుర ముని పావహీఁ ॥

భరతాది అనుజ బిభీషనాంగద హనుమదాది సమేత తే ।
గహేఁ ఛత్ర చామర బ్యజన ధను అసి చర్మ సక్తి బిరాజతే ॥ 1 ॥
శ్రీ సహిత దినకర బంస భూషన కామ బహు ఛబి సోహఈ ।
నవ అంబుధర బర గాత అంబర పీత సుర మన మోహఈ ॥
ముకుటాంగదాది బిచిత్ర భూషన అంగ అంగన్హి ప్రతి సజే ।
అంభోజ నయన బిసాల ఉర భుజ ధన్య నర నిరఖంతి జే ॥ 2 ॥

ఆకాశమున దుందుభిధ్వానములు వీనులవిందుగా వినిపించెను. గంధర్వులు కిన్నరులు ప్రభువుయొక్క యశోవైభవములను కీర్తించుచుండిరి. దివ్యాంగనలు నాట్యములు చేయుచుండిరి. దేవతలు, మునులు పరమానందభరితులైరి భరతలక్ష్మణశత్రుఘ్నులును విభీషణుడు, అంగదుడు, హనుమంతుడు, సుగ్రీవుడును వరుసగా ఛత్రము, చామరములు, వ్యజనము, ధనుస్సు, ఖడ్గము, డాలు, శక్తినిగైకొని ప్రభువును సేవించుచుండిరి.[1] సూర్యవంశభూషణుడైన శ్రీరామచంద్రుడు సీతాదేవితోగూడి కోటిమన్మథులసౌందర్యములతో శోభిల్లుచుండెను. సజలమేఘమువలెనున్న ప్రభువుయొక్క సుందరనీలశరీరముపై శోభిల్లుపీతాంబరము దేవతలమనస్సులను గూడ ముగ్ధమొనర్చెను. మస్తకమున కిరీటము, బాహువులయందు భుజకీర్తులు మొదలగు అద్భుతాభరణములు సర్వాంగములయందును అలంకరింపబడియుండెను. ప్రభువుయొక్క కమలదళములవంటి విశాలనేత్రములను, విపులవక్షస్థలమును, పొడవైన బాహువులను దర్శించు మానవులజన్మములు ధన్యములు. (ఛం॥ 1,2)

దో- వహ సోభా సమాజ సుఖ, కహత న బనఇ ఖగేస ।
బరనహిఁ సారద సేష శ్రుతి, సో రస జాన మహేస ॥ 12(క) ॥
భిన్న భిన్న అస్తుతి కరి, గఏ సుర నిజ నిజ ధామ ।
బందీ బేష బేద తబ, ఆఏ జహఁ శ్రీరామ ॥ 12(ఖ) ॥
ప్రభు సర్బగ్య కీన్హ అతి, ఆదర కృపానిధాన ।
లఖేఉ న కాహూఁ మరమ కఛు, లగే కరన గున గాన ॥ 12(గ) ॥

(కాకభుశుండి పలుకుచున్నాడు) ఓ పక్షి రాజా! గరుడుడా! ఆ దృశ్యశోభ, ఆ సమాజ ప్రత్యేకత, ఆ సందర్భ వైశిష్ట్యము వర్ణనాతీతములు, వాటిని నేను వర్ణింపజాలను. వేదములు, శేషుడు, సరస్వతీదేవి దీనిని నిరంతరము వర్ణించుచుందురు. ఆ దృశ్యానందము పరమేశ్వరునకే యెఱుక. దేవతలు అందఱును వివిధరీతుల స్తుతించి, తమతమ స్థానములకు వెళ్లిపోయిరి. అప్పుడు వేదపురుషులు వందిమాగధులవేషములలో వచ్చిరి. కృపానిధియు, సర్వజ్ఞుడును ఐన ప్రభువు వారిని సాదరముగా ఆహ్వానించెను. ఈ వచ్చినవారు వేదపురుషులు అను రహస్యమును ప్రభువు తప్ప ఎవ్వరును ఎఱుంగరు. వారు ప్రభుగుణములను గానము చేయసాగిరి. (దో॥ 12. క,ఖ,గ)

1) కనుగొంటిని శ్రీరాముని నేడు కనుగొంటిని
ఇనకులమందు ఇంపుగాను పుట్టిన ఇలలోన సీతానాయకుని నేడు ॥కను॥
భరతలక్ష్మణశత్రుఘ్నులును గొలువపవమానసుతుడు పాదముల బట్టధీరులైన
సుగ్రీవప్రముఖులు వినుతిసేయు త్యాగరాయనుతుని నేడు ॥కను॥ (త్యాగరాజ)

## వేద పురుషులు శ్రీరాముని స్తుతించుట

ఛం-జయ సగున నిర్గున రూప రూప అనూప భూప సిరోమనే।
దసకంధరాది ప్రచండ నిసిచర ప్రబల ఖల భుజ బల హనే॥
అవతార నర సంసార భార బిభంజి దారున దుఖ దహే।
జయ ప్రనతపాల దయాల ప్రభు సంజుక్త సక్తి నమామహే॥ 1 ॥
తవ బిషమ మాయా బస సురాసుర నాగ నర అగ జగ హరే।
భవ పంథ భ్రమత అమిత దివస నిసి కాల కర్మ గునని భరే॥
జే నాథ కరి కరునా బిలోకే త్రిబిధి దుఖ తే నిర్బహే।
భవ ఖేద ఛేదన దచ్ఛ హమ కహుఁ రచ్ఛ రామ నమామహే॥ 2 ॥
జే గ్యాన మాన బిమత్త తవ భవ హరని భక్తి న ఆదరీ।
తే పాఇ సుర దుర్లభ పదాదపి పరత హమ దేఖత హరీ॥
బిస్వాస కరి సబ అస పరిహరి దాస తవ జే హోఇ రహే।
జపి నామ తవ బిను శ్రమ తరహిఁ భవ నాథ సో సమరామహే॥ 3 ॥
జే చరన సివ అజ పూజ్య రజ సుభ పరసి మునిపతినీ తరీ।
నఖ నిర్గతా ముని బందితా త్రైలోక పావని సురసరీ॥
ధ్వజ కులిస అంకుస కంజ జుత బన ఫిరత కంటక కిన లహే।
పద కంజ ద్వంద ముకుంద రామ రమేస నిత్య భజామహే॥ 4 ॥
అబ్యక్తమూలమనాది తరు త్వచ చారి నిగమాగమ భనే।
షట కంధ సాఖా పంచ బీస అనేక పర్న సుమన ఘనే॥
ఫల జుగల బిధి కటు మధుర బేలి అకేలి జెహి ఆశ్రిత రహే।
పల్లవత ఫూలత నవల నిత సంసార బిటప నమామహే॥ 5 ॥
జే బ్రహ్మ అజమద్వైతమనుభవగమ్య మన పర ధ్యావహీఁ।
తే కహహుఁ జానహుఁ నాథ హమ తవ సగున జస నిత గావహీఁ॥
కరునాయతన ప్రభు సదగునాకర దేవ యహ బర మాగహీఁ॥
మన బచన కర్మ బికార తజి తవ చరన హమ అనురాగహీఁ॥ 6 ॥

ఓ సగుణనిర్గుణరూపా! నిరుపమలావణ్యభూషితా! ఓ రాజశిరోమణీ! నీకు జయము. నీవు రావణాది ప్రచండప్రబలదుష్టరాక్షసులను నీ బాహుబలముచే వధించితివి. నీవు మానవావ తారమును దాల్చి, సంసారభారమును బాపి, దారుణ దుఃఖములను భస్మమొనర్చితివి. ఓ దయాళూ! ప్రణతపాలా! ప్రభూ! నీకు జయము. శక్తి(సీతాదేవి)తో గూడిన సర్వసమర్థుడవగు నీకు మేము నమస్కరించుచున్నాము. (1) శ్రీహరీ! నీ దుస్తరమైనమాయకు వశులై దేవతలు, రాక్షసులు, నాగులు, మనుష్యులు చరాచరజీవులందఱును కాలకర్మగుణములచే నిండిన జనన మరణరూపభవాటవిలో రాత్రింబవళ్లు పరిభ్రమించుచుందురు. స్వామీ! నీ కృపాదృష్టి ప్రసరించినవారు తాపత్రయములనుండి విముక్తులయ్యెదరు. జననమరణక్లేశములను ఛేదించుటలో దక్షుడవైన శ్రీరామా! మమ్ము రక్షింపుము. నీకు నమస్కరించెదము. (2)శ్రీహరీ! మిథ్యాజ్ఞానాభిమానమత్తులై భవహారిణియైన నీ భక్తికి నోచుకొననివారు దుర్లభమైన పదవిని (మానవజన్మను) పొందియు, పదనీ భ్రష్టులగుచుండుటను మేము చూచుచున్నాము. కాని ఆశలన్నింటిని త్యజించి, నీపై విశ్వాసముఉంచి, నీకు దాసులగువారు కేవలము నీనామజపముచేతనే ఎట్టిశ్రమయు లేకుండ భవసాగరమును తరించెదరు- అట్టినిన్ను స్మరించుచున్నాము. (3) నీ చరణములు పరమేశ్వరునకును, బ్రహ్మకును పూజ్యములు. వాటి మంగళప్రదధూళిస్పర్శమాత్రముననే గౌతమమహర్షిధర్మపత్ని అహల్య ఉద్ధరింపబడినది. ఆ పవిత్రచరణనఖములనుండి ఉద్భవించిన గంగానది ఋషులచే గౌరవింపబడి ముల్లోకములను పావనమొనర్చుచున్నది. వజ్రాయుధము, ధ్వజము, అంకుశము, కమలము మొదలగు దివ్యచిహ్నములుగల ఈ పాదములకు వనభూములలో తిరుగటవలన కంటకములగుర్తులు ఏర్పడినవి. అట్టి పాదములను ఓ ముకుందా! రమాపతీ! శ్రీరామా! మేము సర్వదా భజించెదము. (4) ఈ సంసారవృక్షమునకు పరబ్రహ్మమైన నీవే మూలము. నీస్వరూపము అవ్యక్తము, అనాది (శాశ్వతము). ఈ సంసారవృక్షస్వరూపమునందును నీవే విరాజమానుడవై యున్నావు. ఈ వృక్షమునకు చతుర్విధ (ధర్మార్థకామమోక్షములనెడి) పురుషార్థములు నాల్గును కవచములు. దీనికి షడ్భావవికారములు (జాయతేఽస్తి వర్ధతే విపరిణమతేఽపక్షీయతే వినశ్యతే। (నిరుక్త 1/1/2) ఉత్పత్తి, అస్తిత్వము, వృద్ధి, విపరిణామము, అపక్షయము, వినాశము -అను) ఆఱును స్కంధములు. జడచేతనాత్మకమైన ఈ జగత్తునకు ఇఱువదియైదు (పంచవింశతి) తత్త్వములు (పంచమహాభూతములు, పంచ తన్మాత్రలు, దశేంద్రియములు, మనోబుద్ధ్యహంకారచిత్తములు అను ఇఱువదినాలుగును జడములు, చేతనుడైన జీవుడు ఒక్కడు- వెరసి ఇఱువదియైదు తత్త్వములు-) శాఖలు. అసంఖ్యాకములైన భోగ్యవస్తువులు పత్రములు, పుష్పములు. భోగము, మోక్షము అనురెండును ద్వివిధఫలములు. ధర్మ, మోక్షరూపఫలము మధురము, శాశ్వతము. అర్థ, కామఫలము కటువు, క్షణికము. మాయ అనెడి లత ఈ జగద్వృక్షమునందు అంతటను అల్లుకొనియుండును. ఇది భగవంతుని ఆశ్రయించి, తదధీనమున ఉండును. భగవంతునకు ప్రపన్నులైనవారు ఈ మాయను అధిగమింపగలరు. (మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే॥ (గీత. 7/14) ఈమాయా నిస్తృతి నిత్యనూతనముగా జరుగుచునే యుండును- అని వేదములు, ఆగమములు పేర్కొనుచున్నవి. ఈ సంసారవృక్షరూపమున నీవే విలసిల్లుచున్నావు.[1] సంసారవృక్షరూపుడవైన ఓ రామా! నీకు నమస్కారము. (5) పరబ్రహ్మను జన్మరహితుడనియు, అద్వైతుడనియు, మనస్సునకు గోచరముకానివాడనియు,

---

1) అంతా రామమయం జగమంతా రామమయం ॥అంతా॥
అంతరంగమున ఆత్మారాముడనంతరూపముల వింతలు సల్పగ ॥అంతా॥
సోమ సూర్యులును, సురలు తారలును ఆ మహాంబుధులు నవనీజంబులు ॥అంతా॥
అండాండంబులు, పిండాండంబులు, బ్రహ్మాండంబులు, బ్రహ్మలు మొదలుగ
నదులు వనంబులు నానామృగములు, విహితకర్మములు, వేదశాస్త్రములు ॥అంతా॥ (రామదాసు)

అనుభవగమ్యుడనియు కొందఱు భావించి, ధ్యానింతురు. అట్లు తలంచువారిని తలంపనిండు. కాని మేము మాత్రము నిత్యము నీ సగుణ యశోవైభవములనే, గానము చేయుచుందుము. ఓ కరుణానిధీ! సద్గుణ రాశీ! ప్రభూ! నిర్వికారులమై, త్రికరణశుద్ధిగా సర్వదా నీచరణములనే భక్తితో సేవించుచుండునట్లు వరములను గోరుచున్నాము. (ఛం॥ 1-6)

దో- సబ కే దేఖత బేదన్హ, బినతీ కీన్హి ఉదార।
అంతర్ధాన భఏ పుని, గఏ బ్రహ్మ ఆగార ॥ 13(క) ॥
బైనతేయ సును సంభు తబ, ఆఏ జహఁ రఘుబీర।
బినయ కరత గదగద గిరా, పూరిత పులక సరీర ॥ 13(ఖ)॥

అందఱి సమక్షమున వేదపురుషులు ప్రభువును ఇట్లు ప్రార్థించి, బ్రహ్మలోకమునకు వెళ్లిరి. (కాకభుశుండి పలుకుచున్నాడు) ఓ గరుడా! వినుము. వేదపురుషులు వెళ్ళిన పిదప శివుడు శ్రీరాముని సన్నిధికి వచ్చెను. పులకితగాత్రుడై గద్గదస్వరముతో ఇట్లు స్తుతింపసాగెను. (దో॥ 13. క,ఖ)

## పరమేశ్వరుడు శ్రీరాముని స్తుతించుట

ఛం - జయ రామ రమారమనం సమనం। భవ తాప భయాకుల పాహి జనం।
అవధేస సురేస రమేస బిభో। సరనాగత మాగత పాహి ప్రభో ॥ 1 ॥
దససీస బినాసన బీస భుజా। కృత దూరి మహా మహి భూరి రుజా।
రజనీచర బృంద పతంగ రహే। సర పావక తేజ ప్రచండ దహే ॥ 2 ॥
మహి మండల మండన చారుతరం। ధృత సాయక చాప నిషంగ బరం।
మద మోహ మహా మమతా రజనీ। తమ పుంజ దివాకర తేజ అనీ ॥ 3 ॥
మనజాత కిరాత నిపాత కిఏ। మృగ లోగ కుభోగ సరేన హిఏ।
హతి నాథ అనాథని పాహి హరే। బిషయా బన పావఁర భూలి పరే ॥ 4 ॥
బహు రోగ బియోగన్హి లోగ హఏ। భవదంఘ్రి నిరాదర కే ఫల ఏ।
భవ సింధు అగాధ పరే నర తే। పద పంకజ ప్రేమ న జే కరతే ॥ 5 ॥
అతి దీన మలీన దుఖీ నితహీఁ। జిన్హ కేఁ పద పంకజ ప్రీతి నహీఁ ॥
అవలంబ భవంత కథా జిన్హ కేఁ। ప్రియ సంత అనంత సదా తిన్హ కేఁ ॥ 6 ॥
నహిఁ రాగ న లోభ న మాన మదా। తిన్హ కేఁ సమ బైభవ వా బిపదా।
ఏహి తే తవ సేవక హోత ముదా। ముని త్యాగత జోగ భరోస సదా ॥ 7 ॥
కరి ప్రేమ నిరంతర నేమ లిఏఁ। పద పంకజ సేవత సుద్ధ హిఏఁ।
సమ మాని నిరాదర ఆదరహీ। సబ సంత సుఖీ బిచరంతి మహీ ॥ 8 ॥

మున మానస పంకజ భృంగ భజే । రఘుబీర మహా రనధీర అజే ।
తవ నామ జపామి నమామి హరీ । భవ రోగ మహాగద మాన అరీ ॥ 9 ॥
గున సీల కృపా పరమాయతనం । ప్రనమామి నిరంతర శ్రీరమనం ।
రఘునంద నికందయ ద్వంద్వఘనం । మహిపాల బిలోకయ దీన జనం ॥ 10 ॥

"ఓ రామా! రమారమణా! నీకు జయము. ఓ భవతాపవిదారకా! పునర్జన్మ భయ పీడితులైన జనులను రక్షింపుము. ఓ అయోధ్యాపతీ! దేవదేవా! రమానాథా! విభూ! ప్రభూ! శరణాగతుడను. నన్ను రక్షింపుము. పదితలలు, ఇఱువదిభుజములుగల రావణుని అవలీలగా వధించితివి. భువిలోని భయానకరోగములనన్నింటిని రూపుమాపు శ్రీరామా! నిశాచరశలభములన్నియును నీ బాణాగ్నిలో ప్రచండతేజస్సులో భస్మమైనవి. నీవు ఈ భూమండలమునకు ఒక మనోహర భూషణమైనవాడవు. ఉత్తమమైన ధనుర్బాణములను, తూణీరమును ధరించినవాడవు. నీతేజస్సనెడి సూర్యకిరణసమూహము, అహంకారమోహమమకారములనెడి అంధకారములను దూరమొనర్చును. మన్మథుడనెడి వేటగాడు మనుష్యులనెడి మృగములహృదయములపై భోగేచ్ఛాబాణములతో గొట్టుచున్నాడు. శ్రీహరీ! మీరు ఆ వేటగానిని వధించి, విషయవాంఛలనెడి వనములలో సంచరించెడి పామరజనులను రక్షింపుడు. మీ చరణకమలములను నిరాదరణచేసిన ఫలితముగా జనులు అనేకరోగవియోగములచే కొట్టబడుచున్నారు. మీ పాదపద్మములను ప్రేమింపని వారు అగాధభవసాగరమున మునిగియుందురు. సర్వదా వారత్యంతదీనులు, మలినులు, దుఃఖితులు. కాని మీ లీలావిలాసకథను ఆశ్రయించువారు సజ్జనులు. భగవత్ప్రీతిపాత్రులు. రాగ లోభాభిమానమదములు వారిని దఱిజేరవు. సంపద, ఆపద, రెండును వారికి సమానములే. అందువలననే మునులు యోగసాధనపై విశ్వాసమును వీడి, నిశ్చింతగా ఆనందముతో మీ సేవకులయ్యెదరు. వారు ప్రేమాదరములతో, నియమనిష్ఠలతో, పవిత్రహృదయములతో నిరంతరము నీ చరణకమలములనే సేవించెదరు. వారు ఆదరనిరాదరములను సమముగా భావింతురు. అట్టి సజ్జనులందఱును ఈ భువిపై హాయిగా సంచరింతురు. మునిమానసపంకజ భృంగమా! రణధీర! అజేయా! రఘువీరా! నిన్ను భజించెదను. నీ నామమును జపించెదను. హరీ! నీకు ప్రణమిల్లెదను. నీవు భవరోగములకు దివ్యౌషధమైనవాడవు. అభిమానమునకు వైరివి. నీ గుణములను ఎవ్వరును వర్ణింపజాలరు. నీవు గుణశీలములకును కృపకును పరమనిధానము. లక్ష్మీపతీ! నిరంతరము నీకు ప్రణమిల్లెదను. రఘునందనా! జననమరణసుఖదుఃఖ రాగద్వేషాది ద్వంద్వములను నాశముచేయుము. ఓ మహీపాలా! ఈ దీనసేవకునిపై నీ కృపాదృష్టిని ప్రసరింప జేయుము. (ఛం॥ 1-10)

దో- బార బార బర మాగఉఁ, హరషి దేహు శ్రీరంగ।
పద సరోజ అనపాయనీ, భగతి సదా సతసంగ ॥ 14(క) ॥
బరని ఉమాపతి రామ గున, హరషి గఏ కైలాస।
తబ ప్రభు కపిన్హ దివాఏ, సబ బిధి సుఖప్రద బాస ॥ 14(ఖ) ॥

నీ పదకమలములయందు అనన్యభక్తియు, నీ భక్తులసత్సాంగత్యమూ నాకు నిరంతరము కలుగు గాక- అని పదే పదే నిన్ను ప్రార్థించుచున్నాను. లక్ష్మీశా! ప్రసన్నుడవై నాకు ఈవరమును ప్రసాదింపుము." శ్రీరామచంద్రునిమహోన్నతగుణవైభవములను వర్ణించి, ఉమాపతి, మహా దేవుడు హర్షముతో కైలాసమునకు ఏగెను. పిమ్మట ప్రభువు వానరులకు సుఖప్రదమైన నివాస స్థానములను ఏర్పాటు చేసెను. (దో॥ 14. క,ఖ)

చౌ- సును ఖగపతి యహ కథా పావనీ। త్రిబిధ తాప భవ భయ దావనీ ॥
మహారాజ కర సుభ అభిషేకా। సునత లహహిం నర బిరతి బిబేకా ॥ 1 ॥
జే సకామ నర సునహిం జె గావహిం। సుఖ సంపతి నానా బిధి పావహిం ॥
సుర దుర్లభ సుఖ కరి జగ మాహీం। అంతకాల రఘుపతి పుర జాహీం ॥ 2 ॥
సునహిం బిముక్త బిరత అరు బిషఈ। లహహిం భగతి గతి సంపతి నఈ ॥
ఖగపతి రామ కథా మైం బరనీ। స్వమతి బిలాస త్రాస దుఖ హరనీ ॥ 3 ॥
బిరతి బిబేక భగతి దృఢ కరనీ। మోహ నదీ కహం సుందర తరనీ ॥
నిత నవ మంగల కౌసలపురీ। హరషిత రహహిం లోగ సబ కురీ ॥ 4 ॥
నిత నఇ ప్రీతి రామ పద పంకజ। సబ కేం జిన్హహి నమత సివ ముని అజ ॥
మంగన బహు ప్రకార పహిరాఏ। ద్విజన్హ దాన నానా బిధి పాఏ ॥ 5 ॥

(కాకభుశుండి పలుకుచున్నాడు) ఓ గరుడా! వినుము. ఈ కథ శ్రోతలను పునీతులను గావించుటయే గాక వారిదైవిక, దైహిక, భౌతికపాపములను, జననమరణభయములను, భవ బాధలను తొలగించును. శ్రీరామచంద్రునిరాజ్యపట్టాభిషేకవర్ణనము నిష్కామభావముతో భక్తిశ్రద్ధలతో వినిన మానవులు జ్ఞాన వైరాగ్యములను పొందగలరు. సకామభావముతో ఈ కథను గానము చేయువారు, వినువారు అనేక సుఖసంపదలను పొందెదరు. వారు దేవతలకును దుర్లభమైన సుఖములను అనుభవించి, అంత్యకాలమున రఘురామునిపరమపదమును చేరుదురు. జీవన్ముక్తులు, విరాగులు, విషయలోలురు ఈ కథను విన్నచో వారు క్రమముగా భక్తిని, ముక్తిని, సంపదలను పొందెదరు. ఓ పక్షిరాజా! నేను నా బుద్ధిననుసరించి, ఇంతవఱకు శ్రీరామగాథను వినిపించితిని. ఇది జననమరణభయమును, దుఃఖములను రూపుమాపును. ఈకథ వైరాగ్యవివేకములను, భక్తిని సుదృఢమొనర్చి, మోహనదిని దాటించు చక్కనినౌక. అయోధ్యలో నిత్యనూతన మహోత్సవములు జరుగుచుండెను. అన్నివర్గములప్రజలు ఆనందముగానుండిరి. మహాదేవుడు, బ్రహ్మ, మునీశ్వరులు సర్వదా సేవించుచుండెడి శ్రీరామచరణములపై ప్రజలకు నిత్యనూతనముగా భక్తితత్పరత్వములు వర్ధిల్లుచుండెను. బ్రాహ్మణులకు అనేకదానములు ఒసంగ బడెను. అర్థులకు నానా విధములైన వస్త్రాభరణములు ఇయ్యబడెను. (చౌ॥ 1-5)

దో- బ్రహ్మానంద మగన కపి, సబ కేం ప్రభు పద ప్రీతి।
జాత న జానే దివస తిన్హ, గఏ మాస షట బీతి ॥ 15 ॥

వానరులు బ్రహ్మానందమగ్నులైరి. ప్రభుచరణములయందే వారికి అనన్యభక్తి స్థిరపడెను. రాత్రింబవళ్లు గడచి పోవుటయు వారు గమనింపరైరి. చూచుచుండగనే ఆఱు మాసములు దొర్లి పోయెను. (దో॥ 15)

చౌ- బిసరే గృహ సపనేహుం సుధి నాహీం। జిమి పరద్రోహ సంత మన మాహీం ॥
తబ రఘుపతి సబ సఖా బోలాఏ। ఆఇ సబన్హి సాదర సిరు నాఏ ॥ 1 ॥
పరమ ప్రీతి సమీప బైఠారే। భగత సుఖద మృదు బచన ఉచారే ॥
తుమ్హ అతి కీన్హి మోరి సేవకాఈ। ముఖ పర కేహి బిధి కరౌం బడాఈ ॥ 2 ॥

తాతే మోహి తుమ్హ అతి ప్రియ లాగే । మమ హిత లాగి భవన సుఖ త్యాగే ॥
అనుజ రాజ సంపతి బైదేహీ । దేహ గేహ పరివార సనేహీ ॥ 3 ॥
సబ మమ ప్రియ నహిఁ తుమ్హహి సమానా । మృషా న కహఉఁ మోర యహ బానా ॥
సబ కేఁ ప్రియ సేవక యహ నీతీ । మోరేఁ అధిక దాస పర ప్రీతీ ॥ 4 ॥

వారు స్వగృహములను విస్మరించిరి. సజ్జనులమనస్సులలో పరద్రోహచింత రానట్లు వారికి స్వప్నములోగూడ ఇంటిధ్యాస కలుగుట లేదు. అంతట ఒకనాడు శ్రీ రఘునాథుడు మిత్రులందఱిని పిలిచెను. వారందఱును వచ్చి, సాదరముగా ప్రణమిల్లిరి. శ్రీరాముడు అత్యంత ప్రేమతో వారిని తనదగ్గర కూర్చుండబెట్టుకొని, భక్తులకు సుఖప్రదమైన అత్యంతమృదుమధుర వచనములను పలికెను, "మీరు నాకు ఎంతో సేవచేసియుంటిరి. మీ యెదుట మిమ్ము ఎట్లు ప్రశంసింపవలెను? నాహితముకొఱకు మీరు ఇండ్లను, కుటుంబములను, సర్వసుఖములను త్యజించియుంటిరి. అందువలన మీరు నాకెంతో ప్రియమైనవారు. నాకు నా సోదరులును, రాజ్యమూ, సంపదయు, జానకీదేవియు, నా శరీరము, ఇల్లు, కుటుంబమూ, మిత్రులు వీరందఱును ప్రియమైన వారే. కాని వారు మీ తరువాతనే. నేను సత్యము వచించెదను. ఇది నాకు సహజము. ప్రతియజమానియు తనసేవకుని ప్రేమతో చూడవలెననుట సాధారణ నియమము. కాని నాకు దాసులపైగల ప్రేమ విశిష్టమైనది. (చౌ॥ 1-4)

## సుగ్రీవాదులకు వీడ్కోలు

దో- అబ గృహ జాహు సఖా సబ, భజేహు మోహి దృఢ నేమ ।
సదా సర్బగత సర్బహిత, జాని కరేహు అతి ప్రేమ ॥ 16 ॥

మిత్రులారా! ఇప్పుడు మీరు మీ గృహములకు తరలి పొండు. దృఢమైన నియమముతో నన్ను భజింపుడు. నన్ను సర్వవ్యాపకునిగా, సర్వహితకరునిగా భావించి, ప్రేమింపుడు. (దో॥ 16)

చౌ- సుని ప్రభు బచన మగన సబ భఏ । కో హమ కహాఁ బిసరి తన గఏ ॥
ఏకటక రహే జోరి కర ఆగే । సకహిఁ న కఛు కహి అతి అనురాగే ॥ 1 ॥
పరమ ప్రేమ తిన్హ కర ప్రభు దేఖా । కహా బిబిధ బిధి గ్యాన బిసేషా ॥
ప్రభు సన్ముఖ కఛు కహన న పారహిఁ । పుని పుని చరన సరోజ నిహారహిఁ ॥ 2 ॥
తబ ప్రభు భూషన బసన మగాఏ । నానా రంగ అనూప సుహాఏ ॥
సుగ్రీవహి ప్రథమహిఁ పహిరాఏ । బసన భరత నిజ హాథ బనాఏ ॥ 3 ॥
ప్రభు ప్రేరిత లఛిమన పహిరాఏ । లంకాపతి రఘుపతి మన భాఏ ॥
అంగద బైఠ రహా నహిఁ డోలా । ప్రీతి దేఖి ప్రభు తాహి న బోలా ॥ 4 ॥

ప్రభువచనములను వినగానే అందఱును ప్రేమవిహ్వలురైరి. "మేము ఎవరము? ఎక్కడ నున్నాము?" అనియు వారు ఎఱుగరైరి. వారికి తమ శరీరములపైననే ధ్యాస లేకుండెను. ప్రభువు నెదుట చేతులు జోడించి, తెప్పవాల్చక

చూడసాగిరి. ప్రేమాతిరేకమువలన వారికి నోట మాట రాకుండెను. ప్రభువు వారిప్రేమాధిక్యమును గమనించి, వారికి పెక్కురీతుల విశేషజ్ఞానమును బోధించెను. స్వామియెదుట వారు ఏమియు పలుకజాలక మిన్నకుండిరి. మాటి మాటికిని ప్రభు చరణములపైనే చూచుచుండిరి. అంతట ప్రభువు నిరుపమానసౌందర్యశోభితములైన భూషణములను, వివిధవర్ణములుగలవస్త్రములను తెప్పించెను. భరతుడు స్వయముగా వస్త్రభూషణములతో సుగ్రీవుని అలంకరించెను. పిమ్మట ప్రభునాదేశమునుసరించి, లక్ష్మణుడు విభీషణుని వస్త్రభూషణాలంకృతునిగా జేసెను. రఘునాథుని మనస్సు మిక్కిలి తృప్తి చెందెను. అంగదుడు కూర్చొనియే యుండెను. అతడు తనస్థలమునుండి ఏమాత్రమూ కదలకయుండెను. అతని ప్రగాఢప్రేమను గ్రహించి, ప్రభువు అతనిని పిలువలేదు. (చౌ॥ 1-4)

దో- జామవంత నీలాది సబ, పహిరాఏ రఘునాథ ।
హియఁ ధరి రామ రూప సబ, చలే నాఇ పద మాథ ॥ 17(క) ॥
తబ అంగద ఉఠి నాఇ సిరు, సజల నయన కర జోరి ।
అతి బినీత బోలేఉ బచన, మనహుఁ ప్రేమ రస బోరి ॥ 17(ఖ) ॥

జాంబవంతుడు, నలుడు,నీలుడు మొదలగు వారినందఱిని శ్రీ రఘునాథుడు స్వయముగా వస్త్రభూషణములతో అలంకరించెను. వారందఱును తమహృదయములలో శ్రీరామచంద్రుని రూపమునే నిలుపుకొని, ప్రభుచరణములకు ప్రణమిల్లి వెళ్లిపోయిరి. అప్పుడంగదుడు లేచి, నతమస్తకుడై, సజలనేత్రుడై చేతులు జోడించి, మిక్కిలి వినయముతో ప్రేమార్ద్రహృదయుడై మధురముగ ఇట్లనెను. (దో॥ 17. క,ఖ)

చౌ- సును సర్బగ్య కృపా సుఖ సింధో । దీన దయాకర ఆరత బంధో ॥
మరతీ బేర నాథ మోహి బాలీ । గయఉ తుమ్హారెహి కోఁఛేఁ ఘాలీ ॥ 1 ॥
అసరన సరన బిరదు సంభారీ । మోహి జని తజహు భగత హితకారీ ॥
మోరేఁ తుమ్హ ప్రభు గుర పితు మాతా । జాఉఁ కహాఁ తజి పద జలజాతా ॥ 2 ॥
తుమ్హహి బిచారి కహహు నరనాహా । ప్రభు తజి భవన కాజ మమ కాహా ॥
బాలక గ్యాన బుద్ధి బల హీనా । రాఖహు సరన నాథ జన దీనా ॥ 3 ॥
నీచి టహల గృహ కై సబ కరిహఉఁ । పద పంకజ బిలోకి భవ తరిహఉఁ ॥
అస కహి చరన పరేఉ ప్రభు పాహీ । అబ జని నాథ కహహు గృహ జాహీ ॥ 4 ॥

"ఓ సర్వజ్ఞా! కృపాసాగరా! సుఖనిధానా! దీనదయాళూ! దుఃఖజనబంధూ! ప్రభూ! వినుడు. అసువులు వీడునపుడు మా తండ్రిగారైన వాలి నన్ను మీ చేతులలో పెట్టిపోయెను. కావున ఓ భక్త మందారమా! అశరణ శరణ్యులు' అను మీ బిరుదమును మనస్సులో ఉంచుకొని, నన్ను వీడకుడు. నాకు ప్రభువు, గురువు, తల్లియు, తండ్రియు- అన్నియు మీరే. మీ చరణకమలములను వదలి నేనెక్కడికి వెళ్లను? ఓ మహారాజా! మీరే ఆలోచించి వచింపుడు. ప్రభునైన మిమ్ము వదలి ఇంటిలో నాకేమి పని? జ్ఞానము, బుద్ధి, బలము లేని ఈ పసివానిని దీనుని, సేవకుని మీ శరణుజొచ్చిన

వానినిగా భావింపుడు. నేను మీ ఇంటిలో చిన్నచిన్నపనులనుసైతము చేయుదును. మీ చరణ కమలములను సేవించుచు, దర్శించుచు భవసాగరమును దాటెదను." ఇట్లు పలికి, అంగదుడు ప్రభుపాదపద్మములపై వ్రాలెను. "ప్రభూ! నన్ను రక్షింపుడు. నన్ను ఇంటికి వెళ్లుమని ఆజ్ఞాపింపకుడు" అని నుడివెను. (చౌ॥ 1-4)

దో- అంగద బచన బినీత సుని, రఘుపతి కరునా సీంవ ।
ప్రభు ఉఠాఇ ఉర లాయఉ, సజల నయన రాజీవ ॥ 18(క) ॥
నిజ ఉర మాల బసన మని, బాలితనయ పహిరాఇ ।
బిదా కీన్హి భగవాన తబ, బహు ప్రకార సముఝాఇ ॥ 18(ఖ) ॥

అంగదుని వినమ్రవచనములను విని, కరుణానిధియగు శ్రీరామచంద్రుడు ఆతనిని లేవనెత్తి, తనహృదయమునకు హత్తుకొనెను. ప్రభు నేత్రకమలములయందు ప్రేమాశ్రువులు నిండెను. తన వక్షస్థలమునందలి మాలను, అనేక వస్త్రములను, మణులను అంగదునకు అలంకరించి, ఆతనికి అనేకవిధముల నచ్చజెప్పి, శ్రీరాముడు ఆతనికి వీడ్కోలును ఇచ్చెను. (దో॥ 18. క,ఖ)

చౌ- భరత అనుజ సౌమిత్రి సమేతా । పఠవన చలే భగత కృత చేతా ॥
అంగద హృదయఁ ప్రేమ నహిఁ థోరా । ఫిరి ఫిరి చితవ రామ కీఁ ఓరా ॥ 1 ॥
బార బార కర దండ ప్రనామా । మన అస రహన కహహిఁ మోహి రామా ॥
రామ బిలోకని బోలని చలనీ । సుమిరి సుమిరి సోచత హఁసి మిలనీ ॥ 2 ॥
ప్రభు రుఖ దేఖి బినయ బహు భాషీ । చలేఉ హృదయఁ పద పంకజ రాఖీ ॥
అతి ఆదర సబ కపి పహుఁచాఏ । భాఇన్హ సహిత భరత పుని ఆఏ ॥ 3 ॥
తబ సుగ్రీవ చరన గహి నానా । భాఁతి బినయ కీన్హే హనుమానా ॥
దిన దస కరి రఘుపతి పద సేవా । పుని తవ చరన దేఖిహఉఁ దేవా ॥ 4 ॥
పున్య పుంజ తుమ్హ పవనకుమారా । సేవహు జాఇ కృపా ఆగారా ॥
అస కహి కపి సబ చలే తురంతా । అంగద కహఇ సునహు హనుమంతా ॥ 5 ॥

భక్తితో నిండిన అంగదుని సేవలను గుర్తించి, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు అతని వెంట కొంత దూరము వెళ్ళి, అతనిని వీడ్కొలిపిరి. అంగదుని హృదయము ప్రేమపూర్ణమై యుండెను. అతడు మాటి మాటికి వెనుదిరిగి, శ్రీరాముని జూచుచు, ప్రణామములను సమర్పించుచు వెళ్లుచుండెను. శ్రీరామచంద్రుడు తనను నిలిపి, 'అయోధ్యలోనే ఉండుము' అని పలుకునను విశ్వాసము అతని మనస్సులో ఉండెను. శ్రీరాముని చూపులను, పలుకులను, నడకలను, దరహాసములను, తలచి తలచి, అంగదుడు ప్రేమవిహ్వలుడాయెను. కాని ప్రభువుయొక్క మనోభావములను ఎఱింగి, పెక్కు వినయవచనములను పలుకుచు ప్రభుచరణకమలములను తనమనస్సున నిలుపుకొని, అంగదుడు వెడలిపోయెను. వానరులందఱికిని అత్యంతాదరముతో వీడ్కోలునిచ్చి, భరతుడు, అతని సోదరులు తిరిగివచ్చిరి. పిమ్మట హనుమంతుడు సుగ్రీవుని పాదములకు నమస్కరించి, వినమ్రముగా ఇట్లనెను.

"ప్రభూ! నేను ఒక పదిదినములు శ్రీరాముని సేవలలో గడిపి, మఱల మీ పాదములసన్నిధికి చేరెదను." సుగ్రీవుడు సమాధానమును ఇచ్చెను. "ఓ ఆంజనేయా! నీవు పుణ్యరాశివి. (శ్రీరామచంద్రుడు నిన్ను తనసేవలలో నిలుపుకొనెను) వెళ్లి, దయానిధియైన శ్రీరామచంద్రుని సేవించుచుండుము." పిమ్మట వానరులందఱును వెంటనే బయలుదేఱిరి. అంగదుడు పల్కెను. "మారుతీ! వినుము. (చౌ॥ 1-5)

దో- కహేహు దండవత ప్రభు సైఁ, తుమ్హహి కహఉఁ కర జోరి ।
బార బార రఘునాయకహి, సురతి కరాఏహు మోరి ॥ 19(క) ॥
అస కహి చలేఉ బాలిసుత, ఫిరి ఆయఉ హనుమంత ।
తాసు ప్రీతి ప్రభు సన కహీ, మగన భఏ భగవంత ॥ 19(ఖ) ॥
కులిసహు చాహి కఠోర అతి, కోమల కుసుమహు చాహి ।
చిత్త ఖగేస రామ కర, సముఝి పరఇ కహు కాహి ॥ 19(గ) ॥

చేతులు జోడించి, నిన్ను ప్రార్థించెదను. ప్రభువునకు నా ప్రణామములను దెల్పుము. అప్పుడప్పుడు నన్ను ప్రభువునకు జ్ఞాపకముచేయుచుండుము." ఈ విధముగా పలికి, వాలి పుత్రుడైన అంగదుడు ప్రయాణమయ్యెను. హనుమంతుడు తిరిగి వచ్చి, అంగదునిఅనన్యభక్తిని గూర్చి ప్రభువునకు నివేదించెను. అది విని భగవంతుడు అమితానందము నొందెను. (కాక భుశుండి పలుకుచున్నాడు) ఓ గరుడుడా! శ్రీరాముని హృదయము వజ్రముకంటెను కఠినము. పూవులకంటెను కోమలము. ఈ విషయమును ఎవరెఱుంగుదురు? మీరే తెల్పుడు. (వజ్రాదపి కఠోరాణి, మృదూని కుసుమాదపి) (దో॥ 19. క,ఖ,గ)

చౌ- పుని కృపాల లియో బోలి నిషాదా । దీన్హే భూషన బసన ప్రసాదా ॥
జాహు భవన మమ సుమిరన కరేహూ । మన క్రమ బచన ధర్మ అనుసరేహూ ॥ 1 ॥
తుమ్హ మమ సఖా భరత సమ భ్రాతా । సదా రహేహు పుర ఆవత జాతా ॥
బచన సునత ఉపజా సుఖ భారీ । పరేఉ చరన భరి లోచన బారీ ॥ 2 ॥
చరన నలిన ఉర ధరి గృహ ఆవా । ప్రభు సుభాఉ పరిజనన్హి సునావా ॥
రఘుపతి చరిత దేఖి పురబాసీ । పుని పుని కహహిఁ ధన్య సుఖరాసీ ॥ 3 ॥
రామ రాజ బైఠేఁ త్రైలోకా । హరషిత భఏ గఏ సబ సోకా ॥
బయరు న కర కాహూ సన కోఈ । రామ ప్రతాప బిషమతా ఖోఈ ॥ 4 ॥

పిమ్మట కృపాళువైన శ్రీరామచంద్రప్రభువు నిషాదరాజును పిలిపించి, వస్త్రాభరణములను ప్రసాదరూపముగా సమర్పించి పలికెను. "ఇప్పుడు మీరు ఇంటికి వెళ్లి, నన్ను స్మరించుచు త్రికరణ శుద్ధిగా ధర్మమును ఆచరింపుడు. మీరు నా మిత్రులు. భరతునితోసమానులు. తఱచుగా అయోధ్యకు వచ్చుచుండవలెను." ఈ మాటలు వినినంతనే నిషాదరాజునకు అపరిమితానందము గల్గెను. నేత్రములు ప్రేమాశ్రువులతో నిండెను. అతడు ప్రభుచరణములపై

వ్రాలెను. శ్రీరామచంద్ర ప్రభుచరణకమలములను తనహృదయమున నిలుపుకొని, అతడు తనఇంటికి వేడెను. అచట తన కుటుంబ సభ్యులందరికిని ప్రభుస్వభావమును గూర్చి వినిపించెను. శ్రీ రఘునాథునిలీలలను జూచిన అయోధ్యావాసులందఱును "సర్వసుఖములరాశియైన శ్రీరామచంద్రుడు ధన్యుడు" అని మాటి మాటికిని తలంచు కొనుచుండిరి. శ్రీరాముడు సింహాసనాసీనుడగుటచే సర్వలోకములును సంతసించెను. వారిశోకసంతాపములు మటుమాయములయ్యెను. వైరభావమునకేమాత్రమూ తావులేని సోదరభావముతో వారు మసలుకొనుచుండిరి. శ్రీరామచంద్రుని మహిమచే అందఱును పరస్పరప్రేమానురాగములతో తమ జీవితములను కొనసాగించుచుండిరి. (చౌ॥ 1-4)

## రామ రాజ్యము

దో- బరనాశ్రమ నిజ నిజ ధరమ, నిరత బేద పథ లోగ।
చలహిఁ సదా పావహిఁ సుఖహి, నహిఁ భయ సోక న రోగ ॥ 20 ॥

రామరాజ్యమునందు ప్రజలందఱును తమతమవర్ణాశ్రమనియమములను అనుసరించి, ధర్మతత్పరులై యుండిరి, వేదమార్గమున సంచరించుచు సుఖులై యుండిరి. భయము, రోగము, శోకము అనునవి వారికి తెలియకుండెను. (దో॥ 20)

చౌ- దైహిక దైవిక భౌతిక తాపా। రామ రాజ నహిఁ కాహుహి బ్యాపా ॥
సబ నర కరహిఁ పరస్పర ప్రీతీ। చలహిఁ స్వధర్మ నిరత శ్రుతి నీతీ ॥ 1 ॥
చారిఉ చరన ధర్మ జగ మాహీఁ। పూరి రహా సపనేహుఁ అఘ నాహీఁ ॥
రామ భగతి రత నర అరు నారీ। సకల పరమ గతి కే అధికారీ ॥ 2 ॥
అల్పమృత్యు నహిఁ కవనిఉ పీరా। సబ సుందర సబ బిరుజ సరీరా ॥
నహిఁ దరిద్ర కోఉ దుఖీ న దీనా। నహిఁ కోఉ అబుధ న లచ్ఛన హీనా ॥ 3 ॥
సబ నిర్దంభ ధర్మరత పునీ। నర అరు నారి చతుర సబ గునీ ॥
సబ గునగ్య పండిత సబ గ్యానీ। సబ కృతగ్య నహిఁ కపట సయానీ ॥ 4 ॥

శ్రీరాముని పాలనమున ఎవ్వరును దైవిక, దైహిక, భౌతిక తాప(త్రయ)ములకు లోను కాకుండిరి. జనులెల్లరును పరస్పరప్రేమానురాగములతో వేదోక్తనీతిమార్గతత్పరులై, తమతమ ధర్మములను నిర్వహించుచుండిరి. ధర్మము నాల్గుపాదములపై (సత్యము, శౌచము, దయ, దానము-అను వానిపై) పరిపూర్ణముగా నడచుచుండెను. స్వప్నములోనైనను పాపమనునదియే కానరాకుండెను. స్త్రీ పురుషులు రామభక్తిలో లీనమైయుండిరి. రామానుగ్రహమున అయోధ్యావాసులు అందఱును పరమపదమునకు పాత్రులై యుండిరి. ప్రజలెవ్వరును అకాల మృత్యువునకు గురి కాకుండిరి. ఎవ్వరికిని ఎట్టి బాధలును లేకుండెను. అందఱి శరీరములును స్వాస్థ్యము, సౌందర్యము కలిగియుండెను. రామరాజ్యమున దరిద్రులు, దీనులు, దుఃఖితులు, మూర్ఖులు, శుభలక్షణహీనులు ఏమాత్రము లేకుండిరి. అందఱును దంభరహితులై, ధర్మపరాయణులై, పుణ్యాత్ములై యుండిరి. స్త్రీ పురుషులెల్లరును నీతినిపుణులు, గుణవంతులు. గుణములను సముచితముగాఆదరించెడివారు. వారు పండితులు, జ్ఞానులు, కృతజ్ఞులు, కపటమునెఱుగని వారు. (చౌ॥ 1-4)

దో- రామ రాజ నభగేస సును, సచరాచర జగ మాహిం ।
కాల కర్మ సుభావ గున, కృత దుఖ కాహుహి నాహిం ॥ 21 ॥

(కాకభుశుండి పలుకుచున్నాడు) పక్షిరాజా! వినుము. రామరాజ్యమునందు చేతనాచేతన జగత్తులోని కాల, కర్మ, స్వభావగుణజనితములైన దుఃఖములెవ్వరినీ బాధింపకుండెను. (దో॥ 21)

చౌ- భూమి సప్త సాగర మేఖలా । ఏక భూప రఘుపతి కోసలా ॥
భుఅన అనేక రోమ ప్రతి జాసూ । యహ ప్రభుతా కఛు బహుత న తాసూ ॥ 1 ॥
సో మహిమా సముఝత ప్రభు కేరీ । యహ బరనత హీనతా ఘనేరీ ॥
సోఉ మహిమా ఖగేస జిన్హ జానీ । ఫిరి ఏహిం చరిత తిన్హహుం రతి మానీ ॥ 2 ॥
సోఉ జానే కర ఫల యహ లీలా । కహహిం మహా మునిబర దమసీలా ॥
రామ రాజ కర సుఖ సంపదా । బరని న సకఇ ఫనీస సారదా ॥ 3 ॥
సబ ఉదార సబ పర ఉపకారీ । బిప్ర చరన సేవక నర నారీ ॥
ఏకనారి బ్రత రత సబ ఝారీ । తే మన బచ క్రమ పతి హితకారీ ॥ 4 ॥

సప్తసముద్రములమధ్యగల భూములన్నింటికిని కోసలపతి శ్రీరఘునాథుడే ఏకచ్ఛత్రాధిపతిగానుండెను. భగవంతుని ప్రతిరోమమునందును అనేకబ్రహ్మాండములున్నవి. అట్టి ప్రభువునకు సప్తసముద్రవలయితసప్తద్వీపములపై అధికారముండుట గొప్పగాదు. పైగా ప్రభు మహిమను ఎఱింగిన వారికి ఇట్లు వర్ణించి చెప్పుట స్వల్పవిషయముగా కన్పించును. కాని గరుడా! ఆ రామునిమహత్త్వమునెఱింగినవారికిగూడ ఈ లీలలపైనను ప్రేమాదరములుండును. ఈ మహిమను తెలిసికొనుటవలన గలుగుఫలము ఈ లీలలను అనుభవించుటయేయని సంయమీంద్రులు నుడువుదురు. రామరాజ్యమునందలిసుఖసంపదలను శేషుడును సరస్వతీదేవియు వర్ణింపజాలరు. అచటి స్త్రీపురుషులందఱును ఉదారులు, పరోపకారులు, బ్రాహ్మణచరణములను సేవించువారు. పురుషులు ఏకపత్నీవ్రతులు, స్త్రీలు త్రికరణశుద్ధిగా పతిహితమునకై పాటుపడువారు. (చౌ॥ 1-4)

దో- దండ జతిన్హ కర భేద జహం, నర్తక నృత్య సమాజ ।
జీతహు మనహి సునిఅ అస, రామచంద్ర కేం రాజ ॥ 22 ॥

శ్రీరామచంద్రునిపాలనలో 'దండము' సన్న్యాసుల చేతులలోనే యుండెడిది. 'భేదము' అను పదము కేవలము నర్తక సమాజములలో రాగ, తాళముల యందే వినబడు చుండెది. 'జయము' అను పదము కేవలము మనస్సును జయించుట (కామక్రోధాది వికారములను జయించుట) అనుసందర్భమున మాత్రమే ప్రయోగింప బడుచుండెడిది. (దో॥ 22)

చౌ- ఫూలహిం ఫరహిం సదా తరు కానన । రహహిం ఏక సంగ గజ పంచానన ॥
ఖగ మృగ సహజ బయరు బిసరాఈ । సబన్హి పరస్పర ప్రీతి బఢాఈ ॥ 1 ॥

కూజహిం ఖగ మృగ నానా బృందా । అభయ చరహిం బన కరహిం అనందా ॥
సీతల సురభి పవన బహ మందా । గుంజత అలి లై చలి మకరందా ॥ 2 ॥
లతా బిటప మాగేఀ మధు చవహీం । మనభావతో ధేను పయ స్రవహీం ॥
ససి సంపన్న సదా రహ ధరనీ । త్రేతాఀ భఇ కృతజుగ కై కరనీ ॥ 3 ॥
ప్రగటీం గిరిన్హ బిబిధి మని ఖానీ । జగదాతమా భూప జగ జానీ ॥
సరితా సకల బహహిం బర బారీ । సీతల అమల స్వాద సుఖకారీ ॥ 4 ॥
సాగర నిజ మరజాదాఀ రహహీం । డారహిం రత్న తటన్హి నర లహహీం ॥
సరసిజ సంకుల సకల తడాగా । అతి ప్రసన్న దస దిసా బిభాగా ॥ 5 ॥

వనములలోని వృక్షములు అన్నికాలములయందును పుష్పఫలభరితములై యుండెను. ఏనుగులు, సింహములు పరస్పరవైరములు మాని, ప్రేమతో మసలుకొనుచుండెను. పక్షులును, వన్యమృగములును సహజవైరములను మఱచి, నిర్భయముగా కలిసి మెలిసి తిరుగుచుండెను. పక్షులు మధురముగా కూయుచుండెను. నానావిధ పశుసమూహములు భయరహితముగా సంచరించుచు ఉల్లాసముగా ఉండెను. శీతలమందసుగంధపవనములు అంతటను వీచుచుండెను. భ్రమరములు పుష్పమకరందపానములచే మత్తిల్లి, ఝుంకారములు సేయుచుండెను. లతలు, వృక్షములు కోరినంతనే తేనెలను కురియుచుండెను. గోబృందములు సమృద్ధిగా పాలనిచ్చుచుండెను. భూములు పాడిపంటలతో తులతూగుచుండెను. త్రేతాయుగములో కృతయుగ లక్షణములు ప్రత్యక్షమగు చుండెను. సమస్తజగత్తునకుప్రభువైన శ్రీరాముడు సాక్షాత్తుగా ఆ పరమాత్మయేయని యెఱింగి, పర్వతములు అనేకములైన మణులను ఒసంగుచుండెను. నదులన్నియును ఉత్తమ, శీతల, నిర్మల సుఖ ప్రదములైన మధుర జలములతో ప్రవహించుచుండెను. సాగరములు తమపరిధిలోనుండి మనుష్యులకై తీరములయందు రత్నములను చేర్చుచుండెను. తటాకము (సరస్సు)లన్నియును కమలములతో విలసిల్లుచుండెను. దశ దిశలయందుగల సర్వప్రదేశములలోను ఆనందము వెల్లివిరియుచుండెను. (చౌ॥ 1-5)

దో- బిధు మహి పూర మయూఖన్హి, రబి తప జేతనేహి కాజ ।
మాగేఀ బారిద దేహిం జల, రామచంద్ర కేఀ రాజ ॥ 23 ॥

శ్రీరామరాజ్యములో చంద్రుడు తనచల్లని అమృతమయకిరణములను పృథ్వియందు అంతటను ప్రసరింపజేయుచుండెను. సూర్యుడు అవసరమగునంత వేడినే ఒసంగుచుండెను. మేఘములు వలసినమేరకు వర్షములను కురియుచుండెను. (దో॥ 23)

చౌ- కోటిన్హ బాజిమేధ ప్రభు కీన్హే । దాన అనేక ద్విజన్హ కహఀ దీన్హే ॥
శ్రుతి పథ పాలక ధర్మ ధురంధర । గునాతీత అరు భోగ పురందర ॥ 1 ॥
పతి అనుకూల సదా రహ సీతా । సోభా ఖాని సుసీల బినీతా ॥
జానతి కృపాసింధు ప్రభుతాఈ । సేవతి చరన కమల మన లాఈ ॥ 2 ॥

జద్యపి గృహాఁ సేవక సేవకినీ । బిపుల సదా సేవా బిధి గునీ ॥
నిజ కర గృహ పరిచరజా కరఈఁ । రామచంద్ర ఆయసు అనుసరఈఁ ॥ 3 ॥
జెహి బిధి కృపాసింధు సుఖ మానఇ । సొఇ కర శ్రీ సేవా బిధి జానఇ ॥
కౌసల్యాది సాసు గృహ మాహీఁ । సేవఇ సబన్హి మాన మద నాహీఁ ॥ 4 ॥
ఉమా రమా బ్రహ్మాది బందితా । జగదంబా సంతతమనిందితా ॥ 5 ॥

శ్రీరామచంద్రప్రభువు పెక్కు అశ్వమేధయాగములను జేసి, బ్రాహ్మణులకు అనేకదానముల నొసంగెను. ఆయన వైదికమార్గపరిరక్షకుడై, ధర్మధురంధరుడై, త్రిగుణాతీతుడై అలరారుచుండెను. ఐశ్వర్యమున శ్రీరామునకు ఇంద్రుడుగూడ సాటికాజాలడు. సౌందర్యరాశి, సుశీల, వినయశోభితయైన సీతాదేవి సదా పతి మనస్సును ఎఱింగి ప్రవర్తించుచుండెను. దయానిధియైన శ్రీరామచంద్రునిమహిమను ఆమె యెఱుంగును. శ్రీరాముని చరణ కమలములకు ఆమె తనమనస్సును అంకిత మొనర్చి, సేవించుచుండెను. గృహమున కుశలురైన సేవాపరాయణులైన పెక్కుమంది దాసదాసీజనులు ఉన్నను సీతాదేవి తనపతిసేవలను తానే నిర్వర్తించుకొనుచుండెను. కృపానిధియైన శ్రీరాముని ఆజ్ఞలను పాలించుచు ఆయనకు ఆమె సుఖానందములను గూర్చుచుండెను. సేవా విధులలో ఆమె మిక్కిలి సమర్థురాలు. గర్వము గాని, అహంకారముగాని లేకుండ ఆమె కౌసల్యాదేవి మొదలగు అత్తగార్లకు చక్కని సపర్యలను చేయుచుండెను. శివుడు పలుకుచున్నాడు. ఓ ఉమా! బ్రహ్మాది దేవతలకు పూజ్యురాలు, సంతతము అనిందిత, దోషరహిత, జగజ్జనని యైన రమాదేవియే సీతాదేవి. (చౌ॥ 1-5)

దో- జాసు కృపా కటాచ్ఛు సుర, చాహత చితవ న సోఇ ।
రామ పదారబింద రతి, కరతి సుభావహి ఖోఇ ॥ 24 ॥

దేవతలందఱును ఆమెకృపాకటాక్షములను కోరుకొనుచున్నను, ఆమె వారిని కన్నెత్తియైనను చూడదు. అట్టి లక్ష్మీదేవి తనసహజచాంచల్యములనుగూడ మఱచి శ్రీరామచంద్రప్రభుచరణ కమలములయందు అచంచలప్రేమ కలిగియుండెను. (దో॥ 24)

చౌ- సేవహిఁ సానుకూల సబ భాఈఁ । రామచరన రతి అతి అధికాఈఁ ॥
ప్రభు ముఖ కమల బిలోకత రహహీఁ । కబహుఁ కృపాల హమహి కఛు కహహీఁ ॥ 1 ॥
రామ కరహిఁ భ్రాతన్హ పర ప్రీతీ । నానా భాఁతి సిఖావహిఁ నీతీ ॥
హరషిత రహహిఁ నగర కే లోగా । కరహిఁ సకల సుర దుర్లభ భోగా ॥ 2 ॥
అహనిసి బిధిహి మనావత రహహీఁ । శ్రీ రఘుబీర చరన రతి చహహీఁ ॥
దుఇ సుత సుందర సీతాఁ జాఏ । లవ కుస బేద పురానన్హ గాఏ ॥ 3 ॥
దోఉ బిజఈ బినఈ గున మందిర । హరి ప్రతిబింబ మనహుఁ అతి సుందర ॥
దుఇ దుఇ సుత సబ భ్రాతన్హ కేరే । భఏ రూప గున సీల ఘనేరే ॥ 4 ॥

సోదరులందఱును శ్రీరామునిపాదపద్మములను మిగులప్రేమతో సేవించుచుండిరి. కృపాళువైన ప్రభువు ఎప్పుడేయాజ్ఞను ఇచ్చునోయని నిరీక్షించుచుండిరి. శ్రీరాముడుగూడ సోదరులపై ఎంతేని అనురాగము గలిగియుండెను.

వారికి అనేకరీతుల అనువగు నీతిమార్గములను బోధించుచుండెను. నగరవాసులు ప్రసన్నచిత్తములతో దేవతలకును దుర్లభమైన సౌఖ్యములను అనుభవించుచుండిరి. శ్రీరామచంద్రప్రభుచరణములపై భక్తిని ప్రసాదింపుమని నిరంతరము వారు బ్రహ్మదేవుని ప్రార్థించుచుండిరి. సీతాదేవికి, 'లవకుశులు' అను ఇరువురు (కవల) కుమారులు ఉదయించిరి. వారు రణకోవిదులు, వినయమునకును సద్గుణములకును నిధానములు. అత్యంత సుందరులు. శ్రీరామునకు ప్రతిబింబములు. శ్రీరాముని సోదరులకును ఒక్కొక్కరికి ఇద్దఱేసి కుమారులు కలిగిరి. వారందఱును సుందరులు, సుశీలురు, సద్గుణ సంపన్నులు. (చౌ॥ 1-4)

దో- గ్యాన గిరా గోతీత అజ, మాయా మన గున పార ।
సోఇ సచ్చిదానంద ఘన, కర నర చరిత ఉదార ॥ 25 ॥

శ్రీరాముడు జ్ఞానమునకును, వాక్కునకును, ఇంద్రియములకును, అగోచరమైనవాడు, జన్మరహితుడు మాయకును, మనస్సునకును, త్రిగుణములకును అతీతుడైన సచ్చిదానంద పరబ్రహ్మ. అతడు మానవునిగా మనోహర లీలలను ప్రదర్శించుచు అందఱిని ఆహ్లాదపఱచుచుండెను. (దో॥ 25)

చౌ- ప్రాతకాల సరఊ కరి మజ్జన । బైఠహిం సభాం సంగ ద్విజ సజ్జన ॥
బేద పురాన బసిష్ట బఖానహిం । సునహిం రామ జద్యపి సబ జానహిం ॥ 1 ॥
అనుజన్హ సంజుత భోజన కరహీం । దేఖి సకల జననీం సుఖ భరహీం ॥
భరత సత్రుహన దోనఉ భాఈ । సహిత పవనసుత ఉపబన జాఈ ॥ 2 ॥
బూఝహిం బైఠి రామ గున గాహా । కహ హనుమాన సుమతి అవగాహా ॥
సునత బిమల గున అతి సుఖ పావహిం । బహురి బహురి కరి బినయ కహావహిం ॥ 3 ॥
సబ కేం గృహ గృహ హోహిం పురానా । రామచరిత పావన బిధి నానా ॥
నర అరు నారి రామ గున గానహిం । కరహిం దివస నిసి జాత న జానహిం ॥ 4 ॥

శ్రీరామచంద్రుడు ఉషఃకాలమునందే సరయూనదిలో స్నానములనాచరించి, బ్రాహ్మణులతో సజ్జనులతో సభాసీనుడగుచుండును. వసిష్ఠమహర్షి వేదపురాణములను పఠించును. సర్వజ్ఞుడైన శ్రీరాముడు వాటిని శ్రద్ధగా వినును. ప్రభువు సోదరులతోగూడి భుజించుచుండును. ఈ దృశ్యము మాతలకు నయనానందమును గూర్చును. భరతశత్రుఘ్నులిద్దఱును హనుమంతునితో గలిసి, ఉపవనములకు వెళ్ళెదరు. అచటగూర్చొని, శ్రీరామచంద్రుని లోకోత్తరకథలను అడిగెదరు. హనుమంతుడు తనబుద్ధి బలమునననుసరించి, ప్రభుగుణగానమున నిమగ్నుడగుచుండును. ప్రభువు యొక్క నిర్మలగుణములను విని, సోదరులిద్దఱును అతి ప్రసన్నులై వాటిని మాటిమాటికిని తెల్పుమని సవినయముగా ప్రార్థింతురు. నగరవాసులఇండ్లలో పౌరాణికగాథలు శ్రీరాముని పవిత్రకథలు అనేకములువినబడుచుండును. స్త్రీపురుషులందఱును శ్రీరామునిగుణ విశేషములను ప్రస్తుతించుచు, ఆనందమగ్నులై రాత్రింబవళ్ళు గడచిపోవుటను గమనింపకుండిరి. (చౌ॥ 1-4)

దో- అవధపురీ బాసిన్హ కర, సుఖ సంపదా సమాజ ।
సహస సేష నహిం కహి సకహిం, జహం నృప రామ బిరాజ ॥ 26 ॥

శ్రీరామచంద్రుడు విరాజమానుడైయున్న అయోధ్యాపురమునందలి జనులసుఖసంపదలను వేలకొలది శేషులుసైతము వర్ణింప జాలరు. (దో॥ 26)

చౌ- నారదాది సనకాది మునీసా । దరసన లాగి కోసలాధీసా ॥
దిన ప్రతి సకల అజోధ్యా ఆవహిఁ । దేఖి నగరు బిరాగు బిసరావహిఁ ॥ 1 ॥
జాతరూప మని రచిత అటారీఁ । నానా రంగ రుచిర గచ ఢారీఁ ॥
పుర చహుఁ పాస కోట అతి సుందర । రచే కఁగూరా రంగ రంగ బర ॥ 2 ॥
నవ గ్రహ నికర అనీక బనాఈం । జను ఘేరీ అమరావతి ఆఈం ॥
మహి బహు రంగ రచిత గచ కాఁచా । జో బిలోకి మునిబర మన నాచా ॥ 3 ॥
ధవల ధామ ఊపర నభ చుంబత । కలస మనహుఁ రబి ససి దుతి నిందత ॥
బహు మని రచిత ఝరోఖా భ్రాజహిఁ । గృహ గృహ ప్రతి మని దీప బిరాజహిఁ ॥ 4 ॥

నారదాదిమహర్షులును, సనకాదిమునీశ్వరులును, కోసలాధీశుడగు శ్రీరాముని దర్శనమునకై నిత్యము అయోధ్యకు ఏతెంచుచుండిరి. నగర వైభవమును జూచి, వారు తమ వైరాగ్యమును గూడ మఱచుచుండిరి. బంగారుమణులతో నిర్మింపబడిన పైఅంతస్థులు, చిత్రవిచిత్ర వర్ణములతో కనువిందుగావించుచున్న భవనములలోపలిభాగములు, సందర్శకులను ఆకర్షించు చుండెను. నగరమునకు నాలుగువైపులయందునుగల సుందరప్రాకారములపై వివిధవర్ణములతో చిత్ర విచిత్రములైన బురుజులు నిర్మింపబడియుండెను. నవగ్రహములు అసంఖ్యాకబలములతో గూడి అమరావతీనగరమును చుట్టియున్నారా? అనునట్లుగ అవి శోభిల్లుచుండెను. అనేక వర్ణముల స్ఫటికశిలలుపఱచబడినవీధులను, కూడళ్లను గాంచి మునీశ్వరులమనస్సులును ఆనందహేలలలో తేలియాడుచుండెను. ధవళకాంతులను విరజిమ్ము సౌధములు ఆకాశమును ముద్దాడుచుండెను. వాటిపైగల కలశములు తమకాంతులచే సూర్యచంద్రులనుగూడ అధఃకరించుచుండెను. భవనములయందలి కిటికీలు మణిఖచితములై యుండెను. ప్రతి గృహములో మణులు దీపకాంతులను విరజిమ్ముచుండెను. (చౌ॥ 1-4)

ఛం-మని దీప రాజహిఁ భవన భ్రాజహిఁ దేహరీఁ బిద్రుమ రచీ ।
మని ఖంభ భీతి బిరంచి బిరచీ కనక మని మరకత ఖచీ ॥
సుందర మనోహర మందిరాయత అజిర రుచిర ఫటిక రచే ।
ప్రతి ద్వార ద్వార కపాట పురట బనాఇ బహు బజ్రన్హి ఖచే ॥

భవనములలో మణులదీపద్యుతులు దేదీప్యమానముగా వెలుగుచుండెను. పగడములచే పొదగబడిన కడపలకాంతులు కన్నులకు మిఱుమిట్లుగొలుపుచుండెను. మణిస్తంభములు, మరకతములతో విలసిల్లు బంగారుగోడలు, అతిసుందరములై బ్రహ్మదేవుని శిల్పకౌశలమును ప్రకటించుచుండెను. భవనములు అతిసుందరములు, మనోజ్ఞములు, అతివిశాలములు. వాటి ప్రాంగణములు అత్యంత రుచిరస్ఫటికనిర్మితములు. ప్రతిద్వారకవాటము వివిధవజ్రములచే పొదగబడి, బంగారముతో నిర్మింపబడి యుండెను. (ఛం)

దో- చారు చిత్రసాలా గృహ, గృహ ప్రతి లిఖే బనాఇ ।
రామ చరిత జే నిరఖ ముని, తే మన లేహిఁ చొరాఇ ॥ 27 ॥

ప్రతియింటిలో చిత్రశాలలు గలవు. వాటిలో శ్రీరామునిలోకోత్తరలీలలు రమణీయకుడ్యములపై మనోజ్ఞముగా చిత్రితములై యుండెను. అవి మునులచిత్తములనుగూడ ఆకర్షించుచుండెను. అనగా వాటిని చూచి మునులు భగవల్లీలలయందు మునిగి, తమ ధ్యాసలనే మఱచిపోవుచుండిరి. (దో॥ 27)

చౌ- సుమన బాటికా సబహిఁ లగాఈఁ । బిబిధ భాఁతి కరి జతన బనాఈఁ ॥
లతా లలిత బహు జాతి సుహాఈఁ । ఫూలహిఁ సదా బసంత కి నాఈఁ ॥ 1 ॥
గుంజత మధుకర ముఖర మనోహర । మారుత త్రిబిధి సదా బహ సుందర ॥
నానా ఖగ బాలకన్హి జిఆఏ । బోలత మధుర ఉడాత సుహాఏ ॥ 2 ॥
మోర హంస సారస పారావత । భవనని పర సోభా అతి పావత ॥
జహఁ తహఁ దేఖహిఁ నిజ పరిఛాహీఁ । బహు బిధి కూజహిఁ నృత్య కరాహీఁ ॥ 3 ॥
సుక సారికా పఢావహిఁ బాలక । కహహు రామ రఘుపతి జనపాలక ॥
రాజ దుఆర సకల బిధి చారూ । బీథీఁ చౌహాట రుచిర బజారూ ॥ 4 ॥

ప్రజలు నానావిధపుష్పవాటికలను పెంచియుండిరి. వాటియందనేకజాతులకు చెందిన మనోహరలతలు పుష్పించి, సర్వదా వసంత-ఋతుశోభలను వెలార్చుచుండెను. వాటిపై వ్రాలిన తుమ్మెదలు మధురఝుంకారములను వినిపించుచుండెను. శీతలమందసుగంధపవనములు ఎల్లవేళల వీచుచుండెను. బాలురు అనేకవర్ణములపక్షులను పెంచుచుండిరి. అవి మధురముగా కూయుచుండెను. ఎగురునపుడు వాటి సౌందర్యము ఇనుమడించుచుండెను. భవనములపై అతి సుందరములైన నెమళ్లు, హంసలు, కొంగలు, పావురములు, మణిఖచితకుడ్యములపై తమ ప్రతిబింబములను జూచుకొనుచు, కూజితములనొనర్చుచు, నాట్యములాడుచుండెను. బాలురు చిలుకలకును, గోర్వంకలకును "రఘుపతి రాఘవ రాజారామ్, పతిత పావన సీతారామ్" అను పాటను నేర్పుచుండిరి. రాజభవనప్రవేశద్వారములు అతిసుందరములు. వీధులు, కూడళ్లు, అంగళ్లు అతిమనోహరములు. (చౌ॥ 1-4)

ఛం-బాజార రుచిర న బనఇ బరనత బస్తు బిను గథ పాఇఏ ।
జహఁ భూప రమానివాస తహఁ కీ సంపదా కిమి గాఇఏ ॥
బైఠే బజాజ సరాఫ బనిక అనేక మనహుఁ కుబేర తే ।
సబ సుఖీ సబ సచ్చరిత సుందర నారి నర సిసు జరఠ జే ॥

సాక్షాత్తు లక్ష్మీపతియే అక్కడి పరిపాలకుడు అగుటవలన వస్తువులన్నియు సమృద్ధములై యుండెను. నానావిధసంపదలకును కొదువలేకుండెను. కనుక సమస్తవస్తువులును సమృద్ధిగా ఉచితముగా (మూల్యముతో పనిలేకుండ) లభ్యమగుచుండెను. అక్కడి సంపదలును, అంగళ్ల సౌందర్యములును, వర్ణనాతీతములు. వస్త్రవ్యాపారులు, వెండి, బంగారు వర్తకులు కుబేరులవలె ఉండిరి. స్త్రీ పురుషులును, బాలురును, వృద్ధులును, అందఱును సచ్చరిత్రులై, అందచందములు గలిగి హాయిగానుండిరి. (ఛం)

దో- ఉత్తర దిసి సరజూ బహ, నిర్మల జల గంభీర ।
బాఁధే ఘాట మనోహర, స్వల్ప పంక నహిఁ తీర ॥ 28 ॥

అయోధ్యకు ఉత్తరదిశయందు సరయూనది ప్రవహించుచున్నది. అందలి జలములు నిర్మలములు, గంభీరములు,మధురములు. ఘట్టములు అతిసుందరములు, తీరములయందు ఏమాత్రము బురదయే లేకుండెను. (దో॥ 28)

చౌ- దూరి ఫరాక రుచిర సో ఘాటా । జహఁ జల పిఅహిఁ బాజి గజ ఠాటా ॥
పనిఘట పరమ మనోహర నానా । తహాఁ న పురుష కరహిఁ అస్నానా ॥ 1 ॥
రాజఘాట సబ బిధి సుందర బర । మజ్జహిఁ తహాఁ బరన చారిఉ నర ॥
తీర తీర దేవన్హ కే మందిర । చహుఁ దిసి తిన్హ కే ఉపబన సుందర ॥ 2 ॥
కహుఁ కహుఁ సరితా తీర ఉదాసీ । బసహిఁ గ్యాన రత ముని సన్న్యాసీ ॥
తీర తీర తులసికా సుహాఈ । బృంద బృంద బహు మునిన్హ లగాఈ ॥ 3 ॥
పుర సోభా కఛు బరని న జాఈ । బాహెర నగర పరమ రుచిరాఈ ॥
దేఖత పురీ అఖిల అఘ భాగా । బన ఉపబన బాపికా తడాగా ॥ 4 ॥

కొద్ది దూరమున ఒక విశాలమైన ఘట్టము గలదు. అక్కడ గజాశ్వముల సమూహములు నీరు త్రాగుటకై వచ్చును. స్త్రీలు నీరు తీసికొని పోవుటకు వేఱుగా అనేకఘట్టములు గలవు. అవి మిక్కిలి మనోహరములు. పురుషులచట స్నానములు చేయరు. అన్నిటికంటెను సుందరమైనది, శ్రేష్ఠమైనది రాజఘట్టము. అచట అన్ని వర్ణములపురుషులు స్నానము చేసెదరు. సరయూ తీరముల యందు అనేక దేవాలయములు గలవు. వాటికి నాలుగు వైపుల సుందరోద్యానములు గలవు. సరయూనదీతీరమున అచ్చటచ్చట విరాగులైన మునులు, సన్న్యాసులును నివసించుచుందురు. వారు సర్వదా జ్ఞానవిషయనిరతులైయుందురు. నదీతీరములయందు వారు తులసిమొక్కలను నాటిరి. అయోధ్యానగరశోభ వర్ణనాతీతము. నగరమునెలుపలగూడ అంతటి సౌందర్యమే అలరారుచున్నది. అయోధ్యానగరసౌందర్యదర్శనమాత్రముననే సకలపాపములు తాపములు ఉపశమించును. అది వనములు, ఉపవనములు, వాపీకూపతటాకములచే సుశోభితమై విలసిల్లుచున్నది. (చౌ॥ 1-4)

ఛం-బాపీఁ తడాగ అనూప కూప మనోహరాయత సోహహీఁ ।
సోపాన సుందర నీర నిర్మల దేఖి సుర ముని మోహహీఁ ॥
బహు రంగ కంజ అనేక ఖగ కూజహిఁ మధుప గుంజారహీఁ ।
ఆరామ రమ్య పికాది ఖగ రవ జను పథిక హంకారహీఁ ॥

వాపీకూపతటాకములు మిక్కిలి శోభాసంపన్నములై యున్నవి. అవి అతివిశాలములై మనోహరముగానున్నవి. వాటిసుందరసోపానములను నిర్మలజలములను జూచి, దేవతలు మునులుగూడ ముగ్ధులగుచుండిరి. తటాకములయందు వివిధవర్ణములుగల కమలములు వికసించుచుండెను. పెక్కుపక్షులు కలరవములు చేయుచుండెను. భ్రమరములు ఝుంకారములను గావించుచుండెను. కోకిలలు మొదలగు పక్షులు తమ మధురస్వరములతో రమణీయములైన ఆ వనములకు బాటసారులను ఆహ్వానించుచున్నవా? అనునట్లుండెను. (ఛం)

దో- రమానాథ జహఁ రాజా, సో పుర బరని కి జాఇ।
అనిమాదిక సుఖ సంపదా, రహీఁ అవధ సబ ఛాఇ ॥ 29 ॥

సాక్షాత్తు లక్ష్మీపతి ప్రభువుగా నున్న ఆ నగరమును వర్ణించుటకెవరితరము? అణిమాది-అష్టసిద్ధులకును, సుఖసంపదలకును, ఆ పురము నెలవైయుండెను. (దో॥ 29)

చౌ- జహఁ తహఁ నర రఘుపతి గున గావహిఁ। బైఠి పరసపర ఇహఇ సిఖావహిఁ ॥
భజహు ప్రనత ప్రతిపాలక రామహి। సోభా సీల రూప గున ధామహి ॥ 1 ॥
జలజ బిలోచన స్యామల గాతహి। పలక నయన ఇవ సేవక త్రాతహి ॥
ధృత సర రుచిర చాప తూనీరహి। సంత కంజ బన రబి రనధీరహి ॥ 2 ॥
కాల కరాల బ్యాల ఖగరాజహి। నమత రామ అకామ మమతా జహి ॥
లోభ మోహ మృగజూథ కిరాతహి। మనసిజ కరి హరి జన సుఖదాతహి ॥ 3 ॥
సంసయ సోక నిబిడ తమ భానుహి। దనుజ గహన ఘన దహన కృసానుహి ॥
జనకసుతా సమేత రఘుబీరహి। కస న భజహు భంజన భవ భీరహి ॥ 4 ॥
బహు బాసనా మసక హిమ రాసిహి। సదా ఏకరస అజ అబినాసిహి ॥
ముని రంజన భంజన మహి భారహి। తులసిదాస కే ప్రభుహి ఉదారహి ॥ 5 ॥

అచటి ప్రజలందఱును శ్రీరామునిగుణములనే కీర్తించుచుండిరి. శరణాగతరక్షకుడు, రూపగుణశీల శోభాయుతుడు ఐన శ్రీరాముని భజింపుడని ఒకరికొకరు ఉపదేశములను చేయుచుండిరి. ఇంకను వారు ఇట్లు నుడువుచుండిరి." కమలనేత్రుడు శ్యామసుందరుడు ఐన ప్రభువును భజింపుడు. తనభక్తులను కంటికిఱెప్పవలె కాపాడెడి ఆ ప్రభువును భజింపుడు. అతడు సుందరములైన ధనుర్బాణములను, తూణీరమును ధరించిన వాడు, సజ్జనులనెడి కమలవనమును వికసింపజేయు సూర్యుడు, మృత్యువనెడి భయంకరసర్పమును కబళించుఖగరాజు, స్వార్థభావరహితులై ప్రణమిల్లినవారిఅహంకారమమకారములను దూరముచేయు ప్రభువు, లోభము, మోహము అను మృగములను రూపుమాపు వేటగాడు, కామమనెడి గజమును పరిమార్చెడి సింహము, సేవకులకు సుఖములను చేకూర్చుచు, వారి శోకసంకటములనెడి చిమ్మ చీకట్లను పటాపంచలొనర్చు సూర్యుడు, రాక్షసులనెడి వనమును భస్మమొనర్చుటలో అగ్నితుల్యుడు. జననమరణభయమును దూరమొనర్చునట్టి జానకీరాముని భజింపుడు. అనేకపూర్వజన్మవాసనలనెడి దోమలను నాశమొనర్చు హిమరాశియైన శ్రీరాముని సేవింపుడు. సదా పరిణామరహితుడు, జన్మమృత్యువులు లేనివాడు, మునులకు బ్రహ్మానందమును గూర్చువాడు, పృథ్వీభారమును బాపువాడు, ఉదారగుణసంపన్నుడునై తులసీదాసునకు ప్రభువగు శ్రీ సీతారామచంద్రుని స్మరింపుడు."(చౌ॥ 1-5)

దో- ఏహి బిధి నగర నారి నర, కరహిఁ రామ గున గాన।
సానుకూల సబ పర రహహిఁ, సంతత కృపానిధాన ॥ 30 ॥

ఈ విధముగా నగరప్రజలందఱును శ్రీరామచంద్రునిగుణములను గానము చేయుచుండిరి. కృపానిధియైన శ్రీరాముడు వారియెడల అత్యంతప్రసన్నుడై యుండెను. (దో॥ 30)

చౌ- జబ తే రామ ప్రతాప ఖగేసా । ఉదిత భయఉ అతి ప్రబల దినేసా ॥
పూరి ప్రకాస రహేఉ తిహుఁ లోకా । బహుతేన్హ సుఖ బహుతన మన సోకా ॥ 1 ॥
జిన్హహి సోక తే కహఉఁ బఖానీ । ప్రథమ అబిద్యా నిసా నసానీ ॥
అఘ ఉలూక జహఁ తహాఁ లుకానే । కామ క్రోధ కైరవ సకుచానే ॥ 2 ॥
బిబిధ కర్మ గున కాల సుభాఊ । ఏ చకోర సుఖ లహహిఁ న కాఊ ॥
మత్సర మాన మోహ మద చోరా । ఇన్హ కర హునర న కవనిహుఁ ఓరా ॥ 3 ॥
ధరమ తడాగ గ్యాన బిగ్యానా । ఏ పంకజ బికసే బిధి నానా ॥
సుఖ సంతోష బిరాగ బిబేకా । బిగత సోక ఏ కోక అనేకా ॥ 4 ॥

(కాకభుశుండి తెలుపుచున్నాడు) ఓ పక్షిరాజా! గరుడుడా! శ్రీరామచంద్రునిప్రభుత్వమనెడి ప్రచండసూర్యోదయమైనప్పటినుండియు ముల్లోకములయందంతటను నిరుపమానప్రకాశము నిండెను. దీనివలన పెక్కుమందికి సుఖము, ఇతరులకు దుఃఖము కలిగెను. దుఃఖితులైన వారిని గూర్చి వివరింతును. (ముల్లోకములును ప్రకాశమానములు కాగానే) అవిద్యయను రాత్రి అంతరించెను. పాపములనెడి గుడ్లగూబలు ఎక్కడివక్కడ దాగుకొనెను. కామక్రోధములనెడి కుముదములు ముకుళించుకొనెను. బంధకారకములగు వివిధకర్మలు, గుణములు, కాలస్వభావములు అనెడి చకోరపక్షులు సుఖములను కోల్పోయెను. అభిమానము, మోహము, మదము, మత్సరము అనెడి చోరులు తమ చాతుర్యమును చూపుటకు అవకాశమే లేకుండెను. కాని ధర్మమనెడి సరోవరమున జ్ఞానవిజ్ఞానములనెడి నానావిధ కమలములు వికసించెను. సుఖ సంతోషములు, వివేక వైరాగ్యములు అను చక్రవాక పక్షులు శోకరహితములాయెను. (చౌ॥ 1-4)

దో- యహ ప్రతాప రబి జాకేఁ, ఉర జబ కరఇ ప్రకాస ।
పఛిలే బాఢహిఁ ప్రథమ జే, కహే తె పావహిఁ నాస ॥ 31 ॥

ఎవరి హృదయకమలములపై శ్రీరామభద్రుని ప్రభుత్వమనెడి సూర్యకిరణములు ప్రసరించునో వారిలో ధర్మము, జ్ఞానవిజ్ఞానములు, వివేకవైరాగ్యములు, సుఖసంతోషములు పెంపొందును, అవిద్య, పాపము, కామ క్రోధములు, కాల కర్మగుణ స్వభావములు అంతరించును. (దో॥ 31)

## సనకాదులు శ్రీరాముని దర్శించుట

చౌ- భ్రాతన్హ సహిత రాము ఏక బారా । సంగ పరమ ప్రియ పవనకుమారా ॥
సుందర ఉపబన దేఖన గఏ । సబ తరు కుసుమిత పల్లవ నఏ ॥ 1 ॥
జాని సమయ సనకాదిక ఆఏ । తేజ పుంజ గున సీల సుహాఏ ॥
బ్రహ్మానంద సదా లయలీనా । దేఖత బాలక బహుకాలీనా ॥ 2 ॥

రూప ధరేఁ జను చారిఉ బేదా । సమదరసీ ముని బిగత బిభేదా ॥
ఆసా బసన బ్యసన యహ తిన్హహీఁ । రఘుపతి చరిత హోఇ తహఁ సునహీఁ ॥ 3 ॥
తహఁ రహే సనకాది భవానీ । జహఁ ఘటసంభవ మునిబర గ్యానీ ॥
రామ కథా మునిబర బహు బరనీ । గ్యాన జోని పావక జిమి అరనీ ॥ 4 ॥

ఒకసారి శ్రీరామచంద్రప్రభువు సోదరులను వెంటబెట్టుకొని, హనుమంతునితో గూడి, అందమైన ఒక ఉపవనమును జూచుటకు వెళ్లెను. ఆ తోటలోని వృక్షములన్నియును సుమశోభితములై యుండెను. అవి చిగురుటాకులతో రమణీయములై యుండెను. అది సరియైన సమయమని గ్రహించి, సనకాది మహామునులచ్చటికేతెంచిరి. వారుతేజోరాసులు, సద్గుణశీలసంపన్నులు, సర్వదా బ్రహ్మానందనిమగ్నులు. చూచుటకు బాలురవలెనున్నను జ్ఞానవయోవృద్ధులు, చతుర్వేదములే సాక్షాత్కరించినట్లుండిరి. ఆ మునులు సమదృష్టిగలవారు, భేదభావములకు అతీతులు, (సర్వత్ర బ్రహ్మమునే దర్శించువారు.) దిసమొలలవారు. శ్రీ రఘునాథుని కథా ప్రసంగములు జరుగు చోట వారు వాటిని ప్రత్యక్షముగా వినుచుందురు. అది వారి స్వభావము (శివుడు పలుకుచున్నాడు) శర్వాణీ! సనకాదిమునులు అంతకుముందు అగస్త్యుని ఆశ్రమమునకు వెళ్లియుండిరి. అచ్చట అగస్త్యమహాముని వారికి శ్రీరామునిగాథను వివిధరీతుల వర్ణించి చెప్పియుండెను. శ్రీరామకథాశ్రవణమువలన వారిలో 'రామ దర్శనాభిలాష' పెల్లుబికెను. ఆ కోరికతో వారు శ్రీరాముని జూడవచ్చిరి. అరణి అగ్నిని ఉత్పన్నము చేయునట్లు రామకథలు జ్ఞానోదయమును కలిగించును. (చౌ॥ 1-4)

దో- దేఖి రామ ముని ఆవత, హరషి దండవత కీన్హ ।
స్వాగత పూఁఛి పీత పట, ప్రభు బైఠన కహఁ దీన్హ ॥ 32 ॥

శ్రీరాముడు సనకాదిమునులను చూడగానే వారికి సాష్టాంగప్రణామములను ఆచరించి, కుశలములనడిగి, వారికి (కూర్చొనుటకు) ఆసనముగా తనపట్టు పీతాంబరమును పఱచెను. (దో॥ 32)

చౌ- కీన్హ దండవత తీనిఉఁ భాఈ । సహిత పవనసుత సుఖ అధికాఈ ॥
ముని రఘుపతి ఛబి అతుల బిలోకీ । భఏ మగన మన సకే న రోకీ ॥ 1 ॥
స్యామల గాత సరోరుహ లోచన । సుందరతా మందిర భవ మోచన ॥
ఏకటక రహే నిమేష న లావహిఁ । ప్రభు కర జోరేఁ సీస నవావహిఁ ॥ 2 ॥
తిన్హ కై దసా దేఖి రఘుబీరా । స్రవత నయన జల పులక సరీరా ॥
కర గహి ప్రభు మునిబర బైఠారే । పరమ మనోహర బచన ఉచారే ॥ 3 ॥
ఆజు ధన్య మైఁ సునహు మునీసా । తుమ్హరేఁ దరస జాహిఁ అఘ ఖీసా ॥
బడే భాగ పాఇబ సతసంగా । బినహిఁ ప్రయాస హోహిఁ భవ భంగా ॥ 4 ॥

తదనంతరము హనుమంతునితోగూడి ముగ్గురుసోదరులును వారికి దండప్రణామముల నాచరించిరి, అందఱును ప్రసన్నులైరి. శ్రీ రఘురాముని నిరుపమానసౌందర్యము వారి మనస్సులను దోచెను. ఆ దర్శనానందములో వారు పరవశులైయుండిరి. మనసులు వారి అధీనములో లేకుండెను. భవభయమును పాఱద్రోలు

నట్టి శ్యామశరీరుడు, కమలనయనుడు, సౌందర్యరాశియునైన శ్రీరామచంద్రుని వారు రెప్పలార్పక తనివిదీరజూచుచు నిలబడిపోయిరి. అంజలి ఘటించి, ప్రభువు వారియెదుట వినమ్రుడై నిలిచియుండెను. వారిప్రేమపారవశ్యస్థితిని చూచి, రఘురాముని కన్నులలో ప్రేమాశ్రువులు నిండెను. తనువు రోమాంచమయ్యెను. ప్రభువు వారిచేతులను బట్టుకొని కూర్చుండబెట్టి, మధురముగా పలికెను. "మునీశ్వరులారా! నేడు నేను ధన్యుడను. మీ దర్శనమాత్రముననే పాపములన్నియును నశించును. సజ్జనులసాంగత్యము మహద్భాగ్యవశమున లభించును. దానివలన ఎట్టిశ్రమయు లేకుండగనే జననమరణచక్రము భంగమగును. (చౌ॥ 1-4)

దో- సంత సంగ అపబర్గ కర, కామీ భవ కర పంథ।
కహహిఀ సంత కబి కోబిద, శ్రుతి పురాన సద్గ్రంథ ॥ 33 ॥

సజ్జనుల సాంగత్యము మోక్షమును ప్రసాదించును. కాముకుల సాంగత్యము భవబంధములలో చిక్కుపడజేయును. సజ్జనులు, కవులు, పండితులు, వేదపురాణాదిగ్రంథములు ఇట్లే నుడువుచుండుట లోకవిదితము. (దో॥ 33)

చౌ- సుని ప్రభు బచన హరషి ముని చారీ। పులకిత తన అస్తుతి అనుసారీ ॥
జయ భగవంత అనంత అనామయ। అనఘ అనేక ఏక కరునామయ ॥ 1 ॥
జయ నిర్గున జయ జయ గున సాగర। సుఖ మందిర సుందర అతి నాగర ॥
జయ ఇందిరా రమన జయ భూధర। అనుపమ అజ అనాది సోభాకర ॥ 2 ॥
గ్యాన నిధాన అమాన మానప్రద। పావన సుజస పురాన బేద బద ॥
తగ్య కృతగ్య అగ్యతా భంజన। నామ అనేక అనామ నిరంజన ॥ 3 ॥
సర్బ సర్బగత సర్బ ఉరాలయ। బససి సదా హమ కహుఀ పరిపాలయ ॥
ద్వంద బిపతి భవ ఫంద బిభంజయ। హృది బసి రామ కామ మద గంజయ ॥ 4 ॥

శ్రీరామచంద్రప్రభువచనములను విని, నలుగురు మునీశ్వరులును హర్షించినవారై, పులకిత గాత్రులై స్తుతింపసాగిరి. "భగవన్! మీకు జయము. మీరు అనంతులు, నిర్వికారులు, అనఘులు, అనేకరూపములు గల్గియున్నను మీరద్వితీయులు. కరుణామయులు, త్రిగుణరహితా! గుణసాగరా! మీకు జయము. మీరు సుఖధాములు, సుందరులు, కడుసమర్థులు. ఓ ఇందిరారమణా! భూధరా! మీకు జయము. మీరు నిరుపమానులు, జన్మరహితులు, అనాది, సౌందర్య నిధులు. జ్ఞానమునకు ఆధారులు. అహంభావము, మదము లేనివారు. గౌరవయశస్సులను గూర్చువారు. వేదపురాణములు మీ పావనయశోవైభములను స్తుతించుచుండును. మీరు తత్త్వజ్ఞులు, సేవకుల సేవలను గుర్తించువారు. అజ్ఞానమును పాఱద్రోలువారు. నిరంజనులు, మీకనేక నామములున్నను నామమునకు అతీతులు. సర్వరూపులు, సర్వవ్యాప్తులు. అందఱి హృదయములలో నివసించియుండువారు. మమ్ము పాలింపుడు. రాగద్వేషములు, హర్షవిషాదములు, జన్మమృత్యువులు మొదలగు ద్వంద్వములనుండియు, సంసారవ్యామోహములనుండియు మమ్ము కాపాడుడు. శ్రీ రామా! మీరు మా హృదయములలో నివసించి, కామమును, మదమును తొలగింపుడు. (చౌ॥ 1-4)

దో- పరమానంద కృపాయతన, మన పరిపూరన కామ ।
ప్రేమ భగతి అనపాయనీ, దేహు హమహి శ్రీరామ ॥ 34 ॥

ఓ పరమానంద స్వరూపా! కృపానిధానా! మనోభీష్ట ప్రదాతా! శ్రీరామా! మాకు మీ నిశ్చలభక్తిని ప్రసాదింపుడు. (దో॥ 34)

చౌ- దేహు భగతి రఘుపతి అతి పావని । త్రిబిధి తాప భవ దాప నసావని ॥
ప్రనత కామ సురధేను కలపతరు । హోఇ ప్రసన్న దీజై ప్రభు యహ బరు ॥ 1 ॥
భవ బారిధి కుంభజ రఘునాయక । సేవత సులభ సకల సుఖ దాయక ॥
మన సంభవ దారున దుఖ దారయ । దీనబంధు సమతా బిస్తారయ ॥ 2 ॥
ఆస త్రాస ఇరిషాది నివారక । బినయ బిబేక బిరతి బిస్తారక ॥
భూప మౌలి మని మండన ధరనీ । దేహి భగతి సంసృతి సరి తరనీ ॥ 3 ॥
ముని మన మానస హంస నిరంతర । చరన కమల బందిత అజ సంకర ॥
రఘుకుల కేతు సేతు శ్రుతి రచ్ఛక । కాల కరమ సుభాఉ గున భచ్ఛక ॥ 4 ॥
తారన తరన హరన సబ దూషన । తులసిదాస ప్రభు త్రిభువన భూషన ॥ 5 ॥

ఓ రఘునాథా! మాకు మీ నిర్మలభక్తిని ప్రసాదింపుడు. అది మమ్ము అత్యంత పవిత్రులనుగా చేయును, తాపత్రయములనుండియు, జననమరణక్లేశములనుండియు రక్షించును. శరణుజొచ్చినవారికోరికలను దీర్చు కామధేనువు, కల్పతరువు ఐన ప్రభూ! ప్రసన్నుడవై మాకు ఈ వరమును ప్రసాదింపుము. ఓ రఘునాథా! మీరు జన్మమృత్యురూపసముద్రమును శుష్కింపజేయుటయందు అగస్త్యులవంటివారు. సేవకులకు సులభుడవు, సుఖప్రదాతవు. దీనబంధూ! మనోజనితదుస్సహదుఃఖములను రూపుమాపువాడవు. మాలో సమదృష్టిని విస్తరింప జేయుడు. ఆశాభయములను, ఈర్ష్యను తొలగించి, మీరు వినయవివేకవైరాగ్యములను విస్తరింపజేయువారు. రాజమకుటమణీ! పృథ్వీ భూషణమా! జనన మరణ నిరంతర ప్రవాహమును దాటుటకు నౌకయైన మీ పరమభక్తిని ప్రసాదింపుడు. మునిమానససరోవరహంసమా! బ్రహ్మ శివులకును మీ చరణకమలములు పూజనీయములు. రఘువంశశిరోమణీ! నీవు వేదమర్యాదలను రక్షించువాడవు. కాల, కర్మ, స్వభావ, గుణబంధములనుండి ముక్తిని ప్రసాదించువాడవు. సంసారసాగరమునుండి తరింపజేయువాడవును, ముక్తిస్వరూపుడవును నీవే. నీవు సర్వదోషములను తొలగించువాడవు. తులసీదాసునకు స్వామివి. త్రిభువనములకును అలంకారమైన వాడవు." (చౌ॥ 1-5)

దో- బార బార అస్తుతి కరి, ప్రేమ సహిత సిరు నాఇ ।
బ్రహ్మ భవన సనకాది గే, అతి అభీష్ట బర పాఇ ॥ 35 ॥

ఈ విధముగా స్వామిని అనేకవిధముల స్తుతించి, భక్తి ప్రపత్తులతో ప్రణమిల్లి, తాము కోరుకొనిన వరములను పొంది, సనకాది మహామునులు బ్రహ్మలోకమునకు చేరిరి. (దో॥ 35)

చౌ- సనకాదిక బిధి లోక సిధాఏ । భ్రాతన్హ రామ చరన సిరు నాఏ ॥
పూఛత ప్రభుహి సకల సకుచాహీఁ । చితవహిఁ సబ మారుతసుత పాహీఁ ॥ 1 ॥
సునీ చహహిఁ ప్రభు ముఖ కై బానీ । జో సుని హోఇ సకల భ్రమ హానీ ॥
అంతరజామీ ప్రభు సభ జానా । బూఝత కహహు కాహ హనుమానా ॥ 2 ॥
జోరి పాని కహ తబ హనుమంతా । సునహు దీనదయాల భగవంతా ॥
నాథ భరత కఛు పూఁఛన చహహీఁ । ప్రస్న కరత మన సకుచత అహహీఁ ॥ 3 ॥
తుమ్హ జానహు కపి మోర సుభాఊ । భరతహి మోహి కఛు అంతర కాఊ ॥
సుని ప్రభు బచన భరత గహె చరనా । సునహు నాథ ప్రనతారతి హరనా ॥ 4 ॥

సనకాదిమునులు బ్రహ్మలోకమునకు వెళ్లిన పిదప సోదరులందఱును శ్రీరామచంద్రునకు శిరసా ప్రణమిల్లిరి. (ఒక విషయమును గూర్చి) ప్రభువునడుగుటకు సంకోచించుచు ఆసోదరులు మారుతి వైపు చూచిరి. అన్ని భ్రమలను నివారించు ప్రభువాణిని 'ఆయన ముఖత:' వినదలిచిరి. అంతర్యామియైన ప్రభువునకు అన్నియు తెలియును. ఐనను ఆయన 'మారుతీ! విషయమేమి? తెలుపుము-' అని పలికెను. అపుడు వాయుసుతుడు చేతులు జోడించి, ఇట్లనెను. "దీనదయాళూ! ప్రభూ! భరతులవారేదియో అడుగదలచినారు. కాని అడుగుటకు వారిమనస్సు సంకోచపడుచున్నది." శ్రీరామచంద్రుడు నుడివెను. "హనుమా! నీవు నాస్వభావమును ఎఱుగుదువు. నాకును భరతునకును మధ్య ఎట్టి భేదములేదు." ప్రభు వచనములను విని, భరతుడు ఆయన పాదములను పట్టుకొని వచించెను. "ప్రభూ! శరణాగత దుఃఖహరణా! వినుము. (చౌ॥ 1-4)

## సోదరులకు శ్రీరాముని ఉపదేశము

దో- నాథ న మోహి సందేహ కఛు, సపనెహుఁ సోక న మోహ ।
కేవల కృపా తుమ్హారిహి, కృపానంద సందోహ ॥ 36 ॥

ప్రభూ! ఎట్టి సందేహము గాని, శోక మోహములు గాని, స్వప్నములోగూడ నాకు కలుగవు. దయానిధీ! ఆనంద స్వరూపా! ఇది కేవలము మీ కృపాఫలమే. (దో॥ 36)

చౌ- కరఉఁ కృపానిధి ఏక ఢిఠాఈ । మైఁ సేవక తుమ్హ జన సుఖదాఈ ॥
సంతన్హ కై మహిమా రఘురాఈ । బహు బిధి బేద పురానన్హ గాఈ ॥ 1 ॥
శ్రీముఖ తుమ్హ పుని కీన్హి బడాఈ । తిన్హ పర ప్రభుహి ప్రీతి అధికాఈ ॥
సునా చహఉఁ ప్రభు తిన్హ కర లచ్ఛన । కృపాసింధు గున గ్యాన బిచచ్ఛన ॥ 2 ॥
సంత అసంత భేద బిలగాఈ । ప్రనతపాల మోహి కహహు బుఝాఈ ॥
సంతన్హ కే లచ్ఛన సును భ్రాతా । అగనిత శ్రుతి పురాన బిఖ్యాతా ॥ 3 ॥
సంత అసంతన్హి కై అసి కరనీ । జిమి కుఠార చందన ఆచరనీ ॥
కాటఇ పరసు మలయ సును భాఈ । నిజ గున దేఇ సుగంధ బసాఈ ॥ 4 ॥

ఇనప్పటికిని ఓ దయానిధానా! సాహసించి ఒక విన్నపమును జేసెదెను. నేను మీ సేవకుడను. మీరు సేవకులకు సుఖప్రదాతలు. రఘునాథా! వేదపురాణములు సజ్జనుల మహత్త్వమును గూర్చి మిగుల ప్రస్తుతించినవి. మీరుగూడ 'మీ ముఖతః' వారిని ప్రశంసించితిరి. వారిపై మీ ప్రేమ అపారము. ప్రభూ! నేను సజ్జనులలక్షణములను వినగోరెదను. మీరు దయానిధులు, జ్ఞాన గుణ సముద్రులు. శరణాగతరక్షకా! సాధు-అసాధువులలోగల భేదములను వివరింపుడు." శ్రీరాముడు పలికెను. "సోదరులారా! వినుడు. సజ్జనుల లక్షణములు అనేకములు. అవి వేదపురాణములలో ప్రసిద్ధములు. సజ్జనులు చందనవృక్షమువంటివారు. దుర్జనులు గొడ్డలివంటివారు. గొడ్డలి చందనవృక్షమును నఱికివేయును. కాని! చందనవృక్షము తనను నఱికినగొడ్డలికే తన సువాసనను గూర్చును.

(చౌ॥ 1-4)

దో- తాతే సుర సీసన్హ చఢత, జగ బల్లభ శ్రీఖండ।
అనల దాహి పీటత ఘనహిం, పరసు బదన యహ దండ ॥ 37 ॥

ఈ స్వాభావికగుణములవలననే చందనము అందఱికిని ప్రియమైనది. అది దైవశిరస్సులను గూడ అధిరోహించును. కాని అప్రియమైనందున గొడ్డలి ముఖమును నిప్పున గాల్చి, సమ్మెటతో గొట్టెదరు. (దో॥ 37)

చౌ- బిషయ అలంపట సీల గునాకర। పర దుఖ దుఖ సుఖ సుఖ దేఖే పర॥
సమ అభూతరిపు బిమద బిరాగీ। లోభామరష హరష భయ త్యాగీ ॥ 1 ॥
కోమలచిత దీనన్హ పర దాయా। మన బచ క్రమ మమ భగతి అమాయా॥
సబహి మానప్రద ఆపు అమానీ। భరత ప్రాన సమ మమ తే ప్రానీ ॥ 2 ॥
బిగత కామ మమ నామ పరాయన। సాంతి బిరతి బినతీ ముదితాయన ॥
సీతలతా సరలతా మయత్రీ। ద్విజ పద ప్రీతి ధర్మ జనయత్రీ॥ 3 ॥
ఏ సబ లచ్ఛన బసహిం జాసు ఉర। జానెహు తాత సంత సంతత ఫుర ॥
సమ దమ నియమ నీతి నహిం డోలహిం। పరుష బచన కబహూం నహిం బోలహిం ॥ 4 ॥

సజ్జనులు విషయవాసనాలోలురు గారు. వారు సుశీలసద్గుణాకరులు. ఇతరులదుఃఖములను తమదుఃఖములుగా, ఇతరుల సుఖములను తమ సుఖములుగా భావించెదరు. వారు అన్నిటి యందును, అన్ని చోట్లను అన్ని సమయములయందును సమత్వము కలిగి యుందురు. వారి మనస్సులలో శత్రుత్వము ఉండదు. వారు అభిమానరహితులు, విరాగులు. వారిలో లోభము, క్రోధము, హర్షము, భయము లేశమాత్రముగూడ ఉండవు. వారి హృదయములు కోమలములు, దీనులయెడ, దుఃఖితులపైనను దయచూపుదురు. మనోవాక్కర్మలచే నాపై నిష్కపటభక్తిని గల్గి యుందురు. వారు స్వయముగా అభిమాన రహితులై ఇతరులను సమ్మానించెదరు. భరతా! ఇట్టి సజ్జనులు నాకు ప్రాణతుల్యులు. వారికి ఎట్టి కోరికలును ఉండవు. వారు నా నామస్మరణమునందే నిరతులు. సజ్జనులు శాంతి, వైరాగ్యము, వినయము, ప్రసన్నత కలిగి యుందురు. వారిలో శీతలత్వము, సరళత, అందఱియెడ మిత్రభావము, బ్రాహ్మణభక్తి ఉండును. ఇదియే ధర్మమునకు మూలము. సోదరా! ఈ లక్షణములు గల వారిని సజ్జనులుగా భావింపుము. వారు శమ, దమ, నియమ, నీతి మార్గములనుండి ఎన్నడునూ వైదొలగరు. వారెప్పుడును పరుష వచనములను పలుకరు.

(చౌ॥ 1-4)

దో- నిందా అస్తుతి ఉభయ సమ, మమతా మమ పద కంజ ।
తే సజ్జన మమ ప్రానప్రియ, గున మందిర సుఖ పుంజ ॥ 38 ॥

నిందాస్తుతులను సమానముగా భావించువారు, నా పాదపద్మములయందు అనన్యప్రేమ కలిగియుండువారు సజ్జనులు. వారు నాకు ప్రాణసములు. గుణధాములు, ఆనందస్వరూపులు. (దో॥ 38)

చౌ- సునహు అసంతన్హ కేర సుభాఊ । భూలేహుఁ సంగతి కరిఅ న కాఊ ॥
తిన్హ కర సంగ సదా దుఖదాఈ । జిమి కపిలహి ఘాలఇ హరహాఈ ॥ 1 ॥
ఖలన్హ హృదయఁ అతి తాప బిసేషీ । జరహిఁ సదా పర సంపతి దేఖీ ॥
జహఁ కహుఁ నిందా సునహిఁ పరాఈ । హరషహిఁ మనహుఁ పరీ నిధి పాఈ ॥ 2 ॥
కామ క్రోధ మద లోభ పరాయన । నిర్దయ కపటీ కుటిల మలాయన ॥
బయరు అకారన సబ కాహూ సోఁ । జో కర హిత అనహిత తాహూ సోఁ ॥ 3 ॥
ఝూఠఇ లేనా ఝూఠఇ దేనా । ఝూఠఇ భోజన ఝూఠ చబేనా ॥
బోలహిఁ మధుర బచన జిమి మోరా । ఖాఇ మహా అహి హృదయ కఠోరా ॥ 4 ॥

ఇక దుర్జనుల లక్షణములను వినుము. పొరపాటునగూడ వారితో సాంగత్యము చేయరాదు. వారి సహవాసము దుఃఖములకు కారణము. దుర్లక్షణములుగల గోవుతో కలిసి తిరుగుటవలన మంచి కపిలగోవుగూడ అట్లే మాఱును. దుష్టులైన వారి హృదయములయందు సంతాపమధికము. వారు ఇతరులసుఖసంపదలను జూచి, అసూయ పడెదరు. ఎప్పుడైనను ఇతరులను గూర్చిన నిందలను విన్నచో త్రోవలో నిధి దొరికినంతగ సంతోష పడెదరు. వారు కామక్రోధలోభమదపరాయణులు. నిర్దయులు, కపటులు, కుటిలురు, పాపిష్ఠులు. వారు అకారణముగా ఇతరులతో వైరము పూనెదరు. మేలుచేసినవారికే కీడు తలపెట్టెదరు. వారి ఆదానప్రదానములన్నియును సత్యదూరములు, స్వార్థదృష్టితో చేయబడునవి. అనృతమే వారిభోజనము. వారు అన్ని విషయములయందును అనృతమే పలికెదరు. నెమలికూత (క్రేంకారము)మధురము. కాని దాని ఆహారము మహావిషసర్పములు. అట్లే దుర్జనుల మాటలు మిక్కిలి మధురములు. కాని వారి హృదయములు మిగులవిషపూరితములు, కఠినములు.

(చౌ॥ 1-4)

దో- పర ద్రోహీ పర దార రత, పర ధన పర అపబాద ।
తే నర పాఁవర పాపమయ, దేహ ధరేఁ మనుజాద ॥ 39 ॥

దుష్టులు ఇతరులతో నిష్కారణముగా వైరముపూనెదరు. పరస్త్రీలయందును, ధనమునందును ఆసక్తులైయుందురు. పరులు నిందలపాలైనచో సంతోషపడుచుందురు. వారు నీచులు, పాపాత్ములు, మానవశరీరములను ధరించిన రాక్షసులు. (దో॥ 39)

చౌ- లోభఇ ఓఢన లోభఇ డాసన । సిస్నోదర పర జమపుర త్రాస న ॥
కాహూ కీ జౌఁ సునహిఁ బడాఈ । స్వాస లేహిఁ జను జూడీ ఆఈ ॥ 1 ॥

జబ కాహూ కై దేఖహిం బిపతీ । సుఖీ భఏ మానహుం జగ నృపతీ ॥
స్వారథ రత పరివార బిరోధీ । లంపట కామ లోభ అతి క్రోధీ ॥ 2 ॥
మాతు పితా గుర బిప్ర న మానహిం । ఆపు గఏ అరు ఘాలహిం ఆనహిం ॥
కరహిం మోహ బస ద్రోహ పరావా । సంత సంగ హరి కథా న భావా ॥ 3 ॥
అవగున సింధు మందమతి కామీ । బేద బిదూషక పరధన స్వామీ ॥
బిప్ర ద్రోహ పర ద్రోహ బిసేషా । దంభ కపట జియం ధరేం సుబేషా ॥ 4 ॥

దుర్మార్గులకు లోభమే దుప్పటి, లోభమే పఱుపు. (లోభములోనే మునిగి యుందురు.) ఆహార మైథునములయందే నిరతులైయుందురు. యమలోకభయము వారికిఉండదు. ఇతరుల అభివృద్ధిని చూచినను, విన్నను జ్వర పీడితులవలె నిట్టూర్పులు వదలెదరు. ఇతరులకు విపత్తు కల్గినపుడు చూచినను, విన్నను విశ్వమున కంతటికిని రాజైనంతగా సంతోషింతురు. వారు కటికి స్వార్థపరులు. వారు కామలోభలంపటులై, మిక్కిలి క్రోధస్వభావులై, తమ కుటుంబ సభ్యులతోగూడ విరోధము కల్గి యుందురు. వారు తల్లిదండ్రులను, గురువులను, బ్రాహ్మణులను అంతే గాదు ఎవ్వరినీ గుర్తింపరు, గౌరవింపరు. తాము నశించుటయే గాక ఇతరులను గూడ నష్టపఱచెదరు. మోహవశమున ఇతరులతో వైరము వహింతురు. వారికి సజ్జనసాంగత్యమునగాని, హరికథలయందుగాని అభిలాషయేయుండదు. వారు దుర్గుణసాగరులు. మందబుద్ధులు, కాముకులు, వేదములను దూషించువారు. పరధనములనుకబళించువారు. బ్రాహ్మణులకును, విశేషముగా దేవతలకును, కడకు పరమాత్మకును ద్రోహము చేయుదురు. వారి హృదయము దంభ కపటపూరితము. వంచన చేయుటయే వారి స్వభావము. వారు పయోముఖ విషకుంభములు. చూచుటకు సజ్జనుల వలె కన్పింతురు. (చౌ॥ 1-4)

దో- ఐసే అధమ మనుజ ఖల, కృతజుగ త్రేతాం నాహిం ।
ద్వాపర కఛుక బృంద బహు, హోఇహహిం కలిజుగ మాహిం ॥ 40 ॥

ఇట్టి అధములు, దుష్టులైన మనుజులు, కృతయుగమునందును, త్రేతాయుగమునందును ఉండరు. ద్వాపరయుగములో స్వల్పముగా ఉండెదురు. కాని కలియుగములో వీరు కోకొల్లలు. వీరి సంఖ్యఅపారము, అగణ్యము. (దో॥ 40)

చౌ- పరహిత సరిస ధర్మ నహిం భాఈ । పర పీడా సమ నహిం అధమాఈ ॥
నిర్నయ సకల పురాన బేద కర । కహేఉం తాత జానహిం కోబిద నర ॥ 1 ॥
నర సరీర ధరి జే పర పీరా । కరహిం తే సహహిం మహా భవ భీరా ॥
కరహిం మోహ బస నర అఘ నానా । స్వారథ రత పరలోక నసానా ॥ 2 ॥
కాలరూప తిన్హ కహం మైం భ్రాతా । సుభ అరు అసుభ కర్మ ఫల దాతా ॥
అస బిచారి జే పరమ సయానే । భజహిం మోహి సంసృత దుఖ జానే ॥ 3 ॥
త్యాగహిం కర్మ సుభాసుభ దాయక । భజహిం మోహి సుర నర ముని నాయక ॥
సంత అసంతన్హ కే గున భాషే । తే న పరహిం భవ జిన్హ లఖి రాఖే ॥ 4 ॥

సోదరా! పరోపకారముతో సమానమైన ధర్మము లేనే లేదు. ఇతరులకు కీడు చేయుటకంటెను వేఱొక పాపమే లేదు. నాయనా! వేదపురాణములలో తెలుపబడిన విషయములను నీకు సంగ్రహముగా వినిపించితిని. పండితులు వీటిని ఎఱుగుదురు. మానవశరీరములను పొందియు ఇతరులకు కీడు తలపెట్టువారు జననమరణచక్రములో పరిభ్రమించుచు, క్లేశములను అనుభవింపవలసియుండును. మనుష్యులు మోహవశమున స్వార్థములో మునిగి, పెక్కు పాపములను చేయుచుందురు. అందువలన వారు సద్గతులను పొందజాలరు. పైగా నరకయాతనలకు గుఱియగుదురు. సోదరా! నేను వారికి యమునితో సమానుడను. వారి మంచి, చెడుకర్మలకు తగినఫలములను ఒసంగెదను. దీనిని ఎఱింగి జ్ఞానులు, సంసారము దుఃఖ రూపమని తెలిసికొని, నన్ను భజింతురు. శుభాశుభఫలములనిచ్చు కర్మలను వదలి, వారు దేవతలకును, మనుష్యులకును, మునీశ్వరులకును అధి దేవతనైన నన్ను భక్తితో భజింతురు. ఇంత వరకును సజ్జన దుర్జనుల లక్షణములను తెల్పితిని. ఈ జనుల గుణదోషములను ఎఱింగిన వారు జననమరణచక్రములో పడరు. (చౌ॥ 1-4)

దో- సునహు తాత మాయా కృత, గున అరు దోష అనేక।
గున యహ ఉభయ న దేఖిఅహిఀ, దేఖిఅ సో అబిబేక ॥ 41 ॥

నాయనా! వినుము. లోకములోని గుణ దోషములు అన్నియును మాయాకల్పితములే. ఈ రెండింటిని చూడకుండుటయే వివేకము. వాటిని చూచుట అవివేకము. (దో॥ 41)

చౌ- శ్రీముఖ బచన సునత సబ భాఈ। హరషే ప్రేమ న హృదయఀ సమాఈ ॥
కరహిఀ బినయ అతి బారహిఀ బారా। హనూమాన హియఀ హరష అపారా ॥ 1 ॥
పుని రఘుపతి నిజ మందిర గఏ। ఎహి బిధి చరిత కరత నిత నఏ ॥
బార బార నారద ముని ఆవహిఀ। చరిత పునీత రామ కే గావహిఀ ॥ 2 ॥
నిత నవ చరిత దేఖి ముని జాహీఀ। బ్రహ్మలోక సబ కథా కహాహీఀ ॥
సుని బిరంచి అతిసయ సుఖ మానహిఀ। పుని పుని తాత కరహు గున గానహిఀ ॥ 3 ॥
సనకాదిక నారదహి సరాహహిఀ। జద్యపి బ్రహ్మ నిరత ముని ఆహహిఀ ॥
సుని గున గాన సమాధి బిసారీ। సాదర సునహిఀ పరమ అధికారీ ॥ 4 ॥

'శ్రీరామచంద్రప్రభుముఖతః' ఈ వచనములను విన్నపిదప సోదరులందఱును ప్రసన్న చిత్తులైరి. ప్రేమతో వారిహృదయములుప్పొంగెను. పదేపదే తమ ఆనందములను ప్రకటించిరి. ముఖ్యముగా ఆంజనేయునకు పట్టరానిఆనందము కలిగెను. పిమ్మట ప్రభువు తన భవనమునకేగెను. ఈ విధముగా ప్రభువు ప్రతిదినము నూతనములైన లీలలను చూపించుచునేయుండెను. నారదముని తఱచుగా అయోధ్యకు వచ్చి, పరమపావనమైన శ్రీరామచరితమును గానమొనర్చుచుండెను. నారదమహర్షి ప్రతిదినము ప్రభువుయొక్క నూతనలీలలను జూచి, బ్రహ్మలోకమున కేగి, వాటిని వర్ణించుచుండెను. బ్రహ్మ దేవుడు వాటిని విని, పరమానందమునొందుచు ఇట్లు పల్కుచుండెను. "నాయనా! శ్రీరాముని గుణములను మాటి మాటికిని తెలుపుము" సనకాదిమునులు నారదుని ప్రశంసించుచుండిరి. వారు బ్రహ్మనిష్ఠాగరిష్ఠులైనను శ్రీరామునిగుణప్రశంసలను వినినప్పుడు బ్రహ్మ సమాధిని మఱచి, శ్రద్ధగా వినుచుండిరి. ఈ కథకు వారు సరియైన శ్రోతలు. (చౌ॥ 1-4)

దో- జీవనముక్త బ్రహ్మపర, చరిత సునహిఀ తజి ధ్యాన ।
జే హరి కథాఀ న కరహిఀ రతి, తిన్హ కే హియ పాషాన ॥ 42 ॥

సనకాదిమునులవంటి జీవన్ముక్తులు, బ్రహ్మనిష్ఠాగరిష్ఠులుగూడ తమబ్రహ్మసమాధిని మాని ప్రభుదివ్యచరిత్రమును వినుచుండగా శ్రీహరికథలను ప్రేమతో విననివారిహృదయములు నిజముగా పాషాణ సదృశములే. (దో॥ 42)

## పౌరులకు శ్రీరాముని హిత బోధ

చౌ-ఏక బార రఘునాథ బొలాఏ । గుర ద్విజ పురబాసీ సబ ఆఏ ॥
బైఠే గుర ముని అరు ద్విజ సజ్జన । బోలే బచన భగత భవ భంజన ॥ 1 ॥
సునహు సకల పురజన మమ బానీ । కహఉఀ న కఛు మమతా ఉర ఆనీ ॥
నహిఀ అనీతి నహిఀ కఛు ప్రభుతాఈ । సునహు కరహు జో తుమ్హహి సోహాఈ ॥ 2 ॥
సోఇ సేవక ప్రియతమ మమ సోఈ । మమ అనుసాసన మానై జోఈ ॥
జౌఀ అనీతి కఛు భాషౌఀ భాఈ । తౌ మోహి బరజహు భయ బిసరాఈ ॥ 3 ॥
బడే భాగ మానుష తను పావా । సుర దుర్లభ సబ గ్రంథన్హి గావా ॥
సాధన ధామ మోచ్ఛ కర ద్వారా । పాఇ న జేహిఀ పరలోక సఀవారా ॥ 4 ॥

ఒకసారి శ్రీరామచంద్రుడు గురునైన వసిష్ఠ మహర్షిని, బ్రాహ్మణులను ఇతర పుర ప్రముఖులను పిలిపించెను. సభలో గురువుగారు, మునులు, బ్రాహ్మణులు, సోదరులు, ఇతర సజ్జనులు యోగ్యతానుసారము కూర్చొని యుండగా భవభయబాధలను తొలగించు శ్రీరాముడిట్లనెను. "ఓ పౌరులారా! వినుడు. నేను కేవలము మీమీది మమకారముతో మాత్రమే చెప్పుట లేదు. నేను తెల్పునది నీతిబాహ్యమైనదియుగాదు. అధికారముతోడనూ తెల్పుట లేదు. నేను పలికెడి మాటలను సావధానముగా వినుడు. పిదప మీ ఇష్టము ప్రకారము చేయుడు. నా ఆజ్ఞను పాలించు వారు నాకు సేవకులు, ప్రియులు. సోదరులారా! నేను పలికెడి వచనములలో దోషమున్నచో నన్ను నిస్సంకోచముగా ఆపుడు. మహాభాగ్యవశమున ఈ మానవజన్మ లభించినది. ఈ దేహము దేవతలకును దుర్లభమని ప్రామాణిక శాస్త్రగ్రంథములలో పేర్కొనబడినది. ఇది ధర్మార్థ కామ (త్రివర్గ) సాధనకు ఉపకరణము, మోక్షమునకు ద్వారము. ఇట్టి శరీరమును పొందియు భగవత్ప్రాప్తికై ప్రయత్నింపనివాడు- (చౌ॥ 1-4)

దో- సో పరత్ర దుఖ పావఇ, సిర ధుని ధుని పఛితాఇ ।
కాలహి కర్మహి ఈస్వరహి, మిథ్యా దోష లగాఇ ॥ 43 ॥

పరలోకమున దుఃఖమును అనుభవించును. నెత్తి బాదుకొనుచు 'లబో దిబో' యనును. పిదప 'కుయ్యో! మొర్రో' అనుచు, పశ్చాత్తాప పడును. కాలమును, కర్మను, పైగా భగవంతుని వ్యర్థముగా నిందించును. (దో॥ 43)

చౌ- ఏహి తన కర ఫల బిషయ న భాఈ । స్వర్గఉ స్వల్ప అంత దుఖదాఈ ॥
నర తను పాఇ బిషయఁ మన దేహీఁ । పలటి సుధా తే సఠ బిష లేహీఁ ॥ 1 ॥
తాహి కబహుఁ భల కహఇ న కోఈ । గుంజా గ్రహఇ పరస మని ఖోఈ ॥
ఆకర చారి లచ్ఛ చౌరాసీ । జోని భ్రమత యహ జివ అబినాసీ ॥ 2 ॥
ఫిరత సదా మాయా కర ప్రేరా । కాల కర్మ సుభావ గున ఘేరా ॥
కబహుఁక కరి కరునా నర దేహీ । దేత ఈస బిను హేతు సనేహీ ॥ 3 ॥
నర తను భవ బారిధి కహుఁ బేరో । సన్ముఖ మరుత అనుగ్రహ మేరో ॥
కరనధార సదగుర దృఢ నావా । దుర్లభ సాజ సులభ కరి పావా ॥ 4 ॥

సోదరులారా! ఈ శరీరప్రాప్తికి ఫలములు విషయభోగములు గావు. స్వర్గ సుఖభోగములు గూడ అత్యల్పములు. పరిణామమున అవి దుఃఖప్రదములు. కావున మానవశరీరమును పొందినను విషయలోలురైనమూర్ఖులు అమృతమును వదలి, విషమును పానముచేసినవారగుదురు. 'పరుసవేది'ని పోగొట్టుకొని, గురువిందనాశ్రయించు వానిని మూఢుడు, అవివేకి అని అందురు. నాశరహితుడైన జీవుడు నాలుగువిధములైన ఎనుబదినాలుగులక్షలజీవరాసులలో పరిభ్రమించుచుండును. మాయా ప్రేరితుడై, కాలకర్మస్వభావగుణములకు వశుడై, ఈ జీవుడు వివిధయోనులలో జన్మించుచుండును. జీవుని ఈ దయనీయస్థితినిజూచి, నిర్హేతుక దయాళువైన భగవంతుడు వీనికి ఒక్కొక్కప్పుడు మానవశరీరమును ఇచ్చుచుండును. భవసాగరమును దాటుటకు ఈ మానవశరీరము ఒక నావవంటిది. నా అనుగ్రహమే అనుకూలపవనము. సద్గురువు ఈ నావకు కర్ణధారుడు. ఇట్టి దుర్లభ సాధనములు భగవత్కృపవలననే సులభముగా ప్రాప్తించును. (చౌ॥ 1-4)

దో- జో న తరై భవ సాగర, నర సమాజ అస పాఇ ।
సో కృత నిందక మందమతి, ఆత్మాహన గతి జాఇ ॥ 44 ॥

ఇట్టి సాధనములు లభించినప్పటికిని భవసాగరమునుండి తరించుటకు ప్రయత్నింపనివాడు మందబుద్ధి, కృతఘ్నుడు. అతడు ఆత్మఘాతకుడు పొందెడి గతిని చేరును. (దో॥ 44)

చౌ- జౌఁ పరలోక ఇహాఁ సుఖ చహహూ । సుని మమ బచన హృదయఁ దృఢ గహహూ ॥
సులభ సుఖద మారగ యహ భాఈ । భగతి మోరి పురాన శ్రుతి గాఈ ॥ 1 ॥
గ్యాన అగమ ప్రత్యూహ అనేకా । సాధన కఠిన న మన కహుఁ టేకా ॥
కరత కష్ట బహు పావఇ కోఊ । భక్తి హీన మోహి ప్రియ నహిఁ సోఊ ॥ 2 ॥
భక్తి సుతంత్ర సకల సుఖ ఖానీ । బిను సతసంగ న పావహిఁ ప్రానీ ॥
పున్య పుంజ బిను మిలహిఁ న సంతా । సతసంగతి సంసృతి కర అంతా ॥ 3 ॥
పున్య ఏక జగ మహుఁ నహిఁ దూజా । మన క్రమ బచన బిప్ర పద పూజా ॥
సానుకూల తెహి పర ముని దేవా । జో తజి కపటు కరఇ ద్విజ సేవా ॥ 4 ॥

మీరు ఇహ పరలోకములయందుగూడ సుఖములను గోరుకొన్నచో నా మాటలను విని, వాటిని దృఢముగా మనస్సులలో నిలుపుకొనుడు. సోదరులారా! నేను పేర్కొనిన ఈ భక్తిమార్గము 'అతి సులభము, సుఖ ప్రదము' అని వేదములును, పురాణములును తెలుపుచున్నవి. జ్ఞానమార్గము సుగమము గాదు. దానిసాధనలో అనేకవిఘ్నములు ఎదురగుచుండును. జ్ఞానమార్గసాధన కఠినము. దానిలో మనస్సుకు ఆలంబనము దొరకదు. అతికష్టముమీద ఏ యొక్కరికో జ్ఞానము లభ్యమగును. కాని భక్తిరహితమైన జ్ఞానమార్గసాధన నాకు ప్రియముగాదు. భక్తి స్వతంత్ర సాధనము. అన్ని సుఖములకును అది నిదానము. కాని సజ్జనసాంగత్యము లేనిదే ప్రాణులకు ఇది లభింపదు. పుణ్య సమూహము లేకుండ సజ్జన సాంగత్యము ప్రాప్తింపదు. సత్సాంగత్యమే జనన మరణ చక్రమునుండి ప్రాణికోటికి ముక్తిని కలిగించును. మనోవాక్కర్మలచే (త్రికరణ శుద్ధిగా) బ్రాహ్మణులను పూజించుటలో సమానమైన పుణ్యకార్యము ప్రపంచమున మఱియొకటి లేదు. కపటమును వదలి, బ్రాహ్మణసేవచేయువానియెడల మునులు దేవతలుగూడ ప్రసన్నులయ్యెదరు. (చౌ॥ 1-4)

దో- ఔరఉ ఏక గుపుత మత, సబహి కహఉఁ కర జోరి ।
సంకర భజన బినా నర, భగతి న పావఇ మోరి ॥ 45 ॥

మఱియొక రహస్యవిశేషము గలదు. వినయముతో దానిని ప్రకటించుచున్నాను. శంకరుని భజింపకుండ మానవుడు నా భక్తిని పొందలేడు. అనగా రామానుగ్రహము లభించుటకై శివపూజ ముఖ్యకర్తవ్యము. (దో॥ 45)

చౌ- కహహు భగతి పథ కవన ప్రయాసా । జోగ న మఖ జప తప ఉపవాసా ॥
సరల సుభావ న మన కుటిలాఈ । జథా లాభ సంతోష సదాఈ ॥ 1 ॥
మోర దాస కహాఇ నర ఆసా । కరఇ తౌ కహహు కహా బిస్వాసా ॥
బహుత కహఉఁ కా కథా బఢాఈ । ఏహి ఆచరన బస్య మైఁ భాఈ ॥ 2 ॥
బైర న బిగ్రహ ఆస న త్రాసా । సుఖమయ తాహి సదా సబ ఆసా ॥
అనారంభ అనికేత అమానీ । అనఘ అరోష దచ్ఛ బిగ్యానీ ॥ 3 ॥
ప్రీతి సదా సజ్జన సంసర్గా । తృన సమ బిషయ స్వర్గ అపబర్గా ॥
భగతి పచ్ఛ హఠ నహిఁ సఠతాఈ । దుష్ట తర్క సబ దూరి బహాఈ ॥ 4 ॥

భక్తిమార్గమును అనుసరించుటలో కష్టమేమున్నది? తెల్పుడు. ఇందులో యోగమవసరమే లేదు. యజ్ఞ, జప, తపములతోగాని, ఉపవాసములతోగాని పనియే లేదు. కేవలము సరళ స్వభావము కావలెను. మనస్సులో కపటము ఉండరాదు. లభించినదానితో తృప్తిపడుచుండవలెను. నా(భగవంతుని) సేవకుడనని తెలుపుకొనుచు ఇతరులను నమ్మినచో నాపై విశ్వాసము ఎట్లుండును? ఇంతకంటె ఎక్కువగా చెప్పవలసిది ఏమున్నది? సోదరులారా! నేను చెప్పబోవు దానిని ఆచరించెడివారికే నేను వశుడనగుదును. ఎవ్వరినీ ద్వేషింపనివాడు, ఎవ్వరితోడను పోట్లాడని వాడు, ఆశాభయములు లేనివాడు- ఇనట్టి వానికి సర్వత్ర సుఖమే లభించును. నిష్కామ కర్మల నాచరించు వాడు, ఇంటిపై మమకారము లేనివాడు, గర్వము లేని వాడు, పాప రహితుడు, క్రోధహీనుడు, భక్తిభావమునందు దృఢచిత్తుడు,

భగవత్తత్త్వమును ఎఱిగినవాడు, సజ్జన సాంగత్యమునందు ఆసక్తి గలవాడు, విషయ సుఖములనే గాక స్వర్గమును ముక్తిని గూడ తృణ ప్రాయముగా జూచువాడు, భక్తి మార్గమును వీడని వాడు, అన్యమతములను దూషించని వాడు, సర్వవిధ కుతర్కములను త్యజించు వాడు- (చౌ॥ 1-4)

**దో- మమ గున గ్రామ నామ రత, గత మమతా మద మోహా ।**
**తా కర సుఖ సోఇ జానఇ, పరానంద సందోహా ॥ 46 ॥**

నా గుణములను కీర్తించుట యందును, నా నామజపము నందును లీనమైయుండువాడు, అట్లే మమతా మద మోహములకతీతుడైన వాడు- పరమాత్మ స్వరూపము నెఱింగి, ఆత్మానందము పొందును. ఆ ఆత్మానందము అనుభవైకవేద్యము. ఆ లీపి తినే వారికే తెలియును.[1] (దో॥ 46)

**చౌ-సునత సుధాసమ బచన రామ కే । గహే సబని పద కృపాధామ కే ॥**
**జనని జనక గుర బంధు హమారే । కృపా నిధాన ప్రాన తే ప్యారే ॥ 1 ॥**
**తను ధను ధామ రామ హితకారీ । సబ బిధి తుమ్హ ప్రనతారతి హారీ ॥**
**అసి సిఖ తుమ్హ బిను దేఇ న కోఊ । మాతు పితా స్వారథ రత ఓఊ ॥ 2 ॥**
**హేతు రహిత జగ జుగ ఉపకారీ । తుమ్హ తుమ్హార సేవక అసురారీ ॥**
**స్వారథ మీత సకల జగ మాహీం । సపనేహుఁ ప్రభు పరమారథ నాహీం ॥ 3 ॥**
**సబ కే బచన ప్రేమ రస సానే । సుని రఘునాథ హృదయఁ హరషానే ॥**
**నిజ నిజ గృహ గఏ ఆయసు పాఈ । బరనత ప్రభు బతకహీ సుహాఈ ॥ 4 ॥**

శ్రీరాముడు పలికిన అమృతవచనములను విని, అందఱును ఆయనపాదములకు ప్రణమిల్లి, ఇట్లు పలికిరి. "ఓ కృపానిధానా! మీరే మా తల్లిదండ్రులు. గురువు, సోదరులు, అన్నియు మీరే. మీరు మాకు ప్రాణములకంటెను ప్రియమైనవారు. శరణాగతులదుఃఖములను నివారించు ఓ శ్రీరామా! మీరే మాసిరిసంపదలు, ఇల్లూ వాకిలీ మీరే. మీరే మాహితైషులు. ఇట్టి అమృతోపదేశమును మీరు తప్ప మఱియొకరు ఈయలేరు. తల్లిదండ్రులుగూడ స్వార్థపరులే. ఓ అసురారీ! ప్రపంచములో ఎట్టి కారణమూ లేకుండ మేలుచేయువారు ఇద్దఱే. మీరు, మీ భక్తులు, మిగిలినవారందఱును స్వప్రయోజనములను ఆసించియే మైత్రి చేయుదురు. ప్రభూ! స్వప్నమునందును వారికి పరమార్థ భావము రాదు." ప్రేమపూర్ణములైన వారివచనములను విని, శ్రీరామచంద్రుని హృదయము మిక్కిలి ప్రసన్నమయ్యెను. పిమ్మట ప్రభునాజ్ఞనైకొని, ఆ మధురోపదేశ వచనములను స్మరించుచు అందఱును తమతమ గృహములకు ఏగిరి. (చౌ॥ 1-4)

1. రామనామమే లడ్డంట
అది తినే వారికే తీపంట

దో- ఉమా అవధబాసీ నర, నారి కృతారథ రూప ।
బ్రహ్మ సచ్చిదానంద ఘన, రఘునాయక జహఁ భూప ॥ 47 ॥

(శివుడు పలుకుచున్నాడు) ఓ ఉమా! అయోధ్యావాసులైన స్త్రీ పురుషులందఱును కృతార్థులు. ఏలనన వారి ప్రభువే స్వయముగా పరమానంద స్వరూపుడైన శ్రీరఘునాథుడు గదా! (దో॥ 47)

## శ్రీరామునకు వసిష్ఠుని విన్నపము

చౌ- ఏక బార బసిష్ఠ ముని ఆఏ । జహాఁ రామ సుఖధామ సుహాఏ ॥
అతి ఆదర రఘునాయక కీన్హా । పద పఖారి పాదోదక లీన్హా ॥ 1 ॥
రామ సునహు ముని కహ కర జోరీ । కృపాసింధు బినతీ కఛు మోరీ ॥
దేఖి దేఖి ఆచరన తుమ్హారా । హోత మోహ మమ హృదయఁ అపారా ॥ 2 ॥
మహిమా అమితి బేద నహిఁ జానా । మైఁ కేహి భాఁతి కహఉఁ భగవానా ॥
ఉపరోహిత్య కర్మ అతి మందా । బేద పురాన సుమృతి కర నిందా ॥ 3 ॥
జబ న లేఉఁ మైఁ తబ బిధి మోహీ । కహా లాభ ఆగేఁ సుత తోహీ ॥
పరమాతమా బ్రహ్మ నర రూపా । హోఇహి రఘుకుల భూషన భూపా ॥ 4 ॥

ఒకసారి వసిష్ఠమహాముని సుఖధాముడైన శ్రీరామునియొద్దకు వచ్చెను. రఘునాథుడు అయనను మిక్కిలి ఆదరముతో గౌరవించి, ఆయనకాళ్లు కడిగి, ఆ పాదోదకమును గ్రోలెను. వసిష్ఠముని చేతులు జోడించి, పలికెను. "ఓ, కృపాళూ! శ్రీరామా! నా విన్నపమును ఆలకింపుడు. మీరు ఆచరించుచున్న మానవోచితకార్యములను జూచి, నా హృదయము అపార మోహమగ్నమగుచున్నది. హే భగవన్! మీ మహిమ అపారము. దానిని వేదములుగూడ తెల్పజాలవు. నేనేవిధముగ తెలిసికొనగలను? పురోహితుని పని అతి నిమ్న శ్రేణికి చెందినది. వేద పురాణ స్మృతులుగూడ దానిని నిందించును. రఘువంశమునకు పురోహిత కార్యమును నేను స్వీకరింపక ముందు బ్రహ్మదేవుడు నాతో పలికెను. 'కుమారా! నీవీ పనిని స్వీకరింపుము. దీని వలన నీకు మున్ముందు లాభము కలుగును. పరమాత్మయే స్వయముగా మానవరూపముతో రఘుకుల భూషణుడై జన్మించును.' (చౌ॥ 1-4)

దో- తబ మైఁ హృదయఁ బిచారా, జోగ జగ్య బ్రత దాన ।
జా కహుఁ కరిఅ సో పైహఉఁ, ధర్మ న ఏహి సమ ఆన ॥ 48 ॥

అప్పుడు నేను మనస్సులో ఆలోచించితిని. జనులు ఎవరి కొఱకు యోగములు, యజ్ఞములు, వ్రతములు, దానములు మున్నగు ధర్మకార్యములను చేయుదురో అట్టి పరమాత్మను నేను ఈ పురోహిత కార్యమువలన పొందగలుగునప్పుడు దీనివంటి మఱియొక ధర్మము ఉండదు. (దో॥ 48)

చౌ- జప తప నియమ జోగ నిజ ధర్మా । శ్రుతి సంభవ నానా సుభ కర్మా ॥
గ్యాన దయా దమ తీరథ మజ్జన । జహఁ లగి ధర్మ కహత శ్రుతి సజ్జన ॥ 1 ॥

ఆగమ నిగమ పురాన అనేకా । పఢే సునే కర ఫల ప్రభు ఏకా ॥
తవ పద పంకజ ప్రీతి నిరంతర । సబ సాధన కర యహ ఫల సుందర ॥ 2 ॥
ఛూటఇ మల కి మలహి కే ధోఏఁ । ఘృత కి పావ కోఇ బారి బిలోఏఁ ॥
ప్రేమ భగతి జల బిను రఘురాఈ । అభిఅంతర మల కబహుఁ న జాఈ ॥ 3 ॥
సోఇ సర్బగ్య తగ్య సోఇ పండిత । సోఇ గున గృహ బిగ్యాన అఖండిత ॥
దచ్ఛ సకల లచ్ఛన జుత సోఈ । జాకేఁ పద సరోజ రతి హోఈ ॥ 4 ॥

జపతపోనియమములు, యోగములు, వర్ణాశ్రమధర్మములు, విధ్యుక్తములైన అనేకశుభ కర్మలు, జ్ఞానము, దయ, దమము, తీర్థ స్నానములు- క్షేత్రసందర్శనములు మున్నగునవి ధర్మములని వేదములయందును, సజ్జనులచేతనుచెప్పబడినవి. ప్రభూ! వీటిని ఆచరించుటవలనను, అనేకతంత్రములవలనను, వేదములను పురాణములను అధ్యయనముచేయుటవలనను, వినుట చేతను కలుగు ముఖ్యమైన ఫలమూ, సర్వసాధనలవలన కలిగెడి ఫలమూ ఒక్కటే. అదేమనగా మీ చరణకమలములపై నిరంతరభక్తి కలిగియుండుట. మురికితో కడిగినచో మురికి తొలగునా? నీటిని చిలికినచో నేయి లభించునా? అట్లే రఘునాథా! ప్రేమ, భక్తి అనెడి నీరు లేకుండా అంతఃకరణమునందలి 'అజ్ఞాన మనెడి మైల' తొలగదు. మీ చరణ కమలములపై భక్తి కుదురుకొనిన వాడే సర్వజ్ఞుడు, తత్త్వజ్ఞుడు, పండితుడు అతడే సద్గుణనిధానము, అఖండవిజ్ఞాని, సులక్షణ యుక్తుడు, దక్షుడు. (చౌ॥ 1-4)

దో- నాథ ఏక బర మాగఉఁ, రామ కృపా కరి దేహు ।
జన్మ జన్మ ప్రభు పద కమల, కబహుఁ ఘటై జని నేహు ॥ 49 ॥

ప్రభూ! శ్రీరామా! మిమ్ము ఒక్క వరమును గోరెదను. కృపతో ప్రసాదింపుడు. మీ చరణ కమలములపై నాకుగల భక్తి జన్మజన్మాంతరములయందును తరుగకుండుగాక." (దో॥ 49)

చౌ- అస కహి ముని బసిష్ట గృహ ఆఏ । కృపాసింధు కే మన అతి భాఏ ॥
హనూమాన భరతాదిక భ్రాతా । సంగ లిఏ సేవక సుఖదాతా ॥ 1 ॥
పుని కృపాల పుర బాహెర గఏ । గజ రథ తురగ మగావత భఏ ॥
దేఖి కృపా కరి సకల సరాహే । దిఏ ఉచిత జిన్హ జిన్హ తెఇ చాహే ॥ 2 ॥
హరన సకల శ్రమ ప్రభు శ్రమ పాఈ । గఏ జహాఁ సీతల అవఁరాఈ ॥
భరత దీన్హ నిజ బసన డసాఈ । బైఠే ప్రభు సేవహిఁ సబ భాఈ ॥ 3 ॥
మారుతసుత తబ మారుత కరఈ । పులక బపుష లోచన జల భరఈ ॥
హనూమాన సమ నహిఁ బడభాగీ । నహిఁ కొఉ రామ చరన అనురాగీ ॥ 4 ॥
గిరిజా జాసు ప్రీతి సెవకాఈ । బార బార ప్రభు నిజ ముఖ గాఈ ॥ 5 ॥

ఈ విధముగా పలికి, వసిష్ఠ మహర్షి తన నివాసమునకు వెళ్లెను. ఆయన హృదయమునందలి మనోభావములు దయాసింధువైన శ్రీరామునకు అత్యంత ప్రీతిని గూర్చెను. పిమ్మట సేవకులకు సుఖప్రదుడైన శ్రీరామచంద్రుడు

హనుమంతుని, భరతాది సోదరులను తనవెంట తోడ్కొని, నగరము వెలుపలికి వెళ్లి, రథములను, ఏనుగులను, గుఱ్ఱములను అచటికి తెప్పించెను. అచటివారిని కృపతో చూచి, ప్రేమతో అందఱిని ప్రశంసించెను. వాటిని ప్రజలకు కోరిన విధముగా ఇచ్చివేసెను. సమస్త శ్రమలను దూరము చేయు ప్రభువు రథ గజ తురగములను ఇచ్చివేయుటచే దప్పినవాడై, చల్లని మామిడి తోపునీడలో విశ్రమించెను. భరతుడచ్చట తన వస్త్రమును పఱచెను. ప్రభువు దానిపై ఆసీనుడయ్యెను. సోదరులందఱును సేవలు చేయసాగిరి. పావని వీవనతో వీచుచుండెను. అతని శరీరము పులకితమయ్యెను. కన్నులలో ఆనందాశ్రువులు నిండెను. (శివుడు పలుకుచున్నాడు) ఓ గిరిజా! శ్రీరాముని చరణ కమలములను ఆశ్రయించిన హనుమంతుని కంటెను భాగ్యశాలి ఎవ్వరును లేరు. అతని ప్రేమను, సేవలను ప్రభువు స్వయముగా నూటి మాటికిని కొనియాడెను. (చౌ॥ 1-5)

## నారదుడు శ్రీరాముని స్తుతించుట

దో- తెహిఁ అవసర ముని నారద, ఆఏ కరతల బీన ।
గావన లగే రామ కల, కీరతి సదా నబీన ॥ 50 ॥

ఆ సమయముననే నారదమహర్షి మహతిని చేతబూని, అచ్చటికి వచ్చెను. శ్రీరామచంద్రునియొక్క నిత్యనూతనమనోహరకీర్తిని గానము చేయసాగెను.[1] (దో॥ 50)

చౌ- మామవలోకయ పంకజ లోచన । కృపా బిలోకని సోచ బిమోచన ॥
నీల తామరస స్యామ కామ అరి । హృదయ కంజ మకరంద మధుప హరి ॥ 1 ॥
జాతుధాన బరూథ బల భంజన । ముని సజ్జన రంజన అఘ గంజన ॥
భూసుర ససి నవ బృంద బలాహక । అసరన సరన దీన జన గాహక ॥ 2 ॥
భుజ బల బిపుల భార మహి ఖండిత । ఖర దూషన బిరాధ బధ పండిత ॥
రావనారి సుఖరూప భూపబర । జయ దసరథ కుల కుముద సుధాకర ॥ 3 ॥
సుజస పురాన బిదిత నిగమాగమ । గావత సుర ముని సంత సమాగమ ॥
కారునీక బ్యలీక మద ఖండన । సబ బిధి కుసల కోసలా మండన ॥ 4 ॥
కలి మల మథన నామ మమతాహన । తులసిదాస ప్రభు పాహి ప్రనత జన ॥ 5 ॥

"ఓ కమలనయనా! దయతో నన్ను కనికరింపుము. ఓ శోక విమోచనా! నాపై మీ కృపాదృష్టిని ప్రసరింప జేయుము. నీవు నీలకమలమువలె శ్యామసుందరుడవు. మన్మథశత్రువైన శివుని హృదయ కమలమునందలి ప్రేమ మకరందమును ఆస్వాదించుమధుపమవు. రాక్షసబలములను నశింపజేయువాడవు. మునులకును, సజ్జనులకును ఆనందమును గూర్చువాడవు. పాపములను రూపుమాపువాడవు. బ్రాహ్మణసమూహములనెడి సస్యములపై వర్షించు సజలమేఘసమూహమువంటివాడవు. అశరణశరణ్యుడవు. దీనజనపాలకుడవు. నీ అతులపరాక్రమముచే

1. నారద గానలోలా! నతజనపరిపాలా!
నీరద సమనీలా! నిరుపమగుణశీలా ॥నారద॥ (త్యాగరాజ)

భూభారమునుబాపువాడవు. ఖరదూషణవిరాధులను వధించిన సమర్థుడవు. పరమానంద స్వరూపుడవు. రావణారీ! రాజ శిరోమణీ! దశరథకులకుముదసుధాకరా! నీకు జయము. నీ కీర్తిని వేద పురాణములును, తంత్రశాస్త్రములును ప్రస్తుతించినవి. ఆ కీర్తి దేవతల, మునుల, సజ్జనుల సభలలో గానము చేయబడుచుండును. నీవు కరుణాకరుడవు, దురభిమానమును దూరముచేయువాడవు, సర్వసమర్థుడవు. అయోధ్యకే అలంకారమైన వాడవు. కలియుగ పాపములను రూపుమాపువాడవు. ఓ తులసీదాస ప్రభూ! నీ నామస్మరణము మమకారమును హరించి వేయును. శరణుజొచ్చిన నన్ను రక్షింపుము. (చౌ॥ 1-5)

దో- ప్రేమ సహిత ముని నారద, బరని రామ గున గ్రామ ।
సోభాసింధు హృదయఀ ధరి, గఏ జహాఀ బిధి ధామ ॥ 51 ॥

శ్రీరామచంద్రునిగుణములను కీర్తించిన పిమ్మట నారదమహాముని శోభాసింధువైన శ్రీరాముని తన హృదయమున నిలుపుకొని, బ్రహ్మలోకమునకు వెళ్లెను. (దో॥ 51)

చౌ- గిరిజా సునహు బిసద యహ కథా । మైఀ సబ కహీ మోరి మతి జథా ॥
రామ చరిత సత కోటి అపారా । శ్రుతి సారదా న బరనై పారా ॥ 1 ॥
రామ అనంత అనంత గునానీ । జన్మ కర్మ అనంత నామానీ ॥
జల సీకర మహి రజ గని జాహీఀ । రఘుపతి చరిత న బరని సిరాహీఀ ॥ 2 ॥
బిమల కథా హరి పద దాయనీ । భగతి హోఇ సుని అనపాయనీ ॥
ఉమా కహిఉఀ సబ కథా సుహాఈ । జో భుసుండి ఖగపతిహి సునాఈ ॥ 3 ॥
కఛుక రామ గున కహేఉఀ బఖానీ । అబ కా కహౌఀ సో కహహు భవానీ ॥
సుని సుభ కథా ఉమా హరషానీ । బోలీ అతి బినీత మృదు బానీ ॥ 4 ॥
ధన్య ధన్య మైఀ ధన్య పురారీ । సునేఉఀ రామ గున భవ భయ హారీ ॥ 5 ॥

(శివుడు పలుకుచున్నాడు) ఓ గిరిజా! వినుము. నా బుద్ధికి తోచినట్లు ఉజ్జ్వలమైన ఈ కథను నీకు వినిపించితిని. శ్రీరాముని గాథలు అసంఖ్యాకములు. అనంతములు, అపారములు. వేదములు గాని, వాగ్దేవిగాని వాటిని వర్ణించుట అశక్యము. శ్రీరామచంద్రప్రభువు అనంతుడు. ఆయన గుణములు అనంతములు, ఆయన జన్మలు, కర్మలు, నామములు అనంతములు. జల శీకరములను, పృథ్వీ రజఃకణములను లెక్కింప వచ్చునేమోగాని శ్రీరాముని లీలలను ఎంతగా వర్ణించినను పూర్తిగా ప్రకటింపజాలము. ఈ పావన నిర్మలగాథ శ్రీహరిపరమపదమును ప్రాప్తింప జేయును. దీని శ్రవణమున హృదయమునందు అచంచలభక్తియేర్పడును. ఉమా! కాకభుశుండి గరుడునకు వినిపించిన కథను నేను నీకు తెలిపితిని. నేను శ్రీరాముని గుణములను కొన్నింటినే వివరించితిని. భవానీ! ఇప్పుడు నేనేమి చెప్పవలెను? శ్రీరామునికల్యాణప్రదమైనగాథను విని, పార్వతీ దేవి ప్రసన్నురాలయ్యెను. ఆమె అత్యంత వినయముతో మృదు మధురముగా ఇట్లనెను. "ఓ త్రిపురారీ! జన్మమృత్యుభయములను హరించు శ్రీరామునిచరిత్రమును విన్ననేను ధన్యురాలను, కృతార్థురాలను. (చౌ॥ 1-5)

దో- తుమ్హారీ కృపాఁ కృపాయతన, అబ కృతకృత్య న మోహ ।
జానేఉఁ రామ ప్రతాప ప్రభు, చిదానంద సందోహ ॥ 52(క) ॥
నాథ తవానన ససి స్రవత, కథా సుధా రఘుబీర ।
శ్రవన పుటన్హి మన పాన కరి, నహిఁ అఘాత మతిధీర ॥ 52(ఖ) ॥

ఓ దయాళూ! మీ కృపవలననే కృతకృత్యురాలనైనాను. మోహరహితనైతిని. ప్రభూ! సచ్చిదానంద స్వరూపుడగు శ్రీరామునిప్రతాపమును దెలిసికొంటిని. నాథా! మీ ముఖచంద్రుడు శ్రీరఘువీర కథామృతమును వర్షించును. ఓ మహాత్మా! ఆ కథాసుధను ఎంతగా గ్రోలినను నాకు తనివితీరుట లేదు. ఈ కథామృతమును మీరు నిరంతరముగా వర్షించుచుండుడు, నేను దానిని ఆస్వాదించుచునే యుందును. (దో॥ 52. క,ఖ)

చౌ- రామ చరిత జే సునత అఘాహీఁ । రస బిసేష జానా తిన్హ నాహీఁ ॥
జీవనముక్త మహాముని జేఊ । హరి గున సునహిఁ నిరంతర తేఊ ॥ 1 ॥
భవ సాగర చహ పార జో పావా । రామ కథా తా కహఁ దృఢ నావా ॥
బిషఇన్హ కహఁ పుని హరి గున గ్రామా । శ్రవన సుఖద అరు మన అభిరామా ॥ 2 ॥
శ్రవనవంత అస కో జగ మాహీఁ । జాహి న రఘుపతి చరిత సోహాహీఁ ॥
తే జడ జీవ నిజాత్మక ఘాతీ । జిన్హహి న రఘుపతి కథా సోహాతీ ॥ 3 ॥
హరిచరిత్ర మానస తుమ్హ గావా । సుని మైఁ నాథ అమితి సుఖ పావా ॥
తుమ్హ జో కహీ యహ కథా సుహాఈ । కాగభసుండి గరుడ ప్రతి గాఈ ॥ 4 ॥

శ్రీరామకథా శ్రవణమున తృప్తులైనట్లు చెప్పెడివారిని ఆ కథా విశేషరసమును అనుభవించని వారుగా భావింపవలెను. జీవన్ముక్తులైన మునులుగూడ భగవంతుని గుణరసమాధుర్యములను నిరంతరము ఆస్వాదించుచునేయుందురు. భవసాగరమును దాటగోరువారికి శ్రీరామ గాథ దృఢమైన నౌక వంటిది. విషయలోలురకును శ్రీహరిగుణపుంజములు చెవులకింపుగా మానసోల్లాసములను గూర్చును. చెవులుండియు శ్రీరాముని మధురగాథను విని ఆనందింప లేనివాడెవడు? ఆకథ రుచింపనివాడు నిజముగా జడుడు, ఆత్మ ఘాతకుడు. నాథా! మీరు 'శ్రీరామచరితమానసము'ను గానము చేసితిరి. దానిని విన్న నా ఆనందమునకు హద్దులు లేవు. ఈ కమ్మనికథను కాకభుశుండి గరుడునకు చెప్పినాడని మీరు నాకు తెల్పితిరి. ఇప్పుడు వారి సంవాదమును నాకు వివరింపుడు. (చౌ॥ 1-4)

## కాకభుసుండీ వృత్తాంతము

దో- బిరతి గ్యాన బిగ్యాన దృఢ, రామ చరన అతి నేహ ।
బాయస తన రఘుపతి భగతి, మోహి పరమ సందేహ ॥ 53 ॥

కాకి జన్మ నెత్తినను కాకభుశుండి వైరాగ్యమునందును, జ్ఞానవిజ్ఞానములయందును దృఢ చిత్తము గలవాడయ్యెను. అతనికి శ్రీరఘునాథుని భక్తి అబ్బెను. ఈ విషయమున నాకు మిక్కిలి సందేహము గలుగుచున్నది. (దో॥ 53)

చౌ- నర సహస్ర మహఁ సునహు పురారీ । కోఉ ఏక హోఇ ధర్మ బ్రతధారీ ॥
ధర్మసీల కోటిక మహఁ కోఈ । బిషయ బిముఖ బిరాగ రత హోఈ ॥ 1 ॥
కోటి బిరక్త మధ్య శ్రుతి కహఈ । సమ్యక గ్యాన సకృత కోఉ లహఈ ॥
గ్యానవంత కోటిక మహ కోఊ । జీవనముక్త సకృత జగ సోఊ ॥ 2 ॥
తిన్హ సహస్ర మహుఁ సబ సుఖ ఖానీ । దుర్లభ బ్రహ్మలీన బిగ్యానీ ॥
ధర్మసీల బిరక్త అరు గ్యానీ । జీవనముక్త బ్రహ్మపర ప్రానీ ॥ 3 ॥
సబ తే సో దుర్లభ సురరాయా । రామ భగతి రత గత మద మాయా ॥
సో హరిభగతి కాగ కిమి పాఈ । బిస్వనాథ మోహి కహహు బుఝాఈ ॥ 4 ॥

ఓ త్రిపురారీ! వినుడు. వేయి మంది మనుష్యులలో ధర్మ పథమున నడచువాడు ఎవడో ఒక్కడు మాత్రమే ఉండును. అట్టి ధర్మ పరాయణులలో కోటి మందికి ఒక్కడు మాత్రమే విషయ వాంఛా విముఖుడై విరాగియైయుండును. అట్టికోటి మంది విరాగులలో ఒక్కడు మాత్రమే 'సమ్యక్' జ్ఞానమును పొందును. అట్టి జ్ఞానులలో కోటికొక్కడు మాత్రమే జీవన్ముక్తుడగును. అట్టి వేయి మంది జీవన్ముక్తులలో సుఖనిధానమైన బ్రహ్మానందమునమగ్నుడైనపురుషుడు అరుదుగా మాత్రమే లభించును. ధర్మపరాయణులు, విరక్తులు, జ్ఞానులు, జీవన్ముక్తులు, బ్రహ్మైక్యమును బొందిన వారు- వీరందఱిలో దురభిమానమునుండియు మాయనుండియు ముక్తుడై, శ్రీరామ భక్తిలో లీనమైన ప్రాణి మిక్కిలి అరుదుగా నుండును. ఓ విశ్వనాథా! అట్టి దుర్లభమైన హరిభక్తిని కాకభుశుండి యెట్లు పొందెను? నాకు విశదముగా తెలుపుడు. (చౌ॥ 1-4)

దో- రామ పరాయన గ్యాన రత, గునాగార మతి ధీర ।
నాథ కహహు కెహి కారన, పాయఉ కాక సరీర ॥ 54 ॥

నాథా! శ్రీరామచంద్రునిపై ఆసక్తుడు, జ్ఞాననిరతుడు, గుణనిధి, స్థిరచిత్తుడు ఐన భుశుండుడు కాకి రూపమును పొందుటకు కారణమేమి? (దో॥ 54)

చౌ- యహ ప్రభు చరిత పవిత్ర సుహావా । కహహు కృపాల కాగ కహఁ పావా ॥
తుమ్హ కెహి భాఁతి సునా మదనారీ । కహహు మోహి అతి కౌతుక భారీ ॥ 1 ॥
గరుడ మహాగ్యానీ గున రాసీ । హరి సేవక అతి నికట నివాసీ ॥
తెహిఁ కెహి హేతు కాగ సన జాఈ । సునీ కథా ముని నికర బిహాఈ ॥ 2 ॥
కహహు కవన బిధి భా సంబాదా। దోఉ హరిభగత కాగ ఉరగాదా ॥
గౌరి గిరా సుని సరల సుహాఈ । బోలే సివ సాదర సుఖ పాఈ ॥ 3 ॥

ధన్య సతీ పావన మతి తోరీ । రఘుపతి చరన ప్రీతి నహిఁ థోరీ ॥
సునహు పరమ పునీత ఇతిహాసా । జో సుని సకల లోక భ్రమ నాసా ॥ 4 ॥
ఉపజఇ రామ చరన బిస్వాసా । భవ నిధి తర నర బినహిఁ ప్రయాసా ॥ 5 ॥

ఓ కృపాళూ! శ్రీరామచంద్రుని యొక్క ఈ దివ్య మైన మనోహర చరిత్రమును ఆ కాకభుశుండి ఎవరి నుండి పొందెను. ఓ మదనాంతకా! దానిని మీరు ఏ విధముగా వింటిరి? దానిని వినవలెనను కుతూహలము నాలో మెండుగానున్నది. గరుత్మంతుడు గొప్పజ్ఞాని, సద్గుణరాశి, హరిభక్తుడు, ఆ శ్రీహరికి వాహనము, అతి సన్నిహితుడు. ఆయన ఋషులను, మునులను, వదలి, కాకభుశుండి యొద్ద ఈ కథను ఏల వినెను? కాకభుశుండి గరుడుడు అను ఇరువురు భక్తులమధ్య పరస్పర సంభాషణము ఏ విధముగా జరిగెను?" పార్వతీదేవియొక్క సరళమైన, మనోహరములైన పలుకులను విని, శివుడు సంతోషించి, సాదరముగా పలికెను. "ఓ సతీ! నీవు ధన్యురాలవు. నీ బుద్ధి మిక్కిలి పవిత్రమైనది. శ్రీ రఘుపతిచరణములయెడ నీభక్తి అనన్యమైనది. ఇప్పుడా పరమపవిత్రగాథను వినుము. దానిని వినుటవలన దుఃఖములు, భ్రమలు తొలగిపోవును. పైగా శ్రీరామునిచరణములపై విశ్వాసము ఏర్పడును. మనుష్యుడు అనాయాసముగా సంసార సముద్రమును దాటగలుగును. (చౌ॥ 1-5)

దో- ఐసిఅ ప్రస్న బిహంగపతి, కీన్హి కాగ సన జాఇ ।
సో సబ సాదర కహిహఉఁ, సునహు ఉమా మన లాఇ ॥ 55 ॥

ఉమా! నీవు నన్ను ప్రశ్నించిన విధముగనే పక్షి రాజైన గరుడుడుగూడ కాకభుశుండి యొద్దకు వెళ్లి, ఆయనను ప్రశ్నించెను. నేను దానిని సాదరముగా తెలిపెదను. సావధానముగా వినుము. (దో॥ 55)

చౌ- మైఁ జిమి కథా సునీ భవ మోచని । సో ప్రసంగ సును సుముఖి సులోచని ॥
ప్రథమ దచ్ఛ గృహ తవ అవతారా । సతీ నామ తబ రహా తుమ్హారా ॥ 1 ॥
దచ్ఛ జగ్య తవ భా అపమానా । తుమ్హ అతి క్రోధ తజే తబ ప్రానా ॥
మమ అనుచరన్హ కీన్హ మఖ భంగా । జానహు తుమ్హ సో సకల ప్రసంగా ॥ 2 ॥
తబ అతి సోచ భయఉ మన మోరేఁ । దుఖీ భయఉఁ బియోగ ప్రియ తోరేఁ ॥
సుందర బన గిరి సరిత తడాగా । కౌతుక దేఖత ఫిరఉఁ బెరాగా ॥ 3 ॥
గిరి సుమేర ఉత్తర దిసి దూరీ । నీల సైల ఏక సుందర భూరీ ॥
తాసు కనకమయ సిఖర సుహాఏ । చారి చారు మోరే మన భాఏ ॥ 4 ॥
తిన్హ పర ఏక ఏక బిటప బిసాలా । బట పీపర పాకరీ రసాలా ॥
సైలోపరి సర సుందర సోహా । మని సోపాన దేఖి మన మోహా ॥ 5 ॥

జనన మరణముల నుండి ముక్తిని గూర్చు ఈ కథను నేను ఏ విధముగా వింటినో దానిని గూడ వినుము. ఓ సుముఖీ! సులోచనా! మొదట నీ అవతారము దక్షుని యింట జరిగెను. అప్పటి నీ నామము 'సతి'. దక్షుని యజ్ఞ వాటికయందు నీకు అవమానము జరుగుట వలన నీవు క్రుద్ధురాలవై యోగాగ్నిలో ప్రాణములను త్యజించితివి. నా

ఆమెచరులు యజ్ఞమును ధ్వంసమొనర్చిరి. ఆ కథలన్నియును నీవెఱింగినవే. అప్పుడు నా మనస్సు అతిచింతాక్రాంతమైయుండుటచే నీ వియోగ దుఃఖమును అనుభవించితిని. విరక్తుడనై, ఉదాసీనభావముతో నేను సుందరములైన వనముల యందును, పర్వతముల యందును, నదీ తటాకముల దృశ్యములను జూచుచు తిరుగుచుంటిని. సుమేరు పర్వతమునకు ఉత్తర దిశయందు అతి దూరమున ఒక అందమైన నీలపర్వతము గలదు. దాని యొక్క నాలుగు శిఖరములును స్వర్ణమయములు. అవి నాకు ఎంతయో నచ్చినవి. ఆనాల్గు శిఖరములపై వరుసగా విశాల వటవృక్షము, రావి, జువ్వి, మామిడి వృక్షములును గలవు. పర్వతముపై ఒక మనోహర సరస్సుగూడ కలదు. వాటిలోగల మణిమయసోపానములు మనస్సులను ముగ్ధ మొనర్చును. (చౌ॥ 1-5)

**దో- సీతల అమల మధుర జల, జలజ బిపుల బహురంగ ।**
**కూజత కల రవ హంస గన, గుంజత మంజుల భృంగ ॥ 56 ॥**

ఆ సరోవరజలము శీతలము, నిర్మలము, మధురము. దానిలో అనేకవర్ణముల కమలములు వికసించి యున్నవి. హంసలగణములు మధురముగా కలరవములనుగావించుచున్నవి. తుమ్మెదలు ఝుంకారములు సలుపుచున్నవి. (దో॥ 56)

చౌ- తెహి గిరి రుచిర బసఇ ఖగ సోఈ । తాసు నాస కల్పాంత న హోఈ ॥
మాయా కృత గున దోష అనేకా । మోహ మనోజ ఆది అబిబేకా ॥ 1 ॥
రహే బ్యాపి సమస్త జగ మాహీఁ । తెహి గిరి నికట కబహుఁ నహిఁ జాహీఁ ॥
తహఁ బసి హరిహి భజఇ జిమి కాగా । సో సును ఉమా సహిత అనురాగా ॥ 2 ॥
పీపర తరు తర ధ్యాన సో ధరఈ । జాప జగ్య పాకరి తర కరఈ ॥
ఆఁబ ఛాఁహ కర మానస పూజా । తజి హరి భజను కాజు నహిఁ దూజా ॥ 3 ॥
బర తర కహ హరి కథా ప్రసంగా । ఆవహిఁ సునహిఁ అనేక బిహంగా ॥
రామ చరిత బిచిత్ర బిధి నానా । ప్రేమ సహిత కర సాదర గానా ॥ 4 ॥
సునహిఁ సకల మతి బిమల మరాలా । బసహిఁ నిరంతర జే తెహిఁ తాలా ॥
జబ మైఁ జాఇ సో కౌతుక దేఖా । ఉర ఉపజా ఆనంద బిసేషా ॥ 5 ॥

ఆ మనోహర పర్వతము మీద ఈ పక్షి(కాకభుశుండి) నివసించును. కల్పాంతమునందుగూడ అది చిరంజీవియే. మాయారచితములై విశ్వవ్యాప్తములైన అనేకగుణదోషములును, మోహము, కామము మొదలగు అంతశ్శత్రువులును ఆ పర్వతమును దరిజేరవు. అక్కడ నివసించు ఆ కాకభుశుండి హరిభజనచేయురీతిని శ్రద్ధగా వినుము. అది రావి చెట్టు క్రింద కూర్చొని, ధ్యానము చేయును. జువ్విచెట్టు నీడలో జపయజ్ఞములను ఆచరించును. ఆమ్ర వృక్షచ్ఛాయలలో మానస పూజలొనర్చును. హరిభజన చేయుట తప్ప దానికి మఱియొక పనియే లేదు. వటవృక్షము క్రింద అది హరికథా ప్రసంగములను గావించును. ఆ కథలను వినుటకై అక్కడ అనేకపక్షులు గుమిగూడును. ప్రేమాదరములతో అది అనేక విధములుగా శ్రీరామగాథను గానము చేయును. విశుద్ధ బుద్ధిగల హంసలు సర్వదా ఆ సరోవరమునందు నివసించుచు ఆ కథను వినుచుండును. అక్కడికి వెళ్లి, ఆ దృశ్యమును చూడగా నా మనస్సు ఆనందతరంగితమయ్యెను. (చౌ॥ 1-5)

**దో- తబ కఛు కాల మరాల తను, ధరి తహఁ కీన్హ నివాస ।**
**సాదర సుని రఘుపతి గున, పుని ఆయఉఁ కైలాస ॥ 57 ॥**

నేను కొంత కాలము హంసశరీరమును ధరించి, అచట నివసించితిని. శ్రీ రఘునాథునికథను శ్రద్ధగా విని, తిరిగి కైలాసమునకు వచ్చితిని. (దో॥ 57)

చౌ- గిరిజా కహేఉఁ సో సబ ఇతిహాసా । మైఁ జేహి సమయ గయఉఁ ఖగ పాసా ॥
అబ సో కథా సునహు జేహి హేతూ । గయఉ కాగ పహిఁ ఖగ కుల కేతూ ॥ 1 ॥
జబ రఘునాథ కీన్హి రన క్రీడా । సముఝత చరిత హోతి మోహి బ్రీడా ॥
ఇంద్రజీత కర ఆపు బఁధాయో । తబ నారద ముని గరుడ పఠాయో ॥ 2 ॥
బంధన కాటి గయో ఉరగాదా । ఉపజా హృదయఁ ప్రచండ బిషాదా ॥
ప్రభు బంధన సముఝత బహు భాఁతీ । కరత బిచార ఉరగ ఆరాతీ ॥ 3 ॥
బ్యాపక బ్రహ్మ బిరజ బాగీసా । మాయా మోహ పార పరమీసా ॥
సో అవతార సునేఉఁ జగ మాహీఁ । దేఖేఉఁ సో ప్రభావ కఛు నాహీఁ ॥ 4 ॥

ఓ గిరిజా! నేను కాకభుశుండి యొద్దకు వెళ్లినప్పటి వృత్తాంతమును నీకు వినిపించితిని. పక్షి రాజైన గరుత్మంతుడు భుశుండి కడకేగిన కారణమును వివరించెదను. రఘుపతి మేఘనాదుని చేతిలో తనకు తానే బంధింపబడినప్పటి లీలలను దలచినప్పుడు నాకు మిక్కిలి బిడియము గలిగినది. ఆ సమయమున నారదమహర్షి గరుడుని పంపెను. సర్పభక్షకుడైన గరుడుడు ప్రభు బంధములను తొలగించునపుడు అతని మనస్సులో ప్రగాఢమైన విచారము కలిగెను. ప్రభు బంధములను జ్ఞప్తికి దెచ్చుకొని, గరుడుడు అనేక విధముల ఆలోచింప సాగెను. "సర్వవ్యాపకుడు, నిర్వికారుడు, వాగధిపతి, మాయాతీతుడు ఐన పరమేశ్వరుడు ఈ జగత్తున అవతరించినాడని విన్నాను. కాని ఆ అవతార ప్రభావమునేమాత్రమూ చూడలేదు. (చౌ॥ 1-4)

**దో- భవ బంధన తే ఛూటహిఁ, నర జపి జా కర నామ ।**
**ఖర్బ నిసాచర బాఁధేఉ, నాగపాస సోఇ రామ ॥ 58 ॥**

శ్రీరామ నామమును జపించుటచే మనుష్యుడు భవబంధములనుండి విముక్తులగుదురు. అట్టి మహిమాన్వితుడైన శ్రీరాముడు ఒకరాక్షసాధమునినాగపాశముచే బంధింపబడుట ఆశ్చర్యకరము". (దో॥ 58)

చౌ- నానా భాఁతి మనహి సముఝావా । ప్రగట న గ్యాన హృదయఁ భ్రమ ఛావా ॥
ఖేద ఖిన్న మన తర్క బఢాఈ । భయఉ మోహబస తుమ్హరిహిఁ నాఈ ॥ 1 ॥
బ్యాకుల గయఉ దేవరిషి పాహీఁ । కహేసి జో సంసయ నిజ మన మాహీఁ ॥
సుని నారదహి లాగి అతి దాయా । సును ఖగ ప్రబల రామ కై మాయా ॥ 2 ॥

జో గ్యానిన్హ కర చిత అపహరఈ । బరిఆఈఁ బిమోహ మన కరఈ ॥
జెహిఁ బహు బార నచావా మోహీ । సోఇ బ్యాపీ బిహంగపతి తోహీ ॥ 3 ॥
మహామోహ ఉపజా ఉర తోరేఁ । మిటిహి న బేగి కహే ఖగ మోరేఁ ॥
చతురానన పహిఁ జాహు ఖగేసా । సోఇ కరేహు జెహి హోఇ నిదేసా ॥ 4 ॥

గరుడుడు తన మనస్సును కుదుటపఱుచుకొనుటకు ప్రయత్నించెను. కాని జ్ఞానోదయము కాక పోవుటచే ఆయనహృదయము భ్రమతోనిండిపోయెను. భ్రమోత్పన్నమైన దుఃఖము అతనిని బాధించెను. మనస్సులోకుతర్క మధికమై అతడు నీ వలెనే మోహావిష్టుడయ్యెను. వ్యాకులుడై నారద మహర్షి యొద్దకు వెళ్ళి, తన మనస్సులోని సందేహమును ఆయనకు తెలిపెను. నారదునకు అతనిపై జాలి కలిగి ఇట్లు పలికెను. "ఓ గరుడుడా! వినుము. శ్రీరామునిమాయ అతి ప్రబలమైనది. అది జ్ఞానుల చిత్తములనుగూడ భ్రమలకులోను గావించి, వారి మనస్సులను మోహవశము గావించును. ఆ మాయ నన్నుగూడ పలుమాఱులు మోహావేశపరునిగా జేసెను. అదియే నీలోగూడ వ్యాపించినది. ఓ గరుడా! నీ హృదయమును ఆవరించిన మోహము నా మాటలతో తొలగిపోవునది గాదు. కావున పక్షిరాజా! నీవు బ్రహ్మదేవుని యొద్దకు వెళ్ళి, అతని ఆజ్ఞను అనుసరింపుము. (చౌ॥ 1-4)

దో- అస కహి చలే దేవరిషి, కరత రామ గున గాన ।
హరి మాయా బల బరనత, పుని పుని పరమ సుజాన ॥ 59 ॥

ఇట్లు పలికి, నారద మహర్షి శ్రీరాముని గుణములను కీర్తించుచు శ్రీహరి మాయాప్రభావమును మాటి మాటికిని వర్ణించుచు పోయెను. (దో॥ 59)

చౌ- తబ ఖగపతి బిరంచి పహిఁ గయఊ । నిజ సందేహ సునావత భయఊ॥
సుని బిరంచి రామహి సిరు నావా। సముఝి ప్రతాప ప్రేమ అతి ఛావా॥ 1 ॥
మన మహుఁ కరఇ బిచార బిధాతా। మాయా బస కబి కోబిద గ్యాతా ॥
హరి మాయా కర అమితి ప్రభావా । బిపుల బార జెహిఁ మోహి నచావా ॥ 2 ॥
అగ జగమయ జగ మమ ఉపరాజా । నహిఁ ఆచరజ మోహ ఖగరాజా ॥
తబ బోలే బిధి గిరా సుహాఈ । జాన మహేస రామ ప్రభుతాఈ ॥ 3 ॥
బైనతేయ సంకర పహిఁ జాహూ । తాత అనత పూఛహు జని కాహూ ॥
తహఁ హోఇహి తవ సంసయ హానీ । చలేఉ బిహంగ సునత బిధి బానీ ॥ 4 ॥

పక్షిరాజైన గరుడుడు బ్రహ్మదేవుని కడకేగి, తన సందేహమును ప్రకటించెను. దానిని విని, బ్రహ్మ శ్రీరామచంద్రునకు మనస్సులోనే నమస్కరించెను. ప్రభుప్రతాపమును స్మరింపగానే అతని హృదయము ప్రేమతో నిండిపోయెను. "కవులును, పండితులును, జ్ఞానులును అందఱు మాయాధీనులే గదా!" అని అతడు లోలోన ఆలోచింపసాగెను. భగవంతునిమాయాప్రభావము అపారము. అదినన్నే పలుమారులు ఆటపట్టించినది. సమస్తజడచేతనజగత్తు నేను సృష్టించినదే. అట్టి నేనే మాయామోహితుడనైతిని. ఇక పక్షిరాజు మోహితుడగుటలో

ఆశ్చర్యమేమున్నది? బ్రహ్మదేవుడిట్లనెను. "ఓ గరుడుడా! శ్రీరాముని మహిమను ఆ పరమేశ్వరుడు బాగుగా ఎఱుంగును. కావున నీవు మహేశునికడకు పొమ్ము. నాయనా! ఎవ్వరినీ ఏమియు అడుగవలదు. నీ సందేహమును అతడే తొలగింపగలడు". బ్రహ్మ వచనములను విని, గరుడుడు అచట నుండి నాకొఱకు బయలు దేఱెను. (చౌ॥ 1-4)

దో- పరమాతుర బిహంగపతి, ఆయఉ తబ మో పాస ।
జాత రహేఉఁ కుబేర గృహ, రహిహు ఉమా కైలాస ॥ 60 ॥

మిక్కిలి ఆతురతతో గరుడుడు నా యొద్దకు వచ్చెను. ఉమా! నేను కుబేరుని కడకు పోవుచుంటిని. నీవాసమయమున కైలాస పర్వతమున ఉంటివి. (దో॥ 60)

చౌ- తెహిఁ మమ పద సాదర సిరు నావా । పుని ఆపన సందేహ సునావా ॥
సుని తా కరి బినతీ మృదు బానీ । ప్రేమ సహిత మైఁ కహేఉఁ భవానీ ॥ 1 ॥
మిలెహు గరుడ మారగ మహఁ మోహీ । కవన భాఁతి సముఝావౌఁ తోహీ ॥
తబహిఁ హోఇ సబ సంసయ భంగా । జబ బహు కాల కరిఅ సతసంగా ॥ 2 ॥
సునిఅ తహఁ హరి కథా సుహాఈ । నానా భాఁతి మునిన్హ జో గాఈ ॥
జెహి మహుఁ ఆది మధ్య అవసానా । ప్రభు ప్రతిపాద్య రామ భగవానా ॥ 3 ॥
నిత హరి కథా హోత జహఁ భాఈ । పఠవఉఁ తహాఁ సునహు తుమ్హ జాఈ ॥
జాఇహి సునత సకల సందేహా । రామ చరన హోఇహి అతి నేహా ॥ 4 ॥

గరుడుడు సాదరముగా నాకు ప్రణమిల్లి, తనసందేహమును వినిపించెను. మధుర వచనములతో సాగినఅతనివిన్నపమును నేను విని, ప్రేమతో అతనితో ఇట్లు పలికితిని. "ఓ గరుడుడా! నేను కుబేరుని కడకు వెళ్లు చుండగా నీవు నన్ను కలిసితివి. మార్గమధ్యమున నేను నీకు ఎట్లు ఉపదేశింపగలను? చాలాకాలము సజ్జనసాంగత్యమును నెరపినగాని సందేహములు దూరము గావు. అక్కడ మునీశ్వరులు అనేకవిధముల కీర్తించు మనోజ్ఞములైన హరికథలను విన వలెను. సోదరా! నిత్యము,నిరంతరము హరికథాప్రసంగములు జరుగు తావునకు నిన్ను పంపెదను. నీవు అచటికి వెళ్లి వినుము. అక్కడ ఆదిమధ్యాంతములయందుగూడ శ్రీరామచంద్రుడే ప్రతిపాదింపబడిన ప్రభువు. ఆ ప్రసంగశ్రవణమే నీ సందేహములను దూరమొనర్చును. నీకు శ్రీరాముని చరణములయందు అనన్యప్రేమ కలిగించును. (చౌ॥ 1-4)

దో- బిను సతసంగ న హరి కథా, తెహి బిను మోహ న భాగ ।
మోహ గఏఁ బిను రామ పద, హోఇ న దృఢ అనురాగ ॥ 61 ॥

సత్సాంగత్యము లేకుండ హరికథాశ్రవణము ప్రాప్తింపదు. హరికథలను విననిదే మోహము దూరముగాదు. మోహరహితుడు కానివానికి శ్రీరామచంద్రునిచరణములపై గాఢమైన భక్తి కుదురుకొనదు. (దో॥ 61)

చౌ- మిలహిఀ న రఘుపతి బిను అనురాగా । కిఏఀ జోగ తప గ్యాన బిరాగా ॥
ఉత్తర దిసి సుందర గిరి నీలా । తహఀ రహ కాకభుసుండి సుసీలా ॥ 1 ॥
రామ భగతి పథ పరమ ప్రబీనా । గ్యానీ గున గృహ బహు కాలీనా ॥
రామ కథా సో కహఇ నిరంతర । సాదర సునహిఀ బిబిధ బిహంగబర ॥ 2 ॥
జాఇ సునహు తహఀ హరి గున భూరీ । హోఇహి మోహ జనిత దుఖ దూరీ ॥
మైఀ జబ తేహి సబ కహా బుఝాఈ । చలేఉ హరషి మమ పద సిరు నాఈ ॥ 3 ॥
తాతే ఉమా న మైఀ సముఝావా । రఘుపతి కృపాఀ మరము మైఀ పావా ॥
హోఇహి కీన్హ కబహుఀ అభిమానా । సో ఖోవై చహ కృపానిధానా ॥ 4 ॥
కఛు తేహి తే పుని మైఀ నహిఀ రాఖా । సముఝఇ ఖగ ఖగహీ కై భాషా ॥
ప్రభు మాయా బలవంత భవానీ । జాహి న మోహ కవన అస గ్యానీ ॥ 5 ॥

యోగము, తపము, జ్ఞానము, వైరాగ్యము మొదలగునవి ఎన్నియున్నను ఆయనపై ప్రేమానురాగములు లేనిదే శ్రీరఘునాథుని అనుగ్రహము లభ్యముగాదు. కావున సత్సాంగత్యమునకై ఉత్తరదిశకు వెళ్ళుము. అచ్చట ఒక అందమైన నీలగిరి కలదు. అక్కడ పరమసుశీలుడైన కాకభుశుండి నివసించుచున్నాడు. ఆయన రామభక్తినిరతుడు, జ్ఞాని, గుణనిధి, వయోవృద్ధుడు. ఆయన నిరంతరము శ్రీరామునికథలను వివరించుచుండును. నానావిధ సుందర పక్షులు ఆ గాథలను శ్రద్ధగా వినుచుండును. అచటికి వెళ్లి నీవు శ్రీహరిగుణములనుగూర్చి వినుము. దానివలన మోహజనితమైన నీ దుఃఖము దూరమగును" నేను ఈ విధముగా అతనికి నచ్చజెప్పగా గరుడుడు నాకు ప్రణమిల్లి, ప్రసన్నచిత్తుడై వెళ్లెను. ఓ ఉమా! శ్రీ రఘునాథుని కృపవలన నేను గరుడునిమోహమును ఎఱింగియుంటిని. కావున నేను స్వయముగా ఉపదేశమును ఇయ్యలేదు. అతడు ఎప్పుడైనను గర్వపడి యుండవచ్చును. అందువలన దయానిధి శ్రీరాముడు అతనిని దూరముగా ఉంచదలిచెను. మఱియొక కారణమేమనగా ఒకపక్షి భాషను మఱియొక పక్షి మాత్రమే సూటిగా గ్రహింపగలదు. భవానీ! ప్రభువుమాయ మిక్కిలి బలవత్తరమైనది. అట్టి మాయలో మోహితుడు కానివాడెవ్వడు? (చౌ॥ 1-5)

దో- గ్యానీ భగత సిరోమని, త్రిభువనపతి కర జాన ।
తాహి మోహ మాయా నర, పావఀర కరహిఀ గుమాన ॥ 62 (క) ॥

గరుడుడు ఉత్తమ జ్ఞాని. భక్త శిరోమణి. ముల్లోకములకును స్వామియైన భగవంతునకు వాహనము . అట్టి వాడునైతము మాయామోహితుడయ్యెను. ఇక నరాధములైన అల్పమానవుల విషయము చెప్పనేల? కాని లోకములో సహజముగా మానవులు మూర్ఖులై, దురభి మానపూరితులగుచుందురు. (దో॥ 62. క.)

మాసపారాయణము - ఇఱువది ఎనిమిదవ విరామము

దో- సివ బిరంచి కహుఀ మోహఇ, కో హై బపురా ఆన ।
అస జియఀ జాని భజహిఀ ముని, మాయా పతి భగవాన ॥ 62(ఖ) ॥

ఈ మాయ పరమేశ్వరుని, బ్రహ్మనుగూడ మోహితులనుగా జేయుచున్నప్పుడు ఇక పామరులైన ఇతరులసంగతి చెప్పనేల? ఈ విషయమును గ్రహించియే మునీశ్వరులు మాయాపతియైన ఆ సర్వేశ్వరుని భజింతెదరు.

(దో॥ 62. ఖ)

చౌ- గయఉ గరుడ జహఁ బసఇ భుసుండా । మతి అకుంఠ హరి భగతి అఖండా ॥
దేఖి సైల ప్రసన్న మన భయఊ। మాయా మోహ సోచ సబ గయఊ ॥ 1 ॥
కరి తడాగ మజ్జన జలపానా । బట తర గయఉ హృదయఁ హరషానా ॥
బృద్ధ బృద్ధ బిహంగ తహఁ ఆఏ । సునై రామ కే చరిత సుహాఏ ॥ 2 ॥
కథా అరంభ కరై సోఇ చాహా । తేహీఁ సమయ గయఉ ఖగనాహా ॥
ఆవత దేఖి సకల ఖగరాజా । హరషేఉ బాయస సహిత సమాజా ॥ 3 ॥
అతి ఆదర ఖగపతి కర కీన్హా । స్వాగత పూఛి సుఆసన దీన్హా ॥
కరి పూజా సమేత అనురాగా । మధుర బచన తబ బోలేఉ కాగా ॥ 4 ॥

అఖండమైన హరిభక్తియు, నిశ్చలమైన బుద్ధియుగల కాకభుశుండి నివసించు ప్రదేశమునకు గరుత్మంతుడు వెళ్లెను. ఆ పర్వతమును జూచినంతనే అతనిమనస్సు ప్రశాంతమయ్యెను. ఆయనలోని మాయ, మోహము, శోకము అంతరించెను. గరుడుడు చెఱువులో స్నానమాచరించి, నీటిని సేవించి, ప్రసన్నచిత్తముతో వటవృక్షచ్ఛాయకు చేరెను. శ్రీరామునిసుందరమనోహర చరిత్రమును వినుటకు వయోవృద్ధ పక్షులన్నియును గుమిగూడి యుండెను. కాకభుశుండి శ్రీరామ వృత్తాంతప్రవచనమును ఆరంభింపబోవుచుండెను. ఇంతలో పక్షిరాజైన వైనతేయుడు అచటికి చేరెను. గరుత్మంతునిరాకను గమనించిన కాకభుశుండి మొదలగు పక్షులన్నియును మిక్కిలి సంతోషించెను. భుశుండి గరుడుని మిగుల గౌరవించి, కుశలసమాచారములను నడపి, సముచిత రీతిగా ఆసీనుని జేసెను. ఆయనను చక్కగా పూజించి, మృదుమధురముగా ఇట్లు పలికెను. (చౌ॥ 1-4)

దో- నాథ కృతారథ భయఉఁ మైఁ, తవ దరసన ఖగరాజ ।
ఆయసు దేహు సో కరౌఁ అబ, ప్రభు ఆయహు కెహి కాజ ॥ 63(క) ॥
సదా కృతారథ రూప తుమ్హ, కహ మృదు బచన ఖగేస ।
జెహి కై అస్తుతి సాదర, నిజ ముఖ కీన్హి మహేస ॥ 63(ఖ) ॥

"ప్రభూ! పక్షిరాజా! మీ దర్శనముచే నేను ధన్యుడనైతిని. మీఆనను నేను శిరసావహింతును. మీరాకకు కారణమేమి?" అప్పుడు గరుత్మంతుడు మృదుమధురముగా ఇట్లనెను. "మహాదేవుడే స్వయముగా ప్రశంసించిన మీరు సర్వదా కృతార్థులే. (దో॥ 63. క,ఖ)

## సంక్షిప్త రామాయణము

చౌ- సునహు తాత జెహి కారన ఆయఉఁ । సో సబ భయఉ దరస తవ పాయఉఁ ॥
దేఖి పరమ పావన తవ ఆశ్రమ । గయఉ మోహ సంసయ నానా భ్రమ ॥ 1 ॥

అబ శ్రీరామ కథా అతి పావని । సదా సుఖద దుఖ పుంజ నసావని ॥
సాదర తాత సునావహు మోహీ । బార బార బినవఉఁ ప్రభు తోహీ ॥ 2 ॥
సునత గరుడ కై గిరా బినీతా । సరల సుప్రేమ సుఖద సుపునీతా ॥
భయఉ తాసు మన పరమ ఉఛాహా । లాగ కహై రఘుపతి గున గాహా ॥ 3 ॥
ప్రథమహిఁ అతి అనురాగ భవానీ । రామచరిత సర కహేసి బఖానీ ॥
పుని నారద కర మోహ అపారా । కహేసి బహురి రావన అవతారా ॥ 4 ॥
ప్రభు అవతార కథా పుని గాఈ । తబ సిసు చరిత కహేసి మన లాఈ ॥ 5 ॥

నాయనా! వినుము. నేను వచ్చినపని ఇచటికి రాగానే పూర్తియైనది. మీదర్శనముగూడ లభించినది. మీ పవిత్రమైన ఆశ్రమమును చూచినంతనే నా మోహము, సందేహములు, నానా విధ భ్రమలు తొలగిపోయినవి. దుఃఖములను రూపుమాపి సర్వదా సుఖప్రదమైన శ్రీరామచంద్రుని పునీతగాథను సాదరముగా వినిపింపుడని నేను మాటిమాటికిని విన్నవించు కొనుచున్నాను. గరుత్మంతుని వినయ పూర్వకమైన, సరళమైన, ప్రేమపూర్వకమైన, సుఖప్రదపవిత్రవాణిని విని, కాకభుశుండిలో ఉత్సాహము పెల్లుబికెను. అతడు శ్రీరఘురాముని గుణములను ప్రకటించు వృత్తాంతమును తెలుపసాగెను. భవానీ! మొదటనతడు రామచరితమనెడి మానససరోవరమును వర్ణించెను. పిదప నారదుని మోహమును గూర్చియు, రావణజననమును గూర్చియు తెల్పెను. పిమ్మట అతడు ప్రభువుయొక్క అవతారగాథను గానముచేసెను. పిదప మనస్ఫూర్తిగా శ్రీరాముని బాల్యలీలలను వర్ణించెను. (చౌ॥ 1-5)

దో- బాలచరిత కహి బిబిధి బిధి, మన మహఁ పరమ ఉఛాహ ।
రిషి ఆగవన కహేసి పుని, శ్రీరఘుబీర బిబాహ ॥ 64 ॥

పరమోత్సాహముతో శ్రీరామునిబాల్యలీలలను దెల్పి, అయోధ్యకు విశ్వామిత్రుని రాకను శ్రీ సీతారాములవివాహమును వర్ణించెను. (దో॥ 64)

చౌ- బహురి రామ అభిషేక ప్రసంగా । పుని నృప బచన రాజ రస భంగా ॥
పురబాసిన్హ కర బిరహ బిషాదా । కహేసి రామ లఛిమన సంబాదా ॥ 1 ॥
బిపిన గవన కేవట అనురాగా । సురసరి ఉతరి నివాస ప్రయాగా ॥
బాలమీక ప్రభు మిలన బఖానా । చిత్రకూట జిమి బసె భగవానా ॥ 2 ॥
సచివాగవన నగర నృప మరనా । భరతాగవన ప్రేమ బహు బరనా ॥
కరి నృప క్రియా సంగ పురబాసీ । భరత గఏ జహఁ ప్రభు సుఖ రాసీ ॥ 3 ॥
పుని రఘుపతి బహుబిధి సముఝాఏ । లై పాదుకా అవధపుర ఆఏ ॥
భరత రహని సురపతి సుత కరనీ । ప్రభు అరు అత్రి భేంట పుని బరనీ ॥ 4 ॥

తదనంతరము శ్రీరాముని రాజ్యపట్టాభిషేక ప్రసంగము, దశరథ మహారాజు చేసిన వాగ్దానము వలన రాజ్యాభిషేకము భంగమగుట, పిమ్మట నగరవాసుల విరహవిషాదములు, శ్రీరామలక్ష్మణ సంవాదమును వినిపించెను.

శ్రీరామునివనగమనము, నావికునిభక్తి, గంగానదిని దాటుట, ప్రయాగలో నివాసము, వాల్మీకితో ప్రభువు యొక్క సమాగమము, చిత్ర కూటములో నివాసము మున్నగు ఘట్టములను వివరించెను. పిమ్మట సుమంత్రుడు అయోధ్యకు మఱలి వెళ్లుట, దశరథ మహారాజు స్వర్గస్థుడగుట, భరతుడయోధ్యకు చేరుట, భరతుడు రామభక్తిపరవశుడగుట, సవిస్తరముగా దెలిపెను. దశరథునిఅంత్యక్రియలను జరిపిన పిమ్మట భరతుడు అయోధ్యా వాసులతో గూడి, సుఖనిధానమగు శ్రీరాముని యొద్దకు వెళ్లుట, అంతట శ్రీ రఘునాథుడు అతనికి అనేకవిధములనచ్చజెప్పుట. భరతుడు శ్రీరఘురాముని పాదుకలను గైకొని, అయోధ్యకు తిరిగి వచ్చుట. భరతుడు నందిగ్రామమునందున్నరీతిని, ఇంద్రపుత్రుడైన జయంతునిదుశ్చేష్టనూ, శ్రీరాముడు అత్రిమహర్షిని దర్శించుటను వర్ణించెను. (చౌ॥ 1-4)

దో- కహి బిరాధ బధ జెహి బిధి, దేహ తజీ సరభంగ ।
బరని సుతీఛన ప్రీతి పుని, ప్రభు అగస్తి సతసంగ ॥ 65 ॥

విరాధవధ, శరభంగుని దేహత్యాగములను వర్ణించిన పిదప సుతీక్ష్ణుని ప్రేమానురాగములను, అగస్త్యశ్రీరామ సత్సంగ ప్రసంగములను వర్ణించెను. (దో॥ 65)

చౌ- కహి దండక బన పావనతాఈం । గీధ మఇత్రీ పుని తెహిఁ గాఈం ॥
పుని ప్రభు పంచబటీఁ కృత బాసా । భంజీ సకల మునిన్హ కీ త్రాసా ॥ 1 ॥
పుని లఛిమన ఉపదేస అనూపా । సూపనఖా జిమి కీన్హి కురూపా ॥
ఖర దూషన బధ బహురి బఖానా । జిమి సబ మరము దసానన జానా ॥ 2 ॥
దసకంధర మారీచ బతకహీ । జెహి బిధి భఈ సో సబ తెహిఁ కహీ ॥
పుని మాయా సీతా కర హరనా । శ్రీరఘుబీర బిరహ కఛు బరనా ॥ 3 ॥
పుని ప్రభు గీధ క్రియా జిమి కీన్హీ । బధి కబంధ సబరిహి గతి దీన్హీ ॥
బహురి బిరహ బరనత రఘుబీరా । జెహి బిధి గఏ సరోబర తీరా ॥ 4 ॥

అనంతరము కాకభుశుండి గరుడునకు, ప్రభువుదండకారణ్యమును పావనమొనర్చుటను, గృధ్రరాజైన జటాయువుతో మైత్రి చేయుటను వివరించెను. ప్రభువు పంచవటిలో నివసించి, మునులకు రాక్షసభయమును తొలగించిన విధమును దెలిపెను. పిమ్మట ప్రభువు లక్ష్మణునకు ఇచ్చిన ఉపదేశమును వివరించెను. శూర్పణఖను కురూపిని జేసిన విషయమును, ఖరదూషణ త్రిశిరులను వధించిన కథలను వర్ణించెను. రావణునకు ఈ సమాచారము తెలిసినరీతి, రావణ మారీచుల సంభాషణములను, రావణుడు మాయాసీతను అపహరించినభంగిని తెల్పెను. సంగ్రహముగా శ్రీరాముని విరహమును గూడ వర్ణించెను. పిదప ప్రభువు ఏవిధముగా జటాయువు అంత్యక్రియలను చేసినదియు, కబంధుని వధించినదియు, శబరికిముక్తిని ఇచ్చినదియు వర్ణించెను. తరువాత ప్రభువు యొక్క విరహ వర్ణనము ఆయన పంపాసరోవరమును చేరుటను తెలిపెను. (చౌ॥ 1-4)

దో- ప్రభు నారద సంబాద కహి, మారుతి మిలన ప్రసంగ ।
పుని సుగ్రీవ మితాఈ, బాలి ప్రాన కర భంగ ॥ 66(క) ॥

కపిహి తిలక కరి ప్రభు కృత, సైల ప్రబరషన బాస ।
బరనన బర్షా సరద అరు, రామ రోష కపి త్రాస ॥ 66(ఖ) ॥

శ్రీరామునకును నారదునకును మధ్య జరిగిన సంవాదమును, మారుతి రామ లక్ష్మణులను కలిసికొనుట, సుగ్రీవునితో మైత్రి, వాలివధ మున్నగు విషయములను వర్ణించెను. సుగ్రీవుని వానరులకు రాజుగాజేసి, ప్రభువు ప్రవర్షణ పర్వతముపై నుండుటను, వర్ష శరదృతువుల వర్ణనలను తెలిపెను. శ్రీరాముడు సుగ్రీవుని కోపించుట, సుగ్రీవుడు భయమునకు లోనగుట మొదలగు కథలను వినిపించెను. (దో॥ 66 క,ఖ)

చౌ- జెహి బిధి కపిపతి కీస పఠాఏ । సీతా ఖోజ సకల దిసి ధాఏ ॥
బిబర ప్రబేస కీన్హ జెహి భాఀతీ । కపిన్హ బహోరి మిలా సంపాతీ ॥ 1 ॥
సుని సబ కథా సమీరకుమారా । నాఘత భయఉ పయోధి అపారా ॥
లంకాఀ కపి ప్రబేస జిమి కీన్హా । పుని సీతహి ధీరజు జిమి దీన్హా ॥ 2 ॥
బన ఉజారి రావనహి ప్రబోధీ । పుర దహి నాఘేఉ బహురి పయోధీ ॥
ఆఏ కపి సబ జహఀ రఘురాఈ । బైదేహీ కీ కుసల సునాఈ ॥ 3 ॥
సేన సమేతి జథా రఘుబీరా । ఉతరే జాఇ బారినిధి తీరా ॥
మిలా బిభీషన జెహి బిధి ఆఈ । సాగర నిగ్రహ కథా సునాఈ ॥ 4 ॥

పిమ్మట సుగ్రీవునిపంపున వానరములన్నియును సీతాన్వేషణకై వేర్వేఱుదిశలకు వెళ్ళిన విధమును, హనుమదాదులు బిలములో ప్రవేశించినరీతిని, వారు సంపాతిని కలిసిన విధానమును వినిపించెను. సంపాతివలన కథనంతయు విన్న హనుమంతుడు సముద్రమును దాటి లంకలో ప్రవేశించినపద్ధతిని, సీతాదేవిని ఓదార్చిన విషయమును వర్ణించెను. అశోకవనమును ధ్వంసమొనర్చి, హనుమంతుడు రావణునకు బుద్ధి చెప్పి, లంకను కాల్చిన వృత్తాంతమును దెల్పెను. పిమ్మట మారుతి సముద్రమును దాటి, తిరిగిరాగా వానరులందఱును శ్రీరామచంద్ర ప్రభువునొద్దకు వచ్చి, సీతాదేవి కుశలసమాచారమును వినిపించినదియు వివరించెను. అనంతరము వానరసేనతోపాటు శ్రీరామచంద్రప్రభువు సముద్ర తీరమునకు చేరుట, విభీషణుడు శరణుజొచ్చుట, ప్రభువు సముద్రుని గర్వమణచుట మొదలగు కథలనన్నింటిని వివరించెను. (చౌ॥ 1-4)

దో- సేతు బాంధి కపి సేన జిమి, ఉతరీ సాగర పార ।
గయఉ బసీఠీ బీరబర, జెహి బిధి బాలికుమార ॥ 67(క) ॥
నిసిచర కీస లరాఈ, బరనిసి బిబిధ ప్రకార ।
కుంభకరన ఘననాద కర, బల పౌరుష సంఘార ॥ 67(ఖ) ॥

శ్రీరాముడు వారధిని నిర్మించి, వానరసేనతోగూడి, సముద్రమునుదాటి, లంకలో ప్రవేశించుట, అంగదుడు దూతగావెళ్ళుట మున్నగువిషయములను దెల్పెను. పిమ్మట నిశాచరులకును, వానరులకును మధ్యజరిగిన భయంకరసంగ్రామమును వర్ణించెను. కుంభకర్ణమేఘనాదుల బలపౌరుషములను, వారివధలనుగూర్చి తెల్పెను.
(దో॥ 67 క,ఖ)

చౌ- నిసిచర నికర మరన బిధి నానా । రఘుపతి రావన సమర బఖానా ॥
రావన బధ మందోదరి సోకా । రాజ బిభీషన దేవ అసోకా ॥ 1 ॥
సీతా రఘుపతి మిలన బహోరీ । సురన్హ కీన్హి అస్తుతి కర జోరీ ॥
పుని పుష్పక చఢి కపిన్హ సమేతా । అవధ చలే ప్రభు కృపా నికేతా ॥ 2 ॥
జెహి బిధి రామ నగర నిజ ఆఏ । బాయస బిసద చరిత సబ గాఏ ॥
కహేసి బహోరి రామ అభిషేకా । పుర బరనత నృపనీతి అనేకా ॥ 3 ॥
కథా సమస్త భుసుండ బఖానీ । జో మైం తుమ్హ సన కహీ భవానీ ॥
సుని సబ రామ కథా ఖగనాహా । కహత బచన మన పరమ ఉఛాహా ॥ 4 ॥

రాక్షసులందఱిని తుదముట్టించిన విధమును, శ్రీరామచంద్రప్రభువు రావణునితో యుద్ధమొనర్చిన రీతిని సమగ్రముగ వర్ణించెను. రావణసంహారము, మందోదరీవిలాపము, విభీషణునిరాజ్యపట్టాభిషేకము, దేవతలశోకనివారణము మొదలగు ఘట్టములను వర్ణించి, సీతారాములపునస్సమాగమమునుగూర్చి తెల్పెను. దేవతలు అంజలిఘటించి, శ్రీరాముని స్తుతించిన విధమును, ప్రభువు పుష్పకవిమానముపై వానరులతోగూడి సకుటుంబముగా అయోధ్యకు చేరినరీతిని వర్ణించెను. శ్రీరామచంద్ర ప్రభువు రాజ్య పట్టాభిషిక్తుడైన పద్ధతిని, ఆయన లీలలను అన్నింటిని కాకభుశుండి గరుడునకు వివరముగా తెల్పెను. (శివుడు పలుకుచున్నాడు) భవానీ! అనేక విధములుగా రాజనీతి చర్చలను, అయోధ్యాపుర విశేష వర్ణనలను నేను నీకు తెల్పిన విధముగా కాక భుశుండి గరుత్మంతునకు వివరించెను. ఆగాథనంతయును వినిన గరుడుడు అమితోత్సాహముతో పలికెను. (చౌ॥ 1-4)

సో- గయఉ మోర సందేహా, సునేఉఁ సకల రఘుపతి చరిత ।
భయఉ రామ పద నేహా, తవ ప్రసాద బాయస తిలక ॥ 68(క) ॥
మోహి భయఉ అతి మోహా, ప్రభు బంధన రన మహుఁ నిరఖి ।
చిదానంద సందోహా, రామ బికల కారన కవన ॥ 68(ఖ) ॥

"నేను శ్రీరామచంద్రుని వృత్తాంతమునంతయును వింటిని. నా సందేహములన్నియును దూరమాయెను. ఓ వాయసకుల శిరోమణీ! నీ దయవలన శ్రీరాముని చరణకమలములపై నా భక్తి దృఢమయ్యెను. రణాంగణమున ప్రభువు నాగపాశబద్ధుడై యుండుటనుజూచి, నేను మిక్కిలి మోహావిష్టుడనైతిని. సచ్చిదానందఘనుడైన శ్రీరామచంద్రుడు వ్యాకులపాటునకు లోనైన రీతిని తెలిసికొన గోరితిని. (సో॥ 68 క,ఖ)

చౌ- దేఖి చరిత అతి నర అనుసారీ । భయఉ హృదయఁ మమ సంసయ భారీ ॥
సోఇ భ్రమ అబ హిత కరి మైం మానా । కీన్హ అనుగ్రహ కృపానిధానా ॥ 1 ॥
జో అతి ఆతప బ్యాకుల హోఈ । తరు ఛాయా సుఖ జానఇ సోఈ ॥
జౌం నహిం హోత మోహ అతి మోహీ । మిలతేఉఁ తాత కవన బిధి తోహీ ॥ 2 ॥

సునతేఉఁ కిమి హరి కథా సుహాఈ । అతి బిచిత్ర బహు బిధి తుమ్హ గాఈ ॥
నిగమాగమ పురాన మత ఏహా । కహహిఁ సిద్ధ ముని నహిఁ సందేహా ॥ 3 ॥
సంత బిసుద్ధ మిలహిఁ పరి తేహీ । చితవహిఁ రామ కృపా కరి జేహీ ॥
రామ కృపాఁ తవ దరసన భయఊ । తవ ప్రసాద సబ సంసయ గయఊ ॥ 4 ॥

అతి సామాన్య మానవునివలె ప్రవర్తించిన ప్రభువుయొక్క చరితమును జూచి, నా హృదయమున గొప్ప సంశయము కలిగియుండెను. ఆ భ్రమ నాపాలిటగొప్పవరమైనదని తలంచుచున్నాను. కృపానిధియైన శ్రీరామచంద్ర ప్రభువు నాపై అనుగ్రహమును ప్రసరింప జేసెను. ఎండలో మిక్కిలి వెతచెందిన వ్యక్తియే వృక్షచ్ఛాయవలన మిక్కిలి ఆనందానుభూతిని పొందగలడు. నాయనా! నాకు ఈ ప్రబలమైన మోహము కలుగకున్నచో నిన్ను ఎట్లు కలిసెడివాడను? అత్యంత విచిత్రమైన సుందరరామకథను వినుట ఎట్లు సంభవించెడిది? మీరు అనేకరీతుల దానిని మధురముగా గానము చేసితిరి. నిజమైన పవిత్రసజ్జనులసమాగమము శ్రీరామునికృపాపాత్రులకే తప్పక లభించునని వేదశాస్త్రపురాణములు, సిద్ధులు, మునులు పేర్కొనిన విషయము ప్రసిద్ధము. ఇందు సందేహమునకు తావేలేదు. శ్రీరాముని కరుణవలననే మీ దర్శనమైనది. మీ దయవలన నా సందేహములు తొలగినవి. (చౌ॥ 1-4)

దో- సుని బిహంగపతి బానీ, సహిత బినయ అనురాగ ।
పులక గాత లోచన సజల, మన హరషేఉ అతి కాగ ॥ 69(క) ॥
శ్రోతా సుమతి సుసీల సుచి, కథా రసిక హరి దాస ।
పాఇ ఉమా అతి గోప్యమపి, సజ్జన కరహిఁ ప్రకాస ॥ 69(ఖ) ॥

పక్షిరాజైన గరుడునియొక్క సవినయప్రేమపూర్వవచనములను విని, కాకభుశుండి తనువు పులకించెను. కన్నులలో ఆనందాశ్రువులు నిండెను. మనస్సు హర్షముతో ఉప్పొంగెను. ఓ ఉమా! సద్బుద్ధి గలిగి, సుశీలురై, పవిత్రగాథలయందు ప్రేమగలవారై, హరిభక్తులైన శ్రోతలకు సత్పురుషులు అత్యంతగోప్యములైన విషయములనుగూడ తెలిపెదరు. (దో॥ 69. క,ఖ)

## మాయా ప్రభావము

చౌ- బోలేఉ కాకభుసుండ బహోరీ । నభగ నాథ పర ప్రీతి న థోరీ ॥
సబ బిధి నాథ పూజ్య తుమ్హ మేరే । కృపాపాత్ర రఘునాయక కేరే ॥ 1 ॥
తుమ్హహి న సంసయ మోహ న మాయా । మో పర నాథ కీన్హి తుమ్హ దాయా ॥
పఠఇ మోహ మిస ఖగపతి తోహీ । రఘుపతి దీన్హి బడాఈ మోహీ ॥ 2 ॥
తుమ్హ నిజ మోహ కహీ ఖగ సాఈఁ । సో నహిఁ కఛు ఆచరజ గోసాఈఁ ॥
నారద భవ బిరంచి సనకాదీ । జే మునినాయక ఆతమబాదీ ॥ 3 ॥
మోహ న అంధ కీన్హ కెహి కేహీ । కో జగ కామ నచావ న జేహీ ॥
తృస్నాఁ కెహి న కీన్హ బౌరాహా । కెహి కర హృదయ క్రోధ నహిఁ దాహా ॥ 4 ॥

కాకభుశుండి పక్షిరాజుపై అపారప్రేమ కల్గియున్నవాడగుటవలన మణల ఇట్లు పలికెను. "ఓ ప్రభూ! మీరు సర్వవిధముల నాకు ఆరాధ్యులు, శ్రీరఘునాథుని కృపాపాత్రులు. నిజముగా మీకు ఎట్టి సందేహములునూ ఉండవు, మీలో మోహమునకు చోటే ఉండదు. మీరు మాయావశులు కానేకారు. మీరు నాపై ఎంతయో కృపచూపితిరి. ఓ పక్షిరాజా! మోహమను నెపముతో శ్రీ రఘు నాథుడు మిమ్ము నా యొద్దకు పంపి, నన్ను ఉన్నతుని గావించెను. ఓ ఖగరాజా! మీరు మీ మోహమును గూర్చి తెలిపితిరి. ఇందులో ఆశ్చర్యపడవలసినది ఏ మాత్రమును లేదు. ఆత్మతత్త్వమర్మజ్ఞులును, దానిని ఉపదేశింపగలవారునునైన బ్రహ్మ, శివుడు, నారదుడు, సనకాది మహామునులుగూడ మోహవశులైరి. ఈ చరాచరజగత్తులో మోహాంధుడు కాని వాడెవడు? కామమునకు దాసుడుకాని వాడెవడు? తృష్ణోన్మాదమునకు లోనుకానివాడెవడు? క్రోధము ఎవని హృదయమును దహింపదు?

(చౌ॥ 1-4)

దో- గ్యానీ తాపస సూర కబి, కోబిద గున ఆగార ।
కెహి కై లోభ బిడంబనా, కీన్హి న ఎహిం సంసార ॥ 70(క) ॥
శ్రీ మద బక్ర న కీన్హ కెహి, ప్రభుతా బధిర న కాహి ।
మృగలోచని కే నైన సర, కో అస లాగ న జాహి ॥ 70(ఖ) ॥

ఎంతటి జ్ఞానియు, తపస్వియు, శూరుడును, వీరుడును, కవియును, పండితుడును, కడకు గుణనిధియైనను ఈ జగత్తులో లోభమునకు లోనైనచో నవ్వులపాలుకావలసినదే. సంపదలచే గర్వోన్మత్తుడు కానివాడెవ్వడు? అధికారమదముచే బధిరుడు కానివాడ్వెడు? మృగనయనల చూపులనెడి తూపు (బాణము)లచే కొట్టబడని వాడెవ్వడు?

(దో॥ 70. క,ఖ)

చౌ- గున కృత సన్యపాత నహిం కేహీ । కొఉ న మాన మద తజెఉ నిబేహీ ॥
జోబన జ్వర కెహి నహిం బలకావా । మమతా కెహి కర జస న నసావా ॥ 1 ॥
మచ్ఛర కాహి కలంక న లావా । కాహి న సోక సమీర డొలావా ॥
చింతా సాంపిని కో నహిం ఖాయా । కో జగ జాహి న బ్యాపీ మాయా ॥ 2 ॥
కీట మనోరథ దారు సరీరా । జెహి న లాగ ఘున కో అస ధీరా ॥
సుత బిత లోక ఈషనా తీనీ । కెహి కై మతి ఇన్హ కృత న మలీనీ ॥ 3 ॥
యహ సబ మాయా కర పరివారా । ప్రబల అమితి కో బరనై పారా ॥
సివ చతురానన జాహి డెరాహీం । అపర జీవ కెహి లేఖే మాహీం ॥ 4 ॥

రజస్తమోగుణముల సన్నిపాతమునుండి ఎవడు తప్పించు కొనగలడు? అభిమానమదములచే తాకబడనివాడెవ్వడు? యౌవనజ్వరము ఎవ్వనిని ఉన్మత్తునిగా చేయలేదు? మమతచే కీర్తిని కోల్పోనివాడెవడు? ఈర్ష్యాద్వేషములచే కళంకితుడు కానివాడెవ్వడు? శోకమను వాయువు ఎవ్వరిని చలింపజేయలేదు. చింతాసర్పదష్టుడు కానివాడెవడు? జగత్తులో మాయకు వశుడు కాని వాడెవడు? కోరిక అనునది ఒక కీటకము. శరీరమొక కఱ్ఱ. ఈ కఱ్ఱశరీరము కోరికయనెడి పురుగుచే తొలచబడని ధీరచిత్తుడెవడు? పుత్రులు, ధనము, లోక

ప్రతిష్ఠ అనెడి ఈషణాత్రయముచే ఎవని బుద్ధి మలినము గాదు? ఇవియున్నియును మాయ యొక్క ప్రబల-అపార పరివారములు. వీటిని పూర్తిగా వర్ణించుట ఎవరితరము? బ్రహ్మరుద్రాదులును వీటికి భయపడుదురు. ఇంక ఇతరులెంత లెక్క? (చౌ॥ 1-4)

దో- బ్యాపి రహేఉ సంసార మహుఁ, మాయా కటక ప్రచండ ।
సేనాపతి కామాది భట, దంభ కపట పాషండ ॥ 71(క) ॥
సో దాసీ రఘుబీర కై, సముఝేఁ మిథ్యా సోపి ।
ఛూట న రామ కృపా బిను, నాథ కహఉఁ పద రోపి ॥ 71(ఖ) ॥

మాయ యొక్క ప్రచండసైన్యము జగత్తంతయు వ్యాపించును. కామ క్రోధాదులు దాని సేనా పతులు. దంభము, కపటము, పాషండత్వము దాని యోధగణము. కాని ఈ మాయ రఘువీరునకు దాసి. ఇదియంతయు మిథ్యయని గ్రహించినను శ్రీరాముని కృపలేనిదే ఈ మాయ వదలదు. ప్రభూ! ఈ మాటలను నేను ప్రమాణపూర్వకముగా చెప్పుచున్నాను. (దో॥ 71. క,ఖ)

చౌ- జో మాయా సబ జగహి నచావా । జాసు చరిత లఖి కాహుఁ న పావా ॥
సోఇ ప్రభు భ్రూ బిలాస ఖగరాజా । నాచ నటీ ఇవ సహిత సమాజా ॥ 1 ॥
సోఇ సచ్చిదానంద ఘన రామా । అజ బిగ్యాన రూప బల ధామా ॥
బ్యాపక బ్యాప్య అఖండ అనంతా । అఖిల అమోఘసక్తి భగవంతా ॥ 2 ॥
అగున అదభ్ర గిరా గోతీతా । సబదరసీ అనవద్య అజీతా ॥
నిర్మమ నిరాకార నిరమోహా । నిత్య నిరంజన సుఖ సందోహా ॥ 3 ॥
ప్రకృతి పార ప్రభు సబ ఉర బాసీ । బ్రహ్మ నిరీహ బిరజ అబినాసీ ॥
ఇహాఁ మోహ కర కారన నాహీం । రబి సన్ముఖ తమ కబహుఁ కి జాహీం ॥ 4 ॥

ఈ మాయ సమస్త ప్రపంచమును ఒక ఆట ఆడించును. దీని గతిని ఎవ్వరును తెలియజాలరు. ఓ ఖగరాజా! అట్టి మాయ శ్రీరామచంద్రప్రభుకనుసన్నలను అనుసరించి, తన పరివారముతో సహా నర్తకివలె ఆడును. శ్రీ రఘువీరుడు సచ్చిదానందఘనుడు, జన్మరహితుడు, విజ్ఞాన స్వరూపుడు, రూపబలగుణధాముడు, సర్వవ్యాపకుడు, సర్వరూపుడు, అఖండుడు, అనంతుడు, సంపూర్ణుడు, అమోఘశక్తిమంతుడు, షడ్గుణైశ్వర్య సంపన్నుడు. అతడు నిర్గుణుడు, సర్వోత్తముడు, వాక్కునకును, ఇంద్రియములకును గోచరము కానివాడు, సర్వదర్శి, దోష రహితుడు, అజేయుడు, మమతారహితుడు, నిరాకారుడు, మోహస్పర్శయే లేనివాడు, నిత్యుడు, మాయాతీతుడు, సుఖ నిధానము, ప్రకృతికతీతుడు, సర్వసమర్థుడు, అందరి హృదయములలో ఉండువాడు, ఇచ్ఛారహితుడు, నిర్మలుడు, శాశ్వతుడైన పరబ్రహ్మ. అట్టి శ్రీరాముని యందు మోహమునకు తావే ఉండదు. సూర్యునికడకు అంధకారము రాగలదా? (చౌ॥ 1-4)

దో- భగత హేతు భగవాన ప్రభు, రామ ధరేఉ తను భూప ।
కిఏ చరిత పావన పరమ, ప్రాకృత నర అనురూప ॥ 72(క) ॥

జథా అనేక బేష ధరి, నృత్య కరఇ నట కోఇ ।
సోఇ సోఇ భావ దేఖావఇ, ఆపున హోఇ న సోఇ ॥ 72(ఖ) ॥

భగవంతుడైన శ్రీరామచంద్రప్రభుపు తనభక్తులకై రాజుగా అవతరించి, సామాన్యమానవుని వలె పరమపవిత్రలీలావిలాసములను ప్రదర్శించెను. ఒకనటుడు పెక్కు (పాత్రల) వేషములు వేసి, నృత్యములు చేయును. ఆయా వేషములకు తగినట్లు భావములను ప్రకటించును. కాని అతడు ఆ పాత్రలలో ఏ ఒక్కటియు కాడు. అట్లే పరమాత్మ మానవరూపమును ధరించి, మానవునివలె ప్రవర్తించినను తాను మానవుడు కాడు. (దో॥ 72. క,ఖ)

చౌ- అసి రఘుపతి లీలా ఉరగారీ । దనుజ బిమోహని జన సుఖకారీ ॥
జే మతి మలిన బిషయబస కామీ । ప్రభు పర మోహ ధరహిఀ ఇమి స్వామీ ॥ 1 ॥
నయన దోష జా కహఀ జబ హోఈ । పీత బరన ససి కహుఀ కహ సోఈ ॥
జబ జెహి దిసి భ్రమ హోఇ ఖగేసా । సో కహ పచ్ఛిమ ఉయఉ దినేసా ॥ 2 ॥
నౌకారూఢ చలత జగ దేఖా । అచల మోహ బస ఆపుహి లేఖా ॥
బాలక భ్రమహిఀ న భ్రమహిఀ గృహాదీ । కహహిఀ పరస్పర మిథ్యాబాదీ ॥ 3 ॥
హరి బిషఇక అస మోహ బిహంగా । సపనెహుఀ నహిఀ అగ్యాన ప్రసంగా ॥
మాయాబస మతిమంద అభాగీ । హృదయఀ జమనికా బహుబిధి లాగీ ॥ 4 ॥
తే సఠ హఠ బస సంసయ కరహీఀ । నిజ అగ్యాన రామ పర ధరహీఀ ॥ 5 ॥

ఓ ఖగరాజా! శ్రీ రఘునాథుని ఈ లీల రాక్షసులను విశేషముగా మోహితులను జేసెను. భక్తులకు సుఖములను గూర్చెను. ప్రభూ! గరుడా! మూర్ఖులు, విషయలోలురు, కాముకులైనవారు మాత్రమే రామచంద్రప్రభువుపై మోహము నారోపించెదరు. నేత్రదోషము, కామెర్లవ్యాధి యున్నవాడు మాత్రమే చంద్రుడు పచ్చగామన్నాడని పల్కును. వైనతేయా! దిక్కులనుగూర్చిన జ్ఞానము లేనివాడు సూర్యుడు పడమట ఉదయించునని తెల్పును. నావపై కూర్చున్నవాడు ప్రపంచము సాగిపోవుచున్నట్లు తలంచును. మోహగ్రస్తుడై తాను నిశ్చలుడైయున్నట్లు భావించును. బాలుడు చక్రాకారములో తిరుగుచుండును. ఇండ్లు తిరుగవు. కాని వారు అది నమ్మరు. మిథ్యావాదములు సేయుచు పరస్పరము ఒకరి నొకరు నిందించు కొందురు. ఓ గరుడుడా! శ్రీహరి విషయమున మోహకల్పన అట్టిదే. స్వప్నములో గూడ అజ్ఞానము అతనిని అంటదు. మాయలో పడియున్నవారు, మందబుద్ధులు, భాగ్యహీనులు, మాయ యనెడితెఱచే కప్పబడిన మూర్ఖులు, మొండిగా సందేహములను ప్రకటించుచు తమ అజ్ఞానమును శ్రీరామునిపై ఆరోపించెదరు. (చౌ॥ 1-5)

దో- కామ క్రోధ మద లోభ రత, గృహాసక్త దుఖరూప ।
తే కిమి జానహిఀ రఘుపతిహి, మూఢ పరే తమ కూప ॥ 73(క) ॥
నిర్గున రూప సులభ అతి, సగున జాన నహిఀ కోఇ ।
సుగమ అగమ నానా చరిత, సుని ముని మన భ్రమ హోఇ ॥ 73(ఖ) ॥

కామక్రోధలోభమదములయందు నిమగ్నులైన వారు, దుఃఖరూపమగు సంసార వ్యామోహములో చిక్కుకొనినవారు, శ్రీ రఘునాథుని ఎట్లు తెలిసికొనగలరు? ఆ మూఢులు అజ్ఞానాంధకారకూపములో పడియుందురు. భగవంతుని నిర్గుణరూపము సులభము. కాని సగుణరూపలీలాతత్త్వము నెఱుంగుట కష్టము. పరమేశ్వరుని సగుణోపాసన సరళమగుటవలన సుగమము. కాని ఆయన లీలారహస్యములను తెలిసికొనుట అగమము (క్లిష్టము). ఏలనన సగుణ లీలలను చూచియు, వినియు మునులమనస్సులుగూడ ఒక్కొక్కప్పుడు భ్రమలకు గురియగుచుండును. (దో॥ 73. క,ఖ)

## భుసుండి మోహము - శ్రీరాముని ప్రభావము

చౌ- సును ఖగేస రఘుపతి ప్రభుతాఈ । కహఉఁ జథామతి కథా సుహాఈ ॥
జేహి బిధి మోహ భయఉ ప్రభు మోహీ । సోఉ సబ కథా సునావహుఁ తోహీ ॥ 1 ॥
రామ కృపా భాజన తుమ్హ తాతా । హరి గున ప్రీతి మోహి సుఖదాతా ॥
తాతే నహిఁ కఛు తుమ్హహి దురావఉఁ । పరమ రహస్య మనోహర గావఉఁ ॥ 2 ॥
సునహు రామ కర సహజ సుభాఊ । జన అభిమాన న రాఖహిఁ కాఊ ॥
సంసృత మూల సూలప్రద నానా । సకల సోక దాయక అభిమానా ॥ 3 ॥
తాతే కరహిఁ కృపానిధి దూరీ । సేవక పర మమతా అతి భూరీ ॥
జిమి సిసు తన బ్రన హోఇ గోసాఈఁ । మాతు చిరావ కఠిన కీ నాఈఁ ॥ 4 ॥

ఓ ఖగరాజా! శ్రీ రఘునాథుని ప్రాభవమునుగూర్చి వినుము. నేను నా బుద్ధిననుసరించి ఆ సుందరకథను తెలిపెదను. నేను ఒకప్పుడు మోహావిష్టుడనై ఉంటిని. ఆకథను వివరించెదను. నాయనా! నీవు శ్రీరామునికృపకు పాత్రుడవు. భగవద్గుణములయందు ప్రీతిగలవాడవు. అందుచే నీవు నాకు సుఖప్రదుడవు. కావున నీయొద్ద ఏమాత్రమూ దాచక అతిగోప్యమైన మనోహరచరిత్రమును వర్ణించెదను. శ్రీరామచంద్రుని సహజ స్వభావమును వినుము. ఆయన ఎల్లప్పుడునూ తనసేవకులలో అభిమానమును ఏమాత్రమూ ఉండనీయడు. ఏలనన దురభిమానమే జననమరణములకు మూలకారణము. అది అనేక క్లేశములను, శోకములను కలిగించును. కృపానిధియైన శ్రీరాముడు భక్తులను గర్వమునకు దూరముగా ఉంచును. ఏలనన భక్తులపై ప్రభువునకు అపారమైన అనురాగము. మహాత్మా! బాలుని శరీరముపై గాయము కలిగినప్పుడు తల్లి కఠిన హృదయముతో దానికి శల్యచికిత్స చేయును. (చౌ॥ 1-4)

దో- జదపి ప్రథమ దుఖ పావఇ, రోవఇ బాల అధీర ।
బ్యాధి నాస హిత జననీ, గనతి న సో సిసు పీర ॥ 74(క) ॥
తిమి రఘుపతి నిజ దాస కర, హరహిఁ మాన హిత లాగి ।
తులసిదాస ఐసే ప్రభుహిఁ, కస న భజహు భ్రమ త్యాగి ॥ 74(ఖ) ॥

బాలుడు మొదట (శల్యచికిత్సాసమయమున) ధైర్యమును కోల్పోయి, దుఃఖముతో ఏడ్చినను రోగనివారణమునకై తల్లి వానిరోదనను పట్టించుకొనదు. అదే విధముగా శ్రీ రఘునాథుడు తన భక్తునిమేలుకొఱకు అతని గర్వమును హరించును. ఓ మనసా! భ్రమలను వీడి, అట్టి ప్రభువును ఏల భజింపవు? అని తులసీదాసు నుడువుచున్నాడు. (దో॥ 74. క,ఖ)

చౌ- రామ కృపా ఆపని జడతాఈ । కహఉఁ ఖగేస సునహు మన లాఈ ॥
జబ జబ రామ మనుజ తను ధరహీఁ । భక్త హేతు లీలా బహు కరహీఁ ॥ 1 ॥
తబ తబ అవధపురీ మైఁ జాఊఁ । బాలచరిత బిలోకి హరషాఊఁ ॥
జన్మ మహోత్సవ దేఖఉఁ జాఈ । బరష పాఁచ తహఁ రహఉఁ లొభాఈ ॥ 2 ॥
ఇష్టదేవ మమ బాలక రామా । సోభా బపుష కోటి సత కామా ॥
నిజ ప్రభు బదన నిహారి నిహారీ । లోచన సుఫల కరఉఁ ఉరగారీ ॥ 3 ॥
లఘు బాయస బపు ధరి హరి సంగా । దేఖఉఁ బాలచరిత బహు రంగా ॥ 4 ॥

ఓ ఖగేశ్వరా! శ్రీరామునికృపనుగూర్చియు, నా మూర్ఖత్వమునుగూర్చియు తెలిపెదను. సావధానముగా వినుము. శ్రీరామచంద్రుడు మానవరూపమును దాల్చి, భక్తులకై అనేకలీలలను ప్రదర్శించుసమయమున నేను అయోధ్యకు వెళ్లెదను. ఆయనబాల్యలీలలను చూచి, సంతసించెదను. అచ్చట ఆయనజన్మదినమహోత్సవములను జూచెదను. ఆయన బాల్య లీలలకు ముగ్ధుడనై, ఐదు సంవత్సరములను అచటనే గడిపెదను. బాలరూపుడైన శ్రీరాముడు నాకు ఇష్టదైవము. అతనితనువు కోటిమన్మథసౌందర్యశోభితము. గరుడుడా! నా స్వామిముఖవర్చస్సును గాంచి నా కన్నులను సఫలమొనర్చు కొందును. చిన్న కాకి ఆకారమును ధరించి, ప్రభువు చేయు బాల్యక్రీడలను చూచెదను. (చౌ॥ 1-4)

దో- లరికాఈఁ జహఁ జహఁ ఫిరహిఁ, తహఁ తహఁ సంగ ఉడాఉఁ ।
జూఠని పరఇ అజిర మహఁ, సో ఉఠాఇ కరి ఖాఉఁ ॥ 75(క) ॥
ఏక బార అతిసయ సబ, చరిత కిఏ రఘుబీర ।
సుమిరత ప్రభు లీలా సోఇ, పులకిత భయఉ సరీర ॥ 75(ఖ) ॥

బాల్యమున శ్రీరాముడు తిరిగెడు అన్నిప్రదేశములయందును నేనును ఎగిరెదను. ప్రాంగణములో పడిన అతనిఎంగిలిని తినెదను. ఒకసారి శ్రీ రఘువీరుడు లోకోత్తరచరిత్రను సృష్టించెను. 'ప్రభువు యొక్క ఆ లీలలను తలచుకొనినంతనే కాకభుశుండి తనువు పులకరించెను. (దో॥ 75. క,ఖ)

చౌ- కహఇ భుసుండ సునహు ఖగనాయక । రామచరిత సేవక సుఖదాయక ॥
నృపమందిర సుందర సబ భాఁతీ । ఖచిత కనక మని నానా జాతీ ॥ 1 ॥
బరని న జాఇ రుచిర అఁగనాఈ । జహఁ ఖేలహిఁ నిత చారిఉ భాఈ ॥
బాలబినోద కరత రఘురాఈ । బిచరత అజిర జనని సుఖదాఈ ॥ 2 ॥
మరకత మృదుల కలేవర స్యామా । అంగ అంగ ప్రతి ఛబి బహు కామా ॥
నవ రాజీవ అరున మృదు చరనా । పదజ రుచిర నఖ ససి దుతి హరనా ॥ 3 ॥
లలిత అంక కులిసాదిక చారీ । నూపుర చారు మధుర రవకారీ ॥
చారు పురట మని రచిత బనాఈ । కటి కింకిని కల ముఖర సుహాఈ ॥ 4 ॥

భుశుండి మరల పల్కుచున్నాడు. "ఓ ఖగరాజా! వినుడు. శ్రీరామునిచరితము సేవకులకు అత్యంత సుఖానంద దాయకము. అయోధ్యానగరరాజభవనము అత్యంత సుందరము. అది స్వర్ణ నిర్మితమై, నానారత్నఖచితమై, విరాజిల్లు చున్నది. నిత్యము సోదరులు నలుగురు ఆడుకొను ఆ ప్రాంగణశోభలు వర్ణనాతీతములు. తల్లులకు ఆనందమునుగూర్చుచు బాల్యవినోదక్రీడలలో తేలియాడుచు శ్రీ రఘునాథుడు అచట సంచరించుచుండెను. నీలమణిసమానమైన శ్యామ సుందరశరీరమునందలి ప్రత్యంగమునందును మన్మథశోభలు విలసిల్లుచుండెను. నవ రాజీవారుణమృదుచరణకాంతులు, మృదుమనోహరములైన అకాలివ్రేళ్లు, ఆహ్లాదమును గొలుపుచుండెను. పాదపద్మములయందలి వజ్రాంకుశధ్వజకమలచిహ్నములు మిక్కిలి మనోజ్ఞములు. చరణములయందలి మంజులమంజీరధ్వనులు వీనులకు విందుగూర్చుచుండెను. మణిఖచిత స్వర్ణమయమేఖలా దీధితులుమిఱుమిట్లు గొలుపుచుండెను. ఆ బాలరాముని శోభలు వర్ణింపనెవరి తరము? (1) (చౌ॥ 1-4)

దో- రేఖా త్రయ సుందర ఉదర, నాభీ రుచిర గంభీర ।
ఉర ఆయత భ్రాజత బిబిధి, బాల బిభూషన చీర ॥ 76 ॥

అతని ఉదరమునగల త్రివళులు త్రిరేఖావిలసితములు. నాభి సుందరమై గంభీరమైనది. విశాల వక్షఃస్థలము వస్త్రాభరణ శోభితము. (దో॥ 76)

చౌ- అరున పాని నఖ కరజ మనోహర । బాహు బిసాల బిభూషన సుందర ॥
కంధ బాల కేహరి దర గ్రీవా । చారు చిబుక ఆనన ఛబి సీంవా ॥ 1 ॥
కలబల బచన అధర అరునారే । దుఇ దుఇ దసన బిసద బర బారే ॥
లలిత కపోల మనోహర నాసా । సకల సుఖద ససి కర సమ హాసా ॥ 2 ॥
నీల కంజ లోచన భవ మోచన । భ్రాజత భాల తిలక గోరోచన ॥
బికట భృకుటి సమ శ్రవన సుహాఏ । కుంచిత కచ మేచక ఛబి ఛాఏ ॥ 3 ॥
పీత ఝీని ఝుగులీ తన సోహీ । కిలకని చితవని భావతి మోహీ ॥
రూప రాసి నృప అజిర బిహారీ । నాచహిం నిజ ప్రతిబింబ నిహారీ ॥ 4 ॥
మొహి సన కరహిం బిబిధి బిధి క్రీడా । బరనత మోహి హోతి అతి బ్రీడా ॥
కిలకత మోహి ధరన జబ ధావహిం । చలఉం భాగి తబ పూప దెఖావహిం ॥ 5 ॥

ఎఱ్ఱని అరచేతులు, అంగుళులు నఖములు అతి మనోహరములు. దీర్ఘభుజములపై ఆకర్షణీయములైన భూషణములు అలరారుచుండెను. సింహకిశోరసదృశ భుజస్కంధములు, శంఖమువంటి కంఠము, మనోజ్ఞమైన చుబుకము, ముఖలాలిత్యములు వర్ణింపనలవికానివి. ముద్దులొలుకు మాటలు, ఎఱ్ఱని మధురాధరములు, స్వచ్ఛములైన దంతకాంతులు, నిగ్గులద్దములవంటి కమ్రకపోలములు, సంపెంగవంటి మనోహరమైన నాసిక, చంద్రకిరణముల వలె ఆహ్లాదకరమైన చక్కని చిఱునవ్వు, నీల కమలములవలె కమనీయములైన కన్నులశోభలు, భవ

1. భావయామి గోపాలబాలంమనస్సేవితం తత్పదం చింతయేయం సదా ॥భావ॥
కటి ఘటిత మేఖలా ఖచిత మణిఘంటికాపటలనినదేన విభ్రాజమానం
కుటిల పదఘటిత సంకుల శింజితేన తం చటుల నటనా సముజ్జ్వల విలాసం ॥భావ॥ అన్నమాచార్య

మోచనములు. లలాటమున చక్కగా దిద్దబడిన గోరోచనతిలకశోభలు, ధనురాకార శోభితములైన కనుబొమలు, శృంగారములనువిరజిమ్ము శ్రవణవిలాసములు, మనోజ్ఞములైన కుటిలకుంతలములు, పసుపుపచ్చని ఆంగరఖాఅందచందములు, ఆయనశరీరశోభా వైభవములను ఇనుమడింపజేయుచుండెను. అతని కేరింతలు, చూపులు, నాట్యములు నా మనస్సుకు గిలిగింతలు పెట్టినవి. దశరథ మహారాజప్రాసాదప్రాంగణములో విహరించు సౌందర్య రాశి శ్రీరామచంద్రుడు తన నీడనుజూచుచు గంతులువేయుచుండెను. నాతో ఆయన అనేక బాల్యక్రీడలను ఆడుచుండెడివాడు. వాటిని వర్ణించుటకు నాకు బిడియము కలుగుచున్నది. కేరింతలు కొట్టుచు నన్ను పట్టుకొనుటకు అతడు నా వెంటపడుచుండెను. పక్షి స్వభావమున నేను పరుగెత్తు చుంటిని. నా కతడు అప్పాలు చూపుచు పిలుచుచుండెను. (చౌ॥ 1-5)

దో- ఆవత నికట హఁసహిఁ ప్రభు, భాజత రుదవ కరాహిఁ ।
జాఉఁ సమీప గహన పద, ఫిరి ఫిరి చితఇ పరాహిఁ ॥ 77(క) ॥
ప్రాకృత సిసు ఇవ లీలా, దేఖి భయఉ మొహి మోహ ।
కవన చరిత్ర కరత ప్రభు, చిదానంద సందోహ ॥ 77(ఖ) ॥

నేను సమీపించునపుడు ప్రభువు నవ్వుచుండెను. నేను దూరముగా వెళ్లినచో ఏడ్చుచుండెను. నేనతనిచరణములను స్పృశించుటకు వెళ్లినప్పుడు భయమును నటించుచు వెనుకకు పోవుచుండెను. నావైపు చూచి, పరుగెత్తుచుండెను. సచ్చిదానంద ఘనుడగు ఈ ప్రభువు సాధారణ బాలకులవలె లీలలను ప్రదర్శించుచున్నాడేల? అని నాకు మోహము కలుగుచుండెను. (దో॥ 77. క,ఖ)

చౌ- ఏతనా మన ఆనత ఖగరాయా । రఘుపతి ప్రేరిత బ్యాపీ మాయా ॥
సో మాయా న దుఖద మొహి కాహీఁ । ఆన జీవ ఇవ సంసృత నాహీఁ ॥ 1 ॥
నాథ ఇహాఁ కఛు కారన ఆనా । సునహు సో సావధాన హరిజానా ॥
గ్యాన అఖండ ఏక సీతాబర । మాయా బస్య జీవ సచరాచర ॥ 2 ॥
జౌఁ సబ కేఁ రహ గ్యాన ఏకరస । ఈస్వర జీవహి భేద కహహు కస ॥
మాయా బస్య జీవ అభిమానీ । ఈస బస్య మాయా గునఖానీ ॥ 3 ॥
పరబస జీవ స్వబస భగవంతా । జీవ అనేక ఏక శ్రీకంతా ॥
ముధా భేద జద్యపి కృత మాయా । బిను హరి జాఇ న కోటి ఉపాయా ॥ 4 ॥

ఓ ఖగరాజా! ఈ సందేహడోలికలలో ఊగిసలాడుచున్న నన్ను మాయ ఆవరించెను. కాని ఆ మాయ నాకు దుఃఖప్రదము కాదు. ఇతర జీవులనువలె నన్నుఅది సంసారచక్రమున పడవేయునది కాదు. ప్రభూ! దీనికి మఱియొక కారణమున్నది. శ్రీహరి వాహనమైన ఓ గరుడుడా! సావధానముగా వినుము. సీతాపతియైన శ్రీరాముడు అఖండుడు, అద్వితీయుడు, జ్ఞానస్వరూపుడు. జడచేతన (చరాచర) జీవులన్నియును మాయకు వశమైయుండునవియే. జడ చేతన జీవులకు అఖండ జ్ఞానమే యున్నచో ఈశ్వరునకును, జీవునకును గల భేదమేమి? గర్వితమతియైన జీవుడు మాయకు అధీనుడు. సత్త్వరజస్తమోగుణయుక్తమైన మాయ ఈశ్వరాధీనము. జీవుడు పరాధీనుడు.

(మాయకువశుడు) భగవంతుడు స్వాధీనుడు. జీవులనేకులు. లక్ష్మీపతియైన ఈశ్వరుడు ఒక్కడే. మాయవలన ఏర్పడిన ఈ భేదము అసత్యమేయైనను హరికృపలేకుండ కోట్లాది ఉపాయములతో గూడ అది నమసి పోదు.

(చౌ॥ 1-4)

దో- రామచంద్ర కే భజన బిను, జో చహ పద నిర్బాన ।
గ్యానవంత అపి సో నర, పసు బిను పూఁఛ బిషాన ॥ 78(క) ॥
రాకాపతి షోడస ఉఅహిఁ, తారాగన సముదాఇ ।
సకల గిరిన్హ దవ లాఇఅ, బిను రబి రాతి న జాఇ ॥ 78(ఖ) ॥

శ్రీరామచంద్రుని భజింపక ముక్తిని కోరుకొను మనుష్యుడు జ్ఞానియైనను తోకయు, కొమ్ములునులేని పశువుతో సమానుడు. సమస్త తారాగణములతోగూడి, పదునారు కళలతో అలరారు పూర్ణచంద్రుడుఉదయించినను, పర్వతారణ్యములను కార్చిచ్చు దహించినను, సూర్యుడు ఉదయింపనిదే రాత్రి అంతము కాదు గదా!

(దో॥ 78. క,ఖ)

చౌ- ఐసెహిఁ హరి బిను భజన ఖగేసా । మిటఇ న జీవన్హ కేర కలేసా ॥
హరి సేవకహి న బ్యాప అబిద్యా । ప్రభు ప్రేరిత బ్యాపఇ తెహి బిద్యా ॥ 1 ॥
తాతే నాస న హోఇ దాస కర । భేద భగతి బాఢఇ బిహంగబర ॥
భ్రమ తేఁ చకిత రామ మోహి దేఖా । బిహఁసే సో సును చరిత బిసేషా ॥ 2 ॥
తెహి కౌతుక కర మరము న కాహూఁ । జానా అనుజ న మాతు పితాహూఁ ॥
జాను పాని ధాఏ మోహి ధరనా । స్యామల గాత అరున కర చరనా ॥ 3 ॥
తబ మైంఁ భాగి చలేఉఁ ఉరగారీ । రామ గహన కహఁ భుజా పసారీ ॥
జిమి జిమి దూరి ఉడాఉఁ అకాసా । తహఁ భుజ హరి దేఖఉఁ నిజ పాసా ॥ 4 ॥

ఓ గరుడుడా! ఇదే విధముగా హరిభజన లేకుండ జీవుడు దుఃఖ (పంచక్లేశముల) నివృత్తి పొందలేడు గదా! విద్యయు, అవిద్యయు మాయారూపములు. హరిసేవకునిపై అవిద్యారూపమాయ ఆవరింపదు. ప్రభుప్రేరణచే అతనిలో విద్యారూపజ్ఞానము ఉదయించును. ఓ ఖగరాజా! అందువలన హరిసేవకుడు నశింపడు. భేదభక్తి (సేవ్యసేవక సంబంధము) ఏర్పడును. నేను భ్రమలో పడి, ఆశ్చర్యచకితుడనై యుండుటను జూచి, శ్రీరామచంద్రుడు నవ్వెను. ఆ విశిష్టలీలావిలాస ఘట్టమును గూర్చియు వినుము. ఈ కౌతుకలీలారహస్యమును ఆయనసోదరులు గాని, తల్లిదండ్రులుగాని ఎఱుగరు. అంతే గాదు ఇతరులెవ్వరును ఎఱుగరు. శ్యామసుందరుడు, అరుణ కరచరణుడు ఐన బాలరాముడు మోకాళ్లపై దోగాడుచు నన్ను పట్టుకొనుటకు ప్రయత్నించెను. ఓ ఖగరాజా! నేను అప్పుడు పరుగెత్తితిని. శ్రీరాముడు నన్ను పట్టుకొనుటకు తనభుజములను చాపెను. నేనాకాశమున ఎగిరిన కొలదియు శ్రీరాముని బాహువులను నా సమీపముననే చూచుచుంటిని. ఇది భగంతుని సర్వవ్యాపకత్వమును సూచించుచున్నది.

(చౌ॥ 1-4)

దో- బ్రహ్మలోక లగి గయఉఁ మైఁ, చితయఉఁ పాఛ ఉడాత ।
జుగ అంగుల కర బీచ సబ, రామ భుజహి మోహి తాత ॥ 79(క) ॥
సప్తాబరన భేద కరి, జహాఁ లగేఁ గతి మోరి ।
గయఉఁ తహాఁ ప్రభు భుజ నిరఖి, బ్యాకుల భయఉఁ బహోరి ॥ 79(ఖ) ॥

అంతట నేను ఎగురుచు బ్రహ్మలోకమునకు వెళ్లితిని. అప్పుడు నేను వెనుదిరిగి చూడగా శ్రీరాముని బాహువులు నాకు కేవలము రెండంగుళముల దూరములోనే ఉండెను. పృథ్వి, జలము మొదలగు ఏడు ఆవరణములను దాటి, నాశక్తిని అనుసరించి, నేను ఎక్కడికి వెళ్లినను నా వెనుకనే ప్రభుబాహువులు ఉండుట చూచి, నేను వ్యాకులపాటునకు గుఱియైతిని. (దో॥ 79. క,ఖ)

చౌ- మూదేఉఁ నయన త్రసిత జబ భయఊఁ । పుని చితవత కోసలపుర గయఊఁ ॥
మోహి బిలోకి రామ ముసుకాహీఁ । బిహఁసత తురత గయఉఁ ముఖ మాహీఁ ॥ 1 ॥
ఉదర మాఝ సును అండజ రాయా । దేఖేఉఁ బహు బ్రహ్మండ నికాయా ॥
అతి బిచిత్ర తహఁ లోక అనేకా । రచనా అధిక ఏక తే ఏకా ॥ 2 ॥
కోటిన్హ చతురానన గౌరీసా । అగనిత ఉడగన రబి రజనీసా ॥
అగనిత లోకపాల జమ కాలా । అగనిత భూధర భూమి బిసాలా ॥ 3 ॥
సాగర సరి సర బిపిన అపారా । నానా భాఁతి సృష్టి బిస్తారా ॥
సుర ముని సిద్ధ నాగ నర కిన్నర । చారి ప్రకార జీవ సచరాచర ॥ 4 ॥

భయముతో కన్నులను మూసికొంటిని. మఱల కన్నులు తెఱవగానే అయోధ్యానగరమున నుంటిని. నన్ను జూచి శ్రీరాముడు ఒక దరహాసము చేసెను. అతడు నవ్వగానే ఆకర్షితుడనై నేను ఆయన నోటిలో ప్రవేశించితిని. ఖగరాజా! వినుము. నేను అతనిఉదరములో అనేకబ్రహ్మాండ సమూహములను జూచితిని. అందులో పెక్కు విలక్షణములైన లోకములు ఒకదానికంటె మఱియొకటి మిన్నగా నుండెను. కోట్లాది చతుర్ముఖబ్రహ్మలు, పరమేశ్వరులు, అసంఖ్యాకములైన తారలు, సూర్యచంద్రులు, లెక్కకు మిక్కిలిగానున్న లోకపాలురు, యములు, కాలములు, అసంఖ్యాకపర్వతములు, విశాలమైన పృథ్వి, లెక్కలేనన్ని సముద్రములు, నదులు, తటాకములు, వనములు, నానావిధసృష్టివిచిత్రములను జూచితిని. దేవతలు, మునులు, సిద్ధులు, నాగులు, కిన్నరులు, మానవులు, చతుర్విధస్థావరజంగము జీవులను గాంచితిని. (చౌ॥ 1-4)

దో- జో నహిఁ దేఖా నహిఁ సునా, జో మనహూఁ న సమాఇ ।
సో సబ అద్భుత దేఖేఉఁ, బరని కవని బిధి జాఇ ॥ 80(క) ॥
ఏక ఏక బ్రహ్మండ మహుఁ, రహఉఁ బరష సత ఏక ।
ఏహి బిధి దేఖత ఫిరఉఁ మైఁ, అండ కటాహ అనేక ॥ 80(ఖ) ॥

ఇది వరలో ఎన్నుడును కని,విని, ఊహకందని ఆశ్చర్యకరమైన సృష్టిని జూచితిని. వాటిని ఎట్లు వర్ణింపగలను? ఒక్కొక్క బ్రహ్మాండములో నేను వందేసి సంవత్సరములుంటిని. ఆ విధముగా నేను అనేక బ్రహ్మాండములను చూచుచు సంచరించితిని. (దో॥ 80. క,ఖ)

చౌ- లోక లోక ప్రతి భిన్న బిధాతా । భిన్న బిష్ను సివ మను దిసిత్రాతా ॥
నర గంధర్బ భూత బేతాలా । కిన్నర నిసిచర పసు ఖగ బ్యాలా ॥ 1 ॥
దేవ దనుజ గన నానా జాతీ । సకల జీవ తహఁ ఆనహి భాఁతీ ॥
మహి సరి సాగర సర గిరి నానా । సబ ప్రపంచ తహఁ అనఇ ఆనా ॥ 2 ॥
అండకోస ప్రతి ప్రతి నిజ రూపా । దేఖెఉఁ జినస అనేక అనూపా ॥
అవధపురీ ప్రతి భువన నినారీ । సరజూ భిన్న భిన్న నర నారీ ॥ 3 ॥
దసరథ కౌసల్యా సును తాతా । బిబిధ రూప భరతాదిక భ్రాతా ॥
ప్రతి బ్రహ్మాండ రామ అవతారా । దేఖఉఁ బాలబినోద అపారా ॥ 4 ॥

ప్రతిలోకమునందును వేర్వేఱు బ్రహ్మలు, శివులు, విష్ణువులు, మనువులు, దిక్పాలురు, గంధర్వులు, కిన్నరులు, మనుష్యులు, భూత భేతాళాది రాక్షసులు, సర్పములు, పశుపక్షులు మొదలగు అనేక దేవతా దైత్యాది గణములుండెను. జీవులందఱును వేర్వేఱు విధములుగా ఉండిరి. అనేకములైన భూములు, నదులు, సముద్రములు, సరస్సులు, పర్వతములు అన్నియును ప్రత్యేకతగలవియే. ప్రతిబ్రహ్మాండమునను నారూపమును జూచితిని. అనేకములైన అపూర్వవస్తువులను గాంచితిని. ప్రతిభువనమునందును, వేర్వేఱు అయోధ్యానగరములు, సరయూనదులు, స్త్రీ పురుషులు ఉండిరి. నాయనా! వినుము. దశరథుడు, కౌసల్యాదేవి, భరతాది సోదరులును అనేకరూపములను గలిగియుండిరి. నేను ప్రతిబ్రహ్మాండమున శ్రీరాముని అవతారమును అతని అపార బాల్యక్రీడలను చూచుచు తిరుగుచుంటిని. (చౌ॥ 1-4)

దో- భిన్న భిన్న మైఁ దీఖ సబు, అతి బిచిత్ర హరిజాన ।
అగనిత భువన ఫిరెఉఁ ప్రభు, రామ న ధేఖెఉఁ ఆన ॥ 81(క) ॥
సోఇ సిసుపన సోఇ సోభా, సోఇ కృపాల రఘుబీర ।
భువన భువన దేఖత ఫిరఉఁ, ప్రేరిత మోహ సమీర ॥ 81(ఖ) ॥

ఓ హరివాహనా! నేను ప్రతిబ్రహ్మాండమును ఇతర బ్రహ్మాండములకంటెను వేఱుగా, విచిత్రముగా ఉండుట గమనించితిని. నేను అసంఖ్యాకములైన బ్రహ్మాండములలో తిరిగితిని. కాని శ్రీరామచంద్రప్రభుని ఆకారములను మాత్రము వేర్వేఱుగా చూడలేదు. అవి ఒకే విధముగా ఉండెను. అన్నిచోట్లయందును అదే బాల్యము, అదే సౌందర్యము, దయాళువైన ఆ రఘువీరుడే. ఈ విధముగా మోహమనెడి వాయువుచే కొట్టబడి, అన్ని భువనములను జూచుచు తిరిగితిని. (దో॥ 81. క,ఖ)

చౌ- భ్రమత మోహి బ్రహ్మాండ అనేకా । బీతే మనహుఁ కల్ప సత ఏకా ॥
ఫిరత ఫిరత నిజ ఆశ్రమ ఆయఉఁ । తహఁ పుని రహి కఛు కాల గవాఁయఉఁ ॥ 1 ॥
నిజ ప్రభు జన్మ అవధ సుని పాయఉఁ । నిర్భర ప్రేమ హరషి ఉఠి ధాయఉఁ ॥
దేఖఉఁ జన్మ మహోత్సవ జాఈ । జెహి బిధి ప్రథమ కహా మైఁ గాఈ ॥ 2 ॥
రామ ఉదర దేఖెఉఁ జగ నానా । దేఖత బనఇ న జాఇ బఖానా ॥
తహఁ పుని దేఖెఉఁ రామ సుజానా । మాయా పతి కృపాల భగవానా ॥ 3 ॥
కరఉఁ బిచార బహోరి బహోరీ । మోహ కలిల బ్యాపిత మతి మోరీ ॥
ఉభయ ఘరీ మహఁ మైఁ సబ దేఖా । భయఉఁ భ్రమిత మన మోహ బిసేషా ॥ 4 ॥

ఈ విధముగా అనేక బ్రహ్మాండములయందు పరిభ్రమించుచు నూఱు కల్పములను గడిపితిని. ఇట్లు సంచరించుచు నా ఆశ్రమమునకు వచ్చి, కొంతకాలము అచట గడిపితిని. నా స్వామి అయోధ్యానగరమున అవతరించిన విషయమును విని, భక్తి నిరతుడనై, నిర్భరప్రేమతో ప్రసన్నతతో లేచి, పరుగెత్తితిని. అచట నేను మొదట సవిస్తరముగా తెలిపినట్లు శ్రీరామజననమహోత్సవమును జూచితిని. శ్రీరామచంద్రుని ఉదరమున అనేకలోకములను గాంచితిని. వాటిని చూడవలెనేగాని వర్ణింపనలవిగాదు. అక్కడ మాయాపతియైన శ్రీరామచంద్ర ప్రభువును మఱల దర్శించితిని. నేను మాటిమాటికిని ఆలోచించుచుంటిని. కాని నాబుద్ధి మోహమనెడి ఊబిలో కూరుకొనియుండెను. ఒక రెండుగడియలలో ఈవిచిత్రములనన్నింటిని గాంచితిని. మనస్సును మోహమావరించియుండుటచే నేను అలసిపోయితిని. అలౌకికమైన ప్రభులీలలను జూచి నాబుద్ధి భ్రమకు గురియయ్యెను. (చౌ॥ 1-4)

దో- దేఖి కృపాల బికల మొహి, బిహఁసే తబ రఘుబీర ।
బిహఁసతహీఁ ముఖ బాహెర, ఆయఉఁ సును మతిధీర ॥ 82(క) ॥
సోఇ లరికాఈ మో సన, కరన లగే పుని రామ ।
కోటి భాఁతి సముఝావఉఁ, మను న లహఇ బిశ్రామ ॥ 82(ఖ) ॥

నేను డస్సినది గమనించి, శ్రీరామచంద్రప్రభువు నవ్వెను. ఓ ధీరబుద్ధీ! గరుడుడా! ఆవధరింపుము. ప్రభువునవ్వగానే నేను ఆయన నోటినుండి బయటికి వచ్చితిని. ప్రభువు మఱల నాతో ఆ బాల్యక్రీడలనే ఆడసాగెను. అనేకవిధముల నామనస్సునకు నచ్చజెప్పుకొంటిని. కాని మనశ్శాంతి లభింపకుండెను. (దో॥ 82 క,ఖ)

చౌ- దేఖి చరిత యహ సో ప్రభుతాఈ । సముఝత దేహ దసా బిసరాఈ ॥
ధరని పరెఉఁ ముఖ ఆవ న బాతా । త్రాహి త్రాహి ఆరత జన త్రాతా ॥ 1 ॥
ప్రేమాకుల ప్రభు మోహి బిలోకీ । నిజ మాయా ప్రభుతా తబ రోకీ ॥
కర సరోజ ప్రభు మమ సిర ధరెఉ । దీనదయాల సకల దుఖ హరెఉ ॥ 2 ॥

కీన్హ రామ మొహి బిగత బిమోహా । సేవక సుఖద కృపా సందోహా ॥
ప్రభుతా ప్రథమ బిచారి బిచారీ । మన మహఁ హోఇ హరష అతి భారీ ॥ 3 ॥
భగత బఛలతా ప్రభు కై దేఖీ । ఉపజీ మమ ఉర ప్రీతి బిసేషీ ॥
సజల నయన పులకిత కర జోరీ । కీన్హిఉఁ బహు బిధి బినయ బహోరీ ॥ 4 ॥

ప్రభువుయొక్క ఈ బాల్యలీలలనుజూచి, ఆయనయుదరములో నేను దర్శించిన ప్రభుమహిమలను దలంచుకొని, నా శరీరస్పృహనే కోల్పోయితిని. 'ఓ ఆర్తజనరక్షకా! నన్ను 'కావుకావు' (కాపాడుము') మనియంటుచు నేలపై వ్రాలితిని. నేను పలుకజాలకయుంటిని. నేను ప్రేమ విహ్వాలుడనగుటను జూచి, ప్రభువు తనమాయామహిమను నిలిపివేసెను. దీనదయాళువైన ప్రభువు తనకరకమలములను నా శిరస్సుపై నుంచెను. నా దుఃఖమును పూర్తిగా తొలగించెను. సేవకులకు సుఖప్రదుడు, కృపానిధియైన శ్రీరాముడు నన్ను మోహవిముక్తునిగావించెను. నేను ఆయనయొక్క పూర్వవైభవమును తలంచుకొనినప్పుడు నా మనస్సు హర్షాతిరేకమును పొందెను. భక్తులయెడ ప్రభువుయొక్క అనురాగమును గాంచి, నాహృదయములో అపారప్రేమ ఉత్పన్నమాయెను. నేత్రములయందు ఆనందాశ్రువులు నిండగా, శరీరము రోమాంచితముకాగా అంజలిఘటించి, అనేకవిధములుగా విన్నవించుకొంటిని. (చౌ॥ 1-4)

దో- సుని సప్రేమ మమ బానీ, దేఖి దీన నిజ దాస ।
బచన సుఖద గంభీర మృదు, బోలే రమానివాస ॥ 83(క) ॥
కాకభుసుండి మాగు బర, అతి ప్రసన్న మొహి జాని ।
అనిమాదిక సిధి అపర రిధి, మోచ్ఛ సకల సుఖ ఖాని ॥ 83(ఖ) ॥

ప్రేమ పూర్వకమైన నావాణిని విని, తన సేవకుడనైన నా దీనావస్థను గమనించి, లక్ష్మీ నివాసుడైన శ్రీరాముడు సుఖదములైన తనకోమలగంభీరవచనములను పలికెను. "ఓ కాకభుశుండీ! నేను అత్యంతప్రసన్నుడనైతిని. నన్ను ఏదైననొకవరమునడుగుము. అణిమాద్యష్టసిద్ధులు, ఎనలేని సంపదలు, సమస్త సుఖములకు పరాకాష్ఠయైన మోక్షము (దో॥ 83. క,ఖ)

చౌ- గ్యాన బిబేక బిరతి బిగ్యానా । ముని దుర్లభ గున జే జగ నానా ॥
ఆజు దేఉఁ సబ సంసయ నాహీం । మాగు జో తోహి భావ మన మాహీం ॥ 1 ॥
సుని ప్రభు బచన అధిక అనురాగేఉఁ । మన అనుమాన కరన తబ లాగేఉఁ ॥
ప్రభు కహ దేన సకల సుఖ సహీ । భగతి ఆపనీ దేన న కహీ ॥ 2 ॥
భగతి హీన గున సబ సుఖ ఐసే । లవన బినా బహు బింజన జైసే ॥
భజన హీన సుఖ కవనే కాజా । అస బిచారి బోలేఉఁ ఖగరాజా ॥ 3 ॥
జౌం ప్రభు హోఇ ప్రసన్న బర దేహూ । మో పర కరహు కృపా అరు నేహూ ॥
మన భావత బర మాగఉఁ స్వామీ । తుమ్హ ఉదార ఉర అంతరజామీ ॥ 4 ॥

జ్ఞానము, వివేకము, వైరాగ్యము, విజ్ఞానము, (తత్త్వజ్ఞానము) మునీశ్వరులకును దుర్లభములైన పెక్కు అద్భుత గుణములు - మొదలగు వాటినన్నింటిని నేను నీకు ప్రసాదించెదను. ఇందు సందేహమేమాత్రము లేదు. నీ కిష్టములైన వరములను కోరుకొనుము." ప్రభువచనములను వినిన నేను ప్రేమవిహ్వలుడనైతిని. నా మనస్సున ఇట్లాలోచించితిని. "ప్రభువు అన్నిసుఖములను ఇచ్చెదనని పల్కెను. కాని తనభక్తిని ప్రసాదించెదననియనలేదు. ఉప్పులేకున్నచో ఏ భోజన పదార్థమూ భోజ్యముకానట్లు భక్తిలేనిదే ఏ గుణముగాని, సుఖముగాని నిష్ఫలమే. భజనలేని యేసుఖమూ ప్రయోజనకారిగాదు." ఓ ఖగరాజా! బాగుగాఆలోచించి, నేను ఇట్లంటిని. "ప్రభూ! మీరు ప్రసన్నులై కృపతో నాకు వరమిచ్చినచో నేను నాకిష్టమైనవరమును కోరుకొందును. మీరు ఉదారులు. నేను ప్రకటింపకయే నా మనస్సులోని మాటను గ్రహింపగలరు. (చౌ॥ 1-4)

దో- అబిరల భగతి బిసుద్ధ తవ, శ్రుతి పురాన జో గావ ।
జెహి ఖోజత జోగీస ముని, ప్రభు ప్రసాద కోఉ పావ ॥ 84(క) ॥
భగత కల్పతరు ప్రనత హిత, కృపా సింధు సుఖ ధామ ।
సోఇ నిజ భగతి మోహి ప్రభు, దేహు దయా కరి రామ ॥ 84(ఖ) ॥

ఓ వాంఛాకల్పతరువూ! శరణాగతహితైషీ కృపాసాగరా! సుఖనిధానా! శ్రీరామా! దయతో మీపై నాకు అనన్యభక్తిని ప్రసాదింపుడు. ఈ ప్రగాఢ నిష్కామభక్తిని శ్రుతులు, పురాణములు వేనోళ్ల కీర్తించుచుండును. యోగీశ్వరులైన మునులు దీనిని అన్వేషించుచు సంచరింతురు. మీ కృపకు పాత్రుడైన ఏఒక్కరో దీనిని పొందగలరు.(దో॥ 84 క,ఖ)

చౌ- ఏవమస్తు కహి రఘుకులనాయక । బోలే బచన పరమ సుఖదాయక ॥
సును బాయస తైఁ సహజ సయానా । కాహే న మాగసి అస బరదానా ॥ 1 ॥
సబ సుఖ ఖాని భగతి తైఁ మాగీ । నహిఁ జగ కోఉ తోహి సమ బడభాగీ ॥
జో ముని కోటి జతన నహిఁ లహహీఁ । జే జప జోగ అనల తన దహహీఁ ॥ 2 ॥
రీఝేఉఁ దేఖి తోరి చతురాఈ । మాగెహు భగతి మోహి అతి భాఈ ॥
సును బిహంగ ప్రసాద అబ మోరేఁ । సబ సుభ గున బసిహహిఁ ఉర తోరేఁ ॥ 3 ॥
భగతి గ్యాన బిగ్యాన బిరాగా । జోగ చరిత్ర రహస్య బిభాగా ॥
జానబ తైఁ సబహీ కర భేదా । మమ ప్రసాద నహిఁ సాధన ఖేదా ॥ 4 ॥

"ఏవమస్తు (అట్లే యగుగాక)" అని పలికి రఘువీరుడు పరమానందకరమైన వచనములను ఇట్లు పలికెను. " ఓ వాయసమా! వినుము. నీవు సహజముగనే చతురుడవు. లేనిచో ఇట్టి వరమును కోరుకొనవు. సర్వ సుఖములకును గనియైన భక్తినడిగితివి. ప్రపంచములో నీవంటి భాగ్యశాలి ఎవ్వరును లేరు. జపయోగాగ్నులలో తమశరీరములను తప్తమొనర్చిన మునులు కోటి ప్రయత్నములు చేసినను వారికి ఇట్టి భాగ్యము అబ్బదు. నీ విచక్షణాచాతుర్యమునకు నేను ప్రసన్నుడనైతిని. నీవు భక్తిని కోరితివి. ఓ విహంగమా! వినుము. నా కృపచే సర్వశుభగుణములును నీ హృదయములో నెలకొనియుండును. భక్తి జ్ఞాన విజ్ఞాన వైరాగ్యయోగములు, నా లీలలు, వాటి రహస్యవిభాగములు, వీటి వైవిధ్యములనన్నింటిని నా అనుగ్రహమువలన సమగ్రముగా తెలిసికొనగలవు. నీకు సాధనలో ఎట్టి శ్రమయు ఉండదు. (చౌ॥ 1-4)

దో- మాయా సంభవ భ్రమ సబ, అబ న బ్యాపిహహిఁ తోహి ।
జానేసు బ్రహ్మ అనాది అజ, అగున గునాకర మోహి ॥ 85(క) ॥
మోహి భగత ప్రియ సంతత, అస బిచారి సును కాగ ।
కాయఁ బచన మన మమ పద, కరేసు అచల అనురాగ ॥ 85(ఖ) ॥

మాయచే ఉత్పన్నములగు భ్రమలు నిన్ను తాకనైనతాకవు. నన్ను అనాదిగా, జన్మరహితునిగా, ప్రకృతిగుణరహితునిగా, గుణాతీతునిగా, దివ్యగుణాకరునిగా, పరబ్రహ్మగా ఎఱుంగుము. ఓ వాయసమా! వినుము. భక్తులు నాకు సర్వదా ప్రీతి పాత్రులు. ఇట్లు తలంచి, నీవు త్రికరణశుద్ధిగా నా చరణములయందే అచంచలమైన అనురాగమును కలిగియుండుము. (దో॥ 85 క,ఖ)

చౌ- అబ సును పరమ బిమల మమ బానీ । సత్య సుగమ నిగమాది బఖానీ ॥
నిజ సిద్ధాంత సునావఉఁ తోహీ । సును మన ధరు సబ తజి భజు మోహీ ॥ 1 ॥
మమ మాయా సంభవ సంసారా । జీవ చరాచర బిబిధి ప్రకారా ॥
సబ మమ ప్రియ సబ మమ ఉపజాఏ । సబ తే అధిక మనుజ మొహి భాఏ ॥ 2 ॥
తిన్హ మహఁ ద్విజ ద్విజ మహఁ శ్రుతిధారీ । తిన్హ మహుఁ నిగమ ధరమ అనుసారీ ॥
తిన్హ మహఁ ప్రియ బిరక్త పుని గ్యానీ । గ్యానిహు తే అతి ప్రియ బిగ్యానీ ॥ 3 ॥
తిన్హ తే పుని మొహి ప్రియ నిజ దాసా । జెహి గతి మోరి న దూసరి ఆసా ॥
పుని పుని సత్య కహఉఁ తోహి పాహీఁ । మొహి సేవక సమ ప్రియ కోఉ నాహీఁ ॥ 4 ॥
భగతి హీన బిరంచి కిన హోఈ । సబ జీవహు సమ ప్రియ మొహి సోఈ ॥
భగతివంత అతి నీచఉ ప్రానీ । మోహి ప్రానప్రియ అసి మమ బానీ ॥ 5 ॥

ప్రస్తుతము సత్యమైన, సుగమమైన, వేదస్తుత్యమైన నా నిర్మలవాణిని వినుము. నీకు నానిశ్చిత సిద్ధాంతమును తెలిపెదను. దానిని మనస్సులో నిలుపుకొని, తక్కినవాటిని విస్మరించి, నన్నే భజింపుము. విశ్వమంతయును నా మాయవలననే ఉత్పన్నమైనది. ఇందు నానావిధజడచేతన ప్రాణులున్నవి. అవియన్నియును నాకు ప్రియమైనవి. ఏలనన అవియన్నియును నా సృష్టియే, కాని మనుష్యులు ఈయన్నింటికంటెను నాకు ప్రీతిపాత్రులు. వారిలో బ్రాహ్మణులు, అందును వేదములను బాగుగా ఎఱింగినవారు, వారిలోను వేదోక్తధర్మములను అనుసరించువారు, వారియందును వైరాగ్యసంపన్నులు నాకు అత్యంతప్రీతిపాత్రులు. విరాగులలో జ్ఞానులు, వారిలోను విజ్ఞానులు (తత్త్వజ్ఞులు) నాకు మిక్కిలి ప్రేమాస్పదులు. పరతత్త్వజ్ఞానులు విజ్ఞానులకంటెను ఎక్కువ ప్రేమభాజనులు, వేఱే వాంఛలు లేకుండా నన్నే ఆశ్రయించు నాసేవకులు నాకు అత్యంతప్రియతములు. ఇది నాసిద్ధాంతము. భక్తిభావములేనివాడు బ్రహ్మయంతటి వాడైనను సరే! నాకు ఇతర సామాన్య జీవులతో సమానుడే. కాని అనన్యభక్తిగల అల్పప్రాణులుగూడ నాకు ప్రాణతుల్యులు. ఇది నాకు సహజము. (చౌ॥ 1-5)

దో- సుచి సుసీల సేవక సుమతి, ప్రియ కహు కాహి న లాగ ।
శ్రుతి పురాన కహ నీతి అసి, సావధాన సును కాగ ॥ 86 ॥

పవిత్రుడు, సుశీలుడు ఐన సద్బుద్ధిగలసేవకుని ఎవ్వడు ప్రేమింపడు? వేదములు, పురాణములు ఈ నీతినే ఉద్ఘోషించుచున్నవి. ఓ కాకరాజమా! సావధానముగా వినుము. (దో॥ 86)

చౌ- ఏక పితా కే బిపుల కుమారా । హోహిఁ పృథక గున సీల అచారా ॥
కోఉ పండిత కోఉ తాపస గ్యాతా । కోఉ ధనవంత సూర కోఉ దాతా ॥ 1 ॥
కోఉ సర్బగ్య ధర్మరత కోఈ । సబ పర పితహి ప్రీతి సమ హోఈ ॥
కోఉ పితు భగత బచన మన కర్మా । సపనెహుఁ జాన న దూసర ధర్మా ॥ 2 ॥
సో సుత ప్రియ పితు ప్రాన సమానా । జద్యపి సో సబ భాఁతి అయానా ॥
ఏహి బిధి జీవ చరాచర జేతే । త్రిజగ దేవ నర అసుర సమేతే ॥ 3 ॥
అఖిల బిస్వ యహ మోర ఉపాయా । సబ పర మోహి బరాబరి దాయా ॥
తిన్హ మహఁ జో పరిహరి మద మాయా । భజై మోహి మన బచ అరు కాయా ॥ 4 ॥

ఒక తండ్రికి చాలామంది కుమారులు గలరు. వారి గుణములు, స్వభావములు, ఆచరణలు వేర్వేఱుగా ఉండును. ఒకడు విద్వాంసుడు, మఱియొకడు తపస్వి, వేఱొకడు జ్ఞాని, ఇంకొకడు ధనవంతుడు, మఱియొకడు శూరుడు, వీరుడు, వేఱొకడు దాత, ఒకడు సర్వజ్ఞుడు, అన్యుడు ధర్మాత్ముడు. కాని తండ్రిప్రేమ వీరందఱిపై ఒకేమాదిరిగానుండును. వీరిలో ఒకడు మనో వాక్కర్మలచే తండ్రియెడ భక్తిశ్రద్ధలు గలవాడు, స్వప్నములోగూడ ఇతరధర్మమును ఎఱుగనివాడు. అట్టివాడు తండ్రికి ప్రాణతుల్యుడు. అతడు అన్నివిధముల మూర్ఖుడైనను సరే అతడు తండ్రికి మిక్కిలి ప్రియమైనవాడు. ఆ విధముగనే పశుపక్ష్యాదులు దేవమనుష్యాసురులతోసహా జడచేతనప్రాణులుగల ప్రపంచమంతయు నా సృష్టియే. కావున అన్నింటిపైనను నా ప్రేమ సమానమే. కాని వీరిలో మదమును, మాయను త్యజించి, మనోవాక్కాయములచే నన్నే భజించువాడు- (చౌ॥ 1-4)

దో- పురుష నపుంసక నారి వా, జీవ చరాచర కోఇ ।
సర్బ భావ భజ కపట తజి, మోహి పరమ ప్రియ సోఇ ॥ 87(క) ॥

ఆ వ్యక్తి పురుషుడైనను, స్త్రీ యైనను లేదా తదన్యుడైనను లేక జడ చేతన ప్రాణులలో ఏదైనను కపట ప్రపంచమును వీడి, అన్నియును 'నేనే' (శ్రీరాముడే) అని భావించి, భజించువాడు నాకు అత్యంత ప్రియుడు. (దో॥ 87 క)

సో- సత్య కహఉఁ ఖగ తోహి, సుచి సేవక మమ ప్రానప్రియ ।
అస బిచారి భజు మోహి, పరిహరి ఆస భరోస సబ ॥ 87(ఖ) ॥

ఓ వాయసమా! నిష్కామసేవకుడు నాకు ప్రాణప్రియుడు. కావున ఇతర-ఆశావిశ్వాసములను వదలి నన్నే భజింపుము. (సో॥ 87 ఖ)

చౌ- కబహుఁ కాల న బ్యాపిహి తోహీ । సుమిరేసు భజేసు నిరంతర మోహీ ॥
ప్రభు బచనామృత సుని న అఘాఉఁ । తను పులకిత మన అతి హరషాఉఁ ॥ 1 ॥
సో సుఖ జానఇ మన అరు కానా । నహిఁ రసనా పహిఁ జాఇ బఖానా ॥
ప్రభు సోభా సుఖ జానహిఁ నయనా । కహి కిమి సకహిఁ తిన్హహి నహిఁ బయనా ॥ 2 ॥
బహు బిధి మొహి ప్రబోధి సుఖ దేఈ । లగే కరన సిసు కౌతుక తేఈ ॥
సజల నయన కఛు ముఖ కరి రూఖా । చితఇ మాతు లాగీ అతి భూఖా ॥ 3 ॥
దేఖి మాతు ఆతుర ఉఠి ధాఈ । కహి మృదు బచన లిఏ ఉర లాఈ ॥
గోద రాఖి కరావ పయ పానా । రఘుపతి చరిత లలిత కర గానా ॥ 4 ॥

కాలమునిన్నేమియు చేయలేదు నిరంతరమునన్నే స్మరించుచు భజింపుము." ప్రభువుయొక్క అమృతతుల్యములగువచనములను ఎంతగా విన్నను నాకు తనివి తీరలేదు. నా శరీరము పులకితమయ్యెను. మనస్సు ఆనందవీధిలో విహరించెను. ఆ సుఖము కేవలము మనస్సునకును చెవులకే తెలియును. నాలుకతో దానిని వర్ణింపలేము. ప్రభుసౌందర్య వైభవము కేవలము కన్నులకే ఎఱుక. కాని అవి చెప్పలేవు. వాటికి మాటలు రావు. నన్ననేకవిధముల సమాధానపఱచి, సంతోష పఱచి, ప్రభువు మరల తనబాల్య క్రీడలను చేయసాగెను. ప్రభువు కన్నులలో నీరు నింపుకొని, బుంగమూతితో తల్లివైపు చూచి ఏడ్వసాగెను. తల్లి అతనికి ఆకలియైనదని గ్రహించి హృదయమునకు హత్తుకొనెను. తన యొడిలోనికి చేర్చుకొని, పాలియ్యసాగెను. శ్రీ రఘునాథుని మనోహరలీలలను కీర్తింపసాగెను. (చౌ॥ 1-4)

సో- జేహి సుఖ లాగి పురారి, అసుభ బేష కృత సివ సుఖద ।
అవధపురీ నర నారి, తెహి సుఖ మహుఁ సంతత మగన ॥ 88(క) ॥
సోఈ సుఖ లవలేస, జిన్హ బారక సపనేహుఁ లహేఉ ।
తే నహిఁ గనహిఁ ఖగేస, బ్రహ్మసుఖహి సజ్జన సుమతి ॥ 88(ఖ) ॥

సుఖప్రదుడు, మంగళస్వరూపుడు ఐన త్రిపురారి (శివుడు) విలక్షణమైన వేషమును ధరించి, అనుభవించు సుఖములోనే అయోధ్యలోని స్త్రీ పురుషులందఱును సర్వదా నిమగ్నులై యుండిరి. ఖగరాజా! ఒక్కసారి స్వప్నములోనైనను ఆ సుఖమును లేశమాత్రము అనుభవించు సజ్జనులు బ్రహ్మానందమునుగూడ కోరుకొనరు. (సో॥ 88, క,ఖ)

చౌ- మైఁ పుని అవధ రహేఉఁ కఛు కాలా । దేఖేఉఁ బాలబినోద రసాలా ॥
రామ ప్రసాద భగతి బర పాయఉఁ । ప్రభు పద బంది నిజాశ్రమ ఆయఉఁ ॥ 1 ॥
తబ తే మోహి న బ్యాపీ మాయా । జబ తే రఘునాయక అపనాయా ॥
యహ సబ గుప్త చరిత మైఁ గావా । హరి మాయాఁ జిమి మోహి నచావా ॥ 2 ॥
నిజ అనుభవ అబ కహఉఁ ఖగేసా । బిను హరి భజన న జాహిఁ కలేసా ॥
రామ కృపా బిను సును ఖగరాఈ । జాని న జాఇ రామ ప్రభుతాఈ ॥ 3 ॥

జానేఁ బిను న హోఇ పరతీతీ । బిను పరతీతి హోఇ నహిఁ ప్రీతీ ॥
ప్రీతి బినా నహిఁ భగతి దిఢాఈ । జిమి ఖగపతి జల కై చికనాఈ ॥ 4 ॥

గరుడా! నేను కొద్దికాలమువఱకు అయోధ్యలోనే యుంటిని. అక్కడ నేను శ్రీరాముని రసానందశోభితములైన పెక్కు బాల్యలీలలను జూచితిని. శ్రీరాముని కృపవలన భక్తిని వరముగా పొందితిని. తదనంతరము ప్రభుచరణములకు వందనమాచరించి, నా ఆశ్రమమునకు తిరిగి వచ్చితిని. శ్రీరఘునాథుడు నన్ను తనవానినిగా జేసికొనినప్పటినుండియు, ఆయనమాయ నన్ను ఆవరింపలేదు. శ్రీహరిమాయ నన్నాడించిన రహస్యచరిత్రను నేను వర్ణించితిని. ఓ ఖగరాజా! ఇప్పుడు నేను నా అనుభవములను తెల్పెదను వినుము. హరిభజన లేకుండ (పంచ) క్లేశములు దూరములుగావు. శ్రీరాముని దయలేనిదే ప్రభుమహిమను గూర్చినజ్ఞానము లభ్యముగాదు. అతని మహిమ తెలియనిదే ప్రభువుపై విశ్వాసము కుదురుకొనదు. విశ్వాసములేనిదే ప్రేమ కలుగదు. తైలము లేనిదే జలమునకు చిక్కదనము రానట్లు ప్రీతి, స్నేహము లేనిదే భక్తి దృఢముగాదు. (చౌ॥ 1-4)

సో- బిను గుర హోఇ కి గ్యాన, గ్యాన కి హోఇ బిరాగ బిను ।
గావహిఁ బేద పురాన, సుఖ కి లహిఅ హరి భగతి బిను ॥ 89(క) ॥
కోఉ బిశ్రామ కి పావ, తాత సహజ సంతోష బిను ।
చలై కి జల బిను నావ, కోటి జతన పచి పచి మరిఅ ॥ 89(ఖ) ॥

గురువులేనిదే జ్ఞానము లభ్యమగునా? వైరాగ్యము లేకుండ జ్ఞానము సంభవమా? వేదపురాణములు పేర్కొనినట్లు హరిభక్తిలేనిదే సుఖము ప్రాప్తింపదు. నాయనా గరుడుడా! సహజమైన సంతోషము లేనిదే శాంతి లభ్యముగాదు. ప్రాణములకు తెగించి, ఎన్ని ప్రయత్నములు చేసినను నీరు లేనిదే నావ నడువజాలదు. (సో॥ 89 క,ఖ)

చౌ- బిను సంతోష న కామ నసాహీఁ । కామ అఛత సుఖ సపనేహుఁ నాహీఁ ॥
రామ భజన బిను మిటహిఁ కి కామా । థల బిహీన తరు కబహుఁ కి జామా ॥ 1 ॥
బిను బిగ్యాన కి సమతా ఆవఇ । కోఉ అవకాస కి నభ బిను పావఇ ॥
శ్రద్ధా బినా ధర్మ నహిఁ హోఈ । బిను మహి గంధ కి పావఇ కోఈ ॥ 2 ॥
బిను తప తేజ కి కర బిస్తారా । జల బిను రస కి హోఇ సంసారా ॥
సీల కి మిల బిను బుధ సేవకాఈ । జిమి బిను తేజ న రూప గోసాఁఈ ॥ 3 ॥
నిజ సుఖ బిను మన హోఇ కి థీరా । పరస కి హోఇ బిహీన సమీరా ॥
కవనిఉ సిద్ధి కి బిను బిస్వాసా । బిను హరి భజన న భవ భయ నాసా ॥ 4 ॥

తృప్తిలేనిదే కామవాసనలు నశింపవు. వాంఛలున్నంతవఱకు స్వప్నములోగూడ హాయి చేకూరదు. శ్రీరాముని భజింపనిదే కోరికలు నశింపవు. భూమిలేనిదే చెట్టు నిలద్రొక్కుకొనునా? తత్త్వజ్ఞానములేనిదే సమభావము అసంభవము. ఆకాశములేకుండ అవకాశము ఉండునా? నిశ్చయాత్మకమైన శ్రద్ధలేనిదే ధర్మాచరణము సాధ్యముగాదు. పృథ్వీతత్త్వము లేనియెడల గంధము లభించునా? తపస్సు లేనిదే తేజస్సు విస్తరిల్లునా?

జలతత్త్వములేనిదే ప్రపంచములో రుచి ప్రాప్తించునా? జ్ఞానులకు సేవలు చేయనిదే శీలము ఏర్పడునా? అగ్ని తత్త్వము లేనిదే రూపము లభింపదు. ఆత్మానందము అభావమైనచో మనస్సు స్థిరముగాదు. వాయు తత్త్వములేనిదే స్పర్శ సంభవముగాదు. విశ్వాసము లేనిదే ఏదియు సిద్ధింపదు. అట్లే హరిభజనలేనిచో జన్మ మృత్యుభయములు తొలగవు. (చౌ॥ 1-4)

దో- బిను బిస్వాస భగతి నహిం, తెహి బిను ద్రవహిం న రాము ।
రామ కృపా బిను సపనెహుఁ, జీవ న లహ బిశ్రాము ॥ 90(క) ॥

విశ్వాసములేనిదే భక్తి యేర్పడదు. భక్తితో సేవింపనిదే శ్రీరామునిహృదయము ద్రవింపదు. శ్రీరాముని కృపలేనిదే కలలోగూడ శాంతి లభింపదు. (దో॥ 90 క)

సో- అస బిచారి మతి ధీర, తజి కుతర్క సంసయ సకల ।
భజహు రామ రఘుబీర, కరునాకర సుందర సుఖద ॥ 90(ఖ) ॥

ఓ ధీరమతీ! ఈ విధముగా ఆలోచించి, కుతర్కములను, సందేహములను వదలి, సుందరుడు, సుఖదాయకుడు, కరుణానిధియైన శ్రీరాముని భజింపుము. (సో॥ 90. ఖ)

## భగవంతుని అపార మహిమ

చౌ- నిజ మతి సరిస నాథ మైం గాఈ । ప్రభు ప్రతాప మహిమా ఖగరాఈ ॥
కహెఉఁ న కఛు కరి జుగుతి బిసేషీ । యహ సబ మైం నిజ నయనన్హి దేఖీ ॥ 1 ॥
మహిమా నామ రూప గున గాథా । సకల అమిత అనంత రఘునాథా ॥
నిజ నిజ మతి ముని హరి గున గావహిం । నిగమ సేష సివ పార న పావహిం ॥ 2 ॥
తుమ్హహి ఆది ఖగ మసక ప్రజంతా । నభ ఉడాహిం నహిం పావహిం అంతా ॥
తిమి రఘుపతి మహిమా అవగాహా । తాత కబహుఁ కోఉ పావ కి థాహా ॥ 3 ॥
రాము కామ సత కోటి సుభగ తన । దుర్గా కోటి అమిత అరి మర్దన ॥
సక్ర కోటి సత సరిస బిలాసా । నభ సత కోటి అమిత అవకాసా ॥ 4 ॥

ఖగరాజా! నా శక్తిననుసరించి, శ్రీరామచంద్రప్రభుప్రతాపమును మహిమలనుగూర్చి గానముచేసితిని. ఇందులో దేనినిగూర్చియు నేను కల్పించిచెప్పలేదు. అంతయు ఉన్నది ఉన్నట్లుగా చూచినదానినే తెల్పితిని. శ్రీ రఘునాథునిమహిమలు, నామములు, రూపములు, గుణములు అన్నియును అపారములు, అనంతములు. శ్రీరాముడు స్వయముగా అనంతుడు. మునులు తమతమ బుద్ధిబలములననుసరించి, శ్రీహరి గుణములను కీర్తించెదరు. వేదములు, శేషుడు, శివుడుగూడ వాటిని పూర్తిగా గ్రహింపలేరు. సూక్ష్మజీవియైన దోమ మొదలుకొని మీ (గరుత్మంతుని) వఱకును ఱెక్కలుగల ప్రాణులన్నియును ఆకాశమున ఎగురగలవు. కాని ఆకాశముయొక్క అంతమును చూడలేవు. అట్లే శ్రీరఘునాథుని మహిమను అందఱును తమ తమ బుద్ధిబలములను అనుసరించి,

అవగాహన చేసికొందురు. కాని దానిలోతులను పూర్తిగా కనుగొనలేరు. శ్రీరాముడు కోటిమన్మథసుందరాకారుడు. శత్రువులను పరిమార్చుటలో అనంతకోటి దుర్గామాతలశక్తిగలవాడు. ఐశ్వర్యమున ఆయన కోటి ఇంద్రులతో సమానుడు. అసంఖ్యాకములైన ఆకాశములు పట్టనంత విస్తృతమహిమగలవాడు. (చౌ॥ 1-4)

దో- మరుత కోటి సత బిపుల బల, రబి సత కోటి ప్రకాస।
ససి సత కోటి సుసీతల, సమన సకల భవ త్రాస ॥ 91(క) ॥
కాల కోటి సత సరిస అతి, దుస్తర దుర్గ దురంత।
ధూమకేతు సత కోటి సమ, దురాధరష భగవంత ॥ 91(ఖ) ॥

శ్రీరాముడు కోట్లకొలది వాయువులకంటెను మహాబలుడు. ప్రకాశమున అసంఖ్యాక సూర్యులను మించినవాడు. చల్లదనమున లెక్కలేనంతమంది చంద్రుల కంటెను అధికుడు, సమస్త భయనివారకుడు, భయంకరమైన మృత్యుదేవతవలె ఆయన దుస్తరమైనవాడు, లోకమునకు ఎదిరింపశక్యముగానివాడు. దుర్గమమైనవాడు, అంతములేనివాడు. నూటుకోట్ల అగ్నిదేవతలకంటెను ప్రబలుడు. (దో॥ 91 క,ఖ)

చౌ- ప్రభు అగాధ సత కోటి పతాలా। సమన కోటి సత సరిస కరాలా ॥
తీరథ అమిత కోటి సమ పావన। నామ అఖిల అఘ పూగ నసావన ॥ 1 ॥
హిమగిరి కోటి అచల రఘుబీరా । సింధు కోటి సత సమ గంభీరా ॥
కామధేను సత కోటి సమానా। సకల కామ దాయక భగవానా ॥ 2 ॥
సారద కోటి అమిత చతురాఈ। బిధి సత కోటి సృష్టి నిపునాఈ ॥
బిష్ను కోటి సమ పాలన కర్తా। రుద్ర కోటి సత సమ సంహర్తా ॥ 3 ॥
ధనద కోటి సత సమ ధనవానా। మాయా కోటి ప్రపంచ నిధానా ॥
భార ధరన సత కోటి అహీసా। నిరవధి నిరుపమ ప్రభు జగదీసా ॥ 4 ॥

శతకోటి పాతాళములకంటెను గంభీరమైన (లోతైన)వాడు. కోట్లకొలది యములకంటెను భయంకరుడు. అనంతకోటితీర్థ స్థానములకంటెను అత్యంతపవిత్రుడు. ఆ ప్రభునామమే సర్వ పాపములను అంతరింపజేయును. శ్రీ రఘువీరుడు కోటిహిమాలయములకంటెను సుస్థిరుడు. గాంభీర్యమున అనేకమహాసముద్రములను మించినవాడు. ఆ భగవానుడు దాతృత్వమున శతకోటికామధేనువులకంటెను అధికుడు, బుద్ధి కౌశలమున కోటి సరస్వతీదేవతలకంటెను కోవిదుడు. కోట్ల కొలది బ్రహ్మదేవులను మించిన సృష్టి రచనా నిపుణుడు, కోట్ల కొలది విష్ణువులను మించిన లోక సంరక్షకుడు, శతకోటి రుద్రులను మించిన సంహర్త. నూటుకోట్లకుబేరులను మించిన మహా ధనవంతుడు. అనేక మాయలతో సృష్టికి ఆధారభూతుడు. భూభార నిర్వహణలో కోట్లకొలది శేషులకంటెను అధికుడు. జగదీశుడైన శ్రీరామచంద్రప్రభువు నిరవధికుడు, నిరుపమానుడు. (చౌ॥ 1-4)

ఛం-నిరుపమ న ఉపమా ఆన రామ సమాన రాము నిగమ కహై।
జిమి కోటి సత ఖద్యోత సమ రబి కహత అతి లఘుతా లహై॥

ఎహి భాఁతి నిజ నిజ మతి బిలాస మునీస హరిహి బఖానహీఁ ।
ప్రభు భావ గాహక అతి కృపాల సప్రేమ సుని సుఖ మానహీఁ ॥

శ్రీరామచంద్రుడు నిరుపమానుడు. ఆయనతో పోల్చదగినది ఈ జగత్తున లేనేలేదు. ఆయనకు ఆయనయే సాటి. సూర్యకాంతిని కోటి దీపపుపురుగులతో సమానమని పోల్చినను ఆ వర్ణన (పోలిక) సరిపోదు. మీదు మిక్కిలి అది సూర్యనిందయే యగును. అట్లే మునీశ్వరులు తమ తమ బుద్ధిబలములననుసరించి, శ్రీరాముని ఎంతగా వర్ణించినను అది సరిపోదు. ఐనను మునీశ్వరులు భగవంతుని గూర్చి యథాశక్తి గానముచేయుచునేయుందురు. భగవంతుడు అతికృపాళువు. భక్తుల భావగ్రాహి. కావున సాదరముగా ఆ వర్ణనలను విని, ఆనందించును. (ఛం)

దో- రాము అమిత గున సాగర, థాహ కి పావఇ కోఇ ।
సంతన్హ సన జస కిఛు సునేఉఁ, తుమ్హహి సునాయఉఁ సోఇ ॥ 92(క) ॥

శ్రీరామచంద్రుడు అనంతగుణసాగరుడు. అతనిగాంభీర్యమును ఎవ్వరును కొలువ జాలరు? నేను సజ్జనుల ద్వారా విన్న దానిని మీకు విన్పించితిని. (దో॥ 92. క)

సో- భావ బస్య భగవాన, సుఖ నిధాన కరునా భవన ।
తజి మమతా మద మాన, భజిఅ సదా సీతా రవన ॥ 92(ఖ) ॥

సుఖనిధియు, కరుణాళువు ఐన భగవంతుడు భావవశుడు. కావున మమకారము, మదము, గర్వము వీడి, శ్రీ జానకీనాథుని భజింపవలెను. (సో॥ 92. ఖ)

చౌ- సుని భుసుండి కే బచన సుహాఏ । హరషిత ఖగపతి పంఖ ఫులాఏ ॥
నయన నీర మన అతి హరషానా । శ్రీరఘుపతి ప్రతాప ఉర ఆనా ॥ 1 ॥
పాఛిల మోహ సముఝి పఛితానా । బ్రహ్మ అనాది మనుజ కరి మానా ॥
పుని పుని కాగ చరన సిరు నావా । జాని రామ సమ ప్రేమ బఢావా ॥ 2 ॥
గుర బిను భవ నిధి తరఇ న కోఈ । జౌఁ బిరంచి సంకర సమ హోఈ ॥
సంసయ సర్ప గ్రసేఉ మోహి తాతా । దుఖద లహరి కుతర్క బహు బ్రాతా ॥ 3 ॥
తవ సరూప గారుడి రఘునాయక । మోహి జిఆయఉ జన సుఖదాయక ॥
తవ ప్రసాద మమ మోహ నసానా । రామ రహస్య అనూపమ జానా ॥ 4 ॥

కాకభుశుండియొక్క మృదుమధుర వచనములను విని, ఖగరాజైన గరుడుడు మిక్కిలి ప్రసన్నచిత్తుడై తన ఱెక్కలను విప్పి, విదలించుకొనెను. అతని కనులలో ఆనందాశ్రువులు నిండెను. మనస్సు హర్షముతో పొంగిపోయెను. అతడు శ్రీ రఘునాథుని ప్రతాపమును తన హృదయమున నింపుకొనెను. మునుపటి మోహమును స్మరించుకొని పశ్చాత్తప్తుడయ్యెను. అనాదియైన పరబ్రహ్మను సామాన్యమానవునిగా తలంచితినని చింతింపసాగెను. గరుడుడు కాకభుశుండిచరణములకు పదే పదే ప్రణమిల్లి, అతనిని శ్రీరామునితో సమానునిగా భావించి, ప్రేమవివ్హలుడాయెను. ఎవ్వరైనను బ్రహ్మమహేశ్వరుల యంతటి గొప్పవారైనను గురుకృప లేనిదే తరింప లేరు.

గరుడుడు పల్కుచున్నాడు. "నాయనా! సంశయసర్పదష్టుడనైన నన్ను అనేకకుతర్కములు బాధించుచుండెను. భక్తులకు సుఖమునిచ్చు శ్రీరామచంద్రుడనెడి గారుడ మంత్రము మీ రూపమున ఆ విషమును తొలగించెను. మీ దయవలన నా అజ్ఞానము నశించెను. నిరుపమానమైన రామరహస్యజ్ఞానము ప్రాప్తించెను. (చౌ॥ 1-4)

## భుసుండి పూర్వ జన్మ వృత్తాంతము

దో- తాహి ప్రసంసి బిబిధి బిధి, సీస నాఇ కర జోరి ।
బచన బినీత సప్రేమ మృదు, బోలెఉ గరుడ బహోరి ॥ 93(క) ॥
ప్రభు అపనే అబిబేక తే, బూఝఉఁ స్వామీ తోహి ।
కృపాసింధు సాదర కహహు, జాని దాస నిజ మోహి ॥ 93(ఖ) ॥

పిమ్మట వైనతేయుడు భుశుండిని పెక్కు విధముల ప్రశంసించి, శిరసా ప్రణమిల్లి, అంజలి ఘటించి, ప్రేమపూర్వకముగా వినయవచనములతో ఇట్లనెను. "ఓ ప్రభూ! అజ్ఞానినైన నేను మిమ్ము ఒక ప్రశ్నను అడిగెదను. దయాసాగరా! నన్ను మీదాసునిగా భావించి, సాదరముగా నా ప్రశ్నకు సమాధానమును దయచేయుడు.

(దో॥ 93. క,ఖ)

చౌ- తుమ్హ సర్బగ్య తగ్య తమ పారా । సుమతి సుసీల సరల ఆచారా ॥
గ్యాన బిరతి బిగ్యాన నివాసా । రఘునాయక కే తుమ్హ ప్రియ దాసా ॥ 1 ॥
కారన కవన దేహ యహ పాఈ । తాత సకల మోహి కహహు బుఝాఈ ॥
రామ చరిత సర సుందర స్వామీ । పాయహు కహాఁ కహహు నభగామీ ॥ 2 ॥
నాథ సునా మైఁ అస సివ పాహీఁ । మహా ప్రలయహుఁ నాస తవ నాహీఁ ॥
ముధా బచన నహిఁ ఈస్వర కహఈ । సోఉ మోరేఁ మన సంసయ అహఈ ॥ 3 ॥
అగ జగ జీవ నాగ నర దేవా । నాథ సకల జగు కాల కలేవా ॥
అండ కటాహ అమిత లయ కారీ । కాలు సదా దురతిక్రమ భారీ ॥ 4 ॥

మీరు సర్వజ్ఞులు, బ్రహ్మవిదులు, మాయాతీతులు, బుద్ధిమంతులు, సుశీలురు, సరళ స్వభావులు, జ్ఞానవిజ్ఞానవైరాగ్యసంపన్నులు, శ్రీరఘురామునిప్రియదాసులు. మీరు కాకి శరీరమును పొందుటకు కారణమేమి? నాకు విశదీకరింపుడు స్వామీ! భుశుండీ! మీరీ సుందర 'రామచరిత మానసమనెడి సరోవరమును' ఎచ్చట పొందితిరి? తెల్పుడు. మహాప్రళయకాలమునందుగూడ మీకు నాశములేదని పరమేశ్వరుడు తెల్పినాడు. శివుడసత్యమాడడు. కావున ఈ విషయమును తెల్పుడు. ప్రభూ! దేవతలు, నాగులు, మనుష్యులు మొదలగు స్థావరజంగములతో గూడిన జగత్తంతయు కాలునిచే కబళింపబడును. అసంఖ్యాకములైన బ్రహ్మాండములనుగూడ కాలము కబళించును. ఇది అనివార్యము. (చౌ॥ 1-4)

సో- తుమ్హహి న బ్యాపత కాల, అతి కరాల కారన కవన ।
మోహి సో కహహు కృపాల, గ్యాన ప్రభావ కి జోగ బల ॥ 94(క) ॥

అట్టి భయంకరుడైన కాలుడు నిన్ను ఏ మాత్రము ప్రభావితునిగా చేయకుండుటకు గల కారణమేమి? కృపాళువూ! ఇది జ్ఞాన ప్రభావమా? యోగ బలమా? (సో॥ 94. క)

దో- ప్రభు తవ ఆశ్రమ ఆఏఁ, మోర మోహ భ్రమ భాగ ।
కారన కవన సో నాథ సబ, కహహు సహిత అనురాగ ॥ 94(ఖ) ॥

ప్రభూ! మీ ఆశ్రమమునకు రాగానే నామోహము, భ్రమ దూరమైనవి. దీనికి కారణమేమి? దయచేసి, ప్రేమతో దెల్పుడు. (దో॥ 94. ఖ)

చౌ- గరుడ గిరా సుని హరషేఉ కాగా । బోలేఉ ఉమా పరమ అనురాగా ॥
ధన్య ధన్య తవ మతి ఉరగారీ । ప్రస్న తుమ్హారి మోహి అతి ప్యారీ ॥ 1 ॥
సుని తవ ప్రస్న సప్రేమ సుహాఈ । బహుత జనమ కై సుధి మోహి ఆఈ ॥
సబ నిజ కథా కహఉఁ మైఁ గాఈ । తాత సునహు సాదర మన లాఈ ॥ 2 ॥
జప తప మఖ సమ దమ బ్రత దానా। బిరతి బిబేక జోగ బిగ్యానా ॥
సబ కర ఫల రఘుపతి పద ప్రేమా। తెహి బిను కోఉ న పావఇ ఛేమా ॥ 3 ॥
ఏహిఁ తన రామ భగతి మైఁ పాఈ। తాతే మోహి మమతా అధికాఈ ॥
జేహి తేఁ కఛు నిజ స్వారథ హోఈ । తెహి పర మమతా కర సబ కోఈ ॥ 4 ॥

(శివుడు పల్కుచున్నాడు) ఓ ఉమా! గరుడుని వచనములను విని, కాకభుశుండి ప్రసన్నచిత్తుడై, అనురాగపూర్వకముగా పలికెను. "ఓ గరుడుడా! మీరు ధన్యజీవులు. అట్టి మీసద్బుద్ధికి ధన్యవాదములు. మీ ప్రశ్నలు మెచ్చుకొనదగినవి. మీ ప్రేమపూర్వకములైన ఈ ప్రశ్నలను వినినంతనే నా పూర్వజన్మలు అనేకము స్మరణకు వచ్చినవి. వాటి కథలను వినిపించెదను. శ్రద్ధాదరములతో మనసుపెట్టి వినుడు. జపతపోయజ్ఞశమదమవ్రతదానవైరాగ్య వివేకయోగ విజ్ఞానములఫలము శ్రీరామచరణములయందలి అనురాగ ప్రాప్తి. అది లేకుండ ఎవ్వరును శుభమును పొంద జాలరు. నేనీ కాకి శరీరములోనే భక్తిని పొందియుంటిని. కావున దీనిపై నాకు మక్కువ అధికము. తమకు లాభ ప్రదమైన దానిపై మమకారము ఉండుట అందఱికిని సహజము.

(చౌ॥ 1-4)

సో- పన్నగారి అసి నీతి, శ్రుతి సమ్మత సజ్జన కహహిఁ ।
అతి నీచహు సన ప్రీతి, కరిఅ జాని నిజ పరమ హిత ॥ 95(క) ॥
పాట కీట తేఁ హోఇ, తెహి తేఁ పాటంబర రుచిర ।
కృమి పాలఇ సబు కోఇ, పరమ అపావన ప్రాన సమ ॥ 95(ఖ) ॥

గరుడుడా! "అతి స్వల్పప్రాణియైనను తమకు పరమహితమును గూర్చునదియైనచో ఎవ్వరైనను దానిని సాదరముగా ప్రేమతో గౌరవింపవలెను." అనునది వేద సమ్మతమైన నీతి. సజ్జనులుగూడ దానిని పాటింతురు. పట్టుదారము ఒక పురుగునుండి వచ్చును. దాని వలన అత్యంత సుందరమైన పట్టువస్త్రములు నేయబడును. కావున అపవిత్రమైన పురుగునుగూడ జనులు ప్రాణసమానముగా పెంచుదురు. (సో॥ 95. క.ఖ)

చౌ- స్వారథ సాఁచ జీవ కహఁ ఏహా । మన క్రమ బచన రామ పద నేహా ॥
సోఇ పావన సోఇ సుభగ సరీరా । జో తను పాఇ భజిఅ రఘుబీరా ॥ 1 ॥
రామ బిముఖ లహి బిధి సమ దేహీ । కబి కోబిద న ప్రసంసహిఁ తేహీ ॥
రామ భగతి ఏహిఁ తన ఉర జామీ । తాతే మోహి పరమ ప్రియ స్వామీ ॥ 2 ॥
తజఉఁ న తన నిజ ఇచ్ఛా మరనా । తన బిను బేద భజన నహిఁ బరనా ॥
ప్రథమ మోహఁ మొహి బహుత బిగోవా । రామ బిముఖ సుఖ కబహుఁ న సోవా ॥ 3 ॥
నానా జనమ కర్మ పుని నానా । కిఏ జోగ జప తప మఖ దానా ॥
కవన జోని జనమేఉఁ జహఁ నాహీఁ । మైఁ ఖగేస భ్రమి భ్రమి జగ మాహీఁ ॥ 4 ॥
దేఖేఉఁ కరి సబ కరము గోసాఈఁ । సుఖీ న భయఉఁ అబహిఁ కీ నాఈఁ ॥
సుధి మొహి నాథ జన్మ బహు కేరీ । సివ ప్రసాద మతి మోహఁ న ఘేరీ ॥ 5 ॥

మనోవాక్కర్మలచే శ్రీరామునిపై భక్తికలిగియుండుటయే జీవునకు నిజమైనకర్తవ్యము. శ్రీరాముని భజించుశరీరమే సుందరమైనది, పవిత్రమైనది. శ్రీరామునకు విముఖుడైనవ్యక్తికి బ్రహ్మశరీరమే లభించినను అతనిని కవులు, పండితులు ప్రశంసింపరు. ఈ శరీరముతోడనే నాకు శ్రీరామ ప్రభువుపై భక్తి జనించెను. అందువలన ఓ స్వామీ! నాకు ఇది అత్యంతప్రియమైనది. నా మృత్యువు నా ఇచ్ఛతో కలుగునని భగవంతుని వరము. ఐనను ఈ శరీరమును త్యజింపను. ఏలనన శరీరములేకుండా హరిభజనచేయుట సాధ్యము కాదని వేదములు పేర్కొనుచున్నవి. మొదట మోహము నన్ను దుర్దశలపాలు చేసినది. శ్రీరాముని ఆశ్రయింపకుండుటచే నేను సుఖముగా నిద్రింపలేక పోయితిని. అనేకజన్మలలో నేను అనేకవిధములైన యోగ, జప, తపోయజ్ఞదానాది కర్మలను ఆచరించితిని. ఓ ఖగరాజా! నేను పెక్కుయోనులలో జన్మించి, వివిధ కర్మలను ఆచరించితిని. కాని ఇప్పటి సుఖము నాకెప్పుడును లభింపలేదు. నాకు ఇప్పుడు పూర్వ జన్మల స్మృతిగలదు. ఏలనన శివునికృపవలన నాబుద్ధి మోహమునకు లోనుగాలేదు. (చౌ॥ 1-4)

దో- ప్రథమ జన్మ కే చరిత అబ, కహఉఁ సునహు బిహగేస ।
సుని ప్రభు పద రతి ఉపజఇ, జాతేఁ మిటహిఁ కలేస ॥ 96(క) ॥
పూరుబ కల్ప ఏక ప్రభు, జుగ కలిజుగ మల మూల ।
నర అరు నారి అధర్మ రత, సకల నిగమ ప్రతికూల ॥ 96(ఖ) ॥

ఓ ఖగరాజా! వినుము. నేను నా పూర్వజన్మకథను తెలిపెదను. దానిని విన్నవారికి ప్రభు చరణములపై ప్రీతి యేర్పడును. దానిద్వారా సాంసారిక క్లేశములన్నియును తొలగును. ప్రభూ! పూర్వమొకకల్పములో పాపకూపమైన కలియుగము ప్రారంభమాయెను. అందు స్త్రీ పురుషులు అధర్మములో మునిగి వేదవిరుద్ధమార్గములయందు ప్రవర్తించుచుండిరి. (దో॥ 96. క,ఖ)

చౌ- తెహిఁ కలిజుగ కోసలపుర జాఈఁ । జన్మత భయఉఁ సూద్ర తను పాఈఁ ॥
సివ సేవక మన క్రమ అరు బానీ । ఆన దేవ నిందక అభిమానీ ॥ 1 ॥
ధన మద మత్త పరమ బాచాలా। ఉగ్రబుద్ధి ఉర దంభ బిసాలా ॥
జదపి రహెఉఁ రఘుపతి రజధానీ । తదపి న కఛు మహిమా తబ జానీ ॥ 2 ॥
అబ జానా మైఁ అవధ ప్రభావా । నిగమాగమ పురాన అస గావా ॥
కవనెహుఁ జన్మ అవధ బస జోఈఁ । రామ పరాయన సో పరి హోఈఁ ॥ 3 ॥
అవధ ప్రభావ జాన తబ ప్రానీ । జబ ఉర బసహిఁ రాము ధనుపానీ ॥
సో కలికాల కఠిన ఉరగారీ । పాప పరాయన సబ నర నారీ ॥ 4 ॥

అట్టి కలియుగమున నేను అయోధ్యానగరమున ఒకశూద్రునిగా జన్మించితిని. మనోవాక్కర్మలచే నేను శివభక్తుడనై ఇతరదేవతలను నిందించుచుంటిని. అతిగర్వితుడనై, ధనమదోన్మత్తుడనై, వాచాలునిగా, ఉగ్రబుద్ధిగలవానినిగా ఉంటిని. నా హృదయమున 'దంభము' అధికముగానుండెను. శ్రీరఘునాథునిఅయోధ్యానగరమునందున్నప్పటికిని నేను దానిమాహాత్మ్యమును ఎఱుగకుంటిని. ఇప్పుడే నాకు అయోధ్యవైశిష్ట్యము తెలిసినది. ఏ జన్మలో నైనను అయోధ్యలో నివసించిన వాడు శ్రీరామునిపై అవశ్యముగా అనురక్తుడగునని వేదశాస్త్రపురాణములు తెలుపుచున్నవి. చేత ధనుర్బాణములను ధరించిన కోదండరాముని తన హృదయమునందు నిలుపుకొనినవాడే అయోధ్య-ఔన్నత్యమును తెలిసికొనగల్గును. గరుడుడా! కలికాలము చాల కలుషితమైనది. అందు స్త్రీ పురుషులందఱును పాపకర్మనిరతులు. (చౌ॥ 1-4)

## కలియుగ లక్షణములు

దో- కలిమల గ్రసే ధర్మ సబ, లుప్త భఏ సదగ్రంథ ।
దంభిన్హ నిజ మతి కల్పి కరి, ప్రగట కిఏ బహు పంథ ॥ 97(క) ॥
భఏ లోగ సబ మోహబస, లోభ గ్రసే సుభ కర్మ ।
సును హరిజాన గ్యాన నిధి, కహఉఁ కఛుక కలిధర్మ ॥ 97(ఖ) ॥

కలియుగపాపములవలన ధర్మములన్నియును నశించెను. సద్గ్రంథములన్నియును మఱుగునబడెను. పాషండులు తమవిపరీతబుద్ధులతో వివిధసంప్రదాయములను కల్పించిరి. జనులందఱును మోహమునకు అధీనులైరి. లోభము సత్కర్మలను మ్రింగి వేసెను. ఓ జ్ఞాననిధీ! హరి వాహనా! వినుము. నేను కొన్ని కలియుగ లక్షణములను దెల్పెదను. (దో॥ 97. క,ఖ)

చౌ- బరన ధర్మ నహిఁ ఆశ్రమ చారీ । శ్రుతి బిరోధ రత సబ నర నారీ ॥
ద్విజ శ్రుతి బేచక భూప ప్రజాసన । కోఉ నహిఁ మాన నిగమ అనుసాసన ॥ 1 ॥
మారగ సోఇ జా కహుఁ జోఇ భావా । పండిత సోఇ జో గాల బజావా ॥
మిథ్యారంభ దంభ రత జోఈ । తా కహుఁ సంత కహఇ సబ కోఈ ॥ 2 ॥
సోఇ సయాన జో పరధన హారీ । జో కర దంభ సో బడ ఆచారీ ॥
జో కహ ఝూఁఠ మసఖరీ జానా । కలిజుగ సోఇ గునవంత బఖానా ॥ 3 ॥
నిరాచార జో శ్రుతి పథ త్యాగీ । కలిజుగ సోఇ గ్యానీ సో బిరాగీ ॥
జాకేఁ నఖ అరు జటా బిసాలా । సోఇ తాపస ప్రసిద్ధ కలికాలా ॥ 4 ॥

కలియుగమున వర్ణాశ్రమధర్మములు అడుగంటును. స్త్రీ పురుషులు వేదవిరుద్ధముగా ప్రవర్తింతురు. బ్రాహ్మణులు వేదములను అమ్ముకొందురు. రాజులు ప్రజలను పీడించుచు తినివేయుచుందురు. వేద, శాస్త్ర బోధనలను ఎవ్వరును గౌరవింపరు. ఎవరికి ఏది ఇష్టమో వారికి అదియే ధర్మము. బిగ్గరగా అఱచువాడే పండితుడు. ఆడంబరముగా జీవించువానిని, ఆపాదమస్తకము కపటముతోకూడియుండువానిని ప్రజలు సజ్జనునిగా భావింతురు. ఏయుపాయము ద్వారా ఐనను ఇతరులధనములను అపహరించువాడే చతురుడు. కపటవర్తనుడే ఆచారపరుడు. అసత్యములాడుచూ వాటిని పరిహాసముగా ప్రకటించువాడు కలియుగములో గుణవంతుడుగా చెల్లుబడి యగును. ఆచారహీనుడును, వేదమార్గమును త్యజించు వాడును, పొడవుగా గోళ్లను, జడలను పెంచుకొను వాడును జ్ఞానిగా, విరాగిగా, తాపసిగా ప్రసిద్ధికెక్కును. (చౌ॥ 1-4)

దో- అసుభ బేష భూషన ధరేఁ, భచ్ఛాభచ్ఛ జె ఖాహిఁ ।
తెఇ జోగీ తెఇ సిద్ధ నర, పూజ్య తె కలిజుగ మాహిఁ ॥ 98(క) ॥

అశుభ (అమంగళ కరములైన) వేషభూషణములను ధరించువాడును, తినదగినవి, తినగూడనివి అను విచక్షణ లేక అన్నింటిని తినెడువాడును, ఐనట్టి వాడే యోగి, సిద్ధుడు, కలియుగములో పూజ్యుడు.

(దో॥ 98. క)

సో- జే అపకారీ చార, తిన్హ కర గౌరవ మాన్య తెఇ ।
మన క్రమ బచన లబార, తెఇ బకతా కలికాల మహుఁ ॥ 98(ఖ) ॥

ఇతరులకు అపకారముచేయువారే ఎక్కువగా గౌరవింప బడుదురు. మనోవాక్కర్మలచే అసత్య ప్రలాపములాడువారు గొప్పవక్తలు. (సో॥ 98. ఖ)

చౌ- నారి బిబస నర సకల గోసాఈఁ । నాచహిఁ నట మర్కట కీ నాఈఁ ॥
సూద్ర ద్విజన్హ ఉపదేసహిఁ గ్యానా । మేలి జనేఊ లేహిఁ కుదానా ॥ 1 ॥
సబ నర కామ లోభ రత క్రోధీ । దేవ బిప్ర శ్రుతి సంత బిరోధీ ॥
గున మందిర సుందర పతి త్యాగీ । భజహిఁ నారి పర పురుష అభాగీ ॥ 2 ॥

సౌభాగినీం బిభూషన హీనా । బిధవన్హ కే సింగార నబీనా ॥
గుర సిష బధిర అంధ కా లేఖా । ఏక న సునఇ ఏక నహిం దేఖా ॥ 3 ॥
హరఇ సిష్య ధన సోక న హరఈ । సో గుర ఘోర నరక మహుఁ పరఈ ॥
మాతు పితా బాలకన్హి బోలావహిం । ఉదర భరై సోఇ ధర్మ సిఖావహిం ॥ 4 ॥

పురుషులందఱు స్త్రీలకువశులై గారడీవానిచేతిలో కోతులవలె ఆడుచుందురు. శూద్రులు బ్రాహ్మణులకు జ్ఞానోపదేశము చేసెదరు. మెడలో యజ్ఞోపవీతములనుధరించి, అపవిత్ర దానములను స్వీకరించెదరు. జనులందఱును కామక్రోదలోభపరాయణులై యుందురు. వారు దేవతలను, బ్రాహ్మణులను, వేదములను, సజ్జనులను ద్వేషించెదరు. అభాగినులైన స్త్రీలు, సర్వగుణసంపన్నుడును, సుందరుడైన పతిని వదలి, పరపురుషునిచెంత చేరుచుందురు. ముత్తైదువలశరీరములపై ఆభరణములుండవు. కాని విధవలు నిత్యమూ నూతన శృంగారములను చేసికొనుచుందురు. గురుశిష్యుల సంబంధము గ్రుడ్డి, చెవిటి వారిమధ్యగలసంబంధమునంటిది. గురువునకు జ్ఞానదృష్టి యుండదు. శిష్యుడు గురూపదేశమును వినడు. శిష్యుని ధనమును అపహరించి, వానిని శోకమునకుగుఱిచేయు గురువులు కొల్లలుగా ఉందురు.వారు ఘోర నరకముల పాలగుదురు. తల్లిదండ్రులు తమ పిల్లలకు ఉదరపోషణమునకు ఉపయోగపడు ధర్మములనే బోధించెదరు. (చౌ. 1-4)

దో- బ్రహ్మ గ్యాన బిను నారి నర, కహహిం న దూసరి బాత ।
కౌడీ లాగి లోభ బస, కరహిం బిప్ర గుర ఘాత ॥ 99(క) ॥
బాదహిం సూద్ర ద్విజన్హ సన, హమ తుమ్హ తే కఛు ఘాటి ।
జానఇ బ్రహ్మ సో బిప్రబర, ఆఁఖి దెఖావహిం డాటి ॥ 99(ఖ) ॥

స్త్రీ పురుషులు ఒక వైపు బ్రహ్మ జ్ఞానమునుగూర్చి తప్ప వేఱేమియు మాట్లాడరు. మఱొక వైపు వారు లోభమున ఒకపైసా కొఱకే బ్రాహ్మణునైనను, గురువునైనను హత్యచేయుటకు వెనుకాడరు. శూద్రులు బ్రాహ్మణులతో "మేము మీకంటె తక్కువా?" అని గర్వముతో గ్రుడ్లురిమి గద్దించెదరు, వాదములకు దిగెదరు. "బ్రహ్మమును దెలిసినవాడే బ్రాహ్మణుడు" అని వితండవాదములకు దిగుచుందురు. (దో. 99. క,ఖ)

చౌ- పర త్రియ లంపట కపట సయానే । మోహ ద్రోహ మమతా లపటానే ॥
తెఇ అభేదబాదీ గ్యానీ నర । దేఖా మైం చరిత్ర కలిజుగ కర ॥ 1 ॥
ఆపు గఏ అరు తిన్హహూ ఘాలహిం । జే కహుఁ సత మారగ ప్రతిపాలహిం ॥
కల్ప కల్ప భరి ఏక ఏక నరకా । పరహిం జె దూషహిం శ్రుతి కరి తరకా ॥ 2 ॥
జే బరనాధమ తేలి కుమ్హారా । స్వపచ కిరాత కోల కలవారా ॥
నారి ముఈ గృహ సంపతి నాసీ । మూడ ముడాఇ హోహిం సన్న్యాసీ ॥ 3 ॥
తే బిప్రన్హ సన ఆపు పుజావహిం । ఉభయ లోక నిజ హాథ నసావహిం ॥
బిప్ర నిరచ్ఛర లోలుప కామీ । నిరాచార సఠ బృషలీ స్వామీ ॥ 4 ॥

సూద్ర కరహిఀ జప తప బ్రత నానా । బైఠి బరాసన కహహిఀ పురానా ॥
సబ నర కల్పిత కరహిఀ అచారా । జాఇ న బరని అనీతి అపారా ॥ 5 ॥

పరస్త్రీలయందు ఆసక్తులు, కపటప్రవర్తనలో నిపుణులు, మోహము, ద్రోహము, మమకారములలో మునిగిన వారే "అభేదవాదులు"గా, 'బ్రహ్మజ్ఞానులు'గా ప్రసిద్ధివహింతురు. నేను కలియుగములో ఈ విశేషములనన్నింటిని జూచితిని. జనులు తాము స్వయముగా భ్రష్టులగుటయే గాక సన్మార్గమున నడచువారినిగూడ భ్రష్టపఱచుదురు. వారు కుతర్కములతో వేదశాస్త్రములను దూషించెదరు. ప్రతికల్పమునందును నరకయాతనలను అనుభవింతురు. నీచవర్ణస్థులైన నూనెలను అమ్ముకొనెడివారు, కుమ్మరులు, కుక్కమాంసములను భక్షించెడి చండాలురు, భిల్లులు, కోలులు, మద్యములను అమ్ముకొనెడి వారు- వీరందఱును భార్య చనిపోయినపిదపగాని, సంపదలను కోల్పోయినతరువాతగాని, తలగొరిగించుకొని సన్న్యాసులయ్యెదరు. వారు బ్రాహ్మణులచేతను పూజలందుకొందురు. ఈ విధముగా తమచేతులారా అధోగతిపాలై, ఇహపరలోకములకు దూరమగుదురు. బ్రాహ్మణులు విద్యాహీనులై, లోభులై, విషయాసక్తులై, ఆచారహీనులై, మూర్ఖులై నీచజాతి స్త్రీలను, వ్యభిచారిణులను వివాహమాడెదరు. శూద్రులు నానావిధములైన జపతపోవ్రతాదులను జేసి, ఉన్నతాసనమున గూర్చుండి, పురాణ ప్రవచనములను గావింతురు. మనుష్యులందఱును తమఇచ్ఛానుసారము మంచి చెడ్డలను మఱచి, విచ్చలవిడిగా ప్రవర్తింతురు. కలియుగమున ప్రబలెడి అపారమైన అవినీతిని వర్ణింప ఎంత వారికిని తరము గాదు. (చౌ॥ 1-5)

దో- భఏ బరన సంకర కలి, భిన్నసేతు సబ లోగ ।
కరహిఀ పాప పావహిఀ దుఖ, భయ రుజ సోక బియోగ ॥ 100(క) ॥
శ్రుతి సమ్మత హరి భక్తి పథ, సంజుత బిరతి బిబేక ।
తెహిఀ న చలహిఀ నర మోహ బస, కల్పహిఀ పంథ అనేక ॥ 100(ఖ) ॥

కలియుగమున జనులందఱును వర్ణసంకరులై మర్యాదలను ఉల్లంఘించెదరు. వారు పాపములను జేసి, తత్ఫలితముగా దుఃఖములను, భయములను, రోగములను, శోకములను, ప్రియవస్తువియోగములను పొందెదరు. మనుష్యులు మోహవశమున వేదసమ్మతమైన జ్ఞాన వైరాగ్యయుక్తమైన హరిభక్తిమార్గమున కాలుమోపరు. వారు నిరర్థకముగా క్రొత్త సంప్రదాయములను కల్పనచేసెదరు. (దో॥ 100. క,ఖ)

ఛం-బహు దామ సఀవారహిఀ ధామ జతీ । బిషయా హరి లీన్హి న రహి బిరతీ ॥
తపసీ ధనవంత దరిద్ర గృహీ । కలి కౌతుక తాత న జాత కహీ ॥ 1 ॥
కులవంతి నికారహిఀ నారి సతీ । గృహ ఆనహిఀ చేరి నిబేరి గతీ ॥
సుత మానహిఀ మాతు పితా తబ లౌఀ । అబలానన దీఖ నహీఀ జబ లౌఀ ॥ 2 ॥
ససురారి పిఆరి లగీ జబ తేఀ । రిపురూప కుటుంబ భఏ తబ తేఀ ॥
నృప పాప పరాయన ధర్మ నహీఀ । కరి దండ బిడంబ ప్రజా నితహీఀ ॥ 3 ॥
ధనవంత కులీన మలీన అపీ । ద్విజ చిన్హ జనేఉ ఉఘార తపీ ॥
నహిఀ మాన పురాన న బేదహి జో । హరి సేవక సంత సహీ కలి సో ॥ 4 ॥

కబి బృంద ఉదార దునీ న సునీ । గున దూషక బ్రాత న కోపి గునీ ॥
కలి బారహిఁ బార దుకాల పరై । బిను అన్న దుఖీ సబ లోగ మరై ॥ 5 ॥

కుహనాసన్న్యాసులు ధనమును సేకరించి, తమకై గృహములను నిర్మించుకొని, వాటిని అలంకరింప జేయుదురు. వారు విషయభోగలాలసులు. వారిలో వైరాగ్యము ఏ మాత్రమూ ఉండదు. కపటతాపసులు సంపన్నులయ్యెదరు. గృహస్థులు దరిద్రులయ్యెదరు. నాయనా! నిజముగా కలియుగలీలలు విచిత్రములు. అవర్ణనీయములు. జనులు పతివ్రతలైన తమ కులసతులను వెళ్ల గొట్టి, కులమర్యాదలను మంటగలిపి, దాసీలను చేరదీసెదరు. పుత్రులు తమభార్యల ముఖములను చూడనంతవఱకే తల్లిదండ్రులను గౌరవింతురు. క్రమముగా ఆ పుత్రులకు తమవారు శత్రువులయ్యెదరు. అత్తవైపు వారు ఆత్మబంధువులగుదురు. రాజులు పాపాత్ములై ధర్మములను విస్మరింతురు. నిత్యమూ ప్రజలను పీడించి వారిని దుర్దశలపాలుచేయుచుందురు. ధనవంతులు నీచ జాతివారైనను కులీనులుగా గౌరవింపబడుదురు. యజ్ఞోపవీతములు మాత్రమే బ్రాహ్మణులకు గుర్తు. దిగంబరత్వము తాపసులకు గుర్తు. వేదపురాణములపై విశ్వాసము లేనివారు హరి భక్తులుగా, సజ్జనులుగా చెలామణియగుచుందురు. కవులకు ఉదారముగా ఆశ్రయమిచ్చి, గౌరవించువారుమాత్రము మచ్చునకైనను కనబడరు. ఇతరులగుణములను దోషములుగా చూపెడివారు కోకొల్లలు. కాని వారిలో నిజమైన గుణవంతులెవ్వరును కానరారు. కలియుగమున తఱచుగా కఱవు కాటకములు సంభవించుచుండును. జనులలో ఆకలి చావులు మిక్కుటముగా నుండును.

(ఛం॥ 1-5)

దో- సును ఖగేస కలి కపట హఠ, దంభ ద్వేష పాషండ ।
మాన మోహ మారాది మద, బ్యాపి రహే బ్రహ్మండ ॥ 101(క) ॥
తామస ధర్మ కరహిఁ నర, జప తప బ్రత మఖ దాన ।
దేవ న బరషహిఁ ధరనీఁ, బఏ న జామహిఁ ధాన ॥ 101(ఖ) ॥

ఓ ఖగరాజా! వైనతేయా! వినుము. కలియుగమున కపటము, హఠము, దంభము, ద్వేషము, పాషండత్వము, అభిమానము, కామము, మదము, మోహము మొదలగునవి విశ్వమంతయు వ్యాపించును. మనుష్యులు జపతపోయజ్ఞవ్రతదానాదిధర్మములు తామసభావములతో ఆచరింతురు. దేవతలు భూమిపై వానలను కురిపింపరు. నాటినవిత్తములు మొలకెత్తవు. (దో॥ 101. క,ఖ)

ఛం-అబలా కచ భూషన భూరి ఛుధా । ధనహీన దుఖీ మమతా బహుధా ॥
సుఖ చాహహిఁ మూఢ న ధర్మ రతా । మతి థోరి కఠోరి న కోమలతా ॥ 1 ॥
నర పీడిత రోగ న భోగ కహీఁ । అభిమాన బిరోధ అకారనహీఁ ॥
లఘు జీవన సంబతు పంచ దసా । కలపాంత న నాస గుమాను అసా ॥ 2 ॥
కలికాల బిహాల కిఏ మనుజా । నహిఁ మానత క్వౌ అనుజా తనుజా ॥
నహిఁ తోష బిచార న సీతలతా । సబ జాతి కుజాతి భఏ మగతా ॥ 3 ॥

ఇరిషా పరుషాచ్ఛర లోలుపతా । భరి పూరి రహీ సమతా బిగతా ॥
సబ లోగ బియోగ బిసోక హావీ । బరనాశ్రమ ధర్మ అచార గవీ ॥ 4 ॥
దమ దాన దయా నహిఁ జానపనీ । జడతా పరబంచనతాతి ఘనీ ॥
తను పోషక నారి నరా సగరే । పరనిందక జే జగ మో బగరే ॥ 5 ॥

స్త్రీలు శిరోజములను కత్తిరించుకొని వాటిని చిత్ర విచిత్రములుగా అలంకరించుకొందురు. వారు ఎన్నడును తృప్తి జెందరు. అనేక వస్తువులపై లాలస ఉండుటవలన ధనహీనలై దుఃఖముల పాలగుదురు. వారు మూర్ఖత్వమువలన వ్యర్థ సుఖములను ఆసించెదరు. ధర్మముపై వారి మనస్సులు లగ్నముగావు. వారు అల్పబుద్ధులు, కఠినాత్ములు అయ్యెదరు. కోమలత్వము వారిలో లేశమాత్రమూ ఉండదు. మనుష్యులు రోగపీడితులు అగుదురు. వారికి సుఖమనునదియే యుండదు. దురభిమానముతో వారు నిష్కారణవైరమును పూనుదురు. వారిజీవితకాలము క్షణికమైనను వారి గర్వముమాత్రము కల్పాంతమువఱకును ఉండును. కలియుగము మానవులజీవితములను తలక్రిందులుగావించును. జనులు తమ చెల్లెండ్రను, కూతుండ్రను సైతము పవిత్రముగా గౌరవింపరు. ఎక్కడనూ, ఎవ్వరిలోనూ సంతోషమూ, వివేకమూ మనశ్శాంతియూ మచ్చునకైనను కనబడవు. అన్ని జాతులవారును యాచకవృత్తిని అవలంబింతురు. ఈర్ష్య, పరుషవచనములనుబల్కుట, లోభము అనునవి జనులలో సంపూర్ణముగా ఉండును. సమతాభావములు ఉండవు. ప్రజలందఱును వియోగములను, అంతులేని దుఃఖములను అనుభవింతురు. వర్ణాశ్రమ ధర్మములు అడుగంటును. దమము, దానము, దయ, సానుభూతి కలికమునకైనను కానరావు. మూర్ఖత్వము, మోసము పెచ్చు పెఱుగును. శరీరపోషణయందే స్త్రీ పురుషులు ఆసక్తిని కనబఱచెదరు. జగత్తునందంతటను పరులను నిందించువారే దర్శనమిచ్చెదరు. (ఛం॥ 1-5)

దో- సును బ్యాలారి కాల కలి, మల అవగున ఆగార ।
గునఉఁ బహుత కలిజుగ కర, బిను ప్రయాస నిస్తార ॥ 102(క) ॥
కృతజుగ త్రేతాఁ ద్వాపర, పూజా మఖ అరు జోగ ।
జో గతి హోఇ సో కలి హరి, నామ తె పావహిఁ లోగ ॥ 102(ఖ) ॥

ఓ పన్నగాంతకా! గరుడుడా! వినుము. కలియుగము పాపములకును, అవగుణములకును నిలయము. కాని ఈ కలియుగమున ఒక గొప్పగుణముగూడ లేకపోలేదు. ఎట్టి శ్రమలేకయే జనులకు జననమరణములనుండి విముక్తి లభించును. సత్య (కృత) త్రేతా, ద్వాపర యుగములయందు యోగ, యజ్ఞ, పూజలవలన ప్రాప్తించెడిగతి, కలియుగమున జనులకు కేవలము భగవన్నామస్మరణవలననే లభించును. (దో॥ 102 క,ఖ)

చౌ- కృతజుగ సబ జోగీ బిగ్యానీ । కరి హరి ధ్యాన తరహిఁ భవ ప్రానీ ॥
త్రేతాఁ బిబిధ జగ్య నర కరహీఁ । ప్రభుహి సమర్పి కర్మ భవ తరహీఁ ॥ 1 ॥
ద్వాపర కరి రఘుపతి పద పూజా । నర భవ తరహిఁ ఉపాయ న దూజా ॥
కలిజుగ కేవల హరి గున గాహా । గావత నర పావహిఁ భవ థాహా ॥ 2 ॥

కలిజుగ జోగ న జగ్య న గ్యానా । ఏక అధార రామ గున గానా ॥
సబ భరోస తజి జో భజ రామహి । ప్రేమ సమేత గావ గున గ్రామహి ॥ 3 ॥
సోఇ భవ తర కఛు సంసయ నాహీం । నామ ప్రతాప ప్రగట కలి మాహీం ॥
కలి కర ఏక పునీత ప్రతాపా । మానస పున్య హోహిం నహిం పాపా ॥ 4 ॥

కృత యుగమునందు ఎల్లరును యోగులై, విజ్ఞానులై యుందురు. వారు దైవధ్యానముచే భవసాగరమును దాటెదరు. త్రేతాయుగమున ప్రజలు వివిధ యజ్ఞములను ఆచరించి, తమ కర్మలనన్నింటిని ప్రభువునకు సమర్పించి, సంసారసాగరమునుండి తరించెదరు. ద్వాపరయుగమున భగవంతుని చరణములను పూజించి, జనులు భవబంధములనుండి విముక్తి పొందెదరు. ఈ విషయమున ఇంతకంటెను వేఱుఉపాయమేలేదు. కలియుగమున శ్రీహరిగుణములను గానముచేసి, జనులు జననమరణచక్రమునుండి ముక్తిని పొందెదరు. కలియుగమున యోగము, యజ్ఞము, జ్ఞానము అనువాటిద్వారా శ్రమపడవలసిన అవసరము లేదు. కేవలము శ్రీరాముని గుణకీర్తనమే ముక్తికి పరమసాధనము. (కలౌ సంకీర్తనాన్ముక్తిః) కావున యోగము మొదలగువాని ప్రసక్తి లేకయు శ్రీరాముని భజించువాడు, అనన్యభక్తితో ప్రభుగుణగణములను గానమొనర్చువాడు భవసాగరమునుండి అవలీలగా బయటపడగలడు. ఇందు సందేహములేదు. కలియుగమున నామమహిమ గొప్పది. మానసికపుణ్యముండును గాని, మానసికపాపము ఉండదు. ఇది కలియుగమునందలి వైశిష్ట్యము. (చౌ॥ 1-4)

దో- కలిజుగ సమ జుగ ఆన నహిం, జౌం నర కర బిస్వాస ।
గాఇ రామ గున గన బిమల, భవ తర బినహిం ప్రయాస ॥ 103(క) ॥
ప్రగట చారి పద ధర్మ కే, కలి మహుం ఏక ప్రధాన ।
జేన కేన బిధి దీన్హేం, దాన కరఇ కల్యాన ॥ 103(ఖ) ॥

మానవుడు విశ్వాసము కలిగియున్నచో కలియుగముతో సమానమైన యుగములేదు. ఏలనన శ్రీరాముని నిర్మలగుణ గణములను స్మరించి, ఎట్టి ప్రయాసయు లేకుండగనే సంసారసాగరమును దాటగలడు. ధర్మమునకు సత్యము, దయ, తపము, దానము అనునాలుగు చరణములును ప్రసిద్ధములు. కలియుగమున 'దానము' అనుచరణమే ముఖ్యమైనది. దానమును ఏ విధముగా చేసినను అది శుభ ఫలితమునే ఇచ్చును. (దో॥ 103 క,ఖ)

చౌ- నిత జుగ ధర్మ హోహిం సబ కేరే । హృదయం రామ మాయా కే ప్రేరే ॥
సుద్ధ సత్వ సమతా బిగ్యానా । కృత ప్రభావ ప్రసన్న మన జానా ॥ 1 ॥
సత్వ బహుత రజ కఛు రతి కర్మా । సబ బిధి సుఖ త్రేతా కర ధర్మా ॥
బహు రజ స్వల్ప సత్వ కఛు తామస । ద్వాపర ధర్మ హరష భయ మానస ॥ 2 ॥
తామస బహుత రజోగున థోరా । కలి ప్రభావ బిరోధ చహుం ఓరా ॥
బుధ జుగ ధర్మ జాని మన మాహీం । తజి అధర్మ రతి ధర్మ కరాహీం ॥ 3 ॥
కాల ధర్మ నహిం బ్యాపహిం తాహీ । రఘుపతి చరన ప్రీతి అతి జాహీ ॥
నట కృత బికట కపట ఖగరాయా । నట సేవకహి న బ్యాపఇ మాయా ॥ 4 ॥

శ్రీరాముని మాయాప్రేరణవలన అందఱి హృదయములలో అన్ని యుగములధర్మములును నిత్యము ప్రకాశించుచుండును. శుద్ధసత్త్వగుణము సమత్వము, విజ్ఞానము, మనఃప్రసన్నత అనునవి కృతయుగ ప్రభావములని తెలిసికొనవలెను. సత్త్వగుణము అధికముగా ఉండి, అది కొంత రజోగుణమిశ్రితమైనచో, అది త్రేతాయుగ లక్షణము. దీని ప్రభావము వలన కర్మలయందు ప్రీతి, సర్వవిధసుఖములనుకోరుట జరుగును. రజోగుణము ఎక్కువగా నుండి, సత్త్వ గుణము చాలా కొద్దిగానుండి, కొంతతమోగుణము గూడ మిశ్రితమై, హర్షము, భయము కలుగుచుండుట ద్వాపరయుగలక్షణము, తమోగుణము అధికముగా ఉండి కొద్దిగా రజోగుణము మిశ్రితమై నలుదెసల వైరము, ప్రతీకారము వ్యాపించుట కలియుగ ప్రభావము. పండితులైన వారు యుగ ధర్మములనుగూర్చి బాగుగా ఆలోచించి, అధర్మమును త్యజించి, ధర్మమును ఆచరించెదరు. శ్రీరఘునాథుని చరణములపై అత్యంతప్రీతిగలవానిని యుగధర్మములు ఏ మాత్రమును అంటవు. ఓ ఖగరాజా! ఇంద్రజాలికుడు ప్రదర్శించుమాయ చూచువారికే అనూహ్యమైనది. కాని అతని ఉపాయములు అతనిసేవకులను ప్రభావితము చేయవు. (చౌ॥ 1-4)

దో- హరి మాయా కృత దోష గున, బిను హరి భజన న జాహిఀ ।
భజిఅ రామ తజి కామ సబ, అస బిచారి మన మాహిఀ ॥ 104(క) ॥
తెహిఀ కలికాల బరష బహు, బసెఉఀ అవధ బిహగేస ।
పరెఉ దుకాల బిపతి బస, తబ మైఀ గయఉఀ బిదేస ॥ 104 (ఖ) ॥

శ్రీహరిమాయాప్రేరితములైన గుణదోషములు దూరమగుటకు హరినిభజించుటతప్ప మఱియొక మార్గము లేదు. మనస్సులో ఇట్లాలోచించి, కోరికలన్నింటిని త్యజించి, నిష్కామ భావముతో శ్రీరాముని భజింపవలెను. ఓ ఖగరాజా! వైనతేయా! ఈ కలియుగమున నేను అనేక వత్సరములు అయోధ్యానగరమున నివసించితిని. అక్కడ కఱవు సంభవింపగా ఆపదలకు గుఱియై ఇతర దేశములకు వెళ్లితిని. (దో॥ 104. క,ఖ)

## భుసుండికి శివుని శాపము

చౌ- గయఉఀ ఉజేనీ సును ఉరగారీ । దీన మలీన దరిద్ర దుఖారీ ॥
గఏఀ కాల కఛు సంపతి పాఈ । తహఀ పుని కరఉఀ సంభు సెవకాఈ ॥ 1 ॥
బిప్ర ఏక బైదిక సివ పూజా । కరఇ సదా తెహి కాజు న దూజా ॥
పరమ సాధు పరమారథ బిందక । సంభు ఉపాసక నహిఀ హరి నిందక ॥ 2 ॥
తెహి సేవఉఀ మైఀ కపట సమేతా । ద్విజ దయాల అతి నీతి నికేతా ॥
బాహిజ నమ్ర దేఖి మోహి సాఈఀ । బిప్ర పఢావ పుత్ర కీ నాఈఀ ॥ 3 ॥
సంభు మంత్ర మోహి ద్విజబర దీన్హా । సుభ ఉపదేస బిబిధ బిధి కీన్హా ॥
జపఉఀ మంత్ర సివ మందిర జాఈ । హృదయఀ దంభ అహమితి అధికాఈ ॥ 4 ॥

ఓ పన్నగాశనా! ఖగరాజా! వినుము. నేను దీనుడనై, ఉదాసీనుడై, దరిద్రుడనై, దుఃఖితుడనై, ఉజ్జయినీ నగరముకు వెళ్లితిని. కొంత కాలము అచట గడిపి, కొంత ధనమును సంపాదించి, పరమ శివుని ఆరాధింప సాగితిని. అక్కడ ఒక బ్రాహ్మణుడు వైదికపద్ధతిలో శివుని పూజించుచుండెను. అహర్నిశలు శివుని పూజించుటయే అతని పని. అతడు పరమసాధువు, పరమార్థమును ఎఱిగిన వాడు, శివునియుపాసకుడు. కాని విష్ణునింద చేయకుండెను. నేను కపటభావనుతో అతనిని సేవించుచు ఉంటిని. ఆ బ్రాహ్మణుడు అతిదయాళువు, నీతిమంతుడు . గరుడుడా! నా 'పైపై' వినయమును జూచి, అతడు నన్ను తనపుత్రునివలె భావించి, బోధించుచుండెను. ఆ బ్రాహ్మణుడు నాకు శివమంత్రమునే గాక అనేకపవిత్ర విషయములను ఉపదేశించెను. నేను ప్రతి దినము దేవాలయమునకు వెళ్లి, శివమంత్రమును జపించుచుంటిని. కాని నా హృదయమున డంబాహంకారములు నిండియుండెను. (చౌ॥ 1-4)

దో- మైఁ ఖల మల సంకుల మతి, నీచ జాతి బస మోహ।
హరి జన ద్విజ దేఖేఁ జరఉఁ, కరఉఁ బిష్ను కర ద్రోహ ॥ 105(క) ॥

నేను పాపబుద్ధిని, దుష్టుడను, నీచుడను, అకారణమున మోహవశుడనై హరిభక్తులను, బ్రాహ్మణులను చూడగనే కోపముతో మండిపడుచుంటిని. భగవంతుడైన విష్ణువును వైరభావముతో చూచుచుండెడివాడను. (దో॥ 105. క)

సో- గుర నిత మోహి ప్రబోధ, దుఖిత దేఖి ఆచరన మమ ।
మోహి ఉపజఇ అతి క్రోధ, దంభిహి నీతి కి భావఈఁ ॥ 105(ఖ) ॥

గురువుగారు నా ప్రవర్తనను జూచి, బాధపడుచుండిరి. వారు నాకు నిత్యము సదుపదేశములను ఇచ్చుచుండిరి. కాని నేను వారిఉపదేశములను పెడచెవిన పెట్టుచుంటిని. రాను రాను నాకు కోపము అధికము కాజొచ్చెను. గర్వియైన వానికి నీతి వాక్యములు చెవికెక్కునా? (సో॥ 105. ఖ)

చౌ- ఏక బార గుర లీన్హ బోలాఈఁ । మోహి నీతి బహు భాఁతి సిఖాఈఁ ॥
సివ సేవా కర ఫల సుత సోఈఁ । అబిరల భగతి రామ పద హోఈఁ ॥ 1 ॥
రామహి భజహిఁ తాత సివ ధాతా । నర పావఁర కై కేతిక బాతా ॥
జాసు చరన అజ సివ అనురాగీ । తాసు ద్రోహఁ సుఖ చహసి అభాగీ ॥ 2 ॥
హర కహుఁ హరి సేవక గుర కహేఊ । సుని ఖగనాథ హృదయ మమ దహేఊ ॥
అధమ జాతి మైఁ బిద్యా పాఏఁ । భయఉఁ జథా అహి దూధ పిఆఏఁ ॥ 3 ॥
మానీ కుటిల కుభాగ్య కుజాతీ । గుర కర ద్రోహ కరఉఁ దిను రాతీ ॥
అతి దయాల గుర స్వల్ప న క్రోధా । పుని పుని మోహి సిఖావ సుబోధా ॥ 4 ॥
జేహి తే నీచ బడాఈ పావా । సో ప్రథమహిఁ హతి తాహి నసావా ॥
ధూమ అనల సంభవ సును భాఈ । తేహి బుఝావ ఘన పదవీ పాఈ ॥ 5 ॥
రజ మగ పరీ నిరాదర రహఈ । సబ కర పద ప్రహార నిత సహఈ ॥
మరుత ఉడావ ప్రథమ తేహి భరఈ । పుని నృప నయన కిరీటన్హి పరఈ ॥ 6 ॥

సును ఖగపతి అస సముఝి ప్రసంగా। బుధ నహిఁ కరహిఁ అధమ కర సంగా ॥
కబి కోబిద గావహిఁ అసి నీతీ। ఖల సన కలహ న భల నహిఁ ప్రీతీ ॥ 7 ॥
ఉదాసీన నిత రహిఅ గోసాఈఁ। ఖల పరిహరిఅ స్వాన కీ నాఈఁ ॥
మైఁ ఖల హృదయఁ కపట కుటిలాఈ। గుర హిత కహఇ న మోహి సోహాఈ ॥ 8 ॥

ఒక దినమున గురువుగారు నన్ను పిలిచి, "పుత్రా! శివుని సేవాఫలము నిరంతరము శ్రీరాముని చరణములపై భక్తి కుదురుకొనుటయే" అని అనేకవిధముల నీతి గఱపెను. నాయనా! శివుడు, బ్రహ్మయు శ్రీరాముని భజించెదరు. ఇక మానవమాత్రులసంగతి అడుగనేల? బ్రహ్మ, పరమేశ్వరుల యంతటివారుగూడ శ్రీరామునిచరణసేవయందు ఆసక్తులు. అట్టి ఆ ప్రభువుతో వైరముపూని నీవు సుఖమును ఆసించుచున్నావా?" శివుడు హరిసేవకుడని గురువుగారు పలికెను. ఓ ఖగరాజా! ఈ మాట వినగానే నా హృదయము కోపాగ్నిలో దహించుకొనిపోయెను. జాతిచేత అనర్హుడనైన నాకు గురువుగారు విద్యలను నేర్పుట పామునకు పాలుపోసినట్లైనది. గర్వపోతును, కుటిలుడను, దౌర్భాగ్యుడను, కుజాతివాడను ఐన నేను రాత్రింబవళ్లు గురువునకే ద్రోహము తలపెట్టితిని. కాని గురువుగారు అత్యంతదయాళువులు. కావున ఆయన ఏమాత్రము కోపపడలేదు. ఆయన అనుక్షణము చక్కనిజ్ఞానమును బోధించుచుండెను. నీచుడు తనకు ఔన్నత్యమునుగూర్చినవానికే హాని చేకూర్చును. సోదరా! వినుము. పొగ నిప్పునుండి ఉత్పన్నమగును. కాని అదేపొగ మేఘముగా రూపొంది, తాను వర్షించినజలముతో ఆ నిప్పును ఆర్పివేయును. ధూళి మార్గములోపడి, అవమానము పాలై సర్వదా అందఱిపాదములచే త్రొక్క బడును. కాని గాలివలన ఆ ధూళి ఎత్తునకు (పైకి) ఎగిరినప్పుడు అది ఆ గాలినే చుట్టుముట్టి రాజుల కండ్లలోను, కిరీటముపైనను పడును. ఓ ఖగరాజా! వినుము. ఈ ప్రసంగమును గ్రహించిన బుద్ధిమంతులు అధములతో సాంగత్యము చేయరు. దుష్టులతో కలహముగాని, స్నేహముగాని, చేయుట తగదని పండితశ్రేష్ఠులు నీతిగఱపెదరు. ఖలునియెడ ఎల్లప్పుడును తటస్థునివలెనే ఉండ వలెను. అతనిని కుక్కనువలె దూరముగా ఉంచవలెను. నేను దుష్టుడను, కపటిని, కుటిలుడను, గురువుగారు నాకు హితవచనములనే నుడువుచుండిరి. కాని అవి నాకు రుచింపకుండెను.

(చౌ॥ 1-8)

దో- ఏక బార హర మందిర, జపత రహేఉఁ సివ నామ।
గుర ఆయఉ అభిమాన తేఁ, ఉఠి నహిఁ కీన్హ ప్రనామ ॥ 106(క) ॥
సో దయాల నహిఁ కహేఉ కఛు, ఉర న రోష లవలేస।
అతి అఘ గుర అపమానతా, సహి నహిఁ సకే మహేస ॥ 106(ఖ) ॥

ఒక దినము నేను శివాలయములో శివనామమును జపించుచుంటిని. అదే సమయమున గురువుగారు అచటికి విచ్చేసిరి. కాని గర్వితమతినై నేను లేవలేదు. పైగా ఆయనకు నమస్కరింపలేదు. గురువుగారు దయానిధులు. నాదౌష్ట్యమును చూచియు, ఆయన ఏమియును అనలేదు. ఆయనహృదయములో అవంతయు కోపములేకుండెను. కాని గురువును నిరాదరించుట మహాపాపము. మహాదేవుడు దీనిని సహింపలేకపోయెను. (దో॥ 106. క,ఖ)

చౌ- మందిర మాఝు భఈ నభబానీ । రే హతభాగ్య అగ్య అభిమానీ ॥
జద్యపి తవ గుర కేఀ నహిఀ క్రోధా । అతి కృపాల చిత సమ్యక బోధా॥ 1 ॥
తదపి సాప సఠ దైహఉఀ తోహీ । నీతి బిరోధ సోహాఇ న మోహీ ॥
జౌఀ నహిఀ దండ కరౌఀ ఖల తోరా । భ్రష్ట హోఇ శ్రుతిమారగ మోరా ॥ 2 ॥
జే సఠ గుర సన ఇరిషా కరహీఀ । రౌరవ నరక కోటి జుగ పరహీఀ ॥
త్రిజగ జోని పుని ధరహిఀ సరీరా । అయుత జన్మ భరి పావహిఀ పీరా ॥ 3 ॥
బైఠ రహేసి అజగర ఇవ పాపీ । సర్ప హోహి ఖల మల మతి బ్యాపీ ॥
మహా బిటప కోటర మహుఀ జాఈ । రహు అధమాధమ అధగతి పాఈ ॥ 4 ॥

మందిరము లోపలనుండి ఒక అదృశ్యవాణి ఇట్లు పలికెను. "ఓరీ! దౌర్భాగ్యుడా! మూర్ఖుడా! దురభిమానీ! నీ గురువు మిక్కిలి దయామయుడు గావున నిన్ను కోపగింపలేదు. ఆయన పరిపూర్ణ జ్ఞాని. ఐనను శఠుడా! నేను నిన్ను శపించెదను. నీతి బాహ్యమైనపని నాకు రుచింపదు. దుష్టుడా! నిన్ను దండింపనిచో వైదికనిష్ఠానియమములను ఉల్లంఘించినట్లు అగును. గురువునెడ ఈర్ష్యాళువైనమూర్ఖుడు కోట్లకొలదియుగములవఱకు రౌరవనరకయాతనలకు గుఱియగును. తరువాత పశుపక్ష్యాది యోనులలో జన్మించును. వేలకొలది జన్మలలో దుఃఖములననుభవించును. ఓరీ! పాపీ! నీవు గురువుగారిముందు కొండచిలువవలె కూర్చొని యుంటివి. నీ బుద్ధి పాప పంకిలమైనది. కావున నీవు సర్పమునై, నీచాతినీచముగా అధోగతిపాలై, పెద్ద చెట్టుతొఱ్ఱలో పడియుండెదవు.

(చౌ॥ 1-4)

దో- హాహాకార కీన్హ గుర, దారున సుని సివ సాప ।
కంపిత మోహి బిలోకి అతి, ఉర ఉపజా పరితాప ॥ 107(క) ॥
కరి దండవత సప్రేమ ద్విజ, సివ సన్ముఖ కర జోరి ।
బినయ కరత గదగద స్వర, సముఝి ఘోర గతి మోరి ॥ 107(ఖ) ॥

భయంకరమైన ఆ శివునిశాపమును విని, గురువుగారు 'హాహా కారము' చేసెను. వణకుచున్న నన్ను చూచి, అతని హృదయములో దుఃఖము ఉప్పొంగెను. నా విహ్వలస్థితిని గమనించి, ఆ బ్రాహ్మణుడు శివునకు భక్తితో దండప్రణామములను ఆచరించి అంజలి ఘటించి, గద్గద కంఠముతో స్తుతింప సాగెను. (దో॥ 107, క,ఖ)

## పరమేశ్వరస్తవము

ఛం-నమామీశమీశాన నిర్వాణరూపం । విభుం వ్యాపకం బ్రహ్మ వేదస్వరూపం ॥
నిజం నిర్గుణం నిర్వికల్పం నిరీహం । చిదాకాశమాకాశవాసం భజేఽహం ॥ 1 ॥
నిరాకారమోంకారమూలం తురీయం । గిరా గ్యాన గోతీతమీశం గిరీశం ॥
కరాలం మహాకాల కాలం కృపాలం । గుణాగార సంసారపారం నతోఽహం ॥ 2 ॥

తుషారాద్రి సంకాశ గౌరం గభీరం । మనోభూత కోటి ప్రభా శ్రీ శరీరం ॥
స్ఫురన్మౌలి కల్లోలినీ చారు గంగా । లసద్భాలబాలేందు కంఠే భుజంగా ॥ 3 ॥
చలత్కుండలం భ్రూ సునేత్రం విశాలం । ప్రసన్నాననం నీలకంఠం దయాలం ॥
మృగాధీశచర్మాంబరం ముండమాలం । ప్రియం శంకరం సర్వనాథం భజామి ॥ 4 ॥
ప్రచండం ప్రకృష్టం ప్రగల్భం పరేశం । అఖండం అజం భానుకోటిప్రకాశం ॥
త్రయఃశూల నిర్మూలనం శూలపాణిం । భజేఽహం భవానీపతిం భావగమ్యం ॥ 5 ॥
కలాతీత కల్యాణ కల్పాంతకారీ । సదా సజ్జనానందదాతా పురారీ ॥
చిదానందసందోహ మోహాపహారీ । ప్రసీద ప్రసీద ప్రభో మన్మథారీ ॥ 6 ॥
న యావద్ ఉమానాథ పాదారవిందం । భజంతీహ లోకే పరే వా నరాణాం ॥
న తావత్సుఖం శాంతి సంతాపనాశం । ప్రసీద ప్రభో సర్వభూతాధివాసం ॥ 7 ॥
న జానామి యోగం జపం నైవ పూజాం । నతోఽహం సదా సర్వదా శంభు తుభ్యం ॥
జరా జన్మ దుఃఖౌఘ తాతప్యమానం । ప్రభో పాహి ఆపన్నమామీశ శంభో॥ 8 ॥

ఓ మోక్ష స్వరూపా! ఓ విభూ! సర్వవ్యాపకా! బ్రహ్మస్వరూపా! వేదమూర్తీ! ఈశాన్య దిశాధీశా! పరమేశ్వరా! నీకు నమస్కారములు. నీవు స్వస్వరూపస్థితుడవు. (మాయాతీతుడవు.) నిర్గుణుడవు. నిర్వికల్పుడవు. ఇచ్ఛారహితుడవు. చిదాకాశరూపుడవు. (చిత్తము ఆకాశమువలె స్వచ్ఛము నిర్మలము, ఉదారగుణసంపన్నము, విశాలము ఐన వాడవు.) ఆకాశమే వస్త్రముగాగలవాడవు (దిగంబరుడవు) ఐన నిన్ను భజించెదను. (1) నిరాకారుడవు. ఓంకారమునకు నిలయమైనవాడవు. తురీయుడవు. (సర్వదా సమాధినిష్ఠలోనుండువాడవు) వాక్కునకును, ఇంద్రియములకును, జ్ఞానమునకును అగోచరుడవు, కైలాసపతివి, భయంకరుడవు, మహామృత్యుంజయుడవు, కృపాళుడవు గుణనిధివి. సంసారమునకు అతీతుడవు. పరమేశ్వరా! నీకు నా ప్రణామములు. (2) హిమాలయమువలె తెల్లనికాంతిగలవాడవు. గంభీరుడవు. కోటిమన్మథశోభలతో విలసిల్లువాడవు. నీ శిరమున జటాజూటము, సుందరతరంగములతో గంగానదియు విరాజిల్లుచున్నవి. లలాటమున చంద్రకళ, కంఠమున సర్పములు శోభిల్లుచున్నవి. (3) చలించుకుండలములు, సుందరమైనభ్రుకుటి, విశాలములైన నేత్రములు, మనోజ్ఞములైయున్నవి. ప్రసన్నముఖముతో, నీలగళముతో ఒప్పెడి నీవు దయామయుడవు. వ్యాఘ్రచర్మమును, కపాలమాలికలను ధరించియున్నవాడవు. అందరికివి ప్రియమైనవాడవు. అట్టి నీకు ప్రణమిల్లుచున్నాను. (4) శ్రేష్ఠుడవు, తేజస్విని, పరమేశ్వరుడవు, అఖండుడవు, జన్మరహితుడవు, ప్రచండుడవు, కోటిసూర్యప్రభాభాసితుడవు, తాపత్రయనివారకుడవు, త్రిశూలధారివి, భావగమ్యుడవు, భవానీపతివి. అట్టి సర్వ శుభంకరా! శంకరా! నీకు నమస్కారములు. (5) సకలకళాపూర్ణుడవు, కల్యాణస్వరూపుడవు, కల్పాంతమొనర్చు వాడవు, సజ్జనులకు ఆనందప్రదాతవు. త్రిపురారివి, చిదానందరాశివి, మోహనాశకుడవు. కామారివి, ప్రభూ! ప్రసన్నుడవుగమ్ము. (6) ఓ ఉమాపతీ! నీ చరణ కమలములను భజింపనివారికి ఇహ పరలోకములయందు సుఖశాంతులు ఉండవు. వారి సంతాపములు తొలగి పోవు. సర్వప్రాణిహృదయములయందుండువాడవు. ప్రభూ! ప్రసన్నుడవు గమ్ము. (7) నేను యోగము, జపము, పూజలు ఎఱుగను. శంభో! సర్వదా నీకు ప్రణమిల్లెదను. జరామరణ దుఃఖములతో తపించుచు శరణుజొచ్చినవాడనైన నన్ను ఈ దుఃఖములనుండి రక్షింపుము. ఈశ్వరా! శంభో! నీకు ప్రణామములు. (8)

(ధం)

శ్లో॥ రుద్రాష్టకమిదం ప్రోక్తం విప్రేణ హరతోషయే।
యే పఠంతి నరా భక్త్యా తేషాం శంభుః ప్రసీదతి ॥ 1 ॥

శంకరుడు ప్రసన్నుడగుటకై ఈ రుద్రాష్టకము ద్వారా ఆ బ్రాహ్మణుడు ఆ పరమేశ్వరుని స్తుతించెను. భక్తితో దీనిని పఠించుమానవులను పరమశివుడు అనుగ్రహించును. (శ్లో॥ 9)

దో- సుని బినతీ సర్బగ్య సివ, దేఖి బిప్ర అనురాగు।
పుని మందిర నభబానీ, భఇ ద్విజబర బర మాగు ॥ 108(క) ॥
జౌఁ ప్రసన్న ప్రభు మో పర, నాథ దీన పర నేహు।
నిజ పద భగతి దేఇ ప్రభు, పుని దూసర బర దేహు ॥ 108(ఖ) ॥
తవ మాయా బస జీవ జడ, సంతత ఫిరఇ భులాన।
తెహి పర క్రోధ న కరిఅ ప్రభు, కృపా సింధు భగవాన ॥ 108(గ) ॥
సంకర దీనదయాల అబ, ఏహి పర హోహు కృపాల।
సాప అనుగ్రహ హోఇ జెహిఁ, నాథ థోరేహిఁ కాల ॥ 108(ఘ) ॥

సర్వజ్ఞుడైన శివుడు ఈ స్తుతిని విని, బ్రాహ్మణునిభక్తివిశ్వాసములను గ్రహించెను. అపుడు మందిరముననుండి అశరీరవాణి "ఓ ద్విజశ్రేష్ఠా వరమును కోరుకొనుము." అని పలికెను. బ్రాహ్మణుడు పలికెను. "ఓ ప్రభూ! నా యెడ మీరు ప్రసన్నులైనచో ఈ దీనునిపై కృప యుంచి, మొదట మీ చరణములపై భక్తిని ప్రసాదింపుడు. పిమ్మట రెండవవరమును అనుగ్రహింపుడు. ప్రభూ! ఈ జడప్రాణి మీమాయకు వశుడై నిత్యము నిరంతరము అజ్ఞానముతో తిరుగు చుండును. కృపాసాగరా! ఇతనిపై కోపింపకుడు. ఓ దీనదయాళూ! శంకరా! ఈతనిని కనికరించి, శాప విముక్తి త్వరగా కలుగునట్లు అనుగ్రహింపుడు. (దో॥ 108. క,ఖ,గ,ఘ)

చౌ- ఏహి కర హోఇ పరమ కల్యానా। సోఇ కరహు అబ కృపానిధానా॥
బిప్రగిరా సుని పరహిత సానీ। ఏవమస్తు ఇతి భఇ నభబానీ ॥ 1 ॥
జదపి కీన్హ ఏహిఁ దారున పాపా। మైఁ పుని దీన్హి కోప కరి సాపా॥
తదపి తుమ్హారి సాధుతా దేఖీ। కరిహఉఁ ఏహి పర కృపా బిసేషీ ॥ 2 ॥
ఛమాసీల జే పర ఉపకారీ। తే ద్విజ మోహి ప్రియ జథా ఖరారీ॥
మోర శ్రాప ద్విజ బ్యర్థ న జాఇహి। జన్మ సహస అవస్య యహ పాఇహి ॥ 3 ॥
జనమత మరత దుసహ దుఖ హోఈ। ఏహి స్వల్పఉ నహిఁ బ్యాపిహి సోఈ॥
కవనెఉఁ జన్మ మిటిహి నహిఁ గ్యానా। సునహి సూద్ర మమ బచన ప్రవానా ॥ 4 ॥

రఘుపతి పురీఁ జన్మ తవ భయఊ । పుని తైఁ మమ సేవాఁ మన దయఊ ॥
పురీ ప్రభావ అనుగ్రహ మోరేఁ । రామ భగతి ఉపజిహి ఉర తోరేఁ ॥ 5 ॥
సును మమ బచన సత్య అబ భాఈ । హరితోషన బ్రత ద్విజ సేవకాఈ ॥
అబ జని కరహి బిప్ర అపమానా । జానేసు సంత అనంత సమానా ॥ 6 ॥
ఇంద్ర కులిస మమ సూల బిసాలా । కాలదండ హరి చక్ర కరాలా ॥
జో ఇన్హ కర మారా నహిఁ మరఈ । బిప్రద్రోహ పావక సో జరఈ ॥ 7 ॥
అస బిబేక రాఖేహు మన మాహీఁ । తుమ్హ కహఁ జగ దుర్లభ కఛు నాహీఁ ॥
ఔరఉ ఏక ఆసిషా మోరీ । అప్రతిహత గతి హోఇహి తోరీ ॥ 8 ॥

ఓ కృపానిధీ! ఇతనికి హితమును గూర్చుడు 'పరహితార్థపూర్ణములైన బ్రాహ్మణవచనములను విని, ఆ అదృశ్యవాణి 'అట్లే కానిమ్ము' అనెను. "ఇతని ఘోరపాపములను జూచి, (ఇతనికి) తగిన శాపము నిచ్చితివి. కాని నీ సాధుత్వమును, సరళవచనములను గమనించి, ఓ బ్రాహ్మణుడా! క్షమాశీలుడు, పరోపకారియునైన వానిపై, ఖరారియైన శ్రీరామునివలె నేను కృపను ప్రసరింపజేసెదను. నాశాపము వ్యర్థముగాదు. ఇతనికి వేయి జన్మలు తప్పవు. కాని జనన మరణ దుఃఖములు ఇతనిని బాధింపవు. ఏ జన్మలోనూ ఇతనిజ్ఞానము లుప్తముగాబోదు" అని పిదప ఆ అదృశ్యవాణి నాతో (భుశుండితో) ఇట్లనెను. "ఓ శూద్రా! వినుము. ఇప్పటి నీజన్మ రఘునాథుని (అయోధ్యా) నగరముననే జనది. పైగా నీ మనస్సును నా సేవయందే నిమగ్నమొనర్చితివి. నగరప్రభావమునను, నా అనుగ్రహమువలనను నీ హృదయమున రామభక్తి ఉదయించును. నా వచనములు సత్యములు. వత్సా! బ్రాహ్మణ సేవయే శ్రీహరిని సంతృప్తిపఱచు వ్రతము. ఇంక ఎప్పుడును, ఏ విధముగను బ్రాహ్మణులను నిరాదరింపవలదు. సజ్జనుడు అనంతుడైన భగవంతునివంటివాడని ఎఱుంగుము. ఇంద్రునివజ్రాయుధముతోను, నాత్రిశూలముతోను, కాలునిదండముతోను, శ్రీహరికరాళచక్రముతోను మృతిచెందనివాడు విప్రద్రోహమనెడి అగ్నిలో మాడి మసియగును. ఈ వివేకమును మనస్సునందుంచుకొనుము. ప్రపంచములో నీకు దుర్లభమైనదేదియు ఉండదు. మఱియొక వరమునిచ్చుచున్నాను. నా ఆశీః ప్రభావమున నీ వెక్కడికైనను అప్రతిహతముగా సంచరింపవచ్చును. (చౌ॥ 1-8)

దో- సుని సివ బచన హరషి గుర, ఏవమస్తు ఇతి భాషి ।
మోహి ప్రబోధి గయఉ గృహ, సంభు చరన ఉర రాఖి ॥ 109(క) ॥
ప్రేరిత కాల బింధి గిరి, జాఇ భయఉఁ మైఁ బ్యాల ।
పుని ప్రయాస బిను సో తను, తజేఉఁ గఏఁ కఛు కాల ॥ 109(ఖ) ॥
జోఇ తను ధరఉఁ తజఉఁ పుని, అనాయాస హరిజాన ।
జిమి నూతన పట పహిరఇ, నర పరిహరఇ పురాన ॥ 109(గ) ॥
సివఁ రాఖీ శ్రుతి నీతి అరు, మైఁ నహిఁ పావా క్లేస ।
ఏహి బిధి ధరేఉఁ బిబిధి తను, గ్యాన న గయఉ ఖగేస ॥ 109(ఘ) ॥

పరమశివునివచనములను విని, గురువు ప్రసన్నచిత్తుడై "అట్లేయగును" అని పలికి, నాకు నచ్చజెప్పెను. తదనంతరము అతడు శివునిచరణములను స్మరించుచు తనఇంటికి వెళ్లెను. విధి ప్రేరితుడనై నేను వింధ్యాచలమున సర్పమునైతిని. కాని కొలదికాలముతరువాత అనాయసముగనే ఆ శరీరమును త్యజించితిని. ఓ హరివాహనా! ఖగరాజా! మనుజుడు ప్రాతవస్త్రమును వదలి, నూతనవస్త్రమును ధరించునట్లు నేను ఆయాజన్మలశరీరములనన్నింటిని అనాయాసముగా అవలీలగా త్యజించితిని. ఈ విధముగా శివుడు వేదమర్యాదలను నిలిపెను. నాకు క్లేశములుగూడ ఎదురుకాలేదు. ఓ పక్షిరాజా! నానాయోనులలో జన్మించి, వివిధ శరీరములను ధరించినను దైవానుగ్రహమున నా జ్ఞానము లుప్తము కాలేదు. (దో॥ 109. క,ఖ,గ,ఘ)

చౌ- త్రిజగ దేవ నర జోఇ తను ధరఉఀ । తహఀ తహఀ రామ భజన అనుసరఉఀ ॥
ఏక సూల మోహి బిసర న కాఊ । గుర కర కోమల సీల సుభాఊ ॥ 1 ॥
చరమ దేహ ద్విజ కై మైఀ పాఈ । సుర దుర్లభ పురాన శ్రుతి గాఈ ॥
ఖేలఉఀ తహూఀ బాలకన్హ మీలా । కరఉఀ సకల రఘునాయక లీలా ॥ 2 ॥
ప్రౌఢ భఏఀ మోహి పితా పఢావా । సమఝఉఀ సునఉఀ గునఉఀ నహిఀ భావా ॥
మన తే సకల బాసనా భాగీ । కేవల రామ చరన లయ లాగీ ॥ 3 ॥
కహు ఖగేస అస కవన అభాగీ । ఖరీ సేవ సురధేనుహి త్యాగీ ॥
ప్రేమ మగన మోహి కఛు న సోహాఈ । హారేఉ పితా పఢాఇ పఢాఈ ॥ 4 ॥
భఏ కాలబస జబ పితు మాతా । మైఀ బన గయఉఀ భజన జనత్రాతా ॥
జహఀ జహఀ బిపిన మునీస్వర పావఉఀ । ఆశ్రమ జాఇ జాఇ సిరు నావఉఀ ॥ 5 ॥
బూఝఉఀ తిన్హహి రామ గున గాహా । కహహిఀ సునఉఀ హరషిత ఖగనాహా ॥
సునత ఫిరఉఀ హరి గున అనుబాదా । అబ్యాహత గతి సంభు ప్రసాదా ॥ 6 ॥
ఛూటీ త్రిబిధి ఈషనా గాఢీ । ఏక లాలసా ఉర అతి బాఢీ ॥
రామ చరన బారిజ జబ దేఖౌఀ । తబ నిజ జన్మ సఫల కరి లేఖౌఀ ॥ 7 ॥
జెహి పూఀఛఉఀ సోఇ ముని అస కహఈ । ఈస్వర సర్బ భూతమయ అహఈ ॥
నిర్గున మత నహిఀ మోహి సోహాఈ । సగున బ్రహ్మ రతి ఉర అధికాఈ ॥ 8 ॥

దేవతల, మనుష్యుల, జన్మలనెత్తినను, పశువుగా, పక్షిగా జన్మించినను, శ్రీరాముని భజనను మాత్రము వీడలేదు. కాని ఒక్క విషయముమాత్రము నన్ను సర్వదా బాధించుచునేయుండెను. గురువు గారి కోమల, సుశీల స్వభావమును నేను ఎప్పుడును మఱువలేదు. వేదపురాణములలో పేర్కొనబడినట్లు దేవతలకును లభ్యముగాని బ్రాహ్మణశరీరమును నేను చివరిజన్మలో పొందితిని. ఆ ద్విజదేహమున శ్రీరామునివిశిష్ట లీలలనన్నింటిని స్మరించుచు తోడి బాలకులతో కలిసియాడుచుంటిని. నా విద్యావయస్సునకనుగుణముగా లౌకికవిద్యలలో నన్ను మా పితృపాదులు ప్రవేశపెట్టిరి. నేను వాటిని ఎంతగావిన్నను, ఆలోచించినను, అర్థము చేసికొనుటకు ప్రయత్నించినను

అవిద్యలు నాకు రుచింపలేదు. నా మనస్సునుండి సాంసారిక వాసనలు దూరమైనవి. కేవలము శ్రీరాముని చరణసేవలయందే నా మనస్సులగ్నమైనది. వైనతేయా! నీవే తెల్పుము. కామధేనువును త్యజించి, గాడిదను సేవించు దౌర్భాగ్యుడెవ్వడైనను ఉండునా? శ్రీరాముని ప్రేమలో మునిగిన నాకు ఏదియును రుచింపలేదు. తండ్రి గారు నన్ను చదివించి అలసిపోయిరి. నా తల్లిదండ్రులు గతించిన పిమ్మట నేను భక్తరక్షకుడైన శ్రీరామునిభజించుటకు వనమునకు వెళ్లితిని. అచ్చట ప్రతిమునీశ్వరుని ఆశ్రమమును దర్శించి, వినమ్రుడనై వారికి నమస్కరించితిని. గరుడుడా! వారినుండి శ్రీరామునిగుణగాథలను వినుచు ఆనందించుచుంటిని. ఈ విధముగా నేను సర్వదా శ్రీహరి గుణగణములను వినుచు ఆ వనమునందంతటను శివానుగ్రహముచే నిరాటంకముగా తిరిగితిని. ఈషణ త్రయములు నానుండి పాఱిపోయినవి. నా హృదయములో ఒకే ఒక కోరిక ప్రబలమాయెను. శ్రీరామచంద్రుని చరణకమలములను జూచి, నా జన్మను సార్థకము చేసికొనదలచితిని. నేను ఏ మునీశ్వరుని అడిగినను, "ఈశ్వరుడు సర్వభూతమయుడు" అని తెల్పిరి. కాని నాకీనిర్గుణోపాసన నచ్చలేదు. నా హృదయమున సగుణబ్రహ్మపై ప్రీతి అధికమాయెను. (1-8)

దో- గుర కే బచన సురతి కరి, రామ చరన మను లాగ ।
రఘుపతి జస గావత ఫిరఉఁ, ఛన ఛన నవ అనురాగ ॥ 110(క) ॥
మేరు సిఖర బట ఛాయాఁ, ముని లోమస ఆసీన ।
దేఖి చరన సిరు నాయఉఁ, బచన కహేఉఁ అతి దీన ॥ 110(ఖ) ॥
సుని మమ బచన బినీత మృదు, ముని కృపాల ఖగరాజ ।
మొహి సాదర పూఁఛత భఏ, ద్విజ ఆయహు కెహి కాజ ॥ 110(గ) ॥
తబ మైఁ కహా కృపానిధి, తుమ్హ సర్బగ్య సుజాన ।
సగున బ్రహ్మ అవరాధన, మోహి కహహు భగవాన ॥ 110(ఘ) ॥

గురువుగారివచనములను స్మరించుటచే నామనస్సు శ్రీరామునిచరణములయందు లగ్నమాయెను. అనుక్షణము నేను ప్రవృద్ధమానభక్తినిరతితో శ్రీ రఘునాథునియశమును కీర్తించుచు సంచరించుచుంటిని. క్రమ క్రమముగా నాలో శ్రీరామునిపై భక్తి ప్రగాఢమగుచుండెను. సుమేరు పర్వతశిఖరమున ఒక వటవృక్షచ్ఛాయలో కూర్చొనియున్న 'లోమశ'మునిని గాంచి, అతని పాదములకు ప్రణమిల్లి, సవినయముగా దీనుడనై ప్రార్థించితిని. ఓ ఖగరాజా! నా వినమ్రకోమలవచనములను విని, దయాళువైన ఆ ముని నావచనములకు సంబరపడి పల్కెను. "ఓ బ్రాహ్మణోత్తమా! మీరేపనిపై ఇచ్చటికేతెంచితిరి?" నేను సమాధానమును ఇచ్చితిని. "ఓ దయానిధీ! మీరు సర్వజ్ఞులు, సజ్జనులు. నాకుసగుణబ్రహ్మోపాసనప్రక్రియను తెల్పుడు. (దో॥ 110. క,ఖ,గ,ఘ)

చౌ- తబ మునీస రఘుపతి గున గాథా । కహే కఛుక సాదర ఖగనాథా ॥
బ్రహ్మగ్యాన రత ముని బిగ్యానీ । మోహి పరమ అధికారీ జానీ ॥ 1 ॥
లాగే కరన బ్రహ్మ ఉపదేసా । అజ అద్వైత అగున హృదయేసా ॥
అకల అనీహ అనామ అరూపా । అనుభవ గమ్య అఖండ అనూపా ॥ 2 ॥

మన గోతీత అమల అబినాసీ । నిర్బికార నిరవధి సుఖ రాసీ ॥
సో తైఁ తాహి తోహి నహిఁ భేదా । బారి బీచి ఇవ గావహిఁ బేదా ॥ 3 ॥
బిబిధి భాఁతి మొహి ముని సముఝావా । నిర్గున మత మమ హృదయఁ న ఆవా ॥
పుని మైఁ కహేఉఁ నాఇ పద సీసా । సగున ఉపాసన కహహు మునీసా ॥ 4 ॥
రామ భగతి జల మమ మన మీనా । కిమి బిలగాఇ మునీస ప్రబీనా ॥
సోఇ ఉపదేస కహహు కరి దాయా । నిజ నయనన్హి దేఖౌఁ రఘురాయా ॥ 5 ॥
భరి లోచన బిలోకి అవధేసా । తబ సునిహఉఁ నిర్గున ఉపదేసా ॥
ముని పుని కహి హరికథా అనూపా । ఖండి సగున మత అగున నిరూపా ॥ 6 ॥
తబ మైఁ నిర్గున మత కర దూరీ । సగున నిరూపఉఁ కరి హఠ భూరీ ॥
ఉత్తర ప్రతిఉత్తర మైఁ కీన్హా । ముని తన భఏ క్రోధ కే చీన్హా ॥ 7 ॥
సును ప్రభు బహుత అవగ్యా కిఏఁ । ఉపజ క్రోధ గ్యానిన్హ కే హిఏఁ ॥
అతి సంఘరషన జౌఁ కర కోఈ । అనల ప్రగట చందన తే హోఈ ॥ 8 ॥

ఓ ఖగరాజా! అప్పుడా మునీశ్వరుడు శ్రీ రఘునాథుని గుణవైభవములనుగూర్చి సాదరముగా కొన్ని కథలను దెలిపెను. బ్రహ్మ జ్ఞానతత్పరుడు, బ్రహ్మజ్ఞానములో లీనమైనవాడును ఐన అతడు నన్ను అర్హునిగా గుర్తించి, బ్రహ్మోపదేశమును చేయసాగెను. "పరబ్రహ్మ జన్మరహితుడు, అద్వితీయుడు, నిర్గుణుడు, అందఱి హృదయములలోనుండువాడు, అకలస్వరూపుడు, (పెఱుగుట, తఱుగుట లేనివాడు) ఇచ్ఛారహితుడు, నామరూపరహితుడు, అనుభవైకవేద్యుడు, అఖండుడు, నిరుపమానుడు, మనస్సునకును ఇంద్రియములకును అతీతుడు, నిర్మలుడు, నాశరహితుడు, నిర్వికారుడు, నిరవధికుడు, సుఖనిధానుడు, నీటికిని నీటిఅలలకును భేదము లేనట్లు అతనికిని నీకును భేదము లేదు. అతడే నీవు, (తత్ త్వమసి) అని వేదములు పేర్కొనుచున్నవి" అని యిట్లు 'లోమశ' మహాముని నాకనేకవిధముల బోధించెను. కాని నిర్గుణ బ్రహ్మయందు నా మనస్సు నిలువలేదు. మునిచరణములకు ప్రణమిల్లి, నేను పలికితిని. "మునీశ్వరా! నాకు సగుణబ్రహ్మోపాసనముగూర్చి తెల్పుడు. ఏలనన శ్రీరామభక్తియనెడి జలములో నా మనస్సు చేపవలెనున్నది. ప్రాజ్ఞుడవైన ఓ మునీశ్వరా! ఇట్టిదశలో అది యెట్లు వేఱుకాగలదు? కావున దయతో శ్రీ రఘునాథునిదర్శించుమార్గమును ఉపదేశింపుడు. మొదట అయోధ్యాపతియైన శ్రీ రఘువరుని కన్నులార చూచి, తరువాత నిర్గుణబ్రహ్మనుగూర్చిన ఉపదేశమును విందును." నేనిట్లు పలుకగా ఆ మహాముని మఱల నిరుపమానములైన శ్రీహరి కథలను వినిపించి, సగుణమార్గమును ఖండించి, నిర్గుణమార్గమును ప్రతిపాదించెను. అప్పుడు నేను నిర్గుణ మార్గమును త్రోసిపుచ్చి, పట్టుదలతో సగుణమార్గమును ప్రతిపాదింప బూనితిని. నేను ఉత్తరప్రత్యుత్తరములను ఈయసాగితిని. అప్పుడు మునియందు క్రోధచిహ్నములు పొడసూపెను. ప్రభూ! వినుడు. మిక్కిలి అవజ్ఞకు గుఱియైనప్పుడు జ్ఞానులహృదయములయందుగూడ కోపముఉత్పన్నమగును చందనపుచెక్కనుగూడ ఎక్కువ రాపిడిపెట్టినచో దాని నుండియు అగ్ని ఉత్పన్నమగును. (చౌ॥ 1-8)

దో- బారంబార సకోప ముని, కరఇ నిరూపన గ్యాన ।
మైఁ అపనేఁ మన బైఠ తబ, కరఉఁ బిబిధి అనుమాన ॥ 111(క) ॥

క్రోధ కి ద్వైత బుద్ధి బిను, ద్వైత కి బిను అగ్యాన।
మాయాబస పరిఛిన్న జడ, జీవ కి ఈస సమాన ॥ 111(ఖ) ॥

మునీశ్వరుడు మాటి మాటికిని క్రుద్ధుడగుచు జ్ఞాననిరూపణ చేయుచుండెను. నేను లోలోపల ఇట్లు తర్కించు కొనుచుంటిని "ద్వైత బుద్ధి లేనిదే కోపముండునా? అజ్ఞానము లేనిదే ద్వైతబుద్ధి యుండునా? మాయాధీనుడై భగవంతుని నుండి వేఱైనజడజీవుడు ఈశ్వరునితో సమానము కాగలడా? (దో. 111. క,ఖ)

చౌ- కబహుఁ కి దుఖ సబ కర హిత తాకేఁ। తెహి కి దరిద్ర పరస మని జాకేఁ ॥
పరద్రోహీ కి హోహిఁ నిసంకా। కామీ పుని కి రహహిఁ అకలంకా ॥ 1 ॥
బంస కి రహ ద్విజ అనహిత కీన్హేఁ। కర్మ కి హోహిఁ స్వరూపహి చీన్హేఁ ॥
కాహూ సుమతి కి ఖల సంగ జామీ। సుభ గతి పావ కి పరత్రియ గామీ ॥ 2 ॥
భవ కి పరహిఁ పరమాత్మా బిందక। సుఖీ కి హోహిఁ కబహుఁ హరినిందక ॥
రాజు కి రహఇ నీతి బిను జానేఁ। అఘ కి రహహిఁ హరిచరిత బఖానేఁ ॥ 3 ॥
పావన జస కి పున్య బిను హోఈ। బిను అఘ అజస కి పావఇ కోఈ ॥
లాభు కి కిఛు హరి భగతి సమానా। జెహి గావహిఁ శ్రుతి సంత పురానా ॥ 4 ॥
హాని కి జగ ఏహి సమ కిఛు భాఈ। భజిఅ న రామహి నర తను పాఈ ॥
అఘ కి పిసునతా సమ కఛు ఆనా। ధర్మ కి దయా సరిస హరిజానా ॥ 5 ॥
ఏహి బిధి అమితి జుగుతి మన గునఉఁ। ముని ఉపదేస న సాదర సునఉఁ ॥
పుని పుని సగున పచ్ఛ మైఁ రోపా। తబ ముని బోలెఉ బచన సకోపా ॥ 6 ॥
మూఢ పరమ సిఖ దేఉఁ న మానసి। ఉత్తర ప్రతిఉత్తర బహు ఆనసి ॥
సత్య బచన బిస్వాస న కరహీ। బాయస ఇవ సబహీ తే డరహీ ॥ 7 ॥
సఠ స్వపచ్ఛ తవ హృదయఁ బిసాలా। సపది హోహి పచ్ఛీ చండాలా ॥
లీన్హ శ్రాప మైఁ సీస చఢాఈ। నహిఁ కఛు భయ న దీనతా ఆఈ ॥ 8 ॥

ఇతరులమేలును కోరెడివానికి ఎన్నడైనను దుఃఖము కలుగునా? పరుసవేది కలిగియున్న వానిని దారిద్ర్యము బాధించునా? ఇతరులతో వైరమును పూనువాడు నిర్భయుడై యుండునా? కామియైన వాడు కళంక రహితుడగునా? బ్రాహ్మణుని బాధించిన వానివంశము నిలుచునా? తన (ఆత్మ) స్వరూపమును ఎఱిగినవాడు కర్మలయందు ఆసక్తుడైయుండునా? దుష్టులసాంగత్యము చేయుచున్నవానికి సుబుద్ధి కలుగునా? పరస్త్రీగమనము చేసినవానికి సద్గతి లభించునా? పరమాత్మతత్త్వమును ఎఱిగినవాడు జననమరణరూపచక్రములో పడునా? భగవంతుని నిందించెడువాడు సుఖపడునా? నీతితెలియకుండగనే రాజ్యము నిలుచునా? శ్రీహరి చరితమును గానము చేసినచో పాపములుండునా? పుణ్యకర్మలను చేయనిదే పవిత్రయశము ప్రాప్తమగునా? పాపము చేయనిదే అపయశము ప్రాప్తించునా? వేదములు, పురాణములు, సజ్జనులు గానము చేయు హరిభక్తిని మించిన లాభము

మఱియొకటి యుండునా? సోదరా! ప్రపంచములో మానవుడై జన్మించియు, శ్రీరామునిభజన చేయనిచో కలిగెడిహానితో సమానమైనది ఏదైననున్నదా? వాడీలు చెప్పుటకంటెను మఱియొక పాపమున్నదా? దయతో తుల్యమగు ధర్మము గలదా?" హరివాహనా! గరుడుడా! ఈ విధముగా నేను తర్కించుకొనుచు ముని యుపదేశములను సాదరముగా విననైతిని. నేను పదేపదే సగుణోపాసనపక్షమున వాదించుచుండగా మునీశ్వరుడు కుపితుడై పలికెను. "ఓరీ మూర్ఖుడా! నేను నీకు ఉత్తమోత్తమమైన ఉపదేశమును ఇచ్చుచున్నను నీవు దానిని విశ్వసింపక పిడివాదము చేయుచుంటివి. నా సత్యవచనములపై నీకు విశ్వాసముకుదురుకొనలేదు. కాకివలె అన్నింటి యందును సంశయాత్ముడవైయుంటివి. నీ అభిప్రాయము మీదనే నీకు ఎక్కువ పట్టుదల యున్నది. నీవు వెంటనే చండాలపక్షియైన 'కాకి'వి కమ్ము." నేను మునిశాపమును వినయముతో స్వీకరించితిని. దానివలన నాకు భయము గాని దైన్యముగాని కలుగలేదు. (చౌ॥ 1-8)

దో- తురత భయఉఁ మైఁ కాగ తబ, పుని ముని పద సిరు నాఇ ।
సుమిరి రామ రఘుబంస మని, హరషిత చలెఉఁ ఉడాఇ ॥ 112 (క) ॥
ఉమా జె రామ చరన రత, బిగత కామ మద క్రోధ ।
నిజ ప్రభుమయ దేఖహిఁ జగత, కెహి సన కరహిఁ బిరోధ ॥ 112 (ఖ) ॥

మునీశ్వరుని శాపప్రభావమున వెంటనే నేను కాకినైతిని. పిమ్మట ఆయనచరణములకు నమస్కరించి, రఘుకులశ్రేష్ఠుడైన శ్రీరాముని స్మరించుచు హర్షముతో ఎగిరి పోయితిని. (శివుడు పలుకుచున్నాడు) ఉమా! శ్రీరాముని చరణములయందు అనురక్తులును, కామము, అభిమానము, క్రోధము మున్నగువాటిని కలిగియుండని వారును, జగత్తంతయు రామ మయముగా చూచెదరు. మఱి వారికి ఎవరిపై ద్వేషముండును? (దో॥ 112. క,ఖ)

చౌ- సును ఖగేస నహిఁ కఛు రిషి దూషన । ఉర ప్రేరక రఘుబంస బిభూషన ॥
కృపాసింధు ముని మతి కరి భోరీ । లీన్హీ ప్రేమ పరిచ్ఛా మోరీ ॥ 1 ॥
మన బచ క్రమ మోహి నిజ జన జానా । ముని మతి పుని ఫేరీ భగవానా ॥
రిషి మమ మహత సీలతా దేఖీ । రామ చరన బిస్వాస బిసేషీ ॥ 2 ॥
అతి బిసమయ పుని పుని పఛితాఈ । సాదర ముని మోహి లీన్హ బొలాఈ ॥
మమ పరితోష బిబిధి బిధి కీన్హా । హరషిత రామమంత్ర తబ దీన్హా ॥ 3 ॥
బాలకరూప రామ కర ధ్యానా । కహెఉ మోహి ముని కృపానిధానా ॥
సుందర సుఖద మోహి అతి భావా । సో ప్రథమహిఁ మైఁ తుమ్హహి సునావా ॥ 4 ॥
ముని మోహి కఛుక కాల తహఁ రాఖా । రామచరితమానస తబ భాషా ॥
సాదర మోహి యహ కథా సునాఈ । పుని బోలే ముని గిరా సుహాఈ ॥ 5 ॥
రామచరిత సర గుప్త సుహావా । సంభు ప్రసాద తాత మైఁ పావా ॥
తోహి నిజ భగత రామ కర జానీ । తాతే మైఁ సబ కహెఉఁ బఖానీ ॥ 6 ॥

రామ భగతి జిన్హ కేఀ ఉర నాహీఀ । కబహుఀ న తాత కహిఅ తిన్హ పాహీఀ ॥
ముని మోహి బిబిధి భాఀతి సముఝావా । మైఀ సప్రేమ ముని పద సిరు నావా ॥ 7 ॥
నిజ కర కమల పరసి మమ సీసా । హరషిత ఆసిష దీన్హ మునీసా ॥
రామ భగతి అబిరల ఉర తోరేఀ । బసిహి సదా ప్రసాద అబ మోరేఀ ॥ 8 ॥

కాకభుశుండి పలికెను. "ఖగరాజా! గరుడుడా! వినుడు. శాపమిచ్చుటలో 'లోమశ' మహర్షి తప్పిదమేమియులేదు. రఘుకులభూషణుడైన శ్రీరాముడు అందరి హృదయములకును స్ఫూర్తి ప్రదాత. దయాసాగరుడైన శ్రీరాముడు మునిబుద్ధిని భ్రమింపజేసి, నా భక్తిని పరీక్షించెను. మనోవాక్కర్మలచే ప్రభువు నన్ను తనసేవకునిగా గుర్తించి, ముని బుద్ధిని మరల మార్చెను. ఋషి నా సహనమును, సౌశీల్యమును, శ్రీరాముని చరణములపై నాకు గల విశ్వాసమును గ్రహించెను. ముని అతి విస్మయముతో మాటి మాటికిని పశ్చాత్తాప పడెను. నన్ను ప్రేమాదరములతో పిలిచెను. నన్ను అనేకవిధముల సంతుష్టునిగా చేసి, ప్రసన్నచిత్తుడై నాకు తారక (రామ) మంత్రమును ఉపదేశించెను. దయానిధియైన ముని నాకు బాలస్వరూపుడైన శ్రీరామునిధ్యానవిధిని నేర్పెను. సుందరము, సుఖ ప్రదమూ అగు ఈ ధ్యానము నాకు మిక్కిలి రుచించెను. దానిని నేను నీకు ఇది వఱకే వినిపించితిని. ముని కొంతకాలము నన్ను అచటనే ఉండనిచ్చెను. పిదప 'రామ చరితమానసము'ను వర్ణించెను. సాదరముగా నాకు ఈ కథను వినిపించి, మరల మధుర వచనములను పలికెను. "నాయనా! రహస్యమైన సుందరమైన ఈ 'రామచరిత మానసము' అను సరోవరమును నేను శివుని అనుగ్రహముచే పొందితిని. నిన్ను నిజమైన శ్రీరామభక్తునిగా గుర్తించి, నీకు ఈ చరిత్రమును సవిస్తరముగా తెలిపితిని. హృదయమున రామ భక్తి కుదురుకొనని వానికి దీనిని ఎప్పుడును తెలుపరాదు." మునీశ్వరుడు నాకు పెక్కురీతుల అనేకవిషయములను బోధించెను. నేను భక్తిపూర్వకముగా ఆయునచరణములకు నమస్కరించితిని. తన చల్లని కరకమలములతో నాతలను నిమురుచు హర్షముతో మునీశ్వరుడు "నా కృపచే నీ హృదయమున సర్వదా రామభక్తి ప్రగాఢమగుచుండును." అని ఆశీర్వదించెను. (చౌ॥ 1-8)

దో- సదా రామ ప్రియ హోహు తుమ్హ, సుభ గున భవన అమాన ।
కామరూప ఇచ్ఛామరన, గ్యాన బిరాగ నిధాన ॥ 113(క) ॥
జేహిఀ ఆశ్రమ తుమ్హ బసబ పుని, సుమిరత శ్రీభగవంత ।
బ్యాపిహి తహఀ న అబిద్యా, జోజన ఏక ప్రజంత ॥ 113(ఖ) ॥

నీవు సర్వదా శ్రీరామునకు ప్రీతిపాత్రుడవగుదువు. శుభగుణములు నీలో కుదురుకొనును. నీవు కామరూపుడవు, మానరహితుడవు, జ్ఞానవైరాగ్యములకు నిధివి అయ్యెదవు. ఇచ్ఛా మృత్యువును కలిగియుండెదవు. భగవంతుని స్మరించుచు నీవు నివసించు ఆశ్రమమునకు ఒక యోజనము లోపల 'అవిద్య' అనగా మాయామోహప్రభావములు ఉండవు. (దో॥ 113. క,ఖ)

చౌ- కాల కర్మ గున దోష సుభాఊ । కఛు దుఖ తుమ్హహి న బ్యాపిహి కాఊ ॥
రామ రహస్య లలిత బిధి నానా । గుప్త ప్రగట ఇతిహాస పురానా ॥ 1 ॥

బిను శ్రమ తుమ్హ జానబ సబ సోఊ । నిత నవ నేహ రామ పద హోఊ ॥
జో ఇచ్ఛా కరిహహు మన మాహీం । హరి ప్రసాద కఛు దుర్లభ నాహీం ॥ 2 ॥
సుని ముని ఆసిష సును మతిధీరా । బ్రహ్మగిరా భఇ గగన గంభీరా ॥
ఏవమస్తు తవ బచ ముని గ్యానీ । యహ మమ భగత కర్మ మన బానీ ॥ 3 ॥
సుని నభగిరా హరష మోహి భయఊ । ప్రేమ మగన సబ సంసయ గయఊ ॥
కరి బినతీ ముని ఆయసు పాఈ । పద సరోజ పుని పుని సిరు నాఈ ॥ 4 ॥
హరష సహిత ఏహిం ఆశ్రమ ఆయఉం । ప్రభు ప్రసాద దుర్లభ బర పాయఉం ॥
ఇహాం బసత మోహి సును ఖగ ఈసా । బీతే కలప సాత అరు బీసా ॥ 5 ॥
కరఉం సదా రఘుపతి గున గానా । సాదర సునహిం బిహంగ సుజానా ॥
జబ జబ అవధపురీం రఘుబీరా । ధరహిం భగత హిత మనుజ సరీరా ॥ 6 ॥
తబ తబ జాఇ రామ పుర రహఊం । సిసులీలా బిలోకి సుఖ లహఊం ॥
పుని ఉర రాఖి రామ సిసురూపా । నిజ ఆశ్రమ ఆవఉం ఖగభూపా ॥ 7 ॥
కథా సకల మైం తుమ్హహి సునాఈ । కాగ దేహ జేహిం కారన పాఈ ॥
కహిఉం తాత సబ ప్రస్న తుమ్హారీ । రామ భగతి మహిమా అతి భారీ ॥ 8 ॥

కాల, కర్మ, గుణ, దోష, స్వభావ జనితములైన దుఃఖములు నిన్ను ఆవరింపవు. ఇతిహాస పురాణములలో రామరహస్యములు కొన్ని గుప్తములు మఱి కొన్ని ప్రకటితములు. అవియన్నియును ఎట్టి శ్రమలేకయే నీకు కరతలామలకములగును. శ్రీరామునిచరణములపై నీ అనురాగము నిత్యనూతనముగా ప్రవృద్ధమానమగుచుండును. నీవు మనస్సున కోరినవన్నియును శ్రీహరికృపచే సులభముగా లభ్యములగును." ఓవైనతేయా! గరుడా! వినుము. 'లోమశ' మహర్షి ఆశీర్వాదమును విని, ఆకాశమునుండి గంభీరమైన బ్రహ్మవాణి ఇట్లు వినబడెను. "ఓ జ్ఞానీ! మునీ! నీ వచనములు సత్యములగును. ఇతడు మనోవాక్కర్మలచే నా భక్తుడు." ఆకాశవాణిని విని నేను హర్షించి, రామునియెడ ప్రేమనుగ్నుడనైతిని. నా సందేహములు తొలగిపోయెను. తదనంతరము మునియాజ్ఞగైకొని, ఆతనిచరణకమలములకు పదే పదే ప్రణమిల్లి, హర్షోల్లాసములతో నేను ఈ ఆశ్రమమునకు వచ్చితిని. శ్రీరామునికృపచే నేను దుర్లభమైనవరమును పొందితిని. ఓ ఖగరాజా! నేను ఇచట ఇఱువది యేడు కల్పములనుండి నివసించుచుంటిని. శ్రీ రఘునాథుని గుణములను నిరంతరము గానముచేయుచుందును. జ్ఞానులైన పక్షులు ఆ గుణములను ప్రీతితో వినును. శ్రీ రఘువీరుడు భక్తులహితమునకై అయోధ్య యందు మానవావతారమును దాల్చినప్పుడు నేను ఆనగరమునకు వెళ్ళచునే యుందును. ప్రభుబాల్యలీలలను గాంచి సంతోషించెదను. ఖగరాజా! శ్రీరాముని బాలరూపమును హృదయమున నిలుపుకొని, తిరిగి నా ఆశ్రమమునకు వచ్చెదను. నేను కాకి రూపమును పొందిన కథనంతయును నీకు వినిపించితిని. నాయనా! నీ ప్రశ్నలన్నింటికి ప్రత్యుత్తరమిచ్చితిని. నిజముగా రామభక్తిమహిమ మహోన్నతమైనది. (చౌ॥ 1-8)

దో- తాతే యహ తన మోహి ప్రియ, భయఉ రామ పద నేహ ।
నిజ ప్రభు దరసన పాయఉఁ, గఏ సకల సందేహ ॥ 114(క) ॥

ఈ కాకి రూపముననే నాకు శ్రీరామునిచరణములపై భక్తి ఏర్పడెను. ఈ రూపముననే నాకు ప్రభుదర్శనము కలిగెను. నా సందేహములు అన్నియును దూరమాయెను. కావున ఈ రూపము నాకు అత్యంత ప్రియమైనది.
(దో॥ 114. క)

మాసపారాయణము - ఇరువది తొమ్మిదవ విరామము

## భక్తి మార్గ వైశిష్ట్యము

దో- భగతి పచ్ఛ హఠ కరి రహెఉఁ, దీన్హి మహారిషి సాప ।
ముని దుర్లభ బర పాయఉఁ, దేఖహు భజన ప్రతాప ॥ 114 (ఖ) ॥

పట్టుదలతో నేను భక్తిమార్గమును అనుసరించితిని. దానివలన 'లోమశ' మహర్షి నన్ను శపించెను. కాని కడకు మునీశ్వరులకును దుర్లభమైన వరమును నేను పొందితిని. దైవభజన మహిమ అట్టిది.
(దో॥ 114. ఖ)

చౌ- జే అసి భగతి జాని పరిహరహీఁ । కేవల గ్యాన హేతు శ్రమ కరహీఁ ॥
తే జడ కామధేను గృహఁ త్యాగీ । ఖోజత ఆకు ఫిరహిఁ పయ లాగీ ॥ 1 ॥
సును ఖగేస హరి భగతి బిహాఈ । జే సుఖ చాహహిఁ ఆన ఉపాఈ ॥
తే సఠ మహాసింధు బిను తరనీ । పైరి పార చాహహిఁ జడ కరనీ ॥ 2 ॥
సుని భుసుండి కే బచన భవానీ । బోలెఉ గరుడ హరషి మృదు బానీ ॥
తవ ప్రసాద ప్రభు మమ ఉర మాహీఁ । సంసయ సోక మోహ భ్రమ నాహీఁ ॥ 3 ॥
సునెఉఁ పునీత రామ గున గ్రామా । తుమ్హరీ కృపాఁ లహెఉఁ బిశ్రామా ॥
ఏక బాత ప్రభు పూఁఛఉఁ తోహీ । కహహు బుఝాఇ కృపానిధి మోహీ ॥ 4 ॥
కహహిఁ సంత ముని బేద పురానా । నహిఁ కఛు దుర్లభ గ్యాన సమానా ॥
సోఇ ముని తుమ్హ సన కహెఉ గోసాఈఁ । నహిఁ ఆదరెహు భగతి కీ నాఈఁ ॥ 5 ॥
గ్యానహి భగతిహి అంతర కేతా । సకల కహహు ప్రభు కృపా నికేతా ॥
సుని ఉరగారి బచన సుఖ మానా । సాదర బోలెఉ కాగ సుజానా ॥ 6 ॥
భగతిహి గ్యానహి నహిఁ కఛు భేదా । ఉభయ హరహిఁ భవ సంభవ ఖేదా ॥
నాథ మునీస కహహిఁ కఛు అంతర । సావధాన సోఉ సును బిహంగబర ॥ 7 ॥
గ్యాన బిరాగ జోగ బిగ్యానా । ఏ సబ పురుష సునహు హరిజానా ॥
పురుష ప్రతాప ప్రబల సబ భాఁతీ । అబలా అబల సహజ జడ జాతీ ॥ 8 ॥

ఇట్టి భక్తిమహిమను ఎఱింగియు, దానిని విస్మరించి, కేవలము జ్ఞానమునకై శ్రమలతో సాధన చేయువారు తమఇంటిలోని కామధేనువును కాదని, పాలకై జిల్లేడుచెట్టును వెదకుచు తిరుగు వారగుదురు. ఖగరాజా! హరిభక్తిని వీడి, ఇతరోపాయములచే సుఖములను పొందగోరు జనులు మూర్ఖులు. ఆ జడులు ఓడ లేకుండగనే మహాసముద్రమును దాటబూనువారు ( శివుడు పలుకుచున్నాడు) ఓ భవానీ! కాకభుశుండివచనములను విని, గరుత్మంతుడు ప్రసన్నచిత్తుడై మృదుమధురముగా కాకభుశుండితో ఇట్లు పలికెను. "ఓ ప్రభూ! మీ కృపవలన శ్రీరాముని పవిత్ర గుణములను వింటిని, శాంతిని పొందితిని. నా మనస్సున సందేహము, శోకము, మోహము భ్రమలు ఏ మాత్రమూ లేవు. ప్రభూ! మిమ్ము ఒకమాట అడిగెదను. దయానిధీ! నాకు విశదీకరింపుడు. జ్ఞానముతో సమానముగా దుర్లభమైనది ఏదియును లేదని, సజ్జనులు, మునులు, వేద పురాణములు తెల్పుట సువిదితము ఆ జ్ఞానమునే మీకు మునీశ్వరుడు విశదీకరించి యుండెను. కాని మీరు భక్తిమార్గమును వలె దానిని ఆదరింపలేదు. ఓ ప్రభూ! కృపానిధీ! జ్ఞానభక్తిమార్గముల భేదమేమి? ఇది యంతయు నాకు వివరింపుడు." ఖగరాజువచనములను విని, జ్ఞానియైన కాకభుశుండి సంతోషించి, సాదరముగా పలికెను. "భక్తి జ్ఞానములలో భేదమేమియు లేదు. ఈ రెండును సాంసారిక దుఃఖములను బాపును. కాని మునీశ్వరులు ఈ రెండింటి మధ్య కొంత భేదమున్నట్లు పేర్కొందురు. ఖగశ్రేష్ఠా! సావధానముగా వినుము. జ్ఞానము, యోగము, వైరాగ్యము, విజ్ఞానము- ఇవి యన్నియును పురుషవర్గమునకు చెందినవి. పురుషుని యందు ప్రతాపము ప్రబలమై యుండును. 'మాయ' స్త్రీ వర్గమునకు జెందినది. ఆమె స్వభావతః అబల. జన్మతః జడము (ప్రకృతి స్వరూపిణి). (చౌ॥ 1-8)

దో- పురుష త్యాగి సక నారిహి, జో బిరక్త మతి ధీర ।
న తు కామీ బిషయాబస, బిముఖ జో పద రఘుబీర ॥ 115 (క) ॥

కాని వైరాగ్యవంతుడు, ధీరబుద్ధియుఐన పురుషుడే స్త్రీఆకర్షణలకులోనుగాడు. విషయలంపటుడు, కాముకుడు, రఘువీరునకు విముఖుడు స్త్రీకి అధీనుడై యుండును. (దో॥ 115. క)

సో- సొఉ ముని గ్యాననిధాన, మృగనయనీ బిధు ముఖ నిరఖి ।
బిబస హోఇ హరిజాన, నారి బిష్ను మాయా ప్రగట ॥ 115 (ఖ) ॥

అట్లే జ్ఞానఘనులైన మునులుగూడ 'మృగనయన'యు చంద్రముఖియు ఐన స్త్రీని చూచి, ఆమెకు అధీనులయ్యెదరు. గరుడుడా! విష్ణుభగవానునిమాయయే సాక్షాత్తు స్త్రీరూపమున ప్రకటితమగును. (సో॥ 115. ఖ)

చౌ- ఇహాఁ న పచ్ఛపాత కఛు రాఖఉఁ । బేద పురాన సంత మత భాషఉఁ ॥
మోహ న నారి నారి కేఁ రూపా । పన్నగారి యహ రీతి అనూపా ॥ 1 ॥
మాయా భగతి సునహు తుమ్హ దోఊ । నారి బర్గ జానఇ సబ కోఊ ॥
పుని రఘుబీరహి భగతి పిఆరీ । మాయా ఖలు నర్తకీ బిచారీ ॥ 2 ॥
భగతిహి సానుకూల రఘురాయా । తాతే తెహి డరపతి అతి మాయా ॥
రామ భగతి నిరుపమ నిరుపాధీ । బసఇ జాసు ఉర సదా అబాధీ ॥ 3 ॥

తేహి బిలోకి మాయా సకుచాఈ । కరి న సకఇ కఛు నిజ ప్రభుతాఈ ॥
అస బిచారి జే ముని బిగ్యానీ । జాచహిఀ భగతి సకల సుఖ ఖానీ ॥ 4 ॥

నేను పక్షపాతవైఖరితో చెప్పుటలేదు. వేదపురాణములు, సజ్జనులు నుడివిన ప్రామాణిక సిద్ధాంతమునే తెల్పుచున్నాను. ఒక స్త్రీ మఱియొక స్త్రీ రూపమును జూచి మోహము చెందదు. ఇది విలక్షణమైన రీతి. మాయ, భక్తి ఈరెండును స్త్రీ వర్గమునకు చెందినవనుట సుప్రసిద్ధము. శ్రీ రఘువీరునకు ప్రియమైనది భక్తి. మాయ కేవలము నర్తకిమాత్రమే. శ్రీరాముడు విశేషముగా భక్తిని ఆదరించును. కావున మాయ ఆయనకు భయపడును. నిరుపమ, నిరుపాధికమైన రామభక్తిని హృదయములో నింపుకొనినవానిని జూచి, మాయ భయపడును. అతనిపై మాయ తన ప్రభావమును చూపజాలదు. ఇట్లు యోచించియే విజ్ఞానులైన మునులు సమస్తసుఖములకు ఖనియైన భక్తిమార్గమునకే మొగ్గు చూపుదురు. (చౌ॥ 1-4)

దో- యహ రహస్య రఘునాథ కర, బేగి న జానఇ కోఇ ।
జో జానఇ రఘుపతి కృపాఀ, సపనెహుఀ మోహ న హోఇ ॥ 116(క) ॥
ఔరఉ గ్యాన భగతి కర, భేద సునహు సుప్రబీన ।
జో సుని హోఇ రామ పద, ప్రీతి సదా అబిఛీన ॥ 116(ఖ) ॥

ఈ రామభక్తిరహస్యమును ఎవ్వరును త్వరగా గ్రహింపజాలరు. శ్రీ రఘునాథుని కృపచే ఈ రహస్యవిషయమును తెలిసికొనినవానిని కలలోగూడ మోహము తాకజాలదు. ధీరమతీ! గరుడుడా! జ్ఞానభక్తి మార్గములమధ్య మఱియొకరహస్యమున్నది. దానిని వినుటవలన శ్రీరామునిచరణములయందు అవిచ్ఛిన్నమైన (అఖండమైన) భక్తి జనించును. (దో॥ 116. క,ఖ)

చౌ- సునహు తాత యహ అకథ కహానీ । సముఝత బనఇ న జాఇ బఖానీ ॥
ఈస్వర అంస జీవ అబినాసీ । చేతన అమల సహజ సుఖ రాసీ ॥ 1 ॥
సో మాయాబస భయఉ గోసాఈఀ । బంధ్యో కీర మరకట కీ నాఈఀ ॥
జడ చేతనహి గ్రంథి పరి గఈ । జదపి మృషా ఛూటత కఠినఈ ॥ 2 ॥
తబ తే జీవ భయఉ సంసారీ । ఛూట న గ్రంథి న హోఇ సుఖారీ ॥
శ్రుతి పురాన బహు కహేఉ ఉపాఈ । ఛూట న అధిక అధిక అరుఝాఈ ॥ 3 ॥
జీవ హృదయఀ తమ మోహ బిసేషీ । గ్రంథి ఛూట కిమి పరఇ న దేఖీ ॥
అస సంజోగ ఈస జబ కరఈ । తబహుఀ కదాచిత సో నిరుఅరఈ ॥ 4 ॥
సాత్త్విక శ్రద్ధా ధేను సుహాఈ । జౌఀ హరి కృపాఀ హృదయఀ బస ఆఈ ॥
జప తప బ్రత జమ నియమ అపారా । జే శ్రుతి కహ సుభ ధర్మ అచారా ॥ 5 ॥
తేఇ తృన హరిత చరై జబ గాఈ । భావ బచ్ఛ సిసు పాఇ పేన్హాఈ ॥
నోఇ నిబృత్తి పాత్ర బిస్వాసా । నిర్మల మన అహీర నిజ దాసా ॥ 6 ॥

పరమ ధర్మమయ పయ దుహి భాఈ । అవటై అనల అకామ బనాఈ ॥
తోష మరుత తబ ఛమా( జుడావై । ధృతి సమ జావను దేఇ జమావై ॥ 7 ॥
ముదితా( మథై బిచార మథానీ । దమ అధార రజు సత్య సుబానీ ॥
తబ మథి కాఢి లేఇ నవనీతా । బిమల బిరాగ సుభగ సుపునీతా ॥ 8 ॥

నాయనా! ఈ అకథనీయకథను వినుము. ఇది అనుభవైకవేద్యము. వర్ణించుటకు అలవి గానిది. జీవుడు ఈశ్వరుని అంశయే. కావున అతడు శాశ్వతుడు, చేతనుడు, నిర్మలుడు, స్వభావత: సుఖనిధానము. స్వామీ! అట్టి జీవుడు మాయావశుడై, చిలుకవలె, కోతివలె తనకుతానై బంధములలో చిక్కుపడుచుండును. ఈ విధముగా జడచేతనములు ముడివడియున్నవి. ఆ ముడి అసత్యమేయైనను దానినుండి బయటపడి ముక్తిని పొందుట మిక్కిలికష్టము. ఆకారణమున జీవుడు జననమరణచక్రములో చిక్కుపడును. ఆ ముడి వీడువడు. అతనికి సుఖము అబ్బదు. ఈ విషయమున వేదపురాణములు పెక్కు ఉపాయములను సూచించినవి. కాని ఆ ముడినుండి విముక్తిలభింపదు. పైగా అది ఇంకను గట్టిపడును. జీవునిహృదయములో మోహమనెడి అజ్ఞానాంధకారము దట్టముగా అలముకొనియుండును. దానివలన ముడి కనబడదు. ఇక ఆముడి ఎట్లు విడివడును. మునుముందు చెప్పబడురీతిగా ఈశ్వరానుగ్రహమున పరిస్థితులు అనుకూలించినచో ఆ ముడి ఎప్పుడో ఒకప్పుడు వీడి పోవును. భగవత్కృపచే సాత్త్వికశ్రద్ధయనెడి అందమైన ఆవు హృదయమనెడి ఇంటిలో నివసించినచో, అది వేదోక్తమైన జపతపోవ్రతయమనియమాదికల్యాణప్రదమైన ధర్మాచరణమను పచ్చనిగడ్డిని మేసినప్పుడు ఆస్తికభావములనెడి దూడలను పొంది, దానిపొదుగునుండి పాలు రాసాగును. నివృత్తి మార్గము (విషయవాసనా ప్రపంచమునుండి ముక్తి) ఆవు వెనుక కాళ్లకు కట్టుత్రాడు. విశ్వాసమే దోహన పాత్ర. నిర్మలమైనమనస్సే పాలను పితికెడిదానుడు(దోగ్ధ). సోదరా! ఈ విధముగా పరమధర్మమయక్షీరములను పిదికి, వాటిని నిష్కామభావమనెడి 'మంటపై' బాగుగా కాగబెట్టవలెను. క్షమాసంతోషములనెడి వాయువులు ఆపాలను చల్లార్చును. ధైర్యము, శమము వాటిని పెరుగుగా జేయును. తత్త్వవిచారమనెడి కవ్వమునకు దమమనెడిస్తంభమును ఆలంబనముగా జేసి, ప్రసన్నత్వమనెడికుండలో ఆ కవ్వమును చేర్చి, సత్యము, మధురవచనములనెడి త్రాడును ఆ కవ్వమునకు చుట్టవలెను. పిదప ఆ త్రాడు సహాయమున కవ్వముతో ఆ పెరుగును మధింపవలెను. అపుడు దానినుండి వైరాగ్యమనెడి శుద్ధమనోహర పవిత్రమైన వెన్న వచ్చును. (చౌ॥ 1-8)

దో- జోగ అగిని కరి ప్రగట తబ, కర్మ సుభాసుభ లాఇ ।
బుద్ధి సిరావై గ్యాన ఘృత, మమతా మల జరి జాఇ ॥ 117(క) ॥
తబ బిగ్యానరూపినీ, బుద్ధి బిసద ఘృత పాఇ ।
చిత్త దిఆ భరి ధరై దృఢ, సమతా దిఅటి బనాఇ ॥ 117(ఖ) ॥
తీని అవస్థా తీని గున, తెహి కపాస తే( కాఢి ।
తూల తురీయ సం(వారి పుని, బాతీ కరై సుగాఢి ॥ 117(గ) ॥

అప్పుడు యోగాగ్ని (మనస్సును భగవంతుని యందు లయమొనర్చుట) యందు శుభాశుభ కర్మలనెడి ఇంధనములతో ఆ వెన్నను కాచవలెను. మమతయనెడి మురికి మాడిపోయి, జ్ఞానమనెడి నెయ్యిమిగులును. అప్పుడు నిశ్చలబుద్ధితో దానిని చల్లార్చ వలెను. విజ్ఞానరూపమైన బుద్ధి స్వచ్ఛమైన ఆ సద్యోఘృతమును పొంది, చిత్తమను

ప్రమిదలో నింపవలెను. సమతయును సెమ్మెను సిద్ధపరచి, దానిపై ఈ ప్రమిదెను స్థిరముగా నుంచవలెను. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలును, సత్త్వరజస్తమోగుణములును అనెడి ప్రత్తినుండి తురీయావస్థ యనెడి శుభ్రమైన దూదిని తీసి, దానితో చక్కనివత్తిని సిద్ధపఱచ వలెను. దానిని (ఆ వత్తిని) జ్ఞానమనెడి నేతిలో తడుపవలెను.

(దో॥ 117. క,ఖ,గ)

సో-ఏహి బిధి లేసై దీప, తేజ రాసి బిగ్యానమయ।
జాతహిఀ జాసు సమీప, జరహిఀ మదాదిక సలభ సబ ॥ 117(ఘ) ॥

ఈ విధముగా తత్త్వజ్ఞానమనెడి తేజోమయమైనదీపమును వెలిగింపవలెను. దానిని సమీపింపగనే మదము మొదలగు అరిషడ్వర్గములనెడి శలభము(దీపపు పురుగు)లు మసియై పోవును. (సో॥ 117. ఘ)

చౌ- సోహమస్మి ఇతి బృత్తి అఖండా । దీప సిఖా సోఇ పరమ ప్రచండా ॥
ఆతమ అనుభవ సుఖ సుప్రకాసా । తబ భవ మూల భేద భ్రమ నాసా ॥ 1 ॥
ప్రబల అబిద్యా కర పరివారా । మోహ ఆది తమ మిటఇ అపారా ॥
తబ సోఇ బుద్ధి పాఇ ఉఀజిఆరా । ఉర గృహఀ బైఠి గ్రంథి నిరుఆరా ॥ 2 ॥
ఛోరన గ్రంథి పావ జౌఀ సోఈ । తబ యహ జీవ కృతారథ హోఈ ॥
ఛోరత గ్రంథి జాని ఖగరాయా । బిఘ్న అనేక కరఇ తబ మాయా ॥ 3 ॥
రిద్ధి సిద్ధి ప్రేరఇ బహు భాఈ । బుద్ధిహి లోభ దిఖావహిఀ ఆఈ ॥
కల బల ఛల కరి జాహిఀ సమీపా । అంచల బాత బుఝావహిఀ దీపా ॥ 4 ॥
హోఇ బుద్ధి జౌఀ పరమ సయానీ । తిన్హ తన చితవ న అనహిత జానీ ॥
జౌఀ తెహి బిఘ్న బుద్ధి నహిఀ బాధీ । తౌ బహోరి సుర కరహిఀ ఉపాధీ ॥ 5 ॥
ఇంద్రీఀ ద్వార ఝరోఖా నానా । తహఀ తహఀ సుర బైఠే కరి థానా ॥
ఆవత దేఖహిఀ బిషయ బయారీ । తే హఠి దేహిఀ కపాట ఉఘారీ ॥ 6 ॥
జబ సో ప్రభంజన ఉర గృహఀ జాఈ । తబహిఀ దీప బిగ్యాన బుఝాఈ ॥
గ్రంథి న ఛూటి మిటా సో ప్రకాసా । బుద్ధి బికల భఇ బిషయ బతాసా ॥ 7 ॥
ఇంద్రిన్హ సురన్హ న గ్యాన సోహాఈ । బిషయ భోగ పర ప్రీతి సదాఈ ॥
బిషయ సమీర బుద్ధి కృత భోరీ । తెహి బిధి దీప కో బార బహోరీ ॥ 8 ॥

"సోహమస్మి" ( పరబ్రహ్మమే నేను) ఇది అఖండమైన జ్యోతి. అదియే జ్ఞానదీపముయొక్క ప్రచండదీపశిఖ. ఆత్మజ్ఞానమనెడి సుఖప్రదమైన సముజ్జ్వలప్రకాశము వ్యాపించినప్పుడు సంసార బంధములకు మూలకారణమైన భేదరూపభ్రమలు తొలగిపోవును. అవిద్య యొక్క ప్రబల పరివారమైన మోహము మొదలగు తమస్సులు పటాపంచలగును. అప్పుడు ఆ విజ్ఞాన రూపమగు బుద్ధి ఆత్మానుభవ ప్రకాశమును పొంది, హృదయమనెడి ఇంటిలో

కూర్చొని. జడచేతనగ్రంధిని విప్పివేయును. ఈ విజ్ఞాన రూపమగు బుద్ధి ఈ జడచేతన గ్రంధిని విప్పగలిగినచో ఆ జీవుడు కృతార్థుడగును. కాని ఖగరాజా! గరుడుడా! ఆ ముడి విడిపోవుచున్నట్లు తెలియగనే మాయ మరల అనేక విఘ్నములను కల్పించును. అది బుద్ధి సిద్ధులనెడి పెక్కు అంతరాయములను పంపును. అవి వచ్చి బుద్ధిని ప్రలోభపెట్టును. అవి కళలు, బలము, మోసములు అనెడి రూపములతో సమీపించి, తమ కొంగుగాలితో జ్ఞానరూపశిఖను ఆర్పివేయును. ఒకవేళ బుద్ధి వికసించినచో ఇవియు తనకు హానిని గూర్చునవియని తెలిసికొని, వాటివైపే చూడదు. ఇట్లు మాయ కల్గించు విఘ్నములచే బుద్ధిబాధింపబడనిచో దేవతలు విఘ్నములను సృష్టించెదరు. హృదయమనెడి గృహమునకు ఇంద్రియములనెడి వాతాయనములు (కిటికీలు) కలవు. అట్టి ప్రతిగవాక్షము(కిటికీ)పై దేవతలు కూర్చుందురు. విషయములనెడి వాయువులు వచ్చుటను గమనింపగానే వారు ఆ కిటికీలను పట్టుబట్టి తెఱచెదరు. హృదయమనెడి ఇంటిలోనికి ఆ పెనుగాలులు ప్రవేశింపగనే విజ్ఞాన దీపము ఆఱిపోవును. ముడి విడిపోదు సరిగదా! ఆత్మానుభవ ప్రకాశముగూడ ఆఱిపోవును. విషయపవనములచే బుద్ధి వికలమైపోవును. చేసినసాధనయంతయు వమ్మైపోవును. ఏలనన ఇంద్రియములకును, వాటిఅధిష్ఠానదేవతలకును జ్ఞానము రుచింపదు. వారికి విషయభోగముల యందే సర్వదా ఆసక్తి మెండు. బుద్ధియు విషయభోగములచే కొట్టబడినచో జ్ఞానదీపము మరల ఏ విధముగా ప్రజ్వరిల్లును? (చౌ॥ 1-8)

దో- తబ ఫిరి జీవ బిబిధి బిధి, పావఇ సంసృతి క్లేస।
హరి మాయా అతి దుస్తర, తరి న జాఇ బిహగేస ॥ 118(క) ॥
కహత కఠిన సముఝత కఠిన, సాధత కఠిన బిబేక।
హోఇ ఘునాచ్ఛర న్యాయ జౌం, పుని ప్రత్యూహ అనేక ॥ 118(ఖ) ॥

జ్ఞానదీపము ఆఱిపోవుటవలన జీవుడు మరల వివిధములైన జననమరణపరంపరలలో క్లేశములపాలగును. ఖగరాజా! హరిమాయను తప్పించుకొనుట మిక్కిలి కష్టము. దానిని దాటుట అసాధ్యము ఈ వివేకమును(జ్ఞానమును) గ్రహించుట, వ్యక్త పఱచుట, సాధన చేయుటగూడ కష్టము. ఘుణాక్షరన్యాయమున అట్టి జ్ఞానముప్రాప్తించినను దానిని రక్షించుకొనుటలో అనేక కష్టములున్నవి. (దో॥ 118. క,ఖ)

చౌ- గ్యాన పంథ కృపాన కై ధారా। పరత ఖగేస హోఇ నహిం బారా ॥
జో నిర్బిఘ్న పంథ నిర్బహఈ। సో కైవల్య పరమ పద లహఈ ॥ 1 ॥
అతి దుర్లభ కైవల్య పరమ పద। సంత పురాన నిగమ ఆగమ బద ॥
రామ భజత సోఇ ముకుతి గోసాఈం। అనఇచ్ఛిత ఆవఇ బరిఆఈం ॥ 2 ॥
జిమి థల బిను జల రహి న సకాఈ। కోటి భాంతి కోఉ కరై ఉపాఈ ॥
తథా మోచ్ఛ సుఖ సును ఖగరాఈ। రహి న సకఇ హరి భగతి బిహాఈ ॥ 3 ॥
అస బిచారి హరి భగత సయానే। ముక్తి నిరాదర భగతి లుభానే ॥
భగతి కరత బిను జతన ప్రయాసా। సంసృతి మూల అబిద్యా నాసా ॥ 4 ॥
భోజన కరిఅ తృపితి హిత లాగీ। జిమి సో అసన పచవై జఠరాగీ ॥
అసి హరిభగతి సుగమ సుఖదాఈ। కో అస మూఢ న జాహి సోహాఈ ॥ 5 ॥

జ్ఞానమార్గము అసిధారావ్రతముతో సమానము. ఓఖగేశా! ఈ మార్గమునందలి సాధకులదీక్ష ఎప్పుడైనను సడలవచ్చును. ఈ మార్గమును నిర్విఘ్నముగా అనుసరించువారే అతిదుర్లభమైన పరమపదమును చేరుదురు. కైవల్యమును పొందుట అత్యంతక్లిష్ట కార్యమని సజ్జనులు, వేద శాస్త్ర పురాణములు, ప్రాజ్ఞులు నుడివెదరు. కాని ఓ మహాత్మా! దుర్లభమైన ఆ ముక్తియే రాముని భజించుటవలన కోరకున్నను లభించును. ఆధారము లేనిదే ఆధేయము నిలువదు. ఎన్ని ఉపాయములు పన్నినను, నేల లేనిదే నీరు నిలువదు. అట్లే భగవద్భక్తి లేనిదే మోక్షసుఖము స్థిరముగానుండదు. ఈ విషయమును గ్రహించి, దక్షులైన హరిభక్తులు భక్తిమార్గమునే కోరుకొనుచు, ముక్తిపై ధ్యాసను ఉంచరు. ఎట్టి యత్నమూ, శ్రమయు లేకుండగనే జననమరణ పరంపరకు కారణమైన అవిద్య భక్తితత్పరులనుండి దూరమగును. భోజనము చేసినచో కడుపు నిండును. సంతృప్తి కల్గును. ఆ భుజించినపదార్థము మనప్రయత్నము లేకుండగనే జఠరాగ్నిచే జీర్ణము కావింపబడును. అట్లే హరిభక్తి సంతృప్తి కలిగించును. అది సులభము, సుఖ ప్రదము. ఇది రుచింపని వాడు నిజముగా మూఢుడే. (చౌ॥ 1-5)

దో- సేవక సేబ్య భావ బిను, భవ న తరిఅ ఉరగారి ।
భజహు రామ పద పంకజ, అస సిద్ధాంత బిచారి ॥ 119 (క) ॥
జో చేతన కహఁ జడ కరఇ, జడహి కరఇ చైతన్య ।
అస సమర్థ రఘునాయకహి, భజహిఁ జీవ తే ధన్య ॥ 119 (ఖ) ॥

ఓ ఉరగారీ! గరుడుడా! 'నేను సేవకుడను, శ్రీరామచంద్రప్రభువు నాకు స్వామి' అను భావము లేనిదే సంసారసాగరమును దాటుట సంభవమేగాదు. ఈ సిద్ధాంతమును విశ్వసించి, శ్రీరామ చరణకమలములను భజింపుము. చేతనమును జడముగను, జడమును చేతనముగను జేయుటకు సమర్థుడైన రఘునాథుని భజించు వారలు ధన్యులు. (దో॥ 119. క,ఖ)

చౌ- కహెఉఁ గ్యాన సిద్ధాంత బుఝాఈ । సునహు భగతి మని కై ప్రభుతాఈ ॥
రామ భగతి చింతామని సుందర । బసఇ గరుడ జాకే ఉర అంతర ॥ 1 ॥
పరమ ప్రకాస రూప దిన రాతీ । నహిఁ కఛు చహిఅ దిఆ ఘృత బాతీ ॥
మోహ దరిద్ర నికట నహిఁ ఆవా । లోభ బాత నహిఁ తాహి బుఝావా ॥ 2 ॥
ప్రబల అబిద్యా తమ మిటి జాఈ। హారహిఁ సకల సలభ సముదాఈ ॥
ఖల కామాది నికట నహిఁ జాహీఁ । బసఇ భగతి జాకే ఉర మాహీఁ ॥ 3 ॥
గరల సుధాసమ అరి హిత హోఈ । తేహి మని బిను సుఖ పావ న కోఈ ॥
బ్యాపహిఁ మానస రోగ న భారీ । జిన్హ కే బస సబ జీవ దుఖారీ ॥ 4 ॥
రామ భగతి మని ఉర బస జాకేఁ । దుఖ లవలేస న సపనేహుఁ తాకేఁ ॥
చతుర సిరోమని తేఇ జగ మాహీఁ । జే మని లాగి సుజతన కరాహీఁ ॥ 5 ॥
సో మని జదపి ప్రగట జగ అహఈ । రామ కృపా బిను నహిఁ కోఉ లహఈ ॥
సుగమ ఉపాయ పాఇబే కేరే । నర హతభాగ్య దేహిఁ భటభేరే ॥ 6 ॥

పావన పర్బత బేద పురానా । రామ కథా రుచిరాకర నానా ॥
మర్మీ సజ్జన సుమతి కుదారీ । గ్యాన బిరాగ నయన ఉరగారీ ॥ 7 ॥
భావ సహిత ఖోజఇ జో ప్రానీ । పావ భగతి మని సబ సుఖ ఖానీ ॥
మోరేం మన ప్రభు అస బిస్వాసా । రామ తె అధిక రామ కర దాసా ॥ 8 ॥
రామ సింధు ఘన సజ్జన ధీరా । చందన తరు హరి సంత సమీరా ॥
సబ కర ఫల హరి భగతి సుహాఈ । సో బిను సంత న కాహూఁ పాఈ ॥ 9 ॥
అస బిచారి జోఇ కర సతసంగా । రామ భగతి తెహి సులభ బిహంగా ॥ 10 ॥

ఓ ఖగరాజా! నేను జ్ఞానమార్గసిద్ధాంతమును విశదీకరించితిని. ఇప్పుడు భక్తియనెడి మణి మహిమనుగూర్చి వినుము. రామభక్తి మహిమాన్వితమైన సుందరచింతామణి. దీనిని హృదయమున ధరించువాడు స్వయముగా అహర్నిశలు ప్రకాశమానుడగును. అతనికి నేయి, వత్తి, దీపము అవసరము లేదు. మోహమనెడి దారిద్ర్యము అతనిని సమీపింప జాలదు. ఏలనన ఈ చింతామణి స్వయంప్రకాశకము. లోభమనెడి వాయువు దానిని ఆర్పజాలదు. దానికాంతితో అవిద్యయనెడి గాఢాంధకారము పటాపంచలగును. మదాదిదీపపుపురుగుల సమూహము పరాజితమగును. భక్తి పరిపూర్ణహృదయునిచెంతకు కామక్రోధాదిదుష్టులు రానేరారు. అతనికి విషముగూడ అమృతమువంటిదేయగును, శత్రువు మిత్రుడగును. ఆ భక్తిమణిలేనిచో ఎవ్వడును సుఖశాంతులను పొందజాలడు. లోకమును పీడించునట్టి మానసజాడ్యములు శ్రీరామభక్తి యనెడి మణిని హృదయమున ధరించిన వానిని ఏమాత్రము పీడింపజాలవు. కలలోగూడ అతనిని దుఃఖములంటవు. ఈ మణికై ప్రయత్నించువారు ఉత్తమోత్తములు, దక్షులు. ఈ మణి జగత్తులో ప్రత్యక్షముగనే యున్నను శ్రీరాముని అనుగ్రహములేనిదే అది ఎవ్వరికిని లభ్యము గాదు. అది సులభముగా ప్రాప్తించునదియేయైనను భాగ్య హీనులు దానియెడ నిరాదరణమును చూపుచు క్లిష్ట మార్గములను అనుసరింతురు. వేదపురాణములు పవిత్రపర్వతములు. శ్రీరాముని వివిధ గాథలు ఆ పర్వతమునందలి అందచందాలగనులు. ఈ గనులమర్మములు సజ్జనులకే ఎఱుక. పదునైనబుద్ధి ఈగనిని త్రవ్వి ఆ మణిని వెలికిదీయు గునపము. గరుడుడా! జ్ఞాన వైరాగ్యములు ఆయన నేత్రములు. ప్రేమతో అన్వేషించు వారే సుఖనిధియైన ఆభక్తి మణిని పొందగలరు. ప్రభూ! శ్రీరామునికంటెను ఆయనభక్తులే గొప్పవారని నా విశ్వాసము. శ్రీరాముడు జలనిధియైనచో ధీరులైన సజ్జనులు జలదములు. శ్రీహరి చందనవృక్షమైనచో సజ్జనులు గంధవహులు (వాయువులు). అనన్యమైన హరిభక్తియే అన్నిసాధనలఫలము. సత్పురుషులసహకారము లేనిదే ఎవ్వరును దానిని పొందలేరు. గరుడుడా! ఇట్లు యోచన చేసి, సత్సాంగత్యము చేయువారికే శ్రీరామభక్తి సులభముగా లభించును.

(చౌ॥ 1-10)

దో- బ్రహ్మ పయోనిధి మందర, గ్యాన సంత సుర ఆహిం ।
కథా సుధా మథి కాఢహిం, భగతి మధురతా జాహిం ॥ 120(క) ॥
బిరతి చర్మ అసి గ్యాన మద, లోభ మోహ రిపు మారి ।
జయ పాఇఅ సో హరి భగతి, దేఖు ఖగేస బిచారి ॥ 120 (ఖ) ॥

బ్రహ్మ (వేదములు) ఒక సముద్రము. జ్ఞానమే ఒక మందరాచలము. సజ్జనులే దేవతలు. ఈ సముద్రమును మథించువారు రామకథ' యనెడి అమృతమును వెలికితీయగలరు. ఆ కథామృతములో భక్తిమాధుర్యము మిళితమై యుండును. వైరాగ్యమనుడాలుతో తనరక్షణ చేసి కొనుచు జ్ఞానమనెడి ఖడ్గముతో మదమోహాలోభాది శత్రువులను సంహరించి, విజయమును సాధించునది శ్రీహరిభక్తియే. ఖగరాజా! ఆలోచింపుము. (దో॥ 120. క,ఖ)

## సప్త ప్రశ్నలు - సమాధానములు

చౌ- పుని సప్రేమ బోలెఉ ఖగరాఊ । జౌఀ కృపాల మొహి ఊపర భాఊ ॥
నాథ మోహి నిజ సేవక జానీ । సప్త ప్రస్న మమ కహహు బఖానీ ॥ 1 ॥
ప్రథమహిఀ కహహు నాథ మతిధీరా । సబ తే దుర్లభ కవన సరీరా ॥
బడ దుఖ కవన కవన సుఖ భారీ । సోఉ సంఛేపహిఀ కహహు బిచారీ ॥ 2 ॥
సంత అసంత మరమ తుమ్హ జానహు । తిన్హ కర సహజ సుభావ బఖానహు ॥
కవన పున్య శ్రుతి బిదిత బిసాలా । కహహు కవన అఘ పరమ కరాలా ॥ 3 ॥
మానస రోగ కహహు సముఝాఈ । తుమ్హ సర్బగ్య కృపా అధికాఈ ॥
తాత సునహు సాదర అతి ప్రీతీ । మైఀ సంఛేప కహఉఀ యహ నీతీ ॥ 4 ॥
నర తన సమ నహిఀ కవనిఉ దేహీ । జీవ చరాచర జాచత తేహీ ॥
నరక స్వర్గ అపబర్గ నిసేనీ । గ్యాన బిరాగ భగతి సుభ దేనీ ॥ 5 ॥
సో తను ధరి హరి భజహిఀ న జే నర । హోహిఀ బిషయ రత మంద మంద తర ॥
కాఀచ కిరిచ బదలేఀ తే లేహీఀ । కర తే డారి పరస మని దేహీఀ ॥ 6 ॥
నహిఀ దరిద్ర సమ దుఖ జగ మాహీఀ । సంత మిలన సమ సుఖ జగ నాహీఀ ॥
పర ఉపకార బచన మన కాయా । సంత సహజ సుభాఉ ఖగరాయా ॥ 7 ॥
సంత సహహిఀ దుఖ పరహిత లాగీ । పరదుఖ హేతు అసంత అభాగీ ॥
భూర్జ తరూ సమ సంత కృపాలా । పరహిత నితి సహ బిపతి బిసాలా॥ 8 ॥
సన ఇవ ఖల పర బంధన కరఈ । ఖాల కఢాఇ బిపతి సహి మరఈ ॥
ఖల బిను స్వారథ పర అపకారీ । అహి మూషక ఇవ సును ఉరగారీ ॥ 9 ॥
పర సంపదా బినాసి నసాహీఀ । జిమి ససి హతి హిమ ఉపల బిలాహీఀ ॥
దుష్ట ఉదయ జగ ఆరతి హేతూ । జథా ప్రసిద్ధ అధమ గ్రహ కేతూ ॥ 10 ॥
సంత ఉదయ సంతత సుఖకారీ । బిస్వ సుఖద జిమి ఇందు తమారీ ॥
పరమ ధర్మ శ్రుతి బిదిత అహింసా । పర నిందా సమ అఘ న గరీసా ॥ 11 ॥

హర గుర నిందక దాదుర హోఈ । జన్మ సహస్ర పావ తన సోఈ ॥
ద్విజ నిందక బహు నరక భోగ కరి । జగ జనమఇ బాయస సరీర ధరి ॥ 12 ॥
సుర శ్రుతి నిందక జే అభిమానీ । రౌరవ నరక పరహిఁ తే ప్రానీ ॥
హోహిఁ ఉలూక సంత నిందా రత । మోహ నిసా ప్రియ గ్యాన భాను గత ॥ 13 ॥
సబ కై నిందా జే జడ కరహీఁ । తే చమగాదుర హోఇ అవతరహీఁ ॥
సునహు తాత అబ మానస రోగా । జిన్హ తే దుఖ పావహిఁ సబ లోగా ॥ 14 ॥
మోహ సకల బ్యాధిన్హ కర మూలా । తిన్హ తే పుని ఉపజహిఁ బహు సూలా ॥
కామ బాత కఫ లోభ అపారా । క్రోధ పిత్త నిత ఛాతీ జారా ॥ 15 ॥
ప్రీతి కరహిఁ జౌఁ తీనిఉ భాఈ । ఉపజఇ సన్యపాత దుఖదాఈ ॥
బిషయ మనోరథ దుర్గమ నానా । తే సబ సూల నామ కో జానా ॥ 16 ॥
మమతా దాదు కండు ఇరషాఈ । హరష బిషాద గరహ బహుతాఈ ॥
పర సుఖ దేఖి జరని సోఇ ఛఈ । కుష్ట దుష్టతా మన కుటిలఈ ॥ 17 ॥
అహంకార అతి దుఖద డమరుఆ । దంభ కపట మద మాన నెహరుఆ ॥
తృస్నా ఉదరబృద్ధి అతి భారీ । త్రిబిధి ఈషనా తరున తిజారీ ॥ 18 ॥
జుగ బిధి జ్వర మత్సర అబిబేకా । కహఁ లగి కహౌఁ కురోగ అనేకా ॥ 19 ॥

అనంతరము ఖగరాజైన గరుడుడు ప్రేమతో పలికెను. కృపాళూ! "మీకు నాపై ప్రేమయున్నచో ప్రభూ! నన్ను మీ సేవకునిగా భావించి, నా 'ఏడు ప్రశ్నలకు' సమాధానములను దయచేయుడు. (1) మిక్కిలి దుర్లభమైన జన్మఏది? (2) అన్నింటి కంటెను ఘోరమైన దుఃఖమేది? (3) అన్నింటి కంటెను గొప్ప సుఖమేది? (4) సజ్జనుల లక్షణములును, దుర్జనుల స్వభావములును ఎట్టివి? వాటి మధ్యగల భేదమేమి? (5) శ్రుతులలో పేర్కొనబడిన గొప్ప పుణ్యకార్యమేది? (6) భయంకరమైన పాపకార్యమేది? (7) మానసిక రోగము లెట్టివి? మీరు సర్వజ్ఞులు. నాపై అపారకృపాళువులు. ఈ విషయములను అన్నింటిని వివరింపుడు" కాకభుశుండి ఇట్లు పలికెను. "నాయనా! నేను సంక్షిప్తముగా తెలుపబోవుచుంటిని అత్యంతప్రేమాదరములతో ఆలకింపుము. (1) మానవ జన్మ దుర్లభమైనది. దీనితో సమానమైనజన్మ ఏదియును లేదు. చరాచర (జడ చేతన) ప్రాణులన్నియును ఈ జన్మను కోరుకొనును. ఈ మానవజన్మ నరకము, స్వర్గము మోక్షములకు సోపానము. ఇది మంగళకరములైన భక్తిజ్ఞానవైరాగ్యములను సిద్ధింపజేయునది. ఇట్టి జన్మ ప్రాప్తించినను శ్రీహరిని భజింపక తుచ్ఛములైన విషయభోగములలో మునిగియుండు మనుజులు చేతనున్నపరుసవేదిని పారవైచి, గాజుముక్కకై వెదకుమూఢులవంటివారు. (2) జగత్తులో దారిద్ర్యమునకు మించిన దుఃఖమే లేదు. (3) సత్సాంగత్యమునకు సమానమైన సుఖమేదియును లేదు. ఖగేశ్వరా! (4) మనోవాక్కాయములచే పరోపకారమొనర్చుటయే సజ్జనులకు సహజ స్వభావము. సజ్జనులు ఇతరులహితముకొఱకు ఎట్టి దుఃఖములనైనను సహింతురు. కాని భాగ్యహీనులైన దుర్జనులు ఇతరులను దుఃఖపెట్టుటకై తాము ఎట్టి శ్రమలనైనను ఓర్చుకొందురు. దయాళువులైన సత్పురుషులు భూర్జవృక్షములవలె ఇతరుల మేలుకొఱకు ఎంతటి కష్టములనైనను ఓర్చుకొందురు, అందులకై తమ చర్మమునొలిచి యైనను అపదలకు తట్టుకొని, తమ ప్రాణములను సైతము ఆహుతిగా జేసెదరు. కాని దుష్టులు జనుపనారవలె ఇతరులను బంధించెదరు. తమకు ఎట్టి ప్రయోజనమూ లేకున్నను నిష్కారణముగా పాములవలె, ఎలుకలరీతి ఇతరులకు హాని నూర్తురు.

వడగండ్లు పంటలను పాడు చేసి, తాము కరిగిపోవునట్లు దుష్టులు ఇతరుల సంపదలను నష్టపఱచి, తామును నశింతెదరు. అధమగ్రహముగా ప్రసిద్ధమైన కేతువు యొక్క ఉదయము వలె దుష్టులఅభివృద్ధి ప్రపంచమునకు దుఃఖహేతువు అగును. సూర్య చంద్రుల ఉదయము సమస్త విశ్వమునకు సుఖదాయకమైనట్లు సజ్జనుల అభ్యుదయము సమస్త మానవాళికిని సుఖప్రదము. (5) 'అహింసా పరమో ధర్మః' అనునది వేదప్రమాణ వచనము. (6) ఇతరులను నిందించుట వంటి మహా పాప కృత్యము మఱియొకటి లేదు. శంకరుని, తన గురువును నిందించిన వాడు కప్పగా వేయిజన్మల నెత్తును. బ్రాహ్మణనింద చేసినవాడు పెక్కునరకయాతనలను అనుభవించి, పిమ్మట కాకియై జన్మించును. దేవతలను, వేదములను నిందించునట్టి అహంకారియైన జీవుడు రౌరవ నరకములోబడి కొట్టుకొనుచుండును. సజ్జననిందానిరతులైనవారు గ్రుడ్లగూబలుగా జన్మింతురు. వాటికి అజ్ఞానరూపమైన రాత్రియే ప్రియమైనది. జ్ఞానరూపసూర్యోదయమును వారు చూడజాలరు. అందఱినీ నిందించుజడులు గబ్బిలములుగా జన్మింతురు. నాయనా! (7) ఇప్పుడు మానసిక రోగములనుగూర్చి వినుము. మోహమే సమస్త రోగములకును మూలము. దాని వలన మఱల అనేకబాధలు కలుగును. కామము వాత రోగము. అపారమైన లోభమే కఫవ్యాధి. క్రోధమే ఒక మహాపైత్య రోగము. అది సర్వదా హృదయమును దహించును. కామ క్రోధ లోభములు (కఫ, వాత, పిత్తములు) అనెడి ఈ ముగ్గురు సోదరులును ఒక చోట కూడియున్నచో దుఃఖప్రదమైన 'సన్నిపాత రోగము' ఉత్పన్నమగును. విషయ భోగములపైగల అంతులేని మక్కువయే వివిధ బాధలకును మూలము. వాటి పేర్లను పేర్కొనుట కష్టము. అవి అనంతములు. మమతయే తామరవ్యాధి. ఈర్ష్య అనునది గజ్జి. హర్ష విషాదములు కంఠమాల రోగములు. ఇతరుల సుఖములను జూచి అసూయపడుటయే క్షయరోగము. దౌష్ట్యము, మనఃకుటిలతలే కుష్ఠ వ్యాధి, అహంకారము అత్యంత బాధాకరమైన 'డమరు' (కీళ్లనొప్పుల)వ్యాధి. దంభము, కపటము, మదము, దురభిమానము నరముల రోగములు. తృష్ణయనునది జలోదరవ్యాధి- పుత్రులకును, ధనమునకును, కీర్తి ప్రతిష్ఠలకును (ఈషణత్రయమునకు) ఆరాటపడుటయే ప్రబలములైన ఉష్ణ (వరుసజ్వర)వ్యాధులు. మత్సరము, అవివేకము అనునవి రెండు విధములగు జ్వరములు. వాస్తవముగా ఇంకను అసంఖ్యాకములైన రోగములు గలవు. వాటికి అంతములేదు. (చౌ॥ 1-19)

దో- ఏక బ్యాధి బస నర మరహిం, ఏ అసాధి బహు బ్యాధి ॥
పీడహిం సంతత జీవ కహుం, సో కిమి లహై సమాధి ॥ 121 (క) ॥
నేమ ధర్మ ఆచార తప, గ్యాన జగ్య జప దాన ।
భేషజ పుని కోటిన్హ నహిం, రోగ జాహిం హరిజాన ॥ 121 (ఖ) ॥

ఏ ఒక్క రోగముతోనైనను మనుష్యుడు మరణించును. అసాధ్యములైన ఇన్ని రోగములు అతనిని నిరంతరము పట్టి పీడించునపుడు ఆ నిర్భాగ్యుడు పరమశాంతినెట్లు పొందును? నియమము, ధర్మము, ఉత్తమ కార్యాచరణము, తపము, జ్ఞానము, యజ్ఞము, జపము, దానము మున్నగు వాటి రూపములలో ఈ రోగములకు పెక్కు ఔషధములు గలవు. కాని ఖగరాజా! వీటితో ఆ రోగములు పూర్తిగా నయముగావు. (దో॥ 121. క,ఖ)

చౌ- ఏహి బిధి సకల జీవ జగ రోగీ । సోక హరష భయ ప్రీతి బియోగీ ॥
మానస రోగ కఛుక మైం గాఏ । హహిం సబ కేం లఖి బిరలేన్హ పాఏ ॥ 1 ॥
జానే తే ఛీజహిం కఛు పాపీ । నాస న పావహిం జన పరితాపీ ॥
బిషయ కుపథ్య పాఇ అంకురే । మునిహు హృదయం కా నర బాపురే ॥ 2 ॥

రామ కృపాఀ నాసహిఀ సబ రోగా । జౌఀ ఎహి భాఀతి బనై సంజోగా ॥
సదగుర బైద బచన బిస్వాసా । సంజము యహ న బిషయ కై ఆసా ॥ 3 ॥
రఘుపతి భగతి సజీవన మూరీ । అనూపాన శ్రద్ధా మతి పూరీ ॥
ఎహి బిధి భలెహిఀ సో రోగ నసాహీఀ । నాహిఀ త జతన కోటి నహిఀ జాహీఀ ॥ 4 ॥
జానిఅ తబ మన బిరుజ గోసాఀఈ । జబ ఉర బల బిరాగ అధికాఈ ॥
సుమతి ఛుధా బాఢఇ నిత నఈ । బిషయ ఆస దుర్బలతా గఈ ॥ 5 ॥
బిమల గ్యాన జల జబ సో నహాఈ । తబ రహ రామ భగతి ఉర ఛాఈ ॥
సివ అజ సుక సనకాదిక నారద । జే ముని బ్రహ్మ బిచార బిసారద ॥ 6 ॥
సబ కర మత ఖగనాయక ఏహా । కరిఅ రామ పద పంకజ నేహా ॥
శ్రుతి పురాన సబ గ్రంథ కహాహీఀ । రఘుపతి భగతి బినా సుఖ నాహీఀ ॥ 7 ॥
కమఠ పీఠ జామహిఀ బరు బారా । బంధ్యా సుత బరు కాహుహి మారా ॥
ఫూలహిఀ నభ బరు బహుబిధి ఫూలా । జీవ న లహ సుఖ హరి ప్రతికూలా ॥ 8 ॥
తృషా జాఇ బరు మృగజల పానా । బరు జామహిఀ సస సీస బిషానా ॥
అంధకారు బరు రబిహి నసావై । రామ బిముఖ న జీవ సుఖ పావై ॥ 9 ॥
హిమ తే అనల ప్రగట బరు హోఈ । బిముఖ రామ సుఖ పావ న కోఈ ॥ 10 ॥

ఈ విధముగా జీవులందఱును రోగ పీడితులే. వారందఱును శోకము, హర్షము, భయము, ప్రీతి, వియోగము మొదలగు ద్వంద్వములచే ఇంకను దుఃఖితులయ్యెదరు. నేను కొన్ని మానసిక రోగములనే వర్ణించితిని. ఈ రోగములందఱిని బాధించినను కొందఱు మాత్రమే వీటిని గుర్తింప గల్గుదురు. జీవులకు విశేషమైన తాపమును గల్గించు ఈ రోగములను గుర్తించినచో కొంత ఉపశమనము గలుగును. కాని పూర్తిగా అవి నశింపవు. విషయములనెడి అపథ్యములవలన మునులహృదయములలోగూడ అవి అంకురించును. ఇక సాధారణమానవులసంగతి చెప్పనేల? శ్రీరామునికృపచే ముందు పేర్కొనినట్లు సజ్జనులసంయోగము గల్గినచో అన్ని రోగములును ఉపశమించును. సద్గురువనెడి వైద్యునిపై విశ్వాసమును ఉంచవలెను. విషయవాంఛలుండరాదు. ఇదియే పథ్యము. శ్రీ రఘునాథునిపైగలభక్తి సంజీవనిమూలిక. శ్రద్ధతో గూడిన బుద్ధి అనుపానము. ఈ విధముగా ఆరోగములు నశించును. లేనిచో ఎన్ని ఉపాయములతోనైనను వాటిని నిర్మూలించుట అసాధ్యము. హృదయమున వైరాగ్యము అనెడి బలము పుంజుకొనినప్పుడు, ఉత్తమబుద్ధియనెడి ఆకలి నిరంతరము అధికమగుచున్నప్పుడు, విషయవాంఛలు దుర్బలమైనప్పుడు, మనస్సు రోగరహితమైనదని తెలిసి కొనవలెను. రోగరహితుడైన మానవుడు నిర్మల జ్ఞానమనెడి జలములలో స్నానము చేసినప్పుడు, అతనిహృదయములో శ్రీరామభక్తి పరిపూర్ణమగును. శ్రీరాముని పదకమలములయందు భక్తి కలిగియుండుటయే తరణోపాయమని శివుడు, బ్రహ్మ, శుకుడు, నారదుడు, సనకాది మునులు మొదలగు బ్రహ్మజ్ఞానులు అభిప్రాయపడుదురు. శ్రీ రఘునాథుని యందు భక్తి లేనిచో సుఖము ఉండదని వేద పురాణాది గ్రంథములు తెలుపుచున్నవి. ఒక వేళ తాబేలు వీపుపై వెంట్రుకలు మొలిచిన మొలువవచ్చును, గొడ్రాలికి కొడుకు కలిగి హంతకుడు కావచ్చును, ఆకాశమున పెక్కు విధములైన పూలు వికసింపవచ్చును. (అనగా ఇట్టి అసంభవములైనవి సంభవము కావచ్చును.) కాని హరికి విముఖుడైన జీవునకు ఎట్టి సుఖమూ కలుగనే కలుగదు.

మృగతృష్ణలోని నీటితో దాహము తీరవచ్చును, కుందేటిశిరముపై కొమ్ములు మొలవవచ్చును, అంధకారము సూర్యకాంతిని కప్పివేయవచ్చును. మంచునుండి అగ్ని పుట్టవచ్చును. కాని శ్రీరామునియెడ విముఖుడు ఐన వాడు ఎన్నడును, ఎప్పటికిని సుఖమును పొందజాలడు. (చౌ॥ 1-10)

దో- బారి మథేఁ ఘృత హోఇ బరు, సికతా తే బరు తేల।
బిను హరి భజన న భవ తరిఅ, యహ సిద్ధాంత అపేల ॥ 122(క) ॥
మసకహి కరఇ బిరంచి ప్రభు, అజహి మసక తే హీన।
అస బిచారి తజి సంసయ, రామహి భజహిఁ ప్రబీన ॥ 122(ఖ) ॥

నీటిని చిలికి నెయ్యి తీయవచ్చును. ఇసుకనుండి తైలము తీయవచ్చును. కాని హరిని సేవింపనిదే సంసారసాగరమునుండి తరించుట దుర్లభము. ఇది తిరుగులేని సిద్ధాంతము. ప్రభువు సంకల్పించినచో దోమనుగూడ బ్రహ్మనుగా చేయుగలడు. బ్రహ్మను సైతము దోమకంటెను తుచ్ఛప్రాణిగా చేయుగలడు. ఇట్లు ఆలోచించి, ప్రతిభగలయోగ్యులు సందేహములను వీడి శ్రీరాముని భజించెదరు. (దో॥ 122. క,ఖ)

శ్లో॥ వినిశ్చితం వదామి తే న అన్యథా వచాంసి మే।
హరిం నరా భజంతి యేఽతిదుస్తరం తరంతి తే ॥ 122(గ) ॥

నేను నీకు ఒక పరమసిద్ధాన్తమును తెలిపెదను. భక్తి పరిపూర్ణులై శ్రీహరిని భజించెడి వారు అతి దుస్తరమైన సంసారసాగరమును అవలీలగా దాటగలరు. ఈ నావచనములు నిత్యసత్యములు. (శ్లో॥ 122. గ)

చౌ- కహేఉఁ నాథ హరి చరిత అనూపా। బ్యాస సమాస స్వమతి అనురూపా ॥
శ్రుతి సిద్ధాంత ఇహఇ ఉరగారీ। రామ భజిఅ సబ కాజ బిసారీ ॥ 1 ॥
ప్రభు రఘుపతి తజి సేఇఅ కాహీ। మొహి సే సఠ పర మమతా జాహీ ॥
తుమ్హ బిగ్యానరూప నహిఁ మోహా। నాథ కీన్హి మో పర అతి ఛోహా ॥ 2 ॥
పూఁఛిహు రామ కథా అతి పావని। సుక సనకాది సంభు మన భావని ॥
సత సంగతి దుర్లభ సంసారా। నిమిష దండ భరి ఏకఉ బారా ॥ 3 ॥
దేఖు గరుడ నిజ హృదయఁ బిచారీ। మైఁ రఘుబీర భజన అధికారీ ॥
సకునాధమ సబ భాఁతి అపావన। ప్రభు మొహి కీన్హ బిదిత జగ పావన ॥ 4 ॥

ఓ ప్రభూ! నేను శ్రీహరి యొక్క మహిమాన్విత చరితమును సందర్భానుసారముగ కొన్ని చోట్ల విపులముగను, మఱికొన్నిచోట్ల సంక్షిప్తముగను యథాశక్తి వర్ణించితిని. ఓ ఉరగారీ! సర్వ లౌకిక విషయములను త్యజించి, శ్రీరాముని భజింపవలెనని శ్రుతులు పేర్కొనుచున్నవి. నా వంటి మూర్ఖునిపైగూడ తనఅపారకృపను ప్రసరింపజేసిన శ్రీ రఘునాథుని కాదని మఱి యెవ్వరిని సేవించెదవు? ప్రభూ! మీరు విజ్ఞానరూపులు. మోహమనునది మీ దఱిదాపులకును రాదు. మీరు నాపై ఎంతయో దయచూపితిరి, శుకమహర్షికిని, శివునకును, సనకాది మునులకును గూడ ఆనందదాయకమైన అతిపవిత్రమైన శ్రీరాముని గాథను తెలుపుమని నన్నడిగితిరి. ప్రపంచములో

సజ్జనసాంగత్యము ఒక గడియయైనను, కడకు ఒక క్షణమైనను లభించుట దుర్లభము- ఓ ఖగరాజా! నేను శ్రీరాముని భజించుటకు నిజముగా అర్హుడనా? మీరే యోచింపుడు. నేను పక్షులలో అధముడను, అపవిత్రుడను ఐనను జగన్నాథుడైన శ్రీరామచంద్రప్రభుగాథను తెల్పుట ద్వారా సంపూర్ణ జగత్తును పవిత్రమొనర్చు వానినిగ ప్రభువు నన్ను అనుగ్రహించెను. (చౌ॥ 1-4)

దో- ఆజు ధన్య మైఁ ధన్య అతి, జద్యపి సబ బిధి హీన ।
నిజ జన జాని రామ మొహి, సంత సమాగమ దీన ॥ 123(క) ॥
నాథ జథామతి భాషెఉఁ, రాఖెఉఁ నహిఁ కఛు గోఇ ।
చరిత సింధు రఘునాయక, థాహ కి పావఇ కోఇ ॥ 123(ఖ) ॥

కాకభుశుండి ఇంకను తెల్పుచున్నాడు. నేను అన్ని విధములుగ అధముడనైనను నేడు ధన్యుడనైతిని. ఏలనన శ్రీరామచంద్రుడు నన్ను తనసేవకునిగా భావించి, నాకు మీవంటి సత్పురుషుల సాంగత్యమును కలిగించెను. నేను అత్యంతధన్యుడను. ప్రభూ! నేను నాబుద్ధిబలమునననుసరించి, శ్రీరామచరితమును యథాశక్తి వినిపించితిని. దేనినీ దాచలేదు. ఐనను శ్రీ రఘువీరునిచరితము ఒకసముద్రమువంటిది, అపారమైనది. దాని లోతును ఎవ్వరును కనుగొన జాలరు. (దో॥ 123. క,ఖ)

చౌ- సుమిరి రామ కే గున గన నానా। పుని పుని హరష భుసుండి సుజానా ॥
మహిమా నిగమ నేతి కరి గాఈ । అతులిత బల ప్రతాప ప్రభుతాఈ ॥ 1 ॥
సివ అజ పూజ్య చరన రఘురాఈ । మో పర కృపా పరమ మృదులాఈ ॥
అస సుభాఉ కహుఁ సునఉఁ న దేఖఉఁ । కెహి ఖగేస రఘుపతి సమ లేఖఉఁ ॥ 2 ॥
సాధక సిద్ధ బిముక్త ఉదాసీ । కబి కోబిద కృతగ్య సన్యాసీ ॥
జోగీ సూర సుతాపస గ్యానీ । ధర్మ నిరత పండిత బిగ్యానీ ॥ 3 ॥
తరహిఁ న బిను సేఏఁ మమ స్వామీ । రామ నమామి నమామి నమామీ ॥
సరన గఏఁ మో సే అఘ రాసీ । హోహిఁ సుద్ధ నమామి అబినాసీ ॥ 4 ॥

శ్రీరామునిగుణగణములను స్మరించుచు విజ్ఞుడైన భుశుండి మాటిమాటికిని ఆనందాబ్ధిలో ఓలలాడెను. వేదములు ఆయనమహిమను 'నేతి నేతి'యని కీర్తించినవి. అతనిబలము, ప్రతాప పరాక్రమములు, ప్రభుత, సాటిలేనివి. శివుడు, బ్రహ్మయు రఘువీరుని చరణములను పూజనీయములుగా భావించిరి. అట్టి రఘునాథుడు నాపై కృప జూపెను. ఇది ఆయన కోమల స్వభావ స్థితి. ఇట్టి ఉదాత్త స్వభావ శోభితుని ఎక్కడను కనలేదు, వినలేదు. కావున ఓఖగేశ్వరా! శ్రీ రఘునాథునివంటిప్రభువును ఎట్లు ఊహింపగలను. సాధకుడు, సిద్ధుడు, జీవన్ముక్తుడు, విరక్తుడు, కవి, విద్వాంసుడు, కర్మధర్మమర్మజ్ఞుడు, సన్న్యాసి, యోగి, శూరుడు, వీరుడు, తపస్వి, ధర్మతత్పరుడు, పండితుడు, తత్త్వజ్ఞాని మొదలగు వారు ఎవ్వరైనను శ్రీరామునిసేవాభజనలను చేయనిదే తరింప లేరు. నేను అట్టి శ్రీరామునకు మాటి మాటికిని నమస్కరించెదను. నా వంటి పాపాత్ములును ఆయనను శరణుజొచ్చినచో పుణ్యాత్ములగుదురు. అట్టి శ్రీరామ చంద్రునకు నేను ప్రణమిల్లుదును. (చౌ॥ 1-4)

దో- జాసు నామ భవ భేషజ, హరన ఘోర త్రయ సూల ।
సో కృపాల మోహి తో పర, సదా రహఉ అనుకూల ॥ 124(క) ॥
సుని భుసుండి కే బచన సుభ, దేఖి రామ పద నేహ ।
బోలేఉ ప్రేమ సహిత గిరా, గరుడ బిగత సందేహ ॥ 124(ఖ) ॥

శ్రీరామనామము జననమరణవ్యాధులకు దివ్యౌషధము. తాపత్రయదుఃఖములను రూపు మాపును. అట్టి కృపాళువైన శ్రీరామచంద్రుడు నాపైనను, మీపైనను కృపజూపుగాక. కాక భుశుండి యొక్క మంగళకరవచనములను విని, శ్రీరాముని చరణములపై ఆయనకు గల అపూర్వభక్తిని జూచి, సందేహరహితుడై గరుడుడు ప్రేమతో ఇట్లనెను. (దో॥ 124. క,ఖ)

చౌ- మైఀ కృతకృత్య భయఉఀ తవ బానీ । సుని రఘుబీర భగతి రస సానీ ॥
రామ చరన నూతన రతి భఈ । మాయా జనిత బిపతి సబ గఈ ॥ 1 ॥
మోహ జలధి బోహిత తుమ్హ భఏ । మో కహఀ నాథ బిబిధ సుఖ దఏ ॥
మో పహిఀ హోఇ న ప్రతి ఉపకారా । బందఉఀ తవ పద బారహిఀ బారా ॥ 2 ॥
పూరన కామ రామ అనురాగీ । తుమ్హ సమ తాత న కోఉ బడభాగీ ॥
సంత బిటప సరితా గిరి ధరనీ । పర హిత హేతు సబన్హ కై కరనీ ॥ 3 ॥
సంత హృదయ నవనీత సమానా । కహా కబిన్హ పరి కహై న జానా ॥
నిజ పరితాప ద్రవఇ నవనీతా । పర దుఖ ద్రవహిఀ సంత సుపునీతా ॥ 4 ॥
జీవన జన్మ సుఫల మమ భయఊ । తవ ప్రసాద సంసయ సబ గయఊ ॥
జానేహు సదా మోహి నిజ కింకర । పుని పుని ఉమా కహఇ బిహంగబర ॥ 5 ॥

"శ్రీరఘువీరుని భక్తి రసవాహినిలో ఓలలాడిన మీ వాణిని విని, నేను కృతార్థుడనైతిని. శ్రీరాముని చరణములపై నాకు పరమభక్తి నెలకొనినది. మాయాజనితములైన ఆపదలన్నియును తొలగి పోయినవి. మోహసముద్రములో మునిగిపోవుచున్న నాకు మీరు నౌక యైతిరి. నాకు అనేక విధముల సుఖ, శాంతులను ప్రసాదించితిరి. దీనికి నేనేమి ప్రత్యుపకారము చేయగలను? మీ చరణములకు పదే పదే వందనములనాచరించెదను. మీరు పూర్ణకాములు. శ్రీరామునకు ప్రీతిపాత్రులు. నాయనా! మీవంటిభాగ్యశాలురు ఎవరు? సజ్జనులు, వృక్షములు, నదులు, పర్వతములు, భూమి- ఇవి యన్నియును పరులకు హితములనే చేకూర్చును. సజ్జనుల హృదయములు వెన్న వంటివని కవులు పేర్కొనిరి. కాని నిజముగా వారికి సరిగా చెప్పుట చేతగాలేదు. ఏలనన వెన్న తాను తప్తమైనప్పుడే కఱుగును. కాని సజ్జనులహృదయములు ఇతరులు బాధలకు గురియైనప్పుడును కఱుగును. నా జన్మ, జీవనము సఫలమైనవి. మీ కృపవలననాసందేహములు అన్నియును తొలగినవి. సర్వదా నన్ను మీసేవకునిగా భావింపుడు. శివుడు పలుకుచున్నాడు ఉమా! ఖగరాజైన గరుడుడు మాటి మాటికిని ఇట్లు పలికెను. (చౌ॥ 1-5)

దో- తాసు చరన సిరు నాఇ కరి, ప్రేమ సహిత మతిధీర ।
గయఉ గరుడ బైకుంఠ తబ, హృదయఀ రాఖి రఘుబీర ॥ 125(క) ॥

గిరిజా సంత సమాగమ, సమ న లాభ కఛు ఆన ।
బిను హరి కృపా న హోఇ సో, గావహిం బేద పురాన ॥ 125(ఖ) ॥

కాకభుశుండిచరణములకు ప్రేమపూర్వకముగా నమస్కరించి, హృదయమున శ్రీరఘువీరుని ప్రతిష్ఠించుకొని, ధీరబుద్ధియైన గరుత్మంతుడు వైకుంఠమునకు వెళ్లెను. శివుడు పల్కుచున్నాడు. ఓ గిరిజా! సజ్జనసమాగమమును మించిన లాభమేమియును లేదు. కాని హరికృపావిశేషమువలననే ఇది లభ్యము. వేదపురాణములు ఇట్లే చెప్పుచున్నవి. (దో॥ 125. క,ఖ)

## శ్రీ రామకథాశ్రవణఫలము

చౌ- కహేఉఁ పరమ పునీత ఇతిహాసా । సునత శ్రవన ఛూటహిం భవ పాసా ॥
ప్రనత కల్పతరు కరునా పుంజా । ఉపజఇ ప్రీతి రామ పద కంజా ॥ 1 ॥
మన క్రమ బచన జనిత అఘ జాఈ । సునహిం జె కథా శ్రవన మన లాఈ ॥
తీర్థాటన సాధన సముదాఈ । జోగ బిరాగ గ్యాన నిపునాఈ ॥ 2 ॥
నానా కర్మ ధర్మ బ్రత దానా । సంజమ దమ జప తప మఖ నానా ॥
భూత దయా ద్విజ గుర సేవకాఈ । బిద్యా బినయ బిబేక బడాఈ ॥ 3 ॥
జహఁ లగి సాధన బేద బఖానీ । సబ కర ఫల హరి భగతి భవానీ ॥
సో రఘునాథ భగతి శ్రుతి గాఈ । రామ కృపాఁ కాహూఁ ఏక పాఈ ॥ 4 ॥

పరమపవిత్రమైన శ్రీరామచరితమును తెల్పితిని. దీనిని వినినంతనే సంసారబంధము లన్నియు తెగిపోవును. శరణాగతులకు కల్పవృక్షమూ, కరుణామూర్తియునైన శ్రీరామునిపాదపద్మములయందు ప్రీతియు గల్గును. మనస్సును, చెవులను లగ్నమొనర్చి, ఈ కథను విన్నవారికి మనోవాక్కర్మలచే ఉత్పన్నమైన పాపములన్నియును నశించిపోవును. తీర్థయాత్రలు మొదలగు సాధనలు, యోగ వైరాగ్య జ్ఞాన కౌశలములు, నానావిధ ధర్మకర్మలు, వ్రతములు, దానములు, సంయమ, దమ, జప తపో యజ్ఞములు ప్రాణి కోటిపై కనికరము, బ్రాహ్మణులను గురువులను సేవించుట, విద్యావినయవివేకాదిసాధనలఫలము శ్రీహరిభక్తియే. భవానీ! శ్రుతులలో వర్ణింపబడిన శ్రీరామునిపైఅనన్యభక్తి ప్రభుఅనుగ్రహముచేమాత్రమే ఏ ఒక్కరికో అబ్బును. (చౌ॥ 1-4)

దో- ముని దుర్లభ హరి భగతి నర, పావహిం బినహిం ప్రయాస ।
జే యహ కథా నిరంతర, సునహిం మాని బిస్వాస ॥ 126 ॥

ఉత్తమోత్తమమైన ఈ పుణ్యకథను నిత్యము, నిరంతరము గాఢమైన భక్తివిశ్వాసములతో వినెడివారు మునీశ్వరులకును దుర్లభమైన హరిభక్తిని అనాయాసముగా పొందగలరు. (దో॥ 126)

చౌ- సోఇ సర్బగ్య గునీ సోఇ గ్యాతా । సోఇ మహి మండిత పండిత దాతా ॥
ధర్మ పరాయన సోఇ కుల త్రాతా । రామచరన జా కర మన రాతా ॥ 1 ॥

నీతి నిపున సోఇ పరమ సయానా । శ్రుతి సిద్ధాంత నీక తెహిఁ జానా ॥
సోఇ కబి కోబిద సోఇ రనధీరా । జో ఛల ఛాడి భజఇ రఘుబీరా ॥ 2 ॥
ధన్య దేస సో జహఁ సురసరీ । ధన్య నారి పతిబ్రత అనుసరీ ॥
ధన్య సో భూపు నీతి జో కరఈ । ధన్య సో ద్విజ నిజ ధర్మ న టరఈ ॥ 3 ॥
సో ధన ధన్య ప్రథమ గతి జాకీ । ధన్య పున్య రత మతి సోఇ పాకీ ॥
ధన్య ఘరీ సోఇ జబ సతసంగా । ధన్య జన్మ ద్విజ భగతి అభంగా ॥ 4 ॥

శ్రీరాముని చరణసేవలయందు అనురక్తుడైనవాడే సర్వజ్ఞుడు, జ్ఞాని, గుణనిధి. అతడే భువికి భూషణము. విద్వాంసుడు, దాత, ధర్మపరాయణుడు, వంశరక్షకుడు. త్రికరణశుద్ధిగా శ్రీ రఘువీరుని భజించువాడు నీతికోవిదుడు. పరమబుద్ధిశాలి. అతడే వైదికసిద్ధాన్తములను ఎరిగినవాడు. అతడే కవి, విద్వాంసుడు, రణధీరుడు. దివ్యనది గంగ ప్రవహించు దేశమే ధన్యము. పతివ్రతా ధర్మములను అనుసరించెడి స్త్రీలే ధన్యలు. నీతి నియమములచే పరిపాలనచేయు రాజులే పరమధన్యులు. తమధర్మములను ఆచరించెడి బ్రాహ్మణులే ధన్యులు. దాన ధర్మములకు వినియోగపడు ధనసంపదలే సార్థకములు. పుణ్యకార్యతత్పరమైన బుద్ధియే బుద్ధి. సజ్జన సాంగత్యము కలిగిన క్షణమే క్షణము. బ్రాహ్మణ భక్తి గల జన్మయే జన్మ. (చౌ॥ 1-4)

దో- సో కుల ధన్య ఉమా సును, జగత పూజ్య సుపునీత ।
శ్రీరఘుబీర పరాయన, జెహిఁ నర ఉపజ బినీత ॥ 127 ॥

ఉమా! వినుము. శ్రీరామభక్తిపరాయణులు జన్మించువంశమే ధన్యము. అది జగత్తులో పరమపూజ్యము. అత్యంత పవిత్రము. (దో॥ 127)

చౌ- మతి అనురూప కథా మైఁ భాషీ । జద్యపి ప్రథమ గుప్త కరి రాఖీ ॥
తవ మన ప్రీతి దేఖి అధికాఈ । తబ మైఁ రఘుపతి కథా సునాఈ ॥ 1 ॥
యహ న కహిఅ సఠహీ హఠసీలహి । జో మన లాఇ న సున హరి లీలహి ॥
కహిఅ న లోభిహి క్రోధిహి కామిహి । జో న భజఇ సచరాచర స్వామిహి ॥ 2 ॥
ద్విజ ద్రోహిహి న సునాఇఅ కబహూఁ । సురపతి సరిస హోఇ నృప జబహూఁ ॥
రామ కథా కే తెఇ అధికారీ । జిన్హ కేఁ సతసంగతి అతి ప్యారీ ॥ 3 ॥
గుర పద ప్రీతి నీతి రత జేఈ । ద్విజ సేవక అధికారీ తేఈ ॥
తా కహఁ యహ బిసేష సుఖదాఈ । జాహి ప్రానప్రియ శ్రీరఘురాఈ ॥ 4 ॥

భవానీ! నేను నా బుద్ధిబలముతో ఈ కథను వినిపించితిని. ఇంతవఱకును దీనిని రహస్యముగా ఉంచి యుంటిని. కాని నీలో రామభక్తి పెంపొందుట జూచి, నీ వైశిష్ట్యమును గుర్తించి, శ్రీరామ చరితమును వివరించితిని. శఠునకును, హఠస్వభావముగల వానికిని, శ్రీహరి లీలలను మనస్ఫూర్తిగా విననివానికిని, ఈ గాథను తెలుపరాదు. లోభి, క్రోధి, కామి, మొదలగు వారికిని, శ్రీరామునిభజింపనివారికిని, ఈ కథను వివరింపరాదు. దేవేంద్రునితో

సమానుడగు ఐశ్వర్యవంతుడైనను బ్రాహ్మణద్వేషియైనచో అతనికి ఈ పుణ్యకథను ఎన్నడును తెలుపరాదు. సత్సాంగత్యముపై భక్తిశ్రద్ధలుగలవారే ఈ రామకథాశ్రవణమునకు అర్హులు. గురు చరణములయందు ప్రీతిగలవారు, నీతిపరులు, బ్రాహ్మణులను సేవించువారు ఈ కథా శ్రవణమునకు పాత్రులు. తనప్రాణములతో సమానముగా శ్రీ రఘునాథుని ప్రేమించువ్యక్తికి ఈ చరితము మిక్కిలి సుఖప్రదాయకము. (చౌ॥ 1-4)

దో- రామ చరన రతి జో చహ, అథవా పద నిర్బాన ।
భావ సహిత సో యహ కథా, కరఉ శ్రవన పుట పాన ॥ **128** ॥

శ్రీరాముని చరణములయందు అనురాగముగలవాడును, మోక్షపదమును కాంక్షించువాడును, అమృతతుల్యమగు ఈ కథను తనచెవులార గ్రోలును. (దో॥ 128)

చౌ- రామ కథా గిరిజా మైం బరనీ । కలి మల సమని మనోమల హరనీ ॥
సంసృతి రోగ సజీవన మూరీ । రామ కథా గావహిం శ్రుతి సూరీ ॥ **1** ॥
ఏహి మహం రుచిర సప్త సోపానా । రఘుపతి భగతి కేర పంథానా ॥
అతి హరి కృపా జాహి పర హోఈ । పాఉం దేఇ ఏహిం మారగ సోఈ ॥ **2** ॥
మన కామనా సిద్ధి నర పావా । జే యహ కథా కపట తజి గావా ॥
కహహిం సునహిం అనుమోదన కరహీం । తే గోపద ఇవ భవనిధి తరహీం ॥ **3** ॥
సుని సబ కథా హృదయ అతి భాఈ । గిరిజా బోలీ గిరా సుహాఈ ॥
నాథ కృపాం మమ గత సందేహా । రామ చరన ఉపజెఉ నవ నేహా ॥ **4** ॥

ఓ గిరిజా! కలియుగ పాపములను అంతరింప జేయునదియు, మనోమాలిన్యములను హరింప జేయునదియును ఐన శ్రీరామ చరితమును తెల్పితిని. ఈ రామ కథ జనన మరణరూపవ్యాధిని నివారించు సంజీవనీమూలిక. ఈ కథను వేదములు, విద్వాంసులు వేనోళ్ల ప్రస్తుతించుచున్నారు. ఇందులో మనోహరములైన సప్తసోపానములు గలవు. ఇవి శ్రీ రఘునాథునిపై భక్తినికలిగించు మార్గములు. శ్రీహరికృపకు పాత్రులైనవారే ఈమార్గమున అడుగిడగలరు. కపటమును త్యజించి (త్రికరణ శుద్ధిగా) ఈ కథాగానముచేసినవారిమనోరథములు సిద్ధించును. ఈ కథను వినెడివారికిని, వినిపించువారికిని, విశ్వసించెడివారికిని, సంసారసాగరము గోష్పాదమంతగా అగును. (యాజ్ఞ వల్క్యుడు పలుకుచున్నాడు.) కథనంతయు వినినపిదప పార్వతీహృదయము అతి ప్రసన్నమాయెను. ఆ దేవి మృదుమధురముగా ఇట్లు పలికెను. "స్వామీ! మీకృపచే నాసందేహములు పటాపంచలయ్యెను. శ్రీరాముని చరణకమలములపై అనన్యభక్తి జనించెను. (చౌ॥ 1-4)

దో- మైం కృతకృత్య భఇఉం అబ, తవ ప్రసాద బిస్వేస ।
ఉపజీ రామ భగతి దృఢ, బీతే సకల కలేస ॥ **129** ॥

ఓ విశ్వనాథా! మీ దయవలన నేను కృతార్థురాలనైతిని. నాలో దృఢమైనరామభక్తి ఉదయించెను. నాక్లేశములన్నియును దూరమయ్యెను." (దో॥ 129)

చౌ- యహ సుభ సంభు ఉమా సంబాదా । సుఖ సంపాదన సమన బిషాదా ॥
భవ భంజన గంజన సందేహా । జన రంజన సజ్జన ప్రియ ఏహా ॥ 1 ॥
రామ ఉపాసక జే జగ మాహీం । ఏహి సమ ప్రియ తిన్హ కేం కఛు నాహీం ॥
రఘుపతి కృపాఁ జథామతి గావా । మైఁ యహ పావన చరిత సుహావా ॥ 2 ॥
ఏహిఁ కలికాల న సాధన దూజా । జోగ జగ్య జప తప బ్రత పూజా ॥
రామహి సుమిరిఅ గాఇఅ రామహి । సంతత సునిఅ రామ గున గ్రామహి ॥ 3 ॥
జాసు పతిత పావన బడ బానా । గావహిఁ కబి శ్రుతి సంత పురానా ॥
తాహి భజహి మన తజి కుటిలాఈ । రామ భజేఁ గతి కేహిఁ నహిఁ పాఈ ॥ 4 ॥

ఉమాశంకరుల ఈ సంభాషణము శోకనాశకము, లోకకల్యాణ కారకము. సర్వసుఖప్రదము. ఇది జననమరణరాహిత్యమును గూర్చును. సందేహములను దూరముచేయును. భక్తులకు ఆనందమును ప్రసాదించును. ఇది జనమనోరంజకము. సజ్జనులకు అత్యంతప్రియము, ప్రపంచములో శ్రీరాముని ఉపాసించువారికి శ్రీరామచరితమువలె ప్రియమును గూర్చునది ఈ లోకములో ఏదియును ఉండదు. (తులసీదాసు పలుకుచున్నాడు.) నేను ఈ పవిత్ర సుందర కథను యథాశక్తి గానముచేసితిని. ఈ కలియుగమున యోగము, యజ్ఞము, జపము, తపము, వ్రతము, అర్చనము, మొదలగుసాధనమార్గములేవియు శ్రీరామునికథవలె ఉత్తమోత్తమ ఫలములను ఈయజాలవు. కేవలము శ్రీరాముని స్మరించుట, శ్రీరామునిగుణగానము చేయుట, నిరంతరము శ్రీరామునిగుణగణములనుగూర్చి వినుటయే మానవాళికి పరమకర్తవ్యము. పతితులనుగూడ పవిత్రమొనర్చెడివాడుగా (పతితపావనుడుగా) కీర్తిగాంచినవాడు ఆ శ్రీరామచంద్రప్రభువు. ఈవిధముగా సజ్జనులు, కవులు, వేదపురాణములు లోకమునకు ఉపదేశించుచుండుట జగద్విదితము. కావున ఓ మనసా! కపటమునుమాని శ్రీ రఘునాథుని భజింపుము. శ్రీరాముని భజించినచో మోక్షమును పొందని వారెవ్వరు? (చౌ॥ 1-4)

ఛం-పాఈ న కేహిఁ గతి పతిత పావన రామ భజి సును సఠ మనా ।
గనికా అజామిల బ్యాధ గీధ గజాది ఖల తారే ఘనా ॥
ఆభీర జమన కిరాత ఖస స్వపచాది అతి అఘరూప జే ।
కహి నామ బారక తేపి పావన హోహిఁ రామ నమామి తే ॥ 1 ॥
రఘుబంస భూషన చరిత యహ నర కహహిఁ సునహిఁ జె గావహీఁ ॥
కలి మల మనోమల ధోఇ బిను శ్రమ రామ ధామ సిధావహీఁ ॥
సత పంచ చౌపాఈఁ మనోహర జాని జో నర ఉర ధరై ।
దారున అబిద్యా పంచ జనిత బికార శ్రీరఘుబర హరై ॥ 2 ॥

సుందర సుజాన కృపా నిధాన అనాథ పర కర ప్రీతి జో।
సో ఏక రామ అకామ హిత నిర్బానప్రద సమ ఆన కో ॥
జాకీ కృపా లవలేస తే మతిమంద తులసీదాసహూఁ।
పాయో పరమ బిశ్రాము రామ సమాన ప్రభు నాహీఁ కహూఁ ॥ 3 ॥

ఓ మూర్ఖ మనసా! పతిత పావనుడైన శ్రీరాముని భజించి, పరమపదమును పొందనివారెవ్వరు? ఒక గణిక (పింగళ) అజామీళుడు, వ్యాధుడు (వాల్మీకి), గ్రద్ధ (జటాయువు), గజము(గజేంద్రుడు) మొదలగు ప్రాణులనే గాక పెక్కుమంది దుష్టులనుగూడ శ్రీరాముడు తరింప జేసెను. ఆభీరులు, యవనులు, కిరాతులు, ఖసులు, చండాలురు మొదలగుఅత్యంతపాపులుగూడ శ్రీరామ నామమును స్మరించి, పవిత్రులైరి. అట్టి శ్రీరామచంద్రునకు నేను నమస్కరించెదను. (1) రఘు వంశ భూషణుడైన శ్రీరాముని ఈ చరిత్రమును వర్ణించువారును, వక్తలును, శ్రోతలును, గానము చేయువారును కలియుగపాపములను, మనోమాలిన్యములను ప్రక్షాళనమొనర్చుకొని, అనాయాసముగా, నేరుగా రామధామమును జేరుదురు. వేయేల? ఈ రామాయణమునందలి '5100' చౌపాఈలను మనోహరమైనవిగా గ్రహించి, హృదయమున స్థిరముగా చేర్చుకొనినవారు దారుణ-అవిద్యాజనితములైన పంచవికారములను (అవిద్య, అస్మిత, రాగ, ద్వేష, అభినివేశ క్లేశములను) అరిషడ్వర్గములను (కామక్రోధలోభమోహ మదమాత్సర్యములనెడి వికారములను) శ్రీరాముడు నిర్మూలించును. (2) సౌందర్యనిధి, సుజ్ఞాని, దయాపయోధి, అనాథరక్షకుడు-అను విశిష్టగుణశోభితుడు శ్రీరాముడు మాత్రమే. నిష్కామ భక్తిని, కల్యాణగుణములను ఆయనవలె ప్రసాదించువాడును, సంసారబంధములనుండి విముక్తిని కల్గించు వాడును మఱియొకడు లేడు. అతనిలేశమాత్రమైన కృపచేతనే, మంద బుద్ధినైన నేను తులసీదాసుడు పరమశాంతికి నోచుకొంటిని. అట్టి శ్రీరామచంద్రుని వంటి ప్రభువు "న భూతో న భవిష్యతి". (ఛం॥ 3)

దో- మో సమ దీన న దీన హిత, తుమ్హ సమాన రఘుబీర।
అస బిచారి రఘుబంస మని, హరహు బిషమ భవ భీర ॥ 130(క) ॥
కామిహి నారి పిఆరి జిమి, లోభిహి ప్రియ జిమి దామ।
తిమి రఘునాథ నిరంతర, ప్రియ లాగహు మోహి రామ ॥ 130(ఖ) ॥

ఓ రఘువీరా! నా వంటి దీనుడు ఎవ్వడును ఉండడు. నీ వంటి దీనజనరక్షకుడును లేడు. ఇట్లు యోచించి, ఓ రఘువంశమణీ! నా జననమరణరూపభయానకభవసంకటములను అంతరింప జేయుము. కాముకునకు స్త్రీ, లోభికి ధనము అత్యంత ప్రీతికరమైనట్లు రఘునాథా! శ్రీరామా! నీవు నాకు నిరంతరము మిక్కిలి ప్రీతికరుడవు (ప్రియమును గూర్చువాడవు) కమ్ము. (దో॥ 130. క,ఖ)

శ్లో॥ యత్పూర్వం ప్రభుణా కృతం సుకవినా శ్రీశంభునా దుర్గమం
శ్రీమద్రామపదాబ్జభక్తిమనిశం ప్రాప్త్యై తు రామాయణమ్।

మత్వా తద్రఘునాథనామనిరతం స్వాంతస్తమఃశాంతయే
భాషాబద్ధమిదం చకార తులసీదాసస్తథా మానసమ్ ॥ 1 ॥

సర్వ సమర్థుడును, మహాకవివతంసుడును ఐన శ్రీ శంకరుడు శ్రీరామచరణకమలముల యందు అనన్యమైనభక్తికలిగి, అది నిరంతరము తనమనస్సునందు కుదురుకొనుటకై దుర్లభమైన ఈ మానస రామాయణమును పూర్వమే రచించెను. తులసీదాసు ఈ మానస రామాయణమును రామనామమహత్త్వ పరిపూర్ణముగా భావించి, తనఅంతఃకరణమునందలి అజ్ఞానాంధకారమును అంతరింపజేసికొనుటకై ఈ మానసమును భాషాబద్ధమొనర్చెను. (1)

పుణ్యం పాపహరం సదా శివకరం విజ్ఞానభక్తిప్రదం
మాయామోహమలాపహం సువిమలం ప్రేమాంబుపూరం శుభమ్ ।
శ్రీమద్రామచరిత్రమానసమిదం భక్త్యావగాహంతి యే
తే సంసారపతంగఘోరకిరణైర్దహ్యంతి నో మానవాః ॥ 2 ॥

ఈ రామచరితమానసము అత్యంత పుణ్యప్రదము, సమస్తపాపహరము, సర్వదా మంగళ కరము, అనన్య భక్తిజ్ఞానములను ప్రసాదించునది, మాయామోహమాలిన్యములను నశింప జేయునది, నిర్మల ప్రేమజలపరిపూర్ణము, సర్వ శుభ ప్రదము. ఈ మానస సరోవరమున భక్తి పూర్వకముగా మునకలు వేయువారు సాంసారికక్లేశములనెడి ప్రచండసూర్యకిరణములచే దహింపబడక పరమశాంతిని పొందెదరు. (2)

మాసపారాయణము - ముప్పదియవ విరామము
నవాహ్నికపారాయణము - తొమ్మిదవ విరామము

ఇతి శ్రీమద్రామచరితమానసే సకలకలికలుషవిధ్వంసనే
సప్తమః సోపానః సమాప్తః
కలియుగ పాపములను నశింపజేయు శ్రీరామచరితమానమునందలి ఉత్తరకాండము
అను సప్తమ సోపానము సమాప్తము

(ఉత్తరకాండము సమాప్తము)

శ్లో॥ చరితం రఘునాథస్య, శతకోటి ప్రవిస్తరమ్ ।
ఏకైకమక్షరం ప్రోక్తం, మహా పాతక నాశనమ్ ॥

ఓమ్ తత్ సత్

## ఈ కావ్య విశేషములనుగూర్చి ఒక్కమాట

పరంపరాగతమైన భారతీయసంస్కృతి అవగాహనమునకును దానిపరిరక్షణమునకును శ్రీ మద్రామాయణ భగవద్గీతలు పట్టుగొమ్మలు. భగవంతుడు స్వయముగా శ్రీరామచంద్రుడై అవతరించి, తన ఆదర్శజీవితముద్వారా మానవధర్మములను, వాటివిలువలను లోకమునకు చాటెను. ఈ రామావతారవైశిష్ట్యమును ప్రకటించునదియే శ్రీమద్రామాయణము. ఆ భగవంతుడే మఱల ద్వాపరయుగమున శ్రీకృష్ణుడుగా అవతరించి, అర్జునుని నిమిత్తముగా జేసికొని, లోకమునకు తనదివ్యప్రబోధమును గావించెను. ఆదివ్యోపదేశమే 'శ్రీమద్భగవద్గీత' శ్రీమద్రామాయణ భగవద్గీతలు లోకమునకు రెండు కన్నుల వంటివి. ఇందలి ఉపదేశములు సమస్తమానవాళికిని సర్వకాలములయందును ఆదర్శప్రాయములు, ఆచరణీయములు.

ఆదికవియైన వాల్మీకిమహర్షి శ్రీరామావతారతత్త్వమును శ్రీమద్రామాయణముగా సంస్కృతమున రచించి, లోకమునకందించెను. అది విశ్వవ్యాప్తమై మిక్కిలి ప్రశస్తిని పొందెను. కాని అది సంస్కృతమున రచింపబడుటచే అందలి విశేషములు పండితులకు మాత్రమే గ్రాహ్యములు. కాని మహాకవి శ్రీ గోస్వామి తులసీదాసు 'శ్రీరామచరిత మానసమును వ్యవహారభాషయైన అవధిభాషలో రచించుటచే అది పండితులకును, పామరులకును సులభగ్రాహ్యమైనది. ఇది సరళమైన సుందరమైన మధురరచన. హాయిగా గానము చేసికొనుటకు అనువైనది. ఇందలి 'దోహా'లు 'సోరఠ'లు 'చౌపాఈ'లు 'ఛంద్'లు పరమానందదాయకములు. ఇవి పండితులకును పసిపిల్లలను. పామరులనూ రంజింపజేయును. అంతేగాదు ఆ పరమశివునిగూడ ఆనందింపజేసి, ఆయనఆశీస్సులకును పాత్రములైనవి. ఇందలి శబ్దాలంకారములు, అర్థాలంకారములు నిరుపమానములు. అంత్యప్రాసల, అనుప్రాసల అందచందములు అత్యంతమనోహరములు.

శ్రీరామచరితమానసమునందలి పాత్రపోషణము అమోఘము, సహజసుందరము. దంపతుల అన్యోన్యానురాగములు, మాతాసుతులవాత్సల్యములు, పితాపుత్రసంబంధములు, సోదరులసౌహార్దములు, స్త్రీ పురుషుల మర్యాదా జీవనములు, మన్ననలు, పాలకులయెడ ప్రజల భక్తి విశ్వాసములు, ప్రభువుల ప్రజానురాగములు ఇందు సమయోచితముగా సరసముగా వర్ణింపబడినవి.

శ్రీరాముడు ఈ మహాకావ్యమునకు కథానాయకుడు. ధర్మపరిరక్షణకై భగవంతుడే రఘువంశమున కౌసల్యా దశరథులపుణ్యఫలముగా వారికి పుత్రుడై అవతరించెను. ఆయన భగవదవతారమేయైనను లోకమునకు ఆదర్శప్రాయుడైన ఒక మహాపురుషుడుగా తనలీలలను ప్రదర్శించెను. ఆయన లీలావిలాసములు వినిన వారికిని, చదివిన వారికిని, స్మరించిన వారికిని హృదయములయందు పవిత్ర భావములను కలిగించును. శ్రీరామచంద్రుడు సద్గుణ సముద్రుడు. ఆయన ప్రతిచర్యయు అనుసరణీయము. మాతాపితరులయెడ భక్తి, గురువులయెడ వినయ విధేయతలు, ఏకపత్నీవ్రతనియమము, భ్రాతృప్రేమ, మిత్రులయెడ అనురాగము, శరణాగత వాత్సల్యము, ప్రజాను రాగము మొదగునవి ఆయనకు సహజగుణములు.

శ్రీరాముని వెన్నంటివచ్చిన ఆదిశేషునిఅవతారమే శ్రీలక్ష్మణస్వామి. శ్రీరామునిపాదపద్మసేవయే తనకర్తవ్యమని భావించి, అతడు అందు పరవశుడు అగుచుండును. విశ్వామిత్రునియాగసంరక్షణసమయమునను, శ్రీరామునివనవాసకాలమునను లక్ష్మణుడు నిరంతరము అంకితభావముతో భ్రాతృసేవలొనర్చినతీరు అత్యద్భుతము. శ్రీరామలక్ష్మణులపరస్పరప్రేమానురాగములు అపూర్వములు. వనవాసమునకు సన్నద్ధుడగుచున్న రాముని

అనుసరించుటకై లక్ష్మణుడు ఆయనతో విన్నవించుకొనిన తీరు, అట్లే లక్ష్మణుడు మూర్ఛిల్లినప్పుడు అతనికై శ్రీరాముడు పొందిన వేదన, వారిపరస్పరప్రేమానురాగములకు ప్రబలతార్కాణములు.

భరతుడు శ్రీరామునకు ప్రియసోదరుడేగాక పరమభక్తుడుగూడ. తల్లి కైకేయిమోహకారణముగ కోసల రాజ్యాధికారము తనచేతికందినను దానిని తృణప్రాయముగా త్యజించి, కౌసల్యామాతసమక్షమునను, నిండు సభలో వసిష్ఠాదిమహాపురుషులయెదుటను అతడు ప్రకటించిన పరితాపవచనములు ఆయనహృదయస్వచ్ఛతను వెల్లడించుచున్నవి. ఇంకను చిత్రకూటమున రామునిముందు అతడు ప్రకటించినవేదన, శ్రీరామునిపాదుకలకు పట్టముగట్టుట అనునవి శ్రీరామునియెడ భరతునిఅనన్య భక్తికిని, నిస్స్వార్థబుద్ధికిని నిదర్శనములు. నంది గ్రామమున ఆయన ఆచరించిన తపోనిష్ఠానియమములు మహామునులకును ఆదర్శప్రాయములు.

అవనిజాత సీత మహాసాధ్వి. నిస్సంగనిష్ఠాజీవనవిధానములతో వాసికెక్కిన జనకునిగారాలబిడ్డ. ఆమె మహాలక్ష్మీదేవి అవతారము. శివధనుర్భంగముగావించిన శ్రీరామునిమెడలో వరమాల వేసి, రామపత్నియై వాసికెక్కిన 'వనితామణి'. కన్న తల్లిదండ్రులకును, ఆశీర్వదించి, ఆదరించిన అత్తమామలకును ప్రేమపాత్రురాలై, అందరి మన్ననలను చూరగొనిన ఉత్తమురాలు. కౌసల్యాదేవి అనుమతిని, శ్రీరాముని ఆమోదమును పొంది, ఆయనవెంట వనములకు నడిచిన పతిసేవాపరాయణ. మునీశ్వరులసేవలతో, మునిపత్నులఆశీస్సులతో పరమపునీతయైన ఆదర్శనారీశిరోమణి. విధివశమున రావణాపహరణమునకు గురియైనను, విధిలేక పరులపంచన అశోకవనములో అవస్థలపాలైనను, పతికి దూరముగా కాలము గడుపవలసివచ్చినను చెక్కుచెదరని సౌశీల్యముతో అగ్నిపరీక్షలో నెగ్గుదేరిన పవితారత్నము. రామానుగ్రహముతో, మారుతిగావించిన సేవలతో కష్టాలకడలిని దాటి, అయోధ్యను చేరి, భర్తృ సహధర్మచారిణియై, శ్రీరామపట్టమహిషిగా వాసిగాంచిన సీతామాత నారీలోకమునకే ఆదర్శప్రాయురాలు.

ఆంజనేయుడు వాయునందనుడు, అంజనాదేవి ముద్దుల బిడ్డడు. శ్రీరామచంద్రస్వామికి పరమభక్తుడు. పరమ శివుని అంశతో ఈ నేలపై అడుగిడిన కారణజన్ముడు. రామలక్ష్మణులను తన భుజములపై నిలుపుకొని, వారిని ఋశ్యమూక పర్వతమునకు జేర్చి, రామసుగ్రీవులకు మైత్రిని గూర్చిన మహాపురుషుడు. సుగ్రీవునిసచివునిగా మసలుచు, వాలివధానంతరము సుగ్రీవునకు కర్తవ్యమును జ్ఞప్తికిదెచ్చి, రామకార్యమునకు తోడ్పడిన పుణ్యమూర్తి. శ్రీరామచంద్రప్రభువు ఒసంగిన అంగుళీయకమును గొని, అంగదాదులతో గూడి, సీతాన్వేషణకు నడుము బిగించినవాడు. స్వయంప్రభ సూచనతో, సంపాతిసహకారములతో అంగదాదులప్రోత్సాహముతో వివిధపరీక్షలలో నెగ్గి, వారిధిని దాటిన వీరాధివీరుడు. లంకిణిని హతమార్చి, లంకలో ప్రవేశించి, అకలంకదీక్షతో అశోకవనమున అడుగిడి రామాంగుళీయకమును సీతామాతకు సమర్పించి, ఆమె ఆశీస్సులనందుకొనినవాడు. అశోకవనమును ధ్వంసమొనర్చి, రాక్షసులను పరిమార్చి, రావణుని హెచ్చరించి, లంకను గాల్చి, అనుయాయులతో రామసమక్షమున నిల్చి, సీతామాత శిరోభూషణమును ఆ ప్రభువునకర్పించిన ధన్యజీవుడతడు. రావణవధలో శ్రీరామవిజయగాథలో వీరోచితపాత్రను నిర్వహించిన ఆ మహామహుడు చిరస్మరణీయుడు. అతడు శ్రీరఘువీరునిప్రశంసలకు పాత్రుడైనవాడు. అంతేగాదు శ్రీరామునిఆలింగనసుఖములకు నోచుకొని, బ్రహ్మానందమును అనుభవించినవాడతడు. శ్రీరామునిసేవలతో పరమపునీతుడైన ఆ పవనసుతుడు సర్వదా సర్వారాధ్యుడు.

శ్రీమన్నారాయణునిఅనుగ్రహమునకు పాత్రులైన శతరూపాస్వాయంభువమనువులు ఈలోకమున కౌసల్యాదశరథులై జన్మించిరి. శ్రీహరిఅవతారమైన శ్రీరాముని తనబంగారు కడుపునగన్న ధన్యాత్మురాలు కౌసల్యామాత. శ్రీరాముడవతరించిన వెంటనే అతడు తనచతుర్భుజరూపమున ఆ కన్నతల్లికి దర్శనమిచ్చెను. అప్పుడామె బ్రహ్మానందభరితురాలయ్యెను. అనంతరము ఆమెకోరికమేరకు అతడు ముద్దులుమూటగట్టు శిశువుగా

మాటి ఆమెఒడిని జేరెను. ఆయన లీలావిలాసములను దర్శించి, ఆ తల్లి మురిసిపోయెను. వచ్చియు రాని బుడి బుడి నడకలతో తన ముందు తారాడు ఆ బాలరామునకు తన చల్లని చేతులతో గోరుముద్దలు తినుపించుచు ఆయనను లాలించి, పాలించిన కృతార్థురాలు ఆ కౌసల్యామాత. తూగుటుయ్యేలలో తన చిన్నారి రామన్నను పరుండబెట్టి, కమ్మని జోలపాటలు పాడుచు, జోకొట్టుచు పరవసించి పోయిన అదృష్టవంతురాలు ఆ రామజనని. యాగరక్షణ నిమిత్తముగా తన వెంటవచ్చిన శ్రీరాముని మేల్కొలుపుచు విశ్వామిత్రుడు "కౌసల్యా సుప్రజా రామ" అని సంబోధించెను. ఆ కమ్మని పిలుపు నేటికిని ఇంటింటా మాఱుమ్రోగుచు కౌసల్యామాతకీర్తిని సమస్తలోకములలో చిరస్థిరము గావించుచున్నది. శ్రీరామునివనగమనసమయమున ఆమె పడిన మనోవేదన వర్ణనాతీతము. వెళ్లవలదన్నచో పతియాజ్ఞను మీఱినట్లగును. దానివలన పాపములంటును. 'వెళ్లుము' అనుటకు పుత్రవాత్సల్యము అడ్డువచ్చును. ఎట్టకేలకు ఈ డోలాయమానస్థితినుండి బయటపడి, పతియాజ్ఞను తలదాల్చి, వనగమనమునకు రాముని అనుమతించెను. భరతుడు తనముందునిల్చి, రామునికై పరిపరివిధముల పరితపించుచుండగా గుండెను దిటవు చేసికొని, విజ్ఞతతో ఆ తల్లి అతనిని ఓదార్చినతీరు అతిశ్లాఘనీయము. సీతాదేవిపై ఆమెకుగలవాత్సల్యము లోకమునకే ఆదర్శము. వేయేల సర్వదా సర్వథా మన రామజననిజన్మ ధన్యము.

తులసీదాసమహాకవి చిత్రించిన పాత్రలలో సుమిత్రాదేవిపాత్ర పరిధినిబట్టి చిన్నది. ఉదాత్తగుణప్రభావమున మిన్నయైనది. లక్ష్మణశత్రుఘ్నుల కన్నతల్లియైన సుమిత్ర తన సాధుస్వభావముచేతను, సత్ప్రవర్తనకారణమునను లోకమున మన్ననలను పొందిన మహితాత్మురాలు. సీతారాములను సేవించుటకై వనగమనమునకు అనుమతిని గోరిన లక్ష్మణునకు సుమిత్రామాత ఒసంగిన ఉపదేశములు అత్యద్భుతములు అపూర్వములు ఆదర్శప్రాయములు.

"శ్రీరాముని తండ్రిగా భావింపుము. సీతమ్మను తల్లిగా సేవింపుము. అడవిని అయోధ్యగా తలంపుము. నిరంతరము వారి సేవలలోనే ఆనందమును అనుభవింపుము"- అను ఈ పల్కులు ఆమెసహనసౌశీల్యములకు మచ్చుతునకలు. తన సుతులలో లక్ష్మణస్వామిని రామునిసేవలకును, శత్రుఘ్నుని భరతునిసేవలకును నియోగించిన త్యాగమూర్తి మన సుమిత్రామాత.

జన్మసార్థక్యమునకై శ్రీహరినిగూర్చి తపమొనర్చి, దైవానుగ్రహమునకు పాత్రుడైన స్వాయంభువమనువు దశరథుడుగా జన్మించెను. పరాక్రమమునను రణకౌశలమునను సాటిలేనివాడు ఆ కోసలదేశాధిపతి. ఇంద్రునకును సాయపడగలిగిన సమరవీరుడు సత్యవాక్యపరిపాలకుడు ఆ అయోధ్యాప్రభువు. పెద్దలమాటలను, గురువచనములను గౌరవించువాడు. వసిష్ఠునిసూచనపై విశ్వామిత్రునివెంట రామలక్ష్మణులను పంపి, యాగరక్షణకు తోడ్పడినవాడు. విధివశమున కైకేయికుతంత్రములకు బలియై, విలవిలలాడినను ఆడినమాటను తప్పని సత్యసంధుడు. మునీశ్వరునిశాపఫలితముగ అంతులేని పుత్రశోకమునకు గురియై, స్వర్గమునలంకరించిన పుణ్యపురుషుడు అతడు. అవతారమూర్తియైన శ్రీరామచంద్రునకు తండ్రియైన దశరథుడు సుచరిత్రుడు.

సూర్యవంశమునకు కులగురువైన వసిష్ఠమహర్షి ఋషిపరంపరలో జగద్విఖ్యాతినందినవాడు. ఈయనకు అన్ని విధములుగ తగినఇల్లాలు అరుంధతీదేవి. కలకాలము ఈ పవిత్రదంపతులు నూతన వధూవరులకు ఆరాధ్యులు. వసిష్ఠుడు వేదశాస్త్రపురాణధర్మమర్మజ్ఞుడు. సందర్భోచితముగా ధర్మప్రబోధము చేయుటలో సమర్థుడు. పుత్రప్రేమచే వెనుక ముందాడుచున్న దశరథునకు హితవచనములను పలికి, విశ్వామిత్రునివెంట రామలక్ష్మణులను పంపుటలో ప్రముఖపాత్ర వహించినవాడు. సీతారామకల్యాణోత్సవసమయమున గురుస్థానమును అలంకరించి, తన ఆశీస్సులను అందించిన ఋషిపుంగవుడు. దశరథుడు స్వర్గస్థుడై విపత్కరపరిస్థితులేర్పడగా సమయోచితముగా కార్యములను చక్కగా నడిపించినవాడు. శోకవిహ్వలుడైన భరతునకు హితోపదేశమును గావించి, ఆయనను ఓదార్చినవాడు. భరతునివెంట చిత్రకూటమునకు వెళ్ళి, శ్రీరాముని పితృాజ్ఞాపరిపాలనదీక్షకును, భరతుని అనన్య భక్తి

తత్పరతకును భంగమురాకుండ సమన్వయమార్గమును సూచించి, సమస్యాపరిష్కారమునకు తోడ్పడినవాడు. శ్రీరాముడు దుష్టులను శిక్షించి, సపరివారముగా అయోధ్యకు విచ్చేసినపిదప శ్రీరామపట్టాభిషేకమహోత్సవమును జరిపించి, లోకకల్యాణమునకు సహాయపడినవాడు ఈ వసిష్ఠమహాముని.

శ్రీరామచరితమానసములో విశ్వామిత్రునిపాత్ర విశిష్టమైనది. యాగరక్షణనెపముతో రామలక్ష్మణులను వెంటబెట్టుకొనివెళ్లి, వారికి 'బల-అతిబల' అను విద్యలను అందించుటయేగాక వివిధశస్త్రాస్త్రప్రయోగములలో వారిని ప్రవీణులును గావించినవాడు ఈ గాధిసుతుడు. యజ్ఞానంతరము రామలక్ష్మణులతో మిథిలకు చేరి, శ్రీరామునిచే శివధనుర్భంగము గావింపజేసిన మహనీయుడితడు. సీతారాములకల్యాణమహోత్సవమును జరిపించి, మిథిలా-అయోధ్యావాసుల మన్ననలను పొందిన మహామహర్షి ఇతడు.

'కర్మయోగి'గా ఖ్యాతివహించిన, మిథిలాధిపతియైన జనకమహారాజు రాజన్యులలో రాణకెక్కినవాడు. అవనిజాతయైన సీతమ్మకు తండ్రి. 'శివధనుర్భంగము గావించిన వానినే సీతవరించును'- అని ప్రతిజ్ఞాపూర్వకముగా ప్రకటించి, శ్రీరాముని శౌర్యపరాక్రమములను లోకమునకు విదితమొనర్చినవాడు. పరశురాముని కోపతాపములకు కలతచెందియు, కథసుఖాంతమగుటతో శ్రీరామవిజయమునకు సంతసించినవాడు. సమర్థులగు దూతలద్వారా దశరథుని సపరివారముగా ఆహ్వానించి, వారికి సకలమర్యాదలతో స్వాగతముపలికిన సౌజన్యమూర్తి. జగన్మోహనముగా కన్నుల పండువుగా శ్రీ సీతారామకల్యాణమహోత్సవమును జరిపించి, సమస్తలోకములకును ఆనందమును గూర్చిన మహాపురుషుడు. తన సాధుస్వభావముచే దశరథాదుల మన్ననలనందిన జనకమహారాజు మహనీయుడు. భరతుడు చిత్రకూటమునకు జేరినప్పుడు తామును సపరివారముగా అచటికేగి, శ్రీరామలక్ష్మణ భరతశత్రుఘ్నుల మనోభావములకు అనుగుణముగా ధర్మవచనములను బలికి, అందటి గౌరవాదరములను చూరగొనిన ధీశాలి.

శృంగబేరపురపాలకుడైన గుహుడు శ్రీరామవనవాససమయమున చూపిన భక్తితాత్పర్యములు, కావించిన మర్యాదాసహకారములు అపూర్వములు. వనవాసియేయైనను అతనిరామసేవలు ఆదర్శప్రాయములు. అతడు భరతునకు తోడ్పడినరీతియు ప్రశంసనీయము. భరద్వాజమహర్షి తనఆశ్రమమునకు విచ్చేసిన శ్రీరామునకు సాదరముగా పల్కిన ఆశీస్సులు, భరతునకొసంగిన అతిథి మర్యాదలు అమోఘములు. శ్రీ సీతారామలక్ష్మణులను ఆదరించుటలోను, వారినివాసస్థానమును నిర్దేశించుటలోను వాల్మీకిమహర్షి నిర్వహించినపాత్ర విస్మరింపరానిది. అత్రిమహర్షి గావించిన రామస్తుతి, సీతామాతకు అనసూయాదేవి ఉపదేశించిన పతివ్రతాధర్మములు చిరస్మరణీయములు. శరభంగమహర్షి, సుతీక్ష్ణముని, అగస్త్యమహాముని తమ ఆశీస్సులతో శ్రీరాముని ఆదరించి, వారు తరించిన తీరు ప్రశంసార్హము.

పరమభక్తురాలైన శబరి మిక్కిలి భక్తిప్రపత్తులతో రామలక్ష్మణులకొనర్చిన అతిథిసేవలు అపూర్వములు. వానరరాజైన సుగ్రీవుడు శ్రీరామునితో పరస్పరమైత్రీసహకారములకు ఒడంబడి, వాలివధానంతరము కిష్కింధకు రాజై, వానరపరివారములతో సీతాన్వేషణ కొనసాగించుట అతని కృతజ్ఞతకు నిదర్శనము. హనుమదాదుల ద్వారా సీతజాడ తెలియుగా వారధినిర్మాణములోను, రామరావణయుద్ధములోను యథాశక్తి సేవలందించిన సుగ్రీవుని జన్మ ధన్యము. వాలిపుత్రుడైన అంగదుడు రావణునితో జరిపిన దౌత్యము రాక్షసులకు దడపుట్టించినది, 'రామదండు'కు సంతోషమును గూర్చినది. శ్రీహరిభక్తుడైన విభీషణుడు తన అన్నయైన రావణునకు చేసిన హితబోధలు విస్మరింపరానివి. అతడు శ్రీరాముని శరణుజొచ్చినవిధము, శ్రీరామునివాత్సల్యమునకు పాత్రుడైన రీతి, ధర్మస్వరూపుడైన శ్రీరామునివిజయమునకు రణరంగమున సహకరించిన పద్ధతి వర్ణనాతీతములు.

రాక్షసకులసంజాతయైనను ధర్మమునే అనుసరించుచుండెడి త్రిజట తనస్వప్నవృత్తాంతమును వినిపించుట ద్వారా రాక్షసపరిచారికలకు భయమును కలిగించిన విధము, సీతమ్మకు ఊరట కల్గించిన పద్ధతి మఱువరానివి. జటాయువు పక్షియేయైనను సీతాపహరణసమయమున రావణుని ఎదుర్కొని పోరుసల్పిన తీరు, రామునిసుఖ కరస్పర్శకు తేరుకొని ఆయనను స్తుతించి, పరమపదమును పొందిన విధము ప్రాతఃస్మరణీయములు. జటాయువు సోదరుడైన సంపాతియొనర్చిన రామసేవలు విస్మరింపరానివి. ఆయా సందర్భములలో సమయానుకూలముగా సుమంత్రుడొనర్చిన సేవలు లోకప్రసిద్ధములు. గంగానదిని దాటించుటలో శ్రీసీతారామలక్ష్మణులకు నావికుడు యుక్తితో భక్తితో పాదప్రక్షాళనాది సేవలందించిన విధము అత్యద్భుతము, పరమానందదాయకము. వనములలో శ్రీసీతారామలక్ష్మణులకును, భరతునకును, అయోధ్యావాసులకును, మిథిలానగరప్రజలకును కోలులు, భిల్లులు చేసిన అతిథిమర్యాదలు, అందించిన సహకారములు అత్యద్భుతములు. శ్రీసీతారాముల అందచందములను, రూపరేఖావయోవైభవవిలాసములను జూచి ఆనందించుటకై తహతహపాటుతో వచ్చినను, ఉయాపల్లెలప్రజలు శ్రీ సీతారామలక్ష్మణులకు భక్తితోనొనర్చిన సహకారములుగూడ ఎల్లకాలమూ గుర్తుపెట్టుకొనదగినవి.

పాత్రపోషణలో తులసీదాసు మహాకవి సిద్ధహస్తుడు. అతడు శ్రీసీతారామలక్ష్మణభరతాదిపాత్రలను తీర్చిదిద్దిన విధముగనే రావణకుంభకర్ణ మేఘనాద ఖరదూషణత్రిశిర శూర్పణఖ మారీచాది రాక్షస ఆపాత్రలను గూడ యథోచితముగ చిత్రించెను. తారా, మండోదరీ, సునయనాదేవి మొదలగు స్త్రీ పాత్రలను రూపొందించుటలోగూడ ఆయన తగిన శ్రద్ధను కనబఱచెను.

వాల్మీకిరామాయణమహాకావ్యమును ఆధారముగా జేసికొనియు, తనకాలమున ప్రచారములోనున్న ఇతర రామాయణగాథావిశేషములను పరిశీలించియు, ప్రజలఅభీష్టములను అనుసరించియు, 'తన రామచరితమానసము' నందు అదనముగా కొన్ని సన్నివేశములను చిత్రించినట్లు తులసీదాసు మహాకవియే స్వయముగా ప్రస్తావించెను. తదనుగుణముగ (1) సతీదేవివిభ్రమ, పార్వతీపరమేశ్వరుల వివాహము (2) నారదునిమోహము (3) శతరూపాస్వాయంభువమనువుల ప్రస్తావనము (4) ప్రతాపభానుని చరిత్రము (5) దేవతలపన్నాగము (6) సీతారామలక్ష్మణులచే వాల్మీకిసందర్శనము (7) జనకమహారాజు చిత్రకూటమునకు వెళ్ళి, వనవాసమునను్న సీతారామలక్ష్మణులను పరామర్శించుట (8)భరతకూపమున సర్వతీర్థ నిమజ్జనము (9) మాయా సీతాకల్పనము (10) లంకలో మారుతి విభీషణుని కలియుట (11) సంజీవనిపర్వతమును తీసికొనివచ్చుచున్న హనుమంతునితో భరతునిసమాగమము (12) కాకభుశుండివృత్తాంతము మొదలగు సన్నివేశములు ఇందు అదనముగా చోటుచేసికొనినవి. సీతారాములవివాహమునకు ముందుగనే పరశురామునిఆగమనము, వనవాసమునకు వెళ్ళుచున్న సీతారామలక్ష్మణులను నావికుడు గంగను దాటించుట మున్నగునవి సందర్భోచితముగ ఇందు చేయబడిన మార్పులు.

గోస్వామితులసీదాసు నిజముగా ఒక మహాకవి. మహితాత్ముడైన శ్రీరాముని లీలావిలాసములవలె ఈ కవియొక్క సరసరచనాస్వారస్యములన్నియును పాఠకహృదయములకు మహానందమును గూర్చును. ఈకవి కావించిన ప్రకృతివర్ణనలు అపూర్వములు. ఇతడు వర్ణించిన నగరములకాంతిహేలలు, వనశోభలవైభవములు, ఉద్యానవనలాలిత్యములు, ఋతువుల రామణీయకములు కనులకు మెఱుమిట్లు గొల్పునవి. సీతారామకల్యాణ మహోత్సవ వైభవములు చూడముచ్చట గొలుపునవి, పారవశ్యములను పంచియిచ్చునవి. ఈ కవిగంటమున ఆవిష్కృతమైన 'రామరావణయుద్ధవర్ణనము రణభీరువులగుండెలకు దడపుట్టించునది, యుద్ధవీరులగుండెలలో సమరోత్సాహమును నింపునది. వేయేల ఆ రామరావణ యుద్ధమునకు ఆ రామరావణ యుద్ధమే సాటి. 'ఈ కవి వర్ణనాపటిమ ఆయన కీర్తి కిరీటమున 'ఒక కలికితురాయి'యై విలసిల్లుచున్నది.

మహిమాన్వితములైన శ్రీరాముని దివ్యలీలావిలాసములను భజించుటలో అందఱును మునింగిరి. భక్తితో పరవసించిన స్వాయంభువమనువు, పరమశివుడు, బ్రహ్మ, ఇంద్రాది దేవతలు ఆ ప్రభువును నుతించిరి. అత్రి, శరభంగుడు, సుతీక్ష్ణుడు, అగస్త్యుడు, నారదుడు, సనకాది మహర్షులెల్లరును తన్మయులై శ్రీరాముని కొనియాడిరి. మహాభక్తులైన శబరీ, జటాయువు శ్రీరాముని కీర్తించిరి. వేదపురుషులు ప్రస్తుతించిరి. కాకభుశుండిగురువు పరమశివుని స్తుతించెను. శ్రీరామచరితమానసమున తులసీదాసమహాకవిగంటమునుండి జాలువాఱిన ఈ స్తోత్రములన్నియును అద్భుతములు, అమోఘములు. అవి అన్నికాలములకును ఆనందమును పంచియిచ్చు అమృతజలధులు.

ఈ మహాకవి రసవత్తరరచన చేయుచునే తాత్త్విక చర్చలను తక్కువ చేయులేదు. సుజన దుర్జన లక్షణములను విస్పష్టము గావించెను. కలియుగలక్షణములను కన్నులకు గట్టించెను. జ్ఞానభక్తిమార్గములవైశిష్ట్యములను తేటతెల్లము గావించెను. సాకార నిరాకార పరమాత్మ తత్త్వములను చక్కగా వింగడించి, వివరించెను.

భగవల్లీలలన్నియును లోకకల్యాణార్థమే ప్రదర్శితములగుచుండును. కొందఱు ఆ లీలలను ప్రవచించుచుందురు. మఱికొందఱు ఆ లీలాప్రవచనములను శ్రవణము చేసి ఆనందించుచుందురు. మఱికొందఱు ఆ లీలాగానములతో పరమానందభరితులగుచుందురు. భగవత్సేవలలో నిమగ్నులైన వారందఱును పారవశ్యములను పొందుచు కడకు దైవానుగ్రహముచే పరమపదప్రాప్తికి నోచుకొందురు. భగవత్సేవాసాధనమార్గములలో భక్తిమార్గము మిక్కిలి సులభమైనది. అందువలననే "మోక్ష సాధన సామగ్ర్యాం భక్తిరేవగరీయసీ" అను ప్రసిద్ధి ఏర్పడినది.

ఎనుబదినాలుగులక్షల జీవరాసులలో మానవజన్మ ఉత్తమోత్తమమైనది. ఈ జన్మ లభించుట మిక్కిలి దుర్లభము. భగవంతుడు ప్రాణికోటిని అనుగ్రహింపదలచియే ఆయాప్రాణులకు తనపరమపదమును ప్రసాదించుటకై మానవజన్మను ఇచ్చుచుండును. నవవిధభక్తిరీతులలో సాధనచేయువారికి ఉపయోగపడుటకై అనన్యభక్తి సంపన్నుడైన గోస్వామి తులసీదాస మహాకవి శ్రీరామచరిత మానసమును రచించెను. అది భక్తి భండారము. భక్తులు పెక్కుమంది యుందురు. కవులును చాలా మంది ఉండవచ్చును. కాని మహాభక్తులైన కవులు అరుదుగా మాత్రమే ఉందురు. అట్టి మహాభక్తకవివతంసులలో మనగోస్వామితులసీదాసు ఒకవులుగడిగిన ఆణిముత్యము. అట్టివాడు 'నభూతో నభవిష్యతి'. ఆ మహామహుడు ఈలోకమున జన్మించుటయు, అపూర్వమైన శ్రీరామచరితమానసమును రచించి లోకమునకు అందించుటయు సమస్త మానవాళియు, అందును భారతీయులు చేసికొనిన అనంత పుణ్యఫలము.

భక్తి తరంగములను పరవళ్లు త్రొక్కించి, అజరామరుడైన శ్రీగోస్వామి తులసీదాసు మహాకవికి శతకోటి సాష్టాంగ దండప్రణామములు. మధుర భావరత్నాకరమైన 'శ్రీరామచరిత మానసము' అను మహాకావ్యమునకు అనంతమంగళ నీరాజనములు.

శ్లో॥ శ్రీరామకృతి కర్తారం, భక్తలోక శిరోమణిమ్ ।
వందేఽహం తులసీదాసం, మహాకవివతంసకమ్ ॥



# శ్రీరామశలాకా ప్రశ్నావళి

శ్రీరామచరితమానసముపై ప్రేమానురాగములుగల మహానుభావులకు శ్రీరామశలాకాప్రశ్నావళిని గూర్చి ఎక్కువగా వివరింపవలసిన పనిలేదు. 'మానస' అభిమానులందఱికిని దీనిమహిమను గూర్చియు, ప్రయోజనమును గుఱించియు బహుశా తెలిసియేయుండును. కావున దాని స్వరూపమును మాత్రము రూపొందించి, ప్రశ్నోత్తర విధానమును, తదుత్తరఫలవిశేషములను ఉల్లేఖించుట జరిగినది. 'శ్రీరామశలాకాప్రశ్నావళి' స్వరూపము ఈ విధముగా గలదు.

| | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సు | ప్ర | ఉ | బి | హో | ము | గ | బ | సు | ను | బి | ఘ | ధి | ఇ | ద |
| ర | రు | ఫ | సి | సి | రహిం | బస | హి | మం | ల | న | ల | య | న | అం |
| సుజ | సో | గ | సు | కు | మ | స | గ | త | న | ఇ | ల | ధా | బే | నో |
| త్య | ర | న | కు | జో | మ | రి | ర | ర | అ | కీ | హో | సం | రా | య |
| పు | సు | థ | సీ | జె | ఇ | గ | మ ✻ | సం | క | రే | హో | స | స | ని |
| త | ర | త | ర | స | హుం | హు | బ | బ | ప | చి | స | హిం | స | తు |
| మ | కా | ా | ర | ర | మ | మి | మీ | మ్హా | ా | జా | హూ | హీం | ా | ా |
| తా | రా | రే | రీ | హ్వా | కా | ఫ | ఖా | జూ | ఈ | ర | రా | పూ | ద | ల |
| ని | కో | జో | గో | న | ము | జి | యం | నే | మని | క | జ | ప | స | ల |
| హి | రా | మి | స | రి | గ | ద | న్ము | ఖ | మ | ఖి | జి | మ | త | జం |
| సిం | ఖ | ను | న | కో | మి | నిజ | ర్య | గ | ధు | థ | సు | కా | స | ర |
| గు | బ | మ | అ | రి | ని | మ | ల | ా | న | ఢ | తీ | న | క | భ |
| నా | పు | వ | అ | ా | ర | ల | ా | ఏ | తు | ర | న | ను | వై | థ |
| సి | హుం | సు | మ్హా | రా | ర | స | స | ర | త | న | ఖ | ా | జ | ా |
| ర | ా | ా | లా | ధీ | ా | రీ | ా | హూ | హీం | ఖా | జూ | ఈ | రా | రే |

ఈ రామ శలాకా ప్రశ్నావళి ద్వారా తమకు ఇష్టమైన ప్రశ్నకు సమాధానమును పొందదలచిన వారు మొట్ట మొదట శ్రీరామచంద్రభగవానుని ధ్యానింపవలెను. పిమ్మట శ్రద్ధా విశ్వాసములతో తమకు ఇష్టమైన ప్రశ్నను మనస్సునందు అనుకొనుచు ప్రశ్నావళి చక్రమునందలి ఏదేని ఒక గడిలో వ్రేలును గాని, ఒక శలాక (పుల్ల)ను గాని ఉంచవలెను. ఆ గడి యందలి అక్షరమును వేఱుగా ఒక కాగితముపైన గాని, పలకపైన గాని వ్రాసికొనవలెను. ఆ గడిని శుభ్రముగా ఉంచుచు దానిలో పెన్సిలుతో ఒక గుర్తును ఉంచవలెను. ఆ గుర్తును ఉంచినగడిని వదలి, ప్రక్క గడినుండి తొమ్మిదవ గడిలోని అక్షరమును మొదట విడిగా వ్రాసియుంచుకొనిన అక్షరముప్రక్కన వ్రాసికొనవలెను. ఇట్లు ప్రతి తొమ్మిదవ గడిని గుర్తించుచు ఆ గడియందలి అక్షరమును వ్రాసికొనుచు ముందుకు సాగవలెను. ఈ ప్రక్రియను మొదట గుర్తించిన గడి వచ్చువఱకు కొనసాగింపవలెను. దానితో ఒక చౌపాఈ పూర్తియగును. ఈ చౌపాఈలో కోరుకొనిన ప్రశ్నకు సమాధానము లభించును. ఆయా గడులలో ఏ గడియందైనను ఒక దీర్ఘ చిహ్నము (ా) గాని, రెండేసి అక్షరములు గాని ఉండవచ్చును. రెండక్షరములున్నను ఆ గడిని ఒక గడి క్రిందనే గుర్తింపవలెను. దీర్ఘ చిహ్నము (ా) గల గడిని వదలక, దానిని ఒక గడిగా గుర్తించి, ఆ దీర్ఘ చిహ్నము (ా)ను అంతకు ముందున్న అక్షరముతో కలిపి వ్రాసికొనవలెను.

